శ్రీ

# సూర్యరాయాంధ్ర నిఘంటువు

## అయిదవ సంపుటము

ప — మ

[illegible]

కాకినాడ

ఆంధ్ర సాహిత్య పరిషత్తు

వారిచేఁ బ్రకటింపఁబడినది



గార్డన్. శంకర్ ప్రింటర్స్ ముద్రాక్షరశాలలో ముద్రితము

మద్రాసు

1958

— —

# మనవి.

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు చతుర్థసంపుటము 1944 లోఁ బ్రకటితమయినది. మఱి పదునాల్గు సంవత్సరములకుఁ గాని మిగిలిన మూఁడు సంపుటములను బ్రకటితములు కాలేదు. ఈ యాలస్యమునకుఁ గారణము లనేకములు. 1947 సరికి అయిదవ సంపుటమును 1949 సరికి ఆఱవ సంపుటమును ముద్రణమునకు సిద్ధములయినను గడపటి సంపుటము కూడ సిద్ధమయినఁ గాని వెచ్చము పెట్టి ప్రారంభించుటకు సమ్మతింపనని శ్రీ పిఠాపురము మహారాజావారు తెలియఁజేసిరి. తరువాత కొన్ని రాజకీయములచే 1949 గడవగానే నిఘంటు కార్యాలయము నెత్తివేసిరి. పిమ్మట నా మూఁడు సంపుటముల గ్రంథమును మద్రాసునగరమునకుఁ దరలించి ముద్రణముపని డా॥ గిడుగు వేంకటసీతాపతిగారి కప్పగించిరి. శ్రీ సీతాపతిగారు ముద్రణముపని 1952 లోఁ బ్రారంభించి 'ప' యను నక్షరము మొదలుకొని 'మ' యను నక్షరమువఱకును గల గ్రంథ మయిదవ సంపుటముగాను 'మ' యను నక్షరము మొదలుకొని 'ష' యను నక్షరమువఱకును గల గ్రంథ మాఱవ సంపుటముగాను, విభజించి ముద్రణము వేగముగాఁ గావలయునను సంకల్పముతో వేర్వేఱు ముద్రణాలయములలో ముద్రణము సాగించిరి. అయిదవ సంపుటమును ముద్రించుచుండిన గార్డన్ ముద్రణాలయము కొంత గ్రంథము ముద్రించిన తర్వాత నెత్తివేయఁబడినది. మిగిలిన గ్రంథము మఱియొక ముద్రణాలయములో ముద్రింపవలసివచ్చినది. ఆఱవ సంపుటము సక్రమముగా ముద్రితమగుచుండుటవలన 1954 లోఁ గడపటి సంపుటముకూడ మఱియొక ముద్రణాలయములో ముద్రింపించుట కీయఁబడినది. కాని, తానొకటి దలఁచిన దైవ మింకొకటి దలఁచునన్నట్లయినది. ప్రభుత్వమువారు జమీందారీ విధానమును రద్దుపఱిచి యెస్టేటులను దీసికొనుటవలన శ్రీ మహారాజావారి కార్థికలోపము కలిగి 1954 పూర్తియగుసరికి ముద్రణముపని నిలిచిపోయినది. అయిదవ సంపుటములో 185 ఫారములును ఆఱవ సంపుటములో 112 ఫారములును ఏడవ సంపుటములో 42 ఫారములును ముద్రితములయినవి. మిగిలిన ముద్రణముపని యితరుల సాహాయ్యమర్థింపక తామే పూర్తిచేయుటకు శ్రీ మహారాజావా రుద్దేశించిరి. కాని, యాపని సాగలేదు. అప్పుడు శ్రీ సీతాపతిగారు శ్రీమహారాజావారి యనుజ్ఞాపత్రముఁ బడసి ప్రభుత్వమువారి ధనసాహాయ్యమునకయి 1957 జూన్ మాసములోఁ బ్రయత్నము ప్రారంభించి యధికారుల తోడ్పాటులోఁ గృతార్థులయినారు. ఆంధ్రప్రదేశప్రభుత్వమువారు రూ 5000 లును, ఇండియా

ప్రభుత్వమువారు రూ 8000 లను నొసంగిరి. ఈయార్థిక సాహాయ్యముతోను, ఆంధ్ర సాహిత్యపరిషత్తు తోడ్పాటుతోను శ్రీ సీతాపతిగారు ముద్రణముపని సాగించిరి.

భగవంతుని కృపవలన ఈ నాలుగవ సంపుటముతో ఐదవ సంపుటమును ప్రకటించి యర్థుల కందజేయగలిగిరి. 1958 జూన్ 12వ తేదీని ఆంధ్రసాహిత్య పరిషద్వార్షిక మహాసభా సమావేశసందర్భమున మన యుపరాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితవరేణ్యులు పరిషత్తువారి యాహ్వానము మన్నించి యీ రెండు సంపుటముల యావిష్కరణము గావించినందులకు పరిషత్తు ధన్యతనందినది. దైవబలముచే ఏడవ సంపుటముకూడ కొలది కాలములో ప్రకటితమగును.

## 5వ సంపుట నిర్మాణము కావించిన పండితవర్యులు

1 సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు (సంపాదకులు)
2 బ్రహ్మశ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రి
3 ప్రయాగ వేంకటరామశాస్త్రి
4 ఆకొండి వేంకటశాస్త్రి
5 బాలుసు వెంకటేశ్వరులు
6 చిలుకూరి పాపయ్యశాస్త్రి
7 గుప్పూరి సూర్యనారాయణశాస్త్రి
8 చిలుకూరి వీరభద్రశాస్త్రి
9 చెఱుకుపల్లి అప్పారాయశాస్త్రి
10 సామవేదం శ్రీరామమూర్తిశాస్త్రి
11 పన్నాల వెంకటాద్రిభట్టశర్మ
12 ఇంద్రకంటి సూర్యనారాయణశాస్త్రి

పీఠికాపురాధీశు కోరిక ననుసరించి 1944–48 లో నిఘంటు నిర్మాణ పర్యవేక్షణము సాగించి గ్రంథముద్రణారంభము గావించినవారు డాక్టరు గిడుగు వేంకటసీతాపతిగారు.

దంటు భాస్కరరావు
ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యదర్శి.



మహారాజా రావు వేంకట కుమార మహీపతి
సూర్యారావు బహద్దరు C B E గారు

45వ ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసమావేశము

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు 5-6 సంపుటములఆవిష్కృతి



శ్రీ దంటు భాస్కరరావు – శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణపండితులు.

| సంకేతములు. | వివరణము. |
| --- | --- |
| అ. | అకారాంతము-ఇట్లే.-అ,ఇ,ఈ,ఎ, ఓ. పొందలగునవి తత్తదంతములుగా గ్రహించునది. |
| అ,ఈ,అ. | పుంలింగవిశేషణమయినపుడు అకారాంతము. స్త్రీలింగవిశేషణమయినపుడు ఆకారాంతము లేక ఈకారాంతము. నపుంసకలింగవిశేషణ మయినపుడు అకారాంతము. స్త్రీలింగములలో విశేషము లున్నపుడు అవి సూచింపబడినవి. చివరయచ్చులనుబట్టి యవి తత్తదంతములుగా గ్రహించునది ఉదా:- (1) అంకకుడు. విశే. (అ, కా. అ.) ఇట స్త్రీలింగరూపము ఆకారాంతము 'అంకికా'. (2) అంతర్ధాత విశే. (ఋ. త్రీ. ఋ) ఇట స్త్రీలింగరూపము ఈకారాంతము 'అంతర్ధాత్రీ' (3) అంకి విశే. (న్. నీ. న్) ఇట స్త్రీలింగ రూపము ఈకారాంతము 'అంకినీ'. (4) అపటువు. విశే. (ఉ, ఉ,ట్వీ,ఉ.) ఇట ఉకారాంతము 'అపటువు'ను, ఈకారాంతము 'అపట్వీ'యును స్త్రీలింగరూపములు. (5) అనామము విశే. (న్. న్, మ్నీ, అన్). ఇట నకారాంతము 'అనామ'యును, ఈకారాంతము 'అనామ్నీ'యును, ఆకారాంతము 'అనామా,యును స్త్రీలింగరూపములుగా తెలియంగునది. |
| అ. క్రి. | అకర్మకక్రియ. |
| అనౌ. | అనౌపవిభక్తికము. |
| అప | అపదము. (ఆగమము పొందలగునది) |
| అలం. | అలంకారశాస్త్రము. |
| అవ్య | అవ్యయము. |
| ఆమ్రే | ఆమ్రేడితము |
| ఉదా. | ఉదాహరణము. |
| ఉప. | ఉపపదము (చూ అవి- తెలుగు) |
| ఉభ. | ఉభయము. (సంస్కృతమును, తెనుగును) |
| ఏ. | ఏకవచనాంతము. |
| ఔ. | ఔపవిభక్తికము |
| క. | కన్నడము |
| కరాలపా. | కరాలపాటి రంగయ్యగారి భారత పాఠము. |
| కు. | కుయిభాష. |
| క్రి. | క్రియ. |
| క్రి. విశే. | క్రియావిశేషణము. |
| క్షేత్రగ. | క్షేత్రగణితము. |
| గణిత. | గణితశాస్త్రము. |
| చూ. | చూడుడు. |
| ఛంద. | ఛందశ్శాస్త్రము. |
| జ. | జన్యము. |

## సంజ్ఞావివరణపట్టిక

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| జ్యోతి. | జ్యోతిశ్శాస్త్రము. |
| త. | తమిళము |
| తంత్ర. | తంత్రశాస్త్రము. |
| తర్క. | తర్కశాస్త్రము. |
| తు. | తులుభాష |
| ద్రు. | ద్రుతాంతము. |
| ద్వి. | ద్వివచనాంతము (తెనుఁగున బహువచనాంతములో అంతర్భూతము) |
| ధర్మ. | ధర్మశాస్త్రము. |
| న. | నపుంసకలింగము. |
| నాటక. | నాటకపరిభాష. |
| నాట్య. | నాట్యశాస్త్రము. |
| పా. | పాళీభాష |
| పిం. | పింగ. |
| పుం. | పుంలింగము. |
| పుం. న | పుంనపుంసకలింగము. |
| పుం. స్త్రీ. | పుంస్త్రీలింగము. |
| ప్ర. | ప్రత్యయము. |
| ప్రా. | ప్రాకృతము. |
| బ. | బహువచనాంతము. |
| బీజగ. | బీజగణితము. |
| భా.ల.వ్యా. | భారతములక్ష్మీపతిశాస్త్రిగారి ఆంధ్రభారత వ్యాఖ్య. |
| మంత్ర. | మంత్రశాస్త్రము. |
| మ. | మలయాళము |
| మహా. | మహారాష్ట్రము. |
| మి. | మిశ్రము—సంస్కృతపదము సంస్కృతేతర పదముతోఁగాని, తెలుఁగు కృత్ప్రత్యయముతోఁగాని, తెలుఁగు తద్ధితప్రత్యయముతోఁగాని కలిసిన పదము. |
| వై. | వైదశైవని |
| యోగ. | యోగశాస్త్రము. |
| రూ. | రూపాంతరము. |
| వా. | వాడుక. |
| వి. | విశేష్యము. |
| విణ. | విశేషణము. |
| వీరేశ. పా. | కందుకూరివీరేశలింగముగారి పాఠము. |
| వేదము. పా. | వేదము వేంకటరాయశాస్త్రిగారి పాఠము. |
| వేదాంత. | వేదాంతశాస్త్రము |

| సంకేతములు. | వివరణము |
|---|---|
| వైద్య | వైద్యశాస్త్రము |
| వ్యతి | వ్యతిరేకార్థకపదము. |
| వ్యవ | వ్యవహారము |
| వ్యాక | వ్యాకరణశాస్త్రము. |
| శత్ర | శత్రంతము (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు) |
| శ సం | శక సంవత్సరములు |
| శ్లో | శ్లోకము |
| స | సర్వనామము. |
| ం | సంస్కృతము |
| సంగీ | సంగీతశాస్త్రము |
| స క్రి. | సకర్మకక్రియ |
| సా | సామెత |
| స్త్రీ | స్త్రీలింగము |
| హిం. | హిందూస్థానీభాష. |
| √ | (మూలచిహ్నము) ఇది జనకపదములకు ముం దుపయోగింపఁబడును. |
| = | (సామ్యచిహ్నము) ఇది రూపమందుఁ గాని, యర్థమందుఁ గాని సామ్యము గల పదములకడను నుపయోగింపఁబడును |
| ⚘ | చెట్టు, లత మొదలగువానిగుర్తు |
| , | ఇది విభిన్నార్థమును దెలుపును. |
| ; | సమానార్థమును దెలుపును |

(తక్కినవి స్పష్టము)

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| | | | | వేంకటాచార్యకవి. |
| 1 | అచలా. | అచలాత్మజాపరిణయము. | ఆ ౩ | శ్రీరామకవి |
| 2 | అచ్చ. భా | అచ్చతెలుఁగుభారవి | ఆ ౫ | కూచిమంచితిమ్మకవి |
| 3 | అచ్చ. రా. | అచ్చతెనుఁగురామాయణము<br>బాల బాలకాండము<br>అయో అయోధ్యాకాండము<br>అర అరణ్యకాండము<br>కిష్కిం కిష్కింధాకాండము<br>సుం. సుందరకాండము.<br>యు యుద్ధకాండము | కాం. ౭ | |
| 4 | అధ్యా. | అధ్యాత్మరామాయణము<br>(బాలకాండాదులుఅయిన ఉత్తరకాండమును కలిపి ఏడుకాండములు)<br>ఉ. ఉత్తరకాండము. | కాం ౭ | కోటమరాజా నాగయామాత్యుఁడు. |
| 5 | అని. | అనిరుద్ధచరిత్రము | ఆ ౫. | కనుపర్తిఅబ్బయామాత్యుఁ |
| 6 | అప్ప. | అప్పకవీయము.<br>(లక్షణగ్రంథము) | ఆ ౫. | కామమూరిఅప్పకవి. [డు. |
| 7 | అ. మ. క | అష్టమహిషీకల్యాణము. (ద్విపద) | | తిరువేంగళనాథుఁడు. |
| 8 | అహ | అహల్యాసంక్రందనము. | ఆ. ౩ | సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు. |
| 9 | ఆం చం | ఆంధ్రచంద్రాలోకము | | అడిదముసూరకవి |
| 10 | ఆం. భా | ఆంధ్రభాషార్ణవము (నిఘంటువు) | కాం ౩ | నుదురుపాటివేంకనార్యుఁడు |
| 11 | ఆం. కో | ఆంధ్రనామశేషము (నిఘంటువు) | | అడిదము సూరకవి |
| 12 | ఆం సం. | ఆంధ్రనామసంగ్రహము. (నిఘంటువు)<br>దేవ. దేవవర్గు<br>మాన. మానవవర్గు.<br>స్థా. స్థానవర్గు.<br>తి తిర్యగ్వర్గు.<br>నా. నానార్థవర్గు | వర్గులు. ౫. | పైడిపాటి లక్ష్మణకవి. |
| 13 | ఆం. పద. | ఆంధ్రపదాకరము. | | |
| 14 | ఆము. | ఆముక్తమాల్యద | ఆ ౭. | శ్రీకృష్ణదేవరాయలు. |
| 15. | ఇందు. | ఇందుమతీపరిణయము. | ఆ. ౭. | కుమారధూర్జటి. |
| 16 | ఇందు. రా. | ఇందుమతీపరిణయము. | ఆ ౮. | తెనాలిరామభద్రకవి. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| 17 | ఉ. రా. | ఉత్తరరామాయణము | ఆ ౮. | కంకంటిపాపరాజు. |
| 18 | ఉ. హరి | ఉత్తరహరివంశము | ఆ. ౬. | నాచన సోమనాథుఁడు. |
| 19 | ఉ. హరిశ్చ | ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. ౪ | తెక్కుర్లపాటి లింగన. |
| 20 | కకు | కకుత్స్థవిజయము. | ఆ ౬. | ముక్కు అనంతభూపాలుఁడు. |
| 21 | కలు. శ. | కలువాయిశతకము | | దబ్బీరు వరదు. |
| 22 | కవిక | కవికర్ణరసాయనము. | ఆ. ౫ | సంకుసాల నృసింహకవి. |
| 23 | కవిచా. శ | కవిచౌడప్పశతకము | | కవిచౌడప్ప. |
| 24 | కవిజ. | కవిజనరంజనము. | ఆ. ౩. | అడిదము సూరకవి. |
| 25 | కవిజనా. | కవిజనాశ్రయము. (లక్షణగ్రంథము) సంజ్ఞా. సంజ్ఞాధికారము. వృత్తా. వృత్తాధికారము జాతి, జాత్యధికారము. దోషా. దోషాధికారము. | అధికారములు. ౪ | వేములవాడ భీమకవి. |
| 26 | కవిరా. | కవిరాజమనోరంజనము. | ఆ. ౬. | కనుపర్తిఅబ్బయామాత్యుఁడు. |
| 27 | కవిస | కవిసర్ప గారుడము. (లక్షణగ్రంథము | ఆ. ౨. | కాచన బసవన్న. పింగళి సూరన్న. |
| 28 | కళా. | కళాపూర్ణోదయము. | ఆ. ౮. | |
| 29 | కార్తిక. | కార్తికమాహాత్మ్యము. | | కుందుర్తి వేంకటాచలపతి. |
| 30 | కావ్యా. | కావ్యాలంకారచూడామణి. (లక్షణగ్రంథము) | ఉల్లాసములు ౯ | విన్నకోట పెద్దన్న. |
| 31 | కాశీ. | కాశీఖండము. | ఆ. ౭. | శ్రీనాథుఁడు. |
| 32 | కాళ. | కాళహస్తిమాహాత్మ్యము. | ఆ. ౮. | ధూర్జటి. |
| 33 | కాళ. శ. | కాళహస్తీశ్వరశతకము | | ధూర్జటి. |
| 34 | కిరా. | కిరాతార్జునీయము. | ఆ. ౬. | గోపాలుని సింగయ. |
| 35 | కుచేల. | కుచేలోపాఖ్యానము. | ఆ. ౩ | గట్టుప్రభువు. [కవి. |
| 36 | కువల. | కువలయాశ్వచరిత్రము. | ఆ. ౬. | సురరము చినవారాయణ |
| 37 | కు సం. | కుమారసంభవము | ఆ. ౧౨. | నన్నె చోడుఁడు. |
| 38 | కృ క. | కృష్ణకర్ణామృతము. | ఆ. ౩. | వెలగపూడి వెంగన. |
| 39 | కృ శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. ౩. | కృష్ణకవి. |
| 40 | కృష్ణ. | కృష్ణరాయవిజయము. | ఆ ౪. | కుమార ధూర్జటి. |
| 41 | కృష్ణ. శ. | కృష్ణశతకము | | నృసింహకవి. |
| 42 | కృష్ణా | కృష్ణాభ్యుదయము. | ఆ. ౬. | గొంకెటి సూరన్న. |
| 43 | కేయూర. | కేయూరబాహుచరిత్రము. | ఆ. ౪. | మంచన. |
| 44 | క్రీడా | క్రీడాభిరామము. | ఆ. ౧. | వల్లభరాయకవి. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| 45 | గంధ. | గంధవహము. | ఆ ౧. | మంచర్ల వాసుదేవకవి |
| 46 | గాధే. | గాధేయోపాఖ్యానము | | చక్రకవిఅనంతామాత్యుఁ |
| 47 | గోపీ నా | గోపీనాధరామాయణము | | గోపీనాథ వెంకటకవి [డు. |
| 48 | ఘటి శా. | ఘటికాచలమాహాత్మ్యము | ఆ ౩. | తెనాలి రామకృష్ణకవి డు |
| 49 | చంద్ర. | చంద్రభానుచరిత్రము | ఆ ౫. | తరిగొప్పుల మల్లన్న. |
| 50 | చంద్ర వి | చంద్రరేఖావిలాసము | ఆ ౩ | కూచిమంచి జగ్గకవి |
| 51 | చంద్రా. | చంద్రాంగదచరిత్రము | ఆ. ౬. | పైడిమఱ్ఱి వేంకటపతి |
| 52 | చంద్రి. | చంద్రికాపరిణయము. | ఆ ౬. | శ్రీసురభిమాధవరాయ ప్రభువు. పతి |
| 53 | చం. రా. | చంపూరామాయణము. | ఆ ౮. | ఋగ్వేదికవి వేంకటాచల |
| 54 | చమ | చమత్కారమంజరి | ఆ ౩. | సింహాద్రి వేంకటాచార్యుఁ |
| 55 | చిత్రభా | చిత్రభారతము | ఆ ౮. | చరికొండ ధర్మన్న [డు. |
| 56 | చి ని | చిన్నయసూరినిఘంటువు (వ్రాతది) | | పరవస్తు చిన్నయసూరి |
| 57 | చెన్న | చెన్నబసవపురాణము | ఆ ౫ | అత్తమూరి పాపకవి |
| 58 | జావ్నా వీ. | జావళీవీమాహాత్మ్యము | ఆ. ౪. | ఏనుఁగు లక్ష్మణకవి |
| 59 | జై. భా. | జైమినిభారతము (అశ్వమేధపర్వము.) | ఆ ౮ | పిల్లలమఱ్ఱిపినవీరభద్రుఁడు. |
| 60 | తపతి. | తపతీసంవరణోపాఖ్యానము. | ఆ. ౫. | అద్దంకి గంగాధరకవి. |
| 61 | దశకు. | దశకుమార చరిత్రము | ఆ ౧౨ | కేతన |
| 62 | ద శా | దక్షిణహిందూస్థానశాసనము | సంపుటములు౬ | |
| 63 | దశ. | దశావతారచరిత్రము | ఆ. ౧౦ | ధరణిదేవుల రామయామాత్యుఁడు |
| 64 | దా శ | దాశరథిశతకము | | కంచెర్ల గోపన్న [కవి |
| 65 | దిలీప. | దిలీపచరిత్రము | ఆ. ౪ | కోటికలపూడి వేంకటకృష్ణ |
| 66 | ద్వా | (సింహాసన)ద్వాత్రింశిక | ఆ ౧౨ | కొఱవి గోపరాజు |
| 67 | ద్వి కో భాగ | ద్విపదభాగవతము | స్కం. ౧౨ | కోనేటినాథుఁడు |
| 68 | ద్వి తి సా | ద్విపదసారంగధరచరిత్రము | ఆ ౨ | కూచిమంచి తిమ్మకవి |
| 69 | ద్వి. నల. | ద్విపదనలచరిత్రము, | భా ౫. | చక్రపురిరాఘవాచార్యులు. |
| 70 | ద్వి పరమ | ద్విపదపరమయోగివిలాసము | ఆ. ౮ | తాళ్లపాక తిరువేంగళనాథుఁడు. |
| 71 | ద్వి. భార. | ద్విపదభారతము. (విరాటపర్వము-వ్రాఁతప్రతి.) | ఆ. ౫. | తిమ్మన. |
| 72 | ద్వి. శ సా | ద్విపదసారంగధరచరిత్రము | ఆ. ౩. | బాణాలశంభుదాసుఁడు. |
| 73 | ద్వి భాగ | ద్విపదభాగవతము (దశమస్కంధము.) | స్కం. ౧. | మడికిసింగన్న |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి అశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| 74 | ద్వి. హరిశ్చ. | ద్విపదహరిశ్చంద్రచరిత్రము. | భా. ౨. | గౌరన. |
| 75 | ధనా. | ధనాభిరామము. (వ్రాతప్రతి) | ఆ. ౩. | నూరన. (ము. |
| 76 | ధర్మ. | ధర్మఖండము. | ఆ ౯. | కూచిమంచిపల్లి భవానీశంకరుడు |
| 77 | ఆం. ధా. | ఆంధ్రధాతుమాల | | పరవస్తు చిన్నయసూరి. |
| 78 | నరస. | నరసభూపాలీయము. (లక్షణగ్రంథము) | ఆ. ౫. | భట్టుమూర్తికవి. |
| 79 | నవ (నాథ) | నవనాథచరిత్రము (ద్విపద- వ్రాతప్రతి) | భా. ౫. | గౌరన. |
| 0 | నా. పంచ. | పంచతంత్రము. | ఆ. ౫. | నారాయణకవి, |
| 1 | నార. | నారసింహపురాణము. (ఉత్తర భాగము. | ఆ. ౫. | హరిభట్టు. |
| 2 | నిరం. | నిరంకుశోపాఖ్యానము. | ఆ. ౪. | కందుకూరి రుద్రయ. |
| 3 | నిర్వ. | నిర్వచనోత్తరరామాయణము. | ఆ. ౧౦. | తిక్కన సోమయాజి. |
| 4 | నీతి | నీతిసీసపద్యశతకము | | తాళ్లపాక తిమ్మయ. |
| 5 | నీలా. | నీలాసుందరీపరిణయము. | ఆ. ౩. | కూచిమంచి తిమ్మకవి. |
| 6 | నృసిం. | నృసింహపురాణము. | ఆ. ౫. | ఎఱ్ఱాప్రెగ్గడ. |
| 7 | నైష. | శృంగారనైషధము. | ఆ. ౭. | శ్రీనాథుడు. |
| 8 | పండితా. | పండితారాధ్యచరిత్రము (ద్విపద)<br>దీక్షా. దీక్షాప్రకరణము<br>పురా. పురాతనప్రకరణము.<br>వాద. వాదప్రకరణము<br>మహిమ. మహిమప్రకరణము.<br>పర్వ. పర్వతప్రకరణము. | ప్రకరణము లు. ౫. | పాల్కురికి సోమనాథుడు. |
| | పద్మ. | పద్మపురాణము (ఉత్తరఖండము.) | ఆ. ౧౦. | మడికి సింగన్న. |
| | పరమ. | పరమయోగివిలాసము. | ఆ. ౫. | తిమ్మ నృపాలుడు. |
| | పాంచా. | పాంచాలీపరిణయము. | ఆ. ౫. | కాకమాని మూర్తికవి. |
| | పాండు. | పాండురంగమాహాత్మ్యము. | ఆ ౫. | తెనాలి రామకృష్ణుడు. |
| | పారి. | పారిజాతాపహరణము | ఆ. ౫. | నంది తిమ్మన. |
| | పార్వ. | పార్వతీపరిణయము. | ఆ. ౨. | కోటి శ్రీరాయరఘునాథ తొండమాన్మహీపాలుడు. |
| | పి. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. ౪. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రయ |
| | పె. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. ౩. | పెద్దాడ నాగరాజు. |
| | ప్రబంధ. | ప్రబంధరాజవేంకటేశ్వర విజయ విలాసము. | ఆ. ౧. | గణపవరపు వేంకటకవి. |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 98 | ప్రబోధ | ప్రబోధచంద్రోదయము | ఆ ౫ | నందిమల్లయ ఘంటసింగయ |
| 99 | ప్రభా | ప్రభావతీప్రద్యుమ్నము | ఆ ౫ | పింగళి సూరన |
| 100 | ప్రభు (లిం) | ప్రభులింగలీల (ద్విపద) | ఆ ౫ (ఒకొక్క-ఆశ్వాసమునకుఅయిదైదుగతులు గలవు) | పిడుపర్తి సోమయ |
| 101 | ప్ర మణి | ప్రబంధమణిభూషణము | | |
| 102 | బస వ | బసవపురాణము (ద్విపద) | ఆ ౭ | పాలకురికిసోమన (థుఁడు |
| 103 | బహు | బహుళాశ్వచరిత్రము | ఆ ౫ | దామరల వేంకటనాయ |
| 104 | బిల్హ | బిల్హణీయము | ఆ ౩ | పండిపెద్ది కృష్ణస్వామి |
| 105 | బ్రహ్మో | బ్రహ్మోత్తరఖండము | ఆ ౫ | శ్రీధర మల్లె వేంకటరామ |
| 106 | బ్రా | బ్రాహ్మ్యానిఘంటువు | | బ్రౌనుదొర [కవి |
| 107 | భర్తృ | భర్తృహరిసుభాషితము<br>నీతి నీతిశతకము<br>శృం శృంగారశతకము<br>వై వైరాగ్యశతకము | శతకములు ౩ | ఏనుగు లక్ష్మణకవి |
| 108 | భల్లా | భల్లాణచరిత్రము | ఆ ౫ | వాశేశ్వరుఁడు |
| 109 | భాగ | భాగవతము | స్కం ౧౨ | బమ్మెర పోతరాజు |
| 110 | భాను | భానుమతీపరిణయము | ఆ ౪ | రెంటూరి రంగరాజు |
| 111 | భార | భారతము<br>ఆది ఆదిపర్వము ఆ ౮<br>సభా సభాపర్వము ఆ ౨<br>అర అరణ్యపర్వము ఆ ౭<br>విరా విరాటపర్వము ఆ ౩<br>ఉద్యో ఉద్యోగపర్వము ఆ ౪<br>భీష్మ భీష్మపర్వము ఆ ౫<br>ద్రో ద్రోణపర్వము ఆ ౫<br>కర్ణ కర్ణపర్వము ఆ ౩<br>శల్య శల్యపర్వము ఆ ౨<br>సౌ సౌప్తికపర్వము ఆ ౨<br>స్త్రీ స్త్రీపర్వము ఆ ౨<br>శాం శాంతిపర్వము ఆ ౬ | పర్వములు౧౮ | కవిత్రయము (నన్నయ తిక్కన ఎఱ్ఱాప్రెగ్గడ) |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| | | అను. అనుశాసనికపర్వము ఆ ౫.<br>ఆశ్వ. ఆశ్వమేధికపర్వము. ఆ. ౪<br>ఆశ్ర ఆశ్రమవాసపర్వము ఆ, ౨<br>మౌ మౌసలపర్వము. ఆ ౧.<br>మహా మహాప్రస్థానికపర్వము. ఆ. ౧.<br>స్వ. స్వర్గారోహణపర్వము ఆ ౧. | | |
| 111 | భా. రా | భాస్కరరామాయణము. (అచ్చు తెనుఁగు రామాయణముకడనున్నట్టు దీనికి కాండము లెక్కింగునది ) | కాం. ౬. | భాస్కరుఁడులోనగువారు. |
| 112 | భా. శ. | భాస్కరశతకము, | | మారద వెంకయ్య |
| 113 | భీమ. | భీమేశ్వరపురాణము | ఆ ౬. | శ్రీనాథుఁడు. |
| 114 | భేష. | భేషజకల్పము. | ఆ ౪. | బహుపాద వేంకటాచార్యు [డు. |
| 115 | భోజరా. | భోజరాజీయము | ఆ ౭. | అనంతామాత్యుఁడు. |
| 116 | భోజసుతా. | భోజసుతాపరిణయము | ఆ. ౫. | కోటీశ్వరకవి. |
| 117 | మను చ | మనుచరిత్రము. | ఆ ౬. | అల్లసాని పెద్దన. |
| 118 | మల్ల. | మల్లభూపాలీయము (భర్తృహరికడనున్నట్లే దీనికి శతకము లెక్కింగునది ) | శతకములు ౩. | ఎలకూచి బాలసరస్వతి. |
| 119 | మల్లుపు | మల్లుపురాణము (దేవమల్ల చరిత్రము-వ్రాఁతప్రతి) | ఆ ౪ | మదురపాటి వేంకనార్యుఁ [డు |
| 120 | మల్హణ | మల్హణచరిత్ర | ఆ ౩ | ఎడపాటి ఎఱ్ఱన్న. |
| 121 | మార్క | మార్కండేయపురాణము | ఆ. ౮ | మారన. |
| 122 | ముకుంద | ముకుందవిలాసము | ఆ ౩ | కాణాచి పెద్దన. |
| 123 | మృ వి. | మృత్యుంజయవిలాసము. | ఆ ౩. | గోఁగులపాటి కూర్మ [నాథుఁడు. |
| 124 | మై | మైరావణచరిత్రము. | ఆ ౩ | మాడయకవి. |
| 125 | మొ. రా. | మొల్లరామాయణము (అచ్చుతెనుఁగురామాయణము కడనున్నట్లు దీనికి కాండము లెక్కింగునది.) | కాం. ౬. | మొల్ల |
| 126 | యయా. | యయాతిచరిత్రము. | ఆ. ౫. | పొన్నిగంటి తెలగనార్యుఁ [డు |
| 127 | రంగా. | రంగారాయచరిత్రము. | ఆ. ౩ | దిట్టకవి నారాయణకవి. |
| 128 | రం. రా. | రంగనాథరామాయణము (ద్విపద) (అచ్చు తెనుఁగురామాయణము కడనున్నట్లు దీనికి కాండము లెక్కింగునది.) | కాం. ౬. | రంగనాథుఁడు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసముల సంఖ్య. | గ్రంథకర్తలనామము |
|---|---|---|---|---|
| 129 | రం. రా. ఉ. | రంగనాథరామాయణము. ఉత్తరకాండము (ద్విపద) | కాం. ౧. | రాచభూపతి, విట్ఠలరా |
| 130 | రఘు. | రఘువంశము. | ఆ. ౧౦. | అభ్రదూరి కిచ్చయ్య |
| 131 | రఘునా. | రఘునాథాభ్యుదయము. (ప్రాంత | | విజయరాఘవకవి. |
| 132 | రత్న. | రత్నపరీక్ష (ప్రతి.) | | తైరవకవి. |
| 133 | రస. | రసమంజరి (లక్షణగ్రంథము) | గుచ్ఛములు ౩. | సురతాని కోదండపతి. |
| 134 | రసా. | రసాభరణము (లక్షణగ్రంథము. | ఆ. ౪. | అనంతామాత్యుఁడు |
| 135 | రసిక. | రసికజనమనోభిరామము. | ఆ. ౬. | కూచిమంచితిమ్మకవి |
| 136 | రాఘవ | రాఘవపాండవీయము | ఆ. ౪. | పింగళి సూరన్న |
| 137 | రాజగో. | రాజగోపాలవిలాసము. | ఆ. ౫. | కాళయ |
| 138 | రాజ. చ. | రాజశేఖరచరిత్రము. | ఆ. ౩. | మాదయగారి మల్లన్న |
| 139 | రాజ వి. | రాజశేఖరవిలాసము. | ఆ. ౩. | కూచిమంచి తిమ్మకవి |
| 140 | రాధా. | రాధామాధవము. | | చింతలపూడి ఎల్లనార్య |
| 141 | రాధి కా. | రాధికాసాంత్వనము. | ఆ. ౪. | ముద్దుపళని |
| 142 | రామ. | రామనాటీయము | ఆ. ౧. | వెంకటార్య. |
| 143 | రామలిం. | రామలింగేశ్వరశతకము. | | అడిదము సూరన్న. |
| 144 | రామా. | రామాభ్యుదయము. | ఆ. ౨. | అయ్యలరాజురామభద్ర |
| 145 | రామే. | రామేశ్వరమాహాత్మ్యము. | ఆ ౫. | ఏనుఁగు లక్ష్మణకవి |
| 146 | రా. వి. | రాజవాహనవిజయము. | ఆ. ౫. | కాకమాని మూర్తికవి |
| 147 | రుక్మాం. | రుక్మాంగదచరిత్రము | ఆ. ౫ | ప్రౌఢకవి మల్లన్న |
| 148 | రుక్మి | రుక్మిణీపరిణయము | ఆ. ౫. | కూచిమంచి తిమ్మకవి |
| 149 | లక్షణ | లక్షణసారసంగ్రహము. | | చిత్రకవి పెద్దన్న |
| 150 | ల వి | లక్ష్మీవిలాసము. | ఆ. ౫. | కాయసము వెంకటపతి |
| 151 | వన. వి | వనమాలివిలాసము | | నారన సూరన. [పింగ |
| 152 | వరాహ. | వరాహపురాణము. | ఆ. ౧౨. | నందిమల్లయ్య ఘంట |
| 153 | వసు. | వసుచరిత్రము. | ఆ. ౯. | రామరాజభూషణుఁడు |
| 154 | వా రా. | వాసిష్ఠరామాయణము. | ఆ. ౫. | మడికి సింగన. |
| 155 | వాల్మీ. | వాల్మీకిచరిత్రము. | ఆ. ౩. | రఘునాథభూపాలుఁడు. |
| 156 | విక్ర. | విక్రమార్కచరిత్రము. | ఆ. ౨. | జక్కన. |
| 157 | విజ, వి. | విజయవిలాసము. | ఆ. ౬. | చేమకూర వెంకటకవి. |
| 158 | విష్ణు. | విష్ణుశేశ్వరీయము. | కాం. ౬. | కేతన. |
| 159 | వి. న. | విజయనందనవిలాసము. | ఆ. ౩. | మంగళగిరి ఆనందకవి. |
| 160 | వి. పు. | విష్ణుపురాణము. | ఆ. ౨. | వెన్నెలకంటి సూరన. |
| 161 | విష్ణుమా. | విష్ణుమాయానాటకము. | | చింతలపూడి ఎల్లనార్యు |
| 162 | విప్ర. | విప్రనారాయణచరిత్రము. | ఆ. ౫. | చదలవాడ మల్లయ్య. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 163 | వీథి | వీథినాటకము. | | శ్రీనాథుఁడు ? |
| 164 | వీర | వీరభద్రవిజయము. | ఆ. ౮. | బమ్మెరపోతన్న. |
| 165 | వేంక. | వేంకటేశాంధ్రము (నిఘంటువు) | వర్గలు ౫. | గణపవరపు వేంకటకవి. |
| 166 | వేం పంచ | పంచతంత్రము | ఆ. ౫ | వేంకటనాథుఁడు. |
| 167 | వేం. మా. | వేంకటాచలమాహాత్మ్యము. | ఆ. ౬. | తరిగొండ వెంకమ్మ. |
| 168 | వేణు | వేణుగోపాలశతకము. | | |
| 169 | వేమన | వేమనశతకము | భాగ 3. | వేమనయోగి |
| 170 | వైజ | వైజయంతీవిలాసము. | ఆ. ౮ | సారంగు తమ్మయ్య |
| 171 | శ ర | శబ్దరత్నాకరము (నిఘంటువు) | | బహుజనపల్లి సీతారామాచార్యులు. |
| 172 | శశాం | శశాంకవిజయము | ఆ ౫ | శేషము వేంకటపతి. |
| 173 | శా ప మ. | శాసనపద్యమంజరి. | | |
| 174 | శివ | శివధర్మోత్తరము. | ఆ ౯. | మల్లా రెడ్డికవి. |
| 175 | శివర. | శివరహస్యఖండము | ఆ. ౧౦ | కోడూరి వేంకటాచలపతి |
| 176 | శివరా | శివరాత్రిమాహాత్మ్యము | ఆ. ౮. | శ్రీనాథుఁడు. [ర్యుఁడు. |
| 177 | శివ సా | శివతత్త్వసారము. | | మల్లికార్జునపండితారా |
| 178 | శుక. | శుకసప్తతి. | ఆ ౮. | కదిరీపతినాయకుఁడు |
| 179 | శుక. చ | శుకచరిత్రము. | ఆ. ౫. | పరశురామపంతుల రామమూర్తికవి |
| 180 | శృంగా | శృంగారరసమంజరి | | సురశాని కోదండపతి. |
| 181 | శేష | శేషధర్మము | ఆ ౫. | తామరపల్లి తిమ్మయ్య. |
| 182 | శ్రీరం | శ్రీరంగమహత్త్వము | ఆ ౫. | భైరవకవి. |
| 183 | శ్రీరం మా. | శ్రీరంగమాహాత్మ్యము. | ఆ ౧౦. | కట్టా వరదరాజేంద్రుఁడు. |
| 184 | ష చ | షట్చక్రవర్తిచరిత్రము. | ఆ. ౯. | మల్లా రెడ్డికవి |
| 185 | షోడ | షోడశకుమారచరిత్రము. | ఆ. ౯. | వెన్నెలకంటి అన్నయ్య. |
| 186 | సకల. స | సకలనీతిసమ్మతము. | | మడికి సింగన్న |
| 187 | సత్య సాం | సత్యభామాసాంత్వనము. | | లింగమకుంట, రామేశ్వరకవి. |
| 188 | సమీర. | సమీరకుమారవిజయము. | ఆ. ౬. | పుష్పగిరి తిమ్మన్న. |
| 189 | సర్వ. సా. | సర్వలక్షణసారసంగ్రహము. | | కూచిమంచి తిమ్మకవి. |
| 190 | సస్యా. | సస్యానందము. | | |
| 191 | సాం. ని. | సాంబనిఘంటువు. | వర్గలు. ౫. | కస్తూరి రంగకవి. |
| 192 | సాంబో | సాంబోపాఖ్యానము. | ఆ. ౫ | రంగప్పరాజు. |
| 193 | సానందో. | సానందోపాఖ్యానము. | ఆ. ౫. | శివరామకవి. |
| 194 | సారంగ. | సారంగధరచరిత్రము. | ఆ. 3. | చేమకూర వేంకటకవి. [రుం. |
| 195 | సిం నార. | సింహాద్రినారసింహశతకము. | | గోగులపాటికూర్మనాథుఁ |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 196 | సీతారా | సీతారామాంజనేయసంవాదము | ఆ ౩ | పరశురామపంతుల గురు లింగమూర్తి |
| 197 | సీతావి | సీతావిజయము. (శతకంఠరామాయణము) | ఆ ౪ | మద్దనకవి. |
| 198 | సీమం | సీమంతినీకల్యాణము | ఆ ౫ | పెనుమళ్ల సోమమంత్రి |
| 199 | సుద. | సుదక్షిణాపరిణయము | ఆ ౫ | తెనాలి అన్నయ్య |
| 200 | సుదంతా | సుదంతాపరిణయము(వ్రాతప్రతి) | ఆ ౪ | అళుకురికవి. |
| 201 | సురా. | సురాభాండేశ్వరము. | ఆ ౧. | గట్టు ప్రభువు. |
| 202 | సు శ. | సుమతిశతకము. | | బద్దెనకవి |
| 203 | సేతు. | సేతుఖండము | ఆ ౬ | వక్కలంక వీరభద్రకవి. |
| 204 | హంస. | హంసవింశతి | ఆ ౫ | అయ్యలరాజు నారాయణామాత్యుఁడు |
| 205 | హ. చ. | హరిశ్చంద్రనలోపాఖ్యానము | ఆ ౫ | రామరాజభూషణుఁడు |
| 206 | హర. | హరవిలాసము | ఆ ౭. | శ్రీనాథుఁడు. |
| 207 | హర. వి. | హరభక్తవిలాసము. | | |
| 208 | హరి. | హరివంశము | | ఎఱ్ఱాప్రగ్గడ. |
| | | పూ = పూర్వభాగము. | ఆ. ౯ | |
| | | ఉ = ఉత్తరభాగము | ఆ. ౧౦. | |
| 209 | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ ౫. | శంకరకవి |
| 210 | హ వరాహ. | వరాహపురాణము | ఆ ౫ | హరిభట్టు |

(కడపటి పృష్ఠము)

## సంస్కృత గ్రంథ సంకేత పట్టిక

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథములయందలి సర్గాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 1 | అమర | అమరసుధ | | భానుజి దీక్షితులు |
| 2 | ఆ ని | ఆప్టేని సంస్కృతాంగ్ల నిఘంటువు | | వామనశివరామాప్టేడు |
| 3 | ఉ చ | ఉత్తరరామచరితము | అంకములు ౭ | భవభూతి |
| 4 | కల్ప | శబ్దకల్పద్రుమము (నిఘంటువు) | | సర్ రాజా రాధాకాంత దేవ బహదరు |
| 5 | కాదం | కాదంబరీకావ్యము | భాగములు ౨ | బాణకవియు తత్పుత్రుఁడ |
| 6 | కావ్యాద | కావ్యాదర్శము | పరిచ్ఛేదములు ౩ | దండికవి |
| 7 | కే ని | నానార్థార్ణవసంక్షేపనిఘంటువు | కాండములు ౬ | కేశవమిశ్రుఁడు |
| 8 | గీత | భగవద్గీత | అధ్యాయములు ౧౮ | వ్యాసమహర్షి |
| 9 | గీతగో | గీతగోవిందము | సర్గములు ౧౨ | జయదేవుఁడు |
| 10 | త్రిని | త్రికాండశేషము (నిఘంటువు) | కాండములు ౩ | పురుషోత్తముఁడు |
| 11 | పరా | పరాశరస్మృతి | కాండములు ౨ | పరాశరమహర్షి |
| 12 | భట్టి | భట్టికావ్యము | సర్గములు ౨౨ | భట్టి |
| 13 | భామినీ | భామినీవిలాసము | ఉల్లాసములు ౪ | జగన్నాథపండితరాయలు |
| 14 | మను | మనుస్మృతి | అధ్యాయములు ౧౨ | మనువు |
| 15 | మహా | మహావీరచరిత్రము | అంకములు ౭ | భవభూతి |
| 16 | మాలతీ | మాలతీమాధవము | అంకములు ౧౦ | భవభూతి |
| 17 | మాళవి | మాళవికాగ్నిమిత్త్రము | అంకములు ౫ | కాళిదాసుఁడు |
| 18 | ముద్రా | ముద్రారాక్షసము | అంకములు ౭ | విశాఖదత్తుఁడు |
| 19 | మురా | అనర్ఘరాఘవము | అంకములు ౭ | మురారి |
| 20 | మృచ్ఛ | మృచ్ఛకటికము | అంకములు౧౦ | శూద్రకుఁడు |
| 21 | మే ని | మేదినినిఘంటువు | | మేదినికరుఁడు |
| 22 | మేఘ | మేఘదూతము | భాగములు ౨ | కాళిదాసుఁడు |
| 23 | యాజ్ఞ | యాజ్ఞవల్క్యస్మృతి<br>ఆచా ఆచారకాండము<br>ప్రా ప్రాయశ్చిత్తకాండము<br>వ్యవ వ్యవహారకాండము | కాండములు ౩ | యాజ్ఞవల్క్యమహర్షి |
| 24 | రత్నా | రత్నావళి | అంకములు ౪ | శ్రీహర్షదేవుఁడు |
| 25 | రస | రసగంగాధరము | | జగన్నాథపండితరాయలు |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి సర్గాదుల సంఖ్య. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| 26 | రా. ని. | రాజనిఘంటువు | వర్గములు ౨౧ | నరహరిపండితుఁడు |
| 27 | వాచ. | వాచస్పత్యనిఘంటువు. | | తారానాథ తర్కవాచ |
| 28 | విక్ర మో. | విక్రమోర్వశీయము | అంకములు ౫. | కాళిదాసుఁడు. [స్పతి |
| 29 | వి. ని. | విశ్వనిఘంటువు. | | మహేశ్వరసూరి. |
| 30 | విల్యమ్సు. | విల్యమ్సు సంస్కృతాంగ్ల నిఘంటువు | | సర్. మోనియర్ విల్యమ్సు |
| 31 | వేణీ. | వేణీసంహారము | అంకములు ౬ | భట్టనారాయణుఁడు |
| 32 | వై. ని | వైజయంతీనిఘంటువు. | కాండములు ౭. | యాదవప్రకాశుఁడు |
| 33 | శాకుం. | అభిజ్ఞానశాకుంతలము | అంకములు ౭. | కాళిదాసుఁడు. |
| 34 | శా. ని. | శాశ్వతనిఘంటువు | | శాశ్వతుఁడు. |
| 35 | శిశు. | శిశుపాలవధము. | సర్గములు ౨౦ | మాఘకవి |
| 36 | సం. కిరా | కిరాతార్జునీయము. | సర్గములు ౧౮ | భారవి |
| 37 | సం.కు సం. | కుమారసంభవము. | సర్గములు ౧౭. | కాళిదాసుఁడు |
| 38 | సం.చం రా. | చంపూరామాయణము. | కాండములు ౬ | భోజరాజు, లక్ష్మణసూరి. |
| 39 | సం. దశకు. | దశకుమారచరితము. | | దండికవి |
| 40 | సం. నైష. | నైషధీయచరితము. | సర్గములు ౨౨. | శ్రీహర్షకవి. |
| 41 | సం. పంచ. | పంచతంత్రము. | తంత్రములు ౫ | విష్ణుశర్మ. |
| 42 | సం. ప్రబోధ | ప్రబోధచంద్రోదయము. | అంకములు ౬ | కృష్ణమిశ్రకవి. |
| 43 | సం భర్తృ | భర్తృహరిసుభాషితము | శతకములు ౩ | భర్తృహరి |
| 44 | సం. భాగ | భాగవతము. | స్కంధములు ౧౨ | వ్యాసమహర్షి. |
| 45 | సం. భార. | భారతము | పర్వములు ౧౮. | వ్యాసమహర్షి. |
| 46 | సం. రఘు. | రఘువంశము. | సర్గములు ౧౯ | కాళిదాసుఁడు. |
| 47 | సం. రామా. | రామాయణము. | కాండములు ౬. | వాల్మీకిమహర్షి. |
| 48 | సా. ద. | సాహిత్యదర్పణము. | పరిచ్ఛేదములు ౧౦ | విశ్వనాథకవిరాజు. |
| 49 | హలా. ని. | అభిధానరత్నమాలానిఘంటువు. | కాండములు ౫ | హలాయుధుఁడు. |
| 50 | హితో. | హితోపదేశము. | భాగములు ౪ | నారాయణపండితుఁడు. |
| 51 | హేమ. ని. | అనేకార్థసంగ్రహము. (నిఘంటువు.) | కాండములు ౭. | హేమచంద్రుఁడు. |

(కడమది స్పష్టము.)

శ్రీ

# సూర్యరాయాంధ్ర నిఘంటువు

## ప

ప. ఊథ ఒక యక్షరము.

ప. అప వృత్తియందు గురుపూర్వకమైన సామ్యాదుల 'ము' వర్ణకస్థానమున బిందు పూర్వకముగను లఘు పూర్వకమైన కసుమ్యాదుల 'ము' వర్ణకస్థానమున నిర్బిందుకముగను వచ్చునది.

ఉదా: సాంపచేను, వేంపచెట్టు, వేంపగంప, కసుపపూలు, ఆనుపముక్క, జనుపనార లోను.

ప. సం. విణ. (అ. ఆ. అ) సమాసాంతమునందే యుండును.

౧. త్రాగునది. (ద్విపము లోను) ౨. రక్షించునది. (నృపుడు లోను.)

వి. అ. పుం. ౧. వాయువు. ౨. కారము. 3. కాస్తుభము ౪. రణము ౫. కుధల

పంకకర్వటము. సం. వి. అ. పుం. జలయుక్త పంకము. (త్రి. ని.)

పంకకీరము. సం. వి. అ. పుం. పక్షి విశేషము. (త్రి. ని.)

పంకక్రీడనకము. సం. = పంకక్రీడము.

పంకక్రీడము. సం. వి. అ. పుం. (బురదయందు క్రీడించునది) పంది. (త్రి. ని.)

[illegible]. సం. వి. అ. పుం. [illegible] (త్రి. ని.)

పంకగతి. సం. వి. అ. పుం. = పంకగదకము

పంకగ్రాహము. సం. వి. అ. పుం. మకరము, మొసలి. (వాచ.)

పంకజజన్ముఁడు. సం. వి. న. పుం. తమ్మిచూలి, బ్రహ్మ.

పంకజనాభుఁడు. సం. వి. అ. పుం. పద్మనాభుఁడు, విష్ణువు.

పంకజన్మము. సం. వి. న. న. తామర పూవు. పుం. సారస పక్షి.

పంకజము. సం. వి. అ. న. బురదయందు పుట్టునది (తామర పూవు) పుం. సారసము, బెగ్గురు పక్షి.

పంకజిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. పద్మిని, తామరతీఁగ. ౨. తామర కొలను. (వాచ.)

పంకమండూకము. సం. వి. అ. పుం. శంబూక భేదము, ఒకజాతి కప్పచిప్ప.

పంకము. సం. వి. అ. పుం. న. ౧. కర్దమము, బురద. ౨. అదుమైన ద్రవ్యము. (ఉదా: పాటీరపంకము, కృష్ణాగురుపంకము.) ౩. మెత్తని [illegible] ౪. పాపము. ౫. (గట్టిగా బురదపడియుండు) పాలు, ముఱ్ఱుపాలు.

సీ. [illegible] ... వై. ఖా. [illegible]

౬. పట్టుదల.

గీ. భంగమున దాఁగి పంకంబుపాల లోఁగి, సరసులకుఁ గాళ్ళ రొంపికల సడల సెలగు, లేఁటిచు జలాశయంబుల నెపుడు మెలఁగు, కుకవినికురుంబముల లెక్క గొనఁగ నేల ... రసిక. ౧ ౧౮. (ఎఱుక అనుదానికి జల పత్యర్థమున లెక్క అను నర్థము చింత్యము.)

(వ్యవ.) వాఁ డీ విషయమున గట్టి పంకముతో నున్నాఁడు

పంకరసము. సం వి. అ. పుం. చెఱకురసము వలనఁ దీయు మద్యము. (వై. ని.)

పంకరుహము. సం వి. అ న తామరపూవు (రూ. పంకరుట్టు.)

పంకవాసము. సం వి అ పుం ఎండ్రి, పీత,

పంకశుక్తి. సం. వి ఇ స్త్రీ జలశుక్తి భేదము ఒక విధమైన ఆల్పచిప్ప

పంక(శూ)సూరణము. సం వి అ పుం శాలూకము, తామర లోనగువాని దుంప (వాచ.)

పంకారము. సం వి అ పుం ౧ శైవాలము, నాచు. ౨. సేతువు, కట్ట 3 సోపానము, మెట్టు ౪ జలకుబ్జకము, నీటి గొజ్జఁగి కీ. (వై. ని.)

పంకించే. (సం ?) స. క్రి. (√పంక్ ?) ౧ బురదవలె పట్టించు; అంకిత మొనరించు

క. వెంకటకాస్త్రిలు మాకు నలంకార గ్రంథ మెంకటి లిలి మురభామాక్, బంకించె సాంద్ర కావ్యం, బంకిత మొనరింపు మీథు నట్లావ మాకుఁ చంద్ర. వి. ౧. ౧౩ (పై రెం డర్థములకు నిదియు యుదాహరణము.)

౨. (మూసి మొ.) జాట్టునకు పట్టించు, రాచు.

సీ. కలదు శి దసుపాటిగార మూసి రొంపికిం పంకించి తలచిక్క కాపి ముడిచి ...
వై. భా. ౬. ౧౫౪

సీ. పొంకంబుగా మూసి పంకించి నవరంబు కుచ్చు గన్నడ గొప్పకొప్పు పెట్టు ...
శుక 3 ౩౪౮ కాశ ౮. ౧౦.

3 రుద్దు, చరుము

౪ బింకపు శ్రేంకతాశాలు, పంగన పూఁదోస తేట మాటకు పైపై, నింకిఁ నింకిఁ బల్కుఱుఁ, బంకించుటఁ బోలె పొలిచిచ్చెన పెచ్చుక ..
పాండు ౨ ౪౧ (శ ర పా)

పంకించే. స క్రి (సం కంప్.) ౧ అడించు, ఊఁపు

ఉదా : వాఁ డా మాట విని తల పంకించెను

ఉదా : అగి యాతని యందముఁ జూచి యాశ్చర్యముచే దల పంకించి వోడు కఱచు కొనెను.

౨. సరిచేయు, హెచ్చుతగ్గులు కాకుండఁ జేయు

సీ నును పెండికడియముల్ మిసమిస క్కన పారికను డువ్వి పంకించి కొప్పు పెట్టు
ఘటికా. ౨ ౩౪

౩. క్రి. చలించు; భయపడు

సీ. బాంధవ పితృమాతృభక్తిఁ బెందినవాఁడు కిల్బిషంబులకుఁ బంకించువాఁడు ...
వై భా. 3. ౪౦. (శ. గ. పా "శంకించు వాఁడు" ముద్రి.)

మ తులసీకానన మెప్పునింట నలరుక్ దోహంధ కారార్కమై, తలఁపక్ బో ల్పగు తర్జ్వ హంబు ధరఁ దీర్ఘం బందు రంబ్యాంటిక్, బలిమి గ్గాలిని కింకర బ్రజము రాఁ బంకించు

జూహింపఁగా పద్మ. ౨. ౫౯.
(చి. ని. పా "పట్టించు" అపముద్రి.)

**పంకిలము.** సం విశే (అ`ఆ అ) బురదగలది.

**పంకెన.** వి. తడి, పదను. (శ. ర., బ్రా. దుక్కైన ?)

సీ. పాపట యి(ని ?)డి నూౝ పంకెనతో
నున్నఁగా దువ్వి నెఱులు శిల్గంటు వైచు ...
హంస ౨ ౧౪౬.

**పంకేజము.** సం వి అ న తామరపూవు.

**పంకేరుహము.** సం వి అ. న. పద్మము. పుం సారసపక్షి (రూ. పంకేరుట్టు)

**పంకేశయ.** సం. వి అ. స్త్రీ ఒక జాతి జలగ.

**పంకేశయము.** సం విశే (అ. ఆ అ.) బురదయం దుండునది

**పంక్తి.** సం. వి. ఇ స్త్రీ. ౧. వరుస, శ్రేణి, బంతి. ౨ సజాతీయుల బువ్వపుబంతి (ఉదా: పంక్తి పావనుఁడు, పంక్తి బాహ్యుఁడు మొ.) ౩. సజాతీయ సంఘము. ౪ గౌరవము. ౫. పాకము ౬. భూమి ౭. పది అను సంఖ్య (ఉదా: పంక్తిరథుఁడు, పంక్తికంఠుఁడు.) ౮. పంచాక్షరపాదక మగు వృత్తభేదము ౯ దశమచ్ఛందము

**పంక్తికంటకుఁడు.** సం వి అ పుం. పంక్తిదూషకుఁడు, పంక్తి భోజనమునకుఁ దగనివాఁడు (వాచ.)

**పంక్తిగ్రీవుఁడు.** సం వి. అ. పుం దశకంఠుఁడు, రావణుఁడు.

**పంక్తిచరము.** సం. వి అ పుం. (బారులు కట్టి పోవునది.) పెన్నదపులుఁగు, కురరపక్షి

**పంక్తిదూషకుఁడు.** సం విశే. (అ. షి.శా. అ.) అపాంక్తేయుఁడు, పంక్తి భోజనమునకుఁ దగనివాఁడు.

**పంక్తిదూషుఁడు.** సం విశే. (అ. ఆ. అ.) = పంక్తిదూషకుఁడు.

**పంక్తిపావనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) భోజనార్థము కూర్చున్న వారిబంతిని పావనము సేయునట్టివాఁడు, విద్యాది సంపత్తిచే పూజ్యుఁడైనవాఁడు. (వ్యతి. పంక్తిదూషకుఁడు.)

**పంక్తిరథుఁడు.** సం వి. అ. పుం. దశరథుఁడు. (శ్రీరాముని తండ్రి.)

**పంక్తులు సాగు.** మి. అ క్రి పంక్తులు తీర్చి కూర్చుండు

శా బ్రాగ్రగకుశాస్తరణా, భోగంబులయందుఁ దూర్పు మొగముగఁ బంక్తుల్, సాఁగిరి బలి ముఖదానవు, లాగిరి భిన్నభక్ష్యదితిజా లతులిత భక్తిక్ ... దశా. ౨. ౩౪౯.

**పంగ** = ప్రంగ. ప్రగ్గ. వి. (క. పంగ) ఎదమూఁగాఁ జాఁగినశాఖ. (కాళ్లు మొ.)

గీ దండచే లావు గలగట్టు పండు పెదుర, తండములఁ గొమ్మపంగల మెండుపెట్టు, బెండు విఱిచినకైవడిఁ జెనఁచి విఱుచుఁ, బోతరించిన దుప్పు లప్పాలములోన .
చంద్రా. ౨. ౬౧.

గీ. ప్రగ్గ యనఁ బంగి యనఁగను పరగుచుండు, స్కంధ శాఖాభిధ ... ఆం. భా ౨. ౩౬.
(ప్రాఁత ప్రతిపాఠము)

సీ. కాకిబికిశికిసంపుటకూనిమాఁకులమీఁద మూఁడు పంగల యీఁటె పొడిచినాఁడు ... కుకుచ. ౪ ౭౩. (మూఁడుపంగల యీఁటె = త్రిశూలము.)

జ: పంగటి, పంగటించు, పంగటి కాళ్లవాఁడు, పంగనామము.

**పంగిటి.** విశే. (√పంగ) ఎదము కలది (శ. ర.)

**పంగటించు.** స. క్రి. (√పంగ.) ఎదయూగాఁ జూచు.

సీ. కియితిగాం ద్లంటగో కా ల్పంగటించుచు చిన్నచ్చరము పేరు చెప్పలేరు . .

వేంక ౪ ౨౨.

(వ్యవ) వాఁడు కాళ్లు పంగటించుకొని నిలుచున్నాఁడు.

**పంగటి కాళ్లివాఁడు.** వి (√పంగ) ప్రగతి జానుతుఁడు, దొడ్డి కాళ్లవాఁడు (శ ర)

**పంగనామము.** వి (√పంగ) నడుమ ఎడము గలుగఁ దీర్చిని తిరుమణి.

(వ్యవ.) వైష్ణవులు పంగనామము దిద్దుచున్నారు

(వ్యతి.) బుంగనామము = నడుమ ఎడము లేకుండఁ దీర్చిన తిరుమణి

**పంగము.** వి భాగధేయము, పన్ను (దేవ బ్రాహ్మణ వృత్తులమీఁద దొరతనమువారు తీసెడి చతుర్థాంశగూప మైన పన్ను అని శ. ర)

సీ. అం బడి యప్పన మప్పన పంగము పంజి ప న్నాడికో ల్పగిది బెడిగ, కో రనఁగాఁ జెల గును భాగధేయంబు

ఆం భా ౨. ౧౯౨

**పంగించు.** అ క్రి కోపగించు

మ. అని పంగించినవాని నప్పటికి నిష్టాలాపము ల్పల్కి కే ర్పుఁ గోపం బడఁగించి . .

దశకు ౧౦. ౯౦

**పంగిడి** = పంగొన. వి. (√పంగు.) ౧ ఏనుఁగులఁ బట్టునపు డవి పడుటకుఁ ద్రవ్విన గొయ్యి, ఓదము ; ఒక విధమగు ఓదము.

గీ. వారి పంగొన యనఁగను బంగిడి యన, నోడ మున మూఁకు పేళ్లచే నుల్లసిల్లు

ఆం. భా. ౨. ౧౯౫

ఉ. పంగిడిఁ జిక్కి కోదములపజ్జలఁ ద్రొక్కక మూఁకఁ దోలుమూ, తంగము చొక్కఁ డొంటి మెడఁ బట్టి పయిం బడి విల్పి ...

కకు. ౪ ౫౯.

**పంగు[1].** వి. (అ. పంగం) భయము. (చి. ని ౪ ౧.)

జ : పంగిడి.

**పంగు[2].** వి (సం భగః) దూరాని

**పంగులము.** సం వి. అ పుం ౧ నితశాచాథ పాయము, తెల్లగాజావన్నె గల గుఱ్ఱము, అశ్వ విశేషము. (వై ని.)

**పంగువు.** సం విశే. (ఉ. ఊ ఉ) కుంటివాఁడు (వి. ఉ పుం శని)

**పంగెన[1]** = పంగిడి.

గీ. వారి పంగెన యనఁగను బంగిడి యన, నోద మన మూఁడు పేళ్లచే నుల్లసిల్లు ...

ఆం భా ౨. ౧౯౫

**పంగెన[2].** వి ౧ పట్టుదల, బింకము

ఉ. రంగునఁ బంగెనల్ విడిచి రమ్ము ...

తాళ్లపాకవారి శృంగారశతకము ౩౬.

౨ సంకోచము

చ. పదఁతులు వారె నావలనిపంగెన యేఁటికి నిండుమోహ మె, దుర్భ్యాదలను లేదు నీకు నది యేను నెఱుంగుదు వేంకటేశ్వరా ...

తాళ్లపాకవారి శృంగారశతకము. ౩౩.

(విశే.) ద్రోహి

ఉ. సంగడి కాక యున్న దని సన్నలఁ జొప్పెద లేను వచ్చినఁ, పంగతిగాడు మానినులఁ జొక్కలుసేతుర నీవు కాంతకుం, బంగెన వాఁడవా యెఱుఁగి బత్తి యొనర్పఁగ నిప్పుఁ జేరితి, గంగను దానిచిత్త మిది కాగిట మైకదు వేంకటేశ్వరా ... -

తాళ్లపాకవారి శృంగారశతకము. ౫౩.

**పంచే[1]** = పంచోడి[1] వి. (సం. పార్శ్వః, ప్రా పాస) ౧. పంచోడి, పసార.

సీ. ఎండకో స్నెఱఁగని యింద్రుని యిల్లాలు పలు
పంచేలను జాలిఁబడిరొ నేఁడు . .
భాగ. ౭ ౪౩౧

ద్వి. ఊరూరిపడిపంచే నొదిఁగి నిద్రించి ...
ద్వి హరిశ్చ ఉ ౧౨౪౯ పం.

౨. మందిగ నికటము; అంద.

క. . . .పంచే యన న్మం, దిరనికట మొప్పు . .
ఆం భా. ౨. ౧౯.

క. పంచశరుబాణసంహతిఁ, బంచత్వము నొంద
లేక భామిని యిద నీ, పంచేకు వచ్చితి ...
పద్మ 3 33

ఆ. పరులపంచేఁ జేరి బ్రతికి పలాశవృత్తి
మ్మెలంగు కోకలమ్మనకు
రసిక ౪. ౧౩౨

3. (పర్వతాదుల) పాగ్శ్వ ప్రదేశము

క. ... పడమటి కొండపంచేలం బడవలకు
ఉ హరి. ౪ ౨౩౦

సీ. తాలుప్రసవత్వైన జాలంబుతో ఘోణి పంచల
రొంపిఁ గలంచి యాడ
పాండు ౧. ౧౩౬.

జః పంచేలిన్న, పంచేపాక, పంచేపాళి, పంచే
రుగు, పంచేలు పాటించు, పంచోడి[1]

**పంచే[2]**. విణ (సం. పంచః) అధికము, (చూ పంచే కరపాట్లు)

జః పంచేకరపాట్లు

**పంచకపాలము**. సం విణ (అ. ఆ అ.) అయిదు కొప్పెరలందు సంస్కరింపఁ బడినది (పురోడాశాగి)

**పంచకము**. సం విణ (అ ఆ అ) ౧ అయిదు వెలసి. ౨. అయిదు ఇచ్చి కొనఁ బడినద్ది, అయిదు వెల గలది; అయిదు శతము కలది 3 అయిదు వడ్డి గలది. (అప్వ మెు.)

వి అ. న ౧ అయిదింటి సమూహము (ఉదా: అష్ల పంచకము.)

౨ జగిడ మాడుచోటు, యుద్ధభూమి

**పంచేకము[1]**. వి. అశ్వముయొక్క పశ్చాత్పృష్ఠదేశము

సీ పంచేకం బన నశ్వపశ్చాత్పృష్ఠదేశ మూ ...
ఆం భా. ౨ ౨౦౦.

గీ. పంచేకము తొమ్మ విరివి యై పరిఢవిల్ల,
పాదరసంబువంటి,యుత్తమాశ్వంబు సాహిణి
యొకఁడు నిలుప ... సారంగ. ౧ ౭౧

**పంచేకము[2]**. వి అయిదు తూములు (శ ర)

**పంచేకరపాట్లు** వి బ (పంచే[2] + కరము + పాట్లు) అత్యధిక కష్టములు.

వ .. హరివిరించులు వక్త్రంచరులచేతఁ బంచే
కరపాట్లు వడి యంతఃకరణంబులఁ జింతించి.
భీమ ౪ ౧౦౭

గీ పంచేకరపాట్లు వడి తన్నుఁ బెంచి విసిగి .
కాశీ ౪ ౧౭

గీ. పెక్కుతెఱఁగుల నీరీతిఁ బెంచి విసివి, పంచే
కరపాట్లఁ బడ్డ సేపాటి రైనఁ, బణ్య
ధర్మంబు మదిలోనఁబట్టువడక, శైవధర్మంబె
ధర్మంబుగా విధించి కాశ ౪. ౧౩

**పంచకర్ణము**. సం విణ (అ ఆ. అ) చెవి యందు అయిదు అను సంఖ్య వాఁత వేయఁ బడినది. (పశ్వాది)

**పంచకోణము**. సం విణ (అ ఆ అ) (గణిత) అయిదుమూలలు గలది (క్షేత్రాది.)

**పంచకోలము**. (సం వి అ. న) పిప్పల్యాది పంచకము. (పిప్పలి, పిప్పలీమూలము, చవ్యము, సొంటి, చిత్రమూలము.)

**పంచకోశములు.** (సం. వి. అ పుం. బ) ఆత్మను ఆవరించి యుండు అయిదుకోశములు (అన్నమయము, ప్రాణమయము మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము అని అయిదు.)

**పంచక్రోశి.** (సం. వి.) ఈ స్త్రీ ౧ అయిదు కోసులు. ౨. (అయిదుకోసులు పొడుపు అయిదు కోసులు వెడల్పు కలది) కాశి

**పంచగవము.** (సం. వి అ న) అయిదుగోవుల సమూహము.

**పంచగవ్యము.** (సం వి అ న) గోవువలనఁ గలుగు అయిదు పదార్థములు.
(పాలు, పెరుఁగు, నేయి, పంచితము, పేఁడ)

**పంచగుణము.** సం విణ (అ ఆ అ) అయిదింత లైనది, అయిదురెట్లు కలది
వి అ. న. అయిదుగుణములసమూహము.

**పంచగుప్తము.** (సం. వి అ పుం) ౧ గుప్తము అయిదు అవయవములు (నాలుగు కాళ్లును తలయును) గలది - తాఁబేలు
౨ చార్వాక దర్శనము, (హే ని)

**పంచగువు.** సం విణ (ఉ.) అయిదుగోవు లిచ్చి కొనఁ బడినది

**పంచచత్వారింశత్తమము.** సం = పంచచత్వారింశము

**పంచచత్వారింశత్తు.** సం విణ. (త్) స్త్రీ నలువదియైదింటియం దుండుసంఖ్య కలది, నలువదియైదు వి త్ స్త్రీ నలువదియైగింటియం దుండు సంఖ్య.

**పంచచత్వారింశము.** సం. విణ (అ ఈ అ) నలువదియయిదవది.

**పంచచామరము.** సం వి. అ పుం (ఛంద) ఒకానొక వృత్తము

**పంచజనీనము.** సం విణ (అ. ఆ అ) పంచజనులకు (= పురుషులకు) హితమైనది

**పంచజనీనుఁడు.** (సం వి అ. పుం.) భాండాగారికుఁడు, కోశాధ్యక్షుఁడు.
(వై. ని. హాలా ని)

**పంచజనుఁడు.** (సం. అ పుం) పంచభూతముల నుండి పుట్టినవాఁడు. ౧ పురుషుఁడు ౨ ఒకానొక దైత్యుఁడు (శ్రీ కృష్ణుఁడు వీనిని జంపి వాని యెమ్ముకతో శంఖమును జేసికొనెను కావుననే దానికి పాంచజన్య మని పేరు వచ్చెను)

**పంచత.** సం వి ఆ స్త్రీ ౧ పంచభూతములలో లయమగుట; మృత్యువు, చావు ౨ అయిదింటి ధర్మము, పంచత్వ సంఖ్య

**పంచతత్త్వము.** (సం వి. అ న) ౧ అయిదు తత్త్వముల సమూహము. (పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము)
౨. తాంత్రికుల పంచమకారాది పదార్థములు (మద్యమాంస మత్స్యముద్రా మైథునములు) చూ. పంచమకారములు

**పంచతపు(పసు)ఁడు.** సం. వి. స్ పుం చుట్టు నాలుగు అగ్నులను పైని సూర్యుఁడును అను పంచాగ్నులనడుమ తపస్సు చేయువాఁడు

**పంచతయము.** సం విణ (అ ఈ అ) అయిదు అవయవములు గలది, పంచకము

**పంచతిక్తములు.** సం. వి. అ. న. బ. అయిదు చేఁదువస్తువులు
("నింబామృతావృషపటోలనిదిగ్ధికాశ్చ"— వేము, తిప్పతీఁగ, అడ్డసరము, చేఁతి పొట్ల, వాఁకుడు)

**పంచేతిన్నా** = పంచేరుఁగు. (√పంచే1.)

క. నిలిచి యతి కొంతదింతం, బలిమించుచుఁ బంచేలిక్కాపైఁ బడి వలకేల్, దలక్రిందం జేరిచికొని, వెలవెలనై నిద్ర లేక వేఁగుచు నుండెన్ . కం. పంచ. ౧ ౨౪౪.

సీ. అచ్చ పైఁ బాకిట రచ్చటాయి మెఱుంగు పంచేలిక్కాలు గొప్ప పారిగోడ .. శుక ౨ ౪౦౭.

**పంచత్తు.** సం వి త్ స్త్రీ అయిదింటి సమూహము.

**పంచత్రింశత్తమము.** సం — పంచత్రిం˘ము

**పంచత్రింశత్తు.** సం విణ (త్) స్త్రీ ముప్పదియైదింటియం దుండు సంఖ్య కలిగి వి త్ స్త్రీ ముప్పదియైదింటియం దుండు సంఖ్య

**పంచత్రింశము.** సం విణ (అ ఈ అ) ముప్పదియైదవది.

**పంచత్వము.** సం వి అ న = పంచతి

**పంచదశ.** సం విణ (న్) పదియేను (తెలుఁగున వృత్తియందు పూర్వావయవముగానే యుండును). ఉదా ' పంచదశ దినములు

**పంచదశము.** సం విణ. (అ ఈ అ) పదియేనవది.

**పంచదశాహికము.** సం విణ (అ ఆ అ.) పదియేను దినములు జరుగునది (వ్రతాది)

**పంచదశి.** సం వి ఈ స్త్రీ ౧ పదియేనవ తిథి; (పూర్ణిమ, అమావాస్య) ౨ పదియేను ప్రకరణములు గల గ్రంథము.

**పంచేదార.** వి (సం పంచసారః అని శ. ర.) చెక్కెర.

గీ. పైత్యదోషోదయంబునఁ బరుస పైన, జిహ్వ కహఁ బంచేదారయుఁ జేదు గాదె ... పైష. ౨ ౧౨.

ఉ. అంగభూపతా, కాయకయంత్రకుత్స్య శ్రీ మిత్ర దల్లనఁ ద్రెళ్లఁగ చేసి రయాలకో, తీయఁగఁ బంచేదార వెనుతీయఁగఁ బల్కినరుగా ద్వితీయఁగన్ విజ. వి ౧ ౯౪.

సీ. శర్కరాహ్వయములు చెక్కెర యనఁగను బంచేదార యనంగఁ బరఁగుచుండు ... ఆం భా. ౨ ౨౫౧.

**పంచదీర్ఘుఁడు.** సం విణ (అ ఆ అ) దేహమందు దీర్ఘములుగా నుండు అయిదుభాగములు కలవాఁడు. (అవి 'చేతులు, కన్నులు, కడుపు, నాసాద్వయము, స్తనముల నడిమిభాగము' అని కొందఱు— 'బాహువులు, నేత్రములు మోఁకాళ్లు, ముక్కు, చెక్కిలి మీఁదిభాగము' అని మఱికొందఱు. ఈ యైదును దీర్ఘములుగా నుండుట ప్రశస్తమని సాముద్రిక శాస్త్రము).

**పంచదేవతలు.** (సం. వి. ఆ. స్త్రీ బ.) అయిదుగురు దేవతలు (ఆదిత్యుఁడు, అంబిక, గణనాథుఁడు, శివుఁడు, విష్ణువు)

**పంచధా.** (సం అవ్య.) అయిదు విధములుగా, అయిదు భాగములుగా. (దీనికి తెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు )

**పంచనఖము.** సం. విణ (అ. ఆ ఈ. అ.) అయిదుగోళ్లు కలది. (మృగము.) (వి. అ. పుం ) ౧ అయిదుగోళ్లు గల మృగము (చెవులపిల్లి, ఏదుపంది, కాఁబేలు, ఖడ్గమృగము, ఉడుము. ఇవి భక్షింపఁదగిన పంచనఖ మృగములు అని స్మృతి.) ౨. ఏనుఁగు ౩ కాఁబేలు. ౪. సింహము. ౫. పులి.

**పంచనదము.** సం. వి అ. న. అయిదునదుల సమాహారము, అయిదునదులు. (పుం.) ('శతద్రువు, విపాశ, ఇరావతి, చంద్రభాగ, వితస్తి' అను అయిదు నదులు గలప్రదేశము.) పంజాబు.

**పంచనవతము.** సం విణ (అ. ఈ అ.) తొంబదియైదవది

**పంచనవతి.** సం. విణ. ఇ. స్త్రీ తొంబది యైదింటియం దుండు సంఖ్య కలది, తొంబది యైదు వి. ఇ స్త్రీ తొంబదియైదింటియం దుండు సంఖ్య

**పంచనవతితమము.** సం = పంచనవతము

**పంచని.** సం వి ఈ స్త్రీ శారిశృంఖల, విశ మను పాచిక

**పంచనింబము.** (సం వి అ న) వేపచెట్టు యొక్క బెరడు, పువ్వు, పండు, వేరు, ఆకు అను యైదుభాగములు

**పంచపంచాశత్తమము.** సం =పంచపంచాశత్తు

**పంచపంచాశత్తు.** సం విణ (త్ ) స్త్రీ ఏబది యైదింటియం దుండుసంఖ్య కలది, ఏబదియైదు (వి. స్త్రీ.) ఏబదియైదింటియం దుండుసంఖ్య

**పంచపంచాశము.** సం విణ (అ ఈ అ) ఏబదియైదవది

**పంచపక్షి.** సం వి న్ పుం అయిదు పక్షులను బట్టి భూతభవిష్య ద్వర్తమానములు తెలిసికొన సాధన మగు శాస్త్రము (వాచ)

**పంచపత్రిము.** సం వి అ పుం చండాల కందము, మాలకంద ?

**పంచపది.** సం వి ఈ స్త్రీ. ౧ అయిదు పద ములు ౨. ఋగ్వేదము ౩ కుశద్వీపమందలి నదీ విశేషము.

**పంచపర్ణిక.** సం వి అ స్త్రీ గోరుగము, పల్లేరు. ?

**పంచపర్వములు.** సం. వి. న్. న బ. అయిదు పర్వములు (అష్టమి, చతుర్దశి, పున్నమ, అమావాస్య, సూర్యసంక్రాంతి).

**పంచపల్లవములు.** (సం. వి. అ. న. బ.) ౧. (గంధకర్మమునందు = వాసన కట్టుటయందు) మామిడి, నేరేడు, వెలగ, మాదీఫలము, బిల్వము.

౨ (వైదికకర్మమున) కలశములమీఁద నుంపఁ దగినవి. మామిడి, రావి, మఱ్ఱి, మేడి, జువ్వి

౩ (తాంత్రిక కర్మమందు) పనస, మామిడి, రావి, మఱ్ఱి, పొగడ

**పంచపాళ** = పంచే', పంచోది (శ ర.)

**పంచపాత్తు.** సం విణ (ద్-పదీ ద్) అయిదు పాదములు గలది

**పంచపాత్ర(ము).** సం వి అ న. ౧. అయిదు పాత్రల సమూహము

౨ వెడల్పుమూతి గల లోహపాత్రము.

**పంచపాది.** సం విణ (న్ నీ న్) అయిదు పాదములు కలది వి ఈ స్త్రీ అయిదు పాదములు.

**పంచపాళి** = పంచే'. (చి ని వా)

**పంచపితలు.** సం వి. ఋ. పుం బ అయిదు గురు తండ్రులు.

శ్లో. జనకశ్చోపనేతా చ యశ్చ కన్యాం ప్రయచ్ఛతి, అన్నదాతా భయత్రాతా పంచైతే పితరః స్మృతాః.

**పంచపిత్తము.** సం. వి అ న అయిదు పిత్తములు. (వరాహచ్ఛాగమహిషమత్స్యమయూరపిత్తములు)

**పంచపుష్పములు.** సం వి అ న. బ అయిదు పుష్పములు.

(శ్లో. చంపకామ్ల శమీపద్మకరవీరం చ పంచమం).

**పంచమహాపాతకములు.** సం. వి. అ. న. బ. బ్రహ్మహత్య సురాపానము స్వర్ణస్తేయము గురుతల్పగమనమును ఈ పై నాలుగు పాతకములు చేసినవారితోఁ జెలిమి అను అయిదు గొప్ప పాపములు.

**పంచమహాయజ్ఞములు.** సం. వి. అ. పుం. బ. దేవ యజ్ఞము భూత యజ్ఞము పితృ యజ్ఞము బ్రహ్మ యజ్ఞము మనుష్య యజ్ఞము అను అయిదు మహాయజ్ఞములు (ఇవి గృహస్థునకు విహితనిత్యకృత్యములు.)

**పంచమాస్యము.** సం. విణ. (అ. ఆ. అ.) అయిదు మాసముల కొకమాటు కలుగునది (వి. అ. పుం.) (పంచమస్వరము ఆస్యమందుఁ గలది) కోయిల. (వాచ.)

**పంచమి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. (జ్యోతి.) పక్షమునందు అయిదవ తిథి. ౨. అయిదవ విభక్తి. ౩. సత్త్రమాడు పలక

**పంచేము¹.** విణ. ౧. చెదరినది. ౨. ధ్వస్తము (గ్రా. పంచేముపాడు.)
జ: పంచేబంగాళము, పంచేముపాడు

**పంచేము².** వి. ఇతరులను వశపఱచుకొనుటకు, బహిరంగముగా చేసెడి యుపకారాదికము ఇది లంచేము పదపూర్వకముగనే కానవచ్చుచున్నది
సీ. దొర కాపులై కార్యసరణి దర్పడి కవీశ్వరులకు లంచేపంచేమ్ము లొసఁగి ...
కువల ౪. ౬౧
ద్వి. ... ఆతనిచేత మీరు, లంచేపంచేంబులు లాభ్యగా నంది, వంచనచేసి విశ్వాసంబు దక్కి, అడఁచిన మీ యాట లాడింతు ననిన
ద్వి. పరమ ౩. ౪౫౭

**పంచము.** సం. విణ. (అ. ఆ. అ.) విస్తృతము, విరివి యైనది (ఉదా: పంచాననము.)

**పంచముఁడు.** సం. వి. అ. పుం. చండాలుఁడు, బ్రాహ్మణ స్త్రీయందు శూద్రునకు జనించిన సంకీర్ణ జాతివాఁడు

**పంచముఖము.** సం. వి. అ. పుం. ౧. (అయిదు ముఖములు గలది) అయిదు మొనలు గల బాణము ౨. (విశాలముఖము గలది) సింహము.

**పంచముద్రలు.** సం. వి. అ. స్త్రీ. బ. దేవతార్చనమునందుఁ జేయఁదగు నయిదు ముద్రలు (ఆవాహని, స్థాపని, సన్నిధాపని, సంబోధని, సమ్ముఖీకరణి, ఇవి పంచముద్రలు.)

**పంచేముపాడు** = బగ్గముపాడు విణ. (పంచేము + పాడు)
౧. చెల్లాచెదరైనది, మిక్కిలి చెదరినది.
సీ. బంటుతనము డించి పంచేముపాడైరి గరుడులు యక్షులు గగనచరులు ...
వరాహ. ౩. ౪౯
౨. బగ్గముపాడు, మిక్కిలిపాడు, ధ్వస్తము
సీ. కుందాణి విదళింగ గొడుగుచింత జయింప బాగూరు పంచేముపాగు చేసి ...
వరాహ. ౧. ౩౦.

**పంచముష్టికము.** సం. వి. అ. పుం. యవాది ముష్టిపంచకముతోఁ జేసిన కషాయభేదము. (యవ, కోల, కుళుత్థ, ముద్గ, మూలక, శుంఠులు యవాదులు. వీనిని పిడికెఁడేసి వేసి కాఁచిన కషాయము.)

**పంచమూత్రము.** సం. వి. అ. న. ఆవు, ఆఁడు మేఁక, ఆఁడుగొఱ్ఱె, గాడిద, ఆఁడుగాడిద. ఈ అయిదింటి మూత్రములు

**పంచమూలములు.** సం. వి. అ. న. బ. అయిదు వేళ్లు.
(శాలపర్ణి, పృశ్నిపర్ణి, వార్తాకి, కంటకారిక, గోక్షురము, అనువాని వేళ్లు "బిల్వము,

అగ్ని మంథము, శ్యోనాకము కాశ్మరి, పాటల అనువాని చెట్లు" అని కొందఱు.)

**పంచమూలి.** సం. వి ఈ. స్త్రీ. శాలపర్ణి, పృశ్నిపర్ణి, బృహతి, కంటకారిక, గోక్షురము అనువాని వేళ్ల సముదాయము

**పంచయామము.** సం వి అ. పుం గిలసము, పగలు (రాత్రి నాలుగు జాములలోను మొదటి అరజామును కడపటి అరజామును పగటిభాగములోఁ జేరును)

**పంచరత్నములు.** సం వి అ ప బ ౧. నీలము, వజ్రము, పద్మరాగము, మౌక్తికము, ప్రవాళము. (సువర్ణము, బంగారు, రజతము, వెండి, ముత్యము, రాజావర్తము, ఒకజాతి నల్ల మణి, ప్రవాళము, పగడము. అని కొందఱు) "బంగారు, వజ్రము, నీలము, పద్మరాగము, మౌక్తికము" అని కొందఱు) ౨ శ్రేష్ఠ మగు అయిదు వస్తువులు (పద్యాది)

**పంచరస.** సం వి అ స్త్రీ (అధికరసము కలది) ఆమలకి ఉసిరిక *

**పంచరాత్రము.** సం వి అ న ౧ అయిదు రాత్రుల సమాహారము ౨. నారదాదిప్రణీతమై జ్ఞానోపదేశక మగు గ్రంథభేదము

**పంచరాశికము.** సం వి అ న (గణిత) పంచ రాసులను గూర్చిన గణితభేదము

**పంచేరించు.** = పంచేరించు. (పెద్ద దగు)

సీ కొన పెంద్రుకలు పట్టుకొని పంచేరించిన పంగానసంబులఁ బట్టితెచ్చి ..
పి. శకుం ౪ ౨౩

**పంచే(ట)రుఁగు.** వి. (పంచే+అరుఁగు) పంచే తిన్నె.

ఉ. ... తన కాంతఁ బాయక, కప్పురపుటోఁడి పంచేరుఁగునందు పెతంబడి యున్నవాఁడు.
పరమ. 3. ౨౧3.

ఉ. మునుకు దినంబులందు మన మెానసలఁ బంచే టరుఁగు మీఁదటన్ హర. ౨. ౪౦.

చ. మణిరుచికవాఁటి ప్రొద్దునను మూనక పంచే టరుఁగుపైని దా, నిరవుగ నెచ్చెలిం గదిసి యొంత ప్రియోక్తులు పల్కుచుండ .
బిల్హ. 3 ౧33.

**పంచలక్షణము.** సం విశ (అ ఆ. అ) అయిదు లక్షణములు గలది వి అ న. అయిదు విషయములనుగూర్చి చెప్పునది పురాణము శ్లో సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ, వంశాను చరితం చైవ పురాణం పంచలక్షణమ్.

**పంచలవణములు.** సం. వి. అ. వ. బ. అయిదు లవణములు

(కాచకము, గాజుప్పు, సైంధవము; ఇందుప్పు, సాముద్రము; సముద్రపుటుప్పు; బిడము, బిడ్లవణము; సౌవర్చలము.)

**పంచలాంగలకము.** సం వి అ న. అయిదు నాఁగళ్లతో సేద్యము చేయఁదగి నంత భూమిని దానము సేయుట, మహాదానము

**పంచేలుపాటించు.** స క్రి (√పంచే) శ్రమ కలిగించు, బాధకలిగించు

క పంచముఖ మధ్యమునకు పై, పంచసమంచత్కాశ్యప్రపంచమునికి నీ, పంచశరకేళి వంచన, పంచేలు పాటించు టరుదె పంచజకో ...
రా. వి. ౪. ౧౧౦

**పంచలోహకములు.** సం వి. అ న అయిదు లోహములు (బంగారు, వెండి, రాగి, తగరము, సీసము.)

**పంచవక్త్రము.** సం = పంచాస్యము.

**పంచవక్త్రుఁడు.** సం వి ఙ. (అ ఆ అ) అయిదు ముఖములు గలవాఁడు వి. అ పుం. (సద్యోజాత వామదేవా ఘోరతత్పురుషేశాన ములను పంచ ముఖములు గలవాఁడు శివుఁడు (ఇత్లే: పంచాస్యుఁడు, పంచముఖుఁడు, పంచాననుఁడు లోం)

**పంచవటము.** సం వి అ పుం యజ్ఞోపవీతము, జందెము

**పంచవటి.** సం వి ఈ స్త్రీ ౧. అశ్వత్థము, బిల్వము, వటము, ధాత్రి, అశోకము అను అయిదు వటముల సమాహారము

౨. దండకారణ్యమందలి యొక ప్రదేశము, (ఇందు శ్రీరాముఁ డరణ్యవాసకాలమున వసించియుండెను. ఇది యిప్పటి 'నాసిక' అనుచోటికి రెండు మైళ్ల దూరమున నున్నది)

**పంచవన్నె(న్నియ)** మి విణ అయిదు వర్ణములు కలది

చ. జిలిబిలికమ్మఁ దేనియలు చిల్కఁగఁ బల్కెడు పంచవన్నెగా, చిలుకల పంజరాలగమిచే నలరారెడు రంగమంటపం, బలసతసొక్క చంద్రా ౫ కా౨ శివరా ౨ ౩౬

వి అయిదువన్నెములు గల చిలుక (ఇది మన్మథుని వాహనము)

సీ పంచవన్నియతోడఁ బ్రసవవారాముని సెట్టి చిచ్చులకంట జట్టినాఁడు భీమ ౧ ౧౧౦

బ. అయిదు రంగులు

సీ. పంచ వన్నెలయోగ పట్టె పొందుగపైచి బ్రొద్దు నిద్దపుమేన బూదిఁబూసి ...

శారంగ. 3 ౧౬౧

**పంచవర్గము.** సం వి. అ పుం అయిదింటి సమాహము, పంచత్తు (పంచ భూతములు, పంచేంద్రియములు, పంచమహాయజ్ఞములు లోం)

**పంచవర్ణము.** సం విణ (అ ఆ. అ) అయిదు వర్ణములు కలది వి అ. న అయిదు వన్నెల పిండిముగ్గు

**పంచవల్కలములు.** సం వి. అ న బ మఱ్ఱి, రావి, జువ్వి, మేడి, ప్రబ్బ యనెడి యైదింటి బరడులు

**పంచవార్షికము.** సం విణ (అ ఆ అ) అయిదేండ్ల కొకమాటు కలుగునది

**పంచవింశకుఁడు.** సం విణ. (అ కా అ) ఇరువదియైదవవాఁడు

**పంచవింశతి.** సం విణ ఇ స్త్రీ ఇరువదియైదింటియం దుండు సంఖ్య కలది, ఇరువదియొదు వి. ఇ స్త్రీ ఇరువదియైదింటియం దుండు సంఖ్య

**పంచవింశతితమము.** సం = పంచవింశము

**పంచవింశము.** సం విణ (అ ఈ అ) ఇరువదియైదవది

**పంచవిధప్రకృతులు.** సం వి ఇ స్త్రీ బ. అయిదు రాజ్యాంగ ప్రకృతులు (అమాత్యుఁడు, రాష్ట్రము, దుర్గము, అర్థము, దండము)

**పంచవృత్తి.** సం వి. ఇ స్త్రీ ౧ (ప్రమాణ విపర్యయ, వికల్ప, నిద్రా, స్మృతులు అను నైదు వృత్తులుగల) మనస్సు.

౨ (ప్రాణాపానవ్యానోదానసమాన వృత్తులు గల) దేహవాయువు

**పంచశరుఁడు.** సం = పంచబాణుఁడు.

**పంచశాఖము.** సం. విణ. (అ. ఆ. అ.) అయిదు శాఖలు గలది. వి అ. పుం. ౧ (అయిదు వ్రేళ్లు అను అవయవములు గలది) చేయి. ౨. (పెద్ద అవయవములు గలది.) ఏనుఁగు.

పంచశిఖము. సం వి అ పుం (పెద్ద జూలు కలది) సింహము

పంచమములు. సం విణ (అ ఆ అ) బ అయిదాలు. (పంచపదినములు = అయిదాలు గ్రా ములు)

పంచవష్టము. సం విణ (అ ఈ అ) అఱువది యైదవది

పంచవష్టి. సం విణ ఇ స్త్రీ అఱువదియైదింటియం దుండు సంఖ్య గలది అఱువదియైదు. వి ఇ స్త్రీ అఱువదియైదింటియం దుండు సంఖ్య

పంచవష్టితమము. సం = పంచవష్టము

పంచసప్తతము. సం విణ (అ ఈ అ) డెబ్బది యైదవది.

పంచసప్తతి. సం విణ ఇ స్త్రీ డెబ్బదియైదింటియం దుండు సంఖ్య గలది, డెబ్బదియైదు వి. ఇ స్త్రీ. డెబ్బది యైదింటియం దుండు సంఖ్య

పంచసప్తతితమము. సం = పంచసప్తతము

పంచసస్యములు. సం వి అ న బ వడ్లు, పెసలు, తిలలు, మినుములు, యవలు అను నయిదు సస్యములు. (యవలు అనుచోట ఆవాలు అని కొందఱు)

పంచసుగంధకము. సం వి అ న కర్పూరము, కక్కోలము, లవంగ పుష్పము, పోఁక, జాజి కాయ యనెడి యైదింటిని సమభాగములుగాఁ గూర్చిన పరిమళద్రవ్యము

పంచసూనలు. సం వి ఆ. స్త్రీ బ అయిదు ప్రాణివధ స్థానములు (కండని = కత్తిపీఁట మొ. పేషణి = సన్నికల్లు, తోలు మొ ఖల్లి = ప్రొయ్యి, మార్జని = చీఁపురు, ఉదకుంభి = నీళ్లకడవ అను నైదును కీటకవధ స్థానములు ఈ దోషముల పరిహారమునకే పంచయజ్ఞములు గృహస్థులకు విధింపఁబడినవి)

పంచహాయనము. సం విణ (అ ఈ అ) అయిదేండ్ల యీడు గలది (బాలాది) (అ ఆ అ) అయిదేండ్ల యీడు గలది (గృహాది)

పంచాంగగుప్తము. సం వి అ పుం గుప్తమైన పంచాంగములు (నాలుగు కాళ్లను తలయు) గలది కచ్ఛపము, తాఁబేలు

పంచాంగిమయ్య. మి వి (పంచాంగము + అయ్య) పంచాంగము చదువు బ్రాహ్మణుఁడు

సీ పంచాంగమయ్యకుఁ బాగ సమర్పించు
నట్టువకానికిఁ బెట్టు మురువు .
హంస ౫ ౧౩౪

పంచాంగము. సం విణ (అ ఆ ఈ అ) అయిదు అంగములు గలది వి. అ పుం ౧ కూర్మము, తాఁబేలు ౨. పంచభద్ర మనెడి అశ్వవిశేషము ౩ తిథివారనక్షత్రయోగ కరణములను తెలుపు గ్రంథము

ద్వి అఱువు దోపతియుఁ బంజాంగంబు ముష్టిఁ,
బగిగిన కరతిత్తి పత్త్రాలిసంచి .
ద్వి హరిశ్చ ఉ ౫౦౩.

పంచాంగములు. (నీతి) ఉపాయము, సహాయము, దేశకాల విభజనము, ఆపదుప్రతిక్రియ, కార్యసిద్ధి.

(జ్యోతి) తిథివారనక్షత్రయోగకరణములు

(ప్రణామ) బాహువులు, మోఁకాళ్లు, శిరస్సు, ఱొమ్ము, నేత్రములు

(వృక్ష) ఆకు, పువ్వు, పట్ట, ఫలము, వేరు

(అభినయ) మనస్సు, కన్నులు, కనుబొమలు, చేతులు, కాళ్లు.

క. అటు పసిండి పరులయమ్మల దిటు మగు
పక్కిదొర నల్లదేవర వోలెకా ..
అచ్చ భా ౨. 3౧

**పక్కియ[1]** = పక్కి. వి పిచులము, పక్కిచెట్టు. (శ. ర.)

**పక్కియ[2]** = పక్క, ప్రక్క. వి (సం పక్షకః. ప్రా పక్ఖఓ)

౧. ప్రక్క, పార్శ్వము, పార్శ్వస్థలము.

క. మొగుళగమును నముళగమును, పరి నిరుపక్కియలు దాఁకి జవ మఱి కిఁగసం, భరమునఁ గిరిగ వరాహము, శరనిధి మథనమునఁ దిరుగు శైలము పోలెన్
శా ఆర ౧ 3౦౬

చ పసిఁడి మెఱుంగు ఱెక్క లిరుఁ బక్కియలం దురఁటుల్ పలె న్నము, ల్లసద పమానిలాంకు గమలం బొరియించుచు సేద దేర్ప
రామా ౧ ౫

సీ. ఇరుపక్కియల నుండి నుర సింధురంబులు పరిపూర్ణ హేమకుంభములు దాల్ప
హ ౬ ౪౪

వ. ... జరిర వనితలు తమకు ముక్కుం దారు ముక్కు కొక్కించుకొ రయార తొా మిడి వారి యిరుపక్కియల నొదిఁగి .
ఆము ౪ 3౫.

౨ తెగ, పక్షము

గీ రణసముత్సాహలక్ష్మి వక్త్రీగుణ వింత, చెన్ను నెలయింప నా ప్రుబునేరి రెండు, పక్కియలయందుఁ బవరింపు పలుకు లెసఁగ.
భా కిష్క ౧ ౬౦

**పక్కియ[3]** = పక్క[3].

**పక్కియొడలివాఁడు.** వి (√పక్కి) కిన్నరుఁడు. (శ. ర)

**పక్కిరా.** వి (√పక్కి) గరుత్మంతుఁడు.

సీ. పక్కిరాతేజిపై పక్కినయభ్యాసి చాణూరుఁ ద్రుంచినసత్యరాశి ... నిరం ౭ ౨.

**పక్కిరాచెలి.** వి (√పక్కి) గరుడ(స్త్రీ), గరుడ జాతి(స్త్రీ)

ఈ పీపుల కంటిలోయ్యలియు వేల్పువెలందియు జక్కి మోవశేఁ, జానయు పక్కిరా చెలియు ... అచ్చ రా బాల ౧౪౪

**పక్కిరాజక్కిదొర.** వి (√పక్కి) గరుడ వాహనుఁడు, విష్ణువు, కృష్ణుడు

గీ పక్కిరాజక్కి గొరగల్మి జక్కఁ గోరి, చొక్కమండెడుడెంద మున్మక్కి యొక్క, తుంబవమానినితోడఁ బొందుఁగను నిచ్చ, యిడఁగఁజూచునె తలఁప నెయ్యోదలనైన
నీలా ౨ ౧౬

**పక్కిరాయఁడు.** వి (√పక్కి) పక్షిరాజు, గరుత్మంతుఁడు. (శ ర)

**పక్కితేఁడు.** వి (√పక్కి) పక్షిరాజు; పక్షి శ్రేష్ఠుఁడు

రగడ ఖరుని పీచ మడంచి కల్లమెకంబు నొక్క వెడందతూపున మఱియ లానరిచి పక్కి ఱేనికి ముక్తి పతముగ నొసఁగి యేపున
అచ్చ రా. యు ౬౪

(జటాయువు అని భావము)

**పక్కిలి** = పక్కియ[2] వి పార్శ్వము, ప్రక్క

ద్వి కొలంకుల రెండు నంగుళముల నడుమఁ గలయఁగఁ గన్నెల్లఁ గొలఁకు లై తాకె, నక్కన్నగొలంకులు నరచేత మూయఁ బక్కిళ్లఁ బింఛించి పాంగఁ దొడఁగె ...
బస పు. 3౪౪౯.

ద్వి. గంధంబుఁ జెక్క లాకాంతమై తెచ్చి,
అందించి కావటిపక్కుల్గఁ జేరిచి
పండితా. పురా. ౧౭౬ పా

పక్కిసామి. వి (√పక్కి) గరుత్మంతుఁడు

సీ తమ్మికొలను జొచ్చు కొమ్ముకేసనుఁగు రివిఁ
బాములఁ దోల్పక్కి సామిజాడ ..
అచ్చ రా యు ౩౪౧

పక్కు[1]. వి (అ పక్కు) నవ్వుట పడఁగొట్టుట
ఏయుట త్రెంచుట పొడుచుట మున్నగు
వానియం దగు ధ్వని కనుకరణము

ఉ పక్కున నవ్వు నింతిపయి బాలి నృపాలక
మౌళి ఖిన్నతన్ . హంస ౧ ౭౨

ఆ భూమి నాది యన్న భూమి పక్కున నవ్వు,
దానహీనుఁజూచి ధనము నవ్వు, కదనభీతుఁ
జూచి కాలుండు నవ్వును ...
వేమన. ౨ ౭౫.

గీ బలులకిందూతి కై రాయఁబడిన తరువు,
తునిసి పెల్లున విఱుగ గిఱ్ఱునను మరలి,
పక్కునను రేఁడుకునియ లై పడఁగఁ గొట్టె,
భీకరం బగు నొక దొడ్డ మాకరంబు ...
చంద్రా ౨ ౯౨

చ. ... మాకు నాలుగ్రొం, బదను లకోరులన్
విడముఁ బక్కున నేసినఁ ద్రుంచి యన్ని
టన్, జదిపెఁ దదీయబాపహయసారథి
కేతుల నాతఁ డుగ్రుఁ డై .
చంద్రా. ౬ ౧౦

సీ మును బూది పొలదిండిమనము పక్కునఁ
ద్రెంచి భవుని మెప్పించు నీ బంటుతనము
చంద్రా ౩. ౫౬.

(దీని యామ్రేడితరూపము "పక్కుపక్కు")

వ. ... అంచుల సంచరించు రాయంచబోఁదల
వాడుగా మ పక్కునఁ బక్కుపక్కునఁ బొడువ
కొక్కించుక విచ్చుకెంట్ల కొత్తమ్మి కెంగ
డల ... చంద్రా. ౫. ౬౩.

ఉ పక్కునఁ దిట్టినం గసరి పక్కున ...
వి ప్ర. ౫. ౭౯.

సీ పక్కుపక్కున సంఘిపాళముల్ విసఁ
ద్రుంచి . మకుచ. ౪ ౧౦౩

పక్కు[2]. ఎండినవట్టు, వరుగు.

ఉ చిక్కులు పడ్డవెంద్రుకలు చిక్కి నలంగిన
కమ్మపూవులుం, జక్కిగి మోవులుం గుసుమ
సాయకముద్రలు చిట్టు గందపుం, బక్కుల
తోడి దేహములు వి పు ౬ ౨౦.

౨ ఎండు మెదుకు

గీ ఎండుమెదుకులు పక్కునా కొసఁగు ...
ఆం భా. ౨. ౨౫౭.

౩ పరిపాకము

వ ... ఇవ్విధంబున నయ్యూర్వశియు వసి
మాలఁ జెనంగి యక్కిరీటి చక్కని మనంబు
పక్కు గానక .. హర ౭. ౧౩౪.

౪ (త పక్కు) పగులు, బీఁట (చూ. పక్కు
గొను)

(విణ) వృద్ధుఁడు, ముసలివాఁడు (పక్కువంటి
వాఁడు)

సీ .. డొక్కు ముదురు పక్కు పన్ను, యర
గడం బనఁగను సలయు వృద్ధాభిధ .
ఆం భా. ౨. ౧౧౯.

౫ పక్కుగొను

పక్కుగొను. అ. క్రి (√పక్కు[2]) బీఁటలు
వాఱు

వ. అంతం గింతుండు నిజవశ్యాధిదేవత ప్రస
న్నం బై నంతియ సంతోషించి యుద్దేవికిం
గామాధికారంబుసేసి పరమేశ్వరున కెఱిం
గించి పక్కుగొన సేయుదు వని తలంచి
గారి హృదయంబు స్మరనారాచంబున ఖేదిం
చిన నాక్షణంబ ... కు. సం. ౫ ౫౦౭

పక్తిక. సం వి ఆ. స్త్రీ గౌరసర్షపము, గౌర వర్ణము గల ఆవ (వై ని)

పక్తిశూలము. సం వి అ న తిన్నపదార్థము జీర్ణ మగునపుడు కలుగు శూలబాధ

పక్తిృము. సం వి అ న ౧ గార్హపత్యాగ్ని ౨ గృహస్థ ధర్మము

పక్త్రిమము. సం విణ (అ ఆ అ) ౧ పండినది ౨. పక్వమైనది, పరువమునకు వచ్చినది ౩ పాకముచే శిక్షించినది, వండఁగా వచ్చినది

పక్వకృత్తు. సం విణ (ౕ) ౧ పక్తము చేయునది, పరిపాకము నొందించునది, భక్షము చేయునది. ౨ వండునది
(వి. త్ పుం) నింబము, వేము

పక్వకేశుఁడు. సం విణ (అ ఆ త అ) నెరసిన వెండ్రుకలు గలవాఁడు

పక్వము. సం విణ (అ ఆ. అ) ౧ పరిణతము, పరిపాకము పొందినది పండినది ౨ పరువము నొందినది పూర్ణముగా ఎదిగినది ౩ వినాశోన్ముఖము, పోవనున్నది (ఉదా పక్వోపమాన జ్యాగ్రీ స్త్రీణామ్) ౪ వండఁబడినది (వ్యాతి. అమము) ౫ జీర్ణించినది, అఱిగినది
వి. అ న ౧ పాకము ౨ కాఁచినపాలు మొ గలిగిన పెరుఁగు (శే ని వై ని)

పక్వరసము. సం వి అ పుం వండఁబడిన అన్న గుడాదుల రసము మద్యము (వాచ)

పక్వవారి. సం వి ఇ న ౧ గంజి ౨ కాఁగిన నీరు

పక్వాధానము సం వ అ న = పక్వాశయము.

పక్వాన్నము. సం వి అ న. వండిన యన్నము, వండిన యాహారపదార్థము

పక్వాశయము. సం. వి. అ. పుం. దేహమందు అన్నము పక్వ మగు కోశము

పక్వేష్టక. సం వి ఆ. స్త్రీ కాల్చిన యిటిక, పండిటిక

పక్షకము. సం వి అ పుం ౧ పక్షద్వారము, దిడ్డివాకిలి ౨. పక్షము, ప్రక్క. ౩ పక్షశాల (వై ని)

పక్షచరము. సం వి అ పుం. ౧ కదుపు వీడిన ఏనుఁగు, గుంపున వీడి విడిగాఁ దిరుగు ఏనుఁగు ౨ పక్షి ౩. ఒంటరిగాఁ దిరుగు జంతువు (వై ని)

పక్షచరుఁడు. సం వి అ పుం ౧ చంద్రుఁడు ౨ పార్శ్వచరుఁడు, ప్రక్కఁ దిరుగు సేవకుఁడు

పక్షతి. సం వి ఇ స్త్రీ ౧ పక్షమూలము, ఱెక్క మొదలు ౨ పక్షమందలి మొదటితిథి, పాడ్యమి

పక్షద్వారము. సం వి అ న ప్రక్కగా నుండు ద్వారము, దిడ్డివాకిలి

పక్షధరము. సం విణ (అ ఆ అ) ౧ ఱెక్కలు దాల్చినది ౨ ఒక పక్షమును అవలంబించినది (వి అ పుం పక్షి)

పక్షధరుఁడు. సం వి అ పుం. ౧. చంద్రుఁడు ౨ పక్షపాతి ౩ పక్షస్థతిథిమానాదిధారణాశక్తి గలవాఁడు ప్రసన్నరాఘవనాటక చింతామణ్యాలోక కృతికర్త యగు జయదేవుని బిరుద నామము (వాచ)

పక్షనాడి. సం వి. ఈ. స్త్రీ. ఈఁకయొక్క గొట్టము

పక్షపాతము. సం విణ (అ. ఆ. అ) ౧ పక్షముందు పాతము కలది, పక్షపాతము కలది ౨. పక్షముయొక్క పాతము కలది.

వి అ పుం ౧ ఒక ప్రక్క కొఱగుట, ఒక ప్రక్కకు ప్రాలుట )

౨. ఒక్కదానియందు అభిమానము; అన్యాయ్య మగు సాహాయ్యము ౩ పక్షులకు ఱెక్క లూడుట ౪ ఱెక్కలు ప్రాలుట

**పక్షపాతి.** సం విణ (స్ నీ స్) ౧ పక్ష పాతము కలవాఁడు, ఒక పక్షమునం దభిమానము గలవాఁడు, సహాయుఁడు ౨. ఱెక్కల పాటు గలది

**పక్షపాళి** సం వి ఇ పుం పక్షద్వారము, ప్రక్క వాకిలి

**పక్షబిందువు.** సం. వి ఉ పుం (ఱెక్కలపై చుక్కలు గలది ) కంకము రాబులుఁగు.

**పక్షభాగము.** సం వి అ. పుం ఏనుఁగు పార్శ్వ భాగము (అమరకోశము )

**పక్షము.** సం. వి అ పుం ౧. పత్త్రము, ఱెక్క, వాజము, అంపగఱి, బాణ పుంఖమునఁ గట్టుఱెక్క

౨. (పాడ్యమి మొదలు పూర్ణిమవఱకుఁ గాని అమావాస్యవఱకుఁ గాని) పదునేను దినముల కాలము

౩. పార్శ్వము, ప్రక్క

౪. దేహార్థము, దేహముయొక్క చెరిసగము వైపు.

౫. తెగ, వర్గము

(ఉదా ' ఉభయ పక్షముల సైనికులు, ఉభయ పక్షములవారు.)

౬. (కేశార్థక పదములకు పరమైనచో) సమూహము.

(ఉదా : కేశపక్షము, కచపక్షము, మెం )

౭. (తర్క) సందిగ్ధ సాధ్యవంతము

(“ పర్వతో వహ్నిమాన్ ధూమాత్ ” అను చోట ధూమహేతువుచేత సాధింపఁదగినది వహ్ని - అదిగల పర్వతము - పక్షము)

౮ వాదముయొక్క పూర్వోత్తరా వయవము లలో నొకటి, కోటి పూర్వపక్షము, ఉత్తర పక్షము.

౯ (ద్యోతి) రెండు అను సంఖ్య.

౧౦. దేహము

౧౧ వృషకుంజరము, రాజెక్కెడి ఏనుఁగు

౧౨. బలము, సేన

౧౩. విప్రతిపత్తి, విరోధము

౧౪. గోడ

౧౫ గృహము, ఇల్లు

౧౬ ప్రాయ్య రంధ్రము

౧౭ అంతికము, దాపు.

౧౮ కంకణము, వలయము.

౧౯. శుద్ధి

౨౦. సహాయుఁడు

౨౧. సఖుఁడు, చెలికాఁడు

౨౨. పిచ్ఛము, నెమిలిపురి

౨౩ పార్శ్వద్వారము, ప్రక్క గుమ్మము

౨౪. విరోధము (వై ని )

౨౫. వికల్పమునందలి కోటి.

క ఇదిరొంక పక్షంబున మం, చిది యగు నగుఁ గాక రేమి చిరవిక్రమ సం, పదగలరాజాన కుచితమె, సదన త్యాగంబు మానువచ్యాతి గలదె ... కేం పంచ. ౩. ౧౪.

**పక్షమూలము.** సం వి అ. న. ౧. (పక్షతి) ఱెక్కయొక్క మొదలు. ౨. పక్షమున మొదటి తిథి, పాడ్యమి.

**పక్షవాదము.** సం. వి. అ పుం. ఒకపక్ష మవలం బించి వాదించుట

**పక్షవాహనము.** సం వి అ పుం. (ఱెక్కలచేఁ గొనిపోఁబడునది) పక్షి

**పక్షశాల.** సం వి ఆ స్త్రీ పక్షకము, పార్శ్వగృహము

**పక్షసుందరము.** సం. విశే. (అ ఈ అ) ఱెక్కలలో అందము కలది, అందమైన ఱెక్కలు కలది (వి అ పుం) లోధ్రము, లొద్దుగు చెట్టు

**పక్షహతుఁడు.** సం. విశే (అ ఆ అ) ౧ ఒక పార్శ్వము రోగముచేత పడిపోయినవాఁడు. ౨. ఱెక్కలపై కొట్టఁబడినవాఁడు ౩ ఱెక్కలతోఁ గొట్టఁబడినవాఁడు

**పక్షాంగము.** సం వి అ పుం. అహోరాత్రము, వాసరము (వై. ని)

**పక్షాంతము.** సం వి అ పుం ౧ పక్షము యొక్క అంతము, పక్షముయొక్క తుద ౨. పున్నమ ౩ అమావాస్య ౪ పక్షాగ్రము, ఱెక్కకొన.

**పక్షాంతరము.** సం వి అ న అన్యపక్షము, మఱియొక పక్షము

**పక్షాఘాతము.** సం వి అ పుం ౧ శరీరము యొక్క ఒక పార్శ్వము పడిపోవునట్లు చేయు రోగము. ౨. వాదమందలి యొక పక్షమును ఖండించుట

**పక్షి.** సం. విశే (న్ ణీ న్) ౧. ఱెక్కలుగలది ౨. ఒక పక్ష మవలంబించినది.

(వి. న్ పుం ౧ పులుఁగు, పిట్ట. ౨. అమ్ము, బాణము.

**పక్షికీటము.** సం వి అ పుం అల్పపక్షి, నీచపక్షి.

**పక్షిణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుపిట్ట. ౨. రెండుపగళ్లతోఁ గూడినరాత్రి, తొంబది గడియలకాలము. (పక్షిణ్యాకాచము చూ) ౪. పున్నమ

**పక్షిపుంగవుఁడు.** సం. వి అ పుం. పక్షిశ్రేష్ఠుఁడు, (జటాయువు, గరుడఁడు, సంపాతి. చూ)

**పక్షిబంధనము.** సం. వి. అ. న. ౧. పంజరము ౨ పక్షులనుబట్టు వల (వై. ని)

**పక్షిరాజు.** సం వి. న్ పుం పక్షులకు రాజు (గరుడఁడు, జటాయువు, సంపాతి చూ)

**పక్షిశాల.** సం వి ఆ స్త్రీ ౧ నీడము, గూడు ౨ పెంపుడు పక్షుల నివాసమునకై కట్టిన గృహము

**పక్షీకరించె.** సం స క్రి (తనపక్షముదిగాఁ జేసికొను) అభిమానముతోఁ గాని ప్రేమతోఁ గాని స్వీకరించు.

గీ. ధర్మజాని శార్య మఖిల బృందారకులకు,
సానవము నీవు నీకుఁ బ్రియంబు గాఁగఁ,
జేయఁబూనిన క్రతువుఁ బక్షీకరించి, కరుణ
దలకొత్త రక్షించుకాక యనుచు ...
జై భా ౪ ౨౬.

వ. రతిబడలిక వాయఁ గరంబురఁబులఁ జల్లాడు పువ్వుబోఁడుల శయక్షుకేశయ సమాక్షిప్త ఘనసారక్షోదంబులం బక్షీకరించుచు ...
చంద్రి. ౪ ౧౦౪

**పక్ష్మకోపము.** సం. వి. అ పుం. నేత్రరోగభేదము. (ఱెప్పవెండ్రుకలు కనుగ్రుడ్డు నందంటుకొనఁగాఁ గలుగు కంటిమంట)

**పక్ష్మము.** సం. వి. అ. న. ౧. ఱెప్పవెండ్రుక. ౨ పక్షియీఁక. ౩. పూలిపోఁచ. ౪. కింజల్కము, పుష్పకేసరము ౫. పుష్పచ్ఛదము. ౬. తంతు తూలాదులయొక్క మిక్కిలి చిన్న భాగము. (శ. ని.)

సీ. పసిఁడి సలాకపైఁ బగలు చాఁటుట గాక ...
విక్ర. ౭. ౪౪.

౨. దూషించు.

క. కన రత్తి ముక్కుడున్సిన పసరమువలె రేఁగి, పరుషభాషల నన్నుఁ, విమవక పగఁ జాటుచుండ బో, మ్మసమున, నన దండపాలుం డట్లొనరించె నేం పంచ .. ౧ ౬౦౦

పగటిఱేఁడు. వి (పగలు + ఱేఁడు) అహర్పతి, సూర్యుఁడు.

గీ కవులముంగొంగుపోన్ను లోకములకిన్ను, పచ్చగుఱ్ఱపుఱేఁడు పగటిఱేఁడు
ఇందు ౪ ౬౧.

పగటివే (లుపు) ల్పు. వి (పగలు + వేల్పు) సూర్యుఁడు

ఆ చాలతపముఁ బూని సంయముల్ వనముల, నిన్నుఁ గాంచువేడ్క నున్నవారు, దగ్నినం బొసంగఁ దగు రామ యని వేలు, కొల్వ ననఁగఁ బగటివేల్పు బొడిచె ...
అభ్యా అయో. ౪౬ పా ౧౭ సం

పగటు. స క్రి ౧ ప్రకటించు, బయలుపఱచు

క. ధర వెవ్వారలు సేసిన, దురితంబులు నుచ్చరింప దోస మఁటమహా, పురుషుల కోకకాద రొయికచోఁ, బొరసిన నది పగటు పాపము వృథానసూని . కళా ౭ ౧౬౬.

సీ. మారినీలసోపానసరణి గాఁబోలును బగటు చున్నది నల్లపాఁపపేరు. ప్రభా ౧ ౬౩

సీ. పన్నీర పూరమిళోన్నేత్ర యుగళంబు పద నిచ్చు మదనునంబకముఁ బగటు
రా వి ౪. ౬౭.

౨. తిరస్కరించు.

సీ. పద్మరాగప్రభం బగటికర్ణంబులు కాంచన దీధితి మించుతనువు. హారిక్చ ... ౨. ౪౧.

సీ పవదంపు నునుగెంపుఁ బగటు కెంజెదగుంపు జిగి యాకసపుఁ జెట్టుఁ జిగురుఁ గొలుప.
వాల్మీకి ౧. ౪౧.

(పై రెండు ప్రయోజనములందు ఔపమ్యద్యోతకము)

వి (సం ప్రకటమ్. ప్రా పయడం త పకట్టు) కాంతి, శోభ; చక్కఁదనము, సౌందర్యము.

సీ అవయవసరసతొష్ఠవములఁ బంపొందుమృగవిశాలేక్షణల్ పగటు చూప ...
హ న ౫ ౧౭.

గీ అభినవాలోకనోత్కంఠ నధిపుఁ దలగ, నల రుఁబోఁడి సమగ్రలజ్జానుభావ, భావ రైతెరమాటునఁ బగటు చూపఁ, జూపఱకుఁ గోఁచెఁ బరిణయనర్తి యనుడు ...
వసు. 3. ౬౦.

(ప్రకాశము. అని శ ర)

౨ విధము, రీతి.

క మృగమదమున రుచి పుట్టిన, పగిదిన్ జెలికనను బందు పండినరీతిం, దగ సురభి పసిఁడి నొదవిన, పగటున యౌవనము దనర బాలామణికిన్ ... బిల్హ. ౧ ౫౦.

3 వైరము

గీ వేరి, మనఁగఁ బగ టన నొంటమి యనఁ బగ యన, నొప్పమి యనంగఁ గంటు నా నొప్వ వైరము ... ఆం. భా. ౧. ౧౩౪.

౪. విప్రలాపము. విరోధోక్తి.

గీ. ... కచ్చె పగటు కంట, సమ్మ నాఁగను విప్రలాపమ్మ చెలఁగు ..
ఆం. భా ౧. ౧౧౬.

౫. (సం. ప్రకటః, ప్రా పయడం.) ప్రకాశము, ప్రాకట్యము

ద్వి. ఎన లేనిపాద వైన యీ మేనితోడఁ, బగటున నీపురిఁ బగలు చొచ్చినను, బగ లౌను

రాక్షసభటులకు నాకు

రం. రా. యుం. ౨౪౧ పా. ౫ పం

విశే. కాంతి గలది, మనోజ్ఞము.

గీ పగటిముత్యాలముగ్గులు పచ్చతోరణములు.

ల వి. ౫ ౨౨

సీ పగటుపావలు మెట్టు బట్టు కైవాగముల్
జోడింప వారిగాలనీడ కేగు .

కువల ౫ ౯.

సీ హిమవారి యధికశైత్యమ గుణం బయ్యెను
పగటువాకోయిల పత్రి మయ్యె ...

ప్రబంధ ౫ ౨౦

జ : పగటుందనము

**పగటుందనము.** వి (√పగటు) ౧ మనోజ్ఞము, ఒప్పిదము

సీ వరనువర్ణాస్పృశ్యవర్ణభామలు భజింపఁగఁ
ప్రౌఢిమను మనుపగటుందనము

హ న ౨ ౧౩ (నలపక్షము)

౨ ఉద్ధతి, ఉదుటు

సీ వరనువర్ణాస్పృశ్యవర్ణభామలు భజింపఁగఁ
ప్రౌఢిమను మను పగటుందనము . .

హ న ౨ ౧౩ (హరిశ్చంద్ర పక్షము)

**పగడ.** వి (సం వటికా క పగడె త పగడై)

౧ పాచికలమీఁది రెయుంటిచుక్క (శ ర)

౨. (క పగడె = అక్షము) పాచిక. (చూ. పగడసాల.)

3 (స) పాచికల ఆటయం దుపయోగించు ఒకటియను సంఖ్య

గీ. పాచిక యనంగ గవర నాఁ బాళక శకుఁ,
బగఁగు నేకవచనమునఁ బగడ యనఁగ . .

ఆం భా. ౨. 30౫.

(పగడ పంటిదొర = ఏకదంతుఁడు, వినాయకుఁడు.)

సీ బొరియపాగా జక్కి బరరాకు విల్లారి పగడ
పంటిదొర గొప్ప మెయిప్రోడ

వెంక. దేవ. ౬.

జ : పగడసాల.

**పగడంపుజిట్ట.** వి (పగడము + జిట్ట) ఒకజాతి పక్షి.

సీ ... పగడంపు, జిట్టగొజడి డాబజీనువ
వద్రంగి గున్నంగి పోపిట్ట గూడబాకు

గీ అనఁగనిట్లని పక్షిభేదాఖ్య లలరు

ఆం భా ౨ ౯౭

**పగడపుఁ దీఁగెలు.** వి ఒ (√పాదము) ధాన్య విశేషము

సీ మణిసరు ల్మసరులు ముంకెన ల్పగడంపు
తీఁగెలు మడిప్రాలు దేవసరులు

హంస. ౪ ౧౨౭

**పగడపురిక్క.** వి (పగడము + రిక్క) ఆర్ద్రా నక్షత్రము (శ ౧)

**పగడము** = పవడము వి నవరత్నములలో నొకటి, విద్రుమము

క పగడపుఁ గొమ్మైవిపయిక్, నగ వుదయిం
చిన విధంబునం బ్రస్ఫుట మై .

హర ౪ ౧౯

ద్వి. పగడంపువాతెఱ పద నింకి వాడ, జిగి
దక్కి పాపట సీకాకు వడఁగ .

ద్వి కల ౪ ౧౪౫ పం.

చ పగడపుఁ జాయచెందిరముఁ బ్రామిన పాండ్య
వధూశుచంబుల, న్నగు నరుణాంపు బొండ్ల
ముల నారికెడంబులు .. ఆము. ౧. ౫౪

జ : పగడంపుజిట్ట, పగడపుఁ దీఁగెలు, పగడపు రిక్క

**పగడసాల.** వి (పగడ + సాల). క. పగడైచ్చావై ) ౧. ఇష్టజనద్యూతము, గెచ్చెలు లాడెడు జాదము.

సీ. ... ఇష్టజనద్యూత మెసఁగుచుండుఁ బగడ
సాల యవంగ    అం. భా ౨. ౩౦౫

(ప్రాఁత ప్రతిపా. "అష్టజనద్యూత" మలరు
చుండు. క్రొత్త ప్రతి. పా)

౨. పాచికల యాట

గీ. పందెములు గోరి వైచుచు పగడసాలఁ,
దారతో నాడు మారణాంకుఁ జేరి మ్రొక్కి
శశాం ౪ ౧౬౬

గీ. మగిపోగియుఁ బాపె నాయింతి మరునిదంతి,
పగడసాలను గెల్చిన పంతమునను
శశాం ౪. ౬౬

౩. జూదపుఁ బలక

చ. కురుఁజాలు సారె లచ్చుమణి కుట్టిమభాగము
లిండ్లు మధ్య గోపురము పణంబుగా నిడిన
భూరి సువర్ణముగాఁ జటుర్దిశా, సరసిజనేత్ర
లర్థిఁ జవుసారెల నాడఁగ నుత్కటాత్మసం,
చరణము మీఱఁ బూన్పగడసాల యనం
జవుకిథి చెల్వగున్ . చంద్ర. ౧ ౬౪

౪ (పగడ+సారె) పాచికలు సారెలు గల
పొగటాల పలక (శ ర)

ద్వి పగడంపు పలకపై భవ్యరత్నముల, జగ
దంబు గులికెడు సారెలు వన్ని, కనకకీలిత
పాశకములతోఁ దెచ్చి, యునిచె వారల
చెంత నొక దివ్యకాంత, జగదీశుఁ డపుడు
శ్రీసతి మోముఁ జూచి పగడసాలిడ తెచ్చెఁ
బడఁతి నీచెలియ, యాడెదవే యొకయాట
నాతోడ . విష్ణు. పు. ౨. ౮ (శ ర)

ద్వి. ... నలుండు కడఁక నిట్లనిరెు., బగడసా
లాడంగఁ బ్రమదంబు నొంది, జగదీశ యుచ
టికిఁ జనుదెంచినపుడు, నినుఁ జెన్ను పుచ్చుట
నీతిగా దింక ...
ద్వి. నల. ౩ ౧౩౮. పా. ౧౪ పం.

పగతుఁడు = పవతుఁడు. వి. (√పగ పగ
+అతఁడు అని. శ. ర - వి. పగతురు)
శత్రువు.

క. పెగయునెడ వగ్గమైనను, బిగియారుదుఁ
బెంచుఁడు సనినఁ బడికిటఁ గొఱసం, బి గడు
బెడిదముగఁ బొడిచెం, బగతుఁడు గను
మిడిపి నేలఁ బడి తన్నికొనన్
భార విరా ౨ ౩౫౧

ఇ తెగనిండఁ దిగిచి యొకయా, శుగ మప్పాం
ద్రకునియురము సోనిపెఁ దొలుత నా, నగి
ధరు తమ్ముఁడు దానం, బగతుఁడు వడవడ
వణంకి భ్రమగొని తిరుగన్
హరి ఉ ౬. ౧౬౪

చ. పగతురు చెయ్యరు న్బిరదుపాటలలో గెడ
గూడఁ ..    కళ ౩. ౭౭.

క. పగవారియింటఁ గుడిచిన, పగఁ దమ కను
మాన మమృతమైనను దారుం, బగతురకుఁ
గుడువఁ బెట్టఁగఁ, దగ దొడకుల కెప్పు
డివ్విధము వాటిలునో .
భార. ఉద్యో ౩. ౨౨౪.

పగతురాలు. వి (√పగ) శత్రురాలు (శ ర,
చి ని)

పగతువాఁడు. విశే (√పగ) శత్రుసంబంధి,
పగతురకు సంబంధించినవాఁడు

చ ... ఎందునుం, బరసతిఁ గోరువాఁ డధిక
పాతకుఁ డీ చెడుబుద్ధి నీకు నె, వ్వరు మది
కింపుగాఁ బగతువా రయి చెప్పిరి రాక్ష
సేశ్వరా ...    భా రా ౬౭ ౨౧౫

పగదాయ. వి. (పగ+దాయ) పగతుఁడు,
శత్రువు

చ. తగదా పగదాయవెన్నెల, న్మ్నిఁగెడుప్రాల
నెత్తి నయముం బ్రియమున్ దయ మున్నగాఁ
గవన్ .    వసు. ౪. ౪౫.

సీ. తోరంపుసాంబ్రాణి ధూపధూమము గట్టు
పగదాయ బాకాలబారు దీర్ప ...
దశా. ౧ ౨౬౫

పగదాయతనము. శత్రుత్వము.

చ ... మానఁదగదా పగదాయతనంబు లింత
టన్ ... హ న ౩ ౨౪

పగదారి. విశే (పగ + దారి) పగ ధరించువాఁడు ; శత్రువు. (చూ దారి.)

సీ. ఆవెనుగోలుకు యాయావరవ్రతధారిఁ బగ
దారి యని దన్ని పండ్లు గోలుకు ...
నైష. ౮ ౧౩౦.

పగదెంచే. స క్రి (√పగ) వధించు

సీ. ... పగదెంచె నులుముఁజేసె

గీ వణఁచెఁ జెండె ననంగఁ బొం దగు వధించె
ననుటకు సమాఖ్యలై ఆం. భా. ౩ ౧౨౩

పగప (వ) ట్టు = పగగొను అ క్రి. సం క్రి (పగ + పట్టు) వైరమువూను, ద్వేషించు.

ఉ. ... శా, నే పవిదారిబారిఁ బడిరెం బగ
పట్టెను దత్తినూజుఁడున్ ... కకు. ౪ ౧౪౩.

(వ్యవ) పాము దానిని పగపట్టినది

(పంటఁ బగపట్టు = పామువలె తీక్ష్ణవైరము వూను).

క మచ్చరమున నమ్మదనుఁడుం, పచ్చనివిలుఁ
బూని పంటఁ బగపట్టె చెలీ.
శుక ౧. ౩౬౮.

ఉ. ఓర్వదు బంధుజాల మదకొత్తున నొత్తును
మామగా రిదే, పర్వినమాత్ర పంటఁ బగ
పట్టును బావ కళాం. ౩ ౬౮.

పగలి. వి (√పగ ఈ పగర) శత్రువు. (చి. వి. గ్రా)

సీ. అడ కోకిలాలాప యనిరయాడు వడు మని
రమునంగుపగలశేఁగొనుఁ జూచు ...
రామా. ౫. ౨౪౧.

వ. ... సాత్త్విమ్ముల పగలు వుత్తెంచినయడంగర
లని ముంగిళ్ల రంగు మీలు ముత్యాలయరుం
గుల చెలుంగులం దులుంగలించు మెలుంగులు
కరాంగుళుల విప్పి కప్పుకొనఁ జోరువారు
నై . వసు ౪. ౨౩.

వ. ... పొగిరు వలెగి గాదు మలుంగునం
బరఁగు పగలలం గావు మని కరతలంబుల
వ్రాలిన కాంతిరసంబురీతి
చంద్రా ౫ ౧౨౪.

సీ . వైరి గీ మనును నొంటనివాఁ డన
మూర్తిఁ దనఁగఁ, బగతుఁ డనఁ బగి యనఁ
బగివాఁ డనంగ, గం టనఁగ గొంగ యన
నూడుకాఁ డనంగ
ఆం. భా. ౨. ౧౭౫

పగలు = పవలు. వి. జా. (క. పగలు, హగలు త. పకల్, పవాల్. బ. పగళులు, పగళ్లు) ౧ దివాభాగము.

క పది దినము లైదు ప్రొద్దులఁ బదపడి
రెవ్వాళ్లు నొక్క పగలున్ రేయున్
భార. ఆది. ౧. ౬౭

కి. గురు నట్టినారు పదివే, వురు గాచిన శల్లి
సైంధవునిఁ బగలిటిలోఁ, బొరిగొనునట్లుగ
నరునకు, వర మిండీ వేల్పులార వారని
కరుణన్ ... భార. ద్రో ౨. ౩౪౬.

సీ. మర్యోదువాసరంబు లకాలవర్షంబు గురి
యుంపఁ బంపు మెంగుళ్లగిములఁ, బగళులు
రేలు కుంభద్రోణములు గాఁగ ...
హర. ౨ ౧౫

గీ. పగ లనంగను బవ లనఁ బరఁగు నహము
ఆం. శా. ౧. ౯౩.

ద్వి. (పేమతో నాపగల్ చేయుచు భామ,
జాముచ కర్చునల్ పల్పుడు వారు . .
పండితా. పర్వ ౧౬౭. పా. ౨౩. పం

౨. మధ్యాహ్నము.

క. పగలిటిభానుఁడు వోలెను, ధగధగ యను
మొగము దివుర .. ఉ హరి. ౧. ౧౬౭.

పగలింటికడ. దినాంతము, సాయంకాలము.

సీ. పగలింటికడ నాడు తిగికింటియొకమీని గడి
తంపునిడుబాలుజడ లనంగ ...
అచ్చరా అరయా ౧౩.

జః పగటికోఁడు, పగటివేల్పు, పగలువత్తి, పట్ట
పగలు.

పగతువత్తి. వి (? హగలు బత్తి, త పగల్
వర్తి). ౧. పగలువరెఁ జేయువత్తి, ఒక విధమగు
బాణసంచు.

గీ. కోదనీ సరసీ జాలపాద పద్మ, కుముద
రూపము లై కుంచె కోలగములు, చెలఁగు
చిరుచులు పగలువత్తులను నమరిఁ, బరఁగు
బహుచిత్ర బాణవైభవము గనుచు ...
ప్రబంధ ౭౪

గీ. భూరికైరవవనరమా ముఖవివర్ణ, భావసంప
త్కారం బైన పగలువత్తి, కలట లెద
ప్రుంక్కఁ జోరులు గుట్ట లెక్క, వేగ జని
యించె జిగి నిక్క లేగుఁజొక్క
హంస. ౫ ౨౮౪

గీ. పగలువత్తులు దినకరప్రభల వెలుఁగఁ వచ్చెఁ
బెండ్లికుమారుండు . కృష్ణ. ౪ ౧౧౬.

పగవాఁడు. వి. (√పగ - త పగైవన్)
శత్రువు, విరోధి.

క. పగవారియింటఁ గుడిచిన, నగుఁ దమ కను
మాన మమృత మైనను ...
భార. ఉద్యో 3. ౨౭౪.

మ. పగవాఁ డల్పుఁడు గాఁడు సంగరవిధిం
బలోప్రకలం బోయినాఁడు గణింపం డెదిరిన్.
హరి. ఉ. ౩. ౨౭3.

మ. పగవా రై నగధారితోఁ దొడరి తద్బాహా
బలక్షీణులై, తెగి హేమాక్ష ముఖానురా
గ్రగణులు ముక్తిం జెందరే ..
ఉ. రా. ౫. ౧౪౭.

పగడి[1]. వి (క పగడి. త పగుడి.) ౧. ఉపద,
కానుక

సీ చెంగావివలిపెంపు చిరంచుసరిగ దాల్పడ
శోణఘృణులకుఁ బగిడిఁ బెట్టె .
హంస. ౪. ౬౫.

౨. కప్పము, పన్ను

ద్వి. నానీమపగిడి రెయింతియు నాఁడు నాఁడె,
చేసేత మునుపుగాఁ జెల్లించినాఁడ ..
ద్వి పరమ. ౬. ౪౬౧. పా

(చి. ని. పా. 'పసిఁడియంతయు' ముద్రి. పా)

పగిడి[2]. వి వట్రువపండ్లు పండుదోసజాతి. ?.
(చి. ని. కిరబుజము ? ? ర.)

పగిది[1]. వి (సం ప్రకృతి॰ ప్రా పకతి) ౧
రీతి, విధము, ప్రకారము

సీ. మదనముజ్జృంభితమండలాకారు లై భద్ర
ద్వీపంబుల పగిదిఁ బొల్చి .
భార శల్య. ౨. ౨౩౩.

గీ. జలదరేఖాయుతం బైన చంద్రుపగిది ...
హర. ౪. ౧౭

క. ఈపగిదిన్ పాత్రాజితి, కోపోద్యోగమున
పగిలఁ గుందుచు ... పారి. ౧. ౧౦౭.

పగిది[2]. వి (క త పగది) కప్పము, పన్ను

ఆ. సందుఁ డాదిగాఁగఁ గొందఱు గొల్లలు,
పగిదిధనము దీర్పఁ బాలుఁజనుదు, నులుపఁ

గొంచు, గంటుడున్న చోటికిఁ జొచ్చి వారిఁ
గాంచె ననతిదూరమునను. వి. పు ౪. ౪౩

సీ. అరి బిడి యప్పన మప్పన పంగంబు పంజి
గప్పాడి కో ల్పగిది బెడిగ కో రనఁగాఁ
జెలఁగురు భాగధేయంబు ...
ఆం. భా ౨. ౧౯౨.

పగిలించే = పగులుమే స క్రి (√పగులు).
ఛేదించు, బ్రద్దలుకొట్టు

సీ. బ్రహ్మాండభాండంబు పగిలించి భూతిని శ్చ్చె
తన్య వెంవరించె శంఖరవము ...
భార. విరా ౪. ౧౭౦.

సీ. భాండసంభారంబు పగిలించి గోడలు గోరాడి
గరిపెలు కూలఁదాఁకి ...
హరి పూ ౬. ౧౩౭

క. నరుఁడు ధనుర్గుణరావ, స్ఫురణంబును దేవ
దత్తిభూరిరవము నం, బిరము పగిలింప
వావా, శరముల గురుసైన్య సరభసత్త్వం
బుడిపెక ..
భార. భీష్మ ౩. ౧౫౩, ఉ రా ౨ ౬౧.

౨. చించు.

క. కనుఁగొనెదు రోగివల్లభు, ఘనతర మైనట్టి
ధైర్య కంచుకము దలం, ప నితర సాధన
ములచేఁ, జినుఁగునె యని మరుఁడు విరు
లచేఁ బగిలించెక ... చిత్రభా. ౩ ౪౫.

పగులఁగొట్టు. స క్రి. (పగులన్ + కొట్టు)
పగులు్చ, భేదించు.

సీ. ఒకయింత రేమటియున్నఁ గవ్వము దీసి
పక్కన భాండముల్ పగులఁగొట్టు ..
దశా. ౯ ౧౯౪.

సీ. పగులఁగొట్టించి కుద్భటవివాదప్రౌఢి గాఢ
డిండిమభట్టు కంచుఢక్క.
(శ్రీనాథుని చాటువు.)

పగులు. అ. క్రి. (క. పగు). ౧. బ్రద్దలగు, భేదిల్లు

క. కాటించి నిటలనయనుఁడు. హాటకగిరిచాప
వల్లి నహీశింజిని శ్రా, స్ఫోటించెఁ దక్కట్లో
రము, హాటంకృతిఁ గమలజాండ మట పగు
లఁగన్ భీమ. ౪. ౧౩౨.

సీ. కొంగ కొంగతోఁ దాఁకి పగులంగ నరదంబుఁ
బఱపి యాతేరిపై కుఱుకువారు ...
భార. విరా. ౩. ౧౬౯.

క. భువి పగిలెక రవి వ్రాగిలెక, దివి పిగిలెక
దిగ్గజముల ధృతి సన్నగిలెక, గవిఁ దగిలెక
హరుఁడుక ధృతి, పవి మొగిలెక భూరి
భేరిభాంకారమునన్ ..
రా. వి. ౨. ౪౨ దశా. ౨. ౩౭.

౨. తెగు

వ. ...అప్పవుడండ వాస్తోష్పతి పట్టిన రోమంగు
వలన . క్రుస్సియు వ్రాగిలియుఁ బగి
లియుఁ దీనదశకు వచ్చినం గనుంగొని ..
హర. ౬. ౧౬.

౩. చినుఁగు

క. మొగివిరిసి కిఱుకు గూడక, పగులక పెదలుం
పును నిడుపుఁ బసిమియుఁ గలశేఁ, జిగు
రరఁటాకులు పెట్టిరి, దిగదిగ నద్దేవియాజ్ఞ
దివ్యపురంధ్రుల్ .. భీమ ౨. ౧౭౭.

౪ భయపడు.

గీ. భయము గొందుము నిర్ఘాతపాతమునకుఁ,
దలఁకుదుము భీషణోల్కాప్రపాతమునకుఁ,
జంచలింతుము పటుదండ చండిమలకుఁ,
బగులుదుము పాశవల్లరీబంధములకు ...
శైవ. ౪. ౯౦.

౫ చెదరు.

గీ. వచ్చె నాకస్మికముగ దేవప్రవంతి, నవతి
జలరాశిరాణివాసంబు సహ్యా, తనయ
కావేరి శ్రీరంగధామ వసతి, దిగులుపడి
తీరవాసులు పగిలి పాఱ ...
శ్రీరం. మా. ౨. ౫౧.

చ. కొలంపున కేఁగి శేత్రధరకోటి నిజాయత దృష్టి వాఱుచో, బలసి తటాలునం బగిలి పోఱ బరాబరిచేయు . .

పారంగ. 3. ౧౪౪.

వి. ౧. చీలిక. (బ. పగుల్లు, పగుళులు - చూ. పగుల్లువాఱు కు.)

౨. స్ఫోటము. బీఁట.

సీ. ... పగు లన బీఁ టన వంగు దనఁగ

గీ. స్ఫోటము దనర్చు . ఆం. భా. ౨ ౧౩౦

జ: పగిలించు, పగులఁగొట్టు, పగులుచు, పగుల్లు వాఱు.

పగులుచే (ల్చు) = పగిలించే స క్రి (√పగులు)

౧ బ్రద్దలుచేయు, భేదించు

చ . వెస దగ్గతి రేఁగ పాలముం, బగులు కుణోగదా నిహతి ...

భార. కర్ణ. 3 ౨౯3.

మ. ధర దివ్యాస్త్రహతిం బగిల్చి కొల నుత్పా దించి వే దానికి, న్నరజాలంబుల నిల్లుగట్ట మనసైన్యంబుల్ వెఱం బొందె ...

భార ద్రో 3 ౧౬౨

గీ. తలుపులు పగిల్చి గుడిసెలు దల్లి గూల్చి ...

నీలా 3 ౫౧౧. దశా. ౨ ౧౬౧

౨. విఱుచు, ముక్కలుచేయు.

చ. తలకొని పైనిశుల్ గవిసి తార్కొని శే ర్కొని పావి డాసి యుం, కిలిగొనకమ్ములఁ బగిల్చి నొగిల్చి ... భాగ. ౧౦. ఉ. ౭౪౯.

పగుల్లువాఱు. అ. క్రి. (√పగులు). చీలు, బ్రద్ద లగు, విదారితమగు. (శ. ర)

పగ్గము = ప్రగ్గము. వి (సం. ప్రగ్రహః. ప్రా. పగ్గహో. క. హగ్గవు.)

౧. (గుఱ్ఱము లోనగువాని కళ్లెము మున్నగు వానికిం దగిల్చి లాగిపట్టెడు) పెద్దత్రాడు.

సీ. ధరణీతలంబెల్ల నరదంబు చంద్రార్కబింబ ముల్ చక్రముల్ పృథుజవాళ్వ, ములు వేదములు పగ్గములు చతుర్స్వరములు . .

కా. సం. ౨. ౧౬౦.

క. అగ్గలిక నతఁడు హయముల, పగ్గంబులు నడల విడిచి ... భార. విరా. 3. ౧౫౦.

గీ. గ్రహవిభుని తేరి హయలపగ్గములు వదలి

ఉ. రా ౨ ౪౪

౨. రజ్జువు, త్రాడు.

సీ ఎఱుఁగనివానికి నే దేవుఁడు జగంబు గాఁడు పగము పాము కానికగిని .

ప్రబోధ. ౧. 3౨

సీ వలపగ్గములు ద్రెంచి కలఁబడఁ గొందఱు బొజ్జలు వ్రయ్యంగఁ బొడిచి పొడిచి ...

నీలా. ౨. ౬౬.

3. సాళివాఁడు పడుగు నీడ్చి కట్టెడుత్రాడు

సీ కుంచె మగ్గపుగుంత గూటంబు పగ్గంబు పరికె త్రొక్కుడుపట్టె పలక దోనె ...

హంస. ౨. ౧౧.

౪ తరిత్రాడు, కవ్వపుఁద్రాడు.

ఉ. ... ఆదిమ, వ్యాళము దీనిపగ్గ మయినట్టి యవస్థఁ దలంతు నెప్పుడుంక ...

మనుచ. ౫. ౫౦.

పగ్గించే. అ. క్రి. (√పగ్గ) ప్రజ్ఞలుపలుకు, డంబ ములుకొట్టు.

వ. ... చూప అగ్గింపఁ బగ్గించియు నెగ్గిం చియు ...

ఉ. హరి. ౬. ౧౦౫. (శ. ర. పా.)

గీ. కటకటా యెట్టి వింత లాకాశవాణి, యాడఁ బలికిన నెటుపోయె నీకఁ బలుక, రాద యిపు డని పగ్గించి రాజకీర, వాణి పలికిన జాకాశవాణి పలికె. పారంగ. 3. ౨౦౫.

**పగ్గ (గ్గియ).** వి (సం ప్రజ్ఞా ప్రా పణ్ణా) సామర్థ్యము, శక్తి

చ. ... అసమాస్త్రకేళిలోఁ, బలుమొన లాని మాత్మగల పగ్గెలు తగ్గులు సేసి ప్రోలునన్, గలసి చరింతు రవ్వెలుపకత్తెలు మారుని కత్తులో యనన్ ... ప్రబంధ ౧౪.

సీ నీపున్న మిచ్చుట నీపగ్గె సొయించి బోరు దీర్చుకుఁ మంచుఁ గొండుపటిచి కువల. ౫ ౫౯

౨. లేని సామర్థ్యమును ఉన్నట్లు ప్రకటించెడు మాట, దంభోక్తి

క. అప్పారాయనిసభలో, మె ప్పొంగిరి సాటిలేని మేళంబులలోఁ, జెప్పిరిఁ బగ్గెగి నీమగి, కిప్పుడు తోఁచును . చంద్ర వి ౨ ౧౫.

గీ. పట్టి తల నొవ్వ నవ్వగాఁ బవలు రేలు, పట్టి పగ్గెలు ప్రేలు నవ్వారిజగ . కుకి 3 ౭౨

గీ కోఁకు లెచ్చుట జా దంపుఁజేత లెచట, పగ్గెలటు పెట్టి తిన్నంగఁ బాటి చనుఁడు ... అచ్చ రా యు ౧౭౬

(సామర్థ్యము - అని శ ర)

జః పగ్గించు.

**పచ.** సం. వి. ఆ స్త్రీ ౧ పాకము, వండుట ౨ పాకముచేయు స్త్రీ

**పచంపచ.** సం. వి ఆ స్త్రీ. ౧ మ్రానిపసుపు ౹. ౨. చంపకము. ౹ (శే ని)

**పచత్.** సం. శత్ర వండుచున్న

**పచతభృజ్జత.** సం వి. ఆ. స్త్రీ. ఎడతెగక వండుఁడు. వేగింపుడు అని ఎప్పుడును చెప్పుట.

**పచత్రము.** సం. వి. అ. న. వంటపాత్రము (శే. ని)

**పచనము.** సం విశ (అ ఆ అ) ౧. పాకము సేయునది, వండునది. ౨. పరిపాకమునొందించునది - (అ. ఈ. అ) పాకసాధనమైనది, (వి. అ పుం. అగ్ని - న పాకము వండుట.

**పచని.** సం వి ఈ స్త్రీ వనబీజపూరకము, అడవిమాదిఫలము

**పచము.** సం వి॰ (అ. ఆ అ) ౧ వండునది ౨. జీర్ణింపఁ జేయునది.

**పచేరణ.** వి (సం ప్రచారణమ్ శ పసగణ) ౧ ఉపచారముకొఱకు పలికెడుమాట, ముఖప్రీతివచనము, ఇచ్చకము

శ నుచరిత్రి నేఁడు నీచే, తి చలిగి భుజియింపఁ జాలఁ దృష్టి యొదవెడిం, బచరణగా గిమ్మల మును, రుచియింపదు శబరివిందు గ్రోవదివిందుఁన్ . పాండు ౪. ౧౯౯

౨ నటన. (శ ర)

ద్వి కట్టెండతాఁకునఁ గమలె దేహంబు, ... గొడు గిచ్చి రక్షింపు కువలయాధీశ, యుచిత సవాలక్ష లొం డొల్ల మేము, పచరణ గాదు మీ పాదంబులాన. ద్వి హరిశ్చ. పూ. ౧౦౦౦.

**పచేరించే** = పచోరించే అ క్రి (సం ప్రసరః. ప్రా. పసర శ పసరిను) ౧. ప్రవర్తించు, మెలఁగు

చ. ... సత్యభామయుం, గులమును రూపము న్మగనికూరిమియుం గలదాన నంచు నా, వలఁ బచరింపఁగా ... పారి. ౧. ౪౨.

గీ నేలపై నిల్చి కమయేపు నిలుపలేక, బెడిదనమునఁ బర్వుచిడుగుల కడిమి యొంత, యనుచు నేలిగ రచ్చల నాడుకొనుచు, నేచి పదిరింతు రచ్చటిరాచవారు ... యయా. ౧. ౧౩౪.

౨. విహరించు.

సీ పౌరులు గన బయల్ పచరింపఁ జనువేళ
వారామములఁ గేళి నలరువేళ ...

శుక. ౧. ౧౪౬.

(స క్రి ౧. ప్రసరింపఁ జేయు, వ్యాపింపఁ
జేయు

ఆ. ఆకసంబునకుండి విహంగరాజు, భక్తి నెఱి
కల నీడ నప్పద్మ నాభు, మీఁదఁ బచరించె
బీరెండ మెఱయకుండ.

హరి పూ ౩. ౧౮౯

(రాముని మేని కాంతి) సీ నిగిడి చేరువశెల్ల
నీలోత్పల ద్యుతుల్ పచరించు హరినీల
రుచులకంటె . భా రా అర ౧ ౧౩౫

ఉ . ఆత్మలో, మండెడు కోపవహ్ని నరి
మండలిపైఁ బచరించు పోలికన్ ..
విక్ర. ౪. ౧౧౫. భార విరా. ౨. ౨౪౦

౨ (అమ్ముటకు అంగడియందు సరకులను)
అమర్చు

చ. కొనుఁడు పరార్థ్యరత్నములు గోరినవానిన
యిత్తు మన్నెఱం, గనఁ బచరింతు గంగిడుల
గోమటు లప్పురి సిద్ధరత్నముల్ ...

భార ఆది. ౮. ౩౩.

గీ. అప్పురమున వణిగ్జను లాపణములఁ, గలయఁ
బచరించియున్న నిర్మలినరత్న, రాసు లొప్పెఁ
కు. సం. ౮. ౪౪, విక్ర. ౩. ౧౧౮.

౩. (వల. మొ.) పఱచు; పడునట్లుచేయు

సీ. పాయంతనం బను జాలరి జలధిలోఁ బచరింప
వల డిగఁ బాడినట్లు ...

గీ. భానుమండల మంతఁ జాపట్టదయ్యె ...

ఉ హరి. ౪. ౨౩౧.

సీ. పచరింప కేర్తురు పదియాఱు వన్ని యపసిఁడి
పాదంబులఁ బట్టుచేల ...

కాశీ. ౩. ౧౦౯. వసుచ. ౪. ౬౦.

౪. ప్రయోగించు. (శ.) బాణము - ఏయు.

ఉ. అంబక పంచకంబుఁ గలయం బచరించుచు.

వసు. ౫. ౬౦.

(వ) ఉపాయము - తెలుపు

సీ అడరి రెండవయుపాయం బైన భేదముఁ బచ
రించుఁ బుణ్యపాపములయందు ...

భోజరా. ౩. ౧౪౩.

(పలుకుట)

సీ ఉసికొల్ప శబ్దంబు లొకకొన్ని పచరించి
క్రూరమార్గాన్వేషరూఢి గాంచి . .

చంద్రా ౧ ౧౬

శా. శాపోక్తుల్ పచరింపకున్న నెదిరించం రాడ
యంటేని నిం, దాపారంపరి మున్నుగా
మృతుఁడవే నా కిట్టి పీనుంగుపై, నేపుగా
జూపఁగ నర్హమాసె ఉ రా ౩. ౩౪

౫ చాఁచు చాఁపు

క కాఁగిలింపఁ జే, తులు పచరించు నట్లు ..

కుం సం ౫ ౫౯౮

చ అలరుమొగంబుతోడఁ గడు నిర్మలి నా కెదు
రేల రావు చే, తులు పచరించుచుం దనువు
ధూళి మెయిం దొరయంగ నేల ...

మార్క౦. ౧. ౨౫౧.

౬. సవరించు, సిద్ధపఱచు; విప్పు.

సీ మందారతరుపుష్ప మంజరీమండితమస్తక రైరై
యొప్పుమహతివీణ, పచరించి త్రిస్థానబంధు
రశ్రుతిభేదములతోడ షడ్జంబు మొదలు
గాఁగ, సప్తస్వరంబులు ...

హరి పూ. ౫. ౫౨.

క. కనుకని కమతమకైదువు, లనువునఁ బచరించు
కొనుచు నభిముఖు లై ...

హరి. ఉ. ౬. ౨౩౦.

సీ. చెట్టుపల్ పచరించి చుట్టుఁ గ్రుమ్మతి మనో
రమ నియ్యకొలుపుమరాళవిభుని ...

భార. విరా. ౨. ౩౦౬.

౪ చేయు, కావించు.

చ అనవుడు నాతఁ డిట్లను మహాత్మ భవ త్ప్రియ మెట్టు లట్ల యే, ననుపనుశిల్పశిల్పన మనగ్ఘ్య ముగాఁ బచరింప నోపుదుగ ...
హరి. ఉ. ౨. ౧౫౭

సీ శుచివృత్తి కెన్నాళ్లు పచరించెనో తీర్థసం వాస మిచటి హంసవ్రజంబు ...
వసు ౩. ౭౫

సీ పులకించె మే నేమి తలఁచుకొంటొవె యంచు మేలంబు పచరించె మిత్రవింద ...
విజ వి ౩ ౨౭

౫. పుట్టించు, కలుగఁజేయు.

సీ మేలంపు మాటల మెచ్చులు పచరించి తోరంప పెన్నిను గొలఁగఁగోలి . విక్ర ౪ ౨౩

(కీర్తి) సీ. జాడాలు పచరించు జడదారిఁ గొదంతిఁ దలవాకిట నెపుగు మెలఁగు పొలఁతి గెబ్బు రామ ౨౧౩

౯ ప్రకటించు - (౪) బయలుపఱుచు

వ .. కొందఱు దుష్టమతులు లేమిఁ గుందు వడినభర్త నదికకార్పణ్యంబు పచరించి సర్పి ర్లవణ తైలతండులాదులకై సిబ్బితిపఱుతురు
కాశీ. ౨. ౪౯.

గీ కంబ విజయము పచరించుఁ గాంతగళము
ప్రభా. ౨. ౪౭

(చ) చూపు, కనఁబఱచు.

వ అయ్యాదుపీరు లిద్దఱు నమ్మహాసమరం బుల నాత్మీయ దేవతా రూపంబులుం దక్కిన యప్పగు మారుసాకారంబులుం పచరించి
హరి. ఉ. ౨. ౬౯.

క. తలిరాకుగుత్తిఁ దమిఁ గో, యిల చంచువఁ జించి క్రోశ సీరితి విరహా, గుల గుండియ లవియింపుడు, బలువిడి నని మరునిరొదుటఁ బచరించె ననా ...
పా. ౧. ౪౯.

సీ పర్యాద గిగజార్చి పాలింద్లు పచరించు దిన్నవాఅఁగ వవ్వుఁ దీఁగనవ్వు ...
క్రీడా. ౬౭.

(ట.) (లేనిదానిని ఉన్నట్లు పైకి) చూపు, అభిన యించు.

సీ. వన్నెలు పచరించి కన్నుసన్నల చేసె కొద మాటలను ప్రేమ గడలుకొలిపి
ప్రబోధ ౧ ౪౫

చ మనమున మాటలం క్రియల నున్నన లీ నొక నాఁడు గెట్టికా, మినులకు గాంపంబు పె ఱ మెచ్చులకై పచరింతుఁ గాని
పారి ౧ ౧౮౨ మనుచ ౩ ౩౩

(౩) ౨. శుష్క, ఒఱుకు

క . . పిను, ద్రాలాపంబులు పలుమఱు, సోం పచరింప నిప్రడు హేలానిమిషా
నైష ౪ ౧౦౯

చ తెరువరు లైనయట్టి పరదేశమహీశురు లర్థ వాంఛఁ ద, త్పురమున కేఁగుదేర కెడదోస్య ములం బచరించి వారి ని, ర్భరగతి నోడఁ గూయు ...
శుక ౨ ౪౩౭ సారంగ ౩ ౫౪.

జ : పచేరింపు.

పచేరింపు. వి (√పచేరించే) ప్రసగణము (౪ ౧)

చ. . గొనబుం బచరింపులసిగ్గుఁ ప్రేమయుం, పెనఁగొని వాలుఁ గన్నుఁగవ బిత్తరిచూపుల నాదరింప కెూ, హాస మధురోక్తి నుత్తరము లాడుచు నుండె భవాని శంభుతోఁ ..
కవిరా. ౨. ౧౩౫.

పచోరము = పసారము. వి. (సం. ప్రసారః, ప్రా. ప. అర. క. హిం. పసార.)

౧. అంగడి.

ద్వి. మెఱుఁగు ముత్తెపుఁజాళ మించు పచారిము.
విష్ణుపూ. ఉ. ४. ఆ. (శ ర)

౨. నడవ.

ఉ. ఆ లఁట చంటిపాఁపఁ డఁట యంగడి లేద పచారముల్ గృహాం, బెల ప్రవాసి గాఁడె ... వేం పంచ ४. ४౫౦.

జ: పచోరించే.

**పచోరించే** = పచేరించ్చే, స. క్రి (√పచో రము. సం. ప్రసారః).

౧. ప్రసరింపఁజేయు, వ్యాపింపఁజేయు

వ. పిపాళించు చంచలదృగంచల ప్రభలన్ బచారించి మనుచ ౫ ౧౦౧

శా. ఏలా చూఁచెద రుజ్జ్వలజ్జ్వలము లౌ దృష్టుల్ పచారించి యీ, లో లాక్షుల్ చెదుజంతువుల్ . . మల్లభూ. శ్రుం ౬ 3.

౨. చేయు.

మ. వనితారత్నము సాదువర్తనము దా వాక్రు వ్వఁగాఁ బ్రీతిచే, విజనో లేక వినండో కర్ణములకున్ వింతల్ పచారింపఁగా ననుఁ జేపట్టెడివార్త .
ప్రద్యుమ్నచరిత్రము. 3 ४౫.

మ. నిజక్రీడల్ పచారింపుచో, దనుజాధీశుఁడు కేయిదీవియలతో ధర్మేతరక్రీతితో, వనితల్ పట్టిన పైఁడిపల్లకిపయిన్ వచ్చెన్ నిశీథం బునన్ రామా. ౬. ౧४४.

3. పుట్టించు, కలిగించు.

మ. తలిరుంగేలికి నీలకంకణము లై తళ్కుల్ పచారించు కు, ట్మలదంతావళి కప్పఁ గప్పయి ... చంద్రా. ४. ౬౭.

४. ప్రకటించు - (౬) చూపు.

శా. ... పేం, లా చాతుర్యము, చాపలస్ చెల పలన్ లా లై పచారింప ...
ఉ. హరి. ౬. ౬౫.

(వ.) పఱుకు, చెప్పు.

మహాస్రగ్ధర తవణింపం ముమ్మరిం బై తవణి మల హారుల్ ధాళితాడంబరిస్ఫూ, ర్తి విజృంభింపంగ రింగోర్వ్యిని బిరుదు పచారించి .. వైజ. ౧. ౧౨౭.

మ. అత్యాసక్తి లేనట్టిమా, ట పచారించిన నవ్వ ధూటిఁ గవుఁగింటం జేర్చి లాలించెదన్ ...
బిల్హ 3 ౧3४.

౫. (౬. పచారిను = నిందించు) తిరస్కరించు.

ద్వి సైకతంబులను బచారించుఁ బిఱుఁదు, నా కరభంబుల నణఁగించుతొడలు
ప్రభులిం. ౨ ౬४ పా, ౧ పం

౬. (పంతము) పట్టు.

ద్వి. నభమున కెగసి పంతము పచారించి, గుభులు గుభు ల్లనఁ గుప్పించి దుమికె
అ. మ క ౨ ౬౬. పా. ౧౦ పం

**పచి.** సం వి ఇ. పుం ౧ అగ్ని ౨ పాకము, వండుట.

(స్త్రీ. బుభుక్ష, ఆఁకలి) (శే ని)

**పచేరము.** వి (సం. ప్రచారః ప్రా పయారో) విహారము. (శ. ర)

**పచేలిమము.** సం విశ (అ ఆ అ.) ౧ తన్నుఁ దానే పక్వము చేసికొనునది తినంతెట పక్వ మగునది. ౨. పక్వముచేయఁ దగినది
(వి అ పుం. గుజ్జము.) (శే ని.)

**పచేలుకుఁడు.** సం వి అ. పుం వంటవాఁడు పాకకర్త. (త్రి. ని)

**పచేళిముఁడు.** సం. వి. అ. పుం. ౧ అగ్ని. ౨. సూర్యుఁడు.

**పచ్చే.** వి. (క. పచ్చె త పచ్చై) ౧ ఆకుపచ్చని వర్ణము, హరితవర్ణము.

గీ. పంటవాల్గంటి గబ్బిగుబ్బలఁ జెలంగు, టెక్కు
జిగి చిల్కు పచ్చరాతాళిఁ బోలి, పచ్చ గందని
పైరుల నిచ్చ మెచ్చు, దచ్చు హెచ్చుగ
ద్రావిడదేశ మధిప .. దశా. ౧ ౧౧౩.

౨. పసుపువన్నె, పసుపుపచ్చ వన్నె

సీ. పచ్చన పచ్చ పసిమి నాఁగఁ బీతవర్ణం
బగు ... ఆం. భా. ౧ ౧౦౭.

౩. మరకతమణి, గారుడమణి

ఉ. వింగడ మైన యొక్కవనవీథిఁ గనుఁగొనె
నీడ నున్న పుష్, రంగుటంగుపచ్చలయగం
గయిపో . ఆము. ౫ ౪.

ద్వి చనుకట్లమీఁదఁ బచ్చలబన్నసరము, లును
దారహారంబులును బొందుపఱచి
రం రా బాల ౭౫ పా ౩ పం

సీ మున్నిటిపెన్నిటి ముదురుచిల్వలయలజడికిఁ
బచ్చలజోడు దొడిగె ననఁగ
వసు ౫ ౩౭ ఆం భా ౨ ౨౭౭.

౪. ధనము

ఆ. పచ్చఁ జూచువారు బచ్చ మెచ్చెడివారు,
బచ్చబడెడువారు పచ్చవారు, బచ్చ విడుచు
వానిఁ బ్రభువుగాఁ జూతురు, విశ్వ .
వేమన. ౩ ౧౪౨.

౫. వృక్షవిశేషము

(ఉద్యానవర్ణనము) - వ . రాలచ్చికి రచ్చ
యగుపచ్చయు విప్ర. ౨. ౨౫

౬ (పసరువన్నెగల) తృణాదికము

సీ పసి చేదు దర్శించుఁ బైరుపచ్చ ...
పాండు. ౩. ౪౬.

గీ పయిరుపచ్చలు మేసి యప్పాటఁ బోక,
పల్లియలఁ జొచ్చి. తోఁటలు పాడుచేసి,
కావరంబునఁ గడుపు లై గావి చేసె ...
యయా. ౧. ౩౫.

*౭. కరచరణాదులయందు పొడుచుకొనుటచేత
చేర్పడు పసరువన్నెరేఖ (శ. ర.)

(విశే.) ౧. పసరు రంగు గలది, ఆకుపచ్చ రంగు
గలది.

ఉ. పచ్చనివృక్షవాటికల పండులభిక్ష భుజించి.
శైవ. ౩. ౧౮౮.

సీ పచ్చనివాలురుముంజె పసివాగె పక్కెర పారసి
పల్లంబుఁ బట్టమయము ... మనుచ. ౪. ౨౭.

ఉ. పచ్చమెఱుంగు టెక్కు జిగి పక్కెరచక్కని
రౌతు తూపులన్ .
దశా. ౨. ౨౪౦. శైవ. ౬. ౧౨.

౨ పీతము, పసుపువన్నె కలది.

గీ. మిగుల నామనిఁ బచ్చచాంపేయకముల,
నమ్మి .. ఆము. ౪. ౯౪.

చ అలరెడు కూర్మి వాఁడు పడు చాసపడుంగద
యంచుఁ బచ్చపోఁ, గులు గల చీర యంప
నొనఁగూడక పోయెనె యేమి చెప్పుదుఁ
శుక ౨ ౫౨౦

(పచ్చపైకము = తృణమాత్రపు ధనము)

గీ క్షితిశేశ్వగి నన్ను నీచేతి పోతిఁ, బూని వధి
యించి మఱి కొనిపొమ్ము ధనముఁ, బచ్చ
పైకంబు నిందులో వెచ్చపఱుప .
హరిశ్చ. ౪ ౧౯౯.

ద్వి. అచ్చుగామాగురుఁ డవనీశనీకు, నిచ్చినమితి
నేఁడు సెల్లియుఁజిక్కఁ, బచ్చపైకముగూడఁ
బడినది లేదు ... ద్వి హరిశ్చ. ఉ. ౧౫౩.

గీ. ఇట్లు బాధించి శోధించి యొందు నొక్క,
పచ్చపైకంబుఁ గానక వాల్మీకి. ౨ ౯౬.

పచ్చతోరణము = ఎడతెగకుండు శుభములందు
వాడకుండకయే కట్టు తోరణము. (చూ.
నిత్యకల్యాణము).

ఉ. పాణిశవాణి పంకరుహపాణి రమాఘున
వేణి నిత్యక, ల్యాణము పచ్చతోరణములం
దగి ... దశా. ౧. ౨.

జ : పచ్చఁబ్రాలు, పచ్చకట్టె, పచ్చకన్నుల
మెకము, పచ్చకన్నులకేల్పుమూఁడు, పచ్చ

కప్పురము, పచ్చకర్పూరము, పచ్చగన్నేరు, పచ్చ గోరంట, పచ్చచేమంతి, పచ్చజనము లు.

**పచ్చేఁబ్రాలు.** వి. బ (పచ్చ + ప్రాలు) - పచ్చని యక్షింతలు. - శోభనాక్షతలు, హరిద్రాక్షతలు.

ఉ ఎల్లియ సోఁకుటొజ్జ యతిఁ డేపునఁ జేయును గాఁతుపెండ్లి యం, చల్లనఁ బైఁడిపళ్లెరము లందును గందముఁ బూలుఁ బచ్చేఁబ్రాల్, పెల్లుగ నించి యయా ౪. ౧౪.

**పచ్చేకట్టె.** వి (పచ్చ+కట్టె) మృగయాసాధన విశేషము

సీ పచ్చకట్టెలగుదుల్ ౭ లుతుపాశలు
శుక ౧ ౧౬౫

**పచ్చేకన్నుల మెకము** వి (√పచ్చే) హర్యక్షము, సింహము

(ఇది శ్లేషవాచకముగాఁ గూడ నుపయోగింపఁబడును.)

గీ అట్టు లెదరులఁ గుండెదు చెట్టునట్టు మెకపు బంటులఁ గని యడ లీ్మ్రలి రాచ, పచ్చ గన్నుల మెకము రావణునితోడఁ, బుట్టువును డాయఁ బిల్చి తా నిట్టు లనియె
అచ్చ. రా యు. ౧౪౨

**పచ్చకన్నుల వేల్పునూఁడు.** వి (√పచ్చ) పంగా (గళా) క్షుఁడను పేరుగల రాక్షసుఁడు (ఒకానొక రాక్షసుఁడు. అని. క ర)

గీ. క్రేలిమిడిఁ బచ్చకన్నుల వేల్పుసూఁడుఁ, జిదిమిపై చిన ప్రగ్గక చిక్కియున్న, బిరుదు లాకకొంద ఊకెంచి వరుసమెడల, నల్ల ద్రావుడుదొరకు విన్నప మొనర్చ ...
అచ్చ. రా. మం. ౧౦౪.

**పచ్చేకప్పురము** = పచ్చకర్పూరము. వి. (√పచ్చే) చల్లఁదనమును పరిమళమును గల సుగంధ ద్రవ్య విశేషము.

చ దల మగు పచ్చకప్పురపుఁదావులు పైపయి పోడుముట్ట . . విక్ర. ౧. ౧౩౬.

వ. హాయలపనా పాణిపల్లవ విక్షిప్తంబులైన పచ్చకప్పురంబు పలుకుల వలనను ...
భీమ ౫ ౧౭౦ దశా. ౧ ౧౪.

(పచ్చకప్పుగ మగు = అలభ్యమగు)

సీ అర్జునుండను పేరె యని తెల్పినంతనే మిట్టిమీ పైపడె మెలఁకచూపు, గాంధర్వమునఁ బెండ్లిక మ్మన్న నంతనే పచ్చకప్పురమయ్యె భామపలుకు ... విజ. వి. ౩. ౧౭.

**పచ్చేకపూ్ర(ర్పూ)రము** = పచ్చేకప్పురము. (√పచ్చే)

వ అఖణ్డ వర్తి లోహదణ్డు దివియలు రెట్టికి నాచంద్రార్కము నిత్యపడి .. సార పచ్చకర్పూరపు ...
ద శా. ౪. ౧౦౬౯.

**పచ్చేకర్పూరసరులు.** మి. వి. ల. ధాన్య విశేషము

సీ పచ్చసరుల్ రెడ్డిపాల కంకలు సుఖభోగులు పచ్చకర్పూరసరులు ... హంస. ౪. ౧౭౫.

**పచ్చేగన్నె(న్నే)రు.** వి. (√పచ్చే) పుష్ప వృక్ష విశేషము, పచ్చని పూలుగల కరవీరము. ౯.

(పువ్వుతోఁట పరమున) - మ. సొరిదిం జేర్చిన తీఁగమల్లియలు ఖర్జూరంబులం బుప్పమం, జరులు న్మామిడి గుత్తులు న్గనుమము ల్సంపెంగలు న్పచ్చగ, న్నెరులు ...
ఆము. ౧. ౭౭.

(చైత్రుని పత్నమున) - గీ. పచ్చగోన్నెరు కస్తురి పట్టియలును, గుత్తిమల్లెలు. ఖాను. ౧. ౯.

(బ.) ధాన్య విశేషము. (చేల పత్త్రమున) .
ఆము. ౧ ౭౭.

(పాలికి పత్త్రమున) ... భాను. ౧ ౯

సీ. నన్నబూదులు పచ్చగన్నేర్లు గోదండరామము
శ్వేతసర్లు రాయసర్లు హంస. ౪. ౨౭౭.

**పచ్చేగోరంట.** వి (√పచ్చే) పసుపు వన్నె పువ్వులు గల గోరింట ॥ (కురంటకము ॥ ఆని. ౪ ౨)

**పచ్చేచేమంతి.** వి (√పచ్చే) పసుపు వన్నె పువ్వులు గల చేమంతిలరి ॥ (౪. ౨)

**పచ్చేజనము.** వి (√పచ్చే) ఒక జాతి జనుము. ॥ (శణపుష్పి ॥. ౪ ౨)

**పచ్చేజువ్వి.** వి (√పచ్చే) కొండజువ్వి, కలు జువ్వి. ॥ (౪. ౨)

**పచ్చేడము.** వి (సం ప్రచ్ఛదః ప్రా. పచ్ఛదం ౪ పచ్చదవు)

౧. వస్త్రము

ఉ. ఏనికతోలు పచ్చడము సొమ్ములు గుబ్బ
సరంబు . ఉ హరి ౨. ౧౩౭

గీ. అమరవందిత శూలాయుధమునఁ జీరి, రొండలు
ది త్త్రోల్చి తోలుపచ్చడము చేసి, యుత్తరా
సంగముగఁ జేసి యుండవలయు, నోడిగిలి
రక్తబిందువు లుట్టిపడఁగ ...
కాశీ. ౬. ౧౭౪.

సీ. పాతకంబులు నీలిపట్టు జొందడములు పగ
లింటి నిద్రలు పచ్చడములు ...
శైవ. ౩. ౬౧.

క. కదకదలి వేఁడివెలుఁ గను, జడదార వడిన్
మునుంగఁ జని జేగురు ప, చ్చడ మూలుఁగట్టె
దరి నవఁ, బడమట కొలుపంజ నిండె బలు
పుగ మణియున్ . . యయా. ౨. ౨౯.

౨. (వస్త్ర విశేషము). (క.) అంతరీయము, కట్టు బట్ట

సీ. గజచర్మ మెన్నఁడో కాని నిచ్చలు గట్టు
పసిఁడి కిమ్ముల పట్టు పచ్చడంబు ...
భీమ ౧. ౧౧౫.

(చ) ఉత్తరీయము, పై బట్ట. (అంగవస్త్రము. ఆని. ౪. ౨.)

సీ. కటిమండలమున నీర్కావిధోవతి మీఁద
తెలిపట్టు పచ్చడం బలవు మిగుల .
రుక్మాం ౧ ౧౨.

సీ. గడితంపు మేలుపచ్చడము గప్పట మాని
దుప్పట్లు పైకాలుఁ గప్పఁ దొడఁగె
నిరం. ౨. ౧౭.

(ట) సాలువు

దరువు. పరశాలియంగిలు పట్టుపచ్చడములు, . .
బూని, గిరిమెతో వచ్చిరి కవిబుధోత్తములు.
రఘు ౯. ౭౦.

సీ. .. జడకుచ్చుమీఁదఁ బచ్చడపుఁ గండ ...
పార. ౨. ౯౩.

(పచ్చడపుఁగండ = సాలువు ఖండము.)

(త.) - కప్పికొనుట, పఱచుకొనుట కుపయో గించెడి, దుప్పటి.

ఉ. వెన్నెలకెల్ల పచ్చడము విచ్చిన యంబర
శయ్యమీఁద ... నృసిం. ౩. ౭౯.

గీ. ప్రచ్ఛదపటంబు వెలయును బచ్చడ మన ...
ఆం. భా. ౨. ౧౫౬.

**పచ్చేడి.** వి (క. త. పచ్చడి). ౧. ఉపదంశము, పప్పుదినుసులను గాని కూరగాయదినుసులను గాని ముద్దగా రుబ్బి చేసెడు వ్యంజన విశేషము.

సీ. ఉపదంశ సంజ్ఞ రైయొప్పు పచ్చడి యన.
ఆం. భా. ౨. ౨౪౭.

మ. . . మణిమయం బై యొప్పు సాచం బగు,
రొక్కము పచ్చళ్లను ఆము. ౧. ౭౨.

సీ మధురేక్షు గోక్షీర మధుపానములతోడ సర
సంబు లైన పచ్చళ్లతోడ ...
నా పంచ. ౧ ౩౧౩

౨. అల్పఖండము.

ఉ ... కౌశికరాశిభారచేఁ బచ్చడి చేయఁగా
జముని బాణసముంబురుడించు చోటికిన్
ఉ హరి ౪ ౧౯౨

సీ పెడఁద గొడ్డండ్లఁ బచ్చడిసేయఁ బడువారు
క్రుసమిఁ బాఁతిన నుక్కిపోవువారు
కవిక ౫ ౧౧౩

**పచ్చత్తడులవజీరుఁడు.** వి (√పచ్చే) (హరి
దశ్వుఁడు) సూర్యుఁడు.

క. హనుమంతుం డను పేరం, దనరాఁ రెడువాఁడు
బచ్చతిత్తడులవజీ, రుని కొమరున కంతయు
న, మ్మిన బంటఁ గడింది తేజా మీఱిన
వాఁడన్ అచ్చ రా కిష్కిం. ౧౭

(ఇట్లే పచ్చ గుఱ్ఱముల రాతు)

గీ. ప్రాఁబలుకుకొంకి పచ్చగుఱ్ఱముల రౌతు,
కేవలుం గిన సూర్యుఁ డా ...
ఆం. భా ౧. ౭౧

**పచ్చేతలపిచ్చేక.** వి (√పచ్చే) పక్షి విశే
షము (పీతముండము. శ, ర)

**పచ్చేతామర.** వి. (√పచ్చే) స్థలపద్మము, మెట్ట
తామర. ¶

సీ. స్థలపద్మ మగు మెట్టతామర యనఁ బైఁడి
తామర యనఁ బచ్చతామర యన ...
ఆం. భా. ౨. ౭౯.

**పచ్చేదినసరులు.** వి. బ. (√పచ్చే) ధాన్య విశే
షము.

వ. .. దాళువాలు జారళ్లు రామబాణాలు
కటకసరులు రత్నసరులు జీనిసరులు రాయ
సరులు పచ్చదినసరులు గంధసరులు ..
ప్రబంధ ౧౧౭

**పచ్చేన.** వి (√పచ్చే.) ౧ పసరువన్నె. ౨.
పసుపువన్నె

సీ ... పచ్చన పచ్చ పసిమి నాఁగఁ బీతవర్ణం
బగు .. ఆం భా ౧ ౧౦౭

**పచ్చేనికోకవాఁడు.** వి (√పచ్చే) పీతాం
బరుఁడు, విష్ణువు

వ తద్ద్వారపాలకులు కుచేలు నచ్చట
నునిచి పచ్చకోకవాని కీ ముచ్చట లెఱిఁ
గించువా రై చని ... కుచేల. ౨. ౫౩

**పచ్చేని వింటిజోదు.** వి (√పచ్చే) మన్మ
థుఁడు

ఉ నెచ్చెలిఁ జూచి పల్కెఁ దరుణీ వినవమ్మ
మనోహరాకృతిం, బచ్చని వింటిజోదు
గెలువం గలయొక్క పరోపవిలాసగుణ .
చెన్న ౪ ౨౪౩

**పచ్చేనీరుల్లి.** వి (పచ్చ+నీరుల్లి) పలాండు
విశేషము. (దుద్దుమము. శ ర)

**పచ్చేపచేన.** వి (పచ్చన + పచన) మిక్కిలి
పచ్చన

ఉ అంతటఁ బండి పచ్చపచ నైనదళంబులు
రాలెఁ దద్వన, ప్రాంతములన్ ...
చమ. ౧. ౪౩.

**పచ్చేపట్టు.** వి (√పచ్చే) ౧. స్త్రీలు ధరించు
వస్త్ర విశేషము.

గీ. ... మేఘువన్నెలు పచ్చపట్టు, గరుడ
పచ్చలు ... మొదలుగా వల్వలు ధరించి
ముదిత లపుడు ... ప్రబంధ. ౨౬౨.

వ. ... తోఁపులు మేఘవర్ణంబులు పచ్చపట్టులు చీనీలు శాలువలు . . ప్రబంధ. ౬౦౫.

౨. పచ్చని పట్టుబట్ట, పీతాంబరము.

వ. ... శ్రీకాళాలని శ్రీవల్లభరాయనికి సమ ర్పించిన వస్తువులు ..

జప్పడి ౧ పట్టు పచ్చపట్టు ౨. శ్రీ ౯౪౫

**పచ్చేపిట్ట.** వి (√పచ్చే) ౧ పసరురంగు రెక్కలు గలపిట్ట, చిలుక.

సీ. పచ్చపిట్టలరేఁడు పఱపి యాడెడు వాఁడు పాంథజనంబుల పాలదొంగ

ధనాభి ౧ ౩౮

౨. (= పచ్చపులుఁగు) పసుపువన్నె రెక్కలు గలపక్షి విశేషము, హారీతము.

**పచ్చేపులుఁగు** = పచ్చేపిట్ట వి (√పచ్చే) పక్షివిశేషము, హారీతము (శ ర)

**పచ్చేపూస.** వి (√పచ్చే) పచ్చరంగు గలపూస (పచ్చపూసగు = పచ్చపూసవలె నదృశ్యమగు, ప్రయత్న దృశ్యమగు )

సీ పాలపుఁ బయ్యెదఁ దేఱిచూతు నన్నంతనే పచ్చపూ సాయెఁబో పడఁతియారు ...

విజ. వి ౩. ౧౨.

**పచ్చే పెసలు.** వి బ (√పచ్చే) ముద్గధాన్య విశేషము. (ఖండేరము శ ర )

**పచ్చేబొట్టు** = పచ్చేకుబొట్టు వి (పచ్చ + బొట్టు) పచ్చాకు పసరుతో పొడిచెడు బొట్టు

సీ. ముంజేతులను ముఖాంబుజమున నొక వింత పొలుపు దెల్పెడు పచ్చబొట్టు లెసఁగ .

కుశ. ౧. ౧౩

**పచ్చేముపాడు.** విశ. (పాడు + పాడు . తి. పంటపొట్టు = దారిద్ర్యము, లేమి.) మిక్కిలి పా డైనది, బిగ్గముపాడు.

ఉ. ... పదేసిబాణముల్, పెచ్చిన రోషవీర ధుల పయిక్ నిగిడించిన సేనలెల్లనుం, బచ్చ ముపాడుగా విఱిగి పాఱ ధనంజయుఁ దర్ద గించుచున్ . జై. భా. ౪. ౨౦

**పచ్చేయగు.** అ క్రి (√పచ్చే) ధనవంతి మగు

ఉ అల్లన మందభాగ్యుఁ డగునాతఁడు పెవిధులం గ్రహించియున్, వల్లను పచ్చగాక వసి వాడిన పోముఁ దాగివృత్తుఁ డై

వేం. పంచ ౧ ౪౪౪

సా . పొరుబు పచ్చగా నుండిన ప్రొయ్యిలో నీళ్లు పోసికొనుట

**పచ్చేయరఁటి.** వి (√పచ్చే) పసరువన్నె పండ్లు గల కదళీ విశేషము ?

(మహాగంధ ? శ ర)

**పచ్చేయిరుగుడు.** వి (√పచ్చే) పచ్చపువ్వులు గల యిరుగుడు ? (పారిణి ?. శ ర)

**పచ్చేయెన్ను.** వి (√పచ్చే) త్రీ వశీకర ణౌష ధములలో నుపయోగించు, ఓషధి విశేషము ?.

సీ జాజికాయయుఁ గురాసాని రోమము వస చెంగిల్వ మర్లుమాతంగి పచ్చ, యెన్నులు

ప్రబంధ ౬౪౦.

**పచ్చేరెక్క.** వి. (√పచ్చే) పక్షివిశేషము, ఒకా నొక పిట్ట.

గీ పసిఁడి ముద్దయుఁ బాలయుఁ బచ్చరెక్క .

రసిక. ౧ ౧౧౫

**పచ్చేరెక్కలపక్కి** = పచ్చేపిట్ట వి (√పచ్చే), చిలుక.

వ. .. చక్కెర వింటి చక్కనిసామి టెక్కం బలర నుక్కు మిగిలి పచ్చ రెక్కలపక్కి నెక్కి .. ప్రద్యుమ్న చరిత్రము. ౩. ౪౫.

**పచ్చేఱా(రా)యి** = పచ్చే. వి (√పచ్చే). మరకతమణి

గీ పచ్చతామానికంబుల పల్లేరములఁ, బచ్చ గం
డనిశూర శేర్పడమిం జూచి, పెట్టరని పెం
పెద్దలు పెడము కట్టఁ, బెట్టుటకు వంగనల
కును బట్టెఁ దడవు సైవ ౬ ౧౨౨

గీ పచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకు
మనుచ ౨ ४3

సీ పెకవంకఁ బచ్చరావిడిపంకి బొంకింపఁ జాలి
కట్టిన నీలిచాయదట్టి ... దశా ౧ ౨౬౦

పచ్చేనలువదారి వి (√పచ్చే) (పీతాంబర
ధారి) విష్ణువు, (४ ర)

పచ్చేవార్వ(రువ)పుఱోదు = పచ్చేవార్వపుప
జీరు. వి (√పచ్చే)

౧ హరిదశ్వుఁడు, సూర్యుఁడు

సీ పచ్చవార్వపుఱోడు పచ్చవార్వపుఱోదు వల
కన్న కొడుకు నై వలపు బలుక
అచ్చ రా పీఠిక 3

౨ చిలుకతత్తడి రాతు, మన్మథుఁడు
అచ్చ రా పీఠిక 3

పచ్చేవార్వ(రువ)పునజీరు = పచ్చే వార్వపు
ఱోదు వి (√పచ్చే) హరిదశ్వుఁడు,
సూర్యుఁడు.

గీ. అనిసఁ దద్దయుఁ బొంగి యయ్యదవిమన్కి,
పట్టుబల్లిట్ట యమ్మేటి పచ్చవారు, వపువజీరు
కొలంపు కల్వలయమంగుఁ, గాంచి సును
దియ్యపల్కులు గదురఁ బలికె .
అచ్చ రా బాల ४ర.

పచ్చవా (పా, ఁబా)లు. అ క్రి (పచ్చ +
పాలు) పసుపు వర్ణము కలదియగు

వ ద్రవిడకుటుంబినుల్ పసుపురాచిన రత్నపుఁ
దాపత్రింద నం, బువు తెరవాఁగా నిదుర
వోయి గరుత్తతి పచ్చవాటినక్, భవన సరో
మరాళములు ... ఆము. ౧. ౭ర.

గీ అంత నవ్వాన తరువాతియదను దోఁపఁ, బంట
పూఁబోఁడి తన ముద్దు పట్టిఁగొఱుకు, బిలు
వగలఁ గుంద మేసెల్లఁ బచ్చవా కో, నవఁగఁ
బరువంపుఁ జైరులు గొనజమిాకొ
అచ్చ గా. కిష్కిం ౬ా

పచ్చేవింటిదొర = పచ్చే విలుకుఁడు వి.
(√పచ్చే) చెఱకు వింటివాఁడు, మన్మథుఁడు

మ అల్లుటిం, తిగమిం గూరుపఁ బచ్చవింటి
దొగ హత్తింపండు వి ర్గోలచే .
అచ్చ భా 3 ౬४

పచ్చే(ని)వింటివాఁడు = పచ్చేవిలుకుఁడు వి
(√పచ్చే) మన్మథుఁడు.

ఆ పచ్చవింటివాఁడు పరఁగఁ బల్విపుటమ్ము,
గలుగువాఁడు ప్రౌఢగతులవాఁడు ...
వీర ౨. ४౧

ఉ పచ్చని వింటివాఁడు తెగఁబాఱక ని న్నిపు
డింతదవ్వు రా, నిచ్చనె గాజశేఖర నరే
శ్వర యంచు శుకంబు పల్కినన్
రాజ చ 3 ४५.

పచ్చవిలుతు(ల్తు)ఁడు. వి (పచ్చ + విలు
తుఁడు) ఇక్షుధన్వుఁడు, చెఱకు విలుకాఁడు,
మన్మథుఁడు

గీ .. పరసతీసంగమున వచ్చు పాపమునకు,
నోరతును గాని పైరింపనోపఁ బచ్చ, విలుకు
తూపులతాఁకున కలరుచోఁడి
భార విరా ౨. ५3.

వ పచ్చవిలుతుండు విచ్చలవిడిం దనకైదు
వులు ముప్పిరిగొంటం దోఁడుచూపె ...
పారి. ౨. ५౭.

గీ పచ్చవిల్తుని శాయుధాభ్యాసశాల, యనఁగ
నొప్పారు నెప్పుడు నప్పురంబు ..
విక్ర. ౧. ౧౦౦.

**పచ్చే (ని) విల్కా (లుకా)ఁడు** = పచ్చేవిలుకుఁడు వి. (√పచ్చే) మన్మథుఁడు.

ఎ పచ్చవిల్కాఁడు గురియించు విరివానలుం బోలెఁ గరువలిచేఁ దొరఁగు పరువంపు నన లున్నం గలిగి ... యయా ౪. ౧౩.

గీ దాని సౌందర్యమున కీ విధాతృసృష్టి, సరి సమం బీడు లో డెన్న సతులుగలరె, పచ్చ విల్కానితో నల్గి వచ్చి గంగ, భూపసతి నున్నరతిదేవి దేవదేవి ...

వైజ ౧ ౧౦౭ మృ వి ౧ ౩౫

మ వనజ శ్రీధన పక్ష్మతోహరుఁడు జీవం జీవ జీవంబు ప, చ్చని విల్కానికి మామ చల్వ గని పక్ష్యమ్మాల జూటాగ్రగమో, హ లెన్నంబు ఋభాకిరుం దఖుగు ప్రాగిగ్రస్థలీ వీధి నో, య్యనఁ దోతెంచె

పారి ౪ ౪౮

మ స, చ్చని విల్కాని జయాస్పదం బగు జగా సంలోకి తేజీ విధం, బున నవ్వోళ ప్రభావతీ సుదతి మాపుల్ వన్నెలం బ్బొఁగిన్

శుక ౨ ౨౬౫

**పచ్చేవిల్తునయ్య.** వి (√పచ్చే) మన్మథుని తండ్రి. విష్ణువు

గీ లచ్చి వొదమినచోటికిఁ బచ్చవిల్తు, నయ్య నెయ్యంపువీటి కింపారునేల, లోటిమగవాని కపు మొలత్రాటి కన్న, మేటి రైయి మించు పాలమున్నీటి కరిగి ..

అచ్చ రా బాల ౭౦

**పచ్చేసరులు** వి బ (√పచ్చే) ధాన్య విశేషము.

సీ పచ్చసరుల్ రెడ్డిపాలవంకలు సుఖభోగులు పచ్చకర్పూరసరులు ... హంస ౪ ౧౭౮

**పచ్చోకు.** వి. (పచ్చ+ఆకు). ౧ హరితపత్రికా పత్రము, పచ్చాకు చెట్టుయొక్క ఆకు.

ను. తుటు మై రెయుక్కటఁ గూడి గూడెపుఁ గిరాతుల్ సేసు వీక్షింపఁగా, వట కాలోన పంటాపాటిం బంచి పచ్చాకుల్ ద్రుమ ఖ్యానముల్, గిటిదంష్ట్రల్ చేకానుకల్, సేయుచున్ . కేం. పంచ. ౨. ౧౯౨.

పీ. గాళముల్ పచ్చాకు కచ్చూరములు చాల నించినకొట్టడే ల్మించి రేఁగి ...

గీ చూచె నొక దివ్యరత్న విస్తులగృహంబు హంస ౧ ౨౧

గీ పసివలపులిచ్చు పచ్చాకుపసిఁడిపట్టు, బటువు లోడును బటువు పైపుటము గులుకఁ, బూని రందల మెంతియు బోయ లంత

గా వి ౨ ౪౩

౨ బాలక్రీడా విశేషము

(పచ్చని ఆకును ఇసుకలో కప్పి బాలురు సెమ్మదిగా నూఁదుచు ఎవరికి కనుపించునో వాఁడు గోపి ద్వైన ట్లెన్నుచు పాడుకొనునట్టి ఆట )

**పచ్చోకుబొట్టు** = పచ్చేబొట్టు (√పచ్చే)

**పచ్చోరె.** వి (పచ్చ+ఆర) ఆరెచెట్టు భేదము

ద్వి బలుసుముల్ సొమగు పచ్చార యారె, వలిచంద్రములుచంద్ర వాడగన్నేరు ..

ద్వి. శ. పా ౨. ౨౦. పా. ౩ పం

**పచ్చి.** విశే. (క హసి). ౧. ఆర్ద్రము, తడిగలగి; ఎండనిది

సీ. మంచి పచ్చినది రౌా మగువ యా రెుల నాగ మెడఁ బచ్చికస్తూరి మెలఁచి యలఁదు

యయా ౫. ౩౪.

వ. . చిలుపచిలుపని సొత్తురుల జొత్తిల్లిన పచ్చి రేనికతోలు పచ్చడంబును ...

భీమ. ౪, ౧౨౩.

గీ అవిశ విగిలుంతు నదియును నవల వైచి, కుంకుమపుఁ బూఁత చిమచిమ గొనెడుచిన్ని,

పచ్చికొనగోటి కాఁటులు రచ్చసేయ, గుబ్బ
యుర గాన రాఁ బైఁట కొంగు వైతు
కువల. ౪. ౧౭౭

చ రమణభుజానిపీడనఁ గరంగిన కాంతల విస్ఫు
రన్నితం, బములఁ దలిర్చు సన్నవలిపంబులు
వీడియు జాఱవయ్యెఁ జె, న్నమరు వినూత
నక్షతినఖాంకము వింతెసలారఁ గ్రమ్మనుం,
జెమటలఁ జాలఁ బచ్చు లయి చిక్కఁగ
నంటికొనంగఁ జేసినన్ .. నృసిం 3. ౪౧

సీ ఉత్సాహ మొదవ మై నుబ్బించె సేనియుఁ
బచ్చిగోడలజాడ విచ్చు దిశలు
ఉ. గా ౨ ౧౯౬

ద్వి పచ్చిచెక్కులఁ దలఁ బగులంగ నడిచి,
చచ్చినపీనుఁగుఁ జఱజఱ నీడ్చి .
బస పు ౪ ౪౭౦ పం

ఉదా: పచ్చికసవు మొ

౨ ఉడుకనిది; క్రాఁగనిది

గీ బొరునుమోముల బిఱ్ఱువోఁ బచ్చిపసపున
మేదించినూసె చే మెఱుఁగువెట్టు
వైజ 3 ౪౦

సీ బానలోపలఁ బచ్చిపా లుండ మించి
చేరిమి యిడ్డపా ల్పాయిమీఁదఁ బెట్టి
శుక. ౨ ౫౬౧

సీ విరహులమై సోఁకి కేఁడి యా వెన్నెలఁ
బచ్చివెన్నెల నులివెచ్చఁ జేసి
పారి ౨ ౪౭

3. వేఁగనిది.

సీ పెరుఁగు వడియంబులును బచ్చివరుగు .
ఆము. ౨. ౯౪

౪ కాలనిది.

ఉదా: పచ్చిసుండ, పచ్చియిటుక మొ.

౫ ముదరనిది.

ఉదా: పచ్చికాయ మొ.

౬. నూతనము, క్రొత్తది.

గీ సొబగు కాటుకబొట్టుతోఁ జాద నొప్పి,
వింతచెలువునఁ బచ్చిబాలింత యపుడు ...
శివరా ౨ ౪౪.

గీ పదాఱువర్షముల వయసు, పచ్చిబా
లింతరాలు తాపసిపురంధ్రి
హర. ౨. ౯౩

౭ (రోగాదులనుండి) తేఱనిది

ఉదా: పచ్చిరోగులు మొ

౮ మఱుఁగు లేనిది రహస్యము వెలిబుచ్చునది.

ఉత్సాహము ఇంతెనుండి మిక్కిలిన్,
బచ్చి గాఁగ వలపు తేటపఱిచి వ్రాసి
నాఁడో నీ, యిచ్చఁ జదువు కొనుము వెనుక
నిపుడు దాఁచి నావుడున్
ప్రభా 3. ౧౪౧.

౯ అచ్చటి కయ్యెడ వచ్చిన, సెచ్చెలు లచ్చె
లువఁ దెచ్చి నృపుతోఁ జదురుల్, పచ్చిగ
నాడుచుఁ బాడుచు, మచ్చిక నొకరొకర
పనులమఱుఁగున జరుగన్ ...
రా వి ౫. ౭౪.

సీ జారకర్ణగ్గానిచేర నారిజనుగాఁ బలుకు
నొక్కొకసారి పచ్చిపలుకు ..
వేం పంచ. 3. ౨౫౧.

౧౦ కఠినాత్ముఁడు

చ .. గోవధ మాచరించు నెం, పదర లతాంగి
పచ్చితుర కాఁగద యమ్మదినుంకు చూడఁ
గన్ ... విజ. వి. 3. ౬౬.

౧౧. జన్మమున శివుని దక్షుఁడు, మన్నింపమిఁ
జేసి పచ్చిమాలం డయ్యెన్
శివ. పా. ౪౪౨. బస. పు. ౪. ౪౧ పం

(వి. ౧. కళ్లు లోనగువాని యార్ద్రిత్వము,
పచ్చితనము).

(వ్యవ.) ఆ కళ్లలో పచ్చి పోసింపమ మందుట
లేదు.

౨. శృంగారాదిరసస్ఫురణము, రసము పైకి స్ఫురించుట (చూ పచ్చితేరు)

(పచ్చిగిక్కినుండు = కఠిన రాక్షసుండు

ద్వి. భక్తుని మ్రింగిన పచ్చిగిక్కినుండు, భక్తుని జంపం బాల్పడుసూనగాండు

బస పు ४ ౬४४ పం

ద్వి ఱంకెతిల్ ఱంకెతిల్ పచ్చిగిక్కినులు, రొమ్ములకుంపట్లు కోంత్రపామిండ్లు

పండితా పురా ౧౧౬ షా

జ : పచ్చిక పచ్చితేరు, పచ్చిబియ్యపుమావిడి, పచ్చిబియ్యము

పచ్చిక. వి (√పచ్చి (పచ్చి = పచ్చిగి) స్వార్థమందు ‘ షక ’ ప్రత్యయము) పచ్చికిసవుకాదము (పచ్చికలకి అని శ గ )

చ కిరంగినవింటియప్పసరుకై వడిం పట్టెలు పెట్టు పచ్చికల్ ఆము ४ ౧౦౦

సీ. పచ్చలగనులపైం ఒసివి పచ్చిక యంచు వడి మేయ వచ్చినప్రదుకోంటనులు

యయా ౨. ౩౫

(పచ్చికడాల్ మేనిసామి = దూగ్వాశ్యామాంగుండు, విష్ణువు

క. షచ్చట పెన్నాళ్లకు వా, పచ్చికడాల్ మేని సామి ప్రత్యక్షం బా. టచ్చెరువు వినండు వే ఱొకె, ముచ్చట కాఱంగింతు మీకు మోదం బొదవన్ ఘటికా ౨ ౧౫४

పచ్చితేరు(ఱు). అ క్ర (పచ్చి + తేరు) ౧ పచ్చియగు. (శ గ )

(వ్యవ) ఆపుండు పచ్చితేరెను

పచ్చిపట్టె. వి (√పచ్చి) తడియారని విభూతి రేఖ.

సీ. కన్నుప్ప విభునివక్త్రము మజ్జనపుబిందె పంచ పాయకు మేను పచ్చిపట్టె

రుక్మాం ౫. ౬౮.

(పచ్చపట్టె. ముద్రి. వ్రాతప్రతుల పా. పంచ పట్టె. శ ర పా పంచపట్టు. చి. ని. పా. ఇంకను విచార్యము )

పచ్చిబియ్యపుమామిడి. వి (పచ్చి + బియ్యము + మామిడి)

వార లేక కండ గలమామిడి (శ గ )

పచ్చిబియ్యము. వి (పచ్చి + బియ్యము) ౧ తడియారని బియ్యము

(నానంబ్రాలు అని శ గ )

(వ్యవ) పచ్చిబియ్యముకూడు తినిన కడుపు నొప్పి వచ్చును

౨ ఉప్పుడుచేయని బియ్యము (శ గ )

పచ్చియము = పచ్చెము వి (సం పశ్యతో హరణమ్) పశ్యతో హరణము, చూచు చుండంగా దొంగిలించుట (శ. గ )

(మోసము చి ని )

పచ్చెకాండు. వి. (పచ్చెము + కాండు) పశ్యతో హరుండు, చూచుచుండంగనే దొంగిలించువాండు. (శ గ )

పచ్చెము = పచ్చియము

౬ : పచ్చెకాండు

పచ్యమానము. సం విణ (అ. ఆ అ,) వండంబడుచున్నది.

పచ్ఛము. సం. వి అ. పుం శిల, ఱాయి. (శే. ని.)

పజే. వి. (సం ప్రజా ప్రా. పజా.) ప్రజలు, జనము.

సీ వానలు లేక పెవ్వడిం బైరు లన్నియు వాడందొడంగిన నోడి ప్రజలు ...

అచ్చ. రా. బాల. ५४.

గీ. ఒక గొడుగునీడ నీవు కీడుడుగనడుపు,
గుడుసుకొండకు లోనైన పుడమిఁ గలుగు,
ప్రజలకెల్లను జీర మైనపగిదిఁ బోలను,
విందుఁ గావించెదను పేఁటపెదలు సామి
చంద్రా ౨ ౬౬.

పజ్జ. వి (సం పశ్చాత్ ప్రా పచ్ఛా క పజ్జై)

౧ వెనుక, పశ్చాద్భాగము

ఆ అప్వ డ, వ్వనితిపజ్జ నరిగె వాసవుండు
భార ఆది ౭ ౨౬౯

గీ సింహబలుఁ డత్యుదగ్రుఁ డై చిగురుఁబోఁడి,
పజ్జఁ గడువడిఁ దగిలి కోపంబు గదుర,
నొడిచి తల పట్టి తిగిచి
భార విరా ౨ ౧౨౯ కర్ణ ౨ ౨౮౩

సీ తన తల్లి కైకసీధవళాక్షి మత్యాలపల్లకిపై
వారపజ్జ నరుగ ఉ రా ౨ ౨౯౮

౨. సమీపము, చేరువ

చ భ్రమదమహాస్వ్వరూపమునఁ బజ్జయు
దవ్వు పెఱుంగనని, భ్రమముల
కళా ౩ ౧౨

క .. ఆ, హా భారత్రవాఁత యని కగ, బాధం
గిలఁగిఁగిను వారి పజ్జకుఁ జనిరోయిక్

౩ ప్రాంతము, సమీప ప్రదేశము.

సీ రామాయణాది సద్గ్రంథముల్ వెలయఁగాఁ
బజ్జఁ బుస్తకరాజి పరిఢవిల్ల
బిల్హ ౧ ౫౬

క . పాదపద్మముల జిగిజాళ్వ్వా, గజ్జెలు
మొగయఁగఁ బజ్జల, హజ్జ లిడుం గుజ్జు
తల్లి యానందింపన్ దశా ౫ ౬౮

చ కులుకుచుఁ జేరి యాటలకుఁ గూరిమి నెచ్చెలు
లెచ్చరించినం, బలుక వదేమి యేమటక
పజ్జల నిల్చిన యూడిగింపుటిం, తులఁగని...
నీలా. ౨. ౯౨.

౪. అనుసారము, వెంబడించుట.

గీ. ... అచ్చెలువచెలువుఁ, దగిలి తన యిచ్చఁ
బాయుచిత్తంబుపజ్జ, నరిగి యిట్లను నక్కుచ
కాధముండు భార. విరా ౨. ౨౫.

ఉ సుందరి రాజనందనుని జూచిన చూపులపజ్జఁ
బోరియు . దశకు. ౩ ౧౩౧

సీ కొంచెపుటశనంబు గొనుచు సంగంబులఁ
బాసి యింద్రియములపజ్జఁ జనమి ...
భార. శాం. ౬. ౩౭.

౫ ఒద్ద, కడ

చ సకల కలావిభూషితులు శబ్దనిదుల్ నయ
తత్త్వబోధకుల్, ప్రకట కవీంద్రు లేశ్నృపతి
పజ్జను నిర్ఘను లై చరింతు రా, విశృతపు
జాడ్య మాదొరది భర్తృ ౧ ౧౨.

ఉ పైఁదలి ప్రాణవల్లభునిపజ్జఁ జరింపక పాయు
సేర్చుచే విక్ర. ౨. ౭౨.

ద్వి అలరి యాచిత్రకూటాద్రి నెక్కుటయు,
భౌతుండు రఘురామపజ్జ వచ్చుటయు
రం రా బాల ౭ పా. ౭. పం.

౬. చోటు, స్థలము

సీ పాళెంబు డిగి యొక్కపజ్జ నిల్వక మున్న
కూచి చేసిననాఁటి గుండెదిగులు
రా వి. ౨. ౬౯.

గీ చిడిముడి పడుచుఁగాపు, పడుచు నగి
యుప్పు దప్పజ్జఁ గదిసి ...
శుక. ౧ ౨౯౭

ఉ పంగిడిఁ జిక్కు కోదములపజ్జలఁ ద్రొక్కక
యూఁకిఁ దోలుమా, తింగము నొక్కఁ
డొంటి మెడఁ దట్టి పయింబడి నిల్పి ...
కళా. ౪. ౨౯.

౭. త్రోవ, మార్గము.

గీ. రండువనుగూడి యోపరివ్రాట్టులార, వత్స
లత గల్గి మీ రేల వత్తు రయ్యా, పరమ
నిర్భాగ్యుఁ డైన నాపజ్జ పట్టి, కటకటా

సౌఖ్యజలరాశి కాకెఁ బాసి .
కాశీ ౨. ౧౪౦

వ . విదర్భధాత్రీ పతిపుత్రి విధిపజ్జను నిచ్చె ధంబు శ్రోవనం బోవనితలంపున ...
నైష. ౫. ౧౩౦.

రా కొన్నిరయిచల 'అందు, లో' యున్నగు నర్థములనిచ్చును

క. ఈరీతి నిలిచి యచ్చటఁ, గోరికి లలరం బతంగకులమణి చరియం, భోరాశి కినుఁడు చేరెఁ, భారద్వాజాశ్రమంబుపజ్జ న్నిలిచెన్.
రామా. ౫. ౫౦.

ఉ. బాలిక చెక్కుటద్దములపజ్జలఁ గోమలమంద హాసరే, ఖాలవ మంకురింపదు ...
నైష. ౨. ౧౧౨.

కి. బాగాలు వేసికొని తన, బాగా లున్నట్టి మేదపజ్జకు సేఁగన్ ...
సారంగ. ౨ ౧౯౪.

పజ్జాడు. సం విణ (అ ఆ. అ) పాదములనుండి పుట్టినవాఁడు వి అ పుం శూద్రుఁడు

పటకము. సం వి. అ పుం ౧ శిబిరము, దండు విడిసినపట్టు ౨ పటము, నాలిబట్ట ౩ గ్రామార్థము. (విల్యమ్సు)

పటకర్మము. సం వి క్ న. బట్టలపని, నేఁత

పటకారుఁడు. సం వి అ పుం ౧. బట్టలు నేయువాఁడు, సాలెవాఁడు. ౨ చిత్రకారకుఁడు, చిత్తరువు వ్రాయువాఁడు.

పటకుటి. సం వి. ఈ స్త్రీ దూష్యము, గుడారము, డేరా.

పటచ్చరము. సం వి అ న జీర్ణవస్త్రము, ప్రాఁతగుడ్డ.

పటచ్చరుఁడు. సం వి. అ పుం. పాటచ్చరుఁడు, దొంగ. (వై. ని.)

పటచ్చోరుఁడు. సం. వి. అ. పుం. పటచ్చరుఁడు, దొంగ (వై. ని)

పటత్కుఁడు. సం వి. అ పుం చోరుఁడు, దొంగ (వాచ.)

పటపట = పటపటపట వి. (క పటపట త. పడపడ)

౧ పగులుట బ్రద్దలగుట యందలి ధ్వని కనుకరణము.

క. ఖురనిహతి నొరలు దుమ్ముకృతి, భరమునఁ గీకటుతిలలు పటపట పగులన్ ...
చంద్రా ౧ ౧౯.

వ అప్పుడు కకుప్పుటలంబులు పటపటం బగుల వరాహ ౬. ౬౨.

ద్వి అట జనప్రతిమరూ పప్పుడ వ్రస్సి, పట పట వ్రక్కలై పడఁగ మధ్యమున పండితా.
వా ౨౦౧ పా వరాహ ౩ ౨౬.

౨ కొఱుకుట నములుట యం దగుధ్వని కనుకరణము

గీ పటపటఁ గపాలపంక్తులఁ బగులఁ గొఱికి, బలము సెల్లను గడియలోపలను మ్రింగె .
మనుచ. ౪. ౧౧౩.

౩ ముండ్లు మొదలగునవి గాలి మొదలగువానిచేఁ గదలుట యందలి ధ్వని కనుకరణము.

గీ పడి యుడఁగి యుండఁగాఁ బటపటన ముండ్లు, గాలిఁ గదలుటఁ గని పంట్రకోలఁ బొడిచె.
మనుచ. ౪. ౫౪.

౪. పండ్లు కొఱుకుట యందలి ధ్వని కనుకరణము.

క ఒండొరుఁ గదవం, బిఱుచుచుఁ బండులు పటపటఁ, గొఱుకుచు సారుద్ర సైనికులు ధార్త్యవహన్ ... వరాహ. ౫ ౧౧౪.

చ. ... అందఱిమీఁద నొక్కటఁగ్, బటపట పండ్లు గీటుచు ...

చెన్న. ౫ ౩౮ ఉ. రా. ౩. ౮౦

౫. చినుకులు వడగండ్లు మొ. పడుట యందగు ధ్వని కనుకరణము.

సీ పటపట యని పైని బడుచుండు వడగండ్లు వికసిత మల్లికా వృష్టిగాఁగ ...

పార్వ ౩ ౭౬

చ. చిటిపొటిమబ్బు లాకసపుసీమఁ గనంబడి గొప్పగొప్ప లై, పటపట వ్రాయుచు న్నగిన బాంధవు బింబముఁ గప్పికొంచు చినుకుల్ .. శుక ౨. ౩౪౦

౬. కాలుట వేఁగుట యందగు ధ్వని కనుకరణము

వ . కమలకు డుంగంబులపై వేఁడి వెన్నెలలు చిటచిటం గాఁచినఁ బటపటం గమలి భుగభుగం బొగ వెగయుగతి

సానందో ౫ ౯౧ గ

జ: పటపట లాడించు

పటపటపట = పటపట వి పగులుటయం దగు ధ్వని కనుకరణము

క. పెటపెటపెటఁ గాపెన్ గవి, పటపటపట మనుచు గిరులు పగిలెన్ రగిలెన్, చిటచిట చిట మనుచున్ వని, గిటగిటగిట మనుచు జనము కృశియించె సెగన్ ...

గా వి. ౫. ౯౭

క. మిటమిటని కటికిరొండం, బటపటపటఁ బగిలి పాయవడిన పెదురులం, బుట పొగ యుచు ముత్తియము, ల్చిటిలినగతి నాడె కాల్మలితూలంబుల్ చంద్ర ౧ ౧౫౭.

పటపటలాడించే. స క్రి (√పటపట) పట పట యనుధ్వని కలుగునట్లు నములు - (వ్యావ) వాఁడు సెనగలు పటపట లాడించుచున్నాఁడు.

పటపటాత్కారము. సం. వి అ పుం పటపట మనుధ్వని

పటభాసము. సం వి. అ. పుం జాలాంతరము కిటికి సందు, ప్రేక్షణికము (వై. వి.) సం దశకు. ౨. ౨.

పటమయము. సం. విశే. (అ ఈ. అ) ౧. పటములతో - వస్త్రములతో నిండినది ౨ వస్త్ర వికార మైనది (వి అ న) ౧ గుడారము ౨. కాటి

పటము. వి (సం స్ఫటా కి పటవు త. పడం) పాఁపపడఁగ. (శ. ర)

పటము. సం. వి అ. పుం న. ౧ ఆవరించునది - వస్త్రము. ౨ చిత్తరువు వ్రాయువస్త్రాదికము ౩ తెర ౪. చిత్తరువు, ఆలేఖ్యము.

సీ బలుంజాళువాగట్టు విలుకానికిఁ బటాంతరంబు లేనగరంబులు (పటాంతరము = మఱియొకచిత్రము)

పుం. ప్రియాలము, మోరిటు ? (న-ఛది, పటలము, ఇంటికప్పు (వాచ.)

పటరకము. సం వి అ పుం గుంద్రవృక్షము, కాకివెదురు. ?.

పటరుఁడు. సం విశే (అ ఈ అ ౧ గతిశీలుఁడు, నడచు స్వభావముకలవాఁడు ౨. వస్త్రదాత, బట్ట లిచ్చువాఁడు

పటలము. సం వి. అ న. ౧ ఛది, ఇంటికప్పు ౨. నేత్రరోగవిశేషము, కన్నులకు పొర క్రమ్ము రోగము ౩ సమూహము. ౪ పిటకము, చిన్న గంప ౫. పరివారము. ౬ తిలకము, నొసటిబొట్టు ౭. వృక్షము. ౮ వృంతము, తొడిమ కాఁడ. (పుం. న.)

౧. గ్రంథభాగము. ౨. రత్నదోషము.

సీ. చిదురుప లైనయట్లొదవినపటలంబు ఘన
శోకవనధిలో మునుగఁజేయు

రత్నపరీక్ష. ౧౫.

**పటలము.** వి మల్లవిద్యావిశేషము లగుదండలలో
నొకటి

వ ... వామపార్శ్వభృంగి దక్షిణపార్శ్వ
భృంగి పటలము . . మల్లపు ౩౬౯

**పటలి.** సం వి ఈ స్త్రీ ౧ ఛగి, ఇంటికప్పు
౨ సమూహము

**పటవణి.** వి విజృంభణము

వ . కాలుబలంబులపైఁ బైకొనకి రొక్కి
పటవణి విప్పలేక ... తిరుగవచ్చినంజొచ్చి
చక్కడఁ చుటయుం జాఁపకిట్టావడి
ఘోటకంబులక్రింద మిలమిల మెలంగెడు
గాపుతులును

ఉ హరి ౩ ౨౪

(వావిళ్ల. పా "పటవణింపలేక" కి త్రే
పా )

జ : పటవణించు

**పటవణించు.** అ క్రి. (√పటవణి) విజృం
భించు ('వ్యాపించు' అని. శ ర )

గీ పటవణించినయరిగెల పొఁజామీఁదం .

కవిక. ౨. ౧౫౯

**పటవాపము.** సం వి అ పుం దూష్యము,
గుడారము, డేరా

**పటవాసము.** సం వి. అ పుం ౧. గుడారము.
౨ వస్త్రములకు పరిమళము కలిగించు సుగంధ
ద్రవ్యము, బుక్కాము.

**పటహఘోషకుఁడు.** సం. వి. అ. పుం తప్పెట
గొట్టి చాటువాఁడు.

**పటహభ్రమణము.** సం. వి. అ న. జనులను
ఒకచోటికి ప్రోగుచేయుటకై తప్పెట వాయిం
చుచు తిరుగుట

**పటహము.** సం వి అ. పుం న. తప్పెట (పుం)
౧. హింసనము ౨. సమారంభము, ఉద్యమము

**పటా** = పట్టా వి ౧ ఆయుధ విశేషము, పట్టా
కత్తి

గీ గడలు బాణా ల్పటాలు నగ్గలికఁ బూని,
పరువడుల్ ద్రొక్కుకొనుచు ...

గవిక. ౧ ౨౧

గీ పసిఁడి కమరుపటా యొక్క కిసలయాకృ,
మొలను ధరియించి

గవిక ౧ ౬౫

(శ ర పా "పసిఁడి కమ్మరుపట" అని
ముద్రితము )

౨. ఇనుము మొదలగు లోహములతోఁ జేసిన
బద్దె

(చూ కమరుపటా )

**పటాకి.** సం వి ఆ స్త్రీ పతాక, జెండా
(వాచ )

**పటాకము.** సం వి అ పుం పక్షి (వాచ )

**పటాక్షేపము.** సం వి అ పుం (నాట్యోక్తి)
తెరను త్రోయుట

(ఇది పాత్రముయొక్క ప్రవేశ గమనమును
సూచించును. (చూ. అపటీ క్షేపము )

(ఇట్లే : పటిక్షేపము, పటీక్షేపము

**పటాణము.** వి ధాన్య విశేషము

గీ . అలసందె లుబ్బడాల్ నల్లతెల్ల, యుల
వలు ఎటాణములు పుట్లకొలఁది గిలవు .

హంస. ౪. ౧౨౪.

**పటాణి** = పటాణీ, పటాని. వి (క. పటాణి, త.
పట్టాణి, హిం. పఠాన్).

ఉ. గుత్తిపుఁ దావికావలికకట్టు పటుక్కున విచ్చె రంభకున్

శృం. శకుం. పీఠి ౧. ౭౦

క. అని పలికిన యెడ నఖములఁ, దెన పటుకునఁ ద్రెంచివైచి బెబ్బులి పఱచున్

శుక ౨ ౩౨౩

౩ పాత్రాదులను, భూమిపైఁ బడవైచుట కొట్టుట మొన్నగు వానియందలి ధ్వని కను కరణము

క. అటు పొగవీచి చక్కటి, పటుకునఁ బడవైచి క్రోధ పర్వపాటి మెయిన్

భీమ ౨ ౧౦౨

చ. ని, ఘృణగతి మేగిస్థలిఁ బటుక్కు పటుక్కునఁ గొట్టె నప్పుడున్

వరాహ ౧.౭. ౪

**పటుచ్ఛదము.** సం. వి. అ. పుం., అంగారకి †

**పటుజాతీయుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పటుప్రకారుఁడు, సమర్థునిరీతి కలవాఁడు, పూర్ణ సమర్థుఁడు కానివాఁడు

**పటుతాళించె.** స. క్రి. ఘటు ఇటు బిఱుకుగఁ జూచు.

క. పటుతాళించి నలంగిను, నట నిటు బెళుకంగఁ జూచి సనుటకుఁ దోఁచున్

ఆం. భా. ౩ ౧౩౮

(ద్రా. ముద్రి. వ్రాఁతప్రతుల పా.)

మ. . కర్ణాటి క్రొల్లన్నులన్, బటుతాళింపుచు నవ్వె నీలకబరీభారంబు కంపింపఁగన్

క్రీడా ౫౭

**పటువృణాకము.** సం. వి. అ. న. ఉప్పనిమారిముక్క. †

**పటువేశీయము.** సం. = పటుకల్పము

**పటుపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. రెడ్డివారి నానఁబ్రాలు †. (శ. ర. "కంకోష్ట" అని గురుబాలప్రబోధిక)

**పటుపత్త్రిక.** సం. వి. ఆ. స్త్రీ. క్షుద్రచంచువు, చిట్టియాముదపుఁ జెట్టు

**పటురూపుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పటిష్ఠుఁడు, మిక్కిలి సమర్థుఁడు

**పటువ.** వి. (తు. పడవు) భిక్షాపాత్రము

గీ. భవతి భిక్షాం ప్రదేహి యన్నలుకు వలికి, పటువ సాఁచినఁ గాశికాపదమునందు, సాఁకొనినవార కిడు సుధాహారభిక్షు, గౌరి కంకణములు ఘల్లుఘల్లు మనఁగ

కాశీ ౬. ౧౨౨ (చి. ని. పా.)

(పటువుసాఁచిన అపముద్రితము)

**పటు(ట్టు)వలి.** వి. (పట్టు[2] + వలిపము) పట్టుతోఁ జేసిన సన్నని వస్త్రము

ద్వి. అలరుచుఁ గైకొని యఖిలంబు నెఱుఁగ, బలువుగా నొకపటువలి చించి యొక్క, దిక్కుసుతోడ సంధించి వేఱొక్క, దిక్కు కత్త్రంబుతోఁ దిగిచి బంధించి

బస. పు. ౪ ౭౯౦ పం.

(పటవలిపుట్టము = పట్టుతో జేసిన సన్నని పుట్టము)

ద్వి. అట్టి దివ్యాంబరం బఖిలలోకములఁ, బుట్టదు బసవయ్య పట్టంపుదేవి, కట్టినపటువలి పుట్టంబు చూచి, సెట్టన వచ్చితి నీ కాఁకఁ గింప ...   బస. పు. ౩. ౩౮౨. పం.

(పటవలి, అపముద్రితము)

**పటువు.** సం. విణ. (ఉ. ఊ. ట్వీ. ఉ.) ౧. శక్తుఁడు, సమర్థుఁడు ౨. చతురుఁడు, నేర్పరి. ౩. ధూర్తుఁడు, జిత్తులమారి. ౪. నీరోగుఁడు,

తెవులులేనివాఁడు. ౫. నిష్ఠురము, కఠినము (మాట మొ) ౬ తీక్ష్ణము, వాఁడిదైనది (బుద్ధి మొ.) ౭ కటువైనది ౮ స్ఫుటము, స్పష్టమైనది; పెద్దది. (ధ్వని మొ) ౯ ఉప్పు విది (వై ని.) ౧౦ ఉ పుం న ఛత్రాకము, కుక్కగొడుగు ౧౧ పుం ౧ పటోలము చేఁదుపొట్ల. ౨ ౨ చోరకము, కచోరము ౩ కారవేల్లము, కాకర ౪ ౪ కొండీరలత ౫. ౫. ఉప్పుదనము (వై ని) న ౧ ఉప్పు ౨ ఇందుప్పు, సైంధవలవణము

పటుసాలె = పట్టుసాలె (√పట్టు?)

వ ... అర్వీటి మేటిసాలె యగసాలె పటుసాలె వాసె వైజాతి సాఁతులేతుల కోమిరెలు . ఆము ౪ ౩౫

పటేలు. వి (మహా, హిం పటేల్) గ్రామాధికారి. (శ ర బ్రౌ)

పటోటజము. సం వి అ న ౧ (మూలమునుండి బట్టవలె బయలుదేఱునది) పుట్టగొడుగు, కుక్కగొడుగు ౨ ౨ (పట + ఉటజము) వస్త్రగృహము, గుడారము

పటోలకము. సం వి అ పుం ౧ పటోలము, పొట్ల ౨. ౨ (పొట్లకాయవలె గుల్లగా నుండునది.) శుక్తి, ముత్తెపుఁజిప్ప (వాచ)

పటోలము. సం వి అ పుం. ౧ చేఁదుపొట్ల ౨ ౨. పొట్ల. ౨.

(న. వస్త్రభేదము, ఘూర్జరదేశపు చిత్రవస్త్రము.)

పటోలి. సం వి. ఈ. స్త్రీ పటోలిక, పొట్ల ౨

పటోలిక. సం వి ఆ. స్త్రీ పొట్ల ౨

పట్ట. వి. (క పట్టె, త పట్టై) ౧. చెట్టు మొ మానిచర్మము, తొక్క, నార.

సీ . . తొడు పట్ట తోలక తోలు చెక్క.

ఆ. తొంట చెక్క తడప యంట త్వగాఖ్య యౌ ... ఆం. భా. ౨. ౩౭.

ఉ గట్టిగ పట్ట లెత్తి పలిగాడ్పుతలంట్లను గొట్టి సారకున్, బొట్టలు చీల్చి జీవనముపొం దెడ సేయక పోవనిచ్చునే

ఉ హరిశ్చ. ౩. ౫౯.

౨. గోఁగు మొ. వానినారతో నేసినగుడ్డ మొ ఉదా : గోనెపట్ట, కమ్మరిపట్ట మొ. (శ. ర.)

౩. ఇనుము మొ వానిబద్దె ఉదా : ఇనుపపట్ట.

(ఈ యర్థమందు పట్ట = పట్టా అని వా)

౪ పట్టెడ, నవారు

సీ సరి లేనిమంచిగుజ్జరి నేతపట్టయుఁ బిఱ పైన రాయంచ గిఱులపఱుపు ...

ఉ రా ౬ ౧౭౦

ల. వి. ౫ ౧౦౭ (కేలిపెట్టి అపముద్రితము)

జ. పట్టసారాయి

పట్టకము. సం వి అ పుం. ౧ రాజు దానశాసనాదులు వ్రాయు రాగి లోనగు వాని రేకు. ౨ వ్రణాదులకుఁ గట్టుకట్టు ౩ తమ్మపడిగము.

శ్లో అథ మాతిరుసీరివాసితం, నిజతాంబూలగ సేన గంటికమ్, తపనీయమయే హి పట్టకే, ముఖగండూషజలం విధీయతామ్

(దేవీమానసికపూజ)

పుం. న (వ్యవ.) పత్త్రిము.

పట్టజము. సం. వి. అ. న (పట్టువలనఁ గలిగినది) పట్టువస్త్రము,

పట్టడ. వి కుమ్మరి వడ్రంగి మొదలగు శిల్పులు పనులుచేయుచోటు; అశాలనము. (ఛి ని. శ ర)

పట్టమహిషి. సం = పట్టపుదేవి

పట్టము. వి (క పట్ట. త. పట్టం) ౧ బిరుదు. (పట్టపుపేరు అని క ర)

౨. (సం. పట్టనం) రాజ్యము

శా. రావణుఁ డనంగా మీఱి రాకాసి పెన్, బట్టం బేలి నతండు తమ్ముగవ యొప్పుట్లన్ దమం గొల్వఁగన్ . .
యయా ౨ ౬౩

చ. . నీకు సురేంద్ర పట్టమున్, నిలిపినభాతి దూఱవలె నిన్నుఁ జేఁటికి గోత్రభేదనా .
దశా ౨ ౩౧ భా ౪ ౨౯

౩ అగ్రపత్యము, అధికారము

సీ. . . శేశేల దళవాయి నాయఁకపుఁ, బట్టమున నిల్చి తాఁగకుఁగిట్టి
పాండు ౧ ౧౪౫

౪. పట్టపయ్య, పట్టపేనుఁగు, పట్టపుదంతి, పట్టపుదేవి, పట్టముగిట్టు

పట్టము. సం వి అ పుం న ౧ ఫలకము, వ్రాయుట కొనగువాని కుపయోగించు పలక (శిలాపట్టము, ఫాలపట్టము)

౨. సింహాసనము, పీఁగము, పీఁట

౩ భూమ్యాదికరగ్రహణ లేఖ్యపత్రము, గాజా రైతుల కిచ్చెడు పట్టా

౪. రాజ్యాభిషేకకాలమున నొసటఁ గట్టెడు పట్టె

౫ పట్టునూలు

౬. కౌశేయము, పట్టుబట్ట

౭. ఉత్తరీయము, చైరవాసము.

౮. తలపాగా; పాగా

౯. చెట్టుమీఁది పట్ట, ఆ పట్టవలె నుండు వస్త్రము. (నికోత్కకపట్టము)

౧౦. ఫలకము, డాలు.

౧౧ పేషణపాషాణము, సన్నికల్లు

౧౨ (వ్రణము కొనగువానికిఁ గట్టెడు) కట్టు

౧౩ పట్టణము, నగరము

౧౪ చతుష్పథము, చదుకము, నాలుత్రోవలు కలియుచోటు

౧౫ క్షేత్రము, కయ్య. (వై ని)

పట్టముగిట్టు. స క్రి (√కట్టు) రాజుగఁ జేయు; అధికారిఁగాఁ జేయు

క పరమభక్తి నక్కాహిమోకులఁ జూపి, వీరికిని వైస్యములకును విూఱ యొనయు, లవుమేఁ బట్టంబుగట్టె గంతినుతనూజు
భాగ ఉద్యో ౪ ౧౫౯

ఉ . అ, య్యంబుజనాభి యోషధుల నప్పుల విప్రుల సేలువానిఁగాఁ, బంచిన పేష్కతో నతనిఁ బట్టముగట్టిన పద్ముదగ్రతన్
హరి పూ ౩. ౭

గీ నాయకంబులు మూఁటి ముజ్జగము గెలువఁ, బాలు పెట్టి శేషించిన బాణయుగళి, మదనుఁ జేతిద్వగం భోజపదమునందు, గౌరవం బొప్పఁ బట్టంబుగట్టెఁబోలు
వైష. ౩ ౧౬౨.

(కొన్ని ప్రయోగములందు పదాంతరవ్యవధానమును కొన్నిట పదవ్యత్యయమును గాను వచ్చుచున్నది)

క. ... వాలిం దునిమి న్ప, పాగ్రణి కిష్కింధఁ బట్ట మగ్రజుఁ గట్టెన్ ...
భా. రా. సుం. ౨౬౭.

గీ. వివిధరణకోవిదుఁడు వయోవృద్ధుఁ డధిక, బలుఁడు శూరుండు గట్టుము పట్ట మతని
భార. ద్రో. ౧. ౬౨.

పట్టవస్త్రీఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పట్టుబట్ట గలవాఁడు.

౧. గ్రహింపఁజేయు, చేకొనఁజేయు.

ఉ. పాప మొంచి వీరుఁడఁ బటు కార్ముకఁ బట్టించు, దండధరుని బాధ తాఁకఁగలదె ...
సారంగ. ౨. ౧౧౧.

గీ. పులకఁ బట్టినవాఁడె రూపప్రభావ, భావ ముల్లరఁ గామినీ సంక్రమతకఁ, బులకఁ బట్టించె సజ్జనకులవిభారి, రాధికమురారి ...
ఘటికా. ౧. ౪౫.

౨. లాగించు.

క. చూడవచ్చినవారిఁ బీడించి పెనుబాముఁ బట్టింప నింకైనఁ బాలు దయ్యా . .
శు. క. ౨. ౧౨.

౩. (శంఖాదులను) ఊఁదించు, ఒత్తించు.

మ. . . మనోభవుండు కోదండం బెక్కుడించి సంగ్రామ విరామసూచకంబుగాఁ గుక్కుట కంఠ కాహళంబులు పట్టించె ...
వై. ష. ౪. ౧౯౭.

సీ. అపుడు కోఁతుల తోఁడు కిపి మొలయంగ బూరి పట్టించి తరలి . .
అచ్చ. రా. కిష్కి. ౪౧.

౪. ప్రారంభము చేయించు.

(వ్యవ.) ఉపాధ్యాయుఁడు మా పిల్లవానికి పుస్తకము పట్టించెను.

౫. అనుసరింపఁజేయు.

క. సరసీరుహ సంభవుచే, నరుపం దేవరము పడసి నమ్మిన వాఁడో, పురములు గైకొని కొండలు, తెరువులఁ బట్టంచె నన్నదిక్పాల కులన్ ...
ఉ. హరి. ౧. ౧౨౯.

(కొండలు తెరువులఁ బట్టించెను= పాఱిపోవఁ జేసెను. భావము.)

౬. పూనఁజేయు, యత్నింపఁజేయు.

క. పులరాజ రతియుఁ దమరితము, బలములు దళితంబులఁ బట్టించిరో నాఁ, గలయఁ గయిసేయ గటువిటోల నిలిచిన పురము చిత్ర కల నభినవ మై ... కు. సం. ౭. ౧౨౦.

౩. అంటించు, పూయు.

క. తల విప్పుకండ్లు మెదలంగఁ, బులుగులు పట్టించి పుష్పములు సంజనములన్, తెలు పొప్పఁ బూని కలువి, ర్మల హృదయములు తోడ నుదక మర్పించునదన్ ...
వి. పు. ౪. ౧౯౩.

(రుద్దు. అని భావము.)

౭. సత్తముచేయు, తగులొకనఁజేయు.

దండకము. . ఈ మానవాధీశుపై మానసం బేల పట్టించెదే ముద్దుపట్టీ . .
భోగినీ దండకము.

ప్రయోగ విశేషములు:

(i) రేపు సీతాకోకము పట్టించెదను.

(ii) వాఁడు దానిపని పట్టించక మానఁడు.

(iii) ఆపిల్లలు నన్ను ఎగతాళి పట్టించిరి.

**పట్టించుకొను.** స. క్రి. (√పట్టించు.) మోయించుకొను.

వ. ... నివ్వెఱపడ్డు గుసుకు బాద లాదిగాఁ గలుగు వస్త్రధాన్యంబులు ముడియలం గావళ్లం బెట్టించి పట్టించుకొని ...
పి. శకుం. ౩. ౧౨.

వ. ... చిలువ రాచకొడుకులచేత కొకరత్న సింహాసనముఁ బట్టించుకొని భూదేవి ...
ఉ. రా. ౭. ౯౪.

**పట్టింపు = పట్టుట.** వి. (√పట్టు[1]). ౧. విద్యార్థులకు నూతన పఠనము ప్రారంభింపఁ జేయుట. (శ. ర.)

౨. పట్టుదల, పంతము.

సీ. తెలి పట్టింపు పెల్లవ పూని బాస, పెక్కొకొందు రైనఁ గాని యుండైనఁ గాక, దలప్పుతోఁ

సీ. పాళిని శేషంబు భరించునుగమి ౪౦ నప్పు
అప్పుపట్టెలియును . . అం. భా. ౨. ౧౪౧.

క. కడకాను వెరుగుబలికి బ, ట్టైదు నవనీతం
బు గాంచుకీవని .. దశా. ౪. ౧౫౫.

చ. ... ముద్దుగారు వ, లూదులఁ జెలికమ్మ చేఁ
దలుకకుక్కను చెక్కులుపట్టెచేసికుబ్బులఁ
గను చూపుమేరను గుభాలనుతావులు దీనికే
తగున్ ... కువల. ౩. ౩౨.

గీ. బ్రతికినవాన్నెల్ల నన్నంబుపట్టెఁడిడక . .
కుచేల. ౧. ౫౭.

పట్టిలోధ్రము. సం. వి. అ. పుం. ఎఱ్ఱబొద్దుగకి. (ఇట్లే, పట్టిలోధ్రకము, పట్టికాలోధ్రము, పట్టికాఖ్యము.)

పట్టిస. వి. (సం. పట్టిస.) ఆయుధ విశేషము. (చూ. ముప్పంకపట్టిస.)

పట్టి(ట్టె)సము. వి. ౧. మల్లబంధ విశేషము.

గీ. కళవరావకుఁ దొడ్డి దొక్కరముపాత్తి,
చదికిపై జెడగొని పట్టిసమునఁ దొడరి ...
ఉ. హరి. ౩. ౭౫.

(పట్టెసము, అపముద్రి.)

సీ. చదికి పట్టిసమును సన్న పువిన్నాణములు దొర
కొన్నను మట్టెఁగొనఁడు ...
భార. విరా. ౨. ౧౫.

౨. ఆయుధవిశేషము.

సీ. ... బలువిండ్లునమ్ములు బల్లెములును.

గీ. బందిపోటులు నీఁటెలఁ బట్టెసములు,బంత్ర
కోలలుపాదిగా బహువిధముల, సాధనమ్ములు
ధరియించి తలరసకులు... హరిశ్చ. ౨. ౭.

పట్టిస(శ)ము. సం. వి. అ. పుం. ఆయుధ విశేషము. (వై. వి.)

సీ. అరికి పట్టిస మునుసన్నపు విన్నాణములు
దొరకొన్నను మట్టఁగొనఁడు ...
భార. విరా, ౨, ౧౫.

౨. ఆయుధ విశేషము.

గీ. బందిపోటులు నీఁటెలు బట్టెసములు, బంత్ర
కోలలు పాదిగా బహువిధముల, సాధన
మ్ములు ధరియించి ... హరిశ్చ. ౨. ౭.

(పట్టెసము. అపముద్రి.)

పట్టీ. వి. ౧. వస్త్రముల నామములను వరుసగా వ్రాసిన కాగితము లోనగునది. (శ. ర.), మనుష్యులు వస్తువులు మొదలగువాని పేరులను వరుసగా వ్రాసిన కాగితము.

౨. కమలపాకుల చుట్ట.

సీ. కప్పురగంధంబు కైరవ కప్పట్టీలు తట్టుపు
నుంగును బొట్టుపూవులు ... ప్రబంధ. ౫౪.

౩. పొడవుగా గీచినగీత.

వ. .. పె క్కగు చెక్కుల జవ్వాది మేలు
మేలు పట్టీలును ... ప్రబంధ. ౪౮.

౪. పురుషులకు వేసెడి మందుగుడ్డ ముక్క.

(వ్యవ) వైద్యుఁడు వాని వ్రణమునకైని పట్టీ వేసినాఁడు.

౫. ఇనుము మొదలగువాని బద్దె, రేకు

(ఈ యర్థమందు పట్టీ = పట్టా. అని. శ. ర.)

౬. వ్రాతణపట్టీ.

పట్టు[1] = బట్టుకొను. స. క్రి. (క. పట్టు. త. పట్టు. మ. పట్టుక.) ౧. గ్రహించు, చేకొను, కైకొను.

సీ. తపసిపై యుండి తగుకోరి ధనువుపట్టు ...
పార. ౪. ౫౩.

ఉ. అంతకు భీమసేనుఁడు రయంబెసఁగన్ దగ
పొద్దు పట్టె . .
భార. ద్రో. ౧. ౧౮౧. సారంగ. ౨ ౨౦౪.

౨. ఆక్రమించు, స్వాధీనము చేసికొను.

అ. బయిలి పొనలుగోట పట్టినపెల్లున, పిటి
ప్రమదము నొక్కమాట యూరలఁ ...
విర్య. ౪. ౪౭.

క. ... మనము పట్టం, జాలక పరపురుషభోగ
సంగతి గోరక . . శుక. ౨. ౫౫౩.

౧౦. గుఱ్ఱము మొ. వానిని నడపు, తోలు.

సీ. తాను రక్కసిరయ్యెఁ దగ దన దాత్మ
జాతునకుఁ దోషకరుఁ డింద మాయలఁ బట్టు..
వసు. ౧. ౬౫.

సీ. సంగరంబున ధనంజయరథస్థాయి యై ధవ
ళాశ్వములఁ బట్టు దంటతనము
శశా. ౧. ౬౪. విప్ర. ౨. ౯.

౧౧. (ప్రతిజ్ఞాదులు) పూను.

ఆ. పార్థుఁ డిట్లు ప్రతినపట్టిన నదినిర్వ, హించు
పనికిఁ గృష్ణుఁ డివ్విధమునఁ, బూని .
భార. ద్రో. ౩ ౩.

మ. ... ఏవేళ నే పదార్థంబు వేఁడిన నే దన
కిచ్చుట వ్రతంబు గాఁ బట్టి .
హర ౧. ౧౪.

శా. ... నా, తోడఁ జూరము పట్టి నిట్టిజనక
ద్రోహిఁ జంపిం గంటిరే .
భాగ. ౪. ౧౭౫.

౧౨. ప్రారంభించు, మొదలుపెట్టు.

ఉ. పట్టిన కార్యముల్ విడువఁ బాడిరొ పాడి
రయుజ్జుంగ నోటు. . చంద్రా. ౩. ౬౨.

సీ. దుడుకు సేయఁగ రాదు దూరంబుచూడఁగాఁ
బట్టినపని కడముట్ట వలయు . .
రామలిం. ౪౭.

౧౩. పోలు, ఆవేశించు.

ఆ. బ్రహ్మహత్య దన్నుఁ బట్టిన నమరేంద్రుఁ,
డూని కడకు నేఁగి ..
భార. శాం. ౫. ౪౩౧.

మ. వినుఁడీ కాదు ప్రతిజ్ఞ చెల్పులు జగద్వి
ఖ్యాత చారిత్రుఁ డా నవి నేఁబట్టిన నెగ్గిరోని
తమిత రంధ్రం బబ్బెనంచు ... .
నైష. ౪. ౧౧౭.

క. ఇట్టట్టు చూచి యూఁచలిఁ, బట్టినతల రాచ
గబ్బిబలు భూతంబుల్, నెట్టుకొని పిడఁ
జేయఁగ .. సారంగ. ౨. ౧౩౧.

౧౪. అనుసరించు, అనుసరించిపోవు.

క. మనదేశమునకుఁ బోదము, మన ముల్లన తెరువు
పట్టి . భార. విరా. ౫. ౨౨౦.

ఉ. పక్కున నేసరం జన దుపాయములన్ దగు
నిచ్ఛకంబులన్, జిక్కఁగఁ జేసి దాని సతి
చిత్తముఁ బట్టి సుఖింపఁగాఁ దగున్
మనుచ. ౩. ౬౯.

గీ. గోదావరీ సింధుతటము పట్టి, దండ
కారణ్య వీథిమధ్యంబు దరిసి ...
కాశీ. ౧. ౭౫.

౧౫. చేరు, కూడు

క. నినుఁ బట్ట పాండుపుత్త్రులఁ, దనచేసల్లురఁ
దొలంగ ధరణీశ్వర . .
భార. కల్య. ౧. ౪౯.

చ. గొనకొన చేరఁడయ్యె నినుఁ గూడ మరా
ధనుఁ బట్ట యట్టి క, ర్ణునకయి నీకు సేటికి
మనోవ్యథఁ బొందఁగ నిట్లు పుత్త్రకా .
భార. శాం. ౧. ౩౯.

౧౬. పశువుల వృషణములుకొట్టు, వట్టలు కొట్టి
చేయు.

సీ. పాలఁతి నపుంసకుల్ పూర్వభవంబున నెద్దుఁ
బట్టినవారు భార. అను. ౫. ౧౦౫.

(మూ. పశు పుంస్త్వోప ఘాతేన జీవంతిచ రమం
తిచ . . సం. భార. అను. ౨౨౧. ౩౧.)*

౧౭. రమించు, రమింప నుద్యమించు.

క. మనుజాంగనలం బట్టుచు, దనుజాలకుం జిల్లఁ
గాక దనుజాంగనలన్, మనుజాలు పట్టుచు
కుచు తొరఁ, గొనిరె ...
ఉ. హరి. ౫. ౨౦౯.

(వ్యవ) ధర్మము చెడిపోయె ననుమాట చెవిని బడినవెంటనే సజ్జనుని హృదయము తల్లడిల్లును .

నేను నయనికంటెఁ బడరాదు, నరుఁడు నాకంటెఁ బడరా దని పాము అనుకొనును

" వానికిని నాకును పడదు "

" మాలో నొకరికొకరికిఁ బడుట లేదు "

" పైత్యతత్వములో నువ్వుఁబిండి పడదు "

" పడక " ఇది పడు ధాతువునకు తుమున్నంతము కాని " చాలక " మొ. వానివలె అవ్యయమై " మిక్కిలి " యను నర్థము నిచ్చు పడఁజడిచెను, పడఁదిసెను మొ (దీని కామ్రేడితముగఁ " బాఁబడక ")

సీ పడఁబడ నెత్తెఁ బాల్పడియుక్కు నాసనాభ్యాస నైపుణశక్తి పట్టుపడఁగ

పాండు. ౫ ౨౩౮

ఇది స్వార్థమున సహాయక్రియగా నుపయోగింపఁబడును

ఉదా. చాఁగిలఁబడు, కూలఁబడు

పడుపాటులుపడు = నమస్కరించు

రగడ. మహీతస్థలమున మసలక పాదలెడు పద్మాక్షునకును బడుపాటులుపడి .

హంస ౪ ౨౧౩

జః పక్క, పడఁదన్ను, పడఁగిట్టు, పడఁగ్రొక్కు, పడఁబాఱు, పడఁబెట్టు, పడఁబొడుచు, పడగొట్టు, పడనాడు, పడవేయు, మొ

పడుకటిల్లు = పడకిల్లు. (√పడుక శ ర)

పడుకి(కయి)ల్లు = పడకిల్లు. వి (పడుక + ఇల్లు) శయన గృహము.

సీ. దడదడమన గుండె తాళిబొట్టదర గుబ్బలి పట్టి పడుకయి ల్లెదలదయ్యె .

కువల. ౨. ౧౧౫

ఉ అంతటఁ దల్లవాతిన లతాంగి నమం బడుకింటి మిద్దెపై, దంతపు మేలుమంచము సుధాకర కాంతి గృహాంతరంబులో, నెంతయుఁ జింత లేక వసియింపఁగఁ జేసెను సాహసంబునన్

శుక ౪. ౨౮

గీ సంద్రెగ్రుడ్లను జూపుచు గునిసి గునిసి, బయలు నవ్వుమఁ బడుకిల్లు వాచికొనుచు

దశకు. ౬ ౧౯౪.

పడుకు. వి బాయి, శిల

క కడు నలిగి యూరిలోపలి, పడుచుల గావించి యీ యబద్ధపుఁ గ్రోతిక, బడుకుల వైచుచు నిప్పుడ, వెడల నడచి రెండు నిలువ విడువకుఁ డిచటన్ . భోజరా ౫ ౨౫౨.

క కడునరుదుగఁ దెరవున నొక, పడుకానా డెంపు గాచపాపని యడుగుం, గడ యొక్కించుక సోఁకిన, నడరెడు తలిరాకుఁ బోడి రాయై తగి నిలిచెన్ . .

అచ్చ రా బాల ౧౪౨ ఉ రా. ౧. ౧౫౦

పడుగాయ. వి (పడు + కాయ) రాలినకాయ (శ ర)

పడుగింజ. వి (పడు + గింజ) చల్లకయే రాలిన విత్తు

సీ ఎచట నెవ్వరు గోరి నచటనే వర్షించుఁ బడుగింజలనె పంటఁ బండియుండ ..

దశా ౪ ౧౨౧

పడుగు(వు). వి వస్త్రమునేత యందలి నిగువు నూలు

వ ... వెన్నెల క్రొన్నురువుల బోరనన్నగు నర పడుగు జిలుగు కంచుకంబున ...

మనుచ ౫. ౪౧.

ఆ పడుగు వేయువేళ పటము లల్లెడువేళఁ, గూడు నిసెడువేళఁ గూర్కువేళ, మగని

గీ. ఆటలన్నియుఁ జోడితోయ్యాలలఁ గూడి
పడుచుఁదనమున వేడుకపడుచుసాడు, పెద్ద
రాండ్రపువల్లారుముద్దుగాను. దశా. ౯ ౧౧

గీ పడుచుఁదనమునఁ బైఁ బ్రక్కఁ బడుచునున్న,
పడుచునొక్కతె వేడుక పడుచుగాంచి ...
దశా. ౖ. ౖ.

౨. యౌవనము

చ. పడుచుఁదనాన వచ్చి నినుఁ బట్టి పెనంగ
నటంచు శేవి యా, గడపులు గొన్ని యంగ
ముఁగ గానఁబడకా వవరించి ...
శారంగ. 3 ౪౭

పడుచుఁదనములపెద్ద = మన్మథుఁడు

వ. ... శేమపరితాపాతిశయం బవలోకించి కించి
న్మధ్యలం వేసట పడుచు నప్పుడుచుఁదనం
బులపెద్ద నుద్దేశించి యి ట్లనిరి ..
కవిరా 3. ౧౧౬.

**పడుచేఁబని.** వి (పడుచు+పని) చిన్నతన
ముచేఁ గాని పడుచుఁదనముచేఁ గాని చేసెడి
యవివేకపుఁబని.

గీ కృష్ణ నీపుణ్యమంతయుఁ గ్రిడి కొసఁగి, విదప
నిట్లు మధన్వుఁ జంపింపఁదగునె, పడుచుఁ
బని చేసితివి శేఁగుబండ్లకొలకు, ముత్తియం
బులు వెలపోయుములంచ గలఁడె ...
కై. భా. ౫ ౫౯

ఉ. ... తపోధను ... నీతిఁ దొలంగి సభాంత
రంబునన్, జోరుఁ డటంచుఁ బల్కి
పడుచుంబని సేయుట నీకు ధర్మమే . .
విప్ర. ౫ ౩౬.

**పడుచేది.** విణ. (పడుచు+అది) యౌవనము
గలది. (శ. ర.)

**పడుచేరాసి.** వి. (పడుచు+రాసి) కన్యా
రాశి. (శ. ర.)

**పడుచేలతిండి.** విణ. (√పడుచే) శిశుఘాతిని.

గీ. కటకటా చిన్నిపెత్తురుగండు రావ, పట్టి
చక్కనిపాపనిఁ బట్టి చంప, పోటిమృత్యు
స్వరూప రైరె యెచట నుండి, వచ్చె నీపడు
చులతిండి యిచ్చటికిని హరిశ్చ. ౫. ౧౩౦

**పడుచేవాఁడు = పడుచేఁడు.** విణ. (√పడు
చే) యౌవనముగలవాఁడు.

సీ పడుచువాఁడవు విన్నుఁ బొడగన్న నామది
గడితంపుటక్కటికంబు వొడమె ...
అచ్చ. రా యు. ౧౨౩.

**పడుతెంచే = పడు.** అ. క్రి. (పడు+తెంచు2
స్వార్థమున)

సీ ... విప్రుతికే కాంబరుం డయి సౌంభకంబు
వలనఁ, బడుతెంచు వసుదేవుఁ బాపనిశాచర
బలపీడ్యమాను దవ్వులన కాంచి ..
భార ఆర. ౧ ౧౯౧.

**పడుదల[1].** వి. ౧ భుజావలంబికృత్తి; డాలు.

గీ ... భుజావలంబి, కృత్తి పడుదల డా బనఁ
గేరు నభవ ఆం. భా ౨.౨౦౪.

సీ పడుదలలోన డాబాకత్తి వదలుపాపోసులు
గోరంటఁ బొలుచుగోళ్లు శుక. ౨. ౪.౨౬.

సీ ... జిగిపట్టు నడిగట్టు పడుదల పట్టంబు
సేజాయు బాగుదేర దశా. ౧౦. ౧౧౩.

**పడుదల[2].** వి, పక్షివిశేషము, డాలు (శ. ర.)

**పడుపు.** వి. (√పడుచే) వ్యభిచారము; వ్యభి
చారముచేఁ జేయుసంపాదనము

క ఆకలి యుడుగనికడుపును, పేఁకటి యుగు
లంజెపడుపు విడువనిబ్రతుకుం, గ్రొంకొన్న
నూతియుదకము, మేఁకలపాడియును రోఁత
మేదినిపుమతీ . సుమ. శ. ౧౦.

పీ. ప్రాయ మింకినవాలుపాలిండ్ల వెలయాండ్రు
పడుపు ఫుట్టక మూలపడి కృశింప ...
హం. పంచ. ౪. ౨౪౦.

పడుపుఁగూడు. వి. (√పడుచే) వ్యభిచారవు వృత్తిచేఁ గల్గిన ద్రవ్యము.

ఉ. . కావ్యకన్యకల, గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్ హాలికు లైన నేమి . కేయూర, ౧. ౧౩

ఉ. గట్టు దొలంగుచుం బడుపుఁగూటికి నోఁచిన వారిజాతినిం, బట్టి . విప్ర. ౩. ౧౩.

గీ ఆనఘ వేశ్యావిడంబవర్తనము లెన్న, నిఘుక పాఁతెఱ యీలోలి యేల త్రవ్వ, నిప్పడుపుఁ గూటిపై వసహ్యాత జనించి, నామనసు లోసెనట్టి చందంబు వినుము ...

వైజ ౨ ౧౪

(విశ) పడుపు కూటివారి వంటివాడు, దుష్టుఁడు

సీ రొంగిలికాయ బడుపుఁగూ డెనగొట్టు పాడెగట్టు హంస ౫ ౧౧౩

పడుపుఁగొమ్మ = పడుపుఁగోమలి. వి (పడుపు+కొమ్మ) వారాంగన

క త్రొమ్మించుగిన్నె పడుపుం, గొమ్మగ నిప్పించి మానిభుంజాగుఁ ౭ బ్బక

విప్ర ౪ ౭౦

వేలుపుఁ బడుపుఁగొమ్మ = అప్సరస

గీ తపసి డెందంపుటీలు చేరవితే ఘటించు, కలితపుణ్యాతా మంత్రము ల్గాఁగఁ జేరి, జరుపుమనిఁ గ్రమ్మ వేలుపుఁ బడుపుఁగొమ్మ. చంద్రా ౩ ౯౯

పడుపుఁగోమలి = పడుపుఁగొమ్మ. వి (√పడుచే) వ్యభిచారవృత్తిచే జీవించువాఁడు డు, వేశ్య.

క. తామరలు ముడిఁగె జక్కవ, చామలకులికలు పర్వెఁ జక్కఁగఁ బడుపుం, గోమలులకు బొజఁగులకును, నేఁడుం బోఁడగూడె నపుడు చెప్పఁగ నరుదై .. నీలా. ౩. ౪

పడుపుది. వి (పడుపు+అది) వేశ్య, భోగముది.

సీ లంజియ లంజ తెల్లాటకత్తె పడుపుది వెలయాలోప్పగముది యన వేశ్య

ఆం భా. ౨ ౧౦౦.

పడువ. (విశ.) మిక్కిలి పల్లమైనది (నేల)

(శ. ర)

పడువరి. వి. (పడు+వరి) కోఁత కోయునప్పుడు గింజలుగాలి మొలచిన వరిపైరు

(శ ర. త్రా)

పడువాఁడు. (విశ) (√పడు) పతయాళువు, పతనశీలుఁడు

సీ పతయాళు వగుఁ బడువాఁ డనంగ

ఆం భా ౩ ౯.

పడుసర. వి పట్టనము

క అడిగినవారిం గ్రమ్మలు, నడుగం జనుఁ జనిన కడకు నతేఁ డార్తుం డై, గుడి గుండ మనః పల్లియ, పడుసగ నా కరయఁ జెలిచి పలు చిన శిష్యుక . వేం పంచ ౧. ౨౪౦

పడ్డ. వి ౧ నాలుగేండ్లవయస్సు గిలయావు

సీ చనుఁ జతుర్హాయనసంజ్ఞ పడ్డ యనంగ ...

ఆం భా ౨ ౨౬౩.

౨. ఆవు (తొలిచూలిఆవు లేక గేద అని శ ర)

ద్వి పసదనంబుగ నూఱుపడ్డలు నిచ్చి, పసిఁడి టంకంబులఁ బాటించి యిచ్చె .

ద్వి. భాగ. ౧౦ ౫౯౦. (చి. ని)

ఆ ఫలము గాని గొడ్డుపడ్డకు పిండదాహ, పరిరసంబు పచ్చిపాలతోడఁ, భట్ట నదియుఁ బొల్లుఁ బెద్ద పెండలగునయ్యె. పెట్ట నిల్లుఁ జాలు పెట్టిపనికి ...

(చి. శి. చి ని.)

౩. త్రోవ్ర దూడ.

సీ ... గ్రీవు పడ్డయు ద్వాద శేగ తెయ్య,
యన పళ్ళనామంబు లలరును ...

పాం. ని తిర్య 83

పడ్డీశము. సం వి. అ. పుం. ఏనుగు వెనుకకాలిన గట్టికంభవు (వై ని.) = పట్టి (ట్టీ) శ (స) ము

పణఁకు = పడఁకు

(చఱియ, ప్రపాతము)

సీ ... చఱి చఱియ పడఁకు పణఁ కన, కొకడు
ప్రపాతంబు .. ఆం. భా. ౨. 30.

(పెద్దఱాయి, చాఁపఱాయి.)

సీ పటికంపుఁ బణఁకులపజ్జ గొజ్జఁగి నీటిరేటి
క్రేవలఁ జలి యినుకపెట్టు వసు ౨ ౨౧

పణఁత = పడఁత. వి హనువు, చెక్కిలి మీఁది భాగము.

సీ. కోరచూపుల రొబ్బిచేరు ప్రద్దులవాఁడు బైసి
మాలిన ప్రాని పణఁతవాఁడు .

వరాహ ౨ ౪౫.

పణఁతి = పడఁతి.

గీ. పణఁతి యీలతహాన పుష్పిణి యటన్నఁ,
గేల నిపు డంటఁ దగునె ..

ఇందు 3 3౭.

ద్వి పణఁతిని గొనిపోయి పంక్తికంధరుఁడు,
రణమునఁ జావఁడే రఘురాముచేత ...

ద్వి శ పా. ౨ ౫౭. పా ౧౪ పం.

గీ. శంబరారాతి విజయశాసన సువర్ణ పట్టికయుఁ
బోలె నొప్పు నిప్పణఁతి నీవు ...

శైవ. 3. ౧౬౫

పణగ్రంథి. సం. వి. ఇ. పుం హట్టము, అంగడి వీథి; సంత.

పణత = పడత. వి. సాఁగేటి గొరగ. (శ. ర.)

పణనము. సం. వి. అ. న. ౧ వ్యవహారము (అమ్ముట, కొనుట.) ౨. పందెము ఒడ్డుట.

పణఫరము. సం. వి. అవ. (జ్యోతి) కేంద్రమునకు తర్వాతిరాశి, లగ్నమునకు రెండవదియు ఐదవదియు ఎనిమిదవదియు పదునొకండవదియు నగు స్థానము.

పణబంధము. సం. వి అ. పుం (నీ విది చేసిన మొదల నేను నీ కిది యిచ్చెద నని) సమయము చేసికొనుట, ఏర్పాటు చేసికొనుట, సంధి

పణము. వి ముప్పదిరెండు విన్నాణములలో నొకటి, మల్ల విద్యావిశేషము

సీ. వింటాళము పణమ్ము పెట్లాగు పాఅమ్ము
డొక్కర ముత్తర డొక్కరమ్ము ...

ఆం భా. ౨ ౨౦౯. ప్రబంధ ౪౭

పణము. సం. వి. అ. పుం ౧ జూదము, పందెమొడ్డియాడుట ౨. పందెము, పందెపు సొమ్ము. 3. స్తుతి, పొగడిక. ౪. ఒడంబడిక; నియమము, ఏర్పాటు ౫ భృతి, కూలి. ౬ ధనము, సొమ్ము. ౭. మూల్యము, వెల ౮. కర్ష మెత్తు రాగినాణెము. ౯ కార్షాపణము, కర్ష మెత్తు వెండినాణెము. ౧౦ ఎనుబది వరాటకముల (గవ్వల) వెలగల నాణెము. ౧౧ వ్యవహారము ౧౨. అంగడి, దుకాణము ౧3 గృహము ౧౪. అమ్మఁదగినవస్తువుల నమ్మువాని విడికెడుకట్ట

పణవము. సం. వి. అ పుం. ౧ చర్మవాద్య విశేషము ౨ గజస్కంధము (వై ని)

పణసము. సం. వి అ పుం. అమ్మఁదగిన సరకు, క్రేయవస్తువు.

పణాంగన. సం వి. అ. స్త్రీ. తోఁకలఁది, వేశ్య

పణాయ. సం. వి. అ. స్త్రీ. ౧. క్రయ విక్రయ వ్యవహారము, బేహారము. ౨. స్తుతి. 3. జూదము.

పణాయితము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. స్తుతము, పొగడఁబడినది ౨. క్రీతము, కొనఁబడినది. 3. విక్రీతము, అమ్మఁబడినది.

పణి. సం విణ (క. ని. క.) ౧. క్రయ విక్రయాది వ్యవహారము గలవాఁడు, బేహారి. ౨. స్తుతిగలవాఁడు (ఇ) బేహారి. (శ ని.) (వి క పుం) ఒకానొక ఋషి
(వ్యాకరణకర్త యగుపాణిని వీని వంశస్థుఁడు)
(ఇ. స్త్రీ) విపణి, అంగడివీధి పుం ౧ స్తుతి. ౨. క్రయవిక్రయ వ్యవహారము (శ. ని.)

పణి = పడి. (చూ. పణిహారి.)

పణికము. సం విణ (అ. ఆ అ) పణప్రమాణము కలది. వి. అ పుం కోమటియిల్లు. (వై. ని)

పణిత. సం. విణ. (ఋ త్రి. ఋ) ౧. బేహారి, క్రయవిక్రయాది వ్యవహారము చేయువాఁడు ౨ స్తుతించువాఁడు.

పణితము. సం. విణ (అ. ఆ అ.) ౧. వ్యవహృతము (అమ్మఁబడినది, కొనఁబడినది.) ౨. పందె మిడఁబడినది, పందెముగాఁ జేయఁబడినది 3. స్తుతింపఁబడినది (వి అ న) ౧ పందెము ౨. వ్యవహారము 3. స్తుతి.

పణితవ్యము. సం విణ (అ ఆ. అ.) ౧ వ్యవహరింపఁదగినది (అమ్మఁదగినది, కొనఁదగినది) ౨. పందె మిడఁదగినది 3 స్తుతింపఁ దగినది.

పణిదియ = పడిదియ. (శ ర)

పణిహారి = పడిహారి. (ద్వారపాలకుఁడు.)

చ అని యట పోవఁ బోవఁ బణిహారి యొకం డరుదెంచి విక్రమా, ర్కునిఁ బొడగాంచి మిమ్ముఁ దోడుకొంచు వెసం జనుదేర దైత్యుఁడొ, క్కనిఁ గిటిమూర్తిఁ గైకొని తగం జను మన్నను వచ్చి ... విక్ర. ౨ ౧౪౦.
(సేవకుఁడు)

వ. ఏనును దక్షిణద్వారంబు పణిహారులవలన మున్న యెఱింగినవాఁడ నగుటం జేసి గంచుకంబును శిరోవేష్టంబును ధరియించి విదిత వేషుండనై పోవునపుడు
భార. ఉద్యో. ౨ ౧౨౧.

పణుఁడు. సం విణ. (అ ఆ. అ.) ౧ క్రయ విక్రయాదులు చేయువాఁడు ౨. స్తుతించువాఁడు (వి. అ. పుం) కొండికుఁడు, కల్లమ్ము వాఁడు.

పణ్ణ(ణ్ణే)రము = పణ్యారము. వి. భక్ష్యము
ఉ అద్దములోనఁ దోఁచు ముడు పందనిప్రాని ఫలంబు కోపపుం, గ్రద్దరి చిల్వచేఁ బడిన గంధప్రదీపవ మహావిషంబులో, నద్దిన పణ్ణెరంబు మగనా లది కొంచెమునకా లభించునే
అహల్యా 3 ౪3

పణ్యా. సం వి ఆ స్త్రీ జ్యోతిష్మతి; మాలేరు. గీ.

పణ్యాపతి. సం వి ఇ. పుం. గొప్ప వర్తకుఁడు.

పణ్యభూమి. సం. వి ఇ. స్త్రీ. సరకులకొట్టు.

పణ్యము. సం విణ. (అ. ఆ అ.) వ్యవహార్యము, వ్యవహరింపఁ దగినది (అమ్మఁదగినది, కొనఁదగినది. వ్యవహార్య భిన్నార్థమున పాణ్యమని రూపము చూ. పాణ్యము.) (వి. అ. పుం.) ౧. అమ్మఁదగిన సరకు ౨. బేహారము, వ్యవహారము. 3. మూల్యము, వెల

పణ్యవీథి. సం వి ఈ స్త్రీ అంగడివీథి బజారు

పణ్యశాల. సం. వి ఆ. స్త్రీ. కొట్టు, దుకాణము

పణ్యాంగన. సం. వి. ఆ. స్త్రీ. లంజెలది, వేశ్య, వెలయాలు.

పణ్యాజిరము. సం. వి. అ. న. అంగడివీథి, పేట్టము, బజారు.

**పణ్యాజీవకము.** సం. వి అ న సంత; బజారు.

**పణ్యాజీవుఁడు.** సం. వి అ పుం. బేహారి, వర్తకుఁడు. (ఇట్లే పణ్యాజీవకుఁడు)

**పణ్యారము** = పండేరము, పణ్ణారము. వి (సం పణ్యాహారః, ప్రా పణ్ణార క పణ్ణారవు. త పణియారం) భక్ష్యవిశేషము. (పానఁబప్పు అని. శ. ర.)

మ. శనివారోత్సవ మాచరించె ముని శిష్యవ్రాతముం దానఁ గ, మ్మని పణ్యారము తోడ బూరెగమితో మండెంగ లిండంబుతో
భీమ ౨ ౬౪

మ బాలయుం గాఢ్పు లుదబ్మ హేలయవ దంభో జాక్షవక్షస్థల, స్యలఘు ప్రసజ్మ కరంద బిందువులఁ బణ్యారంపుఁ బుణ్యాంపుఁగం, పులఁ దాపత్రయి మీఁటి
ఆము ౧. ౪౩

**పతంగన.** సం వి అ స్త్రీ పెద్దకంది క్రి (వై. ని)

**పతంగమము.** సం వి అ పుం ఎగురుచుఁ బోవునది. పక్షి.

**పతంగము.** సం. వి అ పుం (ఎగురుచుఁ బోవునది.) ౧. పక్షి ౨. శలభము, మిడుత. 3 శాలిభేదము, ఒకదినుసు వడ్లు ౪. మధూకము, ఇప్ప ౫ బాణము. ౬. చిల్లి న ౧. పాదరసము. ౨. చందనవిశేషము. 3 గుజ్జము, అశ్వము. (శే. ని)

**పతంగి.** వి. వృక్షవిశేషము.

**పతంగిక.** సం. వి. అ. స్త్రీ ౧ తేనె యీఁగ, పుత్తిక. ౨. చిన్న యాఁడుపిట్ట

**పతంగుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**పతంచిక.** సం. వి. అ. స్త్రీ. వారి, వింటియల్లె త్రాడు

**పతంజలి.** సం వి ఇ పుం (అందఱకును నమస్కరింపఁ దగినవాఁ డగుటచే పడుచున్న అంజలులు కలవాఁడు సంధ్యావందన సమయమున ఒక బ్రాహ్మణుని యంజలినుండి సర్పరూపమునఁ బడిన శేషాహియొక్క యవతార మని గాథ కలదు దీని ననుసరించి అంజలి నుండి పడిన వాఁడు అనియు వ్యుత్పత్తి) యోగసూత్ర కర్తయును పాణిని సూత్రమహా భాష్యకారుఁడును అగు ఒకానొక ఋషి, ఒకానొక శేషావతారము.

శ్లో. ఆ బాహుపురుషాకారం శంఖ చక్రాసి ధారిణం, సహస్రశిరసం శ్వేతం పతంజలి ముపాస్మహే.

**పతకము[1].** వి. (సం పదకః ప్రా పతక క పదక త. పతక్కం) కంఠాభరణ విశేషము, హారమునడుమ నుండెడు రత్నాదులు పొదిగిన బిళ్ల.

సీ ఎదల నున్నబిగోళ్లు, బొదలినపతకము త్రెళ్లిముత్తియంపుఁ జేరులు పెలంగ
అచ్చ. రా. బాల ౯౪

సీ వినుఁగెంపుఁ బతకంబు గనిపింప సురదీర్ఘికాచేల రైయె మించె గగనలక్ష్మి
ఉ రా. ౧. ౧౩౬.

**పతకము[2].** వి (సం పథకః) మార్గము; పన్నాగము, పన్నిక

(వ్యవ) బుద్ధిమంతుఁడు చేసినపతకము నెవ్వరును ద్రిప్పలేరు.

**పతగము.** సం వి అ పుం పక్షి

**పతత్.** సం. (శత్ర) పడుచున్నది.

**పతత్తు.** సం. వి. త్. పుం (ఎగుఱుచున్నది) పక్షి.

**పతత్త్రిము.** సం. వి. అ. న.. పడుచున్నదానిని రక్షించునది. ౧. పత్త్రిము, ఱెక్క; ఈఁక. ౨. వాహనము. 3. ఆకాశము. (శే. ని.)

**పతత్త్రి.** సం. విణ. (న. ఈ. న.) ఱెక్కలు గలది (వి. న. పుం.) ౧. పక్షి ౨. బాణము ౩. గుఱ్ఱము (ఇ. పుం. పక్షి)

**పతత్త్రికేతనుఁడు.** సం. వి. అ. పుం. పక్కిపడగకాఁడు, విష్ణువు

**పతద్గ్రహము.** సం. వి. అ. పుం. ౧. తమ్మపడిగము. ౨. మూలబలము, సేనయొక్క నిలువ దండు (విల్యజ్ఞ)

**పతద్గ్రాహము.** సం. వి. అ. పుం. పతద్గ్రహము, తమ్మపడిగము (వాచ)

**పతద్భీరువు.** సం. వి. ఉ. పుం. పక్షులకు భయకారణమైనది డేగ

**పతనధర్మి.** సం. విణ. (న. ఈ. న.) పడుధర్మము కలది - నశ్వరము, నశించునది (దెవాది)

**పతనము.** సం. వి. అ. న. ౧. పడుట, పాటు; వ్రాలుట ౨. అధోగతిని బడుట; క్షయము, నాశము (వ్యతి. ఉదయము, ఉచ్ఛ్రియము) ౩. (స్తనాదులు వీఁగసడలి) వ్రేలుట, వ్రేలాడుట ౪. గర్భపాతము, గర్భము దిగఁబడుట ౫. స్వధర్మాద్భ్రంశము, పతితత్వము ౬. ఆశ, పలాశము (వై ని)

**పతనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) పతననిమిత్తమైనది, పడఁద్రోయు సాధనమైనది, భ్రంశము కలిగించునది

శ్లో. నీచాభిగమనం గర్భపాతనం భర్తృహింసనమ్, విశేషపతనీయాని స్త్రీణామ్ ...
యాజ్ఞ. 3 ౨౯౮

వి. అ. న. పాతము.

**పతము.** సం. వి. అ. పుం. ౧. పక్షి ౨. మిడుత.

**పతముఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు

**పతయాళువు.** సం. విణ. (ఉ) పడెడుస్వభావము కలవాఁడు

**పతయిష్ణువు.** సం. = పతయాళువు.

**పతాక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. జెండా, ధ్వజము ౨. సౌభాగ్యము, మంచియదృష్టము. ౩. చిహ్నము, లాంఛనము ౪. నాటకాంగభేదము (నాటకమున ప్రధానకథకు అంగమగుకథ, ప్రాసంగిక కథ రామాయణమున సుగ్రీవాది చరిత్రము)

**పతాకము.** సం. వి. అ. పుం. అభినయ హస్త విశేషము (బొటనవ్రేలిని వంచి చూపుడు వ్రేలి మొదటఁ గూర్చి వ్రేళ్లన్ని చక్కఁగాఁ జాఁచి పట్టునది)

**పతాకాంశుకము.** సం. వి. అ. న. జెండాగుడ్డ

**పతాకాస్థానకము.** సం. వి. అ. న. (నాటక) నాటకాంగభేదము ఏదియో యొకయంశమును గురించి యాలోచించునపుడు అట్టి విషయముతో సమానమగు చిహ్నములు గల మఱియొక విషయమునకు శ్లేషాదులచే ఆగంతుకముగా ప్రసంగము కలిగించుట యను నాటకాంగభేదము. (ఇది నాలుగువిధములు కలది నాటక సంధులయందు మంగళార్థముగాని అమంగళార్థముగాని కవి యిష్టానుసారముగా రసపోషణమునకై యుపయోగింపఁ దగినది.)

**పతాకి.** సం. విణ. (న. ఈ. న.) ౧. పతాకగలవాఁడు; జెండాగలవాఁడు; చేతిలో జెండాగలవాఁడు ౨. (జ్యోతి) శుభాశుభసూచక చక్రభేదము.

**పతాకిని.** సం. వి. ఈ. స్త్రీ. ధ్వజిని, సేన.

**పతాపతము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి పడునది; మాటిమాటికి పడునది.

**పతి.** సం విణ (ఇ) ఏలిక అధిపతి సమాసోత్తర పదమగు "పతి" శబ్దమునకు స్త్రీలింగమున "పత్ని" యనురూపము వికల్పముగా నగును గృహపతి, గృహపత్ని బహుపతి, బహుపత్ని) వి. ఇ పుం (పాలించువాఁడు) ౧. యజమానుఁడు (గృహపతి), స్వామి, సొంతకాఁడు (క్షేత్రపతి, భూపతి); ఏలిక, పాలకుఁడు, రాజు (ఓషధీపతి, కులపతి) ౨ భర్త, మగఁడు (పతివ్రత మొ.) ౩ వేరు, మూలము ౪ గతి, గమనము ఇ స్త్రీ స్వామిని, ఒడయురాలు, రాజ్ఞి.

**పతింవర.** సం వి ఆ స్త్రీ తనంత మగని వరించునట్టి స్త్రీ స్వయంవర

**పతిఘాతిని.** సం వి ఈ స్త్రీ. పతిని జంపునట్టి స్త్రీ.

**పతిఘ్నము.** సం విణ (అ ఈ అ) భర్తృమరణము సూచించునది హస్తరేఖావిశేషము మొ)

**పతితము.** సం వి అ. న పతనము

**పతితుఁడు.** సం విణ (అ ఆ అ) ౧ పడినవాఁడు ౨. పొందినవాఁడు; చేరినవాఁడు (వంశపతితుఁడు. మధ్యపతితము. మొ) ౩ భ్రష్టుఁడైనవాఁడు ధర్మభ్రష్టుఁడు, పాపి

**పతిదేవత.** సం వి ఆ స్త్రీ పతిని దేవతగా భావించు స్త్రీ పతివ్రత

**పతిప్రాణ.** సం వి ఆ. స్త్రీ. పతివ్రత

**పతిమ.** వి. (సం ప్రతిమా. ప్రా. పడిమా క పతిమె.) ప్రతిమ, ప్రతికృతి, బొమ్మ

సీ. మలదాయటానున్న మలపుకీల్పులు దిండె
పెంటాపతిమకాలిపెండె మమర ...
చంద్రా. ౨. ౧౭.

క. కని మది గలిగినతీరున, నిను మగనిఁ బ్రాసి
కొన్న నిలువుఁబతిమలకా, గనుఁగొని రొయ్యుఁ
గళ వలికిన, ననఁబోఁడిక గినియఁ దశాప
నవలా నీకుఁ ...          యయా. ౫. ౫౯

సీ. అంతట నొక్కనాఁ డాగాధినృపపత్ని
పసిఁడికోలాటంపుఁ బతిములోళ్ళఁ, దీరైన
మంజిష్ఠ తెరతోడిపచ్చలపల్లకి నెక్కి ...
దశా ౬ ౩౪

**పతివత్ని.** సం వి ఈ స్త్రీ జీవద్భర్తృక, మగనాలు, ఐదువ (ప్రభుపర్యాయ మగు పతి శబ్దమునకు మతుప్ప్రత్యయము చేర్చిన స్త్రీలింగ రూపము "పతిమతి" యని అగును)

**పతివ్రత.** సం వి ఆ స్త్రీ భర్తయే ప్రతిమనుజుల నియతముగా ఉపాసింపఁదగినవాఁడుగాఁ గలది. పతిభక్తి గల యిల్లాలు, శ్రోత్రడి

**పతీయంతి.** సం వి. ఈ స్త్రీ పతిని గోరునట్టి స్త్రీ

**పత్త్రేరము.** సం విణ (అ ఆ అ) ౧ పోవునది ౨ ఎగురునది; వ్రాలునది ౩ పడునది వి అ పుం ౧ పక్షి ౨ గ్త్రము, పల్లము ౩ పరిమాణవిశేషము, ఆఢకము ౪ పవనము, గాలి (శే ని)

**పత్కాషి.** సం. విణ. (న్ ఈ న్) ౧ కాళ్లను రాచునది, పాదములను ఒరయునది ౨ కాలి వడకను పోవువాఁడు (పదాతి, యాత్రికుడు మొ.)

**పత్త.** (వి క పత్తి.) భగము, అఁడుగుతి

సీ. పాపలఁ గనుతావు పత్త బుయ్యా, మరునిల్లు
దుబ్బన మదనమందిగ మెప్వ ...
పాం. ని మాన. ౧౯ చంద్ర వి ౨. ౬౭

**పత్తనము.** సం. వి. అ. న ౧. పట్టనము, పురము. (వ్యతిగ్రామము.) ౨. మృదంగము,

మద్దెల. ౩ క్షుద్రగ్రామము. ౪ క్రయవిక్రయ భూమి. ౫. ఓడలచేత పొందఁదగ్గ మైనపురము (శ ని.)

పత్తి=ప్రత్తి. వి. (క. పత్తి హత్తి త పరుత్తి) విత్తులలో నుండెడుదూది, కార్పాసము (శ ర)

జ: పత్తికట్టు

పత్తి. సం. వి. ఇ క. పుం ౧ పాదచారి, కాలి నడకను బోవువాఁడు ౨ పదాతి, కాలి బంటు ౩ శూరుఁడు ౪ స్త్రీ ౧ ఒక రథము ఒక ఏనుఁగు మూఁడుగుఱ్ఱములు ఏవురు కాల్బలము గలసేనావిశేషము ౨ గ-మ, పోవుట ౩ ఏఁబదియైదుగురు గలసేన

శ్లో. నరాణాం పంచపంచాశదేషా పత్తిర్వి
యతే ... సంభార ఉద్యో ౧౫౫ ౨౭

పత్తికట్టు. వి (√పత్తి) లోహపాత్రాదులకు వేసెడి అతుకు

(వ్యవ.) ఆచెంబునకు పత్తికట్టు వేసినందులకు అణా పుచ్చుకొన్నాఁడు

పత్తికాయ. వి బాలక్రీడా విశేషము

సీ ... బందారు బసవన్న పత్తికాయ ...
హంస ౩ ౧౪౬

పత్తిగణకుఁడు. సం వి అ పుం పదాతులను లెక్కించు అధికారి

పత్తిచ్ఛేదము. సం వి అ. పుం స్థాపకరాశి, పరిమళించు మైపూఁతలపంక్తి (వై ని)

పత్తిరిబొట్టు. వి పత్తిరి+బొట్టు) ఒక విధమగు బొట్టు, తిలకవిశేషము

సీ. తిలక మెసంగు గీ. బొట్టనఁగ జా
క్కనఁగఁ జుక్కబొట్టన గఁ బొలుచుఁ
జాతిక పత్తిరిబొట్టనంగఁ, దద్విశేషాఖ్య
ఆం. భా. ౨. ౧౩౦

పత్తిరి. వి. (సం. పత్త్రిం. ప్రా పత్తం) ౧. పర్ణము, ఆకు.

గీ. పత్తిరా కనఁ బర్ణ మాఁ బార్వతీశ ...
ఆం. భా. ౨. ౩౭.

౨. పత్రి. దేవపూజ కుపయోగించెడి దళముల సమూహము.

ఉ. తత్తరపాటు లేక నదిఁ దాన మొనర్చి విశా
కపాణి దే, వోత్తము విశ్వనాథుఁ గరుణో
దధిఁ గన్గొనిపూవుగుత్తులం, బత్తిరిఁ బూజ
సేసి .. కాశీ ౨ ౪౯.

గీ నీలకంఠునిశిరముపై నీళ్లు చల్లి, పత్తి రిడు
మంత నెవ్వఁడు పాటిపైచుఁ, గామధేనువు
వానింటిగాడిపసగ, మల్లమరశాఖి వానింటి
మల్లెచెట్లు ... రాజ. చ. ౧ ౬౫.

ఆ పత్తగిల్లు సత్తుగిత్తత త్తడి సెక్కి, మిత్తి
మొత్తి నత్తి నత్తి బత్తిఁ బత్తి రిడిన ముత్తి
బుత్తులం రెండును, జొత్తి గుత్త గట్టుచుండు
కోఁడె . . నీలా. ౧. ౧౧౭

సా: కొండంతదేవునకు కొండంత పత్తిరికట్టువా
రుందురా

క ... కొండం, తటిదేవరకును గొండం, తటి
పత్తిరి కట్టువారు ధరణిం గలరే . .
సారంగ ౧ ౧౫.

జ. పత్తిరిబొట్టు

పత్తిరేకు. వి లోహము నడుకునపుడు రెండింటి సంధిని వేయు సజాతీయ మైనరేకు.

క. తనుమధ్యవలీభంగము, లనుగూర్పఁగనవియుఁ
దక్కులముతెయగుటఁగం, తుని యుడినపత్తి
రేకనఁ, జనుదోడ్డాణమున నడుముచాయకు
ననుదుచే ... ఆము. ౫. ౨౩.

పత్తూరము. సం. వి. అ. పుం. పొన్నగంటికూర ౖ.

పత్తైచ్ఛము. విణ. (సం. ప్రత్యక్షం ప్రా. పచ్చక్ఖో) ౧. కనఁబడునది, గోచరము ౨. యథాస్థితము, ఉన్నది ఉన్నట్లు
వ. ... ఆమె నీకుఁ బత్తైచ్ఛంబుగా నన్నియుఁ దెల్పు నని రాజుక్కచెలిం బిలిచి శీఘ్రం బారాజకులసానిం దోడ్కొనిగ మ్మని పని చిన సది యతిత్వరితగతిం జని యేమను చున్నది .. మృ వి ౨ ౩౮

పత్త్రకము. సం. వి. అ. పుం. కాలించకాకము †
న ౧ ఆకు, పత్త్రము ౨. పత్త్రభంగము, స్త్రీల చెక్కిలిలో నగువానియందు వ్రాయఁబడు మకరి కాపత్త్రము. ౩. తేజపత్రము, ఆకు పత్త్రము † ౪. ఆకువలె నుండుకత్తి, పత్త్రాస్త్రము.

పత్త్రకూటము. సం. వి అ పుం. న ఱెక్కలుగల యినుపబాణము. (వై. ని.)

పత్త్రఘన. సం వి అ. స్త్రీ. సాతల, సంబరేను †

పత్త్రణ. సం వి. అ స్త్రీ. ౧. పత్త్రభంగము, స్త్రీల చెక్కిలితో నగువానియం దలంకారార్థము వ్రాయు మకరికాపత్త్రము ౨ బాణమునకు ఱెక్కలు కట్టుట (వై. ని.)

పత్త్రతండులి. సం. వి. ఈ. స్త్రీ. యవతిక్త, నాగదొండ.

పత్త్రతరువు. సం. వి. ఉ. పుం. దుష్టఖదిరము, ఒక జాతిచండ్ర †.

పత్త్రదారకము. సం. వి. అ పుం. (ఆకుల వలె పలుచగా నుండుబిల్లలు కోయునది; ఆకు వలె పలుచగా నుండి కోయునది) క్రకచము, ఱంపము.

పత్త్రనాడిక. సం. వి. అ. స్త్రీ. పత్త్రశిర, ఆకులయీనె, ఆకులనరము.

పత్త్రపరశువు. సం. వి. ఉ. పుం. (లోహపు రేకులకు గండగొడ్డలి వంటిది) ఆకురాయి.

పత్త్రపాలము. సం వి. అ. పుం ఛురిక, చూరకత్తి

పత్త్రపాలి. సం. వి ఈ స్త్రీ ౧ బాణమునకు ఱెక్కలు కట్టినభాగము ౨ కర్తరి, కత్తెర

పత్త్రపాశ్య. సం. వి. అ. స్త్రీ పాపటబొట్టు, స్వర్ణాది రచిత లలాటాభరణము, చేరుచుక్క.

పత్త్రపిశాచిక. సం. వి అ స్త్రీ ఆకులతో పిశాచివలె చేయఁబడినది. జమ్ముగూడ; తాటియాకుల గొడుగు ౯ం

పత్త్రపుటము. సం వి అ న. ౧ ఆకుదొన్నె, ఆకుదొప్ప. ౨ ఆకులతో అల్లినబుట్ట, పుటిక.

పత్త్రపుష్పకము. సం. వి అ. పుం. భూర్జపత్త్రము, బుజపత్త్రి †

పత్త్రపుష్పము. సం. వి అ పుం (పూలవంటి ఆకులుగలది) ఎఱ్ఱతులసి †

పత్త్రపుష్పి. సం వి ఈ స్త్రీ తులసి †

పత్త్రఫల. సం వి అ స్త్రీ పెద్దకత్తి (వై ని)

పత్త్రబంధము. సం. వి. అ. పుం. పుష్పరచనా విశేషము, పత్త్రాకారముగా పూవులతో చేయు అలంకారము.

పత్త్రభంగము. సం వి. అ. పుం. స్త్రీలయొక్క చెక్కిలి లోనగువానియందు అలంకారార్థము కస్తూరి కాదులతో వ్రాయఁబడు మకరికా పత్త్రము

పత్త్రభంగి. సం వి ఈ స్త్రీ. = పత్త్రభంగము.

పత్త్రము. సం. వి. అ. న. ౧. పర్ణము; ఆకు; పుష్పదళము, పూపురేకు. ౨. వ్రాయుటు

కాధార మైన కాటియాకు, కాగితము మొ; జాబు. 3 వ్యవహారమున పరస్పరము వ్రాసి కొను దస్తావేజు (ఋణపత్త్రము, దానపత్త్రము మొ) ४ బంగారు లోనగువాని ఆకువంటి రేకు. ౫ పక్షిరెక్క. ౬ బాణమునకు గట్టినరెక్క, అంపగరి ౭ వాహనము ౮ స్త్రీల చెక్కిలి లోనగువానియందు వ్రాయ బడు మకరికాపత్త్రము ౯. వరాంగకము, లవంగపుపట్ట ౧౦. తేజపత్త్రము, ఆకుపత్త్రి ౹ ౧౧ కత్తి లోనగువాని వాదర ౧౨. ఛురిక, చూరకత్తి. (వై ని)

పత్త్రిమూలము. సం వి అ పుం మూలికపకె నుంగుఆకులు గలది వేతసము, ప్రబ్బ ౹

పత్త్రిరంజనము. సం వి అ న గంధపత్త్రము మీద రంగులువేయుట; పుస్తకపత్త్రము మీద చిత్తరువు వేయుట

పత్త్రిరథము. సం వి అ పుం ఱెక్కలు వద ముగాగలది పక్షి

పత్త్రిరేఖ. సం వి ఆ స్త్రీ — పత్త్రిభంగము

పత్త్రిల. సం వి ఆ స్త్రీ ౧ పెద్దయేలకి ౹ ౨. శ్రీతాళము ౹

పత్త్రిలత. సం వి ఆ స్త్రీ ౧ పత్త్రిభంగము. ౨. ఆకులు ప్రధానముగా గలతీగె 3. ఆకు వలె దడదడలాడు నిడుపుచురియ, పెదకత్తి

పత్త్రిలము. సం వి అ న. ద్రప్సము, అఘన దధి, పలుచని పెరుగు.

పత్త్రిలేఖ. సం = పత్త్రిరేఖ.

పత్త్రివల్లరి. సం వి ఈ స్త్రీ. ౧ పత్త్రి భంగము. ౨. పత్త్రిప్రధాన మగులత

పత్త్రివల్లి. సం. = పత్త్రివల్లరి.

పత్త్రివాహము. సం. వి. అ పుం రెక్కలచే తీసికొనిపోబడునది. ౧. పక్షి. ౨. బాణము.

పత్త్రివాహుడు. సం విశే. (అ ఆ అ) జాబులను గొనిపోవువాడు.

పత్త్రివిశేషకము. సం. = పత్త్రిభంగము.

పత్త్రివృశ్చికము. సం వి అ పుం ఆకుతేలు, పత్త్రాకారమగు నొకజాతి వృశ్చికము

పత్త్రివేష్టము. సం వి అ పుం తాటంకము, చెవికమ్మ

పత్త్రిశాకము. సం వి అ పుం ఎడ్వి ధశాక ములలోని పత్త్రిరూపమగు శాకము, ఆకుకూర ౹ (పత్త్రము, పుష్పము, ఫలము, నాళము, కందము, సంస్వేదజము (కుక్కగొడుగు) అని శాకము లాఱు)

పత్త్రిశృంగి. సం వి. ఈ. స్త్రీ. ద్రవంతి, ఎలుక చెవికూర ౹

పత్త్రిశ్రేణి. సం వి ఈ స్త్రీ = ద్రవంతి, ఎలుక చెవికూర

పత్త్రిశ్రేణి. సం = పత్త్రిశృంగి

పత్త్రిశ్రేష్ఠము. సం విశే. (అ ఆ. అ) ఆకు లలో శ్రేష్ఠమైనది వి అ. పుం. బిల్వము ౹

పత్త్రిసిర. సం వి ఆ స్త్రీ ౧ పత్త్రిభంగము ౨ పత్త్రినాడి, ఆకులయీనె

పత్త్రిసూచి. సం వి ఈ స్త్రీ కంటకము. ముల్లు ౹

పత్త్రిస్నుహము. సం. వి హ. స్త్రీ. ఆకు జెముడు ౹ (రూ పత్త్రిస్నుక్కు.)

పత్త్రిస్నుహి. సం. వి. ఈ. స్త్రీ. ఆకుజెముడు ౹

పత్త్రహిమము. సం. వి. అ. న. (ఆకులయందు మంచు నిలుచుటినది) హిమదుర్దినము, మంచు పడెడిదినము

పత్త్రాంగము. సం వి అ న ౧ రక్తచందనము ౨ భూర్జపత్రము శ్రీ. ౩. పద్మకము శ్రీ

పత్త్రాంగుళి. సం వి ఇ పుం = పత్రభంగము

పత్త్రాంజనము. సం. వి అ. న వ్రాఁతపత్త్రములపై వ్రాయుమసి, సిరా.

పత్త్రాంజలి. సం వి ఇ పుం భూస్తృణము, చిప్పగడ్డి శ్రీ

పత్త్రార్యము. సం వి అ న ౧ పిప్పలివేరు శ్రీ ౨ పర్వతతృణము శ్రీ ౩ తాళకము

పత్త్రామ్ల. సం. వి ఆ స్త్రీ పులిచింత శ్రీ

పత్త్రాలువు సం వి. ఉ పుం ౧ కాసాలువు, ఒకజాతి గెనుసుగడ్డ శ్రీ ౨ ఇక్షుదర్భ శ్రీ

పత్త్రావళి. సం వి. ఇ ఈ స్త్రీ ౧ పత్త్రములవరుస ౨ గైరికధాతువు ౩ పత్త్రభంగము ౪. తేనెయు యవచూర్ణమును కలిపిన లేఁత రావియాకుల సముదాయము

పత్త్రి. సం. విణ. (ప. ఱీ. ప.) (పత్త్రములు గలది (౧ ఱెక్కలుగలది ౨. ఆకులు గలది. ౩ తాటియాకులు కాగితములు మొ. కలది. (గ్రంథము, పుస్తకము.) ౪. వాహనము గలవాఁడు. వి. ప. పుం. ౧. బాణము. ౨. పక్షి. ౩. డేగ. ౪. వృక్షము. ౫. రథికుఁడు. ౬. తాటిచెట్టు ౭. శ్వేతకిణిహి శ్రీ. ౮. పారచిఱుబొద్ది శ్రీ. వి. ఈ. స్త్రీ. ౧. ఆకు. ౨. పత్త్రము, పత్త్రిక, వ్రాఁత కాధార మగు తాటియాకు, కాగితము. మొ. ౩. పత్త్రాస్త్రము, ఆకువలెనుండుకత్తి.

పత్త్రిక. సం. వి. ఆ. స్త్రీ ౧ పత్త్రము, పత్త్రి, వ్రాఁత కాధార మగుతాటియాకు కాగితము మొ. ౨. వ్యవహారమున పరస్పరము వ్రాసికొనెడు పత్త్రము (క్రయపత్త్రము మొ) ౩ కర్పూరభేదము.

పత్త్రిణి. సం వి ఈ. స్త్రీ భార్యయొక్క కనిష్ఠ స్వస. (శే. ని.)

పత్త్రోపస్కరము. సం. వి. అ పుం. కాసమర్ధము, కసింద శ్రీ.

పత్త్రోర్ణము. సం వి అ న (ఆకులమీఁద నుండు పురుగులవలనఁ బుట్టు పట్టుదారములతో చేయఁబడినది) ౧ ధౌతకౌశేయము, తెల్లపట్టుబట్ట. ౨ పట్టుబట్ట పుం దుండిగము, శ్యోనాకము శ్రీ

పత్ని. సం వి ఈ స్త్రీ అగ్నిసాక్షిగాఁ బెండ్లాడిన పెండ్లాము

పత్నీసన్నహనము. సం వి అ న యజ్ఞదీక్షార్థము యజమానుని పత్నికిఁ గట్టునడికట్టు, అట్టనడికట్టు కట్టుట.

పత్న్యాటము. సం వి. అ పుం. పత్నిగృహము, అంతఃపురము

పత్రి = పత్త్రి.

గీ పెట్టు మూఁకుడులో కొంగ బీఱపత్రి, మట్టి దూపార్తి దీపముఁ బెట్టుచమురుఁ, బొందుపఱచుక హంస ౧. ౧౭౨

బిల్వపత్రి = మారేడుదళము

ద్వి సొంపారి, పెంపారి చాలనొప్పెడు బిల్వ పత్రి, వలిదీటు కొనఁగోని

బస. పు ౩ ఉకాఉ. ఖం

పత్సలము. సం. వి. అ పుం ౧. ప్రవాహము. ౨. ప్రవాసము (శే. ని) ౩. మార్గము. (వాచ.)

**పథకుఁడు.** సం. విణ. (అ. థి. శా. అ) మార్గ కుశలుఁడు, త్రోవ చక్కఁగా తెలిసినవాఁడు.

**పథము.** సం. వి అ. న. పుం మార్గము, త్రోవ

శ్లో. .. పంథాస్తు ఖుల్లపోపథాః, వాటః పథశ్చ మాథశ్చ .. (త్రి. వి.) (పథిన్ శబ్దమునకు తెనుఁగున ప్రథమైకవచన రూపము పథ మని యగు నని యహోబల పండితీయము.)

**పథాతిథి.** సం. విణ. (ఇ) యాత్రికుఁడు.

**పథి.** సం వి న. పుం. (తెనుఁగున సమాస పూర్వ పదముగానే యుండును. పథిక్రమము. మొ సమాసోత్తరపద మగునపుడు అకారాంత మగును దుష్పథము, దృక్పథము, రాజపథము. మొ. చూ. పథము) పథము, పద్ధతి, మార్గము (ఈ క్రింది ప్రయోగమునమాత్రము ఒకకవి వ్యస్త ముగా వాడినాఁడు

గీ మలని చూపట్టెఁ బథి నొక్కమఱ్ఱిచెట్టు
హంస ౨ ౧౧౬

**పథిక.** సం వి ఆ. స్త్రీ. కపిలద్రాక్ష

**పథికుఁడు.** సం విణ. (అ. ఆ. అ.) దారి నడచు వాఁడు, బాటసారి, తెరువరి

**పథిజ్ఞుఁడు.** సం. విణ (అ. ఆ అ) మార్గములు ఎఱుఁగువాఁడు.

**పథిద్రుమము.** సం. వి అ పుం. శ్వేతఖదిరము, తెలిచంద్ర చె.

**పథిప్రజ్ఞుఁడు.** సం. విణ. (అ ఆ అ) మార్గ ములు చక్కఁగా ఎఱుఁగువాఁడు.

**పథిలుఁడు.** సం. = పథికుఁడు

**పథివాహకుఁడు.** సం. విణ. (అ. హ్రా. అ.) ౧. క్రూరుఁడు, నిష్ఠురుఁడు. ౨. శాకునికుఁడు, పిట్టల వేఁటకాఁడు. 3. మార్గవాహకుఁడు. దారిని బరువు మోయువాఁడు.

**పథ్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మృగైర్వారువు, బుడమ చె. ౨. చిర్భట, నక్కదోస చె. 3. వంధ్యాకర్కటి, గొడ్డు అఁగాకర చె ౪ మాత్రా వృత్తిభేదము ౫ హారీతకి, కరక చె

**పథ్యము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. దారికి మంచిదైనది. ౨. హితమైనది. 3. మేలు చేయు నది వి. అ న. ౧ హితకర మైనభోజ్య ద్రవ్యము. ౨. మేలు, శ్రేయము, క్షేమము. పుం. హారీతకి, కరక చె (వాచ)

**పథ్యశాకము.** సం. వి అ పుం. తండులీయ శాకము, చిఱ్ఱికూర చె.

**పద్.** సం వి ద. పుం (ఇది సమాసపూర్వపదము గానే యుండును ఇది పాదశబ్దమునకు ఆదేశ ముగా వచ్చురూప మనికొందఱు. స్వతంత్ర శబ్ద మని కొందఱు) ౧. పాదము (పద్గుఁడు, పన్న ద్ధము మొ.) ౨. పాతిక. (పన్నిష్కము)

**పదంపడు.** మి. అ. క్రి. పదపడు (పదము + పడు ?) (పూను, యత్నించు.)

చ. ... కే, దవుగని తెల్పు జెప్పినఁ బదంపడి నిన్ను దలంపఁ దోఁపదేక
ఉ. హరి. ౨. ౧౯౪.

**పదంపడి = పదపడి.** అవ్య. ౧. పిమ్మట, తరు వాత, వెనుక. (పదము + పడి ?)

చ. .. ఈ, తనిపలు శాదరింపమిఁ బదంపడి పాటిలు తెల్లచేటులకా ...
భార. ఉద్యో. 3. 3౪౯.

ఉ. ఘోరరణంబులోనఁ బడి కూలినవానరులెల్ల రూగని, ద్రోరతిఁ బొంది పెమ్మదిఁ బదం పడి తుల్కసుఖంగిఁద్రబొత్తను, స్ఫారబలం బులం దనరి ... భా. రా. యు. ౨౪౪3.

ఉ. . విశ్రుతా, ధ్ధాముఁడు వీరభద్రుఁడు పదంపడి యుండఁగాఁ గాచె దేవతా, గ్రామ ణులకా కాశీ. 8 ౯౨.

౨. మఱియు. (శ. ర)

క చంపినవానిని సరిగాఁ, జంపుట తగు విప్రుఁ డైనఁ జంపక పతిత, త్సంపదఁగొని తల గొఱిగి ప, దంపడి కుక్కచ్చుద్రాసి దండిం పఁదగున్ విజ్ఞా ప్రా. ౭౮

వ కెండియుఁ గొందఱు హోమాగ్ను లార్చిరి పదంపడి కొందఱు హోమ కుండంబులందు మూత్రంబు విడిచిరి ... భాగ ౪ ౧౧౭

పదకము. వి (సం. పదకమ్) ౧. లలంతిక, కంఠ భూషావిశేషము.

సీ. పదకము తాళి కేవళములంబెస సరిపెన సర పణి గొలుసన లలంతికా గిశేషంబగు

అం భా ౨. ౧౪౯

సీ. పచ్చలకడియముల్ బంగారుగాఁజాలు పదక ముల్ సవరించె మురితిరూర్తు ...

యయా. ౪ ౯

౨. పద్ధతి

క. ఇది సాకానతియిచ్చిన. పదకము గలరూపు విన్నపము చేసితి నీ, హృదయంబునఁ గైకొను మెంం, దుదలంపులు దక్కుమనవుడుం గుపి తుండై ..

నిర్వ ౪. 3౧ (విషయమని భావము)

ద్వి. ఇది శ్రుతిస్మృతి మూలమేకాని యుండు, పదకవాదములని భావింపవలదు .

బస. పు. ౧. ౫౦౫. (సమాసము చింత్యము)

పదకము. సం. వి. అ. న. పదము, పదవి, అధి కారము. పుం. నిమ్కుమను వక్షోలంకారము, పతకము, రత్నములు దాపిన పతకపుబిల్ల.

పదకుఁడు. సం. వి. అ. పుం. వేద పదపాఠము జాలిగినవాఁడు.

పదఖండనము. సం వి. అ. న. ఒక విధమైన గాయమానము, మల్లబంధ విశేషము.

వ. ఊరిత్రాడును పద ఖండనంబులును విత్తరి కెలివిత్తరి . మల్లపు 3 ౭౯.

పదగళాప్తి. సం వి ఇ. న మల్లబంధ విశేషము.

వ. చాంగణయుఁ . . బదగళాప్తియు గళ కత్తెరయు ... ప్రబంధ ౩౮.

పదగుఁడు. సం విణ (అ అ అ.) పాదచారి, కాలినడకను బోవువాఁడు.

వి అ. పుం పదాతి, కాలిబంటు.

పదచౌళి. వి. (క పదచారి) నాట్యభేదము.

సీ. అభినయంబులు కొపు లరుదైన తీరుపుల్ వెలయఁగాఁ బదచౌళి విధమొకర్తు

ఉ రా. ౨. ౧3౯.

సీ అభినయించుచును బదార్థము దైలుపుచొ రతి ముద్దురా చిల్కరవిూవవిూంప

గీ. చెలఁగి పదచౌళి వినిపించెఁ జెలువ యొకతె.

దశా. 8. ౨౧౭.

ద్వి. పదచౌళిగొనియె రూపవతీ వధూటి, కొద లేక పేరణిగొనె చంద్రరేఖ

రఘునా. ర. పా.

పదటఁగల(లి)యు. అ క్రి (పదటన్ + కలయు) బూడిదపాలగు; వ్యర్థ మగు

సీ. పరకళత్రంబుల కెంబడఁ దలంచినవాఁడె ప్రజ్ఞావిలాసంబు పదటఁ గలచె ..

శివరా. 3. ౭౨.

ఆ. పదయరాని యాయు వొదలికిఁ గలిగినఁ, బాపకృతుల దానిఁ బదటఁ గలుపు వగుచు.

భార. శాం. ౫. ౪౯౦.

సీ. చదువులు భక్షించి సర్వాన్నరాములు కెడ చల్లి సోమంబు పదటఁగలిపి ...

హరి. ఉ. ౪. ౫౭.

పదటము = పదటిమి, పదటు[2]. వి. ౧ ఆత్రము, తత్తఱపాటు, తొందర.

శా ధానుష్కొన్నతి చెప్పఁ దీరదె మునీంద్రా మేరువో మందరం, బో నీచాపము దాని బైసియు నిలక కొం పెట్టఁగాఁ గాన నా, నే నింతే మది కింతలోఁ బదటమా యూపట్టి యాద్భుత్య మే, లా ..

చం రా 3 ౧౪౯

క. ఇది మంచిబుద్ధి యింతక, బదటముచే నింపు కేని భాషింపకు శుక. 3 33౨.

ద్వి పట్టె నుంకించిన పదటము . .

విష్ణు ఉ ౪ ఆ. (౪ ౧)

౨. తొందరమాట, తొందరపని

గీ. పండ్లుఁ బనుపున పక్కా కుఁ బల్లెరమునఁ, బెట్టుకొని వచ్చి బిడ్డఁ గన్నట్టివారి, నడిగి వా రయ్యఁ గైకొను టదియె పాడి, యేల పదరెదుపదటాల నేమిపోదు ...

పార్వ ౪ ౧౪౬

పదటిపాలగు. అ క్రి (పదటు[1]+పాలు+అగు) వ్యర్థమగు

గీ. ... దురాచారులార కావ, కికనకృత్యంబు లిట్లు చేసితిరి మీరు, బ్రహ్మవిజ్ఞానగర్వంబు పదటిపాలు, గావలయు నంచు ఘోరంబుగా శపించె వరాహ ౫. ౫౨.

పదటి పాలుచేయు. స క్రి (పదటు[1]+పాలు +చేయు) భ్రష్టముచేయు, పాడుచేయు

ద్వి బల్ల హుళకటకంబు పదటిపాల్ సేసి బస. పు ౭ ౯౧౬. పం.

పదటిమి = పదటము. వి. (√పదటు[2] స్వార్థ మున ఇమి వర్ణకము.) భయాదులచేఁ గలిగెడు తొందర, ఆత్రము.

చ. కదిసి శశాంకుఁ డీసతిముఖం బయి కేళి తమంబుమీఁదుగా, నెదుగఁగఁ వచ్చు హీన బల మెంచి తనంతనె కన్నుదామరల్, పద టిమి గొప్పు లిప్పలను బైచెయి చేకొన పాము జిక్కినక, సుడు రదచందురుం డన జను ల్మతి లేకనె అంచు వాఁ డగొ ...

ఉ హరిశ్చ. 3 ౩౨

చ పొదిఁగిటఁ గాంచుఁ గాంచి తమిఁ బూని గిగుఱ్కన మల్లు మల్లుచోఁ, బదటిమి వచ్చు

ఉ హరిశ్చ. ౪ ౧౭

పదటి[1] = పదదు. వి. పొ ధూళి బుగ్గి

గీ దుమ్ము దువ్వ దుమారము త్రుమ్ము తుమురు, దవ పదటు బుగ్గి వాఁగను దనరు ధూళి . .

ఆం. భా ౨ ౨౨౦.

జ: పదటఁగలయు, పదటిపాలగు, పదటిపాలు చేయు, పదటుచేయు

పదటు[2] = పదటము.

(ఆత్రము, తొందర.)

ద్వి. పదటునలేచి విష్ణు ..

పూ ౧ అ (శ. ౪)

జ: పదటిమి

పదటుచేయు. స క్రి (పదటు[1] + చేయు) బూడిదగాఁ జేయు; తృణీకరించు.

గీ. వార్త విని సర్వజిత్తు దుర్వారుఁ డగుచుఁ, బాలవంటినా నేస్తంబుఁ బదటుచేసి, కట కటా రాజ జడదారిగాండ్లమచ్చు, మాయ మాటలు విని చెడిపోయె ననుచు ...

ఉ. హరిశ్చ. ౪ ౯౫

పరదు = పదటు. వి ౧. బూడిద, భస్మము.

అ పరదు పకిఁడి గాఁగ భాండసంపద గల్గెఁ, గ్రొత్తవత్తులను గుమ్మరులును, బొప్పు దప్పు కనికి చెప్పెడు జొప్పుల, కుప్ప యనఁగఁ బరగు నప్పరంబు ...

ద్వా. ౧. ౫౫

ద్వి పదడు చేపట్టుచుఁ బసిఁడి రైౌ వెలుఁగు
బస. పు ౫ ౨౪౨ పం.

వ .. పదడునం బొదవినమెదడునుం బ్రదరం
బులం జదిసి కదిపినమాంసంబును .
కాశీ. ౨. ౬౨ పండితా పురా ౧౩౭ పొ.

౨. గుండ, చూర్ణము, పొడి

గీ పులుసులో గంజి మిక్కిలి కలయఁ బోసి,
భక్ష్యములలోన మిరియంపుఁబదడు గలిపి
చంద్ర వి ౧. ౬౫.

పదతీ. వి. పారావతవిశేషము, ఒకజాతిపావురము

క. మే లైనలక్కోరీ లా, డ్డీలుం బదతీలు .
సారంగ ౧ ౧౧౪

పదనిచ్చు. అ క్రి (పదను² + ఇచ్చు) తడుపు

మ. క్షితిబాధత్వము లేదు గావునఁ బరక్షేత్రం
బులం దున్ని లో, హితభారం బద నిచ్చి
రాజమకుటీహారావళీ దీజసం, త తు లం,
జల్లితి ద శా ౯ ౫౯.

సీ. జవ్వాదిఁ బదనిచ్చి పారణుల్ సారించి సర
సత బిరడలు చక్కనొత్తి
వాల్మీకి ౩ ౧౩౩.

సీ కలికిచేష్టలు భావగర్భంబు లైనను బ్రియు
మీఁదఁగూరిమి బయలుపఱుప, పిదపిద నై
లజ్జ మదిఁబదనిచ్చినఁ జెలిమేనఁ బులకలు
నిక్క లొత్త ... భాగ. ౧౦. ఉ. ౩౩౧.

పదను = అదను, పాదను వి. ఔ. అనా (క
పాదను.) ౧ అనుకూల్యము, అనుకూలస్థితి.

క ఇది పోరెదఁ గౌరవ్యులఁ, బదనికి రాఁ
బలికి సంధి పాటించెద ..
భార ఉద్యో ౩ ౬౯.

(= పాకము. చి. ని పరిపాకము. శ. ర)

౨. యుక్తసమయము, తఱి; సమయము.

క. అది విదురుచెప్పినట్టిద, కుదిఁ గృష్ణుఁడు
పాండుసుతులతో నే లఁగనే పదనౌ యీ
గికనిచ్చిన, బెదరి రవార రొుచ్చ మైనఁ
బిమ్మట నగరే భార. ఉద్యో ౩. ౧౬౩

సీ. అంట్లొత్తుపదసున నంట్లొత్తు చెలమిఁ గాన్పిం
చుకేఁగొమ్మలు వంచి వంచి ...
కళా ౪ ౩౭

ద్వి పెదపద స్నొడకుండ విత్తులు గేన, పెదపెట్టుఁ
గాకేమి ... బస పు ౪ ౪౯౩ పం

క పెడతలఁపు లుడిగి సంధికి, నొడఁబడు మిది
తప్ప దీని కొడఁబడవి గడుం, జెడుతెరు
విప్పటిపదనుల్, గడవఁబడుట ద్రాటఁ
దప్పకరణీయచుమ్మి
భార కర్ణ ౩ ౨౪౩

౩. విధము, రీతి

క వారలగుణానుగుణముగ, వారక కను గలిగి
నడచువారల కెలమికా, శ్రీ రంజిలు జయ
మొందవు ను, దారత నీపద నెఱింగి యల
వడు మఱలా శుక. ౧ ౪౯

గీ అంతిపుర మేఁగి మజ్జనం బాడి వేఁటఁ,
బోవుతమి డేగపదనగ భోజనంబు, సేసి.
సారంగ ౧ ౪౭

(విణ) పరిపక్వము

క కదళీ శాకేతక్రమక ఫంగిములఁ, బద నైన
గోస్తనీఫలగుళుచ్ఛముల ...
రం రా సుం ౨౪౫ పొ. ౧౭ పం

పదను². వి ఔ అనా ఆర్ద్రిత, తడి

క కలదొకరపాన్యగోపన, మలఘుమతీ వినుము
పురుషు నమ్యం గనినం, బొఁకులకు నేమి
చెప్పదుఁ, గలుగుఁ బదనుతో డికళలు కామ
గృహాముననే . భార అను. ౨. ౧౪౫.

గీ. పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు,
పీని .. మనుచ. ౨. ౩౬.

గీ. మదురటూర్పులు గొబ్బొనిపదను దివియఁ, తెమటచిత్తడి చెక్కులఁ జిప్పిలంగ, సన్న తన్వంగి భయమేద మపచరించి, యింపు రెట్టింపఁ దెరువరు లిట్టు లనిరి ..
విక్ర. ౪. ౧౦౨

ఉ. పంటవలంతికిం బొడమి భావిలుసీతవు గానఁ జేలతో, నంటినఘుర్మవారిఁ బద నై పులకోద యసస్యసంపదన్, గెంటక యున్కి నీకతగు
రామా ౮ ౧౪౨

(విణ.) ౧ ఆర్ద్రము, తడిసినది

ఉ. పైఁ, జొట్టిననెయ్యపుం బదనుచూపులచే నతి వెంట నంటి
పారి ౮ ౭౨

(నెయ్యపుంబదను చూపులు = ప్రేమార్ద్ర వీక్షణములు)

౨. బురదకలది

వ. .. వేల్పుగానీలపాణీరిత మాణిక్య వీణా మధురరాగామృతంబులఁ గరఁగి జగుకుదు విందకందళంబుల జలంబులఁ బద నైనగైరిక తలంబులన్
వసు ౨ ౧౧

గీ. తత్తనవు మున్ను నెత్తుటఁ దడిసి పద న, యినధరణిఁ ద్రవ్వి పూడ్పించె నినకులుండు
చం. రా ౫ ౮

3. (త్రాగుటకు జాల్చుటకు అనుకూలముగా) ఎక్కువపలుచన మిక్కిలి గట్టి కాకుండఁ జేసినది.

సీ. సుకవిజిహ్వాచకోరికలకుఁ దనకీర్తి పద నైన చంద్రాతపంబు గాఁగ ...
దశకు. ౧. ౧౭౦.

సీ. చంద్రకాంతపుసీట జాలైనవెన్నెల మడురు వెన్నెల జాలుపదనుచేసి ..
పారి ౨ ౮౮

జ: పదనిచ్చు.

పదను³. వి. దే. అసా. (క. హదను.) తీక్ష్ణత, వాఁడిమి; క్రూరత్వము.

క. పదనికిరాఁ బులు గడిగిన, మదనాస్త్రమురేఖ గలిగి మానినిమెయి చెన్, క్రొన్నదనఁ గంటనేసి రప్పుడు, ముదితాజనములు ప్రమోదమున లలితముగన్. భార .. విరా ౫ ౩౫౮.

క. ఎవ్వరు చూచినఁ జూపులఁ, జివ్వకుఁ బద నదలి నడుచుసిగ్గున నొంటిపై, రవ్వకు పొంద లగుపావపు, జవ్వన మెదిరించె జిగి దొసఁగ నామేనన్
మనుచ ౬. ౮౨

వ. ... ప్రతిపదంబును మదనుపద నెఱింగి తత్వ దానుస్మరణం బొనర్చుచు ఇందు ౮ ౩౪.

(విణ.) తీక్ష్ణము, వాఁడిదైనది

ఉదా: ఆ కత్తి పదనుగా నున్నది

చ . ఆటుఁ గ్రొం, బదనులకోరులన్ నిడముఁ బక్కన నేసినఁ ద్రుంచి యన్నిటన్, జదిసెఁ దదీయచాపమాయ సారథికేతుల జాతఁ దుగ్రుఁడై
చంద్రా. ౬. ౮౦.

కంచుపదనువంటిగి = పెచ్చుతగ్గులకోర్వనిది

క. చంచలము మానయుతమును, గంచుపదను వంటి దరయఁ గాంతల హృదయంబు ...
ప్రబోధ ౧ ౮౦

జ. పదనుగొను, పదనుతప్పు, పదనుపెట్టు.

పదనుగొ(కొ)ను. అ. క్రి (పదను³+కొను) వాఁడి యగు

(క) అధికమగు, అతిశయించు.

క. కదనమునఁ గినియుశూరుల, వదనంబులం బదనుగొనుచు వడి నాకసమున్, బొదిరె నొకో నమరకోటిత, మదములరుచు లనఁగఁ బక్వాపాండ్య మరీచుల్ ...
కవిక. ౨. ౨౦౩.

(చ.) మెఱయు, ప్రకాశించు.

సీ. అర చంద్రులోని చిహ్నంబుమంచోశి
సుదుటఁ గస్తురిబొట్టు పదనుకొనఁగ
పాండు. ౪ ౩౩.

(౬) మనోజ్ఞమగు.

సీ. సరసవైదగ్ధ్య రసాయనోదయమునఁ బలుకు
లారోగ్యయయ్యెఁ బదనుకొనిరొ
కవిక ౩ ౧౪

పదనుతప్పు అ క్రి (పదను³+తప్పు) తీక్ష్ణతను విడుచు, తగ్గు

సీ హృదయంబులోఁ జేగపదను దప్పకమున్న
గాత్రంబు శిథిలంబు గాక మున్న
కాశీ ౩ ౨౪

పదనుపెట్టు. స క్రి. (పదను³+పెట్టు) నిశితము చేయు, వాఁడి గలదిగాఁ జేయు

గీ. సరగ మి న్ననుకమ్మరి సంజకొలిమి, బెట్టు
గాఁ గాల్చి బంగారు చుట్టువాలు, పదను
పెట్టఁగఁ గొనిపోయి పట్టలేక, విడిచె ననఁ
బ్రొద్దు పడమటికడలి మునిఁగె.
యయా ౨ ౬౭

పదన్యాసము. సం వి అ. పుం ౧ అడుగు పెట్టుట ౨. పదచిహ్నము ౩ గోక్షురము, పల్లేరు ¶

పదపడి = పదంపడి. అవ్య. ౧ వెనుకను, పిమ్మట, తరువాత.

సీ. . పదపడి పిదప తర్వాత పిమ్మ,

గీ ట నఁగఁ బశ్చాత్సమార్థ మై యలరుచుండు
ఆం భా ౩ ౪౩

క. పదు మూఁడేండ్లుం బోయినఁ, బదపడి
పార్థుండు నిజ్జుల ఉతనృపతుల దు, ర్మదుల
వధియించి విజితశ్రీస్పద శ్లాఘాల గగుడు
ధర్మ పరిరక్షణ శ్లాఘ్య .
భార. అర. ౧. ౩౯౪.

సీ. .. నన్నుఁ గని ముదంబునఁ బుచ్చికొని
పోయెఁ బదపడి యాతండు దర్ప పారాభి
ధాను, మహిత తపోవీర్య మహనీయు మీ
బావఁ జేరి యాతనితోడఁ జెలిమిచేసి .
దశకు. ౪ ౧౦౭. శైవ. ౮. ౯౭.

౨ మఱియు (౪ ౮)

క పదిదినము లైదు ప్రొద్దులుఁ, బదపడి రెవ్వార్ల
నొక్కొపగలున్ రేయును, మదమున రణ
మొనరించిరి బాగ ఆది ౧ ౬౭

క పదపడి ధర్మాచరణము, వొదలుం దత్ప్రాప్తి
విధము బుధజనులకడం, గదలక నిలిచి
యొత్తఁగికొన, విదితం బగు వారి శీలవృత్త
ములఁ గడున్
భార. అశ్వ ౧ ౧౯౩. హర ౪. ౧౯౦.

౩ అప్పుడు, ఆ సమయమున

క పదపడి దుర్యోధనుఁ డు, న్మదుఁ డై తఱి
మంగ ధర్మనందనుఁడు జయా, స్పదముగఁ
బుకొల్పఁగ బె, ట్టిదముగ నొండొంటిఁ దల
పడిరి సైన్యంబుల్
భార. భీష్మ. ౧ ౨౪౧.

౪ వెంటనే. (అత్యంతము అని అర్థ మగుచున్నది అని ౪ ౭)

క. ముదమున హరియును నజుఁడును, చదువులు
మును లాగిగాఁగ సకల జనంబుల్, మద
నారిఁ గొలువ వచ్చిరి, పదపడి సంభ్రమము
భయము భక్తియు గడుగ.
వీర ౧ ౪౩.

పదపడు. అ క్రి ౧ స్థాన మగు, గుఱి యగు

క పదరిన గార్యము చెడు సం, పద చెదరు
మహాపదలకుఁ బదపడు సహసా, విదధీత న
క్రియా మను, చదు వార్యులు చదువ వినరె
శశివంశమణీ. రా. వి. ౨. ౩౪.

౨. పూను, యత్నించు.

ఉ. ... జన్మ మాదిగాఁ, బదపడి యొగ్గొనర్చు శిశుపాలుఁడు యోగిజనంబు లిట్టి ద, ట్టి దనియెఱుంగ నోపని కడింది పదంబును బొందడే కదా — భాగ. 3. ౯౩

క అదిగాక నీదు శరణము, పదపడి యేఁ జొత్తు

భాగ. ౧౦ ఉ ౫౨౨. అచ్చ. గా యు 33౫

**పదభ్రంశము.** సం వి అ. పుం ౧ పదవినుండి తొలఁగుట, అధికారమునుండి తొలఁగుట. ౨. స్థానమునుండి తొలఁగుట. 3 అడుగు జాఱుట ౪ పదము పోవుట

**పదమాల.** సం వి ఆ స్త్రీ ౧ పదముల వరుస. ౨. మోహన విద్య

**పదము.** సం. వి అ న. ౧. పాదము, అడుగు ౨. పద్యపాదము, పద్యచరణము. 3 అడుగు పెట్టిన గుఱుతు, ఇసుక లోనగుచోట్లఁ గనఁబడెడు పాదచిహ్నము ౪ చిహ్నము, గుఱుతు ౫ స్థానము, ఆశ్రయము ; అధికారాది స్థానము ౬. వాక్యము ౭ శబ్దము (సుబంతము, తిఙంతము వ్యాయ అర్థబోధక శక్తి విశిష్టము) ౮. వేదమంత్రముల పదవిభాగము ౯ వ్యాజము, కపటము. ౧౦ త్రాణము, రక్షణము ౧౧. ప్రయత్నము ౧౨ వస్తువు ౧౩ సెత్తి పలకయందలిగడి పండితా

దీక్షా ౫౫ పా కవల ౨. ౧౨౫.

౧౪ పాట, గీతిభేదము పుం కిరణము

**పదరము.** వి తమలపాకులను పదిలపఱచు పాత్రము, అడపము

గీ ... తమలపాకులను బదిల, పఱచునగి పదర మనఁగఁ బరగు నభవ ... — అం. భా. ౨. ౧౭౭.

చ. రక మనస్పైడియూకు పదరంబున నుంచిన పండుటాకులు ... — చంద్ర. ౧. ౯౨.

**పదరికము** = పదరము. వి. పెట్టె.

ఆ మూఁడువగలపగిది ముడుపులు తెప్పించి, కల యనొక్క బదరికమువనుంచి ... — కై భా ౧. ౫౬

**పదరికొను.** స క్రి (√పదరు) తొందరపెట్టు

వ అంత నొక్కించుక యుల్లంబు సల్లనై గిరిజ కిన్నులం మూసినం గనిపకు లాండొరు వులం బదరికొని కెలంకుల కోసరించి రయ్యవసరంబున . — గ సం ౫ ౬౯

**పదరు** = పదురు, వదరు. అ క్రి (క త పదఱు కి ౩ లలో శకటరేఫము అప్పకవి శకటరేఫముగా గ్రహించెను శ ౧ లో సాధురేఫముతో నున్నది నిర్ధారక ప్రయోగములు లేవు) ౧ త్వరపడు, తొందరపడు, తహతహపడు

క. అదియును జెప్పఁగ వచ్చిన, యది దైన నాకింతెవడి ప్రయాణత్వరయుఁ, గుదియింప వచ్చునేనిఁ, బదరక నిమిషంబు నిలిచి భాషింపఁ దగుఁ — ప్రభా ౨ ౪౯

వ గాంధారి గర్భంబు దాల్చి యొక్క సంవత్సరంబు నిండియుఁ బ్రసూతి గాకున్నఁ బదరుచుఁ బుత్త్రలాభలాలస యై యున్న యది ... — భార ఆది ౫ ౯౧

గీ పదరి కథిపతి తెలియంగఁ బాడి యగునె, గాక . — విప్ర ౫ ౪౦

ఆ పాదిపేటఁ జూడఁ బదరెడు గోతిని, మది యొంటింగి తడవు మనిన వెలిచె, కాఁజా కాఱుపోడి శక్కర పూనెడు, చిందు లున్న గూళ్లఁ జేరఁ దెచ్చి. — యయా. ౨. ౨౧.

౨. కినియు, కోపించు.

సీ. సంధ్యలం దొనరించు సద్విధు ల్గడచిన ధర్మ
లోపం బగుఁ దడయు కేల, బోధింపవై తని
భూసురప్రవరుండు పదరుటో ...
భార ఆది ౨ ౧౫౭

సీ అలుకమానుము హరికై సముద్యతమైన
భాగంబు హరిగొన్నఁ బదరనేల
భార శాం ౬ ౩౭౫

ఆ. అతఁడు పైదుపైదు శాఖలు పెన్మిదియును,
శరము లేసియేసి కెరలిపదరి, పలుక
ఉ హరి ౩ ౫౪

౩ క్షోభించు, కోప భయాదులచే కలఁత నొందు

ఉ అర్ధసంజయుండు దన యూత్మలత్వం
బున నవ్వాక్యంబులు దుస్సహంబు లైనం
బదరి దరస్మితంబునఁ
భాగ శాం ౧ ౪౪

గీ అతని యాకారమును జూచి యదరి బెదరి,
చెదరి పదములు దడఁబడ నుదరిపాటు,
గదురఁ బదరుచు నెదఁ ధాత్మి గుదురు
పఱుపఁ జాలక నురులు పఱచి రిష్వాకు
తిలక. ఉ. రా ౩ ౩౪౪.

చ. . అంతటను మిక్కుటమై కపు లేఁగు
దెంచినం, బదరుచు సుగ్రీవంబు లటు
పాఱఁగజైచి భా రా యు. ౧౩౨౪

౪ చలించు.

చ. వదలుదురమ్మ యాత్మకులవర్తన మూలువు
దూలి సాకరణా, బదరు దురమ్మ లేఁదలిరుఁ
బ్రాయపుబోణి నలంతురమ్మ .
చంద్ర. ౪. ౧౦౧.

క. అది గని మధురానగరం, బిదిగో దడవులకుఁ
గంటి మీకృతమాలా, నదిఁ గ్రుంకి పోమ
కుందరుఁ, బదరక సేవింపవలయుఁ బద
పదఁ దనుచుణ్. వాల్మీకి. ౨. ౧౪.

(దృఢచిత్తతకలిగి. అని భావము.)

౫. చలపట్టు, మచ్చరించు.

గీ బెబ్బులికి నీవు నింకైన భేద మొంది, పదరి
కన్నులముందఱఁ బడ్డవానిఁ, గాని వెనకని
గుణ ముండు దానియందు ...
బహు. ౩. ౪౭.

౬. పలుకు, మాటలాడు.

క అది యట్టు లుండె నీతోఁ, బదరం బనిలేదు
వాకుఁ ... భార. శాం. ౪. ౪౦౯.

౭. ప్రేలు, అసందర్భపు మాటలాడు.

క. చంపినఁ జచ్చెద నమచును, గంపింపక రూరి
పలువ కఠినోక్తుల నఖ, గుంపించెదు చాపు
నకుం, దెంపరి రై పదరువాని తెలుఁగునఁ
గుమతీ భాగ ౪. ౨౪౦.

గీ ఏల పదరెదు నీతను హెచ్చు కుందు, మాట
లకు నెంత . వి ప్ర ౫ ౫౪.

౮. దంభములు పలుకు, డాబులు కొట్టు.

సీ పదరి పందెము వైచి బాద దాఁట నెగ
యుచో జెణిచుట్టిఁ గొమ్మ ప్రేల నోకతె.
బహు. ౨. ౨౯.

౯. కూయు, అఱచు

సీ బమ్మరాకాములభంగిని జెట్టెక్కి పదరుచు
నున్నట్టి బర్హిణములు . రసిక. ౩. ౧౪౪.

ద్వి. ... మీకు, వచ్చినలాగున వలవ దున్నట్టి,
రవళి సేయక పదరక యొక్క రొకరు, వివ
రంబుగా మాకు వివరింపుఁ దనిన ...
ద్వి. పరమ. ౪. ౩౩౫. పా. ౧. పం.

స. క్రి. ఆక్షేపించు; పరిహసించు; దూషించు.

వ ... అనిన విని ద్రోణుండు ధర్మజుం బదరి
నీదృష్టి చెదరె నీవు దీని సేయనోపవు ...
భార. ఆది. ౫. ౨౫౧.

మహాస్రగ్ధర. ... పతులఁ బదరి పైఁ గ్రాధి
వాటించి నిట్టూ, ర్పుకడొట్టం దస్సి పీరా
యిల మతి ... ఆము. ౫. ౩.

గీ శైవపరివర్తుఁ గూడి వైష్ణవుల నవ్వఁబదరు
శైవుల వైష్ణవప్రతతి గూడి ..
కాశీ. ౪ ౨౩౧.

సీ పట్టపుదేవిఁ హిమగిరి, పట్టిఁ మాయమ్మఁ
జూచి పదరిప కరివఁ, సెట్టవిసెనొ సేమం
దుల, మ ట్టెఱుఁగనొ కంటికిం బ్రమాదం
బొదవెఁ కాశీ. 3. ౧౧౨.

సీ పలికిన మని కేమీ విఋ, ధులసభలోపలన
తేనదుదుండగి మెల్లం, దెలిపి తగుశిక్ష
సేయుద, మలిగి యిపుడు పదర నేలయని
యతఁ డాడెఁ. కళా 3 ౨౭౯

వి ౧ త్వరితోక్తి.

సీ త్వరితోక్తి వెలయును బద రినంగ ..
ఆం భా ౧ ౧౧౭

౨. పలుకు, మాట.

క. విను మధిప యిట్లు గొనిపో, యి నయంబున
నొక్కనావ రొక్కించెఁదుదం, దన కెక్క
డ సెడలేకుం, దను మునుపటిపదరుఁ గట్ట
డఁగలంబరిగెఁ కళా ౬ ౧౦౦

ద్వి విదువు మీదేశాలిబిద్ద లాజ్జలకు, బడితపా
రము దొంగపదరు లన్నియును
ద్వి హరిశ్చ ఉ ౧౭౯౭

3. అలుపు, కేక

గీ చట్టితోఁ జట్టి పగులంగఁగొట్టి తనదు, ఎద
రులకు నింటిబలుకుక్క లదరి కూయ
శుక : ౨౩౮

౪. ధ్వని

గీ కేకిపడ్జంబె తక్కఁ గోకిలపుఁబంచ, మం
బఱుటఁ దోయిపదరులు మదిఁ బొసఁగమి
ఆము. ౪ ౧౦౨.

౫. క్షోభము, కలఁక.

క. మదిరవరేయొండలచే, సెద వడ చాఁతంగఁ
గొమ్మరొద వడఁ జొచ్చెఁ, జదురుస్మా
టలఁ బెట్టెదు, పద రేఁటికిఁ గొలుప నింకఁ
బద రేయనుచుఁ. కళ. 3. ౧౦౪

౬. కొజ్జు. (చి ని)

ద్వి ముదలింప ముదలింప ము ల్లిచ్చి పెద్ద, పద
రడ్చిన ట్లర్యో నది సెప్పనేల ...
బస పు ౪. ౧౦౪. పం.

జ : పదరిపోను

పదవి. సం. వి ఇ ఈ స్త్రీ. ౧ మార్గము,
త్రోవ. ౨. అధికారము, అధికారస్థానము

పదవి. వి (సం. పదవీ) సంపద

గీ కలిమి సిరి పదవి యనఁగఁ జెలఁగు భూతి
ఆం భా ౧ ౭౪

రగడ మెచ్చిన నిత్తువు మేలగుపదవులు
ఉ. రా 3. ౯౨.

ఉన్నతస్థితి (శ ర)

పదాంకము. సం = పదచిహ్నము.

పదాంగి. సం. వి ఈ. స్త్రీ (హంసపాదమువంటి
స్వరూపము కలది.) హంసపది ⁑.

పదాజి. సం వి. ఇ పుం ౧ కాలినడకను బోవు
వాఁడు, కాలిబంటు ౨. యుద్ధము. 3. మార్గ
ము. (వై. ని)

పదాతి. సం విణ (వ్. నీ వ్) ౧. పదాతులు
గలది (సేన.) ౨. కాలినడకను బోవునది వి.
ఇ పుం కాలిబంటు. ఇ పుం ౧ పాదచారి,
కాలినడకను బోవువాఁడు ౨. కాలిబంటు.

పదాతికుఁడు. సం. వి అ. పుం. కాలిబంటు.

పదాతుఁడు. సం. వి. అ పుం = పదాతి.

పదాదివిదుఁడు. సం. వి. ద్. పుం. (పద్యముల
తొలిపాదములుమాత్ర మెంచఁగినవాఁడు.)

పదాద్యవిదుఁడు. సం. = పదాదివిదుఁడు.

పదానుగుఁడు. సం విణ (అ ఆ అ) అడుగుల ననుసరించి పోవువాఁడు, వెంబడించివచ్చువాఁడు ౨ వి అ పుం అనుచరుఁడు

పదానుశాసనము సం వి అ న శబ్దశాస్త్రము వ్యాకరణము

పదాయత. సం వి ఆ స్త్రీ (అడుగుయొక్క పరిమాణము కలది) ముచ్చె, చెప్పు

పదారము సం వి అ పుం ౧ పాదధూళి, కాలిదుమ్ము ౨ చరణోపరిభాగము, మీఁగాలు

పదార్థము సం వి అ పుం ౧ పదముయొక్క అభిధేయము, శబ్దార్థము ౨ వస్తువు ౩ ద్రవ్యాది (పదార్థములు వైశేషికులకు ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ, అభావములు, ఏడు నైయాయికులకు ప్రమాణాదులు ౧౬ సాంఖ్యులకు ప్రకృత్యాదులు ౨౫ పాతంజలులకు ఈశ్వరునితోఁగూడ ప్రకృత్యాదులు ౨౬ వేదాంతులకు చిత్తు ౧)

పదార్వురు = పదునార్వురు. స (పది + ఆర్వురు) పదునాఱునకు మహన్మహత్త్వార్థక రూపము

వ మౌని యనుదానికి భీమసేనోగ్రసేనాదు లయిన గంధర్వులు పదార్వురు పుట్టిరి
భార ఆది ౩ ౬౫

ఉ ఆర్వురు చక్రవర్తులు పదార్వురురాజులు విశ్వధారుణీ, నిర్వహణప్రభావమున నేర్పరు లైనను వీనిసాటియే  విక్ర ౨ ౩౪

పదాఱు = పదియాఱు, పదునాఱు స ఛా (పది + ఆఱు) ౧ పదియును ఆఱును, షోడశార్థకము

గ వలవంత నైనభీష్మాదుల నర్జునుఁ డోర్చి నూర్జితుం డై మఱి పో, రులఁ గర్ణుండు పదాఱవ, కళకు సమానుండు గాఁడు కవ్వడి తోఁడన్
భార ఆర ౨ ౨౯౩

వ వెండియు గంధర్వదేవమానుష కన్యకలం బదాఱువేలు నూర్వురుగుర నప్సరోగణంబు (లేడింటిం) జెఱలు పట్టి దెచ్చి
ఉ హరి ౧ ౨౪

ఉ కిన్నరకంఠి యొత్తి పటీరపంకమున్, విన్నను వొప్పుఁగా నలఁది నిద్దపుఁ జాయ మెఱుంగునం బదా, ర్వన్నెపసిండితోడ నొరవచ్చు నృపాలునియంగకంబులన్
నైష ౬ ౫౦

సీ నీచ కారకుఁడైన చూచి పదాఱింటివన్నియ గూర్చిత  ఒహు ౩ ౯౨

౨ పదునాఱవది

గీ గుంపు వంపును లేకుండ గుండుపోఁగు, గాఁ బదాఱింటిచెరమును గాఁగ నూలు, వడుకనేర యంచు  శుక ౨ ౪౧౭

(పదాఱింటిచెరము = ప్రశస్తము)

సా ఒకటికిఁ బదాఱు చెల్లించు = ఆధిక్యమును చూపు

ఉ ఇంతియు నేల మీఁకి చెడు రొక్కటి నొక్కటికిం బదాఱు చెల్లింతు
ఉ హరి ౩ ౧౧౪

పదాసనము సం వి అ న పాదపీఠము, కాలుంచుకొనుపీఁట

పదాహతము. సం విణ అ ఆ అ) కాలిచేతఁ గొట్టఁబడినది, తన్నఁబడినది

పది. స ఛా (సం పఙ్క్తి ప్రా పంతి క త పత్తి) ౧ దశార్థకము, తొమ్మిదియునొకటి, దశకము (దీనికి వృత్తియందు సంఖ్యావాచకము పర మగునపుడు తఱచుగాఁ ఉన్, అంతాదేశ మగును

ఉదా. పదునొకటి

క. తురగముల వాలుగిట ను, త్తరు వాతిట
నెనిమిదిట రథముఁ బదిటనువా, నరు నణు
వది శరములన, న్నరునంగంబులను బెలుచ
నాఁటఁగ జేసెఁ.
భార విరా ౫ ౧౦౩

క. .. విరటుఁడు, మదమునఁ దురగముల
జేసె మఱియుఁ బదింటఁ ...
భార. విరా ౩ ౧౭౭

చ. మదనుఁడు రెండు చేతులను మార్పడ
వేయఁగఁ దూపు లైదునుం, బది యయి
వేలువేలుఁ బరిపాటి నవస్థలు సంఘటింపఁగా
వైజ. ౨ ౯౦

గీ వింట నొంకొక గొనయంబు వేగఁ జేర్చి,
కేశవాగ్రజుఁ డొక కేలఁ గేతుదండ, మర్విఁ
గూల్చి కార్ముకము వేతొకట నఱకి, పదిటఁ
బదిట సారథి గెలి బలిమి నొంచె
హరి ఉ. ౭ ౧౭౧

సీ ఇంద్రియంబులు పదియింటిని గుదియించు
టెక్కుడు వెరవు ..
భార. అశ్వ ౨. ౧౫౩

క. ప్రదరంబులు పదియింటం, బదియింటం బదిట
రెంటఁ బరువడి నేసెఁ .
ఉ హరి. ౩ ౪౮

వ. పదులు పదులు నూఱును నూర్లు వేలు వేలు
గములు గట్టి మనుచ ౪ ౩౪

పదిమంది = అందఱు, చాలమంది

(వ్యవ) నే నన్న మాట పదిమంది ఆదరించినచో
తప్పక నెఱవేఱును

పదింట నైదింటఁ = గుంపులు గుంపులుగా

క. పదవగరిగరిడి కందఱుఁ, బదింట నైదింట
వచ్చి పని వినుకేళఁ, బొదువఁబడి చూతు
రెల్లరుఁ, గొదమపులులవంటి రాచకొడుకుల
పిటఁ. కళా. ౧.౭౪.

పదిలక్షలు = అధికధన మిచ్చినట్లుగా సంతో
షింతు ననుట

క నీకిష్టం బిది గాని, నా కాపాపాత్ముఁ
జెప్పినం బదిలక్షల్, లేకున్న విడుతుఁ
బ్రాణము, నీపై కూడుగ్గఁబట్టి నీలగ్రీవా
కాళ ౩ ౧౦౧.

పదిం (ఁ) బదిగఁ = ౧ పలుమాఱు, పెక్కు
సార్లు; పరిపరి విధములుగా

క. మొదలనె మొదలకానిం, జెదరంగా వాద
కార్మఁ జింతింపు పగిం, బదిగ మృషయేని
మఱివిడు, ము ఆము ౪ ౨౨౦

కవిరాజవిరాజితము నీకిరుణకుఁ బాత్రుఁడు
గాఁడు పదింబదిగాఁ గని వచ్చినవాఁడఁ
దుదిఁ రాఘవ ౪ ౧౧౪

౨. లెస్సగా, చక్కఁగా.

క పరికించి పదింబదిగా, నరయుఁడు
ఆము. ౩ ౫౯౫.

ఉ దేవరచర్య లన్నియుఁ బదింపదిగాఁ బరికించి
చూడఁ బ, ద్మావనితామనోహరుని మూఱట
మూర్తిని పరమ ౩ ౩౧

క ఆమఱిరోయుఁ బదిఁబదిగా, సాముద్రతటంబు
నీరఁ జని యుండి .
కేయూర ౩ ౭౨. శుక ౨. ౧౭౫.

పదియుఁ బదియు = పదియుఁ బదియునుగా,
పదింబదిగా

గీ అక్కటా కానవైతి నీమంతిలాఁడి, వగలు
నమ్మితిఁగద పతివ్రత యటంచు ..

కి. అని మఱియుఁ బదియుఁ బదియును, గినుఁ
గొని కదళికకు సాక్ష కల్పించె ...
శుక. ౩. ౭౩౪.

పదియుఁ బదియునుగా = పదింబదిగా.

గీ. అనుడు నతఁ డట్లు యవు నని యపుడు నగుచు,
నింక దీనికిఁ గర్తవ్య మెద్ది మనకుఁ, బదియుఁ

బదియుకుగా నీతిపదవి వరపి, తెలియఁ దగు
వని యి ట్లని పలికె మఱియు
కళా 3 ౨౩౩

జ పం(డెండు, పంచము, పదార్యరు, పదాఱు, పదిగ, పదితేరులదొర, పదిదోయి, ⁻దినూఱులు, పదినూఱుల చేతులజోదు, ౼మొ

పదికము ౦ విణ (అ ఈ అ) పాదచారి, కాలినడకను బోవువాఁడు (వి అ ఫం) పదాతి, కాలిబంటు

పదిగ (క్రి విణ (⁻గి + కఁ) అధికముగా, ఎక్కువగా

ఉ చాలు వివాదము ల్పదిగ శంబునిఁగాఁచి యిట్టిఎఱు౼ గి, వాలమునేని ఎక్కి౼నివి
హం ౪ 3౨

పది తేరులదొర వి దశరథుఁడు

క ఇమ్ముగఁ బదితేరులదొర, కొమ్మల కే నద్దె ఱఁగులఁ గూర్మిఁ బొడమెదఁ
అచ్చ రా బాల ౭౨

(ఇట్టే పదియరదముల దొర)

క ఎదఁ గుదు రగుపేడుకఁ బొగ, డుదుఁ బరి యరదముల దొరకొడుకు కథ కడు నిం, పొదవఁ గదియించి యసముఁ, వొదలిన బల్లిదునిఁ బుట్టఁ బట్టువు శపకఁ
అచ్చ రా బాల ౯

పదిదోయి స (పగి + దోయి) ఇరువది

చ అర్మిలిఁ, దన పదిదోయిచేతుల నతిం డిజిగాఁగిటఁ జేర్చి నందనుఁ
నిర్వ ౫ ౧3౨

పదినూఱు స (పది + నూఱు) వేయి, సహ(స్రము

ద్వి మదిరాక్షి యిందుల మహిమ వర్ణింపఁ, బది నూఱు ముఖముల ఫణియును జాలఁ, డు
ద్వి హరిశ్చ ఉ ౫౪

ఉ ఇంక నొప్పుని మృగాక్షుల ఒల్మి బట్టె కేని స, హ్మాదము దీజ పంం శిరమల్ పదియుం బగిమాఱు(పక్క౼ లై, పేదిని గూలుఁ గావుత నిమేషములో భువనంబు మెచ్చఁ గఁ
ఉ ౼ ౪ ౧ ౧

పదినూఱుల చేతులజోదు వి (√ఎది) సహ(స్రకరుఁడు ౧ హ(స్రాంశుఁడు, సూర్యుఁడు

ఉ పదినూఱుల చేతులజోదు పచ్చబా, బామెయిపచూపు లేరిదొర భానుఁడు తూర్పువఁ దోఁచె నత్తిఱిఁ
కృ శకుం 3 ౫౭

౨ కార్త వీర్యార్జునుఁడు

పదినెనిమి(న్మి)ది = పదునెన్మిది ౦ (ఎది + ఉన్ + ఎనిమిది = పదిన్ + ఎనిమిది) అష్టా దశాధికము, పదియు ఎనిమిదియు

వ శ్రీనరసింహదేవుని వసంత పున్నమతిరునాళ్ల మహోత్సవం అఖిల దేశాల పదినెన్మిది మంది శ్రీవైష్ణవులున్ను
౧3౬౫ శి శా 3 ౧౧౨౧

పదిపాట వి (√ఎది) పదిపాటల సమాహారము, పదిపాటలు

ద్వి అలపరాంతకుని, పటుతరదివ్య(ప్రబంధంబులోనఁ, బదిపాట వినిపింపఁ బదివేల గళుల, మూద మంది
ద్వి పరమ ౭ ౫౬౫ పా

పదియర్లజోదు వి (పది + అఱులు + జోదు) దశకంఠుఁడు, రావణుఁడు

గీ అంత నీలునిపైఁ బదియర్లజోదు, తేరు వోనిచ్చి బలువాలు నారసములు, నినుప
అచ్చ రా యు ౨౧౪

వ. . ఒక రొలకాగ వక్షోజ భాగంబునం
బద్మరాగ పతాకంబుఁ బదిలపఱిచె .
నైష. ౭. ౮౮

సీ. నిజవిరుదాత్మ రాన్విత హేమపట్టిక ఫాల
భాగంబునఁ బదిలపఱిచి
హై భా ౩ ౨౭౦

గీ అలరుఁబోఁడి, పురుష సెవ్వనిఁ
జిత్తంబు చూఱఁగినీక, బ్రహ్మచర్య వ్రతస్థితిఁ
బదిలపఱిచి, యుత్తరార్కునికడఁ జేసె నుగ్ర
తపము .. కాశీ ౫ ౩౩౧

౨. సవరించు, చక్కఁజేయుచు

సీ తలఁకు డెందముతోడఁ దాలిమి గీలించి
పక్కొయ్యదఁ జనుదోయిఁ బదిలపఱిచి .
విక్ర ౧ ౧౫౭

౩. ఏర్పఱుచు.

క పదిచుట్లు సాఱురేకులు, పదిలపఱిచి సుకవి
పేరు పతిపేరును లోఁ, బొదలఁగ నేవం
విధగుణ, విదితం బగుచక్ర బంధవిధ మెట్ల
న్నన్ నగస ౪ ౭౫

పదిలము. వి (సం భద్రమ్ ప్రా భద్దం) ౧
స్థైర్యము, నిలుకడ

మ. . శాహసం, పద సొంపారఁగ నన్న
దమ్ముల మిముం బ్రాణంబులం బ్రాపుదుం,
బదిలం బేది లోలంగిలేని దివియుం బాతాళ
ముల్ లోనుగాఁ, దుది నీచొచ్చినచోటఁ
జొచ్చి ... హరి ఉ. ౧. ౧౧.

క. కదళి గర్భసమున ధర గ్రా, క్కదలఁగ
శేషుండు శిగము లల్లన వంపం, బదిలంబు
లేక కూర్మము, చదికిలఁబడ దిగ్గజములు పరి
భ్రమగ్గతిలన్ భా. రా యు. ౧౩౧౦.

మ. . సాలుకకుదిన్ బంచాక్షరీ మంత్రమున్,
బదిలం బొప్పఁ జపింపు మన్న ... .
హర. ౨. [illegible]

౨ జాగరూకత, అవధానము, అప్రమత్తత

గీ ఎచ్చరిక రొచ్చెరిం చేవ యేద పదిలము
కావలెను పోటిమి యన నొప్పు నవధానము
ఆం భా. ౧. ౧౩౭

చ ఎదురుగఁ బోవనిమ్ము రథ మీతని తేరికి
నన్న నాతఁడుం, బదిలముతోడ రథ్యముల
పగ్గము లెత్తెల నూలుకొల్పి ...
భా విరా. ౫. ౧౭౧.

చ పదిలముతోడ నా హంతులు పావకులో
హరవైరి నాటతో, మ్మిది దగ చేర్చి ...
భా రా. యు. ౧౩౭౪

(విణ) ౧ స్థిరము, అచంచలము

క తనయునికి పదిలముగ నా, తనయునికిం
గలుగ దితని తనయులకైనన్, వనజోదర
యాదరమునఁ, గనుఁగొని ప్రాజ్యోతిషంబు
గరుణింపఁ దగున్
ఉ హరి. ౧ ౧౭౩.

గీ. కొదలు దెలియంగవలె ననుకొర్కెఁ జేర్చి,
కొదలఁ బొదలిన పదిలంపుటీ సమర్చి
జై. భా ౨. ౭౩

క ఇది యేమికంక నీవు, న్మదవృత్తిని కంక
దక్కి నాగద్దియపైఁ, బదిలంబుగఁ గూర్చుం
డితివి భార విరా ౫ ౩౧౭

చ పదిలపుఁ బ్రేమ యారతులభంగులు చాల
విరాళి గొల్పఁగన్ . . కళా. ౪. ౧౨౧

౨. దృఢము

(క) అసందిగ్ధము.

ఉ చేసట లేక భీమపృథివీ పతినందన యాన
నాంబుతో, గ్లానవిరక్తిముద్ర పదిలంబుగఁ
గట్టొని ... నైష. ౫. ౧౭౩.

చ. ... ఆనతి విప్రునియింటి కేఁగి యు, ల్లన
వతఁ డొంటియున్నిఁ బదిలంబుగఁ జూచి
సమీపమందున ని, ల్చిన ..
భోజరా. ౪. ౩౦౯

ములం గైకొని యప్పుడు తేరులతోని కొడుకు
బదలంగ జేసె
అచ్చ. రా. యు ౫.౨౨. కృ శతం. ౧ ౪౦

క పదిరువ్వంబులు భక్తిం, బదిలం బై వినఁగ
వలయు భారతము ...
హరి ఉ ౧౦. ౨౭౩.

౨. అక్షుబ్ధుఁడు, చిత్తక్షోభము నొందనివాఁడు.

క ఆచేప లిపుడు మీరలు, పైచినమల లెల్ల
మ్రింగివైచెఁ జామీ యీరా, రాచల్వ తోఁడ
పదిలుఁడ, వై చెచ్చెర నసవఁ గట్ట నంపుము
నలునిన్ . . అచ్చ. రా యు. ౬౪

మ. . . తా విషము సాహ్యనించుచో డాయు
చోఁ బదిలుం డై కడి సేయుచోఁ గను
చుచో భక్షించుచో మ్రింగుచో . .
భాగ ౧౦ ౨౪౪.

క. ఇది యేమిచంద మేఁటికి, మది యిట్టిది
యయ్యె ననుచు మతి యొయ్యన నేఁ, బి
లుఁడ వై నలుదిక్కులు, వదలక పరికించు
నపుడు వల నొప్పంగన్
హరి. ఉ. ౬. ౬౨

౩. నిపుణుఁడు, జాగరూకుఁడు

క ఆది లిస్సగ విడిచి ప్రకృతి, కుదకవిభాగలన
మును ఝుంపోపమ దనుపం, బదిలుఁ డయి
చూడ నేర్చిన, విదితం బగు దానితోడి
తేర్పా టనఘా
భార. శాం ౬. ౧౨౫.

క. విదితయశుఁ డైన పురుషుఁడు, పదిలుం డై
కూడి నడుకఁ బకయుక సోమం, బొదవఁగ
రాయుట యేఁటికి, యెదిరిం దనయట్ల కాద
యే కార్యములన్.
హరి. ఉ. ౯ ౩౪. నిర్వ. ౩. ౧౨.

**పదివేలు.** స. బ. (పది + వేలు.) ౧. అయుతము, దశ సహస్రము.

సీ. పటుజవస్ఫురణ మై పదివేల హయములు
పూనంగ నేతేరు పొలుపు మిగిల ...
విక్ర. ౨. ౧౦.

౨. అనేకము.

గీ కీర్తి యిటు పెల్లు నంద్రు దాక్షిణ్య మట్లు,
దారు గల్గినఁ బదివేలు దమకుఁ గలవు ...
శైవ. ౩. ౧౧.

గీ. సఖ్య లనిలజుఁ బదివేల చందములను, బ్రస్తు
తింపఁగ శ్రీరామభద్రుఁ దలఁచి ...
ఉ. రా. ౫ ౧౪౩.

౩. మిక్కిలి గొప్ప లాభము.

వ నాకు మంగళసూత్రం బీపాటి శుభస్థితి
నుండుటయ పదివేలు . కళా ౪. ౩౩.

క మీ కరుణఁజేసి వంధ్యత, లేక మదీయా
దరము ఫలించినఁ జాలున్, నా కంతియ
పదివేలు ని, రాకులమతి నైతి ననిరి యని
చెప్పుటయున్ భోజరా ౨. ౨౧౯.

క ఘనులతపంబులు చెఱుపం, బనిచిన నిఁకఁ
జనఁగవలదు పదివే లైనన్ .
వాల్మీకి ౩. ౧౩౫.

ద్వి. ఇంపార సైరంధ్రి నిట నుండనీక, పంపుద
మిఁకఁ జాలు పదివేలు వచ్చె ..
ద్వి. విరాటపర్వము. ౧. ౪. పా.

(ఇట వ్యతిరేక లక్షణచే 'గొప్ప నష్టము' అని
అర్థము)

**పదివేవురు.** స. (√పది) పదివేలునకు మహన్మహత్త్వర్థక రూపము.

క. నీ వొకత వేల యిలఁ బది, వేవుర నే వలచి
పట్టె దెదకిన వర్ణం, బై వచ్చి వలదు నా
నిం, దేవాఁడు మగండు దీని పెంచఁగవ
కంటే. భార. విరా. ౨. ౨౫౬

ఉ. వేయి విధంబులందుఁ బదివేవురు పెద్దలు.
విక్ర. ౧. ౧౨.

**పదుంఁడ్రు** = పదుగుంఁడ్రు, పదుగురు. స (√పది) పదికి మహన్మహత్వార్థక రూపము

క. పదలక పెనఁగి పదుంఁడ్రం, బదిరేవురు నొక్కపెట్ట . భార. ఆది ౫ ౧౭౫

వ. ... శ్రీ భీమేశ్వర మహాదేవరకుం దిరువీథం బనియ తిపన్నులు పదుణ్డ్రికు నిరుపూట .. ద. కా. ౪ ౧౦౪౭

సీ. జీవితేశ్వరునకు జీవితైశ్వర్యల నాఁ బదుం(డ్రను బరిణయము సేసె ... కు. సం. ౧ ౭౪ ఉ హరి. ౧ ౭౬.

**పదుగు.** వి ౧ వంశము.

సీ. పంతు కౌలము వంగనము వంగడము పదుగన వంశసంజ్ఞ లైయలరుచుండు . . ఆం భా ౨ ౧౭౦

౨. = పదువు. (సజాతీయప్రాణి సముదాయము శ ర)

**పదుగుంఁడ్రు** = పదుగురు. (√పది) - (శ ర)

**పదుగు(ద్గు)రు** = పదుంఁడ్రు, పదుగుంఁడ్రు, పదురు, పదువురు. స (పది) పదికి మహన్మహత్వార్థక రూపము

గీ. పావురంబులఁ బట్టెడువారిఁ జేరి, యుద్దవిడిర మ్మనిన భృత్యు లొకవిఁ బట్టి, పదుగుర త్తఱి బడి బడిఁ బాలుతెంచి సారంగ. ౧ ౧౫.

సీ. . అతనిపుత్రులు పద్గు రధికబలులు భాగ. ౭. ౧౭.

**పదునల్లుము.** వి. (పది + నాలుగు + తూము) పదునాల్గు తూములు. (శ. ర)

**పదునాలుగు(ల్గు)** = పద్నాల్గు. స. ఔ (పది + నాలుగు) పదియు నాలుగును, చతుర్దశార్థకము.

చ. ... గాథమతి న్నిగమాదు శైవవి, ద్యలు పదునాలుగింటికి నరం డొనరించెఁ బతుర్దశత్వముల్ శైవ. ౧. ౪౫

క పదునాలుగు లోకంబులు, నుదరస్థములుగఁ జరించుచుండెడు లక్ష్మి, హృదయేశుఁడు నిను వేఁడఁగ, (బదికితి నీ(బదుకు (బదుకు బలిభూపాలా వి(క. ౨. ౧౫౦.

ఉ. ఉండుడుఁ జోళభూమి నొకయూరఁ గళల్పదునాల్గు నేర్చి ... ఆము ౬. ౬౮.

క. పదునాల్గు మహాయుగములు, ముదు కగు భీమేశ్వరునకు నెంగచాలై యుం, దదు నానిపెండ్లి రుుప్పుడు, నది దక్షారామ మహిమ మునినో కాదో భీమ ౧ ౧౧౨

**పదునిద్దఱు** = పన్నిద్దఱు, పన్నిరుగురు. స. (పది + ఇద్దఱు)

సీ. రూఢి నేకాదశరుద్రులతోఁ బదునిద్దఱు సాధ్యు లుద్వృత్తి నడుచ .. ఉ. రా. ౪. ౨౨౯.

**పదును.** వి (పది + ఊను) పది యంగుళముల వఱకు నేలయందు తడి చొచ్చునంతటి వర్ష ప్రమాణము. (శ. ర)

**పదునెనమంఁడ్రు.** స. (పది + ఎనమంఁడ్రు) పదుగురును ఎనమంఁడ్రును, పదునెనిమిదికి మహన్మహత్వార్థక రూపము

క. తునియలు తొమ్మిది యుఁట పదు, నెనమంఁడ్రఁట మొచువారు ... ఆము. ౧. ౩౫.

**పదునెనముందుము.** (పది + ఎనిమిది + తూము) స. పదునెనిమిది తూములు. (శ ర.)

**పదున(ణ్మ)నిమిది.** స. (పది + ఎనిమిది) పదియు నెనిమిది, అష్టాదశార్థకము.

గీ. పృథివిఁ బదునాలుగిది యోగపీఠశక్తి, గణ
ములో నెంత సర్వశృంగార యగుచు, భీమ
నాథుని సన్నిధిఁ బ్రేమపెలయు, మాణిక్యా
దేవి సకల కల్యాణమూర్తి.
భీమ. ౧. ౧౦౨

సీ. బంధురబలుం జరాసంధుఁ బద్నెనిమిది
మాఱులు రణభూమిఁ బాఱఁ దోలి
చిత్రభా. ౭. ౭౪.

పదునేడ్డుము. వ (పది + ఏడు + తూము) పది
యేడు తూములు. (శ ర)

పదునొకఁడు = పదునొకొండు, పదొకండ్రు,
పదొకొండు. స ఔ. (పది + ఒకఁడు) పది
యును ఒకటియు, ఏకాదశార్థకము, పదునొక
టికి మహాన్మహత్వర్థక రూపము

క. విదితం బై యుద్యోగము, పొందలుగఁ బదు
నొకఁడు పర్వముల నెంతయు నొ, ప్పిది
మై యేనవపర్వం, బిది నా నుద్యోగపర్వ
మి మ్మగుసభలన్ భార ఆది. ౧ ౪౩

క త్రి, పర్వంబు పదునొకం డగు,
పర్వము నా వెలయు .
భార ఆది. ౧ ౫౬

పదునొకొఁడు = పదునొకఁడు. స ఔ

చ ... మా, కొనరిన సైన్యముస్ పదునొకొం
టికిఁ బ్రాభవ మాచరింపఁ జొ, చ్చిన సక
లంబు నొప్ప నభిషేకము సైకొనుఁ డుత్స
వంబుగన్ భార. ఉద్యో ౪. ౧౪౦

('పదనొకఁడు' అని అకార ఘటితముగ నీ
క్రింది ప్రయోగమునఁ గవఁబడుచున్నది.)

క. ఎనిమిది తొమ్మిది పదియుఁ బ, దనొకొం
డ్పం డ్రెండు గాఁగఁదగ నేర్పడుచున్ . .
ప్రబంధ. ౧౭౭.

(ప్రయోగాంతరము లేదు.)

పదునొకొల్తుము. (పది + ఒకొఁడు + తూము)
వి పదునొకొండు తూములు

గీ పొదలు నేకాదశాఢకి పదునొకొల్తు, మనఁగ
ఆం భా. ౨. ౨౪౧

పదునొక్కఁడు = పదునొకఁడు.

గీ. అస్తమించినయప్పు డీ యమృతకరుని, కళలు
పదునొక్కఁ డెక్క రుద్రులశిరంబు
సైవ. ౫ ౧౫౫

పదుపు = పదువు. వి ౧ సజాతీయ ప్రాణి
సముదాయము

గీ శితిగిరిమీఁద మదకరుల్ సీత్కరించు,
నెలుఁగు నవఘు నారవమని యొసఁగి యాడు,
నమ్మి పదుపులు గిడు నొప్ప . .
కు సం 3. ౨౫౦

(పదవు ప్రాఁతిప్రతి పా)

గీ అల్లనల్లన పతి వదయాడ నేఁ, గలికిపలుకుల
వాల్గంటి పలికె నేని, యంచ లంచల వచ్చు
రాయంచకదుపు, కూరనేతెంచుఁ గేరంపుఁ
గొదమపదుపు రాజ చ ౨. ౧౪౪.

చ. . మిందతు, మ్మెదపదుపు ల్మదోదయము
మిక్కిలి వేడుకయు న్మనంబులన్, బొద
లఁగఁ గ్రొత్తయామనికిఁ బొచ్చెములే కదు
రేఁగుచాడ్పునన్ . సైవ. ౪. ౧౪.

౨. పంక్తి, వరుస

సీ. ... బారు బంతి, పదుపు చాల్ చాలుపు
పొఁజా సారిది చాలు నాఁగిను బంక్తికి
నామ మగును ఆం. భా. ౨. ౩౪.

(పదువు. ప్రాఁతప్రతి. పా.)

పదుముగ్గురు = పదుమువ్వురు. స ఔ.
(√పది) పదుగురును ముగ్గురును, పదుమూఁడు
నకు మహాన్మహత్వర్థకరూపము.

సీ. ద్వాదశద్వాదశాత్మలతోఁ బడిఁ బదు
ముగ్గురు విశ్వులు ముందు నడువ ...
ఉ. దా. ౪. ౨౯

**పదుముత్తూము.** (పది+మూఁడు+తూము) వి
పదుమూఁడు తూములు (శ. ర)

**పదుమువ్వురు** = పదుముగ్గురు. (√పది)

చ. ... అనర్ఘశమత్సరంబుమై, సురరిపుసన్ని
ధుండు పదుమువ్వుర గం దదఁగంగఁ దెట్టెఁ
దా, విరువు వెలుంగ విజ్జఁ దరిభీకరభూరి
భుజాబలంబునన్ నిర్వ. ౧. ౨౭

క. దితి కొండ లగుపదుమువ్వురు, సతు లతనికిఁ
గలరు . . దశా. ౩ ౫

**పదుమూఁడు.** స. ౭ (పది+మూఁడు) పది
యుమూఁడును.

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొ మ్మదవి
యుండుం జేరు వంచించియుం, బదుమూఁ
డేఁడులు నీవునుం దిరిగిరా పా లీకపో
వచ్చునే ... భార ఉద్యో ౩ ౬౪.

ఉ. ముందటియట్ల యింకఁ బదుమూఁడుదినం
బులమాత్రకున్ భవ, న్మందిరవాస మియ్య
కొనినం గడ కేఁగు మదీయవాంఛ ...
భార. విరా ౩. ౬౭.

క. వాఁ డతినియమంబునఁ బదు, మూఁడేఁడులఁ
దాఁక ధ్యానమున నుండంగన్
ద్వా. ౧౦ ౧౧౪.

వ. శ్రీకాకొలని శ్రీవల్లభునికి అరదీపానకుం
పెట్టినవాదలు పదుమూఁడు . .
ద. శా. ౪. ౯౨౪.

**పదురు¹** = పదరు, వదరు. అ. క్రి. ౧. అసం
దర్భపుమాటలాడు, క్రోలు.

క. ఇది యట్టిద కోపంబునఁ, బదిలుండఁ గా
కేను మున్ను పదిరిభశరవన్, హృదయము
గలఁగిన నా కె, యట్లదియును దోఁపమి
విశారి నైతి మహాత్మా .
భార. కర్ణ. ౩. ౧౦౫.

౨. అదరు, అతిశయించు. చూ పద్రుచు.)

(స క్రి (= పదరు, వదరు) అలుచు; కూయు.)

గీ. వన్యజంతుచయంబుల వానివాని, పదురు
పదురుచు వంచించి పట్టఁబోదు, రు ..
భాగ. ౧౦. పూ. ౪౩౦.

(వి. ౧ అలుపు, కూఁత)

గీ వన్యజంతుచయంబుల వానివాని, పదురు
పదురుచు వంచించి పట్టఁబోదు, రు ...
భాగ ౧౦ పూ. ౪౩౦

మ కమనీయం బగువేఁటకానిపదు రాకర్ణించి
నిశ్శంకంబుగాఁ, దమచిత్తంబులఁ జూచి చేరి
హరిణుల్ తద్బాణనిర్భిన్ను లై .
భాగ ౧౦ పూ. ౧౪౬

(చి ని పా 'పలుకాకర్ణించి' ముద్రి. పా)

(మూ: వయమృతమివ జిహ్మవ్యాహృతం
శ్రద్దధానాః కులికరుతమివాజ్ఞాః కృష్ణ
వధ్వోహరిణ్యః ...
సం భాగ ౧౦. ౪౭ ౧౯

౨. విధము.

క. తుద కొండ లెఱుఁగరు చదువుల, పదు
రెఱుఁగర తమ్ము నెందు బదు రెఱుఁగని దు,
ర్మరకవులఁ గూడియుఁ బద్యపు, గూడియులఁ
జదుపంగ వలదె గుటగుట లడఁగన్
కవిస. ౧. ఆ. (శ. ర.)

(బ) త్వరితపుమాటలు.

క. ఇంక నిటమీఁద మాతో, వంకలపదురులును
వాఁడు వాఁడవ యును మీ, అంకెల పనికే
దిదె విను, గొంకరవో పదుమువ్వుర్కాఁ గొల్పె
దము కొనన్ ... నృసిం. ౪. ౧౦౯.

జ: పదురుచు, పద్రుచు.

(కూడనిపద్దు = అరోహావ్యక్తరాలు.)

(శా.) ఎన్నిక, ప్రసిద్ధి.

చ తనకిదికోళి పద్మమయి. కేద్దయేఁ బద్దు వహించి . హంస ౧. ౨

క జగతి బయకారిపద్దున, సిగచెడు మీకింత చింత నిజశాలంబుల్, దిగవిడిచిపోవు టుచితం, బగుసేయన యాంజకేయఁ జూడిన వారక్

సమీ౽ ౬ ౨౭౦ ఇందు ౧. ౪౧.

పద్దు². వి (క పద్దు, పద్దు = గృధ్రము) గ్రద్ద. (చూ పద్దువాడేగ)

పద్దువాడేగ. వి గృధ్రముఖము గిలడేగ, శ్వేన విశేషము

సీ పద్దువాడేగలు పావురాయలు నెమ్మి పించెంపు గుంచెలు పికిలిచెంప్లు

రసిక. ౧ ౬౪

పద్ధతి. సం వి ఇ ఈ (స్త్రీ). ౧ మార్గము, త్రోవ ౨ వరుస, పంక్తి, శ్రేణి 3. విధము, రీతి

ద్వి పలినాస్త్రకుల నాథ నా తోడనీవు, పలికిన మాటల పద్ధతిదప్పె

ద్వి పారిశ్చ ౬ ౧౪౪౨

పద్ధిమము. సం వి అ న. పాదశీత స్పర్శము, కాళ్లు చల్లఁబడుట

పద్నాల్లు(లుగు) = పదినాల్గు, పదునాల్గు.

ప (√పది) పదియు నాలుగును

మ .. భవత్తుమారి పదికేల్ వర్షాలు జీవించు 'గం, టక పద్నాల్గవ యేటఁ జెందుఁబతి గండంబంచు వాచించిరన్ ...

చంద్రా 3. ౧౪

మ ... రాఘవునిఁ బద్నాల్గేండ్లు కాంతారమం, దుకు వర్తిల్లఁగఁ బంపఁ ..

పెల్ల. రా. అయో. ౭౯. వాల్మీకి. ౧. ౨.

పదొన్నికఁడు = పదునొకఁడు.

గీ మాసములు పదొన్నికండీ క్రమమున వడపి.

వరాహ. ౯, ౮౪.

పద్మ. సం వి. అ (స్త్రీ) ౧ లక్ష్మి. ౨ లవంగము ? 3 భంటిక, గంటుబారంగి ?. ౪. మెట్టదామర ?

పద్మకందము. సం వి అ పుం. తామర దుంప. ?

పద్మకము. సం వి అ న ౧ ఏనుఁగునిబ్బెము, ఏనుఁగుమొగమున యౌవనకాలమునందు బయలు దేఱు మచ్చలు ౨ పద్మకాష్ఠము, ఔషధవిశేషము ? 3 చెంగల్వకోష్టు ? ౪ పద్మము, తామర ?. ౫ పద్మవ్యూహము ౬ పద్మాసనము

పద్మకర. సం వి అ (స్త్రీ) లక్ష్మి. (ఇట్లే: పద్మహస్త మొ)

పద్మకర్కటి. సం వి ఈ (స్త్రీ) తామరగింజ (వై ని)

పద్మకర్ణిక. సం వి అ (స్త్రీ) ౧ తామరదుద్దు ౨. పద్మమువలె పన్నిన సేనావ్యూహముయొక్క నడిమిభాగము

పద్మకళిక. సం. వి అ. (స్త్రీ) తామరమొగ్గ.

పద్మకాష్ఠము. సం వి అ న. పద్మకమను ఓషధివిశేషము ?

పద్మకి. సం వి న్ పుం ౧. (పద్మకముల గలది) ఏనుఁగు ౨. భూర్జము, బుజపత్రి ?.

పద్మకేస(శ)రము. సం వి. అ పుం. న. పద్మకింజల్కము, తామరయకరము.

పద్మకోశము. సం వి. అ. పుం. ౧. తామర మొగ్గ. ౨. అభినయ హస్తవిశేషము. .(అంగుళు

(శ్లేసు కొనలు కూడ కందునట్లు విల్లువలె వంచి రొండము గిలవానిగాఁ బట్టునది )

పద్మగంధి. సం విణ (ఇ) తామరవంటి వాసన గిలది వి. ఇ న పద్మకాష్ఠ మను ఓషధి శ్రీ

పద్మగర్భుఁడు. సం వి అ పుం ౧ పద్మము జన్మస్థానముగాఁ గలవాఁడు బ్రహ్మ, తమ్మి చూలి ౨. పద్మము గర్భమునఁ గలవాఁడు విష్ణువు, అంబుజోదరుఁడు

పద్మగుణా. సం = పద్మగృహా

పద్మగృహా. సం వి ఆ స్త్రీ ౧ లక్ష్మి ౨ లవంగము. శ్రీ

పద్మచారిణి. సం వి ఈ స్త్రీ కాశ్మీరదేశమునఁ బుట్టు మెట్టదామర శ్రీ

పద్మజుఁడు. సం వి అ పుం పద్మమునఁ బుట్టిన వాఁడు. బ్రహ్మ

(ఇట్లే: పద్మజాతుఁడు, పద్మభవుఁడు, పద్మసంభవుఁడు. మొ )

పద్మతంతువు. సం వి ఉ పుం ౧ మృణాలము, తామరతూఁడు, ౨ తామరకాఁడలోని నార.

పద్మతడుకులు. మి వి అభరణవిశేషము

వ. ... శ్రీకాకొలని శ్రీ వల్లభరాయనికి సమర్పించిన సువస్తువులు ... సన్నంపుఁగాసవేలు ౧. ఘంటలు 3 తోసుపిన్నవి ౧. ఒత్తులు ౨ పద్మతడుకులు ౨. ముత్యాల తిరుణామం. ౧ దశా. ౪. ౯౩౧

పద్మనాభుఁడు. సం. వి. అ పుం. పద్మము నాభియందుఁ గలవాఁడు. తమ్మిబొడ్డువాఁడు, విష్ణువు

పద్మనాయకులు. సం వి అ. పుం బ. వెలమలను ఒక జాతివారు.

పద్మనాళము. సం. వి. అ. న. తామరకాఁడ.

పద్మపత్త్రము. సం. వి. అ. న. ౧. తామరాకు. ౨ తామరరేకు. 3. పుష్కరమూలము. శ్రీ.

పద్మపుఁదీఁగ. వి. (పద్మము + తీఁగ) చీర పువ్వుకట్టుతీఁగ శ్రీ (శ ర.)

పద్మపుష్పము. సం వి. అ పుం. ౧. తామరపువ్వు. ౨ కర్ణికారము, కొండగోఁగు శ్రీ. 3. పికాంగ మనెడు పక్షి.

పద్మబంధువు. సం. వి ఉ. పుం. ౧. సూర్యుఁడు. ౨. అర్కము, జిల్లేడు శ్రీ 3. తుమ్మెద ౪. దినము, పగలు (వై. ని)

పద్మబాంధవము. సం వి. అ పుం. ౧. అర్కము, జిల్లేడు శ్రీ ౨. తుమ్మెద

పద్మబాంధవుఁడు. సం వి అ పుం పద్మబంధువు, సూర్యుఁడు

పద్మబీజము. సం వి అ. న పద్మాక్షము, తామరగింజ, తామరపూస.

పద్మము. సం విణ (అ ఆ అ) పసుపు నలుపు తెలుపు కలిసినరంగు గలది (శే ని) వి. అ న. ౧. తామరపువ్వు ౨ పుష్కరమూలము శ్రీ. 3 ఏనుఁగునకు యౌవనకాలమున మొగము నందుఁ బుట్టు మచ్చలు ౪. పద్మాకారముగా నున్నన సేనావ్యూహము ౫ పదియర్బుదములు ౬. సీసము. ౭. (తంత్రి) శరీరమందలి నాడీ చక్రము. ౮. పద్మకాష్ఠమనెడి ఓషధి శ్రీ. ౯. శరీరమందుఁ బుట్టు ఒకజాతిమచ్చ, పొడ. ౧౦. ఒకరకము వస్త్రము.

గీ. హంసపల్లెను పద్మాలు హారిణపల్లె, చెండ

లుగా పల్లవాలు ధరించి ముదితలపుడు ..

ప్రబంధ. ౨౦౨.

౧౧. ఇంద్రియము ౧౨. అష్టకాంగ్రార్థము. (శే. వి) పుం ౧ కుబేరుని నవనిధులలో నొకటి. ౨ రతిబంధవిశేషము.

శ్లో॥ హస్తాభ్యాం చ సమాలింగ్య నారీ పద్మాసనోపరి, రమేద్గాఢం సమాకృష్య బంధో అయం పద్మసంజ్ఞకః (వాచ)

3. తామరపూవు. ౪ పసుపు నలుపు తెలుపు కలిసినరంగు

పద్మముఖ. సం వి ఆ స్త్రీ = పద్మముఖి.

పద్మముఖి. సం. వి ఈ స్త్రీ ౧ తామరవంటి ముఖము గలస్త్రీ; స్త్రీ ౨. దూర్వాలత శ.

పద్మయోని. సం వి. ఇ పుం. (పద్మము జన్మస్థానముగాఁ గలవాఁడు) బ్రహ్మ, తమ్మిచూలి

పద్మరవి. సం వి ఇ పుం ఉంగరములలో భేదము.

ద్వి రాజితం బగు పద్మరవియుంగరములు, తేజంబు పిడికిట దీటుకొనంగ

నవ ౫ ౨౩౨ పా ౯ సం

పద్మరాగము సం వి అ పుం న మాణిక్య విశేషము, తామరకెంపు (ఇది సింహళమునఁ బుట్టునదిఁ గ్రత్తవర్ణము కలగి ఉత్తమజాతి రత్నము

పద్మరేఖ. సం వి ఆ స్త్రీ చేతియందలి పద్మాకార మగురేఖ

(ఇది ధనలాభసూచకము)

పద్మలాంఛన. సం వి ఆ స్త్రీ ౧ లక్ష్మి ౨ సరస్వతి

పద్మలాంఛనుఁడు. సం. వి అ పుం ౧ బ్రహ్మ. ౨. కుబేరుఁడు 3 సూర్యుఁడు. ౪. రాజు.

పద్మవర్ణకము. సం వి అ పుం పుష్కరమూలము.

పద్మవాస. సం. వి ఆ. స్త్రీ లక్ష్మి.

పద్మవృక్షము. సం. వి. అ పుం. పద్మకాష్ఠము, పద్మక మగు ఓషధి శ

పద్మవెలమలు. ము వి పద్మనాయకులు (శ ˙ )

పద్మషండము. సం. వి అ పుం న పద్మసమూహము, తామరతంపర

పద్మాకరము. సం వి అ. పుం. పద్మములకు స్థానము

౧. తామరకొలను ౨ కొలను, జలాశయము; తటాకము, చెఱువు 3. తామరతంపర, పద్మసమూహము.

శ్లో॥ "పద్మాకరం దినకరో వికచీకరోతి"

సం. భర్తృ నీతి. 83.

(ఆకరః = సమూహము అని వ్యాఖ్య)

పద్మాక్షము. సం వి అ న, పద్మబీజము, తామరపూస, తామరగింజ

పద్మాక్షుఁడు. సం విణ (అ ఈ అ.) తామరవంటి కన్నులు గలవాఁడు

(వి అ పుం విష్ణువు)

పద్మోటము. సం వి అ పుం. చక్రమర్దము, తగిరిస శ

పద్మాలయ. సం వి. ఆ స్త్రీ. ౧. లక్ష్మి, తమ్మి యింటిగరిత ౨ లవంగము శ.

పద్మాలయుఁడు. సం వి. అ. పుం. పద్మము నివాసముగాఁ గలవాఁడు బ్రహ్మ.

పద్మావతి. సం. వి ఈ. స్త్రీ. ౧. పద్మచారిణి, కాశ్మీరదేశపు పెట్టదాఱర. శ. ౨. మనసాదేవి. 3. ఒకానొకనది.

పద్మాసనము. సం వి. అ న ౧. పద్మమనెడు ఆసనము, తమ్మిగద్దియ. ౨. (పద్మమువంటి ఆస

నము) ఆసనభేదము కుడికాలిని ఎడమతొడ మొదటను ఎడమకాలిని కుడితొడ మొదటను వైచి కూర్చుండుట ) ౩ దేవనిమిత్తము పద్మాకారముగా చేయించిన పీఠము.

పద్మాసనుఁడు. సం వి. అ. పుం ౧ బ్రహ్మ ౨ సూర్యుఁడు.

పద్మాహ్వా. సం వి. ఆ స్త్రీ పద్మచారిణీలత, కాశ్మీరదేశపు మెట్టదామర †

పద్మాహ్వము. సం వి అ న లవంగము †

పద్మి సం విశ (న్ నీ న్ ) ౧ పద్మములు గలది, తామరలు గలది. ౨ మొగముమీఁద బొట్లు గలది (ఏనుఁగు) వి న్ పుం ౧ ఏనుఁగు ౨ విష్ణువు

పద్మిని. సం వి ఈ స్త్రీ. ౧ తామరతీఁగ † ౨ పద్మాకరము, తామరకొలను ౩ పద్మసమూహము, తామరతంపర ౪ తామరతూఁడు ౫ తామరపూవు. ౬. స్త్రీజాతివిశేషము

(స్త్రీజాతులు నాలుగు : పద్మిని, శంఖిని, హస్తిని, చిత్రిణి పద్మినీజాతి స్త్రీలక్షణము

శ్లో. భవతి కమలనేత్రా నాసికాక్షుద్రరంధ్రా, అవిరళకుచయుగ్మా చారుకేశీ కృశాంగీ, మృదువచనసుశీలా గీతవాద్యానురక్తా, సకలతనుసువేశా పద్మినీ పద్మగంధా (రతి మంజరి )

౭ ఆఁడుఏనుఁగు. ౮ లక్ష్మి.

పద్మినీకంటకము. సం. వి. అ పుం. (వైద్య) క్షుద్రరోగ భేదము

పద్మినీకాంతుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

(ఇట్లే : పద్మినీశుఁడు, పద్మినీ వల్లభుఁడు. మొ )

పద్మేశయుఁడు. సం వి. అ. పుం. (పద్మమునఁ బరుండువాఁడు) విష్ణువు

పద్మోత్తరము. సం. వి. అ. పుం (రంగులో పద్మముకంటె నుత్కృష్ట మైనది) కుసుంభము, కుసుమ †.

పద్మోద్భవ సం వి ఆ స్త్రీ మనసాదేవి

పద్మోద్భవుఁడు. సం వి. అ పుం బ్రహ్మ

పద్యా. సం వి ఆ స్త్రీ ౧ పథము, త్రోవ ౨ (పాదములను హింసించునది) శర్కర, మొఁపటాయి ౩ స్తుతి

పద్యము. సం. విశ (అ. ఆ. అ.) ౧ పదమునకు హిత మైనది. ౨ పదమునఁ బుట్టినది (వి అ న.) ౧ గణపాదబద్ధ మగు కవికృతి, పద్దెము ; శ్లోకము. ౨. మిక్కిలి రొండని అడుసు.

పద్యుఁడు. సం వి అ పుం. (విష్ణువుయొక్క పాదమునఁ బుట్టినవాఁడు) శూద్రుఁడు.

పద్రథుఁడు. సం వి అ పుం (పదములే రథముగాఁ గలవాఁడు ) ౧ పాదచారి ౨ పదాతి.

పద్రము. సం విశ (అ ఆ అ ) శూన్యము, వట్టిగి (కే ని ) (వి. అ పుం ) గ్రామము

పద్రుచే = పదురుచే. (ఇందలి 'అ' కారము లఘువు.) స క్రి. (√పదురు[1]) అదరించు, అతిశయింపఁజేయు

చ. ఎద్రిచిన కాలపాశమున నీగతి నీమదిఁ గ్రోధవల్లికం, బద్రిచినవారు మున్నిశితబాణ పరంపర పై మిణుంగురుల్, విద్రుపఁగఁ

దళ్ఫలంబులచవిం జరితార్థులుగా శరీరఫుం,
జిత్రుపలు చేరఁ దత్సరులచేతులఁ గాశ
కులంబు వాకులన్

ఉ హరి. ౪ ౧౦౯

పద్యము. సం వి. స్త్రీ పుం. మార్గము, పథము
(అ. పుం) ౧ భూలోకము. ౨. రథము

పన. వి కోసి చేలలో వేసిన ఓదలప్రోగు.

గీ. ... ఓద యనఁగ దీర్ఘయావపాళి, కాదులు
చెలంగుఁ బన యన వలరుచుండుఁ, దాదృశ
వ్రీహి సస్యాఖ్య ధనదమిత్ర

ఆం భా ౨ ౨౩౪

పనఁటి = పంటె, ఎరఁటి వి ౧ ఘటము,
కుండ

చ ... ఎసరు పెట్టిన పెద్ద పనంటిపోశ

అము ౧. ౯

చ పనఁటులవారి యూతి యిడి పాలును
పేకులఁ బుక్కిలించి రొం, దు నుమియు

హరి భూ ౫. ౨౦౨ (చి. ని పా)

గీ. పగడ మిగురాకు నిల చట్టు పనఁటులు కరి,
కుంభములు ...                  వసు. ౨. ౩౩

౨ అతిజవగ్రాహ్య జలానయనార్హ భాండము,
చప్పున నీళ్లు ముంచి తెచ్చుకొనఁ దగినకుండ,
కడవ

సీ . . అతిజవగ్రాహ్య జలానయనార్హ భాం
డంబు పంటి

గీ. పనఁటి యనఁ దగు .

ఆం భా. ౨ ౨౪౬.

(గాజుపనఁటి = గాజుకుండ.)

రగడ. గమ్మ రని పన్నీరు తొలఁకెడుఁ గంటితో
యిడి గాజు పనఁటులు, చిమ్మ లేఁగెడు
కప్పురపురవఁ జెందు నీరోడా కుటవఁటులు.

కుక. ౧. ౧౩౩.

(నలుపగ్రుడ్డు పనఁటి = బ్రహ్మాండ భాండము)

గీ నలుపగ్రుడ్డు పనఁటులు వగులఁగ సార్చి

అచ్చ. రా. యు ౩౫౧

(ఇట్లే:) పసిఁడి పెన్బొజ్జగా గ్రుడ్డు పనఁటి
కెం

గీ. కినిసి తిట్టినఁ బతీయ లై చనక యున్న,
పసిఁడి పెన్బొజ్జ రాగ్రుడ్డు పనఁటిగములు

అచ్చ. రా బాల ౧౦౭.

గీ తెక్కలిదగాలి గాయుంచ జక్కనోదు,
గ్రుడ్డుబనఁటులు నిండారు గొప్ప బొజ్జఁ,
బూను పెనుదంట                  నీల ౧ ౪౪

జ: పనఁటిచూలి

పనఁటిచూలి. వి (పనఁటి + చూలి) ౧ కుంభ
సంభవుఁడు, అగస్త్యుఁడు

సీ మున్నీటి పెన్నీటిచెన్ను బన్నమున శేబల
కాలి కరకేలి పనఁటిచూలి .

చం రా ౧ ౪౧

౨ ద్రోణుఁడు

పనఁత = పణఁత.

ద్వి పనఁ తంత యూజాల బలగంబుపాలు, వెనుక
చట్టలు చతుర్వేదుల పాలు

బస. పు ౪ ౩౫ సం

పన(ను)వు. స క్రి ౧. తలఁచు, స్మరించు,
కోరు, వాంఛించు

(ఈ పదము అన్మథ్య మని శ. ర ఉన్మథ్య
మనిచి ని నిర్ధారితములు కానరావు)

ఆ అవరి పెలుచ కేడ్చి నాఁడెఁ బోయిన,
ప్రజలఁ చేరు గ్రుచ్చి పనవి పనవి

భార. మా. ౧౦౪.

శ్లో రుణో దాధ స్మరన్ కారిం విలలాప మని
హ్వాలః, భార్యాశ్చ పుత్రాంశ్చ పౌత్రాంశ్చ
దాహిత్రాన్స సఖీనపి ...

సం. భార. మా. ౪. ౪.

పనసవాండ్రు. వి. కవుసాలివారిని యాచించి బ్రతుకువారు. (శ. ర. బ్రా)
(వారి కిచ్చుకూలి పనసవర్తన యందురు బ్రౌ)

పనసిక. సం వి ఆ స్త్రీ పనసా రోగము

పనాయితము. సం విణ (అ ఆ అ.) ప్రణుతము, పొగడఁబడినది

పని. వి ౧ వ్యాపారము, చేష్ట

క. అని నిశ్చయించి యపుడ, మ్మని యాసంబు వీడి చిత్తమును బలవంతంబున నిల్పి యింద్రియంబుల, మనల వణఁచి చిరసమాధి పదమున నుండెన్
వా రా ౪ ౨౪౧

౨. కార్యము, కృత్యము

క. . నరుఁడు విలు గొని, యరిగెను బ్రముచ్చుల పిరుంద నవ్విప్రు పనికై ...
భార ఆది ౭ ౧౧౯

క . నాపనిచివపని, బ్రాకటముగఁ జేయు మహితభంజన శక్తికై . .
భార అర ౪. ౫౪

క మనరాజు విదూషకుఁ గొని మనమేఖల పోనపుచ్చె మన మిత్రు డాబాఁ, పనిమాలు సేఁత యిది యొక, పనియే దెల్పెట్ట వలదె పార్థివ తిలకున్
కేయూర ౧ ౧౬౫

౩. శిల్పము.
(ప్రయాణ సన్నాహము)

సీ. కలివాడఁ బని క్రొత్త మలకి డా ల్గాని మూసె యిడి తంగడాకు గట్టెదు తమాతమా
ఆము ౬ ౮౧

చ. నిగనిగలాడు కుందనపు నిద్దపుగోడల వాఁడె మైనము, త్రిగగతనంపు జిల్గుఁబని తిన్నియలున్ ... నీలా, ౧. ౩౦.

చ. మినుకుఁ గడాని తాయెతు సమేళపుఁ గ్రొవ్విరి దిండుదండడా, ల్పనివలె వాటు చల్వవలి పంపురుమాలుపు గట్టి .
కువల. ౨. ౫౪.

౪ కారణము.

క కనుచాటు తిండి నడపిన, పనులన్ ...
కుక. ౨. ౨౦౮.

చ . నిర్నిమిత్తి మీ, క్రమమున లేఁతనవ్వు చిబుకం బని యయ్యాది యేవధూటిపైఁ, దమిఁ గనుచేసితో .. వి పు. ౪. ౩౮

క సాకల యొన్నఁడు నిక్కాల, గాకుండఁగ నిటు పరాకుగాఁ బని గలదే
వి పు ౩ ౪౫

౫ ప్రయోజనము

క సలుకులఁ బని లే దీకే, తలపెట్టక పోరు వారుదగ్రత చేసుం, జలము మెఱయఁ బాంచాలురఁ, బోలియింపక కర్తలంబ పుచ్చ నరేంద్రా. భార ద్రో ౫ ౩౮

క. మునులాగ నన్ను విధియే, మని మును పుట్టించె నట్టు లయ్యెడుఁ గాక, విన చవిగాని పలుకు లకుఁ, బని గలదే యుడుగుఁ డింక బహు భాషణముల్ భార ఉద్యో. ౩ ౩౨౫

౬ అవసరము, అక్కఱ

క పాలఁతీ యోగం, బున నింతచాగి, యొమ్మెయిఁ, బనుపడియొం జెపుమ దాఁసఁ బని లే దింకన్ . భార శాం ౬ ౧౮౮

గ్వ వినుము కాశిక యింత విపరీతతపము, పని లేదు చాలింపు బ్రహ్మర్షివైతి
రం. రా. బాల. ౬౪. పా. ౭ పం

క ఓరోరి నీవుచేసిన, గోరపుఁబాపములు నీవుఁ గొడుకులు నాలిం, జేరఁబడి పంచుకొం దురొ, వారికిఁ బనిలేక నీక వచ్చునొ చెపుమా వాల్మీ. ౨ ౧౦౦.

౭. బ్రదుకు, జీవితము.

చ. ... పోయి వచ్చి నీ, పని మఱి చక్కఁ
 జేసెద నెపంబు సహింపుము వేగ పోయెదన్
 భా. రా. సుం. ౭౩.

క అతనిపనిఁ దీర్చ రాజ్య, ద్వితయము నినుఁ
 జేరు ... ఆము. ౩ ౩౫

శా గంగానందను గూల్చి ద్రోణుపని సక్కం
 జేసి కౌరవ్యులీ, రాంగమ్ముల్ మఱుమాడి
 భార భీష్మ. ౨. ౧౫౩

౭ అవకాశము, వీలు

ఉ దేహమనిత్యమూటసం, పన్నతనిత్య
 మంచుఁ దలఁపం బనిలేదు దశా. ౨. ౧౩౩

౮ సంబంధము

వ. . . ఎవ్వరితో నేమియు నెవ్విధంబునుం
 జెప్పిన నీకువాకును బనిలేదని
 శుక ౩ ౨౭౧

౧౦ నియోగము, ఆజ్ఞ

గీ ... విప్ర, వరుల కతిథి జనులకు సవారత
 ముగఁ, దండ్రిపని నిష్టమృష్టాన్నదానమొన
 రఁజేయుచు ... భార ఆది ౫ ౧౪

క. మున్నుగల గోపవర్గము, నిన్నుంగని కొలిచి
 భక్తి నీ పని సేయన్, మన్ననమానిసివై నీ
 వున్నంగడు మేలకాక యొప్పమిగలదే
 భార విరా ౧. ౨౭౭

౧౧ సేవ, కొలువు

ఉ పాయక తొమ్మునందెపుడుఁ బాములమో
 వను వారికింబనుల్, సేయను నేమి కార
 ణము .. భార ఆది ౨. ౪౭.

సీ అపరంజిమెఱుఁగు నిద్దపుఁగీలు బొమ్మలు పరి
 చారికలరీతిఁ బనులు సేయ .
 కవిరా ౫. ౧౯౦

క. ... నీగుణగణముల్, వినినయవి చెవులు
 నీకుం, బనిచేసినయవియె పాణిపద్మము
 లనఘా. ద్వా ౭ ౧౦౯

౧౨. ప్రసాధనము, అలంకరణము

సీ అనులోమమునరెన్న పనిఁజేసికొంటిష్ట భగవ
 దారాధన ప్రాప్తినిధిని శైవ. ౬ ౧౧౦

౧౩ చెంద్రుకిలమాపు

సీ తెలిచెక్కుటరచందుగులఁ గోఁచుజిగి కొప్వు
 గొనబువాఁ జిరుచెంపపని దనర్చ
 చంద్రా ౨ ౧౧

సీ గీఱునామము చిన్నికోవిూసలు చెంపపని
 మట్టు వీకబొందు పట్టునూలు, వెనుకకట్టురు
 మాలు ... శుక ౨. ౨౪౧

౧౪ క్షారము

సీ అనులోమమున లెస్సపనిఁ జేసికొంటిష్ట
 భగవదారాధన ప్రాప్తనిధిని
 (శ్లేష) శైవ. ౬ ౧౧౦

క నక్షత్రవారదినముల, లక్షణ మారయక వీఁ
 డలంకారకళా, పేక్షగా నాపితుఁ దబ్బిన,
 నాక్షణ మాపనులు సేయు మను నసఘాత్మా
 సానందో ౨ ౩౨ పా

౧౫ విజృంభణము

ఉ. ఉ, ద్భట మై యీసెడు బాణసంతి
 తులచందంబుం ద౦ం జూడు మం, కటిలో
 నీపని సక్కనయ్యెడు నపేతప్రాణుఁ గా
 వింతు హరి ఉ ౬ ౧౪౩

పనిలేదు = ౧. తగదు, కూడదు

శా మాగధుసెడన్ సామంబు దానంబు
 సం, ఖేదింపం బనిలేదు ...
 భాగ ౧౦ పూ ౧౦౫౩

మ చనుచోఁగొండలఁ గానలన్ వెదకుచున్ ...
 వేసరన్, బని లే దంచుఁ \ పుల్
 రామా. ౬. ౬౩.

౨. వలదు, అక్కఱలేదు.

ఉ పట్టపుదేవి వై గఱువభాగున నుందరా
 పాఱువారితో, గట్టివనంబులో నవయఁగాఁ
 బనిలే దిటఁ దల్లి పోఁగదే
 భాగ. ౯. ౬౨౬.

సీ. రాజ్యంబు పనిలేదు రాజధనంబుపై నాస
యుఁ జొరదు ... హరి. పూ. ౯. ౧౬౪

జా : పని చేయనివాఁ డింటిదొంగ, ప న్నీయని
వాఁడు గివాణముదొంగ పని తక్కువ
ప్రాకులాట యెక్కువ పనిలేని మంగలి
పిల్లితల గొఱిగినట్లు

పనికివచ్చు = ఉపయోగించు

గీ. గాలములు వైచువా రది గా దటంచుఁ
బెనువలలు వేయువా రవి పనికిరా వ
టంచు దశా. ౧. ౨౬౯

పనిసేయు = నివేదించు

ఉ. లోకనుతుండు పాండుఁడు నాజ భక్తిఁ
బనిసేయుచు సర్వజగజ్జిగీషుఁడై
భార. ఆది. ౬. ౧౨౪

శ్లో. జ్యేష్ఠోఽయమితి రాజ్యే చ స్థాపితో విజి
లోఽపి సః, నిర్జిత్య పరరాష్ట్రాణి పాండు
ర్మహ్యం న్యవేదయత్
సం. భార. ఆది. ౧౩౮. ౬

జ : పనిగొను, పనిగొలుపు, పనిచెలుపులదొర,
పనిచెలుపువాఁడు, పనిపంచు, పనిబడి
కూడారు, పనిముట్టు, పనిలేనిపని, పనివంజ,
పనివడు, పనివాఁడు, పనివిను, పనులు
గొను

పనిగొను = పనులుగొను అ. క్రి. (పని +
కొను) ౧ యత్నించు, పూను.

చ. . వీరలఁ దోడ్కొని వత్తు నంచు నేఁ,
బనిగొని వచ్చి రా మనిన బంధువు లెల్లను
గెలిసేయఁగాఁ, జను టుచితంబె ..
చెన్న. ౩. ౧౬౫

చ. పనిగొని కాలమాంత్రికుఁడు పాంథవిచారణ
రాత్రి శక్తికిన్, బ్రవసృజియింపఁగా ...
చెన్న. ౨. ౨౪౭

౨. అతిశయించు, విజృంభించు.

ద్వి. మకరి మారిక చూడఁ జూడ నెల్లెడలఁ,
బనిగొని బహు మహోత్పాతంబు లొదవె.
ద్వి. హరిశ్చ. పూ. ౧౧౨౫.

(మన్మథుఁడు.)

క. తనతేజము తనబలమును, దనగర్వము తన
మదంబు దన సంపదయున్, ఘనతరముగ
నచ్చెరువుగఁ, బనిగొనఁ బరమేశుమీఁదఁ
బైనం బరయ్యెన్ వీర. ౨. ౯౨.

౩ సేవచేయు

రగడ. తోరాగ్రస్థలిఁ దుంగ శయానస్వామికి
నిత్యోత్సవములఁ బనిగొని
హం. ౪. ౨౧౩

స. క్రి. ౧ ఆజ్ఞాపించు, నియోగించు

క. పనిగొనుము నన్నుఁ గైకొని, యనుచునప్పలుకు
లకు మానవాధీశుఁడు సం, జనితబహు
మానుఁడై యి, ట్లనియెం బుష్పకవిమాన
మానందింపన్ నిర్వ. ౭. ౯

గీ. కొడుకు తండ్రి నాజ్ఞాపించుఁ గోడ లత్త,
నాదరింపక పనిగొను
హరి. ఉ. ౯. ౪౭

౨ ఏర్పఱుచు, ఏర్పఱుచుకొను

చ. అనవరతంబు నెచ్చెలి దిగంబరుఁడై బికా
రంబు లెత్తిఁ దా, ధనదుఁడ నంచు నెక్కు
డౌకతట్టున రైనను లేక మానినిన్, బని
గొనెఁ గల్మికల్మి కిది మార్గము కాదని
ఘటికా. ౨. ౨౦౪

క. అది మొదలుగ సంజీవకు, వదలక మృగ
నాథుఁ డధిక వాత్సల్యం బిం, పొదవంగఁ
దనయొద్ద సచివ, పదవిఁ దగువిభవ మిచ్చి
పనిగొనునంతన్.
నా. పంచ. ౧. ౧౫౭.

౩. సేవింపఁ జేసికొను, కొలువఁజేసికొను; సేవ
లేర్పఱుచుకొను.

ఉ. ఆద విధాతకుం జనవులత్మ సదా పనిపాట సేయఁజే, దోడుగఁ జెంచెక ల్పులంకతోడుగ రాజకుకీరదంబముల్, గూడి చరింపఁగా . కాశీ. ౨ ౪౧.

మ నవ్యారీదజ్రశ్రేణిచేఁ, బనిపాటల్ గొనఁజాలుకొ మణులకొ ప్రఖ్యాతకాయ క్రియల్ వసు ౪. ౪౨.

పనిదీఱు = తీరికయగు

క తనయులకును మనుమలకును, దనసేరుపు మూరిపోసి తాల్చిన ర్గం, బున భరము వారిఁ బూనిచి, పని దీఱి విధాత యీ పథం గొలువుండున్ కళ. 3. ౧౨

**పనిగొలుపు(ల్పు).** క్రి (√పనిగొను) పూనుకొనఁజేయు.

క. శాశ్వత వింతం గొంతక, యీపెదగుంగొమ్మ మెుకము నిపు దద లాదవక్, దావిమల చక్కరాయని, శాశ్వత కనుపుఁ దని బంట్లఁ దగఁ బనిగొలిపెక్ అచ్చ రా సుం ౧౬౧

వ. . ప్రోడ లగునైదువరాంద్రం బనిగొల్పిన వారు వర్యాద .. నీలా 3 ౭౯

**పనిచెఱుపులదొర.** వి (పని + చెఱుపులు + దొర) విఘ్నేశ్వరుఁడు.

సీ. ఇద్దరు తల్లులముద్దుబిడ్డడు పనిచెఱుపులదొర చేటచెవులవేల్పు ఆం సం దేవ ౧౨

**పనిచెఱుపువాఁడు.** వి (పని + చెఱుపువాఁడు) విఘ్నేశ్వరుఁడు.

గీ. బొజ్జదేవర యేనుఁగుమొగముసామి, పని చెఱుపువాఁడు వెనకయ్య యన వినాయ, కుఁడు పేళ్లొప్పును ఆం. భా ౧ ౪3

గీ. జములితల్లులబిడ్డ పెద్దపొట్టప్రోడ, చేట చెవులవేల్పు పని చెఱుపువాఁడు, ... అనఁ దగు గణపతి పేళ్లు ... పాం. వి. దేవ. ౨.

**పనితము.** హా విశే. (అ. ఆ. అ) ప్రేలుకము, పొగడఁబడినది

**పనిప(వ)ంచే = పనిగొను.** స. క్రి (పని + పంచు) నియోగించు, ఆజ్ఞాపించు

గీ వివిధవర్ణరత్నప్రభావితతి మెఱయఁ, దమ్ముఁ బనిపంచు మనిస మాధవుఁగు భూధ, రములఁ గృపఁ జూచి ... ఈ హా ౨ ౪౪

గీ తెఱవ చిడిముడిపాటు మదేష్ణ రయిఁకేఁగి, వేక్కఁ బనివంచు ...డిగి ... నొక్క భార విగా ౨ ౨౯౫.

**పనిబడిగూడారు.** వి (√పని) గొల్లెన, ఒకవిధమైన గుడారము.

సీ. పనిబడి గూడారు పరగుగొల్లెనయన ... ఆం భా ౨. ౧౫౯

**పనిముట్టు.** వి. (పని + ముట్టు) కొలుముట్టు, ఉపకరణము (శ. ర)

**పనిలేనిపని.** క్రి. విశే. ప్రమ (√పని) అనవసరముగా, నిష్ప్రయోజనముగా.

క. పనిలేనిపని ముఖాంబుజ, మునకుం జెన్నగ్గలింప మునిమునిసి నగినన్, వనరుహాగేహిని విభునిం, గనుగొని యిట్లనియె నర్మగర్భము గాఁగన్ విప్ర ౪. 3౬.

సీ పనిలేనిపనిఁ బట్టి పాలార్చి పన్నిదం బనిఁ దొల్లిటి సేరమునకుఁ దోడు ... విప్ర 3 ౫౬

ద్వి. ఎదిమిదియఖ పట్టిరయే కాక పిరిఁ, బనిలేని పనిఁ జంపఁ బని యేమి యనుచు ... ఆ మ క ౧ ౧౪ పా. ౧౨. పం.

**పనివంజే.** విశే (పని + వంజ) = పనికి వంధ్య పనిచేయఁగానిది.

సీ. పనితుంటరితో యింటి బానిసవిద్దరితో కల్తి
  శైతములలో చిల్లిగొట్టి .
      చెన్న. ౪. ౩౮

పనివడు. అ క్రి. (పని + పడు) ౧ పూను, యత్నించు
సీ. పనివడి తోలఁ గొట్టినలీలఁ గొన్నింటిఁ
  జిఱుసుగ్గాగాఁ బొడి సేసి చేసి ...
      భార విరా. ౫. ౩౫
క పనివడి యహింస వ్రతిముగఁ, గొని వనమున
  నున్న మునులకుం దొదరరాద హిం, సనము ..
      భార అర ౫ ౫౯
క కనికరముతోడ నిటువలెఁ, బనివడి సెప్పో
  ము సంచి పంచినఁ గానీ, కనరాని కటిఁ
  చీకటి, యనక నను గానవచ్చునా యెయిఁ
  డైనకా. విప్ర ౪ ౧౫ విక్రి. ౨ ౧౨
౨. కోరు
సీ పనివడి త్రవ్వి కూపమునందు నుదకంబు
  పానంబు సేయనివాని భంగి
      భార. శాం ౧. ౭౪
క పనిపూని కాకకిం జని, వనరుహాలోచనుఁడు
  వెదఁదవాలిక కన్నుల్, తనకుఁ గలఫలము
  గనిరొం, బనివడి తద్విభవలక్ష్మిఁ బరికించు
  నెడకా      కాశీ ౬ ౩౦
క మును పరమహంస వాసనఁ, బనివడి సామీ
  ప్యపదవిఁ బంకేరుహాముకా, గనిరొనొ
  యనఁగా వరవ, ర్ణిని పాదయుగంబు పద్మ
  రేఖం బొలుచుక్      రాజ. చ. ౩ ౪౧
౩. కొన్నిరొదల నిది వాక్యా లంకారముగా
  నుపయోగింపఁబడును.
చ. పనివడి నారికేళ ఫలపాకమువకా జవి రైన
  భట్టువా, ద్ధని కవితాను గుంభనములు సోమరి
  పోతులు కొండ అయ్యె లా, నని కొనియాడ
  సేరు      వైకు. ౧. ౧౪.
చ. పనివడి సాధుసంఘనఁ బ్రభావతి భామిను
  లక్షిఁ గొల్వ .      కై. భా. ౨. ౯౧.

పనివాఁడు. వి. (√పని) భృత్యుఁడు, సేవకుఁడు; కర్మకారుఁడు.
సీ పనివాఁడు గాఁబోలుఁ బటుఘోటిపోతంబు
  బలుకొరా నివ్వరికలుపుఁ దీయు .
      కవల. ౨. ౭౩.
గీ. ఏమిపనివార మనుచుఁ దద్భూమిపాలు,
  కదకు మన కేఁగువార కేశరణి నతని,
  యుల్లమున కెదయక ప్రవర్తిల్ల సేర్తు, మను
  విచారంబుచే నాకులాత్ము లగుచు.
      రాఘవ ౩ ౧౩౧.
సీ. ... పనివాఁ డనంగఁ, గర్మకారుం డొప్పు.
      ఆం భా. ౩ ౭.
విణ. పనిచేయువాఁడు
గీ ఏమిపనివార మనుచుఁ దద్భూమిపాలు,
  కదకు మన కేఁగువారము ..
      రాఘవ ౩ ౧౩౧.

పనివిను. అ క్రి. (√పని) ౧ అజ్ఞావశవర్తి యగు; వశవర్తి యగు.
క. ఏ వెలతు మిమ్ము రమ్మన, దేవర కెంచేవి
  కేని తిరువడిభుకు కే, సేవింపఁగఁ బనివిని
  రొద భావింపఁగ నింతకంటె భాగ్యము
  కలదే      వైజ. ౩ ౭౦.
క అనవుడు నాదయని కిట్లను, వనజానన నీదు
  మనకు వచ్చినరీతిం, బనివినిరొద మాటల
  కేకఁ, బని లేదీతలఁపు సాదుభాగ్యము
  కాదే.      కాశ. ౧ ౩౮. వీర. ౪. ౯౪.
క.    మునివర మీ, రిచ్చోటికి బదలికమై,
  విచ్చేయుట యేమి తెలుపకే పనివింటికా.
      రామా. ౪. ౪.
౨. కొలవు పుచ్చుకొని కళ్ల; కళ్లు, అరుగు.

చ. అనయము నొచ్చుచున్నయది యంగము
తెల్లను వేగ వచ్చుటల్, మనము వశంబు
గాదు జనవాయక ప్రొద్దును బోయె నిప్ప
డే, బనివిని . భార. ఉద్యో. ౨ ౧౫

చ. అని పరమేష్ఠి పంప నతలాదిపదంబులకున్
భుజంగముల్, పనివిని వరాహ. ౨. ౪౪

క అని దశకంఠుఁడు పంచినఁ, బనివినిరాముద
ననుచు లేచి ప్రణమిల్లి ...
బా రా యు ౧౨౪

చ చని విభుఁ గాంచి పల్కు బలశాసనసన్నిభ
నీదుపంపునం, బనివిని తీవెగుం పనక పాండు
రపైకత నిర్ఝరీతటం, బనక దరీపుటం బనక
యన్నియు నారసి ... వసు ౨ ౭౨

3. పచ్చు.

వ. . మీమాంస లైన హేతిప్రహేతులు
ప్రత్తెంచినం బనివింటిమి మమ్ముం జూడు
మని వరాహ ౫. ౭౫

క విని భయము ప్రియము మనమున, నెనయఁగి
నవ్విభుఁడు వినయ మెసక మెసంగన్, నను
నీపాలికిఁ జను మని, పనిచినఁ బనివింటిఁ
గార్యభంగి ఘటింపన్ విక్ర ౧ ౧౮౧

క తడవం బోయిన దైత్యులు, పొడగని
యూర్వశి తొలంగి పో నేల నిచం, దోడితె
మ్మని మారా జద, ఒడిబడి వచ్చెదరు వేగి
పనివిను మనినన్ ఉ హరి ౧ ౫౧

౪. చచ్చు, మృతినొందు

చ కినుఁగొనఁ జాల వే తొకతెకాఁగిట నీవు
సుఖింప నిప్పుడే, పనివిని వాసనావళతి
భావితవంబునసైనఁ జెందెదన్, నిను ...
శుక ౨ ౪౪.

౫. అంగీకరించు.

పీ. అని గారవించి సెయ్యము మీఱఁ బలికినఁ
బనివిని యా మహాబ్రహ్మచారి ...
విప్ర. ౪. ౭౧

పనుకు. అ క్రి కోపించు, ఆగ్రహించు.

క అనుచుఁ గదలి పోవచ్చిన, ననుకూనము
మాని పొంగుఁ దమ్ముని జేప, ట్టినచంద
మేమిచెప్పుదుఁ, బనికినకాలోరగంబుఁ బట్టు
ట దోఁచెన్ ఉ హరి. ౪ ౭౩

పనుగొను. అ. క్రి (పన్ను[4]+కొను) ౧. ఒప్పు,
కలుగు

తరలము కనిరా ముందట నమ్మహీపతి గాంగి
సైకతభూములం, బనుగొనన్ ధను వభ్య
సించుచు భార ఆది ౪ ౧౬౪

(లెస్సగా అని భావము)

ద్వి పనుగొన నిత్యంగిఁ బాడుచు బొగడు,
చును నాల్కు కవివోవ కూలిఁ గీర్తింప ...
పండితా. దీక్షా ౬౨ సా

౨. జాగరూకతకిలుగు

మధ్యా .. అన్నదియుఁ, దనదివ్యశక్తి నప్పా
శముల విడిచి తిమ్మనిసాధుఁ, బనుగొనఁ
దీగంబు సేరఁబెట్టి విపాశనాఁ బరగ ..
భార ఆది. ౪. ౧౨౨

ద్వి పనుగొన మృగము దప్పక చూచి చూచి,
కను మాయ కునికి నిక్కుపుజాగరముగ ...
పండితా పర్వ 3౬౪

3 కలుగు, ప్రాప్తించు, లభించు.

క. ధనమునకై ధర్మముడెస, ననాదరము సేసె
నేని నానృపతికి న, ద్ధనమును జెడు దుర్య
శముం, బనుగొనుఁ దుది దుర్గతియును
బాటిలు ననఘా భార. శాం. ౨ ౪౦౯

ద్వి. పనుగొన్నసామ్రాజ్యభారంబు మాని, పొను
పదని క్లేల పోదు రక్సారు ...
రం. రా. అయో. ౧౧౫
పా. ౪ శం. (చి. ని. పా.)

౪. జనించు, పుట్టు

పడిరొ నప్పు డద్దే, వుని పదవాల్జలను
నాచెవుల కింపారన్.

భారి శాం ౬ ౧౩౫

3. తగు, అర్హమగు.

క ఘనసారకరండమునకు, ఘనసారస్వారము నిచ్చి
కథ చెప్పింపం, బనుపడిన నేర్పు గలిగియు,
జనవర యిటు తప్పఁ జెప్పఁ జనునే నీకున్

విక్ర ౪. ౧౮౩

చ లనహృదయంబు వెంబడిఁ దప్పక ఘోటక
మంత నంతనే, పనుపన నిల్చి ముందటికిఁ
దాటి . .

ప్రభా ౨ ౩౦.

ఉ . అంబుజసంభవుండుఁ జే, తోభవవైర
యున్ గ్రమముతో భవదీయకృపాసమర్పిత,
ప్రాభవులై సదా కనిరి పన్పడ సర్గలయాది
కారముల్

కళా ౭ ౨౩౪

౪ ప్రకటమగు

క అని యొకపద్యము హృద్యం, బును నిం
పద్యమును దోద్యమును గా రచియిం,
చిన మించిన కారుణ్యము, పనుపడఁగా
నతని యగ్రభాగము నందున్

పరమ ౨ ౧౩౭

౫ పశిమగు, లొంగు

క గోష్ఠికిఁ, బనుపడి యేపారి యచటఁ
బ్రభుఁ డున్నతిలేన్ ... వారి ఉ ౫ ౯

క గాంధారగ్రామశ్రుతి, బంధురతన్ మానవు
లకుఁ బనుపడని మహా, గాంధర్వవిద్య
దైవత, గంధద్విపయాన నెఱపెఁ గౌశల
మెసఁగన్

పరమ ౫ ౧౩౦

౬. సిద్ధపడు.

చ. ... వాదముం, దనుకఁగ నంచితాధర
సుధారస మిచ్చి మనోజకేళికిం, బనుపడఁ
జేసి కుంజ మృదుభావముఁ దేలిచి

శాగ. ౧౦. ఉ ౩౮౩

చ. ... ఫచ్చుతవిన్ శశిప్రభా, వనరుహ
పత్త్రినేత్రయును వాఁడును వేడుక మీఱఁ
గేళికిం, బనుపడి సౌఖ్య మొందిరి ప్రభా
వతి వింటె యశోద నైపుణిన్.

శుక. ౨. ౫౧

౭ అలవడు

క విను మంతర్నాదిం జనఁ, బనుపడి పవనంబు
బ్రహ్మపద మొందఁగ శాం, తినిరూఢ
మైనచిత్తము, గను నానందంబునంద కల
యుగ్ బిదపన్ భాగ శాం. ౪ ౧౨౭

సీ వనవాస మింతకయును నాకు దుఃఖంబు
నేయదు దేహంబుఁ జిత్తమును ది, . క్రియ
లకుఁ బనుపడి యున్నయవి

భారి ఆశ్ర ౨ ౭౦

౮ ఒప్పు

చ అనువగునుల్లె నొప్పునులయా నిలవాహము
నెక్కి తేంట్ల న, ల్లిన నిడువాగెఁ బూని
లవలీనవవల్లిక లెమ్మె సొమ్ములై, పను
పడఁ

మనుచ ౬ ౨౬.

క వనితి యనియెడు సరస్సున, మనసుం గన్ను
లను బ్రాశె వన సది బరువై, యనువు
కొని మునిఁగెఁ గన్నులుం, పనుపడ నెల్లెడల
నిలిచి పైపైఁ దేలన్

గంధ ౨౧౪

చ పనుపడఁబూని సారె తెలిపావడపై నెరి
పట్టు కుంచెఁగ, ట్టినయపరంజి పువ్వులు
ఘటించెడు చందురు కావిఁగట్టి

రా వి ౩ ౧౨౩ కళా ౬. ౨౧౨

౯. కదలు, పూను

క. నిను నీనుతిచే నెవ్వఁడు, పనుపడి నుతి
యించు రాత్రిఁ బగలును ...

వి పు. ౧ ౨౦౯.

౧౦ అడఁగు. నిగూఢ మగు.

చ .. ము, న్నను పడియున్న తాపశిఖ ప్రజ్వలభావము నొంద వింత రై

అని. ౨ ౧౩౧.

క. ఘనజఘన స్తనయుగములు, వెనుకను దను త్రోవల నుద్దవిడి నొత్తంగాఁ, జనలేక యారు మఱఁగులఁ, బనుపడ దాఁగె ననఁ గాను భామకుఁ దనరున్ హం ౪ ౪౨

౧౧ దృఢమగు

క జను లాగరించిన పాపము, పనుపడ జన నాథుఁ బొందుఁ

భా రా కిష్కిం ౨౪౯

ద్వి పనుపడ మొగిలిలోపలినీళ్లు నమ్మి, కానినీళ్లు చల్లువేఁడుటలు లెండుఁ గలరె ..

ద్వి హరిశ్చ ఉ ౪౨౦

౧౨ అగు, పరిణమించు

సీ నడుమఁ బ్రమాదంబునదకఁ జేకుతీవశాపము రాజ్యఫలముగాఁ బనుపడుటయు . .

కళా ౫ ౧౭౪

స క్రి పొందు

క. విను నాకీర్తి జగంబులఁ, బొనుఁగుపడియె నీవు భువనపూజితవృత్తిం, బనుపడితి గానఁ దగు నీ, యనలపదవి నీక నాకు నలవడ దింకన్ భార అర ౫ ౧౫౨

చ. .. వర్ణధ, ర్మనిరతి చిత్తపాకము గ్రమం బునఁ దెచ్చుఁ గపాయపక్వతం, బనుపడ కర్మఁ జే లగు నృపాలకుమారుఁడు సన్న్యసింపఁగన్ భార శాం ౫. ౩౯౬.

క. విను ప్రణవాదికరూప, స్వనిరూఢిం బుట్టు వాక్కు దానివెను చనున్, మనము పురుషార్థబుద్ధిం, బనుపడి యని చెప్పె సతికి బ్రాహ్మణుఁ డనఘా

భార అశ్వ ౨ ౧౪

చూ : పనుపఱుచు.

పనువ(న్న)రి. విశే. (పనుపు + అరి³) ౧. ఆజ్ఞకు లోఁబడినవాఁడు, పరతంత్రుఁడు

గీ. ... పనుపరి యనఁగను భాసిలుఁ బర, తంత్రి నామంబు అం భా. ౩ ౫

౨. నియామకుఁడు, ప్రభువు.

ఉ. .. పల్కులచేడరాయఁడున్, గిబ్బదయాళిదిట్ట తమిఁ గ్రేవ మెలంగఁగ నేలుపన్నరీ

అచ్చ భాగవి. ౪ ౯౦

(వాఁతప్రతి. పా)

పనుపఱు(అ)చే. స క్రి (పనుపడు) పనుపడఁ జేయు (పాదమఁజేయు)

చ. .. అట్టి సమంచితచిత్తధర్మమం, బనుపఱు పంగఁ జాలు కలభామణపంక్తి నను గ్రహింపవే. భార శాం ౫. ౩౬౨

(ప్రకటించు)

వ .. పెనురొదలు పొదల మెదలు కొదవ కుమ్మెదలపమువు లినుపసరిపెణలపెనుపున బనుపఱుచుచు కళా ౬ ౨౨౪

(బద్ధము చేయు, బంధించు)

క అని పలికి కురులు బిగియఁ, బనుపఱిచి వెఱంగుఁ జెక్కుపయ్యెద లాడిగా, నొనరిచి యొండొరు మీఱన్, వనజాక్షులు కుసుమ హరణవాంఛాపరలై. చంద్ర ౪ ౦౯

(వాడుకపఱుచు, అలవడఁజేయు)

క అని సుకవీంద్రులగుణములు, గొనియాడుచుఁ గుకవి సరిఁ గొనక మహిఁ బురా, తనసుకవులసాహిత్యము పనుపఱిచిన యట్టిసరస భాషాసాణిన్ ప్రబోధ ౧ ౩౧

క దినముఁ గవుబిండు చేయఁగ, మునిగృహములవన్యభోజ్యములఁ దృప్తుం డై, మను తనయుం డంత నయుం, బునకుం బనుపఱిచి దేహమున్ దైవమతిన్. కకు ౧ ౧౬౦

(కుదురుపఱుచు, స్థిరపఱుచు)

క. నిను సుఖదుఃఖంబులకును, మనసే కార
ణము దానిమాటికిఁ జెటకుగ్, జనకీయక
పోరియందును, బహుపటుపుము కౌతుకంబుఁ
బాటిలఁ జేయుచ్ శేష. ౧ ౫౦

**పనుపు(న్పు).** వి (√పనుచు²) నియోగము, ఆజ్ఞ; ఆజ్ఞాపించినపని

ఆ ... తండ్రి, పనుపుఁజేసి ముదిమి గొని
జవ్వనం బిచ్చె . భాగ. ఆది. 3. ౭౫.

గీ .. దివిజపిత్రు విధివిశిష్ట, మైనయొఱచిఁ గీ
డొలయుడు యజ్ఞములకుఁ, బహువిధాంబు
వేదంబు పనుపు గాన .
భార అను ౪ ౩౦౪

సీ మీపనుపుగ రాజ్యముసా, గీ పాండుతనూ
భవులకు నీకున్న భుజా, టోపభయంకరుఁ
దర్జును, కోపానల మగరి ముట్టుకొంచెదే
వారిన్ భాగ ఉద్యో ౧ ౪౭

సీ మానుపాడుఁ,

ఆ పనుజఁ జూచి కష్టమనుజాలఁ గూడి నా,
పనుపు సేయకుండఁ జనునె నీకు ..
భార ఆది ౬ ౨౦౧

సీ అంబికాతనయుఁ జూచ్చి, తండ్రియు
గురువును దైవంబు నీతఁడ మాకు మీరెల్ల
నీమనుజవిభుని, పనుపు సేయుటయు నీతనికిఁ
బ్రియంబు గావించుటయును మమ్ము చేసి
చేల

గీ విధులఁ బ్రీతులఁ జేత .
భార శాం. ౧ ౩౭౬.

ఉ. . . మీకు మాయెడన్, విగ్రహమేల,
సెయ్యమున నిద్దుఁడు కౌరవరాజు బార్థివ,
ప్రాగ్రసరుండు ధర్మసుతు ప న్పిదిమీకు
వలంధ్య్య మి త్తుతన్. భార. అర. ౫. ౪౧౬.

**పనులుగొ(ల్గొ)ను** = పనిగొను. స క్రి. (పనులు+కొను) సేవింపఁ జేసికొను, కొలువఁ జేసికొను.

వ ... కద్రువ గర్వంబున నుఱక గరుడుని
వినతను బనులు గొనుచున్నంత ..
భార ఆది ౨ ౪౪

గీ కపటపటువాపరుం డైన కంసవైరిఁ, బరమ
ముని నవ్వేటాలకుఁ బనులుగొనిరొ . .
పారి ౫. ౭౬

గీ శాల్మలీవృక్షగతుఁ డైన సంచరింపుఁ, బ్రీతి
లఘుపతనుం డను పేరు వాఁడఁ, గాకు లెల్లను
నా భృత్యగణము గాఁగఁ, బనులుగొందును
సామ్రాజ్యపదవి నొంది
నా పంచ ౨ 30

సు నిగమాంత ప్రతిపాద్యు . పరమ నిశ్చిం
తిం బనుల్గొంచు వా, నిగర్హుండు కృతార్థుఁ
డయ్యె ... పారి ౭ ౪

**పన్న** వి (సం పతితః ౩ పన్న) దాసుఁడు, భృత్యుఁడు

ద్వి యిట్టిల చూడవా యీపన్న కాళ్లు ..
పండితా పురా ౯౪ పా

ద్వి మన్నించి యిప్పు డీపన్నఁ గైకొన్న, నున్న
పన్నలు వత్తు రిన్నియు నేల ...
పండితా పురా ౯౫ పా

(విశ ౧ నీచుఁడు; మూర్ఖుఁడు)

ఉ పెన్నిధిఁ గన్నవాఁడు మఱి పెంపునఁ
బ్రాణ సమానమిత్తుఁడై, యున్న మహా
త్మునిం గదిసి యొయ్యనఁ జెప్పినఁ జెప్పఁ
గాక యే, పన్నలకైనఁ జెప్పిన విపద్దశ
నొందఁడె . శివ ఉ. ౧ (శ, ర.)

రగడ పతిచె మరుఁ దురుల ముదిపన్నలను బిన్న
లను . రాఘవ. ౨. ౩.

ద్వి. ఎలుంగులబన్నలం గన్న కోరుదు నీన్నుఁ, గలఁకంత జూపల్లెఁ గలదెల్ల సుఖము
బస పు 3 ౨౫౯ పం

ద్వి ము న్నెందుఁ జిటిగ్రేల ముద్రికయగుచు, నున్నాఁడె యహిభుఁ డీ పన్నలకెల్ల
పండితా పురా ౯౫ పా

3. దీనుఁడు

౩. ఇరువురఁ గట్టియుఁ గొట్టియుఁ, బరిభవములం పెట్టఁ బేదపన్నల మనుచుం, గరుణముగఁ బలుకఁగాఁ గృప, రొయిరగిన చిత్తముల వార లాండొరులోడన్.
కేయూర 3 3౨3

౪. వృద్ధుఁడు, ముదుసలి

సీ. ముదివాఁడు ముదుసలి ముసలి పెద్ద ముదుక ధొక్క డొక్కు ముదురు పక్కు పన్న, వలరు వృద్ధాభిధ
ఆం. భా ౨ ౧౧౯

పన్నకము. వి. (√పన్ను[1]) పన్నుగడ, పన్నిక, రచన (శ. ర)

పన్నగము. సం. వి అ పుం ౧ సర్పము, పాము ౨ పద్మకాష్ఠము ⸸ (వ సీసము)

పన్నగారి. సం వి. ఇ. పుం. గరుడుఁడు

పన్నగాశనుఁడు. సం. వి. అ. పుం గరుడఁడు

పన్నద్ధ. సం. వి. ఆ. స్త్రీ. = పన్నద్ధి.

పన్నద్ధి. సం. వి ఈ. స్త్రీ. (కాలికి కట్టఁబడినది, కాలికి తొడుగుకొనునది) పాదరక్ష, చెప్పు

పన్నము. సం విణ (అ ఆ అ) ౧ చ్యుతము, జాఱి పడినది ౨ గతము, పోయినది. (వి. అ న. ౧. జేలను ప్రాఁకులాడుట. ౨. క్రిందుగాఁ బోవుట, నీదగమనము; దిగుట, ప్రాఁకుట. 3. జిహ్వా, నాలుక. (శే. వి.)

పన్నము. వి. (సం ప్రశ్నః ప్రా పణ్హో.) వేదమునందలి అష్టములలోని భాగము.

గీ. చెలఁగి తొలువాఁడు తరవాయిఁ జెప్పినట్టి, రొల్లపన్నంబు లేకరు విడి పదంబుఁ, గ్రమము గుణియించు నైష్ఠిక బ్రహ్మచారి, నికరములు గొల్వ వచ్చె శాండిల్యమౌని
రా వి. ౨ ౫౫.

పన్నరు = పన్నారు.

చ. తరుణులు చిల్కబొమ్మలును దంతపు బొమ్మలు కేలిగాజుప, న్నరులును బ్రాని చొప్పికలు నల్లద నోలినపేర్చి ...
కు సం. 3 ౨౬౯.

పన్నస. వి (క పణ్ణియ త పణ్ణై = వరిపండు పొలము)
పొలము, క్షేత్రము.

వ. అస్య క్షేత్రద్వయ స్యావధయః.
ఉత్తరతః కేల్పు కేను. తూర్పున పన్నస
పూర్వతః దామపియపన్నస
(Ep Ind. 5. No. 16.)

వ . . అస్య క్షేత్రస్యావధయః, పూర్వతః స్థాపిత శిలాగుణ్డసీమా దక్షితః పద్దిపెద్దేది పన్నస సీమైవసీమా ...
నమూరుశా. Ep. Ind. 12.

వ కాశ్యప గోత్రమున చక్రగొట్టమున మల్లరాణి వెంగినాటిలోన గుద్దవాదిలోని క్రిందూటి పన్నసబల్లవాణ్డు వాకిచ్చినదాని శ్రీ భీమేశ్వర మహాదేవరకిచ్చిన భూమి ఖ ౧౪ ఈ పన్నసకు నైరుతిమాల ..
దా. శా. ౪. ౧౧౦౧.

పన్నా. వి (క. మహా. పన్న త. పన్నా.) వస్త్రము మున్నగువాని వెడల్పు.

(వ్యవ.) అచాఁపుపన్నా మూఁడు మూరలు.

పన్నాగము. వి (√పన్ను[1] - క పన్నంగ, క. పన్లాగు, మహా పన్నగ.)

౧. అందలము మొదలగువానికిఁ మీఁదకట్టు కప్పు.

(మన్మథుని యందలము వర్ణనము)

సీ. పొన్నాకు మేల్పచ్చ పన్నియ పన్నాగ మనఁటి క్రొవ్విరిగుత్తి గొనబుకుచ్చు
చంద్రా 3 ౭౫

సీ రేఖ లై మీఁదటి రెప్పలరొప్పు పన్నా ౧ంబు కడపల్లబాగు సొబఁగు, ... వెలయింపఁ బన్నాగములకుఁ బై నిడిన యబ్బురపు దండెలుపోలె బొమలు దనర ..
కళా. ౩. ౧౭౪

సీ పచ్చ మార్వ్యపటంపుఁ బన్నాగమును మేలి పట్టె చట్టంబు కొంబట్టు పదము, ...

గీ ... చొప్పడు కొమారి, పందలం బెక్కె శ్రీరఘు నందనుండు
జూ ౭ ౧ ౫౯

౨ ఆందోళి కావ్యవయనము, చట్రము

సీ పన్నాగ మనఁగిన్న భాసిలుచుండును వాం దోళి కావ్యవయన సమాఖ్య ...
ఆం. భా. ౨. ౨౦౨

3 పన్నిక, ఎత్తుగడ.

(వ్యవ.) వాఁడు ఈ వ్యవహారమందు మంచి పన్నాగము పన్నినాఁడు

పన్నారు = పన్నరు. వి (ప్రాణిక లాడుకొను) గురిగి, చిన్నపిడుత, పాత్రవిశేషము

సీ పాఁపమేఁపరి పచ్చ పన్నారులోపుల గజ్జైన గుజ్జులను గుడుచు టుడిగి
యయా 3 ౧౪౯

క. కన్నార మిసుచంబులు, కన్నారతి మరని తోడఁ గళవళపడు వా, పన్నారుదొంతు లిడి గై, కొన్నారో యీ పసిండి కుండల టంచుఁ
రామా. ౨. ౨౮.

ద్వి పిన్నపన్నారులు చిన్నిబొమ్మలును
బస. పు. 3 ౭౩౬. ౫౦

ద్వి ఇత్తికిల్లఁ గుమ్ములరొదలకు దలుపు, మఱుఁ గునఁ బన్నార్గమాటున నద్ద, గోడలపజ్జను
పండితా దీక్షా ౭౭. పా.

పన్ని. వి (సం పంక్తిః. క పన్ని) పంక్తి, వరుస

ద్వి ఎఱ్ఱదామరల, రొబ్బపు కల్లిదవాడు మన్ను పాదములు పన్నికాలియల సంపద మట్టుకోలు, గొన్న నిగ్గులసోనఁ గురియు లేఁదొడలు ... ద్వి. పరమ ౧. ౧౫.

పన్నించు. స క్రి (√పన్ను[1]) ౧. రథవాహ నాదులను ఎక్కుటకు సిద్ధపఱచించు.

మ ఏ, పరివారంబును జేఁ దద్రథగపతిం బన్నింపఁడు ..
భాగ ౭ ౯౬ (పల్లించు చి ని పా.)

౨ ధరింపఁజేయు

ద్వి పసిఁడి పల్లంబులఁ బన్నించి పసిఁడి, పక్కెరి వేసిన ..
పల్నాటి వీరచరిత్రము. ౫౭.

(ప్రా 'కట్టు' అని భావము.)

3 నిర్మింపఁజేయు.

సీ కోట సింగారించి కొత్తళంబులవెల్ల నట్టళ్లు పన్నించి యాళుఁజొక్కి, బంగిళ్లు పెట్టించి
తా. హరి ౨. ౯౨

పన్నిక = పన్నుగడ, పన్నుట. వి. (√పన్ను[1]). ౧. రచన.

సీ. ... పన్నిక యనఁగను బన్నుట దగు ...
ఆం. భా. 3. 3౨.

౨. ఒప్పు, అందము.

ఉ. శైవము గర్భగేహమునఁ బన్నిక మీఱి
వెలుంగుచూలికా, దీపశిఖా ప్రరోహములు
దేరఁగఁ జూచి యనుస్మరించె లో, నా
పృథివీసురుండు ... శివరా. ౩ ౧౦౯

పన్ని(న్ను)కొను. స. క్రి. (పన్ను¹ + కొను.)
౧. పెట్టుకొను, సిద్ధము చేసికొను.

ఆ. వారి లట్ల సేసి వరుసగాఁ గూర్చుండి,
పసిడిపళ్లెరములు పన్నికొనఁగ . .
హర. ౬. ౧౧౬.

౨. చేసికొను.

సీ. ఆ బాల ననుఁ గూడ సాధించుచున్నచో
మిన్నక తప మేల పన్నికొంటి .
కు సం. ౬ ౭౧౯

౩. ధరించు, వేసికొను

ఉ. శేమ రయుక్త వేడుక నళికవళికరణంబు
జాతిగా, బూమియు దాను బన్నుకొని
పోకలఁ బోవుచు నుండఁగా . .
శైవ. ౩ ౯౭.

పన్నిదకాఁడు = పందెకాఁడు. (పన్నిదము + కాఁడు)
(జూదరి.)

ఉ. ... నే, నోడినయంతె కాకి మఱియున్న
పదార్థము లీయ నేర్తునో, పాడిరొ నీవు
వేఁడ సరిపన్నిదకాండ్రు హసింప నిర్యో
దక్ ... నిరం ౩. ౪౫.

పన్నిదము = పందెము. వి. (√పన్ను¹) ౧. పణము.

గీ. అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు, నల్ల
గలిగిన నీ విష్ణు సాకు దాసి, వగుము మఱి
యుండకు నల్లలే దయ్యేనేని, నీకు నే దాసి
నగుదుఁ బన్నిదము పణము
భార. ఆది. ౨. ౩౨. అను. ౧. ౧౭౭.

సీ. ఇత్తన్వి కన శేమి కదిరి పన్నిదము భాషా
విభుతో నైనఁ జెలువరాదె ...
భార. విరా. ౨. ౨౩.

గీ కైతవప్రౌఢి బెడిదంబు గాఁగఁ బన్ని,
దములతోడ నించుకయుఁ గించుదనము
బూన, క ... హ. న. ౩. ౧౦.

౨. ద్యూతాదులందు ధనాదికమును ఒడ్డుట.

౬ ఎత్తినపువ్వులు ముడుచుచుఁ, బొత్తిచ్చిన
పన్నిదములు వోడుచుచు నత్యు, ద్వ్యత్తి
గతి వీథిలో నుభ్య టొత్తము లంగళ్ల
మెఱయుచుండుదు కలమిక్.
కు. సం. ౩. ౯౫౬.

౩. చలము, పట్టుదల

సీ. మెయికొన్న వలపుఁ దెమ్మెరకాలుదిచ్చులో
నాపన్నిదము దీఱ నడచుదాన ...
కృ. శకుం. ౨. ౨౨౩.

(పన్నిదమాడు = పందెమాడు )

గీ. పన్నిదంబాడి గెలిచినభావ మొప్ప ..
హర. ౨. ౧౧౯.

(ఇట్లే = పన్నిదమిడు. మొ )

క. ఈలాగు వానితో నవు, టాలకుఁ బన్నిద
మిడి సొగటా లాడఁగ నో, టా లగు నీ
కర్థంబు ని, టాలా యని దక్కఁగొను కటా
లలికాంగీ. ప్రబంధ. ౬౩౬.

సీ. తన వైభవము చూచి తనవార లింద్రుఁడం
చొరులతోఁ బన్నిదం బూనికొనఁగ ...
దశా. ౧. ౫౩.

వ. ... వన్నె గల వెన్నెలబయట నెన్నరాని
వేడుక పన్నిదంబులు వన్ని నువ్వొన్నికరం
బులతోఁ బెన్నేర్పున జూదంబు లాడు
చున్న కతంబునఁ గొంతతడ వగుట ...
చంద్రి. ౪. ౧౦౩.

పన్నిద్దఱు = పన్నిరువురు. స (పది + ఇద్దఱు)
పండ్రెండుమంది మహాన్మశాత్యర్థక రూపము.

శా. నీ కేశాదశరుద్రులు .., నీ రంయిద్దఱు
నశ్వినుల్ దినకరుల్ నీ రెన్నఁ బన్నిద్దఱుస్,
ధీరుల్ ... కు. సం. ౧౧ ఒ౫౫.

సీ. రవులు లోలార్క కేశవ ఖఖోల్కాదులు
పన్నిద్దఱు ప్రమోదభాజు లైరి ...
కాశీ. ఒ. ౯౪

మ. అలపన్నిద్దఱు సూరులందును
అము. ౧. ౧౦.

పన్నిద్దుము. వి (పది + ఇరు + తూము) పం
డ్రెండు తూములు.

గీ ... పన్నిద్దు మన ద్వాదశాఢకి తగు ...
ఆం. భా ౭. ౭౪౧

పన్నిరువు(గు)రు = పన్నిద్దఱు. స (√పది)
పంౘ్రెండు మంది.

చ. పరువ పరాక్రమం దగుచుఁ బల్లవుపీట
నుదగ్రు లైనప, న్నిరువుర నాతనిం గలయ
కెన్ని . నిర్వ. ౧. ౭౫

క. పన్నిరువురు భాస్కరులుం, బన్నిన తనదైన
చెలువుఁ బాయని దని ధర్మఖ ౧. ౫౦

పన్నిర్లము. స (పది + ఇరు + పలము) పం
డ్రెండు పలములు

గీ. పలులుఁ బన్నిర్ల మనఁగిను ద్వాదశపలి . .
ఆం భా ౭. ౭౯
(పన్నిల్లము అని క ర)

పన్నిమ్కము. సం. వి. అ పుం నిమ్కమునందు
పాతికభాగము.

పన్నీరము. సం వి. అ న. పన్నీరు.

క పన్నీటఁ గడిగి పదములు, పొన్నల పొన్న
వల కొరిఁ బూజించుచుఁ ద, త్పన్నీరము
నిజశిరముప, యి న్నృపతి వహించి గృహా
మహిష రహిఁ జెలికస్
బహు. 3. ౭౪

శ్లో: కర్పూర రేణు సికతా కదలీయ గర్భ'
పన్నీర శీతల శిలాతలపుష్పతల్పే, కేళీ
మృణాళదళ కల్పితతాయమానే, ధారాగృహే
రఘుపతిర్విదధే నిదాఘే

సాహిత్య రత్నాకరమున రసతరంగము.

వ .. కుంకుమ పంకసంకరా లంకార పన్నీర
నీర నిర్వ్యాప్తితోర్వీ సేచన విధానంబునకు ...
కళా ౭ ౬౯ (వ్రాఁతప్రతి పా)

పన్నీరు. వి. జా (క పన్నీర్ త పణ్ణీర్ కు.
పనీర్)
పన్నీరము, హిమాంబువు, ఒక విధమగు పరిమళో
దకము.

సీ పద్మిని కన్నీరు పన్నీటఁ దుడువుము ...
సైవ. ౭ ౧౪౧

గీ .. సఖులు వంచు, చున్న పన్నీటిపల్లి లోఁ
గొన్నకతన ... అము ౧ ౧౫౧.

గీ మిాఱును హిమాంబుసంజ్ఞ పన్నీ రవంగ ...
ఆం భా ౧ ౧౫3.

పన్ను¹. అ క్రి (క త పణ్ణు) ౧ యుద్ధమునకు
సిద్ధపడు ; సిద్ధపడు

సీ పన్నిన పగఱపై సన్నాహ మంతయు పెడ
లించి నడచుట రొట్టులాకొ ...
భార భీష్మ. ౧ ౧౫౪.

సీ అక్కడ సప్తసంఖ్యాక్షౌహిణీక మనీక
మిమ్మ్మడ్కిఁ బన్నిన బలద్వ, యంబును
ఖేచరు లచ్చెరువడఁ బోర ..
భార. అశ్వ. 3. ౧౭౭.

ఉ. పన్నినవాఁడ వింకఁ జెడి పొఱకుమి యని
మూదలించి .. ఉ. హరి. 3. ౫౭.

ఉ. ... బంటుతనంబుఁ బాపుటకుఁ బన్నిన
వాఁడఁట వాఁడు వాఁడిమిన్ ...
కువల. ౭. ౧౦౧.

క. ... మన బలముఁ బాండవ, సేనయు నిటు
పన్ని రేమి సేసెం జెపుమా ...
భార. భీష్మ ౧. ౧౮౧

౨ కవియు, తలపడు

చ .. విశా, రచిత విధానసత్వరత సుద్ధతయోధ
సమగ్రవాహినీ, ప్రచలిత భూమిభాగముగఁ
బన్నఁగఁ బంపుఁడు దండనాథులన్ .
భార విరా ౩ ౧౪౦

క ఏను జయింతును, ఫాలాక్షుఁడుఁ
ప్రమథవరులఁ బన్నిరయేనిన్
హరి, ఉ ౮ ౧౯౨

౩ పూను, ఉద్యమించు

సీ మిన్ను ప్రాలినవైనఁ బన్ని యానగఁజాలు
సముదగ్ర జవమణి స్యందనములు
చంద్రా ౬ ౮౨

క ఇన్నీచునకై దేవర, పన్ని పెనఁగ కేలయేన
పరిమార్త జై భా ౮ ౧౭౩

౪ అతిశయించు

క అన్నలి నాథులవాలుం, గన్నుల కెదిరింప
లేని కతమునఁ గాదే, పన్నిన భయమున
కేడిస, లెన్నఁడు జలదుర్గభూము లేమణి
వెఱచున్ .. హరిశ్చ. ౨ ౯౦

౫ వ్యాపించు, ప్రసరించు

క కనక స్తంభస్తంభన, జనకము లై హస్తి
హస్తపారహారము లై, యనఁటుల మిాఱెడి
యూరుల, మినుకులు మిన్నెల్లఁ బన్ని
మిన్నల సీనన్ ఘటికా ౨ ౮౫

(స క్రి. ౧. (వ్యూహమును) ఏర్పఱచు,
(సైన్యాదులను) యుద్ధమునకు సిద్ధపఱచు

క. మనవెంటఁ గని ధృష్టద్యు, మ్నున కిట్లనుఁ
బన్నఁ బంపు వెంహారము .
భార. భీష్మ. ౨ ౯౮.

మ కడఁకం బన్నఁగ జానతిచ్చెఁ జతురంగం
బుల్ రణక్రీడకు, న్వేదలన్ .
ఉ. హరి. ౪. ౨౧౨

సీ పగవాఁడు బలములఁ బన్ని క్రోధించి
దాను సబలుఁ డై దాయింటికైవ సంగరంబు,
గోరిన భార శాం ౨ ౪౨౦

శ్లో. సచేత్సన్నద్ధ అగచ్ఛేత్సన్నద్ధవ్యం తతో
భవేత్, సచేత్ససైన్య అగచ్ఛేత్ససైన్య స్తమ
థావ్వ్రయేత్ .
సం భార. శాం. ౯౫. ౭.

౨ (రథాదుల, పెక్కుటకు) సిద్ధముచేయు, సిద్ధ
పఱుచు

గీ సమున్నత మగుతోరంగంబు పన్ని,
ప్రాంగణంబున నిల్పి శిలాదసుతుఁడు ...
కాశీ ౬. ౧౪౮.

౩ కావించు, చేయు

ఉ నిన్నటికేయి నారొుదుట నిల్చెఁజామి కల
లోన మాకు మేల్, పన్నెదు పేరఁటా
ల్నిలిచి బాపఁడ కడ్డికిఁ దల్పరాద ...
కుక ౨ ౪౪౫ ఉ రా. ౧ ౭౮.

సీ ఇంద్రజాలపువిద్య పెచ్చొప్పటవైనను బయలు
పట్టనముగాఁ బన్నవచ్చు ..
విక్ర ౪ ౧౧౩

శా అన్నన్నా నలకూబరుండె ప్రబలుం దం
చుణ్ సుధాంధుల్ నుతు, ల్పన్నన్ హగిరి
కారలం బడిన బాలల్ పొంది రానంద
మున్ ... ఉ. రా. ౪. ౨౩౯

౪. నిర్మింపఁజేయు.

సీ. బలభిదారామ సంభవలతాంతక్రీడఁ బన్ను
ము నా కొక్క చిన్నిలేరు ...
పాండు ౫ ౧౨౫.

౫ సృజించు, పుట్టించు.

సీ ఎవ్వనిపొక్కిట నీరేడు జగములు పన్నిన
విధిఁ గన్నపద్మ మలరు
భా రా యు. ౬౧౨

౬. కల్పించు.

చ మన మరియుం దలంచి యుక్తి మార్గము
పన్నితో  పారి ౧ ౧౧౬

ఉ ... కొంటిపెద్ద లే, సూత్రముఁ బన్ని
వారొ బలనూదను వీటికిఁ గొండవీటికిన్
ఆము ౧. ౩౭

౭ రచించు, నిర్మించు, చిత్రించు

సీ పన్నిరి మేరువుల్ బహుసంఖ్యల కొలంది
చంద్రసూర్యా కల్పకలితముతోడ ..
పను ౫. ౬౪

.. భా, శ్రీపరుఁ డుండె కాంబరి ధరించియ
ధీమనుతా వినోదనం, భావనకై సఖీజనులు
పన్నిన యాత్మమనోజ్ఞ పుంస్త్వరూ, పావ
కిలో నిజాకృతి బయల్పడకుండఁగ రత్న
వేదికన్ ..  శైవ. ౩ ౧౧౮

శ్లో: శైవిమా వినోదాయ ముదా సఖీభిస్తదా
కృతీనాం భువి కల్పితాసాన్ ...
సం శైవ. ౬ ౭౪

౮. వేయు

(క) తాల్చు, ధరించు.

క. నామనను వచ్చుకైవడి, నే మెలఁగినఁ
బాదశేకర యొవ్వతెవే యీ, బూమెలు
పన్నఁగ వల దీఁక, యీకొర ల్నిలువకున్న
నిట్టటుఁ జేతున్ ...  శుక ౪. ౩౬

సీ  తమతమ చిహ్నముల్ దనరి యొఱుక.

ఆ. పడఁగ వేలువేలు పన్ని భూతలము గ్రి,
క్కదల ...  భార ఆది. ౭ ౧౬౫.

వ . పులుఁగులభంగి నటించుచు బహురూపం
బులు పన్నుచు కొగిరి తన్నుచు ..
భాగ ౧౦ పూ ౭౨౧

(చ.) వల మొదలగునవి ఒగ్గు.

వ . . గాలి పరికించి దిగువడన దొడ్డివల పన్ని
మనుచ ౪ ౩౭

క. . ఊరులు పన్ని కదుస్ దొ, డ్డుల నాఁగి
నీలా ౨. ౬౫

(ట) గుడారము మొదలగునవి నిర్మించు

సీ . కీవిని బయళులను గొల్లెనలు పన్ని
నీలా ౩ ౪౮

చ పగడపుఁ గంబముల్ నిలిపి పన్నిన ముక్యా
పుఁ జప్పరంబులన్, నిగనిగలాడు కుందనపు
నిద్దపుగోడల  నీలా. ౧. ౩౦

౯ ధరింపఁజేయు, తాల్పఁజేయు

గీ పీలికుంచె తెలాటంబు పేరజంబు, మణుల
కొంగముట్టు పన్ని సాహిణి యొకండు, కత్తి
యొదుటికి గొనివచ్చె గంధవాహా, బాంధ
వం బగునొక మహా సైంధవంబు ...
మనుచ ౪. ౨౮

౧౦ అధిష్ఠించు, ఎక్కు

వ  ఎదుర నొక్క మహోక్షంబు నెక్కి
చనుదెంచువాని నొక్క దివ్యపురుషుం గని
వాని పన్నిన వృషభగోమయ భక్షణంబు
సేసి  భాగ ఆది ౧ ౯౩

౧౧ ఒడ్డు, పందెమిడు

సీ తనకు లా గయిన కొత్తింబు గైకొని పన్ని
పాసిక దాళించి పా కొతెంగి
ఉ హరి ౩ ౧౨౦

వి (= పన్నిక, పన్నుట) ఎక్కుటకు సిద్ధము
చేయునప్పటి రథాశ్వాదుల సవరణ

సీ వాహనంబులు డిగ్గువారును బన్నులు విడుచు
వారును దమవీరు లెఱుఁగఁ దమతమ చిహ్న
ముల్ దనరఁగఁ బట్టించువారును ..
కా సం. ౧౧. ౨౦౦.

జ: పన్నకము, పన్నాగము, పన్నించు, పన్నిక,
పన్నికొను, పన్నిదకాఁడు, పన్నిదము,
పన్నుగడ

పన్ను². వి. కరము, అరి.

సీ. . గురుపేరఁ బత్త్రికఁ గొంచు వచ్చి, పన్ను దెమ్మను నొక్కభటుఁ జూచి యా మునుఁ డొక్కడి పన్నువాఁ డితఁ డనుచు
పరమ ౫ ౧౬౭.

వ. ... రొండ్ల చెలికకాంపుకు రెండుపాళ్లున్న నగరికి పాలున్న ఆయం అడుకొ్క (ళ్లు) పన్ను పరాయాలు తొలఁరేయిండు మాన్యం రెండోరేయిండు ౧౪ పంగ రు ౧౪౯ ఉన్న
ద ౧ శా ౪ ౨౧౨

ద్వి. ... పూనిక పెట్టియుఁ బోరి పెన్నుఁబన్ను, నరుప సేమియుఁ దన్ను నలజడిపెట్ట
బస. ప్ర ౪ ౯౫

జ: పన్నువాఁడు.

పన్ను³. వి. ౧ దంతము, రదము

క. పెన్నకుఁ బన్నులు వచ్చెన, నెన్నెల ధవళ కిరణ రదనమ్ముల మేసె, ల్ల న్నమలెనఁటే యని యు, క్కన్నియ నొక సకియఁ జేరి గారవ మలరన్
చంద్రా ౫ ౭౫

౨. అంపము, దువ్వెన మొ వాని అవయవ విశేషము.

(వ్యవ.) ఒకపన్ను పోయినను అంపము దువ్వెనయు సెట్లో వాడుకొనవచ్చును

పన్ను⁴. వి ౧. విధము, రీతి

ఉ ఈ, పన్నొందఁగూడినం జెలులపా టొందఁజా టటు గాక యెట్లు నే, వెన్నెల నిల్తు గల్తు నవిల్తు నదల్తుఁ బికాది సేనలన్ .
కావ్యా. ౨. ౪౪

౨. ఒప్పు.

ఉ. .. విహాహము నీవు నాకు మున్, భావజ శక్తి నైన యది పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు ... భార. ఆది. ౩. ౧౨౯.

ఉ. మీ, పాదపయోజదర్శనము పన్నుగఁ జేయుటఁజేసి పూర్వసం, పాదిత సర్వపాపములుఁ బాసె భృశంబుగ నాకు నచ్యుతా.
భార ఆది. ౭ ౧౬౯.

క. దున్నక వెదపెట్టక యు, తృన్నము లైనట్టి విపుల బహుసస్యములన్, బన్నుగఁ గైకొని
మార్కం. ౪ ౪౧.

ద్వి. శ సా ౨ ౫౦ పా ౪ పం.

జ. పనుగొను

పన్నుండు. అ క్రి (√పడు) శయనించు, పరుండు (చి ని శ. ర)

పన్నుగడ = పన్నిక. వి. (√పన్ను¹) రచన, ఏర్పాటు, యుక్తితోఁ జేసిన ఏర్పాటు.

లయగ్రాహి. మిన్నగలరాయ రుచిఁ జెన్నగు విమానముల పన్నుగడ పన్నుగి ...
మనుచ ౫ 30 కళా ౫ ౨౦౪

గీ ప్రాణసఖి యిట్లు పన్నిన పన్నుగడలు, తెలియమింజేసి ... ప్రభా ౫ ౧౪౭.

పన్నువాఁడు. విశే (√పన్ను²) కరము గైకొను వాఁడు

గీ. . గురుపేరఁ బత్త్రికఁ గొంచు వచ్చి, పన్ను దెమ్మను నొక్కభటుఁ జూచి యా మునుఁ డొక్కడి పన్నువాఁ డితఁ డనుచు
పరమ ౫ ౧౬౭.

పన్ని(న్నియ). వి ౧ మగ్గమునందు పడుగు నూలు పేఁకలు చొప్పించుటకై పడుపు దువ్వెన పండ్లవలె నిలువుగా నేర్పడియుండునట్లు వెదురుబద్దలతో నడ్డముగాఁ గట్టఁబడిన సాలెవాని సాధన విశేషము. (శ ర.)

౨. అంకపన్నె పెనుకటి యిరుపముల్లు

గీ. మస్తకము దువ్వి పలుమాఱుఁ గుస్తరించి, సమరసముఁ జూచి కొల్లన సమతుపఱచి,

పప్పుచేయు. స. క్రి. (√పప్పు) నుఱుగుచేయు, సంహరించు

గీ పరశువులఁ ద్రెంచి గదలచేఁ బప్పు చేసి,
ఘోరగతిఁ జెర్చి యిరువాగుఁ బోరొనర్చి
కవిక ౨. ౧౫౪

(శ. ర. పా. 'పంపుచేసి' - ముద్రితపా)

పబువు. వి (సం ప్రభుః) ప్రభువు, రాజు (విణ అని శ. ర)

పబ్బటు. వి. (హిం పపడ్) పైపొర, పైకప్పు

(పబ్బటుచీటి = పై పొరగలచీటి) సంచిలో నుంచిన యుత్తరము

ఉ. పబ్బటుచీట్లు వ్రాసి నిజభర్తల పాలికిఁ
బంచి రంతలో, నబ్బలి బంధనుండును భవాబ్జ
భవాదులఁ బిల్వఁ బంచినన్
ల వి ౫ ౫

పబ్బము. వి (సం. పర్వ ప్రా పబ్బ, క హబ్బ తు పబ్బ)

౧. పండుగు; ఉత్సవము

సీ శాకినీ ప్రముఖ పిశాచజంబుల కింకవారంబు
లకుఁ దనివారఁ బెద్ద, పబ్బంబుగా వీరభట
సామజాశ్వాళిఁ బొరిఁగొని హరులను గరులఁ
బట్టి .. రామ ౪౨౯.

చ. చెలియలిపెండ్లి చేసితిరి చిల్లరపబ్బము లెన్ని
రైన శో, భిరె నను పెన్నఁడైనఁ బిలిపించి
తిరే ... శుక ౨. ౫౨౦.

దండకము. ... వివాహంబులున్ బండుగుల్
పబ్బముల్ మున్న మాయిండులన్ జేయుట
ల్లేదొ ... చెన్న. ౫ ౨౯౪

క. అబ్బి త్తరిం గన్నుల, పబ్బమ్ముగఁ జూచు
నపుడు ప్రమదంబునఁ జె, ల్లబ్బెడు గబ్బి

మెఱుఁగుచన్, గుబ్బలచే రవికె సుగ్గు
నూచము లర్యోన్. రా. వి ౩. ౧౩౦.

గీ పరఁగుఁ బబ్బము పండుగ పండు వనఁగ,
నుత్సవము ... ఆం. భా ౧. ౧౪౩

౨. భోజనము (ఆతిథ్యము అని శ ర)

ఆ. నీవు గాక యింక నెఱయంగ నిరువురఁ,
దొరుకవచ్చితేని నొడికమైన, భంగి ముప్పొ
ద్దును బబ్బంబు పెట్టెదఁ, గూర్చి తెమ్ము
వ్రెంక్కు దీర్చికొనఁగ
సా పంచ ౫ ౫౬

జ పబ్బము పెట్టు

పబ్బముపెట్టు. అ క్రి (పబ్బము+పెట్టు) భోజనము పెట్టు

క. గబ్బున నెదిరించిన నొక, దెబ్బ గొనుచు ..
నెదుర త్రిజగముల నొరుల్, తబ్బిబ్బుగ
జంగములకుఁ, బబ్బంబులుఁ బెట్టు ముష్టి పరి
ఘట్టనలన్ శివరా ౪ ౭౧.

(ఇట వ్యతిరేకలక్షణచే 'బాధించు' అని భావము)

పమర. సం వి అ స్త్రీ) గంధద్రవ్య విశేషము, నల్లకి, అందుగు [illegible]

పముజో = పంజో. (శ. ర.)

పమ్మకము. వి అంచులు ముడిచి కట్టెడు కట్టు. (శ ర)

పమ్ము = పంబు[1]. అ క్రి. ౧. అతిశయించు. (క) అధికమగు

ఉ. . ఉగ్రతం, బమ్మిన యట్టికోప పరు
పాలికి భామలు వోవ నోడరే ...
భార. ఆది. ౪. ౩౭.

సీ. పమ్మిన కృష్ణచీరమ్ములు వొగడుచు నున్న
నీచాలిక రొంత్కఁడయ్య ...

సీ. పయనంబు గావమ్మ భర్గజటాటవీతట
జటాఘా శిఖాశేఖరకంబ ...
భీమ ౪. ౧౪౫, సీలా. ౩ ౫౦.

పయనము = పయినము, పైనము. వి. (సం. ప్రయాణమ్ ప్రా పయానమ్. క ఈ పయణ. త పయణం.) ౧. ప్రస్థానము, బయలుదేఱుట, గమనము.

క. మత ప్రజలోఁ గరిపురికిన్, జనుదేఁ గవలయు వారి సవరణతోఁ రం, దని యేర్పడ నియమింపు మ, యన నై యేతెమ్ము నీవు నని తగ మఱియున్.
భార. ఉద్యో ౩ ౧౩౧

సీ. పాళెంబు డించుచోఁ బయనంబు సేయుచోఁ దెండులఁ గ్రందు గానీని తేర్పు .
ఉ గా ౪ ౧౪౬.

క ... పటుతురగగతి, స్ఫురణాను మోదలీలా, భరితుఁ దగుచు తేరింపుఁ బయనములఁ దగన .. భార ఉద్యో ౧ ౬౩

చ. ... రథము న్నిలుప న్పయనంబు పొఁగి మిన్ ...
ఆము. ౨. ౪౯. ఉ. రా ౮. ౬౮

౨. మార్గనివాసము, విడిద. (రెండు బసలకు మధ్యమున నడచెడు స్థలము)

వ. ... స్వామిమలకుఁ జనువాఁడై కొన్ని పయనంబు లరిగి ... కాశీ ౩ ౫౧.

వ. ... సర్వసన్నాహ సమేతుం డై వెడలి భట్టియుం జనుదేర విదర్భానగరంబు నిర్గమించి పయనంబున యోగదండ ప్రకాండ కల్పితానల్ప పురని రూపణంబుల .
విక్ర. ౪. ౨౦౧.

గీ. కదలి జనవరు శల్లితఁ గాన్క లొసఁగఁ, గైకొనుచు శుభ శోతువుల్ గనుచుఁ గొన్ని, పయనములఁ జని ... ఇందు. ౫. ౫౫.

జ : పయనమగు, పయనించు.

పయనించు. అ. క్రి. (√పయనము) పయనమగు. (శ. ర, బ్రౌ.)

పయర = పయ్యర. వి. ౧. గాలి, మారుతము. (ఆం ని., శ. ర)

౨. దక్షిణపుగాలి. (శ. ర.)

౩ (త పయఱు) దక్షిణపు గాలిచే పండెడి పెసలు లోనగు కాయధాన్యము. (శ. ర, బ్రౌ.)

పయస్యా. సం. వి. ఆ స్త్రీ. ౧ ఆమిక్ష, పాల విఱుగుడు ౨. దుగ్ధిక, పాల. చె ౩ క్షీరకాకోలి, పిన్నపాల. చె ౪. స్వర్ణక్షీరిక, రెడ్డివారి నానఁబ్రాలు చె (శ. ర. కంకోష్ఠ అని కొందఱు) ౫. అర్కపుష్పిక చె. ౬. కుటుంబిని, కోలపాల చె.

పయస్యము. సం విణ. (అ ఆ. అ) ౧ క్షీరవికారమైనది (పేయి మొ) ౨. జలవికారమైనది. ౩. పాలకు అనుకూలమైనది ౪. నీటికనుకూలమైనది. ౫ పాలయందైనది ౬. నీటియందైనది

వి. అ. పుం. పిల్లి.

పయస్వలము. సం. విణ. (అ ఆ. అ) ౧ మిక్కిలి పాలుఁగలది. ౨ జలముతోఁ గూడినది

వి అ పుం. భాగము, మేఁక

పయస్వి. సం విణ. (న్. నీ న్) పయస్సు గలది

పయస్విని. సం వి ఈ స్త్రీ. ౧. మేఁగిటి యావు, ధేనువు. ౨ నది. ౩ రాత్రి. ౪. భాగి, ఆఁడుమేఁక. ౫ కాకోలి, కాయకొల్లి చె. ౬. క్షీరకాకోలి, పిన్నపాల. చె ౭ దుగ్ధఫేని, ఒకానొక చెట్టు. ౮. క్షీరవిదారి, పాలకేల

గుమ్మడు ౯. ౯. పాల గొలిమిడి. ౯. ౧౦ జీవంతి. ౯

పయస్సు. సం వి స్. న ౧ రాత్రి (కే ని) ౨ అన్నము. ౩ కేలిస్సు ౪ నీరు ౫ పాలు

(దీనికి సలోపము రాదు కాని యీ క్రింది ప్రయోగమునమాత్ర మొక కవి 'పయము' అని ప్రయోగించినాఁడు.)

గీ. పూరులఁ గాంచినకేమి గుహ పూరులఁ గాంచెఁ, బయము లానినరుచి సరఃపయము లానెఁ, గలన నుంచినరొద పయఃకలన నుంచెఁ, గాశిఁ దఘాచలోద్భేదకాశి కుండు.

గాధేయోపాఖ్యానము ౩. ౬౦ పా

పయి = పై. వి. ౧. సప్తమ్యర్థకము

(క) మీఁదు, ఉపరిభాగము

చ ... మావితోఁ, పులవిరులకిబయి న్నడుపఁ బోలు పురాతన తీర్థకుండముల్ . .

ఆము ౧ ౭౧

ఉ ... కాం, బూలమూ మోవి మోవిపయి మోపుచు రాధకు నిచ్చు ధూర్త = గో, పాలుఁడు ...

భీమ. ౧. ౩

(చ.) విషయమా, ఎడ.

శా ఏలా నాపయి దక్షిణానిలము పక్షీ పేయు దాక్షిణ్యముస్ ...

సైష ౨. ౩౨

క. జంఘాహితుఁ దూర్వాశిపై, రంభ పయిం గరుణ కలిమి ...

విక్ర. ౨. ౭౭. పారి. ౧. ౪౭

౨. వెనుక, వెంట, మీఁద.

క. కలువుపయిఁ గలువు వోరయుచు, పెలువు పయిఁ పెలువు దోఁప ...

భార. శాం. ౪. ౭౨.

క చాలం బుత్రులు గల్గిన, యాలిపయిం బెండ్లి యాడునప్పుడు దాఁ జె, ద్దాలికిని ధనము మూఁడవ, పా లిచ్చుట ధర్మ మంత్రము భర్తల కెల్లన్ విజ్ఞా. ఆచా. ౧౧౭.

క. సంతతి లేకున్నను మ, త్కాంతపయిన్ వేఱ యొకతెఁ గామింపక రే, సెంతయు ధృతి నుండితి నిది, యింతయు విధిఘటన దీని సేను వరింతున్

హరి పూ. ౩. ౧౩౦.

బయిపయి = పై పై, వెనువెంట, ఒకి దాని వెనుక నొకటి

సీ. పయిపయి నెంత లాపదలు వచ్చిననైన నుత్సాహ మెడలక యుద్ధ మరులు, నేద్పడు నట్లుగాఁ జేసెడి బంధులు ..

భార. కల్యా. ౨ ౪౦౧.

జ ' పయఁట, పయింట, పయికొను, పయి చీర, పయిపడు, పయిపాటు పయిపెచ్చు, పయ్యంట, పయ్యద, పయ్యెద.

పయింట = పైఁట. వి (√పయి - సం పైరా ప్రా పఇఢా.) పయ్యెద

ఉ బాలిక నాఁటిరేయి పతిపజ్జకుఁ బోయి పయింటకొంగు కొం, గెల బిగించుచున్ ...

దశా ౬. ౪౩

చ. ముడిచి పయింటలో రవికముళ్లు ఘటింపుచు పోఁకముళ్లు క్రొ, మ్ముడులు బిగింపుచున్.

ఆం. శే ౧౫ మృ వి. ౨. ౬౯.

పయిఁడి = పసిఁడి, పహిండి, పహిణి, పైఁడి.

వి. బంగారము.

మ. ... పెకాచాలివి, చ్చిన కొక్కల్ పయిఁ దండ్రపోఁతలు దగన్ జిత్రాంగి రత్నాంగి వం, దనుఁ గారింపఁగ వచ్చినట్టి విధియోనా వచ్చి ప్రాలిన దమిన్ ...

శారంగ. ౧. ౧౭౯.

(పయి డి కుండలు = దేవాలయ శిఖరముపై నుంచెడి బంగరు కలశములు.)

వ ... నున్న పనులు సేయించి పయిండి కుండలు ఎత్తించి ... ద గా ౪ ౩౦౨.

జ: పయిఁడికంటి, పయిఁడి ప్రత్తి, పయిఁడి ముడుచే

పయిఁడికంటె = పైఁడికంటె[1], పసిఁడికంటె. (√పయిఁడి) వి పక్షి విశేషము

పయిఁడిప్రత్తి = పైఁడిప్రత్తి. వి (√పయిఁడి) కార్పాసభేదము (శ. ర)

పయిఁడిముడుచే = పైఁడిముడుచు. అ క్రి (√పయిఁడి శ ర)

పయికము = పైకము. (శ. ర)

పయికొను = పైకొను. అ క్రి (పయి + కొను[1]) ౧. చలపట్టు

చ పయికొని నన్ను నిట్లు మరువారికి లోనుగఁ జేయఁబూనిరో, నియతిరో వట్టి సంది యము నీ కొనరింపఁగఁబోలు ... క శా ౭. ౨౭౬.

౨ కేచు, కని పెట్టుకొను (యత్నించు అని శ. ర)

క. ప్రాణముల కెక్కుడగునా, ప్రాణేశ్వరి దోఁచికొనిరొఁ ఒట్టి మదాప్త, ప్రాణుల బంధించెను మ, త్ప్రాణంబులు కొనఁగ నెపుడుఁ బయికొని యుండుక ... భా. రా. కిష్కి. ౧౦౪

3. పడు, మీఁదఁబడు.

వ. ... మీఁదిరో, ధనికరమేయు సాయకవితానము భీమణ వృష్టిగారయం, బునఁ బయి కొన్న రేణుఁగుల పోరునఁ జేరులు జేశ నెత్తుటన్. భార. శల్య. ౧. ౧౨౧.

సీ. వంకుల జముదాళ్లు వాల్బల్లెములఁ గ్రుమ్మి పయికొని పెద్ద యీఁటెలఁ బొడిచి అచ్చ. రా. యు ౧౭౦.

పయిచీర = పైచీర. వి. (పయి + చీర) ఉత్తరీయము, పైబట్ట

చ విను పయిచీర లేక నురవిప్రుల నర్చన సేయఁ దెల్ప భో, జన మొనరింపఁగాదు మార్క. 3. ౨౩౧.

పయితాణి = పైతాణి. (జరిబట్ట)

చ కలుకుఁ బసిండి కట్నపుజగా పయితాణి మెఱుంగుఁ గండెపూ, వులకిముకాబుజంటి వారువుల్ బడఁగొట్టు వెడంద పావడన్. మల్లపు. ౪ ౧౯.

పయిడీణి = పైడీణి. వి. వస్త్ర విశేషము.

పయిద = పైద (శ ర)

జ: పయిదలి.

పయిదలి. వి (√పయిద) ఆఁడుది, స్త్రీ

పయినము = పయనము. (చి. ని)

(ప్రయాణము, యాత్ర, ప్రస్థానము)

ద్వి. పయినంపు దినమునఁ బార్థివేశ్వరుఁడు, ప్రియమార వీడ్కోల్పఁ బెంపొంద వెడలి రం రా ఉ ౧౫౦ పా ౧౧. పం

(మార్గము, త్రోవ.)

ద్వి. పయినంబు నిడు పైనప్రజ నొవ్వనీక, రయ మొప్పఁ జని మత్స్యరాజ్యంబుఁ గిడిసి ... ద్వి. భార. విరా. ౧. ౧౫. పా.

పయిపడు = పైపడు. (√పయి.) చూ. పయిపాటు.

పయిపాటు = పైపాటు. వి. (√పయిపడు.) ౧. అనువంగికత్వము.

(పయిపడుట, కవియుట అని శ. ర)

ఉ బాల సమీరణంబు పయిపాటున నించుక సోఁకినం గడుం, దూలుచు నుండుఁ గాను . . విజ. వి. 3 3౭.

సీ పయిపాటుగా డిగ్గ పవమానాంకురంబులు బడలిక యూర్పులబాగు మోవ . . కళ 3. ౬౭.

౨ ఆలింగనము

ఉ ... వెసం బయిపాటు మున్నుగాఁ, దేనియు లుట్టఁ దేటు జగతీపతి కమ్మలి రాముఁ డింతికిన్ నిర్వ ౧. ౬౫

('తేటు జగతీపతికి' తాళపత్ర ప్రతుల పా.)

**పయిపెచ్చు** = పైపెచ్చు. విణ (పయి + పెచ్చు) (ఒక దానికంటె) అధికము

చ. పిడికెఁడు కానుఁ గొప్పఁ గని ప్రేమఁ ద్రివక్ర సమాంగిఁ జేసితేఁ, బిడికెఁడు కానుఁ గొప్పఁ బయిపెచ్చు గుణంబును గంటి వంచుఁ జే, ర్పడఁగ నిజత్రివక్రతయుఁ బాపఁగ ద్రొక్కెడు నా మమాలిపైఁ, జడిగొన నమ్మ లీను హరికార్ద్ర ధనుర్లత గాచుఁ గావుతన్. ఆము ౧. ౯

ఉ. కాఁగిటఁ జేర్చునప్పటి సుఖంబె లతాంగికిఁ బారవశ్యముల్, మూఁగఁగఁ జేసె మోవి పలునొక్కులు రోజనఖాంకముల్ మొదల్, గాఁగల కంతుకేళి సుఖలక్షణముల్ పయిపెచ్చు లయ్యె . విజ. వి. ౧. ౧౦౯.

**పయి(పై)ర** = పయ్యర. (శ ౧)

**పయిరము** = పైరము.

**పయిరు** = పైరు. వి ౧. సస్యము, చేను.

వ. ... తలిరొత్తులపులక మొలక పయిరునకుం బాఱుదర్వార వారిపూరం బన . మనుచ. 3. ౯.

గీ. చేలఁ బోశ్లను బీళ్లను జేరఁ జొచ్చి, పయిరుపచ్చలు మేసి యప్పాటఁ బోక, పల్లియలఁ జొచ్చి తోఁటలు పాడుచేసి, కావరంబునఁ గడువ్రతై గాసి చేయు యయా. ౧. ౧౦౪

సీ. పైరవంగను బయిరు నాపని యనఁగాను సస్యము చెలంగు ... ఆం. భా ౨ 3౯

౨. ఓషధి (చూ పయిరుల ఎకిమీఁడు)

జ: పయిరుచేయు, పయిరుల రొకిమీఁడు

**పయిరుచేయు.** స క్రి (పయిరు + చేయు) సేద్యము చేయు, సాగు చేయు

సీ ఒక శూద్రమునుఁడె చాలఁ గుతలంబెల్లను బహుసస్యమయముగాఁ బయిరు చేయు దశా. ౧ ౯౯

**పయిరులరొకిమీఁడు.** వి (√పయిరు) ఓషధీశుఁడు, చంద్రుఁడు

సీ . అదల్చు, టయు వార లక్కొ౯ఁతి పయిరుల రొకిమీనిఁ బొదవి పల్దెఁగులఁ బోరవాతఁ, డు అచ్చ. రా యు ౧౭౫.

**పయిసర** = పైసర.

**పయోండము.** సం వి అ పుం. పనస. ? (పై ని)

**పయోగళము.** సం విణ (అ. ఆ అ) పాలు కంఠమందుఁ గలది.

వి. అ. పుం. దీనినుండి నీరు స్రవించును ౧. కరక, వడగల్లు. ౨. ద్వీపము, దీవి.

**పయోఘనము.** సం. వి. అ. న. కరక, వడగల్లు.

**పయోజన్మము.** సం. వి. న. పుం. నీరు దీనివలనఁ బుట్టును - ౧. మేఘము, మబ్బు.

౨ (నీటియందు జన్మము గలది) పద్మము 3 తుంగముస్తె ౹.

పయోజము. సం. వి అ. న తామరపూవు, పద్మము

పయోదము. సం విశ (అ ఆ అ) ౧. పాల నిచ్చునది. ౨. నీ రిచ్చునది వి. అ. పుం

౧ మేఘము, మబ్బు ౨ తుంగముస్తె ౹

పయోదసుహృదము. సం. వి ద్ పుం మేఘ మిత్రము, నెమిలి

పయోధరము సం విశ (అ ఆ అ) ౧ పాలను ధరించునది ౨ నీటిని ధరించునది వి అ పుం

౧ మబ్బు ౨. స్తనము 3. (ఆవు లోనగు వాని) పొదుగు ౪ టెంకాయ ౹ ౫. ముస్తె. ౹. ౬. కశేరుకము, గొట్టిగడ్డ, నమ్మదుంప. ౹

పయోధస్సు. సం వి. స్. పుం ౧ సముద్రము ౨. జలాధారము, జలాశయము. (చెఱువు మొ) 3 వానమబ్బు.

పయోధి. సం. = పయోనిధి.

పయోధికము. సం విశ. (అ ఆ అ) పయస్సుచే అధిక మైనది.

వి అ. న సముద్రముపై ప్రకాశించునది సముద్రపు నురుగు

పయోనిధి. సం. వి. ఇ. పుం - దీనియందు నీరుండును - జలధి, సముద్రము

పయోముచము. సం. వి చ్. పుం - నీటిని విడుచునది - ౧ మబ్బు ౨ తుంగముస్తె ౹

పయోరము. సం వి. అ పుం. ఖదిరము, చండ్ర. ౹

పయోరాశి. సం. వి. ఇ. పుం. సముద్రము.

పయోలత. సం వి ఆ స్త్రీ) క్షీరవిదారి, పాలగెలగుమ్మడు ౹.

పయోవహా. సం వి ఆ స్త్రీ) ప్రణాళి, కాలువ (వై ని)

పయోవాహము. సం వి. అ పుం - నీటిని దాల్చునది -

౧ వారివాహము, మబ్బు ౨ తుంగముస్తె ౹

పయోవ్రతము. సం వి అ న పాలే ఆహారముగాఁ జేసికొనియుండు వ్రతవిశేషము

పయోష్ణి. సం వి ఈ స్త్రీ) వింధ్యపర్వతజాత మగు ఒక నది

(ఇగి ఇప్పటి తపతియొక్క ఉపనది యగు పూర్ణానది)

పయ్య వి పాటలవర్ణము

గీ .. హారిద్రాధ పాటలాఖ్యలు చెలంగుఁ, బల్ల యనఁ బస్సె యనఁగను బయ్య యనఁగ
ఆం భా ౧ ౧౦౫

పయ్యంట = పయ్యఁట, పైఁట. వి (√పయి) పయ్యెద

సీ . . కాంతో త్తరీయంబు పయ్యెద పయ్యంట పైఁట పయిఁట

గీ పైకొంగు పయంట నాఁగను బర గుచుండు
ఆం భా ౨ ౧౫౫

ఉ గిం టెపు గబ్బిగుబ్బలజిగిన్ వెలిఁ జిమ్మ నొయ్యా, రిజల్లుప, య్యంటచెఱుం గొకింత దనయంగముపై నటు సోఁకినంతటన్ .
విజ వి ౨. ౧3౪

ఉ ఇంటికిఁ దోడితెచ్చి మణిహేమ మయోజ్జ్వల పీఠి నుంచి ప, య్యంట చలింపఁగా నురటి వల్లన వీచుచు
కళాం. ౪. ౬. దశా. 3. ౭౫.

పయ్యెద = పయ్యొద. (√పయి)

చ. ... ప, య్యెద దడియంగఁ గానఁబడె యం
చిత నిర్మల రత్నభూషలం, దదుచిత దృశ్య
మాన మణిధామ సముజ్జ్వలభాతి దోఁపఁ
గన్ .. భా. రా. యు. ౨౩౪౬.

గీ. అర్థి కొలనూళ్లు మెఱయఁ బయ్యెదలుజార.
భాగ. ౧౦ స్క ౭౦౩

చ వదలిన కట్టుఁగొంగు సవరించి మిటారపుఁ
జన్నుదోయిఁ బ, య్యెద ఘటియించి ముత్తి
యపు టంచులకమ్మలు చెక్కఁబెట్టి ...
దశ. ౩ ౭౯

పయ్యెర = పయర, పయిర, పయ్యొర, పైర.
వి (త పైరు.) ౧. గాలి, మారుతము

సీ. కూళ తోర్వేలుపు కూటువగాటంపు టడ
వుల మేటిపయ్యెర యనుంగ .
అచ్చ రా బాల. ౬౩

౨. దక్షిణపు గాలి

రగడ గురువెంద నద గిలుబుకొనిరొఁ బయ్యెర
దొంగ, విరులఁ గరికుంభకుచ వెఱఁజా మై
యరగ్రుంగ .. మనుచ. ౩. ౭౪ (శ ర)

౩ దక్షిణపు గాలిచే పండెడు శాయధాన్యము.

పయ్యెరదూది = (గాలిలో దూదివంటిది) అతి
శీఘ్రముగాఁ బోవునది

ఉ. కావుడు దామలోచనకు శారదుఁ డిట్లనుఁ
గయ్య మన్న సం, భావన గన్నచందమునఁ
బాఱుదుఁ బయ్యెరదూది పై
ఉ హరి. ౫ ౧౭౧.

జ: పయ్యెర కుఱ్ఱఁడు, పయ్యెరమేపరి, పయ్యెర
యనుంగు.

పయ్యెర కుఱ్ఱఁడు. వి. (పయ్యెర + కుఱ్ఱఁడు)
పవనాత్మజుఁడు.

౧. హనుమంతుఁడు.

క రమ్మా పయ్యెరకుఱ్ఱఁడ, పొమ్మా వెనఁ
దూముపేరఁ బోలు పగుమలకున్ ..
అచ్చ రా. యు. ౪౦౫

౨ భీముఁడు

పయ్యెరమేపరి. వి (పయ్యెర + మేపు + అరి[3])
పవనాశనము, సర్పము, పాము.

సీ పయ్యెరమేపరి నెయ్యంపు బోనంపు తెలి
మెకం బెకిరింత గలుగుసామి
ప్రబంధ. ౧౫౩

పయ్యెర యనుంగు. వి (పయ్యెర + అనుంగు)
వాయు సఖుఁడు అగ్ని

సీ కూళతోర్వేలుపు కూటువ గాటంపు టడవుల
మేటి పయ్యెరయనుంగ .
అచ్చ రా. బాల. ౬౩.

పయ్యొద = పయ్యెద. వి (√పయి) పైట.

సీ. ఎదమీని నెత్తావి నుడియంగఁ బయ్యొద
సగము దూలించి పైముగుడఁ దిగిచి
భార. విరా. ౨. ౬౪ సాం ని మాన. ౧౯

సీ ఎదలపైఁ బాదలు పయ్యొదలు జాఱఁగఁ
బాఱు బిబ్బీలకు మునుంగు లబ్బఁజేసి
వను ౧. ౪౬

సీ ఈ వెలందు కలపయ్యొద లభినూతి భూమిా
తలాధీశుల తేటనముత . .
హరిశ్చ. ౨ ౧౩౨.

సీ. ఎదసీన జిలుఁగు పయ్యొదతోడ ముడివిడికొల
జీరాడు పెన్నెఱులతోడ .
అచ్చ. రా. సుం. ౧౬

పయ్యొర = పయ్యెర. వి ౧ గాలి, మారుతము.

వ ... పయ్యొర విసర . కాశీ. ౩. ౨౩.

౨. మందమారుతము.

గీ. ఎనఁగుఁ దెమ్మెర యనఁగఁ బరొయ్యెరయనంగ,
మందమారుత సంజ్ఞలు మాతృభూత ...
ఆం. భా. ౧. ౫౯

పర = పొర. వి. ౧ కంటిపొర.

సీ. పరపొరయనఁగను బటలంబు విలసిల్లు . .
ఆం. భా. ౨ ౧౮౮

చ. ... కనుంగవ కెంతరేనియుం, బరలంద
యించె దంతముల బల్మి వకావళ లయ్యె.
శేష. ౧ ఆ (శ ర)

ద్వి కెరిజాల్గా గన్నుల నిజదీప్తివంత, పరగప్పి
నట్లుండె ఘాలలోచనము ...
బస. పు 3 ౫౪. పా. ౬. పం

౨ అరఁటి లోనగువాని పొర (చూ పర
శత్తు)

పరశత్తు = పొరశత్తు (చూ ఎత్తు)

సీ. అలరు శేఁజిగురుఁ గొమ్మల నండఁగొని
యుండెఁ బగవెత్తె నరఁటికంబముల చాలు
భాను ౮. ౧౭.

పర. సం వి ఆ. స్త్రీ.

వాగ్భేదము (వాక్కు, "పర, పశ్యంతి,
మధ్యమ, వైఖరి" అని చతుర్విధము.)

పరంగి (గీ). వి (శ పరంగి త. పరంగి =
మాలికా విశేషము) ౧. దేశ విశేషము

ఉ. సానమెఱుంగు రంగులఁ జొనంగు పిరంగి
పరంగి కోడెము ... రా వి. ౨ ౮౬.

సీ. మెలి పెట్టి చుట్టిన తెలిపరంగిము డాను .
శుక. ౨. ౮౨౬.

చ. చలువ లానంగి కేదుక బొనంగి మెఱుంగు
పరంగిపీఁట న, స్నెలఁతలు రాచకేమగని
విల్పు ... కువల ౫. ౯౧.

౨. శ్వేత మనుజుఁడు.

94

గీ అందలి విచిత్ర వేషభాషాభిరామను, లగు
పరంగులతోడి నెయ్యమునఁ జిక్కి ...
శుక. ౧. ౧౦౪.

చ .. కంతుఁ డజేటి పరంగి భామను, బ్బల
కొడు దుర్గము ల్పగిలిపొర గుభుల్లున జేసి
యార్చినన్
హంస. ౧ ౨౩౦ ప్రబంధ ౮ ౬.

3 మాలికా విశేషము (శ ర)

పరంగి(గీ)లాగి. వి కెంపు జాతిదినును

చ కలపమలందుచో నొలుకు కస్తురి చిందుల
చేత ఘు మ్మనన్, వలపు మెఱుంగు బంగరు
తివాసిపయిం దగు నొక్కరంగుకే, బ్బలవు
పరంగిలాగి జిగిచొక్కపు గద్దెగమీఁద నిద్ద
ఱుం, దలగడఁ జేతు లూఁది చిఱునవ్వులతో
వసియించి యున్నెదన్. కువల. ౮ ౧౪౨.

వ .. దుష్టశిష్ట జనశిక్షణ రక్షణంబులు సెఱ
పుటకు విన్నపంబునకు దగ్గఱ రౌద్రకరుణా
గసంబుల తెఱంగు పరంగిలాగి కెంపుల
పోఁగుల బెడంగుఁ జూప ...
చంద్రా ౫. ౧౨౮.

వ ... మెఱుంగుపరంగీ లాగికెంపు రాపరంగి
పీఁట నధివసించియున్న సమయంబున ...
చంద్రా 3 ౫౨. చంద్రా ౨ 3౬.

పరంజే. వి ఇల్లు కట్టునపుడు పనివారలకొఱకు
కొయ్యలతోఁ గట్టిన కట్టడము, సారువ (శ. ర)
(వ్యవ.) ఆ గోడ కట్టుటకు పరంజ కట్టినారు.

పరంజము. సం వి. అ పుం ౧. గానుఁగ.
౨ ఛురికా ఫలము, చురకత్తి యలుఁగు.
3 సురుఁగు.

పరంజయుఁడు. సం విశే. (అ. ఆ. అ.) శత్రు
వులను జయించువాఁడు.
వి అ పుం. - పశ్చిమదిక్కును జయించిన
వాఁడు - వరుణుఁడు.

**పరంజ్యోతి.** సం వి. ప్ న. అద్వితీయజ్యోతి, సర్వోత్కృష్ట మగు తేజస్సు; పరబ్రహ్మము.

గీ ఆ పరంజ్యోతి పేర్లు లర్యముఁడు వరుణుఁ, డనిలుఁ డగ్నిసోముఁడు విష్ణుఁ డజుఁడు శివుఁ డ, నంగఁ బొగు శబ్దములు సన్మతులు దానిఁ, బ్రియతు లయి భజియింతురు నియతులార.

భార. అశ్వ. ౨ ౧౫౬. (చూ పరము అవ్య.)

**పరంటె = పంటె.** వి నూలు మట్టెడి సాధన విశేషము.

గీ ... తంతువేష్టనసాధనంబు, పరగును బొంటె యనఁగను బంటె యనఁగఁ, బంట్రకోల యనంగ ఆం భా ౨ ౨౯౫.

సీ కుంచె మగ్గపుగుంతి గూటంబు పగ్గంబు పరఁటె ద్రొక్కుడుపట్టె పలకగోనె ...
హంస ౨ ౧౧.

**పరంతపుఁడు.** సం విణ (అ ఆ అ) శత్రువు లను దపింపఁజేయువాఁడు (శూరుఁడు మొ)

**పరంధామము.** సం వి న్ న ౧ అద్వితీయ తేజస్సు, పరబ్రహ్మము ౨ అద్వితీయస్థానము (వైకుంఠము మొ)

**పరంధాముఁడు.** సం వి న్. పుం. అద్వితీయ తేజస్సు కలవాఁడు - పరమాత్ముఁడు

**పరంపదము.** సం వి అ న ౧ కైవల్యము, మోక్షము ౨ వైకుంఠము

**పరంపర.** సం. వి. అ స్త్రీ ౧ ఎడతెగనివరుస ౨ వరుస, పంక్తి ౩ వంశము ౪ వధము హింస.

**పరంపరము.** సం. వి. అ. పుం మృగభేదము

**పరంపరాకము.** సం. వి. అ. న. యజ్ఞముకొఱకు చేయు పశుహింస.

**పరంపరీణము.** సం విణ (అ. ఆ. అ) ౧ పరంపరచేఁ గలిగినది, ఎడతెగని వరుసగా వచ్చినది. ౨. సంప్రదాయసిద్ధ మైనది.

**పరంపరుఁడు.** సం వి అ పుం ప్రపౌత్ర సుతుఁడు, మునిమనుమని కొడుకు.

**పరఁట.** వి ఏటుఁబిడక, కరీషము

సీ పెలయుఁ గరీష మేర్పడక పరంట నా ...
ఆం భా ౨ ౨౫౯

**పరఁటి = పసఁటి, పంటి** వి (క పరటె, మహా పరడేం) ౧ కుండ

ఉ పాలుల పేరు చెప్పకొని బానఁడు పప్పనుఁ బాయసంబు నై, దాలుపరంట్ల వంటకము నాజ్యముఁ గమ్మనికూరగాయలుఁ, జాలు దించు ... భోజరా. ౬ ౧౩౩.

చ. పరఁటుల పేరి పెన్నడియపట్టుల నీరము లుంచి యచ్చటిం, దరుణుల పేరిదీమణులు దార్చి
చంద్ర ౧ ౧౬౨

౨ తూము

క పరఁటెడురిసంబు గలుగం, గరయంత్రం బాద పెన్నిఘటలు వలయు న, న్నిరసాల కాండకంబుల్, సిరియాలుని తండ్రి యొత్తె తేకున్నయెడల ... హర ౨. ౧౦.

పరఁటిపుట్టువు = కుంభసంభవుఁడు.

సీ ఎటుఁగఁడు మత్తిల్లి పరఁటిపుట్టువు గ్రుక్క గొనినయప్పుడు గలకులపాటు .
యయా ౧ ౯౫.

**పరక¹ = పొరక** వి (క పరకె) ౧. రెండు వీసములు.

సీ. ... పణషోడశాంశంబు పరఁగు వీస, మనఁగఁ దద్ద్వితయంబు దనరుఁ బరక యనఁ.
ఆం. భా. ౨ ౨౬౨.

౨. ఎనిమిదవవంతు, కొంత్తములో ఎనిమిదవ పాలు

సీ. ... కైక కన్నఁ, బ్రాయంబుచేఁ బెద్దపత్ని సుదాసింపఁ బాడి గా దంచును బరకపాలు, మాత్రం బోసంగి సుమిత్రకు .. దశా ౮ ౧౦౩.

3. (= పారక) శ. ర - (వ్యవ) దూడకు గుప్పెఁడు గడ్డిపరకలు వేయుము

విశ. విలువ తక్కువ దైనది

గీ. పరక తలగుడ్డ రొంతపాటిపచ్చడంబు, ముదుక నీర్కావిదోవతి ... హంస ౪ ౨౬

పా పరక లెత్తుకొనుమన్న పాతిక లెత్తుకొనుట, చెప్పినదానికంటె నధికముగఁ జేయుట

గీ మంచి తగిన గృహస్థుఁడ పెంచఁ బోకి, లెత్తుకొమ్మన్నఁ బాతిక లెత్తుకొంటి, వనిఁ జగురుండు పణఁకంగ నప్పళించి, జడియకు మటంచుఁ గౌఁగిటఁ జక్కఁజేర్చి ... హంస 3 ౧౫౭

పరక². వి. మత్స్యవిశేషము

ఉ. ... చిత్తడికాను మల్గువిూ, నల్లియు గండె రొయ్య పం కాదిగఁ జేపలఁ బట్టు బెట్టుగన్. ప్రబంధ ౧౯౫

పరకతము. వి. వస్త్రభేదము

సీ. శిల్లలు పీదంచువలిపాలు ఖరులను పట్టు జబ్బులు మంచి పరకతాలు ... ధనాభి. 3 3౭

పరకాళి. వి (పరకాళా. అని శర బ్రా.)

౧. దేశవిశేషము. (శా.)

౨. ఒక విధమైన బట్ట, పరకాళిదేశపుబట్ట.

సీ. పరకాళియంగీలు పట్టుపచ్చడములు ... రఘు. ౯. పా. ౨౫. ౪౦.

వ ... తొడగినట్టి పరిగకంబుల కూరుపుపని కప్పురు పరకాళి రొంటిపొర బిగువు బిడుద కాసెల ... ప్రబంధ. ౩౭.

పరకీయ. సం వి ఆ. స్త్రీ) అన్యుని భార్య; (అలం.) స్వీయ, పరకీయ సామాన్య అను నాయి కలలో నొకతె.

(పరోఢ, కన్యక అని పరకీయ రెండువిధ ములు.)

పరకీయము. సం. విశ (అ. ఆ అ.) పరునిది, ఇతరునిది.

పరకులము. సం. వి అ పుం. ఉద్రము, నీటి పిల్లి. (వై వి.)

పరగడుపు = పఱగడుపు. వి. (పరము² + కడుపు - అని శ ర)

(వ్యవ.) ఆ మందు పరగడుపున పుచ్చుకొన వలెను

పరగి. సం వి. ఇ. పుం నదియందు పుట్టెడు పెద్ద శరీరము గల ఒక జాతిచేఁప.

శ్లో. పరగిశ్చ మహాకాయాః శల్కజానరిదు ద్భవాః కేశవ కృతకల్పద్రుమకోశము ... 3౫౫ పా ౧౦౪. శ్లో

పరగించే. స క్రి (√పరగు) ౧ బాణాదులు ప్రయోగించు

ఉ ... రాచము లేదుకే లాక పరంపర గాఁ బరగించి ఉ హరి. ౪. ౨౪౪

శా భల్లంబుల్ పరగించి యుగ్రముగ భూపా లోత్తమాంగంబులన్, ద్రొల్లంజేయుచు ... భార. శాం. ౧. 3౧

సీ. ... కలితఘోర, భల్లపరంపరల్ పరగించి ధనురాదిసాధన ప్రకరంబు చక్కఁజేసి ... భా రా. యు. ౪౨.

౨. కలుగఁజేయు.

క. అరుణ సుధాకరరుచిభా, స్వరసంగతిఁ గను
కతనకా వనితామధురా, ధర మెటుఁ గనుఁ
గొనవియ్యక, పరగించున్ మోహాతమము
బహుళమూర్తి చంద్రా. ౪ ౧౭౧

క సిరులఁ బరగించి బత్తుల, నిరవగుకనికరము
తోడ సేలుచు సెప్పుడున్ ...
అచ్చ రా సం ౧

౩ ప్రసరింపఁజేయు ; వ్యాపింపఁజేయు

క. నరు లారులు దృశ్యములపైఁ, బరగింపఁగఁ
జూడ్కు లిట్లు వడుఁ దప్పక యు, వ్వరు
సున నరుఁ డేయుచిశిత, శరములు లక్ష్య
ములు దప్పి చన వించుకయున్ ...
భార విరా ౫ ౪౩

సీ పద్మపరాగంబుఁ బరగించు నరుణోదయంబు
కాంతిఁ జెలువంబు మిగుల . .
భార ఉద్యో ౨. ౧౧౨.

(ఎగురఁజేయు అని భావము )

ఆ తీవ్రబాణజాలదీప్తులు పరగించి, పాండు
తనయసైన్య బహుళతమము, లీలఁ బది
దినంబు లోలిమై విరియించి, యధిప భీష్మ
భానుఁ డస్తమించె ...
భార. భీష్మ. ౧. ౪౭.

(కరాలప్రతి.) పా విక్ర ౨ ౧

పరగికొను = పరగు. అ క్రి (పరగు + కొను[1])
అతిశయించు, అధికమగు

క. ఇవ్విధమున నీధర్మము, నెవ్వలఁ బొద లేక
పోవ నే మనిచెప్పం, బ్రువ్వులఁ దామలు
మెండలుగఁ, గ్రొవ్వెసఁగఁగ నెండఁ బరగి
కొని కాతించున్ . హరి. ఉ. ౯. ౫౨.

పరగు. అ క్రి (దీనిని చి. వి. శ. ర లు పాను
ప్వారముగా గ్రహించిరి. కాని నిర్ధారకప్రయో
గములు లేవు. (ఇంకను విచార్యము )

౧ పడు, ప్రసరించు, (ప్రయుక్తముగు. శ. ర.)

వ ... అక్కోటిమగలమార్గణమ్ము లమ్మనుజ
పతిపైఁ బరగుటయు ..
భార కర్ణ. ౨. ౩౪౭

౨. ప్రవర్తిల్లు, ఉండు

క ఎక్కడ నడచును సత్యం, బెక్కడ ధర్మంబు
పరగు ... భార. ఉద్యో. ౨. ౩౧౭

గీ తెలిసియుండుదు నిమ్నహితలమునందుఁ,
బరగు మృగపక్షిజాతుల భావశిల్ల ...
మనుచ. ౬ ౧౭

౩. ఒప్పు

సీ. చెలువెఁ దనరెఁ దగెఁ జెలఁగెఁ జెలంగెను
బరగెను ... వనంగ నొప్పె నన్మాటగాఁ
జెప్పఁబడును .. ఆం భా. ౩ ౧౩.

సీ. జిష్ణు వైభవరేఖఁ జెలువొందుటయుఁగాక
పావక విస్ఫూర్తిఁ బరగు టెట్లు ...
కాశి ౧. ౫౪

గీ. ధీరశాసముద్భటు లైన వీరభటులు, పరగు
మండుదు రప్పుర వరమునందు ...
విక్ర. ౧. ౭౭

౪. ప్రసిద్ధమగు. భార. ఆది. ౪. ౧౦౯.

క. ... లోకో, త్తరుఁడు జరత్కారుఁడు నాఁ,
బరగినముని . . భార. ఆది. ౨. ౧౩౯.

లయవిభాతి ... శరగురుఁడుఁ గర్ణుఁడును గురు
సుతుఁడు మద్రేశ, శ్వరుఁడుఁ గృపుఁడుం
బరవఁ బరగి దివిజాల్ వొగడ ధరఁ బడి
ముకుంద మననరతనయుఁ డొప్పెన్.
భార. స్త్రీ. ౨. ౭౨.

క. ఉత్తమ మగువంశంబున, నుత్తమ కాలమున
నీతఁ డుత్తమతనుఁ డై, యుత్తమ నృపతిఁ
బుట్టుట, నుత్తముఁ డను పేరఁ బరగు సుర్వి
నని మునుల్. మార్కం. ౫. ౨౭౦

౫. ప్రసరించు, వ్యాపించు.

సీ. దివ్యకిరీటంబు దీప్తులం ధూన ఖోంతరమెల్లఁ
గలయంగఁ బరగుచుండ ...
భార ఉద్యో ౪. ౧౨౫

సీ. పదతలంబుల కెంపు పరగినతలము కుంకుమ
లిప్తమైనచందము వహింప .
భార విరా ౧. ౩౦౭

క. తిరిగితిమి గాలికైనం, జొరఁ గూడనిచోటు
లెల్ల నూర్కి మరిచుల్, పరగని మెలవులం
చూచుట, యుషదే యనిరుద్ధుఁ జాడ వల
వవ దయ్యెన్ ఉ హరి. ౫ ౩౦౩

౭. ప్రవహించు

మ. రథ్యనూతిరథిక శ్రేణీవపుఃఖండముల్,
తొరఁగఁగా దుత్తము రయ్యెఁ గాల్బలము
లస్రోక ప్రవాహంబులై, పరగెఁ రక్తి
నదుల్ పిశాచకుల మంథః శేఖిలోలంబు
గన్ ... భార ద్రో ౧ ౧౯౫

౮. అతిశయించు, అధికమగు

క. నకపతి ధర్మాపేక్షా, పరఁ దగఁ గలి
యుగమునందుఁ బాయును ధర్మ, స్ఫురణ
మధర్మం బెందును, బరగును వర్ణాశ్రమముల
పథములు దప్పన్ ...
భార శాం. ౨ ౨౯౨. రాఘవ. ౨ ౩౪.

చ. పరగినవాఁడు ఱేఁడు ధరఁ జంద్రుఁడు
రాజులయం దశంగుఁడై ...
ఉ. హరి ౨. ౭౮

౯ కోరు, ఉత్సహించు

గీ. పట్టెఁ గాఁగిటఁ జేర్పంగఁ బరగుకొని, కతర
మెవ్వియు సోఁకంగ జేవ మయ్యె ...
కవిక. ౧ ౩౭.

క. ధరణీశ్వర యాలస్యము, బరపం బని లేదు
పుణ్యాచయ మెంచరింపఁగా, బరగినచో ధర్మ
స్వ, త్వరితాగతి యనుడిమాట తథ్యము
గాదే యక్షాం. ౫. ౧౩౮.

౯ ఇది కొన్నిపట్ల వాక్యాలంకారముగా నుప
యుక్తమగును

ఆ. పరగనన్ను సాల్వపతి వరియించిన, దండ్రి
చేతఁ బూర్వదత్తనైతి
భార. ఆం ౪ ౨౧౨.

గీ. . బహు విచారములతోఁ బరగఁ బొర్చ్చి,
భూతబేతాళ గణములు భూపవర్య
భార. స్త్రీ. ౧. ౧౩. భాగ. ౧ ౧౭౦.

౧౦. విహరించు. (శ. ర.)

వ. . ఏము నిన్నఁ గన్యాకాంతః పురంబున
నొక్క సరోవరంబునం బరగుతఱి సామ్రా
జ్య లక్ష్మీ సాక్షాత్కారాను కారిణియైన
యొక్క కన్యకామణి తన చెలికత్తియ
తోడన్ . ప్రభా ౧ ౧౨౧.

జ. పరిగించు, పరగికొను, పరపారు, పరివు,
పరపుకరము.

పరగ్రంథి. సం. వి ఇ పుం అంగులిపర్వము,
ప్రేలికణుపు. (వాచ)

పరచి. వి. యాచితకము, కొన్నిదినములు వాడు
కొని మరల నిచ్చుటకై తెచ్చుకొనిన వస్తువు
సొం, ఎరవు

గీ. పరచి యన యాచితక మొప్పు ...
ఆం. భా ౨ ౨౭

పరచ్ఛందము. సం విశే. (అ ఆ అ) పరా
ధీనము. వి. అ. పుం పరునియిచ్ఛ, పరుని యభి
ప్రాయము.

పరచ్ఛిద్రము. సం. వి. అ. న పరుని లోపము;
పరునిదోషము

పరజే. వి. పక్షివిశేషము

గీ. పసుపుముద్దయుఁ బాలయుఁ బచ్చకొక్క,
పసిఁడితెంకెయుఁ బరజయు ...
రసిక. ౧. ౧౧౫.

సీ ... పాలలు పరజలు పావురాలు .
రసిక. ౧. ౭౩

**పరజనుఁడు.** సం. వి అ పుం అన్యుఁడు, లాఁతి వాఁడు (వ్యతి స్వజనుఁడు)

**పరజా.** వి ఒకానొక జాతివాఁడు.

సీ. పరజాలపా ల్పిష్టు కరణాలసొమ్ము ఘూర్జ
రుల విత్తంబు తస్కరులపాలు
రామ. ౪. ౨౩

**పరజాతుఁడు.** సం విశే. (అ ఆ. అ) పరునికిఁ బుట్టువాఁడు వి అ పుం - పరులచేఁ బెంపఁబడి వారిపుత్రుఁడుగా భావింపఁబడినవాడు - భృత్యుఁడు

**పరజితము.** సం. వి అ. పుం. పరభృతము, కోయిల.

**పరజితుఁడు.** సం. విశే (అ ఆ. అ.) పరునిచేత జయింపఁబడినవాఁడు

**పరతంత్రుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) పరునకు లోనయినవాఁడు, పరాధీనుఁడు

పరతెంచు - తె సం. 7 ౪౯

**పరత్ర.** సం. అవ్య. (పరమందు.) ౧ పరలోకమందు. ౨. ఉత్తరకాలమందు.

(దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము కనఁబడదు.)

**పరదా.** వి. (హిం. పరదా త. పడుదా.) ప్రావరణము, దుప్పటము. (తెర. అని శ. ర.)

సీ. .... ప్రావరణ మూఁ బరదా యనంగను
కాదు నాఁగ ఆం. భా. ౨. ౧౫౯.

**పరదారి.** సం. వి. న. పుం. పరదార కలవాఁడు, పరునిభార్యను బొందువాఁడు.

**పరదేవత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పరమేశ్వరుఁడు. ౨. పరమేశ్వరి.

**పరదేశము.** సం. వి అ. పుం. అన్యదేశము, స్వదేశము కాని దేశము.

**పరదేశి.** సం. వి. న. పుం విదేశపువాఁడు, అన్యదేశమువాఁడు.

**పరధేసి.** విశే. (సం. పరదేశి) వైదేశికుఁడు.

వ. . దాశరథి శ్రీభీమేశ్వర మహాదేవర
పడుమటిసత్రము పరదేశి తపస్వులకు గుద్ద
వాదిలోపలి ... ద. శా. ౪. ౧౧౦౪

సీ. ఒకదేశ మని గుఱి యున్నదే మాకును సకల
దేశంబులు సంచరింపఁ, బరదేసులము విద్య
బలిమికల్మిని జాల నరు దైనబిరుదు భయంబు
లేక ... బ ప్రభు. ౧. ౯౩

**పరద్రోహి.** సం. విశే. (క. జీ. న.) పరులకు హాని చేయఁదలఁచువాఁడు

**పరద్వేషి.** సం. విశే (న. జీ న) పరులను ద్వేషించువాఁడు.

**పరధర్మము.** సం. వి. అ. పుం. ౧. ఉత్కృష్టధర్మము. ౨. పరునియొక్క ధర్మము.

(వ్యతి. స్వధర్మము.)

**పరధ్యానము.** సం. వి. అ. న. ౧. మఱియొకదానియందు మనస్సు ఉంచుట, మఱియొకదాని నాలోచించుట. ౨. పరమాత్మధ్యానము.

**పరపక్షము.** సం. వి. అ. పుం. శత్రుపక్షము

**పరపతి**=**పరపత్తెము.** వి. (సం. పరభృతిః.) ౧. ఇతరునియొద్ద చేబదులుగా ద్రవ్యము పుచ్చుకొనుట. (శ. ర)

(వ్యవ.) వానికి ఎక్కడను పరపతి పుట్టదు.

౨. అప్పియ్యవచ్చు ననెడి విశ్వాసము, నమ్మకము.

(వ్యవ.) పరపతి పోయినంబిదప బ్రదుకుట కష్టము.

క. అప్పులు పుట్టక పరపతి, దప్పి చరింపంగ వారతగళోత్తములు మఱి, నప్పిచ్చినవారలు మా, యప్పులు పెట్టుమని చాల నలజడి పెట్టన్ రుక్మాం. ౪. ౧౦౦.

పరప త్తెము = పరపతి. వి. ఇతరులయొద్ద చేబదులుగా ద్రవ్యము పుచ్చుకొనుట. (శ గ.)

(వ్యవ) వానికి ఎక్కడను పరపత్తెము పుట్టలేదు

పేను పరపత్తెము చేసి ఆ వ్యాపారము చేసితిని

పరపదము. సం వి అ న ౧ ఉత్కృష్టమైన పదవి ౨. పరమపదము, మోక్షస్థానము, ౩ తిరువాతిపదము

(వ్యతి పూర్వపదము)

పరపర. వి ఖండించుట కోయుట మున్నగు వానియం దగుధ్వని కనుకరణము

మా పరపరచేయు, పరపరయగు

జ. పరపరచేయు, పరపరయగు

పరపరచేయు. స క్రి (√పరపర) ఖండితము చేయు; ఉల్లంఘించు, అతిక్రమించు.

ద్వి ధర బ్రాహ్మణోనవాంతవ్య యనంగ, బరగువాకేదో క్తి బరపరచేసి ...

బస పు. ౩. ౧౦౯ పం.

పరపరయగు. అ క్రి. (√పరపర) ఖండితమగు; పోవు, నశించు; తగ్గు

ద్వి. ఈ పాదపద్మంబు వీక్షించుమాత్ర, పాపంబు లన్నియుఁ బరపరగావె ...

పండితా. పురా. ౫౧. పా.

ద్వి భక్తులసద్గోష్ఠిఁ బాసి యుండినను, భక్తి యు భయమును బరపరగాదె ...

బస. పు. ౪౩౩౭. పం

ద్వి పరమూర్తి మాహాత్మ్యము తిలంచినను, పర సమయములెల్ల పరపరగాదె

పండితా వాద ౧౬౩ పా

ద్వి పరగుశాస్త్రాల పరపరగాక మున్ను ..

పండితా పురా ౨౨ పా

పరపరాయణము. సం వి అ న పరంపర + అయనము. (మిక్కిలి గొప్పది యగు స్థానము) అత్యుత్తమ మయిన ఆశ్రయము

సీ పరమతేజంబును బరగుపదంబును బర మైన బ్రహ్మంబుఁ బర పరాయ, ణమును దవిత్రం బులు నాదగువానికి నెల్ల పవిత్రంబు ...

భార. అను ౫ ౩౭౬

పరపాకనివృత్తుఁడు. ఎ వి అ. పుం ౧. (పరులకొరకు అతిథి దేవతాదులకొఱకు) వండుట మానినవాఁడు.) ప-చయజ్ఞములను జేయనివాఁడు ౨ ఇతరులు వండినదానిని తినుట మానినవాఁడు, స్వయంపాక నియమము గలవాఁడు

పరపాకరతుఁడు. సం వి అ పు పంచయజ్ఞ చేయుచు పరాన్నమందు రుచిగలవాఁడు (వీఁడు నింద్యుఁడు)

పరపాడు. అ క్రి (పరపు + ఆడు.) ఒప్పు, ఏపగు.

క స్వరజలు శర్కజ వితతే, తరువర్గజ లనఁగ నొతరజ లనంగాఁ, బరిపారువళ్లు నాలుగు వరుసఁ దెచుఁగునకు వాని వలయుం దెలియన్.

కావ్యా. ౪. ౩౦.

పరపు = పఱచే. స క్రి (√పరగు) ౧. బాణాదులు ప్రయోగించు.

క. మారుల, బరిమార్చి సారథిఁ బొరిగొని శిత
నము నఱకి భూరి శరంబుల్, పరపి పరిపంథి
దేహం, బర(వేశఁడు తెఱపి లేనియట్లుగ
చేసెన్ హరి. ఉ. ౧౦ ౨౪

మ. ఉర పేసమ్ముల సేసి లక్ష్మణుఁడు పై
నొంకొండ సారావముల్, పరపన్
భా రా యు. ౯౩౮

క ఈ శరజాతములకు సెన, యే శరజాతములు
గాన మిని బవరములో, నాశరజాతము పర
పెడు, నా శరజాతముల నడఁచు నభినవ
మహిమన్ పను ౫ ౯౯

౨ (ప్రవహింపఁజేయు

చ దేవతగంగితేఁ దెచ్చి యుర్విపైఁ, బెరపి నిజ
(ప్రసూత యను (ప్రస్తుతి నొందఁగఁ జేసె
శల్లెదన్ .. హరి పూ. ౨ ౪౨

వి ౧ పాతము, పడుట

చ పెనంగ నబ్బలంబు లతని బాణపరం
పరల బలితంపుఁ బరపునం జేసి
భార (ద్రో ౧ ౨౬౬

౨ (బండి. పెం) మీఁది కప్పు

సీ. ఎడలించి మీఁదట పెసఁగొడుపగ పెల్లఁ
బడఁ(ద్రోచి యడఁతునో ...
హరి. పూ. ౫ ౧౪౨.

సీ. పందిటిపరపు చాపలపాదల్ విగళితహార
ముక్తాళంశ వంటియుంటి ..
రా. వి. ౩. ౧౩.

౩. విశాలత, వైశాల్యము

చ. . పదివేల యోజనంబుల పరపున నున్న
యున్నతంబు పట్టణంబు దశా ౫ ౧౧౫.

౪ పెడలంపు

ద్వి. ఘన పైనసేతువు గట్టి సీనలుఁడు, అని
శతయోజనం బైపట్టి నిడుపు, పదియోజనం
బుల పరపున గలిగి ...
రం. రా. యు. ౩౧౬. పా. ౧౪. పం.

(మా : దశయోజన విస్తీర్ణం శతయోజన మాయ
తమ్ సం గావా. యు ౨౨ ౪౬.)

సీ. పరపు లోఁతును గల పరిఖతోఁ బొడవును
ఘనమును నగుకోట గలిగి ...
భార శాం ౨ ౩౭౩

౫ పొడవు

సీ ముప్పదియోజనంబుల పెడలుపును పేఁబది
యోజనంబుల పరపు గలిగి, శాశ్వనము
మించు వరాహ. ౧౦ ౨౭.

౬ శయ్య

క. పగమేకుఁడు దనయూరులు, పగపుగ నొన
రించి వానిపైఁ దచ్చిరముల్, పనుపలిగ శత
సుదర్శన, ఖగధారానివారిఁజేసి (గక్కునఁ
దునిమెఁ గా. అర. ౪. ౪౦౦.

పగడపుఁగోళ్ల పట్టెమంచములు పఱపు గల
కుంకుమ పూఁబరపులు. దశా ౧ ౧౪.

సీ. విరిశయ్యనా నంచగిరుల తెమ్మెర(గోలు పగ
పైన చిల్వరాపగపు పైని. దశా. ౪. ౧౦౩.

౧ విధము, రీతి.

క. అరదములు నవరణతోఁ బగ పై దొంకొ్క
క్క యూరిపగపున నరిగెఁ .
భాగ భీష్మ. ౧. ౯౪.

(విశే.) ౧, విరివిగలది, విశాలమైనది.

ద్వి చెన్నారు, నురుగులతోఁ (బాఁకి
చుట్టురాఁ (బబలి పగ పైన గురివెంద పందిటి
(క్రింద ... ద్వి. హరిశ్చ. పూ. ౪౪౬.

సీ. ... పర పైనచిల్వరాపరపుపైని
దశా. ౪. ౧౦౩. భాగ భీష్మ. ౧. ౨౪.

౨ అధికము, గొప్పది ; గాఢము.

సీ. ఖురపుటధ్వనులతోఁ బర పైన హేషితఘో
షముల్ భూధర గుహాలనిండ . .
భా. రా. యు. ౧౪౨౪.

మ పర పర్యోగం బరిభోగవాంఛ దడవంబాలఱ్యో నిద్రారతుల్ ... ఉ హరి ౫ ౧౦౦
క. గురుతరతిమిరము గవిసెం, బర పగు నడురేయి కోశం బరువడి తోడకా
భా రా. యు ౧౫.౫౮
3 బహుళసంఖ్యాకము; అసంఖ్యాకము
ఆ ఆత్మ: బొంగి ప్రొంక్కి యతం డాలమందలు, పగపు లైన రొయిడల కరిగి యరిగి
భార అను ౧. ౫౮
క మగతిర్యజ్మనుజస్థా, వరరూపము లగుచుఁ గర్మవాసన చేతం, బరి పైన మిశ్రయోనులఁ, దిరముగ జనియించి సంసృతిం గైకొని తాన్.
భాగ 3 ౯౦౫
ర చదువు, సమము, ఎచ్చుతిగ్గు లేనిగి
ఉ అత్తితి బాటసాగ్గి పగ పైన భువిం బసువారి కత్తిక . కుకి ౫ ౧౪
౧. పయనములు వోవు పశికుల పాదములకుఁ, బరపు గనిపింపఁ బఱవిపఱపు లగుచు
ఉ గా ౬ ౫

పరపిండము. సం. వి అ ఒం ఒకరింటికూడు, ఇతరులు పెట్టు అన్నము

పరపిండరతుఁడు. సం విణ (అ ఆ అ.) పరాన్నభోజి, ఒకరింటికూడు తినువాఁడు

పరపిండాదుఁడు. సం విణ (అ ఈ అ) పరాన్నభోజి, ఒకరింటికూడు కుడుచువాఁడు - వి అ పుం. భృత్యుఁడు.

పరపుకరము. వి (పరపు + కరము) నమస్కార విశేషము
గగడ రసికత వీక్షాగణ్యాకయావపు వరరాఘవు లకు పరపుకరం బని హంస. ౪ ౫౦3.

పరపురంజయుఁడు. సం. వి. అ. పుం. — శత్రు పట్టణములను జయించువాఁడు — శూరుఁడు, వీరుఁడు.

పరపురుషుఁడు. సం వి అ పుం ౧ లాంతివాఁడు, పెఱవాఁడు, అన్యుఁడు. ౨. పురుషోత్తముఁడు, విష్ణువు. 3. తనభర్తకంటె పరుఁడైన పురుషుఁడు

పరపుష్ట. సం వి ఆ. స్త్రీ. ౧. ఆఁడుకోయిల. ౨. వేశ్య 3 బదనిక ? (ఆ. ని.)

పరపుష్టమహోత్సవము. సం. వి. అ పుం — కోకిలకు మహోత్సవము గావించునది—మామిడిచెట్టు (వాచ)

పరపుష్టము. సం. విణ. (అ. ఆ అ.) అన్యముచే బోషింపఁబడినది—వి అ. పుం. కోయిల.

పరపూర్వ. సం వి ఆ స్త్రీ ౧. పరుఁడు - ఇపు డున్న భర్తకంటె నితరుఁడు - పూర్వభర్తగాఁ గలది ౨ అంకృష్టుఁడగు తినమగనిని విడిచి యుత్కృష్టుఁ డగు మఱియొకనిని బొందిన యాఁడుది.
శ్లో పతిం హి త్వాపకృష్టం స్వ ముత్కృష్టం యా నిషేవతే, నింద్యైవసా భవే ల్లోకే పరపూర్వే తి చోచ్యతే — (వాచ)

పరప్రపౌత్రుఁడు. సం వి. అ పుం వృద్ధ ప్రపౌత్రుఁడు, ప్రపౌత్రుని కొడుకు.

పరప్రతినప్త. సం వి బు పుం వృద్ధ ప్రపౌత్రుఁడు, ముమ్మనుమని కొడుకు

పరప్రేష్యుఁడు. సం వి అ. పుం దాసుఁడు, బానిసవాఁడు

పరబ్రహ్మము. సం. వి న న ౧ పరమాత్మ ౨ పరబ్రహ్మప్రతిపాదకమగు ఉపనిషద్వేదము

పరభాగము. సం వి. అ పుం ౧ అన్యుని యంశము, పరునిపాలు. ౨ పశ్చాద్భాగము వెనుకటిభాగము. 3 శేషభాగము. ౪ గుణోత్కర్షము ౫ సుసంపత్తి మంచిసంపద. ౬. అతిశయము, అధిక్యము.

**పరభాగిల్లు.** సం. అ క్రి. అతిశయిల్లు.

క ... ఈహూమహేశ్వరుల పురోభాగమునం బరిభాగి ల్లుచు నఖిలామరపరివృతుం డై పేరోలగం బుండి మహోనురాగంబున . కు సం. ౧౦ ౪౪౪.

**పరభావ.** సం. వి. ఆ. స్త్రీ అన్యభావ.

**పరభుక్తము.** సం. విశే. (అ ఆ అ.) అన్యునిచే ననుభవింపఁబడినది.

**పరభృత.** సం. వి ఆ స్త్రీ. ఆఁడుకోయిల

**పరభృతము.** సం విశే (అ ఆ. అ) మఱియొకి దానిచేఁ బెంపఁబడినది. వి. అ. పుం కోకిలము (కోకిల తన గ్రుడ్డును బొదుఁగ జాలక కాకి గ్రుడ్డును దొలఁగఁ బుచ్చి దాని చోటఁ దన గ్రుడ్డు నిడు ననియు కాకి దానిని దన గ్రుడ్డని పొదిగి పిల్లను జేయు ననియుఁ బ్రసిద్ధి )

**పరభృత్తు.** సం. విశే (త్) ఇతరులను పోషించు నది. వి. త్ పుం - కోయిలపిల్లను పోషించు నది - వాయసము, కాకి.

**పరమగతి.** సం. వి ఇ. స్త్రీ (ఉత్కృష్ట మైనగతి) ౧ మోక్షము ౨ ఉత్కృష్ట మయిన ప్రాపు, గొప్ప ఆశ్రయము.

**పరమతము.** సం. వి అ న ౧. పరుని మతము ౨. ఇతర మైన మతము

**పరమపదము.** సం వి అ న ౧ ఉత్తమ మైన పదవి, ఉత్తమస్థానము ౨ వైకుంఠము 3. మోక్షము.

**పరమపురుషుఁడు.** సం వి అ పుం. ౧ ఉత్తమ పురుషుఁడు. ౨, పరమాత్మ 3 పురుషోత్త ముఁడు, విష్ణువు.

శ్లో. పయఃపారావారం పరమపురు షోఽయం మృగయతే . . భోజచరిత్రము.

**పరమపూరుషుఁడు.** సం. = పరమపురుషుఁడు.

**పరమప్రఖ్యుఁడు.** సం. విశే. (అ. ఆ అ.) మిక్కిలి ప్రసిద్ధుఁడు.

**పరమబ్రహ్మము.** సం = పరబ్రహ్మము

**పరమము.** సం. విశే (అ ఆ అ) ౧ ఆద్యము ౨. ఉత్కృష్టము 3. ప్రధానము, ముఖ్యము ౪. అత్యంతము, మిక్కిలి యైనది

**పరమరసము.** సం. విశే (అ. ఆ అ ) ఎక్కువ రసము గలది - వి అ. పుం - పలుచని మజ్జిగ (శ ని.)

**పరమర్మజ్ఞుఁడు.** సం విశే (అ ఆ అ) పరుల మర్మములు తెలిసినవాఁడు

**పరమర్షి (ఋషి).** సం వి ఇ పుం గొప్ప ఋషి

**పరమహంసుఁడు.** సం వి అ పుం ౧ ఉత్తమ పదము నొందిన సన్న్యాసి (సన్న్యాసులు: — కుటీచకుఁడు, బహూదకుఁడు, హంసుఁడు, పరమ హంసుఁడు - అని నాలుగు తెగలవారు - అందు "పరమహంస త్రిదండం చ రజ్జుం గోవాల నిర్మితామ్, శిఖాం యజ్ఞోపవీతం చ నిత్యం కర్మ పరిత్యజేత్" అని పరమహంస లక్షణము.) ౨ పరమాత్ముఁడు (పక్షివాచకమగునపుడు 'పరమహంసము, పరమహంస' అని రూపములు )

**పరమాణువు.** సం వి. ఉ పుం సూక్ష్మముల కంటె సూక్ష్మమైన అణువు (కిటికీలలోఁ జొచ్చు సూర్యకిరణమందలి సూక్ష్మమగు రేణువునందలి అణువభాగము (ముప్పదియవ భాగము - అని కొందఱు )

**పరమాత్మ (ము).** సం. వి. న్. పుం. పర బ్రహ్మము.

**పరమాత్ముఁడు.** సం = పరమాత్మ.

పరమాణ (సౌ). వి. (హిం. ఫరమానా) అధికారి లంపు ఆజ్ఞా పత్రము; ఆజ్ఞ

గీ. ప్రాణనాయక యిడ చూడు పతులఁగూడి,
పాయకుఁ దటంచు సతులకుఁ బల్కు-లేలి,
పాదుషాహి శికా చేసి పంపుకాగి, తంపు
పరమాన కోశ సుధాకరుండు.

దశా ౩ ౪౫

పరమానందము. సం విణ (అ ఆ. అ) ఉత్కృష్ట మగు ఆనందము కలది - వి అ పుం ౧. ఉత్కృష్ట మగు ఆనందము. ౨. (ఉత్కృష్టమైన యానందమే స్వరూపముగాఁ గల) పరబ్రహ్మము.

పరమానందుఁడు. సం. వి. అ పుం పరమాత్ముఁడు, దేవుఁడు (ఉత్కృష్టానందమే స్వరూపముగాఁ గలవాఁడు అని కొందఱు, ఉత్కృష్టానందము కలవాఁడు అని కొందఱు)

పరమాన్నము. సం వి అ న ౧ శ్రేష్ఠమగు అన్నము ౨ పాలు పోసి వండిన యన్నము, పాయసము, క్షీరాన్నము.

పరమాపత్తు. సం. వి ద్ స్త్రీ. గొప్ప అపద.

పరమాయువు(స్సు). సం. వి స్. స. శాస్త్రోక్త పరిపూర్ణజీవితకాలము

(మనుష్యులకు, గజములకు ౧౨౦ సం. ౫ రాత్రులును. గుఱ్ఱములకు ౩౨ సం. కుక్కలకు ౧౨ సం గాడిదలకు ౨౫ సం. వృషభములకు, మహిషములకు ౨౪ సం పరమాయు వని శాస్త్రము.)

పరమాయుషము. సం. వి. అ. పుం. ఆసనము, వేఁగిస. ?.

పరమార్థము. సం వి. అ. పుం. ౧. యథార్థము, సత్యము, తత్త్వము.

౨ ఇప్పుడ్గ శాస్త్రరక్ష విధియించు విధంబున మంత్రరక్షయు, తన్మయ్యకఁ గేవలంగా వలయుఁ దత్పరిరక్షణశక్తి సల్లకా, రక్షమ్ములం సిద్ధిఁ బొందఁ బరమార్థము...

భార. అను. ౬. ౧౧౦.

౨ పరమ ప్రయోజనము. ముఖ్య ప్రయోజనము ౩. ఉత్తమధనము. ౪. (శబ్దాదుల) ప్రధానమగు అర్థము.

పరము[1]. వి ౧ కూబరము

గీ... తిగుఁ గూబరమ్ము పరము నాఁగ ..

ఆం. భా ౨. ౨౦౨

౨. కట్టెబండిమీఁది పటుపుల్లమాను, చట్టము నిలుపుకమ్మి. (శ. ర. శా.)

క శకటము విరిగియున్న దివిఁ, బ్రకటంబైయుగసి యిరుసుఁ బరమును గండ్లున్, వికటంబుగ నేలం బడె,...

భాగ. ౧౦. పూ. ౨౫౧.

సీ. ఎదలించి మీఁదట సెసఁ గడిపరమెల్లఁ బడఁద్రోచియడఁకుని పారి. పూ ౫. ౧౩౨. వరాహ ౫. ౧౦౭.

౩ బండిపైఁ బిఱచెడిగూడు.

సీ కస్తూరినించి సింగములు గట్టిన కపురంపుట వంకిపరంపు బండ్లు చంద్రా. ౨ ౪౧.

పరము[2]. వి అనశనవ్రతము, ప్రాణాచారము. (శ ర) దీనికి వ్యుత్పత్తియందుఁ 'ము' వర్ణలోపము - చూ పరగడుపు జః పరగడుపు

పరము. సం. విణ (అ ఆ. అ.) ౧. అన్యము, వేఱైనది; భిన్నము. ౨ దూరము, దవ్వైనది. ౩ ఉత్తరము, మీఁదిది. ౪. సమనంతరము, వెంబడి వచ్చునది, తర్వాత వచ్చునది. ౫ మేలైనది, శ్రేష్ఠము ౬. ఎక్కువైనది, అధికమైనది. (ఇది శతసహస్రాది సంఖ్యావాచకములకుఁ బూర్వపదముగానుండి సమసించినప్పుడు మహా

గమము వచ్చిఁ పోన్, అని రూపమగును. పరో రజస్సు మున్నగుచోట్ల సంఖ్యావాచకేతర పదములతో సమసించినపుడు గూడ నీకార్యము కానఁబడుచున్నది.)

౭. ప్రతికూలము, విరుద్ధము ౮ (శరీరాదుల) వెనుకటిది. (వ్యతి. పూర్వము)—శ్లో: దంతివా సనిసమానగుణశ్రీః సమ్ముఖో ౭ పి పరభాగమ వాప. శిశు ౧౦ ౬౩.

(సమ్ముఖోఽపిసన్ పరభాగం = గుణోత్కృష్టం తథా పశ్చాద్భాగం చా వాప ఇతి...సమ్ముఖ పరాఙ్ముఖత్వ యోశ్చవిరోధః —అని వ్యాఖ్య)

—వి. అ న ౧. బ్రహ్మము ౨ మోక్షము

3 పరలోక సౌఖ్యము

గీ . భూవిభుఁడు ప్రజకు, రక్షణము సేయ నిహముఁ బరంబుఁ గల్గు...

భార శాం ౫ ౨౯౬.

క చంపఁగ నొడఁబడు దు, ర్మతి కిహముం బరముఁ గలదె మదిఁ బరికింపన్.

భార ఆది ౬ ౨౬౧

౪ పరలోకము

ఆ అట్లకాకయుని ప్రియంబుమై వీడ్కొని, జాజలియును జనియె రాజవర్య, యిహము పరముల నెసక మెసఁగ సౌఖ్యము లొలా, ధారుఁడును సమున్నతత్త్వ మొందె

భార శాం ౫ ౨౫౪

గీ ఏల చింతింపనిహమునం దెల్ల సుఖము, లనుభవించితి మధురా మహాపురమునఁ, బరమునందు విముక్తిసంపదయుఁ గలిగె ...

కాశీ 3 ౧౭౩

౫. బ్రహ్మదొక్క ఆయువు. ౬. తక్కెలము.

క్రి. (వై. వి.)—అవ్య ౧ కేవలము, అద్వితీయము. ౨. అతిశయము.

(౧. శ్లో. పరస్స్వార్థదుత్తమా త్మార్థ్యే వైరి దూరేషు కేవలే, పరమవ్యయ మిచ్ఛంతి. విశ్వ నిఘంటువు.

౨. శ్లో. శ్రేష్ఠాన్యదూర శ్రేష్ఠేషు పరస్స్యాత్ ద్వాచ్య లింగకః, పరోఽః పరమాత్మాచ కేవలేపర మవ్యయమ్ నానార్థరత్నమాల.

3 పరం అతిశయే అవ్యయమ్. అని పరంపరాకి శబ్దము క్రింద భానోజి దీక్షిత కృతామర వ్యాఖ్య, దీనినిబట్టి మాంతావ్యయ ముండుట చేత 'పరంజ్యోతి, పరంధాముఁడు' మున్నగు నవి సాధువులగును)

పరమృత్యువు. సం వి ఉ పుం.—ఇతరుల వలన మృత్యువు కలది; ఇతరులం చంపకున్న చిరకాలము జీవించునది—వాయసము, కాకి.

పరమేశుఁడు. సం = పరమేశ్వరుఁడు.

పరమేశ్వరుఁడు. సం వి అ. పుం ౧ పరమాత్మ, పరబ్రహ్మము ౨. విష్ణువు 3. శివుఁడు. ౪. ఇంద్రుఁడు ౫ చక్రవర్తి

పరమేష్ఠి. సం వి న్ పుం ౧. (సత్యలోకవాసి) చతుర్ముఖబ్రహ్మ ౨ శివుఁడు. 3 విష్ణువు ౪. సాలగ్రామ మూర్తిభేదము. ౫ జినుఁడు

పరమేష్ఠిని. సం. వి ఈ స్త్రీ బ్రాహ్మీ, సరస్వతి

పరమేష్ఠుఁడు. సం వి అ పుం ౧ (సత్యలోకమం దుండువాఁడు) చతుర్ముఖబ్రహ్మ ౨. పరమాత్మ, బ్రహ్మము

పరమైశ్వర్యము. సం. వి. అ న. ఉత్కృష్టమైన ఐశ్వర్యము.

పరరూపము. సం. వి. అ. న. (వ్యాకరణ) సంధి చేయునపుడు పూర్వపరస్థానముల కాదేశముగా వచ్చు పరవర్ణము.

పరలోకగమనము. సం. వి. అ. పుం. (పరలోకమును బొందించునది) మరణము, చావు.

పరలోకము. సం. వి. అ. పుం. ఇతరలోకము. (స్వర్గాది)

పరలోక విధి. సం వి ఇ పుం. మృతునకు ఉత్తమలోకప్రాప్తికై చేయు కర్మము, ఉత్తర క్రియ

పరవంజో. స. క్రి క్రమ్ముకొను, ఆవరించు.(శ ర )
—చూ పరవంజాకొను జ: పరవంజాకొను

పరవంజోకొను = పరవంజో. (పరవంజా + కొను —స్వార్థమున )

వ .. చేరువం బోవ దూరంబుగాఁ బరవంజా కొని యున్నతిచ్ఛాయం గాల్కానం గోరి తదగ్రంబున నిల్చి యుండె . వేం పంచ ౧ ౪౭౯. (చి. ని పా )

ద్వి. తన సేయు సేద్యమంతయుఁ బరవంజా, కొని తాను సేయుకొకొనుఁ గూర్మితోడ. ద్వి పరమ. ౪. ౭౯౫ పా. (చి ని పా )

పరవంతుఁడు. సం. విశే. (త్. వతీ. త్ ) పరాధీనుఁడు, అస్వతంత్రుఁడు

పరవశము. సం. విశే (అ ఆ అ ) పరాధీనము

పరవశుఁడు. సం విశే. (అ. ఆ అ.) పరాధీనుఁడు, ఇతరులకు లోనైనవాఁడు

పరవశ్యుఁడు. సం. = పరవశుఁడు

పరవాణి. సం వి. ఇ పుం. ౧. ధర్మాధ్యక్షుఁడు, న్యాయవిచారణకర్త. ౨. సంవత్సరము.
3. కుమారస్వామి వాహన మగు నెమిలి.

పరవాదము. సం వి. అ పుం. ౧ పరులు చెప్పుకొనెడి మాట. ౨. ఉత్తరవాదము.

పరవాది. సం. విశే. (న్. నీ. న్.) ప్రతిపక్షి. ఆక్షేపకుఁడు, ఉత్తరవాది.

పరవాది. విశే. అట్రకొట్టు. (శ. ర. చి. ని.)

రగడ. మితిలేని కేకు నామెతచేసె నిరవాది, యితరలతికల మరఁగి రేఁగు నది పరవాగి. మనుచ. 3 ౭౪.

సీ. తరియింతు నెటువలెఁ బరవాది నిరవాది నెఱవాది తావుల మెఱయు గాడ్పు ...
చంద్ర ౪ ౧౧౪.

పరవాళులు. వి ధారాగృహములో యంత్రముఖమున జాఱు జలధారలు, తరువోజ బలుపిడిగొని జాఱు బాష్పోదకముల బాలకన్గవ కేఁడిపరవాళు లొప్పఁ కు సం ౫ ౫౭౭.

పరవ్రతుఁడు. సం. వి అ పుం ధృతరాష్ట్రుఁడు

పరశము. సం. వి. అ. పుం స్పర్శమణి, పరుసవేది (దీని స్పర్శముచేఁ దక్కినలోహములు బంగా రగు నందురు.)

పరశు(వు). సం వి ఉ పుం (శత్రువును జంపునది) ౧ పరశ్వధము, గండగొడ్డలి ౨. అస్త్రము, ఆయుధము

సీ తునియునో పరశుచేఁ దునియదో వృక్షంబు తునియు నీ వృక్షంబు తునిమె పరశు, వు...
ఉ హరి ౨ ౧౪౭.

3. వెలిగారము, టంకణము (వై. ని) ౪. వజ్రము (శే ని)

పరశుధరుఁడు. సం విశే (అ ఆ అ ) గండగొడ్డలి ధరించినవాఁడు . వి అ పుం ౧ పరశురాముఁడు ౨. వినాయకుఁడు

పరశురాముఁడు. సం వి అ. పుం ఒకానొక భగవదవతారమూర్తి. (జమదగ్నిఋషికి రేణుకాదేవియందుఁ బుట్టినవాఁడు.)

పరశ్వధము. సం. వి అ. పుం పరశువు, గండగొడ్డలి

పరశ్వస్. సం. అవ్య. న్ ఎల్లుండి. (సద్యస్—సద్యము అయినట్లు పరశ్వము అని అగునని తోఁచెడిని. లేదా సమాన పూర్వపదముగా నుపయోగింపవచ్చును.)

పరశ్శతము. సం. విణ. (అ. ఆ. అ.) నూటికంటె అధిక పరిమితిగలది. (సంఖ్య, సంఖ్యేయము)

పరష్షష్టి. సం. విణ. (ఇ) అఱువదికంటె ఎక్కువగి (సంఖ్య, సంఖ్యేయము).

పరస=పరుస. వి. ౧. తిర్నాళ్ళనకు వచ్చు జనసమూహము. (శ. ర.) ద్వి. బసవలింగం చేరు పరస యనంగ౯, బసిగొని యిలఁ గ్రిక్కిరిసి వచ్చువారు. బస. పు. ౨. ౧౭౫ పం.

౨. ఒకజాతి బిచ్చగాఁడు

వ... పరసలు పడిగెవారు కంచికావళ్ళవారు పరంగు లింగివీనులు పరాసులు...

హంస. ౩. ౨౯

పరసాత్కృతము. సం. విణ. (అ. ఆ. అ.) పరుని యధీనముగాఁ జేయఁబడినది

పరసు=పరుసు. వి. ధనము.

క. నరకాతురుఁ డగు కిల్బిషు, పరసున నరకుండు దలఁచె. హరి. ఉ. ౪. ౧౫౭

క. కప్పెసఁగుచున్న నున్నని, చిప్పలలో స్వాతి వానచినుకులు ముత్తె, చొప్పునఁ బడు నప్పరమున, నొప్పెదవునుమ ముత్తికంబు లొక్క కథంగి౯. రత్న. ౪౫.

పరసేవ. సం. వి. అ. స్త్రీ. ఇతరుని సేవించుట.

పరస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. పరకీయ, పరుని భార్య

పరస్పరజ్ఞులు. సం. వి. అ. పుం. బ.—అన్యోన్య మెఱిఁగినవారు - స్నేహితులు

పరస్పరము. సం. విణ.=అన్యోన్యము

పరస్మైపదము. సం. వి. అ. న. క్రియాఫలము న్యునికి చెందునని తెలుపు క్రియాపదభేదము—(వ్యతి-ఆత్మనేపదము)

పరస్వంతము. సం. వి. త. పుం. అరణ్య మహిషము. (వై. వి.)

పరస్వథము. సం.=పరశ్వథము.

పరస్వము. సం. వి. అ. పుం. న. పరుని ధనము

పరస్సహస్రము. సం. విణ. (అ. ఆ. అ.) సహస్రముకంటె ఎక్కువ పరిమితి గలది. (సంఖ్య, సంఖ్యేయము)

పరహింసుఁడు. సం. విణ. (క౯ రఘ్న క౯) పరులను జంపువాఁడు.

పరా. సం. అవ్య. ౧. వెనుక (పరావృత్తము=వెనుకకు మరలినది)

౨. ప్రాతికూల్యము, వ్యతిరేకము (పరాజయము)

౩. పోవుట (పరాసువు=పోయిన ప్రాణములు కలది.)

౪. అత్యంతము (పరాహతము=మిగుల కొట్టఁబడినది)

పరాంగము. సం. వి. అ. పుం. దేహముయొక్క వెనుకటి భాగము

పరాకము. సం. విణ. (అ. ఆ. అ.) వరాకము, అల్పము, కుత్సితము. - వి. అ. పుం. ౧. కత్తి ౨. ప్రాయశ్చిత్తరూపమగు వ్రతభేదము ౩. రోగవిశేషము

పరాకరణము. సం. క. అ. న. నిరాకరణము, త్రోసిపుచ్చుట

పరాకు. వి. (క. పరాకు) ౧. ఏకాగ్రత, సావధానత .

గీ. తమ్మలము సేయుచో నొక్క తలిరుఁబోణి గాటమూరునిఁ జూచు పరాకుకతన,..

హైమ. ౬. ౬౩

(శ్లో: విలోక హైమాగ్ర విలోచనోత్పలా-

సం. హైమ. ౧౫. ౪౪)

శా. పూజాదంభమున న్పరాకు మెయి మ్రుక్కఁబోఁడి చేరువ్వఁది చే, తోఁజాతావళ మూర్పు లాత్రనఁదిగ౯ దూలి న్నరి ప్రక్కని...

ఆము. ౫. ౧౪౯.

గీ. రమణీయమయ్యారములపైఁ బరాకుచేతఁ, జవి
దొలంగఁడు వర్ణించు నవి దొలంగఁడు,...
విజ. వి ౨. ౧౫౪, కళా ౩, ౧౫౪

౨. తత్పరతను దెల్పుమాట, హెచ్చరికను దెల్పు
మాట

గీ అంతకంతకు నతివేగ మగ్గలింప, రాగ వాగ
రొచ్చరిక పరాకు జెయ్య, యనుజనులు
తిచ్చవడి తమ పని మఱవఁగఁ, బరగు
నప్పేటి శాఖరాకు ప్రౌఢికతన
ప్రభా ౨ ౩౩

గీ. రాజవర్య పరాకజారమున దొరలు, గాచినా
గని హెగ్గడికత్తె దెలుప. కువల ౨ ౩
ఉ రా ౧ ౧౪౦

౩ అనవధానత, ఏమఱపాటు.

సీ. ఏమఱిపాటున శేమఱిక యుః జొాస మనఁ
బరాకనఁ జనుఁ బ్రమాదము
ఆం భా ౧ ౧౩౬

క. వనిత నృసింహేంద్రుఁ బరాకునఁ జొక్కని
శిరము వంచుకొనుచు... నరస ౩. ౨౩.

ఉ. అయ్య పరాకు మాని దెలియన్ విను ..
సారంగ. ౧. ౬౬.

సా అడిగిన చిరాకు అడుగకున్న పరాకు

౪. ఉపేక్షాభావము, ఉదాసీనత

వ...అని వర్ణించుచుండ దమయంతి...పరాకు
వహించియుండె నవ్విధం బా కాశీరాజనకుం
గ్లానివహ మయ్యె... నైష. ౫ ౧౦౬

సీ కుడిసిన కొంగ మెత్తి చూడకుండు పరాకు
కునుకు బాలుని నైనఁ గునుటుఁ జేయు.
ఆము. ౧,౫౯, విజ. వి. ౧. ౬౫

౫ మైమఱపు, వివశత్వము.

ఉ...అచ్చుగరాకఁ బొండ్ల కెఱయందమునం బె
మనంబు నిల్పి పై, యుచ్చర దానవప్రవరు
లచ్చెరువాటు పరాకుఁ జెందుచున్.
దశా. ౨. ౨౪౧.

(వ్యవ) వానికి సంధి యెత్తినగి పరాకుమాటలు
ప్రారంభించినవి.

౬. అసత్యము

క. ఈకల నిజమో కాక పు, రాకో చోద్యమగు
...లుగలకే, నాకల యున్నఁడు నిక్కల,
గాకుండఁ గ నిటు పరాకుగాఁ బనిగలదే
విప్ర ౩ ౪౫

పరాకుదెల్పు= పరాకు పరాకను

సీ సాగను నిద్దపుఁ గమ్మమగటాల ధళధళల్
ప్రబలాక్షిరుచిఁ బరాకు దెల్ప. శుక. ౧
౨౦౦ (సేవచేయు అని భావము)

జ: పరాకుచేసికొను, పరాకుపడు, పరాకుచేయు

**పరాకుచేసికొను.** అ క్రి (√ పరాకుచేయు)
ఉపేక్షాభావము వహించినట్లుండు, వినిపించు
కొన నట్లు నటించు.

వ అని యనేకప్రకారంబులఁ దనమనోను
రాగంబు తేటపడం బలికినఁ జెలుల నరయు
నెపంబునం బరాకుచేసికొని ..
విజ. వి ౨. ౨౦౦

**పరాకుపడు.** అ క్రి (√పరాకు) ప్రమాద
పడు (శ.ర)— స. క్రి. మఱచు. (వ్యవ)
ఈ తొందరలో ఆ విషయము పరాకుపడితిని

**పరాకు(చే)సేయు.** స. క్రి. (పరాకు+చేయు)

౧. ఉపేక్షచేయు.

చ చెనకి నుపక్రమించుఁ బతిచెంతఁ దొలం
గఁగఁ జూచు నాతి యవ్వనితఁ బరాకు
చేయు జనవల్లభుఁడు .. కళా. ౪ ౧౨

కి. నీవార్తఁ దెలిపినప్పుడె, భావమునఁ గృపా
వివేకపద్ధతి మెఱయంగా వినెఁ బరాకు
సేయక, శ్రీవల్లభుఁ డానతమునఁ జెలువ
వొల్లయన్. శుచేత. ౨. ౬౦

క...కెంజిగు, రాకుఁ గని పరాకుసేయు నార
పదంబుల్ విజ. వి. ౧. ౬౫. (ఇట శ్లేషము
ద్యోతకము)

౨ ప్రకృతవిషయమునుండి మరల్చు, మఱపు కలిగించు

క. మనసిజుఁ డదయుఁడు శరమేసిన సేమగునో పరాకుసేయుద మనుచున్.

కువల. ౩ ౧౧౫

౩. (సేవకులు ప్రభువులను) హెచ్చరించు

గీ. చూడక మొగంబు ద్రిప్పి మాటాడ విభుఁడు, చేదిగిచి పట్టుక పరాకుచేసినపుడె, యేమి పుట్టునో కైలాట మింకమీఁద, మగువ దయలేక విడవాకఁ దగుకొనీకు

విజ. వి. ౨. ౧౯౭

పరాక్కు. సం. విణ. (చ్. చీ. చ్.) ౧. ప్రతిలోమగామి. ఎదురుతిరిగి, వెనుకకు తిరిగినది, పరాఙ్ముఖము ౨. ప్రతికూలము, వ్యతిరిక్తము ౩. మీఁదనున్నది (ఎగాగ్లోకము) ౪. పరగామి, మఱొకటిని బొందునది ౫. బాహ్యపదార్థములను దెలుపునదై ప్రత్యగాత్మకు భిన్నమయినది. (శ్రోత్రాదీంద్రియములు) వి. చ్. పు. ప్రత్యక్షగన్యముగానిది (పరుని ఆత్మాది)

పరాక్పుష్పి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేను, అపామార్గము

పరాక్రమము. సం. వి. అ. పుం. ౧. వీర్యము, శౌర్యము ౨. దేహబలము దేహసామర్థ్యము ౩. ప్రయత్నము, పూనిక

పరాక్రమి. సం. విణ. (న్. నీ. న్.) పరాక్రమము కలవాఁడు.

పరాక్రమించు. సం. అ. క్రి. విక్రమము చూపు, శౌర్యముచూపు, బలముచూపు.

చ. తన భుజశక్తి లేక యొరుదర్పము యాఁది పరాక్రమింపవచ్చిన నది కెల్లుకే...

భార. ఉద్యో. ౪. ౨౦౮.

ఉ. మాల్యవంతుఁ డే, కిరీ ముకుందు నొంచి యగకె నిలు మంచు ఖగేంద్రువాహము నిర్ఘాతముఁ బోలు ముష్టిహతి ఘట్టన సేసి పరాక్రమించినన్ ఉ. రా. ౨. ౧౦౩.

పరాక్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. పరాక్రమము

పరాక్రాంతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పరాక్రమించినవాఁడు. ౨. పరునిచే ఆక్రమింపఁబడినవాఁడు. ౩. ప్రతినివృత్తుఁడు, వెనుకకు మరలిన వాఁడు

పరాగతము. సం. విణ. (అ. అ. అ.) ౧. వెనుకకుఁ బోయినది ౨. మృతము, మరణించినది ౩. వ్యాప్తము; క్రమ్మఁబడినది ౪. (పర + ఆగతము) వెనుకకు వచ్చినది, తిరిగి వచ్చినది

పరాగమము. సం. వి. అ. పుం. ౧. వెనుకకుఁ బోవుట ౨. చావు ౩. (పరా + ఆగమము) వెనుకకు వచ్చుట, మరలి వచ్చుట ౪. శత్రువుల రాక, పగవారు దండెత్తి వచ్చుట

పరాగము. సం. వి. అ. పుం. ౧. పుష్పరజస్సు, పుప్పొడి. ౨. పొడి, ధూళి, దుమ్ము ౩. స్నానీయ ద్రవ్యము, నలుఁగుఁబిండి. ౪. ఉపరాగము, గ్రహణము ౫. చందనము ౬. స్వచ్ఛందగతి, విచ్చలవిడిగాఁ దిరుగుట ౭. ప్రసిద్ధి, ఖ్యాతి

పరాఙ్ముఖుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. విముఖుఁడు, పెడమొగము పెట్టినవాఁడు (వ్యతి - అభిముఖుఁడు). ౨. క్రియాదులందుఁ బ్రతికూలముగా ఆచరించువాఁడు ౩. పనిసేయకుండువాఁడు. ౪. ఒల్లనివాఁడు

పరాచేకము=పరియాచేకము. వి. పరిహాసము ఎకసక్కెము. (గ్రా. వి. అవి. శ. ర.)

గీ. అని పరాచికమాడుచు వరుల మీటిఁ,బుత్తెం...

కుశచరిత్రము. ౧. ౮౧

**పరాచితుఁడు.** సం విశే (అ. ఆ అ.) పరిపుష్టుఁడు, ఇతరులచేతఁ బెంపఁబడినవాఁడు. - వి. అ. పుం. పానిస వాఁడు.

**పరాచీనము.** సం విశే. (అ. ఆ అ) ౧. పరాఙ్ముఖము, వెనుకముంగము పెట్టినది. ౨. ఉత్తరకాలభవము, భావికాలమునఁ గలుగునది

**పరాజయము.** సం. వి. అ. పుం ౧. పరాభవము, అపజయము, ఓడుట ౨. ఓడించుట ౩. దయ్యుట, అలయుట (అధ్యయన పరాజయము = చదువువలన దయ్యుట)

**పరాజితుఁడు.** సం. విశే (అ ఆ అ) పరాజయము నొందినవాఁడు

**పరాజిష్ణువు.** సం విశే (ఉ) ౧ ఓడించువాఁడు, జయశీలుఁడు ౨. ఓడువాఁడు

**పరాణస.** సం వి ఆ స్త్రీ. (పరా + అన్ + అస — మిక్కిలి బ్రతికించుటకు సాధన మైనది), వైద్య-చికిత్స (వాచ)

**పరాత్పరుఁడు.** సం వి అ పుం — ఉత్కృష్టులకంటె ఉత్కృష్టుఁడు-పరమేశ్వరుఁడు

**పరాత్ముఁడు.** సం వి న్ పుం ౧ పరమాత్ముఁడు ౨ పరునిజీవుఁడు.

**పరాదనము.** సం వి అ న. (పరము = ఎక్కువగా — తినునది) పారసీకదేశపు గుఱ్ఱము (అరేబియాదేశపు గుఱ్ఱము, అని కొందఱు)

**పరాధి.** సం. వి. ఇ. పుం. ౧ (పరబాధాకరము) వేఁట. ౨ అధిక మగు మానసిక వ్యథ.

**పరాధీనుఁడు.** సం విశే (అ. ఆ. అ.) అస్వతంత్రుఁడు, ఇతరులకు లోఁబడినవాఁడు,

**పరాన్నభోజి.** సం విశే (న్. నీ. న్.) పరుల అన్నమును భుజించువాఁడు.

**పరాన్నము.** సం. వి. అ. న. ఇతరుల యన్నము.

**పరాన్నుఁడు.** సం విశే (అ. ఆ. అ) = పరాన్నభోజి.

**పరాపరము.** సం. స. (అ. ఆ. అ.) — పరాపరములు — ౧. వెనుకటిదియు ముందటిదియు, ౨. గొప్పదియు తక్కువదియు వి అ న. పరూషకము, పేరీఁదు, ఖర్జూరము ?.

**పరాభవ.** సం వి అ పుం ఒకానొక సంవత్సరము

**పరాభవము.** సం వి. అ. పుం. ౧ తిరస్కారము, అవమానము ౨. నాశము ౩ ఓడుట.

**పరాభవించు.** స. సం. క్రి. ౧ అవమానించు,

ఉ కౌరవకోటి దర్పమునఁ గాసక నిన్నుఁ బరాభవించి దుర్వారభవత్ప్రకోపశిఖఁ గ్రాఁగ మదిన్ వగ పేల దీనికిన్

భాగ కాం ౧ ౯౩.

౨ ఓడించు

వ...ఇట్లు నివాతకవచులఁ బరాభవించి భవ్యతేజో దుర్నిరీక్షుం డై పాండవేయుండు మరలి వచ్చువాఁడు... వాగ ౪ ౧౭౦

**పరాభూతి.** సం. వి ఇ. స్త్రీ పరాభవము.

**పరాభూతుఁడు.** సం. విశే (అ. ఆ. అ) ౧. అవమానింపఁబడినవాఁడు. ౨. ఓడింపఁబడినవాఁడు.

**పరామరిక = పరామరిస.** వి. (సం. పరామర్శః)

౧ వివేచనము, మంచిచెడ్డలను జక్కఁగా విచారించుట.

గీ మహిత చారిత్రు గురుఁ బరామరిక లేక, చంపుమని పంపఁదగునయ్య సదయహృదయ

వి క్ర. ౩ ౬౩

౨. విచారణ, పరిశీలనము.

సీ. హైఁ బరామరిక చొప్పడమిఁ బాకము దప్పి పండఁబాఱిన పాల పెండఁబోలె.

మనుచ. ౩. ౧౭౫.

**పరామరిన**=పరామరిక. (సం పరామర్శః)

క. అని పలికిన వాఁడును తన, మనమున దిరిగి మగుడఁ దెచ్చి మఱిఁదిఁ దెలియఁబలికి, దనవీటఁ బుట్టిఁ గావలి, సునిచి పరామరిన చేయుచుండె మఱిఁంద్రా. వి పు. కి. ౧౬.

(పరామరిక - (క్రొత్తపతి పా)

**పరామరిసించే.** స. క్రి. ౧ (క) విచారించు, ఆలోచించు

ఉ ...రావణముఖ్య నిశాటులెల్ల సం, గ్రామము నందుఁ గూలుట పరామరిసింపుము మర్త్యవేషుఁడై, భూమినిఁ బుట్టెఁ గాని రఘుపుంగవుఁ డాదిని విష్ణుఁడే సువీ సీతా. ౬ ౧౬.

చ ...విజచారుగుణాన్వయలీల కానుకూల్యము గలకన్యఁ గైకొనఁ దలంచి పరామరిసించుచున్నదట్. సమీర ౧ ౧౪౭

(వ.) న్యాయాన్యాయములు - విచారించు.

గీ పొమ్మనినఁ బోయి యొకచిన్నబమ్మచారి, చేత గిన్నియఁ బుత్తెంచె వాఁడే దీని, శిష్యుఁ డనియెఁ బరామరిసించుఁ డనిన, విప్రనారాయణుఁడు సభావితతి కనియె వైజ ౪ ౭౫.

చ ... సేఁ డొక భిక్షుకుండు నట్, గుహిత మతిన్ శిరం ? విసయఁగొట్టెఁ బరామరిసింపవే యనన్. ఉ గా ౭ ౧౭

౨. పరికించు, చక్కఁగఁ జూచు

సీ. చాసదాసీపకులితీఁ బరామరిసింప ...యన్నట్టియొకిఁ దలఁచి ప్రబంధ ౪౪౩

౩. వెదకు

సీ. మటపల్లిచక్కఁ దా నటు పరామరిసించి యందు లందుల సందుగొందు లరసి. విప్ర. ౫. ౬.

౪. (నలుదిక్కులు) పరీక్షించు.

గీ. చిటుకమన్నఁ బరామరిసించుకొనుచు. కువల ౨. ౧౧౪.

**పరామర్శనము.** సం. వి అ. న ౧ స్మరణము, తలఁపునకుఁ దెచ్చికొనుట ౨ వివేచనము, చక్కఁగా విచారించుట ఆలోచించుట.

**పరామర్శము.** సం వి అ పుం ౧ పట్టి యీడ్చుట. (కేశపరామర్శము)

౨ (విల్లు మొదలగువానిని) లాగి వంచుట

౩ ఆటంకము, నిరోధము (శ్లో. తపః పరామర్శ వివృద్ధమన్యోః.) సం కు సం. ౩ ౭౧

౪ అవమానించుట, భంగపఱుచుట (ద్రౌపదీ పరామర్శము)

౫ తలఁచుకొనుట, మనమునకుఁ దెచ్చుకొనుట. ఉ. యుక్తి

౬ వివేచనము, చక్కఁగా విచారించుట

౭ (న్యాయ) అనుమితికారణ మగుజ్ఞానవిశేషము, వ్యాప్తివిశిష్ట పక్షధర్మతాజ్ఞానము (ఈ పర్వతము వహ్నివ్యాప్యమగు ధూమము గలది అనుజ్ఞానము)

**పరామర్శించే.** సం స క్రి చక్కఁగా విచారించు

మ...క్రే, మ దలిర్పన్ శుభశీలురన్ మిముఁ బరామర్శింప నన్ బంపినాఁ, డదిగా కింకొకవార్త దెల్పు మనినాఁ దావింపు ముర్వీశ్వరా ఉ. రా ౫ ౧౫౬

**పరామృతము.** సం. వి. అ. న వర్షించుట; వాన.

**పరామృతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) మృతిని గడచినవాఁడు.

**పరామృశించు.** సం. స. క్రి. చక్కఁగా విచారించు, వివేచించు.

చ. ...కర మరుదార గోపురము కామరుపాపరు
హారి కోటులన్, దరియఁగనీయ దన్నలువ
సాల్గొమొగాల పరామృశింపఁగన్.
అహో. ౧ ౧౧౯.

పరామృష్టము. సం. విశే. (అ. ఆ. అ.) పరా
మర్శింపఁబడినది పరామర్శము చేయఁబడినది

పరాయణము. సం. విశే. (అ. ఆ. అ.) ౧.
అత్యంతాసక్తము, మిక్కిలి తగులు గలది, తత్ప
రము. (ధనపరాయణుఁడు) ౨. అభీష్టము, ప్రియ
మయినది.—వి. అ. న. ౧. తత్పరత, అత్యంతా
సక్తి, మిక్కిలి తగులు
౨. ఉత్తమమైన ఆశ్రయము, మేలైన ప్రాపు
గీ. తనువెలుంగు వేదవ్యాస మునివరుండు, నధిప
కృష్ణుండు నకుఁ బరాయణంబు. .
భార. అను. ౫. ౪౩౯.
3. ఉత్తమ స్థానము
౪. ఒరు లేమేమి రొనర్చిన, నరవర యప్రియము
దనమనంబున కగుఁ దా, నొరులకు నవి సేయ
కునికి, పరాయణము పరమ ధర్మపదముల
కెల్లన్. భార. శాం. ౫. ౨౭౦
౪. నాలుగుమాసము లుపవసించు వ్రతము
(వై. ని.)

పరాయత్తము. సం. విశే. (అ. ఆ. అ.) పరా
ధీనము, పరునకు లోనైనది

పరాయి. విశే. (హి. పరాయి) ఇతరము, ఇత
రుఁడు. (వీఁడు పరాయివాఁడు ఇది వాడుకలోని
విది. శ. ర.)

పరారి. విశే. ఎత్తుపడి ఊరు విడిచి పాఱిపోయిన
వాఁడు. (శ. ర.)

పరారి. సం. వి. ఇ. పుం. గొప్పశత్రువు, కోటి
విరోధి.—అవ్య. కడచిన సంవత్సరమునకు పూర్వపు
సంవత్సరము, ముందుటేఁడు (దీనికిఁ దెనుఁగున
వ్యస్తప్రయోగము లేదు.)

పరారిక. సం. వి. ఆ. స్త్రీ. పదివిధములగు ఉల్లి
పాయలలోని ఒకానొకజాతి. (వై. ని.)

పరారిత్నము. సం. విశే. (అ. ఆ. అ.) పూర్వ
తరవత్సరమునది, ముందటి యేటిది.

పరారుకము. సం. వి. అ. పుం. ప్రస్తరము,
ఱాయి

పరారువు. సం. వి. ఉ. పుం. కారకల్లము,
కాఁకర తీ

పరార్థము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. మఱి
యొక ప్రయోజనము గలది ౨. మఱియొకనికొఱ
కైనది, పరునిమిత్తకము.—వి. అ. పుం. ౧. ఉత్తమ
మైన యర్థము, ఉత్తమ ప్రయోజనము ౨. మఱి
యొకని యర్థము (వ్యతి. స్వార్థము)

పరార్థ్యము. సం. విశే. (అ. ఆ. అ.) శ్రేష్ఠము.

పరార్ధము. సం. వి. అ. న. ౧. వెనుకటిసగము,
రెండవ యర్ధము (వ్యతి. - పూర్వార్ధము)
౨. సంఖ్యావిశేషము, కడపటి సంఖ్య - (100,000,
000,000,000,000 - ఏకత్వాది పరార్ధాంతా
సంఖ్యా - తర్క. సం.), బ్రహ్మయాయువునందు
రెండవ సగము

పరావతము. సం. వి. అ. పుం. పరూషకము.
పేరీఁదు, ఖర్జూరము తీ.

పరావరదృక్కు. సం. విశే. (శ) భూతభవిష్య
ద్విషయములు ఎఱిఁగిన వాఁడు, ముందువెనుక
లెఱిఁగినవాఁడు

పరావరము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. దూర
ముదియును దగ్గఱదియును.
౨. (దేశకాలములందు) ముందటిదియును వెను
కటిదియును.
3. ఎక్కువదియును తక్కువదియును. ౪. శ్రేష్ఠ
తమము.

**పరావర్తము.** సం. వి. అ పుం. ౧ ప్రత్యావృత్తి, మరలుట, వెనుకకు మరలుట ౨. వినిమయము, మాఱుపు ౩ మరల ఇచ్చుట, పరివర్తము. ౪. (వ్యవ) తీర్పుమార్చుట

**పరావహము.** సం వి అ పుం సప్తవాయువు లలో పరివహవాయువునకు మీఁదిది

**పరావిద్ధము.** సం. వి అ పుం అంతఃపురము (వై. ని.)

**పరావిద్ధుఁడు.** సం. వి అ పుం. ౧. కుబేరుఁడు ౨ ఒకానొక సంకీర్ణజాతివాఁడు

**పరావృత్తము.** సం విణ (అ ఆ అ) ౧ మరలినది; వెనుకకు మరలినది. ౨ వినిమయము నొందినది ౩ (వ్యవ) వేఱువిధముగా మాఱినది (తీర్పు)

**పరావృత్తి.** సం వి ఇ స్త్రీ=పరావర్తము

**పరావేది.** సం వి ఈ స్త్రీ ౧ బృహతి, వాఁకుడు చె ౨. ములక చె.

**పరాశరుఁడు.** సం వి అ పుం ౧ ఒక ముని, వేదవ్యాసుని తండ్రి ౨ దేవేంద్రుఁడు (వై ని)

**పరాశ్రయ.** సం వి. ఆ స్త్రీ—మఱియొక చెట్టు మీఁద కొలచు లతాది—బదనిక, వంద చె.

**పరాశ్రయము.** సం వి అ పుం పరునాశ్రయించుట, పరుని యాశ్రయము

**పరాశ్రయుఁడు.** సం విణ (అ ఆ అ) పరుని ఆశ్రయము కలవాఁడు పరుని ఆశ్రయించినవాఁడు

**పరాసంగము.** సం. వి. అ. పుం ౧ పరునాశ్రయించుట. ౨ పరులకూడిక.

**పరాసనము.** సం. వి. అ న. మారణము, చంపుట

**పరాసము.** సం. వి. అ. న. తగరము, వంగము (వై ని.)

**పరాసుఁడు.** వి. త్రెంచినవాఁడు.

శా...కళింగంబు రాజల్లీలన్ ఘనుఁ డాపరాసునకు మూసాబూసియన్వాని కత్యుల్లాసంబున సాధిపత్య మొసఁగన్ రూపించి రావింపుచున్.

రంగా ౧ ౧౩౯, ౧౪౦ రంగా ౩ ౧౧౯

**పరాసువు.** సం విణ (ఉ.)—పోయిన ప్రాణములు కలవాఁడు—మృతుఁడు, చచ్చినవాఁడు.

**పరాస్కంది** సం వి. న్ పుం దోఁపుడుదొంగ, బందిపోటు దొంగ

**పరాస్తము.** సం విణ (అ ఆ అ) ౧ త్రోయఁబడినది, త్రోసివేయఁబడినది ౨ తఱుమఁగొట్టఁబడినది ౩ నిరాకరింపఁబడినది, ఖండింపఁబడినది (వాదాది) ౪ ఓడింపఁబడినది

**పరాహతము.** సం విణ (అ ఆ అ) ౧ కొట్టఁబడినది ౨. వెనుకకుఁ గొట్టఁబడినది ౩ వెనుకకుఁ దఱుమఁబడినది - వి అ న. దెబ్బ, కొట్టు

**పరాహము.** సం వి. అ పుం మఱునాటి దినము, మఱునాఁడు.

**పరాహ్ణము** సం వి అ పుం దినమునందు మధ్యాహ్నమునకు పిమ్మటి కాలము

**పరి** వి ౧ సైన్యము, దండు

చ. పరి సనుదెంచి గోగణముఁ బట్టు రివన్ విని .. భార విరా. ౪ ౬౯

గీ ...ఈతఁడు పరి చాఁపకట్టు వడఁగఁ, గొట్టి చతురంగబలముల వెట్టు గలఁప...చంద్రా. ఉ ౯౫, భార విరా. ౨. ౩౬

౨. మూఁక, గుంపు, సమూహము

గీ అంతపరియనల పై ప్రజ కలికి పాఱి, పోవ వాఁడును వెడపోట్ల బొడిచి చనిరొ...

ఆము. ఉ. ౯౩.

ఉ. పరిమెయిఁ జాఁతి వానిఁ గనిపట్టి నడిం బెరకోలఁ గట్టి తె, చ్చిరి ...

భార. శాం 3. ౫౦౫.

(కట్టినము-అని శ ర)

3. (= పంక్తి) కొల్ల

గీ. డామరం బగుఁ జాలి కొల్ల పరి యనఁగ,

ఆం. భా ౨ ౨౭3

౪. పర్యాయము, మాఱు, సారి (ఈ యర్థమునఁ దఱచుగ 'ఒక' శబ్దపూర్వకముగఁ గాన వచ్చును.

క కేళయ పాల్వేలు దోడుగ, నా కీచకుఁ డాజి నన్ను గపటకుఁ జేసెం, జాకుండ మున్న రొండొకపరి, నా కారనితోఁద ఖండనము లేదయ్యెన్ భార విరా 3 ౧౧౭

క ఆ పలుకు లా పెదల్చిన, తాపసి పలు కనుచు లంజ తల్లియుఁ గోపో, ద్దీపిత యై యిఁక నాచే, నీపరి పెట్లఁ బడ కరుగుకే వీఁ డనుచున్ విప్ర. ౪. ౫౭

మ కదియం గన్గొని మత్స్య మొక్కపరి శృంగం బట్టిటుం ద్రిప్పఁగా, నుదరంబుల్ శిరముల్ డెగం బడిరి దైత్యుల్ చేసటే లొక్కటన్

దశా ౧. ౨౭3

మ .. వారి యేతెంచుట లెస్సగా నెఱిఁగి తీవ్రాటోపయుక్తంబుగాఁ, బరిమై వర్తిమ గాక యున్నఁ గడిమిం బ్రత్యర్థి నా హాలాహిపే, నీ రణక్రీడఁ జలంబు నూపు దము... హరి ఉ ౬. ౧౪౪

(ఇట 'పరిమై' మటియొక పర్యాయము-భావము)

వ ... నాలవపరి ధర్మభార్యాసర్గంబునందు నర నారాయణాభిధానం బై దుశ్చరం బైన తపంబు చేసె భాగ. ౧. ౬3.

౫. తలము పట్టుడల.

ఉ. పరిమెయి మెట్టి త్రొక్కి బహుళభంగులఁ బ్రాగారదు మిత్రుఁ జైత్రునిం, బోరిగొన వచ్చు గ్రీష్మ మనుచాచ్చపుఁ జేరఁ బురారిఫాలభా, నురపటువహ్ని యంచు వెఱఁ జొచ్చిన మన్మథుఁ గాచె నర్తతిన్, సరసశిరీషకేసరల సన్మహిళా మృదులాలకాగ్రముల్.

నృసిం. 3 ౬౨.

౬. (క పరి.) ప్రవాహము, ఒక విధమగు జలా శయము.

క...బుగ్గ వాగు దొన తల,పరి గుండము కాల్వ డిగ్గి బావి దొరువులన్. హంస ౪ ౨౧౦.

ఆలపరి=ఆవులమంద

మ కలఁచెన్ కాలివనప్రదేశములు వీఁక న్మార్గముల్ గాచి పాంథులఁ గూల్చెం బొలి యించె నాలపరిఁ దోడ్తో నూళ్ళలోఁ జొచ్చి

పె శకుం ౧ ౧౦౧

గూఁబపరి=గ్రుడ్లగూఁబల గుంపు

చ. . ఇరు లొన్నఱిచెన్ విరోధి భీకరగతి నంతి గూఁబపరి గాఢమహీధరభూజ దుర్గకో,టర ములం విర్గమించె వికటప్రకటాననముల్ ముడుంచుచున్ శేం పంచ 3 ౧౫3

చీమపరి=చీమలగుంపు

వ...అక్కటబిలంబు... రయసముద్ధూతధూళి ధూసరితధారాధర పథం బగుచు నొక్క పరియ చీమపరి యనఁగ గవిసె నందు

మను. ౪. ౧౧౦.

మిడుతపరి=మిడుతలదండు

వ శిలీముఖంబులు నిగుడ మిడుతపరి గవియున ట్లంబరంబు నాచ్ఛాదించుచు. .

భా. రా. యు. ౬౯౫.

క...మిడుతపరి చిచ్చువాతం, బడిపడిఁ బొడి యైనయట్లు పంకజనయనా.

పద్మ. ౪. ౨౬౪ హరి. ఉ. ౬. ౯౬౫.

౬. (క) క్కపరిన్ = ఒక్కుమ్మడిగా, యాగ పద్యమున.

గీ శరభజాంబవదాదులు శైలతరులు, నొక్క పరి మీఁద నడరింప నురుశరీముల

భా రా యు. ౧౨౮౦.

సీ కరికరంబులం బాలకమలముల్ మూర్తి పాలికల్ నవ్యప్రవాళములను గీ గ గన జలనిధిలోనుండి కలసిరొక్క, పరయుతోరిఁ గొని యనఁగఁ జూపఱకుఁ దోఁచె,

వాల్మీ ౩ ౯౩

జః పరకాఁడు, పరిగొను, పరిగొలుపు, పరిచిచ్చు పరిమార్చు, పరిమార్పించు, పరిమార్పు, పరిమాఱు, పరిమొగము, పరిరొత్తు, పరివెడలు, పరివోవు

పరి. సం అవ్య (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు) ౧ అంతట (పరిభ్రమణము) ౨. వ్యాప్తి (పరిణతము) ౩ దోషకథనము. (పరివాదము) ౪ పూజన (పరిచర్య) ౫ అలంకారము (పరిష్కారము) ౬. మేర, కొలఁది (పరిచ్ఛేదము) ౭ కొన్నిచోట్ల నిరర్థకముగానే యుండును. (పరికల్పితము = కల్పితము) ౮ మిక్కిలి (పరికృతము, పరికృష్టము) ౯ వర్జనము (పరివ్రాట్టు) పరికాంక్షితుఁడు)

పరిఁజించు=పరుఁజించు. స క్రి పరుఁజునఁ బట్టుకొను, కత్తిపిడియందుఁ బట్టుకొను

క. అని కైదువు పరిఁజించుచు, నమపరిగదఁగన్న కుంభియని నీతిజ్ఞుల్ విని మెచ్చవలదె పదకముఁ గొనిరొ నతఁడు నాకు దీనిఁ గొనుట నుచితమే భోజరా. ౫ ౪౫,

చ. చెదరక బంటుమీఁదఁ బరిఁజించుచు దగ్గరు కూరుకై పడిన్. ద్వా. ౧౦ ౫౪

పరిక. వి. ౧. పక్షి విశేషము, ఒక జాతిపిట్ట.

సీ గిజిగాడుఁ పూరేడు కేర్జంబు పొన్నంగి పిచ్చుకాయి పరిక ...

గీ. యనఁగ నిట్లని పక్షిభేదాఖ్య లలరు.

ఆం. భా ౨. ౯౭

౨ (బ్రముగ్గు శ ర) రంగవల్లీ విశేషము, ఒక విధ మగు బ్రముగ్గు.

వ...విగళిత ప్రసవపరాగపరంపర యనుపరిక బ్రముగ్గులదగ్గర . శుపల ౩ ౧౩౧

చ . పరికలు దృష్టిదీపములుఁ బన్నిన గద్దెలు పెట్టి యేమిటన్, గర మగు పుత్రవాంఛ కడగానఁగ లేక విచారఖిన్నులై హంస ౨ ౯౫

౩ తృణ విశేషము

గీ పరిక ముల్లూచి మెందయము బైటికుంగ, మొదలుగాఁ బూచి రవళింపఁ బొదలు వెదలు ప్రబంధ ౨౦౧

౪ మత్స్యవిశేషము (చి ని.)

ఆ పరిక మొట్ట కెయ్యి పరిగ యింగిలికము, చీరజింపుజెల్ల నారజెల్ల, ద్వా ౧. ౨౨౧

(వ్రాఁతప్రతి పా)

పరికంపము. సం వి అ పుం ౧ భయము. ౨ అంతటను గలకంపము, కంపము, వడఁకు

పరికథ. సం వి ఆ. స్త్రీ వాఙ్మయభేదము

శ్లో అథ వాఙ్మయభేదాస్స్యుః చంపూః ఖండకథా కథా, ఆఖ్యాయికా పరికథా కలాపక విశేషకా (త్రి. ని.)

పరికరము సం వి. అ పుం. ౧ పరివారము ౨ ఉపకరణము, పనిముట్టు ౩ సమూహము. ౪. సమారంభము, ఉపక్రమము ౫ పర్యంకము, మంచము ౬ నడికట్టు ౭ యోగపట్టె ౮ వివేకము ౯. ఒక యర్థాలంకారము

క. సాభిప్రాయవిశేషణ, మై భాసిల్లినను బరికరాలంకృతి నా, శోభిల్లు నూరకవిచంద్రాలోకము. ౫౫.

౧౦. (నాట్య) బీజమును విపులముగాఁ జేయుట.

**పరికరించు.** సం. అ. క్రి. పరికరయత్నం దగు, నడుము కట్టు; సిద్ధపడు.

గీ. పంకనిర్మగ్న యగుగోవుఁ బరికరించి, యుక్తరముగ నుద్ధరించు గోపకునిమాడ్కి, ముదము దైవార నుద్ధరింపుదువు గాక, పంకనిర్మగ్ను నన్ను గోపాలతిలక. వై. భా. ౧. ౧౩౦

**పరికర్త.** సం. వి. ఋ. పుం. పరివేత్తను=అన్నకు మునుపు పెండ్లాడువానికి పెండ్లిచేయించు పురోహితుఁడు.

**పరికర్తనము.** సం. వి. అ. న. ౧. చుట్టును కత్తిరించుట. ౨. ఛేదించుట, నఱకుట.

**పరికర్మము.** సం. వి. న్. ౧. కుంకుమపూతలో గువాలిచే దేహము నలంకరించుకొనుట. ౨. (యోగ.) చిత్తశుద్ధిసాధనము (మైత్రి మొ.) ౩. (గణిత.) కార్యవిశేషము. (ఇది యోగ=సంకలన, వియోగ=వ్యవకలన, గుణ, భాగ, వర్గ, వర్గమూల, ఘన, ఘనమూలములు, లని యెనిమిది విధములు.)

**పరికర్మి.** సం. వి. న్. పుం. సేవకుఁడు (వై. ని.)

**పరికర్ముఁడు.** సం. వి. న్. పుం. (పరివాఁడు) సేవకుఁడు, పరిచారకుఁడు.

**పరికర్షణము.** సం. వి. అ. న. ౧. లాగుట, ఈడ్చుట. ౨. ఊడఁబెఱుకుట, బాధించుట.

**పరికర్షము.** సం. వి. అ. పుం.=పరికర్షణము.

**పరికల్కనము.** సం. వి. అ. న. కల్కనము, మోసపుచ్చుట, వంచించుట.

**పరికల్పన.** సం. వి. ఆ. స్త్రీ=పరికల్పనము.

**పరికల్పనము.** సం. వి. అ. న. ౧. నిర్ణయము, ఏర్పాటుచేయుట. ౨. చేయుట, కల్పించుట.

**పరికల్పించు.** సం. స. క్రి. ౧. కలిగించు. ౨. ఏర్పాటు చేయు, ఏర్పఱచు.

క. సురలు మునులు భయమునఁ బఱ, చిరిసలుగడ బ్రహ్మ వచ్చి శివుఁ గని వినయో, త్తరముగ మ్రొక్కుచు నమరులు, పరికల్పించెదరు నీకు భాగము భక్తిన్.
భాగ. ౮. ౨౪౦.

**పరికల్పితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఏర్పాటు చేయఁబడినది, నిర్ణయింపఁబడినది. ౨. చేయఁబడినది, కల్పింపఁబడినది.

**పరికాంక్షితుఁడు.** సం. వి. అ. పుం.=పరిత్యక్తకాంక్షితుఁడు—తపస్వి, సన్న్యాసి.

**పరికాఁడు.** వి. (√ పర) తెగకు ముఖ్యమైన యేనుఁగు, యూధపము.

చ. అమ్మదసాగి మెదిర్చి క్రమ్మరిం, చినపరికాఁడపోవె. భాగ. ఆది. ౪. ౨౦౮.

శ్లో. వాగణం జఘనే ఖండన్ దంతాభ్యాము పరోయథా. సం. భా. ఆది. ౧౦౯. ౩౪

చ. దంతియు, ట్టిసపరికాఁగు మొత్తిము వడింబఱతెంచినమాడ్కి నాపగా, తనయుఁడు తోనుగా రథికదంబము బిట్టదరంగ సముద్ధతిన్. భార. భీష్మ. ౧. ౨౧౫.

(చి. ని. శ. ర. కరాళప్రతుల పా.)

**పరికి.** వి. ౧. కిరాతభేదము (శ. ర.) ౨. తృణవిశేషము కీ.

గీ. పరికి సాళ్వము సొంటె కుందురు గలిమిడి. హంస. ౫. ౪౫

**పరికించు.** స. క్రి. (క. పరికిసు) ౧. పరిశీలించు.

వ. ఒందామాటలు దక్షిణ పథులం బరికింప నియోగింపుము. భాగ. విరా. ౧. ౨౧౬.

సీ. నీరుచేలలు వానకారులు పరికించి పరిపాలంబుల పంటవలఁకు లరసి. వి. శకుం. ౪. ౧౨౫.

ఉ. దేవరచర్య లన్నియుఁ బదింబదిగాఁ బరికించి చూడఁ బ, ద్మావనితామనోహరుని మూరటమూర్తిని సందియంబు లేదో వను ధేశ... పరమ. ౩. ౩౧.

౨. పరీక్షించిచూచు.

ఉ. ...కీల్పరికించిన దేవతావలం, బనరతిభావ
మై పరఁగు భావవికాసము లీ వికారముల్.
కాశీ. ४. ౧౫౪.

ఉ...మంత్రులఁ బంప వారల, కొక్కలకుల సంచ
రించి పరికించియు హేతువుగాన కర్ద్యోదక్
ఉ. రా. 3. ౬౪

3 విచారించు, ఆలోచించు.

చ...తన దివ్యమతిం బరికించి కాంచి రూ, ఉం సె
సమయంబు దప్పఁగఁ గడుం గుటిలాత్ముఁడ
వైతి పాయెదక్ భార శాం ౧ ౨౫౧

(పరీక్షించు అని ४ ర)

క ప్రమదంబాగఁగఁ బరింపు పరికించి తగక్
వైజ. ౫ ४3 సీతారా 3 ४ర

४. వెదకు, అన్వేషించు.

సీ...వెదకి నారసి రోసి వెలచె సెమక్కె, బ
కించెను దశవె పరసె నంగ నన్వేషించె
ననుటకు వెలయుచుండు ఆం భా 3 ౧౭౭

క పాతాళలోక మంతయు, బాఁతిగ శోధించి
చూచుచుఁ బరికించి యతి, ప్రీతిగ నాతుర
గముఁ గొనిఁ రేతెం దని వ్యస్తిపాద
మిచ్చుచుఁ బసపక్. భా.రా. బాల. ४0४

సీ. అని గర్భగృహంబెల్ల నల్లనఁ బరికించి
లెస్సగా నంతరాళిండ మరసి.
విప్ర. ౫ ౬. కళా 3 ४౯.

౫. చూచు, దర్శించు

సీ. ప్రాంతభావణములు రోదచేయు నాతనిఁ బరి
కించి కుశలో క్తిఁ బలుకవలయు
ప్రబోధ. ४ ౨౪.

క. ఉదకూలము గొని రెండవ, వాయువిశేను
దీప్తప్రగహము మింఁగ పా, వరముఖ
మొందితనందిని, బరికించి దళానమందు పట
పట సొరిటిన్. ఉ. రా. 3. ౩౧.

గీ. ధూళిధూసరుఁ బరికించి రేల నిక్కు, పాతన
స్నానవిధి వృథాథర్మ్యేఁ దలఁడు.
వైజ. ౩. ౧౫౫.

౬. ఎఱుఁగు, తెలియు.

౩. పరికింపరు తేమజాతలు, తరుణుల తెగులమును
నమ్మఁ దగ దంద్రు మదిక్, పారి. ౧ ౭౩.

వ ..వందిబృందపర్యమాన బిరుదావళీ ప్రబంధ
మంథర శబ్దార్థచమత్కారంబులు పరికించుచు
నొడ్డోలగం బై కూర్చుండి
కళా ౧ ౧౧

ను పరికింపం దగు నాయనోగథము మీ భవ్య
ప్రభావంబునక్ ఉ రా ౨ ౧3౧

౮ పాటించు, లెక్కసేయు.

క ..దీనిం, పరికింపక యీ పలుకులు, తరుణీ గురు
ప్రతి నీకుఁ దగునే పలుకక్
భాగ ఆది. 3 ౧3౧

౩. పరుల కొకనింద గల్గినఁ, బరికింపవు గుణము
కాని... ౩. ౬3.

పరికిణి (ణీ) వి స్త్రీలు కట్టుకొనెడు పావడ, గాగర

ద్వి పసిడిపువ్వులరంగు పరికిణి మెఱయ.
న్య వి. ౧. ౭

పరికీర్ణము. సం విణ (అ ఆ. అ) ౧ అంతటను చల్లఁబడినది. ౨ అంతటను బర్వినది, అంతటను వ్యాపించినది

పరికీర్తనము. సం వి. అ న. ౧ చెప్పుట; పేర్కొనుట. ౨. అంతటను చెప్పుట, చాటుట. 3. పొగడుట.

పరికీర్తించే. సం. స. క్రి. ౧ కీర్తించు, (భగవన్నామాదులు) ఉచ్చరించు; పేర్కొను.

క గిరివనదుర్గములంభూను, సరిదుత్తరణంబు నభ్రుడు శ్రాద్ధవిధి సమాచరణ సమయమున పేరిం,బరికీర్తించినయతండు వడయు శుభం బులే భార అను 3 ౧౯3.

౨. పొగడు, స్తుతించు

ము. వగరత్నాకరమేఖలాకలన నీ వామాక్షి యత్యంతవి, ఘ్నేశ్వరకాలంబనికలంబబింబమున శశ భూచక్రముశ సాటిగాఁ, బరికీర్తిం పుచు... గాథేయోపాఖ్యానము. ౫. ౯3

పరికీర్తితము. సం విణ (అ. ఆ అ.) ౧ చెప్పఁ బడినది; పేర్కొనఁబడినది ౨ చాటఁబడినది 3. పొగడఁబడినది

పరికూటము. సం వి. అ న పూ స్తినఖము, దుర్గ ద్వారమునొద్ద నుండెడు మట్టిదిబ్బ (వా చ)

పరికృశము. సం విణ (అ ఆ అ) మిక్కిలి చిక్కినది

పరికె. వి ౧ ఒక గినుబు గడ్డ, త్రికృంగము (శ. ర.) ౨ (సం పరిఖ తె పరికె) కంద కము, అగడ్త

క పరిఖజలంబులు మెండలను సురనది నీరాడు పరికె చుట్టున నుండక, వి శకుం ౧. ౩౫.

పరికోపము. సం. వి అ పుం మిక్కిలి కోపము

పరిక్రమణము. సం వి అ న = పరిక్రమము

పరిక్రమము సం వి అ. పుం. ౧ నలుగడలఁ దిరుగుట ౨ ప్రదక్షిణముసేయుట, వలఁగొనుట. 3 విహారము, క్రీడార్థము నడచుట. ౪. క్రమము, వరుస; ఒకటి వెనుక నొకటిగా వచ్చుట.

పరిక్రమసహము. సం. వి. అ. పుం—పరిభ్రమణ మును సహించునది—ఛాగము, మేఁక. (త్రి.ని.)

పరిక్రమించే, సం. అ. క్రి. ౧. బయలుదేఱు, నిర్గమించు...

వ. అని పరిక్రమించి వెలిపాళెంబుగట్టుకడపటగుటకారుకుటీరవాటికఁ బ్రవేశించి క్రీడా. ౭౩.

(పరిక్రామ్యత్, పరిక్రామకుఁడు మొ. అతిక్రామ్యత్, అతిక్రామకుఁడు. మొ. వాని వలె గ్రహించునది)

౨. సంచరించు.

వ అని బహుప్రకారంబుల బహుమానతత్పరుం డగుచు నటఁ బరిక్రమించి ..

హరి. ఉ. ౬. ౧౪. (క్రొత్తప్రతి. పా)

పరిక్రయణము. సం. వి. అ. న. = పరిక్రయము.

పరిక్రయము. సం వి అ. పుం. ౧. వినిమయము. సరకులమార్పు, వస్తు విచ్చి వస్తువు పుచ్చు కొనుట ౨. కూలి, వేతనము. 3 జీత మిచ్చి పనిచేయించుకొనుట ౪ ధన మిచ్చి చేసి కొన్న సంధి

శ్లో కోశాంశేనార్ధకోశేన సర్వకోశేన వా పునః, శిష్టస్య ప్రతిరక్షార్థం పరిక్రియ ఉదాహృతః॥ హితో. ౧. ౧౨౨.

౫ క్రయము, కొనుట.

పరిక్రాంతము. సం. విణ. (అ. ఆ అ.)౧. ప్రదక్షిణము చేయఁబడినది. ౨. సంచరించినది. (ప్రదేశము. మొ.) వి. అ. న. = పరిక్రాంతి.

పరిక్రాంతి. సం. వి. ఇ స్త్రీ. పరిభ్రమణము చుట్టును తిరుగుట

పరిక్రియ. సం. వి. ఆ. స్త్రీ. ౧. (అగడ్త, వెలుఁగు మొ) చుట్టువాఱుట; చుట్టుకొనుట, వేష్టనము. ౨. (నాట్యోక్తి) బీజమును విపులముగా చేయుట.

పరిక్రీడించు. సం. అ. క్రి. క్రీడించు, విహరించు.

వ...అప్రతిమప్రభావ బీజంబులు వెదవెట్టునవి యును నై పరిక్రీడించు వనక్రోడంబులును...

హ. న. కి. ౩౭.

**పరిక్రీతము** సం. విణ. (అ. ఆ. అ.) క్రీతము, కొనఁబడినది.

**పరిక్లాంతము** సం. విణ. (అ. ఆ. అ.) బడలినది, డస్సినది.

**పరిక్లిష్టము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి క్లేశము పొందినది. వి. అ. న. మిక్కిలి క్లేశము.

**పరిక్లేదము** సం. వి. అ. పుం. తడి, చెమ్మ.

**పరిక్లేశము** సం. వి. అ. పుం. మిక్కిలి బాధ, మిక్కిలి క్లేశము.

**పరిక్వణనము** సం. విణ. (అ. ఆ. అ.) బిగ్గర మ్రోగునది. వి. అ. న. పెద్దధ్వని.

**పరిక్షతి** చూ. క్షతి.

**పరిక్షయము** సం. వి. అ. పుం. 1. తొలఁగుట, క్షీణించుట. 2. నాశము, చేటు. 3. నాశము చెందుట.

**పరిక్షామము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి చిక్కినది, బక్కచాలినది.

**పరిక్షాళనము** సం. వి. అ. న. కడుగుట.

**పరిక్షితుఁడు** సం. వి. అ. పుం. అభిమన్యుని పుత్రుఁడు.

ఉ. ఉత్తర యుద్ధ గర్భమున నుండి భవజ్జనకుండు పూరుషం గోత్తరుఁ డాదిగా జగుణ రాగి పరిక్షితుఁ డుద్భవించె.

భా. అశ్వ. 3. 66.

**పరిక్షిత్తు** సం. వి. త్. పుం. చంద్రవంశపు రాజులలో నొకఁడు (అభిమన్యుని కొడుకు, జనమేజయుని తండ్రి).

గీ. అర్జునకులము పరిక్షీణమైన జనన, మొందెఁ గాన నితఁ డభిమన్యునందనునకు, నర్థ మగు పరిక్షిన్నామ మనిరొగిఁ గృష్ణుఁ, దఖిలజను లెల్ల విశ్రుతధీరబాధ. భార. అశ్వ.

**పరిక్షిప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చుట్టు విసరఁబడినది, నలుగడలఁ జిమ్మఁబడినది నలు ప్రక్కల చుట్టఁబడినది. 3. త్యక్తము, విడువఁ బడినది.

**పరిక్షీణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. అగ్గిన వాఁడు, చిక్కినవాఁడు, క్షీణించినవాఁడు. 2. నశించినవాఁడు. 3. నిర్ధనుఁడు, పేదపడిన వాఁడు.

**పరిక్షీబుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి మత్తుగొన్నవాఁడు.

**పరిక్షేపము** సం. వి. అ. పుం. 1. చిమ్ముట, చుట్టును పూసుట. 2. విత్తుట. 3. చుట్టుకొనియుండుట, అగడ్త. 5. త్యజించుట, విడుచుట. 6. శ్రోత్రాదీంద్రియము. 7. హస్తిపాద పాశ్వము, ఏనుఁగుకాలి ప్రక్క. (వై. ని.)

**పరిఖ** సం. వి. ఆ. స్త్రీ. —చుట్టును త్రవ్వఁబడినది.— 1. అగడ్త, ఖేయము. 2. అంబుధి, సంద్రము. 3. భూభృత్తు, పర్వతము (శ. ని.)

**పరిఖాతము** సం. వి. అ. న. 1. పరిఖ, అగడ్త. 2. (నాఁగేలు, బండిచక్రము మొదలైనవి) చాలు, గాఁడి. 3. చుట్టును త్రవ్వుట.

**పరిఖిన్నుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) దుఃఖితుఁడు, మిక్కిలి ఖేదము నొందినవాఁడు.

**పరిఖేదము** సం. వి. అ. పుం. 1. బడలిక, అలసట. 2. ఖేదము, దుఃఖము.

**పరిఖ్యాతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చెప్పఁబడినది. 2. ప్రసిద్ధి నొందినది.

**పరిఖ్యాతి** సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రఖ్యాతి, ప్రసిద్ధి. 2. చెప్పుట.

**పరిగ** వి. మత్స్యవిశేషము.

ఆ. పరిగ పెట్టి రొయ్య పరిగ యుంగిలికము.

ద్వా. 1. 221.

పరిగణన. సం. వి. అ. స్త్రీ. ౧. ఎన్నుట. లెక్కించుట; అంతయు లెక్కించుట. ౨. తలఁచుట, ఎంచుట.

పరిగణనము. సం. వి. అ. న.=పరిగణన.

పరిగణించు. సం. స. క్రి. ౧ ఎన్ను, లెక్కించు,

గీ. తపములును యజ్ఞములు నీవు ధర్మములుగఁ, బలికితివి యిది యార్యసంభావనీయ, పదము లగు కర్మములలోనఁ బరిగణింపఁ, బడవొకో వేదశాస్త్ర తత్పరులచేత.

భార. శాం. ౫. ౨౩౧.

౨. తలఁచు, విచారణచేయు.

క. ధరణిని గృతప్రతిజ్ఞా, పరిపాలనదక్షుఁ డెందుఁ బరమోత్కృష్టుం, డరయంగ నిదియ ధర్మువు, పురుషునకుం బరిగణింప భూరిప్రాభవ.

భా. రా. యు. ౧౭౧౭.

పరిగణితము. సం విణ. (అ. ఆ. అ.) పరిగణింపఁబడినది

పరిగతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వేష్టితము, చుట్టఁబడినది. ౨. పరివ్యాప్తము, అంతటను వ్యాపించినది. ౩ గతము. కదలిపోయినది. ౪. జ్ఞాతము, తెలియఁబడినది.

శ్లో. ప్రథమపరిగతార్థస్తం రఘుస్సన్నివృత్తిం

సం. రఘు. ౭ ౭౧.

౫ చేష్టితము, చేయఁబడినది ౬. స్మృతము, తలఁచుకొనఁబడినది. ౭. విస్మృతము, మఱవఁబడినది ౮. ప్రాప్తము, పొందఁబడినది. ౯. చుట్టును ద్రిమ్మరినది, అంతటను దిరుగునది.

పరిగదితము. సం. విణ. (అ. ఆ. అ.) పూర్తిగాఁ జెప్పఁబడినది. వి. అ. న. పరికథనము, పూర్తిగాఁ జెప్పుట.

పరిగమనము. సం. వి. అ న. ౧. చుట్టుకొనుట. ౨. పర్వుట, వ్యాపించుట. ౩. పొందుట. ౪. తెలియుట.

పరిగమము. సం. వి. అ. పుం. = పరిగమనము.

పరిగర్హణము. సం వి. అ న మిక్కిలి నిందించుట.

పరిగళితము. సం. విణ (అ ఆ అ.) మిక్కిలి గళితమైనది

పరిగహనము. సం విణ. (అ ఆ అ.) మిక్కిలి గహనమైనది

పరిగాఢము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి గాఢమైనది.

పరిగృహీతము. సం విణ. (అ. ఆ. అ.) ౧. స్వీకృతము, కైకొనఁబడినది. ౨. పట్టుకొనఁబడినది. ౩ ఒప్పుకొనఁబడినది, అంగీకరింపఁబడినది. ౪ పెండ్లాడఁబడినది.

పరిగృహ్యా. సం. వి అ. స్త్రీ. పాణిగృహీతి, పెండ్లాడఁబడిన స్త్రీ

పరిగె(గియ). వి. వృక్షవిశేషము.

సీ. చక్కెర గుడితరాగుడుదిక్కునఁ బరిగె చెట్టున్నది దానికి నుత్తరమున, ద్వా. ౫ ౧౯౪.

వ ...పరిగె పక్కె పలుకురు రేఁగు తేము పులుగుడు గురివెంద యీఁదు గేదంగి...మొదలగు పాదపము...  మనుచ. ౪. ౩౭.

౨. క్షుద్రమత్స్యము, మత్స్యవిశేషము

గీ. అల్లిదము నుప్పుచేఁపయు గొల్లదొండు, పరిగె రొయ్యాదియగు మీలఁబట్టు వలఁదు

హంస. ౪. ౧౬౭.

౩. కోసిన చేనిలో దిగఁబడిన వెన్ను.

ఆ. ఇంటియాలు విడిచి యిల జారకాంతల వెంటఁ దిరుగువాఁడు వెఱ్ఱివాఁడు, పంట చేను విడిచి పరిగె యేరినయట్లు...

వేమన. ౧. ౭౪.

క్రి. విణ. శీఘ్రము. (చి. వి. శ. ర.)

**పరిగొ(కొ)ను.** అ. క్రి. (√ పరి) బారుతీరు, బారుకట్టు
చ. పరిణత దివ్యగంధఫలభార సముత్కటకదళీపరం
పరా, పరివృతకాయమానములఁ బర్వు ఫలా
వళిఁ జూచి పైపయిన్, బరిగొనివచ్చు రాజ
శుకపంక్తుల చొప్పున నొప్పు...భూరి హరి
న్మణితోరణావళుల్ వసు ౫. ౬ ౫.
(ఆంధ్ర భూపాలు సేన) చ పరిగొని వచ్చి
యాదవులపట్టణ ముక్కటఁ జుట్టుముట్టి...
ఉ. హరి. 3 ౨౫
వ ... ఉటజప్రఘాణంబుల వేదిడింభంబులు
సంభ్రమంబున నక్కడక్కడ జాతి పరిగొను
కామధేనుధన్యధారా సారంబులు చవి
గొని... వాల్మీ ౨ ౬౪.
౨. పరివేష్టించు, వలయాకారముగ చుట్టునిలుచు.
చ. కరముల పూఁపు లాఁడుకొని కన్నెలు
చన్నులజంటి కొండొరుల్, పరిగొని విల్వ
వసు 3 ౧౫౬. ఆం. భా 3. ౧౧౪
3. చలపట్టు
చ. కురుబల మేఁగుదెంచె నవె గోవుల బిట్టలఁ
బట్టి దానిపై బరిగొని శౌర్యసంపదయు
బాహుబలంబునుఁ జూపఁబూని యే, వరిగె
ద నట్టె
భార. విరా. ౪ ౨౦
చ. ఇరువురు రక్కసుల్ సవన మెప్పుడు సే
నారఁగొంటి నంతలోఁ, బరిగొని వచ్చి వేది
కలపై రుధిరంబులు సల్లి...
భా. రా. బాల ౧౪౨.
క...ఒక యినుపద్రుద్దునఁ, బరిగొని యొక్కన
తెంకిపట్లఁ బడుముచున్.
అచ్చ. రా యు. ౨౪౪.
౪. కవియు, పడు.
వ...ప్రజాపతినికరంబు...కాంచీకు లై కను
కనింజని సకలభువనాధీశ్వరుపైఁ బరిగొని
శి. సం. ౨. ౨౦౯.
౫. దండువెడలు
క అరవాలు గొనక వెట్టుగఁ, బరిగొని యుక్కు-
డీఁది పగలపై నడరుట. .
భార. శా ౧ ౨౩
వ ఇట్లఖిలగుణ పరివృంహితుండై గణాధీశ్వరుం
డతిరయంబున దక్షప్రజాపతిపైఁ బరిగొని
దక్షాధ్వరావాసంబు గని...
శి సం ౨ ౧౯౯ ౬ ౪౭౦
౫. అతిశయించు, అధికమగు
ద్వి. హరిభక్తనికర దయామృతవృష్టి, పరిగొని
కురియఁ దొప్పునఁ దోఁగితోఁగి
బస. పు. ౨. ౧౬౭
౬ ఉత్సాహయుక్తుఁడగు.
ద్వి. విరిదమ్మివాసన విహరించుకేఁటి, పరిగొని
సుడియునే బబ్బిలివిరుల
బస పు 3 ౨౧. పం
ద్వి. పరిగొనివచ్చుచోఁ బురవీధిభవులు
బస పు. ౪ ౧౬. పం.
స క్రి చుట్టుముట్టు
సీ తిరిగినఁ బోవీక పరగొని యున్నింట నద
గంటఁ బొదిలోన దాఁగి యాఁగి
హరి పూ. ౬. ౧౬౫.
చ...చొచ్చె బిసాంతర మాతఁ డందునం, బరి
గొని యుగ్రవృత్తి నది పట్టెఁ జలంబున నమ్మ
హాత్మునిన్ భార. శాం. ౫. ౧౩౦
ఉ గురుతరవిక్రమస్ఫురణఁ గోటుల సంఖ్య
మహోగ్రకింకరుల్, పరిగొని పాపకర్ములను
బట్టి కరంబులు గూడఁ గట్టి...
రుక్మాం. ౧. ౧౬౬.

**పరిగొలుపు.** స. క్రి. (√ పరిగొను) హెచ్చు
చేయు, అధికముచేయు.
క. ధర దుష్టసఖులగుణములు, వెరవున కేపుని
కేంచు చేయుట కప్పు, బ్బరిగొలుపుట
మర్మాంతర పరిహాసము సేయుచునికి పంకజ
వదనా. కేయూర. 3. ౨౯౪.

పరిగ్రహణము. సం. వి. అ. న. పరిగ్రహించుట

పరిగ్రహము. సం. వి. అ. పుం. ౧. పట్టుకొనుట; ౨ స్వీకారము, కైకొనుట; పుచ్చుకొనుట ౩. (పరిగ్రహార్హమైనపదార్థము) ధనము, అలంకారము, కానుక మొ

శ్లో. కుంభయోనిరలంకారం తస్మై దివ్యపరిగ్రహమ్ దదౌ ..సం. రఘు. ౧౫ ౫౫. (పరిగృహ్యత ఇతివ్యుత్పత్త్యా దివ్యపరిగ్రహం-దివ్యాభరణపరిగ్రాహ్య ఇత్యర్థః అని. మల్లి. వ్యాఖ్య)

౪. పెండ్లాము, భార్య. ౫ పరిజనము, పరివారము ౬. ఉపకరణము, సాధనము ౭. గ్రహించుట, తెలిసికొనుట ౮ శాపము. ౯ సంచిమొదలు, మూలము ౧౦. గ్రహణము, ఉపరాగము. ౧౧. శపథము, ఒట్టు ౧౨ సేన వెనుకటిభాగము

పరిగ్రహించు. సం. స క్రి ౧. పుచ్చుకొను, ప్రేమతో పుచ్చుకొను

వ .సకలమహీరాజ్యవిభవం బంతయు సమర్పించినం బరిగ్రహించి యయ్యగ్రజుండు రాజ్యంబు చేసి. మార్క. ౧. ౧౬౩

౨. స్వీకరించు, కైకొను

చ...భవదీయపాదపంకజసం సేవించి మీవలన్ దారుణపాపము వాపికొందు నేననుమదిని వచ్చినాఁడ సదయుం బగుచూడ్కిఁ బరిగ్రహింపవే. భార. శాం. ౩. ౩౪౯

౩. పట్టుకొను

చ...మీ, సకియవివాహవేళఁ బరకాపనుపాణిఁ బరిగ్రహించుచో, వెంకమున బున్నమంచు నహిగ్రహించిన నట్లు భయంబుచెందునో హర. ౪. ౭౬.

పరిగ్రహీత. సం. విశే. (బు. స్త్రీ. బు.) పరిగ్రహించువాఁడు, వి. బు. పుం. ౧. పెనిమిటి, భర్త. ౨. పెంచుకొను తండ్రి.

పరిగ్లానము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి బడలినది, మిగుల డస్సినది.

పరిగ్లాని. సం. విశే. ఇ. స్త్రీ. మిక్కిలి బడలిక, మిక్కిలి డయ్యుట

పరిఘ. సం వి ఆ స్త్రీ=పరిఘము

ద్వి. పరిఘల పరిఘలఁ బట్టసంబులను.

రం రా యు. ౪౭౬. పా. ౯. పం.

పరిఘటించు. సం స. క్రి. కలిగించు, చేయు.

సీ చిటచిటార్భటి నేత్రి శిఖి నిప్పు లాపొర్లఁ బడ నఖాంతరహాతుల్ పరిఘటించి

సమీర ౬. ౧౬౦.

పరిఘట్టన. సం వి అ. స్త్రీ=పరిఘట్టనము

పరిఘట్టనము. సం వి అ న ౧. చుట్టును గదల్చుట ౨. చుట్టును ఒత్తుట. ,౩ మిక్కిలి కొట్టుట, గట్టిగా మోదుట.

పరిఘట్టించు. సం. స. క్రి ౧ గట్టనచేయు, గిట్టించు. ౨ మోదు, కొట్టు

వ...పరిఘంబులఁ బరిఘట్టించియు ముసలంబుల మోదియుఁ గుంతంబులఁ బొడిచియు

భా. రా. యు ౧౭౪౬

పరిఘము. సం. వి అ పుం. ౧ లోహబద్ధల గుదము, ఇనుపకట్లగుదియ ౨ ఇనుపగుదియ, లోహమయ లగుడము. ముద్గరము. ౩. కూలాయుధము ౪ అర్గళము, తలుపుగడియ; ప్రతిబంధము, అడ్డు

శ్లో ప్రత్యపద్యత తధేతి రాఘవః ప్రాఞ్జలిశ్చ విసర్జ సాయకమ్, భార్గవస్య సుకృతోపి సోభవత్ స్వర్గమార్గ పరిఘోదురత్యయః.

సం. రఘు. ౧౧. ౮౮. (పరిఘః = ప్రతిబంధః అని మల్లివ్యాఖ్య)

౫. అస్త్రము. ౬. (జ్యోతి) పందొమ్మిదవ యోగము. ౭. ప్రాకారము. ౮. కోట బుజ్జ

లోహము కాని గదము ౯ గృహము ౧౦ కలశము, కలశ ౧౧ కాచఘటము, గాజుకుండ ౧౨ చంపుట, కొట్టుట, దెబ్బ ౧౩ మూఢగర్భము (వై ని)

పరిఘూర్ణించు సం అ క్రి ఎదురాడు

ద్వి గగనంబుతోఁ బరిఘూర్ణించు నడుము
ద్వి పారిశ్చ ఉ ౩౫౨ పం
క మగతనము పెంపఁబూనియుఁ, బగ దేమియు
లేని చోటఁ బరిఘూర్ణింపం, దగ దతనికి

ద్వా ౪ ౩౬

పరిఘాతనము సం విణ (అ ఆ అ) అంతటను కొట్టునది వి. అ వ అంతటను కొట్టుట పుం పరిఘము, ఇనుపకట్ల గుదియ

పరిఘాతము సం వి అ పుం ౧ హననము, కొట్టుట, చంపుట ౨ పరిఘము, ఇనుపగుదియ

పరిఘోషము సం వి అ పుం ౧ ధ్వని, పెద్ద ధ్వని ౨ ఉఱుము ౩ అవాచ్యము, వచింపఁదగని మాట, నిందావచనము, సైగచేఁ దలిపెడుమాట (శ ర)

పరిచయనీయము సం విణ (అ ఆ అ) ౧ ఎఱుఁగఁదగినది, తెలియఁదగినది ౨ అభ్య సింపఁదగినది ౩ ప్రోగుచేయఁదగినది

పరిచయము సం వి అ పుం ౧ ప్రోగు సేయుట ౨ స్నేహము, మచ్చిక, ప్రణయము ౩ అభ్యాసము అవృత్తిచేయుట ౪ ఎఱుక

పరిచయించు సం అ క్రి స్నేహముచేయు, మరగు, అలవాటుపడు

సీ కాపాలికులకు సత్కారంబుఁ గావించుఁ బరిచయించును దిగంబరుల తోడ

హైమ. ౪ ౧౭౪

ఉ ఎంతయు పేర్మితోఁ బరిచయించిన విద్యల యట్లు పేరకే, దాంతరపాస్యమార్గములు నమ్మ హితాత్ముని కార్మఁ దోఁచె విక్ర ౧ ౧౯౨

పరిచరణము సం వి అ న ౧ కొలువు, సేవ ౨ చుట్టును తిరుగుట, అంతటను తిరుగుట

పరిచరము సం విణ (అ ఈ అ) చుట్టును తిరుగునది, అంతటను తిరుగునది వి అ పుం సేవ, కొలువు

పరిచరించు సం అ క్రి ౧ శుశ్రూష చేయు, సేవచేయు

వ పార్థుం డొడ్డ్కొని చని వానికి నన్నపానాది విధులం బరిచరింప సుభద్రం బంచి కన్యాపురంబు నందు నివాసంబు సేసిన

భా౦ ఆది ౮ ౧౭౦

క వాలుఎయి నడచునట్లు, శ్యాలిక నడునడ నడుంగి భయమున నియమా, ఖీలుఁదగు ఎతికిఁ బవ ళుల్, రేలును నేమజకి పరిచరించుచు నుండెన్,

భార ఆది ౨ ౧౫౪

౨ ఉపాసించు, మరల పఠించు

సీ పంచాక్షరీ మంత్ర పారాయణంబును బ్రణవ మంత్రంబును బరిచరించి కాశీ ౪ ౭౨

పరిచిత సం విణ (బు స్త్రీ బు) పరిచరించు వాఁడు, సేవించు వాఁడు

పరిచరుఁడు సం వి అ పుం ౧ భృత్యుఁడు భటుడు కావలిబంటు, చుట్టును కావలి కాచు భటుఁడు

పరిచర్య సం వి అ స్త్రీ ౧ కొలువు, సేవ ౨ పూజనము, ఆరాధనము

పరిచాయకుఁడు సం విణ (అ యుకా అ) పరిచయము చేయువాఁడు

పరిచాయి. సం విణ (న్ నీ న్) పరిచయము చేయువాఁడు

పరిచాయ్యము సం వి అ పుం యాగీయ స్థండిల విశేషము

పరిచారకుఁడు. సం. విణ. (అ రికా. అ.) పరిచర్య సేయువాఁడు, ఊడిగము చేయు వాఁడు, సేవకుఁడు.

పరిచారము. సం. వి. అ. పుం ౧. కొలువు, సేవ. ౨ సంచరించుటకైన స్థలము

పరిచారి. సం విణ (న్. ణీ న్) పరిచారకుఁడు, సేవ చేయువాఁడు

పరిచారిక. సం. వి ఆ. స్త్రీ ఊడిగపుది, సేవకురాలు

పరిచారికుఁడు. సం=పరిచారకుఁడు

పరిచారుఁడు. సం. విణ. (అ అ అ) భృత్యుఁడు, సేవకుఁడు

పరిచార్యుఁడు. సం విణ. (అ ఆ అ) పరిచర్యకుఁ దగిన వాఁడు, సేవింపఁ దగిన వాఁడు

పరిచౌళిక వి మల్లబంధ విశేషము (శ. ౯)
వ...అర్ధభ్రమణంబున గదినియుం బరిచాళిక
చేసిన. ఉ హరి. 3 ౬౮

పరిచింతనము. సం వి. అ. న. ౧ పర్యాలోచనము, బాగుగా ఆలోచించుట ౨. తలఁచుకొనుట, స్మరించుట (పరిచింతనీయము వెం చింతనీయము వెం వానివలె గ్రహించునది.)

పరిచిచ్చు. వి. (√ పరి) గ్రామాదినిరోధార్థమై పెట్టిన నిప్పు
క పురిటి మెందవు లాఁబోతులు, సూతిమూకపు విడిచి తోఁలఁగు చొచ్చిన యువిరియుం, ఒరిచిచ్చున బెదరినయవి, పరిమేసిన బండ గొనుట చు దధిపతిశిక్. విజ్ఞా ప్రా ౧౩.

పరిచితము. సం. విణ. (అ ఆ అ) ౧. ప్రోగు సేయఁబడినది. ౨. పరిచయము గలది. 3. అభ్యసింపఁబడినది. ౪. తెలియఁబడినది. ఎఱుఁగఁబడినది.

పరిచితి. సం. వి. ఇ. స్త్రీ=పరిచయము.

పరిచిన్వత్. సం. శత్ర. పరిచయము చేయుచున్న.

పరిచిన్వానము. సం. విణ (అ. ఆ. అ.) పరిచయము చేయుచున్నది.

పరిచీయమానము. సం. విణ (అ ఆ. అ.) ౧. అభ్యసింపఁబడుచున్నది ౨ తెలియఁబడుచున్నది, ఎఱుఁగఁబడుచున్నది 3 ప్రోగు చేయఁబడుచున్నది.

పరిచుంబనము. సం వి అ. న అంతటను ముద్దిడుట
(పరిచుంబనీయము వెం చుంబనీయము వెం వానివలె గ్రహించునది.)

పరిచేత. సం విణ (ఋ త్రీ ఋ.)=పరిచాయకుఁడు

పరిచేతవ్యము. సం=పరిచయనీయము

పరిచేయము. సం=పరిచయనీయము

పరిచ్యుతము. సం=చ్యుతము.
(పరిచ్యోతత్ వెం. చ్యోతత్ వెం. వానివలె గ్రహించునది)

పరిచ్యుతి. సం=చ్యుతి

పరిచ్ఛత్తు. సం. వి ద్ స్త్రీ=పరిచ్ఛదము.

పరిచ్ఛదము. సం. వి. అ. పుం. ౧. ఆచ్ఛాదనము, కప్పు. ౨. బట్ట, వస్త్రము 3. పరిజనము, పరివారము ౪. ఉపకరణము, సాధనసామగ్రి (ఛత్రచామరాది, రథ గజ తురగ పదాతాది.)

పరిచ్ఛన్నము. సం. విణ. (అ. ఆ. అ.)౧. కప్పఁబడినది. ౨. దాఁచఁబడినది. 3. సంవృతము, చుట్టుకొనఁబడినది

పరిచ్ఛిత్తి. సం. వి ఇ. స్త్రీ. ౧. ఛేదించుట. ౨. వేఱుపఱచుట. 3 (గుణదోషములను) వివేచించుట. ౪ అవధారణము, నిశ్చయము. ౫. అవధి, మేర. ౬. కొలత, పరిమాణము.

**పరిచ్ఛిన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఛేదింపఁబడినది. ౨. అవధారితము, నిశ్చయింపఁబడినది, నిర్వచింపఁబడినది. ౩. వేఱ యిడఁబడినది, కొలఁది పెట్టఁబడినది

**పరిచ్ఛేదకము.** సం. విణ. (అ. దికా. అ) పరిచ్ఛేదము చేయునది. వి. అ. పుం. పరిచ్ఛేదము

**పరిచ్ఛేదనము.** సం. వి. అ. న. ౧. ఛేదించుట ౨. విభజించుట. ౩ వివేచించుట. ౪ నిశ్చయించుట ౫ గ్రంథభాగము

**పరిచ్ఛేదము.** సం. వి. అ. పుం. ౧. ఛేదించుట ౨. వేఱుపఱచుట. ౩ (గుణదోషముల) వివేచించుట ౪ అవధారణము, నిశ్చయము, నిర్ధారణము. ౫. గ్రంథభాగము (సంధిపరిచ్ఛేదము, కావ్యపరిచ్ఛేదము వెం) ౬. అవధి, సీమ, మేర ౭ పరిమాణము, కొలఁది

**పరిచ్ఛేదించు.** సం. స. క్రి భాగించు

వ. మన్వంతరకల్ప మహాకల్పాదిభేదభిన్నంబైన పదార్థంబులం బరిచ్ఛేదింపు కాలంబు
కాశీ. ౨. ౯౭

వ. .కోపరసాభరితాకుంచిత భ్రూలతార క్తనయనాస్ఫురితాధర యగుచు గిరినందన పరిచ్ఛేదించి. కు. సం. ౬. ౬౭.

**పరిచ్ఛేద్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧ అంతటను ఛేదింపఁదగినది ౨ అవధార్యము, నిశ్చయింపఁదగినది. ౩. పరిమేయము, కొలఁది పెట్టఁదగినది (పరిచ్ఛేదనీయము, పరిచ్ఛేత్త వెం ఛేదనీయము, ఛేత్త వెం వానివలె గ్రహించునది.)

**పరిజనము.** సం. వి. అ. పుం. ౧. పరివారము, బలఁగము; చెలికత్తెలు లోనగు జనము. ౨. భృత్యుఁడు, సేవకుఁడు.

**పరిజయ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) అంతటను జయించుటకు శక్యమైనది (దేశాది)

**పరిజల్పితము.** సం. వి. అ. న. ప్రభువుయొక్క నిర్దయత్వశాఠ్యాదుల నుపపాదించు మూలమునఁ దన సేవ్యతను వ్యక్తీకరించుట. ఇది దశాంగములు గల చిత్రజల్పములలో రెండవ జల్పనము

శ్లో. ప్రభోర్నిర్దయతా శాఠ్యచాపలా ద్యుపపాదనాత్ స్వవిచక్షణతా వ్యక్తిర్భంగ్యా స్యాత్పరిజల్పితమ్. ఉజ్జ్వలమణి

**పరిజేయము.** సం. విణ. (అ. ఆ. అ) జయింపఁదగినది (ఇంద్రియాది)

**పరిజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ = పరిజ్ఞానము

**పరిజ్ఞప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧ పూర్ణజ్ఞానము. ౨ పూర్ణస్మృతి

**పరిజ్ఞానము.** సం. వి. అ. న. పూర్ణజ్ఞానము, నిండు తెలివి

**పరిజ్ఞేయము.** సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా గ్రహింపఁదగినది, తెలిసికొనఁదగినది.

**పరిజ్మఁడు.** సం. వి. న్. పుం. ౧ చంద్రుఁడు ౨. అగ్ని ౩ వాయువు. (శ. ని.)

**పరిడీనము.** సం. వి. అ. న. వలయాకారముగా తిరుగుచు ఎగురుట. (ఇట్లే. పరిడీనకము)

**పరిభవము.** వి. (సం. ప్రథిమా. క. పరిటవ, పరుటవ = విస్తృతి) అతిశయము, విశేషము (శ. ర.)

ఆధిక్యము, గొప్పతనము.

(వ్యవ) స్వాములవారు పరిభవముతో కంచేసియున్నారు.

క. దొర కట్టున కూరు కట్టిదొ, యురు దాహవిడుదలున్న హావణికలు లుపా, పరిభవము నింద్రభోగము దొరకెను దమ కనికూరకుండి కూకొరడల్. విజ. వి. ౩. ౧౬౯.

**పరిభవించు.** స. క్రి. (శ. రత్నాకరము. [illegible] విశు = వ్యాపింపఁజేయు; అవరముగాఁ (చెప్పు)

౧. అతిశయించు, మీఱు.

సీ. తపనేందు శింజినీ టంకార రవములు భట
సింహనాదంబుఁ బరిభవింప.
భాగ. ౭. ౩౭౯.

౨. ధరించు, వహించు, పూను.

గీ. పసిఁడి గిలకల చేర్కోలఁ బరిభవించి ..
వారువంబులఁ బఱపె దుర్వార లీల,...
కాశీ. ౩. ౧౨.

సీ. రాణించు జాతివజ్రాల మేదలడాలు పండు
వెన్నెలచెన్నుఁ బరిభవింప...
దశ. ౧. ౨౭౨.

౩ ఒనర్చు, చేయు, కావించు. (నదపు. శ ర.)

ఉ. వేదవిభాగముం బరిభవించిన పుణ్యుఁడు
పేర్కొఁ బూన్చె బి,ల్వీదళపూజనంబు...
భీమ. ౨. ౪౩

గీ...దిగ్భాగములయందు పీనికీర్తి పద్మలోచన
నృత్యంబు పరిభవించు. ౫ ౧౪౧.

౪. వచించు, పలుకు.

సీ. పరిభవింతు ప్రబంధపరమేశ్వరుని శేవ మూర్తి
వైచిత్రి కొక్కొక్కమాటు.
కాశీ ౧. ౧౩

౫. అతిశయింపఁ జేయు, వ్యాపింపఁ జేయు.

సీ. పండువెన్నెలలేటఁ బరిభవింపఁగరాద నగవు
మొల్కడుంబిరి మెంగములందు.
పాండు. ౧. ౧౧౪.

సీ. కలధౌతపాత్రలఁ గాలాగురుచ్ఛేద బహుల
ధూమంబులఁ బరిభవించు కాశీ. ౧. ౪౪.

అ. క్రి. వర్తించు, ఉండు.

గీ. అట్లు ధర్మసభల నింతులతోఁ గూడి పరిభ
వింపఁ జేడు భ్రాంతి నొంది
భాగ. ౭. ౪౯౧.

**పరిభవిల్లు.** అ. క్రి ప్రవర్తిల్లు, నడచు. (శ. ర.,

సీ పరమపావనమూర్తిఁ బరిభవిల్లిన మీరు భువ
నప్రోథంబుఁ గైకొనక యున్న.
చంద్రా ౪. ౫౧.

౨. అతిశయించు, హెచ్చుగు

గీ. భావజవికారములు పెడుఁ బరిభవిల్ల. భాగ.
౭. ౭౨౦. (శ. ర.)

3 ఒప్పు, శోభిల్లు.

సీ తపనీళ్లఁ గొలఁకి నడకెను బరిభవిల్లె గ్రామపు
వంటిలఁ దురంగలించె .. ననంగ, నొప్పు
నప్పాటగాఁ జెప్పఁబడును.
ఆం భా. ౩. ౭౩.

సీ. తనకీర్తి వర్తిక ఘనతరబ్రహ్మాండ భవన
భూములు గొండ్లిఁ బరిభవిల్ల వైష. ౧. ౯.

౪ వ్యాపించు

సీ మెఱసి కార్తస్వని యిరు మూఁపుపై నిడినట్టి
పదముల కాంతులు పరిభవిల్ల.
భాగ. ౭. ౨౧౭.

**పరిణతము.** సం. విణ. (అ ఆ అ.) ౧. (అంతటను) వంగినది. ౨. ముదిసినది (వయస్సు) ౩. పరిపాకము పొందినది, పక్వమైనది, పండినది. (జ్ఞానము, పండు, వెన్నెల, మనస్సు. మొ) ౪. అరిగినది, జీర్ణించినది (ఆహారము) ౫. పరిణామము నొందినది, మాఱి రూపాంతరము నొందినది. ౬ ముగిసినది. సమాప్తము. వి. అ. పుం. కొమ్ములతో అడ్డముగా పొడుచు ఏనుఁగు

**పరిణతి.** సం. వి ఇ. స్త్రీ. ౧. పరిణామము, పరిణమించుట. ౨. శేషము. ౩. అవసానము. ౪. పరిపాకము. (వాచ.)

**పరిణద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. (చుట్టు) కట్టఁబడినది. ౨ విశాలము, విరివి యైనది.

శ్లో. కవాటవక్షాః పరిణద్ధకంధరః
రఘు. ౩. ౩౪.

పరిణమనము. సం. వి. అ. న పరిణామము, పరిణమించుట

పరిణమించు. సం అ. క్రి ౧. మాఱు, వికారము నొందు.

సీ మంజాల మంజరీ మహిత సౌభాగ్యంబు పరివృత్తిఁ జెందవృత్తిఁ బరిణమింప

మనుచ. ౨. ౯౭.

వ పురుషునిం జెంది పురుషునియందు రేతోరూపంబునం బరిణమించి యోషిత్కుక్షిం బడి యందు గర్భం బై పాదలి క్రమ్మఱ జీవత్వంబునం జన్మించు .

కవిక. ౫ ౧౦౦.

౨. లయించు, లీనమగు.

వ...ఉత్క్రాంతిరూపం బైన మరణ దశయందు ప్రాణంబులు దనయందుఁ దాను భూత తన్మాత్రలయందుఁ దన్మాత్రంబులు పరమాత్మయందును బరిణమింప. .

కవిక ౫ ౧౦౦

౩ క్రి స క్రి సంతోషించు

వ అనిన సచ్చాతుర్యకిం బరిణమించి ధరణి రమణుం డారీతి రత్నమాలిక యతని యందుంత నిడి ద్వా ౪ ౨౨౨

సీ పరిణమించిరి ధరామరపురంధ్రీ హస్త ఘటితచేలాంచల గ్రంధికలన మనుచ. ౫ ౯౫

ఆ. కపటమూర్తి కెంత కాలంబునకు నైన, సంతసింప జేసి జలజగర్భ, చిరతపస్సమాధిఁ జెంది విసర్గేచ్ఛ, మెలఁగునిష్టుఁ బరిణమింతుఁగాని. భాగ. ౨. ౨౭౨.

స. క్రి. సంతోషపెట్టు, అలరించు

ఉ...అవంతిరాయడు, నిర్విలంబనగు నా పరిణమించి యుత్సుకత నొందె...ద్వా. ౯ ౩౮

పరిణమత్, పరిణామ్యము, మొ. నవుత్, శాబ్ద్య.

పరిణయనము. సం. వి. అ వ. వివాహము, పెండ్లి

పరిణయము. సం వి అ పుం. వివాహము, పెండ్లి.

పరిణయించు. సం స. క్రి. వివాహమగు, పెండ్లాడు

వ నీ సహోదరికిం బుట్టిన నీలకేశుండు నీసుతం బరిణయించి యుప్పాతాళ లంకారాజ్యంబు నకుఁ బట్టభద్రుం డై పొగడం గలవాఁడు

మై ౨. ౧౩౯

సీ ఖచర వల్లభుఁ డొక కనకవతీసంజ్ఞఁ బరగెడు కన్యకఁ బరిణయించి, ప్రీతి సంధిల్ల జీమూతవాహుం దనఁదగునట్టు పుత్రరత్నంబుఁ బడసె ద్వా. ౫ ౯౧.

పరిణహనము. సం వి అ. న చుట్టుకు కట్టుట

పరిణామకము సం విణ (అ మి కా అ) మార్పు కలిగించునది, పరిణామమును కలిగించునది

పరిణామదర్శి. సం. విణ (న నీ న) ఏకార్యము చేయఁగా నెట్టి ఫలము గలుగునో కనుఁగొనువాఁడు, దూరదర్శి, కార్యపర్యవసానము ఎఱుఁగువాఁడు

పరిణామదృష్టి. సం వి ఇ స్త్రీ పర్యవసానమెఱుఁగుట

పరిణామపథ్యము. సం విణ (అ. ఆ. అ) పర్యవసానమందు హితముగా నుండునది చివఱకు మేలు చేయునది

పరిణామము. సం. వి. అ. పుం. ౧. మాఱుపాటు, మాఱురూపు, వికారము. ౨. జీర్ణమగుట, అఱుగుట. ౩. ఫలితము, పర్యవసానము. ౪. పరిపాకము, పరువు. ౫ కుది, ముగియుట ౬. ముదిమి, వార్ధకము. ౭. ఒకయర్థాలంకారము.

క. ధరిలో నుపమేయమునను, నరుదుగ సాటో
ప్యమాణ మగునుపమానం, బగియుఁ బ్రకృతో
పమేయాగా, కరముగఁ బరిణామ మయ్యెఁ
గను మెట్లన్నన్.

క సైలింప సతుల కౌఁగిటఁ, దేలుటైన దివికి
సేగు ద్రుప్తారులకును, నీలాలనిచ్చె వారెయును,
నీలాలికపేటి యోబ నృప నరసింహా
నరస ౪ ౪౦ ౪౧

౮. అడ్డముగా విసరఁబడిన యేనుఁగు కొమ్ము
దెబ్బ. (శ. ర)

పరిణామముఖము. సం. విణ. (అ ఆ అ.) పలో న్ముఖము, ఫలింప సిద్ధముగా నున్నది.

పరిణామశూల. సం వి అ న ఆహారము జీర్ణించునపుడు కలుగు మిక్కుటమైన నొప్పి, శూలరోగభేదము

పరిణామశూలము. సం = పరిణామశూల

పరిణామి. సం విణ, (న నీ న) పరిణామము గలది, వికారము నొందునది

పరిణామించే. సం స క్రి పరిపక్వము చేయు, విరక్తము చేయు

ద్వి. సేమించి మదిఁ బరిణామించుకొనినఁ,
గామించునే యెుడల్ దా మించుఁగాక.
పండితా. పురా. ౧౩౦ పా.

పరిణాయకుఁడు. సం విణ (అ. యికా అ) ౧. నడపువాఁడు, నాయకుఁడు ౨. పెండ్లాడు వాఁడు వి. అ. పుం. భర్త, పెనిమిటి

పరిణాయము. సం. వి. అ. పుం. పాచికలయొక్క సవ్యాపసవ్యప్రసారణము, సొగటాలుకదుపుట.

పరిణాహము. సం. వి. అ. పు. వైశాల్యము

పరిణాహి. సం. విణ. (న. నీ. న.) విశాలమైనది, పెద్దది.

పరిణింస. సం వి ఆ స్త్రీ. ౧ ముద్దిడుట. ౨. చవిచూచుట.

పరిణింసకము. సం. విణ. (అ. కికా. అ.) ౧. ముద్దిడునది, చుంబించునది. ౨ చవిచూచునది.

పరిణిష్ఠ. సం వి ఆ. స్త్రీ. ౧. పూర్ణజ్ఞానము, నిండు నేర్పు ౨. నిష్ఠ, స్థితి. ౩. పర్యవసానము, అంతము. ౪ పూర్ణమైన ఆసక్తి ౫ పూర్ణసిద్ధి, పూర్తిగా నెఱవేరుట.

పరిణిష్ఠితము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. సిద్ధము, పూర్తిగా నెఱవేరినది. ౨ నేర్పుకలది, సమర్థము. ౩ అత్యంతాసక్తి కలది. ౪. నిశ్చయింపఁ బడినది.

పరిణిష్ఠుఁడు. సం విణ. (అ ఆ అ.) ౧ నేర్పరి, కుశలుఁడు; సమర్థుఁడు ౨ అత్యంతాసక్తి కలవాఁడు, ఆస్థ కలవాఁడు ౩ నిష్ఠుఁడు, ఉన్నవాఁడు.

పరిణీతుఁడు. సం విణ (అ. ఆ అ) పెండ్లాడిన వాఁడు

పరిణేత. సం. విణ. (ఋ. త్రి. ఋ) వి. ఋ. పుం = పరిణాయకుఁడు.

పరిణేయుఁడు. సం విణ (అ ఆ.అ.) ౧. నడపఁ దగినవాఁడు. ౨ పెండ్లాడఁ దగినవాఁడు.

పరితపించే. సం. స. క్రి. ౧. సంతాపము నొందు, క్రాఁగు. ౨. దుఃఖించు, బాధపడు.

గీ. పలికెరో పెట్టి యుఁక నేల పరితపింప, గిరి
జతోఁ గూడి శివుఁ డీఁదఁ గ్రీడసేయ,
వచ్చినాఁ డింతలో నిందుఁ జొచ్చుపురుషుఁ,
డింతి యాఁగాక యని శాప మిచ్చినాఁడు.
ఉ. రా. ౩. ౪౨౩. (పరితాపకుఁడు. పెు. తాపకుఁడు. పెు. వానివలె గ్రహింపునది.

**పరితప్తము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కాల్పఁబడినది; కాఁగింపఁబడినది, వేఁడిమి కలిగింపఁబడినది. ౨. బాధింపఁబడినది, తపింపఁజేయఁబడినది.

**పరితప్తి.** సం. వి. ఇ. స్త్రీ. పరితాపము

**పరితము.** వి. (సం. పరభృతము) కోయిల, పికము.

సీ. విను గూడ మదనదేవుపైఁ బాటలువాడు
లేఁబ్రాయంపుఁ బరితములును
యయా. ౪. ౧౧

**పరితర్కణము.** సం. వి. అ. న. బాగుగా ఆలోచించుట, బాగుగా ఊహించుట

**పరితర్పణము.** సం. వి. అ. న. ౧. తృప్తిపడుట ౨. తృప్తిపఱచుట. (పరితర్పకుఁడు సం. తర్పకుఁడు సం. వానివలె గ్రహించునది)

**పరితర్కించే.** అ. క్రి. విచారించు, ఆలోచించు.

సీ. పంచాంగశుద్ధిగాఁ బరితర్కించెను భృంగిమతి
వాడు సెందేనిఁ బ్రతిదినంబు భీమ. ౩. ౧౪౭ (చి. ని. పా. పరిభవించుము, ద్రి. పా)

**పరి (రీ) తాపము.** సం. వి. అ. పుం. ౧. అత్యుష్ణత, మిక్కిలి వేఁడిమి ౨. బాధ; దుఃఖము, శోకము ౩. భయము ౪. కంపము, వడఁకు. ౫. నరకము

**పరితాపించే.** అ. క్రి. ౧. దుఃఖించు; బాధనొందు. ౨. సంతాపము నొందు, క్రాఁగు

వ. ఇవ్విధంబున మహావ్యథం బరితాపించుచున్న
నన్ను రూక్షేక్షణంబుల నిరీక్షించు..
కై. భా. ౪. ౨౧౧

**పరితుష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. మిక్కిలి తృప్తి, తనివి. ౨. మిక్కిలి సంతోషము.

**పరితుష్టుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి తుష్టినొందినవాఁడు, మిక్కిలి తృప్తుఁడు. ౨. మిక్కిలి సంతోషించినవాఁడు.

**పరితృప్తి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి తృప్తి

**పరితృప్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మిగుల తృప్తి నొందినవాఁడు

**పరితోషణము.** సం. విశే. (అ. ఆ. అ.) తృప్తి పఱుచునది, సంతోషపెట్టునది వి. అ. న. ౧. తృప్తి ౨. సంతోషము

**పరితోషము.** సం. వి. అ. పుం. ౧. మిక్కిలి తృప్తి, తనివి ౨. మిక్కిలి సంతోషము.

**పరితోషి.** సం. విశే. (న్. నీ. న్.) ౧. తృప్తి పొందువాఁడు. ౨. సంతోషించువాఁడు.

**పరితోషించే.** సం. అ. క్రి. సంతసించు, మిక్కిలి సంతోష మొందు.

గీ... పూజార్హ వస్తువు లప్పుడుదెచ్చి, వంతులకుఁ
గొండపాడుపుగా వైచుటయును.

మ. పరితోషించి శివార్చనాకుతుకసంబద్ధాత్ముఁ
డై లేచి.. ఉ. గా. ౩. ౨౦౨.

**పరిత్యాజి (జియి)ంచే.** సం. స. క్రి. విడుచు

వ. మంకి యివ్విధంబునం గోరెలు సచ్చినం
బుట్టిన నిర్వేదంబున సకల కామంబులం బరి
త్యజించి దేవసమం బై యుండె.
భార. శాం. ౪. ౫౪

మ. అజపక్షుం డిది పోలఁ బోల దని కార్యా
కార్య నివృత్తికిన్, నిజ మోహాంధ నకర్తృఁడై
యప్పుడు వానిం జంప నొంపం బరి, త్యజిం
యింపన్ మది బోడి ... భోజ రా. ౫. ౧౪౦.

(పరిత్యజన్, పరిత్యాజకుఁడు సం. త్యజన్, త్యాజకుఁడు సం. వానివలె గ్రహించునది).

పరిత్రస్తము. సం. విణ. (అ ఆ అ) మిక్కిలి భయపడినది, మిక్కిలి బెదిరినది.
(పరిత్రాసకుఁడు వెం. త్రాసకుఁడు వెం. వాని వలె గ్రహించునది)

పరిత్రాణము. సం. విణ (అ ఆ అ) ౧. రక్షించునది ౨. పరిత్రాతము, రక్షింపఁబడినది (పరిత్రాత,పరిత్రాయమాణము. వెం త్రాత, త్రాయమాణము. వెం వానివలె గ్రహించునది) వి అ. న. రక్షించుట

పరిత్రాణి. సం. వి ఈ. స్త్రీ త్రాయంతి,-కలుగానుఁగుకీ.

పరిదరము. సం. వి అ పుం పంటియిగుళ్లలో పుట్టురోగము (దీనివలన ఇగుళ్లనుండి నెత్తురు కాఱును.)

పరిదహనము. సం వి అ న పూర్తిగా కాల్చుట, అంతటను కాల్చుట.

పరిదానము. సం. వి. అ. న ౧ వినిమయము, ప్రతిదానము, ఒకవస్తువు ఇచ్చి మఱియొకవస్తువు పుచ్చుకొనుట. ౨ దానము, ఇచ్చుట

పరిదాయి. సం. విణ (క నీ క.) ౧ ఇచ్చువాఁడు ౨ పెండ్లికొడుక్కు యన్నగలవానికి కూఁతు నిచ్చువాఁడు. ౩. వినిమయము చేయువాఁడు
(పరిదాత వెం. దాత వెం వాని వలె గ్రహించునది)

పరిదాహము. సం వి. అ. పుం ౧. కాల్చుట ౨. తాపము, బాధ

పరిది. వి (సం. పరిధిః) సూర్య చంద్రుల పరివేషము.
సీ. పరివేషశాఖుంబు భాసిల్లుచుండుసు గుడియనఁ బరిధి దా గుడుగు నాఁగ.
అం. ఖా. ౧. ౧౨౨.

పరిదిష్టము. సం విణ. (అ. ఆ అ.) తెలియఁబడినది; చూపఁబడినది.

పరిదీప్తము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి దీప్తమైనది

పరిదృఢము. సం విణ. (అ ఆ. అ) మిక్కిలి దృఢమైనది

పరిదేవకుఁడు. సం విణ (అ ఏకా అ.) ౧ విలపించువాఁడు ౨. పశ్చాత్తాపపడువాఁడు

పరిదేవన. సం వి ఆ స్త్రీ=పరిదేవనము.

పరిదేవనము. సం వి. అ. న ౧. విలాపము, దుఃఖముతో గూడినమాట ౨. అనుశోచనము, (చేసినపని తగని దని తెలిసిపడు) అనుతాపము, పశ్చాత్తాపము

పరిదేవము. సం వి అ పుం విలాపము, ఏడుపుతోఁ గూడిన మాట.

పరిదేవి సం విణ (క నీ క) ౧ విలపించువాఁడు, ౨ పశ్చాత్తాపపడు వాఁడు

పరిదేవితము. సం. విణ (అ ఆ అ) ౧ విలపించినది ౨ పశ్చాత్తాపపడినది వి అ. న.=పరిదేవనము

పరిదృష్ట. సం. విణ (ఋ స్త్రీ. ఋ.) అంతటను చూచువాఁడు; చూచువాఁడు.

పరిద్రోణి. సం. వి. ఈ. స్త్రీ. నారికడపు పాత్రి (శ ర.)

పరిధానము. సం వి అ. న. ౧. (వస్త్రములు) ధరించుట. ౨. దోవతి, అంతరీయము, కట్టుబట్ట.

పరిధానీయము. సం. విణ (అ. ఆ. అ.) ధరింపఁదగినది, కట్టుకొనఁదగినది. వి. అ. న. కట్టుబట్ట, దోవతి.

పరిధాయము. సం. వి. అ పుం ౧ పరిచ్ఛేదము, భాగము. ౨. మడుఁగు, జలస్థానము. ౩. నితంబ ప్రదేశము, పిఱుఁదు.

పరిధారణ. సం. వి అ. స్త్రీ=పరిధారణము.

పరిధారణము. సం వి అ న. ౧ ధరించుట ౨. ధరించుట.

పరిధావనము. సం=ధావనము.

పరిధావి. సం విణ (ఇ ఈ. ఇ.) చుట్టును పరుగిడు వాఁడు

పరిధి. సం. వి. ఇ. పుం ౧ ఆవరణము, చుట్టునుండు గోడ, కంచె మొ. ౨ పరిది, సూర్యాగ్నిపరివేషము, గుడి ౩ కాంతిమండలము, వలయాకారముగఁ జుట్టును క్రమ్మియున్న కాంతి ౪ చుట్టుకొలత మేర, వృత్తక్షేత్రముయొక్క చుట్టురేఖ ౫. బండి కంటి కదకమ్మి ౬. యజ్ఞాగ్నికి చుట్టును వైచు మోదుగు మొ. వానికొమ్మ ౭. యజ్ఞమునందు పశుబంధనార్థము నాఁటిన పలాశాదిశాఖ

పరిధిస్థుఁడు. సం వి అ పుం ౧ పరిచారకుఁడు. ౨. యుద్ధాదులందు గడికి చుట్టును కాపుగా నుండు సైన్యాది; చుట్టుకొని కాచియుండు భటుఁడు; సేనచుట్టును కాచువాఁడు; చుట్టును వలయాకారముగ నిలుపఁబడిన కావలి బంటుల సమూహము

పరిధూపితము. సం. విణ (అ ఆ. అ) సుగంధద్రవ్యముతో పొగవైవఁబడినది

పరిధూమనము. సం వి అ న (వైద్యక) దప్పిగొన్నవానికిఁ గలుగు నొక విధ మగు త్రేఁపు

పరిధూయమానము. సం=పరిధూమనము.

పరిధూసరము. సం. విణ. (అ. ఆ అ) మిక్కిలి బూడిదవన్నె గలది.

పరిధృతము. సం=ధృతము.

పరిధేయము. సం విణ (అ. ఆ. అ.) ధరింపఁదగినది, కట్టఁదగినది. వి. అ న. దోవతి, కట్టుబట్ట.

పరిధ్వంసము. సం=ధ్వంసము. (పరిధ్వంసితము మొ. ధ్వంసితము మొ. వానివలె గ్రహించునది.)

పరినందనము. సం విణ. (అ ఆ అ) సంతోషపెట్టఁబడినది వి. అ. న. సంతోషపెట్టుట.

పరినిర్వపణము. సం వి. అ న పంచియిచ్చుట, కొలుకొలుగా ఇచ్చుట

పరినిర్వాణము. సం. విణ (అ ఆ అ) పూర్తిగా ఆఱినది, పూర్తిగా నశించినది వి అ. న ౧ ఆత్యంతికనాశము, పూర్తిగా నశించుట ౨ నిర్వాణము, ముక్తి

పరినిర్విణ్ణుఁడు. సం=నిర్విణ్ణుఁడు

పరినిర్వృతి. సం వి ఇ స్త్రీ. పూర్ణసుఖము, మోక్షము.

పరినిర్వృత్తి. సం వి. ఇ స్త్రీ. మోక్షము.

పరినిషేవణము. సం=నిషేవణము

పరినిష్ఠ. సం=పరిణిష్ఠ.

పరినిష్ఠితము. సం=పరిణిష్ఠితము.

పరినిష్ఠుఁడు. సం=పరిణిష్ఠుఁడు.

పరిన్యాసము. సం=న్యాసము. (పరిన్యస్తము మొ. న్యస్తము మొ. వానివలె గ్రహించునది.)

పరిపంథకుఁడు. సం. వి. అ పుం. పరిపంథి, శత్రువు.

పరిపంథి. సం విణ (ఇ. ఈ. ఇ.) అడ్డగించువాఁడు, నిరోధించువాఁడు. వి. ఇ. పుం. ౧. శత్రువు. ౨. తెరువాటుదొంగ, దారికొట్టుదొంగ.

పరిపంథికుఁడు. సం॥పరిపంథకుఁడు.

పరిపంథుఁడు. సం వి అ. పుం. (త్రోవ కాచి యుండువాఁడు.-త్రోవను విడిచి ప్రక్కల నుండువాఁడు.) ౧. శత్రువు, పగవాఁడు ౨ దారి కొట్టు దొంగ.

పరిపక్వము. సం. విణ. (అ. ఆ. అ) పరిపాకము నొందినది. (చూ పరిపాకము)

పరిపణనము. సం వి అ న ౧ ప్రతిజ్ఞసేయుట ౨. పందెము కొం ఒడ్డుట

పరిపణము. సం వి. అ. పుం న మూలధనము, సంచి మొదలు

పరిపణితము. సం విణ. (అ. అ అ) ౧. ప్రతిజ్ఞాతము, ప్రతిన చేయఁబడినది

శ్లో సతతమనభిభాషణం మయా తే పరిపణితం భవతీమనానయంత్యా, త్వయి తదిది విరోధనిశ్చితాయాం భవతి భవత్యనుమ్యాజ్జనస్స కామః॥ శకు ౩ ౯

౨. ఒడ్డఁబడినది (పందెము కొం.)

పరిపతనము. సం. వి. అ న. ౧ చుట్టును పడుట; అంతటను పడుట; పడుట ౨. చుట్టును తిరుగుట, చుట్టును సంచరించుట. (పరిపతితము కొం. పతితము కొ వానివలె గ్రహించునది

పరిపత్తు. సం వి త్ పుం. పంకము, బురద (వై. ని.)

పరివత్రము. సం. వి. అ. న. భోజనము, తినుట. (వై. ని.)

పరిపరి. విణ (√ పరియ. క పరిపరి) ౧ అనేకము; వివిధము.

చ వాపోవల్, పరిపరిలాగులం గుడియఁ బట్టుచు రా వలనత్రయంబులన్, దురగము లేఁగు దెంచె... వై. భా. ౨. ౧౫.

౬. సురభిళ తులసీ పరిమళ, పరిమిళితములంగ నొనర్చి పరిపరిగతులం, గర నురుచుఁగ పతి చతురతఁ, గరకుశలత మెఱయ మాలికలు గట్టు తగన్. విప్ర. ౨. 30

క ఖురనిహతి నొంటు దుమ్మ్రుల, భరమునఁ గిరటుల తలలు పటపట పగులన్, బరిపరి గతులం దురగముఁ, బఱపెదు నెఱరౌతు నిన్ను భక్తిఁ దలంతున్ చంద్రా॥ ౧. ౩౬.

౬ పరిపరి ధూపంబుల వర, దీపల తెరల రత్న దీపవితతుల మార్లా, స్తరణములఁ బొలుచు రాత్రులఁ, బరమబుషులు నృపులు పరస బంతులు సొఁగన్ వై భా ౪ ౨౦౧

౨ మిగుల చెడినది; శుద్ధము, కలత నొందినది. (చూ. పరిపరియగు)

క్రి విణ. చిందఱవందఱ,ముక్కలు ముక్కలుగ

గీ పరిపరి యనంగఁ జిందఱవందఱ యన, సలరుచుండును గణకోర్థి మగుచు...

ఆం. భా ౩ ౬౪

జ పరిపరియగు

పరిపరియగు. అ క్రి (√ పరిపరి) శుద్ధిమగు, కలఁగు

క గిరిజాకరంబు సోఁకినఁ బరమేశుని చిత్తమెల్లఁ బరిపరి యయ్యెన్ వీర ౨ ౧౦౦

పరిపవనము. సం వి అ పుం ౧. పవిత్రము చేయుట, శుద్ధము చేయుట. ౨. ధాన్యమును చెరుగుట ౩ చెరుగు చేట

పరి(రీ)పాకము. సం వి. అ. పుం. ౧ పూర్ణిపాకము, పూర్తిగా పక్వమగుట. ౨. పూర్తిగా జీర్ణమగుట, పూర్తిగా అఱుగుట, (భుక్తాన్న పరిపాకము కొం.) 3. పరిణామము, పర్యవసానము. ౪. బుద్ధి, మనస్సు. కొం. వాని పరిపూర్ణత; నైపుణ్యము. ౫. పరువము, ఫలోన్ముఖత్వము (పండుటకు సిద్ధముగా నుండుట; ఫలము నిచ్చుటకు సిద్ధముగా నుండుట.)

**పరిపాటిని.** సం. వి. ఈ. స్త్రీ. త్రివృత. తెగడ్త

**పరిపాటలము.** సం. విణ. (అ. ఆ అ) అంత టను పాటలవర్ణము కలిగి, మిక్కిలి పాటల వర్ణము కలది. (చూ పాటలము)

**పరిపాటి.** సం. వి. ఇ. ఈ స్త్రీ ౧. అనుక్రమము, అనుపూర్వి

క. సురగురుడును శుక్రుండును, బరిపాటిగి దండనీతిఁ బలికిరి.
భార. శాం. ౧ ౧౦౬.

ద్వి. సవివఫి రొంటిడును బరలోకవిధులు, తినయు లానర్తురు తల్లిదండ్రులకుఁ, బరిపాటి దప్పించి పరలోకవిధులు, జరలించి విధి నీకు మఱఁచేయఁ బనిచె. రం. రా అయో ౧౨౨. పా ౨౨. పం

౨ పద్ధతి, విధము

గీ. వేదసారంబు సత్యంబు వినుఁడు సత్య, సార మూర్తి దమము దమసార మనఘు, లార పొత్య మీపరిపాటి నారవమున, నాదరించు నమంతుల కెందు ముక్తి.
భార. శాం. ౫ ౪౮౭.

సీ. మునిశ్రేష్ఠ లారయ్యుయ్యా పాపి చప్పుడు గానీ పరిపాటిఁ బవనంబు పట్టి వడచి.
కాశీ. ౪. ౧౨౧

3. సామాన్యము, సాధారణము.

సీ ... కూర్చుఁబో పరిపాటిఁగొంపలోఁ గూల్పక యీదుర్గమునఁ ద్రోయఁ జేల యనుచు
శుక 3 ౫౨౭

ద్వి. జనమనోహరుఁ డైన సారంగధరుఁడు, మను జేశ! పరిపాటి మనుజుండు గాఁడు.
ద్వి. తి. పా. ౪౫ పా.

(తెనుఁగునందే యీ యర్థము కనఁబడుచున్నది)

**పరిపాకము.** సం. వి. అ. పుం. అంతయుఁ జెప్పుట, సవిస్తరముగాఁ జెప్పుట.

**పరిపాలకుఁడు.** సం విణ (అ. లిం. ఆ) చక్కఁగా కాపాడువాఁడు, చక్కఁగా పాలించువాఁడు (ప్రభువు మొ)

**పరిపాలన.** సం వి. ఆ. స్త్రీ = పరిపాలనము

**పరిపాలనము.** సం. వి. అ న ౧ చక్కఁగా రక్షించుట, చక్కఁగా కాపాడుట. ౨. పోషణము, పోషించుట.

**పరిపాలించు.** సం స క్రి రక్షించు, ఏలు, కాపాడు, సత్యవ్రతాదులు రక్షించు, ప్రతిజ్ఞాదులు నిలఁబెట్టుకొను

వ తన సత్యవ్రతంబు పరిపాలింపం దలంచి...
మార్క ౧ ౩౯

**పరిపాలితము.** సం విణ (అ ఆ. అ) చక్కఁగా పాలింపఁబడినది.

(పరిపాలయ్యుఁడు మొ పాల్యుఁడు మొ వాని వలె గ్రహించునది)

**పరిపిష్టకము** సం వి అ. న. సీసము

**పరిపీడ.** సం = పీడ

**పరిపీడన.** సం వి ఆ స్త్రీ = పరిపీడనము

**పరిపీడనము.** సం. వి. అ. న ౧ పిసుకుట ౨ పిండుట, పిడుచుట, 3 బాధించుట.

(పరిపీడితము మొ పీడితము మొ. వానివలె గ్రహించునది.)

**పరిపుటనము.** సం. వి అ న. భేదనము, వేఱుపఱచుట. ౨ (వాచ) సంపుటీకరణము; కూర్చుట, కలుపుట.

**పరిపూజ.** సం. వి. అ. స్త్రీ = మిక్కిలి పూజించుట, మిక్కిలి గౌరవించుట.

**పరిపూజన.** సం. వి. అ. స్త్రీ = పరిపూజనము.

పరిపూజనము. సం. వి. అ న. మిక్కిలి పూజిం చుట, మిక్కిలి గౌరవించుట. (పరిపూజితము విణ. పూజితము విణ. వాని వలె గ్రహించునది)

పరిపూతము. సం విణ. (అ. ఆ. అ.) ౧ అత్యంత శుద్ధము, మిక్కిలి పవిత్ర మైనది ౨ చెరుగఁబడినది (ధాన్యాది)

పరిపూరణము. సం. వి అ న చక్కఁగా నిండించుట, పూర్ణ మైనదిగాఁ జేయుట

పరిపూర్ణత. సం వి ఆ స్త్రీ ఆభోగము, సంవృద్ధి, నిండు.

పరిపూర్ణము. సం. విణ. (అ ఆ. అ) పూర్తిగా నిండినది, పూర్ణ మైనది, సమృద్ధము, సమాప్తము (పరిపూరకము విణ పూర్ణకము విణ వాని వలె గ్రహించునది.)

పరిపూర్తి. సం వి ఇ స్త్రీ పూర్తిగా నిండుట ౨. సంపూర్తి సమృద్ధి; సమాప్తి

పరిపృచ్ఛ. సం. వి. ఆ స్త్రీ పరిప్రశ్నము, చక్కఁగా అడుగుట, చక్కఁగాఁ ప్రశ్నించుట

పరిపేలము. సం వి అ న. కైవర్తీముస్తకము, కైవడిముస్తె

పరిపేలవము. సం. విణ (అ. ఆ. అ) మిక్కిలి పేలవ మైనది. (చూ. పేలవము.) వి అ. న. కైవర్తీముస్తకము, కైవడిముస్తె

పరిపోటనము. సం. వి అ న. ఛేదనము, ఛేదించుట

పరిపోటము. సం. వి. అ పుం. ఒకానొక కర్ణపాళీరోగము, చెవితమ్మమీఁద బయలుదేఱు రోగవిశేషము.

పరిపోషించు. సం. స. క్రి. చక్కఁగా పోషించు, పూర్తిగా పోషించు.

పరిపోషితుఁడు. సం విణ (అ. ఆ అ) చక్కఁగా పోషింపఁబడినవాఁడు, పూర్తిగా పోషింపఁబడినవాఁడు. (పరిపోషణీయము విణ. పోషణీయము విణ. వానివలె గ్రహించునది)

పరిప్రశ్నము. సం. వి అ పుం. చక్కఁగా అడుగుట, బాగుగా ప్రశ్నించుట (పరిపృష్టము. విణ. వానివలె గ్రహించునది.)

పరిప్రాప్తి. సం. వి స్త్రీ. చక్కఁగా పొందుట, పూర్తిగా పొందుట

పరిప్రేషణము. సం. వి అ. న పూర్తిగా పంపుట, పంపివేయుట.

పరిప్రేష్యుఁడు. సం. విణ (అ. ఆ అ.) పంపఁదగినవాఁడు వి అ. పుం భృత్యుఁడు, సేవకుఁడు

పరిప్లవము. సం విణ (అ ఆ అ) ౧. చంచలము, కదలునది—౨. తేలునది వి. అ పుం ౧. పొంగిపాఱుట ౨. విప్లవము. 3. జలాదుల మీఁదుగా దాఁటుట. ౪. నీరుకోడి. (శ. ర)

పరిప్లవించు. సం. అ క్రి గంతులువైచు.

ఉ...ఇంక వారలన్, మిక్కిలి శక్తి మీఱి దిగ్భ్రమింగొద కంచుఁ బరిప్లవింపఁగన్.

దశా. ౨. ౩౬౨.

పరిప్లావి. సం. వి. న్ పుం హంసము, అంచ. (వై. ని.)

పరిప్లుతము. సం విణ (అ. ఆ అ.) ౧. వెల్లువ పొంగి పాఱినది. ౨. (జలాదులచే) తడుపఁబడినది. వి అ న ౧. గంతు, దాఁటు

పరిప్లుత. సం వి. ఆ. స్త్రీ. ౧. మదిర, సారాయము ౨. మైథునవేదనాయుక్త యగు ఆఁడుగుఱ్ఱము.

పరిప్లుష్టము. సం విణ (అ ఆ అ) దగ్ధము, కాల్పఁబడినది

పరిబ(వ)ర్హణము. సం వి అ న ౧. పరిజనము ౨. వేషము, వస్త్రాద్యలంకరణము ౩. వృద్ధి, పెనుపు, ౪. పూజనము

పరిబర్హము. సం వి అ పుం ౧. శ్వేతచ్ఛత్రాది రాజయోగ్య వస్తువు ౨. పరివారము. ౩. ఉపకరణములు, సామగ్రి ౪. ధనము ౫. కుడుపు (పిల్లవాన్ను)

పరిబృ(వృ)ంహణము. సం వి అ న పెనుపు, అభివృద్ధి

పరిబృ(వృ)ంహితము సం విణ (అ ఆ అ.) ౧. వర్ధితము, పెంపఁబడినది ౨. చేకొనఁబడినది, కూడఁబడినది
వి అ న ఏనుఁగు గీఁక

పరిభంగము. సం వి అ పుం తునకలుగా విఱుచుట, తుమురుసేయుట.

పరిభజించు. సం స క్రి సేవించు
సీ స్థిరతరం బగు తు్య్ర సింహాసనం బొప్పఁ బ్రహ్మాది మంత్రులు పరిభజింప
శుకచరిత్రము ౧. ౮౦

పరిభర్త్సనము. సం వి అ న బెదరించుట, అదలుపు

పరిభవపడు మి అ క్రి (పరిభవము + పడు) తిరస్కారము నొందు; అపజయమునొందు
క నురవరులు పెక్కువూఱులు, పరిభవపడిరి. .
కు సం ౧౨. ౯౩౧.

పరిభవపదము. సం వి అ న పరిభవమునకు విషయభూతము, పరిభవమునకు అర్హ మైనది ౩. పరిభవము కలిగించు నట్టి స్థితి

పరిభవము. సం వి. అ పుం ౧ అనాదరము, తిరస్కారము. ౨. ఓటమి, అపజయము

పరిభవి. సం. విణ (స నీ స) ౧ పరిభవించువాఁడు ౨. పరిభవము నొందువాఁడు

పరిభవించు. సం. స. క్రి. అవమానించు.
ఆ .విప్ర, రాజ! పరిభవింపఁగాదు విప్రుల కొల్వ్య, కల్పవృక్ష సేవ కరణి యధిప
భాగ అను ౨ ౧౫౧..

ఉ. తేమఱు శత్రునిం బరిభవించుట క్షత్త్రకృత్త్య మిరముం, దా మడిఁ బెట్టుకోలు సుఖతంత్రము గాదు . భార శాం ౩ ౨౨

పరిభాళించు. సం అ క్రి (√ పరిభల్ల్) కలహించు, జగడమాడు
౩ ఏగా ముందఱ గానక, చేరము మై దెచ్చుకొనుచు నీ మీసలు నా, చేరువ వడిఁ బెట్టెద విటు,లాగి రేఁ కాంగ వీరుఁ డుంకె ఱుఁగవకో
౩ నావుడు బరిభాళించెద, నీ వుండుట యెఱిఁగి కాదె యిటు చేటుగ నేఁ, గావించితిఁ బేరిఁ దగ్గ, వించుక గలిగినేని లటవటక్క లేలా. ద్వా ౩. ౯౯
క. మగతనము సెఱపఁ బూనియుఁ, బగ యేమియు లేక నూటఁ బరిభాళింపం, దగదు.. ద్వా ౩ ౩౬
(పగ గలిగింపక - పాఠాంతరము)

పరిభావనము. సం వి అ న చింతనము, ఆలోచనము

పరిభావము. సం = పరిభవము

పరిభావి. సం విణ (స. నీ స) ౧ అవమానించునది ౨ నిరాకరించునది

పరిభావితము. సం విణ (అ ఆ. అ) లోపల ధరింపఁబడినది, లోపలఁ జేరి పయినది. ౨. వ్యాప్తము ౩ ప్రకటింపఁబడినది ౪. తక్కువగా భావింపఁబడినది.

పరిభావ్యకము. సం విణ (అ ఆ అ.) పరిభవించునది.

**పరిభాష.** సం. వి. ఆ. స్త్రీ ౧ ఆలాపము, మాటలాడుట. ౨. నిందావచనము దూఱుమాట ౩. వివరణము. ౪ శాస్త్రకారులు లాఘవముకొఱకు చేయునట్టి సంకేతవిశేషము

**పరిభాషణము.** సం. వి. అ. న ౧ సంభాషణము, మాటాడుట, ఆలాపము ౨. దూఱుమాట, నిందించుట యైన దుష్టవచనము, సదూషణాపవాదవచనము, ౩ నియమము.

**పరిభాషించు.** సం. అ. క్రి ప్రవచించు, చెప్పు

వ. అని పరిభాషించి.

భార. అను ౪ ౯౬

**పరిభాసిల్లు.** సం అ క్రి ప్రకాశించు

మ ఉద్ధతిం, బరిభాసిల్లఁ జతుర్వ్యూహాధుని
చమూ భద్రప్రయాణం బిలన్

కావ్యా ౩ ౧౨౬

**పరిభిన్నము.** సం. విణ. (అ ఆ అ) ౧ చక్కఁగా భేదిల్లినది, చక్కఁగా పెటిలినది, విరిసినది. ౨. వికృత మైనది

**పరిభుక్తము.** సం. విణ (అ. ఆ అ) ౧ చక్కఁగా భుజింపఁబడినది. ౨. చక్కఁగా అనుభవింపఁబడినది. ౩ పొందఁబడినది

**పరిభుగ్నము.** సం. విణ. (అ ఆ అ) మిక్కిలి వంకరైనది, చాల వంగినది.

**పరిభూతము.** సం. విణ (అ ఆ. అ) ౧ తిరస్కృతము. ౨. అనాదృతము, పాటింపఁబడనిది.

**పరిభూతి.** సం. వి. ఇ. స్త్రీ. పరిభవము.

**పరిభూషణము.** సం వి అ. పుం ఒక దేశముయొక్క సిస్తు వంతయు కట్టుటచేత పొందఁబడిన సంధి.

**పరిభోక్త.** సం విణ (ఋ స్త్రీ ఋ) ౧ చక్కఁగా తినువాఁడు; చక్కఁగా అనుభవించువాఁడు ౨. పరిపాలించువాఁడు ౩. గురుస్వభృత్తు, గురుద్రవ్యము ననుభవించువాఁడు. (వై. ని.)

**పరిభోగము.** సం వి అ పుం ౧ అనుభవము. సంభోగము.

**పరిభ్రంశనము.** సం. వి అ న. ౧. భ్రంశము. ౨. నష్టము.

**పరిభ్రంశము.** సం వి అ పుం ౧ జాఱిపడుట ౨ తప్పించుకొనుట

**పరిభ్రమణము.** సం. వి. అ న ౧ అంతట తిరుగుట ౨ చుట్టు తిరుగుట ౩ పరిధి, కైవారము, వర్తులముయొక్క చుట్టు కొలఁత.

**పరిభ్రమము.** సం వి అ పుం ౧ అంతట తిరుగుట ౨. పొరపాటు, భ్రాంతి

**పరిభ్రమి(యి)ంచు.** సం అ క్రి. సంచరించు తిరుగు

సీ ..మహావిపినభూమిఁ, బత్నితోఁ దన పరి
భ్రమియించుటయు నప్డు దలఁచి శోకించి .

భార అర. ౨. ౬౭.

ఉ .అవ్విహంగాంగనయు . అమ్మహాయుద్ధ
మధ్యంబునం బరిభ్రమించుచున్నంత .

మార్క ౧౯. ౪౫.

**పరిభ్రష్టము.** సం విణ (అ ఆ అ) ౧ పరిభ్రంశము నొందినది, బొత్తిగా పడిపోయినది ౨. తప్పించుకొన్నది ౩ కీడ్పుఱుపఁ బడినది. ౪ లేనిది ౫ సద్దసేయనిది. ౬. నశించునది ౭ పోఁగొట్టుకొనఁబడినది (విల్యమ్సు)

**పరిమండలము.** సం. విణ. (అ ఆ. అ) అంతట గుండ్రనిది, వర్తులాకారము. వి అ పుం న ౧ వృత్తము, వర్తులము ౨ బంతి, చెండు ౩ గోళము. ౪ (తర్క) పారిమాండల్యము, అణుపరిమాణము.

**పరిమంథరము.** సం. విశే. (అ.ఆ అ) ౧. మిక్కిలి మెల్లనిది.

**పరిమందము.** సం విశే (అ. ఆ. అ) ౧. మిక్కిలి మెల్లనిది. ౨. మిక్కిలి బలహీనము. ౩ మిక్కిలి చిన్నది

**పరిమరము.** సం వి అ పుం. యుద్ధము

శ్లో. చిరాత్ క్షత్రస్యాస్తు ప్రలయఇవ ఘోరః పరిమరః మహావీరచరిత్ర. ౩. ౪౧,

**పరిమర్దనము.** సం వి అ. న ౧ మాలుట. ౨. నలియఁగొట్టుట. ౩ నాశనము. ౪ గాయ పులుచుట ౫. బిగ్గనదుముట

**పరిమర్దము.** సం = పరిమర్దనము

**పరిమళము.** సం వి. అ పుం. ౧. మెదుపుట వలనను రాయిడివలనను బుట్టిన జనమనోహర మగు తావి. ౨. మిక్కిలి సంబంధము. ౩. పండిత సమూహము (వా చ)

**పరిమళించే.** సం. అ క్రి వాసించు, వ్యక్త మగు

గీ... బ్రాహ్మణుండు, పలికె నిష్పచ్చరం బయిన భావణములు, పరమ నాస్తికభావంబు పరిమ ళింప హర ౩ ౧౪.

**పరిమళితము.** సం. విశే. (అ. ఆ అ) పరిమ ళించునట్లు చేయఁబడినది

**పరిమాణము.** సం వి అ. న తూము లోనగు వానికొలత; ప్రస్థమానము, కొలఁది, ప్రమా ణము.

**పరిమాథి.** సం. విశే. (ఔ నీ ఔ.) మిక్కిలి మథించునది, త్రచ్చునది; మిక్కిలి కలంచునది, చాల బాధించునది.

**పరిమార్గణము.** సం. వి. అ. న. ౧. అంతటను వెదకుట. ౨. అంటుట, స్పర్శము. ౩ తుడు చుట, శుద్ధము సేయుట.

**పరిమార్గము.** సం = పరిమార్గణము.

**పరిమార్చు.** స. క్రి (√ పరి). ౧. ఖండించు నంతట.

క. కరములు వాలుగు నిక్కం, బరిమార్చితి వీఁడు నీదు భక్తుల కగ్రే, సరుఁడై పొగ డొందె జరా, మరణాదిభయంబు దక్కి మను నిటమీఁదన్. భాగ. ౧౦. ఉ. ౪౪౪.

౨ చంపు, వధించు

క ఒరుఁ డెయ్యేనిని మామక, శరాసన క్షిప్త దీప్తసాయకపం క్తిం, బరిమార్చెద... భార విరా ౪ ౧౦౨

శి. గురుభీష్మకర్ణసైంధవ, గురుతనయులతోడఁ గూడఁ గురుపతిబలముం, బరిమార్చునట్టి సత్వము, పురుహూతా యిమ్ము కరుణ బొంపిరివోవన్ హర ౩ ౨౪; మనుచ. ౬. ౧౧౪.

**పరిమార్జనము.** సం వి అ న ౧. తుడుచుట ౨. జలగోమయాదులచే భూమ్యాదులను శుద్ధి చేయుట ౩ మధుమస్తక మనుభక్ష్య ద్రవ్యము (వాచ)

**పరిమార్జము.** సం వి. అ పుం శుద్ధిచేయుట.

**పరిమార్పించే.** స క్రి (√ పరిమార్చు) చంపించు

క ఒడలు బడల్ పడఁ గఱచినఁ, గడు వెవ్వడి నదరి కేచి కంకటి వడిన, ల్గడలు వెదకించి కానం, బడ నరపతి నిన్ను నన్నుఁ బరి మార్పించున్. వెం. పంచ. ౧. ౪౧౩.

**పరిమార్పు.** వి. (√ పరిమార్చు) హింస, చంపుట.

గ్రీ. త్రుంచుట చిదుముట తెగటార్చు పరి మార్చు, పొరిగొనుట పిల్కుమార్చు చంపుడు తునుముట, యణఁగఁ దగు హింస అం. భా. ౨. ౨౨౪.

పరిమారు. అ. క్రి. (√పరి) ఖండితమగు; రూపుమాయు, చచ్చు మ. హరి మర్దింతు నెఱు , .ఇంద్రాద్యష్టదిక్పాలురన్, బరి మారఁ ద్వధియింతు నో...భా. స్కం ౨ ౧౭౭

పరిమితకథుఁడు. సం. విశ (అ. ఆ అ) కొలఁదిగా మాటాడువాఁడు, మితభాషి

శ్లో: తాంజానీథాః పరిమితకథాం జీవితం మే ద్వితీయమ్ మేఘ ౨ ౨౦.

పరిమితము. సం. విశ (అ ఆ. అ.) ౧ మిక్కిలి మిత మైనది. ౨. కొలఁది యుచఁబడినది. ౩ మితి పెట్టఁబడినది. ౪ చేర్పఁబడినది. (శ ర.)

పరిమితి. సం వి ఇ. స్త్రీ. ౧. కొలత, కొలఁది ౨. మితి, మేర.

పరిమిళనము. సం. వి అ న ౧. అంటు, సంబంధము ౨. కూడిక, కలిసికొనుట

పరిమిళితము. సం విశ (అ ఆ అ.) ౧ చిక్కఁగా కూర్పఁబడినది. ౨. నింపఁబడినది.

పరిముగ్ధము. సం విశ (అ ఆ. అ.) ౧ అవ్యాజ మనోహరము, స్వభావముచేత అందమైనది. ౨ చేల దైనది, మూఢము

పరిమూఢము. సం. విశ (అ ఆ. అ) మిక్కిలి మోహము నొందినది

పరిమృదితము. సం విశ (అ ఆ. అ) ౧. అదఁగఁ ద్రొక్కఁబడినది, నలఁపఁబడినది; బిట్టు పిసుకఁబడినది. ౨. కౌఁగిలింపఁబడినది ౩. నూఱఁబడినది.

పరిమృష్టము. సం.విశ. (అ. ఆ. అ.) ౧. కడుగఁబడినది, శుద్ధి సేయఁబడినది. ౨. తోమఁబడినది, రుద్దఁబడినది. ౩. తాఁకఁబడినది. ౪. కౌఁగిలింపఁబడినది. ౫. వ్యాప్తము, వర్షినది.

పరిమేయము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. మిత మైనది, కొలఁదిపాటిది. ౨. కొలఁది యుదఁదగినది ౩. కొలఁది గలది.

పరిమొగము. వి. (పరి + మొగము) ౧. సేనాముఖము.

వ...సురవరు లతిసంభ్రమంబునం బరిమొగంబు దప్పం గనుకని జను నవసరంబున...

భా. సం. ౨. ౨౦.౨.

౨. అభిముఖ్యము, సామ్ముఖ్యము

వ. తదవసరంబునం బ్రజాపతినికరంబు దక్ష ప్రజాపతిం బరిమొగంబుఁ దప్పించుకొని

భా. సం. ౨. ౨౦౯

పరిమోక్షణము. సం. వి. అ న. విమోచనము, విడుదల

పరిమోక్షము. సం. వి. అ పుం ౧. సమ్యక్ముక్తి ౨ మోచనము, విడిచిపుచ్చుట, విడుదల. ౩. రిక్తగాఁ జేయుట, శూన్యము గావించుట. ౪. తప్పించుకొనుట ౫. తొలఁగఁ బుచ్చుట

పరిమోషము. సం వి. అ. పుం. ప్రముచ్చిమి, దొంగతనము, చౌర్యము.

పరిమోషి. సం. విశ (న్. నీ. న్.) దొంగిలించువాఁడు వి. న్ పుం. దొంగ, చోరుఁడు.

పరిమోహనము. సం. వి. అ. న ౧. మిక్కిలి మోహపెట్టుట, ఆకర్షించుట. వలలం బెట్టుట. ౨. వేఁదుఱు పుట్టించుట.

పరిమ్లానము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి వాడినది. ౨. సోలినది; మంద మైనది, దిట్టతనము లేనిది. ౩. తఱిగినది, క్షీణించినది. ౪. చెడినది, దూషితము.—వి. అ. న. ౧. భయశోకాదులచేతలని ముఖవికారము. ౨. మరక, కఱ.

**పరియంకము.** వి. (సం పర్యంకః, ప్రా, పరియంకో, క. పరియంకవు) శయ్య.

చ. తనపరియంకమందు వనితామణి రైన రమాలలామ పొంగ్దునట...

భాగ. ౧౦ ఉ ౯౨౫.

(చి. ని ప్రాంతప్రతి పా "తన మృదుతల్ప మందు" ముద్రిత పా.)

**పరియజ్ఞము.** సం వి అ పుం గౌణ మగు యజ్ఞము. (బృహస్పతిసవసాది)

**పరియల.** వి (క పరియళ, పరియణ, పర్యాణ, హరివాణ, హరివాణ మొ) దేవాలయమునందలి పూజోపకరణవిశేషము, హరివాణము, ఒక విధ మగు పళ్లెరము

వ. చోడగంగదేవని పెమ్మాండ్రు పెమ్మాడి రాజు పెట్టినవెండిపరియల ౧ ట్టిగ

ద శా. ౪. ౧౧౯౦.

**పరియలము.** వి దేవస్థానము

వ శ్రీ భీమేశ్వర మహాదేవర పరియలమున సో(మా)ణ్డి అయిన శ్రీ కరణమాణికము కొడుకు కుడియణ్ణునుం...

ద. శా ౪ ౧౩౫౭

**పరియష్ట** సం. వి ఋ పుం అగ్రజుఁడు యజ్ఞము చేయకయుండఁగా తా యాగము చేసిన యనుజుఁడు. (వై ని)

**పరియాచేకము** వి (సం. పరిహాసః) పరిహాసము, ఎగతాళి

ద్వి. పరియాచకము లాడెఁ బద్మనాభుండు విష్ణు పు ౨ అ (శ ర)

—విణ పరిహాసయుక్తము (శ ర)

(వ్యవ) నామాట పరియాచక మనకోకము

క. నాపుడు నది భోగస్త్రీ, గావునఁ బరియాచకంబుగా గుబ్బలిసుం, డావలికొండకు నుఱుకం, బోవుటఁ గాలు విఱుగఁ బొరిఁ బడె నని నక్. ద్యా. శ. ౫౩. (చి. ని. పా.)

**పరియాచకముచేయు.** స క్రి. (పరియాచకము + చేయు) పరిహసించు.

సీ బ్రాహ్మణాచారంబు పరియాచకముసేయు నగ్నిహోత్రవిధాన మన్నఁ గవలు...

కాశీ ౪. ౭౧.

(శ ర పా, 'పరిహాసకముసేయు' ముద్రిత పా

**పరియు.** అ క్రి ౧. విఱుగు, తునియ లగు.

క పరిఘమున నురము శిరమును, పరియ నడిచి ధనదు మూర్ఛపాలుపఱిచి

హరి ఉ. ౪ ౧౫౩

(చి ని పా 'పరియునడచి' ముద్రిత పా.)

౨ తప్పు

గీ అన్నదానంబు చేసిన యమ్మహాత్ము, నకును బలము నారోగ్యంబుఁ బ్రకటశుభము, నై యరిష్టాత్మకము లైన యరులవలని, భయము నభిచారకృత్యముల్ పరిసిపోవు

వి. పు ౪. అ (శ. ర).

ద్వి. మురసినశస్త్రులు ముద్గరంబులునుఁ, బరిసిన పరిఘలుఁ బట్టిసంబులును

గం రా యు. ౩౫౩. పా. ౧౪ పం

౩. చెడు.

ఉ నీ, వీరసమాప్తి యీపనికి నేఁటికి వచ్చితి వింద్ర నాకు నీ, భూరుహ మిచ్చినం దఱిఁగి పోయెడికే భవదీయసంపదల్.

వి. పు. ౭. ౧౪౧. (శ. ర.)

౪ మీఁదిభాగము సారహీన మై చెక్కలు వాసి రాలు. (శ ర.)

చ. పరిసిన వృక్షమూలములఁ బట్టునమవ్వాపుఁ బువ్వుఁ దీఁగెలన్,...

భాను ౨ ౩౪ (శ ర. పా, 'పరిసర' ముద్రితము)

జ. పరియు, పరిసిపాఱిపోవు, పరిసిపోవు.

**పరిత్రొత్తు.** అ. క్రి (పరి + ఎత్తు) అతిశయించు, బహుగుణిత మగు.

చ కెంపు నలంతికంపమును పీడని బీడయు మాటుసేయఁగా, నెఱుంగమి రేపులేమి పరిరొత్తెడు చొక్కు లకోలు
కవిక 3 ౨౧

పరిరక్షణము సం వి అ న ౧ చక్కఁగా రక్షించుట ౨ పరిపాలనము, తప్పక నిర్వర్తించుట (ఉదా సమయ పరిరక్షణము) 3 ఆపద నుండి విడిపించుట, ఉద్ధరణము ౪ హెచ్చరిక, జాగరూకత (పరిరక్షకుఁడు పుం రక్షకుఁడు పుం వానివలె గ్రహించునది)

పరిరంభణము సం వి అ =పరిరంభము

పరి (రీ) రంభము సం వి అ పుం కౌఁగి లింత, కౌఁగిలి, ఆలింగనము

పరిరంభించే సం క్రి కౌఁగిలించు, ఆలింగనము చేయు

క గరళము గినుటయుఁ బ్రేతముఁ బరిరంభించుటయు నగ్నిభావుఁ డవుటయున్
భాగ ౧౦ పూ ౧౩౦౧

క కమలాకరము విరియ పోగ, ప్రచయం బల్లాడఁ బులిచి పరిరంభించెన్, రుచిరగతి రూపవతి నిజ, కుచలికచాగ్రములు నాఁటుకొనఁ బ్రాణేశున్
హేం పంచ 3 ౨౦౧

పరిరక్షించే సం స క్రి ప్రోచు

మ పరమాత్ముం డజుఁ డీ జగంబుఁ గ్రతికల్పం బండుఁ గల్పించుఁ దాఁ, బరిరక్షించును ద్రుంచు భాగ ౨ ౧౧౦

పరిరథ్య సం వి ఆ స్త్రీ చతుష్పథము పుం

పరిరాటకము సం విణ (అ టికా అ) అంతటను కూ పెట్టునది, బిట్టు అఱచునది

పరిరాటి. సం విణ (న్ నీ న్) అంతటను దిగ్గణ కూ పెట్టునది, బిట్టు అఱచునది.

పరిలంఘించే సం స క్రి దాఁటు, ఎగురు

మ పరమర్షుల్ అంబరమధ్యంబున నావహాంబునుజగత్పావిని ప్రవాహంబుపైఁ, బరిలంఘించిరి భీమమండలము సర్వంబు న్విలోకింపఁగన్
భీమ 3 ౪౫

పరిలఘువు సం విణ (ఉ) ౧ మిక్కిలి తేలిక యైనది (వస్త్రాదిది) ౨ మిక్కిలి సులువైనది, సులువుగ జీరించు గి (ఆహారాగి) అతి స్వల్పము, మిక్కిలి చిన్నది

పరిలుప్తము ం విణ (అ అ అ) ౧ మిక్కిలి లోంచినది, కొఱఁతపడినది ౨ మఱుఁగుపడినది

పరిలేఖనము సం వి అ యజ్ఞస్థానాదులందు చుట్టు రేఖాదులు వ్రాయుట

పరిలేఖము ం వి అ పుం చుట్టుగీత, సంక్షేపవర్ణము ౨ చుట్ట వ్రాయుట కగు ద్రవ్యము 3 చిత్రపటము

పరిలోపము సం వి అ పుం ౧ హాని ౨ లోపించుట, మఱుఁగుపడుట, లేకపోవుట

పరివట్టము వి (సం పరివేష్టనం ప్రా పరివట్ట, త పరివట్టం) విష్ణు ప్రసాదముగా గ్రహించి తలఁ జుట్టుకొనుపట్టు (శ ర)

పరివదనము సం వి అ న తిట్టుట, నిందించుట

పరివపణము సం వి అ న =పరివాపము

పరివర్జనము సం వి అ ౧ బొత్తిగా విడుచుట, దిగవిడుచుట, త్యాగము ౨ మానము, చంపుట 3 మానుట, వదలుకొనుట

పరివర్జించే సం స క్రి విడుచు

మ శాంతి స్వాంతులై సంగముం బరివర్జించి విశుద్ధ చిత్తులగుచున్ భాగ 3 ౧౦౧౩.

పరివర్జితము సం విణ (అ ఆ అ) బొత్తిగా విడువఁబడినది

పరివర్తకము సం విణ (అ ర్తికా అ) ౧ చుట్టు త్రిప్పునది ౨ వస్తువుల మార్పుకొనునది ౩ చుట్టి వచ్చునది, చుట్టి తిరుగునది

పరివర్తనము సం వి అ న ౧ (ఎదుటి లోనగు వానిమీఁద, ఇటు అటు పొరలుట ౨ చుట్టి చ్చుట ౩ తిరుగుడు, భ్రమణము ౪ వినిమయము, వస్తువుల మాఱుపు

పరి (రీ) వర్తనము సం వి అ పుం ౧ చుట్టి వచ్చుట, రాశిచక్రమందు ఏ స్థానమునుండి గ్రహము చలించెనో మరల నా స్థానమునకు వచ్చుట ౨ యుగాంతకాలము ౩ వినిమయము, వస్తువుల మాఱుపు ౪ ఆవృత్తి, మరలి వచ్చుట ౫ సంవత్సరము (వై ౧) ౬ సంసారభ్రమణము ౭ గ్రంథ విచ్ఛేదము (అధ్యాయాది) ౮ కూర్మావతారమూర్తి యగు విష్ణువు

పరివర్తి సం విణ (న్ నీ న్) ౧ చుట్టు తిరుగునది, మరలి వచ్చునది ౨ మాఱునది ౩ దగ్గఱ వర్తించునది ౪ మార్పుకొనునది

పరివర్తించు సం అ క్రి చుట్టి వచ్చు, తిరుగు

వ కాలచక్రంబు యుగమన్వంతర పరార్థ రూపంబునం బరివర్తించుచు సుత్పత్తి స్థితిసంహారంబులకుఁ దా నొక్కరుండ హేతు వై

హరి పూ ౪ ౮

పరివర్తింపించు సం స క్రి ప్రవర్తింపఁజేయు

వ ద్వాదశారచక్రంబుం బరివర్తింపించుచున్న వారి శార్వరఁ గుమారుల

భార ఆది ౧ ౧౦౭

పరివర్తిక సం వి అ స్త్రీ మేఢ్రగత మగు రోగభేదము

పరివర్తితము సం విణ (అ ఆ అ) ౧ చుట్టు త్రిప్పఁబడినది త్రిప్పఁబడినది ౨ మార్పుకొనఁబడినది

పరివర్ధనము సం వి అ న ౧ ఎక్కుడుగాఁ బెరుగుట, పెంపొందుట, అధిక మగుట ౨ చక్కఁగా పెంచుట ౩ కోయుట, ఛేదించుట

పరివర్ధితము సం విణ (అ ఆ అ) ౧ ఎక్కుడుగాఁ బెంపఁబడినది ౨ కోయఁబడినది, ఛేదింపఁబడినది

పరివర్మ్యుడు సం విణ (న్ నీ న్) కవచము ధరించినవాఁడు

పరివసథము సం వి అ పుం గ్రామము

పరివహము సం వి అ పుం సప్తవాయువులలో ఆఱవవాయువు (ఇది సప్తర్షులను స్వర్గంగను వహించును) ౨ అగ్నిజిహ్వలలో నొకటి

పరివాదకుఁడు సం వి అ పుం ౧ (వ్యవ) వాది, వ్యాజ్యెగాఁడు ౨ వీణ వాయించువాఁడు ౩ నిందించువాఁడు

పరి (రీ) వాదము సం వి అ పుం ౧ నింద లేడి ౨ వీణ వాయించెడు కోడుపు

పరివాది సం విణ (న్ నీ న్) ౧ నిడిగట్టువాఁడు, అపవాదము చేయువాఁడు ౨ బిగ్గరఁ నఱచువాఁడు వి న్ పుం (వ్యవ) వాది, వ్యాజ్యెగాఁడు

పరివాదిని సం వి ఈ స్త్రీ ఏడు తంతులు గల వీణె

పరి (రీ) వాపము సం వి అ పుం ౧ ముండనము, గొఱుగుట, ఛేదించుట ౨ వపనము, పెడపెట్టుట, విత్తుట ౩ జలస్థానము, నీటిపట్టు

౪ పరిచ్ఛదము, పరివారము (దీనికే పరిచ్ఛేద మని పఠించి 'కొలఁది' అని యర్థము శ ర) ౫ పొదు ౬ తనివి (శ ర) ౭ లాజలు, పేలాలు ౮ ఆరోహము (శే ని)

పరివాపితము సం విణ (అ ఆ అ) ముండితము, గొఱిగింపఁబడినది

పరివారకము సం వి అ పుం లాజలు, పేలాలు

పరివారణము సం వి అ న ౧ మునుఁగు, గవుసెన ౨ పరిజనము ౩ చక్కఁగా వారించుట, బొత్తిగా తొలఁగఁజేయుట

పరి (రీ) వారము సం వి అ పుం ౧ పరిజనము ౨ సేన ౩ గవుసెన, మునుఁగు ౪ కత్తియొఱ ౫ పరివరణము, చుట్టుకొనుట

పరివారితము సం విణ (అ ఆ అ) పరివేష్టితము, చుట్టుకొనఁబడినది

పరివాసము సం వి అ పుం ౧ కాఁపు, వసించుట ౨ సుగంధము, మంచివాసన

పరి (రీ) వాహము సం వి అ పుం ౧ పొంగి పొరలెడి వెల్లువ ౨ శ్వేతచ్ఛత్రాది రాజార్హ వస్తువు (సుధ) ౩ చెఱువులోని నీరు అధికమైనది పోవుటకును కావలసినది నిలుచుటకును కట్టు ఱాతి కట్టడము

(శ్లో॥ "తనోతు క్షేమం న స్తవవదన సౌందర్యలహరీ, పరీవాహస్రోతస్సరణిరివ సీమంతసరణిః", సౌందర్యలహరి ౪౪)

పరివాహి సం విణ (క నీ క) పొంగి ప్రవహించునది

పరివి సం వి ఈ స్త్రీ ద్యూతవిశేషము (వై ని)

పరివిత్తి సం వి ఇ పుం తమ్ముని కంటె ముందు పెండ్లి కాని యన్న

పరివిత్తుఁడు సం వి అ పుం పరివిత్తి (వై ని)

పరివిద్ధుఁడు సం వి అ పుం కుబేరుఁడు

పరివిన్నుఁడు సం వి అ పుం పరివిత్తి

పరివిహ్వాలము సం విణ (అ ఆ అ) మిక్కిలి విహ్వాల మైనది

పరివీతము సం విణ (అ ఆ అ) పరివేష్టితము, చుట్టఁబడినది ౨ పర్వినది, వ్యాప్తము వి అ న బ్రహ్మ యొక్క విల్లు (విల్యమ్ము)

పరివృక్తి సం వి ఈ స్త్రీ గౌరవింపఁబడిన రాజభార్య (వై ని)

పరివృ(బృ)ఢము సం విణ (అ ఆ అ) ౧ దట్ట మైనది, నిబిడము, ౨ పెద్దది

పరివృఢుఁడు సం వి అ పుం అధిపతి, ఏలిక

పరివృతము సం విణ (అ ఆ అ) ౧ చుట్టఁబడినది ౨ ఆవరింపఁబడినది—వి అ న (వైద్య) యజ్ఞశాలయొక్క ఆవరణము

పరివృతి సం వి ఇ స్త్రీ చుట్టుకొనుట

పరివృత్తము సం విణ (అ ఆ అ) ౧ చుట్టు త్రిప్పఁబడినది ౨ వెనుదీసినది, వెనుకకు దిరిగినది ౩ మార్చుకొనఁబడినది ౪ సమాప్తము, ముగిసినది

పరివృత్తి సం వి ఇ స్త్రీ ౧ పరివర్తము, చుట్టు తిరుగుట, వినిమయము ౨ ఒక యర్థాలంకారము (ఒకవస్తువు నిచ్చి తక్కువదానినో యెక్కువదానినో పుచ్చుకొనుట)

శ్లో॥ పరివృత్తి ర్వినిమయో న్యూనాభ్యాం సా తస్యాస్యామ్, దత్త్వా కటాక్ష మేణాక్షీ జగ్రాహ హృదయం మమ, మయా తు హృదయం దత్త్వా గృహీతో మదనజ్వరః॥

**పరివెడలు.** అ క్రి (పరి + వెడలు) దండు వెడలు

గీ. పడఁతు కేపునఁ బద్మిని యుడమిరెల్లఁ,
జాఁజుగొని పేర్చి మనమునఁ జొక్క మిగిలి,
విటజనంబులపైఁ బరివెడలునట్లు, కొలను
వెలువరి జలకేళివలనఁ దనిసి.
హ సం ౯. ౨౯౦

**పరివేత్త.** సం. వి. ఋ పుం అన్నకన్న ముందు పెండ్లాడిన తమ్ముఁడు

**పరివేదనము.** సం వి అ న ౧ అన్నకన్న తమ్ముఁడు ముందు పెండ్లాడుట ౨. చక్కఁగా తెలియుట ౩ పొందుట ౪ అగ్న్యాధానము

**పరివేదిని.** సం వి ఈ స్త్రీ =పరివేదనీయ.

**పరివేదనీయ.** సం వి అ స్త్రీ అన్నకు ముందు పెండ్లాడిన వాని భార్య (వాచ)

**పరివేధించే.** సం స క్రి బాధించు

మ వాయంబె భీతాత్ములన్, బరివేధించుట...
ఉ రా. ౩ ౩౦౫.

**పరివేషకుఁడు.** సం. వి అ పుం వడ్డించువాఁడు

**పరివేషణము.** సం వి అ న ౧ (అన్నాదులు) వడ్డించుట ౨ చుట్టుకొనుట, పరివేష్టించుట ౩ గాలిగుడి, పరివేషము, ౪ పరిధి

**పరి(రీ)వేషము.** సం. వి అ పుం ౧ వడ్డించుట ౨ పరిధి, వృత్తముయొక్క చుట్టుగీత ౩. పరివేష్టనము, చుట్టుకొనుట ౪ గాలిగుడి, ౫ సూర్యచంద్రమండలము ౫ రెండు గజ్జావుల పరిమాణము. (వై. ని)

**పరివేషించే.** సం అ క్రి. పరివేషము కట్టు.

క పరిదివసంబున భానుపు, లరయఁగ భువిఁ బొన్నె కేని యట సప్తములం, బరివేషించిన క్రాఁవణిఁ, బరగిన గర్భంబువలన బహువృష్టి యగున్.
పద్మానందము ౩ ౧౧.

**పరివేష్ట.** సం విశే. (ఋ స్త్రీ ఋ) వడ్డించువాఁడు

**పరివేష్టనము.** సం వి అ న ౧. చుట్టి వచ్చుట ౨ పరిధి, చుట్టుకొలత ౩ గవుసెన, ముసుఁగు ౪ పరివట్టము

వ పూజకులచేఁ బాదతీర్థ ప్రసాద పరివేష్టనంబు విప్పించి విడిది కనిపిన . ఆ. ము. ౭. ౧౦౪.

**పరివేష్టించే.** సం స క్రి చుట్టి వచ్చు, చుట్టు వాఱు

వ .మనుర్వ సుగంధగ్వ పిధాదులు పరివేష్టింప నింద్రుం డైగాపతారూఢుం డై...
భార శాం ౪ ౪౨౨

వ. .అమ్మహీపాలుండు అమ్మునిపాలికి సూ జన సమేతంబుగాఁ జని పరివేష్టించి యుండి కేలు మోడ్చి భార శాం ౭ ౨౪౧

వ.. సరససాహిత్య విద్యావిశారదు లైనకవివ గులును బరివేష్టింప. . మార్కం పీఠి ౧. ౧౩

**పరివోవు.** అ క్రి (పరి + పోవు) తొల్లపోవు

క పొరిఁ బొరిఁ జోరులవలనన్, ధరణీపు వరులు సంపదలు సకలంబున్, బరివోయి గత్తి భారలు, దొరఁగడు దేహములతోడఁ దూలుచుఁ బెలుచన్
వి పు ౨ ౧౨౪

**పరివ్యాధము.** సం వి అ. పుం ౧ కర్ణికారము, కొండగోఁగు. ని ౨ నీరుప్రబ్బ, జలవేతసము ని

**పరివ్రజ్య.** సం. వి అ స్త్రీ ౧ త్రిమ్మరుట, తిరుగుట ౨ సన్న్యాసము

**పరివ్రాజకుఁడు.** సం వి. అ పుం=పరివ్రాట్టు.

**పరివ్రాజుఁడు.** సం వి. అ పుం=పరివ్రాట్టు

**పరివ్రాట్టు.** సం. వి. జ్. పుం. పుత్రదారాదులను సర్వకర్మములను ద్యజించి యాశ్రమాంతరము పొందిన భిక్షువు, యతి.

పరిశంకి. సం. విణ. (ఇ. సీ. న.) మిక్కిలి శంకించు వాఁడు.

పరిశిష్టము. సం. విణ. (అ. ఆ అ.) ౧. కడపట శేషించినది. మిగిలినది —వి అ పుం అను బంధము.

పరిశీలనము. సం వి అ. న ౧. సంబంధము ౨. ఎడతెగని సంబంధము, నిత్యసంబంధము ౩ శోధనము

పరిశీలించె. సం స క్రి శోధించు

వ...ఉదంచితం బగు కవిత్వ తత్త్వంబునం గల గరిమంబు పరిశీలించి... పాండు ౧ ౧౭.

పరిశుద్ధము. సం విణ (అ ఆ అ) ౧ మిక్కిలి శుద్ధిపొందినది, ౨ చెల్లింపఁబడినది (ఋణాది)

పరిశుద్ధి. సం వి ఇ స్త్రీ ౧. మిక్కిలి శుద్ధి ౨. నిర్దోషత్వము.

పరిశుష్కము. సం. విణ. (అ ఆ అ), ౧. మిక్కిలి యెండినది ౨ వాఁడినది, సురిఁగినది. (చెక్కలు. మొ)- వి అ న. పరిపక్వ మాంసభేదము

శ్లో: మాంసం బహుఘృతైర్భృష్టం సిక్తం చేదంబునా ముహుః, జీరకాద్యైస్సమా యుక్తం పరిశుష్కం తదుచ్యతే॥

పరిశూన్యము. సం. విణ (అ ఆ అ.) మిక్కిలి రిత్తది, బొత్తిగా లేనిది.

పరిశేషణము. సం. వి. అ న. అవశేషము

పరి (రీ) శేషము. సం వి. అ పుం మిగులు, అవశేషము.

పరిశోధనము. సం. వి. అ. న.=పరిశోధము.

పరిశోధము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలి శోధించుట. ౨. శోషము పోఁగొట్టుట, తప్పులు దిద్దుట ౩. (ఋణాదులు) చెల్లించి పుచ్చుట.

పరిశోధించె. సం. స. క్రి. వెదకు

వ...పశ్చిమదిగ్భాగంబు పరిశోధించి ..

ఉ. రా 8. ౨౦౪.

పరిశోభిల్లు. సం అ క్రి మిక్కిలి ప్రకాశించు.

మ పరికింపం గిటికోరదంతమయదీపస్తంభ మై యొప్పెఁ దై, పరిశోభిల్లెడుధాత్రి పాత్రి వలెఁ జూపట్టెం దదగ్రాల్పపుష్కరముల్ ...

దశా 3 ౨౦౧

పరిశోషము. సం వి అ పుం మిక్కిలి యెండుట

పరిశ్రమము. సం. వి అ పుం. ౧. వ్యాయామము, మిక్కిలి శ్రమము.

పరిశ్రాంతము. సం విణ (అ. ఆ అ.) ౧ మిక్కిలి ఆయాసము చెందినది ౨. మిక్కిలి ఊఁటు చెందినది

పరిశ్రాంతి. సం వి ఇ స్త్రీ. ౧. మిక్కిలి ఆయాసము ౨. మిక్కిలి ప్రయత్నము. ౩ మిక్కిలి ఊఁటు, విశ్రాంతి

పరిశ్రితము. సం విణ (అ. ఆ. అ) సమాశ్రితము —వి. అ న ఆశ్రయము

పరిశ్లేషము. సం వి అ పుం. కౌఁగిలి

పరిషత్తు. సం. వి. ద స్త్రీ ౧. సభ; ధర్మ నిర్ణయార్థము విద్వద్బృందయుక్త మగు సభ. (వాచ)

పరిషదుఁడు. సం. వి అ పుం ౧ పరిషత్తులోని వాఁడు, సభ్యుఁడు ౨. అనుచరుఁడు (వాచ)

పరిషద్బలుఁడు. సం వి. అ పుం. సభ్యుఁడు, సభాసదుఁడు (విణ అని వాచ)

పరిషద్యుఁడు. సం వి అ పుం సభార్హుఁడు. (విణ. అని. వాచ)

పరిషేవణము. సం వి అ న చక్కఁగా కట్టుట, ముడి వైచుట (వాచ)

పరిషేకము. సం వి అ. పుం=పరిషేచనము.

పరిషేచనము. సం వి. అ న ౧ చల్లుట, తడుపుట. ౨ పాదులకు నీరు కట్టుట

పరిష్క-(స్క-)ందల్. సం త్రి ౧ అంతటను వెళ్లుచున్న ౨ అంతటను రొండుచున్న

పరిష్క-(స్క-)ందుఁడు. సం విణ (అ ఆ అ) పరపుష్టుఁడు, ఇతరులచేఁ బెంపఁబడినవాఁడు.— వి అ పుం ౧ పెంపుడుకొడుకు ౨ కొనిన వాఁడు 3 రథగోపకుఁడు తేరిని గాచు బంటు

పరిష్కణ్ణ(న్న)ఁడు. సం. విణ (అ ఆ అ) మఱియొకనిచేఁ బెంపఁబడినవాఁడు.—వి అ పుం పెంపుడు కొడుకు

పరిష్కారము. సం వి అ పుం అలంకారము, వైనేత. (వాచ)

పరిష్కరించే. సం స క్రి ౧ చక్కఁబెట్టు ౨ అలంకరించు 3 శుద్ధిసేయు

పరిష్కారము. సం వి అ పుం ౧ చక్కఁ బెట్టుట, సంస్కారము ౨ భూషణము, తొడవు 3 శుద్ధి ౪ విద్యమాన (ఉన్న) వస్తువునకు గుణాంతరమును గలిగించుట మొ

పరిష్కృతము సం విణ (అ ఆ అ) ౧ అలంకరింపఁబడినది, భూషితము ౨ చేష్టితము 3. మార్జనాది సంస్కారము చేయఁబడినది, కడుగుట లోనగువానిచేతఁ జక్కఁబెట్టఁబడినది, లేక, శుద్ధి చేయఁబడినది ౪. చక్కఁగా మెఱుఁగు పెట్టఁబడినది ౫ సిద్ధము చేయఁబడినది. ౬. పశుబంధనమునకు సంస్కారము చేయఁబడినది. (భూమి) ౭. లక్షణముచేత నిర్దుష్టముగా నిర్వచింపఁబడినది.

పరిష్కృతి. సం వి ఇ స్త్రీ=పరిష్కారము.

పరిష్క్రియ. సం వి. ఆ. స్త్రీ=పరిష్కారము.

పరిష్ఠలము. సం వి అ న. చుట్టు నున్న ప్రదేశము

పరిష్వంగము. సం. వి అ పుం ౧ కౌఁగిలింత ౨ కూడిక, సంబంధము, కలయిక.

పరిష్వ (స్వ)ంజనము. సం వి అ. న =పరిష్వంగము

పరిష్వక్తము. సం విణ (అ. ఆ అ) కౌఁగిలింపఁబడినది

పరిస. వి నదీగర్భమునఁ ద్రవ్విన నుయ్యి (బ్రౌ)

పరిసంఖ్య. సం వి ఆ స్త్రీ ౧ లెక్కించుట, గణించుట ౨ (మీమాంస) విధిభేదము.

శ్లో విధిరత్యన్తమప్రాప్తౌ నియమః పాక్షికేసతి, తత్రచాన్యత్రచ ప్రాప్తౌ పరిసంఖ్యేతి గీయతే

3 అర్థాలంకార భేదము

గీ. ఒక్కచోట నిషేధించి యొకట వస్తు, యంత్రణము సేయఁ బరిసంఖ్య యనఁగఁ బరగు, లేదు స్నేహక్షయంబు సాలీకమఖుల, దెంద ములయందు దీపములందుఁ గాని

ఆంధ్ర చంద్రాలోకము. ౧౧౨.

పరిసంఖ్యాతము. సం. విణ. (అ ఆ అ) పరిగణితము, చక్కఁగా లెక్కింపఁబడినది

పరిసంఖ్యానము. సం. వి అ న ౧ పరిగణనము, లెక్కించుట. ౨ విశేషించి యెన్నుట, ప్రత్యేకగణనము

పరిసమాప్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ చక్కఁగా ముగిసినది. ౨. గర్భితము, లోపలఁ జేర్చుకొనఁబడినది, అంతర్భావితము.

పరిసమాప్తి ం వి ఇ స్త్రీ ముగించుట, ముగియుట

పరిసమాప్తించే ఎం క్రి ముగించు, పూర్తి చేయు

వ అమ్మహాధ్వరంబు వేదోపదిష్టవిధి బరిసమాప్తించి ఋత్విక్సభాయంబుల బహుదక్షిణలఁ దనిపి భాగ ౧౦ ఉ ౧౧౭

పరిసమూహనము ఎం వి అ న ౧ పోగు సేయుట, గుమిగూర్చుట ౨ అగ్నిహోత్రము చుట్టును జలము ప్రోక్షించుట, జలముచే మార్జనము సేయుట, యజ్ఞాదియం దగ్నిహోత్రము మీఁద మూరక సమిధలనుంచుట, అగ్నిహోత్రము చుట్టుఁబడిన తృణాదికమును ద్రుంచి యగ్ని నడుమ వైచుట (వాచ)

పరిసరణము ఎం వి అ న చుట్టుగాని అంతటఁగాని తిరుగాడుట

పరిసరము ఎం వి అ పుం (నదీనగర పర్వతాదుల) పర్యంతభూమి, సమీప ప్రదేశము, సమీపము ౨ మృత్యువు ౩ విధానము (విల్యమ్సు) ౪ వెడలుపు, వివిరి, వైశాల్యము

పరిసర్పణము ఎం వి అ న ౧ అంతటఁ దిరుగాడుట, లేక, ప్రాఁకుట ౨ అంతటఁ బరుగిడుచుండుట, ఎల్లప్పుడును దిరుగాడుచుండుట

పరిసర్పము ఎం వి అ పుం ౧ అంతటను దిరుగుట, చుట్టును ప్రాఁకుట ౨ అనుసరించుట, వెంబడించుట, వెదకుట ౩ జలాదివేష్టనము వి అ న సార్పవ్యతయాగభేదము

పరిసర్పించే ఎం అ క్రి చుట్టి వచ్చు

మ కరిసంఘంబులు లేవు రావు తురగౌఘంబుల్ రథవ్రాతముల్, పరిసర్పింపవు రారు కూరులు. భాగ ౧౦ పూ ౧౭౧౪

పరి(రీ)సర్య ం వి అ స్త్రీ అంతట తిరుగుట

పరి(రీ)సారము ం వి అ పుం=పరిసర్య

పరిసిపాఱిపోవు = పరిసిపోవు అ క్రి ౧ మాసిపోవు ౨ తగ్గిపోవు (వ్యవ) పథ్యము సరిగాఁ జేసిన రోగము పరిసిపాఱిపోవును

పరిసిపోవు = పరిసిపాఱిపోవు అ క్రి (√పరియు)

౧ తప్పిపోవు, తొలఁగిపోవు

గీ అన్నదానంబు చేసిన యమ్మహాత్మ్ము, నకును బలము నారోగ్యంబు ప్రకటశుభము, నైయరిష్టాత్మకము లైన యరులవలని, భయము నభిచారకృత్యముల్ పరిసిపోవు

వి పు ౪ ౨౦౯

౨ క్షీణించు, తఱుగు (చెడు అని శ ర)

ఉ ఇంద్ర హాకు నీ, భూరుహ మిచ్చినన్ బరిసిపోయెడికే భవదీయసంపదల్

వి ఉ ౭ ౧౪౧

(తిఱిగిపోయెడికే అని ముద్రిత పా)

చ సత్యశౌచముల్, పాద వదగుం గలిం బరిసిపోవు మహత్త్వము దేవకోటికిన్

వరాహ ౯ ౧౭౭

పరిసెనము వి ఎల్లట్టి, కుగ్గ (గంతు శ ర)

వ వడి దప్పూట్లు త్రాళ్లం గట్టువడి పొట్ట లదరంగ నిక్కి పరిసెనంబులు వేయునవి యును మనుచ ౪ ౨౩

ద్వి తిరముగా దేవ భూదేవసన్నిధిఁ బరిసెనంబుగఁ దిబ్బఁ బట్టించి గాని, రెండు విచారంబు లూహింపఁ గాదు

నవ ౨ ౭౫ పా ౧౩ పం

పరిస్తంభించే ఎం అ క్రి ఘనీభవించు, గడ్డకట్టు

వ జలంబులు శిలాసదృశంబులుగాఁ బరిస్తంభించె భార కల్య ౨ ౪౭

ఆ చీర లపహరించి సిగ్గులం విడిపించి, పరిహసించి రైనఁ బరగ మనకు, ఘనుఁడు నోము కొఱఁత గాకుండ బ్రోచెం, బనుచు హరి నుతించి రబల లెల్ల.

భాగ. ౧౦ పూ. ౮౭౬

పరిహాణి. సం. వి. ఇ. స్త్రీ. ౧. తగ్గుట, కీడ్పాటు, ౨. క్షీణించుట, నాశము ౩ విడిచిపెట్టుట, అసడ్డచే వదలుట

పరి(రీ)హారము. సం. వి. అ. పుం. ౧ విడుచుట, విడుపు ౨ తొలఁగఁ బుచ్చుట, త్రోసిపుచ్చుట ౩ ఊరు పట్టనము లోనగు వాని చుట్టు గల సామాన్య ప్రదేశము ౪ పన్ను లోనగు నిర్బంధములు లేనిది (మాన్యము మొ) ౫ అవజ్ఞ, అనాదరము ౬ ఆక్షేపము ౭. పాపాదులకుఁ జేయు ప్రాయశ్చిత్తము ౮. చేయి (శ ర)

పరిహారి. సం. విణ. (న. ఈ. న) పరిహరించువాఁడు

పరిహార్యము. సం. విణ. (అ. ఆ. అ) పరిహరింపఁ దగినది, విడువఁదగినది

—వి. అ. పుం. హస్తవలయము

పరి(రీ)హాసము. సం. వి. అ. పుం. ౧ నవ్వులాట, వేడుక, నవ్వు ౨. గేలి, వెక్కిరింత, పరియాచకము

పరిహాసవేది. సం. విణ. (న. ఈ. న) హాస్యగాఁడు (విదూషకాది), వేడుకకాఁడు

పరిహీణము. సం. విణ. (అ. ఆ. అ) ౧ తక్కినది, క్షీణించినది ౨ లేనిది, మాలినది ౩. తక్కువైనది, కొఱవడినది

పరిహృతము. సం. విణ. (అ. ఆ. అ) ౧ పరిహరింపఁబడినది, విడువఁబడినది మానఁబడినది. ౨ ఖండింపఁబడినది (ఆక్షేపాది) ౩. పట్టుకొనఁబడినది.

పరిహృతి. సం. వి. ఇ. స్త్రీ. పరిహారము

పరీక్ష. సం. వి. ఆ. స్త్రీ. ౧ పరీక్షించుట, వస్తుతత్త్వమును నిశ్చయించుట, పరిశీలనము ౨ (వ్యవహారమందు) దివ్యభేదములచే దుష్టాదుష్టత్వములను విచారణ చేయుట

పరీక్షకుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧ పరీక్షించువాఁడు, విచారణకర్త ౨ (వ్యవహారాదులందు) ఆయా దివ్యభేదములచేఁ బరీక్షించువాఁడు ౩ తర్కముచేతను ప్రమాణములచేతను నిర్ణయింపరాని దానిని నిర్ణయించుటకై శాస్త్రపరిశీలనము చేసి బుద్ధిప్రకర్షము నొందిన వాఁడు

పరీక్షణము. సం. వి. అ. న. ౧ (రాజు అపహార్యాదులయొక్కయు చోరాదులయొక్కయు) దుష్టాదుష్టత్వములను నిరూపించుట ౨ (తర్కముచేతను ప్రమాణములచేతను వస్తువుల) తత్త్వమును నిర్ణయించుట

పరీక్షించు. సం. స. క్రి. పరిశీలించు

క. చతురాశ్రమములవృత్తి, స్థితులు పరీక్షించి యందుఁ గొఱఁదలఁచి ..., గతి సూక్ష్మదృష్టిఁ గనుఁగొని, ... ప్రవర్తిత సౌమ్యం బరుచున్, భా. శాం. ౫ ౪౫౦

సీ. జిహ్వాగ్రమునఁ బరీక్షింపంగ లవణాబ్ధి కలశాన్నవంబులు దెలియవచ్చె వరాహ. ౧ ౪౧

పరీక్షితుఁడు. సం. విణ. (అ. ఆ. అ) పరీక్షింపఁబడినవాఁడు

—వి. అ. పుం = పరిక్షిత్తు

క. తక్షకుఁడను పన్నగుఁడు పరీక్షితుఁ గఱచె నటే నేఁ డరిందము నతనిన్, రక్షింపఁగ బోయెద శుభ, దక్షిణను మంత్రతంత్ర దాక్షిణ్యమునన్ భార. ఆ. ౨ ౧౮౪

పరీక్షిత్తు. సం = పరిక్షిత్తు

క. తనతల్లి కడుపులోపల, మును నూచినవిభుఁడు విశ్వమునకెల్లఁ గలం, డనుచుఁ బరీక్షింపఁగ జను, లనఘుఁ బరీక్షిన్నరేంద్రుఁ డండ్రు మునీంద్రా. భాగ ౧ ౨౯౨

**పరీణామము.** సం = పరిణామము

**పరీణాయము.** సం = పరిణాయము

**పరీణాహము.** సం = పరిణాహము.

**పరీణాహుఁడు.** సం. వి అ పుం శివుఁడు

**పరీతము.** సం విణ (అ ఆ అ.) ౧ చుట్టుకోఁబడినది, వేష్టితము, ౨ కడచినది, జరిగినది ౩ పోయినది ౪ ఆవరింపఁబడినది, ఆక్రమింపఁబడినది — వి అ న పగలు

శ్లో పరీతంతు దివా ప్రోక్తం విపరీతంతు శర్వరీ. (రామాయణ వ్యాఖ్యానము.)

**పరీదాహము.** సం = పరిదాహము

**పరీధావి.** సం వి న్ పుం ఒక సంవత్సరము

**పరీపాకము.** సం = పరిపాకము

**పరీప్స.** సం వి ఆ స్త్రీ పొందుటకు నిచ్ఛ

**పరీరణము.** సం వి అ న ౧ కమఠము, తాఁబేలు ౨. దండము, కఱ్ఱ, కోల ౩ పట్టశాటకము. (మే ని)

**పరీరము.** సం వి అ న ౧. హాలము, నాఁగలి ౨ హాలముఖము, నాఁగటికఱ్ఱు (శే ని) ౩ ఫలము. (వాచ)

**పరీష్టి.** సం. వి ఇ స్త్రీ ౧ అన్వేషణము, (అమంత్రకణార్థము) వెదకుట ౨ పరిచర్య ౩ ఇష్టపడుట ౪ ప్రాకామ్య మను ఒక ఐశ్వర్యము. ౫. పరీక్షించుట (శే ని)

**పరుండు**=**పడు.** అ క్రి. (√ పడు - రేఫా దేశము-పడి + ఉండు. అవి. శ ర) ౧. పతితుఁడగు, పడినవాఁడగు

చ...ద్యుగ్భరశరరమండలిం గెడపి ఖండనసీమఁ బరుండ నుంతు... దశా ౭. ౧౧౯.

౨. శయనించు

గీ ఒప్పు శయనించుటకును బన్నుండెఁ బండెఁ, బవ్వండించెఁ బరుండెను బవ్వళించె, నత్తిమిల్లె ననన్ .. ఆం సం మూన. ౩౨.

గీ అలసతఁ బరున్నమనుజుండు కలియుగంబు, ద్వాపరం బెన్నఁ గూర్చున్నవాఁడు త్రేత, యుద్ధితుఁడు యాయి మఱి కృతయుగ మటన్న, నముచిదమనోక్తి బుభ్రగ్వాహ్మణ మున వినవె అము ౩ ౪౯

గీ తోడిబ్రాహ్మణౌఘ, ముబునుపోకకుఁ జదువఁ బరున్నవేళ

అము ౨ ౪౪ ఆం భా. ౩. ౯౩

౩ నిద్రించు

గీ పనులలోనన రేయువుతిప్పలఁ బరుండి, మేలు కని యాలఁబిదుకఁగ మెలఁగుగోష్ఠపతులు

హరి పూ. ౯ ౧౭౭.

**పరుఁజించే.** పరుజించే స. క్రి (√ పరుఁజా).

కత్తిని-పరుఁజానం బట్టుకొను

సీ బరువు డించి కటారి పరుఁజించి నిల్పి యుండెందు వచ్చెదరని రెుదురువారు

అము ౭ ౪౪

మ రమణీరత్నము రంభఁ జూడ బురుసారుంగుచ్ జెఱంగుచ్ సెటా, కొమరుండుప్పటి కాసెగా బిగిచి జగ్గల్ మీఱు గ్రొంబైరమాల్, జము దాడిం బరుఁజించి రేఁది మఱి రాజా శమ్మువార్గొమ్మనచ్, బొమ లల్కుచ్ ముడివెట్టి వీరరసవిస్ఫూర్తిచ్ విజృంభించుచుచ్.

అహ ౧. ౯౯.

(పరుఁజంది - ముద్రిత పాఠము.)

ప్రబంధ. ౪౯౯.

**పరుఁజు.** వి. (క. పరజా, పరుజు) ఖడ్గాగ్రి ముష్టి సంగ్రాహ్యతలము, పిరువు, పిడి

సీ ..ఖడ్గాదిముష్టి సంగ్రాహ్యతలము.

గీ. పరుఁ జనఁ బరుం జనంగను బరగు...

ఆం. భా. ౨ ౨౧౫.

ద్వి కర మభేద్యం బగు కవచంబు పసిఁడి, పరుఁ జాలఁ జెన్నొందు పటుకృపాణములు

గం గా అరూ. ౧౦౩ పొ ౧౫ పం

క తరతరముపూసనుండియుఁ, బరుఁజాలు దట్టాడి మధ్యపద్ధతి ధారా, పరివృతి నుపదేశక్రమ, పరిచితిఁ బఠియింప ఖడ్గబంధంబరయ్యెన్.

కావ్యా ౩. ౪౦

జు: పరుఁజించు

**పరుడు.** సం విశే (అ ఆ అ) ౧. ఆసక్తుఁగు, తగులు గలవాఁడు (ధ్యానపరుఁడు, చింతా పరుడు మొం) ౨. భిన్నుఁగు, వేఱువాఁడు, లాఁతివాఁడు.వి అ. పుం పగవాఁడు, శత్రువు

సీ పాశుపతాస్త్రో పదేశంబు సేసెదఁ బరులఁ గెల్వుము ప్రతాపంబుమీఱ

కాశ ౪ ౧౯౪.

— న - పరమాత్ముఁడు.

**పరుగు=పరువు.** వి ౧. ప్రధావనము. (చూ. పరుగెత్తు) ౨. కోసుదూరము. (చి ని క. గ)

జ — పరుగెత్తు.

**పరుగెత్తు.** అ. క్రి (పరుగు+ఎత్తు) ప్రధావనము చేయు.

గీ ..మొకములం గరలి బెదరి, గొతిజదాటుగఁ బరుగెత్తి తిరిగి చూచె. కువల. ౧. ౯౫

సీ. పందులఁ బొడిపింపఁ బరుగు లెత్తఁగ వచ్చుఁ బులులను శిక్షింపఁ బోవరాదు.

రాఘవిం. ౫.

**పరుత్.** సం అవ్య త్. నిరుడు, పోయినయేఁడు (దీనికిఁ దెలుఁగున వర్ణ ప్రయోగము కన్పడదు)

**పరుత్నము.** సం విశే. (అ.ఆ.అ) నిరుటి,పోయిన యేఁటిది.

**పరుద్వారము.** సం. వి. అ. పుం. అశ్వము. (వాచ.)

**పరుమగు.** అ క్రి (పరుము+అగు) చూర్ణ మగు

క. పరిచూర్ణ మయ్యె ననుటకు, పరుసన్ జామంబు లగుచు వర్తిలుచుండున్, దుఱు మయ్యెన్ బరు మయ్యెన్, నుఱుమయ్యెన్ బిండి యయ్యె ను గ్గయ్యె ననన్.

ఆం. శే ౫౯.

**పరుము.** వి. నుఱుము, నుగ్గునుసి, చూర్ణము (చూ పరుముచేయు)

జ ' పరుమగు, పరుముచేయు

**పరుముచేయు.** స క్రి (పరుము+చేయు) నఱుముచేయు, చూర్ణముచేయు; పొడుచేయు

సీ చేలకావలవారిఁ జెంచి చిందఱఁ జేఁగి పండిన సస్యముల్ పరుముచేసి...రుక్మాం. 3. ౧౦

**పరుల.** సం. వి ఆ స్త్రీ సర్వమంగల, పార్వతి; (శే. ని.)

**పరులము.** సం. వి అ పుం. గుఱ్ఱము, అశ్వము (వై ని. శే. ని)

**పరువడి[1].** వి. (పరువు[1]+వడి) ౧. పర్యాయము క్రమము, వరుస; మరల.

క. పరబాధ సుఖము దుఃఖముఁ, బరువడి మొయిఁ బొరయఁగాక పన్నగ నరునిం, బొరయును యం దొక్కటి,...

భార. శాం. ౪. ౧౨

సీ. .. పాండునందనులకు వసుమతీరాజ్యార్హ లగు
దురు రాజ్యమునకుఁ, బరువడి చే నింతఁ
బాసిన మాపుత్ర పౌత్రవర్గంబును బాయ
నింక. భార. ఆది. ౭. ౧౨౪.

మ. శిశుతాశిశిఁ దొడంగి గర్వితులఁ గేళిం గంటుఁ
జాణూరునిన్, శిశుపాలున్ నరకాదులం
బరువడిం జెండాడి. ఉ. హరి. ౨. ౧౭.
అం భా ౨ ౧౬౪

చ. స్థిరవిభవుండు గుండనకు ధీగుణాన్విత భూమి
దేవికిన్, వరసుకీర్తి మల్లనయు వందిత
బంధుఁడు కొమ్మఁడున్ దయా, కరుఁడగు
సిద్ధఁడుం గుసుమకార్ముకి సన్నిభమూర్తి
కేతఁడున్, బరువడి నుద్భవించిరి శుభగ్రహ
సంశ్రిత పుణ్యవేళలన్ దశ. ౧ ౪౫.

క మాకన్నియ కాంతుండు వరుండగుఁ బరువడి,
రండని కార్యోక్తి మై మరల్చిరి వానిన్.
భోజరా ౩ ౫౩ ఉ గా ౪. ౩౩౪

౨. విధము, రీతి.

క అరివరుల నొంచినను భూవర వారికి నొప్ప
గింపవల దనుచు విభా, కిరుఁడు జౌకారము
సొచ్చిన, పరువడిఁదగనొక తె కెంపుపతక
మమర్చెన్. చంద్రా ౭ ౧౭.

సీ...వింజామరములు, వ్రేలఁ గట్టినలీలఁ జా
లారఁబోసిన పరువడి శంఖముల్ పరవు జూడ.
ఘటికా. ౨. ౧౪౫.

౩. తైక్ష్ణ్యము, వేగము.

శా. శరనికరసహస్రంబుల, బరువడి నందఱను
గొప్పె... భాగ. ఆది ౭. ౪౦.

ద్వి. పొరిఁ జెం పెసఁగు రాజులదేవుళ్లఁ, బరు
వడిఁ గనుసన్నఁబనులుగావింప
ద్వి. హరిశ్చ. ఉ. ౨౭.

౪. అతిశయము, ఆధిక్యము.

క. ఇరువురు బాణములం దిగం, తరములఁ బద
మిరుసు మిన్నుఁ దలముగఁ బొదువన్, గురు
తరతిమిరము గవిసెం, బర పుసు వదుకేయి
కోఁ బరువడితోడన్.
భా. రా. యు. ౧౫౨౪

౫. ఇది కొన్నిపట్ల వాక్యాలంకారముగా నుప
యుక్తము.

చ పరుసముతోడ మోవి మలభంబుగ లోవాముఁ
గాంచనంబుగాఁ, బరువడిఁ జేసినట్లు...
హరిశ్చ ౫. ౨౧౪

చ పరువడి భాగ్యాఖ్య గల పంచమవేదము
నాంధ్రభాష ను, స్థిరత రచించుచో ,
విక్ర. ౧ ౧౩

పరువడి. ² వి (పరువు ² + వడి) ౧. ఔచిత్యము,
అర్హత

క. నీయడిగిన యర్థాభి, ప్రాయములకు నుత్త
రంబు పరువడిఁ జెప్పన్, ధీయుత బ్రాహ్మ
ణులకుఁ గా, కాయతమతులయ్యు నొరుల
కది విషయముకే. భార. అర. ౪. ౧౨౫

౨. శ్రద్ధ.

క. పురుషుం డేయేకర్మము, పరువడిఁ గావించి
పుణ్యపరుఁ డై మను... భాగ. ౧౧. ౫౯.

ద్వి పరువడిమై నర్ఘ్య పాద్యాదివిధుల, గురు
భక్తిఁ బూజించి గోదాన మిచ్చి రం
రా ఉ. ౫ పా. ౧. పం.

౩ విలాసము

చ ..ముద్దుమొగంబున గల్గుఁ గాని యా, సుర
చిరమైన మాటలును నూత్నవిభీషణ భాష
ణంబులున్, బరువడితో విభుం గవయుభావము
పుట్టదు విప్రభామునకున్. పీఠి. ౫౭.

౪. తప్పమి.

క. పరులనిజకర్మములఁ బ, త్తిరులం గావించు ధరణిపాలుఁడు దాన, న్నరుల సుకృతముల లోనం, బరువడిఁ గొనుచుండు షష్ఠభాగము పుత్రా మార్క. ౩. ౧౪౦.

పరువడి³. వి. మల్లవిద్యావిశేషము, మల్లుఁడు వేసెడు అడుగులభేదము; అశ్వగతిభేదము. (భేదములు)

గీ...తద్విద్య సాధన యనఁగ దగడు, పరుపు పరువడి గాయమానంబు విసరు, మొన లనం గను...చెలంగు... అం భా. ౨. ౨౦౫.

వ...చిట్టడుగుకత్తెర పావుపావులు తోగినపావు మొదలుగాఁ గల పదిరెండు పరువళ్ల యగణ్య ప్రావీణ్యం బెఱింగి...హంస. ౨ ౨౦౬. ప్రబంధ. ౪౭

క ..మరిలి గొని యురవణమునఁ, బరువడి గోమూత్రికాది భంజళులఁ గడుఁ,గరలి... పాండు. ౧ ౧౬౪.

జ. పరువళ్లు దుముకు, పరువళ్లు ద్రొక్కు.

పరువము = పరువు². వి (సం. పర్వ ప్రా. పరువ) ౧ (సస్యము, పుష్పము మొదలగు వాని) పరిపాకము, పక్వస్థితి

గీ. అంత నవ్వాన తరువాతియుదను దోఁపఁ, బంటపూఁబోఁడి తన ముద్దుపట్టిఁ గొనకఁ, బలువగలఁ గుంద మేసెల్లఁ బచ్చవారె, ననఁగఁ బరువంపుఁబైరులు గొనబు మీఱె. అచ్చ. రా. కిష్కి. ౬౭.

సీ. పరువంబు దప్పినవిరుల రాలుచుఁ దరు చయము చుక్కలు లేని చదలఁ బెనయు. భార. ఉద్యో. ౨. ౧౧౨.

క. పరిమళము చెడదు వాడదు, పరువము దప్పదు... పారి. ౧. ౫౯

౨. ప్రాయము, వయసు.

గీ...ఇపుడు, దేవకీనామఁ బై యున్న దేవకేవ్యఁ, డితఁడు పూతనాప్రాణపాయితఁ దలిర్చెఁ, బురిటిపాపఁ బై యుప్పారు పరువమునను. హరి. ఉ ౫ ౨౨౫.

గీ. జాను మిఱిన చాఁయ మేనమామ, మాఁకు రును లేఁత పరువంపు గుబ్బెతయును. నీలా. ౨. ౧౩.

౩. యుక్తసమయము

వ...అని సప్తమం బైన యవస్థాంతరంబు దేట పడం బలికిన నులికిపడి పాలికయు నిశ్చాలిక మనః పరిపాకంబుఁ బరికించినం గార్యంబు పరువంబు దప్పినయది .. కవిక ౩, ౧౦౭.

గీ. కలికిచూపులఁ బరువంబుగా వొనర్చి,తిలక మునఁ బూవు లొకవేల్పు లెఱవ గోసె. పి. కళుం ౨. ౧౩౭

సీ. పరువంబుగాక చొప్పదనిమామిడితేనె లాన నాపాన నట్టాడునవియు పారి ౩. ౫౧.

గీ ప్రోదిసేయంగ నలయించుఁబోణి కలయు, మలయు పరువంపుజవ్వనం బలముకతన. శుక. ౧ ౩౪౭.

౪ మనోజ్ఞము

సీ. పరువంపుఁబుట్టోడి బాగుగాఁ దీర్చిన యల కలపై బొలుపార నలికి హరి. ఉ ౪ ౨౫౦.

సీ గుజ్జు లేమావిప్రూఁకుల నంటఁ ద్రొఁకినపరు వంపుఁ దలిరాకు పందిరులును. అచ్చ. రా. బాల ౧౧౩.

పరువళ్ళుదుముకు = పరువళ్లుద్రొక్కు.

ద్వి. పరువడి వెనుకకుఁ బరువళ్లుదుమికి, ద్వి. క పా. ౨౫౯ పం

పరువ(డుల్)ళ్ళుద్రొక్కు = పరువళ్లుదుముకు.

అ. క్రి (√ పరువడి.) మల్లవిద్యావిశేషము చూపు

గీ. తెలుపుఁ గొను కానిచెల లైన తెలుపుఁగాని, మరపరు లటన్న నొక్కింత పరువుసేయఁ,దే మని పరమ్ముఁ గాంచుచో యెట్టికతలు, దొ రకున మ్మన వారిదే దొరతనమ్ము.
పార్వ. ౨ ౧౦౧

వ...పరువులు మురువులు గెలియు మెలియు
భీమ. ౪. ౭౦

౩. శక్తి, సామర్థ్యము

క. జ్వరవర యీ మందుఁగ నీకొరుఁ దొడరఁగఁ దగునా రమ్ము యెురణింపుము నీ,పరువెల్లఁ జూపు నాచేఁ, బోరివోయెదు తెలుఁగు నొయ్యుఁ బొందెదు పిదపన్
హరి. ఉ. ౭. ౧౧౨

జ : పరువడి 2, పరువిఁడి.

**పరువు.** సం. వి ఉ. పుం. ౧ గ్రంథి, కేలు; ముడి ౨. సముద్రము ౩. స్వర్గము. ౪ పర్వతము (వాచ)

**పరువుగొను=పరుగెత్తు.** అ. క్రి. (పరువు + కొను-స్వార్థమున.) ప్రధావనముచేయు.

సీ. ఒండొరుఁ గడచుచు మఱువులు చూపుచుఁ బాతరలాడుచుఁ బరువుగొనుచు.
అచ్చ రా యు. ౯౦

**పరువునేల.** వి క్రోశము, కోసుసేల

సీ కూఁతసేలయనంగఁ గ్రోశ మదియొ, పరువు సేలయటంచుఁ బలుకుదురు ..ఆం. భా. ౨. ౭.

సీ. పరువుసేలనువచ్చఁబాల..
పి శకుం. ౧. ౧౩౨.

**పరు(గు)వు(లు)వాఱు.** అ క్రి. (పరువు[1] + పాఱు) ప్రధావించు, పరుగెత్తు.

క. ఊరక పుదకలు విఱుచుట, పైరంబున నొయలతోడ వాదపడుట దు, ర్వారగతిఁ బరువువాఱుట, గోరన్ గో రాలుచుట్టెల్లఁ గొలగాడుకుమీ. వి. పు. ౪. ౨౩౩.

గీ కావ్యజల మూఁగి యింటికిఁ బరువువాఱె ఆము. ౭. ౧౧౪ హంస. ౨. ౧౨౩.

వ...అక్కురంగలోచన మెఱుంగుదీవియకరణి మణిస్తంభంబుల మఱుంగునకుఁ బరుగు వాఱిన
శృం. శకుం. ౩. ౩౭.

('పరుంగువాఱు' ముద్రితపాఠము)

గీ ఆగృహాంబున నిచ్చావిహారమునకు, మనకు పరువులువాఱు సేమాడ్కి నైన, సందు గానక యినుపపంజరములోని, చిలుకపోలికఁ దలఁకు చక్కులుకులాఁడి. శుక. ౨. ౧౬౩. (ఇట 'కుతూహలపడు' అని భావము

**పరువు(లు)వెట్టు=పరువిడు.** అ క్రి.(√పరువు)

౧. ధావనముచేయు, పరుగెత్తు

సీ...చందనగిరినుండి చనుదెంచి చల్లని బిం్లిల పసులకుఁ బరువువెట్ట హరి. ఉ. ౭. ౫౯.

సీ అంతంత నగపడినట్ల చేరఁగ నిచ్చుఁ బైకొన జూచినఁ బరువువెట్టు విక్ర. ౨. ౧౩౫.

౨. వ్యాపించు

మ పరభూషాదుల రత్నదీధితులు దుర్వారంబులై దిక్కులం, బరువుల్ వెట్టఁగ .
వి పు ౭ ౩౩.

**పరువె(వ్రులె)త్తు=పరువిడు.** అ క్రి (√పరువు[1]-ఎ. పాఱెడు) ధావనముచేయు.

ఉ. అన్నలు సేయురాయిడి భయాతురులై పరు వెత్తుమూపలన్. ఉ రా ౨. ౦౫౦.

క. అత్తోరణంబె కొని నడు,సెత్తి వగుల చూర్య భానునిన్ మొత్తినచోఁ, దుత్తుము రై వాఁ డిలఁ బడె,నత్తఱిఁ బరువెత్తె నచటి యక్ష గణంబుల్. ఉ. రా. ౩. ౨౭.

గీ. ప్రాంతసరసీరుహాకరాంతస్తరంగ, పవనముల మీఁద హృదయము పరువు లెత్తె.
కవిరా. ౪. ౧౩.

(ఇటఁ తమకపడు, అనిభావము)

(దీనికి సందర్భానుసారముగా 'క్రూరత్వము, తైక్ష్ణ్యము. వేడి' మున్నగు నర్థములు వచ్చును)

క. శరముల వేగంబున గద, పరుసఁదనంబునను
గలఁగఁబడి చేష్టదప్పి, కరులం ద్రోలెను
భీముఁడు,... భార. భీష్మ. ౨. ౨౧౫.

సీ అత్యంతచిరకాల మదవులఁ గొండల
బాధలఁ బెట్టిన పరుసఁదనము.
భార. ఉద్యో ౧ ౩౬౩.

క పరుసఁదనము మెయి నరిగొనఁ, బోరఁ దగ
దగి పొడుఁగు గోయుచో ప్పగు వినుము...
భార శాం. ౨ ౨౯౯

సీ. నరిశాగ్ని శతముల పరుసఁదనం బంతయును
నొక్కచోఁ గూడి తనర ననఁగ.
హరి. పూ ౬. ౬౩.

గీ నయము కెద యీశ రెల్ల వెంటలన వెలుచు,
మాట పరుసఁదనంబు కుమారచంద్ర
వి శకుం ౪ ౧౬౬.

రగడ. బోరను విరహిణుల కుచస్థలకములఁ దిల
కములఁ, బరుసఁదనము కపోల ఫలకముల
నలకముల. రాఘవ ౨. ౬.

పరుసన=పరుసఁదనము. వి. (√ పరుస 2)
కాఠిన్యము.

సీ. తురగసముద్ధతి ఖురశాదనంబుల పరుసన
దహీరాజు శిరము లదర
భా రా యు ౨౧౦౬.

సీ పలుకు ప్రల్లదమునఁ బౌరవులును బరుసని
దండమున జరాసంధనృపతి
కేయూర. ౪. ౨౦౩.

సీ. వక్షంబు గుంతరై వర్ష్మంబు పరుస నై
తెలినోరఁ దేవుడు తీఁగ సాఁగ.
కాశీ. ౬. ౪౧.

(విరహంతోనము. అని భావము)

గీ. పైత్యదోషోదయంబునఁ బరుస నైన, జిహ్వ
కకుఁ బంచదారయుఁ జేదు గాదె.

పైత్య. ౨ ౧౭. (దోషము అని భావము)

౨. (=పరుసము) నిష్ఠురోక్తి, కాఱులు.

సీ. కఱకు కరుసు కాఱు కాఠోర్ద్యము పరుసము
పరుసన యనఁగ నిష్ఠురము వెలయు.
ఆం భా ౧ ౧౧౬

పరుసము¹= పరుసన. వి (సం పరుషం)

౧ కాఠిన్యము.

గీ వెత్తిని రామశతమున వెదలునట్టిచో కృఁ
బోఁదట్టి రూకశస్త్ర పెక్కఁవెట్టి, దడిఁ
గఱవఁబోవు వేషిఁ చందమునఁ బట్టి పరుస
మెచ్చఁగ నూనజప్రముఖుఁ బలికె.
శుక. ౩ ౩౭.

౨ నిష్ఠురవాక్యం, నిష్ఠురోక్తి

వ... మీకు నగ్ని పరిగ్రహంబును బ్రాహ్మణ
సంగ్రహంబును లేమిం జేసి పరుసంబులు
పలికితి భార ఆది ౬. ౫౬.

క పురుషుండు రెండుదెఱఁగుల ధర నుత్తముఁ
డనఁగఁ బరగుఁ దా పెర్యోడలం, బరుసములు
వలుకి కునికిన్, దురితంబులు వొరియుపనులు
దొఱఁగుటకతనన్. భార. ఉద్యో. ౨.౪౧.

—విణ దుష్టము; కఠినము, క్రూరము.

క... ఇప్పురుషునఁ బరుసపునడవడిఁ, గురువంశ
ప్రవర యిట్లు గూడునె చేయన్
భార ఉద్యో. ౪. ౩౫౦.

పరుసము²= పరుసవేది. వి. (సం. స్పర్శః, క.
పరుస) స్పర్శమణి

ద్వి. తొడిబడఁ బరుసంబుతో నిక్క సోఁకి,
కడువడి కొల్మి బంగారమైనట్టు.
ద్వి. హరిశ్చ. ఉ. ౨౪౫౦.

3. (మాట) ఉచ్చరింపునట్లు చేయు, వచింపఁ జేయు.

వ ..అ బింబోష్ఠి మానవ్రతనిష్ఠాగరిష్ఠ రై యుండ హృదయపుట భేదనంబు గావించి మూఁడు మాటలు పల్కించుట యత్యంత దుర్లభం బని తలంచెద... విక్ర ౬. 3౧.

వ...జిహ్వోద్యష్ట స్థానంబులవలన శబ్దరూపం బుగాఁ బలికించుచు... సీతారా ౧ ౧౬3.

౪. పాడించు.

గీ ప్రౌఢిఁ బలికించు గీత ప్రబంధములకుఁ, గ్రమ కరపంకరుహరత్న కటక ఝుణఝుణ ధ్వని స్ఫూర్తి దాళమానములు గొలుప,

మనుచ ౩ ౨౩.

౫. పలుకరించు, పలుకఁ జేయు

సీ. వలసినప్పుడు వచ్చి యలిగి యున్నట్టిచేఁ బలికించుదాఁక దవ్వునన నిల్చు

కవల ౪ ౧౯౪

సీ పలికించుఁ దలఁకించుఁ బోలఁతి విచారించుఁ జేరి పువ్వులఁ బూజసేయు నబల

వీర ౧. ౨౦౯

పలికినిలి. సం. వి ఈ. స్త్రీ ఆఁడుమేఁక. (వై ని)

పలిక్నీ. సం. వి. ఈ. స్త్రీ ౧ పెంట్రుకలు నర సినయాఁడుది, ముదిసినయాఁడుది

౨. బాలగర్భిణి యగుగోవు. (హాలా. ని)

పలిఘము. సం. వి అ. పుం. ౧ కాచఘటము, గాజుపాత్ర. ౨. ప్రాకారము. 3 పరిఘము, ఇనుపగుదియ. ౪. గోగృహము, పసులకొట్టము.

పలితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ నరసినది ముదిసినది. ౨. బలము కలది. వి. అ. పుం. న. ౧. నర. ౨. నరవెంట్రుక. 3 తాపము. ౪. శిలాజము, కాతిపువ్వు. ౫. బురద, కర్ద మము (కే. ని.) ౬. మరీచము, మిరియము. (వై. ని.) ౭. అంకము. (కే. ని.)

పలు¹. విణ. అనేకము. (వృత్తియందు పాల్లు పర మగుచో నుత్వలోపము వికల్పముగా నగును)

వ పలుచోట్లంబడిన శస్త్రంబులును .

ఉ. హరి. ౧ ౫3

ఉ పలుదెఱఁగు మర్లమాటలు, కలహాము కల్యాణ మని జగంబులవెంట, హ్మలఁగాడు మానికి సహజము పారి ౧ ౯౧

క పలుమాఱు బిట్టు నవ్వుట, పలుగొఱుకుట యనుచితములు వి పు ౪. ౨33

క ధనువు దునిమి నవ్విన నీ, తనయుఁడు పటు శక్తి వైచెఁ దలఁకకయది స్రుక్కినియలుగిఁ జేసె సాత్యకి .. భార ద్రో ౪. ౧౦౯

ఉ. మైనపుటంటు పల్వగలమచ్చులచా లోఁ గల్గ కట్టెలన్ శుక ౧ ౪౨౧.

—పలుమంది=అనేకజనులు

ఉ...లోకవిభుండు దాన రై, నాఁ డు దురాత్ము లైన దితినందనులన్ బలుమంది గూడుకొ,న్నాఁడు...

ఉ రా. ౨. ౨౪౯.

మ. ఎలప్రాయంబును జెల్వముస్ జరురతిల్ హేలావిశేషంబులన్, గలకి స్వామ ణు లెవ్వ రొకొ౯ బలిమిన్ గాంక్షానుకూలం బుగాఁ, బలుమందిన్ జెఱఁదెత్తు...

ఉ రా ౪ ౯౯.

—పలుగూడు=మధుకరాన్నము

ద్వి. తిరిసినపలుగూడు దెచ్చి నిచ్చలును,వరుస నొక్కొకకడి వనరుచుఁ గుడిచి

ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౫౦,

ద్వి. పలుగూడుగాక యే పట్టున నైనఁ,గలదె పాయసము భిక్షాం దేహి యనిన.

ద్వి. హరిశ్చ. ఉ ౧౨౬౭

జః పలుఁబోకలు, పలుమఱు, పలుమాటు, పలు మాఱు, పలువ, పలువిద్దె, పలువురు.

పలు² = పల్లు². (దీనికి వృత్తియందు పొల్లుపర మగుచో నుత్వలోపము వికల్పముగా నగును)

సీ. పలు రాల మును వచ్చి బాలు వేలుపు మన్నఁ బండ్లులేకుంట పెగా వ్యూఁ డనిరెు

బాగ ౯ ౧౯౬

ఉ. ఆయజుఁ దప్పు దంగినముఖాబ్జము బల్మిని వంచి మోవి పైఁ, జే యటు పాఁ(దొబ్బి పలు చేర్చి నొకించుకి నాఁటునట్లుగా

కళా ౫ ౧౬.

పలుకెంపు = దంతక్షతము.

సీ. చిగురుఁ గెంజాగామోవి నొగిలించి ఎలు గెంపు లడరఁజేయుమఁ దేశాలాని యాని

ఉ. రా ౪ ౨౧౪

పలుగ(ల్గ)ంటి = దంతక్షతము.

ఉ. అంటిఁ గందునో యనకి యంగము నిర్దయ వృత్తి మీఁటఁ గొఁ, గింటికిఁ దార్చి చు ౙెగునొ కెంజిగు గట్టిది నాకి మోవిఁ ఒ, ల్కంటు లొనర్చి చన్గవ నలంగునొ నాకి నఖాళిఁ జేర్చి వా, ల్గంటి రమింతు

ఉ. గా ౪ ౪౪౪

పలుగడిసే(చే)యు = దంతధావనము చేయు.

సీ. పలుగడిసేయు ననుపుగను సలిపించుకొనకి మొంటయ స్నానము లేకి ...

పన ౫ ౬౬

పలుగిట్టుఁబుడుకిలు = పల్లుకట్టుకొను పుడు కల వంటివి.

కి. కిలకూపు లేవి చేయుము, పలుగిట్టుంబుడుకి లివిరెు పార్థివ నాకుం, బలుగ్రోఁతులం దంష్ట్రాంతర, ములలోఁ జిక్కుకొని యూడిపో విద రెుపుడున్

రామా ౭ ౧౪౧ (మిక్కిలి యల్పములు అని భావము)

పలుగుటుపు = దంతవ్రణము.

కి. తెలనొవ్వి కిడుపుగుట్టుం, బలుగుటుపుం గాళ్లుతీపు పాటించుచు కుకి ౨. ౨౦౫

—పలుదాఁకు = దంతక్షతము

సీ. వాడు చూపినచేఁతవాతెరపలుదాఁకు జిలుఁగు కొండలఁ జిమచిమ యనంగ

విరం. ౨ ౨౧

—పలుదె (ద్దె) ర : రదనచ్ఛదము, వాతెర.

క. పలుకులు కూర్పఁగఁ గీరము, పలుదెర పం డనుచు నొడిసిపట్టగ వెగయన్,

(శృంగార గోపాలవాలము ౧. అ (౪ ౭)

వ. మధురామృతంబులు వడియం బలుదెర సొబగు లానుచు పను ౨. ౧౪౦

చ. కిళ గిలమోము కెంపునిరి గాంచిన పద్దెర తేజిలాలుక్క పల్కులు

చంద్రి ౨ ౧. ౨౪.

...పలునొ (ల్నొ)క్కు = దంతక్షతము.

సీ. దంతక్షతాభిధ తనరుచుండుఁ, బలుగంటు పలునొక్కు పలుగెంపు లనఁగను

ఆం. భా ౨. ౧౭౦.

సీ. పలునొక్కులను జిక్కుపఱపకు మని క్రొంక్కు కుసుమకోమలి గసిబిసి రెుునర్చి

మృ వి ౧ ౪౫

ఉ. చెక్కులచెంఁ సాంకి ములు చెందొగి చాయల మోవిమీఁది పల్నొక్కులు...

కవిరా. ౫. ౨౩౦.

జః పలుకిప్పు, పలుకిఱు, పలుగొజ్జు, పలు వరుస, పల్గొమ్ముల మొకము.

పలుఁగు. వి (సం స్ఫటికః, ప్రా, ఫలిహో, త. పళిఙ్గు)

౧. స్ఫటికము

ఉ. ఏనికతోలు కచ్చడము పెన్నుఁ గుబుస్సరంబు సంపపూఁ, దేనియ తియ్య విల్లుఁ గొని త్రెంచినబొట్టు పలుంగు పెట్టెముస్... ఉ. హరి, ౨. ౧౪౨. (పలుంగుపెట్టెము 2 స్ఫటికపు తావళమువుట్ట.)

ఆ పలుఁగురాలకుడ్యములరుచుల్ గప్పిన, జలములున్నరొదలు వెలయఁ జూచి యవనుపస్థలంబు లని జను లెఱుఁగక, యుండు నట్లుగా మయుండు సేసె

భార. సభా. ౧. ౧౨

౩. ఒకచోటఁ బువ్వుఁబందిరి, యొకచోఁ జప్పరము దూఁగుటుయ్యేల యొకచో, సకినల గిలిగిలిమంచం, బొకచోఁ గప్పురపుఁబలుఁగు టోవరి యొకచోన్

హైమ. ౪. ౧౮౭, హర ౫. ౮౦.

౨. స్ఫటికభేదము.

సీ పటికమం చనఁగను స్ఫటికంబు విలవిల్లుఁ బరగుఁ దద్భేదంబు పలుఁ గనంగ

ఆం భా ౨. ౨౯౭

జః పలుఁగుఱాయి.

పలుఁగురా(ఱా)యి. వి. పాలరాయి, తెల్లరాయి

వ ... ఝల్లికంబుల యూత్క్రోశంబుల బెదరి గుములు కొని యుఱికి టంపుక నుమతెఱవులం బఱచుచటి బలు పలుఁగుఱా త్రొక్కటంబుల గిట్టలు పగిలి వ్రాగిలి చాఁపకట్టుగాఁ బడు సారంగంబులకు .. చంద్రా ౨. ౭౮.

సీ. పలుఁగుఱా లొల్లక తొలఁగి వచ్చినఁ గంటె పలుఁగుఱా లివి గానఁబడియె నిండు.

రామా. ౫. ౮౧.

సీ. పలుఁగురా యనఁగను పాండుశిలాఖ్యయా... ఆం. భా. ౨. ౭౯.

పలుక[1]. విణ (√పలుకు[2]) విదర్ణమైనది, పదలినది. (వి వైవర్ణ్యము అని శ ర) చ. పలుకని వెరామఁ దొట్రుపడు పాదములున్ వగ గంపుటూర్పులున్, పలపల నైన దంతములు వంగిన మేను. వి్ర. ౨. ౧౫౫

పలుక[2]=పలక. వి ౧ డాలు, అడ్డనము

గీ విరథుఁ డై చక్కురుండు దోర్వీర్య మెసఁగ, వాలుఁ బలుకయుఁ గొని శీఘ్రలీల గదిరి

మార్క. ౬. ౯౭

ఆ. పలుకి పగుల జేసె యులుగు కుత్తునియలు, గాన్పొనర్చి హరి ఉ. 3 ౧౫౧ రా వి ౫ ౨౦

౨. జూద మాడు బల్ల

వ సైరంధ్రిం గనుంగొని పాటెలు దమ్మని పనిచి పలుకి ముందటికిఁ దిగిచికొనుచు ర మ్మనవుడు భాగ విరా ౫ ౨౮౪

3 (జూదము) ఆట.

వ .కింక నాలోకించి చిత్తం బొక పలుకి యాడుదమే . బా విరా ౫ ౨౮౪

క ఆ పలుకియు రుక్మి సముద్ధతుఁ డై గెలిచె నలుకి దీపంపఁ జలంబేపార నిట్లు పలుమఱు, నోపక నాడుచును బలుఁడ యోడుచు వచ్చెన్. హ ఉ 3 ౨౩౨

పలుక[3]. వి వృక్షవిశేషము

సీ. పేరుపనస గుత్తి పెట్టి నారువ రేల పనస కరక కొమ్మి పలుకి రేణి.

హంస ౪. ౧౧

పలుకఁబండు. అ. క్రి (పలుకన్+పండు) మిగులఁబండు

వ...పలుకంబండిన మాకందపండ్లగారామఁ జెఱచు గబ్బిగుబ్బలబెడంగులును

హర. 3. ౭౩.

పలుకఁ(ల్క)బాఱు. అ క్రి (పలుకన్ + పాఱు) తెల్లనగు, విచ్చిన్న మగు; వెలవెలవోవు; రంగుమాఱు

సీ నీరంధ్ర మగు దీనినీడచే పెరిగిరా మలయ జద్రుమవాటి పలుకఁబాఱె
వరాహ ౧౨ ౪౭.

గీ తారమైఁదీఁగ విరిచలోర్ధ్ర ప్రసూన, పాండు చ్ఛాయ నొయ్యొయ్యఁ బలుకఁబాఱె
కాశీ ౪ ౭౦౭

ఉ చెక్కు ల పల్కఁబాఱెఁ గిడుఁ జిట్టము లయ్యె మొగంబు వాడెఁ జన్మక్కుల ల్పుగూడె ద్వా 3 ౭౦. (ప్రాఁచి ప్రతి పా)

చ పలుకఁబాఱె నిశాంతినిశాంత దీపముల్
పార ౭ ౫౯

ఉ తెలయూఁచెం గలకెంపి యచ్చెరువునం దాటంకిగత్ని ప్రభల్, పలుకంబాఱిన చెక్కు టద్దములపైఁ బైపై విలంఘింపఁగాన్..
కాశీ ౫. ౧౬౨

సీ తిమిరాంభాగర్భదళ తాళవృంతంబు పైగాలి వెక్కస పలుకఁబాఱె.
నైష ౭ ౧౧౯

(మ్లాన మగు, వడలిపోవు అని భావము)

పలుకి(ల్క)న. వి (పలుకి[1]) వైవర్ణ్యము, తెల్లన (దీని యామ్రేడితరూపము 'పలుపల్కన')

సీ పలుపల్క నై మ్రానుపడి పండ్లు చూపెడు పుడుకఁ జల్లను పేడఁ బోవనేల యయా ౧. ౭౯. (శ ర పా, 'పలపలనై' ముద్రిత పా)

పలుక(ల్క)ప్పు. వి (√ పలు2) రదనచ్ఛదము, పెదవి. (శ. ర.)

గీ పరగఁ బల్కప్పు పోవి వాతెగ పెదవియు, వాఁగ నోష్ఠంబు... ఆం. భా ౭. ౧౪౭

పలుకమి. వి. (√ పలుకు[1]) మానము (పలుకు ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థకరూపము.)

సీ...మానంబు పలుకమి వాచంయంగు
ఆం. భా. ౭. ౧౩౪.

పలుక(ల్క)రించు. అ క్రి. (√ పలుకు[1]) మాటాడు

సీ పలుకరించినను కెంతలఁ జేరరాకుండ వాతుం పురలు చిత్తవానగురియ విప్ర ౪ ౧౯.

మ సొలయున్ జూచు నగున్ బయల్ బలుకరించున్ బల్కు నూఁకొట్టు బి, ట్టలుగున్ బ్రెమక్కుఁ బ్రియంబుఁ గెప్పు నధరం బల్లార్చి కోకో మ్మనున్ చంద్రా ౨. ౪

చ కిలయఁగఁ బల్కరించి రుపకారులు నై రని నమ్మి యుండఁగా, పలవడు బుద్ధిమంతులు నవప్రియు లైన ధరాధినాథులన్
భార. ఆది. ౪ ౭౯

—స క్రి (=పలికించు) ౧. మాటలాడఁ జేయు, మాటలాడించు

గీ మొలకినగవులు మొగమునఁ గులుకరింపఁ, దళుకుఁ దేనియ నుడువులఁ దొలకరింపఁ, గలికిచూపులు వీనులఁ బలుకరింప, సొలపు నడపుల నందియల్ గిలుకరింప చంద్రా 3 ౯౭ (దగ్గఱఁ జేరి యోగక్షేమము లడుగు భావము)

సీ జపము హోమంబు ధ్యానంబు సలుపుచుతీని, భిక్షుపానీయు చూమ్యముల్ పాయసంబు బుచ్చుకొనువేళ శూద్రులఁ బొసఁగఁ బలుక రించువారలపాపంబు లెంచ వరిది
శివ. 3. ౧౯

ఉ . ఏ, కాంతమునందు నున్న జవరాంద్ర పెపం బిడి పల్కరించు లా, గింతయు కాక నీ పెటుఁ గళ్ళె ముమ వచ్చిన శ్రోవచొప్పు...
మనుచ. ౭. ౪౧.

గీ. అంతఁ దప్పించి నీతోడు కనికి రథము,
తోలఁగఁదెచ్చుటఁ గనుఁగొని యలిగి నూతుఁ,
బలికి పరభసముగ నడుకలని శేఁగి రొలుఁగు
నాపిన బలములునిలిచి పోదికె
భార. భీష్మ. ౨ ౧౧౬.

చ...అనివార్యుల బాహ్లిక సోమదత్తులం, బరు
లవలీలఁ జంపిరికె. పల్కఁడు శే మని యేఁగు
దైవమున్. భార శల్య. ౧ ౨౯
చ పురఘస్మరుఁ బల్కుట నీకు బుద్ధిరే.
కు. సం ౪. ౭౬౦.

3. ఆక్షేపించు.
గీ రూపవిహీనులు దారు రూపు,గలిగి తోలు
మేనఁ గొనటులఁ బలికినారు
భార అను ౫ ౯౩

౪ ఉచ్చరించు
సీ లలిఁ దొక్కుఁబల్కులు పలుకనేర్చినవాఁడె
పలికించి సత్యంబు పలుకనేర్చె.
విక్ర. ౧. ౪౯
ఆ పలుకు లెవ్వి రైనఁ బలుకుచో మారిపేరు,
పలుకఁబడిరొ ననుచు బ్రమసి పలుకు.
భాగ. ౧౦ పూ. ౭౪.

౫ (కథ మొ.) చెప్పు
క మదిరాక్షి యొకకథ, కాదవ యగుట
తగదు కడమగూడఁ బలికెద,న్మదమున విని
పొ మ్మని... శుక. ౧. ౨౩౭.

౬ (గ్రంథము) రచించు.
సీ. పలికె శుకశ్రేష్ఠోపమలజాతి పెంపెక్క
రచించు లోనన మదాలసచరిత్ర.
ఆము. ౧. ౧౩

ఉ. ఏను పరాశరుండు రచియించిన విష్ణుపురాణ
మాంధ్రభాషా నిపుణోక్తులన్ బలుకఁ
జాలెద నంచుఁ దలంచినాఁడ...
వి పు. ౧. ౧౦.

౭. తెలియఁ బలుకు, బోధపరచు.
క శృంగారరఁ గథాదుల నాటకం,బడి దోఁపం,
బలికె మైత్రి వాపుట యొప్పన్.
ఆము. ౪. ౧౯౧

౮ భర్త్సించు, బెదరించు.
క తెలఁకుకచిలుకగవులు కొన్నెలలం గని
నవ్వు లేపునిద్దపుఁ గులుకుం, బలుకులు చిలు
కల నులుకఁగఁ, బలుకుం బలుకుదురు నోలుఁ
బలుమగవాలన్ నీలా ౧. ౫౭ (ఇం
జౌపమ్యదోత్యతకము)

౯. స్తుతించు, పొగడు
గీ తీర్థదైవతకోటిఁ బ్రార్థించి పలికి.
కాశి 3. ౭౯

ఉ పాండవపక్షపాతిమునఁ బల్కఁడు నోరికి
వచ్చినట్లు ని, న్నెంచ దనరామిఁజేసి యిది
యొప్పదె భార విరా. ౪. ౯౭

—అ. క్రి ౧. ప్రతివచన మిచ్చు.
ఆ...జేమ, ధారి మిన్నకేని తెపుమునేయు, చున్న
యట్టు వలుకకున్నవాఁ డని యొగ్గు, లాడి
యారకులు నయంబు లేక.
భార. ఆది. ౪. ౨౭౨.

వ. అని పలికి యతఁడు పలుకకుండం దమలోన.
ఉ. హరి ౪. ౪౫.

సీ. పొలయల్క నోకవేళఁ బలుకనిపార్వతి వెఱ
పించి కూర్తుపు విశ్వనాథు. దశా. ౨. ౧౪౯.

౨. (పక్షులు మొ.) కూయు.
క. కిలకిలవాకొడిపేళం, గలకలమని పలికెఁ
బక్షిగణ మొల్లెదలన్. భాగ.౧౦.ఉ ౧౦౦౨.
గీ ..సర్వేరుహాములఁ, బక్షులు గలకలంబునఁ
బలుకఁదొడఁగె. భోజరా. ౨. ౧౧౪.
చ. చిలుకలు వల్కనో చెవులు చిల్లులువోవఁగ
నంచు కెన్నఁడున్, కలఁడు నందనోప
వనవీథులకై. వైజ. ౪. ౨౪.

క. తొల్లి శివుఁ గడవఁ బలికిన, కల్లరిఁ దన తండ్రిఁ దునిమి కడుభక్తిమెయిన్, దల్లమిగ ముక్తిఁ దరియ్యేను, గొల్లఁడు గాఁడయ్యె కాటకోటఁడు రుద్రా. శివతత్త్వ ర. ౨౧

జః పలికించు, పలుకమి, పలుకరించు, పలుక రింత, పలుకరింపు, పలుకాడు, పలుకుఁగలికి, పలుకుఁజిలుకలకొలికి, పలుకుఁజెలి, పలుకుఁ దత్తడి, పలుకుఁదొయ్యాలి, పలుకుఁదోడు పెం.

**పలుకు².** అ. క్రి ౧ తెల్ల నగు; వివర్ణ మగు.

సీ. పలికె కొంతయుఁ గ్రుయ్యఁబాఱిన మనుఁ జెక్కు లందంద తడిపెడు వక్రువారి
హరి. ఉ ౩ ౭౪.

౨. రంగుమాఱు (చూ. పలుకఁబండు.)

జః పలుక¹, పలుకఁబండు, పలుకఁబాఱు, పలుకన, పలుకెక్కు.

**పలుకు³(ల్కు).** ముక్క, శకలము.

గీ...కప్పురంపుఁ, బలుకు లిడఁ బెట్టి - కట్టిన యలరుదండ. నైష ౩ ౧౭౩

సీ. కన్నీరు పన్నీటఁ గడిగి కర్పూరంపుఁ బలుకులు పెవులలోఁ బాఱమూఁది.
భాగ. ౧౦. ఉ. ౨౮౧

ద్వి. పలుకుల సేసిన ప్రాసంగుఁ బ్రాలు, నల వడ మున్నూఁటయుబదివుట్లు.
బస. పు. ౫ ౬౧౧. పం
(ఇట 'మాక' అని భావము)

చ. పలికె లతాంగి లేనగవుపల్కులఁ గప్పుఁ బల్కులొల్కఁగా...దశా. ౪. ౧౦౪
ఇందు. ౭ ౨౨.

ఉ...మంచికప్పురపుఁబల్కులు ముల్కులు పచ్చ పెచ్చు. హరిశ్చ ౩. ౧౬౨.

జః పలుకుటీగి.

**పలుకుఁ గలికి=పలుకుఁజెలి.** వి (పలుకు¹ + కలికి.) సరస్వతి.

క లోకైకపాలకుండు దయాకరుఁ డెన్నంగ రఘుమహారాజా జయ, శ్రీకాంతుఁ దశని సుతు నజుఁ, గైకొని చెలఁగితివి పలుకుఁ గలికియుఁబోలెన్ ఇందు. ౬ ౨౧.

— ఇట్లే: పలుకుఁగొమ్మ, పలుకు(ల) వెలఁది

సీ పలుకుఁగొమ్మకు తోరెఁ గలిగించులోలి పెద్ద యీరేడుజగముల కేలుకోఁడు
ఉ రా ౧ ౨౦

చ పలుకువెలందికిన్ మనికిపట్టగు చాలుపు మోముదామరల్, గలిగియుఁ బ్రాంత పల్కులు చొక్కారముగా నుడువంగ నేర్కె, తల తెగ వ్రేటులం బడిరి
ఆం. భా ౧ ౩౯

గీ పలుకులవెలంది తళుకుఁజెక్కుల విచిత్ర, పత్రముల వ్రాయ నేర్చినపాణి సనిల,సుతుని నెమ్మెను నిమిరిన కోవ దీటె,వాడు లేఁబైరు వానచేవలెఁ జెలంగె ఉ రా ౫ ౧౭౩

**పలుకుఁజిలుకలకొల్కి** వి (√పలుకు¹) సరస్వతి

మ పలుకుంజిల్కలకొల్కి గాచిలుక బాబా సాహిబూ నెయ్యపుం, గలవన్ సౌఖ్యము గాంచి మై బడలఁగా దశా ౧ ౨౬౯

**పలుకు(ల్కు) జెలి=పలుకుఁగలికి.** వి (√ పలుకు ¹) సరస్వతి.

క. పలుకుఁజెలి లచ్చికోడలు, కలని కనిపెట్టి తూఁటిగాసపుఁదేజీ, గలబోటి యుసఁగె భాషా, జలజాక్షికిఁ జేరుగా ..
ఆం భా ౧ ౬౨.

మ. సకలామోదక తాళవృత్తిగసులన్ సంగీత సాహిత్యసామ్యమున విద్యాయుగళంబు పల్కుఁజెలికిం బాలిండ్లకో నై సిరుల్, ప్రకటింపన్ వసు. ౧. ౩.

—ఇట్లే : పలుకుఁజేడియ.

సీ. పలుకుఁజేడియ తైరి పాలఁకుక లందఱుఁ
జెట్టు లన్నియుఁ జెట్టుచెట్టు లయ్యె
అచ్చ రా అయో. ౨౦

పలుకుఁదత్తడి. వి. (పలుకు[1] + తత్తడి) చిలుక.

మ పలుకుందత్తడి నెక్కి దర్పకుఁడు దర్పం
బేర్పడ న్యూకినన్ చంద్రా 3 ౭౪
(శ. ర.)

పలుకుఁదొయ్యలి = పలుకుఁ జెలి. వి (పలుకు[1] + తొయ్యలి) సరస్వతి

వ .అని పలికి పలుకుందొయ్యలి యూరకుండె... సైవ ౫ ౭౬

క వలరాయని దేవియుఁ, పలుకుందొయ్యలియు కాక బలరిపుసతియో
రాజ చ ౨ ౧౪౪.

మ. "పలయన్ గాదిలిపుత్త్రి చందమున జేవేభంగులన్ బ్రోచుచుం, బలుకుందొయ్యలి చేరి రాచిలుక పెంపన్ బెర్గి...
విక్ర. ౩ ౫౦.

పలుకు (ల్కు) దోడు. విణ (పలుకు[1] + తోడు) మాటాడుటకు సహాయము

సీ. శృంగార పినుమంబు చిన్నిచుక్కలరాజు పసిఁడి కిన్నెరవీణ పలుకుఁదోడు
సైవ. ౧ ౫

సీ. పలుకుఁదో డై తాంధ్రభాషామహాకావ్య సైషధగ్రంథ సందర్భమునకు శ్రీనాథుని చాటువు

సీ. గంభీరరసగుంభసంభృతప్రౌఢిమతో సరస్వతి పల్కుఁ దోడు గాఁగ. పరు. ౨. ౧౦౭.

పలుకుఁబంతము. వి. (√ పలుకు[1]) ప్రతిజ్ఞావాక్యము.

ఉ ..ఏల కామసం, బీవిబుధాధినాయక మహీంద్ర హోము బెకలించి లాకసం, భావిత మైన నీ పలుకుఁబంతము సెల్ల మదీయగేహమే, శీవన వాటి జేడుక దలిర్పఁగ నిల్పుము జీవితేశ్వరా పారి. ౪. ౧౧.

పలుకుఁబూఁబోఁడి(ణి) = పలుకుఁగలికి. వి. (√ పలుకు[1]) సరస్వతి.

గీ. తద్గుణంబులు వర్ణింప ధరణినాథ, యజ్జ నూతికి నైన శక్యంబు గాదు, పలుకుఁబూఁబోఁడికైనను నలవికాదు.సైవ. ౨. ౯.

సీ. కొండమ్మిగద్ద యొక్కినవేలుపుల పెద్ద పలుకుఁబూఁబోణికిఁ బ్రాణపదము. దశా ౨ ౭౨.

పలుకుపటిగి. వి. (పలుకు[3] + టిగి) స్వల్పవస్తుదానము.

సీ. కలుపకేతులతోఁ గద స ప్తపాలముల్ పలుకుటిగియేకదా తలఁప లంక.
వాల్మీకి. 3 ౧౫౫.

పలుకుకొలనాఁగ = పలుకుఁజెలి. వి. (√ పలుకు[1]) సరస్వతి

గీ కప్పు గలవాఁడు గొ పైపనకొప్పు గాఁగ, మేఁలి లిడి నంచ లిరువంక మూఁతిఁ గఱవ, రాణి దులకించుపూఁదీఁగె వీణె గాఁగఁ, బలుకు కొలనాఁగయనుబోలె నలరిమతియు.
యయా. ౨ ౪౨.

పలుకు(ల్కు)బడి = పలుకు[1]. వి (పలుకు[1] + బడి) ౧ వాక్యము, మాట.

సీ. కలుషంబు విదళింపఁగల ధర్మశాస్త్రప్రపంచంబు లెవ్వానిపలుకుబళ్లు. వరాహా. ౧. ౯.

సీ. తలఁపుఁబెంబడి గానివలకారిదిన్నెలు కలకూళితయు గాని పలుకుబడులు
ప్రబంధ. ౭౩౨.

౨. మాటతీఱు, ఉచ్చారణపద్ధతి.

గీ. పడఁతు లారాజసచివుని పలుకుబడియు, జూచుచాయయుఁ గని తొంటిమునిరు కాఁగ, వరసి... వసు. 3 ౬3

చ. సొగసులు గుల్కు పల్కుబడి సోయగముల్.. కళా. 3 3౯

3 ఒడంబడిక, అంగీకారము.

గీ .అప్పనంబు, పలుకుబడి దప్పి కొనిరెడు పతియు గోవు, ముక్కుఁ గుట్టెడువాఁడుఁ దమ్మిమ్మ ఘాతి,యగు పతిండు నధోగతి కరుగువారు. భార. అను ౨ ౬౨.

సీ గజపతిరాష్ట్రదుర్గవిశేషముల నుండి మెలఁపుగాఁ బలికినపలుకుబడుల,తీఱ వ్రాసితిని...

కృష్ణ. 3. ౧౦౯

४ వాక్యము.

౬ అమరఁగ శబ్దార్థంబులు, క్రమతుల్యము లయ్యు భేదకథనముచే వ్యస్త్యము నతిరిక్తముఁ జేయుట,నమితవ్యతిరేక మనఁగ నగుఁ బలుకుబడిక. కావ్యా. ౫. 3౫.

౫. మాటచెల్లుబడి. (వ్యవ) ఆయనకు గ్రామమున మంచిపలుకుబడి యున్నది

పలుకుబోటి=పలుకుఁ జెలి. వి పలుకు[1] + బోటి) సరస్వతి.

సీ. కించిద్దిగంబరీ కృతరదద్యుతిసొంపు పలుకుబోటికైన వ్రాతి గాఁగ.

శైవ. ౫ ౬.

పలుకురాయి. వి. (పలుకు[1] + రాయి) ప్రతిధ్వని యిచ్చు శిలావిశేషము. (శ. ర. బ్రౌ)

పలుకులముద్దరాలు = పలుకుఁ గలికి. వి. (పలుకు[1] + ముద్దరాలు) సరస్వతి.

ఉ...పలుకుల ముద్దరాలి విహారంబుగరు టంచరవల్ సెలంగఁగక్. ఇందు. ౧. 3४.

పలుకువాలు. వి. (పలుకు[1] + వాలు) గీర్వాణుఁడు, వేలుపు.

సీ పలుకువాల్ మగలయాఁకలిఁ దీర్చుచలుపరే మగువలఁ గనిపించు మంత్రసాని.

చంద్రా. 3. ౧౦౧

౨. (శాపాయుధుఁడు) ముని, ఋషి.

గీ పలుకు వాల్దార నిర్వేల్పుపడఁతులెల్ల వికృతి సేయంగవిటుని గావింపకేని, నజరకులమునఁ బుట్టితి నంచు నిచ్చఁ, బలుకఁగా సిగ్గుగాదె యజ్ఞాతజన్మ చంద్రికా ౨ ४౯

పలుకువైచు. అ. క్రి (పలుకు + వైచు) నిందమోపు.

సీ. చక్కార నొకరిపై (జెలువవ్వ చికిలించి యలరుచు నొకరిపైఁ బలుకువైచి

కేయూర. ౨ ౫౯

పలుకె(క్కె)క్కు. అ క్రి (√ పలుకు[2]) పండు

సీ...పల్కెక్కనఁ దగుఁ బండె నపుట

అం భా. 3 ౧౦౧.

పలుగాఁడి. వి. ౧. పశువుల దొడ్డి లోనగువానికి పెట్టెడు తలుపు

ద్వి...దొడ్డిఁ, బలుగాఁడిలిడి ప్రతిభ్రష్టులదిక్కు, పలుకుట చూచుట పాతకంబనుచు.

బస. పు. ౬. ౯౧౬. పం.

ద్వి. పలుగాండ్ల దెఱపింప నలరుచుఁ బసుల.

బసపు. ౬. ౯౨౬. సం. శైవ. 3. ౬४.

౨. కోట లోనగువాని ద్వారమునకు పెట్టెడు తలుపు.

సీ. ప్రాఁకిలోపలఁజొచ్చి పలుగాఁడిఁ దెఱచిన... ఉ. హరి. 3. 3४.

3. శకటావయవ విశేషము. (బండిపరము అని శ. ర.)

సీ. . పలుఁగాఁడితోఁగూడిన యంగముల నొకట,
నెడలించివిడఁదట నెనఁగెడు పరశల్లఁ బఁ
గ్రోచియదఁకుచో .

హరి. పూ. ౫ ౧౭౨

సీ. అందఱునొక్కచోఁబెట్ట తద్రథము వోదివి, హయ
లతోఁ గాడియు హరికోలు నొగలును బలు
గాఁడియును గండ్లంబట్టి కొలఁగ...

భార. కర్ణ ౨ ౨౭౯

సీ. కాగీగములు పలుఁగాఁడి జాడలు సఁచఁ
గాయ్య లశోకముల్ గోడిపీఁట... గీ గా
వసంతుండు మాతుఁడై పూవుఁదేర,

కు. సం ౪. ౪౩౯

—విశే. పెక్కుగాఁడులు గలది (శ ర)

సీ. దంచనంబులును దద్దడములు నెత్తించి బలు
గాఁడి తిలుపులు బలుపుచేసి

ఉ. హరి. ౨. ౯౨

చ... పసవంపుమావిక్రొ,వ్విరి బలుగాఁడి తూపు
లిడి వీరపుగర్వము నెమ్మనంబులోఁ, బిరి
గొని తోలితొప్పఁగలఁజెట్టె వనంగుఁడు
పాంథలోకముఁ.          నృసిం ౨ ౪౪.

పలుగా(ల్గా)కి. విశే (పలుగు + కాకి)

౧. దుష్టుఁడు, తుంటరి.

గీ ఉద్ధతులు గొంట్లు పలుగాకు లుదుకు
మిడుకు, లాకతాయలు కతులు గియ్యాళు
లగుచు.          హర. ౫ ౧౧.

క. పలుగాకులు పెంచిన కో,కిల పంక్తికిఁ గలికి
మీఁదఁ గృప రండెలు నే.   భాను. ౩. ౭౦

ద్వి. పలుగాకు లై బహుభంగుల నిట్టూర్పులు
గాకు లానరింప బోలదే మాన్ప ద్వి.

హరిశ్చ. పూ. ౧౨౧౪
అచ్చ. రా. బాల. ౪౪.

గీ. అకసుదర్పాంధకార మంతంతఁ గవియఁ,
గన్నుఁగానక సాధ్వి రాఘవుని దేవి,జనకకన్య
జగన్మాన్యఁ జెనక వచ్చి, కన్నుఁగానక
చనియెఁ బల్గాకి కాకి

రామ ౫ ౪౦ (శ ర సా)

౨. సంకరుఁడు

సీ...సంకరుఁను రాజలును బల్గాకియువఁగ.

ఆం. భా. ౩ ౧౩.

పలుగు. వి ౧ ఫాలము, నాఁగటికఱ్ఱు

సీ...చతుఁ బలు గవఁగను ఫాలాభిధానంబు...

ఆం భా. ౨ ౨౩౩

క ఎఱుఁగుల మలుగుల వలుగుల,గులగులలుగఁ
జేసె పట్టుకొని బిట్టొంటకం,బలుగుల సలుగుల
ములుగులఁ,గలఁగంగాఁ గట్టిరట్టి గట్టి కిరా
తుల్          రా వి ౩. ౭౦

౨. గుంటకగుజ్జాలకును పాపటపుగుజ్జాలకును—
తగిలించెడు దళమైన యినుపతగుడు (శ. ర)

—విశే ధూర్తుఁడు, మోసగాఁడు

చ నన్, బలుగుఁదనంబునం బలుకఁ బాడియె
నీసతి నంచు...     భార ఆది ౫. ౨౦౩.

కి కల దాసన్యాకాశి బహు, కలధౌత సుకర్ణ
పూర్ణకంథసదా యుప్పలుగుయతి మఱపు
మోసముఁ గలదేనియు లేక దానిఁగని రక్షిం
చుచున్          కేం. పంచ. ౧. ౨౧౪.

జ: పలుగాకి, పలుగుగుంటక, పలుగుడుఁబాము,
పలుగుపిట్ట,పలుగూఁతలు, పలుపడి, పలోప్పక.

పలుగుంౘ్రము==పలుగురు. (శ. ర.)

పలుగుగుంటక. వి (√పలుగు) పలుగు అమ
ర్చి గుంటక (శ. ర)

పలుగుడుఁబాము. వి (√ పలుగు) సర్పవిశే
షము. (చి. ని శ. ర. గ్రా.)

**పలుగుపట్టు.** వి. (√ పలుగు) ఘూకము, గుడ్లగూబ. (శ. ర)

**పలుగురు = పలువురు.** (శ ర)

**పలుగూఁతలు.** వి. బ. (√పలుగు) దుర్భాషలు.

క. పలుగూఁత లాడువానిన్, గలు ద్రావెడువానిఁ జెవులు గఱచెడువానిన్, బొలఁతులఁ దెచ్చెడువానిన్, దొలఁగింపక సంతరింపుదురు రాజన్యుల్

కేం పంచ ౧. ౪౪౫.

**పలుగొట్టు.** వి. (పలు[2] + గొట్టు) పైరులోని గాదము వెల్లగించుటకై పండ్లవలె మేకు లమర్చినపలక (శ ర)

**పలుచే(ల్చ).** విశే. త పల్చై (దీనికి నిగాగమము వికల్పంబుగా నగును—)

౧. దళసరికానిది, సాంద్రము కానిది

గీ. ధరణి నెత్తుటఁ దోఁగి యాభరణకాయ, శస్త్రఖండజాలములఁ జాలనొప్పెఁ, బలుచగాఁ గుంకుమ మలఁది పెక్కు, దెఱఁగు తొడవులు దొడిగిన తెఱవపోలె.

భార. భీష్మ ౩ ౧౭౨

గీ. తారకాధీశకిరణకదంబకంబు, చిలికెఁ, బలుచని వలిపంపు జిలుఁగుమంచు.

పారి. ౨ ౪౮

సీ పలుచనిమాత్న పల్కలము గట్టి .

డై భా. ౭. ౫౫

౨. స్థూలము కానిది.

సీ. జాంబూనదచ్ఛాయచందంబు వర్ణంబు గలిగిపలుచని గనపతేను. భార. ఆశ్ర. ౨.౪౦.

క. పలుచనినా తెలు మెఱుఁగువఁ, బలు మెఱుఁగులు సందడింపఁ జాపటపై వం, జలిఁ జేర్చి జలుఁ జాపులఁ, బలుకులఁ బలుకండ మెంటుకఁ బలికెడ గలఁకెన్.

మనుచ. ౪. ౬౦.

౩ అల్పము, తక్కువైనది.

ద్వి పరిమళమిళితమై పలుచనిగాలి, పొరిఁ బొరి సభలోనఁ బొలుపార నపుడు ౨౦. రా ఈ ౧౬౭ పొ ౨౦ పం. (పలుచనిగాలి=మందమారుతము)

౪. తేలికయైనవాఁడు, గౌరవశూన్యుఁడు.

క మతిమంతుఁ డగు నుమంతునిఁ, బతిమన్నన సేయ నన్నుఁ బలుచగఁ జూచున్, సతతంబు దాన గర్వాన్వితుఁడై యున్నాఁడు వాఁడు నీరజనేత్రా. సారంగ ౩ ౧౩౨

ద్వి పతి నన్ను నెప్పుడుఁ బలుచగాఁ జూచు మతిమంతుఁ డనుచు నుమంతు మన్నించు.

నవ. ౨. ౧౦౭. పొ ౭. పం.

౫ అనుకు, చిక్కన కానిది

సీ ఏడు సాగరములు నిక్క దక్కడఁ బెట్టి పలుచనిరొంపి మై నలఁదికొనఁగ.

భార. విరా ౨. ౧౩౪

చ పలుచనియంబళుల్ చెఱకుపాలెడనీళ్లు...

ఆము ౧ ౭౧

జః పలుచఁజేయు, పలుచఁబడు, పలుచఁబాఱు, పలుచన, పలుచనగు, పలుచని చూఁపు పల్చన, పల్చనగు

**పలుచేఁజేయు.** సం. క్రి (√పలుచే)

౧ తగ్గించు; పొ గొట్టు

గీ, దృశ్యముల సంక్షయంబును దెలియఁజేసి, పరఁగ రాగాదివికృతులఁ బలుచఁజేసి, చెలఁగి యుపరతి నుదయింపఁజేయు నెద్ది, యదియు బ్రహ్మానుసంధాన మనఁగ బరఁగు.

వాసిష్ఠ. ౨. ౮౮.

౨. పలుకనఁజేయు, ఎల్లిదముచేయు.

గీ. ప్రాణవిభుఁ బాసి యతిథిసపర్య ద్రోసి, బంధు
వుల రోసి పుత్రులఁ బలుచఁజేసి, యట్టు
డిగఁదీసి యిట్టి శారదవి డాసి, గాసిఁ
జెందఁగ నిం కేమి గలిగెవాసి

దశా. ౫ ౩౭

ఉ పావనదృగ్విలాసములు బాహ్యగతిం బచ
రించి చంద్రికా, శ్రీవిభవంబులం బలుచసేయు
ముఖప్రభ లుల్లసిల్లఁగా, పాండు ౨ ౧౬

పలుచఁబడు. అ క్రి (√పలుచే) పలుచ నగు—
చూ పలుచఁబాఱు (పలుచపడు శ ర)

పలుచఁబాఱు. అ క్రి. (√ పలుచఁబడు)
పలుచఁబడు, కృశించు

సీ ప్రత్యర్థి నరరాజభయములతోఁ గూడఁ
దళుకులేఁజెక్కులు బలుచఁబాఱె

దశా ౪ ౧౨౬

పలుచన=పల్చన. విణ (√పలుచే) లఘువు,
బరువు లేనిది; గౌరవశూన్యుఁడు

క ఒలము చెడి నీళ్లకంటెను, బలుచన రైతి రిఁక
మిమ్ము బాధింపఁగ . ఉ రా ౩ ౪౦౨

సీ అగువరుం డని తార తడవి కూర్చక మున్న
బంధుల కి సేల పలుచ నైతి...

ఉ హరి. ౫ ౧౧౪

చ ..రాజకన్యకలధర్మము గా దిది యంచు
బంధువుల్, పలుచన గాఁగఁ జాతురొ
పాయపుఁగోరిక లేమి చేయుదున్

రాజ. చ ౩. ౯౯.

—వి ౧ లాఘవము, బరువులేమి, చులుకఁ
దనము

చ. జలజవిశిష్టతోయములు సందులక్రిందుగఁ
దోఁచుచుమింటి నీడలుఁ గనుపట్టె నత్తఱిఁ
దటాకములనల్లఘిమంబు రెంటిలోఁ, దెలియఁ
దరంగఁ బై రాగయతేటుల చేయులఁ దూన్పఁ
దోఁచుచున్నల్పతనఁ దేలె మి న్నదొగఁ
బట్టె గడుం దశ చూటకో యనన్.

ఆము. ౪. ౧౫౧

౨. సన్నదనము. ౩. పలితిలనము. ౪. అవుక
దనము (శ. ర.)

పలుచనగు. అ. క్రి (√పలుచే) అల్ప మగు,
తక్కువ వగు, ఎల్లిద మగు, చులక నగు.

ద్వి. చులుకనై తోఁచె నిచ్చో దొంతనము,
పంచనయ్యెను వాని ప్రజ్ఞలనంగ ద్వి తి
పా ౨౨౫ పా ౧౭. పం

గీ సిరి తనయింతటని జాలె నీరజాక్షి, కార
యభిమానరక్షకు లైనవారు, దొలఁగు సమ
యంబునను దాము తొలఁగి పోక, పరులచేఁ
గ్రోపుఁ బడుదురె పలుచ నగుచు

దశా ౩. ౭౫

(పలచనగు - అపముద్రితము )

గీ అతులాహార్యవందన యలసపవన, జాలములఁ
దూలగితిఁ జాఁఁ దూఁ దొడఁగె, గరిమఁ
దా నెంతయుచరేంద్రకన్య యైనఁ, బలుచ
నగుఁగాదె ఘనవనుప్రార్థనమున.

వసు ౩ ౧౦౩

సా మంచి రొక్కువైన మజ్జిగ పలుచ నగును.

పలుపట్టడ. వి —సంకరజాతిజనము.(శ ర ప్రా.)

పలుపు. వి (సం పలాపః) పసులు గుఱ్ఱములు
మొదలగువాని మెడఁ గట్టెడుత్రాడు, తిలుగు.

పీ. దామెనలును పల్లెత్రాళ్లును బలుపులు గవ్వము
గ్గాడవలికత్తి. హరి. పూ ౭. ౨౧.

క. పలుపులఁ గాండ్లుం బగ్గం, బులఁ దన
యస్త్రంబులునరి పాడి సేసిన వి, ప్పలవిడిఁ
బౌతిడు ష్యం, బల సేయుఁడు దివిజరాజ
పుత్రుఁడు గృశతోన్. భార.విరా. ౫. ౫౩.

(మన్మథరథ వర్ణనము.)

సీ. ఫలరసంబులఁ జొక్కి పలువలై పక్కుకు
చిలుకల పలుకుల కులికియులికి
విక్ర. ౪ ౭౦

౨. దుష్టుఁడు, దుర్మార్గుఁడు.

గీ కిరటి యడిగొట్టు పలువ... మొండి, కట్టె
వాఁ గను కుజనాఖ్యగాఁ గొలంగు
ఆం. శా ౩ ౪

క కలఁకయు నలుకయు నెదలో, మొలవఁగ
నమ్మేటి సోకుమూఁకలకోఁ డో, వెలియల
నిన్నిటుచేసెన, పలువల తెఱఁగెల్ల శేఱు
పఱుపు మటన్నన్
అచ్చ రా అర ౧౬. కు సం ౧ ౭

పలువడి. వి (√పలుగు) దౌష్ట్యము

సీ పలువలై చిలుకల పలువకు లుడిగింతు నని
పల్కు నల్ల యింపొగఁబల్కు
కు సం ౧. ౬

పలువరింత. వి పక్షివిశేషము హంస ౩ ౧౩.

పలువిత్తు. విణ (పలు[1] + విత్తు) పలువునకుఁ
బుట్టినవాఁడు, సంకరుఁడు, దుష్టుఁడు

పలువ(ల్వ)రుస. వి (పలు[2] + వరుస) దంతపంక్తి

వ... భూపాగిత్యుని పలువరుసయుంతెంబున నుప్ప
తిల్లు క్రుల్లు మెఱుంగులు .
భీమ ౫. ౧

సీ. వీడెంపుఁ బలుకెంపు విరిసి వెన్నెలగాయ
వరిగింజ నొకటఁ బల్వాసుస దోమ
ఆము ౧ ౭౦ యయా ౪ ౩౧.

—ఇట్లే పలుచాలుపు మొ

పలువుంద్రు=పలుగుంద్రు. (శ ర.)

పలువురు=పలుగురు. స ఐ (√ పలు 1—
పలు శబ్దమునకు మహన్మహార్థక రూపము)
అనేకులు.



క. అప్పురుషునఁ బెఱిఁగిన నృపు, లిప్పుడు భారత
రణోపహృతు లై పలువుర్, సుప్పలు గొనఁ
బడి రనికిం, దప్పనవాఁ డొకఁ డొకండ
ధర నంతంతన్ భార. శాం. ౨. ౯౭.

క పలువురు కొడుకులు విప్రుఁడుఁ, బలు
పాటులు పడుట తేటపడ విని కరుణం,
దలకొని తన చిత్తమునకు, నెలమిగ నా చేతి
రత్న మిచ్చితిఁ బ్రీతిన్ దశకు ౪ ౧౧

చ... అయ్యలఘుఁడు దాని నీ కునికి నాగ్రహ
మూఁది మదీయభృత్యులన్, బలువురఁ
బుచ్చితిన్ ఽలమిఁ బట్ట సమర్థత గల్గు
వారలన్ పె శకుం ౨ ౧౨౨

పల్కు(లుకు)జేవరాలు. వి (పలుకు[1] + జవ
రాలు) వాగ్దేవి, సరస్వతి

ఉ అంచలతేరఁ బల్కుజవరాలును బొక్కటి
తమ్మిగద్దె క్రొ, మ్మించుల నీనుమేను... తీ,
వంచమొగంబులం గెలుగువాఁడు చెలంగును
వేల్పుఁబెద్ద రై. విప్ర. ౧. ౨౩

పల్కు(లుకు)తేజి. వి (పలుకు[1] + తేజి) చిలుక,
శుకము.

గీ ప్రాణనాయక యిడ చూడు పతులఁ గూడి,
పాయకుఁ దటంచు సతులకుఁ బల్కుతేజి,
పాడుసాహి శికాచేసి పంపు కాగి, తంపు
పరమానువోలె సుధాకరుండు.
దశా. ౩. ౪౫.

పల్గొ(లుగొ)మ్ముల మొకము=(√పలు - దంత
ములే కొమ్ములుగాఁ గల మొకము.) ఏనుఁగు,
ద్విరదము.

సీ. మేటిపల్గొమ్ముల మొకపురాకుటుములు బలి
తంపు బఱపుగుబ్బలు గాఁగ
నీలా. ౧. ౨౪.

పల్చన=పలుచేన. (√పలుచే)
(చూ. పల్చనగు)

పల్చనగు=పలుచేనగు. (√పలుచే)
(చిక్కనిది కాని దగు)

శా. పూ పై తిన్మకరందమై కరంగంబోంబో
నీర్గతం బల్చనై వైజ ౧. ౧౩౯.

(సాంద్రము కాని దగు,దట్టము కాని దగు,దళము కాని దగు)

సీ. అగరుగంధము చెక్కలందుం బల్చగలంగి
రొద లింగపేటికం గుదురుకొల్పి
చెన్న ౧. ౨౩౩.

(చిక్కు, కృశించు)

చ మనమున కుత్సితం బొసంగ మంత్రికిం బట్టపు
దేవి గర్భకో,ధనమునం బల్చనై వెలువు
పైకొను ముస్గిలసెమ్మెగంబుతో
శివరా ౨ ౪౪

సీ పరమాన్నరుచి గ్రోలం బరపదార్థములందు
నరుచి పుట్టెనో పల్చనయ్యెం దనువు
దశా ౭ ౧౪

పల్పొక=పలుపోక వి (√పలుగు) చెడ్డతనము, దుష్టత్వము

మ ఇది యే మిచ్చటి కేల వచ్చితివి నీ కింటం
బను ల్లేవె యెప్పుడు పోపో పతి యూర
కేనియుగ నీ పల్పొకశృంగారముల్, సుద
తుల్ సేయుదురే. శశాం 3 ౫౯

పల్యంకము. సం వి అ పుం ౧ పర్యంకము, మంచము ౨ బృసి, యత్యాదులయాసనము 3. యోగపట్టె ౪ మంచె (శ ర)

పల్యయనము. సం వి అ న ౧ గుఱ్ఱపు పల్లము. ౨. గుఱ్ఱపువాగె, రశ్మి (వాచ)

పల్యయనుఁడు. సం వి అ పుం కూటస్థుని నుండి యేఱవపురుషుఁడు, ప్రపౌత్రుని మనుమఁడు. (వై ని)

పల్ల=పాల. విశ. (సం పాటలః) ౧. పాటల వర్ణము గలది, ఎఱుపు మించిన తెలుపురంగు కలది

క నానాతీర్థసతతను, స్నానంబులం బల్లలైన
జడలును భిక్ష, నూనోపవాసకృశ మగు
మేనులు నై వారతపము మిక్కిలి మెఱ
యన్ భా. అను ౫ ౨౫.

గ్వా పల్లమీసములు సేగ్వ కుకాయకిన్న
బస. పు 3. ౧౧౧౬. పం ఈ హా ౨ ౧౨౭

౨. ఎఱ్ఱనైనది

సీ పల్లచీమల వత్రిభ తికియుంబోలె స్వా
దుప్పటి నొప్పకిత్తవాని. ఆము ౬ ౧౯

సీ పై నుండి క్రింకికిం బర్వసీగరుటేలు గాడల
ప్రేలెడుపల్లజలు గాంగ యుగూ ౨ ౩౬.

జః పల్లకట్టు

పల్లకట్టు. విశ (√ పల్ల) పలవన్నె మాపట్టు నగి (శ గ) పల్లవన్నె కలిగి కనఁబడునది

పల్లకి(కీ)=పాలకి, పాలన. వి (సం పల్యంకికా ప్రా పల్లంకో క పలకి త పల్లక్కు) మనుష్యులు మోసెడి యానవిశేషము

సీ పల్లకి పల్లకీ పాలకి పాల్కి నాఁ బల్యంకి
కాఖ్యలు పరగు...సాం ని స్థావ ౬౪.
ఆం భా ౨ ౨౦౧

చ శకునమనోజయంబుగం బ్రశస్తముహూర్తము
నందు వేడ్కఁ బ, లకులు గదల్చి పెట్టెల
కెలంకుల సాత్యకిం బోసం బంచి...
జై. భా 3 ౬౧.

ఉ. పల్లవపాణి యిందుమతి పల్లకిలోపల బంధు
కోటి రం, బిల్ల స్వయంవరస్థలికిం జేరను
నందు ముదంబు భాసిలఁగ.
ఇందు. ౫. ౧౦౫.

క. అంచలవెత్తలవడిజం, కించుచు బంగారు పల్లకియెక్కి ప్రయా, ణించు పెదంగాంతలక, ప్రాంచలమున నొకమహోగ్రఫణి యెదురగు చున్ — హై. భా. ౭. ౧౫౫

సీ. అల్లంతఁ గని నంత పల్లకీ డిగ్గి భూవల్లభుల్ మ్రొక్క దీవెన లొసఁగుచు. — దశా. ౪. ౧౯౦.

**పల్లగించు=పల్లించు.** ౨. క్రి (√పల్లము²) పల్లముకొట్టు (శ ర.)

**పల్లట=పల్లటము.** వి (సం పర్యస్తం ప్రా. పల్లట్టో, పల్హత్థో శ పల్లట) ౧. వ్యత్యాసము ౨. చలనము (శ ర.) ౩ కష్టము

(చూ. పల్లటపెట్టు)

జ' పల్లటపెట్టు, పల్లటించు, పల్లటిలు.

**పల్లటపెట్టు.** స క్రి (పల్లట+పెట్టు) బాధపెట్టు, కష్టపెట్టు.

చ. పరమగతి న్మహామునులఁ బల్లటపెట్టవె యట్టు నీకు నో,కరువలి మేఘవేణికల గావి రొనర్చుట ధాత్రిఁ జిత్రమే — వేం పంచ ౪ ౧౩౩.

**పల్లటము=పల్లట.** వి ౧ కష్టము

గీ. చోద పల్లట మల్లట చోడుమ బడ,ప యిడు మగచాటు బా మనఁ బరగుఁ గష్టము... — ఆం భా ౧. ౧౫౦.

ఉ. నీ,పైరుగదమ్మ మల్లికలు పల్లట మందఁగ నేల వానికిన్ — వేం. పంచ ౪ ౧౭౯

౨. చాంచల్యము

ద్వి. భూతంబు సోఁకెనో బుద్ధి పల్లటమొ, పైత్యంబు హెచ్చెనో భ్రమసెనో కాక, చిత్తవైకల్యంబు చెందెనో ... — ప్రభులిం. ౨. ౬౯. పొ. ౨. పం. ౩.

వ్యత్యాసము. (శ. ర.)

**పల్లటి=పల్లటీ.** వి. (శ పల్లటు) ౧. మల్లవిద్యావిశేషము.

వ . మొగ్గరాలుటలును మురటి పల్లటి మొదలగు లాగు లెరుసలును. . మల్లుం పు ౩ ౬౯.

౨. నాట్యభేదము

సీ లాగు మైసిరియుఁ బల్లటియు కేత్రియు బెళుకు విలసిల్లు ఒక్క శిలిధ ముక్తి ... — ఉ రా ౬ ౧౩౯.

గీ లాగు మైసిరి బెళుకు పల్లటియు గులుక, జక్కిణి నటించి... — సమీగ ౩ ౨౧౪

౩ (పల్లటులు గొట్టునది) పావురము, పారావత విశేషము

ద్వి భావించి నీమదిఁ బల్లటిఁ దేఁగఁ, బోవల దట్టి పావురములు లేవె — ద్వి శ సా ౧ ౧౯ పొ. ౧౦ ౨౦

**పల్లటించు=పల్లటిల్లు** అ క్రి (√ పల్లటి) పరితపించు.

శ పలవించు బల్లటించున్, ఇలపల కన్నీరు నించుఁ ౭నివాఁ డంచున్, విలవించున్ బొలు పెంచున్, దలవరులకు నప్పగించుఁ దిల యటు వంచున్ — సారంగ ౩ ౧౦౩.

**పల్లటిలు=పల్లటించు.** అ క్రి (√ పల్లట) ౧ పరితపించు, దుఃఖించు

గీ వగచె దుగపిల్లె వందురెఁ బల్లటిల్లెఁ, బొక్కె నన నంగలార్చె నాఁబొల్చి యుండు. — ఆం. భా ౩ ౧౦౨.

౨ చలించు, అదరు.

ఉ .సమగ్రబలంబుతోడ భూ, భాగము పల్లటిల్లు — దిశకు ౨. ౯.

ఉ తల్లి ధరిత్రిపై నొఱగి తల్లడపాటునఁ జెంది చిత్తముం, బల్లటిలంగఁ బ్రాణములు వాసినఁ జూచి కలంగక... — భాగ. ౧. ౧౧౯.

గీ. బలసి కూలీలు నొడ్డీలు పల్లటీలు,. .

హంస. ౫. ౧౪౩

3. ప్లుతగతిభేదము, గంతు, దుముకు

గీ... ప్లుతగతిభేదంబు జంగ గంతు,దాఁటు పల్లటి దుముకు నాఁ దనరు నభవ

రా ఆం భా ౨ ౧౯౭

జ. పల్లటీల్గొను, పల్లటీల్దాఁటు, పల్లటీల్ద్రొక్కు, పల్లటీల్వైచు.

పల్లటీ(లుగొ)ల్గొను. అ క్రి (పల్లటీలు + కొను) ౧ ఎగురు, దుముకు.

గీ పల్లటీల్గొని కవ గూడి పావురంబులు ..

భాను ౪ ౭౭

ఉ ఆవ్వీరవరుల్ మిథోవితతవీరగసాగ్ర కటాక్షభావగంభీరతఁ బల్లటీల్గొనుచుఁ బేరెమువాఱుచు . కళా ౭ ౯౯

ద్వి పనజపంక్తులమీద వడిఁ బల్లటీలు,కొనుచుఁ గుందములపైఁ గునిసియాడుచును,

ద్వి పరమ ౪ ౨౩౬

౨ కవియు,కూడు

గీ అంగుళీయకఖచితంబు లైనమణులు,డాలు నఖకచితోఁ బల్లటీలుగొనఁగ

విప్ర 3 ౭౫

పల్ల టీ(లు)ల్దాఁటు = పల్లటీల్గొను.

(√ పల్లటీ)

(దుముకు)

సీ తెగనిండఁ దిగిచి ...లకుఁ బొట్టేళ్లలు చూపి పల్లటీల్దాఁటువారు. కళా. ౭. ౪౧.

పల్లటీల్ద్రొక్కు. అ క్రి (పల్లటీలు + త్రొక్కు) దుముకులాడు.

సీ. సారెసారెకు దంతచకచాల్ బయలెక్కి కిచి గిక్కులఁ బల్లటీలుద్రొక్కు. చమ. 3. ౯౦. (ఇట వ్యాపించు అని భావము.)

పల్లటీ(లువై)ల్వైచు. అ. క్రి. (పల్లటీలు + వైచు) పల్లటీలుగొను

ద్వి. తెల్లపావురమిది తెలిచి గల్గినది, పల్లటీల్ వైచు ..ద్వి శ. సా (శ. ర. గ్రా. పా.)

పల్లణించు. అ క్రి (క పల్లణిము) జీనువేయు.

గీ త్రాళ్లు వైవక దంతులఁ దఱుమువారు, సిడెము త్రిక గథముల నడుపువారుఁ, బల్లణింపక మాయములఁ బఱుపువారు

చంద్ర. ౫ ౧౨౯.

పల్లన(ము)=పల్లము. వి ౧ పల్యాణము, గుఱ్ఱపు జీను

ఉ. అంగన నాదరించి వసుధాధిపుఁ డాక్షణ మాత్రలోఁ బురప్రాంగణభూమి సాహిణి రియంబునఁ బల్లనకట్టఁ బట్టపా, రంగజవంబుఁ గల్గినతురంగము నెక్కి కదల్చి కాళవా, త్తింగదియంగ వచ్చి డిగి చిద్వనధి న్మొగలేటఁ గ్రుంకుచున్ కాళ ౪. ౨౦౧

గీ మాయముఁ బల్లన కట్టు తెం దతిరయమున

పరమ. 3. ౧౧౧

సీ. బంగారుమెఱవడి పల్లనంబులతోడఁ గెంబట్టు కీలుపక్కెరలతోడ, పి. శకుం. ౧. ౧౧౧.

౨ పల్యాణము, అంబారి.

శా .కుముదస్తంబేరమం బగ్రతో, భూమిం బల్లనఁ గట్టు రానసిరచిమ్ముఫుత్తల్వ్యాజృంభింప సంగ్రామోచ్ఛం బలలాళి రేఁగె నునుజన్మాం ధాంతిగారూఢుఁడై. పారి. ౪. ౭౦.

ఉ. ఏనుఁగుపల్లనం బడిన కెడికులు వళమే వహింపఁగా. విక్ర. ౫. ౧౩౨.

పల్లపుఁబంటు. వి (పల్లము[1] + పంట) నీరాన రాను పండెడిపంట (శ. ర. గ్రా) కాలువలు చెఱువులు మున్నగుజలాధారముల బహోయమునఁ బండెడుపంట.

పల్లము¹=పల్లు, పల్లుడు. వి (సం. పల్వలమ్. తె. పళ్లం) నిమ్నస్థలము, గుంట.

గీ అకట కాశా(ప్రయాణాంతరానువృత్తి, నుదక మున్నతి భూమిపై నుండలేక, పల్లమున కోడిగిల్లినపగిది నతిఁడు, కదలెఁ దీర్ఘాంతిరము నకుఁ గాశినుండి కాశీ. 3 ౧౦౦.

వ...మిఱ్ఱుపల్లంబులు సరిగా నంపజాలంబుపగిగిఁ గురిసి .. హర ౨ ౨౩.

వ. ఇట్లు క్రమంబునం దమంబు నిగిడి మిఱ్ఱు పల్లంబు లియ లోలం బని యేర్పఱుప గా కున్న సమయంబున విక్ర ౬ ౬౭

విణ నిమ్నము.

సీ...పల్లము నవుకుఁ బల్లనఁగ నిమ్నంబు దనరు ఆం. భా. ౧ ౧౫౭

ఉదా: పల్లపునేల.

జ: పల్లపుఁబంట

పల్లము²=పల్లన, పల్లనము. (సం పల్యాణమ్ ప్రా. పల్లాణం)

మ మదదంతావళదంతిముల్ నఱకునమ్మావంతు లుద్భ్రాంతిలన్, బెదగం బల్లము గుఱ్ఱమున్ గవుతునన్ వేటాఱుకుండెంబులై, చెద రంగా . విక్ర. ౬ ౪౯

సీ అరిదిసింగపుఁబల్ల మమరించి శ్రీరాజ మేలుఁ దేజికిఁ బదివేలు సేయ విజ వి పీఠి. ౨౩

మ కిలువ పూపల్లంబు కురువేరువాలులును తమ్మితూండ్ల(ప్రక్కల పల్లంబులును గల పచ్చ తెక్కలహుమాయి సెక్కి...

సానందో. ౫ ౯౧ పా

సీ ..పల్యాణ మొప్పును బల్ల మనఁగ ఆం. భా. ౨ ౧౯౯.

జ: పల్లగించు, పల్లించు

పల్లము. సం. వి. అ. పుం పెద్దగాదె, ధాన్యము పోసెడి పెద్దగరిసె.

పల్ల అపులు. వి. బ. (పలు+అఱపులు) సీచపు మాటలు, దుర్భాషణములు.

క. అని యీగతిఁ బల్లఱపులు, గొనకొని యఱ వంగ విప్రకులజునితో నమ్మను కేంద్రుఁ డధిక ధైర్యంబున నిట్లని పల్కె శంకఁ బొందక తెలివిన్. హరిశ్చ ౪ ౧౦౯.

క ఓరి దురాత్మక కామా, రారాములతోడ నీ వఱచు పల్లఱపుల్, సైరించితి మింక నూఁక, నో ర్తెత్తితివేని మిగుల నొత్తుపు సుమ్మీ పరాహ. ౧౧ ౯౧.

చ. .పతివ్రతాగుణం, బేలుఁగుటఁజేసి నాకు నుగలిచ్చిరి మక్కిటి చక్కఁజాగు పల్లఱ పులు మాని... నా పంచ. ౧ ౧౯౪.

పల్లవకము. సం వి అ. పుం ౧. ఒక దినుసు చేప ౨ అశోకవృక్షము పుం న నవకి సలయము, క్రొంజిగురు

పల్లవద్రువు. సం వి ఉ పుం. అశోకవృక్షము.

పల్లవము. సం వి అ పుం న ౧ నవపత్త్రిము, చిగురు. ౨ చిగిరించినకొమ్మ, కొమ్మ, విటపము 3 విస్తారము, విరివి ౪ అలక్తకరాగము, లత్తుకరంగు ౫ శృంగారము ౬ చాపలము. ౭ బలము ౮ ఆకు, పత్త్రిము ౯. ముంజేయి. (వై. ని) వి. అ. పుం. వెనుకటిచరణముల యందలియర్థము ననుసరించి సంగీతము మొదటఁ జెప్పెడువాక్యము, గీతావయవము

మ.. శే, ల్గదలింపన్ సుకుమారపల్లవనవైలా లక్ష్మి వీక్షింప మ, ట్పదియుం బోల్చు...' గేయవాక్ప్రోద్ధిమన్ వసు. 3. ౫౯.

పల్లవుఁడు. సం. వి అ పుం. జారుఁడు, విటుఁడు.

పల్లవాదము. సం వి అ పుం. లేడి, హరిణము.

పల్లవాధారము. సం. వి. అ. పుం. శాఖ, కొమ్మ. (శాఖ.)

**పల్లవాస్త్రుఁడు.** సం వి. అ. పుం. మన్మథుఁడు, చిగురుటాకులు ఆయుధముగాఁ గలవాఁడు.

**పల్లవి.** సం వి ఇ్ పుం—పల్లవము లుగలది—వృక్షము, చెట్టు. పల్లవము

**పల్లవించు.** సం అ క్రి. ౧ చిగిర్చు, విరివి యగు, అతిశయించు

క గిరుల్లెల్ల జలము లయ్యెన్, దరులెల్లను పల్లవించె ధరణిగిగములూ, చరులెల్లను జొక్కిరి హరి, మురళీరవామృతము సోఁక మద్దియ కంటే భాగ. ౧౦ పూ. ౭౯౫

సీ. పాటబాడుదు రొక్కచోట మోటులు పలవించి కోయిలలకు విందుసేయు

ఉ రా ౧ ౧౭౦.

ఉ...మోదమున న్మగి పల్లవింపఁగా...

దశకు 3 ౧౬౫

చ. గిజభుటలం గనుంగొని వికాసము మోమునఁ బల్లవింపఁగా భార భీష్మ ౭ ౨౦౭

గీ బహుళకారుణ్యసంపద పల్లవింప

భాగ శాం ౫ 3 ౯

౨. రాగిల్లు, రక్తిని పొందు

సీ ఒకకొంతప్రొద్దు ఖాండికిజనంబు లానర్చు పరిహాసగోష్ఠికిఁ బల్లవించు శివరా ౭ ౯౭

ఆ. లీల వంది నెక్కి లేవ్వ దొలుకాడఁ, బణఁతి కథయ మీయఁ బల్లవించి,భక్తబాంధవుండు భవుఁడు ప్రత్యక్షమై, శైలరాజపుత్రిప్రోలనిలచె వీర. ౭ ౫౦౭

**పల్లవికుఁడు.** సం వి అ పుం కాముకుఁడు, విటుఁడు. (వాచ)

**పల్లవితము.** సం విశే. (అ. ఆ అ) ౧. చిగిరించినది. ౨. విరివిగలది, విస్తారయుక్తము

3. లాక్షారక్తము, లత్తుకచే సొట్టుబడినది. (శేు. వి.)

**పల్లవిలు=పల్లవించు.**

క. జనపతి మునిపతిఁ బూజా, వినతి నతి క్రియలఁ బల్లవిలఁజేసి ప్రియంబున వీడు కొలిపి తానుం,జనియెఁ గొలువు విరిసి రత్నసదనంబునకున్. శేం పంచ. ౪. ౧౦౯.

**పల్లాండు.** వి (త పల్లాంటి = ఆశీర్వచనము, కావ్యము) గీతము.

ద్వి మఃవిజజనకుండు మధురాపురమునఁ, దన దేవితోడఁ బ్రత్యక్షమై మున్ను, చేడియ కూర్మి నాచేతఁ బల్లాండ్లు, పాడించుకొన్న శ్రీపతిసొంపు మీఱు.

ద్వి సాను ౫. 3౯3 పా

**పల్లాడు=పాలాడు.**

(చూ. పల్లార్చు)

జ॰ పలార్చు.

**పల్లాయనము.** వి (సం పల్యాణమ్: ౪. పల్లణ త. పల్ాణం) జీను, పల్లము.

(చూ॰ పల్లాయనంబువాఁడు)

జ. పల్లాయనంబువాఁడు.

**పల్లాయనంబువాఁడు.** వి (√ పల్లాయనము) రాతు; భృత్యుఁడు (అప్రుఁడు శ. ర.)

వ...౩న పల్లాయనంబు వారితోఁగలని మఱునడి యున్న కారవేశ్యాపుం దమ్మాటలు విని.

భార ఉద్యో. ౧ ౯౭.

**పల్లార్చు=పాలార్చు.** స క్రి (√ పల్లాడు) ఇది పట్టుభాతుక్వార్థ కానమాపక క్రియాపూర్వకము గానే తఱచుగాఁ బ్రయోగములందుఁ గానఁబడు చున్నది. ౧. పాడుచేయు, ధ్వంసముచేయు.

గీ॰ లేమ నీదయ నామీఁద లేమి వింత, తలలఁ బాల్పడవలసెను వీనిచేతఁ, గాక నీప్రాపు గలిగినఁ గడఁగి వీనిఁబట్టి పల్లార్చుగాఁజ నీపాదమాన. కవిరాజ. ౨. ౧౪౬.

సీ. పండులు గొఱకుచుఁ బదరి పాలు మ్మని మిడి
గ్రుడ్డుల నిప్పులు గ్రుమ్మరిలఁగ.
హరి వూ. ౫ ౧౪౯.

మ. అనిపం బందులు గీటుకొంచు హృదయం
బల్లాడ బాణాసురుం,దనపూ నీపలు సేను
దాఁటుదుపా వీఁ దన్యాయకార్యంబుచే,సిన
సైరింపక యుంచి...
ఉ హరి ౫ ౨౪౮

గీ ముదుసఁదీపల బిగవుగా మొప్పుగట్టి,వాఁడి
పండ్లు బిగించి చేవలఁతి రొంగిరి,
హరి ౧ ౨౦

చ ..ఆపెపో వడగండ్లన రాలెఁ గానిసాఁ,
డిలఁబడువానిఁ దిన్నయపుడే చలిఁ బండ్లు
వడంగ సేఁటికిన్. ఆము. ౪ ౧౧౬

౨ ఏనుఁగు దంతము, గొరుకొమ్ము
చ. ఏనుఁగుఁబల్లు వట్టి చూతురె .
విక్ర ౪. ౧౪౪

పంటపగఁబట్టు=పాముపలె దీర్ఘ క్రోధ మూను,
మిక్కిలి వైర మూను
ఉ. ఓర్వదు బంధుజాల మదకొత్తును మామగా
రిడే,పర్వినమాత్ర పంటపగఁబట్టును చావ...
శశాం 3 ౬౪

జః పల్లఱపులు, పల్లువాలు, పల్లొత్తు, పల్వాల్వ

పల్లుడు=పల్లము.[1]
(నిమ్నము)
(చి. ని. శ. ర. శాస్త్రి.)

పల్లువాలు. వి. (పల్లు² + వాలు) కోఱలు
ఆయుధములుగాఁ గలది,సర్పము, పాము
(చూ పల్లువాళ్ళల్లురాగట్టు.)

పల్లువాళ్ళెల్లురాగట్టు = శేషాచలము, తిరు
పతికొండ.
గీ. ఒకకృప నరుని గావఁ బె ల్లులబిల్లి,పల్లు
వాళ్ళల్లురాగట్టుపట్టు దిట్ట.
ప్రబంధ. ౫౧౬౨

పల్లొత్తు=అల్పము.
క. చిత్తేశుఁ దన్యవనితా,యత్తుం డై యున్న
నప్రియంబులు దగఁ బల్లొత్తుం బల్కక
యొప్పటి, చిత్తములో భక్తి గలిగి చెలఁగిన
పడఁతుల్ పానందో. 3 ౫3. పా
(వ్యవ.) నిన్ను పల్లొత్తుమాటయైనను అంటినా?

పల్లె¹. వి జాతివిశేషము, ధీవరజాతి
ఉదా: పల్లెవాఁడు, పల్లెగి. (శ గ)
జః పల్లెత.

పల్లె²=పల్లియ. వి (సం. పల్లీ. క. హళ్ళి, త.
పల్లి-దీనికి "పల్లి" అని రూపాంతరము ఒక
శాసనమందుఁ గన్పట్టుచున్నది )
౧ గ్రామము; చిన్నయూరు, కుగ్రామము.
గీ పల్లె కొట్టిక కోటిక కుప్పమ్ము నాఁగ నూ
రనఁగ గ్రామనామంబు లొప్పుచుండు.
ఆ సం స్థా. ౪.
శా లంచం బిత్తురు దూతికాతతికి లీలన్ బెండ
వూఁడన్న నిన్,బంచాస్త్రోపముఁ దార తార
కవయన్ బ్రార్థించి లోలోపలన్, బంచా
రాముములందుఁ బల్లెలఁ బురిం బ్రొద్దెంచు
బింబాననల్ భీమ. ౧. ౪౪.
వ...చుట్టుపట్ల పల్లెపట్టులఁ గలప్రజలు జాన
పదులు... ఉ. రా ౯. ౨౬౯.
౧ గొల్లలు మొ వారు నివసించుచోటు.
శా...గోబృందముల్, మాంగల్యాకృతిఁ గ్రోల
సెంతయును పానుగ్ర్యంబునం బందు లు,
పొంగం బల్లె సముజ్జ్వలోత్సవములం
కొంగారె నాఁటికిన్.
హరి. వూ. ౬. ౨౬.
మ...చెంతం గొండపై పల్లెలన్, గృహవాటుల్
మొరసెన్ గృహోపరిఁ ద్రిభంగిన్ ఘుర్ఘ
కంఠధ్వనిన్. మనుచ. ౩. ౫౭.
3. బడి.

ఉ. ఒజ్జలు గొట్టినన్ బడఁగ నోరఁవ కింటికిఁ బాఱు తెంచినన్, దజ్జననీవరం సమును దండ్రియు నిర్దయచిత్తులై మతుఁకున్, నజ్జగ మౌది పల్లెకుఁ జన స్వాదలించిన వాఁడు కేడ్చినన్, బొజ్జ కలంగ నాఁకొనుచు భోజన మేమియు లేక దీనుఁడై

సిద్ధిశేషధర్మము 3. అ (చి ని)

జ : పల్లెకూటము, పల్లెటూరు, పల్లెమాటు

**పల్లెకూటము**=పల్లికూటము. వి (√ పల్లె 2) చదువులబడి

చ తపమును లోఁగిట స్వాదకి తల్లి దిగుల్కొని పల్లెకూటమం,దుఁ దిలకించి.

చెన్న 3 ౧౬౫.

సీ. పంచాగిములు మాని బసివాదనముచేసి పల్లె కూటము చెప్పె పనులఁగాచి వేణు ౪౧

**పల్లెటూరు**=పల్లె 2 వి (పల్లె 2 + ఊరు)

(చిన్నయూరు, కుగ్రామము)

గీ చిన్నచిన్న రాళ్లు చిల్లదేవుళ్లు, నాగులేటి నీళ్లు నాఁపరాళ్లు, సజ్జజొన్నకూళ్లు సర్వం బులును దేళ్లు, పల్లనాఁటిసీమ పల్లెటూళ్లు (శ్రీనాథుని చాటువు)

**పల్లెత**. వి (పల్లె 1) ౧ పల్లెది, పల్లెజాతిది (శ.ర.)

౨. మాతంగి, మాతంగ జాతి స్త్రీ

గీ పల్లెత యనఁగ మాతంగి పరగుచుండు

అం భా ౨ ౧౦౫.

**పల్లెమాట**. వి గ్రామ్యవచనము (శ. ర)

**ప(ల్లె)ల్లేరు**. వి. పలంకష, శ్వదంష్ట్ర కీ.

సీ... పల్లే గనశ్వదంష్ట్ర పరగుచుండు

అం భా ౨ ౫౫

జ : పల్లేరుఁ బుర్వులు, పల్లేరుఁ బూవులు.

**పల్లేరుఁగాయ**. వి. భూషణ విశేషము. (శ. ర.)

**పల్లేరుఁబుర్వులు**=పల్లేరుఁ బూవులు. వి. బ. (√ పల్లేరు) స్త్రీ కర్ణ భూషావిశేషము.

క ముల్లు దలకొనని వరకిపుఁ, బల్లవములతోడ ముత్తిభావ చెవులకుం, బల్లేరుఁబుర్వు లగు పువు, లుల్లసిలంగల్గి-కాకి మెయిదగఁగఁ గొనుచున్

అము ౪ ౧౫౫

**పల్లేరుఁ బూ(వు)లు** = పల్లేరుఁ బుర్వులు. వి బి (√ పల్లేరు) —పల్లేరుపువ్వు వంటిది. స్త్రీ కర్ణభూషా విశేషము

ద్వి పాఁజాల కెమ్మలు పల్లేరుఁబూలు, రాజిల్లు గత్నాలరాకిడి పెట్టి

ద్వి శ్వ పా ౧ ౧౩ పా ౧౨ పం. (పల్లేరు పూలు ముద్రి పా)

సీ దండి తీరైన చింతాకుఁ దీఁగెయు నాను పల్లేరుఁ బూవులు బన్నసరము

హంస ౪ ౧౩౭

**పల్లొత్తు**. అ క్రి. (పల్లు2+ఒత్తు) పంటితో కొఱుకు, దంతక్షతములు సేయ.

సీ పంకనిశ్శంకుఁడై పారదారిక వృత్తి వదలక పల్లొత్తువాని నెడసి

వసు ౧ ౩౬

సీ విటుఁడు పల్లొత్తినఁ గటకటపడు మోవి యినుప కెల్లెములకు నొట్టు లోర్చు

చిత్ర భా 3 ౯౫

వి. దంతక్షతము

సీ. కడ లేని వీర్యంపుఁ గప్పుచందురు కావి మోవి పల్లొత్తుల మునుఁగుడన్న

పాండు. 3 ౧౦

సీ వెలరేయింత యీ మల్లికల కని పలికించి గుత్తింపుమోవి పల్లొత్తుఁ గాంచి.

రా. వి. ౧. ౫౩.

**పల్లలము**. సం. వి. అ. న. నీళ్లు గల చిన్నపల్లము, అల్పసరస్సు.

పల్వలావాసము. సం. వి. అ. పుం. తాఁబేలు.

పల్వ(లువ)ల్వ=పలువలువ. వి. (√పల్లు2) రదనవాసము—వాతెఱ, పెదవి

క. కేదార కొంగమున కన చివు, కే దారపల్వల్వతోడ నిఱిగుబ్బలయా,డే దొరయుం జక్కవకవఁ, బైదలినలు వెన్న నలువపడఁ జిక్కఁ దరోకు. అచ్చ. రా. బాల. ౧౩౫.

(పల్వయన అపముద్రి.)

పల్వురు=పలువురు. (శ ర)

పళ పళ. వి ౧. చెట్టు, అప్పడములు మొ. విఱుగునప్పుడు కలిగెడుధ్వని కనుకరణము.

క. జలసేవన ఘలఘల లప్పలముల పళపళలం భో క్తృభళభళ లబలా, వళిపట వెళవెళలంగడ, ఝళఝళ తేకిభఁ వెఁచె జనము సుతింపన్. బహు ౪ ౨౪

౨. ప్రకాశించుట యం దగు ననుకరణము. (శ ర.)

పళ్యము=పళ్లెము. వి భోజనపాత్రము

ఉ. భోజనశాలలోనఁ బళ్యం బిడివారు పంకి జదళాన్నులు కొందవజాముగంట ద్రే, యంబడె సారగింప సమయం బని చెచ్చెర విన్నవించినన్. కాశీ ౫. ౩౦౭.

పళ్ళిక=పల్లిక1. వి. ఒకరకమగుతట్ట

సీ. ఎడమచేఁ బల్లిక నిడినబండా రవ్యపాణిఁ బట్టినసాగపడిగకోల. శుక ౨. ౪.౨౪.

పళ్ళియరము=పళ్లెము. వి. భోజనపాత్రము.

చ. విశిష్టభూజతోఁ, బస నగు పచ్చడంబు నొక పళ్లియరంబును గల్గఁ దప్పితిన్. హ్యా. ౨. ౧౭.౨.

పళ్ళు. వి. ౧. కుండ మొదలగునవి పగిలినప్పుడగు ధ్వని కనుకరణము.

క. పవిబాణము కొండఁ దాఁకి పళ్ళున విఱిగెన్. కవి. ౫ ౧.౯.

౨. చెంపను కొట్టునప్పుడు కలుగు ధ్వని కనుకరణము

(వ్యవ) వాఁడు పళ్లున ఒకచెంపకాయ కొట్టినాఁడు.

పళ్లెము=పళ్ళియము, పళ్ళియరము, పళ్ళెరము, పళ్యము. వి ౧ భోజనపాత్రము.

సీ కెండియొడ్డవలపై వెలిచి తెచ్చినక్షైఁడి పళ్లెంబు లాయత్తపఱచువారు వైష. ౬. ౧౦౪

౨. తాంబూలము మున్నగునవి ఉంచుకొను పాత్రవిశేషము.

చ ఘనతర రత్నదీపకళికా శతమానమనోహరంబు లైతనరునివాళి పళ్లెములు తామర సాక్షు లొసంగ నేర్కతో, భార ౪ ౬౧

క ఇల్లలికి ముగ్గువెట్టి మ్మహోల్లాసము పల్లవింప నొక్క మెఱుంగుం, బళ్లెమునఁ గోసి పైచిన, యల్లజటాఖండ మిడియు నలరులతోడన్ శుక ౨ ౨౩౦.

గీ. పళ్లెరము పళ్లె మనఁగను పాత్ర మొప్పు ఆం. భా. ౨. ౨౪౪.

పళ్ళెరము=పళ్ళెము. వి. ౧. తాంబాళము, తాంబూలాదు లుంచుకొను పాత్రవిశేషము

వ... దాక్షారామ శ్రీ భీమేశ్వర మహాదేవరకు నైవేద్యానకు నిక్కవ్రోలను రెండుపుట్ల క్షేత్రముం ను నైవేద్యము సమర్పణచేయం బళ్లెరమును సమర్పణ సేస్తిమి... ద శా. ౪. ౧౩౪౩.

దండకము...బాశ్యనాయక్ భయం చేది చేది క్షమావల్లభుం డెంతయుం ద్రవ్యం బిల్లదం

శాడినం బళ్లెరం శెత్తి చిత్రంబుగాఁ దచ్చిరణ రత్నప్రాధి వర్తించి...
పారి 3. 3౮

గీ పసిమి పదియాఱువన్నె యపసిఁడిపళ్లెరమున శివునిపదాబ్జంబు లమర సునిచి,శేలుఁదమ్ముల రితనంపుగిండి వంచి,యనుఁగుటిల్లాలు నీరు వోయంగఁ గడిగి
జాహ్నవీ ౧ ౧౫౮ దశా ౪. ౧౪౩.

౨ భోజనపాత్రము

గీ పచ్చతామానికింబులపళ్లెరములఁ,బచ్చ గందని కూర లేర్పడమిఁ జూచి
సైవ ౬ ౧౨౨

క. ఆనీలవేణి యాదవ,భూనాయకుఁ డారగింపఁ బోయెడుపేళ్ళ,దా నయి పళ్లెర మిడియెడు, దానఁగదా యనఁ తపసితగులున నుండెన్.
శాళ ౧ ౪౪

గీ వారువు మిాఁ శిడిపసిఁడి పళ్లెరమునందు, రస రసాన్నము లిడి యొళరాజవదన,
రసిక ౧. ౩౬

౩. పళ్లెరముపెట్టు.

పళ్లెరము పెట్టు. అ క్రి భోజనపాత్రములో పదార్థము లన్నియు సిద్ధముచేసియుంచు

చ అతివినయంబునన్ సరసిజాక్షులు కొందఱు పళ్లెరంబుపెట్టితి మని పిల్వఁగా...
వరాహ ౪. ౧౩౨

చ. అతనికి సత్యభామయు మురాసురవైరియు నాశిశ్రేయస,త్కృతు లొనరించియుండఁగ సతీమణు లిద్దఱు పళ్లెరంబుపెట్టితి మని విన్న వింపఁగ...
పారి. ౨. ౧౪.

పవ=పగ. వి. విరోధము.

క. పరమాన యిందు సీతలఁ,పవమానప్రభవు యవద లంచుకు దయఁజూ,పవ మానపచరితా స్త్రై,పవమానప్రపూతి గాదు పవ మాన వశా.
రా. వి. ౪. ౬౧.

పవడము=పగడము. వి. (సం. ప్రవాళః, ప్రా. పవాళో క. పవళవు, పావళవు. త. పవళం.) ప్రవాళము, విద్రుమము

సీ. పవడంపుజొత్తులఁ కెవుల రూ పడఁగంగఁ శాపటఁ దలశట్టుభంగి గప్పు
భార. విరా. ౧. ౨౭౬

సీ పవడంబుమిాఁది కోపమునకో యాకాంతి పాదంబు లత్యంతపాటలములు.
సైవ. 3. ౨౦౨. కువల. 3 ౨౨

పవడపుఁదీవె(ఁగె)=విద్రుమలత

గీ తెలుపయధరంబు పవడంపుఁదీవెయరవు.
విక్ర. ౬. ౨౫

సీ తెలిదమ్మి విరియింటి తెలిగంటి కెంపువా తెఱసొంపె పవడంపుఁదీఁగెగుంపు.
దశా ౧ ౧౬౪.

పవ(వ్వ)డించే=పవళించే. అ క్రి (క పవడిను) ౧ శయనించు, పరుండు.

క ఘనభుజగ శతఫణావృత, తనుఁడై బాలుఁడు పయోధితరఁగలమిాఁదఁ, బెనుశాపశెజ్జఁ బవడిం,చినవెన్ను నిపాటి యగుచుఁ జెన్నెస లారఁ.
నృసిం ౪ ౧౩౫.

వ...అచ్చిత్రరేఖ యమ్మచ్చెకంటి పచ్చవిలుతు రిచ్చప ట్టయిన పాన్పునం బవడించియున్న నచ్చోటికిం బోయి తప్పక కనుంగొని,
ఉ హరి ౫. ౧3౮

౨. నిద్రించు

గీ. అతఁడు పవడింప మును కౌరవాధినాథుఁ, డరిగి తలయందుపీఠస మున్నకానవమున, నుండె...
భార. ఉద్యో. ౧. ౬౫.

శ్లో. సు ప్తం దదృశతుః కృష్ణం...

శ్లో. ప్రతిబుద్ధస్సవార్ష్ణేయో దదర్శాగ్రే కిరీటి నమ్.
సం. భార. ఉద్యో. ౩. ౫౧౮.

సీ. దుగ్ధాంబునిధి నిట్టఁ దోఁచెనో యని శేషుఁ
బాన్పుగా హరి నీటఁ బవ్వడింప
కు. సం. ౫. ౧౧౫.

వ... శింశుమారాకారంబునం దారకావీథిఁ బవ్వ
డించిన పాంచజన్యధరు నారసి...
కాశీ ౨ ౯౫.

పవతుండు=పగతుండు.

క. యువతికిఁ బ్రాణం బయ్యెం, బవతుగతిం
బ్రోఁది సేసె మలయక్షితిభృత్పవమానుఁడు
దూరితర్తై, పవమానుఁడు కొనాహదావ
పావక శిఖలన్ వేం. పంచ. ౪ ౧౫౧.

క మలద్రిమ్మరిరాయఁడ దిటు, మలరఁగ నీప
వకుపీఁచ మడఁచి పుడమి కి, మ్ముల నాడ
యనిఁ కేసెద నినుఁ, దలఁపున మామాట
నమ్మఁ దలఁకకు మింకన్.
అచ్చ రా కిష్కిం ౨౪.

పవనతనయుఁడు. సం వి అ పుం ౧ హను
మంతుఁడు. ౨ భీముఁడు
(ఇట్లే, పవనసుతుఁడు మొ.)

పవనము. సం. విణ (అ. ఆ అ) శుద్ధము, నిర్మ
లము. వి. అ. పుం. ౧ గాలి. ౨. గార్హప
త్యాగ్ని.
న ౧. ధాన్యాదులశోధనము (చెరుగుట కడు
గుట మొ వానిచే శుద్ధము గావించుట)
౨. తూర్పెత్తుట. ౩ నిష్పావము. ౪ జలము
పుం. న. కుమ్మరిఆవము

పవనవ్యాధి. సం. వి ఇ. పుం. ౧. ఉద్ధవుఁడు.
(కృష్ణునిమంత్రి.) ౨ వాతరోగము.

పవనాలము. సం. వి. అ. పుం. ధాన్యవిశేషము.

పవనాశనము. సం. వి. అ. పుం. గాలితిండి,
పాము.

పవనాశనాశుఁడు. సం. వి. అ. పుం—పాము
దిండి—గరుడుఁడు (వాలా. ని.)

పవనేష్టము. సం వి. అ. పుం. మహానింబము,
పెద్దవేము ?

పవనోంబుజము. సం. వి. అ పుం పరూష
ఫలము, ఖర్జూరపుపండు.

పవమానుఁడు. సం వి. అ పుం. ౧. గాలి,
వాయువు ౨ గార్హపత్యాగ్ని. ౩. సోముఁడు.
(వాచ)

పవము. సం వి అ పుం ౧. గాలి ౨. వియ్యము
లోనగువానిని శోధించుట (శుద్ధముచేయుట)
౩. తూర్పెత్తుట, నిష్పావము ౪. చిత్తడినేల,
బురదనేల వి. ఆ. స్త్రీ. శోధనము, శుద్ధము
సేయుట అ. న గోమయము, పేడ.

పవలు=పగలు. వి జొ. (త పగల్.) వాది
భాగము.

సీ లోనిజొంపము పవలును వెసుచీకటి వొద
వించి పొందలంగ నొప్పుదాని
భార. విరా. ౧ ౧౬౨.

చ పవలును రేలు దుఃఖపడి బాలుని నొయ్యన
బుజ్జగించి దా, నవకులనాథ యేను జత
నంబునఁ జెప్పితి రాజనీతి...
నృసిం ౪. ౧౫౨.

గీ ఉష్ణశీతాన్నకబళంబు లొకఁడు నూకఁ,
బవలొ రాత్రియు గడగూడ నవసర మని,
దాని యుత్తర మొకలకాతన్వి యిచ్చె, నధర
బింబంబు విరిచి సంధ్యాగమ మని
హైమ. ౬. ౧౩౬. భార కర్ణ. ౧. ౬౨.

పవలింటినిద్ర=దివాస్వాపము.

చ. దిటమున రడ్డి పాటుపడి తెచ్చి యిడంగను
గూటిపొద్దు సంకటితటి పెన్నమజ్జిగలు కంఠ
టిపైఁ బవలింటినిద్రలున్, వెటు కు అంఁ
జెల్లిరా...జారసంగమసుఖంబునకే తమకింతు
రిద్దఱున్. శుక. ౨. ౩౩౪.

జః పవలుపంజాలు.

పవలుపంజేలు. వి పగటిదివిటీలు.

చ అలవిరివింటిదంట మదమూరఁగ నీవెను
వెంటరా ధరాస్థలి వడిఁ జేరి యామునియు
దారతపఃక్రమమెల్ల మాన్చి యుజ్జ్వలగతి
వచ్చునీకుఁ జెలువా రోయునగూర్తు వహింప
నీనురాజలలు శిరోనతిం బవలుపంజాలు
చెంద్రిక పావదకరహిక.

చంద్రి. ౨ ౫౨

(ఇవి గౌరవమునుసూచించును.)

పవ(వ్వ)ళించే=పవడించే. అ. క్రి ౧ శయి
నించు, పరుండు.

చ . శేషఫణిపైఁ బవళించిన యంబుజాక్షుభా,
వమునఁ గరంబుఁ బొల్పమరువానిఁ గనుంగొనె
నింతి పార్థునిక.           హర ౪ ౧౨౦

సీ మునుఁగు పెట్టుచు నొక్క ముద్దియ బవళించు
బిగ్గ శేదసునీకుఁ జెలువరొయితే.

కాశీ ౨ ౧౮

గీ పండెఁ బన్నుండెను బరుండెఁ బవ్వళించె,
నత్తమించెఁ బడుండెను నమణె ననఁగ,నలరి
యుండుచు శయనించె ననుట శౌఖ్య

ఆం. భా 3 ౮3.

సీ చన్నిచ్చుబాగున జనయిత్రితొడలపైఁ బసి
బిడ్డఁ బవ్వళింపంగఁ జేసె హర ౨. ౧౧౫
ఈ రా ౫ ౧౯౧

౨. నిద్రించు

క తురగమును నీరు జలజా,కరమునఁ ద్రావించి
తా వికచపుష్పఫలో,త్కరభరవినమ్రముచూ
తాం,తరమరకతవేది నలవునం బవళింపక

శై. భా. ౮. ౪౧. (చూ ౪౫)

ద్వి. ప్రవిమలమృదులతల్పంబుపై వేడ్కఁ, బవ
ళించియున్నయప్పద్మాక్షుఁ జూచి

రం. రా. అయో. ౮౯. పా. 3. పం.

సీ. పాలమున్నీటిపైఁ బవ్వళించినయట్టి నీల
వర్ణుఁడు నిద్ర మేలుకొనియె.

విక్ర. ౪. ౫౦.

చ...బ్రహ్మరూదవించిన నిద్దురమబ్బు కంఠ
కర్ణనివెంగ మాని జాగ్రదవరోధ మొనర్చినఁ
బవ్వళింపఁగాఁ దన కోశ యిల్లి గావలయు,
దానవనాయక యంచు నన్నతో, నను
టయు...          ఉ రా. ౨. ౨౯౦.

3. ఉండు.

సీ పరమర్షి పావనపాణి పల్లవములు ఫాలభాగ
ములపైఁ బవ్వళింప          హర ౪ ౧౪౦

జ. పవళింత, పవ్వళింపు.

పవళింత=పవ్వళింపు. వి (√ పవళించే) శయ
నము, పండుకొనుట.

సీ అపుడు వైచిన పచ్చియరుగుపైఁ బవళింతఁ
గలువకాఁడై మేను గాసిఁ బొదల.

రా వి. ౨. ౪౦

సీ పాఁపఱుఁ బాన్పుపైఁ బవళింత గన్నవాఁ
డడియని ప్రోల్మాగం బైనవాఁడు.

పాంచాలీ ౧ ౨౯.

పవాక. సం వి అ (శ్రీ) సుడిగాలి, చక్ర
వాతము

పవాడము¹. వి. బిరుదు.

గీ .బిరుదము, బిరు దనఁ బవాద మనఁగను
బరగు నభవ          ఆం భా. ౨. ౧౯3.

వ . సాహితీనృత్యగీత ప్రసంగావధానంబులం
దనకు సాటిరాలేక యుండం జేరని రసికతా
విశేషంబులం గురుకురుమగధమాళవ
చోళ ప్రముఖ దేశాధి నాయకులచేత వాదం
బులం బవాదంబులు గొనుచు...

విప్ర. ౨. ౪౮

పవాడము?=పావాడము. వి. (క. పవాడకు. త. పావాడం) ఒక కార్యము కొఱకేఱకలె నని దేవునిఁ బ్రార్థించుకొని యాప్రార్థనము కొఱకేఱనిరొుదల దేవునియెదుటఁ జేయు జిహ్వాచ్ఛేద నాది సాహసకృత్యము. (శ ర. బ్రా.)

పవి. సం వి. ఇ పుం ౧. ఇంద్రుని వజ్రాయుధము, కులిశము ౨. గాలి ౩ ఆయుధము యొక్క తీక్ష్ణమైన అంచు. (వై ని)

పవితము. సం విణ (అ ఆ అ) పవిత్రము, శుద్ధము చేయఁబడినది వి అ న మిరియాలు.

పవిత్రకము. సం. వి. అ. న జనపనారతో వల్లిన వలత్రాడు. వి. అ పుం. ౧. మేడి చె. ౨. రావి చె. ౩ దమనకము, దమనము చె ౪ దర్భ, కుశ చె.

పవిత్రధాన్యము. సం వి అ. న యవలు

పవిత్రము. సం. విణ (అ ఆ అ) ౧ పరిశుద్ధము; వ్రతశౌచాదులచే శుద్ధమైనది ౨. శుద్ధి గలిగించునది (పాపాదులను బోఁగొట్టునది) వి అ పుం. తిలవృక్షము, నువ్వుచెట్టు. ౨. పత్త్రిజీవము ౩. అగ్ని. ౪. కిరణము, ఘృణి. న ౧. బంగారు. ౨. ధనము. తెల్ల తామరపువ్వు ౪ కలశము (వై. ని.) ౫. యాగములందు నెయ్యి చిలుకుటకు రెండు దర్భపోచలు, ఆజ్యసంస్కారక మగు కుశద్వయము. ౬. కొన్ని కర్మవిశేషముల యందుఁ అనామికయందు దాల్చు దర్భ యుంగరము. ౭. జందెము. ౮. జలము. ౯. రాగి, తామ్రము. ౧౦. వర్షణము, వానకురియుట. ౧౧. ఘర్షణము, రాచుట, తోముట. ౧౨. అర్ఘ్యము నర్పించెడి యుపకరణము. ౧౩. నెయ్యి, ఆజ్యము. ౧౪. తేనె, మధువు. ౧౫. గోమయము, ఆవుపేఁడ. ౧౬. మంత్రము. ౧౭. వస్త్ర, కొరడా. ౧౮. క్షీరము పాలు. (శ. ని.)

ఆ. స్త్రీ. ౧ తులసి ౨. నదీభేదము. ౩. పసుపు. ౪. అశ్వత్థవృక్షము, కండ్లరావి చె.

పవిత్రారోపణము. సం. వి. అ. న (విష్ణుప్రభృతి దేవ సంప్రదానకమగు) యజ్ఞోపవీత దానము. (ఇదియొక యుత్సవము)

పవిత్రారోహణము. సం=పవిత్రారోపణము

పవిత్రి. సం విణ. (క. జీ. వ) ౧ శుద్ధము చేయునది. ౨ పవిత్రము చేయునది.

పవిత్రీకరించే. సం స క్రి పవిత్రముచేయు

సీ ఏ దయాహృదయుల పైదోఁడు జగములఁ
బ్రొ ప్రోత రైయి పవిత్రీకరించు
క్వా. శకుం ౧ ఆ.

పవిది=పగిది. వి. (సం ప్రకృతిః) విధము

క శివునంగయుష్టి నిరియఁగ, నవిరళముగఁ
బట్టి ప్రాఁక నని కడునెమ్మి, న్నిపుడు నవ
కల్పలతికల, పవిదిని మృదుబాహులతలు
పార్వతి కొప్పున్. కు. సం. ౩. ౨౯౯.

ద్వి భవుఁ బాద నానందబాష్పంబు తొలుకు,
పవిది కేడుచుఁ గమఁగవ వక్రు లాలుక.
బస పు. ౧ ౪౧౩ పం.

పవీరము. సం వి అ న ౧. హలము, నాఁగలి ౨ రంగస్థానము (శే. ని)

పవుఁజో=పౌఁజు. (క పవుజు త. పవుంజు.) (శ. ర)

పవుఁజోలుతీర్చు=పౌఁజులుతీర్చు. (శ. ర)

పవుఁజోలునేయు=పౌఁజులునేయు. (శ ర)

పవులు=పౌలు, పగులు. అ క్రి. ౧. బ్రద్దలగు, ఛేదిల్లు.

చ. కవిసి యుగాంతదండ ధరుడై పడిఁ గోలు మసంగి కుంభమున్, పవులఁగఁ దుండముల్ దునియఁ బ్రక్కలు బ్రక్కలు గాఁగ...
భార. భీష్మ. ౨. ౩౭౦.

శ. భవజలరాశి దాటుటెడ భావజవాయువు పీచినం దపు, బ్రవహణముల్ సమున్నతము పర్వ వధూవచపర్వతావళిం, బవిలిన దీన తావికలభావము నొందిన మానివాలిక, బ్రవ రుల భావచిత్రములు వ్రాసినవారు కపోత పాలికల్. వైష. 8 ౧౫౨

ఆ. దివియు భువియు దెసలుం బవిలినగతి బ్రోయు, నిపాతశేషులైన నిగ్గగారు, లరిగి. భా. రా యు. ౧౨౫

౨. ఛిన్న మగు, తెగు.

మ...దైతేయచ, క్రవిదారత్రికచత్రిమం బయిన చక్రం బెత్తి తద్దేహముం, బవులవ్వైచినం దుంగ ప్రచ్ఛిన్నగతింబొసం బ్రకాశంబుగన్. ఉ. హరి. 3 ౧౦౪.

పవ్వా. వి బాన, వెడందమూతి గల భాండ విశేషము.

సీ...కలముఖ భాండాఖ్య తనరు బాన, పవ్వ గంగాళము బందడ మనంగను... ఆం భా. ౨ ౨౮౬.

పవ్వళింపు=పవళింత. వి. (√ పవ్వళించే) పడుక, శయనము, పండుకొనుట.

గీ. చనుం బడుక పవ్వళిం పనంగను శయనము. ఆం. భా. ౧. ౧౪౧.

పశవ్యము. సం. విశే. (అ. ఆ. అ) పశువులకు హితమైనది.

పశుఘాతము. సం. వి. అ. పుం యజ్ఞార్థము పశువులం జంపుట.

పశుపతి. సం. వి. ఇ పుం. ౧. శివుడు. ౨. పశులకాపరి, పశులసొంతకాడు 3. పాశు పతదర్శనకర్త. ౪. అగ్ని.

పశుపల్వలము. సం. వి. అ. న. కైవడిమున్నై వైవర్తకము న్న. కీ.

పశుపాలకుడు. సం. వి. అ. పుం. పశులకాపరి.

పశుపాశకము. సం. వి. అ పుం. రతిబంధ విశేషము.

పశుప్రేరకుడు. సం. వి. అ. పుం. ౧ పశులకా పరి, పశులబదయడు ౨. ఈశ్వరుడు.

పశుమల్లిక. సం వి ఆ. స్త్రీ బోటీగ.

పశుమోహనిక. సం వి ఆ. స్త్రీ కట్వి, కటిక రోహిణి కీ.

పశురజ్జువు. సం. వి. ఉ. పుం. పలుపు

పశురాజము. సం వి అ. పుం సింహము

పశువడు. మి అ క్రి యజ్ఞాదులయందు విశ సింపబడు పశు వగు (చూ పశువఱుచు)

పశువఱించే=పశువఱుచే. మి. స. క్రి. (యజ్ఞాదులందు చంపుటకొఱకు) పశువునుగాం జేయు.

సీ ..అవని నొరులు, నీయట్లు క్రూరులై నృప తులం జెఱంబెట్టి పశువఱించుచుం బశుపతి నుమేశు, వరదుం బూజించిదవారును గలరె .. భార. సభా ౧. ౧౭౭

గీ. ధారుణీసురముఖ్యు లధ్వరములందుం, బశువ ఱింపరె పశువులం బరమపుణ్యు, గతులు గలు గవె వారికి...భార అర. ౫. ౫౫. (యజ్ఞ పశువునుగాం జేయరే అని భావము.

ద్వి. నిశిత ఖడ్గాయుధాన్వితహస్తుం దగుచుం, బశువఱించుచుం గొర్ల పాలుసేయుచును. బస. పు. ౬. ౨౭. పం.

పశువఱుచే=పశువఱించే.

క. తనయుం బశువఱిచి తద్వపుం, గొని వేల్చెం జూచి యూర్తకరరీనాదం, బున వేద్చెరి కడు నడలుగం, దనుమధ్యలు మార్వెరును బుత కన్నహముకన్. భార. అర. 3. ౧౮౧.

**పశువు.** సం. వి. ఉ. పుం—అన్నిటి నొక్కరీతిని జూచునది — ౧ సింహాదిగజాదిజంతువు. ౨. ప్రాణి, జంతువు. ౩, మృగము. ౪. యజ్ఞపశువు, యజ్ఞమున వధింపఁబడు జంతువు. ౫ భాగము, మేఁక ౬. యజ్ఞముభేదము ౭ యజ్ఞోదుంబరము. ౮ ప్రమథగణము

**పశుహరీతకి.** సం వి ఈ స్త్రీ ఆమ్రాతక ఫలము, అంబాళపు పండు

**పశ్చాత్.** సం అవ్య. (దీనికిఁ దెనుగున వ్యస్త ప్రయోగము లేదు) ౧ వెనుకనుండి ౨ వెనుకను. (వ్యతి. పుర‌ః) ౩ పిమ్మట, అవ్వల; వెంట, పిఱుఁద. ౪. కడపట ౫ పడమటి నుండి. ౬. పడమరగా, పడమరవైపుగా.

**పశ్చాత్తాపము.** సం వి. అ పుం అనుతాపము, తానుచేసినది తప్పని యెఱిఁగి దానినిగూర్చి పిదప దుఃఖపడుట

**పశ్చార్ధము.** సం. వి అ పుం ౧ (దేహాదుల) వెనుకటిభాగము. ౨. రెండవసగము. ౩ పడమటిప్రక్క.

**పశ్చిమ.** సం. వి ఆ. స్త్రీ. పడమరదిక్కు

**పశ్చిమము.** సం. విశే. (అ. ఆ అ) ౧ వెనుకటిది. ౨. (దేశకాలములందు.) ౩. కడపటిది

**పశ్చిమరాత్రము.** సం వి అ. పుం. రాత్రి వెనుకటిభాగము, రాత్రి శేషభాగము.

**పశ్చిమాధ్వరము.** సం. వి. అ. పుం. ఉత్తరక్రియ.

గీ. అధిప నీ వింత వన్నిప్పు డడుగఁజేల, కాని కార్యంబు చెప్పెదఁ బూని నీవు, కంటునిికిఁ బశ్చిమాధ్వరకార్యసరణు, లకట నడపంగ వలెం దంటినయ్యె రయ్యెను.

హరి. పూ. ౮. ౧౩౬

**పశ్చిమార్ధము.** సం. వి. అ పుం. ౧ వెనుకటి భాగము. ౨. రెండవసగము.

**పశ్చిమోత్తర.** సం వి. ఆ. స్త్రీ పశ్చిమోత్తరముల మధ్యదిక్కు.

**పశ్చిమోత్తరము.** సం విశే. (అ. ఆ అ) పడమరగాను ఉత్తరముగాను నున్నది.

**పశ్యంతి.** సం. వి. ఈ. స్త్రీ. వాగ్విశేషము.

**పశ్యత్.** సం. శత్రు, చూచుచున్న

**పశ్యతోహరుఁడు.** సం విశే (అ. ఆ. అ.)— చూచుచుండఁగానే దొంగిలించువాఁడు—పచ్చికాఁడు, కన్నులయెదుటనే మ్రుచ్చిలించి కొనిపోవువాఁడు

వి' కమసాలివాఁడు

**పశ్యత్ఫాలుఁడు.** సం వి అ పుం, శివుఁడు, ముక్కంటి

**పశ్యల్లలాటుఁడు.** సం వి. అ పుం నొసలికంటి దేవర, శివుఁడు.

**పస.** వి (క. పాస త పసై) ౧ సారము, చేవ.

సీ పాతాళమున నున్న ఫణిరాజుకోఱల పసయెల్ల రూపమై యెసఁగ నవఁగ.

హరి పూ. ౬. ౩౭.

మ. పస సంసారమునందు లే దొకటియున్ భావించి చూడంగఁ బుణ్యాసముల్లాసము నార్తిదంబు... మల్ల పూ. వై. ౧౧.

సీ...ధరణీశ తాతలతరమునాఁటి, పాతఁ పంచారంబు పస లేదు పెట్టెత్తె నిది వృథా ఘ్నాల నిం దేది బలము...

దశా. ౩. ౨౦౬.

చ. తెనుఁగున దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందు లేదు మెత్తన పస చాల దంద్రదు విశదంబుగ సంస్కృతశబ్ది మాఁటఁ

ఱెప్పిన నవి దర్భముం డ్లనుచుఁ బెట్టరు
వీసుల .. ద్వా ౧ ౩౨.

౨...అతిశయము, సమృద్ధి, ఆధిక్యము.

చ అగజ యూరసీ రొయ్యని వ్రాసెనో సురూ,
పరపస నీకుఁడో దయినథవ్యుఁడు దుర్లభుఁ
డెల్ల సృష్టిలోన్ ప్రభా ౧ ౧౩౬

సీ. ముసిఁడిమ్రాఁకునఁ బండ్లు పసమీఱఁ గల్గించి
యించున కేల పుట్టించదయ్యె.
శ్రీం ౧ ౧౧౧

ఆ అని దశ్వాశమేధ మంత్ర్యంబు తీర్థంబు,
పంచనదము కాశిఁ బసగలయది. వానికంటెఁ
బెద్ద వాతాపితాపస, చక్రపుష్కరిణి యసం
శయంబు కాశి. ౪ ౨౩ కళా. ౧ ౩౩

౩ చాతుర్యము, నేర్పు

రగడ పొలఁతి ప్రేంకణంబు చూడఁ బుచ్చఁ
బుచ్చుడీకి మసలు, నెలఁత చైత్రమాసమున
జనించు నించువిలుతు పసలు
వరాహ ౩ ౯౨

పంచచామరము ఇసీ యిసీ కొంగంబు నూడ
కిల్లు వెల్వరించినన్, వెస న్విసింగిపోవు సిగ్గు
వీసమంత లేదు గీ, దెసం బసల్ ఘటించె
దేర త్రిమ్మరీ మ తిల్లు వ్వచ్చి సారె సారె
నన్నుఁ గెర్లఁ జేయరాక పొమ్మిఁకన్
విప్ర ౪. ౫౯.

విక్ర. ౧. ౮౧,

౪. స్ఫురణము

గీ మధువుఁ గాంతల పుక్కిటి మధువుఁ జేర్లె,
యీర్ష్యఁ బస నూపఁ బొగడపై వెలయ
దాన, విరిపెఁ దొల్లిటి దళములు విరులు
జడిసె, దీన నగ్గల్పునకు నుబ్బి తేఁటు లార్చె
ఆము ౫. ౧౩౦.

సీ ..పస యున స్ఫురణంబు పగగుచుండు
ఆం. భా. ౩ ౩౦.

౫ శక్తి, సామర్థ్యము.

క. అవురా ధర్మవివేక, ప్రవరులపస గానఁ
బడియెఁ... భాగ ౬ ౧౧౧

సీ...వెదక నీ శివ్వరు చెదురు లేగ,పార్థ దర్ప
మున నీపస గాన కి ట్టెదిర్చినవారిదోమంబు
గనిరొ ఫలము. రాఘవ ౪ ౪౧.

సీ ఆదిత్యుపస యాఁచి హాలహాలంబును లోఁచి
హుతవహుగర్వ ము ట్టూఁగలూఁచి
కళా. ౧ ౪౬.

౬ వలపు, (స్త్రీపురుషులకు పరస్పరముకలుగు)
ప్రేమము

క చిక్కనిచక్కనిచన్నుల, మక్కువయిల్లాలి
విడిచి మాయలు గలయీ,చెక్కసపు,మద్య
పానపు,డొక్కపసం దగిలి దుర్విటుఁడ నై
చెడితిన్. భాగ ౬. ౧౩౬

గీ వలచివచ్చినవిల్లాలిబలె భరించి,పసఁ జిక్కిం
చి విలసనపొంది నిజభు,జాపతీరంభముఖు
ములచవులు నూపె,విశ్వధాత్రికిఁ దిమ్మయ
యీశ్వరుండు వరాహ ౧ ౩౨

గీ అటువలె నిశాధినాయకుఁ డన్యమృగదృ,
గానుకూల్యాగ్రచిత్తుఁ డై యహరహంబుఁ,
దిరుగఁ దనమీఁద పస లేనితెఱఁగుఁ జూచి,
వసుమతియుఁ గాంచె జారాంకవాహనంబు.
హంస ౨. ౨౪౨.

౭ పరిమళము, వాసన

సీ. పన్నిటితోఁ గదంబముఁ జేసి పూసిన మృగ
నాభిపస రాచనగరు నెలుప ఆము ౨ ౪౫

గీ...అవ్వనజగంధి, మేనిజవ్వాదిపస కదంబించు
నొడలు, గడిగికొని... మను. ౨. ౪౪.

వ...పునుంగుపసం బిసాళించుగొజ్జంగినీటి కాత్తా
వియును భీమ ౧. ౧౧౪.

౮. ఒప్పిదము; అందము; కాంతి

సీ తెలిమెఱుంగుపస మెచ్చి తలయూఁచు బొటిఁగి
మానక నవ్వు నేర్పు డెందములఁ గరఁప.
ఆము. ౨. ౫౮.

శ. కలికి యొకర్తె రాజుని జగత్రయమోహన దివ్యరూపమం, గళపటుమ్రగమొంబుపసఁ గాంచుటమెక్ గటిఁ బూని మేఘూలా, వల యము గేలంకొల్ప మఱుఁవక్...

దామా. ౪. ౧౪౭.

సీ. పసపపంటికి మంచిపస యొదఁగూర్పక మునిఁడిపండ్లకు దద్ద యొనఁగినట్లు

రఘక. ౩ ౪౦

వ...మిరియంబు పెరిమయు, బహుపుపసయు కొంతిసొబగు నావరే వయు...

కాశీ. ౮ ౧౭౫.

గీ. అసమసాయకజనకాభ నతిశయించి, పసిమి పెచ్చినపచ్చికపస నదించి

ఉ రా. ౨ ౧౪

౯. విధము, పద్ధతి, రీతి

సీ తమవిహారముల నాదట రాలుపేటికాకుసుమ ముల్ వదగండ్లపస వహింప

ఘటికా. ౨. ౧౦౨.

అ. చనుచు నుండి తనదుసంగీతచాతురి, గరిమ పసకు మున్న సరసిజాక్షు, చెలువ లాత్మ మెచ్చి సలిపిన యట్టిప్ర, శంసచందముల ప్రసంగ మైన. కళా ౨ ౪౦ ప్ర. భా ౧. ౮౦.

౧౦ బండారులము, సామగ్రి ప్రా.

౧౧. (బ) చతురోక్తులు

ఉ ఈ నయగారిపుం బ్రియము లీపస లీనెంగ మిచ్చుమాటలే,లా. పారి. ౧ ౧౨౫.

జ. పసగరగొను, పసచెడు, పసదనము[1], పస దప్పు, పసపడు.

పసందు. వి. సొగసుఁ దనము, అందము. (శ. ర) విశ. (హిం. పసంద్) చక్కనిది, మనోజ్ఞము.

గీ. పుతికలును నిండువన్నెల బొదలు పచ్చలును మాణిణక్లు హొంసవల్లులును రంగవల్లు బొద లును సామంతవళులు నవఁగఁ, దనరెడు పసందుపటములు గొనిరెు వెలకు.

హంస ౫. ౩౫౫.

పసగరగొను. స. క్రి (పస + గర + కొను) పీడించు, పాయఁజేయు

క. పసులకు నొడ్డినవలలై, మసఁగిన యవ్వాన పశుసమాజములెల్లన్, బసగరగొని యంతటఁ బోక సమస్తప్రాణిబాధకంబై పేర్చెన్

హరి పూ. ౮ ౧౨౮

పసచెడు. స. క్రి (√ పస) రూపుమాయు, నశించు

చ పసచెడ కేల యందు హరిపాద పరిష్కృతి సేయ నాపదల్... భాగ ౭. ౩౪౩

పసదనము[1]. వి (సం ప్రసాదనం. క పసా యన) ౧ పారితోషికము.

గీ యుద్ధవాటంబుఁ దక్కటి యాలయములు, లలితిభంగి గమ్యములు సలక్షణములుఁగా నొనర్చినశిల్పిని కాయమునకుఁ, బసదనం బిచ్చె సంతసం బెసక మెసఁగ

భారా అశ్వ. ౪ ౧౩౯.

గీ. ఇంతటన మెచ్చి వీరి నుర్వీశ్వరుండు, పస దనం బిచ్చి మాన్పుట పాడి యింక

హరి పూ. ౯. ౧౧౩.

ద్వి కరివరామాజమూర్తికములఁ గస్తూరి పరగ నిచ్చినఁ దనభామిని కిచ్చి, పరువడి శారికిఁ బసదనం బొసఁగి

ద్వి. హరిశ్చ. పూ. ౨.౩౮.

౨. (సం. ప్రసాధనమ్ క. పసదన) అలం కరించుట.

గీ ..వెలయును బసదనము నై సేఁత యనఁ బ్రసా ధనము. ఆం. భా. ౨. ౧౪౨.

పసదనము²=పసాదము. వి. అన్నము.

సీ. బువ్వ మెతుకు కూడు బోన మారెము పసా
దము వంటకము పసదనము శాకు, పాద
మోగిర మన బరుగు నన్నముపేళ్లు ..
శాం వి. మాన. ౨౨.

పసదప్పు. అ. క్రి (పస + తప్పు) క్షీణమగు, చెడు

సీ. పదఁతి నా వేదసంపద రేల పసదప్పె నింతి
నా శాస్త్రంబు లేల తూలె.
వరాహ. ౧ ౯౮

పసనారు. అ. క్రి (√పస) ౧ ఒప్పారు.

సీ. రమణీయశృంగారరసమునఁ బసనారుమురి
పెంపు వలపుల మొలకవోలె విక్ర ౬. ౪౪

ఉ. అంటినఁ గందుమేనుఁ బసనారెడు జవ్వన
ము న్ హరి ఉ ౪ ౨౧.

పసను. వి (క పాసను-వృత్తీయం దంత్య వర్ణము నకు ఇకారాదేశము) ౧ అందము, చక్కఁదనము.

సీ. నక్తంచరీలోచనంబులపోలికి నసితోత్పలం
బులపసను పొలియ
భా రా యు ౧౪౩౧

౨. ఎఱుపుమించిన పసుపువన్నె. (శ. ర)

క. కుసుమం బొద్దినవిధమునఁ, బసుపున వాత్తించి
నట్లు బంగారమునం, బస నిచ్చినగిలి సంధ్యా,
వసరంబున నింగి యరుణవర్ణం బయ్యెన్.
హైమ. ౭ ౧౫౪.

౩. వర్ణము, రంగు.

ఉ. అంతటఁ బండి పచ్చపస హైనదళంబులు
రాలె.. చమ. ౧. ౪౩

విశే. ౧. సుందరము, అందమైనది, బాగైనది.

సీ. బకచకోరజపత్త్రిముకరందరసభాతిఁ బసని
తూపులఁ గృపాసము దొలక్ర.
ప్రిక. ౨. ౫౪.

ద్వి. వసువు నిమ్ముల గిరివ్రజ మనుపేరఁ, బస
నుగా నిర్మించెఁ బట్టణం బొకటి.
రం. రా. బాల. ౩౩. పా. ౫ పం.

ద్వి. అసమానజయశరానల్పశిల్పములఁ, బసను
గాఁ దీర్చిన పసిఁడికంబములు.
రం. రా. ఉ ౩౪. పా. ౧౬ పం.

ద్వి ఇప్పుడే పంపుపాఁ డీల్గకమున్నె, మసలక
తెప్పించి మందు పోయించి పసనుగా నొన
రింపు ప్రాణదానంబు. ద్వి హరిశ్చ ఉ
౧౯౭౦ నవ ౧ ౪౦. పా. ౧౨ పం.

౨. ఎఱుపుమించిన పసుపువర్ణము కలది

ద్వి పసనిమొగంబులుం పసిఁడియద్దములుగా
గురుకుచములు పూర్ణకుంభములుగ
కు. సం. ౧౨ ౯౦౫

గీ ప్రియుము శోభిల్లఁగా సమర్పించె గౌరి పసని
పర్యోద జాతి దోఃపల్లవమున, భాస్వ
దీప్తుల నీరారి ప్రసన్నమైన, పృథులమందా
కినీపద్మబీజమాల హర. ౩ ౭౪

౩ నిర్మలము, స్వచ్ఛము.

సీ. క్రొమ్మించుపస గ్రమ్ముకొనఁ గెలంకులఁ
జిమ్ము పసనిరత్నపుసొమ్ము పరిఢవించి.
రాజ చ. ౨. ౧౭.

సీ....పరి పైన చిల్వరాపఱుపైని గీ. పసని
కుబుసంబు చలువదుప్పటి వసించి
దశా. ౪. ౧౦౩.

౪. మృదువైనది, మెత్తనిది.

చ ఒసపరి జాణఁ డొక్కఁ డొకయుగ్మలిచేరువ
మాఱుకట్టఁగాఁ, బసనికురంగికాపలలఫాలి
నిశాధరపల్లవంబుపైఁ, బసికొని చేరఁబట్టి
మునిపండుల నొయ్యన నప్పళింపఁగా.
హైమ. ౬. ౧౩౩.

శ్లో. మృదువ్యంజనమాంసఫాలికాన్.
సం. హైమ. ౧౬. ౬౨.

సీ బంగారుపస మించు పసనిపుప్పొడిరేఖఁ జొప్పట్టుపాపట సొబగుతోడ.
కళా. 3 ౨౦౪

౫. పరిపక్వమైనది, చక్కఁగా పండినది

క పస నగుసంతానవృక్షఫలము గరుణతో, పసుమతికి వాసుదేవుం, డొసఁగెన్ .
దళకు ౨ ౧౮

ద్వి. పసనిపం డుండఁగఁ గమూగాయ దెంచ పండితా పురా. ౧౭౦ బ

జః పసవారు

పసపడు. అ. క్రి (√ పస) అభిలాష పడు, వాంఛించు

ద్వి. కుసుమబాణునచెప్పఁ గూడునే కేఁటి, పస పడి తిరిగెదుకాగు భావించి, రసికుఁ డై శివభక్తిరసమగ్నుఁ డగుచు
ప్రభులిం ౪ ౧౧౧ బా. ౧౧. ౧

పసపాడు=పసుపాడు. అ క్రి (పసపు+ ఆడు) పసుపు పూసికొని స్నానమాడు; పసపు పూసికొను

మ...పసపాడి పొగడపుఁబాడం బొప్ప కెం పుడి, గ్గియనీ రమ్యతమజ్జనార్థము కిటి గిలించి... ఆము ౧.. ౫౬

ద్వి. కొమ్మలు పసపాడి కోరి నీరాడి, కట్టిరి పుట్టముల్... ద్వి. పరమ ౫ ౪౩౪. బా

పసపార్చు. స. క్రి (√ పసపాడు) ౧. పసుపు పూసి స్నానమాడించు; పసుపుపూసికొను

క...గుత్తంబు లగు మిగుల మెత్తని జలపోఁతి తోలు పట్టెడలు మెడల నమరం బసపార్చి.
మనుచ. ౪. ౨౪

ద్వి. చెన్నుగాఁ బస పార్చి చేయుమజ్జనము.
బసి. పు. 3. ౩౪౦ పం

పసపు=పసుపు. వి (క. పచపు) హరిద్ర, పసుపు.

గీ. పసపు పసు పసంగ, వణుఁకు హరిద్ర...
ఆం. భా. ౨. ౫౫.

క పసపు నలుఁ గిడి రైదువ, విసరుచామరలు పెండ్లిపెద్దల యాజ్ఞన్.
మను చ. ౫ ౫౭. ౫. ౧౧౨

గీ. కలిమి ముద్దియనిద్దపుఁ గమ్మమేని, పసపు నిగ్గులటంచు కొర్వుఅంపలేక, కటికటంబునఁ గట్టున కనకపటికి, వింకరుచి వచ్చె నని కింద్రుడు కాంతినిధులు. దశా. 3. ౧౫౦.

జః పసపాడు, పసపార్చు, పసపుగన్నేర్లు, పసపుముద్ద.

పసపుగన్నేర్లు. వి (√పసపు) ధాన్యవిశేషము.

వ. పసపుగన్నేర్లు గుత్తిబలుగుత్తులు రాజినూ రాజనాలు... ప్రబంధ. ౧౧౨.

పసపుముద్ద=పసిరిక. వి (√పసపు) పచ్చపిట్ట, పక్షి విశేషము

గీ. పసపుముద్దయుఁ బాలయు బచ్చకొక్క, పసిఁడికం కెయుఁ బరజయుఁ బసులుపోలి, గాఁడు నసువాని పై జలకట్టియలను, బంచి ప్రుంచియు... రసిక. ౧ ౧౧౫. ౧. ౬౩.

పసరము. వి (సం పశుః ప్రా. పసు.) పశువు, గొడ్డు, గోమహిష్యాది

సీ. గోమహిష్యాదుల గామముల్ పసి తొట్టి తొడుకు పసరము గా నదరు .
ఆం. భా. ౨. ౨౭౧.

చ. పసరపు కొంపపోవులును బందులడొక్కలుఁ గుక్కగుట్టలున్... భార. శాం. 3. ౨౪.

క. కదవఁగ నొకళ్ల పసరము, నడిచిన నొక్కఁ కులుఁ చెయ్య్య నడుమ వలయుసే.
భార. ఉద్యో. 3. ౯౧.

క. పని యటఁ బసరపు రక్కుము,లను బయికొని ద్రోసిశాదులారా కడుఁగ్రొవ్వునఁ గలఁచితి రిన్నాళ్లను, బనివడి జగమెల్ల నింకఁ బలు వక తిలుఁడే. నీలా. 3. ౬౨.

గీ. గూండ్లకై కాలిమంజరు ల్గొనుచు మూఁగి, యంబరంబునఁ బఱచుశరాళి పొలుచెఁ, బసరుటాంటాంటియాకుతోఁ బండఁబాతి, శ్వేదభయమున కెగసిన చే లనంగ.

ఆము ౪. ౧౭౨.

సీ. పసరుపట్టుహిజారుమిసమిస లఱుతికాశ్మీ ఱుఁగుటంగికి వింతరొుఱుపు నింప.

శుక. ౧. ౧౭౦

౨ పసరువాసన గలది.

(చూ. పసరుఁగాయ)

జః పసరుగాయ, పసరుకొను, పసరుపాఱు, పసరువెుుగ్గ, పసరుకొక్కెలపక్కి, పసిరిక, పసిరికపాము, పసిరికమొగ్గ.

పసరుఁగా(కా)యు. వి (పసరు + కాయ) పసరువాసనగలకాయ, లేఁతికాయ

చ. క్రమమునఁ బిందెలం బసరుఁగాయలుఁ గాయలు దోరపండులున్.

పారి పూ ౭ ౮౨.

పసరుకొ(ర్కొ)ను. అ క్రి. (√పసరు) పసరు వాసన గలిగి యుండు

సీ మును వనల్ దమిఁ బట్టి ముంగాళ్లముక్కు ళ్లొదనలఁ బీలిచి పసర్కొనిన విడిచి

అము. ౫ ౧౧౪

పసరు(వా)పాఱు. అ క్రి. (పసరు+పాఱు) పసరువర్ణము కలిగియుండు, ఆకుపచ్చపడు

వ...కొదమపసరు కొక్కెల పక్కెడాలు పుక్కిలించి యుమియంజాలుచాయ లేర్పడం బసరుపాఱునవియు. . భీమ. ౨. ౫౫.

సీ. లేఁత లేర్పడఁగ వర్ధిలి పెద లవుయి రెమ్మ పసరుబాఱుచు నిక్కెఁ బసరు కప్పు.

మనుచ. ౭. ౨౪.

పసరుమొగ్గ. వి. (పసరు+మొగ్గ) లేఁతమొగ్గ.

సీ. కలిగొట్టు పసరుమొగ్గలఁ గొర్కొపాలిపోఁ బునుపటి మొల్లల మూగునవియు.

పారి. ౩. ౫౧.

సీ పసరుమొగ్గ యనంగఁ బసిమొగ్గ యనఁగను ద్వారకసామ మైమిూఱుచు...

ఆం. భా ౨. ౪౦.

పసరుకొక్కెలపక్కి. వి (√ పసరు) చిలుక

భీమ ౨. ౫౫

పసలము=పసరము. (శ. ర.)

పసలారు. అ. క్రి. వృద్ధిఁజెందు, సమృద్ధ మగు.

ద్వి బసవని శరణన్నఁ బసలారు కీర్తి, బసవని శరణన్న ఫలియించుఁ గోర్కె.

బస. పు. ౧ ౧౦౦ పం.

పసలుకొను. అ క్రి అతిశయించు.

భాగ. ౧. ౩౯౭. వ్రా.

పసలుసేయు. సం. క్రి (పసలు+చేయు) వృద్ధి పఱుచు

గీ పసుపుపుఁ జాయ మైకాంతిఁ బసలుసేయ, సేవకంబులు చనుదోయి నిగ్గుఁజెనక, ద్రవిడ బాల విలాసినీతతులు మెఱయ, వీరిఁ బస్తైన కాంచికాపురమునందు విక్ర ౪ ౧౧౭.

పసాదము=పసదసము. (సం ప్రసాదః. ప్రా. పసాదో.) అన్నము, వంటకము

వ .చేరఁడు బియ్యంపు వట్టిపసాదంబులు కల మూన్నంబులు కలవంటకంబులు .

ప్రబంధ. ౧౧.౨.

క ఇంతకు మిూకొదం ద్రోన, రింతువు భోజనము జాఁ క్రియ మఱ్యొదు మీూఖంతిఁ బసా దముఁ గొనఁగా, నంత పురమునకుఁ బోద మరు దెం దనిరొుక్. భోజరా. ౩. ౪.

పసాదముగొను=భోజనముచేయు.

జః పసాపడు, పసాపాటు.

పసాపడు. స. క్రి. (పసాదము + పాపడు-శ. ర., పసాదము + పడు) భుజించు, తిను.

క. తడయక కోఁ దది గొని తన, పడఁతుక లకుఁ బంచి యిడిన బా గొప్పఁ బసా, పడి యమ్మ యుఁగుంభోఁడులు, కడుప్పులతో నుండి కెలిమి గడలు కొనంగన్.

అచ్చ రా బాల ౪౫.

సీ ఏఁ బసాపడి తోఁట కోలించుచుండాలెఁ బని సేయుఁ దాఁ బసాపడను బోదు

వైజ. ౨. ౧౨౬.

పసాపాటు. వి. (√పసాపడు) భోజనము,

గీ కెలఁకి కుతుమార మైనది నీదు మేను, తోఁట పని కేయుకెడఁ బసాపాటు మాను, కరము మాలోడిలంక నీ కరణి నుండ, నోపుదే యన్న నతని క య్యొవిద యనిరెయు

వైజ ౨. ౧౦౯.

పసారము1 = పసారు, పచారము. వి. (సం. ప్రసారః ప్రా. పఆర క పూపసార)

అంగడి, దుకాణము.

క. అప్పురవీథిని జనుచోఁ గప్పురము జవాది యగరుఁ గస్తూరియును బెస్, గుప్పలుగ నుంచి యమ్మెడు, గొప్ప పసారములఁ గాంచె గురుఁ డొకచోటన్.

రాజ. వి. ౨. ౯౦.

చ. పరకుల కేఁగి కేసరిఁ బసారముఁ బెట్టిన పెట్లఁ గూడి కే, పర

వేం. పంచ ౧ ౪౪౩.

పసారము2. వి. తగుళు, జగి.

ఉ. బందరువారి పాటికిని బైట పసారము కాని యందులో, బుం దటు...

క్రీ. దా. పేరి. ౫౩.

పసారు. వి. (హిం. బజార్.) అంగడి.

గీ. తేరులా గొమ్మ పేసలుకోరలాలే కే, పారులా చోక్కటపురాలే బారలా కొ, టారులా తీరులా గోపబాలు సార, ప్రోలి దొయిర్యార కేరికిఁ బొడగ నరిది.

అచ్చ రా. బాల. ౩౪.

పసి1. వి (సం. పశుః ప్రా. పసు) ౧ ధేనువు

పీ. పసి యీన ధేనువు పవన మెసలగు

ఆం. భా. ౩. ౪౪

(ఈ యర్థమున. బ. వ. అని క ర)

గీ అక్రూరుడు మాకిఁ జేతి కుంభ్మాండుఁ దధిప వరుణు, పాల నున్నవి కాచుని పనులు...

హరి ఉ. ౧. ౨౪౫

ద్వి. ఎసళ్ల యుద్ధములందు నిష్క్రాకులులు, పసుల బ్రాహ్మణుల జంపఁ దలంప రెండు.

రం. రా బాల. ౪౯ పా ౧౭ పం.

క పసివిం గలిగి వెలుఁగొందుచుఁ, బను లన్నియును మంధ్లలయుఁ బ్రసరించె నృపా

భాగ ౧౦. పూ. ౧౪౪

౨ గోగణము, ఆలమంద.

క. ఉత్తరుఁడు పత్వరంబుగఁ, దత్తనువున మఱువు దొడిగి తానను వార్పుదోయి, దాత్తం బగుకంకట మిడి, చిత్తము పసి గ్రమ్మ ఱింపఁ జడిముడిపడఁగన్

భాగ. విరా. ౪. ౪౦.

క. వాణీవిథవమున నతి, ప్రేణవ కొలువరించి యిట్లు ప్రీదులఁ దలఁచె దా, బాలుపసి నొసఁగ కూరక, ప్రాణత్రాణంబు నీకు బడయఁగ వశమే. హరి. ఉ. ౧. ౨౬౪.

వరాహ. ౫. ౬౫.

3. గ్రామ్యపశువులు. (గోమహిష్యాది.)

సీ. గోమహిష్యాదులజాతము ల్పసి తొట్టు తొడుకు పసరము నా నరరు...

ఆం. భా. ౨. ౨౬౧.

క. పులికిఁ బసులు వాటినక్రియ, నలవుఁ జలము
పెగ్గు జిడేటి యట్లొక్కనికొ, త్తల కోర్వక
విఱిగినవు, త్రుల చే మని విందు సేన
కోయక యింకన్ భార ద్రోణ ౪. ౨౦

చ తఱుఁగనిధాన్యముల్ పసుల దాటులు
దోటలుఁ గట్టుపందులున్...తఱచుగ నీను
గోడిగలుఁ దఱుపరికూడ్రుల కొప్ప చెప్ప
డున్. విక్ర ౧ ౪౬

క. మసమసక నరెయ్యె దిక్కులు, పసి గ్రేపుఁ
దలంచి తిరుగఁబడెఁ గూండ్ల కకుం, తస
మాజము కలకలము కొ, గసె పెదపెదకన్న
మెంగిచెఁ గమలవనంబుల్.
జై. భా. ౨ ౧౦౧

౪ సింహము; ఆవు మొద లగు చతుష్పాజ్జంతువు

సీ .సింగంబు మొదలుగా నావులు మొదలు
గాను పసు లనఁదగు
ఆం. భా. ౨. ౨౬.

జ' పసికొలపుగోరడాలు, పసిగాఁడి, పసి
గాపు1, పసిదిండి, పసిబిడ్డ2, పసులకాపరి,
పసులమారి, పసులవాఁడు

పసి2. ౧. వాసన, తావి

చ కుసుమపుగుత్తి చూచి యొక కోమలి డగ్గఱి
కోయఁ బోయినన్, బసిబడి నందు నున్న
మధుపుంబులు వచ్చి ముఖంబుతావికిన్, ముస
రఁగఁ .. భోజరా. ౩. ౧౪౬.

౨. పశ్వాదులమీఁది గాలి

క. పసిబడి మాటికి మాటికి, వసుధాస్థలి మూరు
కొనుచు వదసాంచల మ్రాకసమున కెత్తుచుఁ
జవిగొని,యిసుమంతయుఁ జిక్కపుండ నింత
యుఁ గ్రోలెన్ వరాహ ౧౧ ౨౩.

సీ పసి యన ధేనువు పసన మెసఁగు.
ఆం. భా. ౩. ౪౪.

జః పసిగొను, పసిపట్టు.

పసి3. వి. (క. హసి. త. పచి.) ఆకలి, ఆఁకలి,

కా...,ఆ,చండాలేతరకులుఁ దుఱుపులకై రై
చాండాలిక న్మీఁటుచున్, గుండె న్నీరుగ
సెండ గాలి పసితాఁకుం జూడ కాప్రాప్తా
మున్. ఆము. ౬. ౪.

పసి4. విశ (క పసు, త పచు) శైశవదశయం
దున్నది, లేఁత
(చూ పసిబిడ్డ, పసికొంగ్గి మొ )

జః పసికందు, పసిగాపు2, పసివాఁడు, పసి
పాప, పసిబిడ్డ1, పసికొంగ్గ

పసి5. విశ (పసిమి శబ్దమునకు వృత్తియం దంత్య
వర్ణము లోపింపఁగా మిగిలినది) పచ్చని.

సీ. భామ నీ పాలిండ్లు పసినిమ్మపం డ్లంచు
నీటుగాఁ గొనగోట మీఁటు నొకట
శృం. శకుం. ౩. ౪౨.

పసిండిసీటిత్రాఁత. వి. (√పసిఁడి) ద్రవరూప
మగు బంగారముతోఁ జేసిన చిత్తరువుపని.

సీ నెతిక వట్టి పసిండసీటిత్రాఁతచెఱంగు వెలి
పట్టు రహిఁ గట్టె వెలఁది యొర్తు ఆము.
౬ ౧౨౭ (బంగరుజలతారు అని భావము)

పసిండిబొజ్జదొర. వి. (√పసిడి) హిరణ్య
గర్భుఁడు, బ్రహ్మదేవుఁడు

ఉ...పసిండిదొరబొజ్జకైన నిసుం గొనియాడఁ
బోలునే. అచ్చ. రా. బాల. ౧౫౪.

(ఇట్లే పసిఁడిబొజ్జవేల్పు మొ.)

పసిఁడి = పయిఁడి, పహిఁడి, పైఁడి. వి.—
పచ్చదనము కలది—౧. బంగారము, స్వర్ణము.

సీ శృంగారకుసుమంబు చిన్నచుక్కలరాజు
పసిఁడికొన్నరవిణ పలుకుఁదోడు.
హైమ. ౧. ౫.

క. మండూకమకరకచ్ఛప, గండూపదభుజికుళీర
కలహంసకకా, రండవబకముల పెండిఁ
బసిండిని గావించి గంగఁ జదువుదురు
ద్రవతుల్. కాశీ. ౫. ౫౩.

పసిఁడికొండ. వి. (√పసిఁడి) కనకగిరి, మేరు పర్వతము.

ఉ. కొండ దని పెద్దతోఁ బసిఁడికొండ ధరా ర్థుల కెల్లఁ బంచి యీ, కొండుట... *

సైమ. ౧. ౫౧.

ఆ. కొండకోఁడు మూమ కొండకూఁతురా యాలు, కొండ యిల్లు పసిఁడికొండ విల్లు, కొండ వంటిదొరకుఁ గుంటెన నడుకురా...

వేమ ౨. ౨౭౨

పసిఁడిగట్టు. వి (√పసిఁడి) బంగారుకొండ, మేరుపర్వతము.

ఆ. ఇట్టిరాచపట్టి యెనసినప్రేమ నీ, చెట్టఁ బట్టఁ బసిఁడిగట్టుగన్న, వేదపగిది మదిఁ బ్రమో దంబు గాంచితి, వింతకంటె శుభ మ దెద్ది నాకు.

చె కరుఁ 3 38

గీ పసిఁడిగట్టున కొకవింతపసిమి నించి, నెఱసెఁ గడసావిమదుసలిశెఅపయెండ

పారి ౪ ౪3.

(ఇట్లే పసిఁడిగుబ్బలి మొ.)

పసిఁడిగద్దియ. వి (√పసిఁడి) బంగారుపీఠము

వ...కడమన్నె పసిఁడిగద్దియ నధివసించి...

దశా ౧ ౧౮.

పసిఁడిగేదఁగి. వి. (√పసిఁడి) బంగారువన్నె పచ్చనిరేకులు గలమొగలి.

ద్వి. పసిఁడిగేదఁగిరేకులుపసమించుమేని, కుసుమ కోమల నిత్తు కొన రయ్య మీరు.

ద్వి. పారిశ్ర ఉ. ౩౯౨. పం.

పసిఁడినీరు. వి. (√పసిఁడి) ద్రవరూప మైన బంగారము, బంగారునీరు.

గీ. పసిఁడినీట లిఖించినప్రతిమ లమర.

మనుచ. ౭. 3.

పసిఁడిపురువు(గు). వి. (√పసిఁడి) పాత్తి పూలుగాయుపురుగు.

వ...పెరుగు ప్రుచ్చిలినవాఁడు క్రిమి యగు. . పాత్తిచీరగొని పసిఁడిపురు వగు కలిపట్టు గొని నకార్లం బగు. . మార్క. ౨ ౧౧౫.

పసిఁడిపెన్బొజ్జరా. వి. (√పసిఁడి) బ్రహ్మ దేవుఁడు

గీ కినిసి తిట్టినఁ బతియ లై చనకయున్నె, పసిఁడిపెన్బొజ్జరాగ్రుడ్డు పసఁటిగములు

అచ్చ రా బాల ౧౦౫.

పసిఁడియాకు. వి (√పసిఁడి) బంగారుకమ్మ, స్త్రీ కర్ణాభరణము

ద్వి. బసవన్న యప్పుడే భార్యకర్ణంపు, పసిఁ డియా కిప్పించె భార్యను గినిసి.

పండితా దీక్షా 83 పా

పసిఁడివత్తి. వి (√పసిఁడి) స్త్రీల ఆభరణ విశేషము

గీ పసిఁడివత్తులు మేలశాల్ బన్నసరులు, చేరు బొట్లును ధనాభి 3 38.

పసిఁడివ్రాఁత. వి (√పసిఁడి) బంగారు చిత్ర రువు పని

చ తొలఁకుపసిండి వ్రాఁతతెఱతో నెఱతావుల మేలుకట్టుతోఁ, జలువలు చిందు ముత్తి యపుఁ జప్పరమంచముపై మహోన్నతిక్.

వసు. ౪ ౩౭.

పసికందు=పసిబిడ్డ. వి. (పసి[4] + కందు)

సీ. కలశాబ్ధికాయి పొక్కిలి తమ్మిపసికందు తోయజాతాస్త్రుని తోడఁబుట్టు.

ఘటికా. ౧. ౨౭.

పసిగొలవుదొరడాలు. వి. (√పసి[4]) వృషభ ధ్వజము.

లయవిభాతి. గెలుపు గొనఁజాలు పసిగొలవు దొరడాలు చలిమలుఁగు సొనగోలువగఁ బొలుచు నెఱడాలుక్

అచ్చ. రా. బాల. ౨౧౨.

పసిగ(క). వి ౧. సమృద్ధి.

ద్వి. బసవపురాణంబు పాటించి వినిన బసిగమై
　ప్రాపించు భక్తులకిరణ.
　　　　　　బస. పు ౪ ౧౦౭. పం.

ద్వి ఇప్పాటఁ బసిగమై నీశ్వరుఁ బూన్పఁ,
　గుప్పలుగొని తలల్గడి పిక్కటిల్ల
　　　　　　బస పు ౬. ౫౭ పం

౨. ఉత్సాహము.

ద్వి దర్పం బెలర్ప సమర్పణచేసి, పసిగమై
　సారగింపఁగ నార్చిపేర్చి ,
　　　　　　బస పు. ౪. ౬33 పం

ద్వి పసిగమై మంచెన భట్టారకుండు, నసదృశ
　మహిమ దొల్కాడ చేతేర
　　　　　　బస పు ౬ ౪౮౯ పం

3. పారము, చేవ.

సీ వెగ్గలం బై పేర్చు వీరంబుగాఁ గల పసిక
　రొల్లను మేను వడచె ననఁగ
　　　　　　నృసిం ౨ 3 (శ ర పా)

పసిగాఁడి. (పసి[1] + గాఁడి) పశువులను గట్టెడి
　చోటు.

ఉ. ..కేఁ, డీపసిగాఁడిదండ వసియించి ప్రభా
　తమునందుఁ బోయెదన్.
　　　　　　కేం. పంచ ౪ ౪౪౭.

సీ. పడసాలముంగిలి పందిరి పసిగాఁడి కాయ
　ధాన్యము లున్న కణజములును
　　　　　　శుక. 3 ౪౮౧

పసిగాపు[1]. వి (పసి[1] + కాపు[1]) గొల్లజాతి

ఉ. గోపిక యొూర్తు తొల్లి హరిఁగూర్చి తపం
　బొనరింప దాన ని, ష్ఠాపరతన్ మదిం గరఁగి
　శార్ఙ్గియుఁ దోఁచినఁ జూచి చేక్కతో,
　నాపసిగాపు పూపవయసాక త్రిలోకవిమో
　హనక్రియా, కోపనిరూపణం బగు సరోరుహ
　లోచనురూపుఁ జూచుచున్
　　　　　　పాండు. ౨. ౧౭౯.

సీ. దయచేసి తత్ప్రార్థితము లైన వరముల
　నొసఁగి యప్పసిగాపుటనరుబుద్ధి.
　　　　　　పాండు. ౫. ౧౫౪.

పసిగాపు[2]. వి. ($\sqrt{}$ పసి4) బాలిక.

ఆ బాల ముద్దరాలు పసిగాపు గనుగండు,
　కూన ముద్దుగుమ్మ గోల యబల, యీాలు
　తాలలాడ నెట్లు నో రాజనో, రామ రామ
　నిరపరాధనుమ్మ　　కృ. శకుం 3 ౭౪.

పసిగొను. అ క్రి (పసి[2] + కొను) వాసిని
　గ్రహించు, వాసనపట్టు (గాలిపట్టు శ. ర)
　ఆఘ్రాణించు, మూర్కొను.

సీ మెుదన లావులించి వాసన పల్లఁ బసిగొని లేఁ
　డేఁటిగము లెంగిలింపకుండ గీ గిరిజ
　పూజించెఁ బసిఁడితామరల వరదు.
　　　　　　కు. సం 3 3౫౧.

క పసిగొనుచు మేయ వచ్చిన,పసిగొనుచుం
　గోలపులులు బలిసెన్ నృపసీ,యని యాడు
　చేని యచ్చట,నసియాడం దఱచు వెఱచు
　నఱచుం బఱచున్.　　రామా. ౨ ౧3.

సీ లీలావతీ హస్తలీలాబ్జ కేసరంబులకును బసి
　గొంచు మలసి మలసి. ప్రభా. ౨. ౧౦౭.

ద్వి .. అమర్త్యఁ,బాయక వసయించు బహు
　పిశాచములు, మానిసిగాలఁ బల్మరుఁ బసి
　గొనుచు, నానాముఖంబుల నలి దిగఁబాతి
　　　　　　ద్వి. హరిశ్చ. పూ. ౭౦౭౯.

సీ. కుతుకాళి మూర్కొనఁజాచు ఘ్రాణం
　బున కెవ్వియుఁ బసిగొన చేవ మరియ్యె.
　　　　　　కవిశ. ౧. 3౭.

పసిదిండి. (పసి[1] + తిండి) వ్యాఘ్రము, పులి.

సీ జాతి హస్తసరోజసన్నిరుద్ధాంత మై తెఱ
　తెఱఁ బసిదిండివలువ మెఱయ. నిరం. ౩. ౩౫.
　(పసిదిండివలువ=వ్యాఘ్రాజిన వస్త్రము.)

సీ. పసిదిండి మెకపులే కాలంత లాఁగొన్న జింక పావలకుఁ జాల్సని యొసఁగు.

అచ్చ. రా బాల. ౧.౨.౨.

సీ... పసిదిండి పులి... వ్యాఘ్రంబునకు సమాఖ్యలు చెలంగు...

ఆం. సం తిర్య ౩౭. జంత. ౭౦

పసిదిండి మెకపురక్కసి=వ్యాఘ్రాసురుఁడు.

సీ పసిదిండి మెకపు రక్కసితోలు మొలఁ జుట్టు శేల ముమ్మొనవాలు గీలుకొలిపి

నీలా ౧ ౧౩.

పసినాఁడు. వి (√పసి[4]) పసితనము, శైశవము

సీ పసినాఁడు గట్టిన పాలపూసలెకాని పెట్ట సొమ్ములు లేవు బిడ్డలకును కుచేల ౧ ౩౭.

(ఇట్లే —పసిపాపనాడు)

అ పనులఁ బిల్చు సేయ్ప పసిపాపనాఁటనుం, డియును దనకు నైజ మయినతెఱఁగు, గానఁ బనులఁ బిలువఁగా నుత్సహించి వి, హాంగ గమనుఁ దదరి యుద్ధ మేఁగె

హరి. ఉ ౭. ౨౮౭

పసిపాప(ఁడు). వి. (పసి[4]+పాపఁడు.) శిశువు పసిబిడ్డఁడు

మ .మాయావటూ, త్రయశిఖిం బసిపాపఁ డై యలరి శశ్వత్సింయమిధ్యానస, త్క్రియలం, బొందడు దేవు వ్యాకరణీ ద్రుష్టింపఁగా నొప్పడే. హరి ఉ ౫ ౧౯౪

క. పాండురుచి మించినది యీ, పండు హరింతు నని తీవ్రపడి కడుఁబసిపా, పం డగుటఁ దెలియ కీశఁడు, చండాంశుని విడిచి యల గజముపై కరికెక్. ఉ. రా. ౫. ౧౦౭.

ఉ...పంచ శిలీముఖుండు పసిపాపఁడుకో నవ సంగమంబునన్. శైవ. ౪. ౧౪౧.

(ఇట అప్రౌఢుఁడు అని భావము).

(ఇట్లే పసినిమవు కం.)

క పసినిము వగ మామగురన్, బిసికింపక మఱచు కొంత సేఁడినఁ బైపై, ముసరుచు మటి మటి పొరపెదు, భసలమ నీ కింత రొగసిపా జేమిటికిక్.

రసిక. ౪. ౧౪౧.

క అకటా పసినిమవులఁ గొం,కక కాఱడవులకుఁ బంపఁగావలెనని కో,రుతతోఁ బతికద పెద నిం,చుకయుం గనికరము నీకుఁ జొప్పదడు గదా

అచ్చ రా బాల. ౧౦౧.

పసిపాపయెండ=లేయెండ, ఈరెండ.

క పసిపాపయెండ కొనలును, మసమసకని యిరులు గలిసి మన మలరించెక్.

శైవ. ౭. ౧౨.

(మా. కుమారకరైః భాసాంభర్తుఃకరైః

సం. శైవ. ౧౯. ౩౭.)

పసిబిడ్డ(డు)[1]. వి (పసి[4]+బిడ్డ) చిన్నబిడ్డ

సీ. .స్తనపాయి పరగును జంటివాఁడు, పసిబిడ్డ చంటిపాపఁడు పాలపాపఁ డనంగ

ఆం. భా. ౨. ౧౧౭.

మ...వానిపెం,దొడ నిశ్చం బసిబిడ్డచందంబున రుద్రుం దర్క కోటిప్రభక్

వరాహ ౧. ౧౮౪.

క పసిబిడ్డవె వాయి దెఱచి పలికెదవు చెలీ.

యయా. ౩. ౪౭.

పసిబిడ్డ[2]. వి (పసి[1]+బిడ్డ) క్రేపు, గోవత్సము.

గీ పెలయు శిశువత్సములు పసిబిడ్డ యనఁగ

ఆం. భా. ౩. ౫౭.

పసిమి. వి (త. పచ్చమై) ౧. అకుపచ్చన.

గీ. పసిమి హెచ్చిన పచ్చికపస నదంచి, మసృణ హరిదశ్వహరికాంతిమహిమ కొంచి, పసరు చాయల కముగాయ లెసక మెసఁగె.

ఉ. రా. ౭. ౧౪.

గీ. ప్రచురమాధవోద్యానంబు పసిమికెల్లి, సాట పట్టిది యని గరుడాశ్మరుచులు, మెచ్చి చూచుచు జేమఱఁ బిచ్చలింతు,రమరకన్యక లకుల హిమాచలమున. కుసం. ౩. ౨౭౧.

సీ. పసిమి పో కెండిననవు బుట్టయుఁబోలె
నరి కెంద్రంకలు బర్వీకరమువలన.
కళా 3. ౮౩

౨ ఎఱుపు మించినపసుపువన్నె; పసుపువన్నె.

గీ మంజారుచిపుంజేఁ గనుపొన్ను ముంజివాని,
పసిమి గనుపట్టు పునుఁబట్టుపంచెవాని, శాస
వధ్యజనిభవాల వల్లివాని, నక్కుమారునిఁ
గని తల్లి యాత్మ నలరె. ఉ రా. ౫ ౯౫

సీ. మెఱసి నిల్కడచూపు మెఱపులో రొయిపు
ఖ్తిత్తిరువులో తరము నిద్దాపసిండి, పసిమిలో
మిసిమి... ఘటికా. ౨ ౮౪

గీ. పసిమిపదియాఱువన్నియ పసిఁడిపళ్లెరమున
శివునిపదాబ్జంబు లమర నునిచి, శేలుదమ్ముల
కతినంపుగిండి వంచి, యమఁగుటిల్లాలు నీరు
వోయంగఁ గడిగి. జాహ్నవీ ౧. ౧౫౪

వ పదియాఱువన్నెకడానికుందనంబు హెచ్చు
కుందాడుపసిమిఁ బచేళిమంబు లగునవియు
ప్రాసంగుచేలు . కాశీ ౪ ౭౬

3. ఒప్పు, అందము, నవకము

గీ. ఎన్నిమన్వంతరంబులు చన్న పెంపుడు,బసిమి
దప్పదు కాశికాపట్టణంబు. కాశీ. ౨. ౪౮.

జః పసిమిచెడు, పసిమిడి, పసిమిపడు

పసిమిచెడు. అ. క్రి. (పసిమి + చెడు) నవకము
చెడు, ఎండు.

లయవిభాతి విసరెఁ బెనుగాడుపులు మసలె
జలదాగమము పసిమి చెడె సస్యములు కసవు
దినశేషిం, బసరములు వట్టె
వరాహ. ౧౦. ౭౮

పసిమిడి. విశే (√పసిమి) పసిమిరంగు కలది.

గీ. మదఁకపసిమిడిగింబెమల్ మంజిడిబిగి, దోమ
తెఱమంచములు కానంతులు జవాది, యగరు
సిరులు బొన్నెలు గాఁగ క్షతేడు గడపెఁ,
జలికాలలు తద్వధూటీచకరణుఁ దగుచు
కళా. ౪. ౧౭౧.

పసిమివడు. అ క్రి (√పసిమి) పచ్చనగు.
(సమృద్ధమగు).

క జడి గాక పెట్టె గాకయ్యవడ గాకయుఁ
జలియుఁ గాక వలు పిది యని యూర్పడక
యిల పసిమి పడఁగా,బడుగులు ప్రియ
మంది రనఁగఁ బ్రభులకుఁ దగడే.
ద్వా. ౪. ౯౨. (ప్రాఁతప్రతి పా. పసిమి
వడంగ. ముద్రిత పా.)

పసిమొగ్గ. వి (√పసి4) క్షారకము, పసరుమొగ్గ.

సీ. పసరుమొగ్గ యనంగఁ బసిమొగ్గ యనఁగను
క్షారకనామ మై మీఱును .
ఆం భా ౨ ౪౦.

పసిరిక=పసపుముద్ద, పసరు. వి (పసరు + ఇక
స్వార్థమున, సంధినివర్ణవికారము) ౧. పసరు
వన్నె, ఆకుపచ్చవన్నె (శ. ర) ౨. వృక్ష
విశేషము.

సీ జువ్వి మామిడి జీడి మురుగుడు కెంబుగు
పాపట చంద్ర పసిరిక పాల రేల
కేం పంచ. ౪. ౫౨౨.

3. పచ్చపిట్ట, హారీతము.

గీ. పచ్చపిట్ట యనంగను బసిరిక యన,హారితకం
బొప్పు... ఆం. భా. ౨. ౯౬.

సీ. పసిరిక లకుముకి పావురాయి.
పార్వ. ౬. ౪౪

సీ బరితము కోకిల పసిరిక తంగేడు గొరవంక
జక్కువ చెలువుకోడి హంస. 3. ౧౨.

౪. కామల రోగము

సీ...పసిరిక యనఁగా మాల యనఁగను గామ
లాభిధ మిఱు. . ఆం. భా. ౨. ౧౨౪.

విశే. ఆకుపచ్చ వన్నె కలది. (శ. ర.)

పసిరికపాము. వి (౧ పసిరిక) పసరువన్నె గల
పాము, సర్పవిశేషము.

చ పసిరికపాముపంటి దని పల్కుడు కేయలికేతే
కుట... కుక. ౧. ౧౩౪.

పసిరికతొంగ్గ. వి. (√పసిరిక) పసరుతొంగ్గ. (శ. ర)

పసిపట్టు. అ. క్రి. (పసి2+పట్టు) పశ్వాదులపై గాలిని గ్రహించు, జాడ పట్టు

గీ ముసు్ను జాగిలములఁ గూడి చన్నయట్టి, యెదుపటక్కులు కుందేళ్ల సుందురువుల, నుడుముల గ్రహింపఁ బుట్టలకడలఁ బొదలఁ గిరులపతియలఁ బసిపట్టి తిరుగుచోట
మనుచ ౪ ౫౧.

సీ. పసిపట్టి నలుగడఁ బఱచిన మెకిములఁ పచ్చి త్రోళ్ళను బండ్లఁ గ్రుచ్చి పెఱుకఁ బలు జాగిలంబులు... వాల్మీకి ౨ ౭౫

స. క్రి. ఆఘ్రాణించు, మూర్కొను.

వ. కొనసాఁగి పోగ లై ముంగిసవారలం బోనివారలు పారసారకు నెత్తి బయలు పసిపట్టుచు. మనుచ. ౪. ౨౫.

పసుపాడు=పసపాడు. అ. క్రి. (పసుపు+ఆడు) పసుపు పూసికొని స్నానముచేయు; పసుపు నలిచికొను.

సీ. పద్మాకరమునకుఁ బసుపాడఁ డెచ్చినదైవంబు చలము సాధ్యంబుగాఁగ. శివరా. 3 ౧30

సీ. ఒరసి రొమ్ముత్తిమణుం గొండక మేన నిగ్గులు దేఱఁ బసుపాడి జలకమాడి. అను. ౧ ౬౦

పసుపార్చు. స క్రి (√పసుపాడు) పసుపు పూసి జలకమాడించు.

తరళోజ. అలరుపుప్పొడి పసపార్చి మృణాల హారం బమర్చి కహ్లారంబు కోకు, లలకల నమర్చి... హరి. ఉ. ౭. ౭౫

పసుపు=పసపు. వి ౧. హరిద్ర.

(దీని భేదములు. కస్తూరి పసుపు, కూరపసుపు, మ్రానిపసుపు, చాయపసుపు, పిండిపసుపు.)

చ. ద్రవిడకుటుంబినుల్ పసుపు రాచిన రత్న పుగాంకక్రింత... అను. ౧. ౬౪.

గీ...ఉల్లి కంద పసుపుఁ దోటలు...
నీలా. ౨. ౫౭.

సీ. పసుపునిగ్గులు దేఱు పాపజన్నిద మొప్పు.
మనుచ. ౨. ౧౧.

౨ హరిద్రావర్ణము (శ. ర.)

విణ హరిద్రావర్ణము కలది, పసుపువన్నె కలది

సీ దానవమానినీ స్తనకుంభములతోడఁ బసుపు పయ్యెదలకుఁ బాయ తెరువు.
ఉ హరి. 3 ౧౪౭.

జ. పసుపాడు, పసుపార్చు, పసుపుఁబిట్ట, పసుపుగోఁచి, పసుపుముద్ద, పసుపుమెుల్ల.

పసుపుఁబిట్ట=పసుపుముద్ద. వి పసిరికపిట్ట, హారీతము. (శ. ర)

పసుపుగోఁచి. వి (√పసుపు) ఉపనయనాదు లందు మంగళార్థము పసుపుతోఁ దడిపిన కౌపీనము.

గీ అతఁడు మృగకృత్తి మెళమెళ యనఁగఁ బసుపుగోఁచి గట్టిన మోదుగుకోల మెగయ.
అను ౪ ౬౬

(ఇట్టి పసుపుబట్ట మొ)

పసుపుముద్ద=పసపుముద్ద. వి (√పసుపు) పసిరికపిట్ట, హారీతము (శ. ర)

౨. వ ధాన్యవిశేషము.

వ సుఖభోగులు సన్నబూదులు గొరవంకరాజ నాలు కాటుకశేకులు ముంగురమెటికలు పసుపుముద్దలు మంచిచిరులు...
ప్రబంధ. ౧౧౨.

పసుపుమొల్ల. వి (√పసుపు) పచ్చపూవుల మొల్ల, హేమపుష్పికి.

పసురు. వి. ఆకు మొదలగు వానిరసము.

సీ...పసురు పస రసంగ స్వరస మొప్పు.
ఆం. భా. ౨. ౪౦.

విణ. పసరువర్ణము కలది, ఆకుపచ్చరంగు కలది.

పహిణ్డి=పసిఁడి.
(బంగారు)

వ...శ్రీ భీమేశ్వర మహాదేవరకు ..భుక్తెంచిన ...మాణిక్యములు రెణ్డుంగట్టిన పహిణ్డిపాణి సంక్కృలు ౧ నవరత్నములుంగట్టిన పహిండి పానలురెణ్డు
ద శా. ౪ ౧౧౯౦ ౪ ౧౦౩౨.

వ...శ్రీ భీమేశ్వర మహాదేవరకుం బెట్టిన కనక వలయముగద్యా ౧౦౨ పహిణ్డి...
ద శా ౪. ౧౭౭౭.

వ...పహిణ్డి నీరు వఱడినకొ(ము)ల వెంజా మరలు ౧...
ద శా ౪ ౧౧౯౦

(ధనము)

వ...యిభూమి కృషి సేసి యుతియిచ్చి నదపంగల వారు గాంబహిండియిచ్చి యిరువంణ్డు బ్రాహ్మణులకు ఆ చంద్రార్క్కముగ కస్యత...నిల్పిరి. . ద శా ౪ ౧౭౧

పహ్లవులు. సం వి అ పుం. జన విశేషము

పహ్లికులు. సం=పహ్లవులు.

## పా

పా. సం వి. ఆ స్త్రీ. ౧. అంబుభార్త. ౨ ఘంధ 3 సంపతి శా. వి. దీనికి తెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు

పాంక్తేయుఁడు. సం విణ (అ ఆ. అ.) ౧ బంతి కుడుపునఁ గూర్చుండి తినఁ దగినవాఁడు ౨. పావాసమునకుఁ దగినవాఁడు. (విల్సన్స్.)

పాంక్త్యుఁడు. సం=పాంక్తేయుఁడు (విల్సన్స్)

పాంగుల్యము. సం. వి. అ. న. కుంటుట. (విల్సన్స్)

పాంచజన్యము. సం. వి. అ. పుం. కృష్ణుని శంఖము; శంఖము.(శ. ని.)

పాంచజన్యుఁడు. సం. వి. అ. పుం. అగ్ని విశేషము.

పాంచదశ్యము. సం. వి. అ. న పదిహేనింటి సమూహము. పుం పదియేను సామిధేనీ మంత్రములచేత బ్రకాశింపఁజేయఁదగిన అరాకామగు అగ్ని

పాంచభౌతికము. సం విణ (అ ఈ అ) పంచ భూతములచేఁ జేయఁబడినది (దేహాది)

పాంచాలము. సం. విణ (అ. ఈ అ) పంచాల దేశభవము. వి అ పుం. ౧. ఒక దేశము. ౨ శాస్త్రము

పాంచాలి. సం. వి. ఈ. స్త్రీ ౧. పాంచాల దేశస్త్రీ; పాంచాలదేశరాజకన్య ౨ ద్రౌపది. 3 (అలం) రీతిభేదము.

పాంచాలిక. సం. వి అ. స్త్రీ. వస్త్రదంత కాష్ఠాదులచేతఁ జేయఁబడిన నరమృగాదిరూపము, బొమ్మ

పాంచాలుఁడు. సం వి అ పుం ౧. పాంచాల దేశపురాజు. ౨ (కామశాస్త్ర) ఒక జాతి పురుషుఁడు. 3. శిల్పి (వడ్రంగి, సాలె, మంగలి, చాకలి, మాదిగ మొ)

పాంజేబులు. వి. బ (స్త్రీలు) కాలికి ధరించు కొను గొలుసు. (శ. ర)

పాండరము. సం విణ. (అ. ఆ. అ) తెల్లనిది. వి. అ పుం. తెలుపు, శ్వేతవర్ణము న. కుంద పుష్పము, మొల్లపువ్వు ౨. గైరికము. (వాచ)

పాండవబీడు. వి. చిరాప్రహతభూమి, చాల కాలమునుండి దున్నని బీటినేల.

సీ. పాండవబీడు నాఁ బరగుఁ జిరాప్రహతము...
అం. భా. ౨. ౩.

పాండవుఁడు. సం. వి. అ. పుం.—పాండురాజు కొడుకు—(ధర్మజ భీమార్జునాది).

**పాండవేయుఁడు** సం వి అ పుం పాండవుఁడు

**పాండితి** సం వి ఈ స్త్రీ పాండిత్యము

**పాండిత్యము** సం వి అ న ౧ పండిత భావము, చదువరితనము ౨ సామర్థ్యము, నేర్పు ౩ పండితకర్మము

**పాండిమ** సం వి న్ పుం తెలుపు

**పాండిమము** సం వి అ న తెలుపు

**పాండియము** సం=పాండ్యము (వై ౧)

**పాండియుఁడు** సం=పాండ్యుఁడు (వై ౨)

**పాండీఁడు** వి (సం పాండ్య త పాండియన్) పాండ్యదేశపురాజు

ఉ ఈఁడు మహామతీ మధుర నేవు యఘుఁ గొంచ్చి యందు బాంగఁడు గీర్వాణము న్నెఱయ నించినఁ బ్రేలెడి దుర్మదాంధులన్ బోఁడిమి మాన్పి హంసకులకాముస్ ఆము ౨ రా

**పాండుకంటకము** సం వి అ పుం అపామార్గము, ఉత్తరేను !

**పాండుకంబళిము** సం వి అ పుం ౧ తెల్ల కంబళి ౨ ఎట్టపేనుఁగుపై వేయుకంబళి, తెల కుధ ౩ ఒకజాతిరాయి

**పాండుకంబళి** సం విణ (న్ గీ న్) ౧ తెలకంబళిచేత కప్పఁబడినది (రథము) ౨ తెల్లకంబళి గలది

**పాండుకర్మము** సం వి న్ న వ్రణమును తెల్లఁబారునట్లు చేయు చికిత్సాభేదము

**పాండుకుఁడు** సం వి అ పుం చండాల స్త్రీయందు శూద్రునివలన పుట్టిన సంకరజాతి వాఁడు

**పాండుతరువు** సం వి ఉ పుం ధవవృక్షము

**పాండునాగము** సం వి అ పుం ౧ పున్నాగము, పొన్న ! ౨ తెల్లయేనుఁగు ౩ తెల పాము

**పాండుపత్త్రి** సం వి ఈ స్త్రీ రేణుక అనెడి గంధద్రవ్యము !

**పాండుఫల** సం వి అ స్త్రీ చిర్భటి, దోస !

**పాండుఫలము** సం వి అ పుం పటోలము, పొట్ల !

**పాండుపృష్ఠుఁడు** విణ (అ ఆ అ) దుర్లక్షణుఁడు

**పాండుభూమము** సం విణ (అ ఆ అ) తెల్లని నేల గలది వి అ పుం తెల్లనిబలపు భూమి ఆ స్త్రీ ౧ శ్వేతమృత్తిక, తెల మన్ను ౨ ఖటిక, బలపము

**పాండుమృత్తిక** సం వి ఆ స్త్రీ ౧ ఖటిక బలపము ౨ తెల్లమన్ను

**పాండురంగము** సం వి అ పుం శాకవిశేషము, (పాటరాంగా)

**పాండురద్రుమము** సం వి అ పుం కుటజము, కొండమల్లె !

**పాండురఫలి** సం వి ఈ స్త్రీ ఒక దినుసు క్షుద్రక్షుపము (పొట్టియాకులుగల చెట్టు)

**పాండురము** సం విణ (అ ఆ అ) ౧ తెల్లనిది, ౨ తెలుపు మించిన పచ్చనిది వి అ పుం ౧ తెలుపు ౨ తెలుపు మించిన పచ్చన ౩ కామాల, కామిల న ౧ శ్విత్రరోగము, తెల్లపులుము ౨ మరువకము, మరువము ! ఆ స్త్రీ మాషపర్ణి !

**పాండురాగము** సం వి అ పుం ౧ తెల్లఁదనము, తెలుకు ౨ దమనకవృక్షము

**పాండురిమ** సం వి న్ పుం తెల్లఁదనము, పాండిమ

పాండురేక్షువు. సం. వి. ఉ. పుం. శ్వేతేక్షువు, తెల్లచెఱుకు ణీ.

పాండులోమ. సం. వి ఆ స్త్రీ. మాషపర్ణి ణీ.

పాండులోమశ. సం = పాండులోమ.

పాండువు. సం. విణ (ఉ. ఉ. ద్వి. ఉ) ౧. తెల్లనిది ౨. తెలుపు మించిన పచ్చనిది వి. ఉ. పుం. ౧. తెలుపు ౨. తెలుపు మించిన పచ్చన ౩ ఒక రోగము. ౪ తెల్లయేనుఁగు ౫ ఒకరాజు (ధర్మరాజాదు లగు పాండవుల తండ్రి) ౬. పటోలము, పొట్ల. ణీ. ౭ ఒకా నొక దేశము. ౮ మాషపర్ణి, కారుమినుము ణీ ౯. ఖర్జూరము ణీ

పాండుశర్కర. సం వి ఆ స్త్రీ సితి యను ప్రమేహరోగము

పాండుసోపాకుఁడు. సం వి అ పుం సంకీర్ణ జాతిభేదము.

శ్లో చండాలాత్పాండుసోపాక స్త్వక్సారవ్య వహారవాన్, అహిణ్డికో నిషాదేన వైదేహ్యా మేవ జాయతే మను. ౧౦. ౩౬

(చండాలునికి వైదేహియందుఁ బుట్టినవాఁడు)

పాండ్యము. సం. వి. అ పుం ఒక దేశము (శ ర.)

పాండ్యుఁడు. సం. వి. అ. పుం ౧. పాండ్యదేశపు వాఁడు. ౨ పాండ్యదేశపురాజు, పాండీఁడు.

పాంథుఁడు. సం. వి అ. పుం ౧ పథికుఁడు తెరువరి, ౧. సూర్యుఁడు. (విల్యమ్సు).

పాంశుకీలము. సం. వి. అ. న. నిరుపపద మగు శాసనభేదము, ఎవరిపేరిట వ్రాయఁబడినదో వాఁడు తెలియఁబడని పత్రము. (త్రి ని)

పాంశు(సు)రాగిణి. సం. వి. ఈ. స్త్రీ. మహా మేద. ణీ.

పాంశు(సు)లము. సం విణ. (అ. ఆ అ) ౧. పాంశువు (దుమ్ము) మిక్కిలి గలది. ౨. పాపము గలది, చెడినది ౩. చెఱుపునది, దూషించునది ౪. శివుని యాయుధవిశేషము

పాంస(శ)నము. సం. వి అ. న. తిరస్కారము. (త్రి. ని)

పాంస(శ)నుఁడు. సం. విణ (అ ఆ, ఈ అ) ౧ దూషకుఁడు, చెఱుపువాఁడు. ౨. అవ మానము కలిగించువాఁడు. ౩. దుష్టుఁడు, నింద్యుఁడు ౪ దుష్కీర్తి గలవాఁడు (ఇది తఱచుగా సమాసాంతములం దుండును)

పాంస(శ)వము. సం విణ (అ ఆ అ) పాంసు వులు గలగి వి అ పుం — పాంశువికారి మైనది — లవణభేదము

పాంసు(శు)కాసీసము. సం వి అ న కాసీ సము, అన్నభేది

పాంసు(శు)క్షారము. సం. వి అ. న. క్షారల వణము

పాంసు(శు)చందనుఁడు సం. వి అ పుం. శివుఁడు (త్రి ని, వై ని)

పాంసు(శు)చత్వరము. సం వి అ పుం. ఘనో పలము, వడగల్లు.

పాంసు(శు)చామరము. సం. వి అ పుం. ౧. పటవాసము, కుడారము ౨. గఱిక మొల చిన భూమి ౩ వర్షాపకుఁడు, నాడీవిభాగము చేయువాఁడు ౪. ప్రశంస ౫. పురోటి, తొక్కల ఝుంకారము ౬. ధూళిగుచ్ఛము, పటవాసము.

పాంసు(శు)జము. సం = పాంశుక్షారము.

పాంసుజాలికుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు. (విల్యమ్సు)

పాంసు(శు)వర్త్రము. సం. వి అ. న చార్వాక శాకము, చక్రవర్తికూర. (వాచ.)

పాంసు(శు)మర్దనము. సం వి అ. పుం. కేదారము, వరిమడి

పాంసు(శు)రము. సం వి. అ పుం. ౧ దంశము, అడవియీఁగ. ౨. కుంటివాఁడు

పాంసు(శు)రాష్ట్రము. సం వి. అ. న దేశభేదము.

పాంసుల. సం. వి ఆ. స్త్రీ. ౧ ముట్టుత, రజస్వల. ౨ పుంశ్చలి, జంకుటాలు. 3 భూమి ౪. కేతకి, మొగలి

పాంసు(శు)లుఁడు. సం వి. అ పుం. కాముకుఁడు, విందఁడు

పాంసు(శు)వు. సం వి ఉ పుం. ౧. ధూళి, దుమ్ము ౨. ధూళిదలము, రేణువు 3 ఎరువు, పేడ. ౪. ఒకదినము కర్పూరము. ౫ పర్వటము. అ న. ఒకదినము ఉప్పు

పాఁకు. వి శైవలము, నీటిపైన బయలుదేఱునీఁగె.

గీ. కురులతోఁ గూడ విలసిల్లు గిరిజ మొగము, జడలు దాల్చినఁ గడు చెదం గదరి పొల్చె, భృంగములు మాఁగి చెలువొందు బిసరుహంబు,పాఁకు దాల్చియుఁ గర మొప్పుభంగి నోశ. కు సం. ౬. ౪౪౨

శ్లో...సశైవలాసంగమపి ప్రకాశతే. సం కు. సం. ౫. ౯.

సీ కడిసన్నతమ్మిఁ బాఁ కడరెనో యన దీన వదనంబుపై నెఱుల్ సెదరితూల. కు. సం. ౨ ౨౭౧.

పాఁకుడు=ప్రాఁకుడు. వి. పండ్లపాఁచి లోనగునది. (శ. ర)

పాఁగు=పాఁగెము. వి. (శ. పాంగు) విధము, రీతి.

క. ఏఁగిన శాతం డఖ్రులు, దోఁగిన నయనములఁ జూపు దోఁపక తనలోఁ, గ్రాఁగుచు నుండఁగ నేమా,పాఁగెఱిగినభంగి నొయ్యఁ బలికెడి మఱవిక ద్వా. ౫ ౬౭

పాఁగెము=పాఁగు. వి ౧ విధము, రీతి.

ద్వి. శివుని, నుతియించి పడసెఁ గన్నులు గాళిదాసు,యనఁగ నందులలోన వఠనిపాఁగెముఁ కనుగవల్ వడయుట కష్టంబుగాదె. పండితా మహిమ. ౨౪3. పా

౨ సంబంధము.

ద్వి. ఏఁ గొనిరొఱిడి దేమి రొులమి నీతోడి, పాఁగెము వాపాల పరమేశుఁ డుండ పండితా పర్వత 3౯౭ పా

3. సామ్యము.

సీ కొలముపాఁగెముఁ నప్పాలనుదిండిని వట్టి, తెగి నీటిఁ ఉని పెం పిగురఁ జేసి, యయా ౨ ౦౦౪.

౪. మైత్రి,స్నేహము (చి ని)

పాఁచి=ప్రాఁచి. వి (సం పాచీ క ర పాసి. మ పాయి. తు. పాసే.) ౧ శైవాలము, నాఁచుతీఁగె.

సీ ముంచి చీకటులు కల్పించునీడలు పోవఁ బద్మాకరంబులపాఁచి విఱుగ కువల. 3 ౧౦

సీ నాఁచు పాఁచి యనఁగ గీ. శైవలంబగు సాం ని. స్థా. ౬౫

౨. నీరు నిలువ యుండుటచే కలిగెడి పచ్చని మురికి.

సీ. నిర్ఝరప్రబలవేణిక లింక జట్రాలఁ జేరిన పాఁచి పెన్నీట తెగయ. ఆము. ౨. ౪౭.

3. పండ్లమలము.

సీ. బొక్కిరొమ్మును నూఁదబొడ్డును మిడిపండ్లు తెల్లుగోరును బాఁచి దేఱుమొగము. భల్లాణ. ౪. (శ. ర.)

3. వశమగు, అధీనమగు

... బ్రోవఁగ నెందునీకపాలుపడినదికర్ణసాదలాస భారతసంహితవిల్చిచాడ్పునన్.

పాండు. 3 3౮.

(నీకే చెల్లినది అని భావము)

౪ అర్హమగు, తగు

సీ ఈరైవతక శైలవారుకూటవిటంకకేలి కిం కవ్వతె పాలుపడునా పారి. ౧. ౧3౧.

సీ. క్షితిశిరోభూషావిశేషనిర్మితికిఁ బాల్పడుపడి యచ్చుల ట్లడుగులు దగ

పాండు. ౧ ౧౬౧

౫. సమర్థుఁడగు, శక్తుఁడగు

క బలి నొకనిఁ జెప్ప నేఁటికి,బలవంతుల నెల్ల నోర్వఁ బాల్పడితాఁ డా, జలరుహాసా భుఁడు లోకంబుల నతనికి నెదురఁ జాలు పురుషులు గలరే హరి ఊ ౧౦ ౧౯౫

పాలుప(ల్ప)ఱుచు. స. క్రి (√పాలుపడు) పూనఁజేయు సిద్ధపడఁజేయు

సీ మాధవస్మరణంబు మాన్పి కోశో్‌కాదిపర నంబునకుఁ బాలుపఱుపనేని

విప్ర. ౨ ౮౪

గీ అర్హలక్షణసంపన్న మైనహాయము, భూప్ర దక్షిణసంచారమునకుఁ బంపు,భట్టిఁ దద్ర క్షణమునకుఁ బాలుపఱుపు.

విక్ర. ౫ ౬3.

పాలుపుచ్చు. స. క్రి (√పాలుపోవు) ౧ (పాలుపోఁజేయు) విభాగించు. (శ. ర) ౨. నిర్ణయించు.

ద్వి. పాలుసు నీళ్లు సేర్చితిచి యారెంటిఁ, బాలు పుచ్చిన మీఁద బాధింపు మనుఁడి.

ద్వి. శ పా. ౪౯ పా.

పాలుపోవు. అ. క్రి. (√పాలు¹) పాళ్లగు, విభక్తమగు.

గీ. అసురులకు దేవతలకు నయ్యవసరమునఁ, బాలువోకుండె నప్పు డప్పద్మనయన, యుభయవాదులు గూడి యయ్యోర్పులాక్షి, పాదపంకజములకును బంటు లైరి

హర. ౬. ౧౦౫.

(బుక్యమాకపర్వతవర్ణనము) — ద్వి బలభేది మొదలుగాఁ బరగుదేవతలు, కిలయ నంబుధిఁ ద్రచ్చి కన్నవస్తువులు,పనివడి తమలోనఁ బాలుపోకున్న,వుని చిక్కె... దీనిపై నసఁగ

రం రా. ఆర ౧౯౪ పా ౧౬ పం

౨. నిర్ణీతమగు (బ్రౌ., శ. ర)

(వ్యవ.) నాకది యెటుచేయుటకును పాలుపో లేదు

పాలుబొన. వి (√పాలు¹) ఉభయరాశి యైన అంబారములో కాఁపువానికిఁ జేరవలసిన వర్తన ధాన్యము. (శ ర, బ్రౌ)

పాలుమా(ల్మా)లిక = పాలుమాలిక. వి సోమరితనము. (శ. ర, బ్రౌ)

పా(లుమా)ల్మాలు=ప్రాలుమాలు. అ క్రి ౧. ఆసపడు, కక్కుతిపడు.

రగడ పాలుమాలి నృపాలునకు వనపాలు లిడునులుపాలు డాచెను

చంద్రా. ౪. ౨3౪.

గీ. వానిఁ బోలినవానినీటు కాని నొకని. క కని బాలివోవని మగవా,లిని గూర్చిద నీకుఁ జాలలేవడిఁ బాల్మాలినయది యనుచుం బిలిచిన... కుక. ౧. ౪౪౬

మ రమణీబృందముఁ జూచి వాయుజలపర్ణ గ్రాసు శాగాధిపుత్రముఖుల్ సైతము పాలుమాలిరి పయోదధ్యాజ్యశాల్యన్నభో, గముసం గ్రొవ్వెనరుల్ జితేంద్రియు లనం గాఁ జెల్లునే. మల్లభూ. ౯౦. ౧౧౦.

౨. సోమరితనముపొందు, బద్ధకించు.

పాలెముండు. అ. క్రి. (√పాలెము.) కావలి యుండు, కాఁపుండు.

సీ పండువాణురకాణి పావడం బిచ్చినభద్రేభ ములం వీథిఁ బాలె ముండు భీమ ౧ 3౪.

ఉ. నందివినాయకాదిగణనాథులు గూడిధృతా స్త్రశస్త్రులై రెయిందలు పాలెముం దురు మహీధరకన్యకు పావధానులైనంది వినాయకాది గణనాథులుగూడి ధృతాస్త్ర శస్త్రులై యందలు పాలెముందురు మహో గ్రపథువీటికి దక్షవాటికిన్ భీమ 3 ౧౬.

ఆ పాలెమున్నవారిపై నొల్కి బూడిదమందు చల్లి . ద్వా ౧౦. ౧౨౧

పాలేరు=పాలేరువాఁడు. వి. (పాలు[1]+ఏరు[1]) మేఁడిపాలికిదున్నెడుమదఁకవాఁడు. (శ. ర)

ద్వి ఏకేళ భూమి పాలేరులు గలిగి,కూర్మి సస్యంబులఁగూడి రహించు. ద్వి నల ౧ ౨30

పాలేరువాఁడు = పాలేరు. వి (√పాలు[1]) మేఁడిపాలికి దున్నెడి మదఁకవాఁడు (శ. ర.)

పాలేఱు. వి జొ. (పాలు[2]+ఏఱు[2]) ౧ కాంచీ పురప్రాంతమందలి ఒకానొకనది.

క... మూరుకేరి కలహంసీమండలకాండవఖండన, పాండిత్యంబునఁ దనర్చుపాలేటిదరిన్. పరమ ౪ ౨౨3

౨. పాలసంద్రము.

దండకము తొల్వేల్పులు వ్వేల్పులుం గూడి పాలేఱు వే ద్రచ్చుచో. నీలా ౨. ౪౧.

గీ. అట్టిదంతులుదారి,కొలఁకుపాలేటి నిండుజాబిలి యనంగ. అచ్చ. రా. బాల. ౧౧.

పాల్లకుఁడు. సం. విశ. (అ. పల్లికా. అ.) పల్లె యందుఁబుట్టినవాఁడు, పల్లెటూరివాఁడు, జాన పదుఁడు.

పాల్లవ. సం. వి. ఆ. స్త్రీ. పల్లవములతోడియాట.

పాళ. వి. (క పాళె) పోఁకలోనగు చెట్లయొక్క కప్పడిప్పతోఁగూడిన పూలగుత్తి.

రగడ పాళ కల్లది పోఁకఁ గ్రొవ్వేఁక బందము దొగియ,శాలి యది దిగజాలనట్టిదండము నగిరె మనుచ. 3 ౧౪.

(బ) ధాన్య విశేషము.

మ. సారిదిం చేర్చినతీఁగమల్లియలు ఖర్జూరంబులు న్నవ్వునుం,జరులు న్మామిడిగుత్తులు న్గనుము ల్పంచెంగలు న్పచ్చగ,న్నెరులుం బాళలు గల్గి రాజవధూఁగాంతిం దారు ములన్నపి చేలరుదార న్నగుఁ బూవుఁ దోఁటల బలాకానీకదంభంబునన్.

ఆము. ౧. ౬౬.

(ఇది రెండర్థములకు నుదాహరణము.)

పాళము. వి (సం ఫాలమ్, పారమ్, క పాళ, త. పాళం, మ. పాళం)

౧. (బంగారుమొదలగువాని) ముద్ద

ఉ. పాళము మీఱు పెద్దపెదపాళము లై బలి తంపుఁగాఁగులన్,మూలుగుచున్న ప్రాఁబసిఁడి ముంచి ధనార్థుల కిచ్చు పాండు. ౪. ౨౧౧.

౨ సమయము

రగడ భాను కోయను వేగపడి పూఁబాళఁ బాళము గాదు నేఁటికి. పారి. ౪. ౧౬.

3 విధము (శ ర.) ౪. (=పాళా) బంగారు. మొ. వానికడ్డి. (శ. ర.)

౫. హద్దు, మేర, అవధి.

ఉ. భవత్తమాజానకు నే నొనరించినయట్టి దేమి యూ, పాళము దప్పఁ గ్రొవ్వినయభాగ్యుల కూరక యొడ్వవచ్చునే. హరిశ్చ. ౫. ౫౧.

పాండు. ౪. ౨౧౧.

పాళా=పాళము. వి. (త పాళం)—బంగారులో నగువాని—కడ్డి. (శ. ర)

పాళి. వి. (సం పాళికా.) ౧ జూదమాడెడు పలక

శు...ప్రాణివిశతుల్ పారెల్ పగల్ శేయి ప్రాచికలున్ లోకము లెల్లఁ బాళియను గాఁ జేయుర్చు కాలంబు.

మల్లభూ. వైరా ౪.౫

చ. బలితపుఁబద్మజాండ మనుపాళి ఘటిం చట మీఁద బద్ధజీవు లనెడిపారె లుంచి రహి పుట్టఁగ నమ్మహాకేళిచుబాదముల్, గల బలు పాచిక ల్గాని చమ ౧. ౯౨

౨. పారెలపోఁత.

గీ. సకలసతతమాతసాక్షమాలికలో గుప్త, మనుజ పాళులో దేవసంప్రార్థనములఁబూను సెత్త మ్ములో రాజ్యభూరిభరము,లిల సదాపాశ వృత్తుల కేల సెపుమ హ. న ౩. ౧౪.

పాళియ=పాళె. వి. ౧ జూదమాడుపలక (శ ర.)

౨ పాత్రము, పళ్లెము

గీ తళుకుసద్భావహేమునకమకేంద్రదిగ్వి, లాసవతి పైఁడిపాళియఁబోవి తెచ్చు సాదముల నాఁగ రాగభూరోద్యదయేందుబింబ మునఁబొండుకొ రణాంబరంబు తిసఁగె. కు. సం ౭ ౧౧౨

పాళియము=పాళెము. వి (శ పాళియ)

(శిబిరము, సేనానివేశము 1)

ఉ...భూ, ర్యావనిభృత్తటాటవుల నాఁటివిభుల్ మృగయా విహారముల్, చేవ దలిర్పఁజేయ టకు శీఘ్రమ పాళియ మెత్తి కుంభజ, గ్రావనుతాగ్రతీరగిరికాననమధ్యమునన్ వసిం చుచున్. కాశి ౩. ౫౨

క. అప్పుడయిఁ శైల్లెలు బలె మన్నమెప్పుడు నిలిఁ గూడియుండ మిద్దఱును సొం, పొప్ప నని బారు పాళియ, మప్పుడె రుత్తి వడి నరిగి రిమరావతికిన్.

వాల్మీకి. ౩. ౧౩౭.

పాళి[1]. వి. ౧. ప్రాసెడి యినుప కలముకొనక్క మైన (శ ర) కలమునకు కొనను తగిలించి ప్రాసెడి యినుము మొదలగువానిముక్క.

ఉదా: బంగరుపాళి, ఇత్తడిపాళి మొ.

పాళి[2]. వి. ౧. జూదమాడెడు పలక. ౨. జూదము.

పాళి[3]. వి మల్లయుద్ధ విశేషము

మ. జవసత్త్వంబులు మేలె సాము గలదే సత్రాణమే మేను భూప్రవరుం బోసన మి మ్మనంగి వలెనే పాళి లభీష్టంబుకే

భాగ. ౧౦భూ ౧౩౩౧.

పాళి[4]. వి. కాలనియమము

(వ్యవ) సప్తాహములో పాళి తేర్పఁజుకొని భజన చేయుదురు

జ. పాళిజ్వరము

పాళిజ్వరము. మి. వి. (√పాళి4) కాలనియమ మునుబట్టి తగులుచు విడుచుచు నుండెడిజ్వరము

గీ. కటుకరోహిణిఁ జనుఁబాలఁ గలయ మాఁత, కడుపునకుఁ బోసి యొడ లెల్లఁ గలయఁ జమురఁ,దీఁటుఁ బాళిజ్వరంబులుడిఁగు వసయు, గరిఁటె తామరసంబునఁ గలిపి చముర

(చి కి. చి. ని.)

పాళె=పాళి, పాళియ, పాళి. వి (సం పాళికా) జూదమాడెడు పలక.

సీ పాళె యంచ న శారిఫలము పేరు

ఆం. భా. ౨. ౩౦౫.

పాళెగాఁడు. వి (√పాళెము) ౧. దొర, ప్రభువు; సేనాపతి.

సీ. పాలుపొండుపండుకావలిపాళెగాంద్రకుసన్న దాడిను మెచ్చి కడదురపటిచి.

చంద్రా. ౪. ౭౪

గీ వఱఁదఱోరచ్చలును గల్గి వచ్చె నెంతయు,
పాళెగాఁ డొక్కఁ డా చంద్రభానుకడకు.
చంద్ర ౨. ౩.

చ అనయము జీవకోటికి భయంబుగ దారులు
గట్టి కొల్లఁగై, కొన పెల విచ్చెఁ జోరులకుఁ
గూర్మిపరాంగనలన్ రమింపఁగాఁ, బనిచె
విటావలిన్ భువనబంధుఁడు లేనియరాజకం
బుచేఁ, దనరప హై చరించె వసుధాస్థలి
(?)కటిపాళెగాఁడొగిన్ అని ౩ ౯

గీ దొంగలు మన్నీలు చెలులు బందుగులు జెట్లు,
బంట్లు కబ్బంపుఁగూర్పరు ల్పాళెగాండ్రు,
గడనచేడియ లూడిగేల్ గాణ లాజ్ఞ, చాఁప
నయ్యలు దీర్పరు ల్బలని కొలువ
నీలా ౧ ౪౯

పాళె(ము)పట్టు. వి (√పాళెము) వందునివసిం
చెడిచోటు, నివాసము

మ గురుఁ డాచార్యుఁడు ... స్వర్లోకము
పాళెపట్టు ద్విరదం బైరావతం బిట్టియ,
చ్చెరు వౌపాధన ముండియున్ మఘవుఁడు
మల్లభూ నీతి ౨౧

చ. కవి వచియించె రాక్షసనికాయ్యము గాఁగల
దంచు, దండకాటవి యటు గాన నిల్వ
మచటన్ [illegible]
దనుజచ్మలున్ గొలువఁ బాళెముపట్టొకచో
రహింప నీ,యవరజ దీని శూర్పణఖ నారసి
కొంచు పమాదగంబునన్
ఉ రా. ౪ ౧౦౯.

సీ. కమలాకరములు పాళెముపట్టు కొనఁగద
నెంచుఁడీ నాదెన నంచలార
చంద్రా ౪ ౯౨. (చి ని. పా.)

పాళెము = పాలెము. వి. ౧ పాళెగానిపట్టనము.
(శ. ర.)

౨. చిన్నపట్టనము ; పల్లె.

వ... పరిభ్రమించి వెలిపాళెంబుకట్టగడపటఁ
గటకాదు కుటీరవాటికం బ్రవేశించి.
క్రీడా. ౩౮

౩. పట్టనము, పురము.

గీ మింటిపాళెంబు లేర్చుముక్కంటితూపు,
గతినిపాతితకోహిణస్కందుఁ డనిల, మాన
పాతీతవేగసంపద్ఘనుండు,తార్క్ష్యుఁ డేతెంచె
దానవధ్వంసికడకు. పారి ౨ ౩౧

ద్వి. అలంబు సేసి పాండ్యావనీపాలు,పాళెంబు
డాసి తద్బాలికామణుల,మొలవెట్టఁగాఁ
దనయూఁకలచేత,. నెఱపట్టి తప్పించి చెలఁగ
నాపట్ల రఘునా ౪. పా.

సీ మూఁడుపాళెములు తెంపున గెల్చి పాదలు
జాబిల్లితాలుపు వెల్వబీర మెంత
యయా ౧. ౧౩.

౪ దేశము.

ఉ డెబ్బదిరెండు పాళెములు రీవిఁ దలిర్చు
సమస్తదుర్గముల్ జొబ్బిలు
హంస ౧. ౫౨.

౫ దండు, సేన

చ అద యిదె వచ్చె వచ్చె నరపాధిపుఁడాడి
యటంచుఁ బాళెముల్,బెదరి బరీదుఁ డేగు
నెడఁ దెంపఱి ఖానలు వెన్కముందుగాఁ,
గదిసి. నరస. ౩. ౧౨.

మ ఇది యేమో మనపాళె మెల్ల వగ నట్టిట్టై
వెతం జెంద నిన్నదిలోన న్వినరయ్యా నాఁడు
మొఱ శుక. ౧ ౩౭౭

౬. సేనానివేశము, దండువిడియుచోటు

సీ. కలను పాళెము వీడుపట్టు విడాయ విడిది
యం,చనఁగ నివేశ మొప్పు.
ఆం. భా. ౨. ౧౯౪.

ఆ ఇట్లు వైచి దాన నిలమీఁద దనుజుండు,
దిమ్మదిరిగిపడుటఁ జేతి చూచి, యనుభవింపు

చేసినంతయు నని పాళెముననుండు మరలి విభునిఁ గని భజించె.

రామా. ౪. అ౨౨. కుచల ౧. ౧౦౪.

౪ రాజగృహము, దివాణము

౫ కుంభోద్భవుపాళెమున నీ, కుంభు దివాణమున భృంగి కులపతి గాఁగాఁ, గుంభోద్భవుఁ వగఁ వెకిరి, శంభుని కింకరులు గర్వాంగంభమునన్

హర ౫ ౯.

౬ చోటు, వాసస్థానము

౭ కలువలపొలికందువలు కాముని కయ్యపుఁ బాళెముల్ విరహ్యాగులఁ బిలుకించువేళలు

భాగ ౧౦ పూ ౯౨౨

రగడ వేంకటశైలము విగతికరాళము, వేంకట శైలము విష్ణునిపాళెము ప్రబంధ ౩౯.

౮. కావలి, కాఁపు చూ పాళెముండు

౯ పాళెగాఁడు, పాళెపట్టు, పాళెముండు, పాళెముడిగు, పాళెమువెడలు

పాళెముండు. అ క్రి (√పాళె ॥) కాఁపుండు,

సీ పండువాఙురకాణి గావడం బిచ్చినభద్రేభ ములు వీథిఁ బాళెముండు ౧ ౩౫

పాళెముడిగు. అ. క్రి. (√పాళెము) దండు విడియు.

౪. ఈలీల పెండిమలకడఁ, బాళెముడిగి

ఉ. రా. ౪. ౧౪౪.

సీ. పాళెంబుడిగి యొక్కపజ్జ నిల్వకమున్న కూచిచేసినవాఁటి గుండెదిగులు

రా. వి ౨ ౬౯

వ. ఇవ్విధంబున రఘునాథుండు పాథోనిధిం దాఁటి .సువేలనగంబునఁ బాళెంబుడిగిన ..

దశా ౯. ౧౧౯.

పాళెమువెడలు. అ. క్రి. (√పాళెము) దైత్ర యాత్రకు బయలుదేఱు.

రగడ పచ్చవింటిదొర పాళెమువెడలెఁ, బచ్చ నూర్చి కడు విరహిణి బెదరెఁ.

బహు. ౨. ౧౩.

పావంచ. వి మెట్టు, సోపానము (శ. ర., బ్రౌ —"పావంచా" అని వ్రా)

పావకము. సం విశే (అ వి శే అ) పవిత్రము చేయునది, పరిశుద్ధము చేయునగి, శోధకము—

వి అ పుం ౧ నిప్పు ౨ వైద్యుతాగ్ని, మెఱుపునిప్పు ౩ అగ్నిమంథము, చెట్టి ౪ చిత్రకము, చిత్రమూలము ౫ భల్లాతకము, జీడి ౬ విడంగము ౭ రక్త చిత్రకము, ఎఱ్ఱచిత్రమూలము ౮ కుసుంభము, కుసుమ ౯. మూఁడు అను సంఖ్య. ౧౦ సోమపానము. (వై వి)

పావకాత్మజుఁడు. సం వి అ పుం ౧. కుమార స్వామి ౨ సుదర్శనముని

పావకి. సం వి ఈ. స్త్రీ ౧ అగ్నిభార్య ౨. సరస్వతి

ఇ పుం ౧ కుమారస్వామి ౨ సుదర్శనముని

పావకుఁడు. సం వి అ పుం ౧ వరుణుఁడు. ౨ సూర్యుఁడు

పావకోడు. వి (పావలు + కోడు—౨ పావ కోల్) పాదుక.

సీ పావాలు పావలు పావకోళ్లనఁ జెల్లుఁ బాదుకాభిఖ్యలు

పాం. వి. మాన. ౪౪.

గీ. అలరు పావాలు పావకోళ్లనఁగ గోడుగు, పావ లనఁ బావ లనఁగను బాదుకములు, దనరు ..

ఆం. షడ. షరి. ౧౦౪.

పావటీలు. వి. బ. మెట్లు, సోపానములు. (శ ర., బ్రౌ)

పావడ[1]. వి. (క. పావడ, త. పావాడై, మ. పావాడా).

౧. స్త్రీలుకట్టుకొనెడు వస్త్రవిశేషము, అంగదట్టము, గాగరా.

సీ. లుంగి,యన నంగదట్ట మన చనఁ బావడ యనంగ దూపాంతరీయ మై యొప్పచుండు.
ఆం. భా. ౨. ౧౫౭.

చ. తొడవులు పుచ్చి నిర్జరవధూటులు వెలుపు ప్రూని చీనిపా,వడలు ధరించి...
పారి. ౪. ౨౭.

సీ శశిశదళోదరచ్ఛదపుఁబావడ లూరుచకచకఁ బట్టి పాలికిఁ బెనంగ.
ఆము. ౫. ౧౪౩. చంద్రా. ౪. ౨౩౯.

౨ ధౌతవస్త్రము

సీ బంగారుచెఱఁగులచెంగావిపావడ నొయ్య నొయ్యనఁ దడి యొత్తి నొసలి
వరాహ ౯ ౧౩౯

చ చెలికి మెఱుంగుఁబావడలచేఁ దడియార్చను ధూపవాసనల్,దలకొలిపెఁ ...
ప్రభా ౪ ౧౩౦. చంద్ర. ౫. ౧౫౧.

3 వస్త్రము, గుడ్డ

వ. అక్కాంత యిక్కడ నొక్కచిగురుం బోదరుటేఱమి నిడినదాన నని యాక్షణంబ తెచ్చి నెచ్చెలియుం దాను నప్పులకకప్పు పావడ తొడలించి... ప్రభా. ౧ ౧౩౪.

సీ. కమ్మ్రవాతెఱఁ జెంగావిపావడ చెల్లఁ గంఠ పీఠకు శంఖములు చెల్ల.
బహు. ౫. ౪౭. భీమ. ౫. ౧౧౦.

౪. ఒకవిధమగునురఁటి.

గీ. దండిభవభూతిబిభు త్రైనదండికవులు,సరస విద్యత్కవుల్ దనసరస వెలయ,వనిత విరుగడఁ జైఁడిపావడలు పీవఁ,బ్రబుదములరంగఁ జేరొలగమునసుండె. కృష్ణ. ౧. ౭౧.

మ......భూరమణు లత్యంతప్రమోదంబునం, గనఁగాఁ బల్లకిలోన నిండుమతి శృంగారాంగసంపత్కళల్,దనరన్ బంగరుకుచ్చుపావడలు చెంతన్ నెచ్చెలుల్ వేయఁగన్.
ఇందు. ౫. ౧౦౪.

పావడ[2]. వి. పాదభూషావిశేషము.

చ. చరణతలంబునన్ బసపుసన్నపుపావడపెట్టు గంటలున్,బిరుదులు గాఁగ...
రా. వి. ౨. ౫౪.

పావడము[1] = పావడ [1], పాగడము [1].

వి. వస్త్రము.

సీ. ఏ మేమ యని యోలి నెత్తినపరదేశిగొంల పావడములు తోరణముగ.
భార. విరా 3. ౪౪.

పావడము[2]. వి. (క పావడ, పావుడ) కానుక, ఉపద

సీ. పండువాఱురతాణి పావడం బిచ్చినభద్రేభములుఁజీరిఁ బొలిముండు. భీమ ౧ 3౪

గీ. తనకుఁ బ్రబ్లోచ యనుదేవతాపురంధ్రి,పావడముఁజేసె నెద్దాని భయముతోడ,వట్టితన పారిజాతమాల్యంబు పొరికి,దరిసెనం బిచ్చి దీవించి తాపసుండు పార. ౭. ౧౫.

గీ. అనుచు నీవాల్గొమణులను నంబురాశి,పావడంబుగ నాచేతఁ బనిచె మీకు.
విక్ర. ౫ ౧౧౫.

పావనకము. సం. వి. అ. పుం. టంకణము, వెలిగారము.

పావనధ్వని. సం వి. ఇ. పుం. శంఖము.

పావనము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. పవిత్రము చేయునది, పరిశుద్ధముచేయునది (సాధనము). ౨. పవిత్రము, పరిశుద్ధము, నిర్మలము.—వి. అ. పుం.—౧. అగ్ని. ౨. సిహ్లకము, చిల్లపుడ్డి,

అందుగుబంకతోఁ జేసినధూపద్రవ్యము. ౩. పీత భృంగరాజము, పచ్చగుంటగలిజేరు. శ్రీ.
—న—౧. పవిత్రముచేయుట. ౨. ప్రాయశ్చిత్తము. ౩. జలము. ౪. గోమయము. ౫. రుద్రాక్షము. ౬. చెంగల్వకోష్టు. శ్రీ ౭. చిత్రకము, చిత్రమూలము. శ్రీ.

పావని. సం. వి. ఈ. స్త్రీ ౧ హరీతకి, కరక శ్రీ ౨. తులసి. శ్రీ. ౩. గంగ. ౪ గోవు, ఆవు. ౫. గ్రాసము, కబళము (వై ని)—ఇ. పుం ౧. భీముఁడు ౨ హనుమంతుఁడు, ఆంజనేయుఁడు

పావనుఁడు. సం వి. అ. పుం ౧ వేదవ్యాసుఁడు ౨. విష్ణువు. ౩ సిద్ధుఁడు.

పావమాని. సం వి. ఈ స్త్రీ పవమానాదులను గూర్చి ప్రవర్తించుఋక్కు.

పావర. వి. (క. పావల) అడుగు, పాదము.

సీ. పావర పైఁచుచో భామాకరాంచన్మణీకంకణాళి ఘణిల్లు రనఁగ. ఇందు. ౨ ౧౨౩

పావరము. సం. వి అ పుం. పాచికయొక్క రెండుచుక్కలు గలపార్శ్వము ; ఆపాచికయొక్క ఒకదినుసుగ్రోవు.

పావలు = పాగలు, పావాలు. వి బ. (క పావల్) పాదుకలు, పావకోళ్లు

క...అరుణశ్రీ మించునలినిపదములఁ,భామామణియొార్తు పైఁడిపావలు దొడిగెను.
పారి ౨ ౭.

చ...దుప్పటిపై వలువా టమర్చిపావలు మునిగ్రోల్ల మెట్టి శుకవర్యునిగ్రాల లకాంగి నిల్పినన్. శుక. ౧. ౩౪౪.

క. పావలుఁదెచ్చులుఁ దొడుకొని,దేవ శివాలయములోనఁ ద్రిమ్మరుపొపుల్. శివసా. ౨౯౧.

౫. పావకోడు.

పావళము. వి. పక్షివిశేషము, ఒకానొకపక్షి.

సీ. బలితపుఁబలిచె పావళము చేతున చింద కొక్కెర రేఁత్రింత కాలుకోడి.
యయా. ౨. ౭౪.

పావాడము = పవాడము². (క పావాడమ్) (పావడము. చి. వి. పా) ఒకకార్యము నెఱవేఱినచో నని దేవుని ప్రార్థించుకొని యాప్రార్థన నెఱవేఱినయెడ దేవునియెదుట చేయుజిహ్వాచ్ఛేదనాది సాహసకృత్యము. (శ ర. ప్రా)

పావాలు = పావలు. వి బ. పావకోళ్లు.

సీ అడుగుకెత్తమ్ముల నపరంజిపావాలు కరమునఁ గేదారకంకణంబు కాశీ. ౧ ౩౦

శా కేలన్ గూఁతలు పెట్టుపావాలు పురివక్కిరించుపావాలు ముం,గాలన్ జాలుకెలంగు డాలు .. ప్రబంధ ౧౫౪

గీ. జిలుఁగుచెంగావిదట్టిపైఁ జెక్కుకొన్న,వంకి దులకింపఁ బసిఁడిదువ్వలువ పల్లె,వాటు నెఱినీటు గులుకఁ బావాలు మెట్టి, రాజదేవేంద్రుఁ డంతఃపురంబు వెడలె.
ఉ. రా. ౭ ౩౯౫

పావి. విణ (సం పాపీ,ప్రా. పావి. క. పావి.) పాపాత్ముఁడు.

ఉ దేవుఁడొ కానియో యని మదిం దలపోఁతలు సాకకొని ని,స్సేవురు వేయుచుందమల నింద రొలసర్పద రిప్పు మాఁగ యన్,బావులనోరు నీయెుడముపాదతలంబునఁ దన్నినట్లుగా,నీ పొకయింత యావు రని యేడ్వఁగదన్న కుమారరత్నమా. పరమ. ౨. ౧౭౬.

పావిలి. వి. చిన్నజాతిగోళికూర, విదిల్లిక. శ్రీ.

గీ. మిరియమును వెన్నయును దిన మేలి మైన, తిలజమును లక్క పాడియును మలయజంబు, స్వీకరింపంగ మానె పావిలిరసంబు,బుచ్చు కొనఁ జోవు ప్రదరము లొప్పెడిమిగుల.
చిత్రి. ౨. (చి. ని.)

సీ. కుచ్చెలి యుం చనఁగుచ్చెలి యనఁగను గోకి
యటన్నను గోలి రూపున్వఁ, బావిలి యంచనఁ
బరగుఁ దద్భేదంబు...
ఆం. భా. ౨. ౪౪. (పావలి. ఆం. శ. ర)

పావు. వి. (సం. పాదః, క. త. పావు) వరహాలో నాల్గవభాగము; నాల్గవభాగము
సీ...పాదదీనారంబు పా వనఁ దగు
ఆం. భా. ౨. ౨౪3
జ: పావులా.

పావుపావు. వి. మల్లబంధవిశేషము.
వ. చిట్టడుగు కత్తెర పావుపావు జోగినపావు మొదలుగాఁ గలపదిరెండుపరువడులును...
ప్రబంధ. ౪౭

పావురపుఁబలుకు=పావురాపలుకు. వి (పావురము + పలుకు) మణితము. (శ ర)

పావురము=పారువము. వి (సం. పారావతః) పక్షివిశేషము, కపోతము
సీ. మురిగాలి దవదగ్ధతరుపర్ణతతి రేఁపఁ బావురాలని డేగపడువు దూరె. అము. ౨ ౪౬.
రగడ. ఇంతి పావురపురొద రోల విసె దారి జము. మనుచ. 3 ౭౪
జ: పావురపుఁబలుకు.

పావురాపలుకు=పావురపుఁబలుకు. (√పావురాయి).
సీ. మణితవాచకము లై మనుఁ బావురాపల్కు లనఁగఁ గూకిపల్కు లనఁగ...
ఆం. భా. ౨. ౧౭౦.

పావురాయి. వి. (సం. పారావతః) పావురము.
ద్వి. నీవు నెమ్మనితో నిలిచితి కేని,పావురాయులు లక్ష పదివేలు గలవు.
ద్వి. తి. పా ౧. ౬. పొ. ౧౪. పం.

ఆ. చికిలి కోలమొనల చెఱుగువ్వ బకదారు,పావురాయి నీవడు పలువరింత, చెదరకోడి గువ్వ వదరుతోఁ గలకేడి,యాదిరైనపక్షు లతఁడు దీర్చు. హంస. 3. ౧౩. ఆం. భా. ౨. ౭౯.
జ: పావురాపలుకు.

పావులా. వి. (√పావు-సం. పాదః, క. పావల్) రూపాయలో నాల్గవభాగము—ఉదా: రూపాయకు నాల్గుపావులాలు.

పాశకపీఠము. సం. వి. అ. పుం. ౧. జూత్రపలక. ౨. జూదపుటిల్లు.

పాశకము. సం. వి అ. పుం. ౧. పాచిక, అక్షము. ౨. బంధము, ఉరి. (ఉదా: కంఠపాశకము. మొ.)

పాశక్రీడ. సం. వి. అ. స్త్రీ. పాచికలాట.

పాశనము. సం. వి అ. న ఉరి, వల, బంధనము.

పాశపాణి. సం వి ఇ పుం ౧ వరుణుఁడు. ౨. బ్రహ్మదేవుఁడు

పాశబంధకుఁడు. సం వి అ పు. పిట్టలను బట్టువాఁడు.

పాశబంధనము. సం. వి అ. న. వల, ఉరి.

పాశబంధము. సం. వి. అ. పుం. ఉరి, వల.

పాశబద్ధుఁడు. సం విశే. (అ. ఆ. అ.) వలలోఁ దగిలినవాఁడు, చిక్కుకొన్నవాఁడు.

పాశభృత్తు[1]. సం. వి. త్. పుం.—పాశమును దాల్చినవాఁడు—౧. వరుణుఁడు. ౨. బ్రహ్మదేవుఁడు.

పాశము. సం. వి. అ. పుం. ౧. త్రాడు; మృగవిహగాదిబంధన మగురజ్జువిశేషము ౨. వరుణుని శస్త్రము. 3 బ్రహ్మదేవుని శస్త్రము. ౪. పాచిక. ౫. కేశవస్త్రాదులయొక్క అంచు.

౨. (సమాసమందు కేశపర్యాయములకుఁ బర మైనచో వాని) సమూహము. (ఉదా. కేశపాశము. మొ.) ౩. కర్ణశబ్దపూర్వక మైనపుడు శోభ. (ఉదా. కర్ణపాశము = సుకర్ణము) ౪. కుత్సితము (ఈయర్థమున నిది ప్రత్యయము గాన నుబంతపూర్వక మయిరూ యుండును— ఉదా. భిషక్పాశుఁడు, వైయాకరణపాశుఁడు)

పాశముద్ర. సం. వి ఆ స్త్రీ. ముద్రాభేదము. (తంత్రసార) వామముష్టేస్తు తర్జన్యా దక్షముష్టేస్తు తర్జనీమ్, సంయోజ్యాంగుష్ఠకాగ్రాభ్యాం తర్జన్యగ్రే స్వకే క్షిపేత్, ఏషా పాశాహ్వయా ముద్రా విద్వద్భిః పరికీర్తితా)

పాశరజ్జువు. సం. వి. ఉ. స్త్రీ. సంకెల; త్రాడు

పాశవపాలనము. సం. వి. అ. న —పశుసమూహమును రక్షించునది—ఘాసము, లేఁతపచ్చిక.

పాశహస్తుఁడు. సం. వి. అ. పుం. వరుణుఁడు.

పాశి. సం. విణ. (న్ నీ. న్) పాశముగలవాఁడు. వి. న్. పుం. ౧. పల్లెదాలుపు, వరుణుఁడు. ౨ యముఁడు. ౩. వ్యాధుఁడు, మృగపక్ష్యాదులఁబట్టువాఁడు. ౪. బ్రహ్మదేవుఁడు

పాశికుఁడు. సం విణ. (అ ఈ. అ.) పిట్టల వేఁటకాఁడు; మృగయువు, వేఁటకాఁడు. (వాచ.)

పాశుపతము. సం. విణ. (అ. ఈ. అ.) పశుపతి దేవతగాఁగలది. (అస్త్రాదిది); పశుపతిదైవతముగాఁగలది. (హవిరాది). ౨. పశుపతిసంబంధి. —వి. అ. పుం. ఒకవృక్షము —న—పశుపతి రచితమగు శాస్త్రభేదము, పాశుపతమతము.

పాశుపతుఁడు. సం. విణ. (అ. ఆ. అ) శివ భక్తుఁడు; పాశుపతాగమానుయాయి.

పాశుపాల్యము. సం. వి. అ. న. గోమహిష్యాది పోషణవృత్తి. (ఇది వైశ్యులకు విహితము.)

పాశుబంధకము. సం. వి. అ. పుం. యజ్ఞశేషు.

పాశుబంధిక. సం. వి. ఆ. స్త్రీ. యజ్ఞవేది.

పాశ్చాత్యాకరసంభవము. సం. వి. అ. న. లవణభేదము.

పాశ్చాత్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పడమటిదేశపువాఁడు, పడమటివాఁడు. ౨. వెనుకటివాఁడు. ౩. తరువాతివాఁడు.—వి. అ. పుం. వరుణుఁడు.

పాశ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. వల. ౨. పాశముల సమూహము.

పాషండుఁడు. సం. విణ. (అ. ఆ అ) వేద బాహ్యుఁడు, వేదాచారత్యాగి.

పాషకము. సం. వి అ న. పాదాభరణవిశేషము (వాచ)

పాషాణగర్దభము. సం. వి. అ. పుం. క్షుద్ర రోగభేదము.

పాషాణగర్భ(క)ము. సం. వి. అ. పుం. నీల రత్నదోషము.

క. పాషాణగర్భ మనియెడు,దోషము నీలమున నిసుక దోఁచుట దానిన్ భూషణయోగ్యము గా దని,దూషింతురు. రత్న. ౫౪

పాషాణచతుర్దశి. సం. వి. ఈ. స్త్రీ. వృశ్చిక మాస శుక్లచతుర్దశియందు గౌరినిమిత్తము జరుపు నొకయుత్సవము.

పాషాణదారకము. సం. వి. అ. పుం. కాసె యులి, టంకము.

పాషాణదారకుఁడు. సం. విణ. (అ. ఇకా. అ.) రాయితొలుచు పనివాఁడు, కాసీఁడు.

పాషాణదారణము. సం. వి. అ. పుం. కాసె యులి, టంకము.

పాషాణభేదన(క)ము. సం. వి. అ. పుం. వృక్షవిశేషము, కొండపిండిచెట్టు.

పాషాణభేది. సం. వి. న్. పుం = పాషాణభేదనము.

పాషాణము. సం. వి. అ. పుం. ఱాయి, శిల, గ్రావము.

పాషాణి. సం. వి. ఈ. స్త్రీ. తూనికగుండు. (వాచ)

పానఁగు. వి (క. పానగి) శాలిధాన్యవిశేషము. (శ. ర)

పాసనము = పాచేనము. వి. (సం. పాచనం) విరేచనము (శ. ర)

పాశి. సం వి. ఇ. పుం సూర్యుఁడు. (వై. ని)

పాసిక = పాచిక. వి. (సం పాశకః, క. పాచికె) జూదగాండ్రు చేతులంబట్టి దొర్లించెడి ద్యూతసాధనవిశేషము, అక్షము.

ద్వి. పాసికల్ పెత్తంపుఁబలుకపైఁ బెట్టి, యాసతియంతట నాట చాలించి
పండితా. పురా ౧౨౫. పా

సీ తనకు లాగయినపెత్తంబు గైకొని పన్నిపాసిక దాకించి పాఱెఁజెంగి.
ఉ. హరి. 3. ౧౨౦.

పాసెము. వి. (సం. పాయసం, ప్రా. పాఅసో, పాసో) క్షీరాన్నము.

మ. కలమాన్నంబును నొల్పుఁబప్పు ఘృతముల్ గజ్జంబులుం బిండివంటలుఁ బాసెంబులు సానబాలు ఫలముల్ ...
కై. భా. ౨. ౧౨.

క. అరుదుగ నభ్ర డొక్కెకరయిడ, మరకతమణిపాత్రి గగనమండల మర్యోక్, జిరుపదములపాసెము కళ్ళధరుఁ దర్యోం జాక్కె లర్యోద్రాక్షఫలంబుల్. హైమ. ౨. ౧౨3.

సీ. ఖండశర్కర జాఱ్ఱ కండశర్కరలు దోసెలు వడ శ్రేసిపాసెములతోడ. భీమ. ౧. ౭౦.

పా : పాసెం బడిగినవారే పేదలా ? :—ఉక్తవస్తువు గుణమునుబట్టి దాని పెక్కువగాఁ గోరినంతమాత్రమున దానికై వారు పెంగము వాడినవా రవరా దని భావము.

క. విడుపక విగానము సాగ, సిడుటయు మతి పాడుఁడనుట యెగ్గే పాసెం, బడిగినవారే పేదల, కొడిమెలుఁగట్టుఁడి యతనిఁ గొనిపని యేలా. ఆము. ౫ ౫౭.

పాహాతము. సం వి అ. పుం. బ్రహ్మదారు వృక్షము.

## పి

పింగ. సం వి ఆ స్త్రీ ౧ గోరోచనము. ౨ ఇంగువ 3 నాడి, పింగళనాడి. ౪ హరిద్ర, పసుపు ౫ ౫. చండిక, దుర్గ. ౬. త్వక్, క్షీరి, తవక్షరము ౭ కుంకుమపూవు ౮ అర్లైతాడు. (విల్యమ్సు)

పింగకపిశ. సం. వి. ఆ స్త్రీ. తైలపాయిక, బొద్దీక.

పింగచక్షువు. సం వి. స్. పుం. కుంభీరము, మొసలి .

పింగజటుఁడు. సం వి. అ. పుం. శివుఁడు.

పింగడించే. అ క్రి. గోశాయక్తమగు, ఒప్పు.

వ......ధరాసురాంబుదనికురంబంబు పెంబడింబడి ... అంగడియంగడిం గడుఁ బింగడించిన...... నానావిశానకాయమానవితానంబు లవలోకించి... పాంచాలీ. ౨. ౭.

పింగము. సం. విశ. (అ. ఆ. అ.) పింగళవర్ణముకలది, గోరోచనమువంటి వర్ణముగలది. వి. అ. పుం. ౧. గోరోచనపువర్ణము. ౨. దున్న, మహిషము. 3 ఎలుక, మూషికము. (విల్యమ్సు)

౪. మండలి సర్పభేదము. ఒకవిధమైన పాదపాము. (వై. ని.) ౫. సర్పిణము, అదకీ. (శే. ని.) వ. ౧. కురువేరు. ౨. చిన్నజంతువు, అల్పమృగము. (విశ్వము) ౩. శిశువు.

పింగలి. వి (త. పింగళి, క. పింగడె) వెనుకటి భాగము, వెనుకటి ప్రదేశము.

చ. ఎలమిఁ గుమారుముంగలి సురేంద్రుఁడు రా
మదధీశ్వరుండు పింగలి నడవన్...
కు. సం ౧౧. ౫౭౪.

ద్వి. ముంగల నిజగురుమూర్తి యేఁగంగ, పింగలి
గోవిందప్రెగడ దచ్చాయఁ, ద్రొక్కక
బాఁటక తొలఁగి ప్రొంకుచును
పండితా మహిమ ౨౯౪ పా.

వి. వెనుకటిది; వెనుకటివాఁడు.

ఉ. పోదమునం దమాథవుని ముంగలి గా నడి
పించి తాను దుర్భేదబలాన్వితుం డగుచుఁ
బింగలి రైచన... నిర్వ. ౭ ౧౪౭.

చ. అరదము సత్వరంబుగ శరావళి పెల్లుగఁ
బర్వఁ బాండవాగ్రజుఁడు పోవనీక పాదు
వన్ వడిఁ బింగలివారు పోరిం బురికొని
భార కల్య. ౧ ౩౯౨.

క్రి వి. ద్రు అనంతరము, పిమ్మట.

ద్వి. ఓనరారుమూర్తి గ్రామహోదరజీర్ణ, మనఁగ
నంతకముఖా దానీతవా న్యనంగ మొసలి
కడుపువను జీర్ణమైన,పింగలి నొకవిప్రపుత్రియ
పుత్రు నంచి, పొనరునంతకముఖంబునకు
రప్పించి, కొని యేఁగ...
పండితా. మహిమ. ౨౯౩ పా.

పింగళ. సం. వి. అ. స్త్రీ. ౧ (యోగ) ఒకా కోకనాడి. ౨. వామనమను దిగ్గజముయొక్క భార్య. అమరకోశము; యాదవనిఘంటువు. ౩. కుముదమను దిగ్గజముయొక్క భార్య. (వే. ని. హేమ. ని.) ౪. ఒకానొకవేశ్య. ౫. పైఁడికంటి. పక్షివిశేషము ౬. కర్ణిక. ౭. శింశుపా వృక్షము, ఇరుగుడుచెట్టు. పుం. ప్రభవాది సంవత్సరములలో నొకటి

పింగళము. సం. విణ. (అ ఆ అ) నలుపు పసుపు కలిసినవన్నెగలది, గోరోచనపు వర్ణము గలది. వి. అ పుం ౧. గోరోచనమువంటి వర్ణము ౨ క్రోఁతి. ౩. ముంగిస ౪. చిన్న గుడ్లగూబ, క్షుద్రోలూకము. ౫ ఒకనిధి. ౬. స్థావరవిశేషము. ౭. పిల్లి, మార్జారము. న. ౧. పిత్తళి. ౨. హరిదళము. ౩. కురువేరు. (వై. ని.)

పింగళలోహము. సం. వి. అ. న. పిత్తళి, ఇత్తడి

పింగళాక్షుఁడు. సం వి. అ. పుం శివుఁడు.

పింగళిక. సం. వి. అ. స్త్రీ బలాక, ఒకజాతి కొంగ.

పింగళుఁడు. సం వి. అ. పుం. ౧. రుద్రుఁడు. ౨. సూర్యునిపారిపార్శ్వకుఁడు ౩. ఒకానొక నాగుఁడు సర్పవిశేషము. ౪. ఒకానొక యక్షుఁడు ౫ బ్రహ్మదేవుఁడు. ౬. విష్ణువు. ౭ అగ్ని. ౮. ఛందోగ్రంథకర్తయగు ఋషి

పింగసారము. సం. వి. అ. పుం. హరిదళము.

పింగస్ఫటికము. సం. వి అ. పుం. గోమేదికము, రత్నవిశేషము.

పింగాఁడి=పీంగాఁడి. వి (త. పింగాళము) ఒక విధమగు లోహపాత్రము.

మ...తట్ట లొడ్డికలు గంగాళాలు పింగాండ్లు
ఘర్ఘరికల్ బిందెలు కొప్పెరల్ మొదలుగా
గాంగేయమాణిక్యభాస్వరముల్ కోటులు
గ్రక్కునం జూడ మెఁ దత్సౌధాంతరాళంబు
నన్. వరాహ. ౪. ౧౧౨.

పింగాక్షుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) పింగళవర్ణపు కన్నులుగలవాఁడు. వి. అ. పుం. శివుఁడు.

పింగాణము. సం. విణ. (అ. అ. అ.) నలుపు పసుపు తెలుపు కలిసిన రంగుకలది. వి. అ. పుం. నలుపు పసుపు తెలుపు కలిసినరంగు. (వై. ని)

పింగాణి. వి. (క. పింగాణి) ౧. ఒకవిధము తెల్ల చీనామట్టి; ఆమట్టితోఁ జేసిన పాత్రము

వ...జాలవల్లికలు పింగాణి గిన్నియలు పన్నీరు చెంబులు...

ప్రబంధ ౬౦౫. మల్లుపు ౪ ౧౩

సీ. వటిగ్రెల్లమురటి జవ్వాదిపశ్కాన తట్టు పునుఁగుఁబింగాణి కపురపుఁగ్రోవి.

వైజ. ౩ ౭౪.

౨. (గిన్నె. తెలు) పాత్రము

సీ. గాజుపింగాణి గిల్కులపావ లడపంబు వన్నెలగిన్నె... రుక్మాం. ౪. ౩౫.

సీ పచ్చలపింగాణిఁ బన్నీరు గులికినచందన పంకంబు సవదరింప పరాహ. ౪. ౧౫౬

౩. గాజుపాత్ర

సీ .కాచము విలసిల్లు గా జనంగఁ బింగాణి కుప్పి కుప్పియ కుప్పె యనఁగను దర్కృతచప కాఖ్య తనరుచుండు ఆం. భా. ౭ ౭౦౯.

పింగాళము. సం. వి. అ. పుం. ఒకజాతిచేప.

న. కుందనము, అపరంజి, పరిశుద్ధమైన బంగారము. (శే ని.)

పింగాళి. సం. వి. ఈ. స్త్రీ. నీలిచెట్టు (శే ని.)

పింగాళుఁడు. సం. వి అ. పుం. గ్రామాధికారి. (శే. ని)

పింగి. సం. వి. ఈ. స్త్రీ. శమి, జమ్మి. (శే. ని.)

పింగు[1]. వి. మగగుంటి.

క. ఇంగిత మెఱుఁగనితొత్తును,...పసిక్తి వచ్చు జేపాము కొచ్చుక, పింగుతో పడిచెడు పట్టుడు... కవిచా. క. ౧౭౧.

చంద్ర. వి. ౭. ౯౦.

పింగు[2]. వి. ధనము.

(వ్యవ) పింగులేనివాఁడు పీనుఁగుతో సమానుఁడు.

పింగేక్షణుఁడు. సం వి. అ. పుం. శివుఁడు.

పింగేశుఁడు. సం. వి. అ. పుం. అగ్ని.

పించేము[1]= పించెము. వి. (సం పింఛమ్. క. పిచ్ఛమ్) నెమిలిపురి, బర్హము.

సీ. గురివెందపేరులు గుబ్బచన్నులఁ దాల్చి నెమిలిపించెంపుఁబుట్టములు గట్టి.

హర. ౫. ౩౪.

జః పించేము (లు) సేయు.

పించేము[2]=పీఁచేము. వి. (సం పింజమ్) మదము, గర్వము (శ. ర)

విణ ౧. మగించినది, బలవత్తరము.

ఉ ఆలలితాంగి ... నుసుమించుకురుల్ సరుశై తనర్చి యుం, బించము లై చరించె నవిపించె ఘనాఘనజిద్విలాసరేఖ విప్ర. ౭ ౪౫.

(పించెము. ముద్రి. నెమిలిపురియని యర్థాంతరము.)

౨. కలఁతనొందినది. (చూ పీట్టపించము.)

జః పీట్టపించము.

పించేము(లు)సేయు. స. క్రి (√పించము1) నెమిలిపింఛము విప్పినట్లు విప్పు.

(పికిలిపిట్టలు) వ లవిటిలఁ ద్రిప్పుచుఁ బించములు సేయుచుఁ దల లాడింపుచుఁ గటుకు గటుక్కునఁ బల్లు సోఁక విరవిరం బొట్టు కొని .. ప్రబంధ. ౩౮౮.

పించెగొడుగు. వి. (పించెము+గొడుగు) నెమిలి పురితోఁ జేయఁబడినగొడుగు.

క. ఆవటమహీరుహాం శాఖాదికి ఫలపత్ర చిత్ర దీప్తికృరణశా, భూవల్లభవరనందన, భావిం పఁగఁ బించెగొడుగుభంగి ఘటించుక.

హైమ. ౫. ౩౪.

**పించె(చియ)ము**=పించేము[1]. వి.(సం. పింఛమ్. దీనికి వ్యుత్పత్తియందుఁ గొన్నిచోట్ల మువర్ణము లోపించును. చూ పించెగొండుగు) నెమలిపురి, బర్హము.

గీ తలను వలగొన్న పించెపుదండవాఁడు
ఉ రా. ౧ ౧౯ నీలా. ౩ ౧౦౬

సీ చిప్పకూఁకటివానిఁ జిన్నినవ్వులవానిఁ జెరి
వినమంచిపించియమువాని.
పాండు ౧ ౨౧౩

జ పించెగొండుగు

**పింఛము.** సం వి అ. పుం. పిచ్ఛము, నెమలిపురి

**పింజె**[1]. వి (పిచ్ఛమ్, పింఛమ్) పుంఖము, అల్లె త్రాటికిఁగూర్చెడుబాణమూలము

ఆ. పెండిపింజెఁ బొలుచువెడఁదయమ్మున మిత్త్ర,
సేన ధరణిపాగ్గి శిరముఁ ద్రుంచి
భార. కర్ణ ౧ ౧౩౪

చ రథ వరనేమిఘట్టనతురంగఖురక్షతధూళి
గ్రాలఁగాఁ, బృథివి పగిల్చి బంగరుపుఁ
బింజలయమ్ములు లీల సేయుచున్
భా. రా. యు ౨౦౦౭.

చ... పసిఁడిపింజ లమర్చిన తూపులిట్టలం, దునిమి
అచ్చ. రా యు. ౨౦౭

జ. పింజలుగొను

**పింజె**[2]. వి. (సం పింజ.) దూదేకులవానివిల్లు. (చూ. పింజారి)

జ. పింజనగ్రోలు, పింజనగ్రోవి, పింజారి, పింజించె[1]

**పింజ.** సం వి ఆ స్త్రీ ౧ దూది, తూలము. ౨. పసుపు, హరిద్ర. శ్రీ. ౩. ఘట, సమూహము

**పింజటము.** సం. వి. అ. పుం. కంటిపుసి, నేత్రమలము.

**పింజన.** సం. వి ఆ స్త్రీ. సంగ్రహవాక్యము. (వై. ని)

**పింజనగ్రోలు.** వి. (పింజె[2]+గ్రోలు) పింజనగ్రోవి.

ద్వి పింజించి పెడలేఁ దాఁ బృథుభస్మధార,
పింజనఁగ్రోళ్లను బింజించినట్లు
పండితా. పురా. ౧౩౮. పా.

**పింజనఁగ్రోవి.** వి. (పింజె[2]+గ్రోవి) దూదేకు విల్లు దూదిని చిమ్మునట్లు జలాదులను చిమ్ము గొట్టము

చ నరపతి యొండు విల్గొని గుణధ్వని చేసి
కుమారుమీఁద నిర్భరగతి నేసె నవ్వి
శరంబు లురంబునఁ గాఁడ నెత్తు రాకిన పసు
గంటులం దొరఁగి పింజనఁగ్రోవులరీతిఁ
బాఱఁగా, నరయూనుకీచిమాలిక్రియ నర్కజా
పట్టి వెలింగనాలిలోన్ హై భా ౨. ౬౯.

**పింజనము.** సం. వి. అ న ౧ దూదేకువిల్లు, తూలస్ఫోటన యంత్రము. ౨ దూది లోనగువానిని ఏకుట ౩. ఒకజాతిచందనము శ్రీ (వై. ని)

**పింజము.** సం విశే. (అ ఆ. అ) వ్యాకులము, మనస్సుకలిగినది, కలఁతపాటినది. వి. అ పుం. ౧ ఒకదినుసు కర్పూరము ౨. మారణము, చంపుట. న. బలము.

**పింజరము.** సం. విశే. (అ. ఆ అ) ౧.ఎఱుపు మించినపసుపువర్ణముకలది, పీతరక్తవర్ణముగలది. ౨. పసుపువన్నెగలది, బంగారువన్నెకలది. ౩. వ్యాకులము, కలఁతపాటినది. (శ. ర.) ౪. ధూళిపొందలగు వానిచే వ్యాప్తమైనది. వి. అ. పుం. ౧. పీతరక్తవర్ణము, ఎఱుపు మించిన పసుపువన్నె. ౨. పీతవర్ణము, పసుపువన్నె. ౩. తామ్రము. ఎఱుపు. (శ. ర.)

౪. అశ్వభేదము. ౫. సర్పభేదము. న. ౧. బంగారు. ౨. హరిదళము, ౩. దేహమందలి అస్థిసమూహము, ౪. పంజరము, ౫ నాగకేసరము.

పింజలము. సం. విణ. (అ. అ. అ.) మిక్కిలి కలఁతపాటినది, అత్యంతాకులము. (సేవ. మె.) వి అ. న. ౧ హరిదళము. ౨. కుశపత్త్రము, దర్భగడ్డియాకు.

పింజలి. సం వి. ఈ. స్త్రీ. మణిరామక కుశచేఁ జుట్టఁబడినదై ప్రాదేశమాత్ర మగుకుశపత్త్ర ద్వయము

పింజేలుగొను. అ క్రి (పింజలు,+కొను) పుంఖానుపుంఖమగు, (బాణప్రసారము) ఎడతెగకుండు.

చ అలుఁగుల దట్ట మైపొదమునగ్నికణంబులు పోఁక పైగటుల్, వొలిసియుఁ దొంటికేగ ముడివోక క్రమంబున నొండొకంటిఁబిం,జలు గొని క్రోచికొంచు శరసంఘము లక్ష్యముఁ దాఁకు... పారి ౫. ౨౫ ౪ ౩౭.

ఇట్లే. పింజపింజగొను, పింజపింజఁగఁజుచుకొను, పింజపింజఁగాఁడు, పింజపింజతోఁదాఁకు మొ.

గీ. కరలి మరుఁ దూర్ధ్వలోకముల్ గెలువ పింజ, పింజఁ గొన సేయు పుష్పాస్త్ర వితతి యనఁగఁ గప్పులతుఁ బిండు గై తోఁచె గగనభాగ, మందనం బైనతారకామండలంబు. అని. ౨. ౧౨.

గీ. వార లతిచిత్రశరలాఘవంబు పేర్చి పేర్చి రొండొరుపయి నేయఁ బింజపింజఁ, గఱచు కొని పొఱుకూపు లొక్కటియు పోకఁ, గానిపించుచుఁ దలఁపించెఁ గదలపోరు. కళా. ౮. ౧౨౪. భా. రా. యు. ౭౩౬.

క. ఏణాక్షి నపుడు వెదసిం,గాణిం గొని యలరుఁ దూపుగమిఁ జక్కరయే, భాణముగాఁ గలిగి నకం, భాణపుదొర పింజపింజఁగాఁడఁగ నేసెన్. విజ. వి. ౧. ౬౨.

ఉ ..ఒ, ఉక్కఁజున కేయుచేతుల మహోగ్రశరావళి పింజపింజతోఁదాఁకఁగ నేసినన్... భాగ. ౧౦. ఉ. ౪౩౬.

పింజానము. సం. వి. అ. న. బంగారు. (రా. వి.)

పింజారి. వి. (పింజె[2]+అరి[3]) దూదేకువాఁడు, ఒకానొక జాతివాఁడు.

సీ. అఁడు బిడ్డనుకారి యల్లుఁడు పింజారి మరదలు కోడలు మారువాడి. కేయు. క. ౬౯.

వ...మైలారి మన్నెరి తిలారి కురక పింజారి విప్రవినోదులును... హంస. ౨౯.

పింజించు[1]. స క్రి (√ పింజె[2]) చిమ్ము, విక్షేపించు.

మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీరెక్కించి పూరించి చం, దభమార్గంబున కత్తి నిక్కి వడి నుద్ధాడించి పింజింప నా, రభటిన్ నీరములోనఁ బెల్లెగసి నక్రగ్రాహపాఠీనముల్ నభమం దాడెడుమీనకర్కటములన్ బట్టెన్ సురల్ ప్రాన్పదన్. భాగ. ౮. ౪౩.

సీ కెంజాయ దిక్కులఁ బింజించుచిగురులు కాలానలార్చు లై కానఁ బెనుప. కలిక. ౪. ౧౩. పండితా. పురా. ౧౩౪. పా.

అ. క్రి. చిమ్మఁబడు, విక్షిప్తమగు.

ద్వి. ఆరగించినభస్మమంగంబులోనఁ, బూరించి... పింజించివెదలఁదాఁబ్రభుభస్మధార. పండితా. పురా.౧౩౪. పా.వాద.౨౦౨.పూ.

పింజించు[2]. స. క్రి. (√ పింజె) పింజెలుపోయు, కుచ్చులుపోయు.

సీ. పింజించి కట్టినబిగువుపచ్చనిపట్టు తోఁబు కారుమెఱుఁగులఁ దొఱఁగలింప. కవిక. ౬. ౧౯౦.

పింజిక. సం. వి. అ. స్త్రీ. దూదిచుట్ట, దూదిశాలిక, ఏకు.

పింజాఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు. (విల్యమ్సు.)

పింజూలము. సం. వి. అ. పుం. కళవ్రికి.

పింజూషము. సం. వి. అ. పుం, గులిమి, కర్ణ మలము.

పింజె(జియ). వి. ౧. వస్త్రపుకుచ్చె, మడత.

సీ పరి తేనిరాకట్టుజాఱువా పెలకట్టు బెడఁ గాదనీర్కావిపింజెతోడ. మనుచ. 3 ౩౧.

(నీర్కావిపింజె = పింజెపెట్టికట్టిన నీర్కావి దోవతి.)

క పింజెమట జార దోవతి, పింజెలు మాటికిని గాళ్లఁ బెనఁగొన... వాల్మీ 3 ౮౧

చ...మేల్తర మగుకావిపింజయ .. వాల్మీ. 3. ౧30.

౨. మడత పెట్టి పెనుక దోఁపుకొనుదోవతి కొంగు, కచ్ఛభేదము.

సీ...కచ్ఛభేదాభిధాన మొసంగుఁ గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పింజె . ...అనంగ... అం భా ౨. ౧౫౩.

మ తగుపే నాయిలు సొచ్చి వామొదవు నద్దం డంబుతోఁ గొంచుఁ బ్రాఁగఁ బోరత్వము గాక యుత్తెఁగు ధీరత్వంబె యం చుద్ధతిక్రిక పిదప వెనుచక్కపింజె వదలక చేపట్టుకుక వచ్చినక. ఉ. రా. ౬ 3౬౧. (పింజమూర్తి)

జ : పింజించే2, పింజెపట్టు

పింజెవట్టు. అ. క్రి. (పింజె+పట్టు) కుచ్చెళ్లు పోయు.

సీ. మొలఁ బింజెపట్టి చెంగులు మాఁటి కట్టినవలి పనీర్కావిదోవతి పెలంగ. నీలా ౧. ౬౦

(ఇట్లే. పింజవిడుచు. పింజెపెట్టు.)
(గోవింద మంచనశర్మ)

సీ. గన్నెరువూఁజాయ కర మొప్పు నీర్కావి మడుఁగుదోవతి పింజెవిడిచి కట్టి. క్రీడా. ౪3.

సీ. కడి యాతి యాఁటు కుండెడు ప్రాఁతదోవతి బట్ట చేమడ పింజెపెట్టి కట్టి శుక ౨. ౪౪౬.

పింజేటము. సం. వి. అ పుం. నేత్రమలము, కంటిపుసి

పింజోలం. సం వి అ. స్త్రీ. పత్రశబ్దము, ఆకుల చప్పుడు.

పింర. సం. వి అ స్త్రీ. విటజన సమాశ్రయము, వేశము (శ. ర)

పిండ. సం. వి ఆ స్త్రీ. ౧ పిండాయసము, ఉక్కు, ౨. కస్తూరీభేదము, 3 వంశపత్రి, వెదురాకువలెనుండు తృణవిశేషము. శ్రీ.

పిండకము. సం. వి అ పుం. న ౧ పిండాలువు ౨. పిప్పాకము, చిల్లమడ్డి, 3. చోళము, ౪ అలిందము. వాకిలికి వెలుపలనున్న నలు చదరపుచోటు (వై. ని) ౫. గుండ్రని వస్తువు. (చెండు, గోలీ, మొ) అ జంఘు, పిక్క.

పిండఖర్జూరము. సం. వి. అ పుం. ఒకదినుసు ఖర్జూరవృక్షము

పిండగోసము. సం. వి అ. పుం. గంధరసము.

పిండలేర్యుకులు. సం. వి. అ. పుం. పిండలేప భాగులగువృద్ధ ప్రపితామహాదులు మువ్వురు.

పిండతైలము. సం. వి. అ. న. తురుష్కమను గంధద్రవ్యము.

పిండనము. సం. వి. అ. న. పిండముచేయుట ముద్దచేయుట,

పిండనిర్వాపణము. సం. వి అ. న. పితృదేవ లకుఁ బిండములు పెట్టుట.

పిండపదము. సం. వి. అ. న. (జ్యోతి.) అంక విశేషము.

పిండపాతము. సం. వి. అ. పుం. కూడు లోనగు నవి (బిచ్చము) పెట్టుట.

పిండపాతికుఁడు. సం. వి. అ. పుం. బిచ్చపు కూటిచే బ్రదుకువాఁడు.

పిండపాదము. సం. వి. అ. పుం. గజము, ఏనుఁగు.

పిండపాద్యము. సం. వి. అ. పుం. = పిండపాదము.

పిండపితృయజ్ఞము. సం. వి. అ. పుం. గృహస్థుఁడు సాగ్నికముగాఁ బితరుల నుద్దేశించిచేయఁదగిన పిండదానమనెడియజ్ఞము.

పిండపుల. సం. వి. అ. స్త్రీ. చేఁతిసాఁబ, కటుతుంబి. నీ.

పిండపుష్పకము. సం. వి. అ. పుం. వాస్తూకశాకము. చక్రవర్తికూర. నీ.

పిండపుష్పము. సం. వి. అ. న. ౧. తామరపువ్వు, ౨. తగరపుపువ్వు, ౩. మెట్టనూయి. (శ. ర.)

వి. అ. పుం. ౧. అశోకము నీ ౨. దాసనము. నీ.

పిండభాక్కు. సం. విశ. (క్.) పిండముపొందువాఁడు, పిండముపొందఁదగువాఁడు. (మృతపిత్రాది.)

పిండము. సం. విశ. (అ. ఈ. అ) ౧. ఘనము, గట్టి. ౨. సంహతము, చిక్కఁగాఁ గూడుకొన్నది, దట్టమైనది.

వి. అ. పుం. న. ౧. గోళము, గుండ్రనివస్తువు. (అయఃపిండము.) ౨. పితృదేవతలకిచ్చెడు అన్నపుముద్ద. ౩. కూడు, అన్నము. (ఈ యర్థమున నిదితఁబడు నీచబిచమనుమాగానుండును.) ౪. జలము. ౫. శరీరము. ౬. శరీరమునందు ఏకదేశము. ౭. గృహమునందుఏకదేశము. ౮. బోళము. ౯. సిహ్లకము, చిల్లమద్ది. ౧౦. జపా, దాసనపుపువ్వు. ౧౧. మదనవృక్షము. ౧౨. బృందము, గుంపు. ౧౩. గర్భము. (ఈ యర్థమునందు కేవల "పుం" అని వాచస్పత్యము.) ౧౪. బ్రతుకు.

వి. అ. న. ౧. ఆజీవనము, బ్రదుకుఁదెరువు. ౨. ఇనుము. ౩. బలము.

పిండముస్త. సం. వి. ఆ. స్త్రీ. నాగరముస్త. నీ.

పిండమూలకము, పిండమూలము. సం. వి. అ. న. గర్జరము, ముల్లంగి. నీ.

పిండరోహిణము. సం. వి. అ. న. నాగరంగము, నారింజ. నీ.

పిండలము. సం. వి. అ. పుం. సేతువు, ఆనకట్ట. ౨. వంతెన.

పిండలి. వి. (సం. పిండః.) ముద్ద.

సీ. దిక్కులు నాలుగు త్రొక్కుచోటికిఁ దెచ్చి పిసికి పిండలి సేసి పిడుచగొనఁగ.
భార. విరా. ౨. ౧౩౪.

వ...కసిమసంగి మారి పసికి పిండలి చేసినచందంబున.
ఉ. హరి. ౪. ౨౪౯.

(శ. ర. వ్రాఁతప్రతి పా. "పిండలివండుచేసి" ముద్రి.)

జ. పిండలివండు, పిండలివండులగు.

పిండలివండు. వి. (పిండలి + వండు.) ముద్దగానున్న బురద, చిక్కనిబురద.

సీ. తురగఖురోద్ధూతధూళి ద ప్పురసిన వననిధి పిండలివండుగాఁగ. భార. విరా. ౩. ౧౫౬.

గీ. అడవు లడఁచి కొండలమీఁద నడరి యశులు, వారినిధులను బిండలివండు సేసి, కసల పోతు బ్రమింగి దెసలు చీకట్లుగొలిపి, పరగె యవనసైన్యోత్థితబహుళరజము.
హరి. ఉ. ౨. ౧౧౯.

గీ. భానుదీప్తులచేడిచేఁ బల్వలంబు, లెండి పిండలివండు గా నింకిపోయె.

వి. పు. ౪. ౧౮౫.

పిండలివండులగు. అ. క్రి. (√ పిండలివండు.) ముద్దగట్టినబురద కలవియగు

గీ. అతనితపమున లోకంబు లదరె గిరులు, వదలె జలధులు పిండలివండు లయ్యె.

చిత్రభా. ౨. ౫౩.

గీ. వారినిధు లెల్లఁ బిండలివండు లయ్యె.

సీతా. వి. ౨. ౭౧.

పిండలేపము. సం. వి. అ. పుం. చేతికి అంటు కొన్నపిండాంశభేదము.

(దీనిని వుత్తాతమహాబూపర్యులగు ముగ్గురు పితరులు నైకొందురు.)

పిండలోపము. సం. వి. అ. పుం. ౧. పితరులకు సంతతిలేమిచేఁ బిండములేకపోవుట. ౨. పితరులకుఁ బిండముపెట్టకవిడుచుట.

పిండసంబంధము. సం. వి. అ పుం. ౧. దేహము తోడి (జన్యజనకరూప) సంబంధము. ౨. పిండమునిచ్చువాఁడు పుచ్చుకొనువాఁడు అగు సంబంధము.

పిండసుఁడు. సం. వి అ పుం పరులపిండముచేఁ గాని, భిక్షచేఁగాని జీవించువాఁడు.

పిండాతము. సం. వి. అ. పుం సిహ్లకము, చిల్లమద్ది.

పిండాన్వాహార్యకము. సం. వి అ. న. పార్వణ శ్రాద్ధము.

పిండాభము. సం. వి. అ. పుం. సిహ్లకము, చిల్లమద్ది.

పిండాభ్రము. సం. వి. అ. న. కరక, వడగల్లు.

పిండాయసము. సం. వి. అ. న. ఉక్కు.

పిండారకము. సం. వి. అ. పుం. ౧. చిత్రాంగవ్యాఘ్రభేదము, చిఱుతపులి. (కే. వి.)

పిండారము. సం. వి. అ. పుం. వికంకతము. ముళ్లవెలమ. కీ. ౨. సర్పభేదము. న. ౧. తీర్థభేదము ౨. శాకభేదము. కీ.

పిండారి. వి. (హిం. పింఢారి.) ఒకజాతివాఁడు, (ఈజాతివారు పూర్వము బందిపోటులుచేసెడివారని వాడుక.)

గీ. ఏనుఁగులు కేయి బొందిలీ లెంచి చూడ, లక్ష పిండారు లొకలక్ష లక్షతురక, లిచటి బల మాన్ప్రపాలున కెంచ భటులు.

కృష్ణ. ౩ ౨౫.

పిండారుఁడు. సం. వి. అ పుం. ౧. క్షపణకుఁడు. ౨. గోపుఁడు, గొల్లఁడు. (హే. వి.)

పిండాలక్తకము. సం. వి. అ. పుం. ఒకదినుసు లత్తుక.

పిండాలుకము. సం. వి. అ న. ఒకదినుసు ఆలువు (గెనుసుగడ్డ)

పిండాలువు. సం. వి. ఉ పుం. ౧. చిరుగడము. కీ. ౨. కందగుడూచి కీ.

పిండాశుఁడు. సం. విశే. (అ. ఆ అ.) బిచ్చగాఁడు, భిక్షుకుఁడు

పిండాహ్వా. సం. వి. అ స్త్రీ. నాడీహింగువు, ఒకవిధమైన యింగువ.

పిండి. వి. (సం. పిండిః) ౧. పిష్టము, బియ్యము లోనగువానిపొడి, (దీని యామ్రేడితరూపము పిండి పిండి.)

గీ నన్ను గాచుట యరయంగ నిన్ను గాచి, కొనుట యిప్పిండి యిన్ను పోల్చునది నిచ్చి, కావలె నన్ను... భార. అశ్వ. ౪. ౨౩౬.

శా...పైఁ బందురం దొప్పఁగాఁ, గాచెక్కె
క్రొన్నెల పిండి చల్లినకదంకెగల్వతూ
పందుపై, యయా. ౫ ౧౦౯.

చ కదళిగభీరపుష్పపుటికాచ్ఛటఁ జేతుల నిప్ప
పిండిపైఁ, గుదురుగ నిల్పి...
ఆము. ౧. ౭౩

సీ. చేసికొండలు పట్టి పిండిపిండిగఁ గొట్టి
జలధిలోఁ బెదజల్లఁగలబలంబు
ఇంద్ర. ౧. ౧౫౨. సీలా. ౧. ౬౩. ౩. ౧౦

౨. నువ్వులు మొ, వానిఁ బాడించి, చమురు
తీయఁగా మిగిలిన పిండి, ఉదా: తెలికపిండి మొ.

కొట్టినపిండి=బాగుగా వలఁగినది; మిక్కిలి
పరిచితము.

(వ్యవ:) విరాటపర్వము నాకు కొట్టిన పిండి.

పిండియిడు=దేహమును పిండిచేయు.

గీ. ఒండొకఁడ పైన నిపుడ నీపిండియిడమె,
బ్రాహ్మణుఁడ వౌట మాచేత బ్రదుకఁ
గంటి. మను. చ ౪. ౯౦

జ. పండికూడు, పిండికూర, పిండికొండ. పిండి
దొండ, పిండిపించు, పిండిపీఁచము, పిండి
పీఁచు, పిండిపోఁకలు, పిండిబొద్దికూర, పిండి
మిరియము, పిండివంట, పిండివంటకము,
పిండివడియము.

పిండీ. సం. వి. ఇ. ఈ. స్త్రీ ౧. గుండ్రనివస్తువు,
చెండు, ౨. బండికంటి నడిమితూము, నాభి,
౩. కాలిపిక్క, ౪. మంగ, పిండీతకము,
౫. పీతము; పీతవిశేషము, ౬. పిండీతగరము,
౭. సొలు, ౮. ఒకదినుసు ఈఁదు, ఖర్జూర
భేదము. (శ. ని.)

వి. ఇ పుం. ౧. చూర్ణము, పిండి, (వై. ని.)
౨. తెలికపిండి. (వై. ని.)

పిండిక. సం. వి. అ. స్త్రీ. ౧. కాలిపిక్క
మాంసము ౨. తురుష్కదేశమందు అందగు
బంకతోఁ జేసెడు ధూపద్రవ్యము. ౩. బండి
కంటి నడిమితూము, ౪. ఇల్లుకట్టుటకు ఏర్పర
చినస్థలము, నివేశనస్థలము (వై. ని.)

పిండికూడు. వి. (√పిండి) సంకటి, చిక్కని
యంబలి

క ఒడ లెల్లఁ బిండికూడు గఁ బొడిచి రొమ్మఁగయు
స్త్రొత్తి త్రిప్పి భూస్థలి మఱియుం, బడవైచి
యురము మెట్టగమును, నడిచెను పదములు
తలప్రహారములఁడై.
భార. ఆర. ౬. ౨౪౭

క కఱకంఠు భక్తి వెలిగాఁ, గొఱగా వెవ్వియును
నవియుఁ గొన్నిటివాల్లల్, మఱి పిండికూడు
వెట్టిన, మెఱియలక్రియ మెరచు మీసమెడు
కులమెఱపుల్. శివ. సా. ౧౯౬.

(పిండకూడు, ముద్రి)

పిండికూర=పిండిబొద్దికూర. వి (√పిండి) ఒక
జాతికూరాకు.

అ ఉల్లి పుచ్చకాయ ముల్లంగి సొఱకాయ పిండి
కూర చేతిబీఱకాయ హై. భా ౪ ౯౬

పిండికొండ. వి. (√పిండి) కొండపిండి.

సీ. కొండపిండి యనంగఁ బిండికొండ యనంగ
నగభేదసంజ్ఞ గా వలరుచుండు.
ఆం. భా. ౨. ౬౫.

పిండితము. సం. విశే. (అ. ఆ అ.) ౧. పిండ
ముగా చేయఁబడినది, ముద్దగాఁ జేయఁబడినది.
౨. సంహతము, చేర్పఁబడినది. ౩. గణితము,
ఎంచఁబడినది. ౪. గుణితము, గుణింపఁబడినది.
౫. దట్టము.

వి అ. పుం తురుష్కమను గంధద్రవ్యము.

పిండిదొండ. వి. (√పిండి) తుర్యకుండి.

సీ. తుర్యతుండి చెలగుఁ బిండిదొండ యనఁగ.
అం భా. ౨. ౭౦.

సీ. . తెల్లేర విదఖాద్ది పిండిదొండ
హంస. ౪. ౧౦.

పిండిపించే[1] = పిండిపీచే[1]. విశే. (√ పిండి) మిక్కిలినలఁగఁగొట్టఁబడినది, విమర్దితము.

మ. తరుగుల్మాదులు పిండిపించుగ మహాధాత్రీ ధరశ్రీధరాశ్కరముల్ పెంపరి నుగ్గునూవ ముగ... ఉ. సం. ౧౧. ౫౭౦

పిండిపీఁచేము. విశే. (√పిండి) పిండియైనపీచేము కలది, నిస్సారము

సీ. పిండిపీఁచేంబు గాఁ బృథిధరమ్ము లదంతునే కాలదండమున నథవ కాశీ ౩ ౩౯. (ఇట గుండగుండగా అనిభావము)

పిండిపీఁచే=పిండిపించే.

గీ విరుదువగలలెల్ల ల్తములన బిండిపీఁచే,సేయు బలితంపుసేర్పు లచ్చెరువుఁ బెనుప
భార. శల్య. ౧. ౧౭౨. (పిండిపిండిగా. కరాలప్రతి. పా.)

పిండిపోఁకలు. వి. బ. (పిండి+పోఁకలు "గుండ పిండములు" (శ ర.) భక్ష్య విశేషము.

పిండిబొద్దికూర=పిండికూర. (√పిండి) బ్రౌ. ప్రి

పిండిమిరియము. వి. (√పిండి) పులుసుపేయక పిండితోను మిరియములోను పలుచగా వండిన వ్యంజనవిశేషము (శ. ర.)

పిండిలము. సం. వి అ. పుం. ౧. వంతెన, సేతువు. ౨. మేఘము, స హిసుము, మంచు. (శే. వి.)

పిండిలుఁడు. సం. విశే (అ. ఆ అ.) ౧ మిక్కిలి పిక్కతండగలవాఁడు. ౨. గణకుఁడు, లెక్కించు వాఁడు.

పిండివంట = పిండివంటకము. వి. (√ పిండి) పిండితోచేయు భక్ష్యము.

తరలము. పలుతెఱంగులపిండివంటలుఁ బప్పుఁ గూడును సేతికుండలు...
భార. ఆది. ౭. ౨౧౫.

సీ. పెనుపారుకడియంపుఁ బిండివంటలతోడఁ గమ్మని సద్యోఘృతమ్ముతోడ.
వి. కథ. ౧ ౧౩౫.

ఆ ప్రియము లేనివిందు పిండివంటలచేటు.
వేమన. ౨. ౪౯.

పిండివంటకము=పిండివంట. (√పిండి)

గీ వారయాత్రికు లనుపొందవంతు లగుచు,వలచి భుజియించి రొగిఁ బిండివంటకములు.
సైమ. ౭. ౧౨౦

శా ..నిఖిలముస్ సంపూర్ణ మై పత్త్రిపాత్రీ మధ్యంబునఁ బిండివంటకములన్ దివ్యాన్న ముల్ ...సంధిల్ల నొక్కమ్మడిన్.
భీమ. ౨ ౧౩౮.

పిండివడియము. వి (√పిండి) పిండితోచేసిన వడియము, కూరవడియము.

గీ. ఎండు గుడి మ్రింగువానికి నంది పిండివడియ మనుప శ్కెఱుంగకే పుడమిలోన
విక్ర ౨. ౨౩౫.

పిండీకృతము. సం విశే. (అ. ఆ అ.) ముద్దగా చేయఁబడినది. (శ. ర)

పిండీతకము. సం. వి. అ పుం. ౧ మదనము. మంగ. ప్రి ౨. తగరము. 3. ఫణిజ్జకము, మరు వము ప్రి.

పిండీపుష్పము. సం. వి. అ. పుం. అశోకము. ప్రి

పిండీభూతము. సం. విశే. (అ. ఆ. అ.) ముద్ద యైనది, ఘనీభూతము, గట్టియైనది.

పిండీరము. సం. విశే. (అ. ఆ. అ.) నీరసము, సారములేనిది.

గీ పిందియలు పూలు ముత్తెములం దనర్చ్చ, కొల్లచెట్టులు వలర వల్లిదంపు,రావిరాకారి కెలమన్కి గోన మెఱయు

అచ్చరా కాల ౧౧౭

పింపిణీ వి స్త్రీవేణీవిశేషము, స్త్రీల యొక విధ మగుజడ, (వాలుగుపాయలజడ అని బ్రౌ)

మ జడి గొన్కొర్కుల నింతి తాను మగవేషం బూనిగ న్పింపిణీ,జడలన్ బాపట రావిరేక జిగి పెచ్చన్ గొప్ప పొంకించి

సత్యా పాం 3 ౧౦౮

పింపిళులు,(ళ్లు)=పింపెనలు వి బ పెదవి మీఁదుగా నొకవిధ మైనధ్వనిని గలిగించి నర్తిం చెడుబాలక్రీడావిశేషము

మ దినముల్ కొన్ని చనంగ నంతఁ గడు నర్థిం బొమ్మపెండ్లిండ్లు గుజ్జెనగూళ్లచ్చనగండ్లు పింపిళులు లోనైనఖేలనముల్ మీఱఁగ బోంట్లతో నలరు బాలాకన్య మెల్లప్పుడున్

కళా ౬ ౨౦౨

సీ పింపిళ్లు చెండుగోరింపులు నోమనగుంటలు వెన్నెలకుప్ప లాది దశా ౯ ౭౧

సీ పింపిళ్లు త్రొక్కుళ్లు బేడిసెతిరుగుళ్లు నచ్చన గండ్లు హం౦ ౫ ౧౫౫

జ పింపిళ్లాడు, పింపిళ్లుగూయు

పింపిళ్లాడు అ క్రి (పింపిళ్లు+ఆడు) ౧ పింపిళ్లాట యాడు (చూ పింపిళ్లు) ౨ నర్తనముచేయుచు నమస్కరించు

రగడ మణికూటస్థలి వలయమణిప్రభుపెరు మాళ్లకుఁ గడుఁ బింపిళ్లాడుచు

హంస ౮ ౨౧౩ (నర్తించు అని శ ర)

పింపిళ్లు(ళులు)గూయు అ క్రి (పింపిళ్లు+ కూయు, గునియు అని శ ర)

౧ పింపిళ్లాటయాడు

సీ మాటికి నెత్తమ్మి మొలుపునఁ బింపిళ్లుగూయు భెగ్గురురాచకొమ్మగములు

యయా 3 ౫౮

వ యువజనంబులకుం గన్నులపండువులు గా గుంపులుగుంపు లై పింపిళ్లుగూయుచాలి కలును వరాహ ౮ ౧౫౫

౨ నర్తించు, చిందులుద్రొక్కు, ఎగిరిపడు

వ భావిపుంభావసంభావనాపరిచయంబు సంపాదించుపెంపునం బింపిళ్లుగూయుకలికి కొమిరెల మొలకచనుమోసులం దులకరించిన తళుకుసిబ్బెంపు తళతళల దళముకొనెనో యనన్ వసు ౮ ౨౩

మ బిగిచన్గుత్తులు గుత్తపుంబయటలోఁ బింపిళ్లు గూయంగ కళా ౬ ౬

(ఇది యితరపదవ్యవధానముతోడను గన్పట్టు చున్నది )

ఉ అలవేల్పుపడంతులకెమ్మనంబు పింపిళ్లొగిఁ గూయఁ జొచ్చె

కవి ౪ ౨ ౧౫౦

3 (భారముచే) వంగియాడు

సీ గంటెఁడు కై లైనఁ బంట కబ్బనిచేను బింపిళ్లు కూయని గుంపుపైరు, గీ పన్నిదమునకుఁ గాన మొప్పట్టుమందు పాంచాలీ ౫ ౪౫

౪ (పింపిళ్లాటయందువలె పెదవులతో కూకూ యని ధ్వని చేయుచు) చలించు

గీ పిన్నబిడ్డ లెయ్యెడలఁ బింపిళులఁగూసిరి

హరి పూ ౪ ౧౬౦

సీ అలికాలికలుమదం బెలరారఁ బింపిళ్లు గూయుచు మధువులు గ్రోలి సోల

నృసిం ౨ ౬౪

పింపిసలాడు అ క్రి (పింపిసలు + ఆడు) ౧ బాలికలు పెదవిమీఁదుగా నొకవిధ మైన ధ్వని చేయుచు నర్తించు

ఉ. సేదుతలు మీఱఁ బింపినలాడు.
రుక్మి. ౧. ౭౮.

౨. నర్తించు, చిందులుద్రొక్కు.
సీ కరులు బొమ్మలమీఁదఁ గులికి పంపిన
లాడ... రసిక. ౬. ౧౧౯.
(పెంపెనలాడు, అపముద్రి.)

పింపినలు=పింపిళులు. వి. బ.(చూ.పింపినలాడు.)
జః పంపినలాడు.

పికపికలు = పికాపికలు, పకపకలు, పకా
పకలు. విణ బ. చెల్లాచెదరు.

క మగ్గయినయతనిఁ గనుఁగొని, బెగ్గలమున
నచటిభటులు పికపిక లైనన్, దగ్గఱి పిశి
తాశను లాక, పొంగ్గర మై కోట నార
సముద్ధతు లయినన్. నిర్వ. ౪. ౫౪.

క ఒక ధూమ శేఁగిలన్కరు, పికపిక లై తమ
లరణము పెంపున నన్యోన్యకరాని సంహతు
లచే, వికలతఁ గని రారులు తమరు వీ రన
కొనరా రంగా. 3. ౭౦3.

పికప్రియ. సం. వి ఆ. స్త్రీ. మహాజంబువు, పెద్ద
నేరేడు. ṭ.

పికబంధువు. సం. వి. ఉ. పుం. ఆమ్రము.
మామిడి. ṭ

పికము. సం. వి. అ. పుం. కోకిలము, కోయిల.

పికవర్ధనము. సం. వి. అ. పుం. కాకము, కాకి.

పికాంగము. సం. వి అ. పుం. పక్షిభేదము.

పికాతము. సం. వి. అ. పుం. రోచని. ṭ.

పికానందము. సం. వి. అ. పుం. వసంతకాలము.
(ఇట్లే పికబాంధవము.)

పికాపికలు = పికపికలు, పకపకలు, పకా
పకలు. విణ. ౧. చిక్కులి కలఁగినది, చెల్లా
చెదరు.

సీ. కవిసినవిందుచీకటి పికాపికలుగాఁబాఱఁగఁ
దోలివఱంటుతనము. వరాహ. ౪. ౧౫౪.

చ. ఎలయఁగ లంకఁ గాల్చి తమ కేఁచిన
కోఁతిరా కేఁడు గ్రమ్మరక, గలవికి వచ్చి
నంచుఁ బికాపికలై పఱతెంచి రందఱున్.
అచ్చరా. యు. ౯౯. ప్రబోధ. ౫. ౧౦౦.

౨. పికాపికలు చేయునది, చెదరగొట్టునది.

ఉ సిగ్గునకుం బికాపికలు చిత్తనమున్నతి పేరి
వార్తకుఁ, గగ్గులకాంద్రుం.. అగ్గజయానకుం
బతికి నర్మ్యో యథేష్టరతాః ప్రసంగముల్.
కవిక. 3. ౭౭౯.

పికిలి=పిక్కిలి. వి ౧ పక్షివిశేషము.
సీ వంగపండు పికిలి ...గి అనఁగ ని ట్లని
పక్షిభేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౭.
ఆ. పికిలి కేలకొమిలి పెసుగువ్వ బకదారి...
ఆది యైనపక్షు లలఁదుదీర్చు.
హంస 3. ౧౭. ఇందు. ౨ ౬౯.

౨ పికిలిపిట్టలతూలికలతోఁ చేసినకుంచె.
సీ పికిలిచేఁ జెక్కులమకరికల్ వ్రాతుఁ గా
నిఁక కెందు వ్రాతుకే యిగురుఁబోణి
దశా. ౭. ౬౭; ౬. ౨.

జః పికిలిచెండు, పికిలిపూ.

పికిలిచెండు. వి. (పికిలి+చెండు.) పికిలిపిట్ట
రెక్కసన్ననియీఁకలతో గుండుకారముగా
చేసినకుచ్చు
గీ. అట్లు తమకంబుచే వేఁటలాడి మృగము,
దంబుఁ జామరములు గజదంతములును, బిల్లి
గడ్డలు పులిగోళ్లు పికిలిచెండ్లు చాదిగాఁ
దెచ్చి యిచ్చి రయ్యవనిపతికి.
రసిక. ౧. ౧౧౬.

సీ...కస్తూరిలప్పు పొంపారుపికిలిచెండు.
నీలా. ౨. ౨౬.

పికిలిపూ. వి. (పికిలి+పూ.) పికిలిపిట్టతోఁక
క్రిందియీఁకలనివృదుమైనతూలిక.

మ. పులిగోరుల్ పెరకేసి కస్తురికమెకంబుల్ ప్రస్ఫుటవ్యాళిపి, ల్లులు గోరోజన మిట్టులుస్ బికిలిప్రాలుగా కైకొనుక లిచ్చి బోయ దొరబిడ్డల్ గాంచి రాఘవాభిఖ్యుగా
రామా. ౨ ౫.

మ తడవిండ్లుస్ గటిమేనులుస్ బికిలిప్రాదండల్ మిటారించుపెగా, బిడెముల్ ... పిసాళిం పఁగాఁ, దుదుముల్ గూడుక వచ్చి చెంచులు వరేంద్రుం గాంచి హర్షంబునగా.
ఉ రా. ౪ ౩౭౪.

పికులు=పిగులు, పీలు. అ క్రి. ౧ (వస్త్రము మొ॥ బిగువుచే) చినఁగు

చ పికిలి యజాండకర్పరము బీఁటలువాఱఁ గ మేను పెంచి యా, మకరనికేతనోదరనిమగ్న మహీమహిళాలలామఁ గే, తకముకళాగ్ర సంగతమదభ్రమరీసమరీతి గాఁగఁ గొమ్మ కొనఁ దగిల్చి యుత్తిఁ గిటిమూర్తిని దాల్చితి గా జనార్దనా పారి ౩ ౩౧

౨. పగులు, బ్రద్దలగు.

క గూటగ్రుడ్లం బెట్టిన,

గీ పెట్టి ముదిగ్రుడ్లు వదకుండఁ గట్టు గాచి పొదుగుటయు నెరకొని కొన్ని పొఁటలకున, బికిలి కాం పంచ. ౧ ౪౫౦

పికేక్షణ. సం. వి అ స్త్రీ కోకిలాక్షము ? క దివుసుగన్నేరు ?

పిక్క[1]. వి (సం పిండికా) జంఘ, చిఱుతొడ

క. పిక్కలతొడల నడుములం, దొక్కటఁ బద తలము నిడి సమున్నతి నొదలిగా, నిక్కించిన నీయాసన, మక్కజము గ స్వస్తికాహ్వ యంబగు జగతిన్ సీతారా. ౧ ౯౭.

సీ. చిఱుతొడ యనంగఁ బిక్క నాఁ జెలఁగు జంఘ. ఆం. భా ౨. ౧౩౭.

జః పిక్కచెదరు.

పిక్క[2]. వి (సం. స్పృక్కా) ఒకానొక చెట్టు.

సీ. తోవపువ్వుకాపలతో లిమ్మ గాఁ బుచ్చు పిక్కమూలంబులపెనఁగు వాపు.
కు సం. ౫ ౭౧౭. ౭౧౮.

పిక్క[3]. వి గింజ ఉదా॰ చింతపిక్కలు (వ్యా.)

పిక్క[4]. వి చిన్నరాశెము.

(వ్యవ) చేతిలో నాలుగుపిక్కలున్నవనివాఁడు మిక్కిలి గర్వపడుచున్నాఁడు.

పిక్కచెదరు. అ క్రి (పిక్క[1]+చెదరు) భయ పడు, బెదరు.

వ.. సమీపాటవీమధ్యంబుఁ దోచ్చి యాస్ఫో టించి పిక్కచెదరక దిక్కులు పరిభ్ర మించి... పాండు ౩ ౭౯

వి భయము, బెదరు

ఆ. పేర్మి నదురుగుండె పిక్కచెదరు లేక, యుండ వచ్చుఁ బేద యులుకుఁ దక్కు రమణి గోఁచిపాఁతరాయఁడు దొంగల, మిందఁ దపెడుమాట మేలు దెలిసి కుచేల ౩. ౪౪

ఆ అంటి పొడిచి పోటుగంటివెంబడిఁదూఱు, వీరవరులు పురుషకారపరులు మేర మీఱు సంఖ్య మెఱయుదు రవ్వేట, నదురుగుండె పిక్కచెదరు లేక రంగా ౧. ౧౦౨

పిక్కటము. విణ బిగువు

ఉ. ఆపలుకుల్ సుధారససమంచితసారము లై చెవుల్ సోఁకస్, భూపతి యాత్మహర్షరస పూర్తికి నే మన వచ్చుఁ బూర్వసం,తాప దశాకృశశ్లథకనత్కనకాంగద ముద్రికాదిర, త్నోపలభూష లంగముల యుబ్బునఁబొల్చెను బిక్కటంబు లై కవిరా. ౫. ౧౧౫.

జః పిక్కటిలు.

పిక్కటిలు.(ల్లు) అ. క్రి (√ పిక్కటము) ౧. నిండు, పూర్ణమగు.

సీ. పెనుగొండకడ బ్రాలి పిక్కిల్లి కొందలైన
ప్రతిపక్షులకు పాతాపాతము చేసి.
శై. భా. ౧. ౪౫.

(ఇది కొందర్థములకు నుదాహరణము.)

పిక్కు¹. అ. క్రి. పెనుదీయు. (శ. ర. బ్రా)

స. క్రి. ౧. అపహరించు, దొంగిలించు.

సీ. దాఁచికొన్నను బలితంపుఁజెంపుడు గాక
పిక్కిన నొకపోక పక్కు గాక.
విప్ర ౫. ౧౯.

౨. మోసపుచ్చు, వంచించు. (శ. ర. బ్రా.)

వి. ౧. వంచన, మోసము.

సీ. వంచనమెసంగు గీ. జాడుఁగు బ్రక్కు
కికురు పిక్కు ఆం భా ౨ ౪౨

౨. మర్మము, కిటుకు.

చ. పలుకులలోనఁ బిక్కు లాకపానుపునకా
బొలయల్క చిక్కులకా, కలఁకలు దీఱు
మొక్కులను గాటపుఁగొఁగిటిలోని
పొక్కులు. అహల్యా. ౨. ౩౭.

3 మల్లవిద్యావిశేషము.

వ.. ఏకసరము పైసరము ఝుంప పిక్కు కరలా
ఘవంబు మొదలగు విత్తంబులును.
మల్లుపు. 3. ౬౯

వ నయనపుపారుప లివ రాశడ యేకసర
పైసర ఝుంపు పిక్కు కరలాఘవమ్ము మొద
లగువితమ్ము లెఱిఁగి ప్రబంధ. ౩౭

పిక్కు². వి పెంపు, అతిశయము.

వ...వాకొంబు లగుతూణంబులజాణతనంబు లాడి
ధిక్కరించునిక్కుల కిక్కు కానీ క్కులరు
పిక్కులు .. ప్రబంధ. ౪౦

పిగులు=పికులు, పీలు. అ. క్రి. (వస్త్రము.
తెం. చినుగు చేపగులు; చినుఁగు.)

క. భువి పగిలెకా రవి జాగిలెకా, దివి పిగిలెకా
దిగ్గజములదృతి సన్నగిలెకా.
రా. వి. ౨. ౪౨.

అ. పిగిలెఁ దిశ నవఁగఁ బెంపొందుచుండును,
జెనిఁగె నవుటకాభ్య... ఆం. భా. 3. ౯౧.

పిచండకుఁడు. సం. వి. అ. పుం. జొదరికుఁడు,
తిండిపోతు, ఉదరంభరి.

పిచ(చి)ండము. సం. వి. అ. పుం. న. ౧. కడుపు.
౨. పశుపు. (వై. ని) 3. మృగములవీపు (శ.ర.)

పిచ(చి)ండిక. సం. వి. అ స్త్రీ జంఘ, పిక్క.
(వై. ని)

పిచండిలుఁడు. సం విశే (అ. ఆ. అ) పెద్ద
కడుపుకలవాఁడు తుందిలుఁడు

పిచేపిచే. వి పిచ్చుకలధ్వని కనుకరణము.

వ...చతుర్ఘటికావశేషంబు గా రాత్రి చనియె,
దిక్కులు ప్రకాశప్రకటింబొందెఁ, బిచ్చు
కలు పిచపిచమనియెఁ గాకంబులు గూశ
లిడియె... కేం. పంచ ౪. ౫౦౪.

పిచవ్యము. సం. వి. అ పుం ప్రత్తిచెట్టు,
కార్పాసవృక్షము.

పిచుకము. సం. వి. అ. పుం మంగచెట్టు, మదన
వృక్షము.

పిచుతూలము. సం. వి అ. పుం. తూలము,
దూది.

పిచుమంద(ర్ద)ము. సం. వి. అ. పుం. వేము,
నింబము. శ్రీ.

పిచులము. సం. వి. అ పుం. ౧. ఝూబుకము. శ్రీ.
౨. ఇజ్జలము, ఎఱ్ఱగన్నేరు. శ్రీ. 3. తూలము,
దూది. ౪. నీరుకాకి, జలవాయసము. (వాచ.)

పిచువు. సం. వి. ఉ. పుం. ౧. దూది. ౨. కర్ష భేదము ౩. కర్షము

పిచ్ఛే[1]—పిచ్చి. వి (సం. పిత్తహ. త. పిచ్చు.)

౧. ఉన్మాదము, పిచ్చి

సీ. వెఱ్ఱి యనంగను పిచ్చి యనంగ నున్మాద మనంగ నున్మాదసంజ్ఞ. ఆం. భా. ౧. ౧౩౭.

౨ అల్పము, తక్కువది.

ఉ కొన్ని గొణంగి కొన్నినిసి కొన్నికుటారము లాడి మానరా, కన్నిక నిన్నివాళ్ల కివి యి న్నని కూటికిఁ బిచ్చపాటిఁ గొమ్మన్న మహా ప్రసాద మని పూర్ణరసోల్లసదానశాబ్జ యై, యన్నలిబాణి భర్త యిడునన్నియ గైకొను ప్రముక్కధాన్యముల్

పాండు. ౪ ౧౪౬.

జ. పిచ్ఛేటిలు, పిచ్ఛేపట్టు, పిలుపిచ్ఛే

పిచ్ఛే[2]. వృషణము, ముష్కము.

క పిచ్చలు పడిపడి రాయఁగ...

చంద్రి. వి ౨ ౬౦.

పిచ్ఛ. సం. వి. అ స్త్రీ ౧ ధరణముఎత్తుగల ౧౭. ముత్తెములహారము, ఒకానొకముత్తెముల తూనిక, ముక్తాపరిమాణభేదము.

పిచ్ఛటము. సం. విణ. (అ. ఆ. అ) చదునుగా అదుమఁబడినది

వి. అ. పుం. ౧ ఒకానొక కంటితెవులు, నేత్ర రోగవిశేషము.

న. ౧. తగరము, వంగము. ౨. సీసము, నాగము.

పిచ్ఛటిలు. అ. క్రి. (√పిచ్ఛే) వడఁకు, కంపించు.

లయగ్రాహి. వచ్చెమురభేది ధరపిచ్ఛటిల సైన్య ములు హెచ్చినదవక్ రిపులు రిచ్చవడి చూడక్. ఆదిలక్ష్మీవిలాసము ౪. ౧౨౩. ప్రా.

పిచ్ఛపట్టు. వి. (√పిచ్ఛే[1]) ౧. అభిత్వము. (శ. ర. ప్రా.)

౨. మూర్ఖపుపట్టు.

వ్యవ. ఈ విషయములో వాఁడు పిచ్ఛపట్టుపట్టి నాఁడు.

పిచ్ఛేలము. విణ. అతిశయించినది, అధికము.

ఉ. పెంపరయంగనొక్కరొయిదఁ బిచ్చలమయ్యెను మేన ఘర్మముల్. రస. ౧. ౩. ౨౦.

జ. పిచ్ఛేలించు.

పిచ్ఛేలించు. అ క్రి (√పిచ్ఛేలము) ౧ అతిశయించు.

ఆ. అంతఁ బోక శౌరి యగ్రజుండును దానుచక్రమును హలంబుఁ జటులగదయు, భుజము లందుఁ దాల్చఁ బోరిఁబోరిఁ గదిరెదు, భీతి మానసమునఁ బిచ్చలింప. ఉ.హరి ౬ ౧౯౧.

ఆ. దేవతరువుమాడ్కి తెల్లనిగొడుగుతోఁ, గూడఁ బసిఁడి కామకుంచె లచట, నిలిపి పొంతఁ గైదువులుసేర్చి యర్చనలిచ్చె నుత్స వంబు పిచ్చలింప. ద్వా. ౨. ౩

౨. భయపడు, భీతిల్లు.

చ...దైత్యవిభుండు సవిస్మయంబు గాఁ, దలపడి భూమిపాలుపయి దట్టముగాఁ బలుకెన్ శిలీ ముఖంబులు సురసిద్ధసాధ్యులు సభోవల యంబునఁ బిచ్చలింపఁగన్.

భా. రా. యు. ౨౧౪౯.

ఉ...వెన్నుఁడు నివ్వెఱ నొంద నందునన్, వేలని యార్చి రాసురులు మింట సుపర్వులు పిచ్చలింపఁగన్.

ఉ. రా. ౨. ౩౭.

క. ఒనరింపఁ బిచ్చలింపక, మునుకొని యయ్యాదిక మనికి మొనగాంద్రతనిన్, జెనసి పెనుగట్లు కెట్లును, బెను పొదవఁగ రువ్వుటయును వెగ డక వాఁడున్. అచ్చరా. యు. ౧౬౧

3 కంపించు, కదలు

చ బిగిచన్నవ యరూర్పులఁ బిచ్చలింపఁగా
నిరం ౭ ౭౮

౪ ఆనందించు

గీ మెచ్చిచూచుచు వేమఱుఁ బిచ్చలింతు, రమర
కన్యక లతులహిమాచలమున
కు ౦ం 3 ౭౬౧

సీ ఒకకొంతప్రొద్దు లోకకథాప్రహేళికా
బిందుమత్యాదులఁ బిచ్చలించు
శివరా ౨ ౭౩

౫ క్రి అతిశయింపఁజేయు, ప్రశంసించు

గీ విశిఖనవకంబు నాటించి వెగడుపఱిచి, పేర్చి
యార్చిన సురకోటి యచ్చలించె, మెచ్చి
భీష్ముడు శల్ల విన్వచ్చుఁ బోలు, నెక్కు
డగుఁ గాని యపుడు గాఁడితఁ డనిరి
భార భీష్మ ౧ ౨౭౨

మ సుందరకుఁ దేశోపానిగావించినన్, ఎభిక
ప్రాతము యచ్చలించె నను నానాస్తోత్ర
వాక్యంబులన్ దశకు ౫ ౫3

పిచ్చి=వచ్చు[1] వి ఉన్మాదము, వెఱ్ఱి

ఉ ఎచ్చటనైనఁ గంటిమె మహీస్థలి నిట్టి
విచిత్ర మెన్నఁడున్, బిచ్చుపువానిఁ బిల్చి
తనప్రేయసి నిచ్చె నితండు పీనికిం, బిచ్చి
జనించెనో యిదిరెు పెం పగుభక్తి యటంచు
నెంచెనో, యిచ్చట నేరి కింకఁ దలరెుత్తి
కనన్ మన సొప్పు దెంతయున్ హరభక్త
విలాసము ౧ (చి వి)

విణ హీనము, నీచము

గీ నీకులక్షణపౌరుషములఁ, కొచ్చెముగ నేల
చొచ్చితి పిచ్చిపనికి
రామా ౭ ౨౫౯ (పిచ్చపనికి ౪ ర పా)

జ పిచ్చివాఁడు

పిచ్చిక=పిచ్చుక వి చటకము, ఒకజాతిపిట్ట

సీ చలనంబు లేక జాజలి తపోనిష్ఠ నాసీనుఁడై
యుండఁ బిచ్చికలు గూడు, గావించె
తన్మస్తకంబున భార శాం ౫ ౨౭౪

జ పిచ్చికకుంటు, పిచ్చికుంటు

పిచ్చికకుంటు=పిచ్చుకకుంటు వి (√పిచ్చిక)
(శ ర)

పిచ్చికుంటు=పిచ్చుకుంటు వి (పిచ్చిక)
అనూరుఁడు (శ ర)
విణ కాళ్లులేనివాఁడు (శ ర)

పిచ్చిటము సం వి అ పుం కీటభేదము, ఒక
జాతిపురుగు

పిచ్చిలిపోవు అ క్రి (√ఎచ్చిలు) చిప్పిలు

ద్వి పుడమి మోచినసాగపుంగవుఁ బట్టి,పిడు
కుసా విష మెల్లఁ బిచ్చిలిపోవ
రం రా యు ౨౫౭ పా ౨౨ పం

పిచ్చిలు(ల్లు) అ క్రి చిప్పిలు (నీటిబొట్టు మెం)
లోపలినుండి పైకివచ్చు

ఉ గ్రుచ్చి కవుంగిటం బొదివి కొ బ్బొక
యించుక దుర్వి చెక్కులన్, బిచ్చిలుమాత్ర
ఘర్మజలబిందువు లొత్తి
చంద్రా ౬ ౧౪3

చ సొలవక మేను కంటకము సోఁకినఁ గొండొక
శోణితంబు ఎచ్చిలి తనకెంతనొప్పి యగు
వెం పంచ 3 ౧30

ద్వి పిలిపిలిపోవ మచ్చికల ఎచ్చిల్ల, బిలిబిలి
లజ్జల బిరుదు లణంగ, పండితా మహిమా
౨౫౦ పా పురా ౧౨3 పా

జ పిచ్చిలిపోవు

పిచ్చివాఁడు విణ (పిచ్చి + వాఁడు,) ఉన్మ
త్తుఁడు (శ. ర)

పిచ్చె. వి. (సం పైత్యమ్) పిత్తకోశము, చేఁదు కట్టు.

సీ. గోజాగజంబుకగోళ్ళాఖుమార్జారముల పిచ్చె తనయాత్మబలమువలన (చి. కి చి. ని.)

పిచ్చుక=పిచ్చిక. వి ౧ చటకము, ఒకజాతిపిట్ట దీని భేదములు: వెదురుపిచ్చుక, కొండపిచ్చుక, చెఱకుపిచ్చుక, ఊరఁబిచ్చుక, పొదపిచ్చుక, పేదపిచ్చుక, బంగారుపిచ్చుక. మొ

ఆ పెంచినట్టికోడిఁ బిల్లి భక్షించినఁ, గొందు వగపు పిచ్చుకందుఁగలదె ప్రబోధ ౫ ౨౮

ఉ తూనిగ లాడఁ బొచ్చె దివి దూటి భ్రమింపఁగఁ బొచ్చెఁ బిచ్చుకల్. హర ౨ ౧౭

పిచ్చుకపై బ్రహ్మాస్త్రము = అల్పుని దండింప నధికప్రయత్నము చేయునపుడు దీనిని వాడుదురు.

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము, విచ్చలవిడి నిగుడఁ జేయువిధ మింతెకదా. ఉ. రా 3 30౨

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము, నచ్చుగఁ దొడిఁగినవితాన నబలపయిన్ మీ, కెచ్చుగఁ గోపం బటు రా, వచ్చునె తప్పైన పైఁపవలయు నటంచున్ శకాం. ౪ ౨౧.

(పిచ్చుక చిన్నపిట్టయగుటచే ఈపదము కొన్ని యెడల అల్పార్థద్యోతకముగాఁ బ్రయుక్తము

ఉదా పిచ్చుకయాహారము, పిచ్చుకంత మొ

జ. పిచ్చుకకాలు, పిచ్చుకకుంటు, పిచ్చుకగోళ్లు, పిచ్చుక బియ్యము, పిచ్చుకబీర, పిచ్చుకుంటు

పిచ్చుకకాలు. వి (√పిచ్చుక) పర్పాటము. తీ

గీ. పర్పాటకంబు మనుమ బిచ్చుకకాలు నా మాతృభూత. ఆ. భా ౨ ౬౫

పిచ్చుకకుంటు=పిచ్చికకుంటు. వి. (√పిచ్చుక) అనూరుఁడు.

సీ. ఉత్తానుఁడై కన్న కొరగి పిచ్చుకకుంటు విప్రతీపంబు గా వినుతిసేయ. కాశి. ౧. ౧౨౬.

విశే. పిచ్చుకవలె కుంటుచు నడచువాఁడు, కుంటివాఁడు.

క విను పిచ్చుకకుంటతిరయ్యమునఁ బోకకుఁ బడుట పెదముదుకఁడు పేర్యాజనముం గోరుట దుర్యోధనుఁ డింక జయంబుఁ గొనఁగఁ దలఁచుట యరయన్ భార కర్ణ ౧. 3౨.

క. చీకుం బిచ్చుకకుంటును, మూకు శిఖండి యను నిక్కముగఁ దమపొల్లం, జేకొనఁ జాలరు వారిం జేకొనఁగా వలయు ధనముఁ జేకొన్నజనుల్. విజ్ఞా వ్యవ. ౧ ౪౪.

ఉ...ఈ, పిచ్చుకకుంటుమీఁదఁ గృపపెంపున నామరలోకవాహినిం, దెచ్చితి... పను. ౫ ౨౦.

పిచ్చుకగోళ్లు. వి బ. ధాన్యవిశేషము

సీ ..గొర్రికుంకుమల్ రణపెండ్లికొడుకులు పిచ్చుకగోళ్లు ప్రయాగలు గొజ్జఁగ్రాలు హంస. ౪. ౧౨౭.

వ...ఏలకిరాజనాలు పిచ్చుకగోళ్లు వంగారు బుడమలు ప్రయాగలు. . ప్రబంధ. ౧౧౨.

పిచ్చుకబియ్యము. వి తృణవిశేషము

చ. వెనుతురు ప్రాల్ల బూదియును వీడలి పిచ్చుకబియ్య మెంద్రయున్ ప్రబంధ. ౨౦౦.

పిచ్చుకబీర. వి. (√ పిచ్చుక) ఒకవిధమగు బీర తీ.

గీ బీరపండ్లును బిచ్చుకబీరపండ్లు, గొమ్మిపండ్లికెపండ్లును గొంజిపండ్లు. కాళ. 3. ౬౯.

వ కొండుగుమలుకొండుగు బీర పిచ్చుకబీర కొండి బ్రహ్మకొండి జావ్వి కలజావ్వి...వెంద లగుతరుల... ఇంతు. ౨. ౬౦.

పిచ్చుకు(గు)ంటు=పిచ్చికుంటు. వి.(√పిచ్చుక వృత్తినివర్ణలోపము.) ౧. అమారుఁడు, తూర్యుని పారథి

సీ. ప్రీతి నింతకు నేఁగుఁ బిచ్చుకుంటుకు ద్రొక్కి వినుతపౌ(?)ధాత్రుండు వినతపట్టి
సైప. ౨ ౧౩.

చ. ప్రగ్గములన్ రవియాజ్ఞ మాటికిన్ ముడి యిడఁ బిచ్చుకుంటురథమున్ నిలుపన్
ఆము ౨ ౪౯. ఉ రా ౧ ౮౮

౨. గొల్లలను యాచించి జీవించునొకజాతివారు (కమ్మవారిని అడిగికొని జీవించుజాతి అని బ్రౌ)

సీ. బలిజీలవి త్తంబు పట్టెదాసరిపాలు గొల్ల వి త్తము పిచ్చుకుంటుపాలు రామలిం ౨౩

విశే. పంగువు, కుంటివాఁడు

గీ అవలఁ గొఱగాక పిచ్చుకుం టై యనంగఁ దనపుఁ గొనఁజొచ్చె . ఆము ౨ ౫౭.

సా పిచ్చుకుంటుమీఁదిభాగీరథి = కుంటివానిని గంగయేవచ్చి స్నానము చేయించె ననుట (అర్హతకుమించిన ఫలము లభించెననుట)

సీ పైతృకంబు. గీ పెట్ట సమకట్టువేళకుఁ బిచ్చుకుంటు, మీఁది భాగీరథియుఁ బోలె మీర లేఁగు, దెంచితిరి... పరామా. ౪ ౯౪

ఉ. మీర లిందులకు వచ్చుట సామది నెంచి చూడ భా, గీరథి పిచ్చుకుంటు పయికిం బ్రవహించుట నూ నృపాగ్రణీ
కృ శకుం. ౨. ౬౧.

పిచ్చె. వి. చింతగింజ

సీ. చింత యనంగను ంచ యా పిచ్చె యనంగఁ దద్బీజంబు విలసిల్లు... అం. భా ౨. ౪౪ (పిచ్చ, అని శ. ర బ్రౌ)

పిచ్ఛ. సం. వి. అ. స్త్రీ. ౧. తోఁకయు, ఒఱ. ౨. గంజి; గంజిమీఁదిమీఁగడ. ౩. పం క్తి, వరుస. ౪. ఛట, సమూహము. ౫. శాల్మలీ కోట్టము, బూరుగబంక. ౬. అరఁటి. ౯. ౭. పోఁక ౯ ౮. శింశుప. ఇరుగుడు. ౯. ౯. పిక్క, జంఘ. ౧౦ ఫణిలాల, పాము చొంగ. ౧౧. గుజ్జుపుకాలిపుండు.

పిచ్ఛకము. సం వి. అ. పుం. (నెమలితోఁకగు వాని) పురి.

వి అ స్త్రీ నెమలిపురులకుంచె

పిచ్ఛతిక. సం వి అ స్త్రీ శింశుప ఇరుగుడు ౯.

పిచ్ఛనద్ధము. సం వి అ పుం ఒకజాతియల్లి. ౯ (వై ని)

పిచ్ఛబాణము. సం వి అ పుం డేగ, శ్యేనము.

పిచ్ఛము. సం వి అ న ౧. నెమిలితోఁకగు వాని తోఁకయందలి, యీఁక; నెమిలిపురి; ఱెక్క ౨. సిగ, చూడ ౩. శివుని త్రిశూలము. పుం తోఁక లాంగూలము

పిచ్ఛలదళ. సం వి అ స్త్రీ బదరి రేఁగు. ౯. (త్రి ని)

పిచ్ఛిల. సం వి అ స్త్రీ ౧ పూతిక. ౯. ౨. శింశుప, ఇరుగుడు ౯ ౩ బూరుగు. ౯. ౪ ఒకానొకనది, (మే ని) ౫ కోకిలాక్షము, ములుగొరిమిడి ౯ ౬ తేలుమణి ౯ ౭ అగిసె. కూశీతృణము ౯ కటుకరోహిణి. ౯. (వా. చ)

పిచ్ఛిలకము. సం వి. అ. పుం. ధన్వనము, తడ. ౯.

పిచ్ఛిలచ్ఛద. సం. వి అ. స్త్రీ. ఉపోదకి. దుంపబచ్చలి. ౯

పిచ్ఛిలత్వక్కు. సం. వి. చ్. పుం. నాగరంగము. నారింజ. ౯.

పిచ్ఛిలము. సం. విశే. (అ ఆ. అ.) (జిడ్డుతోఁకగు వానిచే) జాఱుడుగలది. (శేల.)

౨. చిక్కనగలది, చేరినది. మీఁగడకట్టినది. (ముద్దపప్పు మొ॥, స్నిగ్ధమాపాది.)

3. పిచ్ఛము (పిగ) గలది. చూడాయుక్తము.

సం. వి. అ. పుం. ౧. సరసవ్యంజనాదిపలుచగా వండిన కూర మొ॥. ౨. స్నిగ్ధమాపాది, చిక్కనగుముద్దపప్పులోనగునది.

3. శ్లేష్మాతకవృక్షము, విరిగిచెట్టు

అ. పుం. ఆ. స్త్రీ. బింబచ్ఛద, ఇరుగుడు. శ.

పిటంకోకి. సం. వి. ఈ. స్త్రీ. పెద్దపాపర, ఇంద్రవారుణి. శ.

పిటక. సం. వి అ. స్త్రీ. విస్ఫోటము, బొబ్బ.

పిటకము. సం వి. అ. పుం న. ౧ పొక్కు, బొబ్బ, స్ఫోటకము.

౨. ఇంద్రునిధ్వజముమీఁది యలంకారవిశేషము

పుం. చిన్న పెట్టె, చిన్నగంప

పిటక్య. సం. వి. ఆ స్త్రీ. పటకిసమూహము, పెట్టెలగుంపు.

పిటపిట. వి (ఎండమొ॥వాని) తీక్ష్ణతను తెలుపు అనుకరణము.

క. కటికితో గరాచరుండలు,పిటపిటఁ గాయంగ మేను బీఁటలువాఱెన్. బహు 3. ౬౨.

పిటము. సం. వి. అ. పుం. గంప, కండోలము.

వ. చాలము, ఇంటిపూరికప్పు.

పిటాకము. సం. వి. అ. పుం. పెట్టె.

పిటాక్య. సం. వి. ఆ. స్త్రీ. పిటాకసమూహము, పెట్టెలగుంపు.

పిటిలు(ల్లు). వి. పిడుగులు పడుటయం దగుధ్వనికనుకరణము.

చ. పిటిలుపిటిల్లనం బ్రిదిలి ప్రేలి పడం దొడఁగెం బయోర్ధిక్కాశటములు మందుదుం బిడుగు లందము... హర. ౨. ౨౧.

పిట్ట[1]. వి. (సం. పిత్సత్) పక్షి, విహగము.

మ. వలరాయం డనువేటకాఁ డలయుచు బ్రాతం బ్రుతేఁజాపుపి,ట్టలఁ బట్టన్ జెలినాభి యన్జాలమదండ స్గానుగ్రాప్యించుడాల్,వలరొంతేఘుటియించి చన్నుఁగవ బ్రోవం బొంచె...

చంద్రా. ౪. ౧౨౯.

సీ. కాకిపిట్టకుఁ జాలఁ గద తేనిబ్రతుకు కిడి చిలుకకుఁ దద వేల చేయఁదయ్యె.

నీలా. ౧. ౧౧౧.

సీ పిట్ట పక్కి పులుఁగు జిట్ట గువ్వ యనంగఁ బక్షిసామాన్య మై పరగుచుండు.

ఆం. భా. ౨. ౯౬.

పిట్టదొర = పక్షిరాజు, గరుడుఁడు.

గీ. చట్టుపలఁ బుట్టుతేగాడ్చుకొట్టునకును, చెట్టుకాయలు రాలినయట్టునిట్టు, తొట్టుతొట్టునఁ దారక ల్పిట్టు దుల్లఁ, బిట్టదొర కొరకట్టడ కట్టిపడిరె.

బహు. 3 3

ఇట్లే పిట్రాజు

సీ. ఇలభోగిరాజును నిమ్మడి పిట్రాజు పదకనదకలఁగాపాడుచుంద్రు.

ఈ హరిశ్చ ౨. ౬౪.

సా: పిట్టకొంచెముకూఁతఘనము = చిన్నవాఁడు పెద్దమాటలాడుట

పిట్ట[2]. వి. (సం. ఖిత్తం) మంటిగడ్డ, బెడ్డ.

ఆ గురునిమాట సరకుగొనమి దుశ్శీలత, పిట్ట పుడుక గోరు పినుకఁ ద్రుంపఁ, గలవమరుగు టుదయకాలాస్తమయసమ,యముల ఖానఁ జూచు టాయు వడఁచు.

భార. అను. ౪. ౯౦.

సీ...కొలయు లోష్టము పెల్ల పిట్టపెట్ట, గడ్డ బెడ్డ యనంగ...

ఆం. భా. ౨. ౨౩౦.

పిట్టకము. సం. వి అ. న. దంతకిట్టము, పండ్లపాఁచి.

పిట్టపించేము(లు). విణ. (పింఛము + పింఛము.) కలఁతనొందినది.

సీ. తెబ్బులితండంబు పిట్టపించము లయ్యె నలుఁగులపా లయ్యె వెలుఁగు లెల్ల.
తపతీ. ౪. ౩౯.

పిట్టపిడుగు. వి (పిడుగు + పిడుగు క. పిట్టు పిడుగు) పెద్దపిడుగు.

వ ..ఉద్భ్రాంతంబు లై యంబుధు, ల్వారలం గట్టలమీఁదఁ బిట్టపిడుగు ల్త్రొక్కినట్ మహోద్రగతన్. భార. ద్రో. ౫. ౩౪౪.

ఆ పిట్టపిడుగువంటి బెట్టిదంపు బొబ్బ విన్నమాత్ర భూకంప మైనట్లు కళవళించె సకల కాననంబు తపతీ. ౪. ౩౫

క్రి. విణ. అనివార్యముగా, తప్పక.

ఆ. ఘనుఁ డటంచు వేఁడఁగాఁ బోయినను బెట్టుపిడుగు వైచి చంపుఁ బిట్టపిడుగు.
చంద్రా. ౪. ౨౪.

గీ పడుగు మొత్తినగతిఁ గూలుఁ బిట్టపిడుగు
కవిస. ౧ అధికారము (౪ ౮)

గీ పిట్టపిడుగుగ మగనిఁ జంపింప కిల్లి వెడల దిల్లాలు కలియుగవిలయవేళ

సీ రాహుపూజాభిచారవిధాన మొనరించి కిశిఁ బిట్టపిడుగుగఁ జంపవైతు. కవిక ౩. ౧౧౦ (పిట్టబిరుగుడు, అపముద్రి)

పిట్టు. వి. (సం పిష్టమ్, ప్రా. పిట్ఠం క. త. పిట్టు) వాసెనమీఁదఁ బక్వముచేసినపిండి; పిండి

పీ. పిష్టము చెలఁగుఁ బిట్టన
ఆం. భా. ౨. ౨౫౬.

వ...నేతులఁ దేనెతోలలఁ బిట్టును గట్టును దోఁపలఁ బూపలు మొదలెంబులు.
కాశీ. ౪. ౧౭౫.

పిట్టముదు=పిట్టురూపమైనవై వేద్యము.

వ...శ్రీభీమేశ్వరమహాదేవరకు ఉభయసంధ్యలం (త)బోనముపప్పుటికిం బిట్టముదునకుం దెల్ల ప్రాలకుంచము లిరవదొకును...
ద. శా. ౪ ౧౭౮.

పిఠరము. సం. వి అ. పుం. న. స్థాలి, వంటకుండ. పుం. గృహభేదము.

న. ౧. కవ్వపుకోల, మంధానదండము, ౨. ముస్తె.

పిఠరి. సం వి. ఈ. స్త్రీ. స్థాలి, వంటకుండ.

పిడక=పిడుక. వి (సం. పిష్టక, ప్రా. పిట్ఠఅ)

సీ...పేడ నాఁ దనరు గోమయసంజ్ఞ పిడక నాఁ దనరుఁ దత్పిష్టకంబు.
ఆం. భా. ౨. ౨౫౮.

పిటక. సం వి ఆ. స్త్రీ. పొక్కు, బొబ్బ

పిడకము. సం వి అ. పుం. పొక్కు, బొబ్బ

పిడి[1]=పిడికిలి. వి (క త. పిడి) పిడికిలి, ముష్టి

సీ. పిడికిలి పిడి యన నడరును ముష్ట్యాఖ్య...
ఆం భా ౨. ౧౪౧.

౨ పింటినడుము, అ స్త్రకము.

క. అతనిచనుమర విశిఖ,న్యూతము సేయుటయు నొచ్చి క్రుంక్కి హేలాంతం డాశరతోవ సముద్ధతుఁ డై తుంచెం బిడికోలఁదికి నహితుని ధనువున్.
హరి. ఉ. ౭ ౧౭౩.

౩. పిడికిటితో పట్టుకొను ఖడ్గాదులభాగము.

గీ. పిడి యనంగను త్సర్వాఖ్య వెలయు చుండు.
ఆం. భా. ౨. ౨౧౭.

సీ. నగవుపెన్నెలజాలు మ గ రా ల పి డి వా లు సొగసుసొమ్ముల డాలు సొలపుకెలయ.
చెన్న ౫. ౪. ౨౭౪.

క. మారుమకుటేదిమధ్యకెం, డారతియర్ధంబు పిడిరాయి యన కెంతయుఁబొల్పారుఁ గడు నలిక మ్మై మకుమారికి మధ్యంబు పింహ మధ్యమునకోలిక్

కు. సం. 3. ౭౫౮. ఉ. హరి. ౧ ౧౭౧

నలకపిడి = పిడియాకారముగాఁ జుట్టినసులక (గ్రా)

జః పిడికట్టు, పిడికిటికట్టు, పిడికోల, పిడిగంట, పిడిగొట్టు, పిడిగ్రుద్దు, పిడిగ్రుద్దులాట, పిడిపట్టు, పిడిమూర, పిడియము, పిడివాటు, పిడివాదము కెం

పిడి2. వి. (కె. త. పిడి) ౧. ఆఁడేనుఁగు.

గీ. పసిఁడికోరల నించి యిం పెసఁగ మదపు, గ్రోలుచును బొట్టు నతివలు గ్రాల నడచు, నమరుపిడిపిండులోనిమహాగజేంద్రదు, కాంతి నలరుకుమారు నంతంతఁ గనిరొ.

హరి. ఉ. ౪. ౧౫౪

వ. ఇట్లున్న పరమేశ్వరుకాంతరూపంబు దనకుఁ గ్రూరరూపం బైనం గని వనంబుఁ జొర నుల్కి యుభంబున కోఅపిడి నద్దంబు పేర్చి సా త్తించు వా స్త్రిక్ త్తముండునుం బోలె మరుండు గౌరికాళయు వార్చుచు నుండె.

కు. సం. ౫ ౪౯౭.

౨. ఆఁడుమృగము.

వ.. తొడిగినయమ్ము నన పడి టారలంపిడుల విడువక విడి ముడిపడుకదఁకులును...

ఉ హరి. ౪ ౭౯.

సీ. లాఁచి తప్పినజాగిలము గొట్టుకొట్టునఁ గూడినపిడిఁ గూర్చఁ గొమ్ములాడు.

కళ. ౪. ౪౪.

విశ. ఆఁడుజాతిది; ఆఁడుది.

క. వడిఁ జేఁఁ డోలి రా జార్వడి డొంకనపోటు గా నురస్థలి నత్తు డాపిడికిటి గొరకఁ జేయం, బిడికిటి వి ట్టిగని బిల్లమీఁటు గఁ బత్తిరొకా.

సారంగ. ౧. ౯౭.

సీ. అద్దంబునిడుపుటాఁబద్దలగతి మనుఁబిళ్లు డొంకలనుండి ద్రొళ్లిదాఁట. మనుద. ౨. ౪. (మనుఁబిళ్లు=ఆఁడుమన్నులు)

జ. పిడిరేనిక, పిడిచేయు

పిడి3. వి. (క పిడి) వాద్యవిశేషము.

సీ. తారలు విమ్మటతారలు శంఖముల్ కాహళల్ పసిఁడిఢక్కలును బిరులు, గాలికొమ్ములు జోళ్లు కైముళ్లు రుంజలు

కెు. రా. యు. 3. ౭౬.

పిడికట్టు=పిడికిటికట్టు. వి. (పిడి+కట్టు) వింటిపడుము, లస్తకము (శ ర)

పిడికిటికట్టు=పిడికట్టు. వి (√పిడి1) వింటిపడుము. లస్తకము

సీ... పిడికిటికట్టు వాఁగను లస్తకనామ మొప్పు.

ఆం. భా. ౨. ౭౧౧.

పిడికిలి=పిడి1. వి ఔ. (బ. పిడికిళులు, పిడికిళ్లు) ముడువఁబడినవ్రేళ్లుగల అఱచేయి, ముష్టి.

క మాను మీవలవవిక్రమ్మట వజ్రము నీవును బిడికిటికాఁచున నొఱగు దేను గినిపితిసేనికా.

భార. శాం. ౪. ౩౯౭.

ఉ. చామనిమేనులు న్ననుపుఁ జల్లెడుకొమ్ముల లోనఁ గల్గుబల్గోములు మానవుంబొద వులుం బిడికింట నడంగుకొనులంకా.

శుక. ౨. ౩౩౧.

చ... కేల్ చనిరొడిరిక్క కెు త్తమును జక్కఁగఁ జూచి మొఱుంగుఁబోఁడు లిచ్చను బిడికిళ్లఁ బట్టి యవి జారి చనం దమగోళ్లు చుక్కలంచును .. 

నీలా. ౧. ౭౯.

చ.. అర్థికోటికి, బిడికిళు లాదిగాఁగ బలి కిట్టుడు కత్తృడు వైశ్యభామినుల్.

విక్ర. ౧. ౪౪.

క. మతియుం బిడికించడములు, గిరిధరుఁ డటఁ
గ్రేపు వారగించినదానికి, బరమాదరమున
నతనికిఁ, జిరకాలము భృత్యుఁడై వసింపఁగ
వలయుకా. కుచేల. ౨. ౯౯.

ప్రాణములు పిడికిటఁబట్టుకొనుచుమిక్కిలిప్రాణా
పాయస్థితిలోనుండు, మరణభీతితోనుండు.

వ...ఉభయపక్షంబులలోపలఁ గొందఱు
ధైర్యంబుకలిమిఁ బ్రాణంబులు పిడికిటం
బట్టుకొని పట్టిబిగువున నిలిచిన .
వరాహ. ౩. ౫౯.

వ.. ప్రాణంబులు పిడికిటం బట్టుకొని పోవుచు.
ఆము. ౪ ౩౫

జః పిడికిలించు, పిడికిలింత.

పిడికిలించే. అ క్రి (√పిడికిలి త పిడిత్తపిడి). గుప్పిలిపట్టు, పిడికిలి యేర్పడునట్లు చేయి ముడుచు

గీ నిడుదమై వచ్చి యదలించి పిడికిలించి,
హానుమ కట్టల్కతో నిద తిను మటంచు,
నడుగుశెడిదంభ్రుతాఁకులఁ బుసమి పదఁకిఁ,
బొడిచె వడి మించి శతకంఠుపెడఁదతొమ్మ
సమీర. ౫ ౩౩.

గీ...పిడికి, లించి కరములు కాఁ గుదియించి
గునుకు, పరువునను దాఁటె బలుఁడు తోంబది
యడుగులు దశా. ౯ ౧౩.

స. క్రి పిడికిటఁబట్టు, గుప్పిట బంధించు

వ ..తూర్పున నుత్తరంబునం గలుగునరవాయ
కులు నానాసేనాసమన్వితు లయి వచ్చి చి
చ్చయినమం బిడికిలింతు మనుచున్నవారు ..
భార. ఉద్యో ౨. ౧౭౧.

సీ. పెన్నీరు గిలకొట్టి వెన్నముద్ద లొనర్చ నడు
పథం బంతయుఁ బిడికిలింప. శుద. ౪. ౨౫.

గీ. పిడికిలించి పట్టి నడుముఁ జేసె.
భోజరా. ౩. ౧౪౯.

పిడికిలింత. వి. (√పిడికిలించు ) నమస్కార విశే
షము

రగడ. వారణగిరిపై వరదస్వామికిఁ,బిడికిలింత
లని పెంపుగ నొడువుచు.
హంస. ౪. ౨౧౩

పిడికోల. వి (పిడి[1] + కోల) వాగేఁటిమేఁడి, మేఁడికఱ్ఱ. (శ. ర )

పిడిగంట. వి. (పిడి[1]) నిడుపుపిడిగలగంట

క. నిడుదచిగురనఁటియాకున, నిడి వివిధాన్న
ములు భూమురేశ్వరుఁ డొసఁగుకా, పిడిగంట
మొరయఁ జేయుచు, జడనిధికల్పనకుఁ
బూర్ణసంకల్పనకుకా. పాండు. ౨. ౨౨.

సీ పిడిగంటలును గేకిపింఛంబుఁ గుంచెలు, ఛత్ర
ముల్ బులితోళ్లు చామరములు
రాజ వి ౧. ౧౬౩.

పిడిగొట్టు. స క్రి (పిడి[1] + కొట్టు) పశ్వాదులను పిచ్చలుగొట్టు, ఎద్దుపట్టు (శ ర. బ్రా.)

పిడిగ్రుద్దు. వి. (√పిడి[1]) ముష్టిఘాతము, పిడికిటి పోటు, గ్రుద్దు, చూ. పిడిగ్రుద్దులాట.

పిడిగ్రుద్దులాఁట. వి.(పిడి[1] + గ్రుద్దులు + ఆఁట)
౧ ముష్టియుద్ధము

క. వారింప రానిమదమున, వా రిరువురుఁ జట
చటారవంబులు నెగయం, బోరాడిరి వీరులు
చేయారఁగఁ బిడిగ్రుద్దులాఁట నానమయ
మునకా. ఉ. హరి. ౪. ౨౬౩.

పిడిపట్టు. వి. (√పిడి[1]) బిగిపిడుము, లస్తకము.

ద్వి. వడి రక్కసులపట్టు వదలె నన్నట్టు, పిడి
పట్టు వదలినఁ బెటిలి పేడత్తి, పెళపెళ
ధ్వనులును చెటచెటధ్వనులు, గలయ
దిక్కులఁ బర్వఁగా విల్లు విఱిగె.
రం. రా. బాల. ౨౭. పా. ౧౦. పం.
(బ్రాత్యప్రతిపా.)

మ. ఇను శిల్ల స్యాల గంది కూడంగఁ బటు
హ్యాపాదపూర్వంబు గా, నొనరించెం బరి
పూర్ణముష్టిఁ బిడిప ట్టొక్కింత నిక్కించుఁ
డై, యవయంబుల్ వడలించి విల్లు విడిచెన్
హరి పూ ౯ ౪౩

**పిడిమూర** వి (పిడి¹ + మూర) పిడికిలికి మోచేతికిని నడుమనుండు కొలత, ముడువఁబడిన వ్రేళ్లు గల మూర రత్ని (శ ర వ్రా)

**పిడియ(డ)ము** వి (√పిడి¹) కటారి, బాకు

సీ. కుఱుచగాఁ గట్టినకరకదట్టీదిండు, వంకరిమ్మునఁ
బిడియాలు దోఁపి పి శకుం ౧ ౧౧౩

సీ. మెఱుఁపు పచ్చని దట్టి రొయ్యపుగాఁ గటిఁ
బట్టి, యపరంజిపిడిపిడియంబుఁ జెక్కి
వాల్మీ ౧ ౧౭

మ. పులితోలుక్కొక్కెల నంట దోఁపినపొంబుల్
పీలివ్రూఁదావళం,బులు బల్సింగపుఁజుంచు
దండకడియంబుల్ సారంగ ౧ ౬౩

క. పొద నుండి రొప్పబెబ్బులి,కోదమం జే
యిచ్చి పిలిచి కొఱవంజి రొయ్యం, దదరక
గమెదరక మది,బెదరక పదరక యకుఱుచ
పిడెమునఁ గెడపెన్
చంద్రా ౨ ౯౦ సారంగ ౨ ౨౩౩

**పిడియేనిక** వి (పిడి² + ఏనిక) ఆఁడేనుఁగు

క. పిడియేనికపదుపు పొదువఁ గదుపేదుకఁ
గ్రాలుగంధగజపతిమాడ్కిన్
హరి పూ ౭ ౨౪

సీ. పిడియేనిక యనంగ వెలయుఁ గరిణి
ఆం భా ౨ ౧౯౪

**పిడివాటు** వి (పిడి¹) ౧ పనకట్టలను చేతికొలఁది ఎత్తి గింజలురాలఁగొట్టుట (శ ర) ౨ ఒడంబడిక. ఉదా పిడివాటుచీటి (శ ర, వ్రా)

**పిడివాదము** వి (√పిడి¹ శ పిడివాకము) మూర్ఖపుపట్టు, మొండితనము (వ్రా "మూర్ఖవాదము" అని శ ర)

**పిడివాలు** వి (పిడి¹ + వాలు) ఎన్నని తోలు ముక్కలతోఁ దయారుచేసిన గూడుచెప్పు, పాదరక్షావిశేషము

గీ. కాళ్లఁ బిడివాళ్లు నికటమార్గప్రపాన్న, రస
సముత్కృష్టజనిత మారాగ మమర, నృపతిచే
నంపకము గాంచి యిల్లు సేర, వచ్చె కాదారిఁ
దన్మనోవల్లభుండు శుక ౩ ౧౪౦

**పిడివేయు** అ క్రి (√పిడి²) పసులకతిలో చేయిపెట్టి త్రిప్పు, (శ ర)

**పిడిసాన** వి కొయ్యలకును రత్నములకును రంధ్రములు చేయు సాధనము, బరమా, ఆస్ఫోటని

సీ. పిడిసాన యనఁగను వేధిని వెలయును
ఆం భా ౨ ౨౯౯

మ. హాస్తనకు నుత్కంఠంబు వాటిల్ల గిర్రిర
యంచుం బిడిసానచందమున ధాత్రీభాగముల్
గ్రొచ్చె న్నయ్యారదం బారభటంబు మానుపఁగ
లేడయ్యెన్ మురారాతియున్
కై భా ౫ ౬౪

**పిడిసె** వి ఒకజాతి పావురము

చ. ఎడిసెలు చేనిమీఁద నొకబిన్నన వ్రాలఁగఁ
జూచి శ్రీనాథుని చాటువు (వ్రా)

**పిదు(ఱు)ఁజో(దు)** వి పశువులదేహమందుఁ జేరి రక్తము పీల్చుచుక్రిమివిశేషము, గోమరి

గీ. పిదుఁ జనంగను బిలుఁజా హాఁ బిదుఁదుహాఁగ
వఱలు గోమరి ఆం భా ౨ ౭౭

గీ. కర్ణకంఠోదరాధారకంబు లగుచు, నమరు
మయూర్యారు పిదుఁదుతండములతోడ, నప్పు
టికి వచ్చె నొకయశ్వము
శుక ౩ ౩౯౭

సీ. పాలు చాలఁగఁ గ్రోలఁ జాలు నే తగ వాల
బొదుఁగులఁ బిండుదులు పొదలుచున్న.
పీశారా. ౩. ౪౩.

ద్వి. క్రమ పెట్లు నా కెఱుంగఁగఁ జెప్పవలయు,
నమితప్రభావ రాయల్లను యనిన, పీండు
దులు పొదుఁగునఁ బెద్దకాలంబు, గణుతింప
నున్న దుగ్ధము గ్రోలఁ గలవె
ప్రభు ౪ ౧౧౪ పా. ౧౫ పం

పిదుక=పిడక. వి (√పిదుచే) ౧ కరీషము, గోదమున్నగువానికి చఱిచి రొండఁబెట్టిన పేడ ముద్ద

వ ..పిదుకగొఱపంబుతో మకంబునఁ బుటపుట నై... బెదరుకొదమకట్టువగుంపు
ఆము ౪ ౩౫.

౨ వెలిమిడి, భస్మము. (చూ. కంటఁబిదుకఁ ద్రాము)

కంటఁబిదుకఁద్రాము = కంటిలో బూడిద పోయు, వంచించు.

ఆ. కంటఁ బిదుకఁ ద్రామి కడిమిఁ ద్రికూటాద్రి, యాక్రమించిరి భా. రా యు. ౩౦౦

ఆ. కంటఁ బిదుకఁ ద్రామి గర్వంబు గిర్వంబు, నడుప నైతి కేని నొట్టు పెట్టు.
దశకు. ౨. ౫౪

జః పిదుక మొసలి

పిదుక మొసలి. వి (√పిదుక) చిన్న మొసలి

గీ. పెలుక నిర్ఘాత కోచు తాఁబేలు పిదుక,
మొసలి శింశుమారము—పెద్ద మొసలి...
హంస. ౪ ౧౮౨.

పిడుగు(ద్గు). వి. (క. త పిడుగు) అశని, మేఘములరాయిడిచేఁ గలిగిభూమి పైఁబడు తేజఃఖండము.

క. కదనములకయుఁ గూర్మియు పేర్పడ నెఱిఁ గించుటని వానిఫలకాలము పెన్పిడుగుమ గాడ్పును జనులకుఁ, బిడుటయు పీచుటయు పెఱుక పడిరొండుభంగిన్.
భార. ఆది ౭. ౧౧౩.

చ. పిటిలుపిటిల్లనం బ్రిదిలి వ్రేలి పడం దొడఁగెం జతుర్దిశా,కటముల మండుచుం బిడుగు తండము .. హర. ౨. ౨౧.

గీ పృషతపౌత్రుండు గద నైవఁ బిడుగువోలె, నదరు పెడఁ బొడి గాఁ జేసె నస్త్రగురుఁడు.
భాగ. భీష్మ ౨. ౫౪.

ఉ ..రా జీవవినోధిమండలము చిచ్చుఱపిడ్గును బోలె వేచినన్. షోడ. ౨ ౧౦౫.

విణ (పిడుగువంటిది) అతిబాధకము, మిక్కిలి బాధించునది.

సీ. వాదకుఁ బగ యూరివారలతలనొప్పి
పెంపుడుకూఁతుండ్ర పెద్దపిడుగు...గీ.అనఁగ
విఖ్యాతిఁ గాంచు వాయాఁడుఁగూచి.
కుక ౩. ౨౦.

జః పిట్టపిడుగు, పిడుగుకైదువు, పిడుగుతునుక.

పిడుగుకైదువు. వి. (పిడుగు+కైదువు) వజ్రాయుధము.

సీ. పిడుగుకైదువు పెట్టు తడకట్టు గాఁ బరాధి
మహాకామధిరసంబు చమర ననఁగ.
వసు. ౫ ౩౭.

పిడుగుతునుక(న్క-). విణ. (పిడుగు+తునుక) అశనిఖండమువంటివాఁడు, మిక్కిలి సమర్థుఁడు.

సీ. ఆపన్నరక్ష సేయఁడు గాని సజ్జనపీడనం
బొనరింపఁ బిడుగుతునుక. రామలిం. ౧౩.

చ. ఉదిరిపసిండిచాయగల రొమ్ముల కప్పులు
కేఁడివేలుపుం, గొదములు దానపాపుని
కజ్జలు చిచ్చఱకంటిపెచ్చెలుల్, తుదజము
కేఁడుముల్ పిడుగుతున్కలు వానరవీర
లోక్కటన్, బొదివిరి లంకచుట్టునను భూగ
గనంబులు నిండ నార్చుచున్.
రాఘ, ౪. ౧౮౦.

పిడుచే. వి. (√పిడుచే) ముద్ద, కబళము.

సీ. పిడుచ ముద్ద యనంగఁ బిండంబు వెలయును.

అం. భా. ౨. ౨౨౦

పిడుచేగట్టు. అ క్రి. (పిడుచ+కట్టు) ముద్దగట్టు, దప్పిచే ద్రవహీనమై ముద్దవలెనగు.

గీ. పెదవి పేర్చెత్తి వాలుక పిడుచగట్టు, గొంతు తడిలేయు పెక్కటఁ గొంతతడవు, దాహ మున పదకము లేక దరలె పెసిని.

దశా. ౨. ౧౩౭.

పిడుచేగొను. స. క్రి (పిడుచ+కొను) కబళించు, మ్రింగు.

సీ. దిక్కులు వాలుగు నొక్కచోటికిఁ దెచ్చి పిసికి పిండలి చేసి పిడుచగొనఁగ.

భార విరా. ౨. ౧౩౮

పిడుచేపాఁత. వి. (√పిడుచే) అలుకుగుడ్డ (శ ర.)

పిడుచే. స. క్రి (క. పిళుగు, త. పిళ్)

౧ పసరు మొ॥ పిండు.

గీ. బ్రహ్మ పిడిచినమందాకుపస రనంగి.

ఆము. ౨. ౮

సీ. పడిచివఁ జమురు గారెడుమాంసములతోడఁ దేటలియ్యనిజాంటి తేనెతోడ,

పి. కము. ౧ ౧౩౫.

౨. ముద్దవలె నదిమి దిగఁదుడుచు.

వ. అచ్చటిభూరజంబు వుచ్చి పిడిచి పైచి కూపాడిచిరి... హరి. పూ. ౫. ౧౯౯.

జః పిడుచే, పిడుచేగట్టు, పిడుచేగొను, పిడుచేపాఁత.

పిడుం(డ)త. వి. (త. పిడియణ్) మిక్కిలి చిన్న కంద.

శ...మస్తకపీడఁదక్రకము, గడవరాకుంతపర్యో దకఁగా కరదోఁచుమరోజా మాత్య్రకుం, విడుతపికాంగకో త్రివలపించుచెలుంగు...

శం. వంచ. ౧. ౫౯౧.

క. నిక్కపాగపిడుత గదరా, ముక్కు చెంగం బెన్నఁ గోఁతిముఖమున కెనయా...

చంద్ర. వి. ౧. ౬౨.

సీ...ముష్టిమానభాండాఖ్య పిడుత, యవఁ దన రారు. అం. భా. ౨. ౨౪౬.

సీ...కుందలు చట్లు మూఁకుళ్లు బుడ్లు, కడవలు కానలు పిడతల్ పెన కొన భాండముల్ తగు... పాం. ని. స్థావ. ౭౫.

పిడువరించే. అ క్రి. (√పిడువు) (పిడుగువలె) అతిశయించు. మిక్కుటమగు.

గీ ఉరునిదాఘవాతాహతిఁ గరులతలలు, వ్రస్సి లోపలి ముత్యముల్ వడుస విరిసి, మంగలము లోని ప్రేలలభంగిఁ దూలి, ప్రేలిపడఁ గాపెఁ గట్టెండ పిడువరించి.

కు. సం. ౭. ౬౯౫.

పిడువు=పిడుగు. (చూ. పిడువరించు.)

జః పిడవరించు

పిణ్యాకము. సం. వి అ. పుం. న. ౧. తెలిక పిండి, తిలకల్కము, ౨. హింగువు, ఇంగువ. ౩ సిహ్లాకము, చిల్లమడ్డి. ౪. కుంకుమపువ్వు. బాహ్లీకము (వే. ని.) ౫. కిణ్వము, బెల్లము మొదలగు సారాయి కుపయోగించు వస్తువు. (శే ని.) ౬. యవాని, ఒక దినుసుజీలకఱ్ఱ. ౭. (శే ని)

పిత. సం వి ఋ. పుం. తండ్రి. (తండ్రులు అయిదుగురు. చూ. పంచపితలు )

ద్వివ. తల్లిదండ్రులు. బ. పితరులు, వంశమందుఁ బుట్టి మృతులైన పూర్వులు, పితృదేవతలు.

పితర=పితరుఁడు. వి. (సం. పిత. క. త. పితర), ౧. తండ్రి, జనకుఁడు.

వ...పితరయుఁ బితామహుండును బ్రపితా మహుండును ననఁగఁ బిండసంబంధులు మువ్వురు...మార్క. ౩. ౧౬౬, (శ. ర. పా.)

౨. (=పెతర) పితృదేవత. (చూ. పితరదొర.) పితరయు మద్రి. పా.

జః పితరదొర.

పితరదొర. వి (పితర + దొర.) పితృపతి, యముఁడు.

క. పితరదొర కేటఁ గ్రొటఁక, జతనంబునఁ దివియ మిగుల జడుపున నెదలోఁ, గత కుడుచు తపసిబిడ్డని, బ్రతికించి యసంబుఁ గిన్నబల్లి దున కొగిక. నీలా. ౧. ౨౨.

—ఇక్లేః- పితరుల కోఁడు.

క. మిత్తియుఁ బితరుల కోఁడు, న్మత్తిలి తిరు గంగఁ జూచి నలిఁ బోగ రదఁగక, మొత్తిన కెలిగి త్తరవా, ల్తత్తిడి వెఱరాత నల్లలదొర తాతా. అచ్చ. రా. కిష్కిం. ౧౦౭.

పితరుఁడు.=పితర. వి. (సం. పితా.) ౧. తండ్రి, జనకుఁడు.

క సతియుం బతియును సుతుఁడును, బితరుఁడు నొండొరులతోడఁ బెనఁగడుచో సాక్షితఁ గైకొని మాన్పక యున్నతఁడు పఞ్రతయము దండు వరువఁగ వలయుఁక.

విజ్ఞా ప్రాయ. ౬౬

౨ (బ పితరులు, పితాళ్లు) పితృదేవతలు, వంశమందుఁబుట్టి మృతినొందినవారు.

సీ పితరులఋణము దీర్పదునటనుఁ జెందని దౌర్భాగ్యశీలుఁగోత్రమ్ము త్రమ్ము.

రాఘవ. ౧ ౪౬.

శి. కృతమతి యై యేడేఁడులు హుతవహు ఘృతమునను బ్రీతి నొందించినఁ, బ్రతుఁ డీరేడంతరంబుల, పితరులఁ గొని దివికి నేఁగుఁ జెంపెసలారక. భార అర. ౪. ౨౦౩.

జః పితరులచుక్క.

పితరులచుక్క. వి. (√పితరుఁడు) పితృదేవతాక మగు నక్షత్రము, మఘ, (శ. ర.)

పితలాటకము=పితలాటము. వి. (శ. పిత్త వైతలాటకమ్) ౧. వంచన, మోసము, (శ. ర.) ౨ లోభిత్వము. (వా.)

పితలాటము=పితలాటకము. వి. (శ. పిత్త లాట్టమ్) ౧. మోసము, వంచన, (శ. ర) ౨. లోభిత్వము.

(వ్యవ.) వాఁడు పట్టి పితలాటమనుష్యుఁడు.

పితాపుత్రులు. సం. వి. అ. పుం. ద్వి. (పితయుఁ బుత్రుఁడును) తండ్రికొడుకులు.

పితామహి. సం. వి ఈ. స్త్రీ. తండ్రితల్లి.

పితామహుఁడు. సం వి. అ. పుం. ౧ తండ్రి తండ్రి. ౨ బ్రహ్మ.

పితాళ్లు=పితరులు. వి బ. పితృదేవతలు, మృతి నొందిన పితృవర్గమువారు.

ద్వి విడువఁడే యొకఁడైన వృషభ మటంచుఁ గొడుకులఁ గాంచుట కోరి పితాళ్లు.

రం రా అయో ౧౪౧. పా. ౬. పం.

ద్వి తండతండములు పితాళ్లు నొక్కొక్క, తర ములవారు తత్క్షణమ యేతేర.

పండితా. మహిమ. ౭౩. పా.

పితుఃపుత్రుఁడు. సం. వి. అ పుం. ప్రసిద్ధుఁడగు తండ్రియొక్క కొడుకు.

పితుకు=పిదుకు. స క్రి. (త. పిశుక్కు) ౧. (పాలు) పిండు.

గీ. ఇద్ధరాదొగ్ధిః గ్రేపుల నెలమిఁ జేర్చి, పితికి కొనుఁ దని పనిచె సమ్మతము మిగుల.

హరి. పూ. ౧. ౧౩౧.

ఆ. అడిగెఁ బితికి వండి సద్దగించెను గోవు, నవఁగ నిట్లు కొన్ని యసుద్విశర్మ, ధాతు వులు గఁ డెలియఁదగు తాని నెల్లను...

అం. ళా. ౩. ౧౩౯.

౨. (పశువులు పాలు) ఇచ్చు, స్రవింపఁజేయు.

చ. సతతము న్నెవోత్రములు సాగుచు భూరు
హాములె ఫలించుచున్, పితువుచే ధేనువుల్
జలగభీరము లై చెలువొందుచే నర,
స్తతులు... హ. వరాహ. ౧౦౩. పా.

క. వరియు సెలమూఁడువానలు, సురభులు చ
న్నవసి పితువు సుకృతము జరుగుచ్, ధరిఁ
గొంద్ర కేలు పండును, బరగుం బురుషా
యుషములు ప్రజలకు సెల్లన్
కాశీ. ౪. ౨౯౯.

పితువు. సం. వి. ఉ పుం. ౧. బ్రహ్మదేవుఁడు.
౨. అన్నము ౩. సూర్యుఁడు. (శ. ని)

పితృకల్పము. సం. వి అ పుం. పితరులనుద్దే
శించిచేయుశ్రాద్ధాదికము.
౨. పితరులయుత్పత్త్యాదికమునుదెలుపు గ్రంథ
భేదము.

పితృకాననము. సం. వి అ. న. శ్మశానము.

పితృకుల్య. సం. వి. అ. స్త్రీ. మలయపర్వతమునఁ
బుట్టినయొకనది.

పితృగణము. సం. వి అ పుం. ౧. వంశము
నందలి పూర్వులసముదాయము.
౨. పితృదేవతలగు అగ్నిష్వాత్తాదులు (వీరు
ప్రజాపతులవలనఁ బుట్టినవారు)

పితృగామి. సం. విశే. (న్ నీ. న్.) ఎతను వెందు
నది, పితృసంబంధి.

పితృగృహము. సం. వి. అ న. ౧. శ్మశానము,
వల్లకాడు. ౨. తండ్రియిల్లు.

పితృతర్పణము. సం. వి అ న. ౧. పితరుల
నుద్దేశించిచేయు జలతర్పణము. ౨ పితృతీర్థము.
౩. తిలలు, నువ్వులు. ౪. శ్రాద్ధాదులందుఁ
జేయుదానము.

పితృతిథి. సం. వి. ఇ. పుం. స్త్రీ. అమావాస్య.

పితృతీర్థము. సం. వి. అ. న. ౧. తర్జనికిని అంగుష్ఠ
మునకును నడిమిచోటు, చూపుడువ్రేలికిని బొట్టన
వ్రేలికిని నడిమిచోటు, ఉప్పలవాయి. ౨.
గయాదితీర్థము.

పితృదాయము. సం. వి అ. పుం. తండ్రిసొత్తు,
పైతృకధనము.

పితృదినము. సం. వి. అ న. అమావాస్య.

పితృదైవత్యము. సం వి. అ. న. అష్టకాదిన
మందు పితరుల నుద్దేశించి చేయుయజ్ఞము.

పితృనల్వము. సం వి. అ. పుం. రెండువందల
నలువది యంగుళముల పరిమాణము. (వై. ని)

పితృపక్షము. సం వి అ. పుం ౧ తండ్రివంశ,
తండ్రితెగ. ౨. భాద్రపద కృష్ణపక్షము.

పితృపతి. సం వి. ఇ పుం. యముఁడు.

పితృపైతామహము. సం విశే (అ. ఈ. అ)
తండ్రితాతలనుండి వచ్చినది (ధనాది.)
వ...పితృపైతామహం బయిన రాజ్యంబునకు
నీయట్లు వారు నర్హులు .. భార. ఆది ౮. ౩౦.
మ. పితృపైతామహ మైనరాజ్య మరి విశ్వే
ద్యంబు... భార అర. ౧ ౨౩౪.
శ్లో॥ పితృపైతామహే రాజ్యే బోధవ్యే తేఽన్య
థామతిః సం భార అర. ౩౦. ౧.

పితృప్రపా. సం వి అ స్త్రీ గయయందుఁజేయు
తర్పణరూపమగు ఆమ్రసేకము.
శ్లో॥ గయాయాం పిండదానం య త్పితృకార్యం
త దార్యకమ్, ఆమ్రసేకస్తయ స్త్వత పా
చారీ సా పితృప్రపా. (వై. ని.)

పితృప్రసువు. సం. వి. ఊ స్త్రీ. ౧. తండ్రి
తల్లి. ౨. సాయంసంధ్య, మలుసంజ. ప్రొద్దు
పొడుచుటకు ముందై దుగడియలవఱకును, ప్రొద్దు
గ్రుంకినవెనుక మూఁడు గడియలవఱకునుగల
కాలము. (శ. ర.)

పితృప్రియము. సం. వి. అ. పుం. భృంగరాజము. గుంటకలగర. *

పితృభోజనము. సం. వి. అ. పుం. మాషములు, మినుములు.

పితృమందిరము. సం. వి. అ. న. ౧ తండ్రియిల్లు. ౨. శ్మశానము

పైతృమేధము. సం. వి. అ. పుం. పితరుల నుద్దేశించిచేయు కర్మవిశేషము

పితృయజ్ఞము. సం వి. అ పుం. ౧ పితృతర్పణము. (ఇది పంచమహాయజ్ఞములలో నొకటి) ౨ పితృకర్మము.

పితృయాణము. సం వి అ పుం పితరుల యొక్క చంద్రలోకగమనమార్గము.

పితృలోకము. సం. వి అ పుం చంద్రలోకమునకు మీఁదనుండు నొకలోకము. ౨. అగ్నిష్వాత్తాది పితృదేవసమూహము.

పితృవనము. సం వి అ న శ్మశానము

పితృవనేచరుఁడు. సం. వి అ. పుం ౧. శివుఁడు. ౨. భూతప్రేతాది.

పితృవ్యుఁడు. సం వి అ. పు ౧ తండ్రితోడఁబుట్టినవాఁడు

పితృశ్రాద్ధము. సం వి అ. న. పితనుద్దేశించిశాని పితరులనుద్దేశించి చేయుశ్రాద్ధము.

పితృష్వ (తుఃస్వ,తుఃష్వ.) స సం. వి. ఋ. స్త్రీ తండ్రితోఁబుట్టినది. మేనత్త.

పితృష్వస్రీయుఁడు. సం. వి. అ. పుం. మేనత్తకొడుకు

పితృసువు. సం. వి. ఊ. స్త్రీ. ౧. తండ్రితల్లి, ౨. సాయంసంధ్యాసమయసంజ.

పితృవాక్పు. సం. వి. ఊ. పుం. కుడిచెవి, దక్షిణకర్ణము.

పిత్తకోశము. సం వి. అ పుం. పిత్తధాతువుండు దేహమందలితిత్తి.

పిత్తఘ్ని. సం. వి ఈ. స్త్రీ. గుడూచి, తిప్పతీఁగ

పిత్తడి. వి (సం. పిత్తలమ్, క. పిత్తళె, త. పిత్తళై) ఇత్తడి

సీ...మను సారకూటంబు, పిత్తడి యం చన నిత్తడి యన. ఆం. భా. ౨. ౨౩౯.

ద్వి. పిత్తిడికడియముల్ పికిలిపూదండ, కొత్తంబు లగు నల్లముడుక గాజులను. ద్వి. పరమ. ౪. ౩౨౩. పా.

పిత్తడికాసు. వి మత్స్యవిశేషము.

చ ఇసుకదొందువ పిత్తడికాసు మల్లుమీఁ, నల్లెయు గిండె రొయ్యపర శాదిగఁ జేపలఁ బట్టి బెట్టుగన్. ప్రబంధ. ౧౯౧

పిత్తద్రావి. సం వి న్ పుం. మధురజంబీరము, తీయనిమ్మ *

పిత్తధర. సం. వి. అ. స్త్రీ. కలాభేదము.

శ్లో. షష్ఠీ పిత్తధరానామయాకశాపరికీర్తితా, పక్వామశయమధ్యస్థాగ్రహణీసాప్రకీర్తితా. (సుశ్రుత)

పిత్తము. సం వి అ న. దేహమందలి ధాతువిశేషము (చూ. ధాతువు.)

పిత్తరక్తము. సం. వి అ. న. రక్తపిత్తరోగము.

పిత్తల. సం. వి. అ. స్త్రీ. నీరుపిప్పలి. *

పిత్తలము. సం విశే. (అ. అ. అ.) ౧. మిక్కిలి పిత్తముగలది, పిచ్చగలది, వి అ. న. ౧. ఇత్తడి. ౨. భుజపత్రి, భూర్జపత్రము * ౩. అరిదళము.

పిత్తాతిసారము. సం. వి. అ. పుం. పిత్తమువలనఁ గలుగు అతిసారరోగము.

పిత్తాభిష్యందము. సం. వి. అ. న. పిత్తమువలన కంటనీరు కారెడి రోక తెవులు

పిత్తారి. సం. వి. ఇ. పుం. ౧. లాక్ష, లక్క. ౨. బర్బరచందనము, పీతచందనము.† ౩. పర్పటము, పర్పాటకము †

పిత్తు. అ. క్రి. అపానవాయువువిడుచు.

క. బడబడ పిత్తులు పిత్తుచు, బిడిబిడి బహుభంగి మీఱఁ బాఱుచు మతి తా, నొడలెఱుఁగక పెనుమూర్ఛం, గడు పోలఁగఁ దల్లి గాంచి కటకటపడుచున్

చంద్ర. వి. ౨. ౪౪.

వి. అపానవాయువు చంద్ర. వి. ౨. ౪౪

కవిచా. ౧౫౦.

పిత్ర్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. మఘానక్షత్రము. ౨. అమావాస్య. ౩. పూర్ణిమ. (వై. ని.)

పిత్ర్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తండ్రిది పితృసంబంధి. ౨. పితరులది.

వి. అ. పుం. మాషము, మినుము

న. మఘానక్షత్రము. ౨. పితృతీర్థము (చూపుడు వ్రేలికిని, బొటనవ్రేలికిని నడిమిచోటు, ఉప్పలవాయి. ౩. తేనె, మధువు

పిత్సత్. సం. శతృ. పడనిచ్ఛగలది. ఇది సమాస పూర్వావయవముగానేయుండును.

పిత్సత్తు. సం. వి. త్. పుం. పక్షి.

పిత్సలము. సం. వి. అ. పుం. మార్గము, త్రోవ.

పిత్సువు. సం. విణ. (ఉ) పడనిచ్ఛగించునది; పెళ్లనిచ్ఛగించునది. శబ్ద. ౩. ౪౪.

వి. ఉ. పుం. పక్షి, పిట్ట.

పిదప. వి. ఓ. అనా. వెనుక.

సీ... పదపడి పిదప తర్వాత పిమ్మట. గీ. టనఁగఁ బశ్చాత్పర్యాయమై యలరుచుండు.

ఆం. భా. ౩. ౪౩.

శా. వీరశ్రీనరసింహశౌరిపిదపన్...కృష్ణరాయఁడు విభుం డై రాజ్యసింహాసనం, బారోహించె పారి. పీఠి. ౧౬.

గీ. మొదలఁ దేనియ లుట్టునంభోరుహాక్షు, ముద్దు పల్కులు శ్రుతిపుటంబుల భుజించి, పిదప భుజియింపఁ దొడఁగిరి త్రిదశవరులు, దైత్యులును దథ్యమిథ్యామధురసములు

హరి. ౬. ౧.౨౧ శైవ. ౩ ౧౧౫.

విణ. ౧. వెనుకటిగి, పిమ్మటిది, తర్వాతిది

ఆ. ఇవ్విధమునఁ గృష్ణుఁ డేనపిదపటి, కథ వినంగ నాకుఁ గౌతుకంబు ..

భార. ఉద్యో. ౩ ౪౧౨.

క. అట్టిరొంత మాద్రిపిదపటి, పట్టి...

భార. కర్ణ. ౨. ౩౪౭

క. మొదలిటిపత్రము లెల్లను, మదమున విలుచుటకు దానమున వాడికి నిం, పొదవఁ బ్రమాణము లైనను, బిదపటిపత్త్రంబుచెల్లుఁ బెనఁకువ లందున్ విజ్ఞా. వ్యవ. ౩౪.

౨. తక్కువ, నీచము

ద్వి. మద మతి వాలోద మాట లాడినను, పిదపగు నే భక్తి పెద్దతికంబు.

పండితా. పురా. ౧౦౧. పా.

జః పిక్కారు.

పిదపిద. వి. అనుకుగా నుండుటను సూచించు ననుకరణము.

గీ. అంతఁ జలచల పిదపిద మనుచు నవిచి, కలల మై విర్వు బాఱుచుఁ గరుడుగట్టి, తల దలిర్పఁగ గర్భమై తరతరంబు, చెల మసలెఁ జీరచిక్కి నస్నెలఁత కథప.

కృ. శకుం. ౨. ౧౪౪.

విశే. ౧. (దీనికిఁ గర్మధారయమునందు నిగాగమం బగును) అనుకు, పలుచనిది. (చూ. పిదపిదన.)

౨. మృదువు, మెత్తనిది.

ద్వి. చెదరక యదరక చిడిముడిపడక, బెదరక వదలక పిదపిద గాక, క్రొవ్వాడి మూపక క్రూరత లేక. పండితా దీక్షా. ౬౧ పా.

వ... అమృతవాహినీప్రవాహం బెడబెడఁ బొదవడినయెడలఁ బొదవడునిమము పిద పిదనిపద వెగని కూలుదరులును...
శ్రీరం. ౧. ౧౩౭

జః పిదపిదన.

పిదపిదన. వి (√పిదపిద) ౧. అనుకుఁదనము, పలుచఁదనము. ౨. మార్దవము. మెత్తన. (శ.ర) విశే. అనుకు, పలుచనిది.

సీ. కలికిచేష్టలు భావగర్భంబు లైనను బ్రియుని మీఁదనుగూర్మి బయలుపఱుపఁ, బిదపిద యై లజ్జ మదిఁ బదనిచ్చినఁ జెలిపోనఁ బులకలు చెక్కు లొత్త భాగ. ౧౦ ఉ ౩౩౧, ౮ ౪౯౩

వ... శీకరపరంపరలచొదుగులు మదుగులుగొనినఁ బిదపిద నగుచుఁ జిదుకుచిదుకు మనుచుండు లును... భాగ. ౧౦. పూ ౫౫౬.

పిదుకు=పితుకు. స. క్రి. (క పిదుక్కు) ౧. (పాలు) పిండు.

సీ. తనపేరఁ బృథివి నాఁ జనఁ జేసి గోరూప, ధారిణియై వ్యాసుమతి సమరగణముఁ, బనిచి రౌషధులను బహురత్నములఁ బిదికించి జగమ్ముఁ బోషించెఁ బృథుఁడు.
భార. ద్రో. ౨. ౨౧౧.

చ. పిదికినయాలపా ల్వ్యాధుయిచ్చ్యాము కావడి కుండ నించి యయ్యాదుపతికిం బ్రియం బుగ .. కుక. ౨. ౫౪౬.

౨. (పశువులు) పాలు ఇచ్చు

క... కొందవూల్, చన్నువిసి పాలు పిదుకుచు...
వి. పు. ౧౪౪.

సీ. పాదపంబులు పుష్పఫల సమృద్ధి వహించె, నఖిలధేనువులు చన్నువిసి పిదికె
ఖై భా. ౬. ౯.

సీ. అదనుతోఁ జేఁపి చన్నువిసి యోషధుల మున్మొదవు కొండల కల్లఁ బిదుక నెఱిఁగె.
మనుచ. ౨. ౧౧.

పిధానము. సం. వి అ. న. మఱుఁగు, తిరోధానము ౨ ఛాదనము, కప్పు, ముసుఁగు. ౩ ఒఱ ౪. మూఁత, మూఁకుడు.

పిధాయకము. సం. విశే (అ యిశా. అ) కప్పునది, మూయునది, మఱుఁగుపుచ్చునది.

పిన=పిన్న. (దీనికి వ్యస్తముగాఁ బ్రయోగము లేదు) విశే. చిన్న.

వ గయలోఁ గాశిఁ బ్రయాగ శ్రీగిరిని గంగా ద్వారనీలాచలో, జ్జయినీ ద్వారకలం..., దర్పణ, క్రియచే నావీనతమ్ముఁ డెల్లిన యొనర్చెం దండ్రి శ్రాద్ధమున్
ప్రభా. ౧. ౭.

(దీనియామ్రేడితరూపము. "పినపిన"=మిక్కిలి చిన్న.)

సీ మొనలు చూపెడిపినపిన మొలచునదోయి యలఁతిపయ్యంటకు నాసచేయ.
దశా ౯. ౨౧౦.

క. పినపిన మెఱుపులు పొటిపొటి, చినుకులు మసమసక లసఁగుచీకట్లుం డోఁగుచిన నౌకరి నౌకరు గానక, చని రాలోఁ బసియుఁ గన్న చాయల బఱచెఁ. వేం. పంచ. ౧. ౪౭౧.

జ: పినగుమ్మడు. పినతండ్రి, పినతల్లి, పిన వాఁడు, పినపిచ్చి.

పినగుమ్ముడు. వి. (√. పిన.) ఒకజాతిగుమ్మడు. ౯. (కొక్కు అని. శ. ర.)

పినతండ్రి. వి. (√ పిన) తండ్రితమ్ముఁడు.

సీ. పినతండ్రి యని తండ్రిఁ గనమి జయంతుండు వచ్చినఁ జెఱసాల వైచువారు.
దశా. 3. 52.

౨. తల్లిచెల్లెలిభర్త. (గ్రా)

పినతల్లి. వి. (√ పిన) తల్లిచెల్లెలు.

చ మనపినతల్లి పట్టి భరమానదభోజివరుండు దండకావనమున దూషణాద్యనుజవర్గముతో వసియింపఁ బోయెడిఁ, జను మతఁ డాద రించు నిను .. ఉ రా ౪ ౧౦౪.

౨. తండ్రితమ్ముని భార్య. (గ్రా)

పినద్ధము. సం విణ అ ౧ కట్టఁబడినది, బంధింపఁబడినది (వస్త్రము) ౨ తొడుగఁబడినది ధరింపఁబడినది. (కవచము)

పిననాఁడు=పిన్ననాఁడు. వి (√పిన) బాల్యదశ, చిన్నవాఁడు

చ. కనినది మాత్రమే యొకటి గాదు మమీ పిన నాఁటనుండియుఁ, జెనరు వహించి పెంచి మతి నేరిపి విద్యలు చెప్పి యెప్పుడుఁ, నిను పెడఁబాయ కున్నయది...
ముకుంద 3. 308

పినపిచ్చి. వి. (√పిన) వృక్షవిశేషము ఒకానొకచెట్టు.

వ మఱియుం బెదపిచ్చి పినపిచ్చి నల్లింద నల్లింద యిప్పు కప్పురమద్ది.
విశకుం. ౨. ౧౪.

పినాకపాణి. సం. వి. ఇ. పుం శివుఁడు.

పినాకము. సం. వి. అ. పుం. న. ౧. శివుని విల్లు. (శే. ని) ౨. మట్టివాన. 3. త్రిశూలము. (వై. ని.)

పినాకి. సం. వి. న్. పుం. శివుఁడు.

పినాకిని. సం. వి. ఈ. స్త్రీ. నదీ విశేషము, పెన్న నది. ౨. పినాకివిశేషము.

పినుఁగు=పిలుఁగు. విణ. (క. పినుగు) ౧. దుర్బలుఁడు, శక్తిహీనుఁడు.

ద్వి మునిశాపదగ్ధ లౌ పినుఁగులు నరియె.
బస. పు ౭. ౨౦౧ పా. ౬౩౯. పం.

గీ. పెనె యొకచోట నొకచోట పిఁగుఁజన్నుఁ, గవయు మాడుక చనుదెంచెఁ గాంత యొార్తు, పినుఁగు పెన్నదు మిట్టటు లేనఁకకుంద, రెండుదిక్కుల భర మాని యుండె ననఁగ.
సుద. ౫ ౧౩౦.

౨ అల్పుఁడు, నీచుఁడు.

సీ తన కమృతముఁ బోసి యనుప వంచు నదల్పఁ, బినుగురక్కసునకుఁ బ్రియము చెప్పి.
ప్రభా. ౧౪౯.

క. వనజాసనవనజోదర, సనకాదులు ముఖ్యబాహ్యసంత్యాగము నేఁ,పినవారు గారు తక్కటి,పినుఁగులు బాహ్యంబు విడిచి పెద్దయుఁ జెడరే
శివత త్త్వ. ౨౯౭.

3 అవివేకి, బుద్ధిహీనుఁడు.

క. అని పక్షిహితము చెప్పిన, విని కెంగలి యైన క్రోఁతి పీఁ దిరవున జాలున దాని నుండి న న్నొక, పినుఁగుం గాఁ దలఁచి కాద ప్రేలెఁ దొడంగెన్ శేయూర. 3. ౨౪౭.

౪. దుష్టుఁడు, క్రూరుఁడు.

క. పులుఁగులఁ బినుఁగులగిరాతుఁడు, వలఁ దవ్వులఁగఁ దిగిచి తగ్గి వగ్గెరవగ్గం, బలఘుతరకీలమున సం,వలనము గావింపు చుండె వలసినభంగిన్.
కేం. పం. చ. ౨. ౧౨.

౫ లోభి, పిసినిగొట్టు.

సీ. పినుఁ గీక పెనఁగినఁ బెద్ద నొంపక యిచ్చు, పాటించి చేఁ గలపాటి నాఁచి.
అము. ౬. ౪౭.

౬. భోయవాఁడు, బుద్ధిహీనుఁడు.

గీ. జిగురుఁగండెలు గాలఫుఁజివ్వ పెదుర, లాది యగుసాధనంబుల నలవరించుకొని పాటా పాటినడలతోఁ బినుఁగు లెల్లఁ, గదిసి నడ చిరి యమ్మహాకాంతునటుల.

కుశ ౧. ౧౬౫.

పిన్న=పిన. విణ. ౧ చిన్నది

క. ధవళాక్షి వయసునఁ బిన్నవు గాని వివేక గుణమునఁ మిక్కిలి పెద్దవు. .

కళా ౪ ౧౩౩.

సీ. వారి యాఁటేటిపిన్నలు తావి గ్రోలని,పువ్వు కోదండాస్త్రపుష్పకళిక. సుద. ౫. ౩౪

వ ..అనురూపలావణ్యరేఖాసంపన్నం బైన పిన్నవయసురాకొమరు నవలోకించు ..

సైప ౨ ౨౨.

౨. (విద్య మెం వానిచే) అల్పుఁడు, తక్కువ వాఁడు.

దండకము అప్పాపహోఁ దట్టిరాయంచవార్వం పుజో దైవ నోరార నగ్గింప లేరన్నచోఁ బిన్న లెల్లెన్నఁగాఁ జాలువా రెన్న

నీలా. ౨ ౪౧.

3 తేలికయైనది, చులకనిది (చూ పిన్నపని)

పిన్నది=చిన్నది, చిన్నవయసుది.

క. ఈపిన్నది సాకూఁతురు, తాపసజనముఖ్య మిమ్మఁ దాఁ గొలువంగా, నోపుదు నని పూనె... భార అర ౭ ౩౧౭

ఉ. ఎన్నిమఁ గూర్తు నన్న విను మే మును దాల్చినమాల్య మిచ్చున,ప్పిన్నది రంగమం దయిన పెండిలి సెప్పుము...

ఆము ౧. ౧౪.

పిన్నవాఁడు=చిన్నవాఁడు.

ఆ. సాదువల్ల భుండు నటుఁ డింత నిక్కంబు, పెద్దవారియట్ల పిన్నవారు.

భాగ. విరా. ౨. ౧౫౨.

పిన్నప్పుడు=చిన్నప్పుడు.

ఉ. కప్పురగంధి యాధరణికాంతతనూజ నృపాల చంద్ర పిన్నప్పటినుండియున్ జెలువ మందినచందము లెన్న శక్యమే.

ఇందు ౨. ౧౩౩.

పిన్నాతఁడు=చిన్నవాఁడు.

క. ఉన్నఁ గని యప్పుడఁతి రోఁ,యన్న విడువు భుజగనాథు ననవుడు నతఁడీ,పిన్నాతని ప్రాణంబులు, గొన్నది యిది దీనియనుజు గొనిరొమ్మ ననిరొమ్మ్. భార. అను ౧ ౪.

గీ అతినిదర్శనమున విలయార్ణవమున, మడివడిత సంచరించు నానుద్ధు లేల, జాఁటిపిన్నాతఁ డీయదునందనుండు, నరవి మిమ్మఁ గూడి తిరిగి యీచంద మరుర్యె

జై భా. ౭. ౧౪౩

జ' పిన్నఁజేయు, పిన్నకక్కుర, పిన్నగోరఁట, పిన్నగ్రద్ద, పిన్నజమ్మి, పిన్నతనము, పిన్న తుమికి, పిన్నదూలగోవెల, పిన్ననవ్వు, పిన్నవాఁడు, పిన్ననుడురు, పిన్నపేరడు, పిన్నపని, పిన్నపాఁపర, పిన్నపాప, పిన్న పాపఁడు, పిన్నపాల, పిన్నబిడ్డాటలు, పిన్నమ, పిన్నములక, పిన్నముల్లంగి, పిన్న యిప్ప, పిన్నతీకము పిన్నవరగోఁగు

పిన్నండు. వి (త పిన్నంతండు) భూసావిశేషము

వ ..శ్రీ భీమేశ్వరశ్రీమన్మహాదేవరకు ... సమ ర్పించిన వివరము, పహిండిపిన్నండున్ను .. ఆ చంద్రార్కస్థాయిగాను సమర్పణచేశెను.

ద శా ౪ ౧౩౪౪.

పిన్నఁజేయు. సం క్రి (పిన్నన్+చేయు) లాఘవ పఱుచు, చిన్నఁబుచ్చు, అవమానపఱుచు.

ఉ. బల్లిదు నన్ను భీష్మజనపాలకుమారకుఁ బిన్నఁజేసి సాచెల్లెలి రుక్మిణిం గొనుచుఁ జిక్కనినిక్కపుబంటువోలె నీగొల్లఁడు పోరాడిన్... భాగ. ౧౦. పూ. ౧. ౧౬౨.

పిన్నకక్కెర. వి. (√పిన్న) పక్షివిశేషము, కక్కెర. (శ. ర.)

పిన్నగోరంట. వి. (√పెన్న) ఒకజాతి గోరంట, సహా. ౹. (శ. ర., బ్రౌ.)

పిన్నగ్రద్ద. వి (√పిన్న) చిందు, పక్షివిశేషము. (శ. ర.)

పిన్నజమ్మి. వి. (√పిన్న) శేలజమ్మి, శమీరము. ౹. (శ ర.)

పిన్నతనము. వి. (√పిన్న) ౧ బాల్యము, పసితనము.

ఉ. పిన్నతనావ నుండియు విభీషణుఁ డెంత పరోపకారియో. ఉ. రా. ౨ ౧౫౦.

౨. హైన్యము, కొఱఁత, న్యూనత.

ఉ. ఎన్నఁడుఁ గానుపీస పెంక టిచ్చినవాఁడవు గావు నీట నీ,వన్నియుఁగోడెకాండ్రు తగ వారవధూటులకై రొయుసంగుచా, చిన్నెలు నీవు చూచియు విసీ తలవంపఁగ నేర వన్నిటం, బిన్నతనంబుఁ దాల్చితివి పెద్దగ నిన్నిఁక నాద నేటికిఁ విప్ర ౪ ౨౪.

3 లఘుప్రవర్తనము, తప్పుపని, నీచకృత్యము.

ఉ తన్నిన వాఁడు తచ్చరణతామరసంబుల ప్రాలి నన్ను నే, మన్నదిలేదు నావలన నన్నియు నేరము లోర్చుకొమ్ము నాపిన్నతనం బొకొల్ల చెవిఁ బెట్టుకు పెట్టిన సిగ్గు వోవు నా,యన్నియ నన్న యా నగరివారికి దండుగఁ బెట్ట ని మ్మగుచు. పం. పంచ. ౪ ౫౧౧

ఉ...ధనకాంక్షఁగాద యా, పిన్నతనంబు చేసి తిది పెద్దలు మెత్తురె రాజధర్మమే. భోజరా. ౨. ౧౭౭.

పిన్నతుమికి. వి. (√ పిన్న) కాకితుమికి. ౹. (శ. ర.)

పిన్నదూలగొండెల. వి. (√ పిన్న) దూలగొండెల కండూర. ౹. (శ. ర.)

పిన్న(ట,టి.)నవ్వు. వి. (పిన్న + నవ్వు.) మందహాసము, చిఱునవ్వు

చ కనుఁగవఁ బిన్ననవ్వు దొలఁక న్మనిసాథుని కన్నుసన్న... పారి. ౧ ౫౫.

ఉ. సన్నలువాఱఁ బల్కుచుఁ గుచంబులు నూపుచుఁ గ్రొల్లగించి క్రేఁ,గన్నులఁ దూఱఁ జూచుచు మొగంబునకు న్మురిపంబు దెచ్చుచుం, బిన్నట నవ్వునవ్వుడుచుఁ బొన్నతి నేణులు సప్పరించుచుం, జె న్నొందవించుచుం జఱచి చెయ్యులు దాల్చిరి జారకామినుల్ కు. సం. ౭. ౧౦౧.

మ. కురుముఖ్యుండును దోడిపైనికులఁ బెక్కుల్ దూపు లొక్కుమ్మడిం గురియం బిన్నటి నవ్వుతో నతఁడు తత్కోదండనూతాశ్వకే, తురథంబుల్ వికలత్వముం బొరయఁగా దోర్దర్పదుర్దాంతుఁ డై, పెరవుం జేవయు లావునుం దలిపె నుర్వీనాథ యానేనకుచ్. భార. ద్రో. ౪, ౩౨.

పిన్న(ట, టి.)నాఁడు. వి (పిన్న + నాఁడు) చిన్నతనము, బాల్యము.

గీ సకలదేశభాషావిశేషములయందు, పరుసఁ బ్రఖ్యాత మనఁగ సుతాప్రద్య మనఁగ, మిశ్రమన నొప్పుసత్కథామేళనంబు, లెన్నియన్నియు విన్నాఁడ బిన్ననాఁడ. విక్ర. ౧. ౨౪.

ఉ. మాపొరుగింటికూఁతురునికుమారికి పిన్నటనాఁటనుండియు, స్నాపయుఁ బ్రేమఁ గన్నది... శుక. ౨. ౫౫౪.

ఉ. పిన్నటనాఁటనుండి ననుఁ బెద్దగఁ జూచిన వంశవృద్ధులన్. జై భా. ౧ ౫౯.

ఉ. పిన్నటినాఁటనుండి రిపుభీకరుఁ డై శుభలక్షణాఢ్యుఁడై... ఇందు. ౧. ౧౧౯.

పిన్ననుదురు. వి (√ పిన్న) ఏనుఁగుకొనటి బుడిపి, వాతకుంభము. (శ. ర.)

పిన్న నేరేడు. వి. (√ పిన్న) కాకినేరేడు, కాక జంబువు. శ. (శ. ర.)

పిన్నపని. వి. (పిన్న + పని) ౧. తేలికపని, చులకనైనపని.

గీ. అక్కటా యుష్ట్ర దోఁచిన దొక్కమాట, యంగహీనుండు గాన వాఁ డంత కోర్చెఁ, గుహుమతోమలి యిది యోర్చుకొనుట యెట్లు పిన్నపని గాదు పైచింత చెన్నవలయు.
చంద్రా. ౪. ౧౭౨.

౨. అగౌరవపుఁబని, లఘుచేష్ట

సీ. ఈపిన్నపనులకు నెట్లు వచ్చితివని బోధించి చెప్పినఁ బోవపై తి...

గీ. అకట కామాతురత్వ మి ట్లడఁచె నిన్ను.
సురాభాం. ౧౩౮.

పిన్నపాఁవర. వి. (√ పిన్న) ఒకజాతిపాఁపర, గోరుంబ శ.
(వారుణి అవి. ఆం భా., ౖశా)

గీ. వారుణి దవర్చుఁ బిన్నపాఁప రన...
ఆం భా. ౨ ౪౧.

పిన్నపాప. వి. (పిన్న + పాప) బాలిక; బాలకుఁడు.

క. మాఁపన్నపాప లిచటికి, శ్రీ పార్వతి నోము వచ్చి వెచ్చెర నోకమ్మ ర్వ్యాపారివడుగుఁ బొడఁగని, రాపొడువఁడు వారిఁ జూచి యదయాత్ముఁడై పద్మ. ౩. ౧౯౮.

సీ. పిన్నపాఁపవు నీవు పితృపరాధీనవు ..
నైష. ౨. ౨౨.

(శ్రీ మహావిష్ణువర్ణనము.) సీ ... పెనునీటఁ దేలాడు పిన్నపాప. ఉ. రా. ౧ ౭౦.

పిన్నపాపఁడు. వి. (పిన్న + పాపఁడు.) బాలకుఁడు.

చ. ఉరువ్యథాధరా, ఖ్యత మొకవృద్ధవిప్రమిథునంబు మృతుం డగుపిన్నపాపనిన్, బిత మతికొంచువచ్చి రఘువీరునివాకిట వైచి దీనతన్.
ఉ. రా. ౪. ౧౮౧.

ద్వి. మీ కృపాసాద మిమ్మెయి దేరవతొక్కపనిఁ బూని యొకపిన్నపాపనిచేత, వనిపినం జాలదే... ద్వి పరమ ౧. ౭౨౪. బొ.

పిన్నపాల. వి. (√పిన్న)మనుపాల, జీవంతి. శ.

గీ పరగఁ మనుపాల యనఁ బిన్నపాల యం చ, టన్న జీవంతిక. . ఆం భా ౨. ౭౧.

పిన్నబిడ్డాటలు. వి బ. (√పిన్న) బాలక్రీడలు.

ఉ పోటిగృహస్థు బ్రహ్మ యని మిక్కిలి నమ్మితిమమ్మ చూడ నేపాటియు లేదు మాకుఁ బరిపాలకుఁ డైవసరోజనేత్రుడు ని, చ్చోటఁ వసింపనీక యొకచోటికిఁ బో విధియించి పిన్నబిడ్డాటలు చేసె నీడుడుకు లక్కట భారతికైనఁ జెప్పరే. భాగ. ౧౦. పూ. ౧౨౧౨.

పిన్నమ (మ్మ). వి. (పిన్న + అమ్మ) ౧ పిన తల్లి, తల్లిచెల్లెలు, మాతృష్వస

ఉ ... ఈ,పుత్త్రడిబొమ్మకన్నుఁగవ పోలిక వాలిక గండువిాల కీ, చిత్తరిముద్దుసొమ్ముగను పిన్నమ పున్నమచందమామకున్. విజ. వి. ౨. ౧౦౮. (ఇటనొపమ్యద్యోతకము.)

౨. తండ్రి తమ్ముని భార్య. (శా)

పిన్నములక. వి. (√పిన్న) నేలములక, కంటకారిక. శ. (శ. ర.)

పిన్నముల్లంగి. వి. (√ పిన్న) క్షుద్రమూలకము. శ. (శ ర)

పిన్నయిప్ప. వి. (√పిన్న) మధూలిక. శ. (శ. ర.)

పిన్నతనము. వి. (√పిన్న)పిన్నతనము, బాల్యము.

గీ. బాల్య మగుఁ జిన్నతికి మనఁ బడుచుఁ
దనము నాఁగ ఁబిన్నతికం బన...
ఆం. భా ౨ ౧౧౪.

పిన్నలి. వి ౧. ఆభరణవిశేషము

వ...శ్రీకాళాలనిశ్రీవల్లభరాయనికి సమర్పించిన వస్తువులు...రు ౧౦ా తోను సన్నంపూస పేఱు ౧ ఘంటలు 3 తోను పిన్నలి ౧ ఒత్తులు ౨. పద్మకడుకులు ౨ ముత్యాల తిరుణామ ౧ . ద శా. ౪ ౯౩౪.

౨. పిరి, మెలి.

ద్వి. మున్నుగా మెల నున్నముమ్మాలకావి, పిన్నలి వడి మెడం బెనచి అగిల్చి...
ద్వి. పరమ ౪ 3౨౧ పా ౧౪ పం

ద్వి...నంబులు నచటిస్థానంబులవారుఁ బంచిన ఛీతిఁ జేపట్టి గొబ్బునను, బిన్నలి దప్పించి పెనఁకువఁ గేల, నున్నట్టికైదువు నాడిసి కైకొనుచు
ద్వి పరమ ౪ 3౨౧ పా ౧౯ పం

పిన్నవరగోఁగు. వి. (√ పిన్న ) కమలవల్లభ ‡ (శ. ౧ )

పిన్ని. వి (త పిణ్ణి) ౧. పసతల్లి, తల్లిచెల్లెలు ౨ పినతండ్రిభార్య (వా)

పిపతిమత్తు. సం వి. ల్ పుం పక్షి. (మే ని)

పిపతిషువు. సం. విణ (ఉ) పడుటకునిచ్ఛకలది ౨. ఉ. పుం. పక్షి.

పిపతిష. సం వి. ఆ. స్త్రీ పఠించునిచ్ఛ

పిపతిషితము. సం. విణ (అ. ఆ. అ.) పఠింప నిచ్ఛగింపఁబడినది.

పిపతిషువు. సం. విణ. (ఉ) పఠింపనిచ్ఛగించు వాఁడు.

పిపాస. సం. వి. ఆ స్త్రీ నీరుత్రావనిచ్ఛ, నీరు వట్టు, దప్పి.

పిపాసి. సం విణ (న్. నీ న్)=పిపాసువు.

పిపాసితుఁడు. సం విణ (అ. ఆ. అ.)=పిపాసువు.

పిపాసువు. సం విణ (ఉ) నీరుత్రావనిచ్ఛగొన్న వాఁడు, దప్పిగొన్నవాఁడు

పిపీతకీ. సం వి ఈ. స్త్రీ వైశాఖశుద్ధద్వాదశి (వాచ)

పిపీతకుఁడు. సం వి. అ పుం. బ్రాహ్మణభేదము (వాచ)

పిపీలకము. సం వి. అ పుం చీమ

పిపీలము. సం వి అ. పుం చీమ

పిపిలి. సం వి ఈ స్త్రీ=పిపీలిక.

పిపీలిక. సం వి ఆ స్త్రీ ఆఁడుచీమ

పిపీలికము సం వి అ పుం ౧ చీమ. ౨. చీమ లచే కూర్పఁబడినఒకదినుసుబంగారు (విల్యమ్సు)

పిపీలికామధ్యము. సం. వి. అ న. చాంద్రాయణభేదము

పిప్పట. సం వి ఆ స్త్రీ=పిప్యట. గుడశర్కర, పటికబెల్లము (త్రి ని)

పిప్పలకము. సం వి అ న ౧. స్తనవృంతము, చనుమొన, ౨ సీవనసూత్రము, కుట్టునూలు.

పుం. ౧. గుండుసూది, ౨ బండి, శకటము. (విల్యమ్సు)

పిప్పలము. సం వి. అ. పుం. ౧. రావి. ‡ ౨. బంధనములేనిపక్షి; శాకు (శ. ౪) 3. చొక్కాలోనగువాని మీఁజేయి.

న ౧. చూచుకము, చనుమొన, (వై. ని) ౨. జలము, 3 వస్త్రఖండ భేదము. ౪. ఫలము, పండు. (వై. ని.)

పిప్పలాదుఁడు. సం. వి. అ. పుం. ఒకఋషి.

పిప్పలాశనము. సం. వి అ పుం. ఏనుఁగు, గజము

పిప్పలి. సం వి ఇ పుం రావి. 

ఇ ఈ. స్త్రీ ౧ పిప్పలి, కణ. ౨ గజకర్ణమూలము. (వై ని)

పిప్పలీమూలము. సం. వి. అ. న గ్రంథికము, పిప్పలికట్టె.

పిప్పి=పిప్పిరి. వి. (క హిప్పె త. తిప్పి) రసము పిండివేయఁగా మిగిలిన చెఱకు, ఆకు, మొదలగునది

గీ. చెఱకు విడిచిరసమున కెఱఁగి రాక, పిప్పి కరిగడు నీఁగలపెల్లుపోక
కు సం ౧ ౩౦.

సీ పిసరు పిప్పి యున నిప్పిప్పటుమం బగు...
ఆం భా ౨. ౨౩౯

సీ పద్యాన్వభిజ్ఞతాభంగిఁ బంగువుఁ బోలు భిన్నమాధుర్యుఁడై పిప్పిఁ బోలు,...గీ సుకవి వాసర ధవ దివాంధ కవి కుకవి.
బహు ౧. ౧౦

పిప్పిక. సం వి. అ స్త్రీ. ౧ ఆఁడుకాటుకపిట్ట, (వై. ని) ౨ పళ్లపాఁచి, దంతిమలము.

పిప్పిరి=పిప్పి. వి సారము తీసివేయఁగా మిగిలిన చెఱకు, ఆకుమొదలగునది.

ఉ...విరోధిసేనలం, బిప్పిరి సేసెదన్ సెలవు పెట్టుము నీవు గదంగు మాజికిన్
జై. భా ౫. ౧౫౪

పిప్పీకము. సం. వి. అ పుం పక్షివిశేషము, (ఇది ప్రయాణమగువానికి దక్షిణదిక్కుగా నుండిన రెండల శుభసూచకము, బృహత్సంహిత.)

పిప్యట. సం. వి. అ. స్త్రీ—పిప్పుట.

పిప్లువు. సం వి ఉ. పుం పుట్టుమచ్చ, జటులము.

పిమ్మట[1]. వి. జౌ ఏ (క పికటు. మ పిన్. త పిన్ను) ౧ వెనుక, అనంతరము, (చూ. పిమ్మటిప్రేలు )

౨ మునుపు, పూర్వకాలము

శా ఈవారం బొకమాటు పిమ్మటికి నే సాచ్చోటనో కన్నయ, ట్లూహాం బయ్యెడి...
వసు ౪ ౯౪.

—పిమ్మటిప్రేలు. (పిమ్మట+ప్రేలు) వి బొటనప్రేలి తరువాతిప్రేలు, తర్జని, చూపుడు ప్రేలు

చ నడుఁకక బాల్యచాపలమున స్తనపిమ్మటిప్రేలఁజొక్కపుస్, గడియపుట ట్టటంచుఁ ద్రిజగజ్జను లచ్చెరువంది చూడ నక్కడపటికొండ పొంపు లెఱుగం దవిలించి నటించు శూలిపె, న్గొడుకు . వేం. పంచ. ౧. ౪.

అవ్య. ద్రు ౧ అనంతరము, పిదప

మ...అయ్యరవిందాక్షికిఁ బక్షిపుంగవగతిస్థాయం గీవంబు నిర్గ్రహంబు నొనర్చి మున్న రుచిసౌరభ్యంబులం బిమ్మటన్, మఱియం ద్రోయుచు నించె సెమ్మనమునన్ మూర్ఛాసముచ్ఛ్రియముల్
వైష ౨. ౯౯.

తే తండ్రిపిమ్మట నిది యేము తగినభంగిఁ, బంచుకొనసేరి కిష్టోయిఁ బ్రతిదినంబుఁ, బోరు చున్నారము...విక్రి ౨ ౮ ఆము. ౩.౪౫

౨. పరోక్షమందు, చాటున.

సీ. తులువ పిమ్మట నిన్ను దూషించుపలుకులు కులజాలు నిజముగాఁ గొనుట...
భార. అను. ౪. ౩౭౪.

శ్లో. పరోక్షవాదిభి ర్మిత్యా దోష స్తే సంప్రదర్శితః పం. భార. అను. ౧౭౪ ౧౩. ౨౦

సీ. ఎదుటఁ బిమ్మటనైన చెప్ప దేనియు భక్తి సేయనో న న్నింతసేయ నేల.
చంద్ర. ౧. ౧౫౭.

పిమ్మట[2]. వి. ౧. బాధ, దుఃఖము

క ఆరీతి నంతిపురమున, నారీతిలకము సఖీ జనంబులు గొలువం, జేరిచపిమ్మట మదిలోఁ, గూరిన పిమ్మట విరాళిఁగొని నరుఁ డుండెన్. (విజ వి ౩ ౩ మనోవ్యథ అని శ ర)

క. అలజడి సెంజలి పిమ్మట పిలు గుత్తలపాటు కుంది నా నమరు దుఃఖాఖ్యల్
ఆం శే. ౧౦

౨ భయము.

చ పిడుగులు బిట్టు ప్రేలిపడఁ బిమ్మటఁ బొంగి సమస్తజీవులున్, వడఁకఁగ ..
పద్మ ౯. ౨౩౧

—పిమ్మటగొను అ క్రి (పిమ్మట[2]+కొను) బాధపడు

క ఈరీతి నుండువాతని, గారాబుఁటూరి తలిరుకైదువులదుస్సే, దారికటూరి సులక్షణ, పేరింటి వధూటి శేమిఁ బిమ్మట గొనుమన్
శుక ౨ ౩౨౪

వ...తొర దిగ నిమ్ముశేక పిమ్మటఁ గొని నలుదెసలం జూడ... ఆము. ౪ ౩౫.

పియ్యి=పీయి. వి విష్ఠ, మలము

వ. .యీపుణ్యాలకు యవండు ఆవించి కీడాడిన కూడుకి పియ్యి తిన్నవాండె .
సె శా. ౩ ౧౩౯౩. పా.

పిర. వి రూపాయలో రెండువందలయేఁబదియాఱవ వంతు, కానిలో నాల్గవభాగము.
(శ. ర బ్రా.)

పిరంగి (గీ). వి (హిం ఫిరంగి. మ పీరంగి, క. పిరంగి) లోపల మందును గుండును వేసి దట్టించి కాల్చెడిపెద్దలోహపుఁగ్రోవి.

ఉ...అచ్చమూపాళి గలంగ...రాలఁ దుపాకు లం బిలుఫిరంగుల ఖంగము నొందఁజేసి...
కృష్ణ. రా. ౩. ౬౧.

గీ ద్రుమము వహి నున్నచోటఁ బాఁదుకొని యుండి, తురకకైవడి నల్లమందుబొడి మెక్కి, రాజవిధమున నరిపురిరాజి పేది, వలులు నోదకాను పరంగి వగపిరంగి.
ప్రబంధ. ౬. శుక. ౧. ౧౩౩.

కా కీలాఖీలము లిప్పరానులపిరంగి లగ్నిమూర్తుల్, రంగా. ౨ ౩౭, ౩. ౬౨.

౨ ఖడ్గము, పెద్దకత్తి

సీ వాలు ఖండా కరవాలు మేల్కత్తి తరవళి నరాజి పిరంగి యడిద, మనఖడ్గనామ మై యలరుచు నుండును...ఆం. భా. ౨. ౨౧౪.

పిరము. విణ (సం ప్రియమ్ క. పిరియ) ౧. ప్రియము, ఇష్టము.

గీ. ఒకగొడుగునీడ నీవు కీడుడుగ నడుపు, గుడుగు కొందకు లోనైనపుడమిఁ గలుగు, పజలకెల్లను బిరమైనపగిదిఁ బొలుచు,విందుఁ గావించెదను వేట వెడలుసామి.
చంద్రా ౨. ౬౬.

౨ హెచ్చువెలగలది (వ్యవ.) ఈనడుమ బెల్లులు చాలపిరమైనది

జ పిరపడు

పిరపడు. అ క్రి (పిరము+పడు) ఇష్టపడు, ప్రియపడు

గీ .తాఁచురారూపుచట్టు చేస్తంపు జెయ్యి, యయినరాసనక్కరవతి యడె పిరపడి, నూనె ప్రబం. ౧౯౪.

పిరి=పురి. వి మెలి

సీ తనరు సూత్రము నూలు దార మనఁగఁ, బురి పిరి యనఁగఁ దక్కరణవేష్టన మొప్పు...
ఆం భా. ౨. ౨౯౫.

మ. అసమబ్రహ్మకరోగ్రకాగ్రసనలీలాకారఁ దగ్గంధవా,హానుతుం దగ్గతి నున్న ఘోరభవ పాశాయాసవిధ్వంసనవ్యసనుం డిప్పిరిత్రాళ్ల

నిల్వఁ దనిపోక మ్మేఘు వాడుండు పాళసమూ శేశితుఁ జేసెఁ... సమీర 3. ౧౧౧

(ప్రథమ పాదమున యతిచింత్యము)

౨. వెంటి, గడ్డిపిరి.

క. పాల మిల్లు తోఁట గ్రామము, కలమ పనులు మేయుకొను కాల్చిన నృపకాం, తిలతో సంగము చేసినఁ గలయం బిరి సుట్టి వానిఁ గాల్వఁగ వలయున్

విజ్ఞా. ప్రా ౧౦౪

3 గోనెలంమున్నగునవి కట్టెడుత్రాడు (శ ర)

పిరివెంటి=మెలిపెట్టిపేనిన గడ్డిత్రాడు

ద్వి కసవుఁ బిరివెంట్లు గాఁ దాల్చి చేత, నస లాఁగ గవగివియలభాతిఁ బట్టి

బస. పు. 3 ౫౭౯ పం

జూ: పిరిగొను, పిరిచుట్టు.

**పిరిగొను.** అ క్రి (౧ పిరి+కొను) ౧ మెలిగొను, పెనఁగొను, చిక్కుపడు

చ. సారము గాఁగి బావములు జానఁ దెనుంగున నింపు పెంపుతోఁ, బిగొన ఆర్యులకుఁ గ్గ్న నపాయ-శీలఁ గ్రాలఁగాన్ కు సం ౧ ౩౫

తే విటుఁ డడలును గినుకయుఁ బిగొనంగ, ముక్కె వాకని వాతంను మూర్ఛవోవ

భారి ద్రో ౫. ౧౭౪.

చ కరఁగినపూఁత చేఁ గనకకందుక కాంతి వెలుంగు చన్నులం, బిరిగొనుకొ్డ ముత్తియపుఁ బేరులు వాయఁగ... ఉ హరి ౫ ౭౮.

౨ సాంద్రమగు, దట్టమగు, అతిశయించు

తే ఇవ్విధంబునఁ బలికినయింతిపలుకు, గాన నేరక తమ యప్పకదకు మగుడ, నరిగె నవ్వగ మనమునఁ బిరిగొనంగఁ, జిన్నఁబోయిన మొగముతో సింహబలుఁడు.

భార విరా. ౨. ౫౯.

చ. అంత సకామనుఁ డైనకర్దముం, దరయ విమోహి యై మనమునందలి ముందటవచ్చు కోరికల్, పిరిగొనుచుండఁ దత్క్షణమ బిందు సరంబున కేఁగి... భాగ. 3 ౪౭౧

క పిరిగొను తొలకరి మొగుళుల, భరితాంధం కరిణమునకు బాసటయయ్యెక్, బురివిచ్చి యాడు నెమళుల, నిరస్తతాపింఛ పింఛ నిర్మల దీప్తుల్ ౪విక ౭ ౨౧

3 గుంపుగూడు, సంక్షీభవించు

క నందయశోదలు గోపక, బృందంబులు గోపికలును బిరిగొని పగమూ, నందంబునఁ జను దెంచిరి భాగ ౧౦. ఉ ౧౦౫౯

**పిరిచుట్టు.** వి (పిరి+చుట్టు) (స్త్రీ పురుషులు కట్టుకొను) నడికట్టు

తే దర్భ ప్రేలియుంగగము మేఖావిభొట్టు, మడుఁగు పిరిఁదికిఁ బిరిచుట్టు బెడఁగు గాఁగ, వడుగుచందంబు దన కెడమడుగు గాక కొమరు గాఁ నేఁగి నెలకజ్జిగుజ్జువేల్పు

హరి ఉ ౧౦ ౨౪3.

చ పయఁట బిగించి నెన్నడుముపైఁ బిరిచుట్టుగఁ జుట్టి కుంతలోఁ, చ్చయము దృఢంబుగా ముడిచి ..వెల్వడియె శక్తినివాసము.

కళా. ౭ ౭౦

**పిరుపీ(ర్వీ)ఁకు.** వి (పీఁకు+పీఁకు) ౧ పీఁకులాట, పెనఁగులాట

క తరుణీ యేరికిఁ జెల్లునె, యరయఁగనే మింత వార మనుకొన నిదిగో, పిరుపీఁకుగ నున్నది తాఁ, గిర మద్భుత మైన సవతికయ్యము చేతన్. కళా. ౧ ౪౨.

౨. బాధ, కష్టము

క. ఈరాత్రి యకారణముం, చేరలుకఁ దదాత్మ కాదని పిరుపీ కగుచో, న్పారయు భాగ్య విహీనులు, శే కెవ్వరు వనని యుండలిన్ వనుఁ బోలన్. ప్రభా. ౫. ౧౫౫.

శా...స, త్ప్రతిప్రత్యగుణాభిరామ యశశ్శాఖా మాలలామంబు సం,ప్రీతిం జేయునసహ్య దర్పవములన్ బిర్వీఁకులం బెట్టుదు,ర్జాతున్ వీతదయానయుం దదుచితాచారంబులన్నిచ్చ లున్ పాండు ౪ ౧౪౬.

పిరుపీఁకులాడు. అ. క్రి (పిరుపీఁకులు + ఆడు) పెనఁగులాడు

గీ ఒండొంటితోఁ బిరుపీఁకులాడు శ్వాపదం బులు ఆము ౬ ౧౩ (శర, పా)

(పొరిఁపీకులాడు చూడుము)

పిరుపీఁకులువెట్టు. స క్రి (√పిరుపీఁకు) బాధ పెట్టు, కష్టపెట్టు

ఉ అమణిచిత్రిణీసుదతి యన్యజనోత్కట సంగ మంబుపైఁ, బ్రేమ జనించి యాత్మ పిరు పీఁకులువెట్టఁగ . హంస ౫ ౨౦౭

పిరుపీఁకు(లు)సేయు. స క్రి (పిరుపీఁకు + చేయు) ౧ పెనఁగిలాఁగు, పట్టిలాఁగు

క. కని చుట్టువారుకొని యిట్టునటుం బిరుపీఁకు సేయుచు వృథాత్వరకుం, బని యేమి నిలుపుఁ దని యొయ్యన వారలపట్టు పదిల మగు టరసి మదిన్. పగమ ౫ ౫౪

ఉ. బింబఫలోష్ఠికన్నులను చేడిసమీ లిరు దిక్కులన్ సమానంబుగఁ బర్వుచున్న శ్రుతినామ సరోయుగశోభ లిట్టునట్టుం బిరుపీఁకుసేయఁగఁ గడున్ నమి యెందుకుఁ గాక రెంటిమధ్యంబునఁ బొరడింబరువు లారయఁ జాపల మట్టిదే కదా ప్రభా ౨. ౪౧

ఉ. కేలగలించి పట్టి రతికిం బిరుపీఁకులుసేయు వల్లభుల. వేం పంచ ౪ ౩౫౦

౨. బాధించు, పీడించు

తే. తగిలి పిరుపీఁకుసేయు నుద్దండవృత్తిఁ జెలఁగు టయొ కాని మనమువచ్చిన మిటారిఁ, గూడి తమి మీఱ సయ్యాట లాడికొనుచు, నడుమఁ గూడునె మేదినీనాయకులకు

కువల. ౪ ౯౩.

చ...అ,వ్వనరుహనేత్ర కన్నుఁగవ వాలిక రెప్పలఁ గప్పి పెద్దయుం, బెనఁగొన మన్మథుండు పిరుపీఁకులుసేయఁగఁ దత్తరించు చున్ వి పు ౬ ౨౩ వేం పంచ ౩ ౧౨౪.

పిఱికి. విణ (సం భీరుకః) భయశీలుఁడు పంద

క విఱిగినచో నిలువక వెఱుమఱికెం దశరథము మీఁది కోడితి పోపో, పిఱికి యని పలికి నురుముగ, నతికెం దత్సేనఁ బార్థనందనుఁడు వడిన్. భార ద్రో ౧ ౧౩౪.

చ పిఱికివి గాక నీవు నొక పెగ్గడవే, సభలుందు భంగి ము న్నెఱుఁగనివాఁడ వైఁబ్రమని ఉ హరి ౪. ౧౯౯.

చ పెఱుకులు కాని బానుజవిభీషణు లుండఁగ నీకు నర్హమే దై భా ౬. ౬౯. ఆం. భా. ౨ ౨౨౧

జ. పిఱికికండ, పిఱికితనము, పిఱికిపంద, పిఱికి మెకము, పిఱికివాఁడు

పిఱికికండ. వి (పిఱికి + కండ) అధైర్యము, భీరుత్వము

తే. పిఱికికండ యొకింత లేకతమి చేర్కఁ, జొచ్చుఁబలుకఁ బోవుచికచరాజీవనేత్ర, కళ్య మేధంబు ఫలము తథ్యంబు గలుగుఁ, బదము పదమున కిది వేదభాషితంబు

కాశీ ౨. ౯౬.

ఆ. తమకుఁ దామె ప్రల్లదంబునఁ బని లేని, కయ్యమునకుఁ బనరు గాని తగిన, దురము లైనఁ దివురుదురు తమయంతన, పిఱికికండ లేని బిరుదుమగలు. ప్రభా ౨. ౬౦.

పిఱికితనము. వి. (పిఱికి√తనము) భీరుత్వము.

క. వెఱ పెట్టెదిరారా రున్నదు, వెఱుఁగని
నీయట్టివాని కెవ్వ రోకో యీ, పిఱికితన
మింత యలవడఁ, గఱపిన వా రనుచు కారి
కలకల నవ్వెన్ భార ఉద్యో ౩ ౫౩

సీ. పిఱికితనంబున గుఱి దప్పి చనుటయు వెఱ
పున మఱపున గొఱకొఱయును
అచ్చరా కాల ౪౫

**పిఱికిపంద.** విణ = పిఱికివాఁడు (√పిఱికి)
వ్యవ (వాఁడు వట్టిపిఱికిపంద)

**పిఱికిమెకము.** వి (√పిఱికి) జింక, హరిణము
(చి. ని ౪. ౭)

**పిఱికివాఁడు.** విణ (పిఱికి + వాఁడు) భీరుఁడు,
భయశీలుఁడు

పీ. బిరుదులమైనను బిఱికివాండ్రమునైనఁ జంపు
చోఁ గడపఁడుజముఁడు
భాగ త్రి ౧ ౫౫

**పిఱు.** వి (√పిఱుఁదు త పుఱ) వృత్తియం
దును కొన్ని క్రియలనుప్రయుక్తములగునపుడును
'పిఱుఁదు' శబ్దమునకు అంత్యవర్ణములోపింపఁగా
మిగులు రూపము
ఉదా. పిఱుదెస, పిఱుతివియు, వెం

**పిఱుఁదిచ్చు.** అ క్రి (పిఱుదు + ఇచ్చు) వెన్ని
చ్చు, వెనుకకు మగులు
గీ. ప్రధనభూములఁ బిఱుఁదీక పగఱనోడిచి, జయ
ముఁ జేకొన్న సత్కీర్తి జగమెఱుంగు.
రంగా ౫ ౧౭౭

**పిఱుఁదు.** వి ఔ. (క పిఱె) నితంబము, స్త్రీల
కటి ప్రదేశమునకు వెనుకటి భాగము; వెనుకటి
భాగము.
గీ. పడఁతి సంభ్రమించుచు నిట్లు పనులు సేయఁ,
బిఱుఁదు పాలిండ్లుఁ గొప్పుఁ గంపించు
చొప్పు, గనుఁగొనుచు కళా ౪. ౯౩.

గీ. గిఱుకుటందెలు ఘల్లనఁ గిరవాణి, మరలి
సురపంక్తి కరుగుచోఁ బిఱుఁదు చక్కఁ,
దనము నెఱివేణి చెలువు గన్గొని బలీంద్రుఁ,
డాది కన్నను మిగుల మోహంబుగాంచె.
దశా. ౭ ౩౯౫ నృసిం ౨. ౬౫

శా. ద్రోణాచార్య పిఱుందనొప్పి కృతహ
స్తుల్ భార ఆది ౮. ౯.

ఉ. సుందరరాజుఁ బుద్ధిబలముల్ గలయంబడి
గోవ్రజంబులన్, దండడిపెట్టకుండఁ బిఱుఁ
దన్ నడపింపఁగఁబంచి
భార విరా ౪ ౧౭౪

ఈ క్రింది యుదాహరణమున మాత్రము కటి
పురోభాగము అను నర్థము కానవచ్చు
చున్నది

ఉ. .నునుఁజెక్కులినొక్కుచు గుబ్బలంటుచున్,
గిప్పగివీడెమిచ్చి తమకంబున నీవి వదల్చి
యంత నీ గొప్పపిఱుందుపై నొలసికూడిన
మేటికి స్వర్గమేఁటికిన్ ఉ రా ౪ ౧౯౯

జ. పిఱు, పిఱుఁదిచ్చు, పిఱుఁదుకొన, పిఱుఁ
దెక్కు, పిఱుతివియు, పిఱుతిరుచు, పిఱు
దీయు, పిఱుదెస, పిఱువడు, పిఱువెట్టు,
పిఱువోవు, పిఱుసను

**పిఱుఁదుకొను.** స క్రి (పిఱుఁదు + కొను) వెంబ
డించు, తఱుము
సీ. రథ్యాప్రతీకోత్థ వముచే గిరికోటి పిడుగుల
వెఱవిడిఁ బిఱుఁదుకొనఁగ.
ఉ హరి. ౩ ౫౪

**పిఱుఁదెక్కు.** అ క్రి (పిఱుఁదు + ఎక్కు)
వెనుకపడు, వెనుకచిక్కు
క. తతిఁదతి నినుతో నడవక, పిఱుఁదెక్కిన
రుచులు దమము బిట్టదరుదు ని, ర్వెఱ నిండ్ల
లోన డాఁగిన, తెఱఁగున సుద్దీప దీప దీప్తులు
వెలిఁగెన్. కు. సం. ౭. ౯౫.

**పిఱుతి (ది) వియు.** పిఱుతివుచే అ. క్రి (శ. పిఱుందిరుప్వ.) (పిఱుఁదు + తివియు) వెనుదీయు, జంకు.

క. పిఱుతివియక నాముందఱఁ, దెఱవా యిప్ప గిది నాడఁ దెరవా మేల్ మేల్

అచ్చరా. అయో ౨౬.

క (ఎద్దును ఎనుబోతును). పిఱుతివియకొకటి నొకటిం,దఱుముచు నా రెండుఁబోరి...

శేవ 3 ౨౫౭

వ...శకునితమ్ములు . గుఱ్ఱపుమొగ్గరంబులతో నగ్గలిక నతనిపై వాహనంబులం బఱపి పిఱు దివియక రాయిరాయి దాఁకినట్లు దాఁకి

భార భీష్మ. 3. ౯౧.

గీ పిఱుదివిచె నృసంగ వెనుదీసె ననుటఁ దనర్చియుండు... ఆం. భా. 3 ౧౦౧

**పిఱుతివుచే=పిఱుతివియు.** అ క్రి (పిఱుఁదు+ తివుచే) వెనుదీయు, జంకు

వ అప్పుడు కేకయసృంజయభూపతులుం దాము ను వివిధాయుధపాణులై యదల్చి నిల్చిన వాఁడునుం బిఱుతివక యదల్చి...

భాగ ౧౦. ఉ ౪౯౪.

క మనవాఁడై సంద్రుఁడు చెప్పినమాటలు వింటి రింకఁ బిఱుతివక మలల్, గొనివచ్చి కట్ట కట్టుఁడు, చనవలయున్ గడలి దాఁటి సరగున మనకున్ యయా 3 33.

**పిఱుదీయు=పిఱుతివియు.** అ క్రి. (పిఱుఁదు+ తీయు) వెనుదీయు, జంకు

సీ. మొలనూలు బిగియించి వెలఁదిచెన్నొలఁ జొమ్పుఁ బిఱుదీయ కేటిలో నుఱుకకరణి. మనుచ. 3. 30.

**పిఱుదెస.** వి. (పిఱుఁదు+దెస) పశ్చాద్భాగము. వెనుకప్రక్క.

సీ. పిఱుదెస నెవరైనఁ బిలిచిరో యని నిల్చి బయ లాలకించి విభ్రాంతి గొనుచు.

చెన్న. ౪ ౧౯.

**పిఱుసము.** విశ. పరుసము, కఱకైనది, తీక్ష్ణమైనది.

సీ. ద్వాదశరూపము ల్దాల్చి యుగ్రమయూఖుఁ డేవేళఁ బచరించు నెండఁ బిఱుసు.

హరిశ్చ ౪ ౧౧ (శ. ర పా)
(ఎండఁగరము, అని. ముద్రి పా)

వి పారుష్యము, రూక్షత్వము, కఱకుఁదనము.

చ కఱచినపీనుఁగు స్వేదఁదశ ప్పిరయున్ మొలఁ బచ్చితోళులున్, . . బొమ్మపయిఁ జేరిన నెత్తురుతోడిద్రేవుడున్, బిఱుముల చూపు లుం దఱచుబీఱనరంబులుఁ గల్గురూపమై

ఉ హరి ౨ ౧౨౬.

**పిఱువడు.** అ క్రి (పిఱుఁదు+పడు) ౧ వెను దీయు, ౨ భయపడు. శ ర

క చారులచే గాండీవి మృవారథికులతోడ వచ్చె నని విని గుండెల్, నీరై సైంధవతనయుఁడు, పేరోలగ ముండి బిట్టు పిఱువడి చచ్చెన్.

జై భా ౮ ౧౫౬.

**పిఱువెట్టు.** స క్రి (పిఱుఁదు+పెట్టు) వెనుకఁ బెట్టు, అలక్ష్యముచేయు, చులకఁజేయు

ఆ చలన మేది పుట్టుఁ జావునుం బిఱువెట్టి, యామిషార్థిజనుల నపహసించు, చెలిమి తోడఁలేమి కలిమి వాటింపని, రమణ నునికి యజగరవ్రతంబు. భార శాం ౪ ౨౨.

**పిఱువోవు.** అ క్రి. (పిఱుఁదు+పోవు) వెను దీయు, వెనుకకుఁబోవు.

సీ. పిఱువోవ నందంద తఱిమి కొమ్ములు వట్టి తోడర నొండొంటిపైఁ ద్రోచిత్రోచి.

హరి. పూ. ౬ ౧౭౨.

**పిఱుసను.** అ క్రి. (పిఱుఁదు+చను) ౧. వెను కకుఁబోవు.

సీ ఉత్సాహ మెదలి నీ పునికియుఁ గని కురు
సంతతి యార్పఁ బాంచాలకోటి, పిఱుసని
పోవంగ సెఱుఁగవో
భార కర్ణ. ౩ ౨౯౫

ద్వి పిఱుసని యొక్కింత మఱువున నిలిచి, మఱి
వచ్చి చూచుడు గతి గంటి గామి
బస. పు. ౩ ౬౦ పా ౪౧౬. పం

౨. వెనుదీయు, జంకు

క సెలి సుఱికి వైరివీరుల, సెఱఁకులు దూఱంగ
సేయునృపపుంగవునం,పఱి కౌర్వక పిఱుసని
రని, వెఱచి విషణ్ణు లయి సకలవిషయాధి
పతుల్ భార ఆది ౪ ౨౦౨

క. మఱుతురె యాడినమాటలు, పిఱుసని పోఁ
దగునె మీకు బెదరక యెదురై, తఱుముఁడు
భీష్ముని గీష్ముని, సెఱుఁగరె ము న్నేను
గలుగ సేలా వెఱవక
భార భీష్మ ౨ ౧౫౦.

**పిఱ్ఱ.** వి ౧ పిఱుఁదు, నితంబము (శ ర)
౨ గుదము, ముడ్డి

సీ గాఁడు గుద్ద పిఱ్ఱ యనంగి గుదము దనరు
సాం ని మాన. ౧౯

సీ గుదసమాహ్వాయము లౌ గుద్ద గాఁడు, పిఱ్ఱ
యనగను. . వేంక మాన ౪౦

**పిలకము.** సం వి అ పుం చర్మరోగ విశేషము

క. పిలకాదులఁ గంతులచే, నలమటఁ బడు
వారు భార అను ౫ ౧౦౧

శ్లో. గ్రంథిభిః పిలకై శ్చైవ క్లిశ్యన్తే భృశ
దుఃఖితాః సం భార. అను. ౨౨౦ ౩౬

**పిలపిల.** వి మూఁగుటయందును వచ్చుట పోవుట మున్నగు క్రియలయందును చెవులు తిక్కించుటయందు నగునను కరణము.

చ...ఈఁగలును చీమలు దొంతర గాఁగఁ బైప
యిన్ పిలపిల మూఁగ. పారంగ. ౩. ౧౧౬.

గీ. జంటఁ బిలపిలఁజను శుకశారికాము, యూర
కాదంబవితతుల... రసిక ౪ ౩౧.

చ పిలపిల నాజయధ్వజానిఁ బెద్ద కెదుర్కొని ..
శుక. ౧. ౩౨౨.

చ...పక్షులు వృక్షశాఖలకన్, బిలపిలఁ జేరఁ
జొచ్చె . ముకుంద ౩ ౧౪౬.

ద్వి...మృగావళి భీతిల్లి కలఁగి, పిలపిల చెవు
లల్ల బిక్కరించుకొని, సాలవి నల్దిక్కులు
నూచుచునుండ ద్వి. నల ౩. ౨౬౯

**పిలాటము.** సం వి. అ పుం వాహిత్థపార్శ్వభాగములు, ఏనుఁగుముఖ మధ్యమునకు ప్రక్కచోటు (వై. ని)

**పిలిపి(ల్పి)ంచు.** స క్రి (√పిలుచే) ౧ పిలువఁజేయు, ఆహ్వానింపఁజేయు

చ జలరుహనేత్రుఁ గాంచి సరసత్వము మీఱఁగ
నొక్కవేలుపుం, జెలుకలకొల్కి రావిలు
కచేఁ బిలిపించిన సత్యభామ కాఁకలికి
తెఱంగు కౌరి కడకన్నులసన్నలఁ జూపె...
పారి. ౩. ౨౦.

౨ రప్పించు, వచ్చునట్లుచేయు

సీ అచటిరాజులు బంటు నంపి భార్గవుడైన
బింకానఁ బిలిపింతు రంకమునకు
మనుచ. ౧. ౫౦
నీలా. ౩. ౫౬.

గీ ఇట్లు పిల్పించి సన్మాన మెసక మెసఁగ.
భీమ. ౧. ౨౨.

**పిలిపిలి.** విణ. చిన్నచిన్న.

ద్వి. అంత బంగరుగజ్జియలు నందియలును,గలకల
రవణింపఁ గారుమెఱుంగు, పిలుప వా
నింటిలోఁ బిలిపిలినడల, మెలఁగుచు .
ద్వి. పరమ. ౫. ౩౬౯. పా.

**పిలు=పిల్లు.** పులు, పుల్లు. వి. తృణము, గడ్డి.

క. అలఁతులఁ బోరిగొనరు మహా,బలు లాహా
ఘనులఁ గాని పవమానుఁ డిలం, బిలు
వెఱుకుగ బహుశాఖా, తులగగవస్పంది
వృక్షకోటులు దక్కన్
వేం. పంచ. ౧. ౨౦౪.

పిలుఁగు=పినుఁగు. విణ లుబ్ధుఁడు, పిసినిగొట్టు.
క. కల దానవ్యాపికి బహు,కలధౌతసువర్ణపూర్ణ
కంధ సదా య,ప్పిలుఁగుయతి మఱపు
వోసమ్ము, కలసేనియు లేక దానిఁ గని
రక్షించున్
వేం పంచ. ౧ ౨౧౪

(క. ర పా. 'పలుఁగుయతి' ముద్రి పా)

పిలుక(ల్క).=పిలువ. వి (సం పీలుకః)
పశుపక్ష్యాదుల పిల్ల.
చ... కేటికేఁ, బిలుకల వెంటఁ ద్రిప్పికొని పెం
చుచు... రామా ౨ ౪౧
ఉత్సాహ . చిలుకపిలుక ముచ్చటలు గులుక
చంద్రా ౩ ౯౪
ఉ... పాంథవర్గమ్ముల నేచు తేఁటిపిలుకల్ పెద
లెక్ సహజాపికచ్ఛవిన్ వసు ౪ ౧౩౪
ఉ... తెమ్మెరపిల్క లచ్చటన్
చంద్రా ౨. ౩౨
ఇట్లే అరఁటిపిలుక, కందపిలుక, జొట్టుపిలుక
మొ
విణ. చిన్నది ఉదా. పిలుకజొట్టు. మొ
జ. పిలుకవాఁటు

పిలుకవాటు. విణ. (పిలుక+వాటు) పిల్లలను
పెట్టునది, ఈనునది.
వ.. పిలుకవాటుగోడిగలజావడంబులకుం బుట్టి..
బెదరు కొదమతట్టువగుంపు...
ఆము. ౪. ౩౫.

పిలుకు(ల్కు). వి. గర్వము, మదము. (చూ.
పిలుకుమాఱు. మొ.)

ఐ. పరుషవాక్కులు.
సీ పిలుకు లాడినపోల్కి బెక్కు వీపులఁ జిల్కు
చిలుకపల్కులబాధ మెలఁగ రాదు.
ఇందు. ౩. ౧౨.

జ. పిలుకుమాఱు, పిలుకుమార్చు, పిలుకుమార్పు,
పిలుకుమాలు

పిలుకు(ల్కు)మాఱు(రు;లు). అ క్రి.
(పిలుకు+మాఱు) చచ్చు; నాశమొందు.

చ (కర్ణుఁడు) సరకుగొనండు పాండుసుతసైన్య
నికాయము నించుకేనియుం, గరులు రథంబు
లున్ హయులఁ గాల్బలముల్ దనవీక
విచ్చియున్, మరలియుఁ దూలియుం బిలుకు
మాఱియు నల్గడఁ బాఱియున్ వియచ్చరు
లకు వేడ్క సేయ...
భార. కర్ణ. ౧. ౫
('పిలుకుమాలియు', క ర పా)

చ ఇవి యరయంగ నెంతపను లింద్రజుచావుఁ
దలంప వాని వ్యాహవమున శూలికైనఁ జెన
యన్ భర మాతఁడు పిల్కుమారినన్, భువ
నము లెల్ల నిర్భయతఁ బొంది మహాద్భుత
మంది లక్ష్మణ, స్తవనకథావిధాచరణతా
పరతంత్రము లయ్యె రాఘవా.
నిర్వ. ౨. ౧౩.

గీ నెలకెలంకు మేలిటినేమములకు, నెలవు చెలు
వపుగమికాఁడు పిలుకుమారి, రక్కసుల
చేతఁ బోయెను నక్కచునకు, వగవ కట్లొత్త
మై యెల్ల నొగులఁ దంద్రి.
యయా. ౩. ౧౩౧.

ఉ... నేఁడు వ్యామంచితనంబునం బిలుకుమాలిన
నాథుని సుగ్రకక్రులన్, మంచు నినుండు
వోలెఁ బరిమార్చుమహోబలుఁ జూచి.
భార. అశ్వ. ౪. ౪౩.
('పిలుకుమారిన', క. ర. పా.)

**పిలుకు(ల్కు-) మార్చు (ఉచే) = పిలుకుమాలుచే(ల్చు)** స క్రి (√పిలుకుమాలు) చంపు; నాశముచేయు.

క. విలు దుమురు సేసి గుఱ్ఱం,బుల సూతునిఁ బిలుకుమార్చి భుజగనిభశరం, బులఁ జేద్పఱచిన నీ గ్గతి, కలఁగి పఱచి రెండు రథము కర్ణుండెక్కెన్. భార ద్రో ౪. ౧౪౪

గీ తవిలి యప్పుడు మల్లయుద్ధమున వానిఁ, బిలుకుమార్పింపవచ్చు భీముచేత
భాగ ౧౦ ఉ ౪౧౭

గీ...తద్రథంబు లొక్క,పెట్ట కవిసిన వన్నిటిఁ బిలుకుమార్చి భార శల్య ౧ ౩౩౯

సీ. సముచితం బైనలజ్జాభరంబును బోలెఁ బ్రియసఖీసఖ్యంబుఁ బిలుకుమార్చి
కవిజ ౩ ౪౦ అచ్చ రా సుం ౧౫౪

**పిలుకు(ల్కు-)మార్పు(ఉపు)** వి (√పిలుకుమారు) హింస, చంపుట

గీ పొరిగొనుట పిల్కుమార్పు చంపుడు తును మట, యనఁగఁ దగు హింస
ఆం. భా ౨. ౨౨౪

**పిలుకు (ల్కు-) మాలుచే (ల్చు) = పిలుకుమాఱుచే(ర్చు)** స క్రి (√పిలుకుమాలు) చంపు, నాశనముచేయు (శ ర)

**పిలుచే(ల్చు)** స క్రి ౧ ఆహ్వానించు రమ్మను. (దీనికి పిలువమి, పిలమి, పిలువక, పిలక, పిలువుము, పిలుము, పిలువుఁడు, పిలుఁడు, పిలువఁడు, పిలఁడు, పిలువని, పిలని, మొ. రూపములు సిద్ధించును)

సీ త్రిపదీగతత్రివేదీధర్మకలిత మష్టాక్షర మంత్రంబు హరిపరంబు.

గీ. పిలిచి యాదలవలకేలు నిలువరించి, చదివె నాశనిదక్షిణశ్రవణవీథి, నపుడు తచ్ఛ్రోత్ర మానంద మనుభవించె, సన్మహాముని యంతర్నిధిగమించె. కవు. ౧ ౧౫౭.

మ రమణం బిల్చె సరోవరం బనిలజాత రాజీవ రాజీవస త్సమదాళిప్రజచక్రవాకబక హంస క్రౌంచ నాదంబులన్.
భార. ఆది. ౬. ౧౪౨

చ...సేఁ, గుడువఁగఁ బిల్తుఁగాని తనకుం గల యాఁకటి ప్రొద్దెఱుంగఁ డీకొడు కిటు నాకు మనము గుందెడు నిన్నని యూఱడిల్లెడున్ భార విరా ౨ ౨౧౩.

సీ రథముపై నున్న పార్థుండుఁ జూడఁగ లేమి గరుడాగ్రజుఁడు చెట్టుగాఁగఁ బిల్వ

గీ గాఢమై నిండె గాఢాంధకార మొకటి
దశా ౩. ౧౧౦.

గీ అనిమిషాధీశ్వరుని చెంత కనుపఁ దలఁచి, పుత్రుఁ బిలు మన్న మాడిగంపుత్రుటు లపుడు
సవల ౪ ౨౦౫.

౨ పేర్కొను.

ద్వి ఇల నింద్రజి త్తని యొవ్వాని జనులు, పిలుతు రప్పుడు నట్టిపృథులవిక్రముని.
రం రా ఉ ౭౯. పా ౯. పం.

క...ఆటవికుని బ్రాహ్మణభర్తన్, గరుణం బిల్చిక విహితేవర మింపన వారు కృత్తివాసునితోడన్ కాశ ౩. ౧౨౨

పా. ఊర లేనిది పేరఁబిల్చుటః లేనివస్తువును నిర్దేశించి ప్రస్తావించుట

జః పిలిపించు, పిలుపు, పిలుపుడు, పిలువఁబంచు.

**పిలుని.** సం వి. ఈ. స్త్రీ. మార్వ్య, చాఁగ ౯.

**పిలువ=పిలుక.**

ద్వి. అంత బంగరుగజ్జియలు నందియలును, గలకల రవళింపఁ గాదు మొలుంగు,పిలుప నా వింటిలోఁ బిలిపిలినడల, మొలఁగుచు...
ద్వి. పరమ. ౫. ౩౪౭. పా.
(పిలుక చి. ని. పొ.)

పిలుపిచ్చు. విశే. (పిచ్చ + పిచ్చ) మిక్కిలి పిచ్చము.

సీ. పిలుపిచ్చవిద్యలు పేరవన్నియలును దెలుపఁ దనంబులు ప్రేలదములు. పాండు. ౩. ౪౩.

పిలుపు(ల్పు). వి (√పిలుచు) ఆహ్వానము, పిలుచుట.

సీ. ఫెళఫెళారవభగ్నభీమకోదండంబు భృగు రామువింటికిఁ బిలుపుదీము.

చంద్రా ౧. ౭౧

చ. విలిచెఁడుబిత్తి మిత్తి వని నీతికిఁ బాపినఁగాని పూని యుచ్చెలి కలనేనియుం బిలుపుఁ జెప్పు దనీతికిఁ దుచ్ఛజాతికిన్

వేం పంచ ౧ ౧౧౪.

సీ. పదిపిల్పులకును దాఁ బలుకఁ గొంకెడు కాంతి పలుమాఱు వింతఁగాఁ బలుక నేర్చె

కవిజ. ౩. ౧౭౪

పిలుపు(ల్పు)డు=పిలుపు. వి (√పిలుచు) ఆహ్వానము, పిలుచుట (శ ర)

పిలున(ల్వ)ఁబంచు. స క్రి (పిలువన్ + పంచు) పిలిపించు, రప్పించు

ఉ. పాండుకుమారులన్ బిలువఁబంచి...

భార. ఆది. ౬. ౧౩౩.

గీ...పిలువఁబంచె, శెందపూడన్న మంత్రీశ్వ రుండు నన్ను. భీమ ౧. ౨౧.

మ...నను...సంగీత కళారహస్యనిధిఁ బిల్వం బంచి పల్కెన్ గృపన్. వసు. ౧. ౧౬

పిల్ల. వి. (సం. పీలకః ప్రా. పిల్లకో, పిళ్ళ, త. పిళ్లై.) ౧. పశుపక్ష్యాదిబాలకము.

గీ. వినుఁ వనంగను బిల్ల నా...తిర్యగర్భకములు గాను దెలియవలయు. అం. భా. ౨. ౬౯.

గీ. మీను పిల్ల లజన్మంబు మే లనంగఁబడుచు...

దశా. ౧ ౧౩౭. పీలా. ౧. ౧౩.

౨. ఆఁడు శిశువు.

వ్యవ : మాపిల్ల కింకను వరుఁడు కుదురలేదు.

౩. బిడ్డలు; మగపిల్లలు

శా...పిల్లలుం బిల్లగో, ర్పల్లో యంచు బయల్లనుం జెడుగుడుల్ ప్రేరేఁచి రవ్వే కలన్.

రా. వి ౩ ౧౪.

పా : పిల్లలకుఁ బేఁటకోళ్లకుఁ జలి లేదు.

విశే. ౧ చిన్న ఉదా: పిల్లకాలువ, పిల్ల కెట్టి కెం.

౪ అని కామక్రోధాదులఁ, గనుఁగొని యావిష్ణు భక్తి గడుఁబిల్లది దానిని మీరు సావధానం, బున గెలువఁగ వలయు ననుచు బోధింపం గన్

ప్రబోధ. ౨. ౫౦.

గీ బిరుదుటందియ వెంబడిఁ బిల్ల కెట్లు,నమర... గేహమున కేఁగు...మల్లమాళి.

శుక. ౨. ౩౫౭

౨ న్యూనము అల్పము.

సీ విక్కుపువరుఁ దని నీ వింత నీవింత పల్లచేతలు చేసి చేలవైతి. చిత్రభా ౩. ౧౦౩.

జ : పిల్లఁగ్రోలు, పిల్లఁగ్రోవి, పిల్లఁడు, పిల్ల కాయ, పిల్లగడ్డము, పిల్లగాఁడు, పిల్లగిలుబు, పిల్లగోరు, పిల్లగోల, పిల్లజాట్టు, పిల్లకెట్టి, పిల్లదీవి, పిల్లమాయి, పిల్లపిల్లతరము, పిల్ల పేఁచర, పిల్లపెసర, పిల్లపేగులు, పిల్ల మెఱము, పిల్లత్రేలు, పిల్లసన్నాయి, పిల్ల పిగ, పిల్లేరుగంతు

పిల్ల(న)ఁగ్రోలు=పిల్లనగ్రోవి. వి. (పిల్ల + గ్రోలు.) (వృత్తియందు వర్ణాధిక్యము) మురళి, ఊఁదుటకు అనువుగా బెజ్జములు చేసినవెదురు గొట్టము.

ద్వి. కొమ్మ యూఁదెడి పిల్లఁగ్రోలూఁది వ్రజము, కొమ్మలఁ గడు కెల్లి గొల్పినవాఁడు.

ద్వి. భాగ. ౩. ౪౯. పా.

మ...దివ్యాప్సరో, లలనాబృందము లాడ దాన వులు పిల్లంగ్రోళ్లు పట్టంగ .

భీమ. ౪. ౧౯౧

సీ...కేలఁ జొక్క పుఁబిల్లఁగ్రోలు పట్టి

నీలా ౧ ౭౧

యయా. ౪ ౧౫౭

పిల్ల(న)ఁగ్రోవి,=పిల్లనగ్రోలు. వి (√పిల్ల) వృత్తియందువర్ణాధిక్యము, మురళి

సీ. పిల్లఁగ్రోవులు చెక్కు పెట్టినవిండ్లు కంబళ్లు మప్పట్లును నల్లెత్రాళ్లు కుక. ౨ ౫౪౫

సీ పెనువంతఁ గుందనో పిల్లఁగ్రోవి

నీలా ౧. ౧౦౯

వ .పిల్లనగ్రోవులఁ గిన్నరలు

ఉ రా ౫ ౨౪౭.

క. తలచీరకోల కిరుచె, ప్వలు బిల్లనగ్రోవి య మరఁ బోలము దిరుగుచున్ చెన్న 3 3౧.

బి. బాలక్రీడావిశేషము

సీ కోలాటములు పిల్లఁగ్రోవులు గుమ్మడిక్రోవి కూఁతలు నూఁదుఁగ్రోవులు...

హంస 3 ౧౪౬

పిల్లఁడు. వి (√పిల్ల) పురుషశిశువు, మగబిడ్డ.

ఉ మాపవసాథ నేను గృహమార్జన చేసుక పిల్లఁ జేద్యఁగ౯, వానికిఁ బాలు పోసి కొని

ఆనందసుందరీవిలాసము ౨ ౧౭౪ (బ్రా )

పిల్లక. సం. వి ఆ. స్త్రీ పిడియేనుఁగు.

పిల్లకాయ. వి. (√పిల్ల) బాలుఁడు (శ ర )

పిల్లగడ్డము. వి (√పిల్ల) నసుమమాత్రముకొం చెము పెంద్రుకలుగల గడ్డము.

సీ. పిల్లగడ్డము మించి పెరిఁగిమీసలు కుక్షి గోళంబుమీఁద నుయ్యాల లూఁగ

ఆము ౬. ౭౦.

పిల్లగాఁడు. వి. (√పిల్ల) బాలుఁడు. (శ. ర.)

పిల్లగిరులు. వి బ (√పిల్ల) బాలక్రీడావిశేషము. (శ ర.)

పిల్లగోరు. వి (√పిల్ల) బాలక్రీడావిశేషము.

శా . పిల్లలుం బిల్లగో, ర్వ ల్లో యంచు బయళ్ల, నుం జెడుగుడుల్ ప్రేరేఁచి రక్ష్వేళలకా.

రా వి. 3. ౧౪.

పిల్లగోల. వి (పిల్ల+కోల) చిన్నకఱ్ఱ.

భద్రకవృత్తము - పంచినపిల్లగోల కరయుగ్మ పాదములఁ బట్టి యూఁది పశువర్గంబు నర ణ్యమధ్యమధరిత్రిఁ గాచుసమయంబునన్...

అప్ప ౪ ౨33. పా.

పిల్లజొట్టు వి (√పిల్ల) ౧ చిన్నజుట్టు

గీ. కావితిరుకాసెదట్టులుఁ గావుబొట్లు, మొల్ల సరు లొప్పు చరిత్రాటిపిల్లజుట్లు, పెద్దచేత్రాళ్లు గలకోడుబిరుదుజెట్లు ప్రబంధ. ౭౨

౨ బాలురముందటిసిగ (శ ర )

పిల్లదీవి వి (√పిల్ల) బాలక్రీడావిశేషము

సీ తూరినతుంకాలు గీరినగింజలు పిల్లదీవాలంకి బిల్లగోడు కాశి. 3. 33.

సీ కుప్పిగంతులు పిడిగ్రుద్దులాటలు పిల్లదీవులు గొబ్బిళ్లు గూవనాలు.

గీ ఆదిగా శైశవక్రీడ లాడి రపుడు, రామ కృష్ణులు గోపదారకులఁ గూడి.

వి పు. ౩. ౨౦౨.

గీ విమలచంద్రోదయారంభవేళయందుఁ, బిల్ల దీవాటలను మల్లుపెనఁగుటలును.

శివరా. ౨. ౭౩.

పిల్లనూయి. వి (√పిల్ల) నూతిలోపలి చిన్న నూయి. (శ. ర.)

ఇట్లే: పిల్లబావి.

పిల్ల పిల్లతరము. క్రి. విశే. (√పిల్ల) పుత్రపౌత్ర పారంపర్యముగా.

క. అవమతిఁ బిత్రృఘ్ను లగుభూధవుల నెదకి పిల్లపిల్లతరము దునిమి భార్గవుఁడు ముని యయ్యె... ఆము ౩. ౪౧

మ గుడి క్రిందగావానికిం దల్పు లప్పడముల్ గావునఁ బిల్లపిల్లతరముఁ భక్షింతు దాయా దులఁ ప్రబోధ. ౨. ౭౪

పిల్లపీఁచేర. వి. (√పిల్ల) పీఁచర,శతావరి. తీ.

సీ పిల్లపీఁచర యనఁ బీఁచరి యనఁ బ్రబలును శతావరి... అం భా ౨. ౫౫.

పిల్ల పెసర. వి (√పిల్ల) కాకిపెసర,ముద్గపర్ణి. తీ

గీ పిల్లపెస రనఁగాఁ గాకిపెస రనఁ దగు అం. భా. ౨. ౫౮

("పిల్లి" అప ముద్రి, ధాన్యవాచకమైనచో బ "పిల్లపెసలు" అని శ. ర.)

పిల్ల పేగులు. వి బ (√పిల్ల) చిన్నప్రేగులు (గ్రా)

పిల్లము. సం విశే అ అ అ. తడికన్నుగలది, చిల్లము, క్లిన్నాక్షము వి అ న. తడిసినకన్ను, క్లిన్నాక్షి

పిల్ల మెట్టులు. వి బ. పాదరక్షావిశేషము, ఒంటి యట్టచెప్పులు

గీ. పిల్లమెట్టులు మొలవంకి చిల్లకోల. సానందో ౫ ౫౪.

పిల్ల మెఱము. వి. (√పిల్ల) తలక్రిందుగాచేసెడు మొగ్గ; పల్లటీలాఁగు,

గీ. పిల్లమెఱములఁ బోదు తప్పించ రాదు, దీని జేలాగునఁ దరింపఁ దీరు మనకు. రామా. ౬. ౪౨.

ఆ. మీఁదనుండి పిల్లమెఱములు వేయుచు, వచ్చి పుడమి నిలిచె వనిత యార్త. చెన్న. ౨. ౨౨౪.

ఉ క్రొన్నెలదాల్పుడేల్పు జిలుగుల్ వెలుఁగుల్ గొన తటిఘోటిఁజే,కొన్నవలంతిపిల్లగమి కొల్లఁగఁ బిల్లమెఱమ్ము లేసె... అచలా ౨. ౨౪.

పిల్లరీ. వి ఒకవిధ మగుపాట

ద్వి. పిల్లరీ పాడెడు పెనుపిశాచములు. పల్నాటివీరచరిత్ర ౨౪౧ (గ్రా.)

పిల్ల ప్రేలు. వి (√పిల్ల) చిటికనప్రేలు.

ఉ కొటికాంద్రు కృపణ వలకాలిపిల్లప్రేల్, మట్టెఁగఁ గోవి. జై భా ౭ ౪౧.

పిల్లసన్నాయి. వి (√పిల్ల) చిన్నసన్నాయి. (గ్రా)

పిల్లసిగ(క)=పిల్లజుట్టు. (√పిల్ల) చిన్నజుట్టు

సీ. ప్రతిమాన వపనముండిత మైనమస్తంబు పెడ తలఁ దూలాడుపిల్లసిగయు. వైజ ౨ ౫

క తనవంటిపిల్లసికయే,తనకుం బలెఁ దులసి పేర్లు... వైజ. ౪. ౯౩

పిల్లాడి(ణి). వి ఆఁడుదాని కాలి నాలుగవప్రేలి యాభరణము

ఉ పేఁడు దలంప నీవరుఁడు తలపోయఁగ నిం కొకవింత యాకవి,ల్లాఁడి కరంబుప్రేలఁ బదిలంబుగఁ దాల్చినవాఁడు చూడవే. కళా. ౪. ౨౦౩.

గీ పెలఁది మట్టెలు పిల్లాండ్లు వీరమద్దియలును నందెలు...తాల్చె మార్చి మార్చి. ప్రభా. ౪. ౧౩౭.

సీ. వయ కలప్రేళ్ల మట్టియలుఁ బిల్లాం డ్లిడి పాయవట్టము పెట్టెఁ బై నొకర్తు. ఆము. ౬. ౧౨౭.

సీ... పిరమద్ది నా మట్టె యనఁగఁ, బిబ్బిరికాయ నాఁ బిల్లాణి యనఁజెటి, బొద్దు నాఁగను గ్రమంబుగఁ బదాంగు, శివిభూషలు .
ఆం. భా ౨ ౧౫౧

పిల్లాకము. సం. వి అ పుం పిట్టపిల్ల, పక్షిశిశువు

పిల్లి[1]. వి. (సం బిడాలః, క పిల్లి) మార్జాలము (దీనిభేదములు, జంగుపిల్లి, జవాదిపిల్లి, నీరుపిల్లి, పునుఁగుపిల్లి, బావురుఁబిల్లి, బూతపిల్లి, మూసపిల్లి మొ.)
సీ. జన్నిరోగికి బత్తెజాన్ను వేసినయట్లు పిల్లి కత్తిని వెన్న పెట్టినట్లు వేణు ౪ ౩౪
సీ పిల్లి యం చనఁగను జెల్లు బిడాలాఖ్య ..
ఆం. భా ౨ ౭౪
ఉ రా ౨ ౧౬౫

సా:—కాలుగాలినపిల్లి, అస్వస్థచిత్తుఁడు
ద్వి. కడు భయంకరమహాగహనముల్ గడచి, కాలుగాలినపల్లికరణి నీవెంట, నేల నీబంట నై యెల్లందుఁ దిరిగి
ద్వి మాకళ్ళ ఉ ౧౨౪౫ పం
జః పిల్లికన్రతనము, పిల్లికోల, పల్లిగడ్డ, పిల్లిశీలము

పిల్లి[2]. వి ధూళియందుపల్లముకావించుకొని దాని నడుమను అణఁగియుండు నల్లివంటి కీటము
(చి ని)

పిల్లికన్రతనము. వి (√పిల్లి[1]) వైదూర్యము.
సీ. పిల్లికన్రతనంపుబిగియోడుబిళ్లలు పులుఁగురా పచ్చమేలొప్పదియలును
అచ్చ. రా అయో. ౪.

పిల్లికోల. వి. (√పల్లి[1]) మార్జాలహాత్య, (ఇదిమహాదోషములలోనొకటి)
ఉ. మోఘము గాక నీవు తల మోచి యొనర్చిన యట్టియుద్దురం, శాఘము నేఁడు పిల్లికోల యై చరణంబులఁ బ్రాకు...
వేం. పంచ. ౪. ౨౭౭.

పిల్లిగడ్డ. వి (√పిల్లి[1]) పునుఁగుచట్టము, బిడాలకము, పునుఁగుపిల్లి శరీరమున పుట్టుఁగుండు కోశము
గీ. అట్లు దమకంబుచే వేఁటలాడి మృగము, దంబుఁ జామరములు గజదంతములును, బిల్లిగడ్డలు పులిగోళ్లు పికిలిచెండ్లు, నాది గాఁ దెచ్చి యిచ్చి రయ్యవనిపతికి
రసిక. ౧. ౧౧౬.
పీ పిల్లిగడ్డకుఁ దావి పిల్లగా నొనగూర్చి కుంద నంబున కేల కూర్పఁడయ్యె.
నీలా. ౧ ౧౧౧, ఆం భా ౨. ౧౬౧

పిల్లిశీలము. వి (√పిల్లి[1]) కపటవర్తనము.
గీ శీల మఖిలంబు నిది పిల్లిశీల మనుచు, చదువు లివి యెల్లఁ జిల్కలచదువు లనుచు.
పాండు ౩ ౩౭

పిల్లు=పిలు, పులు, పుల్లు. (కసవు, తృణము)
ఆ పల్లు గిట్టు నలకువేరుండు దా నైన, వాయమునకు నెచ్చ మధిక మైనఁ, బేద యైన ధనదు నెన్నడి యై చను, వాయమునకు నెచ్చ మల్ప మైన. విక్ర. ౨. ౧౪౧.

పిల్లేరుగంతు. వి (√పల్ల) పిల్లమొలిము, కలక్రిందుగా వేసెడులాఁగు, పల్లటి (శ. ర.)

పిళ్ల. వి. (క. పిళ్లె, త. పిళ్లై) అఱవదేశమందలి కళ్లాలజాతికిడినపేరు
ఉ. ఎక్కడఁ బోయితో యొఱుఁగ కేసును వెంటనె వచ్చి యప్పు డేడికన నిన్నుఁ గానక మదికి నెఱ గందుచు దేవుఁ డానఁ నీ, బిక్కర మెత్తు నయ్యలవపిళ్లలవాదల నింత పేపు నీ, యిక్కన లన్నియుఁ జెడక యే నిట వచ్చితి లేచి రావయా. వైజ. ౪. ౩౭.

పిళ్లారి. వి. (త. పిళ్లైయార్) విఘ్నేశ్వరుఁడు, వినాయకుఁడు.

గీ. గజ్జెకట్లంపు పిళ్లారి కొక్కురాకు, బొజ్జదేవర రేనుఁగుమొగముసామి, అన వినాయకు నకుఁ బేళ్లొప్పు .. ఆం. భా. ౧. ౪౩.

గీ. చేరి యాచేవ్రమానిపిళ్లారి నఱకి, చెక్కు లొవరించి యంగడిఁ జేర్చి యమ్మి, యింటి కేఁగుట కార్య మిం కేటిదేవుఁ, డేను గూటికి వగవఁగా నేమి కలదు

శుక ౩. ౨౫౪.

క. పిళ్లారిజియ్య కేజానఁ, దెల్లంబుగ జింకమావు దేవరకతనకా, బెల్లదరారఁగఁ బుట్టిన,బిల్లిదుఁదవు నీకు గడ్డుపనులుం గలవే.

అచ్చ రా. కిష్కిం ౯౩.

(పిళ్లాఁజియ్య=వినాయకునితండ్రి, శివుఁడు)

పిల్లు. వి ఐ దూడలనుకుడువనీనియావులను, దూడ లంచచ్చిన ఆవులను, మరులుకొలుపుటకై వాని యోనిమార్గమున చొప్పించి లాగెడు కుఱుచ కసవుబెంటి.

వ...క్రేపులం గోనవియావులం దొలంగిం గట్టి పిల్లు పెట్టియు మందులు సల్లియుఁ జాల దుఃఖపఱచి చేఁ పెటింగించువారును...

హరి. పూ. ౫ ౧౪౨.

పిశంగకము. సం. వి. అ పుం. ౧. పిశంగవర్ణము. ౨. విష్ణువు, ఒకానొక విష్ణుదేవుని యనుచరుఁడు.

పిశంగము. సం. విణ. (అ. ఆ. ఈ. అ.) తామర పుప్పొడివన్నెగలది, పింగళవర్ణముగలది.

వి. అ. పుం. కపిలవర్ణము, పింగళవర్ణము, గోరోచనవర్ణముగలది

పిశంగిల. సం. వి అ స్త్రీ. ఇత్తడి,రీతి.

పిశ(స)ము. విం విణ (అ. ఆ. అ.) పాపము నుండి విడివడ్డది.

వి. అ. న. బహురూపము, సర్జరసమను గంధ ద్రవ్యము. (వాచ.)

పిశాచకి. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

పిశాచద్రువు. సం. వి. ఉ. పుం శాఖోటవృక్షము. తపసిచెట్టు.

పిశాచభాష. సం. వి ఆ. స్త్రీ. ఒకానొక ప్రాకృత భాషాభేదము

పిశాచము. సం వి అ పుం ౧ దేవయోని విశేషము ౨ ప్రేతము ౩ పిల్లి, మూరారము. (వై ని.)

పిశాచసభము. సం వి. అ. న. ౧. పిశాచముల కూటువ. ౨. పిశాచముల కొలువుచావడి, (లోక) సభ

పిశాచాలయము. సం వి అ పుం వేడిమికి కుండఁ బ్రకాశించు గుణము, వేడిచూపకయే వెలుతురునిచ్చునట్టి గుణము (విల్యమ్సు)

పిశాచి. సం వి ఈ స్త్రీ ౧. పిశాచజాతి స్త్రీ. ౨. ఒకవిధమగు జటామాంసి. †.

పిశి. సం వి ఈ స్త్రీ జటామాంసి. †.

పిశితము. సం. వి. అ. న. ౧. మాంసము. ౨. చిన్నముక్క, స్వల్పాంశము.

పిశితి. సం. వి ఈ. స్త్రీ జటామాంసి. †.

పిశీలము. సం వి అ. న. అంసద్వయాంతరము, రెండు భుజశిరస్సుల మధ్యభాగము (శ. ని.)

పిశున. సం. వి ఆ. స్త్రీ ౧ స్పృకయను గంధ ద్రవ్యము, ౨ కొండబెండ †

పిశునము. సం. విణ అ ఆ. అ. ౧. సూచించునది, తెలుపునది, వెల్లడించునది, ప్రకటించునది. ౨. కొండెముచెప్పునది ౩. పట్టియిచ్చునది, మోసపుచ్చునది. ౪. క్రూరము. ౫. దుష్టము. ౬. నీచము. ౭. మూఢము

వి. అ. పుం. ౧. దూది. ౨. కాకి.

వ. ౧. కుంకుమపువ్వు. ౨. పట్టియిచ్చుట, పొగ మున వెలిపుచ్చుట.

పిష్టకము. సం. వి. అ. పుం. న. ౧ పిండివంట, అపూపము.

పుం. నేత్రరోగవిశేషము ౨ కించిజ్జఘనాధిక్యమును, ప్రసాంత విస్తృతియుఁ గల గజవిశేషము (శ ర)

న నూఁబొడి, తిలచూర్ణము

పిష్టపచనము. సం వి అ న బుఱుమ, పిండి వంటచేసెడు పాత్రము, బూరెలమూఁకుడు

పిష్టపాకభృత్తు. సం. వి త్. పుం. వంటచేసెడు పాత్రము

పిష్టపూరము. సం వి అ పుం ౧ వటకము, వడియము ౨ ఘార్త్రికము, నేతియందు పక్వమైన గోధుమపిండి ముస్నగువానితోఁ జేసిన భక్ష్యము

పిష్టము. సం విణ (అ ఆ అ) ౧ చూర్ణితము, పొడిచేయఁబడినది ౨ పిసుకఁబడినది

వి అ న పొడిచేయఁబడిన ద్రవ్యము పిండి ౨ సీసము.

పుం న పిష్టకము, నూఁబిండి

పుం పరిమాణవిశేషము (వై రి)

పిష్టమేహము. సం వి అ పుం ప్రమేహరోగభేదము

పిష్టవర్తి. సం. వి ఇ పుం పెసలు, మినుములు లోనగువాని పొడి, ముద్గమాషాది చూర్ణము.

పిష్టసౌరభము. సం, వి అ న పొడిచేయఁగా సౌరభముకలది, చందనము శ్రీ

పిష్టాతము. సం. వి. అ పుం ౧. పటవాసము, వస్త్రములకు వాసనకట్టెడు బుక్కాము. ౨ కర్పూర కుంకుమ మిశ్రచందనచూర్ణము.

పిష్టికము. సం. వి అ. న బియ్యపుపిండితోఁ జేయు ద్రవరూపమగు నొక వంటకము.

పిష్టోడి. సం. వి. ఈ. స్త్రీ. శ్వేతామ్లిక, తెల్ల చింత. శ్రీ.

పిష్టోదకము. సం వి అ న బియ్యపుపిండి గలిపిన నీరు

పిస. వి (త పిచ్చుక్ పిచ్చి) ౧. అవివేకము, తెలివిలేమి

చ రసికుఁడు గాని యర్థమధురం బగుకావ్యగభీరభూరివాగ్విసర మెఱుంగ నేరఁ డవివేకి యొకానొకకారణంబునన్, వెసఁ జని రాజగేహమున విద్రుమపంజరకీరిఁ జూచి తాఁ, బిస తెలతగ్గు దూడ యని పిల్చును గొల్లఁడు జాతిభావలన్

చమ ౧ ౪.

౨ క్రౌర్యము, క్రూరత్వము

గీ ఇట్లు బాధించి శోధించి యెందు నొక్క, పచ్చపైకంబుఁ గాన కప్పుచ్చిపోయె, నేఁటి తెరవాటు పస లేక దాఁటిపోయె, ననుచు వెసఁ బాటె పిస మాని యవలి కేఁగె.

వాల్మీకి ౨. ౯౬.

3 కామము చూ పిసవెఱ్ఱి

జః పిసవెఱ్ఱి

పిసక. వి (త పిచ్చుక్కు) తలవెంట్రుకలందు చెమటచే బందవగొను మురికి (శ ర)

పిసపిస. వి (క పిసిపిసి) గుసగుస్వరహాస్యము చెప్పుటయం దగుధ్వని కనుకరణము

వ...కర్ణంబునన్ బిసపిస ననమకరమంత్రంబు చెప్పి... ప్రబోధ. 3. ౫౧.

పిసరు. వి (క. పిసరు) ధాన్యాదులనుండి కడిగి తొలఁగించిన మలినపదార్థము.

(నిద్రించుచున్న కలహాకంటకివర్ణనము) ద్వి... చెమట,దొరఁగుకక్షంబుల దుర్గంధ మెసఁగఁ, బిసరు గాఁచినకుండ పేర్పుచందమున, సెసఁగినబాఁకినో రంతయుఁ దెఱచి.

ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౫౧. పం. (కడిగినధాన్యము లోత్రోపుడుపడినది. అని శ. ర.)

౨. పిప్పి, నిష్పిష్టకుసుమము.

సీ... పిసరు పిప్పి యయిన నిష్పిష్టకుసుంబ...
ఆం. భా. ౨. ౨౩౯.

౩. లేశము, అల్పభాగము.

(వ్యవ.) వానికిఒక్కపిసరైనను దయ లేదు.

౪. విష్ఠ, మలము, ఉదా:—పిసరు వెళ్లగ్రుద్ది వాఁడు. (శ ర. గ్రా)

పిసవెత్తి. వి. (√పిస) కామోన్మాదము, మిక్కిలి పిచ్చి.

క. నసగొట్టుబావనయ్యా, పిసవెత్తికిఁ దగులువడి తపింపఁగ నేలా, బసవెద్దు గదల కుండెను, వసతికి రమ్మనుచు నేను వచ్చెదఁ బొమ్మా.
శుక. ౨ ౪౪౯.

సీ. పిసవెత్తికన్న కత్తి రొసరేఁగు నసగూఁటి పూఁబోండ్లు తమయిండ్లపొంత కరుగ
హంస ౧. ౧౩౪

ఉ. అని నిశ్చయించి ధీరత్వనిరూఢుం డగుచుఁ గమలవదనం డానక్కఁ గనుఁగొని యిట్లను నేఁగ్రతను వలయకఁ మళ్లి పోయెదవు పిస వెత్తిక.
శేం పంచ ౪ ౫౪౩.

విశ. మిక్కిలిపిచ్చివాఁడు; పిచ్చిది; అవివేకి, మూఢుఁడు.

శా. నవ్వెన్నవ్వి నిషాదభర్తృమృగసంతానంబుఁ జంపంగ నే, నవ్వాఁడఁ బరమాత్మ గాక పిసవెత్తి విప్ర యాచీకటుల్, ద్రవ్యింపం బని లేదనుమ్మా మముబోంట్లకఁ మీరి వారిం బలెకఁ.
వరాహ. ౨. ౧౭.

ద్వి. రసఘుటికాసిద్ధి ప్రార్థించునట్టి పిసవెత్తులను జూచి బిందుకే రసము, పరమామృతంబు నివృంద మారుతము... అనుచు నుపదేశ మొం నగుచు...
ప్రభులిం. ౪. ౧౩౨. పా. ౧౯ పం.

పిసాళము. వి. ౧. వికాసము.

క. అంత వసంతము జిత హే,మంతము దీపించె మత్తమధుకరకలభా,క్రాంత మురభృద్వ్రరస క్కాంతము సకలద్రుమములఁ బిసాళము కెలఁగ.
పాండు. ౪. ౧౩.

౨ కాంతి, ప్రకాశము.

గీ దాడిమీబీజరాజికెందళుకు మొల్ల, మొగ్గల పిసాళమును ముత్యములనుపోని, తమ్మి పువ్వింటఁ గోలువున్నకొమ్మ తదయు, దంతు రాలక నుస్నిగ్ధదంతపంక్తి.
పాండు. ౩. ౧౯౨.

౩ వ్యాపనము. (చూ. పిసాళి.)

౪ పరిహాసము

ఉ చాటుప్రౌఢిఁ బిసాళ మాడెదవు కాన ల్నాటిబాపండవో
క్రీడా. ౧. ౯౨.

గీ విప్రనారాయణునిఁ జూచి కెలఁదు లపుడు, కడుఁ బిసాళంపుఁబలుకుల నడపుచుండఁ, బలుకు పలుకులతో డిబ్రమాకులనుబోల, వికృతి లేక తఁ డీక్షింప కెలఁగుపడిరి.
పరమ. ౩. ౧౯౮.

౫. దొంగయుక్తి, కపటప్రవర్తనము.
(చూ. పిసాళి)

జః. పిసాళి, పిసాళించు.

పిసాళి. విశ. (పిసాళము + ఇ³.) ౧. ప్రకాశము కలది శోభావంతము; మనోజ్ఞము.

సీ. జనకకన్యపిసాళిజనుకుంకఁ దోయితో సరియైన మొట్టదామరలు కొన్ని. ఉ. రా. ౬. ౨౯.

చ. అలఁతిపిసాళినవ్వు మధురాధరబింబ ఫలంబు...
పాండు. ౪. ౧౩౨.

మ. కడిమిం జిల్కపిసాళిపిక్క కెడ రెక్కఁ...
నీలా. ౩. ౧౩.

క. గయ్యాళిచిలుక లేక, వయ్యాళిపిసాళిరవాలి వరి నక్కంతక.
సారంగ. ౧. ౧౩౬.

౬. వ్యాపనముకలది, వ్యాపించునది.

చ. మొకరి విసాళితుమ్మెదల మాఁకకు గండపు
గాలిరాకకుఁ, జకిత మృగాక్షి యౌర్వనిఁకఁ
జాలఁ గృపామతి నాదరింపుమా.
రుక్మా 3. ౧౫౪.

చ తొడరి విసాళిజక్కవలఁ దుమ్మెదదాఁటుల
నంచబోదలకా, మడువునఁ బొఱఁదోలుచు.
రసిక. 3 ౪౭.

3 పరివాసనయుక్తము, ఎగతాళితోఁగూడినది.

చ. కలికివిసాళినవ్వు లెసఁగక వటుధూర్తులు
కొంద ఱొండొరుం, దలకొన పెచ్చరించి...
ప్రభా ౧. ౧౦౬.

౪ మూర్ఖము, వివేకములేనిది

ఉ ఆఁకలిదప్పలం బడలినందుకుఁ దోడు విసాళి
కోయిలల్, కూఁక లొనర్చి...
తపతీ. ౪ ౪౮

ఉ. ఈమక్కిడిజంతకుం దగినమొండివిటుండు
నిశాటజాతియం, దొక్కఁడు లేక లక్కఁ
డని యూహాపరుల్ నగఁ జేటగోటిబ,
ల్మొక్కలపుంబిసాళి ఖరము దటికిం జని
నిర్చె నిల్చినన్
చం రా ౫ ౪౧. ఆం భా 3 ౭

౫. వంచకము, దొంగయెత్తుకలది.

శా. చాలుం జాలు విసాళినేఁతలు పదాబ్జాతం
బుపై మాటికిన్, వ్రాలం బోకు భవద్ర్భి
యానఖవిమిశ్రం బైననీవక్షము...
నరస ౬. 3౬

ఉ. అద్దమరేయిదాఁక బొల మారవి మారశిలీ
ముఖావాతిన్, నిద్దరఁ గాచి యున్న మగ
నిన్ జగనీలివిసాళిజంత యుమ్మద్దియ సేవ
సేయ దొకమచ్చట యాడదు మాఁగవోలె.
పాండు. 3. ౭౧; కళా. ౬ ౬3౧

విసాళించు. అ క్రి (√విసాళము.) ౧. ప్రకాశించు, వెలుఁగొందు.

క. అక్కమలజాకర్ణంబులఁ, జక్కనికన్యకలు
పదుకు జనియించిరి లేఁ, జెక్కులదాలుఁ
తళుకుక్కతళుక్క మనఁగ వాలుఁజూపులు
విసాళింపన్. వరాహ ౭. 3

వ విసాళించుచంచలదృగంచలప్రభలన్ ఖచా
రించి. మనుచ ౫ ౧౧౧

౨ బయలుపడు, ప్రకటితమగు

మ...ఇష్టం బెద్ది చే నిత్తు నన్న నిజస్వాంత
విచింత్యమానగిరిజానాథస్వరూపంబు వ్యక్త
నయ కైన భయంబు భక్తియుఁ బిసాళింపం
బ్రవర్తించుచున్ కాళ. ౧. ౭౬

3 వ్యాపించు, ప్రసరించు.

శా చంచల్లీలల హస్తకంకణమణిచ్ఛాయల్ విసా
ళింపఁ బూజించున్ వేమమహీవిభుండు
నవరాళీవంబులం గల్పలన్.
కాశీ. ౧. ౪౦

సీ. సతులమైపూఁతఁ బిసాళించువెన్నెలఁ దనపు
వెన్నెల రసాయనముఁ గూర్చి
పారి ౨ ౪౭ జై భా ౭ ౧౯౭

౪ పరిమళించు

సీ సద్యోవినిర్భిన్నసారంగనాభికామ్యాత మై
విసాళించు మృగమదంబు మనుచ ౨ ౫౫.

వ ఘుమఘుమం బిసాళింప నలందుకొని...
పారి ౨ ౭౭

౫. చలించు, కంపించు

క సంపంగినూనె యంటిన్, శింపాంగి కిరీటి
కొకతె చనదోయి విసాళింపన్
విజవి. 3. ౭౯.

౬. దొంగయెత్తువేయు, కపటముగాఁ బ్రవర్తించు

ద్వి. నీకంటె మిక్కిలి సెలజాణ నేను, కొడుకునకై
విలపించుకొనుచు నీ వున్న, నెడప తిన్వ
రొనర్త రీపను లెల్లఁ, జాలు లేలెమ్మ విసా
ళింప కనుచు ద్వి. వారిశ్చ. ఉ. ౧౯౦౯.

అ. క్రి. స క్రి. పరిహసించు, వేళాకోళములాడు.

స్వీ. లేఁతచందురుఁ బిసాళించు నెన్నుదురు. ద్వి. పారిజా. ఉ ౩౪౦.

వ వొండొరులతో ననేకవిధసరససల్లాపంబులం బిసాళింపుచు నింపు దళుకొత్త. కళా. ౧. ౩౯ కాళి ౪ ౧౭౫.

పిసాసి. వి (సం పిశాచీ ప్రా పసాజీ, పిసాచో, త. పిచాచమ్) పిశాచి, పిశాచము

క. ఆసపడి చుప్పనాతి పిసాసి తనుజ డాసి హృదయజాతానీతా,యాసముఁ దెలిపిన విని పరిహాసము దొలఁకంగ వాతేఁ డాసతిఁ బలికెన్. చం రా. ౫ ౩౭.

విణ దుష్టుఁడు; దుష్టురాలు

సీ సం దెలెంగినదొంగ సాకెవగొట్టు పసాని దిమ్మరి బేరిజము బజారి చెన్న ౭ ౭౪ ప్రబంధ ౪౭౮

పిసి. వి (కు పిని) ౧ తొలియందుబిగఁగొట్టుటకై చెక్కిన స్తంభము, పట్టెలోనగువానిచివర, కసి (శ ర)

౨ కేఁటయం దుపయోగించు సాధనవిశేషము

చ. వలలు నురుల్ సిడుల్ పిసలు వంకరదుడ్డులు పందిపోట్లు... చంద్ర ౭ ౭౧.

పిసికిళ్లు. వి. బ. (√పినుకు) పినుకుటలు, మర్దనములు

మ... కాఁపుగుబ్బెతల పెన్గుబ్బల్ పునాసల్ వెలిం, బిసికిళ్లుం బిసికిళ్లు పాళికల కర్పించెడా నభస్యంబునన్. ఆము. ౪. ౧౩౩.

వ... గోవాళ్లకుఁ దిరువాళ్లఁ జూచువేడుకలలోఁ బిసికిళ్లఫలము గల్పించునుపాయంబు లెంచి... ప్రబంధ. ౪౭.

౨. జొన్నలోనగువాని లేఁతకంకులను నలుపఁగా వచ్చు బియ్యము, ఊఁచబియ్యము.

సీ. కాచేనఁ జొచ్చి తిన్నన్నిజొన్నల గోధుమల పిసికిళ్లు గ నలఁచి తినుఁడు. ద్వా. ౧ ౧౪౧.

మ... కాఁపుగుబ్బెతల పెన్గుబ్బల్ పునాసల్ వెలిం, బిసికిళ్లుం బిసికిళ్లు పాళికల కర్పించెడా నభస్యంబునన్ ఆము. ౪. ౧౩౩.

పిసిడి=పిసిని. విణ లోభముకలవాఁడు, లుబ్ధుఁడు.

సీ పిసిడి యర్థముఁ గూడఁబెట్టిన ట్లావంకఁ బోకుటీగకునైనఁ బొలయ రాదు. కై. ఖా ౧. ౭౪.

ఆ మందులాడి చెడుగుమానిసి బూతంబు, పిసిడి బిచ్చగాండ్లనెన్నుగుదియ. చెన్న. ౭. ౭౪.

ద్వి పరమ ౪. ౫౪౫. పా

జః పిసిడితనము

పిసిడితనము వి (√పిసిడి) లుబ్ధత్వము,లోభము.

చ రసికపుమాటలన్ మనసు రంజిలఁజేయఁగ నేర్చు నీగులం, బిసిడితనంబు లేదు వలపించి యలంపఁడు... బసవయ లక్ష్మణుడ్ రతులఁ బాయుట కంతునిబాయుటే సుమీ. వి. పు. పీఠి. ౪౪

సీ పిసిడితనం బది పిమ్మటఁ దిట్టించుఁ గడు నహంకారంబు కష్టపఱచు. నీతి. ౪౩.

పిసినారి. విణ (పిసిని[1]+ఆరి.) వృత్తియందు వర్ణవికారము, లుబ్ధుఁడు, లుబ్ధురాలు.

సీ వితరణశౌర్యప్రవిష్టునకెకాక మీసము పిసినారి కోనకేల. వేను. ౯. ౭౪.

పిసిని=పిసిడి. విణ. (త. పిసిణీ.) లోభి, లుబ్ధుఁడు.

క. అపిపిసినక్క చాపము, కోపంగిట నితికి నరముఁ గొఱికిన రథసం, బేపార ఖడిసి మర్మనిరూపణ మొనరింప నక్క లోబాచుఁ గూలెన్. వేం. పంచ. ౭. ౧౦౯.

జః పిసినారి, పిసినిగొట్టు, పిసినిపురుగు, పిసిని వాఁడు.

పిసిని². వి. ఒకజాతి పండ్లచెట్టు. (గ్రా).“పిసినిగ” వాడుక.

పిసినిగొట్టు. విణ. (పిసిని + గొట్టు. స్వార్థమున.) లోభి, లుబ్ధుఁడు.

(వ్యవ.) వాఁడు వట్టి పిసినిగొట్టు.

పిసినిపురుగు=పసిఁడిపురుగు. వి. (√పిసిని¹) పట్టుపురుగు, పత్తిమాలి గూఁటిలోనిపురుగు. (గ్రా.)

పిసినివాఁడు. విణ. (√పిసిని₁) లోభి, లుబ్ధుఁడు.

ఆ. పిసినివానియింటఁ బీనుఁగు వెడలిన, కట్టె కోలలకును గాను లిచ్చి, వెచ్చ మూరె నంచు వెక్కి వెక్కి యేడ్చురా. వేమన ౧. ౩౭.

పిసుకు. క్రి. (క. పిసుకు.) ౧. పిండిలోనగు వానిని చేతితో మర్దించు, మెదించు; గట్టిగా నలుపు.

సీ. దిక్కులు వాలుగు తొక్కుచోటికిఁ దెచ్చి పిసికి పిండలి వేసి పిడుచగొనఁగ.

భార. విరా. ౨. ౧౩౪

గీ. గగనలక్ష్మి నిజోరునక్షత్రమాలి, కలు వియన్నది జలములఁగడుగఁబిసుక, వెరయు కెంపుదుపండులనరువనంగ .

ఆము. ౪. ౧౫౪.

చ...మంచునం, బిసికినపంచదార లన...

వైజ. ౬. ౧౭౯

వ...కాసరీదధి మండమూషరంబులుగాఁ బిసికి యూరం బెట్టిన...కలమాన్నంపుఁజల్ది

ఆము. ౪. ౩౫.

౨. (భయాదులచే చేతులు) నలుపు. ఈయర్థమున అర్మకేపదరూపమే ప్రయోగము లందు కానఁబడుచున్నది.

సీ. భాగ్యదేవతలార యీశారి గదవఁ, బెట్టరె యుంచుఁ జేతులు పిసికికొనుచుఁ, గన్నునీర్ల నించుచు వార్తకంతి రైన, యూర్మవల్లభఁ గనుఁగొని యల్ల నగుచు.

హరి. ఉ. ౪. ౧౯౧.

మ అకటా యీరొమ్ము నీళ్ల వండి యిదఁ బుత్ర్యాత్రీలు శేరై ర రేఁ,టికి నాయింటికిఁ దెచ్చి తన్నియుఁ జెనంటిక దోషి శే నంచు నిం,చుక శంకింపక హస్తముల్ పిసికి కొంచుక...

శుక. ౩. ౧౯౭

గీ. బెగడి యేడ్చుచుఁ జేతులు బిసికికొనుచు.

సారంగ. ౩. ౪౦.

౩ (పాదములు మొ. చేతులతో) ఒత్తు, పట్టు.

క. ఒద లంటఁ గాళ్లు పిసుకం, గదవెఁడు వేన్నీళ్ల నీయఁ గంచము వెట్టక.

శుక. ౩. ౩౪౪.

౪. (చేతులతో) అదుము, నొక్కు.

ద్వి కదలక మెదలక కాలితో మూఁది, కదియంగ వెసఁ బట్టి కత్తుకఁ బిసికి.

ద్వి. హరిశ్చ. ఉ. ౨౭౯

౫ గట్టిగా కలుపు

ద్వి వన గూర్చు కృతులు వావద్లును బెరుఁగుఁ, బిసుకుచందపు బిలిబిలికృతుల్ కృతుల.

పండితా. దీక్షా. ౬. పా.

పిహితము. సం. విణ. (అ. ఆ. అ) ౧. కప్పఁబడినది, ఆచ్ఛాదితము. వి. అ. న. ౧. ఒక అర్థాలంకారము

శ్లో. పిహితం పరవృత్తాంతజ్ఞాతుః సాకూత చేష్టితం,ప్రియే గృహాగతే ప్రాతః కాన్తా తల్ప మకల్పయత్.

## పీ

పీ.=పీయి, పియ్యి. వి (క. పీ. త. పీ) పురీషము, మలము. చూ. పీగ్రద్ద.

పీంగాడి=పింగాడి. వి. లోహపాత్రవిశేషము.

సీ. ఘర్మరికలును బింగాండ్లు తాంబాళాలు
గిన్నెలు పింగాణిగిన్నెలు కొప్పెలలు ..
హంస. ౫. ౩౫౩.

పీక. వి. అటవికులు ధరించు శిరోభూషణ విశే
షము, పక్షియీకలతోఁ జేసిన ఒకవిధమైన
తురాయి

మ. పులితోల్కాసెలనంటదోఁపిన పిడెంబుల్
పీలిపూఁదావ కం,బులు బల్ పింగపుఁజించు
దండ కడియంబుల్ చెంపలం జెక్కు పీఁ,కలు
కెం జేగుఱుబొట్లు జంజరుపిగల్ కారింపు
మైపూఁతలుఁన్... పారంగ. ౧. ౬౩.

సీ. చారుసుధాధామశకలావతంసంబు పెదకో
ప్పుపైనుండు పీఁకగాఁగ. పూర. ౩. ౪౧.

సీ జడకొప్పు కెళవింఛపుఁ ద్రాటి చుట్టగా బిస
రుహహితరేఖ పీఁకగాఁగ. కాశ. ౪ ౧౩౭.

సీ. పాలకంపు జంజారు కలపీఁక బొమిడికతోలు
చల్లడముపై నీలిదట్టి.
సానందో. ౫. ౭౩. పా.

పీకవని(న్ని)యలు. వి బ. పైపై వన్నెలు,
పైపై మెఱుఁగులు.

సీ. పిలుపిచ్చు విద్యలు పీఁకవన్నియలును బెళు
చదనంబులు ప్రేలడములు

గీ. దుర్గుణంబులప్రోవులు ద్రోహమతులు, వార
కాంతలఁ దదవిన వచ్చుఁ గీడు.
పాండు. ౩. ౪౩.

గీ. ద్రవిడ పరిచారకులనోలి దరుణిశేఖ్య, లద
పములు పూనిరాఁగొండ ఆప్పెలంది, వెన్నెల
లసారజపుఁ బీఁక వన్నెలలరఁ, గంకు గురు
పల్లకీసేవగాంతు రందు. వైజ. ౨. ౪౩.

పీకు. స. క్రి. (క. పీకు) ౧. పెఱుకు, పైకిలాగు.

ఆ. తక్క రేమెఱుంగు గురులింగజంగంబు,
చిక్క రొండిసిపట్టి పీఁకుఁగాక.
పేమన. ౨. ౩౩.

వ్యవ. వాఁడు చేనిలోని గడ్డియంతయుఁ బీఁకి
వేసినాఁడు.

౨. పీడించు, బాధించు.

వ్యవ. తన కిమైన బదులిమ్మని వాల్గు దినముల
నుండి వాఁడు నన్ను పీఁకుకొని తిను
చున్నాఁడు (ఇట స్వార్థమున, 'కొను')

వి. పెనఁగుట. (చూ. పీఁకులాడు, పీఁకులాట)

జ. పిరుపీఁకు, పిరుపీఁకులాడు, పిరుపీఁకులంపెట్టు,
పీఁకులాట, పీఁకులాడు, పీకుపీకాడు.

పీఁకులాట. వి. (√ పీఁకులాడు) పీఁకులాడుట,
పెనఁగులాడుట; చిక్కు, బాధ.

వ్యవ వానితో నా కెంతో పీఁకులాటగా
నున్నది, ఈ వ్యవహారములో పీఁకులాట
పెట్టకుము.

పీఁకులాటబేరము=తెగకుండ చిక్కులుపెట్టు
బేరము.

పీఁకులాడు. అ. క్రి. (పీఁకులు+ఆడు) పెనఁగు
లాడు.

గీ. కునిసిన నరాంగకశులఁ బొత్తులను గమిచి,
పాశ రెుండొంటితోఁ బోరి పీఁకులాడు,
శ్వాపదంబులు...
ఆము, ౬. ౧౩ (వేదం.పా)

పీకుపీకాడు. స. క్రి. (పీఁకు+పీఁకు+ఆడు.
క. ర.)

సీ....పితవికారమై పిరరుబాధ, చారు శరీర
సంచయముండఁగా దీనిఁ గంకశివాగ్వ్రధ
కాశకులము, లాదిగాఁ గలుగు క్రవ్యాద
ముల్ పీఁకు పీఁకాడుట పెంగిలియరుర్వ
నకట. భార. స్త్రీ. ౨. ౧౪.

౨. మిక్కిలి వికలముచేయు, పెఱుచు.

శా. ..తోఁటియు, కృప్తత్వంబును దక్కి
ద్రుక్కి వగ బుద్ధిం బీఁకు పీఁకారఁగాఁ
జేష్టాహీనతఁ బొంది యగ్గురుఁడు సంక్షి
ప్తాంగుఁడై యున్నాఁడదే.
భార. ద్రో. ౫. ౩౨౦.

పీఁక. వి ౧ కంఠనాళము.

వ్యవ దొంగలు ఆశిశువు పీఁక పిసికి చంపినారు.
౨. కంఠధ్వని; కూఁత, అఱపు

శా. ఈలల్ పీఁకలు దిక్కులం జెలఁగఁగా మెచ్చో
మృగశ్రేణిపై, గాలింబోవక సన్నదప్పు
టయు... కాశీ ౩ ౫౮

ఆ. పీఁకపెట్టి యీలవెట్టుచు బడిబడిఁ, బాఱు
తెంచి చుట్టు వాఱుకొనిరి, దివ్యరత్ననికరదీ
దీప్యమానమై, యతిశయిల్లు రాజసుతుని
యిల్లు పారంగ ౩ ౭౮. ("కూఁకపెట్టియీల
గొట్టుచు" ప్రాఁతప్రతిపా)

౩. సన్నాయి మున్నగు ఊఁదెడువాద్యముల
ముఖమునఁజొప్పించెడి తాటాకుతోఁ జేయఁ
బడిన ద్విదళరూపమైన సాధనవిశేషము
(నాగసరములోనగు వాద్యముఖమునఁ జొప్పిం
చెడు క్రోవిపుల్ల అని శ ర)

౪. ఊఁదుట కుపయోగించు ఆకుచుట్ట, బూర.

సీ. నిడుపున నాకులుమడిచి పీఁకలుచుట్టి
యూఁదుచు నటియింతురొక్కచోట
వి. పు. ౭ ౧౫౧

౫. కాల్పఁగా మిగిలిన పొగచుట్ట.

(వ్యవ.) వాఁడు వీధిలోఁ బాఱవేసిన చుట్టపీఁక
లేఱికొని పోవుచున్నాఁడు.

క. పీఁకపొగ యమృతపానము, చేకొని పొగ
చుట్టమహిమఁ జెప్పం దరమా, నాకొనఁగ
రాదు సుడిసుడి, యాకసనఁ బొగద్రాఁగు
వాఁడె దవాఁడో వాతుఁడో. (చాటువు.)

చూ: పీఁకపాఱు.

పీఁకపా(వా)ఱు. అ క్రి. (పీఁక+పాఱు)
౧. పీఁకవఱకుగల్లయగు.
౨ కృశించు, చిక్కు.

గీ. కలమగర్భంబు లామహోత్పలదళాక్షి, చిక్కు
లకు నోడి తద్దయుఁ బీఁకపాఱి, వెన్ను చూపి
తృణం బూని యున్నరాని, వానఁ దల వంచు
చుండె నసారతంబు రసిక. ౨ ౧౦౧

సీ. బలురాజనంపుఁబొట్టలు పీఁకవాఱెఁ బో
ముద్దియపిక్కల కుద్ది గాక
అచ్చ. రా. అర ౨౨

(౧ ౨. అర్థముల కివి యుదాహరణములు)
౩ చప్పటయగు, (శ. ర గ్రా.)

పీఁచేమడఁగు. అ క్రి (పీఁచేము+అడఁగు)
ఉక్కడఁగు, నశించు

ఆ. ఇతఁడు పరమహంసుఁ డే నిక్కముగను
గ్రాకున్న నుగ్రగతిని నుండు పెట్టు, లిమ్మ
హాత్ము తేజ మెనసినఁ గువలయం, బెల్లఁ
బీఁచమడఁగదే తలంప చిత్ర భా. ౨ ౫౩

గీ. ఎచట దైత్యులు మెలఁగెద రచటఁ గదిసి,
పీఁచమడగింతు
భార అర ౧ ౫౧

పీఁచేమడ(ణ)ఁచే. స క్రి (పీఁచేము+అడఁచు)
ఉక్కడఁచు, చంపు, వధించు

సీ. చక్కాడె మురమూడెఁ జాఁగిలాడెను
బిలుకుమార్చెను ద్రుంచెఁ బీఁచేమడఁచె...

గీ. అడఁచెఁ జెండె నవంగఁ బొందగు వధించె,
నసుటకు సమాఖ్య లై...
అం. భా. ౩. ౧౨౩.

క. అకట తమమహిమ తా రెఱుఁగ, గిరిరో
మతి రేఁలో తెగరుగాక మరుత్కం, టకుఁ
బీఁచేమడంపనె వ, న్నొకనిని పంపినన
దమునితోఁగము బలిమిక. ప్రభా. ౨. ౫౭.

సీ. తగరుకై ఖరిఁ దూఁటి తెగువ నీవురగాలి
పీఁటవెట్టినపందిఁ బీఁచేమడఁచు.
సారంగ ౧. ౯౭.

చ. .అచ్చటికూరుల వానితోఁడుతఁ, నలివడఁ
గెండి పీఁచేములణంచి నమం బ్రమదాత్ముఁ
జేయవే. వీర ౪. ౪౭.

పింఁచేము=పించేము. వి (సం పింజమ్) ౧ శక్తి
బలము

సీ లావు సత్తి సత్తువ బల్మి పీఁచే మోవిక
యన వెలయు శక్తి ఆం భా ౨ ౨౨౧

౨. గర్వము, మదము.

ఉ తమ్ములదిక్కుఁ గన్గొనుచు దైత్యులపీఁచ
మడంగిదరొ్యోడుం, గ్రమ్మఱఁ దోఁచె పీఁ
డొకఁడు .. నిర్వ ౯. ౯౭.

క నిఖఁ దొలుత ససైన్యముగా, వనిలోఁ
దెగటార్చి పిదప యాదవుల జనార్దన
పూర్వజపూర్వకముగఁ, దనుమదు నీపీఁచే
మడఁగ దుర్దమశక్తిః
హరి. ఉ ౨ ౨౭

ద్వి. పెక్కండ్రు దైత్యులపీఁచేంబు లడఁచి,
పెక్కుచందంబులఁ జేర్చినఁ జానిఁ, దప్పక
విక్రమధనుఁడు కోపించి, విప్రైనవానర
విధునివక్షంబు, శూలంబు గొని పొడుచుట
యును. రం రా యు. ౩౫౪
పా. ౨౭ పం

జ: పీఁచేమడఁగు, పీఁచేమడఁచు.

పిఁచేర. వి. శతావరి, పిల్లపీఁచేర. ?

సీ...పిల్లపీఁచేర యనఁ బీఁచేర యనఁ, గి బ్రబ
లును శతావరి ఆం. భా. ౨. ౫౫.
హంస. ౪. ౧౦.

పెఁచే. వి. (క. పీచు) ౧. పెనఁచుకొని కొన్ని
పదార్థముల లోపలనుండునార.

(ఉదా! కొంకాయపీఁచు, బీఱకాయపీఁచు)

గీ ఏఁచమాటలు జరగొన్న పీఁచుఁగురులు,
గలుగుపెఱుకులు దగఁ బొదగనఁగ వచ్చి.
యయా. ౧. ౩౦.

౨. మీఁదిచర్మము, పైపొర

ఉ వాలుకబంతి క్రేలఁబడి నంజావఁ దోఁగి
తమాలపల్లవ, శ్రీల హసింప నబ్బి కనఁ
గ్రేవల కేవులు పుక్కిలింపఁగా,వాలికమెనిపీఁ
చెగయ వాడినమాల్యమువోలె వాదిమ,
వ్యాళము దీనిపగ్గ మయినట్టియవస్థఁ దలంతు
చెప్పదుకా మనుచ. ౫ ౫౦.

(వ్యవ) వారందఱు ఆదొంగను పీఁచు కేఁగఁ
గొట్టివారు

పీఁట. వి (సం. పీఠః) కట్టి మున్నగువానితోఁ
గూర్చుండుట కుపయోగపడునట్లు చేయఁబడిన
పలక. (చూ. పీఁటమీఁదపెండ్లి)

—పీఁట(అ)మీఁద(టి) పెండ్లి=సిద్ధమైన పెండ్లి

గీ జారయనుపేరు విన్నంత జాఱుటయును,
బీఁటమీఁదటి పెండ్లిండ్లు పెక్కు కెడసె.
శుక ౨. ౧౫౩.

జ: పీఁటవెట్టు

పీఁటవెట్టు. స క్రి (పీట+పెట్టు) నిలువరించు,
నిలుపు, ఆఁపు

వ ..ఒక్కపురాణ వృత్తాంతంబు కల దంచు
మాటలఁ బీఁటవెట్టి యాపెట్టిపట్టితోఁ జల
పట్టి పచ్చచట్టుపలపిట్టదిట్ట యి ట్టనియె...
శుక. ౨. ౨౩౭.

అ. క్రి. కదలక యొకచోటనే పాదుకొని
యుండు, స్థిరముగానుండు

గీ. ఈఁటెపోటులఁ బడి క్రేవు లీఁదులాడఁ,
బోయి పోలిక దగ దొట్టి పొదలు సొచ్చి,
బెండువడియును బోరకిడు పీఁటవెట్టి,
చూపులచె యొప్పుఁ బ్రజ కొక్కసూకరంబు.
మనుచ. ౪. ౪౭.

పీతపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. వృశ్చికఘ్ని, తేలు మణి. తె.

పీతపాద. సం. వి. ఈ. స్త్రీ. శారిక, గోరువంక.

పీతపుష్పము. సం. వి అ. పుం ౧. కాసమర్దము, కసివెంద. తె. ౨. కూశ్మాండము, గుమ్మడు. తె. (శే. ని)

పీతప్రసవము. సం. వి అ పుం పచ్చగన్నేరు. తె.

పీతఫల(క)ము. సం వి అ పుం ౧. శాఖోట వృక్షము ౨. కిర్మారము, వెదురు. తె

పీతభద్రము. సం వి అ పుం కర్ణికారము, కొండగోఁగు. తె.

పీతభృంగరాజము. సం. వి అ. పుం పచ్చ పువ్వులగలికేరు. తె.

పీతమణి. సం వి ఇ పుం. పుష్యరాగము

పీతము. సం విశ (అ. ఆ. అ) ౧ త్రాగఁబడి నది ౨. పసుపువన్నెముగలది

—వి అ పుం. ౧ పసుపువన్నె. ౨. పుష్యరాగమణి. ౩ కుసుంభము, కుసుమపూవు. ౪. గంధకము. (వై. ని), ౫ అంకోలము ఊడుగు తె. ౬. శాఖోటము. తె ౭. ఎంద్రకాయ.

—న—౧ బంగారు. ౨. హరిదళము ౩. పానము, త్రాగుడు.

పీతముండము. సం. వి. అ. పుం. బంగారుపచ్చుక, పచ్చకలవిచ్చుక. (వై ని)

పీతముద్గము. సం. వి అ పుం. పచ్చపెసర. తె.

పీతమూలకము. సం. వి. అ. న. ముల్లంగి. తె.

పీతయూథి. సం. వి. ఈ. స్త్రీ. పచ్చమొల్ల,స్వర్ణయూథి. తె.

పీతరక్తము. సం. విశ. (అ. ఆ. అ.) పసుపుగల సిన యెఱుపువన్నెగలది.

—వి. అ. న. పుష్యరాగము.

పీతరాగము. సం విశ. (అ. ఆ. అ) పీతవర్ణము గలది.

—వి అ పుం. పీతవర్ణము —న—౧ కింజల్కము, అకరువు. ౨ సిక్థకము, మైనము.

పీతరోహిణి సం వి. ఈ. స్త్రీ. కాశ్మరి, గుమ్మడు. తె

పీతలకము. సం వి అ న పిత్తళము, ఇత్తడి.

పీతలము. సం విశ (అ. ఆ అ.) పీతవర్ణముగలది.

—వి అ పుం.పీతవర్ణము.—న—ఇత్తడి.

పీతలోహము. సం వి అ. న ఇత్తడి. (వై. ని.)

పీతవాలుక. సం వి అ స్త్రీ పసుపు తె.

పీతవాసస్సు. సం వి స్ పుం పచ్చవలువ దాల్పు, శ్రీకృష్ణుఁడు. (హలా ని.)

పీతబీజ. సం. వి ఆ స్త్రీ. మెంథిక, మెంతిచెట్టు

పీతవృక్షము. సం.వి అ.పుం. శ్యోణాక భేదము. తె.

పీతసారకము. సం. వి. అ పుం ౧. సర్జకము. పేగిస. తె. ౨ అంకోలము, ఊడుగు తె. ౩. నింబము, వేము. తె.

పీతసారము. సం. వి. అ. పుం. ౧. గోమేదకమణి. ౨. బర్బూరము, తుమ్మ. తె. ౩. అంకోలము, ఊడుగు. తె. ౪. కురుమ్కమను గంధద్రవ్యము.

—న—౧. మలయపర్వతపుపచ్చ చందనకాష్ఠము. ౨. హరిచందనము. తె.

పీతసారి. సం. వి. ఇ. న. స్రోతోంజనము.

పీతసాల(క)ము. సం. వి. అ. పుం. పేగిస.

పీతస్కంధము. సం. వి. అ. పుం. ౧. పంది. ౨. పీతవర్ణముగల కొమ్మలతోఁగూడిన వృక్షవిశేషము.

పీతస్ఫటికము. సం. వి. అ. పుం. పుష్యరాగమణి.

పీతహరితము. సం. వి. అ. పుం. పసుపుగలపీన యాకుపచ్చ.

పీతాంగము. సం. వి. అ. పుం. శ్యోనాకభేదము. కై.

పీతాంబరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పచ్చబట్టలుగలవాఁడు.

—వి. అ. పుం. ౧. విష్ణువు, పచ్చవలువవాఁడు. ౨. శైలూషుఁడు, నటుఁడు.

పీతాశ్మము. సం. వి. న. పుం. పుష్యరాగము.

పీతి. సం. వి. ఇ. పుం. పీతి, గుఱ్ఱము.—స్త్రీ. ౧. పానము, త్రాగుట. ౨. గతి, పోక. ౩. కల్లుదుకాణము. ౪. ఏనుఁగుతొండము, కుండ.

పీతిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రానిపసుపు. ౨. స్వర్ణయూథి. కై. ఒకజాతిపచ్చ అడవిమొల్ల.

పీతిగోరువంక. వి. (పీయి+గోరువంక) విట్చారిక, ఒకజాతి గోరువంక పిట్ట. (శ. ర.)

పీతిరిగద్ద=పీగ్రద్ద. వి. (పీయి+గద్ద) ఆతాయి, చీపరపిట్ట. (శ. ర.)

పీతిరిగుంట. వి. (పీయి+గుంట) మురికిగుంట. (శ. ర.)

పీతిరిడొంక. వి. (పీయి+డొంక) మలమువరిదుర్వాసనగొట్టు డొంక.

ఉ. పోడులబ్రోడులార కడుఁ బూచిన పీతిరిడొంకలార బల్, కాడిచెట్టులార. చంద్ర. వి. ౨. ౧౦౦.

(పీతిరికుక్కలార. ప్రాతప్రతి పా.)

పీతువు. సం. వి. ఉ. పుం. ౧. సూర్యుఁడు. ౨. అగ్ని. ౩. యూథపతి, ఏనుఁగుల గమికాఁడు. ౪. పక్షి. (వై. ని.) ౫. ఉగ్రగిన్నె. ౬. కన్ను. (కే. ని.)

పీత్వాస్థిరకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) త్రాగిన పిదప కదలక మెదలకుండువాఁడు.

పీథము. సం. వి. అ. పుం. ౧. అగ్ని. ౨. కాలము. ౩. రక్షణము. ౪. పానము.—న. ౧. జలము. ౨. నేయి. ౩. పాలు. (వై. ని.)

పీథి. సం. వి. ఇ. పుం. గుఱ్ఱము.

పీథుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

పీనక్రోష్ఠి. సం. వి. ఈ. స్త్రీ. పెసలు మొదలగువానిపొట్టు, ఊంబ. (వై. ని.)

పీనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. స్థూలము, బలిసినది, బలుపుగిలగి. ౨. పెరిఁగినది, వృద్ధము. ౩. నిండయినది, సంపన్నము. ౪. మిక్కుటమైనది, అధికము.

—వి. అ. పుం. స్వేదము, చెమట. (శ. ర.)

—న. ౧. స్థూలత్వము. ౨. సంతోషము. (శ. ర.)

పీనస. సం. వి. ఆ. స్త్రీ. కర్కటి, దోస. కై.

పీనసము. సం. వి. అ. పుం. రోగవిశేషము, పడిసెము.

పీనస్కంధము. సం. వి. అ. పుం. అడవిపంది. (వై. ని.)

పీనాహము. సం. వి. అ. పుం. ఇటికలోనగువానిచేత కట్టఁబడిన నూతివాతికట్టు. కాగాఁడి.

పీనుఁగు(స్గు). వి. (క. పేణ, త. పిణం) శవము, మృతకళేబరము, ప్రాణముపోయిన బొంది.

క. నానాస్త్రంబులు మందలు, కే ని గుడక్ బడలువడిన పీరభటులపై, నేనుంగుల గుఱ్ఱంబుల, పీనుంగులమీఁదఁ దేరు పెలుచం బఱ పెన్. భార ద్రో ౪ ౨౫

క పీనుఁగు నంటరు మాదృశు, లై నెగడెడు పెద్దవాఁ లందును జూడం,గాను మహా మాశోన్నత, యీనీయెడు పూజనంబు హేయము నాకున్ హరి ఉ ౫ ౨౪౦

క తనయొకలం గలసెత్తుస, ధనహీనుని విడిచి పోవు దారాదిసుహృ, జ్జనములు విడుచుట యరుదే, మనుపీనుఁగు నిర్ధనుండు మదిఁ బరికింపన్ విక్ర ౨ ౧౩౨.

—నడపీనుఁగు = (నడమంట్రపువాఁడు), పీవచ్ఛవము, నిస్సారుఁడు

క గడన గలమగనిఁ జూచిన్, నడుపులకును మడుఁగు లిడుదు గతివలు లేరులో, గడ నడుగుమగనిఁ జూచిన, నడపీనుఁగు వచ్చె ననుచు నగుదురు సుమతీ సు శ ౪౩

—పీనుఁగుపెంట = శవములప్రోవు

క. ఏనుఁగునెత్తుట గదయుం, దానుఁ దడిసి విలయకాలదండధరునిచం, దానం బావని మాగధ, సేనం బీనుంగుపెంటఁ జేసి చెలంగన్ భార భీష్మ ౨ ౨౧౪.

ఉ. పీనుఁగుపెంటలై యొకటి పేరును పెందును లేకయుండున, ట్లీనుఁగులుల్ హయంబులు సమృద్ధ జనావళియుం బకంగ హరి పూ ౫ ౪౭.

జ: పీనుఁగుదిండి

పీనుఁగుదిండి. వి (పీనుఁగు + తిండి) పిశాచము (శ. ర.)

పీనోధ్ని. సం వి ఈ స్త్రీ బలుపయిన (పెద్ద) పొదుఁగుగలయావు

పీపరి. సం. వి. ఇ. పుం. ప్రాస్వప్లక్షము, బొట్టి జువ్వి

పీయి=పీ, పియ్యి. వి. ఓ (క. త పీ.) పురీషము, మలము

(వృత్తియందుఁ గొన్ని పట్లవర్ణాధిక్యము—చూ. పీతిరిగద్ద, పీతిరిగుంట)

చ ఉదరమునం ధరించి ప్రసవోద్భవవేదనఁ బొంది పిమ్మటన్, ముదిమిది రైనపీతఁ బడి మూత్రిమునం బడిలజ్జ వండుగా, నదపద గ్గైన తల్లికిఁ బ్రియంబొ సుతుండు వృథాభిమానదుర్మదుఁ డగుతండ్రికిం బ్రియుఁడొ మానసవీథిఁ దలంచి చూడుమా హార. ౨ ౫౭

జ. పీతిగోరువంక, పీతిరిగద్ద, పీతిరిగుంట, పీతిరి డొంక

పీయుష సం వి ఉ పుం ౧. కాకి ౨ సూర్యుఁడు ౩. అగ్ని ౪ గుడ్లగూబ ౫ కాలము. ౬ బంగారు (విల్యమ్సు) ౭ కిరణము. (శే ని)

పీయూషమహాస్సు. సం వి స్ పుం ౧ చంద్రుఁడు ౨ కర్పూరము (వాచ)

పీయూషము. సం. వి. అ. న. ౧. అమృతము. ౨. ఈనిన యేడునాళ్లలోని యావుపాలు.

పీయూషవర్షుఁడు సం వి అ పుం. చంద్రుఁడు.

పీయూషవర్షము. సం వి అ పుం. ౧ అమృతపువాన ౨. కర్పూరము.

పిరంగి=పిరంగి. వి. యుద్ధమునందు మందుగుండ్లు వేసి పేల్చెడు పెద్ద లోహపుఁగ్రోవి, యుద్ధ సాధనవిశేషము.

గీ...మగ్రక్రోవి పిరంగి బాణము గుంటుక్రోవి, జబురుజంగి తుపాకి జజా యనంగ, వెలయు నగ్నిప్రసారకాఖ్యలు మహాశ ఆం. భా. ౨. ౨౧౪.

పీరి. వి. తృణవిశేషము, ఒకజాతిగడ్డి

చ. పొను కెడ పీరి తోఁణగియు పొత్తరము...
ప్రబంధ ౨౦౦

పీరు[1]. వి. స్త్రీగర్భాధార, గుమ్మ (శ. ర)

పీరు[2]. వి తురకలు మొహరము పండుగలోఁ
బూజించు విగ్రహము (గ్రా)-శ ర పీర్లు
అని. బ.గా గ్రహించెను)

జః పీరుజాదా

పీరు[3]=పీలు. అ క్రి పిగులు, చిటులు.
(శ ర, గ్రా)

పీరుచే(ర్చు)=పీలుచే. (శ ర)

పీరుజాదా. విణ (పీరు[2]+జాదా—హిం జా దా=
కొడుకు) పీర్లను బూజించువాఁడు

సీ. పూతాత్ము లగునవస్థాతలు నీ కేల తలచుచుగా
పీరుజాదాలె కలరు సిం వారి శ. ౪౧

పీల. విణ (క పేల) బక్క, కృశము

ఉదా పీలచేతులు, పీలపంట, పీలగింజ

(వ్యవ) పెండ్లికూతురికన్న పెండ్లికొడుకు పీలగా
నున్నాఁడు

పీలకము. సం విణ (అ వికా. అ) గోధకము,
అడ్డగించునది

—వి అ పుం పిపీలిక, చీమ.

పీలి=పికిలి,పిక్కిలి,పిగిలి. వి ౧ ఒకజాతిపక్షి

ఆ. ఒక్కరొయొకరుకోడు నక్కకొమ్మను నిజ్జీ,
గోఱజంబు జున్నుఁ జాఱపప్పుఁ, బీలిగఱుల
యాపకోలు పెలవిడ్లుఁ, గాను కిచ్చి కర
యుగంబు మొగిచి. మనుచ. ౪. ౧౪.

౨. (క. త. పీలి) నెమిలి 3. నెమిలిపురి,
బర్హము; నెమిలియీఁక. (చూ. పీలిగరగ,
పీలిచొప్పము. మొ.)

౪. ఓడనడపుచుక్కాను. (శ. ర, గ్రా.) చూ.
పీలికాఁడు.

జః పీలికాఁడు, పీలికుంచె, పీలిగరగ, పీలిగరగ
వాఁడు, పీలిజల్లి, పీలిజల్లెడ, పీలిదండ, పీలి
చొప్పము, పీలిసురఁటి, పీల్కుంచె

పీలిక. వి (√పీలు) చినిఁగినబట్టముక్క, శీర్ణవస్త్ర
ఖండము (శ ర, గ్రా)

పీలికాఁడు. వి (పీలి+కాఁడు) ఓడచుక్కాను
త్రిప్పువాఁడు, మాలిమికాఁడు

చ కవి కవితాబ్ధిలోన ముఖగహ్వర మోడయు
జిహ్వ త్రెడ్డు హృత్పవనుఁడు పీలికాఁడు
మృదుభావులు రత్నములు...శివరా. ౧ ఉ.
ఆం భా ౧ ౧౫౭.

గీ నాకు మానీతిపదము మంత్రికి నెలవు, మంత్రి
లేకున్న రాజ్యంబు మనుజపతికిఁ, జెక్క
వది యెంత గలిగినఁ బీలికాఁడు, లేని
పేరోడ చక్రంబు లేనిరథము.
పి శకం ౪ ౧౪౯, వరాహ ౫ ౭౬.

పీలికుంచె. వి (√పీలి) పికిలిపిట్ట యీఁకలతోఁ
జేసినకుచ్చు

గీ పీలికుంచెతలాటంబు వేరజంబు, మణులపెంగ
మ్ముట్టువన్ని పాహిణి యొకండు, కర్తయొదు
టికి గొనివచ్చె గంధవాహ,బాంధవం బగు
నొకమహా సైంధవంబు మనుచ. ౪. ౭౫.

పీలిగరగ. వి (√పీలి,క.పీలిగరగ) నెమిలి
యీఁకలతో నలంకరింపఁబడిన జలకుంభము.
చూ పీలిగరగవాఁడు.

పీలిగరగవాఁడు. విణ (√పీలి) పీలిగరగమోయు
వాఁడు

వ ..పీలిగరగవానికి ౫౨ (వృత్తి.) చే. శా.
శక. ౧౧౩౫. Ep Ind Vol 5.

**పీలిజల్లి.** (పీలి+జల్లి) నెమలిపింఛముతోఁ జేసిన జల్లి, నెమలిపురితోఁ జేసినకుచ్చులజాలరు.

గీ. కటికరటి కంఠపీఠిపైఁ గంతుఁ దనెడి, బిరుదు
మావంతుఁ జేసినపీలిజల్లి, నెంపుగను పెన్నె
లులుగుంపు ప్రిదిలి జార, వచ్చె నొకసతి
వసుమతీవరునిఁ జూడ వసు. ౬. ౧౧

**పీలిజల్లెడ.** వి (√పీలి) పీలికుంచె

ద్వి విరిసి పైఁ దూఁగు నీవెలఁదులజడలు,
వెరయు విరోధుల పీలిజల్లెడలు.
ద్వి మరిచ. పుం ౧౦౭౭.

**పీలిదండ.** వి. (√పీలి) నెమలిపురిదండ, నెమలి యీఁకలమాల.

గీ. ఆదిదేవుఁ డిప్పుడు గొల్లఁడై ముదమునఁ,
బీలిదండసెట్టెము చుట్టి పిల్లఁగ్రోలు, శేలఁ
బట్టి గోవులబడిఁ గేలి సలుపఁ, జూడఁ
గంటి నా కిది యేమి సుకృతఫలమొ
హరి పూ ౭ ౭౦

**పీలిసెట్టెము.** వి (√పీలి) నెమలిపింఛముతోఁ జేసిన తలపాగ, బర్హావతంసము

ఉ. విచ్చినకన్నుఁదమ్ములకు విందులు పెట్టు
వెడందకన్నులున్, బచ్చనిపట్టుఁ జేరరమఁ
గ్రాఁకినమచ్చయుఁ బీలిసెట్టెమున్, బచ్చిక
చాయయున్ జిలుకపాయము గల్గి వెలుంగు
నిచ్చలో, రచ్చ యొనర్ప నందలిపరాకునఁ
దేలుచు వేడ్క నేలుచున్
పాండు. ౪. ౪౯

**పీలిసురఁటి.** వి. (√పీలి) నెమలిపింఛముతోఁ జేసిన వట్రువ విసనకఱ్ఱ

సీ. అలఁతి దంతంపుఁగామలపీలిసురఁటులు శో
ధించి వడిచిన జంటి శౌరి.
పి. శకుం. ౧. ౯౭.

**పీలు**=పిలుకులు, పిగులు, పీరుసే. అ. క్రి. వస్త్రము కొండలగునటు విగుపుచే చినుఁగు.

ఉ పిగిలెఁ బీలె వనఁగఁ గొంపొందుచుండును,
జినిఁగె ననుట గ్రామ్య నికషమూర్య.
ఆం భా. ౩. ౯౧.

జ: పీలిక.

**పీలుకము.** సం. వి అ న ౧. చీమ, క్రిమి భేదము.

—పుం పక్షిపిల్ల. (శ ర.)

**పీలుచే (ల్చు)** స క్రి (క త. పీర్, హీర్.)

౧ జుట్టు, చప్పుడు కలుగునట్లుగా త్రాగు, పానముచేయు, (దీనికి పీలుచుట, పీలుచమి, పీలు వక, పీలుచకము, మొ॥ రూపములుసిద్ధించును.

సీ అరవింద మందిర యామోదముగఁ బీల్చు
కొందటిర త్తిమమించు ముద్దుకాంచి
దశా. ౩. ౧౪౫.

గీ. ధరణినాథానసేందుమధురసంబు, సౌధ
జాలమృణాళికాజాలకముల, నుత్పలాక్షి
కటాక్షనీలోత్పలములు, ప్రేమమునఁ దప్పి
వోవంగఁ బీల్చుకొనియె నైష. ౪. ౭౭

సీ కడఁకమై శే నాని కనపుబొందములట్ల జెట్టి
దంబుగఁ దల ల్పీల్చికొనుచు
అచ్చ. రా యు. ౭౪౫.

(తలలు=తలలోని రసము) అనిభావము.

౨ ముక్కుతో లోనికి ఎగలాగికొను.

సీ. మును ననల్ దమిఁ బట్టి ముంగాళ్ల ముక్కు
జోడనలఁ బీలిచి వసర్కొనిన విడిచి.
ఆము. ౫ ౧౧౪.

(వ్యవ.) చెడుగాలి పీల్చుటచే ఆరోగ్యము చెడును

ఏనుఁగు తొండముతో నీళ్లు పీల్చుకొనిత్రాగును.

౩. మ్రింగు, కబళించు.

మ. ఇలకుం గల్గినజీవనంబుల నిజానిష్టోగ్ర
మార్తండమండల మానం దనపైరవైరి సఖుఁ
డాటం ద్రవించిల్చి యున్నయ్యల గొక్కు

ష్మడిఁ గ్రుమ్మరింపఁ దగుఁ దా నెం తైన
నం తైనమంజులముగ రాజు పాసంగఁ
దాల్చుగతి మింటం బర్వె నీలాభ్రమాల్.
ఆము. ౪. ౭౭.

౪. ఇంకఁజేయు; హరింపఁజేయు.

వ...తప్తాయఃపిండం బాక తోయకణంబుం బీల్చి
నకైవడి బడబాగ్ని విజృంభించి యమ్మహాం
భోరాశిఁ బానంబుసేయు ..
పీఠారా. ౨. ౧౫౭

తే. అతని రావించి నావిచారానువృత్తిఁ, జెప్ప
దనా దీనిజేటివిచార మింకఁ, గమిచి
నామేనిర క్తమాంసములఁ బీల్ప,సాఁగె నతి
గాఢతరబరజ్వరరాగ్ని శుక. ౨ ౨౫౧.

పీలుని. సం. వి. ఈ. స్త్రీ. చాఁగ, మూర్వ. కీ.

పీలువర్ణి. సం వి. ఈ. స్త్రీ ౧ మూర్వ,
చాఁగ. కీ. ౨ బింబిక, దొండ. కీ.

పిలుపత్త్రము. సం. వి అ పుం పెూరట,చాఁగ.కీ.

పిలుపాకవాది. సం. వి న్. పుం వై శేషిక
మతమువాఁడు. ఇతఁడు ఉష్ణము పదార్థము
యొక్క అణువులయందే వర్తించునుగాని పదార్థ
సమష్టియం దుండదనువాఁడు.

పిలుమూలము. సం. వి అ. న. పీలువుయొక్క
వేరు.
వి. ఆ. స్త్రీ. ౧ శతమూలి, చల్లగడ్డ కీ
౨. శాలపర్ణి, ముయ్యాకుపొన్న. కీ ౩ అశ్వ
గంధ, పెన్నేరు. కీ. ౪ తంబిపియావు.

పీలువు. సం. వి. ఉ. పుం ౧. బాణము ౨. పర
మాణువు ౩. కృమి. ౪ ఏనుఁగు ౫ పువ్వు
౬. అస్థిఖండము, ఎమ్ముకతునుక. ౭ గుడఫల
వృక్షము, గోఁగు. కీ. ౮. చేయివడిమిభాగము
౯. కట్టెలము, కోఁకు, కీ (శే. ని)
౧౦. ఉ. న. గోఁగుపండు.

పీల్కుంచె. వి (పీలు+కుంచె—వృత్తిని వర్ణ
లోపము.) పెమిలియీఁకలతోఁ జేసినకుంచె.

మ. పెలవిం డ్లేనుఁగుదంతముల్ పికిలిపూఁచెండ్లున్
బునుం గిత్తిమై,రొయిబుపుల గస్తురి కప్పురంబు
పులితో ళ్లొడ్డీలు జవ్వాదిపి,ల్లులు పీల్కుం
చెలు పుట్టకేస పవరాలుల జల్లులున్
బందిగో,మ్ములు తాబువ్వను జీకిపప్పు
మయినంబున్ గోరజం బాదిగక
ప్రబంధ. ౧౩౬.

పీవ. సం. వి ఆ స్త్రీ. జలము

పీవము. సం. విణ. (న్. వరి. న్) ౧ పీనము,
స్థూలము, బలుపు గలది. ౨ బలవంతము,
బలిమిగలది
వి. న్. పుం వాయువు.

పీవరము. సం విణ. (అ ఈ అ) ౧ బలిసి
నది, స్థూలము, అవయవముల పెనుపుగలది,
కండపుష్టిగలది ౨ క్రొవ్వినది
వి. అ పుం. తాఁబేలు.

పీవరి. సం వి ఈ స్త్రీ ౧. కుమారి, లేఁబ్రా
యపు స్త్రీ ౨ ఆవు, ౩ పిల్లపీఁచెరు కీ.

# పు

పు. అవ. ౧ కొన్నిధాతువులకుఁ బ్రేరణార్థమున
ఆగమముగా వచ్చువర్ణము ఉదా: మాను,
మానుపు, మను, మనుపు.
౨ కొన్నిధాతువులపై భావాద్యర్థములందు
వచ్చుకృత్ప్రత్యయము ఉదా: చూచు,
చూపు; ద్రేఁచు, ద్రేఁపు, విడుచు, విడుపు;
ప్రోచు, ప్రోపు మొ.
౩. కర్మధారయంబునందును కొన్నిచోట్ల తత్పు
రుషమునందును "ము" వర్ణకములకు బిం
దువు ముందు కలిగి కాని, లేకగాని ఆదేశ
ముగా వచ్చునది పుగాగమము.

చ అరుణంపు బొండ్ల ఆము ౧ ౫౪

క మధ్యప్రసమయము మానుసార్చ్వాస్తం బరయన్ భార ఆను ౨ ౫౪

సీ దిశాశరులు నాఁ దగుమరాళపుంగరులు ఆము ౧ ౫౩

పుంఖము ఎం వి అ పుం న ౧ బాణముక్రింది చివర, పింజ ౨ డేగ

పుంఖించే. సం అ క్రి పుంఖానుపుంఖముగాఁ దోఁచు, వెంబడిగాఁ దోఁచు

క క్రమ మొంద సాధజావళి, గిమకముగా శుద్ధ సాళగములను నంకీర్ణము లాగిఁ బుంఖింపఁగ మంద్రము మధ్యము తార మత్యుదారత మీరఁగ నమీర ౬ ౨౦౫

పుంఖితము ఎం విణ (అ అ అ) పుంఖము గలది, పుంఖానుపుంఖముగాఁ జేయఁబడినది

పుంఖీభవించే ఎం అ క్రి పుంఖానుపుంఖ మగు

సీ అఖిలదేశంబుల నమరుసాకౌములఁ బుంఖీభవించినచిత్రగేహములను

హం ౨ ౨౩౧ (అధికమైన అని భా)

సీ యజ్ఞతంత్రములందు హవిరన్నములచేతఁ బుంఖీభవించినపొట్రక్రొవ్వు

నిరం ౪ ౩౪ (అధికమైన అనిభా)

పుంగము ఎం వి అ పుం న సమూహము (వాచ)

పుంగవకేతువు ఎం వి ఉ పుం వృషభధ్వజుఁడు, శివుఁడు

పుంగవము ఎం వి అ పుం ౧ ఎద్దు, వృషభము ౨ ఓఎధివిశేషము విణ శ్రేష్ఠము (ఉదా వానరపుంగవము)

పుంగాహము ఎం వి అ పుం నల్లగుఱ్ఱము (వై వి)

పుంగుడు వి ౧ పులివిరికాయ, అల్పగ్రంథి

తే పుంగుడు పులివిరి యనఁ నల్ప మైనటిగ్రంథిగా నలరుచుండు అం భా ౨ ౧౩౦

౨ తెల్లపొడలకుష్ఠము (శ ర)

పుంజే వి మెట్టభూమి, వర్షాధారమునఁ బండెడు నేల (గ్రా) (వ్యతి నంజ)

పుంజేము వి (ఎం పుంజః క పుంజ అరువది పోగులనూలు (ముప్పదియొనికలనూలు అని శ ర)

సీ షష్టితంతువులు పుంజ మన వెలయు

అం భా ౨ ౭౯౫

సీ పుంజపుకిట్లు దంపుటఁ బర్వెత్తుచో

హం ౨ ౨౨

తే ఎన్నికలు ఎట్టి పుంజంబు లేర్పరించి

శుక ౨ ౪౨౪

సా పిండికోలదిటోక్కె, పుంజముకోలదిబట్ట

జ పుంజాలదండ

పుంజము ౦ వి అ పుం రాశి, ప్రోగు

పుంజాలదండ వి (పుంజాలు + దండ) స్త్రీలు మెడను ధరించెడి యొకవిధమగు నగ

తే దండ నెకిమెడఁ బుంజాలదండ వెట్టు, వనితచిన్నారిపొన్నారివయసువాని, విప్రనందనుఁ గిన్నంత వెకిలి యగుచు పాండు ౩ ౬౨

సీ మొలనూళ్లు నొడ్డాణములు సేసలంబుఁ బుంజాలదండయు బన్నసరము మొంగపుఁ, దీఁగయు శశా ౪ ౬౬ క్రీడా ౯౩

పుంజి వి సమృద్ధి, పెంపు

శా చెల్లెం గింతునిపంత మద్ధిపాగ రెచ్చెం గల్వ రాణాలు రం, జిల్లె న్మంచులపుంజితోడ విను మించెం భోగినీరాజ రా, జిల్లెన్

రా వి ౩ ౧౪

తే తాలెమున్నవ నంతునిరాణువెల్లఁ, గన్ను గుట్టెడుఁ గడుపుంజి గనుటవలన

శివల ౩. ౯౬

సీ... ఘంజరీటంబులపుంజీఁదెలుప.

దశా. ౭ ౧౮౫.

—విణ. (ధనాది) సమృద్ధి గలది,సంపన్నము

ఉ: ఆగ్రామ మిపుడు పుంజిగా నున్నది. (శ.ర.) ఆగ్రామమును పుంజిచేసినాఁడు. (బ్రౌ)

జ. పుంజికొను.

పుంజికా(క)స్థల. సం. వి అ స్త్రీ ఒకానొక యచ్చరి (విల్సన్సు)

పుంజికొను. అ క్రి (పుంజి+కొను) గుబురు కొను,పుంజీభవించు (జరావర్ణన)వ పుంజికొని వెడలి నిడుదలై యుండుకఱకుగిలు నాసా కేశం బులును . కవిక ౫ ౧౧౦

పుంజితము. సం. విణ (అ ఆ అ) ౧ పుంజ ముగాఁ జేయఁబడినది ౨. ఒక్కటిగా అదుమఁ బడినది

పుంజీ. వి (సం. పుంజః) నాలుగు, చతుష్కము (శ ర.)

వ్యవ: మూఁడుపుంజీలు,నాలుగుపుంజీలు.

పుంజీభవించు. సం అ క్రి రాశిపడు,ప్రోఁగు వడు

సీ. పుంజీభవించినభువనగోళముభంగి సంకులాం గణమైనవంకదార క్రీడా. ౧౧౭

సీ. వింతగాఁ బుంజీభవించి నానాధాన్యముల రాసు లుండెడి నిలయములును.

హంస. ౨. ౨౩౧.

పుంజీలము. సం. వి. అ. పుం. తృణస్తంభము. (వై. ని.)

పుంజో. వి. ౧. పసుపక్షులలోఁ బురుషజాతి

ఉదా: పుంజు, కోఁజఁ పుంజు పావురము, కోడి పుంజు, (చూ. పెట్ట)

౨. మగకోడి, కుక్కుటము.

మ. గురుశంతస్వరయుక్తిమైఁ దగ కెనక గో యంచు ఘోషించువైఖరిఁ బుంజుల్మాఱు పెన్ ద్రిలింగగతి కెక్కుల్ పారకల్గాల్చు చున్. చంద్రా. ౫. ౧౧౫.

సీ పే రహల్యయటంచు రాకనాఁడు వేలుపు టొడయఁడు డెమ్మె, నఁ గోరి పుంజు రూపునఁజేరి నడురేయిఁతతి నింటిదరిఁ బొంచి యఱచుటయును అచ్చ. రా బాల ౧౮౭. ఆం. భా ౨ ౯౨.

జ' పుంజోదాలుపు

పుంజోదాలుపు. వి (పుంజు+తాలుపు)కుక్కుట ధ్వజుఁడు, కుమారస్వామి (చూ భీమ ౨ ఆ. సాం ని దేవ ౪)

సీ పుంజుదాలుపు వేలుపులకోని దళవాయి జంటముమ్మెమ్మెలదంటవేల్పు.

ఆం సం దేవ. ౧౩.

పుంట=పూఁట,పురఁట. వి సంధ్య.

సీ సంధ్య యొప్పుచునుండు సంజనఁ బూఁటనఁ బుంట యంచనఁగఁ బురంటయనఁగ

ఆం భా ౧ ౯౪.

పుండరి. సం వి న్ పుం కాలపత్త్రవృక్షము యొక్క ఆకులవంటియాకులుగల యొక వృక్షము.

పుండరీకప్లవము. సం వి అ పుం గుంపుగా తిరిగెడు నొక పక్షివిశేషము

పుండరీకము. సం. వి అ న ౧ తెల్లదామర పూవు, ౨. తెల్లగొడుగు. (అ.ని) 3. భేష జము, మందు, ౪ తీర్థవిశేషము ౫. మదపుటే నుగు గంధద్రవ్య విశేషము. ౬. ౭. ఒకజాతి విషము. (వై ని) ౮. ఆమ్రఫలము

వి. అ. పుం. ౧. తెల్లవర్ణము ౨. ఆగ్నేయ దిక్కునందలి యేనుఁగు. 3. బెబ్బులి, వ్యాఘ్రము.౪. రాజిలసర్పము ౫.ఆమ్రము, మామిడి. ౬ ౭. తెల్లపొడల కుష్ఠము.

౭. హస్తిజ్వరవిశేషము, ఏనుఁగులకు వచ్చు జ్వరభేదము. ౮ దమనకము. ౯. ౯ కమండలువు ౧౦ తెల్లచెఱకు ౯. ౧౧ ఒకదినుసు బియ్యము ౧౨ అగ్ని

పుండరీకముఖి. సం వి ఈ స్త్రీ నిర్విషమగు నొకజాతి జలగ

పుండరీకాక్షుఁడు. సం వి అ పుం విష్ణువు.

పుండరీయకము సం వి అ న స్థలపద్మము, మెట్టదామరపూవు ౨ ప్రపౌండరీకము ౯

పుండర్యము. సం వి అ న ౧ తీఁగ+లత ౨ శాలపర్ణియాకులవంటి యాకులుగల యొక క్షుపము

పుండలించే. అ క్రి. అభూతకల్పనముచేయు, లేని మాట కల్పించు (చి ని శ ర)

పుంతము. వి దే ౧ వ్రణము, కుఱుపు

సీ. క్రవ్యాగతోగ్రకాకవిధూత మక్షికాపుంజమై తగువెన్ను పుంటితోడ

శుక 3 ౩౯౨.

సీ పుంటిమీఁదను నీఁగ గంటు వెట్టును గాని గిట్టిసమ్మెనిపైఁ గదియలేదు

రామలిం ౧౨ ఆం భా ౨ ౧౭౯

౨ మర్మము, గుట్టు

తే ఒక్కట యవనరాట్సేన చక్కఁ జేసి, యుక్కణప పెందుచేత నీపోపలేవు, పేదపుండెల్ల బయలను బెట్టవలయు

సిం. వార 33

పుండ్ర. సం వి ఆ స్త్రీ తెల్లయావు, శ్వేతగోవు

పుండ్రకము. సం వి. అ. పుం నలుపుగలసిన యొఱ్ఱచెఱుకు, ౨ నుదుటిబొట్టు 3 మాధవి, బండిగురివెంద. ౯. ౪. తిలకము, బొట్టుగు. ౯

పుండ్రకుఁడు. సం. వి. అ పుం పట్టుపురుగులను పెంచి బ్రతుకువాఁడు (విల్యమ్సు)

పుండ్రకేళి. సం వి. ఇ పుం ఏనుఁగు (వాచ)

పుండ్రము. సం వి అ పుం. ౧. నలుపుగలసిన యొఱ్ఱచెఱకు ౨ తెల్లదామర. 3 పురుగు. ౪ పువ్వులగురివెంద, పుండ్రకము ౫ వంగదేశము ౬. పులి ౭ తిలకవృక్షము ౮ ప్రాస్వష్టక్షము పుం న. నుదుటిబొట్టు (శ ని)

పుంత వి (సం పంథాః) ౧. ఊపరథ్య, పశ్వాదుల రాకపోకలచే నేర్పడిన ఊరిముందటిదారి

మ జాబిల్లిరానిద్దపుంజిగి దళ్కొత్త వితర్దిఁ దమ్మెరలు మై నిండింపఁ గర్వూరధూళిఁ గరం బూనిన పుంతలం బొదలు నాళీకాక్షి వీక్షింపుమా

వి సం ౨ ౫౬

౨ మార్గము

(వ్యవ) పెద్దలు త్రొక్కినపుంత మంచిగి

పుందానుఁడు. సం వి అ పుం దానుఁడు, బానిసవాఁడు

పుంధ్వజము. సం వి అ పుం. ౧ ఏజాతియందుఁగాని మగది ౨ ఎలుక, కొక్కు

పుంఘిక. సం. వి ఆ స్త్రీ గహ్యాజములము (వై ని)

పుంభావము. సం వి అ. పుం ౧ ప్రౌఢత్వము ౨ పురుషత్వము

పుంరాశి. సం వి ఇ పుం (మేషాదులందు) పురుషరాశి (మేషమిధునసింహాదికములు విషమరాశి)

పుంలింగము. సం విణ. (అ.అ.ఆ) పుంలింగము గలది (శబ్దము.)

వి. అ. న. పుం. ౧. మగతనము, పుంస్త్వము ౩ మగగుఱి, పురుషచిహ్నము ౪ ఒకానొక శబ్దధర్మము

**పుంవృషము.** సం వి అ పుం. ఛుచ్ఛుందరము. చుంచెలుక (విల్సన్సు)

**పుంశ్చలి.** సం వి ఈ స్త్రీ ఱంకుటాలు

**పుంశ్చలీయుఁడు.** సం వి అ పుం పుంశ్చలి కొడుకు.

**పుంశ్చలుఁడు.** సం వి అ పుం మిండఁడు

**పుంశ్చిహ్నము.** సం వి అ న మగగుఱి (వాచ)

**పుంసవనము** సం విణ (ఉ ఆ అ) మగ బిడ్డను బుట్టించునది (కి త్రి)

వి అ న గర్భచిహ్నము తెలిసినతోడనే పురుష ప్రజగాఁబుట్టవలెనని చేసెడి యొకానొక శుభకర్మము (చూ కర్మము)

౨. క్షీరము. (వై ని)

**పుంసానుజుఁడు.** సం విణ (అ ఆ అ) అన్న గలవాఁడు. (వాచ)

**పుంస్కోకిలము.** సం వి అ పుం మగకోయిల, గండుఁగోయిల

**పుంస్త్వము.** సం వి అ న పురుషత్వము, మగతనము ౨. శేతస్సు ౩ పుంలింగము

**పుంస్త్వవిగ్రహము.** సం వి అ పుం. భూతృణము. కీ. (వాచ)

**పుంహాలము.** సం వి. అ. పుం. వ్యంగరోగము, ముఖమందు ఒకవిధమగు నల్లనిమచ్చలు బయలు దేరురోగము.

**పుకిలించే=పుక్కిలించే.** స. క్రి. నీళ్లలోనగు వానిని గండూషించు.

చ. పరిగొనఁ దాల్చి పెట్టముగఁ బ్రేవులు చుట్టి కపాలపాత్రలలో, విరియఁ గలంచుఁ గ్రొమ్మెదడు వెంద్రుకశేరి తొలంగవైచు నెత్తురు పుకిలించుఁ గండలు తుఘూ యని క్రాయఁ ద్రిశూల ధారలం, జెరివిన ప్రేతమాలికలఁ జిమ్ముఁ బిశాచవిభుండు వేడుకన్

ఉ హరి. ౨. ౧౨౪.

(చి ని శ ర పా "నెత్తురు చవిచూచు" ముద్రి)

జః పుకిలింత.

**పుకిలింత=పుక్కిలింత.** వి (√ పుక్కిలించే) పుక్కిలించుట, గండూషము (శ ర)

**పుక్క=పుక్కిలి.** వి బుగ్గలోపలి భాగము.

సీ...పుక్క పుక్కిలి బుగ్గ నాఁగ గండూషము. ఆం భా. ౨ ౧౪౩.

**పుక్కటిల్లు.** వి బ బాలక్రీడా విశేషము, (రూపము విచార్యము)

సీ గొబ్బిళ్లు పుక్కటిల్లు, గుజ్జెనగూడులు... హం స ౫. ౧౫౫

**పుక్కశి.** సం. వి ఈ స్త్రీ ౧ కలిక, మొగ్గ ౨ నీలిచెట్టు. ౩ చండాలస్త్రీ (మే ని)

**పుక్కశు(సు)ఁడు.** సం విణ (అ ఆ. అ.) అధముఁడు వి అ పుం ౧ చండాలుఁడు ౨ క్షత్రియస్త్రీయందు శూద్రునికిఁ బుట్టినవాఁడు ౩ నిషాదునికి శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు

**పుక్కిటిపురాణము.** వి. (పుక్కిలి+పురాణము) నిరాధారమైనకథ అసత్యవార్త

తే. పుక్కిటిపురాణములఁ బ్రొద్దుఁ బుచ్చునతఁడు, చాలఁగ పురాణములు విప్పి చదివి చెప్ప. రామలిం. ౭౨.

క. వకుళము రాగిల్లఁగఁ బ్రసవకులం బొసఁగ స్మృఖానవం బీయ కొక, త్తెక నిట్లన విని యొక్కక్క యిది పుక్కిటిపురాణ మయి తోఁచెఁజామీ. రామా. ౧. ౧౯౩.

పుక్కిలి=పుక్క. వి. ఓ బుగ్గలోపలి భాగము.

పుక్కిటిబంటి. పుక్కిటివఱకు వచ్చునంత లోఁతు గలది.

తే సఖులు ప్రార్థించుతఱిని లజ్జాప్రవంతి పద్మగంధికి మోఁకాలిబంటి యయ్యెఁ,బడ కయిలు సేరుతఱి మొలబంటి యయ్యెఁ, బతిని డాయంగఁ బుక్కిటిబంటి యయ్యె కవిజన 3 ౯౫

వ...శిశిరకాలంబునం దివతాళించు కొలంకుల లోనం బుక్కిటిబంటినీట నివాసమయంబుల నిలిచియు... హార ౪ ౧౪

సీ. హిమవాతదారుణ హేమంతదినముల నిర్ధఁ బుక్కిటిబంటి నీరనుండి పద్మ ౪ ౩

క. ఒక్కనిమేషము రాహువు, పుక్కిటిలోఁ దగులుపడక పోయెడుభానుం, డిక్కొండ ప్రక్కఁ జిక్కక కాశీ ౧ ౧౩౪
బస. పు 3 ౭౧ పా ౬. ౯౭ పం

తే. కమ్మకస్తురిగుళికలు తమ్మిరేమ, నిదుర మంపువఁ బుక్కిట నించి మేలు, కాంచి కేళవ నుమిసె నాఁగమలముకుళ, కోట రంబుల నెలదేఁటికొదమ లెగసె
పారి ౨ ౬3 అం భా. ౨. ౧౪3

జః పుక్కిటిపురాణము, పుక్కిలించు, పుక్కిలించుకొను, పుక్కిలింత

పుక్కిలించే. స.క్రి ($\sqrt{}$ పుక్కిలి) ౧ పుక్కిటఁ బట్టు.

చ కెరలుచు గల్గునోళు లొకకేయి ధరించి వియన్నదీజలం, బదరఁగఁ బుక్కిలించి రయ మొరఁగఁ దెచ్చి మహానలంబుపై, నెద పద కుందఁ జల్ల .. హరి. ఉ. ౭. ౪౨.

సీ. (సుందరమూరతము) తిలకంబు బలుతేని యలఁ బోఁకమాకల పువ్వుఁబాకులతావి పుక్కిలించి భీమ. ౧. ౯౪.

౨. పుక్కిటఁబట్టి చప్పుడగునట్లు కదల్చు.

ద్వి. చెలులార విలసిల్లు శీతలోదకము, అలరుచు గ్రుక్కుగ్రుక్కునకు ద్రావుచును, పూరించి గళగళఁ బుక్కిలించుచును, పారించి యుమి యుచుఁ జప్పుడు గాఁగ.
పండితా. దీక్షా ౪౨. పా.

3. పుక్కిటఁబట్టి ఉమియు, గండూషించు.

సీ కడుపార నెత్తురు ఘనముగాఁ గొని త్రావి దిక్కులు నెరయంగఁ బుక్కిలించు.
భా రా యు ౨౨౧౬

ద్వి కొండొక ప్రొద్దుండి కోమలి తల్పు, గ్రిక్కునఁ దెఱచి యక్కాంతుపై నీళ్లు, పుక్కిలించుటయును..
పండితా. పురా. ౧౨౩ పా.

౪ వెదలఁగ్రక్కు, వెలువఱుచు

వ చేచినమేచకద్యుతులు పుక్కిలించు కప్రో పల సోపానంబులు పి కకు ౧ ౭౯

అ. క్రి వెడలు, వెలువడు

ఉ కనుఁగ్రేవల జేవులు పుక్కిలింపఁగా, మనుచ ౫. ౫౦.

పుక్కిలించుకొను. స క్రి (పుక్కిలించు+కొను స్వార్థమున) పుక్కిటఁబట్టికొను

వ ..గరుడుండు...సకల నదీజలంబుల నెల్లఁ బుక్కిలించుకొని వచ్చి యయ్యవలంబు నాలుంజల్లి. భార ఆది. ౨. ౧౦౧.

పుక్కిలింత. వి ($\sqrt{}$ పుక్కిలించే) పుక్కిలించుట, గండూషము. (శ. ర.)

పుచ్చే. వి. కళింగము, కాళింగి. ?

అ. గురువునకును బుచ్చకాయైన నీయరు,యరయు కొఱ్ఱ కిత్తు రర్థ మెల్ల. వేమన. ౨. ౨౭.

మ. అలుక స్ఫోటకధట్టికాఘురపుటీపాల్య స్ఫురా పానిపుచ్చులు వో దున్ని చలచ్చయాగజ మదాపారప్లుతి గ్లిత్తిపుష్కలసస్యం బిడి
ఆము ౧. ౪౨. ఆం. భా. ౨. ౪౨.

జః పుచ్చకాయ.

పుచ్చేకాయ. వి. (పుచ్చ+కాయ) కళింగము, ఒకవిధమగుకాయ

సీ. పుచ్చకాయలు దిన్నఁ బోరెుడి మంత్రంబు లిచ్చునే ఫలము లెందేరికైన నీతి ౬౯

పుచ్చేటిక=పుచ్చేడిక. వి లజ్జ, సిగ్గు

తే...పురులోట, సిగ్గు పుచ్చటిక యు నాన సిబ్బితి యన,వెలయు లజ్జాహ్వాయంబులు .
వెం. ఆం మాన. ౪౨.

తే. సిగ్గు నా లజ్జ యనఁగను సిబ్బితి యన,నాన యన పుచ్చటిక యనఁగానులజ్జ.
సాం. ని. మాన ౨౨. ఆం. భా. ౧. ౧౩౨.

పుచ్చేడిక=పుచ్చేటిక. వి ౧. సిగ్గు.

రగడ—పాలఁతి క్రేంకణంబు చూడ బుచ్చఁ బుచ్చడీక మసలు,కెలఁత చైత్రమాసమున జనించు నించువిలుకుపసలు
వరాహ. ౩. ౯౨

౨. స్త్రీ.

క. కిచ్చడి పండ్ల రసావళి, పచ్చడి యొక పుచ్చడీక బంతుల కిడిరొక. బహుళా. ౪. ౩౭.

—విశే. సిగ్గరి, లజ్జాళువు. (చూ. పుచ్చడీకతనము.)

జః పుచ్చడీకతనము.

పుచ్చడీకతనము. వి. (పుచ్చడీక+తనము) లజ్జ, సిగ్గు.

సీ. పుచ్చడీకతనంబు పోఁబెట్టి గిరికన్య పతిఁ గౌల్వ జాయమానవదనపోటు. మహత. ౨. ౯.

పుచ్చియ(చ్చె). వి. ౧ (తల) పుర్రె, పునక.

ద్వి. ఈయింతిఁ గొని వచ్చు కెతేఁగిన నన్ను, బోయినప్పుడె తలపుచ్చియ ద్రింగు.
ద్వి. హరిశ్చ. ౘ ౧౦౧౫. పం. (చి. ని. పా. "పుచ్చెను" ముద్రి)

తే. తనరుచు గరోటి కప్పెర పునక పుర్రె, పుచ్చె యన . ఆం భా. ౨. ౧౩౩. సాం. ని మాన. ౧౭.

౨. (కొబ్బెర మున్నగువాని) పెంకు. (శ. ర. ప్రా.)

(వ్యవః) ఈయొందకు కొబ్బెరపుచ్చె లన్నియు రాలిపోవును.

పుచ్చివైచే. స క్రి (పుచ్చి+వైచు) ౧ పూర్తిగా తొలగించు మిక్కిలి పోఁగొట్టు.

తే ఇంత నొక్కింతసేపున కల్లవగపుఁ, బుచ్చి వైచెదనని పల్కి .. కళా ౩ ౯౧.

చ తను సెతేఁగించి చిత్తమునఁ దారొక్కని యున్నకృపాంబురాశిలో, ననయము నోల లార్చి చటులాహవఖేదము లెల్లఁ బుచ్చి వైచిన... వి. పు ౬. ౨౪౦.

౨. తీసివేయు, ఎడలించు.

వ ఇట్లు విరథుండును వికలహస్తుండును వై విషణ్ణుం డగునన్నరనాథుండు ఖేదం గగుటం గటకటంబడి యాకంకటబు నిష్ఫలం బను బుద్ధిం బుచ్చివైచి యొండొకకవచంబు దొడిగ .. భార. ద్రో. ౩ ౨౦౯.

చ. కలికిపిపాలినవ్వు లెసఁగఁ బటుధూర్తులు గొంద ఱొండొరుం, దలకొన సెచ్చరించి తమదండపుఁగోలల నున్నమాలుగోఁచులు వెసఁ బుచ్చివైచి... ప్రభా. ౧. ౧౦౨.

పుచ్ఛ్చో¹=ప్రుచ్ఛ్చో. అ. క్రి. (త. పురు) ౧. పుష్పి పట్టు, (పురుగు పట్టుటచే పండ్లు, కట్టెలు, మున్నగునవి) చెడిపోవు.

(వ్యవ) పుచ్చినపండు దానము చేయఁగూడదు

౨. మిక్కిలిపండు,పరిపాకమునకువచ్చు.

(వ్యవ) నీపుణ్యము పుచ్చినది

వి ౧ పుచ్చుట, పుప్పి

(వ్యవ) పుచ్చున్నభాగము తీసివేసి మిగిలిన కాయ కూర కుపయోగింపుము

౨ ఆముదపుమడ్డి

గీ పప్పులో నుప్పు మిక్కిలిఁ బారజల్లి, నేతిలో నాముదపుపుచ్చు నిండనించి, పులుసులో గంజి మిక్కిలి గలయఁ బోసి, భక్ష్యము లలోన మిరియంపుఁబదడు కలిపి.

చంద్ర వి ౧ ౬౫ (బ్రౌ పా)

జ. పుప్పి, పుప్పిపురుగు, పుప్పు

పుచ్చు². స క్రి (√పోవు) ౧ పోవఁజేయు పంపు

శా వీటన్ వీథుల నెల్ల నేనుఁగులపై విస్ఫార ఘంటాధ్వనిం,జాటం బంపుఁడు పేర్మి నుత్తర జయాశ్చర్యంబుఁ బుణ్యాంగనా, కోటిం బుచ్చుఁ డెదుర్కొనంగి. .

భార విరా ౫ ౨౪౨

ఆ భూరిభుజుఁడు దాసె పోయెనో నీ వెట, యేని పుచ్చితో నిజేచ్ఛ నతని

భార. అర. 3 3౮౨. మనుచ ౪ ౪౦

౨ పోగొట్టు, పాపు

క పరిభవకరుఁ డగుకీచకుఁ, బరిమార్చుట యిపుడు గడవఁబడియె నె యిమ్మై, దురపిల్ల నేల పేర్మిడిఁ, బొరిగొని నీమనముకలఁక పుత్తు లతాంగి   భార విరా ౨. ౧౯3

ఉ...ఆత్మసం,తాపము లెల్లఁ బుచ్చి విదితం బగుసంపద లిచ్చి ..ప్రోవ లక్ష్మీపతి యున్నవాఁడు .   వి పు ౧ ౧౫౯

క దినమున మూఁడవయామం,బున నపరార్థంబు యోగ్యముగ నాహారం,బునకుం గల్పించితి నా, కనిమిషు లటుగాన మాన నాఁకలి పుత్తున్ భార. అశ్వ 3. ౯౨. (ఆకలి పుత్తుఁజభుజింతును అనిభావము)

3 తీయు; పైకితీయు

క పకపక నవ్వుచు నొకవి, ప్రుకకేశబరమాంస మెల్లఁ బుచ్చి పునుకపాత్రికలోనఁ గడిగి పెట్టుచు...   ఉ హరి. ౨. ౧౪౯.

ఉ ఆవులచేతిఁ బాలుగొని యందు గ్రమంబున నెయ్యి పుచ్చి యయ్యావుల కాఘృతం బిడి ప్రియం బొనరించినయట్ల కాద...

వి పు ౨. ౯౦.

సీ పెనుఁగూపమునఁ బడ్డపృథుకుం దుకము బాణ తతిఁ బుచ్చి యిచ్చినధన్వి దక్క.

విక్ర. ౪. ౧౭౯

౪ వెళ్లించు, కడపు

వ ఆరాత్రి పుచ్చి మఱునాఁ డమ్మునులు

భా. రా బాల ౨౨౪

చ దినముల్ పుచ్చుచునున్నవాఁడు విబుధార్థీ కుండు... నైష ౪ ౨౭ ఇందు ౨ ౧౨.

౫ ఎడలించు, తొలఁగించు

క...పాంచాలురఁ, బొలియింపక కత్తికంబు పుచ్చ నరేంద్రా   భార ద్రో ౫ 3౭

ఆ. మునుఁగు పుచ్చ నేల మొగ నేల యల రింపవు   భా రా అయో ౧౬

మ ఈ,ద్విజదేవాదులకుం గపాలకవచాస్థి వ్రాతముల్ మేచులక, నిజమై యున్నవి రుద్రచిహ్నలివె వీనిం బుచ్చి రా నేర్చిరే

కు సం ౨ ౧౫౯

౬ (అస్త్రాదులు) ప్రయోగించు, ఏయు

చ మురదనుజుండు పౌరవసమూహమునుం గని రాజరాజుపై, శరనికరంబు పుచ్చి...

ఉ. హరి. ౧. ౪౦

క పిచ్చుకపయి బ్రహ్మాస్త్రము, పుచ్చిన చందాన...   పార్వ. 3. ౭౭.

౭. దొడ్చు, కుడుచు.

ఉ...కీర్తులతాంగి కేపెద్దుర్కట్టున ముంగిటం
గసవు గాంద్రయుఁ బుచ్చుచుఁ జెతిచీపురుం,
గట్టయుఁ దానుఁ డొచ్చెఁ గఱకంఠుని
నోంకృతి నాదిదేవునిన్ కాశీ ౬. ౨౬౨

౮. (తలుపు మొ) తెఱచు

ఉ. వి, ప్రోత్తముఁ డొయ్య లేచి తలు
పోరఁగఁ బుచ్చి నభోవి మర్మనా యత్తత...
పరమ ౩ ౨౩౫

ఆ వానిఁ బిలిచి నీవు వాకిలిఁ బుచ్చు మం,
దఱము మొగ్గరంబు దఱియఁ జొచ్చె,
దము భార ద్రో ౨ ౨౪౦

౯ విడుచు,త్యజించు

క నావార్త వినక యింతకు, నావృద్ధులు భిన్న
హృదయులై ప్రాణంబుల్, పోవిడుతురు
గా కచటికిఁ, బోవం బనిగలదె యేనుఁ
బుచ్చెద నసువుల్ భార ఆశ్ర. ౮ ౨౬౪

గీ .నలువపట్టి, యొండ శాక యొక్కింతసే
పూరకుండి, యున్న గనుచున వేఁడినిట్టూర్పు
పుచ్చె కాశీ ౧ ౧౦౧

౧౦ తీసివేయు

తే కుడుచునెడ వానిపెనుద్రేలు కూటిలోన,
దునిసి పడి యున్న ద్రేలుపుచ్చి తోయజాక్షి
భార ఆగి ౪ ౨౫౬

తే మనుజకృతతటాకాదులమన్నుముద్ద, లైదు
పుచ్చక సుస్నాన మాచరింపఁ, జనదు
వాగ్గ ౩ ౨౫౪ అను ౫ ౩౯.

౧౧ వెలుపు,వెల్లగించు.

తే కోల, లెల్లఁ బుచ్చిన నురగంబు లేమి
సేయు భార ఉద్యో ౩. ౩౯౦

వ ..రాజానుం బఱతెంచి శూలప్రోతుండయి
యున్న మాండవ్యునకు నమస్కరించి వాచేసిన
యజ్ఞానంబు సహించి నాకుం బ్రసాదింప
వలయు నని శూలంబువలన నమ్మునిం బాచు
చో నది పుచ్చరాకున్న .
భార. ఆది. ౪. ౨౬౪ భాగ. ౪. ౧౦౫

౧౨. చెఱచు,పాడుచేయు.

ఉ పతివ్రతామణుల్, వాపులు పుత్తురిమ్మ
తలవంపులు చేతురటమ్మ జాతికిన్.
శుక ౧ ౪౦.

౧౩ పుచ్చుకొను,గ్రహించు

క ధనధాన్యపశుసమగ్రుం, డనఁ బరగెడునట్టి
వైశ్యుఁ డధ్వరముం జే,యనినాఁడు బ్రాహ్మ
ణాధ్వరి,మునకు నతనిసొమ్ము గాఁజా పుచ్చి
యిడఁ దగున్ భాగ శాం ౩ ౪౩౧

చ పుడిసెఁడు గాని లేదిపుడు పుచ్చుక త్రాగిన
మద్య మింతలో, నొద తెలుగండు .
కాశీ ౩ ౪౩ నా పంచ ౧ ౨౩౪

౧౪ ఇగి కొన్ని సకర్మకక్రియలస్వార్థకరూపము
లకు అనుప్రయుక్తమగును (చూ కప్పిపుచ్చు,
విడిచిపుచ్చు మొ)

జః పుచ్చివైచు,పుచ్చుకొను,పుచ్చుకోలు, పుత్తెం
చు, పుప్పించు

పుచ్చే(చ్చి)కొను. స క్రి (పుచ్చు$^2$ + కొను,
స్వార్థమున)

౧ స్వీకరించు,తీసికొను

సీ ద్రౌపదీసహితుఁ డై ధర్మరా జాయుధాగా
రంబునం దున్నఁ గార్ముకంబుఁ ఆ బుచ్చి
కొనఁగఁ దనకుఁ బోలమి యెఱిఁగియు ..
భార ఆగి ౮ ౧౧౮

చ మన మురియాడుచుండ ననుమానముతోన
సుధేష్ణఁ జూచి నీ, వనయముఁ గోరినట్టిపని
యర్థి మెయిం జని చేయుదానఁ గా, కనుతవ
మాటకాపాలఁతి పూర్ణముఁ బొందుచు నంది
యిచ్చుకాం,చనచషకంబు పుచ్చికొని చారు
విలోచన యార్తమూర్తియై
భార విరా ౨ ౧౦౨.

౨ లాగు,ఆకర్షించు

మ చలికత్తైల్ ధ్రువదర్శనంబుకొఱకుం జే
ముట్టి పల్మారు నెత్తు లిడంగా వెంగ మెత్తి

పుటపాకము. సం. వి. అ. పుం. ౧. ఔషధపాక
ముకొఱకై పుటముపెట్టుట. ౨. కీర్తిఅరుగుదల.

పుటపుట. వి. ౧. అదరుటయందగు ననుకరణము.
ద్వి. పుటపుటఁ గటములు బోరఁబోరి వదర.
ద్వి. హరిశ్చ. పూ. ౧౧౫౨. పం.
౨. సంతోషము,ఆనందము.
వ...విటవిటీజనంబులకుఁ బుటపుటయును, విర
హులకు మెరమెరయును...
ప్రబంధ. పీఠి ౬౨
విశే. సుందరము,విలాసయుక్తము.
క. చిటిపొటిసొమ్ములు పెట్టుక,పుటపుటగా వీథి
వెంటఁ బోరఁగిండ్లబడిన, విటులనిమిత్తము
మట్టెలు,చిటుకుచిటుక్కనఁగఁ దిరుగు...
హం. స. ౫. ౭౫.
ద్వి. పుటపుటగా జాజిపూవులు దాల్చి,బటువులు
గలమించుకటువు లింపొంద.
అ. మ. క. ౩. ౧౬౪. పా. ౩. పం.

పుటపుటన. విశే. (సం. స్ఫుటమ్) అధికము
వ...చదువ దొరఁకొనినపరువకుఁ గాలంబు
చాలంబు, విఘ్నంబులు సకలోద్యమఘ్నంబు
లందులకు సామగ్రి గిటగిటనఁ గాం తెఱుంగ
నగుమదంబు పుటపుటన... ఆము. ౧. ౪౭.
జః పుటపుటనగు.

పుటపుటనగు. అ. క్రి. (√.పుటపుటన) ౧. స్ఫుట
మగు, స్పష్టమగు.
చ. కిటకిటనయ్యె సన్నడుము కేసరిమధ్యకు నాఁ
డునాఁటికిం, బుటపుటనయ్యెఁ జారు కడుఁ
బొల్పు వహించెఁ దమాలకాద్యుతుల్ .
వి. కకుం. ౪. ౫౪.
౨. నున్ననగు,నిగనిగలాడు,మెఱవడిచుగు.
వ...మాపుమాపున మేపుసక్కవణంపు మేపునఁ
బిడుకగొఱకంబులోపకంబునఁ బుటపుటనై



కతింబుకంబడి ప్రాతఁగనిర్మైనం జెదరుగొదకు
తట్టుమగుంపు... ఆము. ౪ ౩౫.
౩. అధికమగు.
క. ఇట నథ మిట భూవలయం, బిట బలిసద్మంబు
సుందునిరవు లని యనక, బటువులగువకుల
చెలువునఁ, బుటపుటనై యున్నచిన్నిబొజ్జ
గదలఁగఁ. పాండు. ౨. ౩౫.
వ. చేమంతిపూబంతులం బుటపుటనై మిటమిటం
గాయుదట్టంపుఁబండుకొన్నల...
మనుచ. ౩. ౭౭.

పుటభేదనము. సం. వి. అ. న. నగరము.

పుటభేదము. సం. వి. అ. పుం. ౧. ఏటికినీరువచ్చు
మార్గము, నదీముఖము. ౨. నీటినుడి. ౩. పత్త
నము, ౪. అతోద్యము,చతుర్విధవాద్యము. ౫.
పైనిమూసికొనియున్న కప్పువిరియుట. ౬. ఏటి
వంపు. (శ. ర)

పుటము[1]. వి. (సం.ప్లుతమ్,ప్రా. పుతం, క పుట.)
అశ్వగతివిశేషము. (దీనికి ఏకవచనమునందు
ప్రయోగము కనఁబడలేదు.)
ఉ. తీరినతత్తడిన్ జవగతిన్ బుటముల్ దుమి
కించుచాడ్పునన్, దీరనితత్తడిన్ జవగతిన్
బుటముల్ దుమికించు వాగెఁ బెం,పార
బిగించి. చంద్రా. ౨. ౧౩౦
౨. మల్లవిద్యావిశేషము.
సీ. కర్నాటలు పుటము ల్గస్తాలు మండీలు దాశా
లు డింకీలు దండెములును,నాఁగు లవంగను
రాజిల్లు... ఆం. భా. ౨. ౨౦౪.
విశే. (క. పుదైప్పు) అధికము,హెచ్చైనది.
క. హరిభక్తియు గురుభక్తియు,సురరక్తియుఁ
బుటము గాఁగ యోగీంద్రశిఖా,భరణము
ముక్తామయతా,స్ఫురణము భువనప్రశస్తముగ
జగిదిరాకొన. పాండు. ౨. ౧౩.
జః పుటపెండు, పుటముగులుకు, పుటముబ్బు,
పుటమురెత్తు, పుటమెగయు.

**పుటము².** వి. జలనిర్గమమార్గము, తూము.

సీ తూపరాణ పుటమ్ము తూ పెంపురము జల
దారి యంచనఁగును దనరుచు జలనిర్గమము...
ఆం. ఛా. ౧. ౧౫౪.

**పుటము.** సం. వి. అ. న. ౧. దొప్ప, దొన్నె. ౨. దొప్పవలెనున్నట్టి పాత్రము ౩ శేత కొలకలను గప్పియుండు దళసరితోలు. ౪ ఆచ్ఛాదనము,కప్పు. ౫. కనుఱెప్ప ౬. గుజ్జుపుశాలిగొరిజ. ౭. పూలబుట్ట. ౮ మిథఃశ్లేషము ఒండొంటితో గుత్తముగాహత్తికొనుట ౯ జాజికాయ. ౧౦. ఔషధపాకమునకై మన్నులోనగువానిచే రెండు దొప్పలుచేసి యొకటిక్రిందను మఱియొకటి మీఁదనుబెట్టి కూర్చి చేసిన పాత్రవిశేషము.

వి. అ. పుం. ౧. దొప్పవలె ముడుఁగుకొనుట. ౨. ద్వాదశాక్షరకమగు వృత్తభేదము. ౩ వ_ర్తనము. (వై. వి.)

**పుటముగులుకు.** అ. క్రి. (√పుటము¹) పుటమెగయు,పైకెగురు

గీ పసివలపులిచ్చుపచ్చాకు పసిఁడిపట్టు,బటువు
తోడును బటువుపై పుటముగులుకఁ,బూవి
రందల కెంతయు తోయ లంత.
రా. వి. ౨. ౪౩.

**పుటముబ్బు.** అ క్రి. (పుటము¹+ఉబ్బు) పైకిఉబ్బు, ఉద్గమించు.

చ. అలికులవేణియూరు నవయావన మక్షవలరాచ
తోఁటలోఁ, బొలుచునితంబవేదికడఁ బొక్కి
లిడిగ్గియచెంత నీలసం, కలితనవాంబుయంత్ర
మగుఁ గానియొదకా రసగుంభనంబు సంధిలఁ
బుటముబ్బునే నడుము నిల్చి ఘనస్తనమూన
గుచ్ఛముల్. వసు. ౨. ౪౦.

**పుటములెత్తు.** స. క్రి. (పుటములు¹ + ఎత్తు) మీఁదికెత్తు,పైకెత్తు.

సీ. గుణితతంబులె చాలఁ బరితోన కొనరింపఁ
బూగుత్తు లేటికిఁ బుటములె_త్తి.
పంచ. ౧. ౬౨. (బయటఁబెట్టు అని భావము)

సీ. ఉడుగక గుండెయు దడదడ మనుటఁ గొంపుల
దంటఁ బనుదోయి పుటములె_త్తి.
కువల. ౫. ౬౭.

**పుటముబెట్టు=పుటమువేయు.** వి. స క్రి. (శుద్ధిచేయుటకై లోహములను, ఔషధములకై గంధకాది ద్రవ్యములను) అగ్నితప్తముచేయు, నిప్పులోఁ బెట్టికాల్చు.

తే. మేటిజక్కొటిమనటఁ గ్రొమ్మించుమించుఁ,
బొదివి మదనప్రతాపాగ్నిఁ బుటముబెట్టి,
తమ్మిగద్దియదాశట గ్రమ్మి యట్టి,కొమ్మఁ
గావింపఁబోలు నె_త్తమ్మిచూలి.
వసు. ౨ ౩౨.

**పుటమువేయు=పుటముబెట్టు.**

సీ. రస మంటె నమచు నీరసముతోఁడఁ బుటంబు
చేయ మేనవు చేర విశ్వకర్మ.
దశా ౧. ౨౨.

**పుటమె(ములె)గయు.** అ క్రి (పుటము+ఎగయు) ౧. మీఁదికెగయు,పైకెగురు

క. పుటమెగసి తాళవృక్షము, చటులోద్ధతిఁ
బూని పెటికి సారథి నవనిఁ,విటతటముగఁ
బడవైచెను, బటుభుజన_త్త్వంబు మెఱయఁ
బవనజుఁ డల్క_ను. భై. ౩. ౮౨.

మ జలగుంబరొయ్యదకొంగు జాతి మెరుకర
జీరాడ ముత్యాలపేరులు వక్షోజతటిం బుటం
బెగయఁగాఁ ద్రోపదఁ జన్నల్...
పారంగ ౩. ౪౬.

సీ. ఒండొంటితో రాయుచుత్తుంగకుచకుంభములు
మింగంబులకుమ బుటములెగయు.
భాగ. ౧౦. ఉ. ౬౮౮.

౨. దూఁటు,లంఘించు.

క. ఇటు నిశ్చయించి యచ్చు దటు,నిటుఁ జూచి
మహేంద్రశైల మెక్కిన లంకా,పుటభేద
నంబువిరాఁదికిఁ, బట మెగయును వాయుసూతి
పొ మ్మని కదలెఁ. రామా. ౬. ౧౪.

పుటానిలము. సం. వి. అ. పుం. శిశిరర్తువందలి వాయువు. (వై. ని.)

పుటాపుటిక. సం. వి. ఆ. స్త్రీ. పూర్వము సంశ్లిష్టమై పిదప పీడియుండుట

పుటాలువు. సం. వి. ఉ. పుం. కోలకందము. శ.

పుటి. సం. వి. ఈ. స్త్రీ. ౧ దొప్ప, దొన్నె, ౨. పూలబుట్ట. (వై. ని.)

పుటిక=పుట్టిక. వి. (త. పుట్టికల్. క పుటిక) పిటకము, గంప

చ...కంబడిచింపుల నీలిపాఁత లీఁ,కలఁ దగు పావురంపుఁబుటికల్ గొని వచ్చి కుమార సన్నిధిన్. సారంగ. ౧ ౧౧౬.

సీ...బుట్ట పుట్టిక పుట్టి పుట్టిక యనఁగఁ, దన రును బిటకంబు... ఆం. భా. ౨. ౨౪౦.

పుటిక. సం. వి. ఆ. స్త్రీ. ఏలకి. శ.

పుటితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. రెండుగా చీల్పఁబడినది, పాటితము, ౨. కుట్టఁబడినది, స్యూతము, 3. ముకుళితము, ముడుఁగుకొన్నట్లు చేయఁబడినది; దొప్పగాఁ జేయఁబడినది. ౪. ఆద్యంతములందు ప్రణవాదియుక్తమైనది. (మంత్రము.)

వి. అ. న. దొప్పవలె కూర్పఁబడిన రెండు చేతులు, దోసిలి, హస్తపుటము.

పుటుక్కు. వి. తెగుటయం దగుధ్వని కనుకరణము.

మ....గంట పుటుక్కునం దునిసికొ పృథ్వీం బడెన్ జాలె విస్ఫుల్ల ప్రకాశెన్ నుర మండలభుల్ గురిచె పోస్నెనై విరు ల్పోరసన్. అము. ౪. 3.

పుటోటజము. సం. వి. అ. న. ఛత్రము, గొడుగు, (త్రి. ని.)

పుటోదకము. సం. వి. అ. పుం. నారికేళము, కొబ్బెర శ.

పుట్ట. వి. ౧. వల్మీకము.

చ. తిరుగుచుఁ బుట్టలం దొదలఁ ద్రిమ్మరు పాముల కోసి కోసి విస్ఫురతగదీర్ఘదండము డొల్లఁగఁ ద్రేయుచు వచ్చివచ్చి...
భార. ఆది. ౧. ౧౫౨.

శా. పుట్టం బుట్టె శరంబునన్ మొలవ వంశో యాన పాత్రంబునన్, మెట్టం గల్గను...
భాగ. ౧. ౮.

సీ. ఆయుధంబులు చేసి హంకారములు కోసి ప్రెంకుక్కవారును బుట్ట లెక్కవారు.
వరాహ. 3. ౪౮.
కళా. ౧. ౧౬౨. ఆంధ్ర. ౨, ౯.

౨. స్థానము, నెలవు.

క. ప్రియములపుట్ట లనంగ వినయములకుఁ బెట్టె లనఁగ... వరాహ. ౯. ౧3౮.

గీ. చలము సాధించుదిట్ట కోపాలపుట్ట.
శుక. 3. ౧౯.

3. సమూహము, (ఉదా) కానుకలపుట్ట మెు.

(వ్యవ) ఆమంచములో నల్లులు పుట్టపుట్టలుగా నున్నవి.

౪. చిన్నపొద. (శ. ర.)

౫. పుబాది, గోడబలముకై తోఁకుమండి కట్టుటకు త్రవ్వుపల్లము.

(వ్యవ.) గోడలకు పుట్టలు త్రవ్వినారు.

జః పుట్టకాఁపు, పుట్టకాలివాఁడు, పుట్టకాలు, పుట్టకూడు, పుట్టకూడుమేపరి, పుట్టకొక్కు, పుట్టకోట, పుట్టక్రోవి, పుట్టగొడుగు, పుట్ట గోఁచి, పుట్టచెంబు, పుట్టచూలు, పుట్టచెరువు, పుట్టజాన్న, పుట్టతమ్మ, పుట్టతేనియ, పుట్ట

తేలు, పుట్టపుట్టూళ్ళు, పుట్టపురుగు, పుట్టపెద్ద, పుట్టబంగారము, పుట్టముంగి, పుట్టలమ్మ.

**పుట్టంధుఁడు.** వి. విశే. జన్మాంధుఁడు, పుట్టుగ్రుడ్డి.

శా. పుట్టంధుండవు పెద్దవాఁడవు మహాభోగంబులా లేవు నీ,ప ట్టెల్లం జెడిపోయె... కౌరవ్యవంశాగ్రణీ. భాగ. ౧ ౩౧౧.

సీ. తనకొమాముసాగముఁ గన్గొనుచొ పుట్టంధుండు మించుటద్దంబు చే నుంచుకొన్న.

సీతారా. ౩. ౪౩.

**పుట్టకాఁపు.** వి (పుట్ట+కాఁపు) ఝల్లాకము, ఎలుఁగుగొడ్డు (శ. ర గ్రా)

**పుట్టకాలివాఁడు.** విశే (√. పుట్ట+కాలు) వల్మీకపాదుఁడు, పుట్టవలె దుర్మాంసముపెరిఁగిన కాలుకలవాఁడు

సీ. వల్మీకపాదుఁడు వరలుఁ బుట్ట,కాలివాఁ డనఁగను . ఆం. భా. ౨. ౧౨౨.

**పుట్టకాలు.** వి. జో (౮ పుట్ట) వల్మీకపాదము, పుట్టవలె దుర్మాంసము పెరిఁగినకాలు.

సీ పుట్టకాల్ సొట్టకేల్ వట్టి గ్రేలుంజెవుల్ పట్టుకే కట్టిట్టు బిట్టుగదల.

చంద్ర. వి. ౧. ౫౧

**పుట్టకూడు.** వి జో. (√పుట్ట) పుట్టలో లభించు నాహారము (చీమగ్రుడ్లు మొ.)

సీ...వట్టిమాటలుగాపు పుట్టకూటికి డాయు కొలుఁగునైననుబట్టి నిలుపఁగలము.

చంద్ర. ౨. ౨౫.

వ...పుట్టకూటికిం జీమలకున్ జెదలునకు నెలుంగులు గులగులన్ బుట్టలు నికటనిజనఖరఖ లికకోటులన్ గోరాడ. మనుచ. ౪. ౩౭

(చీమగ్రుడ్లతో కలిసిన పుట్టమట్టిముద్ద. అని. శ.ర. కుక్కగొడుగు అని గ్రా.)

**పుట్టకూడుమేపరి.** వి. (√పుట్టకూడు) ఝల్లాకము, ఎలుఁగుగొడ్డు.

ఆ. అనిన సంతసిల్లి యద్దొర యంతయు, గారవించి యనుప గట్టుకూఁడు, కొడుకుకొడుకుఁ బుట్టకూడుమేపరి యెఁడుఁ, దోఁడు గాఁగ చెలిమితోడఁ జనిరి.

అచ్చ. రా. కిష్కిం. ౧౨.

ఇట్లే. పుట్టకూడుమేపుడు, పుట్టకూడుదిండి. మొ. (శ. ర )

**పుట్టకొక్కు.** వి. (√పుట్ట) పుట్టగొడుగు, భూస్ఫోటము.

గీ. ఒదవువృశ్చురత్తమున బుద్బుదము లెసఁగి, పుట్టకొక్కులై యవి జనభోజ్యభావ,మంది...

భార. శాం. ౫ ౪౩౩.

సీ. పుట్టకొక్కనఁగను భూస్ఫోటసంజ్ఞయా ..

ఆం. భా. ౨. ౭౭.

**పుట్టకోట.** వి. (√పుట్ట) కోటకు బలమునకై దానిపైట కేసినమట్టితిన్నె, అందగోడ. (శ. ర. గ్రా)

**పుట్టక్రోవి.** వి. (√పుట్ట) వల్మీకనాళము, పుట్టకలుఁగు.

సీ. పుట్టక్రోవుల సైతమును దేఁచి గలిగించి గేదంగి కేల కల్గింపఁడాయెను.

వైజ. ౩. ౧౨౧.

ద్వి. కటిలోద్ధతిని బుట్టక్రోవులఁ జేరి, ఘుటఘుటఁ జీమలఁ గ్రోలుభల్లుకములు...

ద్వి. సా. ౪౬౧. (గ్రా.)

**పుట్టగొడుగు.** వి. (√పుట్ట) పుట్టకొక్కు, పుట్టయందు తెల్లఁగా గొడుగువలె మొలచుమొలక, భూస్ఫోటము, కుక్కగొడుగు. ?. (శ. ర. గ్రా.)

పుట్టగోంచి. వి. (√పుట్టు. క. పుటగోసి.) గుహ్యాంగమును మఱుఁగుపఱుచుటకుపయోగించు వస్త్రఖండము. (పెద్దకౌపీనము. అని శ. ర. గ్రా.)

చ. వల నగుపుట్టగోంచి బిగువాఁగ్లను నుంకపుంగాసులున్ విభా,సితుంకరచాప గోఁగ్గలియు... శుక. 3. ౨౪౮.

సీ. నీ పుట్టగోంచియు నీ కావికేప్పువల్ వార కాంతకు బట్టుచీర లౌను. హైజ 3. ౧౦౩.

పుట్టచేమ్మ. వి (√పుట్ట) వల్మీకశింబి. ?

సీ. వల్మీకశింబిరై వరలుఁ బుట్టచేమ్మ యటంచన .. ఆం. భా. ౨. ౪౨.

పుట్టచూలు. వి. (౮ పుట్ట) వాల్మీకిముని. (చి. ని. గ్రా.)

పుట్టచెండు=పుటచెండు. వి. (పుట్టము + చెండు) (వస్త్రము, మొ. తోఁచేయఁబడిన) ఎగురఁగొట్టియాడెడుబంతి.

క. ఎవ్వనితల దునిమిన నది,చివ్వనఁ బుటమెగయుఁ బుట్టచెండుంబోలెన్, నవ్వినొకనవ్వు పెత్తుర, చివ్వన లోఁబడఁ గబంధపీఠున నిలుచున్. కళా. ౫. ౧౬౩.

క. కుటిలాలక నీగుబ్బలు, బటువు లయి మెంగాని లేగయు బంగిరునిగ్గుల్, పాటమరిలుఁ బుట్టచెం డ్లౌ, నటుగాదే నింతపట్టి యాడుదు నఁటకే. సారంగ. ౨. ౨౦౮.

రామా. ౮. ౫౧.

బః బాలక్రీడా విశేషము.

సీ. పుట్టచెం డ్లుప్పనఁబట్టి లాలంకుట గుడుగుడు గుంచాలు గుంటచాఁగ్లు. వి. పు. ౪. ౨౦౨.

కుదంశా. ౧. ౪౩.

పుట్టచేర్పు. (√పుట్ట) పాము, సర్పము.

సీ. చెలితోఁచులక పుట్టచేర్పులమున్నించు శాఖులఁ గరుణించు వనితశాఖి. హ. న. ౪. ౪౩.

పుట్టజేన్ను. వి. (√పుట్ట) పుట్టలో పట్టెడు తేనెపట్టు.

గీ. పుట్టతేనియ పెరతేనె పుట్టజున్ను, తొఱ్ఱతేనియ గల వందుఁ... కాళ. 3. ౬౮.

పుట్టతమ్మ. వి. (√పుట్ట) ఒకజాతి తంబలిఁగ, శింబి. ? (శ. ర.)

పుట్టతేనియ(నె). వి (√ పుట్ట) పుట్టలో పట్టిన తేనెపట్టులోని తేనె.

గీ. పుట్టతేనియ పెరతేనె పుట్టజున్ను, తొఱ్ఱతేనియ గల వందు... కాళ. 3. ౬౮.

సీ పుట్టతేనియఁ గ్రోలఁబోదలు చీమలమెక్కులూటి గైకొనదు భల్లూకగణము.

చంద్రా 3 ౪౨.

పుట్టతేలు. వి. (√పుట్ట) ఒకజాతి పెద్దతేలు, మండ్రగబ్బ (శ. ర)

పుట్టనిమ్మ. వి. (√పుట్ట?) గడియారము. (చి.ని)

పుట్టపు(ఁబు)ట్టువు. వి. (√పుట్ట) వల్మీక సంభవుఁడు, వాల్మీకి.

చ... ఆప్రచురకవిత్వతత్త్వనిధి భక్తి భజించెదఁ బుట్టపుట్టువున్. విక్ర. ౧. ౯.

గీ... అమృతమూర్తి, శ్రీ రఘూత్తముఁ దతని చారిత్ర మరిది, పుట్టఁబుట్టువులకుఁ గాక పొగడఁ దరమె. హ. న. ౧ ౧౪.

(క.) ఎదఁ గుదు రగుపేడుకఁ బొగడుదుఁ బదియరదముల దొరకొడుకుకత కడు నిం,పొదవఁ గదియించి యనమునఁ, బొదవిన బల్లిదునిఁ బుట్టఁబుట్టువు కవుసిన్.

అచ్చ. రా. బాల. ౯.

పుట్టపురుగు. వి. (పుట్ట+పురుగు) పాము (చి.ని.)

చ. కడుఁ దొడు సైన యుద్ధరితకర్మము నిక్గొని ముందుఁగాక ద్రొక్కెడఁ బడ నిచ్చుఁ

బుట్టపురుగా కొలగా కెపు దస్వతంత్రతకా, మడుంగు భజించి భేకముల మస్తమున నృరి యించి కొల్చి రొ, ప్పుదవి దయామతిం గడుపు పోయంగ నుందు పాకాలి పా మ్మనక్. కేం. పంచ 3. 3౫౫.

పుట్టపెద్ద. వి. (√పుట్ట) సర్పము. పాము.
సీ. జక్కవపులుంగుల జత విప్పకొద పుట్ట పెద్దల మలకలఁ బెట్టురట్టు.
అచ్చ. రా. అర. ౨౧.

పుట్టబంగారము. వి. (√పుట్ట) ౧ పుట్టలో పాలుపోసికొనునప్పుడు తడిపిచెవులకు రాచి కొనుపుట్టమన్న (వా)
౨. మొలకబంగారు, పుట్టలలో పురుగులవలనఁ గలుగు బంగారు.

పుట్టము. వి (సం పటః క పుట్టమ్) వస్త్రము. బట్ట.
క. చెలఁగ సురదుందుభిస్వనములు ముదమున భూమరోత్తములు పయిపుట్టంబులు విడిచి వీచి యార్చిరి... భార. ఆది. ౪ ౧౭౨.
సీ. పొంబట్టుపుట్టంబు పొట్ట నందంబుగా ఘన జటా జూటంబు గలయఁ బొదవి.
విక్ర ౨. ౯౪.
సీ. వలిపక్రొందళుకుమేల్ పెలిపట్టుబుట్టముల్ గట్టినయట్లు దిక్కాంత లలర.
ఉ. రా. ౧. ౫౮ ఆం. భా. ౨. ౧౫౧
జః పుట్టచెండు.

పుట్టముంగి. వి (√పుట్ట)నకుల విశేషము. ఒక జాతిముంగి.
(వ్యవ.) ఎన్ని తిట్టినను వాఁడు పుట్టముంగివలె యూరకుండును.

పుట్టలమ్మ. వి. (పుట్టలు+అమ్మ) ఒకానొక గ్రామదేవత, గర్భిణులు మొంగముబాఁపు అను రోగముల కధిదేవత. (గ్రా.)

సీ. పుట్టలమ్మ యటన్నఁ బో రయింత లేదను...
గీ...విబివియయ్యాలి బసివి. శుక. 3. ౮౯.

పుట్టి¹=పుట్టిక. (క కు పుట్టి) వి. ౧. బుట్ట.
సీ ..బుట్ట పుట్టిక పుట్టి పుటిక యనఁగఁ, దన రుచు విటకంబు .. ఆం. భా. ౨. ౨౮౦.
గీ. చెట్టుచెట్టునఁ బిట్టలు పుట్టికొలఁది, కోతి ముద్దలవంటివి దీకు మెపుడు.
ఇంపు. ౨. ౫౨.
౨. పేముతో గంపవలె అల్లి మీఁదఁ దోలు కప్పి కట్టి రేవుల దాఁటుటకు పయోగించు సాధన విశేషము
సీ పుట్టి నా వరిగోలు నాఁ గోల మలరు చుండు. ఆం. భా. ౧. ౧౫౪.
గీ. ఈఁదుకొయ్యలు తెప్పలు నీఁదుకాయ, లదర లరిగోల్లు పడవలు తరులు పుట్లు, చేపడవ లోడ లాదిగాఁ జెలఁగుపట్టి, యంబు తరణంబులకు పెల్ల నధిపుఁ డతఁడు.
హంస. ౮. ౧౭౨.
చ. సుజనజనైకభూషణము కూరత దుర్జనదూష ణంబు సద్ద్విజవిబుధాశ్రితప్రకతి పేదుకఁ బ్రోపును రాజ్య చిహ్న కాంక జలధుమాళి ప్రేకముగఁ గట్టినపట్టము వీజనంబు భూ, భుజాలక కాక యిన్నియును బుట్టికినైనను లేవ చూడఁగాన్. కు. సం. ౧౦. ౫౭౮.

పుట్టిముంచు=చెఱచు, ధ్వంసము చేయు.
క. మట్టొకటి కలద నీకుం, దొట్టినమదమునఁ దపోధనుఁ బరాకరునిగా, నట్టేటఁబుట్టి ముంపకె, కట్టా కందర్ప కుసుమకాండ ములవడిన్. కళా. 3. ౧౧౮.

పంచచామరము ...గాఢమ్ము మూర్ఖ పట్టి ముట్టి బానిపుట్టి ముంచెగట్టులన్.
రామా. ౭. ౫౫.

పుట్టిమునుఁగు—చెడు, ధ్వంసమగు.

చ. పదలక కృష్ణరాయకరవాలమునం దసుధార నీట వ్యథ్యోదయము నొంది శాత్రవులపుట్టి మునుంగగ... మను. ౧. ౪౧.

(వ్యవ.) అంతపుట్టి మునిఁగినప్పుడు చూతముశే. (...) ఏమిపుట్టి మునిగినదని నీవిటుకు పరుగెత్తు కొని వచ్చినావు.

జః పుట్టిమునుక, పుట్టివాఁడు

పుట్టి². వి ౧. ధాన్యమాన విశేషము

(ఈ పరిమాణము మండలభేదమునుబట్టి మాఱు చుండును.

బుట్టెడుపుట్టి, తూర్పుపుట్టి ౨౦ కుంచములు.

పల్లెపుట్టి—౮౦ కుంచములు.

మలకపుట్టి—౨౦౦. కుంచములు

పత్త్రిములలో దీనికి గుఱుతు "ఖ", ఖండి యొక్క లంత్తరూపము (గ్రా)

గీ. తల్లిచను పాలు గ్రుక్కఁడు తక్కువయివి, పుట్టెఁడును బొక్కరూ పను భూమిఁ బరగు, నాడువు బొం కర్యో...
హరి. పూ. ౫. ౨౩౫.

గీ. చుట్టుకొని కొల్చు పోఁతకుఁ బుట్టెఁ డమ్మె, శ్రీ రఘుస్వామి రాజ్యంబు సేయునపుడు.
ఉ. రా. ౮. ౧౪౧.

వ. చేతిజాయ(కు) కూంతుర జయమయిండ్దు లయ మినీశ్వర మహాదేవరసన్నిధానమున నుత్తరాయన సంక్రాంతి నిమిత్తమునంబెట్టిం చ్చిన కులోత్తుంగచోడ శత్రమునకుంబ్రోలు పాట్టి కుంకటూరి దక్షణమున చెఱువు దక్ష ణామున ముప్పదిపుట్ల వితుపట్లు సర్వాకర పరిహారముగా శ్రీచోడ (గ)ంగ్గదేవరిచ్చి.
ద. శా. ౧౦౧౫.

౨. భూమాన విశేషము.

వ...గొల్లపల్లు తూర్పున పీలచుదేవి...యువప రకాముబ్బోట కొలుకపుట్టి...
ద. శా. ౧౦౧౭.

౩. తులామాన విశేషము. ఇరువది మణుగుల యెత్తు.

ఉదా: పుట్టెఁడుబెల్లము, పుట్టెఁడు పొగాకు. మొ.

పుట్టించే. స. క్రి (√. పుట్టు) ౧. కను, జనింపఁ జేయు.

వ ఆ దీర్ఘతముండును దానివలనఁ గాక్షీవ దాదుల సేకాదశపుత్రులం బుట్టించిన..
భార. ఆది. ౪. ౨౩౪.

సీ .అతఁడు సర్వకర్మనిఁ బుట్టించె ననరణ్యా భూపతి యతనినుతుఁడు.
హరి. పూ ౨. ౩౨.

౨ సృజించు, నిర్మించు

సీ అన్యోన్యధనకాంక్షులై పోరు ధరణీశులకు నెల్ల సాదకాడకును శైల, దుర్గంబులను వనదుర్గంబులను జలదుర్గంబులను మహీదుర్గ ములను, బుట్టించి... వి. పు ౧. ౧౦౦.

గీ బ్రహ్మ పుట్టించు మనుచు నారాయణుండు, హరుఁడు హరియించు భువనంబు లవసర మున
కాశీ ౩. ౪౪.

౩ కలిగించు, ఒదవించు.

గీ ఇంపుఁ బుట్టించుఁగాక మీ యిద్దఱకును.
నైష. ౫. ౩౨.

వ...బదలికలు పుట్టించుచు ..
ఉ. రా. ౩. ౨౪౭.

౪ కల్పించు, కల్పనముచేయు.

సీ...ప్రబంధములు క్రొత్తలు పుట్టించుకొని లిఖింప.
విక్ర. ౧. ౨౦.

(వ్యవ) వాఁడు సామీఁద లేనిపోనిమాటలు పుట్టించి చెప్పినాఁడు

జః ప్రసంగమునకుఁ దెచ్చు.

వ. పాండవపక్షంబువారల తారతమ్యంబులు వినువాఁడై యమ్మాట పుట్టించిన నతనికి భీష్ముఁ డిట్లనియె.
భార. ఉద్యో. ౪. ౨౧౨.

పుట్టిక=పుటిక.

చ. పొగడలు దూపి పుట్టికలఁ బోసి రసాలయు
షద్రసాలభ్రుం, జిగురులు డాపి ..
బహు. ౨. ౨౭.

ఉ. భూవరముఖ్యసన్నిధిఁ బోరెడు మామిడి
పండ్లపుట్టికల్, పెంపుగ
కళా. ౬. ౧౫౭. ఆం. భా. ౨ ౨౮౦

—బద్దలపుట్టిక=అబద్ధములగంప; మిక్కిలి యసత్యమాడువాడు

ఉ. పైనపుదట్టి గట్టుకొని బద్దలపుట్టిక వెంట
రాఁగ రాఁపానిప పాని నవ్వువెలజవ్వని
రాఁ గని యొక్కసాని యొంపాని మిటారి
నీకు దొరసానికి నీ దన చెల్ల దంచు భూ,
జాని పటానిగా యవుక జిక్కి వెసం దిగి
కొమ్మ కొమ్మనెన్. రా. వి. ౨. ౫౯.

—బోనపుట్టిక=అన్నపుబుట్ట

చ అమరులబోన పుట్టిక సహస్రమయూఖుని
కోడుకోడె సంతమసమువేయుటిత్తు కుముదం
బుల చిక్కిలిగింత .. పారి. ౨ ౪౦

పుట్టినయిల్లు=పుట్టినిల్లు, పుట్టిల్లు. వి
(పుట్టిన+ఇల్లు)

౧. ఆడువారి జన్మవంశము.

సీ. ఈరీతిఁ బుట్టినయింటికిఁ జొచ్చినయింటికి
నెప్పుడు వెలుబలుండు. వరాహ. ౬. ౩

౨. జన్మగృహము, జనకగృహము.

క. కడుబలవంతుం డైనను, బుధమిని బ్రాయం
పుటాలిఁ బుట్టిన యింటన్, దడ వుండ
నిచ్చి తీనియుఁ, బదయుఁగ నంగడికిఁ దాఁ
దాపుట మమతే. ము. ౪. ౨౯

పుట్టినిల్లు (లు)=పుట్టినయిల్లు, పుట్టిల్లు.
(జనకగృహము.)

ఆ. పుట్టినింటి కేమ బోయి రొక్కించుక,
యూఁడల్లి వత్తు .. పారి. భూ. ౧. ౧౪౦.
(జనన కారణము)

వ. అప్పుణ్యవంశంబు కంసాసురధ్వంసిచరణ
పల్లవంబు దనకుఁ బుట్టినిల్లు గావున కారణా
గుణ సంక్రమంబునంబోలె చాతురత్తోచుర
చ్ఛత్రధనుః ఖడ్గాది చిహ్నోపశోభితంబై.
భీమ. ౧. ౩౧.

(నెలవు, స్థానము.)

ఉ నెట్టన పాపగాములఁడు నీలకు బ్రాణా
నవంగ విన్న దా, కిట్టెఁడిపీను లేమి విను
కాతియు కౌర్యవు దుర్వినీతిఁ, బుట్టిన
యిల్లు నై వినాశపోవఁగ వచ్చునె యింక
నాకు... భార. భీష్మ. ౧. ౭౫.

క...ఇది పుట్టినయిల్లు సిరుల కెల్లఁదలంపన్.
కళా. ౨. ౧౧౪.

సీ. ఏము ప్రముచ్చులమె యూహింప ప్రముచ్చుఁ
దనాలపుట్టినయిండ్లు మీలోఁ గాక.
ప్రభా. ౧. ౧౦౭.

పుట్టిమునుక. వి. (√పుట్టి[1]) నష్టము, చెఱుపు.
(వ్యవ)వాఁ డాపని చేసినయెడల నీకు వచ్చి
పుట్టిమునుక ఏమి?

పుట్టిల్లు=పుట్టినయిల్లు, పుట్టినిల్లు.
(జనకగృహము)

సీ. సిరికిఁ బుట్టింటి వెచ్చెలు కాట మనవికి
డాసె దా మకరకుండలము లమర.
ఆము. ౪. ౧౧.

పుట్టివాఁడు. విణ (√పుట్టి[1]) పుట్టినదప్పువాఁడు,
నాశకుఁడు.

గీ. పుట్టివాని కొక్కరునిఁ దాఁ బొందుచేసి
వారి నాదటఁ గాచెరివారియందు, ముంచు
టకు మున్నుగా నియమించి రొక్క, వాఁడు
కాసీల కిట్లను నయము మీఱ.
పరమ. ౫. ౪౯.

పుట్టు. అ. క్రి. (క. పుట్టు.) ౧. జన్మించు, జనన
మొందు.

గీ. మున్ను పుట్టుట యిది కద్రూతోద్య మ్మెం. భార. ఆది 3 ౧౭౦.

ఉ. పుట్టఁగఁ బుట్టఁగాఁ దునిమెఁ బుత్రుల దేవకి గన్నయందఱం, గట్టిఁడి పాపజాతి యగుకంసుఁడు... హరి. పూ. ౫. ౧౩౯

౨. మొలచు, అంకురించు.

గీ. చంద్రగుప్తుండు గావించె సరసగోష్ఠి,పట్టి ప్రాఁతలఁ జివురులు పుట్టునట్లు. విక్ర. ౧. ౧౧౨.

సీ. పుట్టె వల్మీకంబు పొదలు పొదలె. కాశీ. ౫. ౧౨౮.

3. కలుగు, సంభవించు.

క తగతరమ ప్రజలఁ దునిమెదు,నరునప్పటి యుత్తరోలునకు సురవిద్యాధర ఖేచరులును భీతిం, బొరసిరి తమదెసకు నేమి పుట్టునొ యనుచున్ భార. విరా. ౫ ౬౪.

గీ భక్తి దివిజాలచిత్తంబు పట్టి యున్న,నంతరాయంబు పుట్టఁ గార్యముల కెల్ల నైష. ౪. ౭౫.

౪. దొరకు, లభించు.

గీ. పులుఁగు పూరెదు ప్రియపడి పొలములందు, మొలఁగి వెదకినఁ బుట్టదు మెకము లదఁగ. హరి. పూ. ౬. ౫.

చ నముచినిషూదనాదులు మనంబున నొందిరి ఖేదమోదముల్,భుము గుడువంగ నోగిరముఁ గట్టఁగఁ బుట్టముఁ బుట్ట కుండుటన్. హర. ౬. ౩౧. శుక. ౨. ౫౧౧.

౫. గోచరమగు, కనబడు.

శా .దివ్యప్రభా,దట్టం బొక్కటి పుట్టెఁ గట్టెదుర సంధ్యాలక్ష్మికిం బుట్టమై. వసు. ౪. ౫౫.

౬. ఏర్పడు.

ఉ... వెళ్లము పుట్టెఁ దమ్మిపూఁజొట్టములోనఁ గానిరెండవ కూరులు శాకముఁ జేరఁబోవఁ గాఁ,బుట్టుట యెట్లు త్రోవ పరిపూర్ణదినేశ్వరమండలంబునన్. దశా. ౧ ౭౪.

వి. = పుట్టుక ౧ జన్మము. ఉద్భవము.

ఉ. ఇట్టిపదంబు గాంచి పరమేశ్వరునిం గృతినాథుఁ జేసి యే,పట్టునఁ బూజ్యమూర్తి యగుభారతసంహితఁ జెప్పఁగంటి నా,పుట్టు గృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి నవ్యయం, గట్టెదఁ బట్ట మప్రతిమకారుణికత్వమహావిభూతికిన్ భార విరా. ౧. ౨౪.

సీ వలవంత లిఖవు కాంతలపుట్టు దూషించు కారణంబులతోంటికథలు తెలుప. అము ౫ ౬౦

ఆం. భా. ౧. ౧౦౦

౨. మొలక, అంకురము.

సీ సకలదైవతబుభుక్షాపూర్తి కవ్వాఁడు పుట్టుగాననిమేనిమెట్టపంట మనుచ ౧ ౧౭.

3 (గ్రహాదుల) ఉదయము, పొడుపు.

శా...అప్పట్టునం,బుట్టుంగెంపువ నింపు మీఱు రవిపెంపుం జెంపి దట్టంపుకెం,బట్టుంబుట్టము రంగు నింగిరమ కాపాదించుదివ్యప్రభా, దట్టం బొక్కటి పుట్టెఁ గట్టెదుర సంధ్యాలక్ష్మికిం బుట్టమై. వసు ౪ ౫౫.

—పుట్టుకర్ములు = పుట్టినదిమొదలు కర్మములే ప్రధానములని సిద్ధాంతించి చేయువారు (పూర్వమీమాంసకులు)

ద్వి. కారు లేఁటికిఁ బుట్టుకర్ము లైనట్టి,మీర లీయర్థ మెమ్మెయి నెఱుంగుదురు. ద్వి పరమ. ౫. ౩౫౭.

—పుట్టుముని = పుట్టినదిమొదలుగా లౌకిక ప్రవృత్తులందు విరక్తికలవాఁడు.

ద్వి. తనుఁజాలుపుత్రరత్నముఁ బ్రసాదింతు, ననఁగ నమ్మితిఁ గాని యున్న యీపుట్టు, ముని నైననిన్ను నిమ్ముల నిచ్చుకొలుఁగ. ద్వి. పరమ. ౩. ౧౫౩.

జః పుట్టంధుఁడు, పుట్టింగు, పుట్టినయిల్లు, పుట్టి నిల్లు, పుట్టిల్లు, పుట్టుఁగల్లరి, పుట్టుఁగవచము, పుట్టుఁజీకు, పుట్టుక, పుట్టుగట్టు, పుట్టుగు గట్టు, పుట్టుగొడ్డు, పుట్టుగొడ్రాలు, పుట్టు గ్రుడ్డి, పుట్టుగ్రుడ్డు, పుట్టుచెయువు, పుట్టు పాప, పుట్టుబడి, పుట్టుభోగి, పుట్టుభోగి, పుట్టుమచ్చ, పుట్టుమూఁగ, పుట్టువ, పుట్టు వడుగు, పుట్టువు, పుట్టువుకట్టు, పుట్టువెట్టి, పుట్టినిల్లు.

పుట్టుఁగల్లరి. విణ (√పుట్టు) పుట్టినది మొదలు కొని కల్ల లాడువాఁడు, అజన్మానృతవాది.

గీ. పుట్టుఁగల్లరియై పాపములకు నెల్లదిట్టయై లోకములచేతఁ దిట్టువడినకట్టిఁడికి నిట్టికష్టం బుగా నొనర్చితిగ విధాతృఁడు చతురుఁడై నెగడె నేఁడు. భార. అర. ౫. ౪౦౫

పుట్టుఁగవచము. వి. (పుట్టు+కవచము.) పుట్టుక తోడనె కలిగినకవచము, సహజకవచము.

చ. సలలిత మైనపుట్టుఁగవచంబు నిసర్గజ మైన కుండలం,బులయుగళంబు నొప్పఁగ నుపు త్రుఁడు కర్ణుఁడు పుట్టె... భార ఆది ౫. ౨౭.

పుట్టుఁజీకు. విణ. (పుట్టు+చీకు) పుట్టుక మొదలు గ్రుడ్డి యైనవాఁడు, జనుసాంధుఁడు, జనుసాం ధము, గ్రుడ్డియైనది.

ఆ. పుట్టుఁజీకు వృద్ధుఁ బూతిగంధానను, జెద జడునిఁ బొంద వెలఁది రోసి. భార. ఆది. ౪. ౨౩౩.

ఉ. తప్పునె చేటు వారలకు దైవముకన్నులు పుట్టుఁజీకులే. కేయూర. ౩. ౩౩౦

పుట్టుక=పుట్టు,పుట్టువు. వి. (√పుట్టు) స్వార్థ మునకు ప్రత్యయము, అని. శ. ర. క. పుట్టుకా. (జన్మము)

ఉ...ఈసమీరపుత్రుండు పుట్టుఁ డాని కద తొల్లి టిపుట్టుక నీకపాదరుహం డితఁ డంచుఁ గొండలు బుధుల్ గణింతు రుదరు... ఉ. రా. ౫. ౭౩. (ఉదయము,పొడుపు.)

సీ సకలదైవతబుధసామ్రాజ్యకీర్తి కవ్వానిపుట్టు కావని రేనిమెట్టపంట. ఆము. ౧. ౧౯

పుట్టుగట్టు=పుట్టుగుగట్టు.

ఆ పుట్టుగట్టుచరిని బోదమునతమ్ములవిందు, కిరణి... యయా. ౩ ౧౪౧.

పుట్టుగుగట్టు=పుట్టుగట్టు. వి (పుట్టుగు+గట్టు.) పొడుపుఁగొండ,ఉదయపర్వతము.

చ వలపులకేఁడు సేయుకొదువం బడ కెంతయు రాజు మీఱి లోఁనలరుచుఁ జూడ వచ్చె నన నంతటఁ బుట్టుగుగట్టుమీఁదటన్, దలిరి దలిర్పఁ దామరలదేవర దోఁచిన యయా. ౫. ౧౫౧.

పుట్టుగొడ్డు. విణ (పుట్టు+గొడ్డు) పుట్టుకనుండి యు గొడ్డుతనముకలది,కేవలవంధ్య. (శ. ర.)

పుట్టుగొడ్రాలు. వి. స్త్రీ. (పుట్టు+గొడ్రాలు) వట్టిగొడ్రాలు,కేవలవంధ్యయగుస్త్రీ.

ద్వి పుట్టుగొడ్రాలిని బురవీథినడుమఁ, బట్టి యీడ్చుచు రద్దుపద్దుచేయఁగను. ద్వి. శ. సా. ౩. ౧౭౫. పం.

పుట్టుగ్రుడ్డి. విణ. (పుట్టు + గ్రుడ్డి.) పుట్టుక మొదలు గ్రుడ్డియైనవాఁడు,జాత్యంధుఁడు.

మ. కవిరాజాగ్రణి పుట్టుగ్రు డ్డనుచు నీకంజా క్షికిం జెప్పి రయా,కవిత్వ విభాసుకదృగ్గాత్రి యని నేర్చుం జెప్పె... విప్ర. ౧. ౧౧౨.

సీ. ఇలఁబుట్టుగ్రుడ్డకు హితవర్ణవృత్తి... వసు. ౩. ౧౩౪

పుట్టుగ్రుడ్డు. విశే. (పుట్టు+గ్రుడ్డు.) గ్రుడ్డిగాఁ బుట్టినది. (పక్షి)

సీ. పుట్టుగ్రు డ్డైననీబూమెలకేడికిఁ దగిలెదవు వినితప్రతీతి. కేం. పంచ. ४. ౧౬౧.

సీ. అలరారుటెగి దేఁటులుదబోరంబులఁ బుట్టుగ్రుడ్లని పల్కఁ బోలఁదికనులు.

హంస. ౫. ౨౧౦.

పుట్టుచె(య్వు)యువు. వి. (పుట్టు+చెయువు) పుట్టినప్పుడు చేయు సంస్కారము, జాతకర్మము. (శ. ర.)

పుట్టుపాప. విశే. ౧. పుట్టువునందే సర్వశరీరమందుఁ బ్రుంగుడు కలవాఁడు, పుట్టుకతోడనే శ్వేతరోగముకలవాఁడు. (బ్రౌ. చి. ని. శ ర.)

౨. పుట్టినప్పటినుండియు భర్తృసౌఖ్య మెఱుంగక పనిపాపవలె నుండునది, అబాధ,

సీ. అలిగి యొంకటిరాజానాంద్రమైనను బట్టి పుట్టుపాపలఁ జేయఁరట్టుకత్తె. క్రీడా. ౧౭౯.

(నెల్లూరిమండలములో నిది యొకతిట్టుగా వాడుదురు)

పుట్టుబడి. వి (√పుట్టు) పుట్టుక, ఉత్పత్తి (శ. ర బ్రౌ.)

పుట్టుబోగి=పుట్టుభోగి. విశే (√పుట్టు) పుట్టినది మొదలుకొని భోగము లనుభవించువాఁడు.

క. ఇది పుట్టుబోగి దీనికిఁ, గూడ నేమియు లేకయుండఁ గూర్చుకరమ్మ.

యయా. ४ ౧౩౪.

పుట్టుభోగి=పుట్టుబోగి. వి. విశే. (√పుట్టు) పుట్టినదాదిభోగములనుభవించువాఁడు.

ఉ. చాలదు పుట్టుభోగులు నృపాలకమాధవు లెందఱుండిరేఁ, దూలినవారు...

చంద్ర. ౩. ౨౩.

ద్వి. నందనుండును నీవు జాతియు నెరలఁ, బొందకోపరు పుట్టుభోగులు నిజాయ.

ద్వి. హరిశ్చ. భూ. ౧౯౦౭. పం.

పుట్టుమచ్చ. వి. (పుట్టు + మచ్చ) పుట్టినప్పటినుండియు దేహమునందుండెడి నల్లనిమచ్చ, తిలకాలకము. (శ. ర.)

పుట్టుమూఁగ. విశే (√పుట్టు) పుట్టుకనుండియు మూఁగయైనవాఁడు, మూఁగయైనది.

సీ పుట్టుమూఁగను తమ్మిపుట్టువుగాఁ గైచేసి పగఁగు ప్రసాదవైభవమువాఁడు. భాను. ౧. ౩.

పుట్టువ=పుట్టువు. వి. (√పుట్టు) జన్మము.

ఆ. పుట్టుపుట్టువయనఁ బొలుచు జన్మము ..

ఆం. భా. ౧. ౧౦౦.

పుట్టువడుగు. వి. (పుట్టు+వడుగు) ౧ పుట్టుకనుండియు బ్రహ్మచారిగా నుండువాఁడు, ఆజన్మబ్రహ్మచారి (శ. ర)

౨. విష్ణువు, హరి.

గీ... పుట్టువడుగుకామర బొక్కిలివాఁడు పనిఁడి, వలువకాల్పన హరిపేరులు...

సాం ని. దేవ. ४.

పుట్టువు(గు)=పుట్టు, పుట్టుక, పుట్టువ.

వి (√పుట్టు) జన్మము.

క .ఇటపుట్టువుగాకుండెడు సక్తిము, మపుబ్రాహ్మణకులమునం దయయెయ్యెడుజాతున్.

భార అర. ౧. ౨౯४.

ఉ పుట్టుగచెట్టుకన్నోలవఁబోసిన విత్తులు కాంతిము స్తకుఙ్, ముట్టియతోడి జీవములు...

కవిక. ౫. ౧౨౦.

ఉ. ఏఁ, బోరచియాఁడు బుట్టువునఁబుట్టి విరర్థకజీవనైతి సం, సారసుఖావహంబయిన సత్పుత జన్మముఁ గానఁబోలమిఙ్.

భార. ఆది. ౫. ౧౭౯.

జన్మసంబంధము.

ఉ. చక్కని పిట్టకుల కలికచన్నుల మిట్టపు సేమి
పుట్టువో, చక్కెరదీవికా వనిత సన్నపు
పొందికి సేమి సాధియో... కువల. 3. 33

ఉదయము.

చూ. పుట్టుగుగట్టు

పుట్టువుకట్టు. వి (పుట్టువు + కట్టు) భవబంధము,
సంసారమనెడి బంధము

రగడ ప్రాఁకమిన్నక్కొనల్ గనుంగొని బల్మి
పుట్టువుకట్టులూడిచి అచ్చ రా. యు ౭౪.

పుట్టువెత్తి. విశే. (√పుట్టు) పుట్టినప్పటినుండియు
వెత్తియైనవాఁడు, వెత్తిది (శ ర)

పుట్టెము. వి గుబురు, జొంపము

ద్వి. మట్టపై తలిరుజొంపములలో నొక్క,
పుట్టెపైలో సొందపాద వదకుండఁ, దలి
రించి. ద్వి. పరిమ ౪. ౨౫౦.

పుట్టిల్లు. వి దే (పుట్టిన + ఇల్లు, వృత్తివిషగ్ర
లోపము చి ని శ. ' ఘట్టిల్లు ఇంకను విచా
గ్యము.) పుట్టిల్లు

సీ. అరిదిదీవులమేలు నవఘటింపఁగఁ జాలుచలిత
కాంచీదామజఘనసీమ, గలిగి పుట్టింటి
చిన్నెలఁ జెలఁగునట్టికలశవారాశిపట్టి...
ఘటికా. ౧. ౨.

గీ మూఁడుమూర్తులపుట్టిల్లు మొదలివేలపు
భాగి ౮ ౧౫౪.

(శ ర. పా పుట్టిల్లు ముద్రి. పా)

పుడమి. వి (సం పృథివీ, ప్రా పుడవీ క పొడవి. త. పుడవి) ౧ భూలోకము

సీ. అతఁడు గ్రమ్మఱ వా కాధ్యా మగుపారి
జాతంబు పుడమి కేకీతిఁ దెచ్చె
పారి. ౧ ౩౬.

గీ. ఎండ గుడి ప్రింగువారికి నంది పిండివడియ
మనుప శ్క్కంగజే పుడమిలోన.
విక్ర. ౨. ౨౩౮.

గీ. పుడమిలోపల మిథిల కాఁ బ్రోలు వెలయు.
సీలా. ౧. ౨౬.

౨. నేల, భూభాగము.

గీ. పుడమి తిలకంబులన్యాయమున వెలుంగ.
మనుచ. ౨. ౬.

ఆ పుడమి నేల యనిన భూవాచకం బగు...
ఆం. భా ౨. 3.
హర ౨. ౨౦.

3 రాష్ట్రము, ప్రజలతోఁగూడిన దేశము.

౪ పుడమియు రాజ్యము బంధుల, విడిచి ..
భార. అర ౨. 3.

౪. ఒడఁబడి మాకు వారికిఁ, బుడమి సగము
గాఁగఁ జేసి పొంది పొసఁగి యుం, డెడునట్టి
తెఱఁగు సేయుట... భార. ఉద్యో. 3. ౬౬.
భార. ఉద్యో. 3. ౪౧

జ పుడమికాన్పు, పుడమికాపరి, పుడమికాలుపు, పుడమిదయ్యము, పుడమిగొర, పుడమిపట్టి, పుడమిబొట్టియ, పుడమిమగడు, పుడమిమోపరి, పుడమిఱేఁడు, పుడమివేల్పు

పుడమికా(నుపు)న్పు. వి (పుడమి + కానుపు)

౧ భూపుత్రి, సీత

ఆ పుడమికాన్పుమగనిఁ బొగడుచు నపు డాకు,
టింటిప్రోడ యొందు సేని జనిరె.
అచ్చరా బాల. ౧౬౬

౨ భూజము, వృక్షము.

గీ. పొదవిచిగురును వలిగుబ్బ పూవుగుత్తి, లక్క
జవుఁబల్కు కేనియ లరిదిటాలు, గంటు
తుమ్మెదగిమ్ముకు గలిగి రూపు, పుడమి
కానుపుఁ బేరొల్పుఁ బొగడఁ దరమె.
అచ్చ రా. బాల. ౧౪౦.

ఇల్లే. పుడమిపుట్టుగు.

గీ పుడమిపుట్టుగు లతకూన పూతఁబోఁడి,
కొమ్మ పైదోడు మాకు భూజమ్ములార,

తోడు నీడయు నగుచుఁ గాపాడుఁ దరసి,
యఖిలశైశ కళలావాప్తి యగు నిజంబు.
రామా. ౫. ౨౪౪.

పుడమికాపరి. వి (పుడమి+కాపరి) భూపాలుఁడు, రాజు.
గీ. పుడమికాపరిమేల్బంతి కదలి దాఁటె.
అచ్చ. రా. యు. ౯౧

పుడమితా(దా)లుపు(ల్పు). వి. (పుడమి+తాలుపు) భూభృత్తు, రాజు
తే కఱకుఁ జాపక్రంతలు గనక శాత్త్రములఁ
దొరలు పెనుబాములవెంగి నలుగక, పేల్చు
దొరలైన పెంపక పెలయునచటి, పుడమి
దాలుపుగమిపెచ్చు పొగడ నరిది
అచ్చ రా బాల. ౪౦
౨. భూధరము, గట్టు.
వ. అప్పు డప్పుడమితాల్పనల్పకల్లోలినీ వల్లభ
సముల్లంఘనదృఢతరనిహితమానుమచ్చరణ
తలపీడనంబు పైరింప నక్షమం బై .
చం. రా. ౪ ౩.
వ . పుడమితాల్పులకు నేలికవు గమ్మని .
దశా. ౫ ౧౧౫.
౩. శేషుఁడు.
సీ. పుడమిదాలుపు లయ్యుఁ బడగదాల్గ న్నియు
మేటిసింగము లయ్యు మెకము లెల్ల
అచ్చ. రా అయో ౨౦.
సీ. పుడమిదాలుపువేయిపడగ లల్లాడంగ వడి
మెట్టు ..
గీ...వరాహమూర్తి. రామ. ౩౮౪.

పుడమిదయ్యము=పుడమివేల్పు. వి. (పుడమి+దయ్యము.) భూదేవుఁడు, బ్రాహ్మణుఁడు.
క. బవరమున తిప్ప రమ్మని, తవిలిన మీవంటి
పుడమిదయ్యంబులతో, దివిరి రొండుకొన్క
నఁగాఁ దగ, నవులే సెలరాచమున్నియల
కెంకైకన్. అచ్చ. రా. బాల. ౨౦౪.
గీ. పుడమిదయ్యాలు రొండుకొండి కెదలి వచ్చి,
తిటుల... నీలా. ౧. ౭౨.

పుడమిదొర=పుడమిఱేఁడు. వి. (పుడమి+దొర.) భూపతి, రాజు.
క పుడమిదొర నిర్నిమిత్తం, బడపఁగ నే పెట్టి
నయ్య యాకర్ముఁడు నా,దొడ నడచిన
నడువడి యొర్పదఁ దల్పెద నిను మటంచుఁ
బలికె నథయుఁడై. చెన్న. ౩. ౪౨౪.
క. పుడమిదొరతపసులై వివా, రడవికిఁ జని
యిప్పుడు పురికి నరుదెంచితి క్రీనడుము...
హై ౧. ౮౪.
(పుడమిదొర తపసులు=రాజర్షులు.)

పుడమిపట్టి. వి (√పుడమి) ౧. భూపుత్రి,
సీతాదేవి
గీ తపసిజాబిల్లి జవరాంబ్రదండ నుండఁ,బుడమి
పట్టికి మరిఁ గోర్కి పుట్టు పెటఁగి, పేర్కొ
నాకపర్ణశాల గావించి యచటఁ, గొలిచె
నారాఘవింగంపుఁగొవమదోయి.
రామా. ౫. ౭౫.
వ తటిల్లతవలె నిలుచున్న పుడమిపట్టికట్టెదుటఁ
బుడమి బిట్టువిసి పటిల్లునఁ బగిలిన
యప్పట్టున మహాబిలం బగునొక్క మహా
బిలంబు గనుపట్టె భా. రా ౭. ౯౪.
౨. భూపుత్రుఁడు, అంగారకుఁడు. ౩ నరకాసురుఁడు.

పుడమిపుఁడు. మి. వి. (√పుడమి, సం. పృథివీశః.) భూపుఁడు, రాజు.
చ. పుడమిపుఁడుం ధరాధుర్యుఁడును భూరి
బలుండును శౌర్యవంతుఁడున్.
భా. సం. ౧౧. ౭౧౪.

పుడమిపుట్టు. వి. ౧ చెట్టు. ౨. సీత.
గీ. పుడమిపు ట్టగు లతమాన పూవుఁబోఁడి
కొమ్మ పైఁదోడు మీకు భూజమ్ములార,

తోడు నీడయు వసుధం గాపాడం దరసి,
యఖిలదైశకలాపాప్తి యగు నిజంబు.
రామా. ౫. ౨౪౪. శ. ర. పా.
పుడమిపుట్టువు. ముద్రి. పా.

పుడమిబోట్టియ. వి. (పుడమి + బోట్టియ) సీతా దేవి.

గీ. పుడమిబోట్టియ యత్తల కడం బ్రొక్కి, తోడికోడండ్ర సంగడిచేడియలను, చెనరు దైవారం గౌగిటం జేనచి జన్ని, గట్టు మత్తైదువులం దద్ద గారవించె.
అచ్చ. రా. యు ౫౮౪.

పుడమిమగండు. వి. (పుడమి + మగండు) భూనా థుండు, రాజు

చ. పుడమిమగండ నీవుడువు పొం దయినక్ నిజకాంతచర్మ మే, కడం దగంగోసినావొ యది కర్గొనదక...
చెన్న. ౪. ౪౪

పుడమిమోపరి. వి. (పుడమి + మోపరి) పుడమి దాల్పు, శేషుండు.

సీ. పుడమిమోపరి పాంపడగగుంపుల సొంపు విడి పెంపు ..వెలుపు వెలుప.
సమీర ౩. ౫౫.

పుడమిఱేండు. వి (పుడమి + ఱేండు) భూపతి, రాజు.

ఉ. ఆప్పులు వాల్ప కప్పుడమిఱేనిమనోహర మూర్తి నిచ్చలుం, దప్పక చూచి
హైమ ౧. ౨౫.

గీ. బాగడికలం జెందు నెపుడు నప్పుడమిఱేండు
నీలా ౧. ౪౨.

పుడమివేల్పు (లుపు). వి (పుడమి + వేల్పు) భూదేవుండు, బ్రాహ్మణుండు.

సీ. సీతల్లి లచ్చమ్మ చే సంతసిల నోరములు పెట్టంగ బుడమివేల్పులకు నెల్ల.
అచ్చ. రా. బాల. ౧౫.

గీ. ఇప్పు డమిలాగ్రహాంబున నేనకేని, యిప్పు డమివేల్పుగొలముగా రందరేని, చెలి గిలి యటంచు నున్నారు విష్ణుపాదు, వెలిం బ్రకాశింపు వాటుది వెలసినట్లు.
పరమ. ౨. ౧౩౬.

(ఇప్పుడమివేల్పుగొలమువారు = ఈ బ్రాహ్మణ వంశమువారు)

పుడమీశుండు. మి. వి (√పుడమి) సం పృథి వీశః రాజు, పుడమిపుండు.

ద్వి. పుడమీశ విూధనంబునకుం జే పొంప.
ఐన. పు. ౩. ౨౪. పం.

క. పుడమీశ సత్యవాక్యము, నడపుము...
సకల ౨ ఆ.

ఇట్లు . పుడమీశ్వరుండు. (శ. ర.)

పుడి(ణి)కరించే. స. క్రి (√పుడుంకు) ౧. కొంచె ముగా ఇచ్చు; ఇచ్చు ౨ (సన్నిపాతదోషముచే శ్రేష్ఠ కావలతో వస్త్రాదులను) పీంకుకొను.
(శ. ర.)
జ పుడికిరింత.

పుడి(ణి)కిరింత. వి (√పుడికిరించే) పుడికిరిం చుట, కొంచెముగా ఇచ్చుట; అల్పదానము.

సీ ..దాన మూం జాగము పెట్టొనం గిరి యీావి.
గీ పుడికిరింత పుడిగ తేగము పుడుం కనంగ.
ఆం. భా. ౨. ౧౪౨.

పుడి(ణి)కిలి. వి. (√పుడుకు) (అయిదు వ్రేళ్లతో) గ్రహించుట, తీసికొనుట.

క. మానక నిను దూషించుచు, మానిని నిను ముద్దం జేసి మన్నగొనంగా, నానాటికి నానీచుల,చే నది యంతయునుం బోవుం జెడి పుడికిళ్ల న్.
భోజరా. ౩. ౬౦

సీ. మంటపించి రాళ్ల నిమర్మంబు అంటుచోం బుడికిళ్ల నెలపుల పుడికిదైచి.
కవిక. ౩. ౨౨౨.

౫. బాలక్రీడా విశేషము.

గీ. మఱియుఁ బుడికిళ్లు పెందలుగా మనసువచ్చు,
నాట లన్నియుఁ దోడితోయ్యాలులఁ గూడి,
పడుచుతనమున వేడుకఁ బడుచు నాడు.

దశా. ౭. ౮౧.

సీ. బొమ్మల పెండ్లిండ్లు బువ్వపుఁబంతులు పుడి
కిళ్లు కొట్టుక్కు బొమ్మరిండ్లు, కుజగుజ కేకలు
గొబ్బిళ్లు నీగీగ బుడికిళ్లు. హంస. ౫. ౧౫౫.

పుడిగ=పుడుకు. వి దానము, ఈవి

సీ ..దానమా...గీ. పుడికిరింతపుడిగ తేగముపుడు
కనఁగ. . అం. భా. ౨. ౧౪౨.

పుడిసిలి. వి దే (బ. పుడిసిలులు, పుడిసిళులు,
పుడిసిళ్లు.) ద్రోల్లువంచి దోప్పవలె కుదియఁ బెట్టిన
అఱచేయి, చులుకము.

ద్వి. పిడికిట నడఁగునే పేర్చుకాలాగ్ని, పుడిసిట
నడఁగునే పొంగారుజలధి.

రం. రా. యు. ౭౬౩. పా. ౭౯ పం.

సీ. ఈ జగజ్జాలంబు కోదరము చేసి చెల్లఁ
గ్రోలుదుఁ బుడిసిళ్లఁ బట్టి. ప్రబోధ. 3. ౩౭.

సీ...బెట్టఁదఁచెఁ గాద, గీ. యతఁడు పుడిసిఁడు
నీరన... భార. అశ్వ. ౧. ౭౪.

గీ.. పుడిసిలి యన, భాపిలు నిఖిలచతురంగుళీ
సమాఖ్య. అం. భా. ౨. ౧౪౦.

జ. పుడిసిలించు, పుడిసిరింత.

పుడిసిలించే. స. క్రి. (√పుడిసిలి.) పుడిసిటఁబట్టు.

చ...చంచదిశాగజదండకాండముల్, విఱుకునె
వారిధుల్ పుడిసిలించునె మందర మంగు
టంబునన్, జెఱుముదునే...

భార. అర. ౨. ౧౦౪.

ఓ...తాటవకాంతములు తేగుఁ రింపఁ గోపంబు
చెముట వర్షింప హస్తమున వియద్గంగనలి
లంబు పుడిసిలించి, నరాహ. ౧౦. ౬౫.

జ: పుడిసిలింత.

పుడిసిలింత. వి. (√పుడిసిలించే) పుడిసిలించుట,
పుడిసిటఁబట్టుట. (శ. ర.)

పుడుఁకులు=పుఱుఁకులు. వి. బ. భక్ష్య
విశేషము.

వ పుడుఁకులు నడుకులు ..కాశీ. ౪. ౧౭౫.
(బుడుకులు...శ. ర. పా.)

పుడుక. వి. (√పుడుకు) ౧. తృణకాండము;
సన్నని పుల్ల.

చ. కలహము పెట్టికొంట పుడుకల్ సుఱు
మాడుట పెక్కు వాక్యముల్, పలుకుట. .
పెల్లలువలికే సికొంటకుశలత్వతిరిక్తము శెల్ల
వారికిఁ. సిద్ధేశ్వ, 3. అ. (చి. ని.)

గీ...పుల్ల, పుడుక యనఁగను దృణకాండము
చను . అం. భా. ౨. ౪౭.

(అం భా. లోను కొన్నిముద్రితప్రతులలోను
ఈపదము అన్యర్థ్యముగా నున్నను, వ్యుత్పత్తిని
బట్టియు, చి ని. శ. ర. మతములనుబట్టియు
నన్యర్థ్య మనుట యుక్తము. నిర్ధారకప్రయోగ
ములు కాన రాలేదు.)

ఉదా. చీపురుపుడుక, పూరిపుడుక, పెం.)

౨ సమిధ, కట్టెపుల్ల.

గీ. అమరపతినందనుఁడు పోద వడఁగి చనిన,
నసురిమాయయు నుడివోయె వట్ల కాద్య, యుదరి
దరికొని మండుతీవ్రానలంబు, పుడక శెదగల్గ
నైచినఁ బొనుఁగువడదె. నిర్వ. ౬. ౧౧౦.

గీ. అగ్గి రవులించి యావాలు గుగ్గిలంబు, కెడిపుడు
కలు కానుగుచిదుగులు...

ఆచ్చ. రా. యు. ౪౩౭.

3. పుల్లవలె నుండి పట్టుకొని త్రిప్పుట కుపయో
గించురాట్నముయొక్క అవయవవిశేషము.

సీ. పుడుకఁ ద్రిప్పుడురయంబునఁ దైఁట
జాబుచో మినుకుగుబ్బలు కళు క్కుని
రహింప. శుక. ౨. ౪౭౧.

క. కలుషించి విరించిభుజ,మ్ములు ద్రొక్కి తదూ
ర్ధ్వశిరము పుడికెఁ గరరుహాం,చలమునఁ...
వరాహ. ౧౨. 3.

౫. (సన్నిపాతకొంగి వస్త్రాదులను ద్రొక్కొనలతో) పీకుకొను. (ఈయర్థమున ఆత్మనే పదరూపముతోనే యుండును)

ఉదా:—సంధిరోత్తి వాఁగు ఒడలు పుడుకుకొనుచున్నాఁడు )

౬. కొంచెముగా గ్రహించు.

గీ పుట్టలినుమంత లిడనిడఁ బొదలు పెటిఁగి,
పుడుకఁ బుడుకంగఁ గాటుక పోకఁ జూచి,
విత్తసముపార్జనవ్యయవృత్తులందుఁ, జిత్త
మిడినవర్తకునకుఁ జేటు గలదె
విక్ర. ౨ ౧౪౦.

౭. ఇచ్చు,దానముచేయు.

క. అడిగెడువారలు మునుమయి,పుడికెడువాఁ
డొకఁడు లేక పురుషాల్పతయై,పడఁతులు
తఱచై కులములు,సెడి యచ్యులు ప్రబలి
జగము శిథిలత నొందెన్
హరి ఉ ౯ ౮౧

గీ భూమినురలకు నింతైనఁ బుణుక నోప,బిడ్డ
లకుఁ బెట్టి యింకనైనఁ బెంప వలయు,
నెవ్వరైనను మనకు ము న్నిచ్చిరయ్య,యూ
రకేయుండు మింటిలో నోపవేని.
శేష. ౧ ౯౮ దశకు ౫. ౧౪.

వి. ౧. ఈవి,దానము

సీ. దాన మూఁ జాగము పె ట్టొసఁ గీగి యీవి,
పుడుకురింత పుడిగ తేగము పుడు కనఁగ.
ఆం ధ్రా. ౨. ౧౪౨.

౨. కానుక,బహుమానము.

ఆ... మేల్మిరతనముల దనరుప్పరవణమ్ములును బట్టుఁ
బుట్టములును మిగులఁ బుడుకు లంది.
నీలా. ౨. ౫.

క. పుడుకులకొలఁ కప్పుడు గడు,నిడిమిడి యిడు
కొని కడింది వేదబలములతో,వడివడి వెలవెలఁ
దుల మెంపడి వదరించిరి పొరిఁబొరిఁ
బ్రాయపుబోజాఁగుల్.
అచ్చ రా. అయో. ౧౪.

—పుడి(ణి)కిపుచ్చుకొను = పూర్ణముగా గ్రహించు

క ఇలఁ ఱేఁడు కొనకకమడ,కులనై పుణి పుణికి
పుచ్చుకొనిరి మురారీ. బహు. ౧ ౧౨౦.

సీ ఎగుబుజంబులవాఁడు మృగరాజమధ్యంబు
పుడికి పుచ్చుకొను సెన్నడుముమవాఁడు
విజ వి ౨ ౧౬౮.

(ఇట ఔపమ్యద్యోతకము)

జ. పుడికిరించు, పుడికిరింత, పుడికిలి, పుడుక,
పుడుకబావిలి, పుడుకుఁగల్లు, పుడుకుఁజెట్టు,
పుడుకుఁదొడుకు, పుడుకుఁబని, పుడుకుబాన,
పుడుకుమ్రాను.

పుడుకుఁగల్లు. వి (పుడుకు + కల్లు) ఈవుల తాయి,చింతామణి

గీ పుడుకుఁగల్లలజెట్టికై పాదమినట్టి,మెట్టవా
ల్పిట్టరామేనిదిట్టవేల్పు,క్రచ్చు లాడఁగూర్చి
మము నిచ్చఁ గాచుఁగాత
అచ్చ. రా. బాల. ౯.

పుడుకుఁజెట్టు. వి (పుడుకు+చెట్టు.) కోర్కుల నిచ్చుచెట్టు,కల్పవృక్షము.

సీ. చుట్టుఁగైదువుబోడు గట్టులరొకిమీనిఁ
బుడుకుదొడుకు మఱి పుడుకుఁజెట్టు.

గీ గబ్బు...రామభూభుజాని యశము.
రామ. ౨౧౩.

సీ. దుగతిగమెంగములజగజెట్టితోఁబుట్టు పొగడు
వారల వట్టుపుడుకుఁజెట్టు.
అచ్చ. రా. బాల ౪.

**పుదుకుఁదోడుకు.** వి. (పుదుకు + తోడుకు.) కామధేనువు.

ఆ. పిన్నకోరియశము వెన్నకోళాహాళి, విన్న
వాకఁబలుకువెలఁదిఁ బుదుకుఁ, దోడుకు
రిక్కఁ గొని నాదలిచూపాదయని, మేటితేజఁ
బోలు దీటులేమి. రామ ౧౯౪

క. ఉదుకా విద కున్నది మది,పదుకా మిదు
కంగ నుఱక పఱవం జను స్కోడుకా నదు
కానల కిటు, దుదుకా నాపాలిపుదుకుఁ
దోడుకా నీకుఁ అచ్చ రా అయో ౯౨

**పుదుకుఁబసి.** వి (√పుదుకు). కామధేనువు

సీ. పచ్చలగనులపైఁ బసిమి పచ్చిక యంచు వడి
మేయ వచ్చినపుదుకుఁబసులు
యయా. ౨ ౩౫

**పుదుకుబాన.** వి (పుదుకు+బాన) అమృతకలశము, సుధాకుంభము.

చ. కమలనిభాస్య యోర్తు చషకంబున మద్యము
నిండఁ బోసి యిం,ద మనుచు నొక్క
చంద్రముఖిఁ దార్కొని యిచ్చిన వారి
వక్త్రయు, గ్మము ప్రతిబింబముల్ దనరఁ
గంజసుధాకరు లబ్జనామలా,భములకుఁ బోరు
చున్ బుదుకుబానకు నందు మునింగిగో
యనన్ వి. పు ౧ ౪౭

**పుదుకుమ్రాను.** వి (పుదుకు+మ్రాను కామితార్థమునిచ్చుచెట్టు) కల్పవృక్షము

సీ. వేల్పురాయఁడు బత్తి వెలయఁ బుత్తెంచి
నపుదుకు మ్రాన్పలితావిపూవుటెత్తులు .
అచ్చ రా. అర. ౫౯

గీ. కొండవీ డేలువేలుపుఁగూడి పాల, కదలి
నడుచక్కి బలుమానికములదీవిఁ, బుదుకు
మ్రాఁకులు మాకెల్లఁ బొదలి పొదలు, కడిమి
పూఁదోఁటలో నాడుగరితఁ దలఁతు.
అచ్చ. రా. బాల. ౨.

**పుణుఁకులు=పుదుఁకులు.** (శ. ర)

**పుణుకు.** వి. మత్స్యగ్రహణ సాధనము.

గీ. ఉంటగాలంబు తెర దీము లురుగాల,
మొనుకు గొరక పుణుకు సొక్కు తెసఁగు
చుందు హంస ౪. ౧౭౪.

**పుణ్య.** సం వి ఆ స్త్రీ ౧ గంగానది. ౨ అర్ఘ్యము.

**పుణ్యకము.** సం వి అ న పుణ్యముకొఱకయిన ఉపవాసాగ్రవతము

**పుణ్యకర్మము.** సం విణ (న్. ఆ. న్ న్) ధర్మకర్మముతోఁగూడినది వి న్ న ధర్మకార్యము, సత్కార్యము

**పుణ్యకాలము.** సం వి అ పుం శుభకరమగు కాలము.

**పుణ్యకీర్తనము.** సం వి అ న పురాణాదులను జదువుట, పుణ్యవిషయములను చెప్పుట

**పుణ్యకీర్తి.** సం విణ ఇ ఎవనిని గీర్తింపఁగా పుణ్యము గలుగునో యట్టివాఁడు
వి. ఇ. స్త్రీ పుణ్యమును గలిగించునట్టి కీర్తి

**పుణ్యకృత్తు.** సం విణ. (త్) పుణ్యమును (ధర్మమును) చేసినవాఁడు

**పుణ్యకృత్యము.** సం. వి. అ న. పుణ్యమును గలిగించునట్టి కార్యము

**పుణ్యక్షేత్రము.** సం వి అ న. పవిత్రభూమి.

**పుణ్యగంధము.** వి అ. పుం. చంపకము, సంపెంగ.

**పుణ్యగంధి.** సం. విణ. (ఇ.) శుభావహగంధదేశముతోఁ గూడినది ఇంచుక శుభావహమైనది.

**పుణ్యగంధికము.** సం. వి. అ. న. తెల్లతామరపూవు, పుండరీకము. (వై. ని.)

పుణ్యజనుఁడు. సం. వి. అ. పుం. ౧. రాక్షసుఁడు, ౨ యక్షుఁడు, ౩ సజ్జనుఁడు. ౪. బ. ప్రాచేతసపుత్రులు (వీరు పదుండ్రు)

పుణ్యజనేశ్వరుఁడు. సం. వి. అ పుం కుబేరుఁడు, జక్కులఱేఁడు.

పుణ్యతీర్థము. సం. వి. అ. న పవిత్ర మగు తీర్థము

పుణ్యతృణము. సం వి అ. న శ్వేతకుశము, తెల్లదర్భ శ

పుణ్యదర్శనము. సం విణ (అ. ఆ. అ) ౧. పావన మైనదర్శనము గలది (దేవప్రతిమాది) ౨ అందమైనది

వి అ. పుం. చాషపక్షి, పాలపిట్ట

న పుణ్యక్షేత్రాదులను దర్శించుట.

పుణ్యఫలము. సం వి అ న పుణ్యము యొక్క ఫలితము, పుణ్యరూపమగుఫలము వి అ పుం లక్ష్మికి నావాసమగు వనభేదము (వాచ)

పుణ్యభాక్కు. సం వి ఇ (జ్) పుం. పుణ్యము బొందినవాఁడు.

పుణ్యభూమి. సం వి ఇ స్త్రీ ఆర్యావర్త దేశము.

పుణ్యము. సం. విణ అ. ఆ అ ౧. సుకృతము గలది, శుభాదృష్టమగు ధర్మము గలది ౨. శోభన కర్మముతోఁగూడినది. ౩. పావనము, పవిత్రము. ౪. సుందరము, మనోజ్ఞము, ౫. సుగంధి, మంచి వాసనగలది. వి. అ. న ౧. శుభాదృష్టము, ధర్మము ౨ సుకృతము, సత్కర్మము, ౩ పవిత్రత, ౪. పశువులు నీరుత్రాగుతొట్టి, ౫. భర్తృప్రేమము కానపాగుటకు పుత్రుఁడు కలుగుటకును భార్య చేయువ్రతము మొదలగు కర్మవిశేషము. (జ్యోతి) ౬. లగ్నమునకుఁ దొమ్మిదవ స్థానము ౭. వర్షాకాలికమగు సహామభేదము, ౮. బంగారు. ౯. నీరు, జలము. ౧౦. పూర్వ (వై. ని) ౧౧. ఆకాశము (శే. ని) ౧౨. మేష కర్కట తులామకరములను రాసులలో నొకటి.

పుణ్యయోగము. సం. వి. అ. పుం. పూర్వకృత పుణ్యఫలమును బొందుట.

పుణ్యలోకము. సం. వి. అ. పుం. ౧. పుణ్యముచేఁ బొందఁదగులోకము, (చంద్రలోకాది.) ౨. ధర్మిష్ఠజనము.

పుణ్యవంతుఁడు. సం. విణ. (త్. తీ త్) ౧ సుకృతము గలవాఁడు. ౨. భాగ్యవంతుఁడు, మంచి యదృష్టముగలవాఁడు. ౩. సుందరుఁడు. మనోజ్ఞుఁడు.

పుణ్యశ్లోకుఁడు. సం. విణ (అ. ఆ అ) పుణ్యము కలిగించుకీర్తిగలవాఁడు. ౨. పుణ్యచరితగలవాఁడు. ౩ ప్రియంవదుఁడు

పుణ్యసహామము. సం వి. అ. న. (జ్యోతి) సహామభేదము (వాచ)

పుణ్యసాగరము. సం. వి అ. న. పుష్కరము. పుష్కరమూలము. శ. (రా. ని)

పుణ్యస్థానము. సం. వి. అ న. పుణ్యక్షేత్రము. పుణ్యమునుగలిగించు స్థానవిశేషము. ౨. (జ్యోతి) లగ్నమునకు తొమ్మిదవస్థానము.

పుణ్యాత్ముఁడు. సం. విణ. (న్. ఆ, న్. న్) పుణ్యస్వభావుఁడు. పుణ్యస్వరూపుఁడు.

పుణ్యాహము. సం వి. అ. న. పుణ్యదినము.

పుణ్యాహవాచనము. సం. వి. అ. న. దైవాది కర్మ ప్రారంభమునందు మంగళార్థము చేయు శుభకర్మము.

పుతపుత. వి. తపాతపాను బాధను తెలుపుటయందగుననుకరణము.
(చూ: పుతపుతమను, పుతపుతవోవు.)
జః పుతపుతమను, పుతపుతవోవు.

**పుతపుతమను.** అ. క్రి. (పుతపుత + అను.)

౧. తహతహపడు, తమకించు.

క. మునినాథ పురోడాశం,బునకుం గిడువాఁచి నోరు పుతపుతమనఁగా, నిను వేఁడెద యజ్ఞములకుఁ, జని యించుక దాఁచి తెచ్చి చవి చూపఁగదే. వి పు. ౬ ౧౬౫

౨. నొచ్చు, బాధనొందు.

చ. ప్రతిదినకేళలుంఛనపురాయిడి పెట్టనఁబట్ట గట్టి పైఁ, బుతపుతమంచు నున్నకుటుబోడ తలన్ ధరియింప నోడియున్ సతముగ సొమ్ము గాన నిడఁ జాలవుగా శిఖిపింఛవల్లిసా, గతమతధుర్యదానిఁ గటిఁ గట్టుము పుట్టము మిన్న కేఁటికిన్ పాండు. ౨. ౬౪.

(వ్యవ) ఆమాట విన్నది మొదలు నామనసు పుతపుతమను చున్నది

**పుతపుతపోవు.** అ క్రి (పుతపుత + పోవు.)

౧ తహతహపడు, తమకించు.

చ. అతులితభావగర్భితము లైన మృదూక్తులచేతఁ గేలికిన్, బుతపుతవోవు చున్ననృపపుంగవు చిత్త మెఱింగి. . విక్ర ౪ ౨౨౧.

౨ నొచ్చు, బాధనొందు

గీ ఎంత చేసిన నంతంత లెక్క లైన, బలముఁ జలమును జూప శాంభవరుజావ, రుండు రుక్మిణీవరు జ్వరరోగరాజు, భుజము లద్ధతిఁ బుతపుతపోవఁ గిఱచి, ఉ హరి ౬. ౧౦౪

(శ. ర పా పుతపుతఁబోవ ముద్రి పా)

**పుతిక.** వి పిచ్చము.

సీ. అక్కరకిల్లద చావంచపోములు పుతిక బోనమ్ము లచ్చ రా. యు. ౫౯౫. (ప్రయోగాంతరము కనఁబడలేదు)

**పుత్త.** వి. (సం. పృష్ఠమ్. ప్రా. పుట్ఠ.) పృష్ఠము (శ. ర.)

**పుత్తడి¹.** (ఓ) వి. (క. పుత్తళి. తు. పుత్తలి.) బంగారము.

చ .తమ్మికెం, పులు గదియించినట్టిజిగిపుత్తడి ముక్కలిపీఁటమీఁద .. నీలా. ౧ ౬౧

ఉ పెండ్లికొమార్తెఁ జేయుఁ దని పెద్దలు బల్కమిటారితక్కువూఁ, బోండ్లు నృపాలపుత్రికను బుత్తళిమేల్జిగిపీఁట నుంచి...
కృష్ణ ౪ ౩౫ ద్వి శ. పా ౧ ౧౭౬. పం.

జ. పుత్తడిపొలదిండి, పుత్తడిబొమ్మ

**పుత్తడి².** వి (సం పుత్తలీ. క పుత్తలిక) వస్త్ర దంత కాష్ఠాదులచేఁ జేయఁబడిన బొమ్మ, పాంచాలిక

మ పురుషాకారముతోడ నున్న శిఖిరో పుంస్త్వంబు లేదో యిదే, తరువో పుత్తడిరూపో చిత్తము ను జైతన్యంబు శూన్యంబొకో, విరసత్వంబులప్రోవో నిర్భరకళావిజ్ఞానసర్వస్వమో, యరు దీచందము నంగనిల్పె ధృతియం దస్పందమందస్థితిన్
నృసిం. ౨ ౭౭.

చదువుపుత్తడి = విద్యామయమగుబొమ్మ, సరస్వతీదేవి

ఉ పుక్కిటిరోవరిం జదువుపుత్తడి హత్తిన పెద్ద సైన మ్రో,రొక్కకపేళ పాటవము నొందమిఁ జందినఁ జక్కఁబెట్టువా రు...
పాండు. ౫ ౨౧౭.

**పుత్తడికాసు.** వి. మత్స్యవిశేషము.

సీ. వాలుగు ముకుదొమ్మ పల్లికతట్ట పుత్తడికాసు పూమేను కడిసెలంబు. హంస ౪. ౧౭౩.

**పుత్తడిపొలదిండి.** వి (√పుత్తడి¹) హిరణ్యాక్షుఁడు.

సీ. పుత్తడిపొలదిండిగొత్తు రేనవలాలఁ గన్నబాలెంతకుఁ గావుటొట్టు. చంద్రా. ౩. ౧౦౧.

**పుత్తడిబొమ్మ.** వి. (√పుత్తడి[1]) ౧ బంగారు బొమ్మ, సువర్ణవిగ్రహము.

చ...క్రొమ్మెఱుంగుచాయ దొప్పున నడ సేర్చి చిత్తరువు పోలిక పుత్తడిబొమ్మభాతి మెఱుపైన గతి తోడ మంగళగృహంబునకుఁ గొనిపోయి యచ్చటన్. పి. శకుం. ౪. ౧౪౨.

క. చిత్తజమహాగ్ని కాఁకల, నెత్తు దతిగి వచ్చె నొక్క సెంతయు పెమ్మె, నత్తరుణికి జను లందఱుఁ, బుత్తడిబొమ్మ యనుమాట బొంకేల యగున్ ప్రభా. ౪ ౩౭

సీ. ఎదఁదఁ గాఁపురపుఁబుత్తడిబొమ్మ నిడువాలు గన్నులా యీవాలుగన్ను లరయ దశా ౧. ౧౬౪.

(బంగారు బొమ్మవంటి స్త్రీ అని భావము)

**పుత్తలకము.** సం. వి. అ. పుం శవాదులకుఁ బ్రతిమూర్తిగా పత్త్రాదులచే రచింపఁబడిన వస్తువిశేషము (చూ. పర్ణనరుఁడు)

**పుత్తలము.** సం. వి అ. పుం. విగ్రహము, వస్త్ర దంతకాష్ఠమృదాదులచేఁజేయఁబడినబొమ్మ

**పుత్తళి.** సం. వి ఈ. స్త్రీ. విగ్రహము, వస్త్ర దంతాకాష్ఠమృదాదులచేఁజేయఁబడినబొమ్మ.

**పుత్తిక.** సం. వి. అ స్త్రీ పెరయీఁగ, పతంగిక. ౨. బొమ్మిక, మెట్టతోఁటకూర. ? 3. చెద పురుగు. (విల్యమ్సు)

**పుత్తెంచు.** స. క్రి. (పుచ్చు+తెంచు,స్వార్థమున. దీనికి "పుత్తేరఁగ, పుత్తేఁగ, పుత్తేరక, పుత్తేక, పుత్తేరఁడు, పుత్తేఁడు, పుత్తెమ్ము, పుత్తెండు." మొ॥ రూపములగును.) పుచ్చు, పంపు, పోవఁ జేయు.

ఆ. భూతలేశ నన్నుఁ బుత్తెంచి రిప్పుడు... భార. ఆది. ౨. ౧౭౦.

వ...చోడగంగదేవర తమ్ముణ్డు ఉలగయ్య వందపెమ్మాడిడియు పిరిదేవులు వల్లభమహాదేవులును శ్రీమద్దాక్షారామ భీమేశ్వర... పూజయందుల చందన కర్పూరములకు నివేద్యమునకు నా చంద్రార్కస్థమ్ము నడచునట్టి గంగగొణ్ణచోడకైరాగి యాణ్డారిచేతం బుత్తెంచిన మాట ఇరు... (ణ్డు) మాతలకుం దగు పెలగాంజేకొని .. ద. శా. ౪. ౧౧౭౬.

క. ఆసవమున కని నీదునిన్ వాసమునకు దివములో నవశ్యంబును జే, పానుదతిం బుత్తెంతు నిజాసక్తి ఫలింపఁ గొలుఁ మఖీమతశీలిన్. భార. విరా. ౨. ౭౧.

గీ. తెలివ యిన్నాళ్లు నడుగఁ బుత్తేఁడు నిన్న, నరయనిది తప్పుగాదె .. వైష. 3. ౧౨3.

ద్వి. ఏకత్వణంబున పెదపక నియతిఁ, జేకొని నీమేలు చెప్పి పుత్తెమ్ము. రం. రా బాల. ౭౨ పా. ౧౫. పం.

మ...తిరిగెడున్ ద్వైప్య జరాసంధుఁ డిట్లని మిత్తంబు నశింప నేమిటికి మీ కారాజు సాత్తాపరాధునిఁ బుత్తెం డిట నస్మదీయ సముపాద్దోశ్మిత్తు లక్ష్యంబుగన్. హరి. ఉ. ౧. ౧౧౧.

గీ. అతఁడు ప్రార్థించి పుత్తేర నరుగుదెంచెఁ, బోలఁతిచెంతకు నందుకుఁ బ్రౌడ్ఢ గ్రంథ. శుక. ౨. ౬౫.

**పుత్రంజీవకము.** సం. వి. అ. పుం. పుత్రజీవక వృక్షము.

**పుత్రిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కూఁతురు, కన్య. ౨. పుత్తళి, బొమ్మ. 3. యావకతూలము, లక్కదూది. ౪. పుత్రులు లేనివాఁడు ఎవతెని బుత్రికగాఁ జేంచుకొని దాని కడుపునఁ బుట్టిన కొడుకును దన వంశకరునిగా స్వీకరింపఁదలఁచునో యట్టి కన్య. ౫. స్వల్పార్థకము.

పుత్రకంద సం వి ఆ స్త్రీ లక్ష్మణా కందము ?

పుత్రకము సం వి అ పుం ౧ శరభము ౨ శైలభేదము ౩ వృక్షభేదము, ఉష్మ్రీత్తి ? ౪ పతంగము ౫ బొమ్మ

శ్లో మన్దాకినీసైకతవేదికాభిస్సాకందుకైః కృత్రిమపుత్రకైశ్చ, రేమే ముహుర్మధ్యగతా సఖీనాం క్రీడారసం నిర్విశతీవబాల్యే

సం కు సం ౧ ౨౯

పుత్రకామ్య సం వి ఆ స్త్రీ పుత్రులు కావలె నసెడి కోరికగలది పుత్త్రేషిణి

పుత్రకుఁడు సం వి అ పుం అనుకంప్యజనుఁడు (ఇది ప్రేమ, అనుకంప మొదలగువానియందుఁ బ్రయుక్తము) ౨ పుత్రుఁడు,కొడుకు

పుత్రకృతకుఁడు సం వి అ పుం పుత్రుఁడుగాఁ బెంచుకొనఁబడినవాఁడు

శ్లో యస్యాత్వయా వ్రణవిరోపణ మిఙ్గుదీనాం, తైలం న్యషిచ్యతముఖే కుశసూచివిద్ధే, శ్యామాక ముష్టిపరివర్ధిత కోజహాతి, సాయం నపుత్రకృతకః పదవీం మృగస్తే  శకుం ౪ ౧౪

పుత్రజీవము సం వి అ పుం పుత్రజీవిచెట్టు

పుత్రద సం వి ఆ స్త్రీ ౧ వంధ్యాకర్కోటకి ? ౨ లక్ష్మణాకందము ? ౩ గర్భధాత్రీ క్షుపము ?

పుత్రదాత్రి సం ? ఈ స్త్రీ మాళవదేశమందుఁ బ్రసిద్ధమగు లతావిశేషము ?

పుత్రభద్ర సం వి ఆ స్త్రీ బృహజ్జీవంతి ?

పుత్రశృంగి సం వి ఈ స్త్రీ జుట్టుపుఅఢ శృంగి ?

పుత్రశ్రేణి సం వి ఈ స్త్రీ మూషికకర్ణి,ఎలుక చెవిచెట్టు

పుత్రి సం విణ (క కీ క) పుత్రులుగలవాఁడు

పుత్రిక సం = పుత్రక (ఖడ్గపుత్రిక,అసిపుత్రిక, ఇం)

పుత్రిణి సం వి ఈ స్త్రీ బదరిక ?

పుత్రీయ సం వి ఆ స్త్రీ పుత్రుఁడు కావలె నని కోరిక

పుత్రుఁడు సం వి అ పుం ౧ కుమారుఁడు, కొడుకు (పుత్రులు పన్నిద్దఱు)

శ్లో ఔరసః క్షేత్రజశ్చైవ దత్తః కృత్రిమ ఏవ చ,గూఢోత్పన్నోపవిద్ధశ్చ దాయదా బాంధవాశ్చ షట్,కానీనశ్చ సహోఢశ్చ క్రీతః పౌనర్భవ స్తథా స్వయందత్తశ్చశౌద్రశ్చషడ దాయాదబాంధవాః

మను ౯ అధ్యా ౧౫౯ ౧౬౦

పుత్రపౌత్రీణము సం విణ (అ ఆ అ) వంశ పరంపరగా వచ్చినది

పుత్త్రి సం వి ఈ స్త్రీ ౧ కూఁతురు ౨ దుర్గ ౩ వృక్షభేదము

పుత్త్రుఁడు సం = పుత్రుఁడు (ఇది ఏకతకార మును ద్వితకారముగూడ నగుటచే దీనితోఁ గూడిన సమాసములందు రెండురూపములను గ్రహించునది)

పుత్త్రేష్టి సం వి ఇ స్త్రీ పుత్రప్రాప్తికై చేసెడియిష్టి

పుదియ విణ (త పుదియ) అభినవము, క్రొత్తదై ౞ పుదియబొట్టు

పుదియబొట్టు వి (పుదియ+బొట్టు) క్రొత్త బొట్టు, అప్పుడే పెట్టినబొట్టు

నీ కుదిరెల కెగసనఁ ద్రోచిన పుదియబొట్టురు ఫాలపట్టిక పల్లకిల్ల ఖా రా అర ౨ ౧౨

పుద్గలము. సం. విణ. (అ. ఆ. అ) ౧. సుందరాకారముగలది, ౨. రూపాదివిశిష్టమైనది. (ద్రవ్యము). వి. అ. పుం. ౧ పరమాణువు. ౨. (బౌద్ధమత ప్రసిద్ధముగు) ద్వ్యణుకాదిపదార్థవిశేషము. ౩. శివుడు, ౪ దేహము. (వై ని)

పునరుక్తజన్ముడు. సం. వి క. పుం. ద్విజాతి

పునరుక్తము. సం. విణ (అ. ఆ అ.) ౧. మరల చెప్పబడినది. (అర్థము,శబ్దము) ౨ అత్యధికము,పైపెచ్చు వి అ న ౧ మరల చెప్పుట. ౨ (అలం) శబ్దార్థదోషములలో నొకటి.

పునరుక్తవదాభాసము. సం. వి. అ పుం. ఒక శబ్దాలంకారభేదము.

శ్లో॥ యత్రార్థః ప్రముఖేకించిత్ భాసతేపునరుక్తవత్, పునరుక్తవదాభాసోఽలంకారస్సస తాంమతః. (ప్రతాపరుద్రీయము.)

పునరుక్తి. సం వి. ఇ స్త్రీ. మరలఁజెప్పుట, వ్యర్థముగా మరలఁజెప్పుట

పునరుత్పత్తి. సం వి ఇ స్త్రీ. ౧ మరలఁ బుట్టుట ; పునర్జన్మము, అసత్యము (వాచ)

పునరూఢ. సం. వి. ఆ. స్త్రీ. (మరలఁ బెండ్లాడఁబడినది) మరలఁ బెండ్లియైనది

పునర్జన్మము. సం వి క. న మరలఁ బుట్టుట, జన్మాంతరమెత్తుట

పునర్నవ. సం వి ఆ స్త్రీ. గలిజేరు కూర.

పునర్ణవము. సం వి. అ పుం. గోరు

పునర్భవము. సం. విణ. (అ. ఆ. అ) మరలఁ బుట్టినది. వి. అ. పుం. ౧. సంసారము. ౨. గోరు.

పునర్భవి. సం. వి. క. పుం. జీవాత్మ. (ఆ. ని.)

పునర్భువు. సం. వి. ఊ. స్త్రీ. ౧. మారుమనువుది. దిధిషువు.

పునర్యువ. స వి క. పుం. చంద్రుడు. (వై.ని)

పునర్వత్సము. సం. వి. అ పుం. పాలు కుడుపు తప్పి మరలఁ పాలు కుడువఁ దొడంగిన దూడ. (విల్సన్సు).

పునర్వసువు. సం వి ఉ పుం ౧ ఒక నక్షత్రము (ఈ యర్థమున సంస్కృతమున నిత్యద్వివచనాంతము )

సీ ఒకచోఁ బునర్వసు వుఁగా వృక్షముక్కొమ్మ నుడివడ్డ ముత్యాలజోఁగునోలి.

కాశీ. ౧. ౧౩౭.

౨ విష్ణువు ౩ శివుడు ౪ కాత్యాయన ముని ౫ ఒకానొక లోకము

పునశ్చరణము. సం వి అ న. మంత్రము యొక్క పునః పునః పఠనము

పునస్సంధానము. సం వి అ న ౧. మరలఁ గూడుట ౨ విచ్ఛిన్నమైపోయిన అగ్నిని మరల హోమకుండమునందుఁ గూర్చుట

పునాది. వి ౧ బలమునకై గోడ కడుగున భూమిలో లోఁతుగాఁ ద్రవ్వి పెట్టెడుగోడ, మూలబంధము (శ. ర)

(వ్యవ) నాలుగు దినములలో ఆ మేడపునాదులు లేచును

౨. బలమునకై లోఁతునుండి గోడ కట్టుటకు భూమిలోఁ ద్రవ్వు పల్లము.

(వ్యవ) ఆ మేడకు మిక్కిలి లోఁతుగాఁ బునాదులు తీసినారు

౩. ఆధారము,మూలకారణము.

(వ్యవ) ఆతనియైశ్వర్యమునకుఁ బునాది ఆయుద్యోగమే.

**పునాసలు.** వి. బ. (సం పునర్వసుః.) సూర్యుఁడు పునర్వసునక్షత్రమునం దుండునపుడు చల్లిన రాగులు లోనగుధాన్యములు

మ... కాఁపుగుబ్బెతలపెన్గుబ్బల్ పునాసచ్చేలిక్, బిసికిళ్లుం బిసికిళ్లు పాళికల కర్పించె న్నభస్యం బునన్. ఆము. ౪. ౧౩౩.

**పునుఁగు(న్గు).** వి గంధమార్జాలమువలనఁ గల్గు నొకవిధ మగుసుగంధద్రవ్యము.

చ. ఘనగళకంపఁ గంచ మిడి కాటుకఁ దీర్చి పునుం గినోమ్మఁ దట్టినది యలంది...
ఆము. ౨. ౧౭.

మ. బురుసాకోకలు హైరణీల్లు సవరంబుల్ పున్గుజవ్వాజి కస్తూరియున్ గుంకుమసర్వ వస్తువులు భృత్యుల్ గొంచు వెన్వెంట రా.. ఈ. హరిశ్చ ౪ ౧౨౭.

ద్వి. క్రొత్తకస్తూరి పున్గు గూర్చిన మంచి, మెత్తని గంధంబు మెయి నిండఁ బూసి.
ద్వి. నల ౧ ౪౪౯ పం.

జః పునుఁగుదావులు, పునుఁగుచట్టము, పునుఁగు పిల్లి పునుఁగు రాజనములు

**పునుఁగుఁదావులు.** వి బ. (√పునుఁగు వృత్తి యం దేకవచనము) పునుఁగువాసనగల శాలిధాన్య విశేషము

వ. .కూటికుప్పలు కాటుసంపెఁగలు కందర్ప భోగులు గజపతిలాగీలు బొందడీలు పునుఁగుఁ దావులు తేనెతోలలు మోసవాలు...
ప్రబంధ. ౧౧౨

మ. పునుఁగుందావినవోదనంబు మిరియంపుం బొళ్లతోఁజట్టి చుయ్యనునా దాలనికూర గుంపు ముకుమం దై యేర్చుపాకం బెగు, ర్గొన్నుపచ్ఛన్నపు బాయసాన్నములు మారుం గాయలున్ జే సురుచక్కనుపేయుం బెలు పాలవెల్లువగ నాహారం బిడు న్నిత్యమున్.
ఆము. ౧. ౮౨.

**పునుఁగుచేట్టము.** వి. (పునుఁగు+చట్టము.) పునుఁ గుపిల్లి శరీరములో పునుఁగుండునట్టికోశము, పిల్లి గడ్డ.

చ. కెదురులముత్తెముల్ కెలలవిండ్లు జవాది పునుంగు చట్టముల్ ..మొదలగు కానుకల్ నృపతిముందట నుంచి జోహారొనర్చుచున్,
ఈ. రా. ౪ ౩౭౭

సీ పునుఁగుచట్టంబులు పునుఁగుకత్తి జవాజి కస్తూరియును బచ్చకప్పురంబు
శుక. ౧. ౧౫౪.

**పునుఁగు(న్గు)పిల్లి.** వి. పునుఁగునిచ్చుపిల్లి, గంధ మార్జాలము

చ. పెదపెదదంతముల్ పునుఁగుపిల్లులు జల్లులు జంటితేనియల్, మొదలగుకానుకల్ నృపతి ముందట నుంచి జోహారొనర్చుచున్.
ఈ రా. ౪. ౩౭౭.

సీ బూతపిల్లి నాఁగను గమ్మపిల్లి నాఁగను, బున్గుపిల్లి యటంచనఁ జెల్లు గంధమార్జాల నామంబు... ఆం. భా. ౨ ౭౪.

**పునుఁగురాజనములు.** వి బ (√పునుఁగు) పునుఁగువాసన గలఒకవిధమగుశాలిధాన్యవిశేషము.

సీ పొన్నశ్రీరాజనా లప్పునుఁగురాజనములు ముద్దుప్రా లారళ్లు ముత్తెసరులు
హం స ౪ ౧౨౭.

**పునుక(న్క).** వి ౧. తలపుఱ్ఱె, కపాలము.

ఆ. పునకఁ గుక్క తిత్తిఁ బోసినపాలు నీ, క్లధిక నిండఁ బోరయునట్లు దుష్టమై యపాత్ర విషయ మగునీగి వృథవోవు.
భార. శాం. ౧. ౩౩౧

సీ. కాశికానగరోపకంఠ దేశంబునఁ బగులవైచెఁ గరంబు బ్రహ్మపునుక. కాశీ. ౫. ౧౨౩

చ. కరమున నున్నపున్కయును గాముని భూతియు... విక్ర. ౧. ౪

ద్వి. పాదలుచు వ త్తలపున్కయుఁ దక్క, మెద డును రక్తంబు మేనిచర్మంబు, క్రమ్మన భక్షింపఁగా లెక్కగొనక.

పండితా దీక్షా ౩౬. పా

సీ ..ఎదఁ బున్కపరములు కుదుటపఱచి.

నీలా. ౧ ౧౩

౨. చిప్పరొమ్ముక, రొమ్ముక.

ఉ... జానువులపున్కల మూడిచి తాళిఁ జూపఁ గాల్గట్టువ కూద్రహం భ్రమలఁ గప్పుచుఁ దద్విధి గుట్టి మూచు నాపట్టునఁ గొంచు మట్టికడఁ బ్రాణము తీసెఁ గదయ్య భాస్కరా

భా శ ౩౬.

క జలరాశిఁ దిమితిమింగిలములు నాఁ దగుమీల సత్వములు విని లేదే, కులశైలమతుఁడె జల చరములతో రావెడల నుమియుఁ బునుకల తోడన్.

దళా ౧ ౧౫౩.

జ: పునుకతాల్పు.

పునుకతాల్పు. వి (పునుక + తాల్పు) కపాల ధారి, శివుఁడు.

ఆ. పునుకతాల్పు విల్లు దునిమెఁ దాటకఁ జంపె.

అచ్చ రా. యు ౧౧౬.

పునుగు. అ. క్రి ౧ వెనుదీయు, సంకోచించు

ద్వి తనసేన వెనుకముందరిధనం బెల్లఁ, బునుగక యాక్షణంబునఁ బెట్టి పొమ్ము.

ద్వి. పరమ. ౬. ౪౩౩. పా. ౯ పం.

ద్వి తనసామ మడిగిన దయతోడ నవ్వి, పునుగ కెప్పుడు సాష్టభుజకరుఁ డైన, మాత హేమకశి పుండ ననిరెు...

ద్వి. పరమ. ౩. ౫౧౨. పా. ౫. పం.

౨. త్వరపడు.

ద్వి. అతిథక్తి నీ వన్న యట్ల వైష్ణవులఁ, బ్రతివార మారగింపఁగఁ జేసి కాని, పునిగి రే మందర భుజియింప కొల్ల.

ద్వి. పరమ. ౬. ౪౫౫. పా. ౨౦. పం.

65

పునెము=పున్నెము. వి. సుకృతము. (శ. ర.)

క. వివవమ్మ భామినీమణి, మనమున నీ కిరసంగ మము ప్రియ మైనన్, మును గొంతి కమల బాంధవు, నెవసియుఁబునె మఱుఁగనట్టులే వర్తిలుమీ. శుక ౧. ౪౮. (శ. ర పా. పొనమెఱుఁగునట్లు నే ముద్రి. పా.)

పున్న=పిన్న. విశ. చిన్నది.

ఉదా: పున్నతేలు. (శ ర బ్రా.)

పున్నమ. వి (సం. పూర్ణిమా, ప్రా. పుణ్ణమా, క. హుణ్ణిమె.) పౌర్ణమాసి, శుక్లపక్షమందలి కడ పటిదినము.

గీ. మేనఁ బ్రాణము వాసినమీఁద మెుగము, మెఱసి యుండుగా రెుండు నిత్తెఱఁగుకాంతి, తోడఁ బున్నమనాఁటిచందురునిచంద, మున రేఁబాడు మిక్కరువృద్ధుసాననంబు.

భార. స్త్రీ. ౨. ౯౪.

ఉ. పున్నమచందురుం దెగడుపొంకపుమోముల రాచకన్నియల్

నీలా ౧ ౨౯.

విజ వి. ౨. ౧౦౯

తపసిపున్నమ=వ్యాసపూర్ణిమ, ఆషాఢపూర్ణిమ.

ద్వి. తరళాక్షి ముందటి తపసిపున్నమను, సరిభుజి కోయిడి గురుకట్నమిచ్చె.

పండితా. పురా. ౧౨౨. పా.

(తమసపున్నమ. అపముద్రి)

దవనపున్నమ=చైత్రపూర్ణిమ

గీ. దవనపున్నమ కాళకాధ్యక్షుఁడైన, తెలుఁగు రాయఁడు...ఉత్సవం బవధరింప, నందుఁ బోయితి...

క్రీడా. ౨౦౫.

—నూలిపున్నమ=శ్రావణపూర్ణిమ. (ఆనాఁడు తోరమున పూజింతురు)

ద్వి. నూలిపున్నమనాఁడు నూపురం బిమ్మి, బాల భక్తుల కొప్పు బందువఁ జేసె.

పండితా. పురా. ౧౨౨. పా.

శ్లో. ఉత్తేౖవ్రతం మధాదోలా్రావణీఅంతు పూజ
నమ్, చైౖత్రేత దమకారోపం కర్వ్యాణో
వ్రజత్యథః. నిర్ణయసింధువు చైత్రవ్రత ప్రక
రణము.

పున్నాగ. సం. వి. అ పుం. ముప్పదిరెండు నపుం
సకరాగములలో నొకటి.

సీ. కాంభోజి కేదారగౌళ శోకవరాళి పున్నాగ
గుమ్మకాంభోజి... హంస ౫. ౧౭౮.

పున్నాగము. సం వి. అ. పుం. ౧ తెల్లయొనుఁగు.
౨. పురుషశ్రేష్ఠుఁడు. 3. తెల్లగలువ. ౪. జాజి
కాయ. ౫. సురపొన్న ? ౬. నాగకేసరము ?.

పున్నాగవరాళి. సం. వి. ఇ పుం ముప్పదిరెండు
నపుంసకరాగములలో నొకటి.

సీ గౌళ నారాయణగౌళ వసంత వరాళి పున్నా
గవరాళి శంక,రాభరణమును ..
ప్రబంధ. ౯౬.

పున్నాట(డ)ము. సం. వి అ. పుం. చక్రమర్దము,
తంటెపుఁజెట్టు.

పున్నియ(న్నె)ము. వి (సం. పుణ్యమ్, ప్రా.
పుణ్ణమ్) సుకృతము.

గీ. ఎన్నఁడును నేగి తేనట్టియిమ్మహా క్ష్మ,కానము
నయందుఁ గాఁపున్న జంతువులకు,కోఁటిశా
తంబు పున్నియం బెదలినప్పుడొ లోకమునఁ
గూల వలయుఁ గే లూడినట్లు
కాశీ ౨. ౪౫

గీ. పురిపులుఁగుకొ త్త మెన లేనిపున్నియంబు,
లెమిచేసెగా... నీలా. ౧. ౧౦౯.

సీ. ఎవ్వనిమన మెవ్వఁ డెఱుఁగు నన్నెము పున్నె
మును దేవుఁడెఱుఁగు ననెడివారు
సారంగ 3 ౮౨

సీ. విడుచు ని న్నెప్పుఁడు విశ్వసింపవె యన్న
నీసత్యమునకుఁ బున్నియము గాఁగ.
శివరా. 3. ౧30.

(ఇట వ్యతిరేకలక్షణచే పాపము = వైయర్థ్యశీ
మ్ము,అని తాత్పర్యము.)

శా... ఆ,భూమిలో కోఁటలఁ దోఁటలం దిరిగి
మీపున్నెన మా కచ్చితం, బేమిలో లే కను
భూన నుండుదుము సారంగ. ౧. ౬౫

(ఇట మీచేసిన ఉపకారముచేత, అని భావము.)

—విణ. పుణ్యము కలిగించునది,పవిత్రము.

గీ. అప్పనంబుగ నాసేస్సిన ట్లొనర్పఁ, గడఁగు
నిప్పున్నియపు బలుకబ్బమునకుఁ, గళతెలం
గొట్టుటం అచ్చ. రా బాల ౨౩.

—నీపున్నెము = నీకుమేలగును (ఇది అనిష్టకా
ర్యము చేయవలదు అని చెప్పుటయం దుప
యు.క్తము )

సీ నీపున్నె మిచ్చట నీపగ్గె కొరయించి పోరు
దీర్పుము మంచుఁ బొందుపఱిచి
కువల ౫ ౫౩

పుప్పము. వి (సం పుష్పమ్ ప్రా పుప్ఫమ్ )పువ్వు.

సీ పువు పువ్వు పూ నాఁగఁ బుష్పము విరి యల
రనఁ గుసుమాఖ్య లై యలరు నీశ
ఆం సం. స్వా. ౩.

పుప్పి=ప్రుప్పి. వి ($\sqrt{}$ప్రుష్[1]) పురుగుపట్టి చెడి
పోవుట

(పాలకీబొంగు వర్ణనము )

వ ముక్కునొక్కు పుప్పి చీముదిండి యేకలమ్ము
పెలవు నిడుదగణుపు లేఁతయు ముదురు
సన్నము గమకంబు నీలధవళర క్తహారిద్వర్ణం
బులు మొదలుగాఁ గలదుర్గుణంబులు లేక ..
ప్రబంధ. ౬౦౫

విణ. పుచ్చినది.

తే. వివిధసంగ్రామజయరుద్రవీరభద్ర, రాజకరు
ణాకటాక్ష నిర్వ్యాజలబ్ధ, సకలసామ్రాజ్య
ఘనవిభవ వకటరొక్క,పుప్పిభోగపులందె తై
పొగులఁ దగునె. చంద్ర. వి. 3. ౪౦.

సీ. పుప్పిపంటికి లేద పుట్టంబు చుట్టుట కొను
ధరుం డెద్దుకంట రాఁడె. రామలిం. ౧౦౦

పుష్పించే. స. క్రి. (పుచ్చే² + ఇంచే) తీయించు, తొలఁగింపఁజేయు.

గీ. వాడుగుడిపొంతఁ జాల సున్నతిఁ దనర్చు, తోరణస్తంభ మెక్కి రొప్పారు నెఱుఁగ, కుండ నిచ్చినఁ బుష్పించి యుండు మునిద, యట్టు లైనను జేఁగెద నమరపురికి.

పాండ. 3 ఆ. (చి ని శ ర)

౨. పుచ్చు, తొలఁగించు, తీసివేయు. (స్వార్థేం చుక్కు)

ద్వి. విగతశేక్రద్వారవినిహితావృతము, లగు ప్ర సాదప్రసూవాంబరావళులు, పుష్పించునంతన పురవారుకరుణ, నొప్పార నుదయించె నూ ర్ధ్వక్షేత్రములు. పండితా. మహిమ ౨౩౯.

ద్వి. ఎల్లయ్య మధుపయ్యగారికి తప్పేమియును లేక చొప్పుగా దనకు రప్పించి కన్నులు పుష్పించె .. బసవ ౪ ౯౦౪ పం.

పుష్పిపురుగు. వి (√పుష్పి) నుసిపురుగు, కట్టె తొలిచి నుసి రాల్చెడిపురుగు

(చి. ని శ, ర. బ్రా)

పుప్పు. వి (√పుచ్చే¹) పశువులగొరిజలు ప్రస్సి పురుగులు పడెడువ్యాధి.

ఆ. నరిడి పుప్పు కప్పవాపురు కడుపూఁద, యదురుఁద్రిక్కు యనఁగ నదరి మఱియుఁ, దెవులు లెన్నిరేనిఁ దవిలి రొంతయు మహోగ్రంబు లయ్యెఁ బశుగణంబునందు.

హరి పూ. ౭. ౪౫.

ద్వి. కప్పవాపురుగాలి గజ్జపత్తిక్కు పుప్పు పంపరయూడు బొట్టు బొల్లాఁత...

నవ. ౧. ౩౦. పా. ౨౧ పం.

పుప్పుసము. సం. వి. అ. పుం. ౧. ఎడమప్రక్క నుండుతూపిరితిత్తి. ౨. తామరదుద్దు.

పుప్పొడి. వి. (పువ్వు + పొడి—క. పుప్పడి. క. పూప్పొడి.) పుష్పపరాగము, పూవులయందలి ధూళి.

సీ. చంద్రరుచిసమూహాశ్రితులగు తావు లద రెడు పుప్పొడులట్లు మెఱయు.

భార. విరా. ౪. ౫౦.

గీ. జడియ దళులకుఁ గురియు పుప్పొడుల మునుఁగు మనుచ 3. ౩౧. (ఇది కొన్ని ప్రయోగములందు పుష్పవాచక పదపూర్వ ముగాఁ గూడఁ గనఁబట్టుచున్నది.)

వ... చెంగల్వపుప్పొళ్లు నిండిన చంద్రోపల వేదిపై... పారి. ౧ ౪౧.

సీ. పువ్వుఁబుప్పొడిదుమ్ము పొదలి నిప్పొద లలో సిద్ధాళులెపుడు వసించుచోటు.

ఉ రా. 3. ౭౫.

పుప్పొడివన్నెలు. వి. బ. (పువ్వు + పొడి + వన్నెలు.) వస్త్రవిశేషము.

వ ..కంటకి వన్నెలునుఁ బుప్పొడి వన్నెలును రుద్రాక్ష వన్నెలును... ద్వా. 3. ౨౦౭.

(ప్రాఁతప్రతి.)

పుబ్బ. వి సం. పూర్వా, ప్రా. పువ్వాఫ. క. పుబ్బె.) పూర్వఫల్గుని, పదునొకండవ నక్షత్రము.

సీ. ఆశ్లేష నుత్కృష్టమిరుతనుజలాభము పుబ్బఁ దనకులమున బెంపు పుబ్బ సౌభాగ్య విస్ఫూర్తి సిద్ధి. భార. అను. 3. ౧౭౯.

సా: పుబ్బలేఁగినను బూబులేఁగినను నిలువదు. చంద్రిక.

పుమనుజ. సం వి. అ. స్త్రీ. అన్నగలపడుచు.

పుమపత్యము. సం. వి. అ. న. మగబిడ్డ.

పుమర్థము. సం. వి. అ. పుం. ౧. పురుషప్రయోజనము. ౨. (ధర్మార్థకామమోక్షములనెడి) పురుషార్థము.

**పుమాంసుఁడు.** సం. వి. స. పుం. మనుష్యుఁడు, మానిసి.

**పుమాఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. పురుషుని పేరు

**పుష్ఫలము.** సం. వి అ పుం. గర్భవాయువు (విల్యమ్సు)

**పుయిలోట(ము).** వి (√పుయిలోడు)౧ లజ్జా భయాదులచేఁగలుగు) జంకు,సంకోచము; వెఱపు, భయము.

గీ సీవుఁ దమ్ములు నొక్కెడ నిలిచి చూచు, చుండుఁ దని పల్కుటయుఁ బుయిలోట తోడఁ, గీచకారాతిఁ దప్పక చూచి నగుచు, నతని కిట్లని చెప్పె ధర్మాత్మజుండు

భార విరా. 3 ౨౦౫

గీ. పరగి పుయిలోట లందుగుటఁ బగలు రేయుఁ, బల్లెయందున వడవిలోపల వినేచ్ఛఁ, దిరిగి నట్లు కృష్ణునిఁగూడి తిరుగఁ దొడఁగి,రంగ నలు మదభరవిమాధాత్మ లగుచు

హరి పూ ౭ ౧౪

సీ జనులు గాంచిన మానసము దూలఁ దన కనుపుయిలోటమున మోము పుల్లగిలఁగ.

భార. విరా ౨ ౪౦

సీ. తల్లడింపు తలఁకు తల్లడము తలరు జళుకు జంకెన జంకు జడుపు జాలి, పుయిలోట జలదరింపు దిగులు వెఱ పక్కు వెఱ యుత్త లము బీఁకు బెదరు బెగ్గ్,లుట యంటెక యుదిల యటన నధృతి యగు ..

అం. భా. ౧. ౧౩౩

౨...సంశయము.

వ...ధర్మంబులు కేటపడ ననుగ్రహించుచుం బుయిలోట వాసి నన్నుం గలిపికొని కృపక భాజనంబుగాఁ జేయుట...

భార. అను. 3. ౨.

**పుయిలోడు.** అ క్రి. (క. పుయిల్, హుయిల్,— ఆక్రందనము —పుయిల్ + ఓడు—సాక్రంద ముగా పరుగెత్తు ) ౧. (లజ్జాభయాదులచే) వెన దీయు, సంకోచించు; వెఱచు, భయపడు.

క. పీకుఁగు నంటఁగ నగుకైభూపాథకమాజాఁ దనక పుయిలోడక న, న్ననిచపుఁబనిఁ బన పం,గా నీకుం దగునె పాపకర్మము గాదే.

భార విరా. ౪. ౧౦౯.

చ ..ఏ,నొకగతి విన్నవింతుఁ బుయిలోడక యిప్పుడు దాని నీ వొకిం,చుక వడి చిత్తగింపు మనమాయెఁడ వై మదిఁ గింక వాయఁగన్. నృసిం. ౪. ౧౫౪.

క ప్రియ యిజ్ఞ యేటిది వాపుడుఁ, బుయిలో డిన పలుకుకుదల బాల్లలచేతన్, మయరసత భజనగణము లు,దయ మొందెన్ ఛంద మొందెఁ దధ్గుణయుక్తిన్

కావ్యా ౪ ౭

ఉ నీవిమలప్రభావమును నీవినయాదికసద్గుణం బులున్, దేవుఁ డెఱింగి యుండియును నిందల కున్ బుయిలోడి యోజగ,త్పావని నీవు గోరినవెపంబున నిచ్చటి కంపినాఁడు...

ఉ రా. ౬. ౨౪౧.

జ. పుయిలోట

**పురఃపాకము.** సం విణ (అ ఆ అ) పాక మును దగ్గిఱినది, ఫలోన్ముఖమైనది.

శ్లో: ఈప్సితార్థక్రియోదారం తేఽభినన్ద్య గిరే ర్వచః, ఆశిర్భి రేధయామాసుః పురఃపాకా భిరంబికామ్ సం. కుసం. ౬. ౯౦.

**పురఃఫలము.** సం విణ. (అ. ఆ. అ) (ఫలము ముంగలగలది.) ఫలమును సమీపించినది.

శ్లో: వత్సోత్సుకాపి స్తిమితా సపర్యాం ప్రత్య గ్రహీత్సేతిన నన్దకుస్తౌ, భక్త్యోపపన్నేషు హి తద్విధానాం ప్రసాదచిహ్నాని పురః ఫలాని... సం. రఘు. ౨. ౨౨.

పురంజనుఁడు. సం వి. అ. పుం క్షేత్రజ్ఞుఁడు, జీవుఁడు.

పురందర. సం. వి. అ. స్త్రీ గంగ.

పురందరము. సం వి. అ న. ౧ (జ్యోతి) జ్యేష్ఠానక్షత్రము ౨ చవ్యము, ఓషధివిశేషము

పురందరుఁడు. ౧ ఇంద్రుఁడు ౨ శివుఁడు 3 అగ్ని ४ విష్ణువు. ५ చోరుఁడు

పురంధ్రి. సం. వి ఇ ఈ. స్త్రీ ౧. కుటుంబము గల యాఁడుది. మగఁడును బిడ్డలును గల యాఁడుది, ౨ ఆఁడుది, (శ. ర) ఇ పుం. ౧. ఇంద్రుఁడు, ౨ వరుణుఁడు.

పురఁట=పుంట, పూఁట. వి. సంధ్య

సీ. సంధ్య రొప్పుచు నుండు సంజవఁ బూఁటనఁ బుంట యంచనఁగఁ బురంట యనఁగ.

ఆం. భా ౧. ౯४

పురజ్యోతి. సం వి స్ పుం ౧ అగ్ని, ౨ అగ్ని లోకము.

పురటము. సం. వి. అ. న బంగారు

వ...నికటపురటల తారూఢస్థలవిహంగమ మిథునప్రోచ్య మానశ్రుతిభిః ..

సం. భాగ ५. ౨. ४.

(పురటలతా=స్వర్ణవల్ల్యః, శ్రీధరుఁడు)

పురణము. సం. వి. అ పుం. సముద్రము (వాచ.)

పుర(ణి)(డి)ంచే1 = పు రా ణి ం చే, పురాయించే. అ క్రి (సం. పూరణమ్.)

౧. వర్ధిల్లు, పెంపొందు, ప్రబలమగు.

వ ..కృష్ణుండు జన్మించినది యాదిగా గోపులు ప్రతివత్సరంబును బ్రమాతలై శ్రీపులు పురణించి వచ్చుచో శారదల్పతికిధి మంతయు ఘృతం బయి పేర్చు...

హరి. పూ. ౬. ౧౩౧.

ఉ...కేసాయుచు పార దూఱుచుఁ గుశంకలఁ బోవకఁ దన్నలార మీ, పేసుపు లస్యాశావర్త నరణిం బురణింపఁగఁ జేయ టొప్పుగన్.

కృ శకుం పీరి ౬

ద్వి. చింతింపఁ దగ దని చెలికాంద్ర నిలిపి, పురణించుచును దనపూర్వకర్మంబు, తరువు వాఁడై వెంటఁ దరితిపునేయ

ద్వి ४ సా ౧. ౨౦ పా. ౧౬. పం.

౨. విజృంభించు, చెలరేఁగు

క...కురుబల మదె పురణించె బడలుపఱుతము రమ్మా భార. ద్రో. ५. 380

ఉ...సం,తానసమృద్ధి చే శుభవితానము తానక మర్మ్యోకేకి సం,తానముఁ గన్న దైవతవతంస పురిం బురణించి నవ్వుచున్.

వను ౧. ౧౨४.

పుర(ణి)(డి)ంచే2=పురుడించే. స క్రి పోలు, ఎనయు

ద్వి బుద్ధి బృహస్పతిఁ బురణించువాని,నిద్ధ తేజంబున నినుఁ బోలువాని

రం రా. అయో ౨౫ పా ౧3 పం.

ఉ పట్టెపుజాట్టు నిక్కి మెడ భాగగఁ జివ్విన యారెపాంకమున్, రెట్టలబల్మి తెమ్మిఁ బురణించినయీకలలోకలుక్...గబ్బిపుంజఁ జే,పట్టి గ్రహంబు వెన్కఁ గనుపట్టఁగ నల్లలు దీసి యంకటన్. కువల ४. ౨౦४.

క. సత్త్వము సాహసమును ద్యాత్మ త్వమ్మును విక్రమార్కు తెఱఁగునఁ గనకే,సత్త్వరగతిఁ జనుదేరఁ బ్ర,భుత్వము ఘనమూనె యతనిఁ బురణించెదవే. ద్వా. ౬. 3.

—అ క్రి ౧ సాటియగు, సమానమగు.

సీ. పుండరీకములతోఁ బురణించు కన్నులఁ గారుణ్య మను తేనె గడలుకొనఁగ.

ఉ. హరి. ౨. ౧४౬.

ద్వి. అరయంగ మే లైనయమృతంబుతోడఁ,
బురణింపఁ దరువుగాఁ బుట్టించితారొ.
రం రా. అర. ౧౯౫. పా. ౮. పం

౨. మార్కొను, ప్రతిఘటించు

క. గిరితోడన కరిపోతము, హరితో బుష్పంబుఁ
జెనయునట్టిద కాదే,హరితోడ నీవు
ఁగావునఁ, బురణించుట
ఉ హరి 3 ౫౧.

3. ఒప్పు, అతిశయించు.

ద్వి సరి లేనినవరత్నసంఘసంఘటన, పురి
ణింపఁగా బాహుపురులు ధరించి
రఘునా ౪ పా ౧౬. పం

పురతటి. సం వి. ఈ. స్త్రీ క్షుద్రహట్టము. చిన్నయంగడివీథి

పురదేవత. సం వి ఆ. స్త్రీ పురమునధిష్ఠించి యున్న దేవత.

పురద్వారము. సం వి అ న. పురముయొక్క వాకిలిగవను, గోపురము, పురమును ప్రవేశించు ద్వారము

పురపాలుఁడు. సం వి అ. పుం. ౧ పురాధ్యక్షుఁడు ౨ శివుఁడు.

పురపుర. వి. ౧. బొబ్బలేచుటకు ననుకరణము.

మహాస్రగ్ధర...పదకరకటక భ్రష్టభూషావిశేషం,
బుల్ చొప్పుల్ దప్ప నెండం బురపుర
నడుగుల్ పొక్కగా...
ప్రబోధ ౫ ౬౭.

౨. దుఃఖించుట తహతహపడుట మున్నగువానికి ననుకరణము.

క. పురపురఁ బొక్కుచు బకపతి,కరంకముం
దేరఁ బనిచి...
భార. శాం. 3. ౫౧౨.

క. పురజను లెల్లఁ గనుంగొని,పురపుర బొక్కంగ
నధ్యభూమిస్థలికిం, ద్వరితగతిం గొని చని
యగ్గురుహింస రాజునర్పమునకుగొలుపమిఁ
దనలోన్. విక్ర 3 ౬౫.

క. పురిపురఁ బడి యేడ్చు చుండె భూభాగము
నన్. దశకు. ౮ ౬౯.

3. తహతహ; బాధ.

చూ. పురపురగొను, పురపురమను.

జ: పు॰ పురగొను, పురపురమను, పురపురిలాడు

పురపురగొను. అ క్రి (పురపుర + కొను) తహతహపడు, తత్తఱిల్లు.

గీ తల్పమునకు సఖీప్రయత్నమున వచ్చి,నళిన
బోధకు నడుగడు గామ దయ్యెఁ,దలఁపు
పురపురగొనఁ దత్తఱిలుతదీయ,కాంతునకుఁ
దక్షిణము బ్రహ్మకల్ప మయ్యె
కవిక. 3 ౨౦3

పురపురమను. అ క్రి (పురపుర + అను) పురతమను,నొప్పినొందు

వ...శోకోల్లంఘనంబునం బురపుర మనుబోడితల
నిమురుకొనుచు . ప్రబోధ 3. ౧౨

పురపురలాడు. అ క్రి (పురపురలు + ఆడు) తహతహనొందు,మిక్కిలి అపేక్షపడు
(వ్యవ) అతఁ డాయుద్యోగమునకై పురపుర
లాడుచున్నాఁడు

పురభిత్తు. సం. వి. ద్. పుం శివుఁడు.

పురమథనుఁడు. సం వి అ పుం. శివుఁడు.

పురమార్గము. సం వి. అ. పుం. పురమునందలి వీథి;పురమునకుఁ గొంపోవుదారి.

పురము. సం. విణ. (అ. ఆ. అ.) పూర్ణము, ప్రచురము.

వి. అ. న. ౧. పట్టణవిశేషము. (పెద్దపెద్ద గృహములును జాట్టు నగర్తయు గలిగి యొక క్రోశమునకుఁ దక్కువకాని వైశాల్యముగలది); బహుగ్రామముల వ్యవహారమునకు స్థానమై పెక్కులు హాట్టాదులు కలిగియున్న ప్రధాన గ్రామము. ౨ గృహము. ౩ దేహము. ౪. పాటలిపుత్రమను పట్టణము. ౫ కుసుమదళవృంతము, పూఁతకాడ ౬. సాగరముస్త ౧. ౭ చర్మము. ౮ పేడ, గృహాపరిగృహము స్త్రీ అందుగృహభాగము. ౧౦ మూఁడు అను సంఖ్య —వి అ పుం పీతఘుంటి, పచ్చగోరంట. ౧. ౨ ధాన్యరాశి. ౩. గుగ్గిలపుఁజెట్టు

పురరక్షుఁడు. సం వి అ పుం. తలారి, ఆరక్షకుఁడు

పురరిపువు. సం వి ఉ. పుం. శివుఁడు

పురరోధము. సం. వి అ. పుం. పురముముట్టడి.

పురల. సం వి ఆ స్త్రీ దుర్గ

పురశాసనుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

పురశ్చరణము. సం వి అ న. ౧. ముందుగా ఆచరించుట ౨. (తంత్ర) గ్రహించిన మంత్రమునకు సిద్ధిహేతువగు ప్రయోగభేదము

పురశ్చర్య. సం. వి. ఆ. స్త్రీ = పురశ్చరణము.

పురస్కరణము. సం వి అ న. ముందిడుట. ౨. పూజనము. (చూ: పురస్కారము)

పురస్కరణీయము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ముందిడఁదగినది. ౨ పూజింపఁదగినది.

పురస్కరించు. సం. స. క్రి. ౧. పూజించు. ౨. ముందిడుకొను.

వ... అంత సమస్తసైన్యంబులు సన్నద్ధంబులు గావించి వివిధాయుధంబులు ధరియించి సుధాశనులు మహాదేవిం బురస్కరించుకొని మహిషునిమీఁదికి నరుదెంచిన.

మార్క. ౭. ౧౦

పురస్కారము. సం వి. అ. పుం. ౧. ముందిడుట. ముంగలపెట్టుట. ౨ ముఖ్యత్వమునిచ్చుట. ౩. పూజనము. ౪. పరిగ్రహించుట. ౫. (దీనినుండి) అయితపఱచుట, సిద్ధముచేయుట. ౬. శత్రువాక్రమించుట, అరిగ్రహణము. ౭. అభిశాపము, అపదూఱుపడుట ౮. సేకము, తడుపుట; మంత్రజలాదులఁ బ్రోక్షించుట. ౯. ఎదురుచూచుట, ప్రతిపాలనము.

పురస్కృతము. సం. విశే. (అ. ఆ అ.) ౧. ముందిడఁబడినది, ముందఱపెట్టుకొనఁబడినది; (దీనినుండి) అనుసరింపఁబడినది. ౨. పూజింపఁబడినది. ౩. పరిగ్రహింపఁబడినది. ౪ శత్రువుచే నాక్రమింపఁబడినది. ౫ అభిశప్తము, అపదూఱుపడినది. ౬. తడుపఁబడినది, ప్రోక్షింపఁబడినది, సిక్తము. ౭. సిద్ధముచేయఁబడినది ౮. ఎదురుచూడఁబడినది. ౯ ఏర్పఱుపఁబడినది, నియుక్తము. ౧౦. అభిషిక్తము, అభిషేకముచేయఁబడినది. (రాజకులము. మెు॥ శే ని.)

పురస్క్రియ. సం. వి. ఆ. స్త్రీ. ౧. పురస్కారము. (ముందిడుట. పూజనము. మెు) ౨. పురశ్చరణము.

పురస్సరుఁడు. సం. విశే. (అ. ఆ అ.) ముందు నడచువాఁడు, పురోగముఁడు. వి. అ. పుం. ౧ ముందుపోవువాఁడు-దూత. ౨. అనుచరుఁడు, సేవకుఁడు. ౩. నాయకుఁడు, ముందుండి నడపువాఁడు.

పురహరుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

పురా. సం. వి. ఆ. స్త్రీ ౧. గంగ. ౨. ఒకానొకగంధద్రవ్యము. ౩. తూర్పు. ౪. కోట,

దుర్గము అవ్య పూర్వమున (ఈయర్థమున తెలుఁగునందు వ్యస్తప్రయోగము కన్పడదు)

పురాకథ సం వి అ స్త్రీ పూర్వకథ, ఇతి హాసము

పురాకల్పము సం వి అ పుం ౧ ప్రాచీన యుగకల్పము ౨ పూర్వకాలము ౩ అర్థవాద భేదము

పురాకృతము సం విణ (అ ఆ అ) పూర్వము చేయఁబడినది వి అ న ఇహజన్మమందును జన్మాంతరమందును చేయఁబడిన పుణ్యపాపాది కర్మము

పురాజుఁడు సం వి అ పుం ఇంద్రునికి శాంతి కర్మములుచేయు పురోహితుఁడు (వై ని)

పురాణగుఁడు సం విణ (అ ఆ అ)౧ పురాణ గాయకుఁడు, పురాణములను జదువువాఁడు, సం వి అ పుం బ్రహ్మము, పరమాత్మ

పురాణపురుషుఁడు సం వి అ పుం ౧ విష్ణువు ౨ ముసలివాఁడు, వృద్ధుఁడు

పురాణము సం విణ (అ ఆ అ) ౧ పురాతనము, పురాభవము, పూర్వకాలపుది ౨ చాలఁ గాలము చెల్లినది ౩ జీర్ణించినది, క్షీణము వి అ న ౧ సర్గప్రతిసర్గాది పంచలక్షణ ములతోఁగూడిన బ్రాహ్మాది (చూ అష్టాదశ శ్లో సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ,వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్) ౨ పదునెనిమిది వి అ పుం న ౧ కర్ష మెత్తువెండిటంకము, కార్షాపణము ౨ ఎనుబది వరాటకములకొలదియగు పణము

పురాణాంతుఁడు సం వి అ పుం యముఁడు (వై ని)

పురాణించు = పురాయించు, పురణించు[1].

అ క్రి (సం పూరణమ్) ౧ వర్ధిల్లు, అతిశ యిల్లు, ప్రబలు

వ తంత్రిపాలుం డనం బరగినవాఁడ కాచేతం బ్రోవులు పురాణించుటం జేసి కొండొక కాలంబునన కడుపులం జెనుకు

భార విరా ౧ ఉ

దండకము ఉల్లోక సౌందర్య ధుర్యస్థితిన్ విస్తృతం బౌనురస్సీమ జిమూతమై హార వర్షోపలశ్రేణి రాణించు మించుల్ బురా ణించఁగాఁజేయు

పాండు ర ౩౫

౨ విజృంభించు (శ ర)

పురాణించు సం స క్రి పురాణముచెప్పు

శా పెట్టం గల్గను గాలిఁ గొల్వను బురాణింపం దొరంకొంటి భాగ ౧ ౫

పురాతనము సం విణ (అ ఈ అ) పూర్వము కలిగినది,బహుదినములనాఁటిది,ప్రాచీనము, జీర్ణిం చినది,క్షీణము

పురాధిపుఁడు సం వి అ పుం పురమున కధి పతి ఇట్లే పురాధ్యక్షుఁడు, మొ.

పురాయించు = పురాణించు, పురణించు[1]

అ క్రి ౧ వర్ధిల్లు (శ ర)

౨ విజృంభించు

దండకము శాశ్వరస్కంధ బంధుత్వగంధంబు, రూపించు మూఁపుల్ పురాయింప

పాండు ర ౩౫ (ముద్రి చి ని శ ర)

పురాయోని సం విణ (ఇ) ప్రాచీనమగుఉత్పత్తి గలది వి ఇ పుం శివుఁడు

పురారాతి సం వి ఇ పుం శివుఁడు, (ఇట్లే పురారి)

**పురార్ధవిస్తారము.** సం. వి. అ. పుం. ౧. ఖేట కము. ౨. అస్త్రభేదము. (వాచ) 3. పల్లెటూరు. (అ. ని.)

**పురావసువు.** సం. వి ఉ పుం. భీష్ముఁడు. (త్రి. ని.)

**పురావిదుఁడు.** సం. విణ (ద్) పురావృత్తముల నెఱిఁగినవాఁడు

**పురావృత్తము.** సం విణ. (అ ఆ అ) పూర్వము జరిగినది వి అ న ౧ పూర్వపు వృత్తాంతము. ౨. ఇతిహాసము.

**పురి.** వి. (త పురి) ౧ నెమిలిపింఛము బర్హము, నెమిలియీఁక

గీ. మేఘరాజాలు సరసత మీఱఁ దమ్ముఁ, దరళ విద్యుల్లతాదీర్ఘ తరకటాక్ష, వీక్షణకలాపముల గారవింప నలరి, నెమ్మి నర్తించుఁ బురి విచ్చి నెమ్మిగములు. రామా ౬ ౧౦

క విరితేనె మేపరులకున్, హరినీలపుసరుల కిరుల కజ్జాక్షికురుల్, గురులై పెదవిలుకుని బెడఁ, గురులై తగ నెమ్మిపురుల కొకదాఁపగులై. చం రా. 3. ౪౪.

క. పురి విచ్చి మయూరము లప్పురిసౌధశిఖో గృహాగ్రముల నటియించున్ వరాహ ౯. ౧౫౧.

౨. పిరి, మెలి, పెన; పేనుటవలనఁగలుగు గట్టి తనము.

సీ .తనరుచమాత్రమునాలు దారమనఁగఁ, బురి పిరి యుఁగఁ దక్కరణచేప్పన మొప్ప . అం. భా. ౨. ౨౯౫.

వ...తర్కోత్రాడు పాపఁడని రొండలిమలఁకలు పురులు విడి... భీమ. ౪. ౭౦

3. జిగ్బిసారము.



శా. జాజాఁటం బురి రొక్క సంగముల నందంబై యురఁటితి వి, భూపాలక... చంద్ర. ౧. ౧౦౯.

చ. కలకలనవ్వు మోము పురి గల్గినకెమ్మయి యూఁగుయూఁగుమీసలు నమరంజడా లెగు బుజంబులు . కువల. 3. ౧౧౭.

౪. కవియుట, ఆక్రమణము. చూ. పురికోను, పురికొల్పు)

౫. ఉత్సాహము, ఎచ్చరిక. (చూ పురికాఁడు)

౬ ధాన్యములు పోసి యుంచుటకు గడ్డితోఁ గట్టినకూటు, పెంటిగాడె. (శ. ర.)

(వ్యవ) మాపురి నిండ ధాన్య మున్నది.

౭. గోనెలు కుట్టుట కుపయోగించెడుత్రాడు. (శ. ర.)

(పురికోస అని వాడుక)

—కోలపురులు. = బాణములకుఁ గట్టిననెమిలి యీఁకలు

సీ తూరగోలలు నాఁటి కుతిగొని తనకుంచె పొది వమర్చినకోలపురులుంగాగ కు. సం. ౧౭. ౯౭౪.

జః—పురికాఁడు, పురికోను, పురికొల్పు, పురి నమ్మి, పురిపులుగు, పురిరొక్కించు, పురి రొక్కు, పురివిచ్చు.

**పురి.** సం. వి ఇ ఈ. స్త్రీ ౧ నగరము, ౨. నది. ఇ పుం రాజు (కే ని.) వి. ఈ. స్త్రీ. ౧. కోట, దుర్గము. ౨ దేహము. 3. సన్న్యాసుల ఉపాధిభేదము.

శ్లో. జ్ఞానరత్నేన సంపూర్ణః పూర్ణతత్త్వ పథ స్థితిః, పరబ్రహ్మరతో నిత్యం పురీనామా న ఉచ్యతే. మహానిర్వాణతంత్రము

**పురికాఁడు.** విణ. (పురి+కాఁడు) ఉత్సాహ వంతుఁడు, ఎచ్చరికగలవాఁడు.

క. పైఁ డేమి ప్రాఁతి యిదిగో, కేఁ డిచ్చెదు ప్రముచ్చుపగల నెలఁత రమింపం, గోఁడిమి

చదదే మరిఁ బురి, కాఁదవుగద కొదవకే
జగంబు లెఱుంగుద్. శుక. ౩. ౩౬.

పురికొను. అ. క్రి. (పురి+కొను) ౧. ఎచ్చరిక గొను, ఉత్సాహమునొందు;

క. ...బలములు దూర్యం,బులు వార్పులుఁ
జెలఁగ రెండుబురికొని చతురంగలసద్గతు
లొప్పఁగ నడిఁ, దలపడిరి...
భార. భీష్మ. ౨. ౧౭౧.

సీ. దనుజేంద్రునిలుచుట గని సైన్య మెప్పటి
యట్టుల పురికొని యనికిఁ జొచ్చె
భార. భీష్మ ౩. ౩౬.

క. బరవసమునఁ గోత్తలచే,సిరి పురికొని కదఁగి
దైత్యసేనలు మగుడన్. నిర్వ ౩. ౧౪

చ తెరలినసేన నిల్పి సముదీర్ణరయంబున రాము
సేయుచుం, బురికొనఁ జేసె దూషణుఁడు
భా. రా. అర ౧ ౨౦౬.

౨ కదఁగు, ఉద్యమించు

చ. కరకరితోడిరిత్తయలుక ల్పచరించి మనోజ
కేళికిం, బురికొనదీక కోపమునఁ బో
నడవం గడు నల్గి... చిత్ర భా ౪ ౫౨

౩. దట్టమగు, సాంద్రమగు

క. సెలు లనఁగ నెంత ఓపే, పురికొని తెగ
వారఁడేసి పాదమెడు మీ రేమురువుగ
జడ యల్లెదరు . శుక. ౨. ౨౩౩.

౪. అతిశయించు.

క పరికించుచు డెందంబునఁ, బురికొనుకౌతుకము
తోడ .. మనుచ. ౨. ౯.

౫. పెనఁగొను.

క. అనటయు నచ్చరహృదయం,బున భయమును
సంభ్రమంబుఁ బురిగొనఁగా నొ,య్యనఁగర
భృతవల్లరియొక, యనఁగుం జౌలికరతలంబునం
దిడి యంతన్. పె. కథం. ౧. ౨౧౯.

౬. కవియు, తలపడు.

క. పురికొనుచుం దరలుచు నొ,మారిసామారి
నొక్కచోట నలవడు నొకచో, విరియు
నొకచోటఁ దిరుగుం,దిరుగక యొకచోట
రెండుదెఱఁగుల నొచ్చున్.
భార. భీష్మ. ౨. ౧౭౩.

క ఉభయబలంబులుఁ బురికొని...నభశ్చరులు
వొగడ నీనునం బోరాడెన్
భార ద్రో ౩ ౧౨౩.

౭ సక్తమగు, చిక్కు

చ...వచ్చె పుండరీక,స్థలయనునప్సరోంగన ముదం
బున దానివిలాసలీలఁ జూ,డ్కులు పురి
కొన్నఁ బైఁబడి
మార్క ౫ ౫౯.

పురికొల్పు(లుపు). స క్రి. (√ పురికొను)
౧. (యుద్ధాదులకు) ప్రేరేచు, ప్రోత్సాహ
పఱచు

క తిరిగినపందల నేఁటికిఁ,బురికొల్పఁగ నున్న
వారు వోదురుగాక ..
భార భీష్మ. ౨. ౧౫౨

గీ కామమోహిత యగుచింతిఁ గస్తిపఱుప,
నమజుఁ బురికొల్పి తిది నీకుఁ జనునె రామ
సైమ. ౯ ౧౩౦ భార ఉద్యో. ౩ ౫౩.

౨ పంపు, పుత్తెంచు.

క సైరింపకయుద్దైఱఁగురు, వీరాగ్రణి యురువ
దేనువేలరథంబుల్, పోరికిఁబురికొలిపినవి,
స్ఫారగతిం గూడికవిసెఁ బార్థునిమీఁదన్.
భార. భీష్మ. ౨. ౩౩౭.

గీ. పురిగొలిపె నంచెఁ బుత్తెంచెఁ బుచ్చె
నంపెఁ,బంచెఁ బంపెను బంపించెఁ బనిచెఁ,
జనఁగ,వలరు నంపించె ననుమాట కర్థ
మగుచు. ఆం భా. ౩. ౧౨౧.

పురిడిపిట్ట. వి. పూరేడు, పక్షివిశేషము (శ. ర.)

పురినమ్మి. వి. (పురి+నమ్మి. పురిగలకెమిలి.)
మగకెమిలి.

క. పురులు గలఁ డిచ్చు నని తన,పురు లెల్లఁగొని
విల్తు మేముఁ బుదుకఁ గానం, బురులఁ
బొదకట్టి మెఱయుచుఁ,బురు లొకయ తక్క
పోరఁ బురివిప్పె క్రియన్.
కు. సం. ౫. ౧౪౦.

—పురివిప్పు = మగ నెమిలి.

సీ. పాలతిపోవలిలోఁద బురివిప్పి తనపురి ప్రతి
వచ్చు నని పాముఁ బట్టెనేని
విక్ర. ౫ ౧౬౦.

పురిపులుఁగు. వి. (పురి+పులుఁగు) నెమిలి, బర్హిణము.

గీ. పక్కివాల్గా ల్పునఁగుమై దోడు ప్రోలఁ, దొ
దరి యవయంబు సాదంగఁ బడసినట్టి,
పురిపులుఁగుమొత్త మెనలేని పున్నియంబు,
లేమిచేసెను .. నీలా. ౧ ౧౦౯.

క. ఇరువంకలఁ దన్నుఁ బొదివి,గొరువంకలుఁ
దుమ్మెదలును గోయిలలుం దక్కొరిచిలు
కలుఁ బురిపులుఁగులు, గొరగొర రా
మరుఁడు వెడలెఁ గొమ్మ గలంపన్.
నీలా. ౩. ౧౧.

పురిమెక్కించు. స. క్రి (√పురిమెక్కు) ౧. పేని గట్టిగా పెనగొనఁజేయు, బిగిమెక్కించు. ౨. పురికొల్పు, ప్రేరేచు, (క్రోధాదులను) రేఁపు.

(వ్యవ.) ఎవరో వానికి గట్టిగా పురిమెక్కించుటచే నన్ను చెడఁ దిట్టినాఁడు.

పురిమెక్కు. అ. క్రి. (పురి+ఎక్కు) పేనుట చేత గట్టిగా పెనగొను, బిగియు.

(వ్యవ) తంత్రాడు చక్కఁగా పురిమెక్కక పోవుటచే త్వరగా తెగిపోవును.

పురివిచ్చు. అ. క్రి. (పురి+విచ్చు) బిగి చెడు, సడలు; విడిపోవు.

చ. విడువని కౌఁగిలింత పురివిచ్చనిమచ్చిక తన్ను
లేనిసందడి...కల్గి రయుక్కకై,వడి నెడఁబాసి
యింటికిని వచ్చితి వాఁడు వేఁగునంతటన్.
కవల. ౫. ౩౧.

గీ. ఎదలొఁ బురివిచ్చె నెదమయ్యెఁ గడపెఁ
జెంగెఁ బాపెఁ గేడించె నాఁగను బరగు
చుండు, వీడెననుటకు...
ఆం. భా. ౩. ౨౫.

సీ. మతిమతిఁ బురివిచ్చె మాయూరపింఛిక
యపయశశ్రీఁ జెందె నంబుజంబు...గీ. జల
జలోచన నెఱులకు సాటిరాక.
ఇందు. ౨. ౧౬౫.

(పింఛము - విడుట - అనిధ్వని)

పురీతత్తు. సం వి. త్. పుం. న. ౧ ఆంత్రము. (ఇది దేహారంభకమగు నాడీవిశేషము) ౨. హృదయమును గప్పికొనియుండు మాంసభేదము. ౩. దేహము

పురీషణము. సం. వి. అ. పుం. మలము, విష్ఠ, (త్రి. ని)

పురీషమలము. సం వి. అ. పుం. మాషము, మినుములు (త్రి ని)

పురీషము. సం. వి అ న మలము, విష్ఠ, ౨ మఱికి, మాలిన్యము ౩ మట్టిబొడి, (వై. ని) ౪ సలిలము, నీరు (శ ని.)

పురీషాధానము. సం. వి. అ న. మలకోశము.

పురీషోత్సర్గము. సం. వి. అ. పుం మలవిసర్జనము.

పురుకుత్సుఁడు. సం. వి. అ. పుం. మాంధాత కొడుకులలో నొకఁడు.

పురుగు(వు,ర్వు)=ప్రువ్వు. వి. (సం. పులకః) ౧. క్రిమి, కీటకము.

ఆ దుక్కినున్న పురుగు చెక్కినయున్నను, శౌచమునకుఁ గాదు సంగ్రహింప.

వి. పు. ౪ ౧౭౩.

ఉ. నాయపరాధ మేమియు మనంబున నెన్నక మానిమానసవ్యధ్యయ కృపావిధేయ కుది దీనికి నెయ్యది యోవనంబునం, బోయి వసింతు నేఁ బురువుపుట్టువు దీరెడుదాఁక...

కాశ. ౪. ౧౪౧

చ. జరపక విశ్వనాథునకు సత్యము దప్పినరాజు రాజ్యసంహరణము నొంది దీనుఁ డయి యార్తి పెనంగొను మేనిపుండ్లనుం బురదగు రక్తిపూరముల బ్రుంగి పయింబయి నంతకంతకున్, దొరఁగెడిపుర్వులం గలికి తోఁడుచు వేడుక రిచ్చపట్టులన్

కావ్యా. ౨. ౧౨౨.

౨. పాము.—

(వ్యవ) వానిని పురుగు ముట్టుకొన్నది

ఆ. వక్రగతిన యెపుడు వర్తించు రంధ్రముల్, వెదకుచుండు మిగుల విషము గురియు, నోఁగ పడఁగఁ బెట్టు నోయన్న యే మందుఁ, జిట్టి బన్ను మనెడిచెడుగుఁబురుగు.

హరిశ్చ ౫. ౭౨.

ద్వి. అపాపజాతి బు ్వదరంటఁ గఱచు, నప్పుడు నన్ను నే మని తలఁచితివో.

ద్వి హరిశ్చ ౬ ౧౨౫౯ పం

—పురుగుఁబుట్రలు=పురుగులు (ఇందు బుట్రకు వేఱర్థము లేదు.)

గీ. అచ్చముగ నీటికందువ లరయువారు, బురుగుఁ బుట్రలు చెదరనుబ్బుచును నొక్క, పరిగ నవ్వుచుఁ జప్పట్లు చఱచువారు, సైరికద్వేశఁ బాలెంబువార లెల్ల.

కువల. ౨. ౧౦౪.

౩:—పురుగుచేయు.

పురుగు(పు)చేయు. అ. క్రి (పురుగు+చేయు) నష్టము, నశించు.

ఆ. చదువు చట్టుపడియె శాస్త్రంబు మన్నరెయ్యె, బుద్ధి పురువుచేసెఁ బుణ్య మడఁగె.

భాగ. ౬. ౧౩౫.

ఆ. రోయ్యపుర్వు క్రొవ్వి కోధోవసుంధర, కగవి తెగినపగిది నిట్టు లేల, జలతలంబు విడిచి చనుదెంచి నాబుద్ధి, పుర్వుచేయఁ జెట్టఁబొందఁగంటి శేం పంచ. ౪ ౫౩౭

పురుజత్తు. సం. వి త్ పుం ౧. విష్ణువు. ౨. కుంతిభోజుఁడు, (అర్జునుని మాతులుఁడు)

పురుటము. సం వి అ పుం ౧ మానవదంపతులయందు ఇతర మానవులకు ఉండునసమానము ౨ సంలాపము ౩ జలజంతువిశేషము (శే ని)

పురుటాకు. (పురుడు + ఆకు) వి బాలెంతరాలికి గర్భార్థముకట్టు నొకదినుసు ఆకు. (భూతులని)

చ. అలిక విభూతిరేఖ నవహారమునం బురుటాకు మూట ..కన్పడఁగాఁ గురుమాపుచీరతోఁ, నెలపురుడోమె నంత ధరణీవరకాంత యొకింత వింత గన్ ఇందు ౨ ౧౪.

పురుటాలు=పురుటియాలు. వి ఔ (పురుడు[1] + ఆలు) బాలెంతరాలు, ప్రసూతి

క పురుడీబోటికి నిందిర, పురుడంబిక గాక యొరులు పురుడే యనుచున్, బురుటాలికిఁ బదిదినముల, పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యపుగరితల్ భాగ. ౮. ౫౧౭.

సీ. పులి క్రొత్త యీనినపురుటింటిలోనికిఁ బురుటాలితగవు గొంపోవు హరిణి.

పి కను. ౨. ౪౭.

పురుటిపాపఁడు. (పురుడు[1] + పాపఁడు.) = పురుటిలోని శిశువు, మిక్కిలి లేఁతశిశువు. (ఇప్లే. పురుటిపట్టి.)

తే. పురుటిపాపనిఁ దొట్టెలోఁ బొందుగాఁగ, బెట్టి జోపించుకొని తాను బ్రియసతి యును...మందర సేఁగ నెలమి. హరి. పూ. ౫. ౧౮౧.

తే... ఇపుడు, దేవకీసూనుఁ డైయున్న దేవదేవుఁ, డితఁడు పూతనాప్రాణపాయితఁ దలిర్పఁ, బురుటిపాపఁ డైయుప్పొంగుపరువమునను. హరి. ఉ. ౫. ౨౨౮.

వ. మేనాయు...అప్పురుటిపట్టి నల్లనల్లన పట్టికొని వ శకుం ౨ ౧౮౬

పురుటియాలు=పురుటాలు.

సీ. పాదివితేఁ గావక పొత్తులలోఁ బట్లఁ బోనాడుకొనిన లేఁబురుటియాండ్రు రామా ౬ ౨౫౦

(పొత్తులలోఁబట్లన్=పొత్తులలోని బిడ్డలను )

పురుటి(యి)ల్లు. వి. (పురుడు[1]+ఇల్లు) ప్రసవగృహము, బిడ్డనుకన్నయిల్లు.

తే ..సూతి,కాగృహాభిధ పురుటిల్లు నాఁగఁ దనరు. ఆం. భా ౨. ౧౬.

మ. ఘనసంతోషము మీఱఁగా దశరథక్ష్మాపాలచంద్రుండు తే, చని కాంచెం బురుటింటిలోపలను...రాముని... దశా ౪ ౨౦

సీ. ఆది దివ్యానిదివ్యావతారమునకుఁ బూర్ణాంబుకుంభంబు పురుటియిల్లు. కాశీ. ౨. ౮౦.

క. ఈపురుటియింటి కద్య,ద్దీపంబును బోలె... భాగ. ౧౦. పూ. ౧౧౫.

పురుడించే=పురణించే[2]. (√పురుడు[2].) స. క్రి. ౧. పోలు, ఎనయు.

సీ. ఉరుపిచ్చ గంగజాబురుపడి వినుజాఱఁబురుడించుకట్టుల సరసిజాస్య. ద. శా. ౧౦౦౪.

శా. సింగం బున్నగుహానికేతమునకున్ శీఘ్రంబు నన్ వచ్చునాతంగంబుం బురుడించుచుం బవనపుత్రకస్వీకృతం బైనయా,రంగాగారము సేర వచ్చి... భార. విరా. ౨. 330.

సీ. బుద్ధి నింద్రాచార్యుఁ బురుడించు కూరత వాసవుఁ దాలిమి వసుధఁ బోలు. భార. అర. ౪. ౧౯౦. హేం పంచ. ౧. ౧౨౨.

౨. ఉపమించు, పోల్చు

మ వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ గాండీవితోఁ, బురుడింపం దగువాఁడు వీని కన యీభూలోకసంచారు లెవ్వరు లేరు... భార ఉద్యో ౪. ౨౨౯.

క. ఖరశరకిరభిన్నముల్లై,కర మెలమి వహించు నరుణకమలంబులతోఁ, బురుడింపఁ దగుచు నొజ్జఁగ్గి,విరోధులబంతిగములు వెలఁదికరంబుల్. ప్రభా. ౨ ౪౯.

—అ. క్రి.=సామ్యమునొందు, పాటియగు

క...ఒండొంటితోడ బురుడించిన చెన్నుద్దుల మద్దుల ముద్దుల,నుద్దులకాలువఁడు ద్రోచ క్షోణిం బడఁగన్. వి పు ౪. ౧౩౯ (క.ర)

ద్వి పొలఁతులు నీతోడఁ బురుడింపఁ గలరె ద్వి హరిశ్చ. పూ ౨౮౬౮ పం.

సీ. నాతోడఁ బురుడించునాఁతు లందఱు విన దశకు ౫. 3౫

పురుడు[1]. వి. దే. (క. పురుడు. త. పురుటు)

౧. జాతాశౌచము, సూతకము

తే పదిదినంబులు సన్నభూపాలు పతికిఁ,బురుడు వెడలె... రామా. 3. ౧౨౮.

ద్వి. పురుడు దీఱినయంతఁ బుణ్యాహవేళ,వరుస జానుకులకు వంశోన్నతులకు. రం. రా. బాల. ౨౦. పా. ౧౪. పం.

సీ. జాతసూతకమును సమ మగుఁబురుడు నా... ఆం భా. 3. ౫౬.

౨. పురుటిదినములు, జాతాశౌచకాలము.

క. ధరణిం గడుం జేదవారును, బురుటికి ఘృత
తైలధాన్యములం జెచ్చిర యుం,దర సంగ్ర
హింతురు . భార. అర 3 ౨౪౧.

సీ. నిమం గన్నపురుటిలోనన శంబరుండు దెచ్చి
యుదధిలో వైచిన నొక్రమమున.
హరి. ఉ. 3. ౧౯౭.

జః—పురుటాకు, పురుటాలు, పురుటిపాపండు,
పురుటియాలు, పురుటిల్లు, పురుడుపోయు.

పురుడు². వి (క. పురుడు, పురుడి త ప్రా.)

౧. స్పర్థ, పోటి; మాత్సర్యము

క ధరణిం గలరాజా శెల్లను, బురు డనం
గాంపిల్యనగరమున కరిగెదరొం,డొరులం గడ
వంగ . భార. ఆది 8. ౨౭.

వ. ప్రభాకరుండు నభోమధ్యంబునకు వచ్చి
వెలుంగు చున్న నతనితోడిపురుడునం దేజో
మహిమ దలకొన్న... దేవవ్రతుండు.
భార. భీష్మ. ౨ ౧౩౦.

సీ. హరి పురాంతకుతోడిపురుడున రజతాద్రి
కెన గాంగ నిది సృజియించెనొక్కొ.
వృ. విం ౨ ౪౦

క. రాజాలంకృత మర్కవిరాజిత మురుసింహ
మిథునరమ్యము ఘనవిభ్రాజిత మనుపురుడు
ననో,రాజతగిరి మింటితోడ రాయుచు
నుండున్. కు సం 8 ౯౪౫.

౨. పోలిక, సామ్యము.

క వరసతులం బతులం గదలడి,పురుడునం
దములోనం జల్లంబోరాద
కు సం. ౯ ౨౮౦

సీ. శౌర్యసముత్సాహధైర్యపారంబులం బురుడు
చెప్పంగ రాని పురువవరుండు.
శా. పంచ. ౨. ౧౫౩.

సీ. కైవడి కైవశి కయివడి కొడుపు మాదిరి
పోలిక మాడ్కి పురుడు,పోలిక యనంగం
బోల్పెంతు నుపమలేర. . .
అం. భా. ౨. ౩౦౨.

3. ఉన్నత స్థితి,గౌరవము.

ద్వి. దొరయు గాం దనిరుడే దొరకు బిడ్డండ,
పురుడు లే దనిరుడే పురుషార్థపరుండ.
పండితా పురా. ౧౧౩. పా

—విణ. సాటి,సమానము.

క పురుషోత్తముతో సెప్పుడుం,బురు డీతం
డంద్రు... హరి ఉ. ౫ ౪౦.

కి. పురు డీబోటికి నిందిర,పురు దంబిక గాక
యొరులు పురుడే యనుచున్, పురుటాలికిం
బదిదినముల,పురుడు ప్రవర్తించి కెలమిం
బుణ్యపుగరితల్ భాగ. ౧. ౫౧౭.

క హరుం డున్నతకరుణానిధి,కర ణన్నం బరి
గ్రహించు జగతి నతనికిన్,బురు డున్నదె
యుజకనకాం,బరు డన్నంగ లేరు తత్ప్రభావం
బనినన్. ఉ. రా. 3 ౧౪.

స. క్రి. (త- పురివు) ప్రేమతో సమత్వముచూపు;
నిమురు

మ హరిణీవచ్చెద కానకుం దపము పేయంబోద
మంచున్ మృగిం, బురుడున్
కు. సం. ౭. ౭౧౨.

జః పురుడించు, పురుడుచూపు.

పురుడుపోయు. అ క్రి. (పురుడు + పోయు )
(పురుటిలో బాలెంతరాలికి) ఉపచారముచేయు.
(వ్యవ ) ఆమెకు పురుడుపోయుటకు తల్లిని తీసి
కొని వచ్చినారు.

పురుడుచూపు. స. క్రి. (పురుడు² + చూపు)
దృష్టాంతముగాచూపు, తార్కాణించు.

సీ. ఒరుం దోసంగినయాగి పురుడుచూపుచు లోభి
చే నర్థ మెయ్యనం జేదికొనుచుం, బురుడు
చూపినవైన బుడుకచేరనివాని వంగడిం
బొచ్చిపోకాలగొనుచు. దశకు. ౫. ౧౪.

పురుదంశకము. సం. వి. అ. పుం. హంస.
(త్రి. వి.)

పురుదంశ(స)స్సు. సం. వి. స్. పుం. ఇంద్రుఁడు

'పురురము. సం. వి. అ. న. బంగారు.

పురుభోజస్సు. సం. వి. స్. పుం. ౧. మేఘము.

౨ పర్వతము (శే ని)

పురులు. వి (త పొరల్ క పురుళు, హొంరుళు = యుక్తక)

౧. ధనము, వైశము.

క. పురులుగలఁ డిమ్చనని తన,పురులెఱుంగక పిల్లిమేము బుడుకక తానుం, బురులఁ బొడకట్టి మెఱయుచుఁ, బురులీకయ తక్కి పోయెఁ బురిపమ్మి క్రియన్

కు సం ౫ ౧౮౦.

౨ పరువు, గౌరవము, మానము. (బ్రౌను దీనిని "పురి" పదముయొక్క "బ వ."గా గ్రహించి "గర్వము" అనునర్థమిచ్చెను)

గీ మగలఁ గోరి తొల్లి మగువలు తపములు,చేసి నవసి రనినచెట్టు లెందుఁ,గలవె దీని కమ్చు నిలిపితి నీవ నీ,వలన పతులపురులు వొలిసెఁ గాక.

కు సం ౪ ౫౬౪

ద్వి వల దని వారింపఁ జలమున ముక్కు,పొలి యింపతొన్నట్లు పురులు వోకాడి.

బస పు ౪. ౧౦౯ పా ౨౦౧ పం.

ద్వి. పుట్టినాఁడ కులముపురులు వోనాడ,చె ట్టయ్య తలఁచెదు పట్టి మాయయ్య.

బస. పు. ౧. ౨౦ పా. ౪౫౯. పం.

ద్వి. ఇప్పాట నితరులఁ జెప్పెడి దేమి,తప్పులు దారులు దడఁబడఁ బలికి,పెలసినచదువులు వీటిఁబో విత్త,పొలిసిపోయిరి తమపురులు దూలఁగను.

బస. పు. ౧. ౬. పా. ౧౭౯. పం.

౩. స్వభావము, ప్రకృతి.

క. పురులు గలఁ డిమ్చ నని తన,పురు లెఱుంగక పిల్లి మేముఁ బుడుకక తానుం,బురులఁ బొడకట్టి మెఱయుచుఁ,బురు లీకయ తక్కి పోయెఁ బురిపమ్మి క్రియన్.

కు. సం. ౫. ౧౮౦.

౪. ఖ్యాతి, పరాక్రమము (చూ. పురులోము.)

౫ సౌందర్యము

ద్వి బుద్ధ లెఱుంగులేఁబురులు ప్రాయమున, సిద్ధంబు భక్తుల శివునిఁగాఁ దలఁచు

బస. పు ౧ ౪౨౪. పం.

జః—పురులోము

పురులోము. అ క్రి (త.పొరలోంబు. పురులు + ఓము) ఖ్యాతము మెఱయించు, పరాక్రమము చూపు

క పురులోమె నాఁగ ఖ్యాతము, మెఱయించె నటంచుఁ దోఁచు ఆం భా. ౩ ౧౦౪.

పురువు విణ (ఉ ఉ, ద్వి ఉ) ౧ ప్రచురము, మిక్కిలియైనది, మిక్కుటము వి ఉ. పుం. ౧ పరాగము, పుప్పొడి ౨ దేవలోకము, ౩ ఒకానొకదైత్యుఁడు ౪ యయాతికొడుకులలో నొకఁడు (వీఁడు యయాతికి శర్మిష్ఠయందుఁ బుట్టిన మూఁడవకొడుకు) స్త్రీ ఒకానొక నది

పురుషకము. సం వి అ పుం న. గుఱ్ఱములు వెనుకకాళ్లు రెంటిమీఁద మనుష్యునివలె నిలువఁబడుట.

శ్లో. దన్తాలికాధరణ నిశ్చలపాణియుగ్మ, మర్ధోదితో హరిరివోద్వయశైలమూర్ధ్నః, స్తోకేన నాక్రమత వల్లభపాలముచ్చైః, శ్రీ వృక్షకీ పురుషకోన్నమితో గ్రకాయః.

శిశు. ౫. ౫౬ (అ. ని)

పురుషకారము. సం వి. అ పుం పౌరుషము, పురుషప్రయత్నము. (వ్యతి,దైవము.) - ౨. పురుషత్వము, పుంస్త్వము.

**పురుషకేసరి.** సం. వి. ఇ. పుం. నరసింహావతార మూర్తి.

**పురుషత్వము.** సం. వి అ న. మగవానితనము, మగతనము ౨. పుంస్త్వము, మైథునశక్తి. 3. పురుషస్వభావము, పురుషధర్మము.

**పురుషదంతిక.** సం వి ఆ స్త్రీ. మేదకీ.

**పురుషదఘ్నము.** సం. విణ (అ ఈ అ.) మనుష్యునియంత, నిలువు, (చేతులు పైకి నిలువుగాఁ బట్టుకొని నిలుచున్న మనుష్యుని పొడవుకొలఁది)

**పురుషద్వయసము.** సం=పురుషదఘ్నము.

**పురుషనాయకుఁడు.** సం వి. అ పుం ౧ సేనాపతి, దళవాయి, ౨. రాజు

**పురుషపశువు.** సం వి ఉ పుం ౧ పశుప్రాయుఁడగు పురుషుఁడు. ౨ పురుషరూపమగు యజ్ఞపశువు

**పురుషపుంగవుఁడు.** సం వి అ పుం మనుష్యశ్రేష్ఠుఁడు ఇట్లే పురుషసింహుఁడు, పురుషశార్దూలుఁడు, పురుషవ్యాఘ్రుఁడు, మొ॥

**పురుషము.** సం వి. అ పుం ౧ (వ్యాక) క్రియలమీఁది విభక్తులసంజ్ఞ. ౨ శాస్త్రము. 3 మురపొన్న. ౪. మనుష్యునిపొడవు, నిలువు (ఇదియొక యుపమాన విశేషము)

౫ పురుషకము, అశ్వస్థానక భేదము

శ్లో పశ్చిమేనాగ్రపాదేన భువి స్థిత్వాగ్రపాదయోః, ఊర్ధ్వప్రేరణయాస్థానమశ్వానాం పురుషస్స్మృతః.

**పురుషమేధము.** సం. వి. అ. పుం. యజ్ఞభేదము (ఇందు మనుష్యుఁడు పశువుగా విశసింపఁబడును)

**పురుషవరుఁడు.** సం. వి. అ పుం విష్ణువు.

**పురుషవాహుఁడు.** సం వి. అ. పుం. కుబేరుఁడు, నరవాహనుఁడు.

౨. గరుడుఁడు.

**పురుషవ్యాఘ్రము.** సం. వి. అ. పు. గ్రద. (వై. ని)

**పురుషసూక్తము.** సం. వి. అ న. ఋగ్వేదమున 10 వ. మండలమందలి, 90 వ. సూక్తము. (ఇందుఁ బదియాఱుఋక్కులు గలవు)

**పురుషాంగము.** సం వి అ న. మగగుఱి.

**పురుషాంతరము.** సం వి అ. న తరము, పురుష జీవితకాలము

**పురుషాదుఁడు.** సం వి అ. పుం (మనుష్య భక్షకుఁడు) రాక్షసుఁడు

**పురుషాధముఁడు.** సం వి. అ. పుం. పురుషుల యందు మిక్కిలి తక్కువైనవాఁడు, మిక్కిలి నింద్యుఁడు.

Hist. పురుషమృగము - A four-legged animal with a human f

**పురుషాయణము.** సం వి. అ పుం ౧. (ఆత్మప్రతిష్ఠగాఁగల) ప్రాణాది ౨ పురుషార్థము, (ధర్మార్థకామాది) 3. పురుషకారము, పురుషప్రయత్నము.

**పురుషాయితము.** సం విణ (అ ఆ అ) పురుషునివలె ఆచరించునది. వి అ. న ౧ పురుషునివలె ఆచరించుట ౨. ఉపరతి, మగలాగు

**పురుషాయుషము.** సం. వి అ న పురుషుని ఆయుఃకాలము.

**పురుషార్థము.** సం. వి అ పుం ౧ పురుషప్రయోజనము (పురుషార్థములు నాలుగు — ధర్మము, అర్థము, కామము, మోక్షము) ౨. పురుషప్రయత్నము.

**పురుషాశి.** సం. వి. ఇ. పుం. రాక్షసుఁడు, మానిసిదిండి.

**పురుషాస్థిమాలి.** సం. వి. ఇ. పుం. శివుఁడు.

పురుషుఁడు. సం వి అ. పుం ౧ చతుర్ముఖబ్రహ్మ. (వై. ని) ౨ మనుష్యుఁడు ౩ మగవాఁడు ౪ వంశమునందు ఒకతరమువాఁడు, తరము. ౫ అధికృతుఁడు, నియుక్తుఁడు ౬ పరమాత్మ, విష్ణువు ౭ (సాంఖ్యతత్త్వములందు) ఇరువదియైదవ తత్త్వము ౮ (పురుషసూక్తమందు చెప్పఁబడిన) జగత్కారణమగు పురుషుఁడు

పురుషోత్తముఁడు. సం వి అ పుం ౧ పురుషశ్రేష్ఠుఁడు ౨ విష్ణువు, నారాయణుఁడు ౩ పరిజనశ్రేష్ఠుఁడు. ౪ జైనభేదము

పురుహము. సం విశ (అ ఆ అ.) ప్రచురము, మిక్కుటము, మిక్కిలి

పురుహూతద్విట్టు. సం వి ష్. పుం ఇంద్రుఁడు

పురుహూతి. సం వి ఇ పుం విష్ణువు, స్త్రీ దాక్షాయణి, ఈశ్వరి.

పురుహూతుఁడు. సం విశ (అ ఆ. అ) పెక్కండ్రచేఁ బిలువఁబడినవాఁడు, వి అ పుం ఇంద్రుఁడు

పురూరవుఁడు,(వస్సు). సం వి స్ పుం ఒక చంద్రవంశపురాజు (బుధునకు ఇలయందుఁ బుట్టినవాఁడు, ఊర్వశీకాముకుఁడు)

పురే=బాపురె (రే). అవ్య ౧ ఆశ్చర్యప్రశంసాదులను తెలుపును

(ఆశ్చర్యార్థము)

మ కలకంఠీ మణిసౌధజాలములఁ గాంక్షం
జూడ నమ్మక్క చుక్కలరా జద్దిర కాఁడు
గా మరనదీకంజాత కోశమో పురే,యల
ఘుస్వర్ణశిరోగృహైకముకురం బంచున్ పురీ
వాసు లగ్గలముం బందెము వైచి చూచి
రవు డాకాంతాముఖాంభోజమున్.

రా. వి. ౫. ౬౩.

(ప్రశంసార్థకము)

శా విద్వేషుల్ మృతిం బొంది రీయుద్ధం
బేటికి నింకఁ జాలుఁ బని లే దోహో పురే
యంచు సంబద్ధాలాపము లాడి మాన్పె
మరలన్... భాగ ౮. ౩౮౬.

(ప్రశంసార్థకము)

గీ కావ్యనాటకాలంకారగానమదన, శాస్త్ర
పరిచయు మహిమంబు జాలపాద,భామినీ
మణి వెలిపె సుద్దామపటిమ, నా యనుర
భర్త మెచ్చి పురే యనంగ

ప్రభా ౪. ౬౪.

౨ (నిందార్థకము)

ఉ చాలు పురే సరోజభవ సత్పథవృత్తిఁ
దొలంగి కూతు నిట్లాలరివై రమింప హృద
యంబునఁ గోరుట ధర్మరీతియే

భాగ ౩ ౩౮౦.

ఉ చాలుఁ బురే నరేశ్వర ప్రచండతరం బగు
నిట్టి సాహసం,బేల యొనర్చి దీవు ..

హరిశ్చ ౫ ౧౫౩.

చ ఘనకుపితాత్ముఁడై యమునఁ గన్గొని
రాముఁడు వల్కె డాయఁ జేరఁ జనుదేశ
తక్కిటి పురే... భాగ ౧౦ ఉ. ౫౦౦.

పురోగంత. సం విశ (ఋ. స్త్రీ ఋ) ౧ ముందునడచువాఁడు ౨ ప్రధానుఁడు.

పురోగతి. సం. వి ఇ స్త్రీ ౧ ముందునడచుట, ముందఱపోక వి ఇ పుం కుక్క విశ. (ఇ) ముందుపోవువాఁడు

పురోగతుఁడు. సం విశ (అ ఆ అ) ముందఱనున్నవాఁడు, ముంగలనున్నవాఁడు.

పురోగముఁడు. సం విశ (అ ఆ. అ) ముందు నడచువాఁడు

పురోగామి. సం. విశ. (న్. నీ న్.) ౧. ముందు నడచువాఁడు ౨. ప్రధానుఁడు, వి. న్ పుం. కుక్క, శునకము. (శే. ని)

పురోగుఁడు. సం విణ (అ. ఆ. అ) అగ్రగామి, ముందునడచువాఁడు ౨ ప్రధానుఁడు

పురోజన్ముఁడు. సం విణ (న్ న్, అ న్) ముందు జన్మించినది వి న్, పుం. అగ్రజుఁడు, అన్న.

పురోజవము. సం. విణ (అ ఆ అ) ఎక్కువ వేగము గలది

పురోటి. సం వి ఇ పుం ౧ నదీప్రవాహము ౨. పత్త్రిశబ్దము, ఆకులచప్పుడు

పురోడాశము. సం వి అ పుం. ౧ హవిస్సు, యజ్ఞియద్రవ్యము ౨ హుతశేషము 3 సోమరసము ౪ పురోడాశసహచరితమగుమంత్రము ౫ పిష్టపాత్రము, పిండిపాత్రము (వి ని)

పురోడాశీయము. సం విణ (అ ఆ అ) పురోడాశమునకు హితమైనది

పురోడాశ్యము. సం = పురోడాశీయము

పురోణి. వి చిన్నయుత్తరము, చీటి (శ ర, చి ని)

పురోద్భవ. సం వి ఆ స్త్రీ మహామేద ౕ

పురోధ. సం వి ఆ స్త్రీ ౧ పౌరోహిత్యము ౨ నియోగము, అధికారము 3 నిరూపణము వి స్. పుం పురోహితుఁడు

పురోధసుఁడు. సం వి స్ పుం పురోహితుఁడు

పురోధానము. సం వి అ న ముందిడుట ౨ పౌరోహిత్యము

పురోధిక. సం. వి ఆ. స్త్రీ అందఱికంటె అధికురాలయినభార్య, మిక్కిలియనుంగయిన యిల్లాలు

పురోఽనువాక్య. సం వి. ఆ. స్త్రీ ఋగ్వేదము

పురోభాగి. సం. విణ. (న్ నీ. న్) ౧ తనంతటముందుపడువాఁడు, పడటముగలవాఁడు ౨ దోషదృక్కు. ఈర్ష్యగలవాఁడు, ఈసుగలవాఁడు. 3. ఎప్పుడు తప్పులేవెదకువాఁడు, దోషైకదృక్కు.

పురోభాగుఁడు. సం. విణ (అ. ఆ. అ) = పురోభాగి

పురోమారుతము. సం వి అ పుం. ౧. ముందటి ప్రక్కఁగొట్టినగాలి; పూర్వదిక్కునఁబుట్టినగాలి ఇట్లే పురోవాతము మొ

పురోవర్తి. సం విణ (న్ నీ న్) ముంగలనుండునది, ఎదురనున్నది

పురోహి. సం వి న్. పుం. తోడేలువంటి మృగవిశేషము (వై ని)

పురోహితిక. సం. వి ఆ స్త్రీ. పురోహితపత్ని.

పురోహితుఁడు. సం. విణ (అ ఆ.అ) ముందిడఁబడినవాఁడు ౨ నియుక్తుఁడు, ఒకపనిఅప్పగింపఁబడినవాఁడు —వి. అ. పుం. శుభాశుభ వైదికకర్మములను జేయించుచు మేలు కీడులను దెలుపుచుండెడి యాచార్యుఁడు, ఒజ్జ (శ. ర. చి ని)

పుఱి.(ఱ్ఱి). విణ ఎడమది, వామము. ఇది "చేయి" పదమునకు పూర్వముగానేయుండును.

ఉదా: పుఱ్ఱిచేయి, పుఱిచేయి

జ' పుఱ్ఱిచేయి

పుఱి. (ఱ్ఱి) చేయి. వి. (పుఱి (ఱ్ఱి) + చేయి.) ఎడమచేయి, వామహస్తము

చ అరిగి మహాభయంకరతరాహవదోహలబాహువప్రతాపరుచులు వోలుచెందిరపుఁబావడచేబుఱిచేయి వీచి .. కువల ౨. ౧౩౪

పుఱితి. వి. చేయి కొలచెడిపాత్రము.

వ దివసపడిదగుంప్రలకు(ం)చాలు 3. పప్పువ ౧ చేపుఱితి (౧) వీనిసరిఖుంపుంగొ, రలు.. . ద. కా. ౧౦౧౪

**పుటి (ట్టి) య=పుఱ్ఱె.** వి. (క. పుఱు) పుఱక, కపాలము, తల రొముక.

చ కఱచిన పీనుఁగు క్ర్వాఁదరకప్పెరయు నొ్మ్రలఁ బచ్చితోళులుఁన్, బుటియల పేరులుఁ మెదడుపూఁతయు ఝుమ్మని మూఁగు నీఁగలుఁ ఉ. హరి ౨. ౧౨౫

ద్వి పుటియల నఁట ౹మింగి పులి౹తేఁపు లదర, నఱుగక పొరలాడి యఱచు రక్కసులు
ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౩౫. పం

**పుఱుడ.** వి (సం పురోడాశః) భక్ష్యవిశేషము

క. ఉక్కెఱకుఁ బుఱుడలపైఁ, జక్కెరకుఁ వడలపై నొనఁగుతేనెలకుఁ, ౹గుక్కిళ్లు ౹మింగు టరుదా, పుక్కిళ్లం బెట్టుచంద ములు విన్నయ్యల్ బహు ౪ ౩౦

**పుఱ్ఱు.** వి ౧ చింపుటయం దగుధ్వని కనుకరణము
(వ్యవ) ఆ బట్ట పుఱ్ఱున చింపినాఁడు
౨ పలుచని మలము (శ. ర) ౩ పలుచని బురదమొ. (౹గా)

**పుఱ్ఱె (టె)=పుటియ.**

సీ. ఎలనీటి బొండలంబులువోలె మెద డెల్ల జిట్టి చెదరిన డొల్లు పుఱ్ఱెగములు.
ఆము ౬ ౧౪

**పుల=పుల్ల.** విశ. పసుపు మించిన తెలుపురంగు గలది. (శ. ర. చూ. పులకండము)
జః పులకండము.

**పులకండము=పుల్లకండము.** వి. (పుల+కండము=పుల్లరంగుగల ఖండ శర్కర.) కల కండ, పటిక బెల్లము.

సీ. శర్కరాభేద సంజ్ఞలు నవాతు బొమ్మోజు పులకండ మనఁగను బొలుపుగాంచు.
ఆం భా. ౨. ౨౫౧.

ద్వి పులకండ మొలుకు నీ ముద్దులమాట, లల వడ వీనుల చాలింపకున్న.
ద్వి హరిశ్చ. ఉ ౧౯౯౫. పం

క పలుకులఁ బులకండ మొలుకఁ బలికెం గలకన్. మనుచ ౪ ౩౦ విక్ర ౭ ౪౫.

క పులకండంబులు గలిపిన, నలు వగు సలిలము రసాయనం బగు పగిదిన్ నరస ౩ ౪

**పులకము.** సం. వి. అ పుం ౧. ఒక దినుసు రాయి వజ్రమణి (వై. ని) ౨ మణిదోష విశేషము మణులయందలి చీలిక. ౩ కంఠ ష్ఠము ౪ గజాన్నపిండము ఏనుఁగున కిచ్చెడి యన్నపు కబళము ౫. హరిదళము ౬ గల్వ ర్కము, మద్యము ౹తాగెడి పాత్రము ౭. కదప ౯ ౭ నులిపురుగు ౯ పురుగు ౧౦ చెట్టుమీఁది నల్లపురుగు (శ ర) ౧౧. గగు ర్పాటు, రోమాంచము వి అ న ౧ రేచక మను గంధద్రవ్యము ౨ పుడుక ఇంధనము

**పులకరము.** వి (సం పులకః) ౧. గగుర్పాటు, రోమాంచము

సీ. పులక లనంగను బులకర మనఁగను గగ్గ రనంగను గగు రనంగ, గరుడా ల్పనంగను బరఁగు రోమాంచము.
ఆం. భా. ౧. ౧౪౧.

౨. జ్వరము. (శ ర)
(వ్యవ) వానికి నాల్గురోజులనుండి పులకరము తగులుచున్నది
జ పులకరించు

**పులకరించు.** అ ౹క్రి (√ పులకరము) గగుర్పాటుపొందు, పులకితమగు

తే. మానసాయకశరవృష్టి నానకతనఁ, బొడము చలిచేత నెమ్మేను పులకరించు, కరణి రోమాంచకంచుకకలిత మగుచుఁ, దనువు గనసయ్యె దనుజమర్దనున కపుడు
దశా ౨. ౨౬౪.

పులకలు. వి. (సం పులకః) రోమాంచము. (దీనికి తఱచు బహువచనమందే ప్రయోగము కన్పడుచున్నది)

సీ. పులక లనంగను బులకర మనఁగను గగ్గ రినంగను గగు రనంగ, గగుదా ల్పనంగను బరగు రోమాంచము...

ఆం భా ౧ ౧౪౧

క. తరుణీ తరుణాంగుళములు, కరమునఁ దెమ లించి యహీ మకరకులజశిఖా,భరణము తను వునఁ బులకలు, దొరయఁగ వనకేళిఁ బ్రియ ముతో విహరించెన్ ఉ. రా ౬. 33

చ నలినదళాక్షుఁ జూచి నయనంబుల మోద్వఁగఁ జాల కాత్మలన్, వఱచి తదీయమూర్తి విభవంబు దలంచుచుఁ గౌఁగిలించుచుం, బులకలు మేన జాదుకొనఁ బొల్తులు సొక్కిరి

భాగ ౧౦ ఉ ౧౦౭౭

వ...మిన్ను వితెగి పయింబడినవడువున బెడంగు వడఁ గలయం దలకొనుపులక మొలకపయి రునకుం బాలుదుర్వారవారిపూరంబనన్

మనుచ. 3 ౯

పులకాలయుఁడు. సం వి అ. పుం కుబేరుఁడు

పులకి. సం విణ (న్ నీ న్) పులకలు గల వాఁడు వి న్ పుం. కదంబము, కడిమిచెట్టు (వై ని.)

పులకించే. సం అ క్రి రోమాంచితమగు, గగు ర్పాటుగలదియగు

క పలుతలలు ముఖవికాసము, వొలియక పడి యున్నసమరభూభాగము పె, ల్లలరినతామర కొలనిం, దలఁపించెన్ గగనచరవితతి పుల కింపన్. భార. ద్రో 3. ౪3

తే. అట్లు ప్రత్యక్షు మైనపద్మాక్షు నంత, రిక్షు మునఁ గాంచి ముని ప్రమోదాశ్రుజలము నిగుడఁ బులకించి కరటిఘంటికలతాళ, ములుఁగ నిట్లని యమ్మహాత్ముని నుతించె

ఆము. ౪. ౧౫

సీ పొలయల్కఁ దలఁపులఁ బులకించుఁ బుల కించి బింకంపుఁగౌఁగిళ్ల బిగి భజించు.

కావ్యా 3 ౧౨౭

పులకితుఁడు. సం విణ. (అ ఆ అ) పులకలుగల వాఁడు, పులకించినవాఁడు, హర్షించినవాఁడు

పులకోద్గమము. సం వి అ పుం గగుర పొడుపు.

పులగ(గ్గ)ము. వి (సం పులాకః) పప్పు చేర్చి వండినయన్నము, కృసరాన్నము

క. పులగముఁ బాయస మట్టులుఁ,బలలము నర్చనకుఁ గాక పక్వము లయినం, గలుగు నభోజ్యత్వము వి,చ్చలవిడి వంటకము చేసి చనదు భుజింపన్ భార శాం ౧ 3౭౪

చ .చేసి మె,త్తనిపులగంబు బెల్లము ఘృతంబు ఫలంబులు నారగింపు చే,సిన మది మెచ్చి యాత్మపదసిద్ధికిఁ బాత్రముసేయు నాతనిన్ సిద్ధకేమధ ౫ (చి.వి)

మ...మాయక్క నీ,కును బుల్గం బిడ పంచెఁ గైకొనుము. భల్లా ౫ (శ ర)

సా: పులగముపైనిపప్పు=(పులగములోనే పప్పు ఉండును కావున పైగా వడ్డించినపప్పు ప్రియముగా నుండదు)=అనావశ్యకమగుటచే ఎక్కువ ప్రియము గానివస్తువు.

క...అప్పిండియుఁ బులగముపైఁ, బప్పుగతిన్ పైప కతఁడు పొఱఁగఁ జల్లెన్.

చెన్న. బ. ౨. ౫౨.

పులపా(ల్పా)డుచే. అ క్రి. పులుకుపులుకునఁ జూచు,రెప్పలు మూయుచు తెఱచుచు నుండు.

చ. తడితల డిగ్గి ముంప జడతం దుదకొప్పులం
గన్ను విప్పి పుల్కొడుచుచు నీరు ముంగ
అలపోలిక ముక్కులం గూడ నోటం గొం,
తొడియుచు గూటికత్తి సగ కొంత్తుచు
తొక్కవిదుర్పు మున్నగా,వడంకులె కాక
చేష్టుడిగ వత్సము పత్సలు జానువుల్
చొరగ ఆము ౪. ౧౧౭

౨ కొప్పు వేయక చూచు

క. చప్పుడు సేయక సంధ్యకుం, జప్పట్లిడు
కొంచుం గొందసరియలవెంటక్, జప్పుళ్ళకుం
బులపొడుచుచుం, జొ ప్పరయుచు నీల
పెట్టుచును కబరభటుల్.

భల్లా 3 అ (శ ర)

పులము. సం విణ (అ. ఆ అ) విపులము వి
అ. పుం పులకము, గగ్గురు

పులసరము. వి ౧ పాకము చెడుటవలనం గలి
గినపులుసు, (శ ర చి ని)
౨ అజీర్ణవ్యాధి, (ప్రా) 3 ఉద్రేకము
(ప్రా.)
జః పులసరి

పులసరి. విణ (√పులసరము) పొగరుంబోతు

ద్వి కలవానియట్లు నిక్కుంబు నీ వొక్క,పుల
సరితనమునం బుచ్చితి కొలుచు బస పు
పురా. ౪ ౧౧౧ పా (శ ర ప్రా)
బులుసరి. ముద్రి

పులస్తి. సం వి ఇ పుం పులస్త్యుండు

పులస్త్యుండు. సం వి. అ పుం సప్తర్షులలో
నొకండు (ఇతండు బ్రహ్మకర్ణమునుండి పుట్టిన
వాండు. ఇతనిభార్య కర్దమునికూతురగు హవి
ర్భుక్కు

పులహుండు. సం. వి. అ. పుం సప్తర్షులలో
నొకండు. (ఇతండు బ్రహ్మనాభినుండి పుట్టిన
వాండు. ఇతనిభార్య కర్దముని కూతురగు గతి)

పులాకము. సం వి అ పుం తుచ్ఛధాన్యము
పొల్లు. ౨. భక్తసిక్థము అన్నపు మెతుకు 3.
సంక్షేపము

పులాకి. సం వి న్ పుం వృక్షము, చెట్టు
(వై వి)

పులాయితము. సం వి అ న అశ్వగతిభేదము.

పులాలిక. సం వి. ఆ స్త్రీ నాసాగ్రదంశమను
విషోపద్రవభేదము

పులి1. వి (క. పులి హులి త పుల్ =)
వ్యాఘ్రము వేంగి

క పులి గోల వేసిన ట్టి,ట్టలపురయంబునం గడం
గుటయుం దద్వృక్ష, స్థలమునం గిరీటి కెం
ద,మ్ముల నాటంగ నేసె బొమలు ముడి
పడుచుండగ భార. విరా ౫ ౧౭౭.

సీ సెల సెప్పకొని రొప్పుపులి నైనం బీడించి
పడవైతుం జొచ్చి నీపాదమాన
మనుచ ౪ ౩౪.

మ. .ఆపులికి దుర్వారోద్యముం డైనయా,హరి
యుం దోడగు ..
భార ఉద్యో ౪. ౨౫౭.

(ఇట శౌర్యగుణముచే పులివంటి వాండని
భావము )

సా. పులికూన పూరి మేయునాకిగొప్పకుల
మునం బుట్టినవాండు నీచకృత్యములు చేయం
డనుట.

—పులి నాకి విడుచుట=గొప్ప ఆపదతప్పుట

తే నాకవల్లభ నీమీంద నాటికొన్న, మాని
కోపాగ్ని దివిజసంపదలమీందం, బోయె
నంతియ చాలు నీపుణ్యమునను, వేయు
నేటికిం బులి నాకి విడిచినట్లు
వి పు ౧. ౧౫౬.

—పులిమీసల నుయ్యాల లూంగుట,=ప్రాణ
హానికరమగు సాహసకృత్యమును చేయుట.

ఉ. చేరకుఁ డింతి నెవ్వఁ డిటు చేరినఁ బ్రాణము మీఁద వచ్చునం, ఘోరమహాసంభవాన్వయుఁడు భూజ్యుఁడు గాన సహించియుంటి గా, కారయ నన్ను తెంకటిబలాధికు లైనఁ ద్రుణీకరింపఁ సే, మీర లెఱుంగ రిట్లు పులి మీసల నుయ్యల లూఁగ వచ్చునే.

భోజరా. 3 3౭.

ఈనినపులి = అతికోపముగల క్రూరుఁడు. (ఈనిన పులికి కోపక్రౌర్యము లెక్కువయని ప్రతీతి)

సీ. కొఱవితో నడునెత్తి గోకి నట్టీనిన పులితోడ సాముకుఁ బూనినట్లు వేను ౪ ౫౦

(ఈనిన పులితోడ సాము చేయుట = ప్రాణహాని కరమగు సాహసకృత్యము చేయుట)

—మెత్తనిపులి = పైకిసాధువుగాఁ గనఁబడుచు తీక్ష్ణస్వభావము గలవాఁడు

చ. . ధర్మమూర్తి మెత్తనిపులి ..

భార ఉద్యో ౨. ౧౮

జ. పులిగోచ, పులిగోరు, పులిగోరుపట్టులు, పులిగోళ్ల వంకెలు, పులిచెవులాకు, పులిజున్ను, పులిజూదము, పులిపెంజర, పులిమెకము, పులియడుగుకపసి, పులియాట,

పులి². విణ. (√పులియు క. త పుళి) పులిసినది. శుక్తము.

(ఇది సమాసపూర్వావయవముగానే కాన వచ్చుచున్నది చూ పులికడుగు, పులికూడు)

పులిచేల్ల=పుల్లనిమజ్జిగ

సీ. పేరి పక్వం బైనపెరుఁ గుండఁ గవ్వంబు పులిచల్లలో నుంచి చిలుకఁబోవు

శుక ౨ ౫౬౧

—పులిచారు=పుల్లనిచేరు, చేరు.

క. పులిచారు వంచె నొక్కతె, పులిచాఱులచీరఁ గట్టి భోక్తల కేకా, వలిచారు చంచరీకా, వలిచారుతలక్కాచాలి వహీ వహీ నొగడఁగా.

విమా. ౪. ౨౫.

జ పులికడుగు, పులికాపు, పులికాయ, పులిగంజి, పులిగాయము, పులికూడు, పులిచించలము, పులిచింత, పులిచెంచలి, పులిత్రేఁపు, పులినీరు, పులిపెట్టు, పులియంబలి, పులియఁబాఱు, పులియు, పులిబోర, పులివరుగు, పులివోపు, పులుప, పులుసు, పులుసుఁగూర.

పులిందము. సం వి. అ. న. దేశవిశేషము

పులిందుఁడు సం. వి అ. పుం. అడవియందు వాసముచేయుచు మిక్కిలి జీవహింసాపరుఁడై తిరిగెడి యొకజాతి బోయవాఁడు (ఇంద్రుఁడదితిగర్భమును గత్తిరించుటవలని భ్రూణహత్యా పాపముచే తపశ్చర్యకుఁ బిదప తన దేహమునుండి పుట్టిన యొకజాతి; వసిష్ఠుని హోమధేనువు ఫేనమునుండి పుట్టినయొకజాతి

పులికడుగు. వి (పులి² + కడుగు) పులిసిన కడుగునీరు, ధాన్యామ్లము. (శ. ర)

పులికాపు. వి (పులి² + కాపు) ౧ లోహవిగ్రహములను శుద్ధిచేయుట కుపయోగించు చింతపండునీరు. (బ్రౌ)

౨ చింతపండు గలిపిన నీటితో లోహకృతములయిన దేవతా విగ్రహములను తోమి శుభ్రముచేయుట (వా)

పులికాయ. వి (పులి² + కాయ) పుల్లనికాయ

క పులిచెలికలోని కేఁగుం, బులికాయల కరికి యొక్కపులిచింతపాదం, బులి యుండ జాగి లముచేఁ, బులిపులి గావించె నొకఁడు పులిపేసెల్లక.

రా వి 3 ౭౨.

పులికూడు¹. వి (పులి¹ + కూడు) పులియొక్క ఆహారము, వృషభము వెం.

ఆం. భా. 3. ౭౦.

పులి(కూ)గూడు². వి. (√పులి²) పులిసిన యన్నము; పులిబోర, ఉప్పు పులుసు,

కారము, పసుపు మున్నగువానిలో రుచికర
ముగా చేసిన యన్నము.

సీ. పులిపినవంటకంబును వృషభంబును పులి
కూడు వాఁగఁ బెంపొందియుండు
ఆం భా ౩ ౬౦

(ప్రాఁతవ్రాఁత ప్రతులపా పులిహోరంబు అని
క్రొ వావిళ్ల. పా. పులిహోరము=వ్యాఘ్రా
హారము. క్రొ. వ్యాఖ్య)

౩. భిక్షాన్నము, భిక్ష మెత్తి తెచ్చికొన్న
యన్నము

క. పులిగూడు తిండి గొరగం,గలిచియు నోచెల్ల
యింత గల్పించెదు... కు సం ౪ ౧౪౪

చ. చెలి పులిగూడు మానుపని శ్రీదునిఁ గా
దని వసు ౧ ౯౯

పులికోచే. వి. (పులి[1] + కోచ) పులి మొగము
వంటి మొగముగలిగిన యొక విషజాతి పాము
పుర్రుగు. (శ. ర క్రొ, పురికోస అని వాదక)

పులిగంజి. వి (√పులి[2]) పుల్లనీళ్లు, ఆరనాళము,
(శ. ర.)

పులిగాయము. వి (√పులి[2]) పూర్తిగా మానని
గాయము, పులినీరు కాఱుగాయము (అతిన
గంటిమచ్చ శ ర)

క తిలకించితివే నృప మొక్కల మగునీచెంచు
మేనఁ గలపలుగంటుల్, బలుసింగపుఁ
బలుగం ట్లా,పులిగాయము లెల్లఁ బెద్దపులి
గాయమ్ముల్ చంద్రా ౨ ౪౧

పులిగోరు. వి (పులి[1] + గోరు) ౧. వ్యాఘ్ర
నఖము; పులిగోళ్లుపెట్టి చేసిన పతకము; అట్టి
పతకము గలహారము. (శ ర)

క. ఇవి పందికొమ్ము గాయము, లివి సింగపుఁ
గోర చీర లివి యేనుఁగుపో, ట్లివి పులిగోరుల
చెనకులు, నువుగింజకుఁ గో టిడదు తనువు
గనుము నృపా రా. వి. ౩. ౪౯.

సీ తీ రైనగళమునఁ దోర మైనకడానిజాళువా
పులిగోరు తూలియాడ. ఇందు. ౨. ౧౪౧.

చ పెండెఁ బులిగోరు ఫాలమున మేలిమిపచ్చల
రావిరేక .. చంద్రా. ౨. ౧.

౨. వ్యాఘ్రనఖము. శ.

సీ. పులిగోరుచె ట్టన వెలయు వ్యాఘ్రనఖంబు...
ఆం. భా. ౨. ౬౨.

పులిగోరు పట్టులు. వి (√పులిగోరు) వస్త్ర
విశేషము

వ...వెలిపట్టులును పాలంబట్టులును పులిగోరు
పట్టులు నుదయరాగపట్టులును క్షేత్రపట్టు
లును... ద్వా ౩. ౨౦౬.

పులిగోళ్ళ వంకెలు. వి బ (√పులిగోరు)
ధాన్యవిశేషము

సీ. ఏదుకజ్జిలు వంకె లినుకరాజనములు పులి
గోళ్ల వంకెలు బొగడసరులు.
హంస. ౪. ౧౨౧.

పులిచించేలము=పులిచెంచేలి. వి. (పులి[2] +
చెంచలి) ఒకానొక యోషధి శ.

సీ విషకంటకాలాహ్లకేతసంబును నీరుచించలం
బును పులిచించలంబు హంస. ౨. ౨౭౯.

పులిచింత. వి (పులి[2] + చింత) ౧ పులిచెంచలి,
చుక్రిక, నేలపై ప్రాఁకు ఒకజాతి యోషధి శ.
(చి ని. శ ౧ చూ పులిచెంచలి. దీనియాకు
పుల్లగానుండి పచ్చడి కుపయోగించుదు)

౨. గుల్మవిశేషము పొదగా పెరుగు ఒకజాతి
చెట్టు

సీ. పులిచింత మొదుగు ములుమోదుగును వెల్గి
పుల్లవెలఁగ వెట్టిచిల్ల చిల్ల
హంస ౪. ౧౧.

క. పులిచెలికలోని రేఁగు, బులికాయల కరిగి
యొక్క పులిచింతపొదం,బులి యుండ...
రా. వి. ౩. ౬౨.

పులిచెంచేలి. పులిచింత, పులిచించేలము వి చుక్రికి స్త్రీ (చి ని శ. ర. మునివణ్ణకమని ఆం ఖా. సీ. మునివణ్ణ కాఖ్యదగును, పులిచింతయనఁగను బులిచెంచలియనంగ ... ఆం భా. ౨. ౬౭ చుక్రియను మునివణ్ణకి మును భిన్నములని అమరము.)

పులిచెలిక. వి (పులు² + చెలిక వృత్తిని వర్ణ వికారము) క్రొత్తగా బీడుపెట్టిన నేల
క పులిచెలికలోనిరేఁగుంబులికాయల కరిగి
రా. వి 3. ౬౨.

పులిచెవులాకు. వి (పులి¹ + చెవులు + ఆకు) ఒకానొక మందుచెట్టు

పులిజేన్ను. వి (పులి¹ + జున్ను) పులిపాలతోఁ జేసినజున్ను. (శ ర)
సీ హితబహుక్రుతధర్మరితసారశాస్త్రపూర్వతల మన్ద్విజాలదుర్గముల నిలిపిఁ, పులిజున్ను మొదలుగాఁ బురుసాయసావధి కం దుండ సవరిణ ల్పొందువటిచి
ఆము ౪ ౨౬౧
తే గసగసలు వీకవిండ్లు సోగచిలుకలును, సింగములు పులిపిల్లలు జింక లేడు,గములు మానిపి తోతులు కాటుపోఁతు, లేడి కదుపులు పులిజున్ను పాడిపనులు ప్రబంధ ౧. ౧౩౫
చ కనుఁగొని పెమ్మనం బలరఁగాఁ బులిజున్నును సేఁదుకన్నుఁ డె, మ్మనినను దెచ్చువాఁడ.
విక్ర ౧ ౧౬౪
మ. వరి నన్నక వెల యిచ్చి కొంద్రం మురజద్వత్సస్థలీరత్నముక,పులిజ స్నేనియు నమ్ముఁ జాపుదురు . వణిగ్వర్యుల్ యశోధుర్యులై
సుద. ౧ ౧౭౨

పులిజూదము. వి (పులి¹ + జూదము) ఒకానొక యాట. (గళ్లుగీసి పదునైదుకాయలను మేఁకలుగాను మూఁడుకాయలు పులులుగాను గ్రహించి యాడెడు ఆట పులిజోను అని కొందఱు)
సీ . ఒడ్డు,విడుపు నెట్టుడుగాయ విండ్లమ్ము లాటలు పులిజూదములు
హంస 3 ౧౪౬.

పులితోడుగు. వి (√పులు²) వన్య వక్రకంటకము స్త్రీ (గురవెందవంటి యాకులుగలది చి ని)

పులిత్రేఁపు. వి (పులి² + త్రేఁపు) అజీర్ణపు త్రేఁపు, పుల్లని త్రేనుపు
ద్వి పుణియల నట మ్రింగి పులిత్రేఁపు లడర, నణుగికి పొరలాడి యలుచు రక్కసులు
ద్వి హరిశ్చ ఉ. ౧౬౩౬ పం

పులినము. సం. వి అ పుం. న ౧ సైకతము, నీరువెలిసిన పిదపఁ గనఁబడు నిసుకదిబ్బ

పులినవతి. సం వి ఈ స్త్రీ నది ఏఱు.

పులిసీరు. వి (పులి² + నీరు) రక్తము విఱిగి గాయములోనగు వానియందుండి కాఱెడి నీరు.
చ వెలుఁగుల కేని వే వెలుఁగు వేఁడిమి నుఱ్ఱిన గ్రుక్కు_ణాపగా, కలశ సమస్త నీ మృదుల కాయముల న్పులినీరు గ్రుమ్మ బొబ్బలగతి కూపకప్రతతి భాసిలె
చంద్రా. ౨. ౨౨.
క హరునఱకాలం జొరఁబడి, శిరమునఁబుక పెడరి నీడు సితఖండము చంద్రిర యది పెల వడి సేఁదుక, దొరఁగెడుఁ బులిసీరు గాంగ తోయము పేరక చంద్రా ౫, ౪౫.

పులిపి(ల్పి)రి=పులిపులి¹. వి దేహమునందు మిరియములవలె లేచెడు దుర్మాంస విశేషము.
సీ...దొప్ప, చెవులుఁ బిల్లికనులుఁ జెక్కిలి పులిపిరి గొగ్గిపండ్లును మురిశోఁతి ముఖము
హరిశ్చ. ౪. ౧౬౨.

ద్వి కటుంబీఁచు గర్దమున, బరువు మోసముఁ
బెక్కు_పైఁ బులిపిరియు నఁటుకు బొడ్డుమ...
నవ. ౩. ౧౪౯. పా. ౨౩. పం.

ద్వి. మిడిపండ్లు చెక్కు_టిమీఁది పుల్పిరియు
ద్వి పారిశ్చ. ౯ ౧౦౬౫. పం.

జ: పులిపిరికాయ

పులిపిరికాయ=పులిపిరి. (శ. ర)

పులిపులి[1]. వి పులిపిరికాయ (శ ర)

జ. పులిపులికాయ

పులిపులి[2]. విశ. అవమర్దితము, నలఁగినది

చ పులిపులి యయ్యె నంగలత పొక్కు_ సుధా
ధరబింబ మింతికిఁ, నలినలి యయ్యెఁ
గౌను. . శుక ౧ ౨౧౫.

సీ. పులిఁ గ్రమ్ముకొని పులిపులిగ నీఁటెలఁ
గ్రుమ్మి యేపుతో మగఁటిమిఁ జూపువారు.
రసిక ౧ ౧౧౨

క మిలమిలనిగోళ్లఁ జలుపలు, గులగులలుగఁ
గొట్టు నచటి కోల్పులులు గవిం,బోల
వోలయ పెటిగి రొటుకులు, పులిపులి యన్న
పుడ కలిసి పులిపులిసేయుఁ

చంద్ర ౨. ౯

పులిపులికాయ=పులిపిరికాయ. (శ ర)

పులిపెంజెర. వి (√. పులి[1]) కాటుక రేకు
పాము. ఒకజాతి పొడపాము (శ ర)

పులిమిపుచ్చే. స క్రి (పులిమి+పుచ్చు) ౧
కప్పిపుచ్చు

సీ. నందుఁ దదే మన్న నవ్వుచు మీ రేల పొ
మ్మంచు నొకవేళ పులిమిపుచ్చు.
దశా. ౯. ౨౭.

౨. వంచించు, మోసముచేయి.

ద్వి. అలమీఁడివారల వణఁకించినట్లు, పులిమి
పుచ్చిన నేఁడు పోనీము నిన్ను
ద్వి పరమ ౪ ౫౪౪. పా.

౩. నలిపివేయు.

ఉ కరాళదివ్యబా,ణా వళు లెచ్చి రా వాడిని
యుగ్రతమప్రదరాగ్నికీలముల్, వోవఁ గరం
బులం బులిమిపుచ్చుచు మారుతి యుగ్రదాన
వుల్, త్రోవ నెదిర్చినం గడవిత్రొక్కు_చు
మక్కు_వఁదూఱి గ్రక్కు_నఁ
రామా. ౬. ౨౦౪.

౪ తాటాతూటముచేయు, అతుకుల పనిచేయు

క తెలుఁగుకవిత్వము చెప్పక, దలఁచిన కవి
యర్థమునకుఁ దగియుండెడు మా,టలు గొని
వకులుం బ్రాసం బులు నిలుపక యొగిని
బులిమిపుచ్చుట చదురే నిర్వ ౧. ౪.

పులిమెకము. వి (పులి[1] + మెకము) మత్స్య
విశేషము (శ ర. బ్రౌ)

పులిమెట్టు. వి (√పులి[2]) తేర్చినకడుగురొక్క_
అడుగుది (శ ర. బౌ) అభిషుతము, పులియఁ
బెట్టిన కడుగు

తే... మెట్టనఁగ మెదు ద,నంగఁ బులిమె ట్టనంగఁ
బెలంగుచుండు, నభిషుతాఖ్య...
ఆం. భా ౨. ౨౫౦.

పుల(ల్లి,ల్లె)య. వి పర్ణకృతభోజన పాత్రము,
విస్తరి

క. పెలవాల్లు మునియతుండై,పలాశపత్రముల
పులియఁ బాయక ద్విజుఁ డి,మ్ముల భోజనంబు
చేసిన, ఫల మిలఁ జాంద్రాయణంబు ఫలముం
గలుగుఁ. విజ్ఞా ఆచా. ౪౪

సీ. అగ్నికార్యము దీర్చి హారుని నభ్యర్చించి
ములుమోదుగాకులఁ బులియఁ గుట్టె
కాశీ. ౩. ౧౨౧.

తే ఇచటి కొంగిలి పుల్లియ తేలవచ్చె
కాశీ 3 ౯౫

ద్వి ప్రొద్దునఁ జని పది పుల్లెలాకులును, జేలిమి సమిధలు వెలయు దర్భలును
ద్వి హరిశ్చ ౪ ౧౪౧౪ ౫౦

పులియంబలి వి (√పులి) పులిసిన అంబలి

చ ఎతి చెప్పిన నంతన మంది దానినొయ్యన దరిఁ జేరఁ దిల్చి పులియంబలి యించుక పోసి మూకుటక
చెన్నబ ౨ ౨౬

పులియఁబాఱు అ క్రి (పులియు[1]+పాఱు, స్వార్థమున) పులియు పుల్లనగు

సీ పూఁబోఁడికెమ్మోవి పులియఁబాఱిని కేసె నతిమోము కందనిచందమామ
చంద్రా ౬ ౧౭

పులియదుగుతపసి వి (√పులి[1]) వ్యాఘ్ర పాదుఁ డనుముని

(గంగానది) వ పులియదుగుతపసికొడుకు వెను కొనెడు పాలకడలి వడువున వసంతసమ యంబు ననుసరించు కుసుమసముదయ సమృద్ధి పగిది
చం రా 3 ౨౫

(ఇతనికొడుకు ఉపమన్యువు వాఁడు కోరినపు డెల్ల ఆహారము లభించుటకై శివుడు దధి క్షీరాంబుధులు సృజించెను శివపురాణము)

పులియాట వి (పులి[1]+ఆట) బాలక్రీడావిశే షము ఒక యాట

సీ చీకటిమొటికాయ చింతాకుచుణుదులు పులి యాటలునుఁ జిట్లబొట్లకాయ
హంస 3 ౧౪౬ ప్రబంధ ౧ ౬౧౩

పులియు[1] అ క్రి (√పులి[2]) పుల్లనగు

(వ్యవ) కరవాణి మిక్కిలి పులిసినది

పులియు[2]. అ క్రి ౧ క్రొవ్వు, మదించు

రగడ తరు కొనఁగఁ బల్లవవితానముల నూన ములఁ, బులియుఁ దికమధుపములు బోన ముఁ చానముల రాఘవ ౨ ౬

౨ మురియు, గర్వించు

వ సత్యభామ సామాయంబుగా వాసుదేవున కిట్లనియె

క కలిగె నొకజాంబవతి కన్నులవడఁ బడె డేఁ వలపు నీతల కేగెఁ,బులియకుకే సవ తులు గల,బాలతులచే పాటువడక పో రా దనియెక
ఉ హరి 3 ౧౧౫

సీ మాటిమాటికిని నుమాళించి పాడుచుఁ బులి యుచుఁ దనఁ దానె పొగడికొనుచు
విప్ర ౫ ౨౬

3 బిగియు, బింకముతోనుండు

క పేసాలఁ బోకు రమ్మా, పూసజ్జెఁ బ్రొద్దు వోదుఁ బులియుట చాలుక
హర ౪ ౧౩౪

పులిదోగిరము=పులిదోర వి (పులి+ఓగి రము)

వ సాంగలి పులిదోగిర ప్రబంధ ౧౧౨

వ సాంగలి పులిదోగిరంబు దధ్యోదనంబు
హంస ౧ ౧౦౫

పులియో(హో)ర పులికూడు (క పులి యోర హోర) వి (పులి[2]+ఓరము) పులుసుకలిపిన అన్నము (శ ర) పులుసు, ఉప్పు, కారము, పసుపు మొ॥ వానితో రుచి కరముగాచేసిన అన్నము

వ్యవ ఆ సమారాధనకు బూరెలు పులిహోర చేసినారు

పులిరికము సం వి అ పుం పాము (గిల్యమ్ము)

పులివరుగు వి (√పులి[2]) పులియఁబెట్టిన వరుగు

వ పడిదెములుఁ బులుపలుఁ, బులివరుగులు, వప్పు దంబులు, బప్పులు కాశీ ౪ ౧౯౫

పులివోవు (పులి² + పోవు) అ క్రి పులిసిపోవు, పాడగు

ద్వి పాదలసెయ్యడఁ బులివోవనిప్రాణ,పద
మగునోగిరం బొదవ నర్పించి
పండితా దీక్షా ౭౭

పులిసరి వి (క పులిస్త్రీ) పులుఁగుడు,వాకఘ్నికి

సీ పులుఁగు డనంగను బలిసరి యనఁగిను బాల
కనిఎంజ్ఞ పరగుచుండు ఆం భా ౨ ౭౭
(ఇందలి బాలకనిపద మింకను విచార్యము)

పులు¹ వి లోహరత్నాదుల మాలిన్యము, మాలిన్యము (ఈ యర్థమున కడుగుధాతువుతోఁ గూడియే తఱచుగాఁ బ్రయోగము లందుఁ గాన వచ్చుచున్నది పాల్లుపర మగునపుడు కొన్నిరొండల ఉత్వలోపము)

క పదనికిరాఁ బులుఁగడిగిన,మదనాస్త్రము రేఖ
గలిగి మానినిమొయి చెన్నొందవఁ గయిసేసి
రప్పుడు,ముదితాజనములు ప్రమోదమున లలి
తముగన్ భార విరా ౫ ౩౫౫

ద్వి శ్రీనింకఁ బటిక నార్చినకుందనంపుఁ,గమ్మలో
మతీఁ బులుఁగడిగినముత్తి,యమ్ములో నెఱ
తావి నలరుగందంపుఁ,గొమ్మలో యన
రం రా బాల ౭౫ పా ౧౧ పం

సీ పెనఁవి రోగులఁ దగ బ్రేయఁ బుల్గడిగించి
నిలిపిన గందగొడ్డలి యనంగ
పి కకుం ౩ ౧౭౨

క పడుకుకలలితాంగయష్టి పదనికిరాఁబుల్,
గడిగిన మరుఖడ్గలతిక,వదువున పొడావన
విలాస వైభవ మొందెన్ నిర్వ ౮ ౬౦

సీ చంద్రబింబముఁ బాలసంద్రంబులోఁ ద్రోచి
కిందల్లఁ బోఁ బులుకడుగ కున్న
విక్ర ౧ ౧౭౨

జ పులుఁగాఱ

పులు²=పుల్లు వి (క పులు, పుల్లు) గడ్డి, కసవు

సీ పులు మేయుకమకంబు దొలఁగుట కాక
విహ్వలబుద్ధిరై దాఁటె హరిణకులము
పాండు ౪ ౭౯౨

క పెలయాలివలనఁ గూరిమి,గలుగదు మతి
కలిగ కని కడకేరదురా,పలువుర నడిచెడు
తెరువునఁ, బులు మొలవదు మొలచె నేనిఁ
బొదలదు వేమా వేమ ౨ ౧౦౨

మ మత్తవేదండకుం,భరసైకాశనకాంక్షి యైన
మృగభూపాలుండు పుల్ మేయునే
మల్లభూ నీతి ౨౧

విణ అల్పము, నీచము (చూ పులుమానిసి)

పులుదిండిచట్టు=ఇంద్రనీలశిల (ఇంద్రనీలము గడ్డితినునని ప్రసిద్ధి)

వ అవ్వరంబునట్టనడుమ నిట్టలంపుఁబులుదిండి
చట్టులన్ గట్టినయభ్యంతరవప్రగోపురద్వా
రంబునన్ ఉరా ౮ ౭౯౪

పులుదిండిచలుప=ఇంద్రనీలశిల

సీ చెలికురుల్ పులుదిండిచలుప కా మామక
స్వాంతతృణగ్రాహులయ్యెఁగాన
చంద్రా ౪ ౧౦౨

పులుదిండిమానికము=ఇంద్ర నీలమణి

సీ పులుదిండిమానికంబులవన్నె గలయిఁకె
లాకవంకఁ జేఁ కట్ల నునుకు కొలుప
కపతీ ౧ ౯౧

పులుదిండికా(యి) వి (పులు² + తిండి + కాయి) తృణగ్రాహి, ఇంద్రనీలమణి

సీ పులుదిండికామొత్తములతోవ లమరించి స్ఫ
టికసోపానముల్ సంఘటించి
ఉ రా ౨ ౭౯౨

జ పులిచెలిక, పులితోడుగు, పులుకాసి, పులుకాసిపురువు, పులుకాసిపులుఁగు, పులు

గుడిశె, పులుదారి, పులుదాలినోరిము౧, పులు పంట, పులుమానిసి, పులు్రమాగ, ౖలువడు, పుల్గ ౖహూము

**పులుఁగు(ల్గు)** వి ౧ పక్షి, పిట్ట

ఆ పులుఁగుఁ బ్రాటఁ బట్టి యలయించి యాడెడు, బాలునట్లపోశె బాణసురుఁడు, గడఁగి కృష్ణునమజాఁ గారించుచున్న వాఁడు
భార ద్రో ౩ ౨౪౩

౪ తొట్టినబ్రొవ్వులు గలయలి, చెట్టడిచినచేటెఁ డేమి చెప్పన్ బులుఁగుల్
మనుచ ౪ ౨౪

౬ ఆదిమ మైన యండమునయం దుదయించెను గూబపుల్గు
కాశీ ౬ ౧౪

౨ ఒకజాతి పక్షి (దీనికూఁత అరిష్టసూచనము, ముఖము భీకరము,)

వ్యవ పులుఁగువలె ముంగముపెట్టుకొని యెట్లు కూర్చున్నాఁడో చూడుము

జ పులుఁగుపిట్ట, పులుఁగు బొల్లఁడు, పులుఁగు ముక్కు నొక్కు, పులుఁగురాడాలు, పులుఁగు రాపచ్చ, పులుఁగు రాబొల్లఁడు, పులుఁగు రాయఁడు, పులుఁగులనాఁడు, పులుఁగు టాయి, పులుఁగుఁ కోఁడు, పులుఁగుసాహేబు, పులుఁగు హుమాయికోడు, పులుఁగరి, పులు రాతూవు

**పులుఁగుపిట్ట** వి (పులుఁగు+పిట్ట) గుడగూబ, ఘూకము (శ గ్రా)

**పులుఁగుబొల్లఁడు** వి (పులుఁగు+బొల్లఁడు) గరుత్మంతుఁడు, గరుడుఁడు (శ ర)
(ఇట్లే పులుఁగు(ల్గు) రాబొల్లఁడు, పులుగు హుమాయి)

**పులుఁగు ముక్కు నొక్కు** వి (√పులుఁగు) పల్లకి బొంగునందలి దోష విశేషము

వ పాల్కిడి పులుఁగుముక్కునొక్కు ప్రవిప్ర చీమదిండి మొదలుగాఁ గలదుర్గుణంబులు లేక
ప్రబంధ ౧ ౬౦౫

**పులుఁగురాబొల్లడు** వి (పులుఁగు+రాచ+బొల్లఁడు) గరుత్మంతుఁడు, పక్షిరాజు

ఈ నల్లనిమేను నిల్వుతిరునామము పచ్చనిపట్టు శాఖిపైఁ దెల్లని తమ్మియుం గలుగుదేవుఁడు కుంకుమవన్నెపులురా, బొల్లని నెక్కినల్పుఁ దెలుపుం గలపువ్వులదండఁ దెచ్చి యు, త్పల్లని జాంజలిం జగుడుఁబోఁడి కొసంగె వెంగ కృపామతిన్
వైజ ౧ ౬౯

**పులుఁగురాడాలు** వి (పులుఁగు+రాచ+డాలు) గరుడధ్వజము
దశా ౨ ౨౫౪

**పులుఁగురాపచ్చ** వి (పులుఁగు+రాచ+పచ్చ) గరుడపచ్చ, గారుత్మతము
అచ్చరా అయో ౪

(పులుఁగురాబొల్లఁడు=గరుడవాహనము)

**పులుఁగు(ల్గు)రాయఁడు** వి (పులుఁగు+రాయఁడు) పక్షిరాజు, గరుత్మంతుఁడు

లయగ్రాహి పులుఁగురాయనికి జోడగుజటా యువు
చం రా ౫ ౪౨

ఆ అపుడు పుల్గురాయఁ డర్మిలిఁ బుదమికి, డిగ్గి కేలుకోని డెంద మలరఁ, జేసి
అచ్చ రా యు ౧౬౪

**పులుఁగులనాఁడు** (√పులుఁగు) వి దేశ విశేషము

౪ తెలనాఁడు వేఁగినాడును, బులుఁగులనాఁ డ్వాకనాఁడు పొత్తపినాఁడుకా, అలములికి నాఁడు రేనాఁ, డలయక గనుఁగొంటి నచటి యబలలఁ గంటిన్
హంస ౧ ౫౩

పులుఁగుటాయి. వి (పులుఁగు+టాయి) గారుత్మతము, పచ్చ
తే ప్రోలి పల్గోటకొమ్మలఁ బులుఁగుటాలు, గరిక యనిడాసి నీలా ౧ ౩౭

పులుఁగు(ల్గు)ఱేఁడు. వి (పులుఁగు(ల్గు)+ ఱేఁడు) పక్షిరాజు, గరుత్మంతుఁడు
సీ ఎగసిన బలధూళి యొదుగుగా రాకుండఁ బులుఁగుఱేఁ డెఱకలఁ బోవఁ జదియ. కవు ౫ ౧౫౯

పులుఁగుసాహేబు వి (√పులుఁగు) పక్షిరాజు, గరుత్మంతుఁడు
వ పులుఁగు సాహేబు బాబారాయఁడ ప్రబంధ ౧ ౭౧౬

పులుఁగువాహమాయిజోదు. వి (√పులుఁగు —పక్షి గుఱ్ఱముగాఁగలయోధు) విష్ణువు
అచ్చరా బాల ౪

పులుకాసి[1] వి క్షుద్రజల జంతువిశేషము
సీ. పులుకాసి నసిమిరి బుంగ పురువు హంస ౪ ౧౯౬ త్రొ త్తప్రతి పా

పులుకా(గా)సి[2]. విణ (పులు[2]+కాసి)—తృణమువంటిగి—అల్పము, నీచము (చూ పులుకాసి పురువు)

పులుకా(గా)సి పురువు(గు)పుల్గాసి పురువు. (పులుకాసి[2]+పురువు) వి ఆకుపచ్చని చిన్న పురుగు (పచ్చ తెక్కల పురుగు శ ర)
ద్వి రాజులు వాటించు రాణివాసముల,నోజతో నూడిగం బొనరింపఁ దమకు, వరపులఁ గాఁ జేసి వరుస వర్తింపఁ, బురిలోనఁ బులుకాసి పురువులతరమె
ద్వి. హరిశ్చ. ఉ ౧౪౩ పా ౪౫౪ ౩.౦. పం.

తే మన్న పురుషునిఁ జెడనాడు మనుజవిభుఁడఁ, బోయి పులుఁగాసి పురు వయి పుట్టు ననుచు. శుక. 3. ౧౬౮.

(ఇట పులుకాసి పురువులవంటివారు, అల్పులు, అని తాత్పర్యము)

సీ చండాంశురథముతో జగతిపైఁ ద్రెళ్లంగ గన్నెఱ్ఱనేసిన గర్వరేఖ,

గీ గల మహామహులకు వీరుఁ గణనసేయఁ, గ్రవ్యభుక్కు లనంగఁ బుల్గాసిపురువులు... వి. శకుం. 3. ౭౩౦

పులుకాసి పులుఁగు. వి (పులుకాసి[2]+పులుఁగు) నీచమైనపక్షి.
తే ఇన్ని దేవళ్లఁ గొలిచి నే నేమి గంటిఁ, బోయి పచ్చని పులుకాసి పులుఁగుచేత, మోసపోయితి శుక ౩ ౪౯

(ఇట పచ్చనిపులుకాసిపులుఁగు=పచ్చరంగుగల నీచపక్షి, చిలుక, అని తాత్పర్యము

పులుకు(ల్కు) వి కను తెప్పలు తెఱచుటయందగు ననుకరణము.
—ద్వి కట్టెఁడిపేరి కెక్కుడిబిడ్డఁ దమ్మ, పుట్టియున్నా ళ్లోయిఁ బులుకునఁ గన్ను, దెఱవక చను ద్రావఁ దివురనిబిడ్డ... ద్వి పరమ ౩ ౧౫౪ పా.

జ పులుకుపులుకు

పులుకు(ల్కు)పులుకుల్కు. వి (పులుకు+పులుకు) భయదుఃఖాద్యమాసారూయాదులచే తెప్ప లప్పళించుచు తెఱచుచు చూచుటయందగు ననుకరణము.
(భయమునకు.) క అని కెలని పులుకుపులుకునఁ దనుఁ జూడం జూడఁ బట్టి కన్నెం గొట్టెకా. కేం. పంచ. ౪. ౪౭౫.

(దుఃఖమునకు) ద్వి. పులుకుపులుక్కునఁ జూచి భూపాలసుతుఁడు, కొలుకులఁ గన్నీళ్లు గ్రుక్కుచుఁ బలికెఁ.

ద్వి. క. పా. ౧. ౩౦. పా. ౫ పం

తే పులుకుపులుకునఁ జూచి యక్కలికి తోడఁ, బలుకుపలుకున దైన్యంబు దొలఁకఁ బలికె.

పారంగ ౨ ౧౦౦

(అవమానమునకు) చ అనటయు మాట లేక హృదయాబ్జము జల్లన మోము వెల్లనై, కనలుచు నీరు జేఱుతెలికన్నుల నాతినిఁ బుల్కుపుల్కునం, గనగొని.

మనుచ ౨ ౬౬

(అనూయకు) సీ భోగించువారలఁ బుల్కుపుల్కునఁ జూచి మెల్లన గ్రుక్కిళ్లు మ్రింగువారు.

నైష ౩ ౫౩

శ్లో. భుంజానజనసాకూతపశ్యాయస్యాపుజీవినః

సం నైష ౧౪ ౭౫

పులుగ(ల్ల)రి. విణ (పులుగు + అరి ౩ త పులనరివాళ్) జూద తెలుపువాఁడు, ఆమాకి యిచ్చువాఁడు.

క...మాసా మృఖలం,బును వచ్చునేని నీచె, ప్పిన పులుగరి వెచ్చ మెల్లఁ బెట్టెద మనినన్ క

పరమ ౫. ౫౯

సీ ముగురు నల్గురు పాత్రులుగ నీక్రమంబున నిపుడు మా కొకపత్తి మిమ్ము వేగ,యేము నీపురమున కేఁగి తెచ్చెదము పుల్గరిధనం బనిరి...

పరమ ౫ ౭౧

పులుగాకు. వి. (పులు + కాకు త పుళుక్కుమ్) దుండగము, దుష్టచేష్ట

ద్వి. బలిమిమై శార్చి నీబలములు పేర్చి, పులుగాకులై బహుళంగుల నిట్లు, పులుగాకు లావరింపఁ బోలదే మాన్ప.

ద్వి. మారిచ్చ. పూ. ౧౭౧౭. పం

ద్వి. పిలిచి యేకతమునఁ జెప్పెద నంచు కోటఁ బలికిమాపఁగ రానిపలుకులు పలుకఁ, బలు గాకు లేల పోపొ మ్మన్న మమ్ము, బలు గాకు లాడు నీపలుగాకువాఁడు.

అ మ క. ౧ ౩౫. పా ౫. పం.

పులుగు(ల్లు). వి. ౧ గుఱుతు, చిహ్నము.

గీ కలఁక మామీఁది పనికేనికఁదరు దెలుప, బోలఁతి రేలు నీయుక్కియే పులుగు గాదె

ఆము ౫. ౭౦

గీ గునియజార్నిగ చెక్కిట గోరు మోవి,కెంపు లత్తుక సుదుర గంధంపు చిటులు, వాడపస పంటువలువతో వచ్చినట్టి, పుత్ర యిది కానినదతకుఁబులుగుగాదె ప్రబంధ ౭౫౩

౨. జూద, ఆమాకి

సీ కద లేనిక్షేమంబు గప్పెద మంటిమా పుల కాంకురంబులు పులుగు చెప్ప.

వరాహ ౪. ౧౮.

వ ..చిక్కెం జిక్కు నిక్కడ నిక్కడ నక్కయక్క యని చేటికానికరంబు పాలసిన పులుగెత్తింగి

పాండు. ౪. ౨౩౭.

పులుగుడిసె. వి (పులు² + గుడిసె) పక్షుల వేటాడువాఁడు తాను మఱుఁగున నుండుటకై గడ్డితో నిర్మించుకొను చిన్నగుడిసె, కసవు గప్పినగొడిసె.

క పులుగుడిసెఁ బన్ని వల కాద్యలధరణిం బాదుపఱిచి ప్రస్సినకన్నుల్, గలపులు గు దీమ మిడి యుగ్గలపుందమిఁ గాచియుం దఁగా దైవగతిఁ. కేం. పంచ ౨ ౧౦.

పులుగుడు. వి. పులిసరి. వాతఘ్ని క్రీ. (ఇది నల్లపులుగుడు, తెల్లపులుగుడు అని ద్వివిధము అని. క. ర. చూ పులిసరి.)

ద్వి పద్దెపాల కొడికెల మాకెడు పెలఁగ, బొద్ది
* పాపర జెమ్మి పులుఁగు మేడి
ద్వి ౪ పా ౨౪౯ పా ౧౧ పం

పులుదాలి వి (పులు²+దాలి) గడ్డికుమ్మ (చూ పులుదాలినోరిముని)

పులుదాలినోరిముని మి వి (పులుదాలి+నోరు+ముని) గడ్డికుమ్మవంటి నోరుగలఋషి, తీక్ష్ణమైన నోరుగలఋషి

ఉ బ్రాహ్మణమాత్రుఁడె యత్రినందనుం, డాపులుదాలినోరిముని కడ్డము వారయ లేదు వానికిం, గోపమెకాని శాంతియును గూర్మియు లే దెటువంటివారిలోన్
వి పు ౧ ౧౬౫

(దుడుకునోటిఋషి అని భావము)

పులుప=ఉలుప² వి (√పులి²) ఎలుచగా మారిన పుల్లని యూరఁబిండి, విరళామ్లకలితపిష్టము

తే ఊరుఁబిండి దన లవణభావిత పిష్టమొప్పఁ, బులుప యను పేర విరళామ్లకలితమ్ము, యొనరు
ఆం భా ౨ ౭౫౧

వ చిఱుగడములుఁ బడిదెములుఁ, బులుపలుఁ బులివరుగులు నప్పడంబులు
కాశీ ౧౯౫

పులుపంట వి (పులు²+పంట) తృణధాన్యపుఁ బైరు (వరి, గోధుమలు, మున్నగు సస్యము)

సీ తపశ్శ్రీ వెలుంగ, నున్నెడఁ బులుపంట లన్నియు నత్యంతవికలంబుగా ననావృష్టి దోప,
గీ మాననల్లిన
భార అశ్వ ౪ ౨౭౦

పులుమానిసి విణ (పులు²+మానిసి) అల్పమనుష్యుఁడు, (ప్రాభవముచెడి) కొంచెపడిన జనుఁడు

సీ మునీంద్ర యేము, గలుగంగ దన లేని పులుమానిసికిఁబోలె నక్కఱువృద్ధున కట్టిచావు, పాటిల్లె
భార అశ్ర ౨ ౧౬౧

క పురమున కేతెంచె నతఁడు పులుమానిసి యై
దశకు ౪ ౧౯

పులుము స క్రి ౧ రుద్దు

తే కమ్మనూనెఁ దల యంటి చెలులు గందానఁ బులుమ
ఆము ౬ ౧౭౬

క పన్నగజాతీరసనం, పన్నంబుగఁ దలలు పులిమి మందోష్ణం బౌ, పన్నీట జలకమార్చిరి, కన్నియకున రామకునకుఁ గామిను లంతన్
బ్రహ్మో ౩ ౧౫౧

౨ రాచు పూయు

తే శేలఁ గలవంటకపుఁదాలికిని పులిమిన, ఘుసృణములు మించ
ఆము ౫ ౧౪౩

ద్వి జలజారిగ్రుడు కప్పుచాయఁ గెంగేలఁ, బులుము కాటుక పెంగంబున దిట్టపడఁగ
అ మ ౪ ౧ ౨౫ పా ౧౫ పం

౩ నలుపు, నలుచు

(వ్యవ) వాఁడు కన్నులు పులుముకొని లేచినాడు (గ్రా)

చూ పులిమిపుచ్చు

౪ కొట్టు

(వ్యవ) వానిని బాగుగా పులిమి పంపినారు (శ ర గ్రా)

౫ అంటఁగట్టు, పైఁబడఁజేయు

(వ్యా) అన్న తాను చేసిన అప్పంతయు తమ్మునిపై త్తిని పులిమినాఁడు

౬ వంచించు (చూ పులిమిపుచ్చు)

వి కష్టము, దోగవిశేషము

సీ కష్ట, ములు మనఁ గష్టనఁ బులు మన విలసిల్లు
ఆం భా ౨ ౧౭౮

జ పులిమిపుచ్చు, పులుముకొను, పులుముడు

**పులుముకొను.** స క్రి (√పులుము) నలిపివైచు, మర్దించు.

తే. తిరుగు భిక్షాశనులమీఁద దృష్టి యిడని, యదయురాలగు కలిమితో యెలిగృహంబు, లలజడికిఁ దార్చుకైవడిఁ బులుముకొనిరొ, వనజవిసరంబు హేమంతవాసరంబు

చం రా. ౫ ౭౭

**పులుముడు.** (√. పులుము) వి రుద్దుడు, మార్జనము

సీ. తోముడు ప్రాముడు తుడుపు రుద్దుడు పులుము దన మార్జనసంజ్ఞ బొలుచుచుండు,

ఆం భా ౨ ౧౬౦.

**పులుమ్రాను.** వి (పులు² + మ్రాను) తృణద్రుమము

(తాడు, కొబ్బెర, పోక, ఖర్జూరము, ఈఁత మొం జాతిచెట్లు)

ఉ...తాడు మున్నగుతరుల్ పులుమ్రాఁకు లనంగఁ బోలు ఆం భా. ౨ ౭౯.

**పులువడు.** అ. క్రి (పులు² + పడు) గడ్డివలెనగు, వలఁగు

క. పిటిఁదికిఁ బోనిచ్చినవి, ల్లతితికివై యల్లఁ జాఁప నది గనఁగొని వెల్లుటికి చను లతలు పలువడఁ, జెలుముం గడు నాస పుట్ట శృంగాగ్రములక్.

భా రా అర. ౨. ౮౯

**పులుసు¹**(లుప్పు)వి. (√పులియు) ౧ ఆమ్లము, షడ్రసములలోనొకటి

చ జలధర మువ్పతోఁ బులు సొసంగు రసం బని యప్పరోధి నిం, బొలయఁగఁ గ్రోలిపై దధిపయోధియఁ గ్రోలఁగఁ బ్రాఁచి దాటఁ బెప్పులుఁగరుల్లు గాయ నవివో జడగం డ్లన రాశిఁ గావిచో, నిలఁబడ వానిఁ దిన్నయపుడే చలిపండ్లు పడంగ జేటికిన్

అము. ౪ ౧౧౬.

ఆ. పాలలోనఁ బులును లీలతోఁ గలసిన, విరిసి తునక లగును విరివిగాను

వేమన ౧ ౧౬౦

సీ నెత్తిఁ దంగేడాకు మెత్తి రేచకి నిమ్మపంటి పులుసున నూతి పట్టువెట్టి

కాశి 3 ౧౧౦

౨ చింతపండు, ఒకటి రెండు మూఁడు కాయ దినుసులు, మున్నగువానితోఁ జేయువ్యంజన విశేషము, దప్పళము

గీ పప్పులో నుప్పు మిక్కిలి పాఱఁజల్లి, కూరలో నాముదపుపుచ్చు నింత నించి, పులుసులో గంజి మిక్కిలిఁ గలయఁ బోసి, భక్ష్యముల లోన మిరియంపుఁబొడి గలిపి

చంద్ర వి. ౧ ౬౫

3 ఉద్ధతి, గర్వము.

క. వనిత గజనిమ్మపండ్లను, ఘనముగ నో రూరఁ జెప్పఁగా విందుము నీ చనుగుబ్బల లావణ్యము, వినినప్పుడె వానిపులుసు విరుగుం జుమ్మీ

సారంగ ౨. ౨౨౧.

(ఆమ్లగవము అని రెండవయర్థము)

**పులుసు².** వి వృక్షవిశేషము ?

సీ. భూతాంకుశ మశోకభూర్జ పత్త్రమ్ములు బోళము మంకెనపులుసు గంగరేను .

హంస. ౪ ౧౧

**పులుసుఁగూర.** వి (√పులుసు¹) పులుసు పెట్టి వండినకూర (క ర)

**పులోమ.** సం వి. ఆ. స్త్రీ. భృగుభార్య, చ్యవనునితల్లి

**పులోమజ.** సం వి అ స్త్రీ శచీదేవి, ఇంద్రుని భార్య

పులోమజిత్తు. సం. వి. త్. పుం. ఇంద్రుఁడు.

పులోముఁడు. సం. వి. స్ పుం. ఒకదైత్యుఁడు, (ఇంద్రుని శ్వశురుఁడు.)

పుల్కసుఁడు. సం. వి. అ. పుం. ౧. బ్రాహ్మణు వలన క్షత్రియస్త్రీయందుఁ బుట్టిన సంకీర్ణజాతి వాఁడు ౨ మాలవాఁడు.

పుల్గు(లుఁగు)రాతూపు. వి. (పుల్గు + రాచ + తూపు) గారుడాస్త్రము.
అచ్చ. రా. యు. 3౪3.

పుల్గృహము. వి (పులు² + గృహము) గడ్డితో చేసినయిల్లు, పూరియిల్లు.

చ ..పొగలఁగా విరిఁ బ్రుంగెడు పుల్గృహంబు లె,ల్లెడఁ గనుపట్టె... ఆము. ४. ౧౨౭.

పుల్ల¹. (శ పులిత్త). విణ పుల్లనిది, పులుసు గలది, ఆమ్లము.

తే. మిసిమి గల పుల్లపెరుఁగుతో మిళిత మైన, యావపచ్చళ్లు చవిచూచి రాదరమున.
శైవ. ౨. 30.

(వృత్తియందు వికల్పముగా నిగాగమము) ఉదా పుల్లనిమజ్జిగ తెం.

జ. పులుఁదీఁగ, పుల్లఁగంద, పుల్లఁ గూర, పుల్ల దానిమ్మ, పుల్లనీళ్లు, పుల్లప్రబ్బ, పుల్లబచ్చలి, పుల్లమామిడి, పుల్లయుసిరిక, పుల్లవెలఁగ, పుల్లాకు.

పుల్ల²=పుల. విణ పసుపు మించిన తెలుపువన్నె కలది. (శ ర. కపిలవర్ణముకలది. అని బ్రౌ. చూ. పుల్లావు.)

జః పుల్లకందము, పుల్లగిత్త, పుల్లగోరక, పుల్ల ప్రత్తి, పుల్లకావిలి, పుల్ల పిల్లి, పుల్లావు.

పుల్ల³. వి ౧. సన్నని పుడుక.

తే ..పుల్ల, పుడుక యనఁగను దృణకాండము చను... ఆం. భా. ౨. ४౭.

(వ్యవ) పూచికపుల్ల, పలుదోముపుల్ల. తెం.

౨. చిదుగు, సమిధ.

చ. అనవుడు సుల్ల కొంకయుఁ బ్రియంబు వహింపఁగఁ బక్షివైరి పీ,ఱున సకలాంగ కంబులఁ బ్రకున్నము అయ్యెడు దీనిఁ శాపకేఁయనిన విహంగమంబు రయమారఁగ నచ్చటిపుల్ల లెల్ల ముక్కునఁ గొని తెచ్చి ప్రోవిడి యతుంరిక మైవదయాగుణంబునన్.
భార. శాం. 3. 3౭౧.

3 వంటకట్టె, ఇంధనము.

(వ్యవ) పొయిలోనికి పుల్లలు లేవు

పుల్లవిఱుచు=మంత్రముల నుచ్చరించుచు పుల్లను విఱుచు

(పిల్లలు జడిసికొన్నప్పుడు పీడాపరిహారార్థము మంత్రముచ్చరించుచు పుల్లవిఱిచి పాఱ వేయుట ఆచారము)

సీ. పెనుఁజీకటులు గ్రమ్మ పెన్ బైట వసియించి వెఱచెఁ గా యని పుల్ల విఱిచి విఱిచి.
పాండు. 3. ౧౯౭.

పా పువ్వు అమ్మినయూరనే పుల్ల అమ్మ వలసి వచ్చినది.

(ఎక్కువగౌరవము పొందినచోటనే మిక్కిలి హైన్యమును పొందె ననుట.)

పుల్లవిఱుపుమాటలు=విరసవాక్యములు, తెగుసు మాటలు.

(వ్యవ) నీపుల్లవిఱుపుమాటలతో వానిమనసు విఱిగిపోయినది.

జః పుల్లతి, పుల్లవడు, పుల్లవిఱుగు, పుల్లవిఱుచు.

పుల్లంటురాయి. వి. (పుల్లు + అంటురాయి) ఇంద్ర నీలమణి

పుల్లఁదీఁగ. వి. (పుల్ల¹ + తీఁగ). సోమలత, (దీని రసమును యజ్ఞములందు యజ్వాదులు పానము చేయుదురు)

సీ కమరాని చాయంబు గైకొన్న దివి యంచుఁ
బుల్లఁదీఁగలఁ జూచి యలఁత నొంది
పాండు ౫ ౨౯౨

పుల్లకండము=పులకండము వి (పుల్ల$^{2}$+కండము) ౧ కండచక్కెర, ఎటికబెల్లము
ద్వి పుంగపుముద్దలు పుల్లకండములు, పలుకజ్జ
ములు చానబా లిడ్డెనలును
ద్వి భాగ ౧ ౬ పా

౨ భక్ష్యవిశేషము
ద్వి కండచక్కెరయును గరిజలు పుల్లకండంబు
లటుకులుఁ గడవల నిండియుండఁగ
ద్వి భాగ ౧ ౧౪ పా

పుల్లకంద వి (పుల$^{1}$+కంద) ఒకజాతి కందకూ (శ ర త్రా)

పుల్లగిలు(ల్లు)=పుల్లసిల్లు అ క్రి ($\sqrt{}$పుల్ల$^{2}$) (భయాదులచే) వివర్ణమగు, భయపడు
సీ జనులు గాంచిగ మానుషము దూలఁ దన
కనుపుయిలోటమున మోము పుల్లగిలఁగ
భార విరా ౨ ౬౦

క తనచేత నృపతిసుతుఁ డెటేఁగినఁ బైవచ్చు
నని పుల్లగిలి పోఁ జూచుచు, వనసత్వము
లత్యుగ్రంబున మెదలఁగఁ జూచి పాపి
పోవను వెఱచుచు భోజరా ౫ ౮౬

పుల్లగూర వి (పుల్ల$^{1}$+కూర) పులుసు పెట్టి వండినకూర (శ ర)

పుల్లగోరక వి ($\sqrt{}$పుల్ల$^{2}$) నీరుకోడి, సలిల కుక్కుటము
తె సలిలకుక్కుటనామంబు వెలయు నీరుకోడి
యనఁ బుల్లగోర కన గుండలి యన
ఆం భా ౨ ౯౨

పుల్లతి వి. ($\sqrt{}$పుల్ల$^{3}$) ౧ మల్లసాధన మగువొక విధమైన దుడ్డు (త్రా) పాదవకాంద్రుం గుతికై చాచెదుకోవ (శ ర)

ఆ కేలఁ బుల్లతియును నీలిమాలును బూని, కేలి
గతిఁ గటారికోల వట్టి, సంగడీలు గొల్వఁ
జనుదెంచె గోకమత్త, గజముభంగి కలహాకంట
కుండు ద్వా ౩ ౩౫

౨ కెట్లు పోరునప్పుడు బరి గీచి యేర్పఱచు
కొన్నహద్దు (త్రా)
సీ పుల్లతిఁ బెట్టినభూమికిఁ గొనరిన చెదిరిపోటు
నకుఁ జే యొదుగుచున్న ద్వా ౩ ౬౦

పుల్లదానిమ్మ వి (పుల్ల$^{1}$) పుల్లనిరసము గల ఒక జాతి దానిమ్మ, ఆమ్లదాడిమము కూ (శ ర)

పుల్లన వి పులుసు
తె కుప్ప పైనట్టిచక్కెరలప్ప లీడ, చేఁదువగ
గలయమృతంపుఁజెలమ యొనరె, పుల్ల నుం
డెడి తేనెకరుల్లు నరియొ, వనిత కదుఁదియ్య
నానీదువాతెఱకును సారంగ ౨ ౨౦౫
(పుల్లయుం దుండెడి అని యర్థాంతరము)
—విణ పులుసు గలది (శ ర)

పుల్లనీళ్లు వి బ ($\sqrt{}$పుల్ల$^{1}$) పులిసిన కూటినీరు, తరవాణి (చి ని త్రా) కూటినీళ్లు, ఆర నాళము (శ ర)

పుల్లప్రత్తి వి (పుల్ల$^{2}$+ప్రత్తి) ఒకదిమను ప్రత్తి (శ ర)

పుల్లప్రబ్బ వి (పుల్ల$^{1}$+ప్రబ్బ) అమ్లవేతసము, చుక్కకూర
సీ అమ్లవేతససంజ్ఞ యగును జుక్క, పుల్లప్రబ్బ
యనంగి ఆం భా ౨ ౬౭

పుల్లబచ్చలి. వి (పుల్ల$^{1}$+బచ్చలి) అమ్లకలంబి
తే పొసఁగు నామ్లకలంబ్యాఖ్య పుల్లబచ్చలి
యన ఆం భా ౨ ౬౨

పుల్లమామిడి వి (పుల్ల$^{1}$+మామిడి) కొండ మామిడి కానమ్రాకము కూ

ద్వి. పుల్లమామిళ్లు కర్పూరభూజములు,నల్లని
యరఁటులు నారికేళములు. ద్వి.నల ౧.౯౭.

పుల్లయుసిరిక. వి (పుల్ల¹+ఉసిరిక) కొండ
యుసిరిక †. (దీనికాయలు పెద్దవి. శ. ర.)

పుల్లరి. వి (క. పుల్వారి. పుల్లు+అరి) ౧. పశు
వులు కసవు మేయుటకై ఇచ్చెడుపన్ను, తృణ
భాగధేయము
సీ. పుల్లరి వాఁగ నొప్పను దృణభాగధేయంబు..
అం. భా ౨. ౧౯౨.
ద్వి. అరి యప్పనంబు పుల్లరి సేయి పాలు,పెరు
గులు దెప్పించి పిల్చి గోపకుల
అ. మ. క. ౨. ౧౭౭. పా ౭౧. పం.
౨. గడ్డి. (చూ పుల్లరిమాన్యము)

పుల్లరిమాన్యము. వి. (√పుల్లి) ధర్మార్థము
పశువులు కసవుమేయుటకై విడిచినబీడు; గడ్డి
బీడు...దేవరపసులకు పుల్లరిమాన్యమున్ను...
ఇట్టునిచెను. ౧౭౩౨. పె. శా. ౧. ౩౩౩.

పుల్లరుజా. వి (పుల్లి+అరుజా) మత్స్యవిశేషము
తే. కొరి పక్కెర దొండును గూరముక్క,
పుల్లరుజా గచ్చె గండెయు బొమ్మదాయ.
హంస. ౪ ౧౭౪.

పుల్లవడు. అ క్రి (పుల్ల³+పడు=పుల్లవలె నగు)
౧. (భయదుఃఖాశ్చర్యాదులచే) స్తంభించు,
బ్రమసుపడు.
క. తల్లియుఁ దండ్రియు వెఱఁగునఁ, బుల్లవడగ
వారికడకుఁ బోయి తడయఁగా, నొల్లక
పయనపువీడ్కో, లెల్లం దనయిచ్చ నడపి
యొత్తెలి వెడలెగ.
భార. ఉద్యో. ౪. ౧౭౨.
క. పుల్లవడి చలము కోపముఁ,బొల్లయు నై
చనఁగఁ గొంకప్రొద్దు మెంగమునగా, వెల్లఁ
దనము గదురు నిలిచి,యొల్లజనులు వినఁగ
మటియు నిట్లని పలికెగా
భార. అర. ౪. ౩౫౮.

ఆ. నిప్పు ద్రొక్కినట్లు నిలువఁ డెచ్చోటను,
వాఁడుమునుకుఁ గని మహాకతోడఁ, గూడఁ
బాతి తేటిఁకోనఁ జూచుఁ జూచి యుప్పొ
లఁతిగాక యున్నబుల్లవడును.
భోజరా. ౩ ౧౪౩.
౨ జంకు, సందేహించు
ద్వి. మలహరు నీగియు బిలబిల యగుచు, పుల్ల
వడఁగ నేల పుల్లాంబుజాత, పల్లవితాస్య...
పండితా. పురా. ౧౨౦.

పుల్లవావిలి. వి (పుల్ల¹+వావిలి) ఒకజాతి
వావిలి, శ్వేతసురస † (శ. ర)

పుల్లవిఱుగు. అ క్రి (పుల్ల³+విఱుగు) నిస్సార
మగుటచే పుల్లలుగా విఱిగిపోవు, నిస్సారమగు,
సత్వహీనమగు
(వ్యవ) ఈయేఁడు మాదబ్బచెట్టు పుల్లవిఱిగినది
క. వారలతోఁ బలుమారును, పోరాటం బాడి
యాడి పుల్లవిఱిగి యుస్సారము...
శేష. ౧. ౧౧౩.

పుల్లవెలఁగ. వి (పుల్ల¹+వెలఁగ) పుల్లని
కాయలు కాచు నొకజాతి వెలఁగ. అమ్ల
కపిత్థము †.
సీ వెలఁగపండులు పుల్లవెలఁగపండులు మోవి
పండ్లు నంకెనపండ్లు బలుసుపండ్లు.
కాళ. ౩. ౭౪.

పుల్ల(ల)సిల్లు.(లు)=పుల్లగిల్లు. అ క్రి.
(√పుల్ల²) ౧. (భయాదులచే) వివర్ణమగు,
భయపడు, చెదరు
సీ కమలారివామంబుఁ గైకొన్న విని యంచుఁ
బుల్లదీఁగలఁ జూచి పుల్లసిల్లి.
పాండు ౫. ౭౯౨.
మ అని భర్త్సించినఁ బుల్లసిల్లి విముఖుండై
పోరు నిత్యత్వప్రభా, ధ్వనిశాటాధముఁడు.
వరాహ. ౧౧. ౯౨.

ఉ కలఁగు, క్షోభపడు

ఉ ..మగవారిచిత్తముల్, పుల్లసిలంగఁ జేయఁ బౌరపౌష్పములాడఁగి నాఁడువారికే, కెల్లను వి ప్ర ౨ ౨౩౩

సీ అంత నిక్కడ మానినులాగ్రగణ్యుఁ, డావటూత్తముఁ డటు పోగ నంపి చనిన, దొలఁక మాటలు పడి పుల్లసిలినవాఁడు, గనకఁ గొంకుచుఁ దనయాత్మగతమునందు విప్ర ౪ ౧౩

౩ నొచ్చు, నొప్పిఁజెందు, బాధనొందు

వ అగ్రహించి మహీవల్లభుండు తదీయవిగ్రహంబు భల్లంబులం జెల్లుబోవ జేసినం బుల్లసిల్లుసమయంబున వరాహా ౫ ౩౧

క పందకుఁగాక పలాయన, కందళి పాపాలుని యందుఁ గలుగునె యని మి, న్నందినకోపంబున పై,చెం ద్రాప్రముఖుండు పుల్లసిల కిలవలంకన్ శేం పంచ ౪ ౧౯

౪ కుందు, దుఃఖించు

వ ఏతత్కార్యంబు సిద్ధించిన నయ్యాగ్యచరితుం డుల్లసిలం గాని పులసిలండు,చింత యుడిగి సంతసంబు నొందుము పి శకుం ౩ ౭౬

చ పులసిల జేల మానవులపుట్టువు పావనమయ్యె నెప్పుడుఁ, గళవళ మేల రోగముల కాలగతిన్ గడవట్టు నితిశా,ధలును దరిద్రతావ్యథలు దవ్వులకే చను వాంఛితార్థముల్, గలుగు నపేయుచేతఁ గమలాధవుచే పట పత్రికాయిచేత అప్ప ౪ ౩౧౪

పుల్లాకు వి (పుల్ల$^{1}$+ఆకు) ౧ పుల్లనియాకు

౨ (పుల్లె+ఆకు) తినిపాఱవేసిన రొంగిలి విస్తరాకు

క శాకోశిలములు విరసాలఁ, బీకాకుఎడంగఁ జేయఁ జెలియా యవి పుల్లాకులు పెంచిన కతమున,నో కడుఁ బుల్లాకుకేంతనో వివరింపవే చిత్రభా ౨ ౧౫౧

(పై రెండర్థములకు నిదియే యుదాహరణము)

పుల్లాయము వి (పుల్లు+ఆయము) గడ్డినుండి వచ్చు రాబడి, గడ్డిపన్ను సా శా ౩ ౧౦౫౧

పుల్లావు వి (పుల్ల$^{2}$+ఆవు) కపిలధేనువు, పసుపుమించిన కెలుపువన్నెగల యావు

శా ఆపెంజీకటి మోలఁ గాన కడిదం బంకించి శార్దూలమం, చాపుల్లావుశిరంబుఁ ద్రుంచి తెగిదో యంచున్ పులిన్ జెండియున్, వాపోవం దెగ వేసి భూవరుఁడు ద్రోవన్ ఖదరక్తంబుచేఁ,బైపై గీయుచుఁ జేరి చూచెఁ దల దివ్వెంబడ్డ యద్ధేనువున్ భాగ ౯ ౩౫

పుల్లి(లి)రుసు వి (పుల్లు+ఇరుసు) మోట గా యొక్కతొండపుత్రాడు జరుగుటకు ఆధారముగా నుండు ఇరుసు (కడుపు శ ర ప్రా)

పుల్లు=పులు$^{2}$ విణ అల్పము (చూ పుల్లిరుసు)

వి (త పుల్) కసవు, తృణము, గడ్డి

చ మలసి నిదాఘవేళలను మాపు వెలార్చిన తత్ర్పపాజలం,బుల పరిమళ్లలోఁ బొడము పుల్లు భుజించుచుటోర్ని కాచయం,బులు ఘటికా ౧ ౪౯

సీ గడ్డి గాదము గవతము కసవు కవను, పుల్లు పూరి యనంగఁ జెల్లును దృణసంజ్ఞ ఆం భా ౨ ౩౭

జ పుల్లంటురాయి, పుల్లరి, పుల్లరిమాన్యము, పుల్లరుజు, పుల్లాయము, పుల్లిరుసు, పుల్లుడి, పుల్లుంబుసపాము

పుల్లుడి వి (√పుల్లు) అప్పుడప్పుడుమాత్రమే సాగుబడి కుపయోగించునిస్సార మగునేల (శ ర ప్రా)

పుల్లుటుకుపాము (పుల్లు + ఊటుకు + పాము) గడ్డిమండి పై కుటుకుపాము, సర్పవిశేషము (శ ర బ్రౌ)

పుల్లెన వి (త పుల్లడి) ఒకజాతిచుంద పెంక్కి (శ ర బ్రౌ)

పుల్వము సం వి అ పుం ౧ దర్వీకరమను సర్పవిశేషము ౨ కృమి, పురుగు (శేని)

పువ్వాటు వి (పువ్వు+వాటు) పువ్వువలె ముందువెనుకలకు ఊగాడుట (శ ర బ్రౌ)

పువ్వాన వి (పువ్వు+వాన) పుష్పవర్షము.
ద్వి కొడుకుపై పువ్వానఁ గురిసిరి సురలు
నవ ౧ ౨౪ పా ౧ ౨౦

పువ్వారు వి (పువ్వు+వారు) ౧ ఈఁదు, తాడులో నగుచెట్లయొక్క పూఁత (శ ర) తాటిపూవులకు లేఁతతాటియాకులకును వరి మున్నగు సస్యముల వెన్నులకును పట్టుమెత్తని బూజువంటి పదార్థము, (పువ్వారము, వా) ౨ చేఁపల యూపిరితిత్తులయొక్క లోపలి భాగము (బ్రౌ)

పువ్వారు వి పువ్వు, (√పువ్వు)
సీ దక్షిణహస్తపద్మంబులఁ దాల్చెఁగలలితంపుఁ బువ్వారు గళలతోడ
ఎరవ ౩ ౧౩౦ ౩ ౨౧
("గళ" ఇది తమిళభాషలోని బహువచన ప్రత్యయమగు "గళ్"నకు వికృతాంధ్ర రూపము, పూలతో అని యర్థము
పువ్వారుగళ=తిరుమణిపెట్టె అని చి ని
పువ్వారుకళ=పూరెమ్మ అని కళక్రింద శ ర)

పువ్వారుఁదీఁగ. వి (పువ్వారు+తీఁగ) పుష్పలత
సీ పువ్వారుఁదీఁగకొమ్ములు కాలువలఁ ద్రొక్కి ప్రవహించు పన్నీరు పసరుచేసి
రామా ౬ ౨౦౧

పువ్వారుఁబోఁడి (తి) వి (పువ్వారు+పోఁడి) పువ్వువలె మనోహర యగువాఁడుది, ఆఁడుది
క పువ్వారుఁబోఁడికై సరి, యొవ్వా రన భీష్మకుఁ గాంచి యుంపొందితి నీ, వవ్వావి యెఱుఁగుదువె మా,యవ్వా బోషింపఁ బాడి యగు నను నీకున్
విజ వి ౧ ౫౦
క ఎవ్వరిదానవు నీ పే, రెవ్వతె యేమిటికి వచ్చి తిచ్చోటికిఁ, జెవ్వడి నీతోఁ గంతయుఁ, బువ్వారుంబోఁడి నాకుఁ బొంకక చెపుమా
రసి ౩ ౪౪
క పువ్వారుఁబోఁణి మదిలో, నివ్వెఱపడి చూచు చుండ
శుక ౧ ౨౨౪ అచ్చరా ఆర ౫౫

పువ్విలు(వ్వుల)కాఁడు వి (పువ్వు + విలు కాఁడు) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు
ఉ పువ్విలుకానితోడ నెరిపోరెడుచక్కనివాఁడు భూమిలో, నెవ్వఁడు చెప్పఁడాయనుచు
వైష ౧ ౪౫
వ ఇవ్విధంబునఁ బువ్వువిలుకాని నవ్వుక్రొవ్వు గలయలజవ్వని మగనిముందట ముద్దు గురియుచు
విక్ర ౭ ౬౫
క ఇవ్విధమున నాజవ్వని, పువ్వులవిలుకాని దంతిపొలుపమరునదల్, నివ్వటిల మెంగమునను జెలువ వ్వోలయఁగ గురునియుప వనస్థలిఁ జెందన్
చెన్న ౨ ౨౩౪

పువ్విలుతుఁడు వి (పువ్వు+విల్లు) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు
క పువ్విలుతుతండ్రి యచ్చట, మువ్వంకమురువున మురళి మ్రోయించె ననం, బువ్విల్లూరఁగ
పాండు ౫ ౨౨

పువ్వు (వు)=పూవు,పూ వి (సం పుష్పమ్, త పూ క హూవు) పుష్పము, విరి
ఆ నవ్వుపువ్వు నవ్వు జవ్వనిసాటిక
విజ వి ౧ ౭౪.

చ. పువ్వు లిఁకఁ గోసి తేఁడు శివపూజ కటంచు దశాస్యుఁ డంచినన్　ఉ రా ౩. ౧౯౯.

జ: పుప్పొడి, పుప్పొడివన్నెలు, పువ్వాటు, వెం.

**పువ్వు(వు)ఁబోఁడి.** (ణి) వి (పువ్వు+బోఁడి బ. పువ్వుఁబోఁడులు, పువుఁబోఁడులు, పువ్వుఁబోండ్లు, పువుఁబోండ్లు పువ్వుఁబోణులు, పువుఁబోణులు, పువ్వుంబోండ్లు, వెం) పువ్వువలె మనోజ్ఞాంగములగు ఆఁడుది; ఆఁడుది.

గీ... భోగభాగ్యంబులును మంచిపువ్వుఁబోండ్లు, కలిగియుండంగ .　దశా ౩ ౨౩

సీ పుణ్యంబుముడి వోచుపోలఁతుల కెల్ల నీపువుఁబోఁడి యాఁదలభూషణంబు　కేయూ ౧ ౩౬.

మ. తలుకుల్ గుల్కెడు నందుమేడలతుదన్ దార్కొన్న బంగారుకుండలు మిన్నేటను గానుపించుచుచు విన్నాణంపుఁ దెల్వింగడున్,విలసిల్లం గని హైఁడితమ్మ లనుచున్ వేల్పుంబువుంబోండ్లు చేఁగులఁ దేరం జనఁ జూచి నవ్వుదురు రంతుల్ గాఁగ జేజే దొరల్.　యయా ౧ ౭౮

గీ... నాగకన్యలతోడికలహ,మునకుఁ గాల్ద్రి వ్వెదవో లేక బోటన్రేలఁ, బుడమి వ్రాసెద విని యేల పువ్వుఁబోణి　దశా ౨ ౩౨౪

గీ...భయంబు లేని,పొలుపుతో నున్న దీపువుఁబోణిచెంత.　శుక ౨ ౨౪౯.

**పువ్వుగట్టు.** స క్రి (పువ్వు+కట్టు) పరిమళము గలిగించు, వాసితముచేయు.

వ అభ్యంచితకాంచనప్రసవ సౌరభసమాగమునం బువ్వుగట్టి గంధవహుండు సవరించిన యందంపుగందవొడి...　వసు ౨ ౧౧

**పువ్వుటమ్మ.** వి (పువ్వు + అమ్మ) పుష్పబాణము.

గీ కెంజిగురువిల్లుఁ బువ్వుటమ్మ లేత్తైఱ ధరించి, కట్టి బిగిసి రయేతెంచె నక్కడికిదిమగఁడు.　హ. ఉ. ౬. ౬౮ (ప్రక్షిప్తప్రతిపా.)

**పువ్వు(వు)టెత్తు.** వి (పువ్వు+ఎత్తు) ఒకవిధమగు పూలదండ, మాల్యగ్రంథి

సీ...పువుటెత్తు పూలబాట్ల, మనఁగి మాల్యగ్రంథి యగు　ఆం భా ౨ ౧౬౮.

**పువ్వులపువ్వుఁబోఁడి.** = పువ్వుల నమ్మెడు స్త్రీ, పుష్పలావిక.

గీ ఒకిగ్రఁ డిడుచోట నలుగురు రొక్కమిడిన, విటులఁ దెలుపుచుఁ దావులవిరుల సరులు, గూర్చి యమ్మెదు రవ్వీటఁ గులుకు గుబ్బ, జవ్వనపుటాంద్రు పువ్వులపువ్వుఁబోండ్లు　రా వి ౧. ౫౪

**పువ్వు(వు)వింటిజోదు.** వి (√పువ్వు) కుసుమధన్వుఁ డగుయోధుఁడు, మన్మథుఁడు

ఉ. ఆపువువింటిజోదు మధుపావళినారి యొనర్చి చక్కఁగా, మోపిడి పట్టి జా మ్మనుచు ద్రోయఁగ మీఁటుచు నున్నవాఁడు .　పి శకుం. ౨ ౧౩౦.

**పుష.** సం వి. ఆ స్త్రీ లాంగలీవృక్షము.

**పుషము.** సం వి అ పుం. ఆఁడుగుబె (వై. ని)

**పుష్కము.** సం వి అ న పోషణము.

**పుష్కర.** సం వి ఆ. స్త్రీ మెట్టతామర. †

**పుష్కరకర్ణిక.** సం వి ఆ స్త్రీ. స్థలపద్మిని, మెట్టతామర †

**పుష్కరచూడము.** సం. వి. అ పుం. చక్రవాళపర్వతముమీఁది దిగ్గజభేదము.

**పుష్కరనాడి.** సం వి. ఈ స్త్రీ స్థలపద్మిని, మెట్టతామర †.

పుష్కరనాభుఁడు సం వి అ పుం విష్ణుఁడు

పుష్కరప్రియము సం వి అ పుం మైనము

పుష్కరబీజము సం వి అ న తామరవిత్తు

పుష్కరము సం వి అ న ౧ తామరపూవు, పద్మము ౨ తొండముచివర, తుండాగ్రము ౩ వాద్యభాండముఖము ౪ అసిఫలము, కత్తివాదర ౫ కత్తిరొలు, ఖడ్గకోశము ౬ బాణము ౭ ఆకాశము ౮ గూఁడు, పంజరము ౯ ఉదకము ౧౦ యుద్ధము ౧౧ కూడిక, సంయోగము ౧౨ తీర్థభేదము ౧౩ గరిసె ౧౪ భాగము, అంశము ౧౫ మెట్టతామరదుంప, పుష్కరమూలము ౧౬ కుష్ఠమను ఓషధి, చెంగల్వకోష్టు ౧౭ ఒక ద్వీపము, (చూ ద్వీపము) ౧౮ బ్రహ్మకృతమగు నొక సరస్సు ౧౯ వ్యాఘ్రము వి అ పుం ౧ కొలను, సరస్సు ౨ నాగభేదము ౩ రోగభేదము ౪ సారసము, బెగ్గురుపిట్ట ౫ త్రిపుష్కరఘటయోగము ౬ ఔర్వము, బడబాగ్ని ౭ వాయువు ౮ శేషాహి ౯ మేఘములకు కూటస్థమగు మేఘవిశేషము —విణ (అ ఆ అ) శోభనము (శే ని)

పుష్కరమూల(క)ము సం వి అ న ౧ కుష్ఠౌషధి, (చెంగల్వకోష్టు) ౨ తామరవేరు ౩ పుష్కరదేశ ప్రసిద్ధమగు ఓషధివిశేషము

పుష్కరవ్యాఘ్రము సం వి అ పుం నక్రము, మొసలి

పుష్కరశాయిక సం వి అ స్త్రీ గుమిగా సంచరించునట్టి పక్షివిశేషము, (సుశ్రుతము సూత్రస్థానము ౪౬. ౧౦౫)

పుష్కరశిఖ సం వి అ స్త్రీ పుష్కరమూలము,

పుష్కరసాగరము సం వి అ పుం కుష్ఠౌషధి, చెంగల్వకోష్టు †

పుష్కరసాదము సం వి అ పుం తామరలను దిగొడిరయుక పక్షి

పుష్కరస్థపతి సం వి ఇ పుం శివుఁడు

పుష్కరాంఘ్రిజము సం వి అ న పుష్కరమూలము, కుష్ఠౌషధి

పుష్కరాక్షుఁడు సం వి అ పుం విష్ణువు

పుష్కరాఖ్య(హ్వ)ము సం వి అ పుం ౧ సారసము, బెగ్గురుపక్షి ౨ కుష్ఠౌషధి †

పుష్కరి. సం విణ (న ఈ న) పుష్కరములు (తామరలు) గలది వి న పుం ఏనుఁగు

పుష్కరిక సం వి అ స్త్రీ రోగవిశేషము

పుష్కరిణి సం వి ఈ స్త్రీ ౧ కోనేఱు, నాలువిండ్లమెట్లుకొలఁది గల నలుచదరపుబావి ౨ తామరకొలను ౩ స్థలపద్మిని, మెట్టతామరతీఁగ ౪ పుష్కరమూలము ౫ తామరతీఁగ

పుష్కలకము సం వి అ పుం గంధమృగము ౨ చీల

పుష్కలము సం విణ (అ ఆ అ) ౧ సమృద్ధము ౨ శ్రేష్ఠము, వి అ పుం ౧ ఒకదినుసు మృదంగము ౨ పుష్కరమను మేఘాధిపతిభేదము ౩ గ్రాసచతుష్టయాత్మకమగుభిక్ష, నాలుగుకబళములబిచ్చము వి అ న ౧ ముష్ట్యష్టకాష్టకము, అఱువదినాలుగు ముష్టులపరిమాణము ౨ బట్టయంచు (వై ని)

పుష్టము. సం విణ (అ ఆ అ) ౧ పోషింపఁబడినది ౨ బలిసినది, బలుపుగలది ౩ పెంపఁబడినది ౪ సంపన్నము, సమృద్ధము ౫ శ్రేష్ఠము, ఉత్కృష్టము వి అ న పుష్టి

పుష్టి. సం వి. ఇ స్త్రీ. ౧ పోషణము ౨ వృద్ధి, పెరుగుట. ౩. బలుపు ౪ సమృద్ధి. ౫ అశ్వగంధ, పెన్నేరుగ. ౬. మాతృకాభేదము. ౭. యోగినీభేదము ౮. ధర్మునిపత్నిభేదము.

పుష్టిక. సం వి అ స్త్రీ జలశుక్తి, గుల్లచిప్ప

పుష్టికరము. సం విణ (అ ఈ అ) పోషించునది, పెంచునది, సత్తువగలిగించునది.

పుష్టికర్మము. సం వి న్ న పెంపుకలుగుటకై చేయునొక విహితకర్మము

పుష్టికాంతుఁడు. సం వి అ పుం విఘ్నేశ్వరుఁడు.

పుష్టిద. సం వి. అ స్త్రీ అశ్వగంధ, పెన్నేరుగ

పుష్టిదము. సం విణ (అ ఆ అ) పుష్టినిచ్చునది ౨ వృద్ధికలిగించునది

పుష్టివర్ధనము. సం విణ. (అ. ఆ అ) పుష్టిని పెంచునది వి అ పుం చావము, పాలపిట్ట (శ. ని.)

పుష్ప. సం వి అ. స్త్రీ చంపాపురి. (కర్ణుని పట్టణము. ఇది యిప్పటి భగల్పూరు)

పుష్పంధయము. సం. వి. అ పుం (ఈరూపము వ్యాకరణవిరుద్ధము) భ్రమరము, తుమ్మెద
ఉ...మత్తపుష్పంధయవేణి నిత్తు శిశుపాలున కు... భాగ. ౧౦. పూ. ౧౬౪౫

పుష్పకము. సం వి. అ న. ౧. పుష్పము ౨. కుసుమాంజనము ౩ కుబేరునివిమానము. ౪. నేత్రరోగభేదము, (కంటిలోనిపువ్వు) ౫. రత్నకంకణము. ౬. రసాంజనము ౭. లోహకాంస్యము. ౮. మట్టికుంపటి. ౯. కాసీసము వి. అ. పుం. కృష్ణునిరథగుఱ్ఱములలో నొకటి. (శ. ర.)

పుష్పకరండకము. సం వి అ. న. పూలగరిడియ. ౨ అవంతిదేశమందలియొకతోద్యానము

పుష్పకరండిక. సం వి. అ. స్త్రీ ఉజ్జయిని.

పుష్పకాలము. సం వి అ పుం వసంతర్తువు, ననకాఱు, పూఁదఱి ౨ ఆర్తవముకలుగు కాలము, ముట్టుతఱి.

పుష్పకాసీసము. సం వి అ న ఒకపర్వతధాతువు, ఒకవిధమగువన్నభేది.

పుష్పకీటము. సం వి అ పుం. భ్రమరము, తుమ్మెద

పుష్పకేతనుఁడు. సం వి అ. పుం మన్మథుఁడు.

పుష్పకేతువు. సం వి ఉ పుం మన్మథుఁడు —న కుసుమాంజనము.

పుష్పఘాతకము. సం వి. అ. పుం. వెదురు. !

పుష్పచయము. సం వి అ పుం ౧ పుష్పాపచయము, పువ్వులుకోయుట. ౨. పుష్పసమూహము

పుష్పచాపుఁడు. సం వి. అ. పుం. మన్మథుఁడు, పూవిలుకాఁడు

పుష్పచామరము. సం వి అ. పుం. ౧ మదనవృక్షము, మ్రంగచెట్టు ౨. కేఁపచెట్టు.

పుష్పజము. సం. వి. అ. న. పుష్పరసము.

పుష్పదంతము. సం. వి. అ పుం. ౧. వాయుకోణమందలి దిగ్గజము ౨. విష్ణుదేవుని వాకిలిగుఱ్ఱములలో నొకటిఁ (శ ని.)

పుష్పదంతుఁడు. సం వి. అ పుం. ఒకశివానుచరుఁడు.

పుష్పదము. సం. వి. అ. పుం. చెట్టు.

పుష్పదామము సం వి ఌ న పూదండ

పుష్పద్రవము సం వి అ పుం పూలరసము, పూఁదేనె ౨ పూలనుండి తీసినరసము

పుష్పద్రుమము సం వి అ పుం పువ్వులు ప్రధాన మగుచెట్టు

పుష్పధన్వుఁడు సం వి ఌ పుం మరుఁడు పూవిలుకాఁడు

పుష్పధారణుఁడు సం వి అ పుం విష్ణువు

పుష్పధుఁడు సం వి అ పుం వ్రాత్యబ్రాహ్మణునికి సవర్ణస్త్రీయందుఁ బుట్టిన యొకజాతి వాఁడు

పుష్పధ్వజుఁడు సం వి అ పుం మన్మథుఁడు

పుష్పనిక్షము సం వి అ పుం తుమ్మెద

పుష్పనిర్యాసము సం వి అ పుం మకరందము, పువ్వురసము

పుష్పపత్త్రి సం వి ఌ పుం మన్మథుఁడు

పుష్పపథము సం వి అ పుం ఆఁడుగుఱి

పుష్పపుటము సం వి అ పుం ౧ పూమొగ్గ ౨ అభినయహస్త విశేషము

పుష్పపురము సం వి అ పుం పాటలీపుత్రము (పాట్నా)

పుష్పప్రచాయము సం వి అ పుం పువ్వులు చేతితోఁ గోయుట, (దొంగతనముగా కోయునపుడును, గడమొదలగువానితో కోయునపుడును "పుష్పప్రచయ" మగును)

పుష్పప్రచాయిక సం వి అ స్త్రీ పుష్పాపచయము

పుష్పఫలము సం వి అ పుం ౧ కపిత్థము, వెలఁగ తీ ౨ కూశ్మాండము, గుమ్మడి తీ

పుష్పబాణుఁడు సం వి అ పుం మరుఁడు, మన్మథుఁడు (ఇట్లేపుష్పశరుఁడు మొ)

పుష్పభూషితము సం వి అ న వణిజుఁడు నాయకుఁడుగాఁ గలరూపకప్రకరణభేదము

పుష్పమంజరి సం వి ఈ స్త్రీ ౧ పూగుత్తి ౨ సస్యవిశేషము ౩ ధాన్యవిశేషము

నీ తొక్కపాలలు కాకితొక్కులు పుష్పమంజరులు సీతాభోగసరులు

హం ౪ ౧౭౨

వ ఇప్పపూరాజనాలు పుష్పమంజరులు కస్తూరి నిగరాలు ప్రబంధ ౧౧౨

వ మాటిమాటికిఁ గొరవిదిరిగుత్తిపై వ్రాలి యొంగయెుత్తలలంత్తిఁ గొమ్మ పుష్పమంజరులు ద్రాయముసలం బని గుసగుసలాడుచు రా వి ౩ ౧౧౪

పుష్పమాల సం వి అ స్త్రీ పూదండ

పుష్పమాసము సం వి అ పుం వసంతర్తువు (రా వి)

పుష్పము. సం వి అ న ౧ పూవు ౨ స్త్రీరజస్సు ౩ పుష్పరాగమణి ౪ నేత్రరోగవిశేషము, కంటిపువ్వు ౫ పుష్పకవిమానము, కుబేరునివిమానము ౬ శృంగారవిలసితము ౭ గందివనము తీ ౮ మాచిపత్రి తీ పుం. వికాసము (శ వి)

పుష్పరక్తము సం వి అ పుం సూర్యమణి వృక్షము

పుష్పరజస్సు సం వి ఌ న ౧ పుప్పొడి ౨ కుంకుమము (శ వి)

పుష్పరథము సం వి అ పుం. ౧ క్రీడాయోగ్య మగురథము, పుష్యరథము ౨ పుష్పనిర్మిత మగు రథవిశేషము (వాచ)

పుష్పరసము సం. వి. అ. పుం. పూఁదేనె, మకరందము

పుష్పరసాహ్వయము సం. వి. అ. పుం. మధువు, తేనె

పుష్పరాగ(జ)ము సం. వి. అ. పుం. కొంచెము పసుపువన్నెగల శ్వేతమణి విశేషము
శ్లో॥ ఆపీతపాండురుచిరః పాషాణః పుష్పరాగస్తు

పుష్పలావి సం. వి. న్. పుం. పుష్పలావుఁడు, మాలాకారుఁడు వి. ఈ. స్త్రీ. పూదండలు, బంతులు, గ్రుచ్చియమ్మెడు ఆఁడుది

పుష్పలావిక సం. వి. ఆ. స్త్రీ. పుష్పలావి

పుష్పలావుఁడు సం. విణ. (అ. ఈ. అ.) మాలాకారుఁడు పూలబంతులు సరములు లోనగునవి గ్రుచ్చి యమ్మెడువాఁడు

పుష్పలిట్టు సం. వి. హ్. పుం. = పుష్పలిహము (రూ. పుష్పలిహము)

పుష్పలిహము సం. వి. అ. పుం. తుమ్మెద

పుష్పరోచనము సం. వి. అ. పుం. నాగకేసరము

పుష్పలోలుపము సం. వి. అ. పుం. తుమ్మెద (వై. ని.)

పుష్పవంతము సం. విణ. (త్. తీ. త్.) ౧ పుష్పములుగలది ౨ పుష్పములతో నలంకరింపఁబడినది
వి. త్. అ. పుం. ద్వి. (పుష్పవంతులు) సూర్యచంద్రులు

పుష్పవతి సం. వి. ఈ. స్త్రీ. రజస్వల, ముట్టుత

పుష్పవాటి సం. వి. ఈ. స్త్రీ. పూలతోఁట

పుష్పవృక్షము సం. వి. అ. పుం. పుష్పములు ప్రధాన మైనవృక్షము

పుష్పవృష్టి సం. వి. ఈ. స్త్రీ. పూలవాన

పుష్పశకటి సం. వి. ఈ. స్త్రీ. దివ్యవాక్కు- ఆకాశవాణి

పుష్పశకలి సం. వి. న్. పుం. నిర్విషమగు సర్పభేదము

పుష్పశరాసనుఁడు సం. వి. అ. పుం. మన్మథుఁడు, పూవిలుకుఁడు

పుష్పశూన్యము సం. వి. అ. పుం. ఉదుంబరము, మేడి

పుష్పసమయము సం. వి. అ. పుం. వసంతర్తువు

పుష్పసారము సం. వి. అ. పుం. ౧ కుసుమరసము, పూఁదేనె ౨ తులసి

పుష్పసౌరభ సం. వి. ఆ. స్త్రీ. పొత్తిదుంప

పుష్పస్వేదము సం. వి. అ. పుం. మకరందము, పూఁదేనె

పుష్పహాస సం. వి. ఆ. స్త్రీ. రజస్వల, ముట్టుత

పుష్పహీనము సం. వి. అ. పుం. ఉదుంబరము, మేడి

పుష్పాంజనము సం. వి. అ. న. పిత్తడితోఁ జేయఁబడినఅంజనవిశేషము

పుష్పాకరము సం. వి. అ. పుం. వసంతర్తువు

పుష్పాగమము సం. వి. అ. పుం. వసంతర్తువు

పుష్పాజీవుఁడు సం. = మాలాకారుఁడు, మాలాకరి

పుష్పాననము సం. వి. అ. పుం. మద్యవిశేషము.

పుష్పాపీడము సం వి అ పుం పూలసిగదండ

పుష్పాయుధుఁడు సం వి అ పుం మన్మథుఁడు

పుష్పావచయము సం వి అ పుం పువ్వులు కోయుట

పుష్పావచాయి సం వి న్ పుం పుష్పాజీవుఁడు మాలాకారుఁడు

పుష్పాసవము సం వి అ న మధువు, తేనె

పుష్పాస్త్రుఁడు సం వి అ పుం మన్మథుఁడు

పుష్పాహ్వా సం వి ఆ స్త్రీ శతపుష్పి, సదాప కీ

పుష్పి సం విణ (న్ నీ న్) ౧ పువ్వులు గలది వికసించునది ౨ పువ్వులచే సమృద్ధమైనది
సం వి ఈ స్త్రీ అతిబల, ముత్తవపులగము కీ (వై ని శ ని)

పుష్పించు సం అ క్రి పూచు, వికసించు
గీ గీతము వహించి, తేజము పుష్పించెఁ
బ్రేంకణ మింతి మాకు నమర ౧ ౧౭౬
స క్రి పుష్పింపఁజేయు
సీ చులుకగాఁ దన్ని యశోకంబుఁ బుష్పించి
విద్రుమాదరి రూర్తి విరులు గోసె, నవ్య
గీతులఁ బ్రేంకణము వికసింపించి వనిత
యొక్క తె ప్రసవములు గోసె
పి శకుం ౨ ౧౩౭

పుష్పిక సం వి ఆ స్త్రీ ౧ దంతమలము, ౨ లింగమలము, ౩ గ్రంథాధ్యాయసమాప్తియందు, ఆయధ్యాయముచేఁ బ్రతిపాదితమగు దానిని జెప్పెడి గ్రంథాంశభేదము (ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వనపర్వణి అధ్యాయః, ఇది పుష్పిక) ౪ ఒకవిధమగు పిల్లనఁగ్రోవి (వై ని)

పుష్పిణి సం వి ఈ స్త్రీ రజస్వల

పుష్పితము సం విణ (అ ఆ అ) ౧ పుష్పించినది పూచినది ౨ వికసించినది, విరిసినది ౩ పువ్వులచే నలంకృత మగుదానింబోలె అందము గలుగునది (వాక్క మెం) ౪ సమృద్ధము, సంపన్నము (సువర్ణపుష్పిత మగుపృథ్వి) ౫ ప్రవృద్ధము, చక్కఁగా ఎదిగినది

పుష్పితాగ్ర సం వి ఆ స్త్రీ (ఛంద) అర్ధసమవృత్తభేదము
శ్లో అయుజిన యుగరేఫతో యకారో యుజిచ
నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా

పుష్పోపజీవి సం విణ (న్ నీ న్) మాలాకారుఁడు

పుష్యనేత్ర సం విణ ఆ స్త్రీ ఏరాత్రియందు మొదటినుండి కడవఱకు పుష్యనక్షత్రము కనఁబడునో యట్టిరాత్రి (వాచ)

పుష్యమి సం వి ఈ స్త్రీ ఒకనక్షత్రము ఎనిమిదవనక్షత్రము
(శ ర మాత్రము సం ని లలో లేదు)

పుష్యము సం వి అ పు ౧ పుష్యనక్షత్రము
వ ఉత్తరభాగంబునఁ బునర్వసు పుష్యంబులును దక్షిణభాగంబున నార్ద్రాశ్లేషలును
భాగ ౫ ౨ ౯౮
౨ పౌషమాసము ౩ కలియుగము (మే ని) ౪ కూశ్మాండఫలము, గుమ్మడికాయ (శే ని)

పుష్యరథము సం వి అ పుం పుష్పరథము

పుష్యరాగము సం వి అ పుం పుష్పరాగమణి (శ ర)

**పుష్యలము.** సం వి. అ. పుం కీలము, మేకు. (వై ని)

**పుసలాయించే.** స క్రి (హిం. ఫుస్‌లానా) బుజ్జగించు. (శ. ర)
జః—పుసలాయింపు

**పుసలాయింపు.** వి. (√పుసలాయించే) బుజ్జగించుట, ఉపలాలనము. (గ్రా.)

**పుసి.** వి. నేత్రమలము. దూషిక

సీ పుసి యటంచనఁగ నొప్పును నేత్రమలము ..
ఆం భా ౨ ౧౩౮.

**పుసుక్కు-(కు).** వి. ౧ తుమ్ముట లోనగు వానియం దగుధ్వని కనుకరణము
వ్యవః—నేను ప్రయాణ మగుచుండఁగా మా పిల్లవాఁడు పుసుక్కున తుమ్మినాఁడు
౨ తొందర
వ్యవః—మావాఁడు పుసుక్కున ఆసంగతి వానితో చెప్పివేసినాఁడు

**పుస్తకము.** సం వి అ పుం. న ౧ పొత్తము. శబ్దా ర ర౫ గ్రా. ౨. సిందూరము. ఉంచు కొనుదారు భాజనము. (బరిణె. మొ వై. ని)

**పుస్తకముద్ర.** సం. వి. ఆ స్త్రీ (తంత్ర సాంకేతికము) ముద్రాభేదము.
శ్లో:—వామముష్టిం స్వాభిముఖీం కృత్వా పుస్తకముద్రికా.

**పుస్తము.** సం. వి. అ. న. ౧. లప్పము చేయుట లోనగు శిల్పులపని, లేపాద్యశిల్పకర్మము ౨. పుస్తకము. ౩. మాంసపు చెక్కలము. (శ. ర)

**పుస్తి.** సం. వి. ఈ. స్త్రీ = పుస్తకము.

**పుస్తీ.** (ఐ పుస్తీలు) వి. మీసము. (గ్రా)
విశే. (సం. పుష్టమ్.) పెద్దది, దీర్ఘమైనది.

సీ. చేవలవలెను బుస్తీమీసము ల్కాలందాల్పెట్టి లును జేత దస్త్రములును. వేబు. ౫౯ ౪

**పుస్తు.** విశే ౧. అసహ్యము, రోఁతపుట్టించునది.
ద్వి అదివచ్చె నడచేసుఁ గనుచు నంతంతఁ, గదియుచు మైపుస్తుకంపున కడని, తొలఁగుచుఁ బురజనుల్ తుప్పున నుమియ ౪
ద్వి వారిశ్చ ఉ. ౫౦౭. పం.
(ఇట. వి దుర్గంధము, అని శ ర. కాని "కంపు" గా గ్రహించి పైయర్థము చెప్పుటయే యుక్తము.)
౨. దుర్గంధము కలది చెడ్డకంపు కొట్టునది
ద్వి... మెడమీఁది కంతియు నీఁచు, బోయిన పిఱుఁదును బుస్తుదోవతియు
నవనాథ ౩ ౧౬౯. పా. ౨౯. పం.
వి. పూతిగంధము దుర్వాసన.
ఆ పుస్తు బాజా సాఁగఁ బూతిగంధ, మలరు
ఆం భా ౧ ౧౦౪

**పుస్తుంగు.** వి గుబ్బపుటేను పైఁ బఱచెడి యొకవిధమైన అలంకారవస్త్రము
మ. మురుపై పేర్చుకడానివన్నియజరీమునూన్నలు పుస్తుంగు బంగరుపల్లంబు...
రంగా. ౨. ౨౧౦

**పుస్తె.** వి. ౧ మంగళసూత్రము.
గీ ..పుస్తె, యనఁగ మంగళసూత్రాఖ్య యలరుచుండు. ఆం భా. ౨. ౧౯౭
గీ పుస్తె గట్టినయది మొద లొప్పెంతరావు.
రుక్మాం ౪. ౧౨౦.
సీ. పుస్తెమాత్రమె కాని పోఁడి మెఱుంగని గళమున హారముల్ గలవు కొనిరొ.
దశా. ౪. ౪౨౭.
౨. తాలిబొట్టు, మంగళసూత్రమందు గ్రుచ్చెడి స్వర్ణాభరణవిశేషము.

శ. పాకశాసనిటీవవదిరయొక్క చేయిం జన జేలుచు బల్లహుందండు గల్చి తత్కారివరకంఠహార్తి కలకాకతిఁ బూంచె నిజానిపుత్రికిన్. కాని దనకాసనము అం సం. ప ౯. ౩౭. పా

(చ) వహింపఁజేయు, మోచునట్లుచేయు

క. కాంచనమాలాలంకృత, చంచత్తనులీల మెఱయ జవవాశ్వములం,బూంచి రథంబున మణిమయ,పంచాననకేతు వెత్తి బంధుర లీలన్. భార విరా ౪ ౪౫.

**పూండులు(ఁడులు).** వి బ బహువత్సరాత్మకములయిన కాలవిశేషము.

(ఇది 'ఏండ్లు' పూర్వమందుగలిగియే యీయర్థమునఁ బ్రయోగములఁ గానవచ్చుచున్నది)

క. నావుడు మట్టినజగడం, బీవేళ నా తీర్పవేని యేడ్లం బూండ్లన్,నీ కేమి తీర్చెదు జై. భా ౪ ౭౧

క అగుణమణి యొక్కని కిడు,బాగాలే చాలు బహుళపరిణయములకున్, బాగైన వలువ లాకనివి,భోగింపఁగ నీమ కేండ్లు పూండ్లకుఁ జాలున్ పాంచా ౪ ౬౨

చ...ఇట్టివి యెల్లఁ జూచిరా, కొలికిలు గట్టుకొన్న మతి యేఁడులుఁ బూఁడులుఁ బట్టె మనుచ. ౧. ౮౩. (శ ర పా 'ఏండ్లును బూండ్లును' ముద్రి పా)

విశే. బ. అనేకములు (సంవత్సరములు) అని శ ర.

**పూఁగొమ్మ.** వి (పూవు+కొమ్మ)పూలకొమ్మ

క తేఁగరువలిచే ముంగలి,పూఁగొమ్మలు పాయఁ బడుచు. కళా ౧ ౩౪

ఇట్లే: పూఁగొమ్మ=పూలకొమ్మ (చూ కొమ్మ)

క. మాఁగిలి మాఁగిలి వృత్తము,పూఁగొమ్మనమండి వర్ణము ప్రకాశింపన్, తేఁగొదమతుమ్మిలి పల్కెడుఁ,గేఁ గోయని వైశ్య మనకు గెలుపుగుఁ బొమ్మా. క్రీడా. ౫౧.

**పూఁచే=పూంచే.** అ. క్రి. (√పూను) పూను, ఉద్యమించు.

క ఈచందంబున దెలుపులు, కేచియుఁ బయిఁ బూచి లాఁచి క్రేపియు...
ఉ. హరి ౩ ౬౩.

గీ పేరటాండ్రురు హస్తపంకేరుహములఁ, బూఁచి యెత్తిన కనకంపుఁ బూలకుండ,లు. నైష ౬. ౯౭.

శా ఈహం బూఁచి పెనంగఁ జొచ్చి రఘుదయ్యేకాంగవీరుల్. జై. భా ౭ ౯౪.

ఆ వీఁడె సైంధవుండు వీనిచుట్టును గృప,శల్య గురుతనూజసౌమదత్తి, కర్ణకర్ణసుతులు గావలి యున్నారు, పోటుమగలు గాన పూఁచి పట్టి భార ద్రో. ౩. ౧౮౦.

చ పనివడి పూఁచి పట్టుమి సుబంధురధైర్యము నిర్వహింతు కే, వసుమతి సొన్పకుండుట సమగ్రతపంబున తత్పలేచ్ఛ లేకునికి విమోక్షతృష్ణభర మొందమి కాము నడంచుఁ గాన నిర్యయ్యనపులు లేమి నువ్వే యనపాయతగా నతఁ డాడె భూవరా.

భార. అశ్వ ౧ ౧౩౭.

ఆ మనము పూఁచి పట్టి మొనలేర్చికొనిపోవఁ, బాండురాజసుతుల బలముగలిసి, గాసి చేయు...

భార భీష్మ. ౩ ౫. శకాం. ౪ ౧౯౪.

స. క్రి ౧. కాల్చు, వహించు

(గజంబు) నీ చెవులు క్రొంగ్గించి పూఁచిన రౌద్రతరరేఖ వినువీథిఁ జూపఱ కెక్కఁ జెనుప. భార ద్రో. ౧. ౩౧౪.

శ్లో. వ్యావృత్తనయనః క్రుద్ధః ప్రమథ న్నివ పాండవం. సం భార ద్రో. ౭౬. ౭౭.

ఉ. ఊఁచినకత్తి వంచనిపరోరుహాలోచన మింట మంటలం, బూఁచినబాణజాలమునఁ బూర్వనుపర్వపురాణగర్వమున్, పేఁచిన...
ఉ. హరి. ౧, ౧౬౩.

గీ. అట్టహాసంబుతోఁ బ్రాస మలుకఁ బూఁచి, రక్కసుఁడు వైవ...

భా. రా యు ౯౨౨.

౨. పూను, అవలంబించు

గీ. ఎఱుఁగుకే నీదుకన్నను కొండకన్నుఁ, జెలఁగి పూఁచుకేశరమ్మ వంచిన లతాంగి, యెట్టి క్లేశంబులకు నైన నీడఁబోదు, తనమనంబున నిగ్రహమనంతానకాంత. శివరా. ౨ ౩౯.

౩. వైచు, ప్రయోగించు

ఉ. ..ఆఘోరపుశక్తి సాలుకలుగ్రోయ మెఱుం గులు ప్రజ్వరిల్ల ఘంటారవ మభ్రవీథి నిగుడం దగఁ గేల సమర్చి పేర్చి యుబ్బ్యేకిఁ బూఁచినం దలఁకి వాఁడు మహోన్నత ఘూర్ణితాకృతిన్.

భార. ద్రో ౫ ౨౯.

శ్లో...వైకర్తనః ప్రాహిణో ద్రౌత్మసాయ.

సం. భార ద్రో. ౧౮౦ ౫౪.

జః పూఁపు.

పూఁజోలు. వి. (పూవు+చాలు) పుష్పమాల, పూలదండ.

శా...పూఁతలు పెట్టువాలు . నిర్మలం బ్బోమ పేల్పుచాలు పెద సొమ్మిన్ నిల్పఁ బూఁజాలు... ప్రబంధ. ౧౫౪.

పూఁజిల్కు-(లుకు)దొర. వి (పూవు + చిల్కు+దొర) పుష్పబాణుఁడు, మన్మథుఁడు.

సీ. బొమవింటఁ దొడిగినపూఁజిల్కుదొరముల్కు పోల్కి కస్తురితోడ బొట్టుదిద్ది.

మృ. వి. ౧ ౧౩.

పూఁజేప. వి. (పూవు+చేఁప) మత్స్యవిశేషము. (శ. ర.)

పూఁజేరు. వి. (పూవు+చేరు) పుష్పాలదండ, పుష్పమాల,

శా. శ్రీరంగేశునకున్ సదా యిరఁడు పూఁజే రుల్ సమర్పించు టాహారార్థం బగు...

వైజ. ౨. ౨౨.

పూఁట¹=పురఁట, పుంట. వి. ౧. సంధ్య.

సీ సంధ్య యొప్పుచు నుండు పం జనఁబూఁ టనఁ బుంట యం చనఁగఁ బురంట యనఁగ.

ఆం. భా. ౧. ౯౪.

ఉ. రేపటిపూఁట పెన్నికొని ద్రేఁడు పసిం గొనిపోయి మేపి తా మాపటిపూఁట పెన్ని నక్రమంబున నీఁ దగున్...

విష్ణు. ప్రా ౧౦.

(రేపటిపూఁట=ప్రాతస్సంధ్యాకాలము)

౨. అర్ధదివసము

క. పూఁట నగుకార్యగతు లాకపాఁటన్ మతి నాఁటఁ గొనెదునయ కార్యము లొక్కొఁటం జేయుట మే లగు... రా. వి. ౨. ౩౭.

ఉ. పొంపిరి వోనిభక్తి నిరుపూఁటలు రాత్రులు శీతభాను దర్శింపక యారగింపఁడు...

వైవ. ౫. ౪౪

క...తొల్లి భ్రష్టగువిభ్రుండొక్కం దలఁ గఁడె ప్రోచిన వొక్కరపై నొక్కపూఁట కూటికిఁ గాఁగన్.

ఆము ౪. ౨౧౦. కేయూర ౩. ౧౪౩.

౩. దినము.

సీ. ఈపూఁట దప్పించి రొల్లి చూచెద నన్నఁ బతి వేడ్కఁ జెఱుచుట పాడి గాదు.

భోజరా. ౪. ౨౫౪.

దండకము . లోఁ దాల్మి దైవాఱఁగా చెయ్యి కే మైన నీ కప్పనం బంచుఁ బూఁట ల్పడిం ద్రోచుసాబల్లిదుల్ నీకు వింద ల్గదా...

నీలా. ౨. ౪౧.

వ. .కొన్నిపూఁటలన్ బుటపుట వైననన్నుం గమంగొని మునీంద్రుండు ప్రియం బంది ..

మనుచ. ౭. ౩౯.

౪. సమయము, కాలము.

ఉ. దాఁటక మాన రెక్కడలి దాశరథుల్ కపిదండిమూఁకతో, దాఁటినదాఁకఁ జూడక కదా కని కావు మటంటివేని నా,పూఁటయ కాచు. . రామా. ౬. ౬౩.

చ...అ,వ్వనిత విధాశరుం దపరవార్ధిఁ బడక మణిమంజరీగృహాం,బునకు నికేశ్వరుం దరుగు పూఁట యటంచును నిశ్చయించి . శుక. 3 ౭౧౧

జః పూఁటకూటిల్లు, పూఁటకూళ్లమ్మ పూఁట కూళ్లు.

పూఁట². విణ (√ పూను) పూఁచివహించువాఁడు, బాధ్యుఁడు

చ. బరవస మొప్పు నీవు గదపండువు సేయఁ దలంచి తాఁకినం,గురుపతి నిర్జితుం డగుటకుం బవనాత్మజ రేయు బూఁట పోఁ,టరికిన మెల్లఁ జూపుము భార. శల్య ౨ ౧౭౯

క. మీకును ధర్మవిరోధమ్ము,గా కుండుట కేన పూఁట గారవమున నా,లోకింపుఁడు భార. శాం ౬ ౫౪౦

ద్వి. ఏసత్యమునకుఁగా నిప్పుడు నీకు, దాఁకుఁడ నై జట్టి దక్కుచున్నాఁడ, వట్టిసత్యంబు సేఁ డగు వాఁకుఁ బూఁట ద్వి హరిశ్చ ౬. ౧౫౩౩

సీ ..పూఁటకాఁ పనఁగను బూఁట యనఁగఁ
గీ దనరు లగ్నకసంజ్ఞ... .. ఆం. భా. ౨. ౩౦౪

(శాసనములందు 'పూంట' అను రూపమేవాడఁ బడియున్నది
వ... బెరపినబోలు నల్వురుం బూంటగా... ద. శా. ౪ ౧౦౧౨. ౧౦౧౭)

వి...౧. ఒకఁడు చేయవలసినపనిని తాను చేసెదనని మఱియొకఁడు పూనుకొనుట, పూచి, బాధ్యత.

గీ. అఖిలభోగానుభవయోగ్య మైనతనువు, వదని యును జపతపములపాలుచేసి, సౌఖ్య మొందక చెడుమూర్ఖజనులఁ దెల్పఁ, బూఁటరే మాకు వా రెట్టి పోవనిమ్ము దశా. ౧౦. ౫౬.

వ ..అఖండవర్తిలోహద(ం)ణ్డదీపం బొక్కటి టికి మూండవు అదపుకామె బోయని పూంట్టను నూంక్కబోలమూరనివసమునం బెట్టినపనులు ౫౦ దింటికి... ద శా. ౪. ౧౨౦౦.

ఆ దానుబుణము దీర్చి తనపూఁట యిట్లు చె, ల్లించి . పరమ. ౪ ౨౬౪.

౨ తాకట్టు, కుదువ

సీ. విశ్వాస మొదవించి వృద్ధికి బడియక తలంచు పూఁటలును బత్రములఁ బెట్టి. హరిశ్చ ౪ ౧౨౧.

పూఁటకాఁడు. వి=పూఁటకాఁపు.

మ...మనోజా గెలిపింపం బూఁటకాం డై)... మల్లభూ. శృం. ౧౯.

పూఁటకాఁపు=పూఁటవాఁడు,పూఁట². విణ. (పూఁట² + కాఁపు) ప్రతిభువు, పూఁచి వహించినవాఁడు

సీ విను మింతి యీయర్థమును ఘటింపఁగఁజేయఁ బుప్పనారాచుండు పూఁటకాఁపు. నైష ౨. ౭౬

క. హరి నిచటికి రప్పించుట, కరయఁగ నే బూఁటకాఁపు నైతి నటంచుకా, సరసిజగర్భుఁడు శేషుని, శిరములపై నిలిచి నమ్మఁ జెప్పెను గరుణకా. వెం. మా. ౪. ౬౬. ఆం. భా. ౨. ౩౦౪.

పూఁటకూటిల్లు. వి. (√ పూఁట) పూఁటకూళ్లు పెట్టెడు ఇల్లు.

మ. సదశెం భానుఁడు పశ్చిమంబునకు సైక్యా
పూఁటకూటింటికిఁ, గుడువంబోదమె లెక్క
యిచ్చి కడు నాఁ కొన్నార మిప్పట్టునన్.
క్రీడా. ౧౫౫

పూఁటకూళ్లమ్మ. వి (పూఁటకూళ్లు+అమ్మ) పూఁటకూళ్లుపెట్టువంటలక్క, వంటపూఁటమ్మ.

సీ...పూఁటకూళ్లమ్మకుఁ బుస్తె మేల
వేంకు ౪ ౧౩.

పూఁటకూళ్లవాఁడు. వి (పూఁటకూళ్లు + వాఁడు) పూఁటకూళ్లుపెట్టువాఁడు వంట పూఁటవాఁడు.

సీ...పూఁటకూళ్లవాఁ డనఁగ వంట,పూఁటవాఁ
డనఁగను బొలుపొందు...
అం శా. ౨ ౨౪౫.

పూఁటకూళ్లు వి బ (వృత్తియం దొకచో నేకవచనము కన్పట్టుచున్నది చూ పూఁటకూటి యిల్లు) డబ్బు పుచ్చుకొని అన్నివేళలయందు పెట్టెడు అన్నము (వెలతీసికొని వేళవేళకు పెట్టెడు అన్నము (శ. ర)

పూఁటపడు. అ క్రి. (పూఁట² + పడు) బాధ్యతవహించుట, ఒకఁడు చేయవలసినపని తాను చేసెద నని పూనికఁగొను

క. ఖేదంబు వలదు నియమత, బోదానము లిటనిఁ
జూపఁ బూఁటపడిరయొకే
భార శాం ౭ ౩౭౯.

ఉ. ఆనతి యిచ్చినట్ల సరియాఁకల నున్నప్రపన్ను
పాలికింఁబూనఁగ నేఁగి పూఁటపడి రొప్పగ
బారనియప్పుఁ దీఁతిచెన్.
పగమ ౪. ౧౪౧.

సీ. తనవిత్తహాని కోర్చినఁ బూఁటపడవలె హిత
వున్నచోట వ త్సీయవలదు
రామలిం. ౪౭.

పూఁటవాఁడు=పూఁటకాఁపు. విశే. (√పూఁట²) పూచివహించినవాఁడు, ప్రతిభువు

క. పెక్కండ్రు పూఁటవారలు, తక్కొని మెయి
పాళ్లు నరువఁ దగు నొకబాయం, బెక్కండ్రు
పూఁటయగుచో, నొక్కనిచే నైన నర్థ మొంద
యందు గొనుక విజ్ఞా. వ్యవ. ౭౯.

పూఁట(పా)వాటు. వి (√పూఁటపడు) పూచి, ప్రతిభూతము, బాధ్యత.

ఆ. అన్నదమ్ముఁ డైన నాలుమగం డైనఁ,గొడుకు
తండ్రి యైనఁ గూడి యుండి, పాత్రుధనము
నందుఁ బూఁటవాటును నప్పు, సాక్ష్యమును
వహింపఁ జనదు జగతి
విజ్ఞా వ్యవ. ౭౫.

పూఁటపెట్టు. స క్రి (పూఁట² + పెట్టు.) పూచివహింపఁజేయు, ప్రతిభువుగాఁజేయు

క. అగు నగుఁ బోనిత్తునె శ్యాపగ చేతుల
నిపుడ రొన్నిథంగుల నయినం, దొఁజాలకుఁ
గాక విడుతునె, మగఁడఁ గదే పూఁటపెట్టి
మా కిచ్చోటన్ నిర్వ. ౧౦. ౨౦.

గీ. ఒయ్యఁ జేరిక చేసి సా మ్మొప్పఁజెప్పఁ,
బూఁటపెట్టుము నను...
పరమ ౪ ౧౪౦.

వ. వెయ్యన్నియునూరుటంకాలకు నిన్నుంబూఁట
పెట్టి ద శా ౪. ౪౭౪.

పూఁడి. వి (త పూన్డి) చిన్నగ్రామము, పల్లె.

ఇది గ్రామనామముల చివర కనిపించుచున్నది ఉదా॰ బెండపూఁడి, చిఱుతపూఁడి, ఇసుక పూఁడి, పెదపూఁడి, బెల్లముపూఁడి మొ

శ్లో...ద్విజాతివసతి (శ్చా) కల బొల్లపూండి
నామ తత్ర నారాయణో నామధర్మ(జ్ఞో)తి
వర్ధమానక్రతుర్ ప్రతివసతిస్మ...
ద. శా. ౫. ౧౦౪.

వ. భవద్విషయే ద్వాదశపూర్ణి సహితమాల
పెల్లినామ గ్రామః పొన్నపల్లినామగ్రామశ్చ
ఉత్తరపరుసవిషయే ఆలమినామగ్రామశ్చేతి
గ్రామత్రయ మేకీకృత్య ... పిఠాపురము.
శాసనము
(S 1024) Ep Ind 5 No 10

పూఁత. వి (√పూయు) ౧. (గంధాదుల) లేపనము, అలఁదుట

సీ దిక్కు లన్నింటను దెలుపార పూఁత గావించె
నుజ్జ్వలయశోవిభ్రమంబు.
భార విరా. ౫ ౩౨౦

గీ సంకుజగివాఁడు వలకేల జింకవాఁడు, ప్రాఁత
మగవాఁడు వెలిబూదిపూఁతవాఁడు, మిక్కు
టం బగుమక్కువ నొక్కవాఁడు, దనరఁ
గలలోన ప్రోలఁ గన్గొనఁగ నయ్యె.
అచ్చ రా. బాల ౧౩.

ద్వి. ఒకని నాముందట నొకకొండఁ జేసి, పూని
నీ వతనిపైఁ బూయనిపూఁత, లేనిసత్యంబు
గల్పించి రొక్కించి
ద్వి. పారిజా పూ. ౭౯౩

(పూయనిపూఁత = లేనిగుణము అని భావము)

సీ తలమూసె బలుకిప్పు ద్రావిడీస్తనపాళి
కస్తూరి నెఱపూఁత మస్తరింప.
రా వి ౨ ౫౦.

౨ (పూసికొనుట కుపయోగించు) చందనాది పరిమళద్రవ్యము, అంగరాగము.

చ... అప్పురుషుఁడు వచ్చునంతకును బూవులుఁ
బూఁతలు మేలిచీర లాభరణము లెక్కుడుం
జవులపాకవిశేషము లాదరింపను...
భార. అను. ౪ ౩౫౯.

మ... రత్నప్రస్ఫురదూభూషణం, బులు వస్త్రం
బులు పూఁతలుం దములమ్ము బుష్పంబులున్
లోనుగా, లలితద్రవ్యము లెల్ల నాకొసఁగ
మేలం బాడుచుం బ్రీతితోన్.
దశకు. ౩ ౭౦

ఉ... కేశ్యకు, స్మేఁతలు పూఁత యన్నది గణిం
పఁగ మందుల కారు మందులై, చేఁతలఁ
కూడిమారములు సేయుదు రింతియకాక
దుర్వ్యటుల్.
హైజ. ౨. ౪౯.

౩. మన్ను మున్నము మున్నగునవి రాఁచుట, మేఁగుట

ఉదా.— పేఁడపూఁత, మంటిపూఁత, సున్నపుపూఁత. మొ

౪ (బంగారుమున్నగునీరు) పైనిప్రాముట, మొలాము.

గీ శుద్ధకాంచనపిండంబు సూర్యుఁ దిగిచి,
పూర్ణశశిపూఁత బంగారుపూఁదె వొసఁగి
హైమ. ౮. ౧౬౭.

ఉ పూఁతపసిండివంటివలపున్ బచరించు
కులంబునీతికిన్, లేఁతగదమ్మ ..
మనుచ. ౩. ౩౩.

క లోనున్నరాగి వెలుపలఁ, గానంగావచ్చు
పూఁతకడియము భంగిన్.
పి శకుం. ౨. ౬౪.

౫ ఆవరణము, కప్పు

ఉ. ప్రాఁతల మేము నీకుఁ బలుబాములఁ
బొందక యున్నవాఁటినీ, చేఁతలు గంటి మంద
ఱకుఁ జిత్తముల న్వైలిఁ దోఁచు నూఁతలుం,
బూఁతలు నీవ యొందుదలపోఁతలు లేఁతలు
మమ్ము నెమ్మెయిన్, లాఁతులఁగాఁ దలం
పకు నలంపకు చాల నలంగియుండఁగన్.

(ఇట 'మాయ' అని భావము)
ఉ. పారి. ౪. ౯౩.

విణ బూటకము, అసత్యము.

సీ. పూఁదెమాటలు గాని పొసఁగునే సరిచేయ
బంగార మీనిర్మలాంగమునకుఁ, బూఁతమా
టలు గాక పోలునే సరిచేయఁ గర్పూర
మీతనూగంధమునకు
వరాహ ౯. ౧౦౧.

(లేపనము[1] అని అర్థాంతరము)

సీ. పూఁతమద్దులుగాక పోల్పంగ వచ్చునే
చందనం బీమేనిగంధమునకు
హంస ౧ ౨౧౦

పూఁదఱి వి (పూవు+తఱి) పుష్పసమయము, వసంతఋతువు (శ ర)

పూఁదీఁగ వి (పూవు+తీఁగ) పుష్పలత, పూలతోనుండు తీఁగ

క. వనలు పెఱిన లత్తెఁ దేనెలు,చినికెం జిగు
రాకు గండెఁ జెదరె నలికతుల్, చనుపువ
నీపూఁదీఁగకు, ఘనమైన సృశింపాలుపొందు
గలుఁగఁగఁ బోలున్
నరస ౫ ౧౩౫ కళా ౧ ౧౪౯

పూఁదే(నె)నియ వి (పూవు+తేనియ) పుష్పరసము, మకరందము

శా. ము,క్కారుం బండును రాజనంబుఁ జెఱు
కున్ గప్పురపుఁబూఁదేనియన్
విక్ర ౧ ౯౦

సీ. ఎం దుండు గురివెందపందిళ్ల పూఁదేనెజడి
యుండుశిలలందు జాలువాఱు
మనుచ ౪ ౩౭

పూఁదేరు వి (పూవు+తేరు) పుష్పనిర్మితమైన రథము (చూ పూఁదేరురాయఁడు)

పూఁదేరురాయఁడు వి పుష్పరథుఁడు, మన్మథుడు

గీ. పూఁదేరురాయని కొలువుసెలవు, పగిది
బొప్పారు పసిఁడియుప్పరిగలోన
యయా ౫ ౧౧

పూఁదోఁట వి (పూవు+తోఁట) పుష్పవనము, పూవుఁదోఁట

దండకము ఉపవ్వసంద్రంబు పూఁదోఁట
కాల్వంబలెన్ దాఁటి నీలా ౨ ౪౧

ఉ. పూఁ,దోఁటకు జీరగాండ్రు మనతొల్లిటి
వారలు తేరె నీవిధుం, డేఁటికిఁ బోవఁగా
వలయు కళా ౪ ౧౩౨

పూఁపు వి (√పూఁచు) ౧ పూనిక, ఉద్యమము, సంకల్పము

గీ. కర్ణశకునిదుశ్శాసనుల్ ఘనులు గాఁగఁ,
దలఁచి వారలఁ గొని మమ్ము గెలుచు
వాఁడ,వై మనంబున శంకింప కట్టు లీడు,చేసి
తా పూఁపు దప్పిన గాసి యైతి
భార కల్య ౨ ౫౯

చ. చిడిముడిపాటునన్ జెఱకువింగఁడుఁ బూని
మధుప్రియత్వ మేర్పడ వడి లావులున్న
వారిపైని జివుక్కన చెక్కి యుక్క గా,
విడవదు ఎందు చూచి తమి జేఁ డిదె గోవధ
మాచరించు పూఁపదరంగ నీవు పచ్చితురు
కాదువు పాంథులకున్ మనోభవా
సారంగ ౨ ౧౭౩

ఉ. నీ వొకరుండు దక్కఁగ ననింద్యపరాక్రమ
శాలి భీష్మునిం, జావఁగఁజేయ నెవ్వఁడును
జాలఁడు నీతలఁ పెన్నిభంగులన్,దైవము
పూఁపువోలెఁ దుది దాఁకుసె యవ్విధ మిట్టు
లుండఁగాఁ,ద్రోవఁగ వచ్చునే రిపులు
దోఁచినఁ బోవదు చూచియుండుమీ
భార భీష్మ ౩ ౩౧౩

చ. వినుమరిఁ జంపనుం జెఱుప జేచుట లెన్న
ప్రతాపభావణం,బున నెడ నుల్లిగట్టులను
బొంకుల వానిఁ గలంగఁజేసి తేఁచినఁ దన
పూఁపు దప్పు భార శాం ౩ ౨౦

౨ మగటిమి, పౌరుషము

సీ. తొడరి బెబ్బులి నైనఁ బెదకేలఁ బడఁ
ద్రోయు పూఁపుగల్గినబంట్లపుట్టినిల్లు
యయా ౧ ౩౦

మ. రామకృష్ణు లిద్దఱుం గ్రోధసంరక్తలోచనంబులఁ గంసుఁ డెనఁ గనుంగొనునప్పు డప్పాపునకుఁ గంసక్రౌర్యంబునకుఁ నందగోపాలాదు లగు ఘోషజనంబు లందఱుం దల్లడంబున — హరి పూ ౯ ౧౨౪

3 తడవ, సారి (ఈ యర్థమున 'ఒక్క' శబ్దపూర్వకముగానే యుండును రెండు ఎదములను జేరి యుగపదర్థమునిచ్చును)

శా. కారింపకావల దొక్కపూఁటనన యాఘూతించి నాకున్ మహోదారంబైన శుభంబొనర్పుఁడు భవత్ప్రఖ్యాతి నిండారఁగన్ — హరి పూ ౯ ౫౧

సీ. పురుడించి మన కొక్కపూఁటున వల యొత్తి గగనభాగమునకు నెగసి చనిన, నివ్వ డీ మొప్పమి దప్పు — నా ఎంచ ౨ ౯

**పూఁబచ్చెడము** వి (√పూవు) పువ్వు లద్దకము గలవస్త్రవిశేషము

గీ. ప్రావృషేణ్యపయోధరపటలిచేత, గాడ్పు నీహారకగరేఖఁ గప్పుకరణి, ధరణిధరకార్ముకుఁడు శైలతనయఁ బొదివెఁ, బచ్చడంబునఁ బొల్పు పూఁబచ్చడమున — పాండు ౧ ౧౭౪

**పూఁబాన్పు** (వి √పూవు) పుష్పశయ్య, పూసెజ్జ

మ. కెందమ్మిబొందళపుష్పరాశులు ప్రాసినట్టి పడుకింటన్ మించుపూఁబాన్పునన్ — ఉ రా ౪ ౨౨౨

(ఇట్టి—పూఁబఱపు పెం)

సీ. ఈగిరికుంజంబు లిందుశేఖరు దేవి మెచ్చు పూఁబఱపులు మెఱయ మెఱయు — హరి ఉ ౪ ౭

**పూఁబాళ** వి (పూవు+పాళ) ౧ (పోఁక మున్నగు చెట్లయొక్క) కప్పు (డిప్ప) తోడి పూలగుత్తి

క. పూఁబోణులకును విటులకు, వేఁబోకలఁ దలరుసొంపు వీడ్కొలుపుఁ బురిన్, లేఁబోఁకఁబోఁకతోఁటల, పూఁబాళలకమ్మతావిఁ బొదలిన గాడ్పుల్ — భీమ ౧ ౯౧

క. లలనా విచ్చినపూఁబాళల నాలేఁబోఁక మోక లక్ష్మీసుతుఁ సేనలలో నలిజల్లెడ కత్తులకొంతము విలసనమునఁ దోఁచెం గనుమా — వరాహ ౩ ౭౯

౨ గడ భామ కోయకు వేగపడి పూఁబాళఁ బాళముగాదు కేటికి — పారి ౪ ౧౩

**పూఁబిందె(దియ)** వి (పూవు+పిందె) మిక్కిలి లేఁతపిందె, పూప

సీ. పూఁబిందె నాఁ బూప యనఁగఁ గీ ప్రబలు నత్యంతబాలకలాటు నంజ్ఞ — ఆం భా ౨ ౩౯

**పూఁబోఁడి(ణి)**=పూఁవుఁబోఁడి(ణి), పువ్వుఁబోఁడి(ణి), పువుఁబోఁడి(ణి) వి (పూవు+పోఁడి) బ పూఁబోఁడులు, పూఁబోండ్లు, పూఁబోణులు పుష్పమువలె మనోహరయగు స్త్రీ, స్త్రీ

ఉ. వీఁడె నలుండు విశ్వపృథివీవలయైకవిభుండు వచ్చుచున్నాఁ డని భీమభూమిపతినందన యాలిడిలంగఁ బల్కుపూఁబోఁడులమాట చెప్పికొని ప్రోదికుశాంగన యట్లు పల్కినన్, కోఁడిది వన్ను గ్రియ సెలంగనొకో యని యుండె వాక్యలోన్ — నైష ౩ ౧౦౪

క. వాఁడు కొందలుకొని యాపూఁబోఁడి యసారతముఁ దెచ్చి భోజన మిడఁగా, నేఁడొక్కటిచనువంతకు, వాఁ డక్కడనుండు మచితవర్తనలమెయిన్ — భోజరా ౨ ౧౩౭

గా ఏణీమూణవశాక్షి యూనరణి నుశ్రేప్రీశో క్తలం గలి నీ,ప్రాణేశుకా వినుతించి పూజ నల నారాధించి యాచెంతc బూc,బోణు శ్వేcడుక నూడిగంబు నలుంకా
కృ శశు ౨ ౧౮౧ భీమ ౧ ౯౫

పూకు వి (క ఉక్కు, పూకు) ఆcడుగుఱి, భగము

పూగతిథము సం విణ (అ ఈ అ) సంఘు మును పూరించునది (వై ని)

పూగపాత్రము సం వి అ న ౧ తమ్మపడి గము ౨ పోcకలపట్టము, వక్కలాకులపెట్టె

పూగవీరము సం వి అ పుం, న తమ్మపడి గము, పతద్గ్రాహము

పూగపుష్పిక సం వి ఆ స్త్రీ పెండ్లియందు అతిథులకు పోcకలను పువ్వులను ఇచ్చుట

పూగఫలము సం వి అ న పోక శ

పూగము సం వి అ పుం ౧ పోcక, క్రముకము శ ౨ బ్రహ్మదారువు, గంగరావి శ 3 ప్రోగు, సమూహము, సమాజము ౪ భావము ౫ ఛందస్సు న పోcక శ

పూగరోటము సం వి అ పుం హింతాళము, గిలకతాడి శ

పూగావపని సం వి ఈ స్త్రీ కత్తరి, అడకత్తెర (వై ని)

పూగి సం వి ఈ స్త్రీ పోcక శ

పూగోల వి (పూవు+గోల) పువ్వుగుచ్ఛము, పువ్వులగుత్తి

సీ క్రొవ్విరు లెనcగి పూగోలల మో పొపక నవకంపు లేcదీగె నెవులునట్లు
కు సం ౮ ౯

పూచి[1]=పూచీ వి (త పూచీ) బాధ్యత, కార్యము (శ ర)

పూచి[2](క) వి తృణవిశేషము శ (శ ర)

పూచీ=పూచి[1] వి బాధ్యత
(వవ్య) ఇంతటినుండి మీపూచీ నా కేమియు లేదు

పూచినమావులు వి బ ౧ తెల్లపొదల గుజ్జు ములు ౨ పుష్పితామ్రములు, పూచిన మామిళ్లు శ
సీ కుసుమితామ్రంబులును మచ్చగుజ్జుములును మనుచు నుండును బూచినమావు లనcగ
ఆం భా 3 ౪౭
ఉ పూచినమావులం దవిలి పూవిలుకోడున కమ్మె మాధవుం,డేచినకంక నాతc డవియే కొనియే పథికావళీజయుక్రీడుcడయ్యె
ఆము ౫ ౧౨౦

రెండర్థములకు నిదియే యుదాహరణము (తవ్వునుగ్లు పొదము అని శ ర)

పూచే అ క్రి ౧ పుష్పితము, పుష్పించు (దీనికి పూవమి, పూవని, పూవక, పూవక, పువ్వక, పూవడు మున్నగు రూపములు సిద్ధించును)
మానిని పూచిన మంచియశోకములకా నుర పొన్నలc బొన్నలc గేదcగులకా
భార ఆది ౪ ౨౦
ఉ పొన్నలు పూచెc బొన్న లాగిc బూవక ముండcబూచె గోరంటు
కు సం ౪ ౪౪౩.

క పూవనికావనితరువులం, లే వమ్ముని యా(క్రమ
మున భా రా కిష్కిం ౪౨౭

ఉ నీ కిటకా,బువ్వకపూచెనంట తిగుఁ బొ
మ్మని యొక్క టె వక్కి నల్కతోన్
రామా ౧ ౧౯౧

౨ విచ్చు, వికసించు

ఉ అ, హ్వామికి నర్చనం బొనఁగె శంబర
శ(త్రుఁడు దత్తవాటికా,ధామవినూనవీర్థికలఁ
దన్నుగఁ బూచినహల్లకంబులన్
భీమ ౫ ౪౪

3 శోభించు, (ప్రకాశించు

గీ మంజుమంజీరకంకణశింజితముబు, నమదకల
హంసకలనినాదముల దొరయ, నరసిగతిఁ
బూచి సరసులు నరి యనంగ, గంధ సుర
రాజు(కొల న ర్తనమొనర్చి
వి(క ౨ ౯

౪ (చెమ్మచేత చిన్నచిన్నచుక్క లేర్పడుటచే)
బట్టలు మొ డాగుపడు

(వ్యవ) బట్టలు పూచిపోయినవి (ప్రా వా)
మాపాఁతఱలో ధాన్యము పూచిపోయినవి

౫ (నాలుక) చిన్నచిన్నపొక్కులు లేచుట
వలన పుండువడు

(వ్యవ) నాలుక పూచి నోటికి కారము పట్టుట
లేదు

౬ (అశ్వాదుల శరీరములు) మచ్చలుదేలు
(చూ పూచినమావులు)

(వ్యవ) పూచిన ఆవుపాలు (తాగఁగూడదు

౭ నిస్సారమగు, నిస్సత్త్వమగు

సీ వీఁకతోఁ గడుఁ బూచు(మాకుల విఱు
పును భార సభా ౨ ౪౧

శ్లో అర్క(ప్రమాణా తా వృక్షా యద్వ్యాశన
నిపాతితా సం భార సభా ౬౪ ౯

జ పూఁగొమ్మ, పూఁజాలు, పూఁజెల్కు,
పూఁజేప, పూఁజేరు, పూఁదఱి, పూఁదీఁగ,
పూఁదేనియ, పూఁదేరు, పూఁదేరురాయఁడు,
పూఁదోఁట, పూఁబచ్చడము, పూఁబాన్పు,
పూఁబాళ మొ

పూజే వి (సం పూజా) దేవతాదులకుఁ జేసెడు
అర్చన, సపర్య

గీ దొమ్మిగూడి, పూజ లొనరించి యి ట్లని
పొగడి రపుడు నీలా ౧ ౩౪

కం లోఁజూపు సేరుపరి మది, రాజిలు తెలి
వెలుఁగు నెలవు రవణపు గనికిన్, దేటన
బొబ్బిలి పీటం, బూజం గను గొల్లవేసపు స్డే
వరకున్ అచ్చ భా ౧ ౨౨

చ గొప్పతమ్మికెం,పులు గదియించినట్టి జిగి
పు త్తడిముక్కలిపీటమీఁద ని,చ్చలముగ
నుంచి పూజ లిడి నీలా ౧ ౬౧

జ పూజరి, పూజవారవము, పూజారి, పూజారి
సాని

పూజు సం వి అ స్త్రీ ౧ అర్చన, దేవతా
దులకుఁ జేయుసపర్య ౨ సత్కారము,
సమ్మానన

పూజకుఁడు సం విణ (అ జితా అ)
౧ పూజించువాఁడు, అర్చకుఁడు ౨ గౌర
వించువాఁడు, సమ్మానించువాఁడు

పూజనము సం వి అ న ౧ పూజించుట,
అర్చన ౨ సన్మానించుట, గౌరవించుట,
సత్కరించుట

పూజనీయుఁడు సం విణ (అ అ అ) ౧
పూజించువాఁడు, అర్చించువాఁడు ౨ గౌర
వించువాఁడు, సత్కరించువాఁడు

పూజేరి=పూజారి విణ (పూజే+అరి) అర్చ
కుఁడు, గుడిపూజచేయువాఁడు

ద్వి జాలవారిని దివ్వటీలను బల్లగోలలవారిని గుడిపూజరులను ఖస పు ౩ ౫౧౦ పం

సీ పూజరి బ్రాహ్మణపుత్రి యొకర్తు సుగాత్రి వాఁబరగెడు కాంత గలదు కళా ౪ ౭౦

పూజేవారువము వి (పూజే+వారువము) పూజావాజి, రాజులధిరోహించు ఉత్తమాశ్వము

ఉ ఓరి యటంచి యీ వికసితోత్పలగంధిని మారునింటిసింగారపుఁ బూజవారువముఁ గారుమెఱుంగులలోని తేట నా, కూరిమి పట్టి నిట్టి నసగూటితనంబున వేలువెట్టి తాఁ, రార గణింప నన్ను వినవో మఱి యిప్పరిలోని తక్కరిక్ వి ప్ర ౪ ౨౫

వ గండభైరవపూజవారువంబు లన మెండుకొని యందు జాగిలంబులనుం గాంచి మనుచ ౪ ౨౪

పూజారి=పూజేరి విణ (పూజ+అరి—సంధిని వర్ణవికారము) అర్చకుఁడు గుడిపూజచేయువాఁడు

వ ఏనిం జేకొని పూజారిరామదేవని కొడుకులు దశా ౪ ౬ ౭౭

వ పూజారులకు ౩ మూలస్థానకేశవ దేవపూజారి (౫)౨ ద శా ౪ ౬౪౪

క పూజారివారికోడలు, కా జాఱఁగ బిందె జాతి దబ్బునఁ బడియెన్ వీథి ౧౭

ఉ పూజారివధూటి వచ్చి జలజాతవిలోచనఁ జేరి యిట్లనున్ వి క్ర ౬ ౧౨౪

పూజా(జే)రిసాని వి (√పూజే) అర్చకురాలు, గుడిపూజసేయుస్త్రీ

ఆ కేనిధృతి ఘటించి కేను యాపూజారి, సానిఁ బిలిచి ప్రియము సాలఁ జెప్పి వి క్ర ౬ ౧౧౫

వ అనినం బూజరిసాని యొత్తిఱంగున నైన భూవతోత్తము స్వేదకి తెత్తు నని యరిగిన వి క్ర ౬ ౧౧౭

ఇట్లే—పూజారివధూటి చెం

ఉ పూజారివధూటి వచ్చి జలజాతవిలోచనఁ జేరి యి ట్లనున్ వి క్ర ౬ ౧౨౪

పూజించే సం ఎ క్రి అర్చించు, పూజచేయు

గీ భద్రమూర్తి మాయింటి కభ్యాగతుఁడవు, గావఁ బూజింపవలయు ని న్నారవమున మార్కం ౩ ౭౫

సీ నీతండ్రి గంగన నిచ్చనిచ్చలు మమ్ముఁ బూజించె నవరంజిపూలచేత అచ్చరా బాల ౧౫

పూజితవ్యుఁడు సం=పూజనీయుఁడు

పూజితుఁడు సం విణ (అ ఆ అ) ౧ పూజింపఁబడినవాఁడు ౨ గౌరవింపఁబడినవాఁడు ౩ అంగీకరింపఁబడినవాఁడు

వి అ పుం వేలుపు (శ ర)

పూజిలుఁడు సం విణ (అ ఆ అ) పూజ్యుడు, వి అ పుం దేవుఁడు, వేలుపు

పూజె వి ఘూటాదులమీఁదిచిత్రము, కుండలమీఁది రంగులతోఁ జేసెడి యలంకారము. (చి ని, శ ర, బ్రౌ)

(వ్యవ) కుండకు పూజెలు పెట్టిరి (శ ర)

చూ పూజెకుండలు

జ పూజెకుండలు, పూజెగులు, పూజెసేయు

పూజెకాఁగులు వి బ=పూజెకుండలు

గీ ఘటవిశేషంబు లై కేనికదవ లనఁగఁ, బూజెకాఁగులు బుద్దనఁ బొలుచుచుండు అం భా ౩ ౩౬

ప్రాఁతప్రాఁతప్రతులపా (పూజెగులు అని శ ర)

**పూఁజెకుండలు** వి బ (√పూఁజె) అయిరేని కుండలు, (పెండ్లి సీమంతము మున్నగు శుభ కార్యములందు) రంగులువేసి యుపయోగించు కుండలు

గీ పేరటాండ్రురు హస్తపంకేరుహములఁ, బూఁ చియెత్తిన కనకంపుఁబూఁజెకుండ, లున్నత స్తనములు గాఁగ నొప్పుమిగిలెఁ, దరుణి యనుబోలె నృపగృహద్వారభూమి
వైజ. ౬ ౮౭

మ నాల్గువం,కల నుప్పొంగుచుఁ బూఁజెకుండ లల రఁగై పొంది
యయా ౪ ౧౧౬

సీ పూఁజెకుండలు నిల్పెఁ బువ్వుఁబోఁడి యొకర్తె శుభవితర్దికచతుష్కోణములను
శివరా ౭ ౫౬

**పూఁజెనేయు** స క్రి (√పూఁజె)—ఘటాదులను —చిత్రించు

సీ తురగ ఖురోద్ధూతధూళి దిక్కులఁ బ్రాఁకి భుజగారి తొ క్కలుఁ బూఁజనేయు
ఉ హ ౬ ౬౦
(శ ర పా పూఁజెనేయు మద్రి పా)

**పూజ్యపాదుఁడు** సం విణ (అ ఆ అ) పూజింపఁ దగినవాఁడు, గౌరవింపఁదగినవాఁడు
(వై ని)

**పూజ్యము** సం విణ (అ ఆ అ) శూన్యము, సున్న, (దీనికి సంస్కృతభాషలో నీయర్థము లేదు)

శా ముక్తిం డాఁడు భావికాలజనవంబుల్ దా నికిం బూజ్యముల్ పొందు ౭ ౧౫౫

ఉ కైదువు సున్న పూజ్యములు కంకటఖేట శిరస్త్రాలక్రమముల్,శే దరదంబు తత్తడి హుళిక్కి సహాయము సర్వమంగళం,బు
మనుచ ౪ ౧౦౫

సీ పేటిబలాఢ్యులు మిత్రులై యుండియు రాజ్యాధిపత్యంబు పూజ్య మయ్యె
కలు ౪ ౮౧

**పూజ్యుఁడు** సం విణ (అ ఆ అ) పూజింపఁ దగినవాఁడు వి అ పుం శ్వశురుఁడు, మామ

**పూటము=పూట** వి బరువు, భారము (శ ర)
విణ బరువుకలది, భారవంతము, ముందువెనుకల సరియైన బరువుకలది

సీ రాకపోకలుసేయు త్రాళ్ల పూటంపుబండ్ల బహుప్రకార చండధ్వనలును
ఎరమ ౫ ౪౦

(వ్యవ) ఎడవ పూటమైనది (గ్రా)

**పూటీ** వి చక్రముయొక్క అకులను కలుపుచు చుట్టు నమర్చెడి కఱ్ఱముక్కలు
(వ్యవ) ఈచక్రమునకు ఆఱు పూటీలు కలవు

**పూట=పూటము** వి బరువు
(వ్యవ) బండిముందు పూటైది
విణ భారవంతము, బరువుకలది, నిండైనది
(వ్యవ) పెండ్లివారు పూటైన రెండుబండ్ల సామాను తెచ్చినారు
పిండివంటలచే పొట్ట పూటైనది

**పూడ** వి గుదము, ముడ్డి (శ ర,చి ని)

**పూడిక** వి (√పూడు) నూయి మొదలగువాని యడుగు పడియుండుమన్ను (శ ర, గ్రా)

**పూడిపి(డ్పి)ంచే** స క్రి (√ పూడు)
౧ పూడుచునట్లుచేయు
(వ్యవ) ఆచెఱువు పూడిపించినారు
౨ పూడ్చు, పాఁతు

గీ తత్తనువు మున్ను పెత్తుటఁ దడిసి పదనయిన ధరణిఁ ద్రవ్వి పూడ్పించె వినతులందు
చం రా ౫ ౮

శ్లో శ్వభ్రే తదక్షిపదిషు ప్రచూతం స రామః
సం చం రా ౮౪ ౬

పూచు అ క్రి (క పూడు క వృద్ధై) ౧ (మట్టి మున్నగువానిచే పల్లము) నిండు, నిండు

సీ. ఎగము దుమ్మువఁ బూడి చిగిరింత వా మూయఁ బోఁగిననూతి పాఁతఱిబోతియల
ఆము ౬ ౧౩

సీ. తల్లిదండ్రులయింటఁ దనపొట్ట పూడక గొల్లరైయి గోవులఁ గోరి కాచె కలు ౪ ౭౨

౨ (రంధ్రాదులు) మూసికొనిపోవు

(వ్యవ) వాని చెవులుట్లు పూడిపోయినవి

వి పూడిక (శ ర, బ్రౌ)

విణ (మన్ను మొదలగువానిలో) మఱుఁగుపడి యుండునది (చూ పూడుఁబాము)

జ పూడిక, పూడిపించు, పూడుఁబాము, పూడుచు, పూడుపు

పూడుఁబాము. వి (√పూడు) మట్టిలో మఱుఁగు పడియుండు ఇరుదలలపాము

ఉ. శ్రీ,పానిలభుగ్విభుం డురుసహస్రశిరంబులఁ దాల్చులోకముల్, హీనవుఁ బూడుఁబాము ధరియించెద నంచుఁ దలంచు చాడ్పునన్ వి పు ౧. ౧౦ (శ ర పా పూరిపాము మద్రి పా)

పూ(డుచే)ప్పు ఎ క్రి (√పూడు) ౧ పూడఁజేయు, (మట్టి మొదలగువానిచే పల్లము) నింపు

చ. పరోవరంబుఁ బూడ్చినఁ దనయంత శంకరుఁడు చేతికి వచ్చు నటంచు గోత్రభిత్తనయుఁడు నిమ్మహానగము దానిపయిన్ వడిఁ దెచ్చి వైచినన్ కాశ ౪ ౭౦

మ. మాతుల్ తటాకంబులన్, గొలఁకుల్ పూడ్చినతుల్యాలుం బదుదు రాక్రోశించుచుం దుర్గతిజ శేవ ౩ ౨౧౪

౨ పాఁతు, నిక్షేపించు (శ ర)

పూడుపు. వి (√పూడు) ౧ పూడ్చుట ౨ పాఁతిపెట్టుట, నిక్షేపము, నిక్షేపించినధనము

గీ. పాలించు నిక్షేపవామంబు పూడు పనఁగ
అం భా ౧ ౬౪

పూత వి (√పూచు) ౧ పూచుట, వికసనము (చి ని, శ ర, బ్రౌ)

(వ్యవ) మామిళ్లు ఇంకను పూత ప్రారంభింపలేదు

౨ (నాలుక మున్నగువానియందు) చిన్నచిన్న పొక్కులులేచుట

(వ్యవ) నాయొద్ద నోటిపూతకు మంచి యౌషధ మున్నది

పూతక్రతాయి సం వి ఈ స్త్రీ — పూతక్రతునిభార్య — శచీదేవి

పూతక్రతుఁడు సం వి అ పుం ఇంద్రుఁడు

పూతతృణము సం వి అ న తెల్లకుశ ࿀

పూతద్రువు సం వి ఉ పుం పలాశము, మోదుగు ࿀ (రాజ ని)

పూతధాన్యము సం వి అ న నువ్వులు

పూతన సం వి అ స్త్రీ ౧ ఒకానొకరాక్షసి (ఇది కంసునిదాది కృష్ణునిఁ జంపుటకై కంసునిచేఁ బంపఁబడి కృష్ణునిచే హత యయ్యెను)

౨ ఒకదినుసుకరక ࿀ (ఇది సింధుదేశప్రది)

౩ గంధమాంసి, జటామాంసి ࿀ ౪ బాలగ్రహభేదము

పూతనము సం వి అ పుం గజవిశేషము (శ ర) మృతకళేబరము (ఆ ని)

పూతఫలము సం వి అ పుం పనసచెట్టు

పూతము సం విణ (అ ఆ అ) ౧ పవిత్రము ౨ తూర్పెత్తఁబడినది (ధాన్యాది) ౩ వడకట్టఁబడినది, వస్త్రాదిశోధితము ౪ క్రొత్తగా నిర్మింపఁబడినది, కనిపెట్ట బడినది వి అ పుం ౧ శంఖము ౨ శ్వేతకుశము, తెల్లగఱిక ౩ వికంకతము ࿀ ౪ సత్యము

**పూతాత్ముఁడు** సం విణ (పు ఆ స్త్రీ న) ౧ పరిశుద్ధమనస్కుఁడు ౨ శుద్ధదేహుఁడు

**పూతి** సం విణ (ఇ) దుర్గంధముగలది వి ఇ స్త్రీ ఎవిఁత్రత పుం ౧ దుర్గంధము ౨ క్రుళ్లుట ౩ ఖట్వాశమున్కఁడు, పునుఁగుపిల్లివృషణము ౪ ౧ చీముగానసు దుర్గంధవస్తువు ౨ శోపిపత్రణము

**పూతికము** సం విణ (అ ఆ అ) దుర్గంధము కలది వి అ న విష్ఠ పుం ౧ పూతికరంజము, కానుగచెట్టు ౨ పూతిమార్జాలము, మాతపిల్లి ఆ స్త్రీ కొమ్మనగొట్టపిండిచెట్టు (శాకభేదము)

**పూతికర(రం)జము** సం వి అ పుం కానుగచెట్టు, ఒకవిధమగుక్రానుగు †

**పూతికర్ణకము** సం వి అ పుం కర్ణరోగభేదము

**పూతికాముఖము** సం వి అ పుం శంబూకము, కప్పచిప్ప

**పూతికాష్ఠము** సం వి అ న ౧ దేవదారువు † ౨ సరళవృక్షము (ఇట్లే పూతికాష్ఠకము)

**పూతిగంధము** సం వి అ పుం ౧ దుర్గంధము ౨ ఇగుది, గార † న రంగము, తగరము (వాచ)

**పూతిగంధి** సం విణ (ఇ) దుర్గంధముకలది, గదురుకంపుగలది

**పూతిఘాసము** సం వి అ పుం జంతుభేదము

**పూతితైల** సం వి ఆ స్త్రీ జ్యోతిష్మతి, మాలెరుతీఁగ

**పూతిదారువు** సం వి ఉ పుం దేవదారువు †

**పూతినస్యము** సం వి అ న నాసికారోగభేదము (దీనినుండి దుర్గంధమగుశ్వాసము వచ్చును)

**పూతినాసికుఁడు** సం విణ (అ ఆ అ) దుర్గంధముగొట్టు నాసికగలవాఁడు

**పూతిపత్త్రము** సం వి అ పుం శ్యోనాకభేదము, ఒకజాతిదుండిగము †

**పూతిపుష్పిక** సం వి ఆ స్త్రీ మాదీఫలము, మాతులుంగము †

**పూతిఫలి** సం వి ఈ స్త్రీ కారుగిచ్చ, సోమరాజి †

**పూతిమయూరిక** సం వి ఆ స్త్రీ అజమోద, ఒకవిధమగుఓమము †

**పూతిమృత్తికము** సం వి అ న నరకభేదము.

**పూతిమేదము** సం వి అ పుం అరిమేదము, విట్ఖదిరము, తెలితుమ్మ †

**పూతివాతము** సం వి అ పుం ౧ దుర్గంధముగలవాయువు ౨ బిల్వవృక్షము

**పూతివృక్షము** సం వి అ పుం దుండిగము, శ్యోనాకము †

**పూతిశారిజ** సం వి ఆ స్త్రీ ఖట్వాసము, పునుఁగుపిల్లి

**పూతీకము** సం వి అ పుం ౧ పూతికరంజము, కానుగచెట్టు ౨ గంధమార్జాలము, పునుఁగుపిల్లి ౩ ఒకానొకతీఁగ (యాగములయందు సోమలతకు బదులుగా దీనిని వాడుదురు) (సీతామ్మవారితొడయని వ్యవహారము)

**పూత్కారము** సం వి అ పుం 'పూత్' అని ఊఁదుట, ఊపిరిపుచ్చుట

పూత్కారి సం వి ఈ స్త్రీ ౧ సరస్వతి ౨ నాగులరాజధాని (విల్సన్సు)

పూత్కృతము సం విణ (అ ఆ అ) 'పూత్' అని ఊదఁబడినది, ఊర్పు పుచ్చఁబడినది

పూత్యండము సం వి అ పుం ౧ కస్తూరి మెకము ౨ గడురుకంపుగల యొకదినుసు పురుగు, గంధకీటకము (శే ని)

పూథిక సం వి ఆ స్త్రీ పూతిక, కొమ్మన గొట్టెపిండిచెట్టు (వాచ)

పూదండ వి (పూవు+దండ) పుష్పమాల

గీ చేతిపూదండమీఁదవైచిన సురేంద్రుఁ, డది కరంబువఁగైకొని దశా ౨ ౨౦

సీ దోషాచరతపోగ్ని దూమాళి భారతీధవళాక్షి కొప్పు పూదండలాన ఉ రా ౧ ౨౪౪

పూదియ(దె) వి (బంగారు నెఱు వాని) పూస

మ చరమాశానికషోపలాంచలములన్ సంధ్యా
ప్రకాశోదయం, బొరఁగావించి విరించి
చేఁగొనిన సూర్యాండ స్వదార్వ్యాస్నబంగర
పుంబూదియకై వియద్విపణి నేడ్కం గాల
మన్నచ్చు చెచ్చెరఁ దెల్లించినగవ్వచాక
మన మించెందారకాచక్రముల్
శైవ రా ౧౫౯

సీ కాలకళాదుచేఁ గరఁగు సంధ్యారాగమున
నైనమూకటిపూదె యనఁగ భానుమండ
లంబు పరమ ౩ ౨౭౦

ద్వి చుట్టుప్రోవులఁ గొలుచులు గూడఁబెట్టి,
దిట్టకూళలకుఁ బూదియలు గాదియలు
అ మ క ౧ రా పా ౧ పం

సీ గుళిక పూదె యనంగ ఘటికాద్వ్యాయం
బొప్పు అం భా ౨ ౨౪౫

సీ శుద్ధకాంచనపిండంబు సూర్యుఁ దిగిచి, పూర్ణ
శశిపూఁత బంగారుపూదె నొనఁగి, ఛాయ
మసుధూర్తు ఖండించె జగము నెల్ల, దల్లఁ
కాదెడు నదె చూడు తెలివి విధుఁడు
శైవ ౭ ౧౬౪

విణ బూటకమైనది, అసత్యము

సీ పూదెమాటలు గాక బొంఁగు నే పరిచేయు
బంగార మీనిర్మలాంగమునకు
వరాహ ౯ ౧౦౧

(ఇట బంగారుపూస అని అర్థాంతరము)

౫ పూదెగట్టు

పూదుమ్ము వి (పూవు+దుమ్ము) పుష్పపరాగము, పుప్పొడి

వ మన్మంపు దుప్పటంబులతెరలమురువు లసం
గ్రమ్ము పూదుమ్ములముమ్మరంబులం గొమ్మలం
గానక యయా ౪ ౧౩

పూదెగట్టు అ క్రి (పూదె+కట్టు) పూసగట్టు, పూసగా చేర్పడు, ఘనీభూతమగు

సీ కరచరణాదులం గలయోగవిద్యఁ జాఁ బూదె
గట్టినతత్త్వబోధ మనఁగ కళా ౩ ౧౧

పూనము సం విణ (అ ఆ అ) వినష్టము

పూనించే స క్రి (√పూను)—పూనఁజేయు—

౧ పురికొల్పు, ప్రేరేచు

సీ అనించు నొకవేళ సరిది మోమున మోముఁ
బూనించు నొకవేళఁ బురుషరతికి
కళాం ౪ ౩౭

౨ వహింపఁజేయు, తాల్పించు

క తా నొల్ల నని సుమిత్రాసూనుఁడు కడ
కోరసిల్ల శుభమతి భరతుం, బూనించిరి
మానులు రామానుమతిం దదనుసారి యగు
రాజ్యంబున్ శ్రీరం మా ౩ ౧౭౪

పూనిక=పూనికి వి (√పూను—క పూనిక)

౧ కడఁక, ప్రయత్నము

గీ పులికళాసంబుగడ్డపైఁ బూన్కి మెఱయ,
పంచకుష్ఠుల గావించి పొందుసుకుండు
హర ౪ ౧౧౧

౪ ఒడంబడిక, చేసికొనినయేర్పాటు

ఉ కావనదేశవాసములఁ గాఁతియ కోర్చి
యడంగి యుండి మీ,పూనికి దీర్చి మీరలమిఁ
బొందుట యెల్లను బుణ్యదేవతా,నూనదయా
సమృద్ధి నను నొందుట గాదె సురేంద్ర
నందనా భార విరా ౫ ౩౪౯

౫ విధము, తెఱఁగు, రీతి

గీ పచ్చవిలుతునినడయాడు గిచ్చుకోల,పూన్కి
నవ్వేల్పుఁ జిగురాకుఁబోఁడియు నల,మాని
పరమేశ్వరునియాశ్రమంబుఁ జేరి
చంద్రా ౩ ౧౪

౬ ధారణము, వహించుట

గీ పారసీహార మణఁపు విశాఖజోన్న,విత్తు
ధాత్రీతలంబున వెదలు చల్లఁ,దగు ప్రస్గంపుఁ
బూన్కి జడ్డిగి మనంగఁ,గిరిణబాహుళ్యమున
మధూకరుఁడు పొడవె రా వి ౩ ౨౦

పూనిగొల్లలు వి బ గొల్లలో నొకతెగవారు
(శ ర, ప్రా)

పూనీరు వి (పూవు+నీరు) ఎన్నీరు

సీ పూనీరు కలువపుప్పాళ్లను దంపించి నునుపు
మీఱంగఁ గల్పనముఁ జల్లి
ల వి ౫ ౨౨

పూను—ఊను అ క్రి (శ పూణ్) ౧
కడఁగు, ఉద్యమించు (దీని క్త్వార్థకరూపమగు
'పూని' కొన్నిపట్ల 'క్రి విణ' వలె ఆసక్తితో,
పట్టుదలతో, శ్రద్ధతో, నొక్కి, గట్టిగా,
మిక్కిలి, బాగుగా, మున్నగు నర్థముల నిచ్చును)

ఉ అచ్యుతాం,ఘ్రిరుహాగర్భు లిద్దఱును బూ
నిరి సర్వము నిర్వహింపఁగన్
భార అది ౨ ౯

క మానుగ ధర్మక్షేత్రం,బైన కురుక్షేత్రమున
మహాహావమునకుం,బూని మునబలముపాండవు,
సేనయు నిటువన్ని యేమి సేసెం జెపుమా
భార భీష్మ ౧ ౧౪౧

చ రంభయుతు నచ్చరలెను నలుకన్ వరింపఁ
బూ,నినతినకోర్కి నొక్కమొఱ నిండఁగఁ
జేయుటకై శైవ ౨ ౫౪

సీ కు దలమ్ములు జేగ కొనిరమ్ము వాలవ
కాఁటికి నని పూని నన్నుఁ బనిచె,గురు
ఎత్ని భార ఆది ౧ ౧౧౪
(ఇచట 'ఆసక్తితో' నని యర్థము)

క నీపతులఁ గావఁ బెట్టుము, భూపాలక నన్ను
సేతు బూని యరపినన్,గోపంక్తులు రుజువడ
వొరు,చేపక పెన్నఁడును దప్పఁ జేద్పడ
పెచటన్ భార విరా ౧ ౨౪౭

చ పూని ఎగంబున కివ్వ ముద్యమం, బనుపుగఁ
జేయఁగావలయు ఆము ౨ ౭౬

(ఇట 'శ్రద్ధతో' అని యర్థము)

గీ ఇదియ నిశ్చయ మిమ్మాట వదలకుండు,
మనిన నీ వొక్కరుండవ యరుగుదేర,
వలయు లేకున్న నయ్యెడ నిలుచుదానఁ,
గానుజా నిక్కవం బని పూని ఎలిగి
భార విరా ౨ ౨౬౪

(ఇట 'నొక్కి' అని యర్థము)

చ పురుషవరేణ్యుఁ దిక్కరివిఁ బూని నుతింతు,
విక్ర ౧ ౧౩

(ఇట 'ఎక్కువగా' అని యర్థము)

సీ వానిచక్కఁదనంబు పూని చూచినఁ గాని
దిగులు దీఱదునుండీ మగువలార
ఇందు ౩ ౧౫

(ఇట 'బాగుగా' అని యర్థము)

౨ ప్రారంభించు, మొదలుపెట్టు

మ దిక్చక్రంబునం దెల్ల కో,భవతత్కీర్తినదీమ
తల్లి ప్రవహింపన్ బూన ముమ్మున్నుగా,

ఘనమైం యొబ్బుఁ గవీంద్రులకా చెలువలం
గావ్యామృతం బెంతయుకా
కళా పీఠి ౭౫

౩ ఉద్దేశించు, తలఁచు

గీ అడుగఁబూనినమాట యేరొండకు సెక్క, వంతనుండియు మగిడింపు మమరరాజ
హైమ ౩ ౨౧

వ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నారయ వర్షం బూనిన స్వారోచిషమనుసంభవం బను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన
మనుచ ౧ ౪౭

౪ వహించు (క) పక్షము వహించు

చ నరునకుఁ బూని పల్కితి వినం జవిమాలిన దొడ్డపల్కు లేవరగలిగెఁ బెట్టదరినప్పుడు మూడుము నన్ను నాతనికా
భార కర్ణ ౨ ౨౭

(నరునకుఁబూని=నరునిపక్షమువహించి)

గీ అంబకై పూని వచ్చిబలాధికుండు, జామదగ్న్యుండు సాధింపఁజాలకున్న, వాని భీష్ముఁ బాండవులకై పూనివచ్చి, కడిమి సాధించి తౌర శిఖండి పోర (భార భీష్మ ౧ ౫౫)

క కను కెట్టిన నిట్టిక నమ్మలినవిధమున దేవతాళికిఁ బూనితి శ్రీనని రుద్రు నుఱక పైఁజని, చెనయుట శిఖిశిఖల వి. దుంత సెనయుట గాదే
కు సం ౪ ౪౨౩

(చ) పట్టుదల వహించు

సీ ఘనవిద్య సాధింతు నని పూనిశాఁ డిది రొండు సెవ్వరును ము న్నెఱుఁగఁగనికి
కళా ౨ ౩౦

౫ నియమము చేసికొను, ఏర్పాటుచేసికొను

౬ వారలు పూనినట్లు వనవాసము ఎల్పిరి
భార విరా ౩ ౧౦౬

౭ నిలుచు, స్థిరముగనుండు

గీ పూనియున్నది శాబుద్ధి వానిమీఁదఁ, దగిన పనిచేయు మీకేళ కాళకేసు (గంధ ౧౪౨)

౮ ఆవేశించు

(వ్యవ) వానికి వేంకటేశ్వరస్వామి పూనినాఁడు

౯ నిండు

(వ్యవ) మడిలో నీరు పూనఁగట్టినారు

స క్రి (త పూన్) ౧ తాల్చు, ధరించు, ధారణసేయు

గీ ఎను దీవించి చేయెత్తి యిచ్చినట్టి, పున్నమాలిక సొంఁదలఁ బూనకైతి
హర ౬ ౧౯

గీ మేనఁ, గలపము లలంది తొడవు లంగములఁ బూని
పారి ౪ ౪౦

మ మతిలో నీఁడుశాస్త్రవిద్యలును సన్మానంబునం బూనితివ్
విక్ర ౧ ౧౧౦

౨ పట్టుకొను, కైగొను, గ్రహించు, తీసికొను

శా ఏ, వేళయున్ సీతయు లక్ష్మణుండుఁ దను సేవింపంగ విల్ పూని చె, ల్వా లీలందగు రామమూర్తి రఘునాథాదీశ్వరుం బ్రోవుతన్
విజ వి ౧ ౧

సీ హస్తాబ్జములఁ బూను నక్షమాల
హర ౪ ౧౧

క పూరునకు యౌవనముఁ గడు, గౌరవమున నిచ్చి వార్ధకముఁబూని ధరిత్రీరమణుఁడు
వి పు ౬ ౧౭౨

౩ మోచు, వహించు

ఉ పూవుల తేరు జక్కవలు పూన వసంతుఁడుఁ దాను సెక్కె
కు సం ౪ ౩౯౦

శా భూమీచక్రము పూని కొట్లు దలలగ్రాలుం బన్నగస్వామి
హైమ ౫ ౧౩౪

క సేనాధిపత్యమును దగఁ, బూనెద నను మార్కొనంగఁ బురుషుల నెవ్వం, గానను
భార ఉద్యో ౪ ౧౪౯

గీ. అనినఁ బతియాజ్ఞ శిరమున నతఁడు పూని
ఉ రా ౭-౧౪౪

౪ (ప్రతిజ్ఞ) చేయు, పట్టు, అవలంబించు

ఉ. క్రేనితమూఁజాఁ డొక్కరుఁడు వీర్యసముగ్రుఁడ
పోరి వచ్చి నా పూనినపూన్కి యంతయును
భంగగున్నట్లుగఁ జేసె
పారి ఉ 3 ౯౯

ఉ. ఏ నలరమ్ము లొడ్డఁ బరమేశ్వరుచిత్తము
గారిచిత్తమ్ముం, దాన కరంగి కూడ మఱి
దానికి సందియమేల వెండియున్, బూనెద
మూఁడులోకములఁ బుట్టనిపూనికి వారి
చేసములు, స్మానుగఁగూర్తు నొక్కటిగ
మార్గణకోశలభావ మేర్పడన్
కు సం ౪ ౪౭౫

వ. అతం డప్పువ్వులు గనినచోటు రుచి నడిగి చెప్పించికొని గురుప్రభావంబున నిజశప క్త్యాక్తియు నూఁది యప్పుని పూని చనియె
భార అను ౭ ౭౧౦

గీ. అతివ యొన్నఁడు మామాట కడుగు దాఁట,
కుందుదానవు నేఁ డేమి యొండుదెలఁగు,
పూని మాటికి నుడువంగ రానికినుక, నేనెదవు
నేర పెద్ది మాచెంతఁ జెపుమ
నీలా ౭ ౧౦౪

౫ పొందు, చెందు

గీ. కాల్యమునఁ జేసి యేను జాపలముఁ బూని,
నిన్ను నాయాసపెట్టితి నిగ్రహమున
హైమ ౭ ౬౧

గీ. (రామభద్రుండు) త్రాసచకిత, దారవచనా
గత భ్రాతృదర్శనమున, మానసములో నమో
దంబు పూనె నంత రాఘవ 3 ౯౫

౬ నిర్మించు, ఏర్పఱుచు

సీ. ఇమ్ములై మరుమాజారమ్ములై పొద లుండఁ
బూఁజవిశెలు చేత పూనవలదు
వసు ౧ ౧౪౧

గీ. పదఁతిజఘనంపు పెద్దదాబాలు పూని, కాయ
జాఁడు పొక్కిలను మురంగమునఁ దూఱి,
తెగువఁ గుచదుర్గయుగము సాధించుకొనుచుఁ,
దార్చునిశ్రేణి యన వళిత్రయము వెలఁగు
బిల్హ ౭ ౧౦౭

జ. పూంచు, పూఁచు, పూఁట2, పూఁటకాపు, పూఁటవాఁడు, పూఁటవాటు, పూఁటపెట్టు, పూనించు, పూనిక, పూనిక, పూనుకొను, పూనుగాఁడి, పూనె, పూన్కికాఁడు, పూన్చు, పూన్పు

పూనుకొను స0 క్రి (√పూను+కొను-స్వార్థమున) ౧ చెందు, పొందు

సీ. కుచకుంభభారభంగురమధ్యలతికలు పునరుక్త
గుణయుక్తిఁ బూనుకొనఁగ
కవిక ౪ ౩౭

౨ గ్రహించు, పట్టుకొను

మ. అనుచుం బల్లెము కేలఁ బూనుకొని కార్యా
రూఢులౌ కమ్మవారు కృష్ణ 3 33

౩ క్రి పక్షమువహించు

౪ పూనుకొని మేలంగిళ్లకు, లోనయి విహరించు
వారి లోకె మెఱుఁగదో పారి ౧ ౯౧

పూనుగాఁడి వి (√పూను) ఎద్దు మున్నగు వాని మెడపైనుంచు బండి మున్నగువానికాఁడి

సీ. పంకరుహంబులు బండికన్నులు, పొగ
డలు పలుపులు పున్నాగములు పగ్గములు
నహంకారముల్ పూనుగాఁడి
కు సం ౪ ౪౩౯

ఆ. పూనుగాఁడియంతభుజంగము లో నున్న,
వెలఁగ ప్రూనివెడఁదలోలట మూపి, దీనఁ జేయి
వెట్టు లోన నున్నది సవి, కేవ పేవ మనుచుఁ
జిలుక చెప్పె కేయూర ౪ ౪౪

పూనూక వి (పూవు+నూక) మెత్తనినూక, (చి వి, ౪ ర) మిక్కిలి సన్ననూక

పూనూన వి (పూవు+నూనె) ఎంపెంగనూనె (చి ని, శ ర)

పూనె వి (√పూను) బరణి, కరండము

రగడ త్రొక్కుసారు పదేసిమణులు తోలుత నీ కుంకుమపుగోనెలు, మిక్కుటపుఁగస్తూరి వలపుల మించుపునుఁ గిడఁ దగినపూనెలు   శుక ౧ ౧౩౩

పూన్కికాఁడు విణ (పూన్కి + కాఁడు) పూనుకొన్నవాఁడు, అభినివిష్టుఁడు

చ ఎడపక పంచె నాకఁ డొకయేలినవాఁ డని పూన్కికాఁడ వై, పొడువఁగఁ బోయె దీవు   శు సం ౪ ౪౧౭ (పూనికాఁడు అపముద్రి)

పూన్చు(నుచే)=పూంచే స క్రి (√పూన)

౧ పూను

(క) గ్రహించు, పట్టుకొను

ఉ ఖలమూ బలాప్తి కీబంధుల నొంపవచ్చు టని ఎల్కి మహోగద పూన్చి వైచినన్   ఉ రా ౩ ౨౪

ఉ రాగతరంగిణీరమణిరత్నసువర్ణవిభూషణాదు లిచ్ఛాగతిఁ గొంచుఁ బోఁదలఁచి చంపఁ గ రారము పూన్చెఁ బూన్చినన్   విక్ర ౮ ౧౨౯

(చ) వహించు, మోచు

చ హృదయములోన నిల్పి తప మిమ్ములఁ జేయుచునున్న రానుతున్, ఎదమలవృత్తిఁ బూన్ప ధృతి చాలక భూమిపడంతి నొక్కటన్ వి పు ౨ ౪౨ (ప్రా పా 'ఎదమలవృత్తిఁ బూన ధృతిచాలక' ముద్రి పా)

౨ వహింపఁజేయు, మోపఁజేయు

మ ఈయదుఁడు లోకఖ్యాతుఁ డుండంగ న్, భువనేశత్వభరంబుఁ బూన్పఁదగునే పూనక జహుజ్యాత్మజా   భార ఆది ౩ ౧౯౬

క తనయులకును మనుమలకును,దన కేయపు మాతి పోసి తాల్చినసర్వర్గంబు,ననభరము వారిఁ బూనిచి, పనిదీరి విధాత యీ ఎత్తం గొలు వుండున్   కవి ౩ ౧౨

౩ ధరింపఁజేయు

అ మహితకీర్తిపుష్పమాలికఁ బూన్చెద,నిన్ను   భార కల్య ౨ ౧౩౨

సీ నీకంటెఁ బాలనుండు,గలఁడె యెవ్వఁడు పుత్రుఁ బోలియుంచె సాకృష్ణుఁ డొక్కటి కద్రాజ్య మెల్లఁ దాఁ,కొని రిక్తపట్టంబు నినుఁ బూన్ప నతని పెట్టెదునన్న పిండంబు గుడిచె దకట   హరి ఉ ౨ ౨౫

౪ (రథాదులకునశ్వాదులను) కట్టు

ఉ సారథి జూచి నీవు రథమెంబునఁ బూన్పుము ఘోటకంబులం,దేరఁ దదీయవర్మము లతి స్ఫుట బంధముగాఁగఁ బెట్టు   భార విరా ౩ ౧౪౩

గీ అంచకొదమలఁ బూన్చిన యరద మెక్కి   సైప ౬ ౨౨ హర ౮ ౧౧౨

౫ సంధించు, కూర్చు, అమర్చు

శా గుల్ఫముల్,కంకు స్వేద్వదఁ జేర్చి బాహు యుగిమున్ ప్రేల్గుం గడుం జిక్కవై, యుండం జానువులందుఁ బూన్చి నివృతాన్యాసైగ   కళా ౫ ౧౫౫

చ బురుజాలవెంట నిచ్చెనలు పూనిచి చీమలు ప్రాఁకినట్టు లు,ద్ధరగతి నెక్కి   రంగా ౩ ౧౧౬

౬ సమర్పించు, ఇచ్చు, ఒసఁగు

సీ నీకంటె హరి బుద్ధిలేకయే నిజనేత్రకమలంబు పూన్చి చక్రంబు వడసె   కు సం ౨ ౧౬౪, ౧ ౩

చ చిటికెనవ్రేలిగోరఁ గొని చిట్టిన దీపను లోచనంబుఁ ద్రి,స్ఫుటకమలంబు వేగ హరికిఁ బూన్చెఁ దటుక్కున దక్షవాటికా,కట కవిలాసినీ చిటశిఖామణికిన్ శోభితాంశ మాలికన్   భీమ ౬ ౬౫

ఉ. ఆపద లెల్ల మాన్చి సుఖ మైనపదంబులఁ బూన్చి యాత్మసంతాపము లెల్లఁ బుచ్చి విదితంబగుసంపద లిచ్చి ప్రోవ లక్ష్మీపతి యున్నవాఁడు . వి పు. ౧ ౧౫౭.

౭ ఉంచు, పెట్టు

చ. .రథాంగపాణి చే,యరమునఁబూన్చె నొక్క యసితోత్పలమాలిక . సైవ ౭ ౧౧౨

శా. .పంక్తికంఠునకు వాణీకుండు గాన్పించి వీరాచారుం డతఁ డున్నయొక్కతలపై వాస్తాసిఁ బూన్పంగ నో,వా చాలింపు దశాస్య... ఉ రా ౨ ౧౭౯

ఉ. పూనెను మేన సొమ్ము సిరిఁ బువ్వుల దండలు చుట్టె శయ్యపైఁ, బూనిచె వక్కలాకులను... గంధ ౧౭౯

౮ పోయు

సీ తత్క్రకపూర, గీ మొకయఁబాబుశలాటు ఖండోదరమునఁ, బూన్చి యటు డించి తానను బొత్తు గలసి, సామిదప్టాన్నకబళ ముల్ సామి కొసఁగు,నగుచుఁ జవు లెచ్చ రించుచు చిగురుఁబోఁడి పాండు ౩ ౭౮

౯ నియోగించు, నియమించు

ద్వి జనకుండు సంగరస్థలి వానిఁ గూర్చి, తన తమ్ముఁ బూన్చె నధ్వరణికి ననుచు
రం రా బాల ౩౨ పా ౧౩ పం.

ద్వి నాకౌఁకునకుఁ గల్గునందన నఖిల,భూకాంతుఁగా నీవు పూన్పమీ యనుచు. .
రం రా అయో. ౧౪౦ పా ౭౦ పం
,, ,, ౯౬ పా ౨౨ పం

౧౦ కలుగఁజేయు, పుట్టించు

మ. లలితో ద్యానపరంపరావికసితాలాపప్రతిధ్వానముల్, వలభీనీలహరిన్మణీవికసిత ప్రానభ్రమం బూన్చ... ఆము. ౧ ౫౧.

౧౧. మోపు, ఆరోపించు.

చ...ఈవిధంబున వలయింతి నాపయినిఁ బూన్చెను నేరమి యింతలోఁతయుఁ, విన వలసెంగదా యిపుడు వీనుల నే మనుమాఁడ దీనికిన్. పారంగ ౨. ౭౪౧

౧౨ గురిచేయు, (లక్ష్యము తప్పిపోకుండఁ దగులుటకు బాణాదులను) మూటిగాఁ బట్టు, ఉద్దేశించు

వ. జరిగి జరిగి గిరి గదలివచ్చుగతి వచ్చుచో నచ్చెరువంగి పరేతగాజశిగి మరిం బోని యారాకాశి తెనిగిళంబునకుం బూన్చి తెగ నిండఁ దిగిచి జగతీవల్లభుం జేసె. .
రామా ౭ ౧౫౬.

ద్వి పుగవార మిముఁ బూన్చు పూజాఫలములు, పారిఁబోరి నొప్పించు పురుషుఁ డెవ్వండు
పండితా మహి ౩౦౭ పా

పూన్చు(నుపు). వి (√పూను) పూనుట, పొందుట

ఉ వర్ణనపాత్రిచిత్రగుణవైభవశోభితుఁ డత్తిం గళాపూర్ణుఁడు దేగకేటతమిపూన్పున వచ్చి ముదంబునం దద,భ్యర్ణమహీం జరించు చొక పక్షికిఁ బాతినదేఁగఁ బిల్చుచుం, దూర్ణత నేఁగ వానిజవధూటియు బోఁటులు నున్నచోటికిన్ కళా ౬ ౨౩౫.

పూప¹. వి (√పూచే) ౧ పూఁబిందె, మిక్కిలి లేఁతపిందె

గీ శాఖ చివురులు రంజిల్లె ననలు మొలిచె, నలరె విరులెల్లఁ బూపలు దలలుసూపె.
వసు. ౧ ౧౩౬

చ కొలఁదికి మించుకెంజిగురుగుత్తుల మొగ్గలఁ బువ్వుగుచ్ఛకంబులఁ బువుఁదేఁటెఁ బుప్పొడులఁ బూపలఁ బిందెలఁ గాయలన్ ఫలం,బుల నెపుడున్ సమగ్రపరిపూర్తి వహించుచుఁ దద్వనవ్రజం, బెలమి వహించు నందనసమృద్ధికిఁ గోటిగుణాధికంబుగన్.
కళా ౧ ౧౨ అని ౨. ౨౨.

౨. లేఁతపాప, చంటిపిల్ల, చంటిపిల్లవాఁడు.

వ. ...కణ్వమునీంద్రుఁడు...ఆపేల్పుంబూపవొక్క శిష్యునిచేతి కిచ్చి యాశ్రమంబునకుం దెచ్చి...
భా. శకుం. ౨. ౧౪౯.

సీ. కమ్మఁదెమ్మెరపూపదిమ్ము దా నే పేల్పు మంచుమించులపొనుపంచదూది.
యయా ౧ ౧౯.

చ కటుదులపూప పై మునులు గావనియట్టి కతల్ వచింపఁగా,వెతఁగిననీకు నాఁకలియు దీర్పులు నా యనువారు...
కళా. ౬. ౧౭౨.

(శిశురూపమును దాల్చినప్రావీణ్యములు అని భావము)

తరళ...గాలిమేపరికేనిచూ,వుల చెదంగును శాస వాల్కనపూపకందుఁ దలంచు శ్వాగులయ సంబు... యయా ౧ ౨౦

(శాసవాల్కనపూప=చంద్రుఁడు.)

పూపయిఱకండు...కృష్ణా 3 (శ. ర.)

3 కేఁబ్రాయముకల స్త్రీ, తరుణి.

చ...దువ్వలువ నిద్దపుగుబ్బల ప్రాలుచుం గళం, బలముచుఁ జెక్కు లంటుచు మదంచిత రాగరసార్ద్రిమయ్యెఁ బూ,పల మెయి సోఁకి నక్ విమలభావము నిల్చె రొట్టెపట్టునక్
వసు ౫. ౧౧౨.

విణ లేఁత, మనోజ్ఞము

సీ పూపప్రాయపుకేళఁ బురుషుచెంతకు రాక పెఱపుచేఁ గొన్ని నాళ్ళరిగెనమ్మ .
కళా శ. ౪౧.

క. ఎడ రగుట దెలిసి పాలుం,బోడువఁడు గొని చనిరొ మాటుభూమికి నట సం,దడి బొమ్మఁడు పెండ్లాడెదు,వడువునఁ గను గాఁపుఁబూపవయసుమిటారిక్.
పాండు. 3. ౭౦.

ఉ. నంటున రాజుదూతిక దినంబును నొక్క పెపంబుఁ బూని శ్యా,రింటికి రాకపోక ఘటి యింపుచుఁ బ్రాయపుఁబూపకాఁపవా,ల్గం టిని జెగ్గిచేసి... ఉ. హరిశ్చ. ౪ ౪౫

పూపచుక్కలరాజు=బాలచంద్రుఁడు.

సీ. పాటలంబగు జటాజూటంబునడుమట్టు పూప చుక్కలరాజు పొడుపుమాత్ర.
భీమ 3. ౧౯.

పూపనెలదాల్పుచెలిపట్టి=నలకూబరుఁడు.

గీ. మరుని కేళిని కేలెలదొంతొమరునిఁ, బూప నెలతాల్పుచెలిపట్టిఁ బోలఁజాలు,వానిచెలు వంబు నడుపులకోని కైనఁ, బూని దిటముగ వాక్రువ్వఁ బోలదెందు నీలా. ౧. ౭౨

పూపవెన్నెలతేఁడు=బాలచంద్రుఁడు

సీ అలరుపెంగడిమితోఁటల నాడు పూఁబోఁడి పూపవెన్నెలకోనిఁ బూనుచాన
నీలా ౧ ౨.

పూపవేఁడివెలుఁగు=బాలసూర్యుఁడు.

సీ. జడదారితలమిన్నచాలుపు పెమ్మాము విరి దామరల పూపవేఁడివెలుఁగ
అచ్చ రా శాల ౬3.

పూప². వి. (సం పూపః) భక్ష్యవిశేషము, పోఁకఱండ.

వ తోఁపలుఁ బూపలు మోదకంబులు గుడోద కంబులు ముక్కలు... కాశీ ౪ ౧౭౫.

పూపము. సం వి అ పుం అపూపము, అప్పము, అపూపసామాన్యము, పిండివంట.

పూపల. సం. వి ఆ. స్త్రీ పోలిక, పోళి, అపూపము, పిండివంట.

పూపలిక. సం.=పూపల, పూపాలి, పూపిక, పూలిక.

పూపాలి. సం. వి. ఈ స్త్రీ.=పూపల.

పూపాష్టక. సం వి ఆ. స్త్రీ. ఆగ్రహాయణీ పూర్ణిమకుఁ బిదపఁ గృష్ణాష్టమియందు విహిత మగుశ్రాద్ధము.

పూపిక సం =పూపల

పూమేను వి ఔ (పూవు+మేను) మత్స్య విశేషము, ఒకజాతిచేఁప
సీ వాలుగు ముకుదొమ్మ వల్లికట్ట పుత్తడి తామ పూమేను కడిసెలంబు (పూమీను ప్రా త్రప్రతి పా) హంస ౪ ౧౭౩

పూమొగ్గ[1] వి (పూవు+మొగ్గ) ౧ ముకుళము విరియని పువ్వు, వికాసోన్ముఖమైన ముకుళము
సీ ముకుళంబు నిగ్గు పూమొగ్గనఁ దగు ఆం భా ౩ ౪౯
గీ అతనుఁ డట్టి కోదండపూమొగ్గయఁట శరంబు, చించినదియఁట తద్ధైర్యకంచుకంబు హైమ ౧ ౭౦

పూమొగ్గ[2] వి నిగ్గు, కాంతి
సీ ముకుళంబు నిగ్గు పూమొగ్గనఁదగు ఆం భా ౩ ౪౯

పూయనము సం =పూయము

పూయము సం వి అ న ౧ చీము, రసి ౨ జాడము ౩ పీసఁగు (శ ర)

పూయరక్తము సం వి అ పుం నాసారోగ భేదము (ఇందు ముక్కునుండి చీము నెత్తురు కాఱును)

పూయారి సం వి ఇ పుం నింబము, వేము †

పూయాలసము సం వి అ పుం (సుశ్రుత) సంధిగతరోగభేదము

పూయించే ఎ క్రి (√పూచే) పుష్పింపఁజేయు
సీ పొన్నఁ ద్రెంకణమును బూయించె నొక్కర్త చిలువపువ్వనుఁబాట దుఱఁగలింప యయా ౪ ౧౯

పూయు స క్రి (స పూను) ౧ (చందనాదులను దేహముపైని) అలఁదు, ప్రాము
చ పొలుపుగఁ బూసి కట్టి తొడి ధూళిధూసరి ప్రకాశితంబుగాఁ, గలయఁగ దత్పురీ జనులు భార ఆది ౭ ౧౩౪
సీ కలపంబు పూయు తొయ్యలిమేనికమ్మవాసనలు ఉ రా ౪ ౪౭
క దంతప్రభరణిన్, నినిచినదాంకపు రిది యది, యని చెప్పక పూసెఁ దత్పదాంబుజ యుగళిన్ మనుచ ౧ ౩౭ దశా ౩ ౧ ౧౦
౨ (మన్ను మొ వానిని) మెత్తు, మేఁగు
సీ గోడలు పూయంగఁ గుమ్మ గందంబున మేదించినట్టి జవ్వాదియడుసు యయా ౧ ౪౩
సీ కుడ్యభాగంబులఁ గుంకుమంబులు పూసి విక్ర ౪ ౧౩౭
ఱ పూసికొను, పూసిగొండి

పూయోదము సం వి అ న నరకభేదము

పూరకము సం విణ (అ రికా అ) ౧ నించునది ౨ నెఱవేర్చునది వి అ పుం ౧ బీజపూరము మాదిఫలము ౨ (గణిత) గుణకమైన అంకము ౩ నాసాపుటముచే ఊపిరిని లోపలికిఁ బూరించుట (ఇది ప్రాణాయామాంగము) ౪ ప్రేతదేహనిష్పాదకమై అశౌచకాలమందు ఇయ్యఁదగు దశపిండము (ప్రేతలయొక్క అతివాహికదేహము నశింపఁగా ఈ పిండముచే దాని దేహము మరలఁ బూరితమగుచున్నది ఇది అశౌచకాలమునదుమ నియ్యఁదగినది)

పూరగించే ఎ క్రి (సం పూరః) ౧ నిర్వహించు, నెఱవేర్చు
క వగ పింక నెన్నటికిఁ దాఁపు, మిగిలి ప్రతిన పూరగింపఁ జేకొని చనుసా, మగఁటిమియు

లావు మాన్పుట, తగవే గురునకు నతండు
దానికిఁ బూనెఁ    భార ద్రో. ౨ ౩౫౯.

౨. కిడపు, వెళ్లఁబుచ్చు

ఆ. నిదుర లుడిగి తరణి కెదురుచూచుచు నుండు,
వారు నగుచు రజని పూరగింప.
భా రా యు. ౨౭౬

అ క్రి ౧ దక్కు, అనుభవయోగ్యమగు

ద్వి నీరాజ్యభారంబు నీ కిటమీఁదఁ, బూరగింపక చెడిపోవుఁగా కనుచు
నవ ౫ ౬౨ పా ౨౪ పం (క్రొత్తప్రతి పా)

౨. వ్యర్థసంభాషణముచేయు, ప్రేలు

ఆ. సభలఁ బలుకు దీవు సరికేరు నా కని, యిడ
రణంబు వచ్చె నెల్లవారి, కెఱుఁగవచ్చు
దీనఁ బెఱచోట ర జైన,యట్లు పూరగింప
నగునె యిచట    భార విరా ౫. ౭౭

శ్లో యత్త్వయా కథితం పూర్వం నాస్తి
మత్సమ ఇత్యపి, తత్సత్యం కురు రాధేయ
కురుమధ్యే మయా౽సహ
సం భార విరా ౫౮ ౪౫

జః పూరగిల్లు

పూరణ. సం వి ఆ స్త్రీ గలిజేరు † (వై ని)

పూరణము. సం విణ (అ ఈ అ) ౧ పూరించునది, నింపునది ౨ సంఖ్యాపూరణార్థకము (ద్వితీయము, తృతీయము) ౩ నెఱవేర్చునది ౪ (విల్లులోనగువానిని) సారించునది వి అ. పుం. ౧ సేతువు ౨ సముద్రము ౩ విష్ణుతైలము, ఔషధవిశేషము న ౧ నింపుట, పూరించుట, వెలితి లేకుండ చేయుట. ౨ ఉప్పొంగుట, ఉబ్బుట. ౩ నెఱవేర్చుట ౪. సంఖ్యాపూరణము ౫ గుణించుట, గుణనము ౬ కుడుములు లోనగుపిండివంటలలోపల పెట్టెడు బెల్లము వేసి నూఱినపప్పుముద్ద లోనగునది

క...పూరణము లేనిబూరెయు, వీరణమును లేని
పెండ్లి వృథరా సుమతీ.    సు. శ. ౩౯.

౭. మృతాశౌచమున దిచ్చెడు భక్ష్యవిశేషము. ౮. వర్షము. ౯. వాపతంతువులు, పడుగుపాలు. ౧౦. కుటన్నటము †. ౧౧. (వైద్యశ) ద్రవములను లోనికిఁ జొప్పించుట. ౧౨ (విల్లు మొదలగువానిని) సారించుట ౧౩ అలంకరించుట

పూరణి. సం వి ఈ స్త్రీ ౧ పూరించుసంఖ్య ౨. దుర్గ ౩. బూరుగు. † ౪ కేష్టబంక †. ౫ చిన్నగలిజేరు. †. (వై ని) పడుగుపాలు. (విశ్వ ని)

పూరము. సం వి అ పుం ౧ నించుట, నింపుట ౨ నెఱవేర్చుట ౩ జలవృద్ధి, నీళ్లపోటు, జలసమూహము (కొలను, చెఱువు మొ) ౪ వ్రణములను శుద్ధిచేయుట ౫ భక్ష్యభేదము, పూరి ౬ ముక్కుచేత శ్వాసమును పీల్చుట, పూరకము ౭ మాదీఫలము న. దావా గురువు †

పూరయిత. సం విణ (బు. స్త్రీ. బు) ౧ నించువాఁడు ౨ నెఱవేర్చువాఁడు

పూరాల్చు. అ క్రి

క ధారుణిఁగల మేతల్లను, ధారాశకరాళ వర్ష
ధారలచేతన్, నీరామని గాఁగలదని, పూరా
ల్చినభంగి మునుపు పొరిఁబొరిఁ గురిసెన్
విక్ర ౪. ౩౦.

పూరి[1]. వి (త. పూరి) గడ్డి, తృణము

ఆ కలుకుదర్భ పూరిపలుపులు భిక్షాన్న,మశన
మట్టివారి నతిముదమున, సాదరించెఁ బ్రీతి
సాదిగర్భేశ్వరి,యయ్యు సేవగింపదయ్యెఁ
గృష్ణ    భార ఆది. ౭. ౨౨౩., ౨౨౪.

సీ ఇల్లిల్లు దిరుగ నొక్కెం తట్టు శిఖ యచ్చెనే
నింటిలోఁ బూరి యిడి విసరక,రాఁజడు...
ఆము. ౪. ౧౨౬.

సీ...పుల్లు పూరి యనంగఁ జెల్లును దృణసంజ్ఞ.
అం. ఛా. ౨. ౬౨.

పూరి(రులు)గఱచుట—యుద్ధాదులందు ఓడిపోయి క్షమింప వేడుకొనువారును అపరాధము చేసినవారును క్షమింపుఁడని విజేతలను దేవతాదులను ప్రార్థించుటకు సూచకముగా గడ్డి నోట నుంచుకొను

సీ చావవెనలితోడ సరిగాక యొదలిచూపుల దొరరతనము లూరిఁ గఱచె
నీలా ౨ ౨౦

సీ తనచంచలావలోకనచారుతకు నోడి సారంగ నికరంబు పూరిఁగఱవ కవిరా ౪ ౭౬.

వ ..కొందఱు నోటిబీగముల దాసళ్లపెల్లన నోరులఁ బూరులు గఱచువారు...
ప్రబంధ ౭౯

ఇట్లే: పూరిమేయు

సీ త్రాసంబుఁ జెంది కొంతయు దేవతామణి పూరిమేయఁ గడంగ సౌరభేను,వు...
ఇందు ౧ ౧౦౯

పూరికిఁ గైకొనక—గడ్డిపరకవలెనైనను చూడక, ఇంచుకంతయు లక్ష్యముసేయక

ఉ ..ఆ,పోతర మేమిచెప్ప నముఁ బూరికిఁ గైకొన కప్సరోవధూవ్రాతము...
ప్రభా ౧ ౪౨

ఇట్లే: పూరిపుడుకకుఁ గైకొనక

సీ అనుభావశక్తి బ్రహ్మాదుల నొకపూరిపుడు కకుఁ గైకొనిపోతరీఁడు
వరాహ ౨. ౧౭౦.

నడుమఁబెట్టిన పూరిగాలు—నుపచ్చగడ్డి వేసిన భగ్గమనును, మిక్కిలి వైరము కలిగియుండు ననుట

గీ దనుజసులవైరి శౌరి నందనులు నట్లు, రక్కసులు మనవారు వారలకు మనకుఁ, బోసఁ గుసు నడుమఁబెట్టిన పూరిగాలు, కేల చిత్రరేఖా తుది నింత సఱుగు.
ఉ. హరి. ౫. ౧౫౯

చూ: పూరిపాము.

పూరి². వి. మృగములచనుఁబాలు. (శ. ర.)

సీ భేరుండముల ప్రక్కఁ బెట్టి చన్నులపూరి పాటించి శరభడింభములకిచ్చు.
హై. భా ౪. ౬౯.

పూరి³. వి ఒకానొక రాగము

ఉ భైరవి నాట...పూరి బేగడా, యారభి... మొదలైన తగురాగము లింపు మీఱఁగన్.
చెన్న. ౨. ౨౩౭.

పూరి. సం వి ఈ స్త్రీ ౧ విల్లనగ్రోవి. ౨. గలిజేరు (వై ని)

పూరించు. సం స క్రి నిండించు

గీ. ఘర్మజలమునఁ బూరించెఁ గైటభారి, యమ్మహోపల్వలంబుఁ గాళ్యంతరమున.
కాశీ. ౫. ౧౭.

గీ...శంఖమొకటి పూరించె దమరుగం బొకటి ద్రిప్పె (ఇట గాలిచే నిండునట్లు చేసె నని భావము) వరాహ. ౫. ౧౧౭.

క. ఆరణ్యపర్వశేషము, పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముముగాన్.
(ఇటపూర్తిచేయు. అని భా)
భార. అర. ౭. ౪౬౧.

పూరిక. సం వి. ఆ. స్త్రీ. ౧. పూరి, ౨. బూరె. (శ ర.)

పూరితము. సం విశ. (అ. ఆ. అ.) ౧. నింపఁబడినది. ౨. గుణింపఁ బడినది. ౩ వ్యాప్తము.

పూరిపాము. వి. (పూరి¹ + పాము.) పచ్చిగడ్డి రంగుగలపాము, పసిరికపాము.

ఉ ...కే,సానిలభుగ్విభుం డురుసహస్రశిరంబులఁ దాల్పులోకముల్, హీనపుఁ బూరిపాము ధరియించెద నంచుఁ దలంచువాఁడున్నన్.
వి. పు. పీఠ. ౧౧.

పూరిమము సం వి అ న ౧ మాలాబంధ విశేషము ౨ భక్ష్యభేదము (శ ని)

పూరీ వి (సం పూరికా, క, త పూరి) భక్ష్య విశేషము (శ ర)

పూరుదొన్న వి ఒకానొక చెట్టు (శ ర)

పూరుషుఁడు సం వి అ పుం మానవుఁడు, మగవాఁడు (పూరుషపక్షి, పూరుషజంతువు మొ)

పూరె(రే)డు వి జా (బ పూరెడులు, పూరెలులు, పూరెళ్లు, పూరేడులు, పూరేలులు, పూరేళ్లు) పక్షివిశేషము (మానవల్లంకి కాలికి మూఁడుగోళ్లు గలిగి గుంపులు గుంపులుగా నుండు ఒకజాతి పక్షి (గ్రా)

గీ పులుఁగు పూరెడు ప్రియపడి పొలములందు, మొలఁగి వెదకినఁ బుట్టవు మెకము లడఁగ
హరి పూ ౬ ౫

ఆ కారుకోడి కాఁజ కక్కెర పూరేడు, కేరజములు మఱియుఁ బేరు గలుఁగు, చిందమొందలు గాఁగఁ బొందికేఁటకు మీఱు, పిట్టలెల్ల గూండ్ల బిట్టు చెలఁగ యయా ౧ ౧౧౩

సీ పొదఁ దూఱు నొకమేటిపూరేటి వెలికిఁ బోఁదోలి కైకొను నొక్కతోఁచిగాఁడు
మనుచ ౪ ౫౦

సీ పెల్లుగాఁ బొలుచుపూరేళ్ల కుట్టులనుద్దు దొడ్డయా బెళగువ్వ లొడ్డురవలి
చంద్రా ౨ ౭౧

పూర్ణ సం వి ఆ స్త్రీ ౧ చంద్రుని పదునేనవకళ ౨ పంచమి, దశమి, పంచదశి పున్నమ, అమావాస్య అనువానిలో నేదేని యొకటి

పూర్ణకకుత్తు సం వి ద్ పుం —నిండయిన మూఁపురము గలది —ఱంపిరొద్దు

పూర్ణకము సం వి అ పుం ౧ తిలకము, బొట్టుగు ౯ ౨ పాలపిట్ట, స్వర్ణచూడపక్షి

పూర్ణకాముఁడు సం విశ (అ ఆ అ) కామము లెల్ల నిండినవాఁడు వి అ పుం పరమాత్మ

పూర్ణకుంభము సం వి అ పుం ౧ జలాదులచే నిండినకుండ ౨ యుద్ధములోఁ జూపు నొకవిన్నాణము, మల్లబంధవిశేషము ౩ (చోరుఁడు) గోడయందు కుంభాకారముగఁ జేసినరంధ్రము

శ్లో పద్మవ్యాకోశం భాస్కరం బాలచంద్రం, వాపీవిస్తీర్ణం స్వస్తికం పూర్ణకుంభం,తత్కస్మిన్ దేశే దర్శయా మ్యాత్మశిల్పం,దృష్ట్వా శ్వో యం యద్విస్మయం యాంతి పౌరాః
మృచ్ఛ ౩ ౧౪

పూర్ణకూటకము సం వి అ పుం పాలపిట్ట, చాషము (వై ని)

పూర్ణకూ(కు)టము సం వి అ పుం ౧ పక్షిభేదము ౨ చాషము, పాలపిట్ట (శ ని)

పూర్ణకోశ సం వి ఆ స్త్రీ ఓషధిభేదము

పూర్ణకోశము సం వి అ న అపూపము, అప్పము (శ ని)

పూర్ణకోష్ఠ సం వి ఆ స్త్రీ సాగరముస్తె ౯

పూర్ణపాత్రము సం వి అ న ౧ వైదికకర్మమునందలిజలపూర్ణమగు పాత్రము ౨ ౨౫౬ దోసిళ్లకొలఁది (ఇదియొకమానవిశేషము) ౩ వర్ధాపకము, నూతనవస్త్రములు సొమ్ములు లోనగువస్తువులు కట్నము కొందలగువానిచే నించినపాత్రము ౪ పుత్రజన్మోత్సవాదికాలము లందు సేవకులు స్వామివస్త్రాభరణాదులు

సంతోషముచే దోఁచుకొనుట,దోఁపు, వస్త్రాభరణాదులు పల్లెమం దిడి బంధువులు లోఁగు వారికిఁ గట్నముఁలుగాఁ బంచి యిడుట, వస్త్రాభరణాదులు సంతోషముచే బంధువులు దోఁచుకొనుట ౫ హోమాంతమందు బ్రహ్మకు నిచ్చు దక్షిణ (ఇది తండులపూర్ణ మగుపాత్రము)

పూర్ణప్రజ్ఞుఁడు సం వి అ పుం మధ్వాచార్యుఁడు, ఆనందతీర్థుఁడు
(ఇతడు ద్వైతమత ప్రస్థాపకాచార్యుఁడు)

పూర్ణబీజము సం వి అ పుం బీజపూరము, మాదిఫలము తి

పూర్ణమ సం వి ఆ స్త్రీ =పూర్ణిమ (వాచ, కల్ప)

పూర్ణమసుఁడు సం వి స్ పుం ౧ సూర్యుఁడు, ౨ చంద్రుఁడు స్ స్త్రీ పున్నమ

పూర్ణమాసము సం వి అ పుం పున్నమనాఁడు చేయుయాగము

పూర్ణము సం విణ (అ ఆ అ) ౧ పూరితము ౨ సకలము, అంత ౩ సమగ్రము, సరి చేర్పఁబడినది ౪ ముగిసినది, సమాప్తము ౫ కడచినది, జరిగినది ౬ తనిసినది, తృప్తము, అపేక్షాశూన్యము ౭ శక్తికలది, పటువైనది ౮ తిగువఁబడినది, సారింపఁబడినది (విల్లు మొ) ౯ చక్కఁగా ప్రయోగునది —వి అ న ౧ వింటివారిని చెవిదాఁక తిగుచుట, ౨ (వైదిక) జలము వి అ పుం ౧ నాగభేదము ౨ దేవగంధర్వభేదము

పూర్ణముఁడు సం వి స్ పుం =పూర్ణమసుఁడు

పూర్ణయోగము సం వి అ పుం బాహుయుద్ధభేదము

శ్లో తృణాపీడం యథాకామం పూర్ణయోగం సముష్టికం, ఏవమాదీని యుద్ధాని (వా చ)

పూర్ణవైనాశికుఁడు సం వి అ పుం సర్వము శూన్య మని వాదించుబౌద్ధులలో నొకజాతివాఁడు

పూర్ణహోమము సం వి అ పుం పూర్ణాహుతి, హోమసమాప్తియందు హోమద్రవ్యమును వేల్చుట

పూర్ణాంకము సం వి అ పుం (గణిత) నిండు అంక (వ్యతి భిన్నాంకము) ఉదా ఒకటి రెండు మొ

పూర్ణానందుఁడు సం వి అ పుం పరమాత్మ

పూర్ణానకము సం వి అ న ౧ పటహము, తప్పెట ౨ భేరీపటహాధ్వని ౩ చంద్రకిరణము ౪ వివాహోద్యుత్సవములందు కట్నముకై నూతనవస్త్రములు పండ్లు మొదలగువని నించినపల్లెము, పుత్రజన్మాదులందు బంధువులు లోనగువారు ఇంటియజమానునినుండి వస్త్రాభరణాదులను సంతోషముచే దోఁచుకొనుట, దోఁపు, పూర్ణపాత్రము ౫ పాత్రము (విల్యమ్సు)

పూర్ణామృత సం వి ఆ స్త్రీ చంద్రునిషోడశకళ (విల్యమ్సు)

పూర్ణాయువు సం వి స్ పుం —శతాయుష్కుఁడు అగు మనుజుఁడు —న శతవర్షపరిమితమగు జీవనకాలము

పూర్ణాలకము సం వి అ న =పూర్ణానకము (వాచ, కల్ప)

పూర్ణావతారము సం వి అ పుం ౧ నృసింహావతారము ౨ శ్రీరామావతారము ౩ శ్రీకృష్ణావతారము

పూర్ణాహుతి. సం. వి. ఇ. స్త్రీ. పూర్ణహోమము.

పూర్ణి. సం. వి. ఇ. స్త్రీ. ౧ పూర్తి ౨. పూర్ణిమ ౩. సముద్రపుపోటు (వై ని)

పూర్ణిక. సం. వి. ఆ. స్త్రీ ౧ నాసాచ్ఛిన్న యనెడిపక్షి (త్రి ని) ౨. పూర్ణిమ (వై ని)

పూర్ణిమ. సం. వి ఆ స్త్రీ పౌర్ణమాసి, పున్నమ

పూర్ణీభవించు. సం. అ. క్రి నిండు, పూర్ణమగు. పీ. భువనభోంతరములఁ బూర్ణీభవించుతమంబుల నుచ్చాటనంబు చేసె అని ౩ ౧౮

పూర్ణోపమ. సం. వి. ఆ స్త్రీ. ఉపమానము, ఉపమేయము, సాధారణధర్మము, ఉపమావాచకము అనెడు నాలు గంగములును గల ఉపమాలంకారము (వ్యతి. లుప్తోపమ)

పూర్తము. సం. వి. (అ. ఆ అ) ౧ పూరితము నింపఁబడినది, నిండినది ౨ ఛన్నము, కప్పఁబడినది. ౩ పాలితము, పాలింపఁబడినది —వి అ న. ౧ పాలనము, నెఱవేర్చుట ౨ పోషణము ౩. దానము ౪ ఖాతాదికర్మము (నూతిని బావిని చెఱువుం త్రవ్వించుట, గుడికట్టించుట, తోఁట నేర్పఱచుట, అన్నము పెట్టుట.—ఇది 'ఇష్ట' శబ్దముతో కూడియే తఱచు ప్రయోగింపఁబడును చూ: ఇష్టాపూర్తము)

పూర్తి. సం వి. ఇ స్త్రీ. ౧ నించుట, పూరణము ౨ నెఱవేర్చుట, ముగించుట ౩ తృప్తి, తనివి ౪ (జ్యోతి) గుణించుట ౫. విరాళమిచ్చుట, పారితోషికము
విణ. (న్. సీ. న్.) పూరింపఁబడినది.

పూర్ద్వారము. సం. వి. ర్. స్త్రీ, అ. న పట్టణపువాకిలి, గవను

పూర్నము. వి (సం. పూర్ణం, క. పూర్ణ) పప్పు బెల్లము మున్నగునవి కలిపి బూరెలు మొదలగు భక్ష్యములలోఁ బెట్టి వండెడు పదార్థవిశేషము. (శ. ర.)

పూర్యము. సం విణ (అ ఆ అ) ౧ పూరింపఁదగినది ౨ పాలింపఁదగినది, పోషింపఁదగినది

పూర్వ. సం వి ఆ స్త్రీ తూర్పు, తొలిదిక్కు

పూర్వంగముఁడు. సం విణ (అ ఆ అ) ముందు నడుచువాఁడు, అగ్రగామి

పూర్వకర్మము. సం వి న్ న ౧ పూర్వము చేసిన కర్మము ౨ మొదటఁ జేయఁదగుపని ౩ పూర్వజన్మమునఁ జేసినపుణ్యపాపకర్మము ౪ సన్నాహకార్యము, ఆరంభకార్యము

పూర్వకాయము. సం వి అ పుం మృగాదుల దేహముయొక్క ముందటిభాగము ౨ మనుష్యాదులఁ మొండెము

పూర్వకృతము సం విణ (అ ఆ అ) పూర్వము చేయఁబడినది వి అ. న పూర్వజన్మమునఁ జేసినకర్మము

పూర్వకోటి. సం వి ఇ స్త్రీ పూర్వపక్షము, విప్రతిపత్తియందుఁ బూర్వోపాత్తి మగువిషయము.

పూర్వగంగ. సం వి ఆ స్త్రీ నర్మదానది (కల్ప)

పూర్వచిత్తి. సం వి ఇ. స్త్రీ. ఒక యప్సరస.

పూర్వచోదితము. సం విణ (అ ఆ. అ) ౧ పూర్వోక్తము. ౨ పూర్వోపాత్తము (ఆక్షేపాది.)

పూర్వజ. సం. వి. ఆ స్త్రీ అక్క, జ్యేష్ఠభగిని.

పూర్వాజన్మము. సం. వి. న్. న. మునుపటి పుట్టుక

పూర్వాజము. సం. విణ. (అ ఆ అ) ౧. ముందు పుట్టినది, మొందటఁ బుట్టినది. ౨. తొల్లింటిది, ప్రాచీనము. ౩. తూర్పుది.

పూర్వాజాతి. సం. వి ఇ స్త్రీ పూర్వాజన్మము.

పూర్వాజుఁడు. సం వి అ పుం ౧. అన్న ౨. పెద్దభార్యకొడుకు ౩ పూర్వుఁడు (తాత మొం) ౪ బ పితరులు, చంద్రలోకమందలి దివ్యపితృగణము ౫. ప్రజానిష్పాదకు లగు పూర్వులు. (ప్రజాపత్యాదులు.)

పూర్వాజ్ఞానము. సం వి అ న పూర్వాజన్మమును గుఱించినజ్ఞానము

పూర్వాతనము. సం విణ. (అ ఈ అ) పురాతనము, మునుపటిది.

పూర్వాదక్షిణ. సం. వి. ఆ స్త్రీ ఆగ్నేయదిక్కు

పూర్వదిక్కు. సం వి క్ స్త్రీ తూర్పుదిక్కు.

పూర్వదిక్పతి. సం. వి. ఇ పుం ఇంద్రుఁడు

పూర్వదిగ్బలము. సం. వి అ న. సూర్యాది గ్రహముల కాలభేదము

పూర్వదిగ్వదనము. సం. వి. అ. న మేషసింహధనూరాశిత్రయము. (వాచ)

పూర్వదినము. సం. వి అ. న ౧ పూర్వాహ్ణము ౨. మొందటిరోజు, గతదినము

పూర్వదిశ్యము సం. విణ. (అ. ఆ. అ.) తూర్పుదిక్కుది, తూర్పువైపుగా నుండునది.

పూర్వదిష్టము. సం విణ. (అ. ఆ. అ) పూర్వభాగ్యానుగుణముగాఁ గలిగినది. (సుఖదుఃఖాది) ౨ పూర్వవిహితము.

పూర్వదేవత. సం. వి అ స్త్రీ. (బ) (అనాదిగా దేవభావము గల) పితరులు

శ్లో. అక్రోధనాః శౌచపరాః సతతం బ్రహ్మచారిణః, న్యస్తశస్త్రామహాభాగాః పితరః పూర్వదేవతాః॥ మను ౩ ౧౯౨.

పూర్వదేవుఁడు సం వి అ పుం ౧ తొలివేల్పు, అసురుఁడు ౨ (ద్వి) నరనారాయణులు.

పూర్వదేశము. సం వి అ పుం. జంబూద్వీపమునందుఁ బూర్వభాగము, తూర్పుదేశము.

పూర్వపక్షము. సం వి అ పుం. ౧ శుక్లపక్షము ౨ ముందటిభాగము, ముందటిప్రక్క ౩ శాస్త్రీయ సంశయమును నిరసించుకొఱకుఁ బ్రశ్నించు ఫక్కికా, సిద్ధాంతమునకు విరుద్ధమగు కోటి. ౪ (విషయి విషయము పూర్వపక్షము ఉత్తరము అనెడి) అధికరణమునందు మూఁడవ యవయవము ౫ (వ్యవహారమందు) ప్రతిజ్ఞయనెడి ప్రథమావయవము (ఇదియే వాదియొక్క వాదము పూర్వవాదము) ౬ ధర్మాధికరణ ప్రాప్త మగువ్యాజ్యము

పూర్వపదము. సం. వి అ న ౧ సమాసమందుఁగాని వాక్యమందుఁగాని పూర్వావయవమగు పదము ౨ పూర్వస్థానము

పూర్వపర్వతము. సం. వి. అ పుం తూర్పుకొండ, ఉదయాచలము

పూర్వపాలి. సం వి. న్. పుం. ఇంద్రుఁడు.

పూర్వపితామహుఁడు. సం వి. అ పుం. ప్రపితామహుఁడు, ముత్తాత.

పూర్వపీఠిక సం వి అ స్త్రీ కథాసంగ్రహము యొక్క అవతరణికాభేదము

పూర్వపురుషుఁడు సం వి అ పుం ౧ బ్రహ్మ ౨ పిత, పితామహుఁడు, ప్రపితామహుఁడు ౩ వంశమునందలి పూర్వుఁడు

పూర్వఫల్గుని సం వి ఈ స్త్రీ ఒకనక్షత్రము (చూ నక్షత్రము)

పూర్వఫల్గునీభవుఁడు సం వి అ పుం బృహస్పతి (వాచ)

పూర్వభ(భా)ద్రపద సం వి ఆ స్త్రీ ఒక నక్షత్రము (వాచ)

పూర్వభాగము సం వి అ పుం ౧ ముందటి భాగము ౨ మీఁదిభాగము

పూర్వభావము సం వి అ పుం ౧ పూర్వవర్తిత్వము, కారణత్వము ౨ పూర్వమైనదిగా నుండుట, పూర్వత్వము ౩ పూర్వవర్తి యగు భావము, పూర్వముగం దునికి (ఇది న్యాయము యొక్క ధర్మభేదము) ౪ (అలం) శృంగార రసము యొక్క పూర్వరాగమనెడి భావవిశేషము (చూ పూర్వరాగము)

పూర్వభావి సం విశ (న్ నీ న్) పూర్వవర్తియుండున్నట్టిది (పదార్థమాత్ర) వి న్ పుం కారణము

పూర్వమీమాంస సం వి ఆ స్త్రీ మీమాంస (వేదమందు కర్మభాగమునకు సంబంధించిన యొకదర్శనము)
(వ్యతి ఉత్తరమీమాంస-వేదాంతము)

పూర్వము సం విశ (అ ఆ అ) ౧ మొదటిది, ఆద్యము ౨ ముందటిది (వ్యతి 'పశ్చాత్' వెనుకటిది) ౩ ముందటికాలమునది, మునుపటిది (వ్యతి ఉత్తరము-పిమ్మటిది) ౪ మొదటిదిక్కుది, తూర్పుది (వ్యతి పశ్చిమము) ౫ తొంటిది, తొల్లింటిది, పురాతనము వి అ న పూర్వభాగము, ముందటిప్రక్క

పూర్వరంగము సం వి అ పుం నాట్యవస్తువునకు ముందు రంగవిఘ్నోపశాంతికై కుశీలవాదులు చేయు నాంధీపాఠాది

పూర్వరాగము సం వి అ పుం నాయికానాయకులకుఁ బరస్పరమేళనమునకు ముందు కలిగెడి యనురాగవిశేషము, శ్రవణమువలనఁ గాని దర్శనమువలనఁగాని పరస్పరము వృద్ధిఁ బొందిన యనురాగముగల నాయికానాయకులకు అసమాగమునందుఁ గలిగెడి దశావిశేషము (చూ కుసుంభరాగము, నీలవయర్థము)

పూర్వరాత్రము సం వి అ పుం రాత్రి యొక్క పూర్వభాగము, ముందటిదినమురాత్రి (శ ర)

పూర్వరూపము సం వి అ న ౧ రోఁగోత్పత్తికు ముందు సూచకము అవస్థ ౨ రోగము కలుగఁ బోవుటను సూచించు చిహ్నము ౩ (వ్యాకరణ) సంధి చేయునపుడు పూర్వపర స్థానుల కాదేశముగా వచ్చు మొదటివర్ణము (వ్యతి పరరూపము) ౪ అర్థాలంకారభేదము (ఇం దొక్కటి కటాలునఁ బూర్వరూపము నొందినట్లు వర్ణింపఁబడును)
క తనరారు పూర్వరూపము, పునరాత్మగుణాప్తి రైనఁ బరహారకంఠాంగు నిలిపైఁదయ్యె నీయశమున శుభ్రశరీరుఁ డయ్యె భుజగేంద్రుఁడనఘా
ఆంధ్రచంద్రా ౧౨౬

పూర్వవర్తి సం విశ (న్ నీ న్) ౧ ముందుండునట్టిది, మునుపటిది ౨ అన్యథా

సిద్ధికొఱకై మనుష్యు వర్తించునట్టిది (కారణము)

పూర్వవాదము సం వి అ పుం (వ్యవ) వాదియొక్క వాదము (ఇది వ్యాజ్యముయొక్క ఆరంభావస్థలోనిది)

పూర్వవాది సం వి ఇ పుం (వ్యవ) వాది, వ్యాజ్యగాఁడు

పూర్వవృత్తము సం వి అ న ౧ (ప్రాచీనమగువృత్తము) ఇతిహాసము ౨ పూర్వపు నడవడి

పూర్వశైలము సం వి అ పుం ఉదయపర్వతము

పూర్వసంధ్య సం వి ఆ స్త్రీ తొలిసంజ

పూర్వసరము సం విణ (అ ఈ అ) ముందఱ పోవునది, అగ్రేసరము

పూర్వసాహసము సం వి అ పుం మూఁడు విధములుంగల దండుగులలో మొదటిది (విజ్ఞా)

పూర్వాగ్ని సం వి ఇ పుం గృహస్థాగ్ని, గార్హపత్యము, ఆవసథ్యము

పూర్వార్జితము సం విణ (అ ఆ అ) పూర్వకర్మములచే గడింపఁబడినది, పూర్వులచే నార్జింపఁబడినది వి అ న పైతృకధనము, తండ్రితాతలసొత్తు

పూర్వార్ధము సం వి అ పుం న, ౧ (గ్రంథాదులయొక్క) మొదటిసగము ౨ దేహముయొక్క క్రిందుభాగము ౩ తూర్పువైపునఁగల భాగము

పూర్వాషాఢ సం వి ఆ స్త్రీ ఒకనక్షత్రము

పూర్వానుయోగము సం వి అ పుం దృష్టివాదభేదము (వాచ)

పూర్వాహ్ణ(హ్ణా)తనము సం విణ (అ ఈ అ) పూర్వాహ్ణమున జనించినది

పూర్వాహ్ణము సం వి అ పుం పగటియొక్క పూర్వభాగము, లేఁబగలు

పూర్వుఁడు సం వి అ పుం తొంటివాఁడు తండ్రి తాత ముత్తాత మొ

పూర్వోత్తర సం వి ఆ స్త్రీ ఈశాన్యదిక్కు

పూఱే(రే)కు వి (పూవు+ఱేకు) పుష్పదళము

సీ నిగిడి పూఱేకు బాగుగఁ గత్తిరించినగడ్డంబు కానఁ బొమ్మఁ గమ్మి రింప (శైవ రా ౯౩)

రగడ కన్నులు గెదఁగి పూఱేకఁగఁ బరికాధరమున దురుమును మణికర్ణిక కాశీ ౬ ౧౨౫

(బ) ధాన్యవిశేషము (శ ర, బ్రౌ)

పూలకము సం = ౧ పూలము పిండుల యున్నతభాగము (వై ని)

పూలగడ్డి వి (√పూ) తృణవిశేషము, ఒకవిధమైనగడ్డి

గీ పుల్లు పూరూఁచయును బూద పూలగడ్డి, కదురు తుంగాకు తుంగలు కలయ విడిచి హం ౨ ౪౬

పూలగురివెంద వి (√పూ) వాసంతి (శ ర)

పూలపొట్లము వి (√పూ) ౧ ఆకులు మున్నగువానిలోఁ బూవులుంచి కట్టిన పొట్లము ౨ పూవుబెత్తు, పుష్పమాలావిశేషము

సీ పువ్వుబెత్తు, పూలపొట్లముఁగ మాల్యగ్రంథియగు ఆం భా ౨ ౧౨౩

3 దీపావళినాఁడు పిల్లలు చక్రాకారముగ పువ్వులు రాలునట్లు త్రిప్పెడు ఒకవిధమగు బాణసంచు

(వ్యవ) ఈయేఁడు పిల్లలకు పూలపొట్లములు కట్టితిమి మఱి యేవస్తువులు కొనలేదు

పూలమట్టు వి (త పూమట్టై) మత్స్యవిశేషము (శ ర)

పూలాలము సం వి అ పుం గడ్డికట్ట, తృణాది స్తూపము 2 ధాన్యతృణాదిముష్టి

పూలముడుపు వి (√పూ) గర్భిణికి చేయించెడు పుష్పధారణము (శ ర)

పూలాసము సం విణ (అ ఈ అ) గడ్డి లోనగువానికట్టను విడుల్చునది,తృణాదిస్తూపవిక్షేపము

పూలి వి (క పూలి) ఒకానొకచిన్నచెట్టు (శ ర)

సీ ల్లగించెన పూలి తెల్లగించెన యుత్తరేను గుబ్బురి సంబరేను హం౦ ౪ ౧౦

పూలిక సం వి ఆ స్త్రీ పూఁభేదము (పోళీ)

పూవత్తి వి (పూవు+వత్తి)—పూవులురాలు వత్తి ఒకవిధమైన బాణసంచు, కాకరవత్తి (శ ర)

పూవింటిజేజే వి (పూవు+విల్లు+జేజే) మన్మథుఁడు

శా ఏణీమాణవకాక్షి యాచెంతపూఁ,బోటుల్ వేడుక నూడిగంబు సలుపన్ బూవింటిజేజేకడన్, బ్రాణాచారము పట్టరీతి విరిశయ్యంబేరి మై బ్రామ్పడన్

కృ శకుం 2 ౧౨౧

పూవింటిజోదు వి (పూవు+విల్లు+జోదు) మన్మథుఁడు

గీ వేడ్కఁజనుదెంచె నపుడు పూవింటిజోదు

చంద్రికా 2 ౫౪

పూవింటివాఁడు వి (పూవు+విల్లు+వాఁడు) మన్మథుఁడు (శ ర)

పూ(ల)విలుకాఁడు వి (పూవు + విలు + కాఁడు) మన్మథుఁడు

సీ చని చూడఁగల్గినఁ జాలుఁ జేయును నవ్వు కానిగాఁ బూవిలుకానినైన

యయా ౧ ౧౩

గీ ఏను ఘనుఁడనే మఱుమాటలేల లీల, పూలవిలుకానికేళి న న్నేలు బాల

చెన్న 2 ౫౩

ఇట్లే పూవిలువాఁడు

మ త్తకోకిల వచ్చి య చ్చపలాక్షి పూవిలువాని తూపుల వేఁగుచున్ ఇందు 3 ౯౧

పూవిలుతు(ల్తు)ఁడు వి (√పూవు) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు

చ పూవిలుతునిదేహాయష్టిఁ బ్రభవింపఁగఁ జేయ సమర్థమైన నైష 2 ౯౫

చ పూవిలుతునిదుండగంబు దగకే సహించఁగ మాకు నిత్తఱిన్

దశా 3 ౪౬

సీ అరవిరులే నిప్పు లసు వేని నింతకుఁ బూవిల్తు నఱచేయి పొక్కకున్నె

రాజ చ 3 ౧౧౧

క (కన్నులు) తమ్ములఁ బూవిల్తునిగ్రొ,త్తమ్ములఁ జేరికిని,గొనక యడకింపఁగఁడుఁ

యయా ౪ 3౬

ఇట్లే పూవులవిలుతుఁడు

సీ కంఠచక్కొరదింది కత్తిలానివశిరుఁ దలరు విల్కాఁడు పూవులవిలుకుఁడు గీ నాఁగ మరుజాఖ్య లగు ఆం భా ౧ ౪౫

పూవిల్లు వి ఔ (పూ+విల్లు) ౧ పుష్ప ధనువు, పుష్పచాపము

సీ పుష్పచాపంబును బుష్పగేహంబును బూవిల్లు నాఁగను బొదలుచుండు ఆం భా 3 ౫౭

శా పూవింట న్నివధాధినాథు గెలువం బూనంగ రాకుండుటన్ (శైవ ౨ ౯౮)

౨ (పూవు+ఇల్లు) పుష్పగృహము, పూల యిల్లు ఆం భా 3 ౫౭

పూవు వి (√ పూచే సం పుష్పం) ౧ విరి, పుష్పము

క పూవో పూవో యని చేఁటే విని గండు నని యోరిల్లెడు నా మైకవంబు నిలుచునే వినుఁబోవిడిచి మహోగ్రదుర్గముల పాల్పడఁగాన్ కు ఎం ౬ ౬౯

గీ కైకొనుము దీని నని యిచ్చె నాశవనిత, పూర్ణచంద్రనిభాస్య క పూవుదండ శైవ 3 ౧౨౦

గీ పూవులు ననలు విరులు, పుష్ప లలరులు నా నమంబు లగు సాం ని స్థా ౫౭

౨ కాల్చిన కాఁకరవత్తి లోనగువానినుండి పుష్పాకృతిగఁ బడు అగ్నికణము (క ర)

(వ్యవ) మేము కట్టిన కాఁకరపూవత్తులకు మంచి పూవులు పడినవి

3 కంటిలోఁ బుట్టుపువ్వు, నేత్రరోగవిశేషము (వ్యవ) వారిపిల్లకు కంటిలో పూవుపేసినది

౪ సొగసు, అందము

సీ పూవు నా సొగసును బుష్ప మొప్పు ఆం భా 3 ౪౭

పూవుగట్టు=పుష్పపర్వతము.

సీ విరులు నిలిచి, పూవుగట్టున గండకొడి కోరెఁ బరిపక్వఫలమై పెలయ రామా ౭ ౧౪౪

పూవుఁదీవ(ఁగ) వి (పూవు+తీవ) పూవులు కలతీఁగ

శా పూవుందీవల నొప్పు నొక్కభవనంబు న్గారడోత్కీర్ణముల్ మను చ ౨ ౨౨

పూవుఁదూపులజోదు వి (√ పూవు) మన్మథుఁడు

శా హస్తం బుద్ధతిం జాపి శే, పూవుందూపుల జోదు పుచ్చుకొనియెం బుంద్రేక్షుకోదండముల్ శైవ ౧ ౪౪

పూవుఁదేనియ(ఁనె) వి (పూవు+తేనియ) పుష్పరసము, మకరందము

ఉ కొన్మని పూవుఁదేనియలు కూరిమి నాకొంత లిచ్చి నీలా ౧ ౪

పూవుఁదేరు వి (పూవు+తేరు) పుష్పనిర్మిత మైనరథము

గీ వసంతుండు నూతుఁడై పూవుఁదేర,సొరయఁ గుసుమాయుధంబులు నిలిచి తెచ్చె (పీవి తెచ్చి ముద్రి పా) కు సం ౪ ౪౩౯

పూవుఁబోఁడి =పూఁబోఁడి, పువ్వుఁబోఁడి, పువుఁబోఁడి వి (√ పూవు) పువ్వువలె మనోజ్ఞ రైనస్త్రీ, స్త్రీ

గీ కాఁపుఁబూవుఁబోఁడి క్రీడా ౧ 3౪

శా పూవుంబోఁడులు శేర విప్రవిధవల్ క్రీడా ౧౬౯

క పూవుంబోఁడుల మూపుర,లో విదళవిహార సంగతులఁ దక్పరుఁ డై (మనుక ౬ ౬౧)

పూవుటెత్తు వి (పూవు+ఎత్తు) ఒకవిధమగు పూలదండ, పుష్పమాలానిశేషము

గీ కోటి గట్టిన చెంగల్వపూవుటెత్తుఁ, దరుపరిణ తోరుకదళమంజరియోఁ గొనుఁడు
ఆము ౫ ౯౦

సీ మొనసి యారైదుగ్రొమ్మడులఁ జాగపుఁ జెట్లపూవుటెత్తులు గ్రొత్తకావు లీన
అచ్చ రా యు ౧౧

పూవుతా వి (పూవు+తాయి) పుష్పాకారముగ నుండుతాయి పానవట్టము, లింగ పీఠము

ద్వి పూవుతా వద నూకి పోవులింగములు, కావి నదృశ్య మైం పఱుచులింగములు
బస పు ౪ ౩౪౭ పం

(పూతాయి ప్రాంతప్రతి పా)

పూమభామ. సం వి ఆ స్త్రీ ఇంద్రనగరి (వాచ)

పూమ(క)ము సం వి అ పుం బ్రహ్మదారు వృక్షము

పూపాత్మజుఁడు సం వి అ పుం ౧ మేఘుఁడు ౨ ఇంద్రుఁడు

పూమ(షుఁడు) సం వి ప్ పుం ద్వాదశా దిత్యులలో నొకఁడు

గీ భూతములు దీర్ఘమాడు వేఁ జోక చివర, పూష మకరస్థుఁడైనయప్పుడు ప్రయాగ
కాశీ ౩ ౯౨

పూస. వి ౧ (గాజు, లోహములు, తులసి, రుద్రాక్షము, మొదలగువాని) చిన్నపూస, గుళిక

ఉదా.—గాజుపూస, బంగారుపూస, తులసి పూస, గురిగెందపూస చెం

శా మేం, స్నానాంబూసకు సందుకేక కదియ స్నానాయంబులకా చేసినకా
అచ్చ. రా యు ౫౦౩

౨ సచ్ఛిద్రమణి (మణి అని శ ర)

గీ మానికము రతన మనంగ మణి చెలంగు, నదియు సచ్ఛిద్ర మైనఁ బూ సనఁ దనర్పు
ఆం భా ౨ ౨౪౭

౩ ప్రేలుమున్న గువానికిలు,శరీరమునందు చిన్న బుడిపిపరి నుండు ఎముక

సీ చిటిప్రేలిపూసపై ఘటియిల్లు వెడపట్టు చిమ్ములనురియడా బ్బుమ్మరముగ
ఆము ౭ ౯౦

౪ ముద్ద (చూ వెన్నపూస)

పుట్టనిబిడ్డలకు పూసలు గట్టుట—ఇంకను సంభ వింపనిదానిని జరిగినట్లే భావించి తత్సంబంధ మైనకృత్యములు సలుపుట

ఉ ధరిత్రిలోపలన్, పుట్టనియట్టిబిడ్డలకుఁ బూసలు గట్టుదు రమ్మలక్క సేసగట్టిన నుండుదాన నతికోపనుఁ డింటిగృహస్థు యోగినీ
అహల్యా ౩ ౫౪

పూసలలో(ని)దారము = (పేరములోనిదారము అన్నిపూసలను అంటిపట్టుకొని యుండునట్లు) అందఱితోను గలసి మెలసి యుండుట

క తిలలోపల నూనెక పూసలలో దారంబు పాలఁజల్లిన నీరుం,బళి వెలివెలిఁగిక మన ములుగలసి యభేదమునఁ గాఁపురకద వక దుండెడి
పాండు ౩ ౫౯

సీ సకలబంధులకుఁ బూసలలోనిదారంబువలె సరాగంబున మెలఁగుమమ్మ
వరాహ ౨ ౧౭౪

పూసగ్రుచ్చినరీతి = వరుసగా, సక్రమముగా

గీ తనదువృత్తాంత మంతయు సనుపుపడేఁగఁ, బూసగ్రుచ్చినరీతిఁ జెప్పుటయు నపుడు
తపతీ ౩ ౭౩

ఇట్టే. పూసగ్రుచ్చినగతిగా, (భంగిగా)
క కొమ్మలఁ గొల్లం బిండిగఁ, గ్రుమ్మి నుగిడి
పోయి పూసగ్రుచ్చినగతి ముగా, తమ్ముం
బిలిచినగోవుల,తమ్మునితెఱఁ గెల్లఁ జెప్పి
పూర్ణ చెంపర్చెస్ భార అను ౩ ౯౯
క అని యపాప్వకలోకుండు, దనఁ జేపట్టినది
మొదలు దా నవటికి వచ్చినయది తుదయుం
గా దొరకొని యన్నియుఁ జెప్పెఁ బూస
గ్రుచ్చినభంగిగా భోజరా ౫ ౧౩౩
జ పూసకజ్జము, పూసకట్టు, పూసకామంచి,
పూసద్రాడు, పూసనాను, పూసబొట్టు,
పూసరొమ్మిక, పూసలగురివెంద, పూసల
వాఁడు

పూసకజ్జము వి (√ పూస) మనోహరము, భక్ష్యవిశేషము (శ ర)

పూసకట్టు అ క్రి (√ పూస) చిన్నచిన్న పూసలుగా చేర్చడు
(వ్యవ) చేయి మంచిదిగనుక పేరుకొని
చక్కఁగాఁ బూసకట్టినది

పూసకామంచి వి (√పూస) తృణవిశేషము (శ ర)

పూసజ్జ వి (పూవు+సజ్జ) పూవు లుంచెడు అల్లికబుట్ట
ద్వి గట్టిగా మాలిక ల్గట్టి పూసజ్జఁ,బెట్టి యా
వేళ నర్పించెద ననుచు
ద్వి పరమ ౫ ౩౮౧ పా

పూసద్రాడు వి (పూస+త్రాడు) (పశువులకు మెడనుగట్టు) కొలికిముడి గలత్రాడు
గీ పూసద్రాడు దయ్యనుకేదుపాలఁతి మెడకుఁ,
బెరువుఁ బా లింట సేడ్చినబిడ్డకైన, మిడు
వశే డిల్ల దానను జెడితి మొల్లఁ,బోయితిమి
ప్రాలు గలపట్టి పుట్టఁబట్టి
హరి పూ ౫ ౨౧౯

పూసనాను. వి (పూస+నాను²) కంఠాభరణ విశేషము
గీ కమ్మతీఁగ, పొగడము పూస నాన్మెపై
బవిరపడగ, చుక్కబొట్టను బెటిపాటిసొమ్ము
గలిగి, కాఁపురముసేయు నవ్వీటఁ గాఁపు
కొడుకు
హం పంచ ౪ ౪౧౬ (శ ర పా)

పూసబొట్టు వి (పూస+బొట్టు—మణులతో చేర్పరచినబొట్టు) పాపటబొట్టు, చేర్చుక్క
గీ రాగినగలు సదాచారరతియు దేవపూజ
నిత్యాన్నదానంబుఁ బూసబొట్టు,చిరుచ
జల్లినకులసమ్మ చిన్నతిక్కె,గలిగి కొనుపట్టు
నాతని కాఁపురంబు
శుక ౨ ౧౪౫, ౪౦౬

పూసరొమ(మ్మి)క వి (పూస + ఎముక) వెన్నెముక, వెన్నుపూస, కశేరుక
సీ అదరియుండుఁ గశేరుకాఖ్యాయంబుగను
గ్రోశిముక యంచనఁ బూసరొముక యనఁగ
ఆం భా ౨ ౧౭౩
సీ చేదోయి కుఱుచరై చెవులు విల్వంక లై
పూసరొమ్మికములు బొందుకట్ట
కాశీ ౬ ౪౧ (చి ని పా) (పూస
ఓమ్మిక ముద్రి పా)

పూసరి వి (పూవు+సరి) పుష్పమాలిక
సీ సత్య కీల్జడకుఁ బూసరులు చుట్టి
ఉ రా ౧ ౪౪

పూసలగురివెంద వి (√పూస) (పూసలవలె నుండుగింజలుగల గురివెంద) గురివెంద, గుంజ (శ ర)

పూసలవాఁడు విణ (√పూస) రత్నములను పొనఁబట్టువాఁడు, మణికారుఁడు
సీ పొనలవాఁడు పూసలవాఁ డనంగను మణి
కారసంజ్ఞ యై మనుచు నుండు
ఆం భా ౨ ౨౮.

పూసికొను స క్రి (√పూయు) మీఁదఁబెట్టు కొను, (పైని) వైచికొను

క. తనవానిచేయు కార్యంబున కడ్డము సొచ్చి పేరఫున మెలఁగుచుఁ దానను బయిఁ బూసికొనుటఁ దన్యమును మెలఁగిన మెలఁకువ కును దుష్పుగుఁ బిదప

భార విరా ౧ ౧౭౫

పూసిగొండి విశే (√పూయు) తనకు లేని సంబంధము కలిగించుకొనువాఁడు, అనావశ్యక ముగా నితరుల కార్యము తనపైని వైచుకొను వాఁడు చూ పూసిగొండితనము

పూసిగొండితనము వి (√పూసిగొండి) తనకు లేని సంబంధము కల్పించుకొని వ్యవహరించుట

సీ పూసిగొండితనానఁ బోయి యెవ్వరికైన గొడవలు గావించు కొండెగాఁడు గీ

వారదుఁడు వరాహ ౯ ౭౬

# పృ

పృక్క సం వి ఆ స్త్రీ పిక్క శాక విశేషము (వాచ)

పృక్తము సం విశే (అ ఆ అ) ౧ కూడు కొన్నది, మిళితము ౨ సంబంధించినది ౩ నిండినది వి అ న ధనము

పృక్తి సం వి ఇ స్త్రీ స్పర్శము, తాఁకుడు

పృక్థము సం వి అ న ధనము, విత్తము (వై ని)

పృక్షము సం వి అ పుం ౧ అన్నము ౨ యుద్ధము ౩ వేదము (వై ని)

పృచ్ఛ సం వి ఆ స్త్రీ ప్రశ్నము, అడుగుట

పృచ్ఛకుఁడు సం విశే (అ చ్ఛికా అ) ప్రశ్నించువాఁడు, అడుగువాఁడు

పృచ్ఛనము సం వి అ న అడుగుట, ప్రశ్నించుట

పృచ్ఛించే సం స క్రి అడుగు, ప్రశ్నించు (శ ర)

పృచ్ఛ్యము సం విశే (అ ఆ అ) అడుగఁదగినది జిజ్ఞాస్యము

పృతన సం వి ఆ స్త్రీ ౧ సేన ౨ సేనా విశేషము (౨౪౩ రథములును అన్నియేనుఁగులును ౭౨౯ గుఱ్ఱములును వేయినిన్నూట యెనుబదిపురుషులును గలది)

పృతనాషాట్టు సం వి హ్ పుం ఇంద్రుఁడు (రూ పృతనాసాహుఁడు)

పృథ సం వి ఆ స్త్రీ కుంతి, పాండురాజు భార్య

పృథక్ సం అవ్య ౧ వేఱయిన, భిన్నము ౨ వేఱుగా, లేకుండ, విడిచి, కాక (విసార్థకము) దీనికి తెనుఁగునవ్యస్త ప్రయోగము కన్పడదు)

పృథక్కరణము సం వి అ న వేఱుచేయుట, వేఱుపఱచుట, విశేషించుట ౨ వేఱువేఱ విభజించుట

పృథక్త్వచ సం వి ఆ స్త్రీ మూర్వాచాగ తీగె

పృథక్పర్ణి సం వి ఈ స్త్రీ పృశ్నిపర్ణి, కోలపొన్న తీగె

పృథగాత్మత సం వి ఆ స్త్రీ ౧ వేఱు వేఱుగా నుండుట ౨ భేదము, వేఱిమి ౩ విశేషము

పృథగాత్మిక సం వి ఆ స్త్రీ వ్యక్తి

పృథగ్జనుఁడు సం విణ (అ ఆ అ) ౧ నీచుఁడు ౨ మూర్ఖుఁడు ౩ పాపి (శ ర)

పృథగ్బీజము సం వి అ పుం భల్లాతకవ, జీడి చె

పృథాజము సం వి అ పుం అర్జునవృక్షవ, ఏఱుమద్ది చె

పృథాజుఁడు సం వి అ పుం కుంతికొడుకు (ధర్మరాజాది)

పృథిక సం వి ఆ స్త్రీ శతపది, పిల్లిజెఱ చె

పృథివి. సం వి ఈ స్త్రీ ౧ భూమి, ౨ ఆకాశము (శ ని)

పృథివీక్షిత్తు సం వి త్ పుం రాజు

పృథివీపతి సం వి ఇ పుం ౧ రాజు ౨ యముఁడు ౩ ఋషభ మనెడిఓషధి చె ౪ అంగారకుఁడు, ౫ శాలి చె (శ ని)

పృథివీరుహము సం వి అ పుం చెట్టు

పృథుక సం వి ఆ స్త్రీ ౧ హింగుపత్రి చె ౨ స్త్రీశిశువు, ఆఁడుపిల్ల

పృథుకము సం వి అ పుం, న అడుకులు, చిపిటము (ఇది కేవల పుం అని వాచస్పత్యము) పుం పిల్ల, శిశువు

పృథుకోలము సం వి అ పుం రాజబదరము, పెద్దరేఁగు చె

పృథుచిత్తుఁడు సం వి అ పుం కుండలో ధాన్యము పోసి నిలువచేసికొను గృహస్థు (వై ని)

పృథుచ్ఛదము సం వి అ పుం ౧ హరిదర్భ చె ౨ పేఁకి చె (వై ని)

పృథుపత్త్రము సం వి అ పుం, న ఎఱ్ఱ వెల్లుల్లి, రక్తలశునము

పృథుపలాశిక సం వి ఆ స్త్రీ శఠి, కచోరము చె

పృథురోమము సం వి న్ పుం మత్స్యము, చేఁప విణ (న్ మ్ని, అ, న్, న్) పెద్ద వంౘ్రుకలు గలది

పృథురోమయుగ్మము సం వి అ పుం మీనరాశి (విల్యమ్సు)

పృథుల సం వి ఆ స్త్రీ హింగుపత్రి చె

పృథులము సం విణ (అ ఆ అ) స్థూలమైనది, బలుపు గలది

పృథువు సం విణ (ఉ ర్వీ ఉ ఉ) ౧ విస్తీర్ణము, విరివియైనది ౨ తెలివయినది ౩ గొప్పది ౪ పెక్కు, అనేకము ౫ నిపుణము, నేర్పుగలది ౬ ముఖ్యము ౭ నానావిధము —వి ఉ పుం ౧ అగ్ని ౨ విష్ణువు ౩ మహాదేవుఁడు, శివుఁడు ౪ ఒకరాజు వేనునికొడుకు ఇతఁడు గోరూపయగు భూమిని పిదికి సస్యాదిఫలములు ప్రజలకుఁ గూర్చెను ౫ నుపవి, నల్లజీలకఱ్ఱ ౬ వానరము, కోఁతి స్త్రీ ౧ త్వక్పర్ణి ౨ హింగుపత్రి చె ౩ అహిఫేనము, నల్లమందు

పృథుశాలిక సం వి ఆ స్త్రీ నల్లజీలకఱ్ఱ (వై ని)

పృథుశింబము సం వి అ పుం శ్యోనాకభేదము

పృథుశేఖరము సం వి అ పుం పర్వతము (త్రి వి)

పృథుసూప్యము సం వి అ పుం చిఱుసెనగ, మహాపాకము (వై వి)

పృథుస్కంధము సం వి అ పుం అడవిపంది (రాజ ని)

పృథూదరము. సం వి అ పుం మేషము, పొట్టేలు

పృథ్వి. సం వి ఈ స్త్రీ పృథువైనది ౧ పృథుత్వముగలస్త్రీ ౨ భూమి ౩ హింగుపత్రి ౪ నల్లజీలకఱ్ఱ ౫ పెద్దయేలకి ౬ పునర్నవ, గలిజేరు ౭ (ఛంద) పదియేనక్షరములు పాదమున నుండు వృత్తభేదము

పృథ్వీక. సం వి ఆ స్త్రీ ౧ నల్లజీలకఱ్ఱ, ౨ హింగుపత్రి (వై ని)

పృథ్వీక సం వి ఆ స్త్రీ ౧ పెద్దయేలకులు ౨ చిన్నయేలకులు ౩ నల్లజీలకఱ్ఱ ౪ హింగుపత్రి

పృథ్వీకురవకము సం వి అ పుం శ్వేతమందారకము

పృథ్వీగర్భుఁడు సం వి అ పుం లంబోదరుఁడు, విఘ్నేశ్వరుఁడు

పృథ్వీగృహము సం వి అ న గుహ (విశ్వ ము)

పృథ్వీజము. సం వి అ పుం చెట్టు న గడలవణము

పృథ్వీజుఁడు. సం వి అ పుం అంగారకుఁడు, కుజుఁడు

పృథ్వీధరము సం వి అ పుం కొండ, పర్వతము

పృథ్వీపతి. సం వి ఇ పుం =పృథ్వీశుఁడు

పృథ్వీభుజుఁడు సం వి జ్ పుం =పృథ్వీశుఁడు

పృథ్వీశుఁడు సం వి అ పుం రాజు, నేలఱేఁడు
(ఇట్లే పృథ్వీపాలుఁడు)

పృదాకువు సం వి ఉ పుం ౧ పాము ౨ తేలు ౩ పులి ౪ చిఱుతపులి, చిత్రకము ౫ చెట్టు ౬ ఏనుఁగు ౭ గోత్రకర్త యగు వైశాలాక ఋషి (శే ని)

పృశ్ని(ష్ణి) సం విణ (ఇ) ౧ ఖర్వము, పొట్టి ౨ స్వల్పము, కొంచెపాటిది ౩ చిత్రవర్ణము కలది —వి ఇ పుం అల్పశరీరము, అల్పమగు మేను —ఇ స్త్రీ ౧ కిరణము ౨ భూమి ౩ నక్షత్రములతోఁ గూడిన యాకాశము ౪ దేవకియొక్క పూర్వజన్మమందలినామము ౫ మేఘము ౬ పాలు —ఈ స్త్రీ కుంభిక

పృశ్ని(ష్ణి)క సం వి ఆ స్త్రీ కుంభిక

పృశ్నిగర్భుఁడు సం వి అ పుం నరనారాయణులలోని నారాయణుఁడు
(ఇట్లే పృశ్నిధరుఁడు, పృశ్నిభద్రుఁడు)

పృశ్నిపర్ణి సం వి ఈ స్త్రీ కోలపొన్న

పృశ్ని(ష్ణి)శృంగుఁడు సం వి అ పుం ౧ గణేశుఁడు ౨ విష్ణువు

పృషంతి సం వి ఇ పుం నీటిబొట్టు
శ్లో॥ పయః పృషంతిభిః స్పృష్టా వాంతి వాతాః శనైః శనైః (జాంబవతీ విజయం, వాచ చూ అమరవ్యాఖ్య)

వృషతము సం విణ (అ ఆ అ) చిత్రవర్ణపు బొట్లు గలది వి అ పుం ౧ బొట్లదుప్పి, తెల్లమచ్చలయిఱ్ఱి ౨ నీటిబొట్టు ౩ బొట్టు, మచ్చ ౪ వాయువునకు వాహనమగు దుప్పి ౫ దధ్యాజ్యము, పెరుగుతోఁ గూడిననేయి (హోమద్రవ్యవిశేషము) (వై వి)

వృషతాంపతి సం వి ఇ పుం గాలి

వృషతాశ్వుఁడు సం వి అ పుం వాయువు

వృషత్కము సం వి అ పుం బాణము, అమ్ము

వృషత్తు సం విణ (త్) ౧ చిత్రవర్ణము గలది ౨ నీకయుక్తము, చల్లునది ౩ బ్రహ్మ బిందువులతోఁ గూడినది (శ ర) వి త్ పుం ౧ బొట్లదుప్పి (శ ర) న నీటిబొట్టు బిందువు

వృషదంశకము సం వి అ పుం పిల్లి మార్జాలము (వై వి)

వృషదంశుఁడు సం వి అ పుం ౧ గాలి, ౨ శివుఁడు (విల్యమ్సు)

వృషదశ్వుఁడు సం = వృషదంశుఁడు

వృషదాజ్యము సం వి అ న పెరుఁగుతోఁ గలఁపఁబడిన నేయి, చిత్రాజ్యము

వృషద్బలము సం వి అ పుం వాయువు యొక్క అశ్వము

వృషభాస సం వి ఆ స్త్రీ అమరావతి, ఇంద్రనగరి

వృషాకర సం వి అ స్త్రీ క్షుద్రశిల, చిన్న బాణము

వృషాలకము సం వి అ న ౧ పెరుఁగుతోఁ గలఁపఁబడిన నేయి ౨ నేతితోఁ గలఁపఁబడిన పాలు (శ వి)

వృషోదరుఁడు సం వి అ పుం వాయువు విణ (అ ఈ అ) స్వల్పమగు ఉదరము కలవాఁడు

వృష్టము సం విణ (అ ఆ అ) అడుగఁబడినది, ప్రశ్నింపఁబడినది

వృషహాయనము సం వి అ పుం ౧ ధాన్యభేదము ౨ ఏను గు

వృష్టి సం వి ఇ స్త్రీ ౧ అడుగుట, ప్రశ్నించుట, జిజ్ఞాస, తెలియఁగోరుట ౨ తాఁకుట ౩ కిరణము (శ ర)

వృష్ఠగోపుఁడు సం వి అ పుం వీఁపుఁదిక్క కావలియగు బంటు ఇట్లే వృష్ఠరక్షకుఁడు

వృష్ఠగ్రంథి సం విణ (ఇ) కుబ్జుఁడు, గుజ్జు

వృష్ఠచక్షువు సం వి ఆ స్ పుం ౧ ఎండ్రి ౨ ఎలుఁగుగొడ్డు, భల్లూకము (విల్యమ్సు)

వృష్ఠజాహము సం వి అ న వృష్ఠమూలము

వృష్ఠదృష్టి స వి ఇ పుం ౧ ఎండ్రి ౨ ఎలుఁగుబంటి

వృష్ఠభాగము సం వి అ పుం ౧ నీవు ౨ వెనుకప్రక్క

వృష్ఠమాంసాదనము సం వి అ న ౧ పరోక్షమందు దోషములు ఎంచుట ౨ కడచిన పనికి చింతించుట (శ ర)

వృష్ఠమాంసాదనుఁడు సం విణ (అ ఈ అ) వృష్ఠమాంసాదుఁడు, పరోక్షమున దోషము లను చెప్పువాఁడు

పృష్ఠమాంసాదము సం = పృష్ఠమాంసాదనము

పృష్ఠమాంసాదుఁడు సం విణ (అ ఆ అ) ౧ వీపుమాంసమును దినువాఁడు ౨ పరోక్షమందు దోషము లెత్తి చెప్పువాఁడు, కొండెగాఁడు

పృష్ఠము సం వి అ న ౧ వీపు ౨ వెనుకప్రక్క, పశ్చాద్భాగము ౩ మీఁది (శ ర) ౪ ప్రదేశము ౫ పుస్తకమండలిపుట (ఆ ని) ౬ యజ్ఞసంబంధిసామస్తోత్రవిశేషము ౭ కుక (కే ని)

పృష్ఠయానము సం వి అ న అశ్వాదులపై స్వారిచేయుట

పృష్ఠవంశము సం వి అ పుం వెన్నెముక

పృష్ఠవాట్టు సం వి హ్ పుం ౧ పశ్చాద్భాగమున బరువు లాగెడి యెద్దు ౨ యుగపార్శ్వవాహకవృషము, కాఁడియొక్క ప్రక్క బరువు లాగెడి యెద్దు (వాచ)

పృష్ఠవాస్తువు సం వి ఉ న మేడ, ఇంటిపై నిలువు

పృష్ఠవాహ్యము సం వి అ పుం వీపుచే బరువుమోసెడి యెద్దు

పృష్ఠశయము సం విణ (అ ఆ అ) వెలికిలి పరుండునది, ఉత్తానశాయి

పృష్ఠశృంగము సం వి అ పుం అడవిమేఁక

పృష్ఠశృంగి సం వి న్ పుం ౧ పొట్టేలు ౨ దున్న ౩ పేడి, నపుంసకుఁడు ౪ భీముఁడు (మే ని)

పృష్ఠానుగుఁడు సం విణ (అ ఆ అ) పిఱుఁదఁ బోవువాఁడు, వెంబడించువాఁడు

పృష్ఠాస్థి సం వి ఇ న వెన్నెముక

పృష్ఠోదయము సం వి అ పుం మేష వృషభ కన్యా కర్కాటక ధనుర్మకరరాశులలో నొకటి

పృష్ఠ్యము సం విణ (అ ఆ అ) ౧ పృష్ఠసంబంధి వి అ పుం మోపు మోసెడి గుఱ్ఱము న పృష్ఠములనెడి యజ్ఞసంబంధిస్తోత్రవిశేషములసమూహము

# పె

పె = పెను విణ (వృత్తియందు పెనుశబ్దముగకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలినరూపము దీనికి పరుషసరళంబులు పరంబగునపుడు మగాగమంబగు

ఉదా పెన్గురుజా, పెన్జిలువ, పెన్దరి మొ ఇందలి ద్రుతంబునకు బిందువునగు పెంజీకటి, పెందెరువు, పెంధూళి మొ) పెద్దది, గొప్పది

పెంకి వి ఒకానొకతీఁగ (శ ర, బ్రౌ)

పెంకియ = పెంకె (చి ని)

పెంకు వి ౧ ఇంటికప్పున కుపయోగించు ఓడుబిళ్ల

వ్యవ ఆయింటి కింకను పెంకు వేయలేదు

౨ కుండ మున్నగువాని ఖండము

ఉదా కుండపెంకు, అద్దపుపెంకు, పుర్రెపెంకు మొ

సీ తనరును గరొటి కప్పెర పునుక పుర్రె పుచ్చె యునఁగను దగు బోరె బొచ్చె బోఁకి, పెంచు పెంచిక పెంచి పెంకంచునంగఁ దద్విశేషాఖ్య.

అం భా ౨ ౧౩౩

(ప్రాఁతవ్రాఁతప్రతి పా)

పెంకుగట్టు అ క్రి (పెంకు + కట్టు) ముదిరి గట్టిపడు

వ్యవ ఆకొబ్బెరకాయ లింకను పెంకుగట్టలేదు

పెంకె = పెంకియ వి ౧ మొండికట్టె (వేశ్యామాతవర్ణనము)

గీ పెంకెయవరాదు పట్టెగుంపె ఱసేయు — శుక ౩ ౨౧

౨ మూర్ఖుఁడు (శ ర)

౯ జ పెంకెతనము, పెంకెపురుగు

పెంకెతనము వి (పెంకె + తనము) ౧ మూర్ఖత మొండిపట్టు

వ్యవ వానిపెంకెతనము నానాఁటికి మితిమీఱు చున్నది

పెంకెపురుగు వి (పెంకె + పురుగు) బియ్యము చిట్టు మున్నగువానికిఁ బట్టెడు ఒకజాతిపురుగు (శ ర, బ్రౌ)

పెంచి = పెంచిక వి ఎగిలినకుండ మొదలగువాని ఖండము, పెంకు — ఆం భా ౨ ౧౩౩

పెంచిక = ఎంచి, పెంచుక వి ఎగిలినకుండ మొదలగువాని ఖండము, పెంకు

సీ ఎనఁటులఁగాలఁగేలఁ, (గీ) దన్నియును ద్రేసియును వెఁ బిన్నపెంచి, కలుగఁజేసి పాయసము గూరలను గూడు, ఎడుచులకుఁ బెట్టి దొంతులు ఎగులనడిచె — హరి పూ ౫ ౨౧౭

క అంచితముగ తాళక మొక, పెంచికలో నుంచి యగ్ని బిఎసదృశము గావించి పొగ వోవనీక యుదంచితముగ గరిటె నదిమి యది ఎట్టంగన్ — చి కి (చి ని)

పెంచే¹ = పెంపు, పెనుచే స క్రి (√ పెరుగు)

౧ వృద్ధినొందించు, వర్ధిల్లఁజేయు

శా శేవు ల్మాపు మతంగజంబును మణిప్రేఖండముక్తాదియుక్, రా వాణిజ్యము పెంచి యొలఁగ నరుగా — ఆము ౪ ౨౪౫

గీ తానవరుసలు పెంచు గంధర్వగాయకులను బాచుచుఁ గక్ష్యాంతరములు గడచి — దశా ౧ ౨౬౪

సీ మది కింపుఁ బెంచు కమ్మనిపదార్థంబులు బహుపాకరుచులైన పాయసములు — విక్ర ౪ ౧౭౭

౨ (ఆహారాదులచే) పోషించు, సాకు, సంరక్షించు, కాపాడు

ఉ పెంచితి ధర్మమార్గమునఁ బ్రీతి యొనర్చుచు ధారుణీప్రజన్ — భార అది ౨ ౨౦౨

మ పుత్రవతిరొ్యై తత్పుత్రు పెన్నండుఁజూడని యీభారముతోడఁ బెంచెఁ దనసైన్యంబు బెల్ల వారు న్నగన్ — కేయూర ౩ ౨౨౧

సీ బత్రుతతులప్రక్కఁ బాయనిరుయులుకలు పెలు కలఁ బెంచు పల్లులను గలిగి — (కళా ౩ ౧౦)

ఉ నర్గ మొనర్తు బ్రహ్మ యన నర్కృపఁ బెంతు జనార్దనుండు నా, భర్గుఁ డనంగఁ ద్రమ్మఱఁగఁ బారణసేయుదు విఙ్ఞగంబు — పారి ౩ ౨౬

గీ మనిచెఁ బెంచెఁ బెనిచె అన వినరుఁ, బ్రోచె ననుమాట — ఆం భా ౩ ౧౨౩

౩ ఉబికించు, స్థూలముచేయు

చ అన విని మేను పెంచి రయ మారఁగ మారుఁడు తేర వోవనిచ్చివఁ గని — భార ద్రో ౧ ౨౦౦

గీ అమృతమధురంబులగు గాదప్పు లానియాని, బొజ్జపెంచిన పెనుపాఁపజొజ్జమీఁద — హైమ ౫ ౪౬

౪ పెంపు, నాశముచేయు

సీ తనమహోమావదీక్ష దనమహోమావదీక్షపగిది నానావనీపతులఁ బెంప ('పోషించు' అని అర్థాంతరము) — వసు ౧ ౨౭

సీ తనముదర్పవలీల తనముదర్పవలీలకరణిఁ బుణ్య జనవర్గంబుఁ బెంపు — ప్రబంధ రా

సీ పెంచె మన్నిగొనెను అనంగ బొందగు
వధించె ననుటకు పమూళ్య శై
అం భా ౩ ౧౨౩

౫ అర్పు, అర్పిచేయు

౪ దీవియ పెంచి సుఖకేళిఁ దేల్చి నిజేశుఁగా
కేయూర ౩ ౨౧౪

౬ క్రి మించు, అతిశయించు

సీ పెంచుపెవ్వనిబుద్ధి ఎంచాస్త్రపరిపంథి పాద
పాథోజతాత్పర్యచర్య (కాశీ ౧ ౫౧)

పెంచే2=పెంచేక వి ౧ కుండలోనగువాని
పెంకు

౪ భవదురుతరపురదాహ, శ్రవణంబున మంట
వచ్చి బ్రహ్మాండఘటం, బవియించిన పెంచున
నీ,భువనములో నుడుకఁ బెట్టి పొరఁబెడఁ
గపులకా రామా ౪ ౬౪

౬ క్రొవ్విోయేకలంబులను గొన్నిటిఁ గూల్చి
కమర్చి పెంచులం, జివ్వచు నెజ్జిమన్నలఁది
చివ్వన నీ రిపురంగ కేర్చి కొ, క్లవ్విడు
లారఁ బ్రేల్చి కాశ ౩ ౫౦
ప్రభు ౨ ౫౩ పా ౪ ౨౦

౨ కరోటిభేదము అం భా ౨ ౧౩౩

౩ పెంచులబేరి

పెంచేక=పెంచే2

ద్వి రాజితాంచితరత్నరాజ ముందంగ, గాజు
పెంచుక లేఖ గమియించినట్లు
బస పు ౪ ౧౫౧ పం

పెంచేకొను స క్రి (√పెంచే1) ౧ పెంచు,
వృద్ధిబొందించు

(వ్యవ) అతఁ దండంబో వైరము పెంచుకొను
చున్నాఁడు వీఁ దూరక గడ్డము పెంచు
కొన్నాఁడు

౨ దత్తపుత్రునిగా స్వీకరించు, దత్తుచేసికొను

సీ అధిప యీతఁడు గాక యున్యుఁడు కుమ్మి
మరుత్తుఁ దపుత్రుఁ డై రూఢకేబా గీ భరత
జనకుఁడు దుష్యంతుఁ డాశయొన, ఘనుని
దివ్యంతుఁ దగఁ బెంచుకొనిరొఁ బాపె
హరి వం ౩ ౧౦౬

పెంచేలబేరి వి (√పెంచే2) బాలక్రీడా
విశేషము

సీ పెంచులబేరి దోపిళ్లు గాలిపటంబు ఎరిచేసి
పుటచెండు చాకిమూట
(హం౦స ౩ ౧౪౬)

పెంజలువప్రోలు వి (పెను + చిలువ +
ప్రోలు) భోగవతి, పాతాళలోక ప్రధాన
నగరము

గీ లలి నిరాబారుకే యుండు నలువప్రోలు,
బలని వినదారు లుండు పెంజలువప్రోలు,
కూడు రిదురయు నెవుడుఁ జేకూఱ కుండు,
వేలుపులప్రోలు నమ్మోటివీటి కనరు
అచ్చరా బాల ౩౧

పెంజీకటి వి (పెను+చీకటి) గాఢాంధకారము,
కాఱుచీకటి

ఆ ఖరకరాయుధాంశుకలన నమ్మోఁక పెం,జీక
టులను విరియఁజేసె నతఁడు
ఉ రా ౩ ౨౪౨

౪ ఆలోకంబగు పెం,జీకటి కవ్వల నెవ్వం,
డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతుఁగా
భాగ ౧ ౪౫

పెంజెమురు కు సం ౧౦ ౩౬

పెంజెర వి (పెను+జెఱ్ఱి) సర్పవిశేషము, ఒక
జాతిపాము దీనిభేదములు ఉడ్డుపెంజెర, ఎఱ్ఱ
పెంజెర, తున్నుపెంజెర మొ

గీ చెలఁగు సర్పభేదంబులు కెఱ్ఱి పెంజె,ర
పసిరికపా మనంగ అం భా ౧ ౧౪౪

సీ శంఖపాలకులను జాతినాగులు నుడ్డుపెంజె
రలును నెఱ్ఱపెంజెరలును. ద్వా ౧౧౦౦

క నేం డుష్పాంగంగఁ జెంతెర,కూన న్నగు లగుడ
ముత్తికొని ప్రాణంబుల్,పో నడఁచె పెట్టి
యాలో, దీవ్రతితయం బవో నిధిత్రయ
మర్యోక్ వేం పంచ ౫ ౫౫

పెంట1 వి (క పెణ్టె) ౧ (ధూళిమున్నగు వానితోఁ గూడిన) చెత్తకుప్ప

(వ్యవ) ఆగదిలో పెంట లేకుండ శుభ్రముగా ఊడ్చివేయుము

౨ (ఎరువుమున్నగు) కశ్మలపదార్థములకుప్ప

ఆ ఇంట నుండ గూడ దిప్పుడ కొని చని,
గుంటపైనఁ బెద్దకుంటపైనఁ, బెంటపైన
వైచి యింటికి నరుగుదాం, దనఁగ నద్దురుక్తి
లాలకించి వేం పంచ ౫ ౪౨

క ఈపార్వణంబు గొని గం,గాపావనజలము
లోనఁ గలుపు మటన్నన్, గోపించి చండి
యింటిన,మీాఎంబున నున్న పెంటమీాఁద
వైచెన్ జై భా ౪ ౧౦౦

గీ పెంటదొగ్గిళ్లలోఁ గడు ఎంటి శ్మశ్రు,చలన
ములఁ గ్రుక్కిళ్లొకువుల
ఆము ౬ ౧౩

౩ పూర్వము ఎకువులమంద ఉండినతావు, గోవులు మేయుగాదముఎటు

సీ ఆశితముఎట్లు పెంట నాఁ దనరుచుండు
ఆం భా ౨ ౨౭

౪ చీఁదఱ, బాధ

(వ్యవ) వాఁ డిచ్చటనుండి పోయినఁ గాని యీ పెంట వదలిపోదు

జ పెంటగట్టు, పెంటపట్టు

పెంట2=పేట1 వి ౧ శాఖానగరము, పేట

ఉదా — ముంగలపెంట మొ (శ ర)

౨ నెలవు, స్థానము

చ తలఁపులతిట్ట భావములతావళ మాసలపుట్టి
నిల్లు గో,ర్కులనెలవీడు వల్వగలతోట మవ
స్థలజన్మదేశ మ్మున్మలికలపెంట వేదనల
మంద మనోభవుపేటపట్టు మూర్ఛలనవా
వాస మున్నిరహసంతతతాపము వొందెఁ
బార్వతీ కు సం ౫ ౫౭౮

ఉ చోరరాజ పేరాఁకటిపెంట కోటీర
దావళిగంట రథాంగకేళికిన్, దేఁకువపెంట
మింటఁ బకుడెంచె దినేంద్రుఁడు కాలఘంట
యై కాళ ౪ ౯౫

పెంటగట్టు అ క్రి (పెంట1+కట్టు) పెంటకై మందగట్టు (చి ని, శ ర)

పెంటపట్టు వి (పెంట1+పట్టు) పశువులు నిలిచి పేడవేయుచోటు, దొడ్డి

వ మోఁతపెంబడిన్ వాలముపల్లంబులన్ దిరిగి
తిరిగి పెంత్రికలు పెట్టు పెంటపట్టునకు
వచ్చి మనుచ ౪ ౩౪

వ ఈపరిప్రదేశంబులఁ గారెనుపపెంటపట్ల
నీ రాలునేలుఁబిడుకల దాళ్లిడి
మనుచ ౪ ౬౦

పెంటి వి (క పెండ) పశుపక్ష్యాదులలో నాఁడుది

గీ పఱవ నోఎకయున్న మైమఱచి పెంటిఁ,
బెనఁగియున్నను బ్రసవింప కొనునియున్నఁ,
దవులు గొనియున్న మృగములఁ దివిరి
యేయ, రఱచి యాహారముగ మనువెంటక
లయిన భార ఆది ౫ ౫౩

గీ విప్రలహాస్మృతలంబులు వెదలునట్టి, వలఁది
మొత్తముల్ వొళ్చ బళ్వేఁటకాఱు, పకులఁ
జంపిన గిరిగుహాప్రతతి వెదలఁ, బాఱు
పింగంపుఁబెంట్లకుఁ బాటి యగుచు
భార శ్రీ ౧ ౧౦౨

రగడ గోతి చిలుకపెంటి మగనిఁ గూడు
గూఁడు చేరఁ జనకు, నాతి పువ్వములకుఁగా
వసాన జాన పెట్టుకొనకు
వరాహా ౩ ౯౨

గీ అంతఁ బడమటసెఱఁగంజ యాముకవిసె, నలిని
కములాసెఁ దుమ్మెద కలుగ కరఁగెఁ, బులు
గిరవు చేర మెఱుఁగుడుఁబురవు వెలిఁగెఁ,
బెంటి పెడఁబాసి జక్కవ యొంటిఁ దిరిగె
రామా ౬ ౧౦౪

విణ పశుపక్ష్యాదులలో ఆఁడుజాతిది
గీ వ్యంతరజామంబు దగుఁ బెంటిజంట యనఁగ
ఆం భా ౨ ౭౮

పెంటికరడు=ఆఁడుతరఁగ
సీ కదలినీటను పెంటికరడు పొర్లువిధానఁ
గుఱుచ గా ముంగలిమెఱుఁగు వైచి
ప్రబంధ ౧౦౯
('పెంటికరడు' చిన్నఅల యనిభావము)
జ పెంటితనము, పెంటితాడు, పెంటిపడు,
పెంటిపోతులు

పెంటిక=పెంట్రిక వి మేఁకలు మున్నగుజంతు
వులు చిన్నఉండలుండలుగా వేయుపేఁడ
శా ని ష్కైరూపముగా భజింతు మదిలో
నీరూపు మోకాలా త్త్రీ,చనోన్న కంచమెం
మేఁక పెంటికయొ యీ నం దేహము
ల్మాన్చి కాళ ౪ ౧౫

పెంటితనము వి (పెంటి+తనము) స్త్రీత్వము,
దైన్యము
సీ తగునె యర్జున యీ పెంటితనము నీకు, దండి
వై లెమ్ము మనను పేదతనము విడిచి
భార భీష్మ ౧ ౧౯౨

పెంటితాడు వి (పెంటి+తాడు) ఆఁడుతాడి
చెట్టు (శ ర)

పెంటిపడు అ క్రి (పెంటి+పడు) కవగూడు
ద్వి మృగపక్షిపశువులు మేఁకలు వదలి, పగలు
రేలును పెంటిపడి పాయవయ్యె
ప్రభులిం ౩ గతి ౨౦ పా ౧౮ పం

పెంటిపోతులు వి బ (పెంటి+పోతు) తిర్య
క్మిథునము, పశుపక్ష్యాదులజత
సీ గం డనఁ బో తనఁ గాను దిర్యక్పురుషాఖ్య
యా తన్మిథునాభిధ పెంటిపోతు లనంగ
విలసిల్లు ఆం భా ౨ ౧౦౦

పెంట్రిక=పెంటిక
ద్వి కాటకోటందు కాఁ గలఁ డొక్కగొల్లఁ,
డేఁట పెంట్రిక తన కీశ్వరుఁ డనుచు
బస పు ౨ ౪౧౪ పం
వ మేఁతవెంబడిం బోలముపల్లంబులం దిరిగితిరిగి
పెంట్రికలు పెట్టుపెంటపట్టుఁగను వచ్చి
మనుచ ౪ ౩౪

పెండ=పేఁడ వి పశువిష్ఠ, గోమయాది
ఉ వ్రతా,ధీనతఁ బెండ యన్నమును ధేనువు
మూత్రముఁ బాలుఁ బానమున్, గా నియతి
వ్యసించి బహుకామ్యఫలంబులఁ బొందు
భూవరా భార అను ౩ ౧౬
శ్లో కామ్యాష్టమ్యాం వర్తితవ్యం త్రిరాత్రం,
రపై ర్వా గో శ్శకృతా ప్రస్నవై ర్వా
సం భార అను ౧౧౧ ౧౯
చ ప్రమదము లుల్లసిల్లఁ దనుపారఁగ నిద్రలు
వోయి పల్మఱుం, గమియు సెమర్చి మే
ఎఱుఁగఁగా బొరిఁ బెండలు పెట్టి లేచి
వృత్సములఁ దలంచి పంచితివి చన్నులు చేఁ
పొదవంగ హరి వూ ౭ ౧౬౫
(పెండలుపెట్టు=పేఁడలువేయు)
సీ వాఁడును దనకుఁ దా వలచి కొట్టములోనఁ
బెండరొత్తెడునట్టిముండ కిచ్చె
ద్వా ౧ ౭౭

పెండరము వి పెండారము (శ ర)

పెండలము=పెండ్లము[1] వి (సం పిండాలుః)
౧ ఒకజాతిదుంప

ఉ. నిండిన చేర్కొ విూలు విట నీరరుహాయత నేత్ర రత్నపుం, బెండెము పెట్టు పెల్లవడి బెగ్గిలి పెక్కువోలయల్కఁ జేరలం, దండము వెట్టినట్టి మగతండము నూరులఁ జేర కుండఁగాఁ బెండెముఁ బెట్టుచే యనచుఁ జేర్చి నటింపఁగ బుద్ధి పుట్టెడున్.
చిత్రభా. ౩. ౮౪.

గీ. . పాదాంగదం బొప్పు వందె యనఁగఁ, బెండెమనఁ బెండియం బనఁ బెండెర మనఁ, గాను బెండేరమనఁగ .
అం. ధ్యా. ౨. ౧౫౦.

గీ. ... కమలారి హరిపదాక్రాంతుఁ డయ్యె, ననఁగ మగరాలపెండియం బునిచె శౌరికి.
ఇలా దేవీయము. ౧ ౧౭౫. (వ్రా)

చ. కలుతుహారంగు పెండియము ఘల్లన
ఇలా దేవీయము. ౨. ౧౭౩. (వ్రా)

చ. వారి పెందలై దిక్పతులయాశ్రితులం దన రారి యున్నయా, విరుదులఁ గ్రాలుపెండి యముఁ బెం పగురత్నమయూఖచారుమా, పురమును వామపాదమునఁ
భా. రా. యు. ౧౯౩౮.

**పెండె(డియ)ము².** వి. పశువులదొడ్డిలోనగు వానికి కంప మున్నగువానితో చేర్పఁబడిన తలుపు, పలుగాడి.

సీ. ... దొడ్డయాఁబోతులై పుట్టి రచ్చెరువుగఁ, జాటు వాల్గాలంపు సూదు లెంతయుఁ గ్రొవ్వి యున లేనిలావున సెల్లకదల, పెలఁ గుచు భవి సెల్ల మేయుచు గోడలు పెలఁ గుచు పెండెము ల్వ్రాలఁగఁ ద్రొక్కి.
నీలా. ౨. ౮౩.

ఉ. నిండిన చేర్కొ విూలు విటనీర రుహాయత నేత్ర రత్నపుం, బెండెము పెట్టు పెల్లవడి బెగ్గిలి పెక్కువోలయల్కఁ జేరల, దండము వెట్టినట్టి మగతండము నూరులఁ జేరకుండఁగాఁ బెండెము పెట్టుచే యనచుఁ జేర్చి నటింపఁగ బుద్ధి పుట్టెడున్. చిత్రభా. ౩. ౮౭.

**పెండెముదువులు.** వి. ఓ. (పెండె + ముదువులు.) ధాన్య విశేషము.

వ. పసుపు యుద్దులు మంచి విరులు రంభ వెక్కోళ్లు చిలుకి ముక్కులు మధురములు చామరాలు పెండెముదువులు రాచ వన్నెలు .. నూట నాలుగు వగల పైరుల
ప్రబంధ ౧౧౭.

**పెండె(డే)రము = పెండెము¹.** వి. వీరులు విరుదుగా కాలియందు ధరించెడు అందె, గండ పెండేరము, అందె, పాదాంగదము.

వ. సకలకళల నడిసన్న చవురుల ప్రోడఁ బెరిగినది గాఁబోలుఁ గాలి పెండెరంబు కొక్కటి గలిగియున్నది ...
ప్రభా. ౩. ౭౬.

ద్వి. విరుదుగా కలకాలఁ బెండెరం బెసఁగ, బరగంగ బంగారు పావలు దొడిగి . .
ద్వి. క. సా. ౧. ౧౭౭. పం.

ద్వి. సిరిమి డాకాలఁ బెండేరంబుఁ బెటి ..
ద్వి. సారంగ. ౨. ఆ. (క. ర.)

**పెండ్ల(డ్లియ)గు.** అ. క్రి. (పెండ్లి + అగు.) వివాహితుఁడగు, పెండ్లాడు.

ఆ. ఎంతో చదుర యైనఁ బెండ్లాట కేసి ...
అము. ౬. ౧౦౯.

క. ద్వారవతి కేఁగి యర్జునుఁ, డారంగ సుభద్రఁ బెండ్లియై వచ్చి ...
భార. ఆది. ౩. ౧౬.

**పెండ్లము¹** = పెండలము.

ఆ. చేమ కంద గనుము చిటిగోరు పెండ్లము, పొసఁగు తెల్ల గనుము ..
హంస. ४. ౧౩౧.

**పెండ్లము²** = పెండ్లాము. వి. (√ పెండ్లి. ఇ. పెండలి) భార్య.

(రావణుఁడు రంభతో నన్న మాటలు.)

ఆ. కొడుకు పెండ్లమైనఁ గోడలు గాక పూఁ,బోఁడి యిట్లు దరువె పోయిపోయి, నీవు మాటలాడ నేర్తుఁ గదా యని, యొట్టు లేని వాఁడు టిది క్రమంబె నిర్వ. ౬. ౬४.

క. కొడుకులు పెండ్లముఁ జంపమిఁ గొడుకులఁ బెండ్లాముఁ జంప గుఱఁ డానతి యీ, వదు గులకు నెఱిఁగి భాగ. ౼. ४६౧.

**పెండ్లా(డ్లి యా)డు.** స. క్రి. (పెండ్లి + ఆడు.) వివాహమగు, పెండ్లిచేసికొను.

మ. .. ఆ రాజకుమార శేఖరుని సొంపారన్ మీఁఱఁ బెండ్లాడఁ గల్గినాకో నా కను చున్. ఇంను. ౬. ६४

ఉ. . రామయాం,బారమణీమణిన్ భువన పావనవర్తనఁ బెండ్లియాడె .
భీమ. ౧. ౫౫

చ. కమనునిఁ జెట్టవట్టెదవొ సాగర వల్లభుఁ బెండ్లియాడెదో. సైవ. ४. ४౯.

**పెండ్లాము** = పెండ్లము² వి. (√ పెండ్లి.) భార్య.

క. పెనిమిటి చేతను బెండ్లా, మని కాను నిర్హ్పష్టదాని యనియును విలువం, గను జాల విదుర్భగురా, అను, ..
భాగ. ४. ౭३౦.

' శా. ... నరుఁడు పంగైయున్నఁ గైకోరు పెం, డ్లామున్ బిడ్డలుసైతమున్ నురభిమల్లా నీతి వాచస్పతీ. మల్ల. 3. ६3.

**పెండ్లి** = పెండిలి. వి. (బ. పెండ్లిండ్లు, పెండ్లిం డులు. వివాహము, పరిణయము.

(పెండ్లిండ్లు అను రూపము అను, అప్పరా. లలో నున్నది. శ. ర. యనంగీకరించినది. కాని నిర్ధారక ప్రయోగములు లేవు.)

గీ. ముదిపి ముప్పునఁ బెండ్లికై పొంగము వేల్వ, దగవు గా దని రాఁడయ్యెఁ దాతవేల్పు.
సైవ. ४. ౧౭౯.

పొంగము వేల్చు = పొంగము వేలుచుట, ఆశా సూచకముగా పొంగము చిట్లించుట అని భావము.)

క. తనతమ్ముని బిడ్డల నా,తని తమ్ములు ముప్వ రకును దద్దయు వేడ్కన్, బెనుమినుకు ద్రోవఁ బెండ్లిం, డ్లొనరించి కరంబు గూర్మి యుప్పతిలంగన్.
అచ్చ. రా. బాల. ౧౯३.

వ. వటువులకుం బెండ్లిండ్ల కనుపనీతుల కుపనయనంబులకు అము. ४. ५३.

ఉ. పెండ్లి వృపాలునింట నని పేరఁటముల్ ప్రియ మొప్పఁ జెప్ప కళా. ౬. ५౯.

వ. . పెండ్లిండ్లకును పెండ్లిసుంఖాలు గొనం గాను . పెండ్లిండ్లకు గానే పెండ్లి సుంఖాలు శివరాత్రి పుణ్య కాలమందు సర్వ మా (౦) న్యంగాను విడిస్తిమి ...
ద. కా. ४. ౭౦३.

జ. పెండ్లగు, పెండ్లము, పెండ్లాడు, పెండ్లాము, పెండ్లికుండలు, పెండ్లికూఁతురు, పెండ్లి కొడుకు, పెండ్లిగుమ్మడి, పెండ్లిచవికె, పెండ్లి దొర, పెండ్లివడ, పెండ్లినడుపు, పెండ్లిపీట, పెండ్లిపెద్ద, పెండ్లిమరుఁగు, పెండ్లివీడియము పెండ్లిసేయు,

**పెండ్లికుండలు.** వి. బ. (√పెండ్లి) పూజలు పెట్టి పెండ్లియందుపయోగించు కుండలు, ఐరేని కుండలు. (శ. ర.)

**పెండ్లికూఁతురు.** వి. (పెండ్లి + కూఁతురు.)
౧. వివాహదీక్షితురాలు, వధువు.
గీ. పెట్టిరి నలుంగు లక్కన్యఁ బెండ్లికూఁతుఁ జేయు ముహిపక్ష్న లర్థి వాత్సల్యతమంగ.
ఆము. ౬. ౧౨౫.

౨. కోడలు. (శ. ర.)
(ఇక్లీ పెండ్లికొమిరె జెం.)
ఆ. ... పరిణయ మహూర్తం, సమయ మయ్యెఁ బెండ్లికొమిరె జేగ, దోడితెం డటంచు వి. వం. 3. ౧౫౧.

**పెండ్లి(డిలి)కొడుకు.** వి. (పెండ్లి + కొడుకు.)
౧. వివాహ దీక్షితుఁడు, వరుఁడు.
గీ. ఇవ్విధంబున రుచికమునీంద్ర చంద్రుఁ, బెండ్లి కొడుకును జేసినఁ బ్రేమమీఱ
దశా. ౬. ౭౮.
క. అనుగుల పెండ్లిగినఁ బెండిలి, కొడుకవు గ మ్మనుచు . . వ్రజ . అవరికాంతునిఁ బలికెన్
వసు. ౫. ౫౪.
ఆం. భా. ౭. ౧౪౮.

౨. అల్లుఁడు, జామాత.
గీ. అర్థితో సోమధీశ్వరుఁ డాదియైన, పెండ్లి కొడుకుల నెల్లను బిలువనంపె .
భీమ. ౭. ౪.
గీ. పెండ్లికొడుకవు మాకు నీవిపుడు హోమ, సూర్మి నందన . . మను. ౫. ౮. శాశీ. ౪. ౪౦.

**పెండ్లిగుమ్మడి.** వి. (పెండ్లి + గుమ్మడి) వివాహాది శుభకార్యములయందు మంగళార్థముగా ద్వారమున వ్రేలఁగట్టెడు గుమ్మడి, బూడిద గుమ్మడి కాయ. (శ. ర.)

**పెండ్లిచేవికె.** క. (పెండ్లి + చేవికె.) కళ్యాణ మండపము.
సీ. ఇట గాధిభూపాలుఁ డత్యంతముదముతో జాతిమాత్యపుఁ బెండ్లిచవికెలోన . పత్న్య వతిఁ దనపుత్రికామణి ధారపోసి యిచ్చి
దశా. ౬. ౭౯.
గీ. మెఱయు సమకట్టు జల్లులమేలుకట్లు, జతల రంజిల్లుతగు పెండ్లిచేవికెలోన ...
భాను. ౪. ౫౬.

**పెండ్లి(డిలి)దొర.** వి (పెండ్లి + దొర.) వివాహ మహోత్సవము నడపునాయకుఁడు. పెండ్లిపెద్ద.
ఉ. అంత దివాంత మింత చనునప్పుడు విప్రుఁడు లగ్నమింతయుం, జెంతకు సేఁగుదెంచె నని చెప్పినఁ బెండ్లిదొరల్ గదల్ హరుల్, దంతురితాతపత్రి విరద ధ్వజదుందుభి ముఖ్య చిహ్నముల్, వింతలు గాఁగ సేర్పఱచి పెదుకఁ జాపిరి హారకోటికిన్.
రా. వి. ౫. ౫౭.
సీ. సమర సంక్రీడన సందర్శనాగతసురకోటి పెండిలిదొరలు గాఁగ . విక్ర. ౪. ౧౭౪.

**పెండ్లినడ(క).** వి. (√పెండ్లి.) పెండ్లిలో మారేఁగునప్పుడు నడచునడకవలె నెమ్మదిగా, ఠీవిగా నడచునడక, మందగమనము.
గీ. నీటు వాటిల్ల నరిగలనీదఁ బెండ్లి,నడల నవ్వీధి కరిగ న ప్పుడమి నేఁడు ...
శుక. ౭. ౧౫.
క. పెండ్లినడకల్ నడచెన్ ..
భాను. ౧. ౬౬. (శ. ర.)

**పెండ్లినడుపు.** వి. (పెండ్లి + నడుపు.) వివాహ వర్తనము, స్త్రీ పురుషులకూర్పు.

ఉ. పాలయులు గాని యున్నపుత్రులఁ బోఁటులు
ఖండితనాయికాలలాములు మది నియ్య
కోల్ వలయు మానిసు లేటికి వచ్చెనమ్మ
తాఁ బిలువని పేరఁటం బనుచు బెగ్గిలి వాధుల
గాఁగిలింపఁగాఁ, బోలుపుగ నందఁ బెండ్లి
నడుముల్ నడుముల్ వలినాలి కెమ్మెరల్ ...
విజ. వి. ౧. ౧౩.

పెండ్లిపీఁట. వి. (√ పెండ్లి.) వివాహమునందు వధూవరులు కూర్చుండుపీఁట.

ఉ. . ఓర్తు పెక్కుగం,పులపని పెండ్లిపీఁట రొయిక
బోఁటియు బంగరుచేల వైచె నో,ర్తులలిని
దేవయానఁ దగఁదోడ్కొని వచ్చెను
దాసి ... యయా. ౪. ౭౭.

పెండ్లి(డిలి) పెద్ద. వి. (√ పెండ్లి.) వివాహ మహోత్సవము నడపు నాయకుఁడు, నాయకురాలు.

క. పసపుల నలుఁగిడి రదువ, బిసరుహలోచ
నలు పెండ్లి పెద్దలయాజ్ఞన్, వసుధాధ్యక్షు
బుధసేన, కపిలాలకధరకుఁ జేరఁటాం
డ్రాగెఁ బాడన్. మనుచ ౫. ౫౬.

ఉ. . తోడ్కొని రందు పోయి గాంధర్వ
వివాహ శీలకు ముదమ్మున మావశి పెండ్లి
పెద్దవై .. ప్రభా. ౫. ౧౭.

గీ. అతఁడు శంభుండు విశ్వలోకైక సాక్షి,
యడుగఁ బుత్తెంచినాఁడు నీ యనుఁగుఁ
గూఁతు, నిమ్ము పెండిలి పెద్దల మేము
వినవు, దుహిత గిరిరాజ భాగ్యవంతుండ
వైతి. హర. ౪. ౭౪.

పెండ్లియరుఁగు. వి. (√ పెండ్లి.) పెండ్లియందు వధూవరులు కూర్చుండుటకై చేసిన యరుఁగు, వివాహవేదిక.

సీ. పెద్దింటిలో నుండి పెంపారఁగాఁ బెండ్లి
యరుఁగు మీఁదికి వచ్చి ..
పీఠి. ౩. ౧౩౭.

పెండ్లిపీడియము. వి. (పెండ్లి + పీడియము.) వివాహ నిశ్చయ సూచకముగా నిచ్చు తాంబూలము.

మ. ప్రియునిం గూర్పన్ మరుం డెంత
యున్, గలిగెన్ దానికిఁ బెండ్లి పీడియము
సాఁగింపన్ మదిన్ జూచెనో. ...
చంద్రా. ౪. ౧౫౪.

పెండ్లిసేయు = పెండిలిచేయు. (√ పెండ్లి.)

గీ. గాధి యమ్మునిపుత్రు శీఘ్రమునఁ బెండ్లి,
సేసె . భార. అను. ౧. ౧౦౪.

గీ. ప్రీతముతో విప్రవరునకుఁ బెండ్లి సేసె...
శుక. ౧. ౧౬౦.

పెందగడియ. వి. ఆకాశ బాణము.

సీ. పటుగతిఁ జనుగాలి పదగలతోఁడన కడు వేగ
మునఁ బెందగడియ లెగసె ..
కు. సం. ౧౧. ౭౨౦.

పెందడ. వి. (పెను + దడ2.) పెద్ద కొయ్యప్రాకారము, కోట.

విణ. మిక్కిలి సమానము, కడు తుల్యము.

సీ. గంధ సింధుర కుంభప్రకాండ కరభ
కదళికా కాండ కాంత వర్గములతోడి,
పెందడలు కాంత పెందొడ లెందు నరయ,
మదన లేఖకు పరియైన మగువ కలదె.

విప్ర. ౧. ౧౧౯. (పెందొడలు. అపముద్రి.)

పెందలకడ = పెందలాడ. క్రి. విణ. ప్రా. (పెను + తల + కడ.) ప్రొద్దు పోకమునుపు.

గీ. పెట్ట నోపితివా యొప్పుటట్ట యుండు, పెట్ట
లేకున్న విచ్చేయు పెందలకడ, కొండలు,

కోయింటులకు నొక్కటుమడుంపె గాక, నీ పదాదార మేలయ్య దాసరయ్య.

వైజ. ౩. ౧౦౩.

క. పెందలకడనె వచ్చెద మని వా(క్రుచ్చి .

ఉ. రా. ౪. ౧౬౩.

వ. ... దండనాథసామంత సందోహంబులఁ బెందలకడన మందిరంబుల కనిపి .

ఆము. ౧. ౧౮.

పెందలాడ = పెందలకడ క్రి విశే (ద్రు. (√ పెను.) ప్రొద్దుపొడుమునపు.

(శ. ర., చి. వి.)

పెందిరువడి. వి. (పెను + తిరువడి) మహా భక్తుఁడు, గరుత్మంతుఁడు.

ఉ. ... పెందిరువడిం గనిరి ..

ఆము ౪. ౧౧.

పెందుఱుము. వి. (పెను + ఉఱుము.) పెద్ద కొప్పు.

సీ. విరిబోఁడి పెంజుఱుగు పెందుఱుమువిప్పు .

రసిక. ౩. ౧౫౫.

పెందేర. వి. (పెను + తెర) ౧. పెద్ద తెర, పెద్దజవనిక.

క. తదనంతరంబ హర్షము, పొదలుమదిఁ బెట్టుఁద్రాల ఫుట్టికలయొదఁ, గదియం బట్టినపెందెరఁ, గదియుంచిరి బంధుజనులు కన్యావరులన్.

మనుచ. ౫. ౭౮.

సీ. చుక్కలించినకావు మంజిల్లి పెందర లంగ రంబులఁ బట్టి రొయ్యుతువారు ..

వైష. ౬. ౧౦౭.

౨. గొప్పఅల, మహాతరంగము.

ఉ. ... లతాంగి పోలెఁ దైల్యవృతిలక్ష్మీ భూధరపరయోనిధి పెందెరఁ బుటునిందె ర్లన్ ...

పాండు. ౫. ౭౦.

పెందెరువు = పెంద్రోవ. వి. (పెను + తెరువు.) పెద్దబాట, రాజమార్గము.

వ. మాధవుండును ప్రయాణ సర్వసంభారవిర్వా హకులఁ గలయం గనుంగొని తగినపల్లా పంబులు సేసి కరిపగరఁబు పెందెరువు గై కొని .

భార. ఉద్యో. ౩. ౧౪౫.

ఉ. అంతటఁ బొంతఁ బెందెరువు నందరు డెంచు పిలిందిమంది .. ఆము. ౬. ౭౪.

పెందోడ. వి. (పెను + తోడ)-పెద్ద తొడ.-తొడ పూర్వభాగము, ఊరుమూలము.

సీ. ఇటువు పెందోడలు రంభల వంచు చిత్ర మిథహస్తముల రీతి సేపుచూచు .

దశా. ౨. ౭౬.

గీ. . పొసఁగుఁ బెందోడ యన నూరుపూర్వ మథన ..

ఆం. భా. ౨. ౧౩౫.

పెంద్రోవ = పెందెరువు. వి (పెను + త్రోవ). ౧. రచ్చ, రాజమార్గము.

గీ. తిలలు పై చిత్తి చల్లిన దిగువఁ బడని, యంత సందడి పెంద్రోవలందుఁ గలిగె

వైష. ౪. ౧౬౨

మహాస్రగ్ధర. ... హస్తీంద్ర హస్తాంచిత ఘన మధుల శాలల పెంద్రోవ చెల్లన్, జోదు గొండన్

ఉ. రా. ౪. ౨౫౫.

౨. మోక్షమార్గము, ముక్తిపథము.

ఉ. ఏ విభు పాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొంద లేరి పెంద్రోవఁ బదింతురట్టి బుధ లోపక నీ వరుడెంచుటం బ్రహ్మ, దావృత మరయ్యఁ జిత్తము ..

భాగ. ౧౦. పూ. ౬౫౫.

పెంపగు. అ. క్రి. (పెంపు + అగు.) ౧. వర్ధిల్లు అభివృద్ధి నొందు.

౫. వదలు, విడిపోవు.

సీ. సన్నమై వలు పెక్కు సొనలిచేరుచు కంటి
కెగువ కైచిన శిఖ పెగలుచుండ ..
శ్రీకా. ౨.౭౪.

౬. ప్రయాణమగు, బయలుదేరు.

ద్వి. ఒక్కండె రానిమ్ము యుద్ధంబు సేయఁ,
బెక్కురీతుల సేన పెకలి రానిమ్ము ..
ద్వి. కిరాటపర్వము ౨. ౩౬. పా.

గీ.. శూరుని కష్టాహీనదశకము, కలిగినను వంద
నాకకొంతిగాని పెకల్, యంతయును రాము
చను చెంచు పాయమూబడిని.
కై. భా. ౨. ౧౦.

జ : పెకలించు, పెకలుచు.

పెక(గ)లుచు(ల్చు) = పెకలించు, పెగ
లించు. — క్రి. (√పెక(గ)లు.) పెల్ల
గించు, ఊడఁబెఱుకు.

క. పెకలిచి యిచ్చినఁ జాలుం, బ్రకటిత
దోశ్శక్తి బెండుపడి దచ్చెద మే, మొక
రొకరమె ... దశా. ౨. ౧౭౭.

క. బకపాదపంబుఁ గెలం, బెకలిచికొని యుదుం
భిదుర భీకరబాణం, బోకటి యుతఁడేయ
నగ్గాలికి వినబడు వడియుఁ జెట్టు పెచెం
బయిలికి .. రామా. ౮. ౯౨.

ఉ. కే లెవ్వరు గినకుండగఁ, గాలిదుం బెకల్చి
కదనంబి కె బాహుపీలస్థానము పొందలుగఁ,
దాలిమితో పేలమాలెఁ బ్రద్వఁగఁదొడఁగెఁ.
కుక. ౩. ౫౩౧.

ఉ. కొట్టి పడేయఁ బున్నకముఁ గొంటెఁ బెగ
ల్చితి కొండకొండ ... శం. రా. ౮. ౬౧.

పెక్కండ్రు. స. బ. (పెక్కుశబ్దమునకు మహాన్మ
హార్థ్యర్థకరూపము) అనేకులు; అనేకలు.
(చూ. పెక్కు.)

పెక్కణము = ప్రెక్కణము. వి. (సం. ప్రేక్
ణమ్. ప్రా. పెక్ఖణం) ౧. అభినయముతోడి
నృత్యము.

సీ. మొకములచాయ కేళోకచందముగ నిల్పి
కములసంభవుఁడు పెక్కణ మొనర్చ ..
ఉ. హరి. ౪. ౨౧౬. (శ. ర., వీరేశ. పా.)

౨. మల్లరంగము. (చూ. ప్రెక్కణము. అని
శ. ర.)

పెక్కణి. వి. (ప్రా. పెక్ఖణం.) నాట్యవిశేషము.

ఉ. పేరణి దండలాస్యమును బెక్కణి కుండలి
నాఁ జతుర్విధో,దారమూలైన నాట్యముల .
వాల్మీ. ౩. ౫౧.

పెక్కలి. సి. ఒకానొక చెట్టు (శ. ర.)

పెక్కలించు. స. క్రి. పెల్లగించు, పెఱుకు.

కళి. తరిని సద్గురునుతుల దాపురించినసదయు,
పెరిమె నాగపురంబు పెక్కలించిన విజయు.
అప్పక. ౪. ౩౩౩.

పెక్కు. స. (సం. పుష్కలః. - అమహాదర్థకమై
నప్పుడు, బ. పెక్కటిస్, పెక్కంటిస్,
పెక్కటికి, పెక్కంటికి, పెక్కటన్, పెక్కం
టన్, పెక్కటియందు, పెక్కంటియందు మొ.
బ. పెక్కులు, మహాన్మహార్థ్యర్థమైనప్పుడు,
అనా. బ. - పెక్కురు, పెక్కండ్రు, పెక్కం
డ్రురు, పెక్కురకు, పెక్కండ్రకు, పెక్కండ్రు
రకు మొ. ఎల్లశబ్దమువలె నిది మహాన్మహాత్య
మహాదర్థక విశేష్యములకు విశే. గా వానికి
ముందుగాని వెనుకఁగాని ప్రయోగింపఁబడును.)
౧. బహ్వర్థకము, అనేకములు, అనేకులు.

శా. కాశాంచిత్యము మాటుఁ బెక్కువలమైఁ గల్యాణ సౌమ్యాంగులై, కేళీలోలతపస్వి దారకసమాక్రీడం బ్రవర్తిల్లుచున్.

నిర్వ. ౧౦. ౧౩౫.

సీ. శివపూజ జాస్తిఁ జెప్పినదున్నల పెక్కువయోఁ త్యాగ్రహంబును నయమంజాప .

కాశీ. ౪. ౨౩.

౨. ఉన్నతి, ఎత్తు.

గీ. మొదలి పెక్కువయును బోయి మునిఁగ నగ్రి, కలశజాని క్షేత్రమునఁ గొంపు గాన నైన, నొరయని యైశ్వర్య మాశించి యుప తపించు, నట్టి ఖలుఁడతఁ డది యెద్దయాని తలఁప. కాశీ. ౩. ౭.

(ఇవి రెంటు నూర్ధ్వార్థముల కుదాహరణము.)

౩. ఆధిక్యము, ఘనత, గొప్పతనము.

సీ. కంఠకీటంకార సింహనాదంబుల పెక్కువ యోర్చలేఁ విలుచుకొనియు

భాగ. షష్ఠ. ౧. ౬౨.

(పీల్చుకొనియు పాఠాంతరము)

ఉ. .. పెనంగిరి బాహుకార్యముల్ క్రాముడఁ దూన్పనమ్ము నవఁ దక్కువ పెక్కువలేక యుద్ధముల్ ... జై భా. ౫. ౯౯.

(తక్కువ ఎక్కువలేక శ. ర. పా. ముద్రి. పా.)

క. పెక్కువ గల హరి యటువలెఁ, బెక్కువ గల వేద మూని పృథుహుంకార, మ్మక్కువ గలఁ జేయఁగ లో, మక్కువగల నిట్టు లనిరు మఘువునితో దన్. (దశా. ౨. ౩౦.)

౪. ప్రేమ, అనురాగము.

సీ. హంస పెక్కువనిచ్చె హంసికి శోకార్త కెలదూఁడు పొంగముల కెలమి మిగుల ...

శు. శం. ౪. ౪౬.

౫. సమూహము.

వ. .. మగువల నగవు వెన్నెలలోన తెక్కుల పెక్కువలుంబోలెఁ గానుపించు పొన్న మొగ్గలను . యయా. ౪. ౧౩.

విశే. ౧. పెద్దది, అధికము.

గీ. జెలుఁగు రవికెలలోపల వలుఁబోండ్ల, గబ్బి చిబ్బంపు బిగివలిగుబ్బ లమరెఁ, జిత్తజాతుని యురులలోఁ జిక్కియున్న కలికి పెక్కువ జక్కవకవలకరణి ..

ఘటికా. ౨. ౧౨౩.

క. జక్కవకవ పెక్కువయగు, మక్కువతో రేయిఁ బగలు మనుజాధీశుం, డక్కాంతఁ దక్క నొర్వక, దక్కట కార్యంబు లెల్లఁ జక్కఁ జరించుఁ. (శుక్ర. ౩. ౩౯.)

౨. ఉన్నతము, ఎత్తయినది.

సీ. నీవు పెక్కువో లేక నేను బెక్కువో యంచు సరి నిల్చి వానిభుజంబు సోఁక .

(రా. ౨. ౭౨.)

పెగడ = పెగ్గడ. వి. మంత్రి, ప్రధానుఁడు.

(శ. ర.)

పెగ్గడ = పెగడ. వి. ౧. మంత్రి, ప్రధానుఁడు.

వ. సర్వన్ కరపరిపారుపుగాదారా ... ఇచ్చితిమి, సన్ధివిగ్రాహి పోడవ పెగ్గడ ప్రాలు .. (ద. శా. ౪. ౧౦౪౭.)

౨. ఊరి పెత్తనదారు.

వ. . పెగ్గడలు త్తు కంణాపట్ త్తు ... భూమివృత్తులు గా నియ్యఁబడినవి ...

శా. శా. Ep. Ind. Vol. V 17. S. 1185.

పెగ్గుమ్మడు. వి. (పెద్ద + గుమ్మడు.) శ్రీ షష్ఠి. కీ. (శ. ర.)

**పెగ్గురు = బెగ్గురు.** వి. (సం. భృఙ్గః. ప్రా. పాఖ్ఖరం.) సారసపక్షి.

సీ. పెగ్గురుకొదుపుల బెగ్గిల మగ్గించి కొంగల పొంగెల్లఁ గ్రుంగఁ ద్రొక్కి.
ద్వా. ౧. ౨౧౯. (ప్రాఁతప్రతి. పా.)

**పెచ్చగిల్లు(లు).** అ. క్రి. (√పెచ్చు.) అతిశయించు, చెలరేఁగు.

వ. ఇట్లు పెచ్చగిల్లిన పచ్చవిల్తు పెచ్చ పెచ్చు పెచ్చులిం జూచి కలంగి ప్రబల బలదర్పితుం డగు నా దర్పకుని దూఱం దలంచి.
ద్వా. ౫. ౧౩౭.

క. పెంచ్చిరి నీళ త్తి పదిం, నిచ్చెద నే వేఁడు మింక నేవర మైనఁ, జెచ్చెర నీమనమని కృప, పెచ్చగిలం బట్టుటయును. శ్రీతా త్మ్యం డై.
(శ్రీరం. మా. ४. ౯४3. పిచ్చిగిలం. ముద్రి.)

**పెచ్చారి.** విశే. (పెచ్చు + అరి, వృత్తి యందు వర్ణ వికారము. క. పెచ్చు=పిచ్చి,అవివేకము.) మూర్ఖుఁడు.

క. వచ్చిన మునిపతి కర్ణ్హిణ, మిచ్చిన పిదపన్ మహీశు లెల్లను వినఁగా, మచ్చరపు వాసుదేవుఁడు, పెచ్చారితనంబు ప్రూమపిల ని ట్లనిరొయిన్.
(ఉ. హరి. 3. ౧౦.)

**పెచ్చు.** వి. (క. పెచ్చు, హెచ్చు.) ౧. ఆధిక్యము, అతిశయము.

ఉ. ఒప్పులుగా భుజించిరి బుధోత్తము లాకఁటి చిచ్చు పెచ్చువన్ . (భీమ. ౨. ౧3౯.)

౨. అధికప్రసంగము, దూలుమాటలు.

ఉ. వచ్చి జోహారు సేసి నిలువఁగా సురనాథుఁడు చూచి రంభతో, మచ్చర కోటికిన్ విరుదు మాటలకుం బని యేమి నీకు నీ,పెచ్చులు వల్కు నేల నిమఁబెంచిన దంద్రికిఁ గీర్తి మిక్కిలిం, దెచ్చితి .. వాల్మీ. 3. 3౧.

3. అక్కరకు బట్టి నాణెములు మార్పులోపగు వానియందు అధికముగా నిచ్చెడు ధనము. [illegible] (శ. ర.)

४. ఫలాదు[illegible] తోలు.

ఉదా : దానిమ్మ పెచ్చు. ఇం.

ద్వి. అనిమిషుల్ మిఱ పెచ్చువం దిడ్డ నిప్పుతూ పెలవ రెక్కలం దోచె పట్టముగ ..
ద్వి. తి. సా. ౨. ౨౯. పా. ౨౩.పం.

౫. విధము, రీతి.

వ . కృష్ణభుజంగంబునంగంబున బుసలం బోవిడుచుచుఁగార్చిర్చు పెచ్చున మండిపడుచు వంబు దంబుచందంబునఁ దిమురుచు .
చంద్రా. ౬. ౯3.

వ. అట్టియెడ నట్టెగ కెటి మహారణ్యాఁ ౖ సొచ్చిన కార్చిచ్చు పెచ్చున
ఉ. రా. ౨. ౬౧.

విశే. అధికము.

సీ. ఎచ్చు పెల్లఁదనము హెచ్చు మిగిలి, మిక్కిలి యెక్కువ మెం డగ్గలము పెచ్చెదుగు నాఁగ నధికంబు దోఁచుచుండు .
ఆం. భా. 3. ౨४.

వ. భద్రదంతావళా భ్రంకషఘీంకార బెచ్చఁ బెచ్చ వుంగదలం గదలంకొన్నకరులు చెవుడు పడ ..
రా. వి. 3. ౬౬.

(ఇట విశాలమని భావము.)

క్రి. విశే. అధికముగా, మిక్కిలిగా. (గ్రా.)

(చూ. పెచ్చుపెరుఁగు, పెచ్చురేఁగు.)

జ : పెచ్చగిల్లు, పెచ్చారి, పెచ్చుపెరుగు, పెచ్చురేఁగు, పెచ్చుకెచ్చు.

**పెచ్చుపెరుఁగు.** అ. క్రి. (పెచ్చు + పెరుఁగు.)

౧. మిక్కిలి అతిశయించు, పెంపెక్కు.

ఉ. వచ్చిన రాజసంఘములు వారిజనేత్రల కంద కందముల్, పెచ్చుపెరింగి…ండఁ దఱచేసి దల స్వేచ్ఛఁ దోఁచ్చినట్లుగా .. …దేల. ౨. ౧౧.

గీ. బలయు రత్నాకరములు సంచులుగఁ జేసి, పాదివి నిధు లెల్లఁగొని సందిమొదలు చేసి, వేఁగ మాడెడుపాటి యుపకారలక్ష్మి, బచ్చు లప్పటి మహాన్నరు పెచ్చుపెరిఁగి. పాండు. ౧. ౧౧౧.

౨. విజృంభించు, చెలరేఁగు.

ఆ. అతఁడు పూజనీయుఁ డగు నే నెఱుంగుదు, నైన ధనము లీగి వనదతనము, వచ్చుఁ బెచ్చు పెరిఁగి వైగులు గర్వింతు, రేల పగ యడంగ పెట్టులైన. భార. ఉద్యో. ౩. ౧౭౪.

ఆ. ఎదురి నుండ నెఱిచి మదమతి దవ్వుగా, వచ్చి రాఁదిఁగి తేల పెచ్చుపెరిఁగి, క్రేశి దిప్పుడ పట్టి వాలుక గోసెద, మానుమాను రిత్తమాటలేల. భార. ద్రో. ౪. ౨౭౧.

**పెచ్చురేఁగు.** అ. క్రి. (పెచ్చు + రేఁగు.) చెలరేఁగు, విజృంభించు.

గీ. నలుగు రేవురు సంగడీ లెలమితోడఁ, బోక లాడలు జొడితోనఁ బోసికొనుచు, జాణ తనములు నట్టువాసనలు నోలయఁ, బెచ్చు రేఁగుచుఁ గొలువఁగా వచ్చె నొకయు. ద్వా. ౧౦. ౭౩.

**పెచ్చుహెచ్చు.** అ. క్రి. (పెచ్చు + ఎచ్చు.) మిక్కిలి యధికమగు.

ఉ. ... శివుని భార్యయుఁ గాశిఁ బుణ్యరాశిం, గా డోసరింపఁ జూచెదవు కంఠముఁ గ్రోధము పెచ్చుహెచ్చఁగన్. భీమ. ౨. ౧౧౭.

**పెజ్జటి.** మి. వి. (పెద్ద² + జటి.) గొప్పజతి.

క. ఇటు లుండి కొంతవడి కా, కుటిలాలక పలుకు విసిడి కుకుకంబునఁ బెజ్జటి యటులఁ బల్కె నత్తఱిఁ, బటుతర నాదాళి కేకభావం బగుచున్. (వెన్నెల. ౨. ౨౪౩.)

**పెటపెట.** వి. ౧. (పండ్లు కొఱుకుట, పెటులుట, విఱుగుట, ప్రేలుట, చిటుకులు పడుట, ఈఁడ్చుట మున్నగు వానియందగు) ధ్వన్యనుకరణము; అట్టి ధ్వని.

ఆ. పెదవు లదరఁ బండ్లు పెటపెటఁగొఱుకుచు, దక్షుఁ డాగ్రహించి తపసిఁ బలికె... భాగ. ౪. ౨౫౦.

ద్వి. పెటపెటఁ జిటిలి పె న్పిడుగులు పడియె... ద్వి. హరిశ్చ. పూ. ౭౧౪౭.

ద్వి. పెళపెళ ధ్వనులును పెటపెట ధ్వనులు, కలయ దిక్కులఁ బర్వఁగా విల్లు విఱిగె ... రం. రా. బాల. ౬౬. పొ. ౧౦. పం.

(దిక్కులద్రువఁగా విల్లు విఱిగె, ప్రాఁతముద్రి. పా.)

చ. మిటమిటఁ గాయు తాతపము మించఁగ నొర్వక గండశైలముల్, పెటపెటఁ బ్రేలి ప్రేలముల పెంపు వహించెను ... చిత్రభా. ౨. ౯.

క. అం దొకకూఁతురుండు సుమతి యను, నందగుఁ బద్మిని యనం దనర్చిన పరిపూర్ణేందువదన యుల్లాలుగఁ, బెండవుటింబోని కేమి పెట పెటఁ జేల్పన్. శుక. ౩. ౨౪౩.

కంకపటలంబుల వెగడెన గొప్పకెలంది
మూ త్తైము లనఁగఁగా.
పరమ. 3. ౨౨౯. (శ. ర.)

పెటిల్లు. వి. పగులునప్పుడగు ధ్వని కనుకరణము.

సీ. పొన్నుపయిఁ బొరల నిబ్బరపు గుబ్బలపొర
పటలి పెటిల్లనఁ జిటిలి రాల్చ...
కువల. 3. ౨౪.

పెటుకు. వి. ౧. విఱుచుటయందగు ధ్వని కను
కరణము.

(దీని ఆమ్రేడిత రూపము. "పెటుకు పెటుకు")

వ. . . రక్తంబులు గుటుకుగుటుకున
గ్రోలియుఁ గీకసంబులు పెటుకు పెటుకున
విఱిచియుఁ బ్రేవులు పుటుకుపుటుకున
ద్రెంచియు . వరాహ. ౬. ౧౧౭.

విశ. పరుషము. విరసము.

(వ్యవ.) వారితో నీవు పెటుకుమాట లాడ
వలదు.

పెటులు(ట్లు) = పెడులు. అ. క్రి. ౧. (వేడిమి,
బిగువు, మున్నగువానిచే) చిటులు, పగులు,
బ్రద్దలగు.

గీ. పెటిలె బ్రహ్మాండభాండంబు చిటిలె
దిక్కు, లురలెఁ బాతాళభువనంబు లుడిలె
వభము . భీమ. ४. ౬౧.

క. పోఁకముడి పిడఁ బులకలు, మూఁక లిడక్
వెమట గ్రమ్మ కాలి చలింపన్, హైక పెటి
ల్లని పెట్లఁగ, రాకేందునిభాస్యఁ గనెఁ
బురాంతకుఁ డంతన్. (పార్వ. 3. ४3.)

౨. ధ్వనించు, శబ్దించు.

ద్వి. పెటపెట పెటిలి పెన్పిడుగులు పడిరాఁ.
ద్వి. పూరిక్ప. ౨౧४౬.

3. ఉష్ణముచేత ఉబుక్కు ట్రేలు.



సీ. పొగిడెదిక్కులు పెరంబుల యంగములు
పెట్లై పొరగఁ బిట్టలు పడఁబడిగ
మరఁడు. చంద్రా. ౨. 3४.

వి. తుపాకివంటి అగ్నిప్రసరణాయుధవిశేషము.
(పెట్లుఁగ్రోవి. అని. శ. ర.)

సీ. పెటులుచప్పుడు లాత్మభీయన్యయంగ్రాహ
పరిరంభసుఖము శోభచరుల కొసఁగ.
మనుచ. ४. ४४.

ఇ. పెటిలించు, పెటిలిపడు, పెటులుఁగ్రోవి,
పెట్లకంబము, పెట్లగుండు, పెట్లదిమ్మ,
పెట్లమారి, పెట్లాట, పెట్టుఁగ్రోవి,
పెట్లుప్పు.

పెటులు(ట్లు)ఁగ్రోవి. (పెటులు(ట్లు) + గ్రోవి.)
అడురుఁగ్రోవి, తుపాకివంటిరాజక
యుద్ధసాధనము.

వ. . . తుపాకుల పెళపెళలు పెట్లుఁగ్రోవుల
పెటపెటలు .. కృష్ణ. 3. ౨౯.

పెట్టు[1]. వి. (త. పెణ్ణై.) ౧. పశుపక్ష్యులందలి స్త్రీ
వ్యక్తి.

గీ. కొక్కులార్చుచు లకుముకిపక్కిరీతిఁ, దాలు
పుచు ధరణి వేమైనఁ దలుపుటగనిన, పెట్ట
యని గమకించి చూపెట్టుకొనుచు, నుండెఁ
బావురము ... సారంగ. ౧. ౧౨౨.

వ. సంచారార్థంబు దిక్కులకు బెదలు పక్కుల
రవంబులనక్కఁ దండనంబుపోని ముక్కున
వంపకంబులంబోలు చరణనఖాంకురంబులం
బెట్టుమంపోరుమం గఱచియు, నివిరియుం
బెట్టి రమకాంతప్రదేశంబునం భక్షించుచుదిరా.
కాశి. ౬. ౨౯౩.

౨. ఆఁడుకోడి.

సీ. పుట్టినిల్లని పెట్టిపోఁత లాసించిన యక్క-
చెల్లెం డ్రెంత యడలవలయు.

నిరం. ౨. ౧౨౭.

పెట్టిపోయు. అ. క్రి. (√ పెట్టు.) అన్నాదు లొసఁగి పోషణముచేయు.

సీ. పెట్టిపోసినవాఁడె చుట్టాలచేరిక కలిమి గల్గిన వాఁడె కాంతవలపు. (రామలిం. ౪౭.)

పెట్టు. స. క్రి. (క. త. పెట్టు.) ౧. (ఆహారము, జీతము, బహుమానము, ఇ॥) ఇచ్చు, ఒసఁగు.

(క.) ఆహారమిచ్చు.

చ. ప్రియమెసగం దగం బిలిచి పెట్టెడు కూడది లెస్సకూడు ..

భార. ఉద్యో. 3. ౨౨౨.

గీ. అఖిలకళ్యాణగుణశీల యా సుశీల, పెట్టెఁ జే మీఁదుగా నెల్లచుటములకు, భర్తతోఁ గూడ ముత్తాటిపండు దినిరి, నత్తి మున్నన్న గుజ్జుల నెందఁ కోని. పాండు. ౪. ౨౬౭.

(చ.) జీతమిచ్చు.

క. పలికెవకంబెను వెనుకను గొలిచిన భటుఁ డరుగు వేళఁ గొన్నధనం బీ, వలయును బతి దా ననిపినఁ, గొలిచినదినములకుఁ బెట్టి కొలువుడుపఁదగున్. విజ్ఞా. ౨. ౩౪.

(ట.) బహుమానమిచ్చు.

సీ. పంచాంగమయ్యకుఁ బాగ సమర్పించు నట్టుల కానికెఁ బెట్టు మురువు.

హంస. ౫. ౧౩౪.

(త.) అధికారమిచ్చు.

క. ... సితికి దళవాయితనము పెట్టకు సుమతీ.

సు. శ. ౯౪.

(ప.) మాల్యము (వెల) గానిచ్చు.

ఆ. .. మేను, దీనిరహిఁ బుణ్యమమ్మరు కప్పురంబు పెట్టి యుప్పు గొనుట.

ఆము. ౬. ౧౧౫.

(గ.) ఇచ్చు, అనుభవింపఁజేయు.

క. కుడుపక పెట్టక రూద్రుఁడు, కడు నెక్కుడు కూర్చినట్టి కనకముఁగొలుచుం, బుధమితతి ధర్మకృతులకు, నిడ దగు పగము గాని మేదినీశ్వరవర్యా. (భార. శాం. 3. ౪౩౨.)

ద్వి. ఏ మందు పెట్టిన నెఁగుఁ బ్రాణములు.

ద్వి. హరిశ్చ. ౬. ౨౦౨౦.

సా : పెట్టిన తినువారే కాని తిట్టిన పడువారుండరు.

౨. ఇడు, వైచు, వేయులనలె నే ఇది సందర్భమును బట్టి పెక్కర్థముల నిచ్చును.

చ. .. అవ్వనంబున లతాలలనల్ మృదులానిలాపవ్యక్తి తకునుమాత్మశావళులు పేసలు బెట్టినయట్టి రైరి ..

భార. ఆది ౪. ౧౭. (ఇట చల్లు.)

క. అని తలఁచి యొక్క పత్త్రిక, తనతనయుని పేరు నేకతమ్ము స్వహస్తమ్మున వ్రాసి ముద్ర పెట్టి పంపినయఁ దగుచుఁ జంద్రహాసువిభునకు ననియన్.

జై. భా. ౯. ౬౭. (ఇట వేయు.)

క. .. లేఁబిగురరఁటాకులు పెట్టిరి, దిగదిగ న ద్దేవియాజ్ఞ దివ్యపురంధ్రుల్.

భీమ. ౨. ౧౨౭.

గీ. ఎంత చేసిన నాపింప మెదుటి కడుగు, పెట్టదయ్యును గర్జావిభీమముగఁ, దోఁకఁ ద్రిప్పుచుఁ గదు వెక్కఁ ద్రొక్కఁ గాని...

కళా. 3. ౭౮. (ఇట ఉంచు.)

సీ. ఒకటి నొక్కటి చూచి యుతికి మేఁకలు చెట్టునీడల గుమిగూడి నెమరువెట్టు.

శుక. ౨. ౩౪౨.

సీ. పరుసలుపెట్టి దువాళింప నుడి పీడి వెలిమావు పోపదు వెనుకకాలు.

పరమా. ౧౦. ౧౫.

(పరుసలుపెట్టి = పంకులు జేసికొని.)

ప్రాఁగన్ను పెట్టు = మూఁగన్ను వేయు.

గీ. ఇచట జంతులలోపల పెద్దియైనఁ, బెద్ద నిద్రకుఁ బ్రాఁగన్ను పెట్టుఁజేని, దాని కబ్బు విభూవళకంబు గొలుక, బ్రహ్మయోగీంద్ర లోకసామ్రాజ్యపదము. (వరాహ. ౯. ౮౯.)

(ఇట కన్నులు పోలవైచు అని భావము.)

౩. వడ్డించు.

ఉ. కంచము పెట్టికొన్నయది కర్పురయుగ్మము కాలుపెట్ట శ్రీకేంచుచున్నవాఁడు మన దేవర విష్ణుఁడు . . హంస. ౨. ౧౨౫.

గీ. పచ్చటామానికంబుల పళ్లెరములఁ, బచ్చ గంధనికూర శేర్పడమిఁ జూచి, పెట్ట రని పెండ్లిపెద్దలు పెడము పెట్టఁ, బెట్టుటకు వంగవలకుమ బడెఁ దడవు.

శైవ. ౨. ౧౨౨

౪. (పన్ను, ఋణము, మొ.) చెల్లించు.

గీ. సఖ్య సంబంధములఁ జేసి చక్రధరుఁడు, ద్రుపదుఁడును దక్కఁ దక్కిన నృపులెల్ల, నరియఁ బెట్టనివారలేరు .

భార. సభా. ౨. ౧౦౭.

క. అప్పిచ్చి నతనియాతను, నప్పు మగుడఁ బెట్టు నతనియాతను గలచో, నప్పిచ్చి వాడు బొంకగు, నప్పు మగుడఁ బెట్టి నతని యాడు నిజ మగున్. విజ్ఞా. ౩. ౩౮.

క. అప్పులు పుట్టక పరపతి, దప్పి చరింపంగ వారకరశాతులు మున్న ప్పిచ్చినవారలు మా, యప్పులు పెట్టు మని చాల నలజడి పెట్టన్. రుక్మా. ౪. ౧౧౦.

సీ. ... దాసిగా నిల మోహిఁగి పెట్టి కొనుడు ... మార్కం. ౧. ౨౧౩.

౫. పోషించు, పణుచు.

(ఈ యర్థమున నిది పద్యాదులలోఁ జేరును. అప్పుడు పూర్వమందున్న విశేష్యముయొక్క తుదవర్ణకమునకు లోపపూర్ణబిందువులు వైకల్పికములు.)

ఉదా : సుఖపెట్టు, భయపెట్టు.

సీ. సభలోన నట్లు దుశ్శాసనుం డవమాన పెట్టంగ నచ్చటిపెద్దలెల్లఁ, బలుకక యుండంగ ... (భార. ఆశ్ర. ౧. ౧౭౭.)

ఉ. అక్కట పోనపోయి యడియాసలఁ జావకయున్నదాన ము, న్నొక్కరి నే దురంతదురితోత్కటబాధలఁ బెట్టియున్న నా, కొక్కెడి దుఃఖశాంతి

భార. విరా. ౨. ౨౨౭.

ఉ. పుట్టఁగఁ బుట్టఁగాఁ దునిమెఁ బుత్రుల దేవకి గన్న యందఱం, గట్టిడి పాఁపజాతి యగు కంసుఁడు తద్విధి చిత్తమున్ వగం, బెట్టెడు రోహిణీకలితపిండ ...కొందును దప్పె వీని నీ, వెట్టయినన్ మహాత్మ్య భరి యింపుము దీనఁ బొందు మెంతయున్.

హరి. పూ. ౫. ౧౩౮.

౬. ఆరోపించు, మోపు.

క. తమియించు వారిఁ గని చాలమి పెట్టుదు రైనమం దలంప ననూనత్వమయ కడుఁ మెఱయు తోడవు . .

భార. ఉద్యో. ౧. ౪౦.

క. శ్రీకిఁ గులశ్రేష్ఠునిపై, నాతతముగ లేని బ్రహ్మహత్యాదిమహాపాతకము పెట్టి తిట్టిన, యాతం డేనూటనాలు గచ్చుఁ బడంబుల్. విజ్ఞా. ౨. ౪౮.

క. కోట వలసి యూచెంచెత, రోటమి పెట్టం గడంగి యున్నట్టియెడన్ ...

హర. ౭. ౫౨.

౭. అమర్చు, తీర్చు.

గీ. కూరు పొంకపెట్టినట్టులు గొంద ఱుజ్జ్వ
లాయుధములు గంకటములు పసర మన్నఁ,
జూచి చావనివా రని చూడు చేర, నరుగ
కున్నవి కంకగృధ్రాదు లలిక.
భార. స్త్రీ. ౧. ౨౦.

గీ. ... కంకరాద్రి,కాననము పోచి మందరా
గంబు దాఁకఁ, బాఱ పెట్టిరి తిన్మ్మలబలము
దొరలు. మనుచ. ౫. ౪౪.

సీ. ప్రియకు ధమ్మిల్లంబు పెట్టివాఁ డొక్కఁడ .
భాగ. ౧౦. పూ. ౧౦౨౬.

సీ. ముంగిట గోమయంబున గోముఖము దీర్చి
కడలు న్రాఁగ ముగ్గుకట్ల పెట్టి.
కాశీ. ౮. ౧౪౧.

౮. అలఁదు, రాచు

చ. బిగిచనుదోయిఁ జందిరము పెట్టి నిశేకద
సాంధ్యకృత్యముల్ (గంధ. ౨౮. పా)

చ. . తగుమాత్రము సున్నము పెట్టి చుట్టి
య, య్యిరుగడ నొక్కి యాకుమడు
పిచ్చిన . సారంగ. ౩. ౧౩౯.

చ. మరప్రకరంబు కళింగమేదినీ,విభు నప
క్తి రికజ్జలము వేమఱు పెట్టి పరించు
నిచ్చలుఁజా. ఆము. ౧. ౪౦.

౯. ఆభరణాదుల ధరించు.

సీ. కట్టినచీరలు పెట్టిన తొడవులు నొక్కఁడి
వాహంబులు .. విజ్ఞా. ౩. ౧౩౨.

సీ. ధరియింపనేర్చిరి దర్భపెట్టెడుఁబ్రేళ్ల లీల
మాణిక్యాంగుళీయకములు. (భీమ. ౧. ౪౦.)

క. ... బిరుదులు హారికులు దున్నఁబెట్టిరొ
యనఁగఁజా. ఆము. ౪. ౧౨౫.

౧౦. ధరింపఁజేయు.

సీ. ... బిసకాండహారంబు పెట్టు హారిణి.
హైమ. ౨. ౧౪౧.

సీ. పసివాఁడు కట్టిన పాలభూసరి కాని పెట్ట
పొమ్ములు లేవు బిడ్డలకును.
(కుచేల. ౧. ౩౬.)

చ. .. కస్తురిం, గొని యిడు బొట్టు నా
కనుచుఁ గూర్మి నొసంగిడఁ బెట్టుచుండ ...
ఆము. ౫. ౬౨.

(బొట్టును. అను కర్మపదమధ్యాహార్యము.)

౧౧. కలిగించు.

సీ. అనలాక్షుఘనజటావనవాటి కెవ్వాఁడు వన్నె
పెట్టునవార్తవంపుఁబువ్వు.
మనుచ. ౧. ౧౯.

ఉ. . మృదుపల్లవకోమలతల్పదద్వయీ,
పాటలకాంతి మాళి మణిపంక్తికి వన్నియ
పెట్ట నాజగన్నాటకసూత్రధారి యదు
నందనుఁ దర్శిలి మ్రొక్కి .
పారి. ౧. ౧౨౦.

సీ. లచ్చి యన్నకుఁ దమ్ములకును వాదులు పెట్టి
కలకల నగుమోము కళల నీన ...
సారంగ. ౨. ౪౨.

౧౨. దిగవిడుచు, విడుచు.

ఉ. ... మదీయభార్య కీర్తిప్రియ దినిఁ బెట్టి
చనుదెంచుట ధర్మమో నాకు . .
భార. ఆది. ౨. ౬౩.

చ. అదలిచి లక్ష్మణుండు విజయాత్మజుఁ
దాఁకినఁ జూచి యమ్మలం, బొదవఁగఁ
బుత్రుఁ బెట్టి చన నోపక క్రమ్మఱ రాజుఁ
గాంచి ... భార. ద్రో. ౨. ౯౯.

గీ. తగిలి నా జీవమునకు నాధారమైన, నీవు
ననుఁ బెట్టి పోఁ జన్నె భావజన్మ.
కు. సం. ౫. ౫౫౩.

౧౩. (పశుపక్ష్యాదులు.) ప్రసవించు.

క. కటికిఁ బిట్టలను నీకుం, గట్టని నీదమూలు
గావె కింధికటంబుల్, పట్టయినచోట
గ్రుడ్లం, బెట్టును నీ వనిత
పం. పంచ. ౧. ౫౭౫.

(వ్యవ.) ఆ కోడి నాలుగు గ్రుడ్లు పెట్టినది.

(వ్యవ.) ఆ యావు మంచిదూడను పెట్టినది.

౧౪. పక్షులు గ్రుడ్లను పొదిగి పిల్లలను చేయు.

సీ. చతురభాషిణి యొకశారిక వర్తించు నది
పిల్లఁ బెట్టి యింపారుపండ్లు, తెచ్చి యచ్చిలి
వాని కిచ్చుచో ...
భార. శాం. ౩. ౨౭౫.

౧౫. ఒప్పగించు.

గీ. చదువఁ బెట్టిరి వేదంబు పదముఁ గ్రమము,
సాంగముగ బాలకుని నుపాధ్యాయునొద్ద
కాశీ. ౭. ౧౩.

సీ. గరిమ మహాభాష్యగురువిరుద్ధను దగ
శాస్త్రము లెంతయుఁ జదువఁ బెట్టె.
పరమ. ౫. ౧౬౨.

౧౬. ఉంచు.

ఉ. వార్ధి లసత్తరంగహస్తంబుల నెతి
పెట్టెఁ దనమైకతతీరముఁ జేర నమ్మునిన్.
భార. ఆది. ౩. ౧౧౯

చ. .. సర్వపితామహుఁ డబ్జసూతియుణ్,
సమధికదీర్ఘజీవి యను శబ్దము పెటక పిల్వఁ
డొన్నఁడున్. హరి. ఉ. ౯. ౧౦౭.

గీ. మంత్రపుష్పంబుఁ బెట్టి మన్మథవిరోధి,మూర్ధ
భాగంబునందు సమ్మోద మెసఁగ.
నైష. ౮. ౧౧౦.

క. ఆ దైవత పెన్నటి కీ,పైఁదలిపై దయను
బెట్టి ప్రత్యక్షమగుణ. (పార్వ. ౭. ౮౫.)

౧౭. నెలకొల్పు, నిలుపు.

ఉ. . ఖరాంశుమూర్తిపైఁ, బెట్టినచూడ్కితో
హృదయపీఠికయం దమృతాబ్ధిమందిరం బట్ట
మగటి ... (కవిక. ౨. ౯.)

గీ. నిండువేసవి మరుభూమి నిర్మలముగఁ, జేర్చి
సలిలాన్నసత్రంబుఁ బెట్టినట్లు ...
భీమ. ౫. ౧౫౨.

గీ. ఇటుల నయ్యాంబ మనసులో నీకుఁ బెట్టి.
పార్వ. ౭. ౭౨.

౧౮. నియోగించు, పనుచు.

ఉ. కటకుఁ గాపుగా నిదుర గానఁగఁ జాలెడి
వారిఁ గొందఱం, బెట్టుచు వచ్చి ...
భా. రా. యు. ౨౫౮.

గీ. మీర లనమంద్రు భుజగేంద్రహార యొద్ద,
భక్తిఁ బూజింపఁ బెట్టుఁడు పాశుపతుల.
భీమ. ౭. ౨౦౮.

౧౯. (నారు లోనగువానిని) గ్రుచ్చు, నాటు.

క. సుగ్రీవుఁ డయో,మీపెట్టు పెట్టుగాఁడా,
చేపట్టినమెుకఁ గినుక నీయుందగునే.
రామా. ౨. ౭౩.

చ. భయ మను తొల్లిశణ విమలభావవసుంధరఁ
బెల్లగించి భక్తి యనెడువిత్తుఁ బెట్టి ప్రతిభ
నది సమ్మదవారిఁ జల్లగా, ...
కాశీ. ౭. ౧౨౨.

సీ. పేదకై కృషి చేసి పెట్టినసస్యంబు లెల్లఁ
బో లైనఁ గొఱ్ఱెగ్లె నవసి.
కవిక. ౫. ౧౬.

౨౦. చేయు, కావించు.

(ఈయర్థమున కొన్నిక్రియల కుమున్నంతరూప
ముల కనుప్రయుక్తమై వానిప్రేరణార్థ
మును తెలుపును.)

ఉదా: చేరఁబెట్టు = చేర్చు, కూడఁబెట్టు,
పరుండఁబెట్టు, లోం.

ద్వి. కడఁగి కన్నును పెట్టి గడియలఁ దీయు.
ద్వి. పల. ౪. ౨౫౯.

ఆ. అంతిపురములోని కన్యలపేరిటి, పోరు
టేఁగ నైనఁ బొలయకుండ, సాక్షి పెట్టి
శారదానందగురు సాక్షి,పెట్ట సేరనైతి వేల
నైతి. విక్ర. ౩. ౫౯.

గీ. పెక్కుమాటల నిటు జాగు పెట్టనేల.
కాశీ. ౨. ౭౭.

క. మాని పెట్టినతంత్రంబుఁ గానలేఁడు.
నిగం. ౪. ౨౦.

సీ. క్రుంచుచు నీరిలో ముంచుచు నెత్తుచుఁ
గారించి తీరంబుసేరఁ బెట్టి.
భార. ఆది. ౫. ౧౬౬.

మ. ... తల్లిదండ్రుల్ మనంబు విరాజిల్లఁగఁ
గూడఁబెట్టినధనంబుల్ ...
సారంగ. ౨. ౭౫.

౨౧. నిర్ణయించు.

క. ... దుర్యోధనుఁడు లగ్నము పెట్టఁగ ధవళ
చ్ఛత్రముపట్టఁగ దుర్జయుండు రథము నెక్కె
తడిసె. వరాహ. ౩. ౨౪.

సీ. పెలఁది యీ నీ దండవెల యెంత నా దండ
కును వెల పెట్ట నెవ్వనితరంబు.
ఆము. ౨. ౧౯.

౨౨. కట్టు, నిర్మించు.

ఉ. పెట్టనికోట నీకు హరి భీముఁడు వజ్జనుఁ
డుండ్ రణంబునం, దొట్టిన మంటలు ..
భార. ఉద్యో. ౧. ౨౯౪.

చ. ... గడ్డమున గూఁడులు పెట్టిన పక్షి
కోటి పెన్నొరప మెఱుంగఁడు ...
వరాహ. ౧౦. ౫౩.

౨౩. కల్పించు, పన్ను.

వ. .. మదీయ సంగీతచాతుర్యంబు వార్తలు
క్రమంబున విజ్ఞగన్నాయకునకు వినంబడు
నట్టి యుపాయంబు పెట్టెదంగాక ..
కళా. ౨. ౭౧.

౨౪. (దారి) నిర్దేశించు, చూపు.

చ. వా, రరిగిరి చుప్పనాతి ముద
మందుచు ముందఱఁ ద్రోవపెట్టఁగన్.
భా. రా. అర. ౨. ౧౬౧.

గీ. లేచి పోవంగఁ దత్తఱ మేచి తోడి,వారు
పన నేమ ముడిమోపు పటువ కత్తి, పోవ
వాఁ డిందరం దని త్రోవ యడవిఁ, బెట్టి
యొకవాఁగు డిగ నీలపెట్టుటయును.
ఆము. ౬. ౪౩.

గీ. శ్రీరంగనాయకుఁడు పెటి,నట్టిత్రోవ
యయ్యెడు ... పరమ. ౫. ౩౫౫.

౨౫. మాయు.

ఉ. ... అతం డేవిధమో యొఱుంగఁ దల
పిమ్ముగఁ బెట్టినయట్లు యుండఁగాన్.
మార్కం. ౫. ౧౩౪.

గీ. అనుచు రాగరసార్ద్రాంతరంగ యగుచు,
సుదతి కనురెప్పు పెట్టక చూచె నతని ..
కవిరా. ౨. ౧౫౧.

౨౬. ప్రహరించు, కొట్టు, చఱచు.

చ. ... నవనాళ్వము ధేయని కక్కసంబులన్,
నదనదగాఁగ వ్రేసియును జాటులఁ
బెట్టియు నేమిచేసియున్, గదలుపలేక
యవ్విధము కవ్వడి కేర్పడ విన్నవించినన్.
జై. భా. ౪. ౪౪.

ఉ. ... త్రిమూర్తులఁ బట్టి కట్టి యప్పట్టట్టన
నీక మేను పగమై పడగా కొక పెట్టు పెట్టి
తిన్. చంద్రా. ౩. ౩౪.

గీ. ఇట్లు కోలాహలంబు గాఁ బెట్లఁ బెటి ..
హైమ. ౪. ౬౬.

సీ. తొగల కెంగ్గలు వైవ దూర మేగమిఁ
బెట్టు చప్పట్లఁ జమ్ములు జడలు గదల.
ఆము. ౪. ౧౬౩.

౨౭. కొన్ని సకర్మకధాతువుల క్త్వార్థకరూపముల కనుప్రయుక్తమై "అత్యంతము, పూర్తిగా" అను నర్థమిచ్చును.

ఉదా: విడిచిపెట్టుము, వదలిపెటుము, ఆ మాటలు కట్టిపెట్టుము, వెం.

వ్యవ. అత్తగారు కోడలిని కొసిపెట్టుమన్నది.

౨౮. పలుకు, ఉచ్చరించు.

ఉదా. జయపెట్టు.

శా. .. భామా రోఁ దప మాచరింతు విధి క
బ్రహ్మణ్యముం బెట్టుచున్.
మనుచ. ౩. ౧౦౨.

సీ. శరణాగతారాతిధరణీరమణు లయ్యజియ్యలు
పెట్టుచు సేవ సలుప. (సారంగ. ౧. ౬౨.)

వ్యవహారములోని కొన్నిప్రయోగ విశేషములు.

౧. కేఁడు జడి పెటి కేపు సెల విచ్చెదరు.
౨. ఎద్దు బండిని చెట్టునకు పెటినది.
౩. మేమింకను ఊరుఁగాయ పెట్టుకొన లేదు.
౪. తద్దినముపెట్టు (ఆచరించు.)
౫. నైవేద్యముపెటు (అర్పించు.)
౬. బొబ్బలుపెట్టు (అరచు.)
౭. కనుపెట్టుకొనియుండు (వేచియుండు.)
౮. ఒట్టుపెట్టుకొను. (ప్రమాణముచేయు.)
౯. బాణము సరిగా కెందకు గురి పెట్టి వేసి నాఁడు.
౧౦. శాపముపెట్టు = శపించు.
౧౧. దయ్యాలపెట్టు = ప్రయోగముచేయు.
౧౨. ఏమొగము పెట్టుకొని వాఁ డిక్కడకు వచ్చును = సిగ్గుమాలి వాఁ డిటకు రాఁడు.
౧౩. వాఁడు మామాట చెవిఁ బెట్టలేదు.

సా. చేతిలో కన్ను పెట్టుకొని చేతికై అంగలార్చుట = పరికరము సిద్ధముగ నుండఁగా కావలసిన వస్తువునకై తహతహపడుట.

ఉ. . నీవు గల్గకే నల్లవిధుండు రాఁ డని
మహాపరితాపము నొంది యేల చింతిల్లఁగ
కన్నుఁ బెట్టుకొని చేతికి చేటికి నంగలార్చఁ
గన్. సారంగ. ౨. ౬౦.

కంటనువత్తిపెట్టుకొనుట. = మిక్కిలి శ్రద్ధ వహించుట.

మ. బ్రహ్మమిత్త్రిండు కృష్యలకు
గంటను వత్తిబెట్టుకొని యాయుర్వేద పా
రంగ ప్రౌఢుఁడు చెప్పెన్ .
మనుచ. ౫. ౭.

అ. క్రి. ౧. కలుగు, పొడము, ఏర్పడు.

క. గదగద నడఁకెడు మేనన్, నిదురవెంద్రుక
బెట్ట . ఉ. హరి. ౬. ౯౬.

ఉ. . మానిసమూర్తిరుఁ దర్యు మేనిపైఁ,
బెట్టినపట్ట సెట్టవిసి బీటలు వారు ...
పాండు. ౫. ౨౪౯.

సీ. కనుపట్టులోయ గంగానిర్ఘరము వాఁ
జలుర యా నర్యోటికోలఁకులందు, నిసుక
పెట్టినచేల మనుచ. ౨. ౧౯.

౨. పరిపోలు, పాటివచ్చు.

లయగ్రాహి. . ఈ చవికి చే చవియఁ బెట్ట
దని చూచి కైకొన్న చవి ...
భోజరా. ౭. ౧౨.

౩. కొన్ని సకర్మకక్రియల క్త్వార్థముల కనుప్రయుక్తమై ఆయా పనులు పరహితార్థము చేయుటయును తెలుపును. సాయపడు, తోడ్పడు, అను నర్థముల నిచ్చును.

ఉదా. కొనిపెట్టు, చేసిపెట్టు, తెచ్చిపెట్టు, వ్రాసిపెట్టు మొ॥

౪. కొన్ని క్రియారూపముల కనుప్రయుక్తమై ప్రేరణార్థకముగా నుండును

ఉదా చూపెట్టు—చూపు, చూపించు

(వ్యవ) నీనేర్పు చూపెట్టుము

లేఁపెట్టు—లేఁపు, లేఁగునట్లు చేయు

(వ్యవ) మఱచిన విషయములు జ్ఞప్తికి తెచ్చి యతనికోపము లేఁపెట్టవలదు

తినిపెట్టు—తినిపించు (వ్యవ) బిడ్డకు అన్నము తినిపెట్టు

నేర్పిపెట్టు — నేర్పు (వ్యవ.) నోరెఱుఁగని ముద్దరాలికి కొంటెమాటలు నేర్పిపెట్టఁదగునా!

పెట్టు. వి ౧ దెబ, కొట్టు

క. దనుజేంద్రుఁ డెఱుఁగు విభుమని, పెనఁగను
పులిగొన్న మృగము పెట్టునఁ బడునే, పనుఁ
ద్రావు బాలుఁడవు నీ, వనికలవడి చక్కఁ
ద్రోవ నలవియె నీకు॥

భా. సం. ౧౦. ౧౩౨

గీ ఎందు నీతివిహీనునిఁ జెందునట్ట, సిరిని దిట్టుదు
రెట్లు దాఁ జేర నితని, ననుచు భూజను
లందఱు నినుముఁ గూడి,యున్న యగ్నికిఁ
బెట్లు రాకుండు పెట్లు?

కళా. ౩. ౨౫౫.

ద్విపద. కుదిసియగ్గదఁ బుచ్చుకొని బిట్టుఁ జేయ.
బెదరివాఁడొకవింత పెట్టోసరించి.

రంగా రా సుం. ౩౭౩

(వ్యవ.) కోలలేని పెట్టు, త్రాడులేనికట్టు
పడిపెము పదిరోగముల పెట్టు
గోడపెట్టు చెంపపెట్టు రెండును తగిలినవి

౨. దానము, ఈవి

(చూ పెట్టుడు, పెట్టుపోఁతలు)

(వ్యవ) మాటలు మాయమ్మవి, పెట్టు సవతి తల్లిది నేగుచుట్టమా! పెట్టుచుట్టమా?

3 ఆవృత్తి, తతి

చ. అతనీ నాయకుఁ జూచి రేంచి యని వీరావేశ
దుర్దాంతమై, కవిసెన్ గుంతభు కుండతో
మురగదా ఖడ్గాదిశస్త్రాస్త్ర తీవ్ర విహారంబు
విరోధ దుర్వ్యహసంరంభంబుగా నొక్కపె,
ట్టవడిం దద్బలమెల్ల నారదుఁడు వేడ్కం
గుంచె సారింపఁగన్

భార విరా ౩. ౧౮౨.

(ఒక్కపెట్ట = ఏక కాలమందే.)

క. ఆ మహిమ రొమెఱుఁగ జేరని, పాపరు లాకార
ల్రాజఁ బరఁగుదు రొక పెట్టామడ చన
నోపరు యర,యామడ చని నిల్చినట్టు యార్మ్మి
వివేకీ. వా రా. ౫.

చ. ద్రుపదుని సేన పై నడరి తోలినఁ జూచి వృకో
దరుండు దేవపతిసుతుండుఁ జాఁకి యనివా

రణ వగ్గురు నొంపనేచి యుగ్రపువడి మాత్స్య
కేకయ ముఖంబగు పాండవసైన్య మొక్కపె
ట్ట పరఁగి గీ బలంబుల కడంక యడంచి
మదించి పేర్చినన్.

భార. ద్రోణ ౫ ౯౩

ద్వి. అంతంతఁ దత్ప్రాక్రాంతులై జనులు, గొంత
విశ్రమ మంది గొబ్బున చెలఁగి, కట్టలు గట్టి
నక్షత్రపర్వతము, బిట్టు గలఁగి నొక్క
పెట్టునఁ గూడి పర్వతాగ్రంబెల్ల వధమునా
నెరవి, 'పర్వతయాత్ర మమ్మఁ బాలింపు'

పండితా పర్వ ౩౭౧ పా

౪. మోటు.

వ కవలు గడించి మగలు సాత్యకి సత్యపరా
క్రముండు పాంచాలోత్తముండగు నుత్త
మౌజుం డుదాత్తబలుండు శిశుపాల తన
యుండగు ధృష్టకేతుండు ధీరుండు భీష్మ
పాతన హేతు వయిన శిఖండి యఖండ పరా
క్రముండు సౌభద్రుండు కింపవ రుద్రుండు
యాదవ శ్రేష్ఠుండగు చేకితానుండు మాన
ధనుండు ద్రౌపదేయు లకేయులు గేకయు
లేవురు నేవుర పట్టు

భార. ద్రోణ. ౧౬౯.

మానిసి కావున నీదస నాతనికిన్ విముఖ
త్వము గల్గదు భక్తిమెయిం, దావినయం
బెవయుం గొనియాడుట దప్పదు కాంచెద
నాతనినై, నీవును నెయ్యముఁ గారుణి
కత్వము నొక్కనఁ దమ్ముల నవ్విభుండున్,
లేవుర పెట్టుగ సంతతి కల్మియు నీ మది
నిల్పుము పెంపొలయున్.

భార. స్త్రీ. ౧. ౯౦

పెట్టుఁజుట్టము. వి. (పెట్టు + చుట్టము)
చూ. పెట్టు³

పెట్టుఁజెట్టు. (పెట్టు + చెట్టు) కల్పవృక్షము,
వేలుపుఁజెట్టు.

పెట్టుకొను, స క్రి ౧ తాల్చు, ధరించు.
నగలు పెట్టుకొను, పువ్వులు పెట్టుకొను

౨ వహించు.

వ్యవ రామదాసను పేరుపెట్టుకొను

ఈ కార్యభారము నేను నా నెత్తి మీఁదను
బెట్టుకొంటిని.

౩ ఉంచుకొను

వ్యవ ఈ బాలుని నేను నాయొద్దఁ బెట్టుకొని
పోషించితిని, అతఁ డొక వేశ్యను బెట్టు
కొనెను.

పెట్టుకోలు. వి. పెట్టుకొనుట.

ఉ నేమఱి శత్రునిం బరిభవించుట కిత్తఱిఁ
రిత్త వైరమం, దామదిఁ బెట్టుకోలు సుఖ
తంత్రముగాదు సుసంధికాలమున్, నీమద
గంగ రూపడఁగఁ జేయుటయున్ వలదగ్గ
లైనవాఁ, డేమియునైన వధ్యుఁడను నిట్టి
వినిశ్చయమాత్మఁ గల్గుటన్.

భార. శాంతి. ౩. ౨౨.

పెట్టుక్రోవి. వి చూ. పెట్టుఁగ్రోవి.

పిట్టుడు. వి. పెట్టు³.

పెట్టుబడి. వి వ్యాపారమునందు ముందుగా వెచ్చమునకై మొదటపెట్టెడు మదుపు.

పెట్టుమందు. వి వశ్యౌషధము.

చ. పతి నను నొల్లఁ డవ్విభునిఁ బాయుట కోర్వఁగఁజాల నక్కటా, గతియిఁక నాకు నెద్ది గజగామిని యానతి యిమ్మటంచు దు, ర్మతమున సిద్ధురాలికిఁ గ్రమంబునఁ జెప్పినఁ బెట్టుమందు నీ,పతి కిది పాలతో నిడుము భర్త వశుం డగునంచుఁ బల్కఁగన్

యక్షగా ౪ ౨౩౪.

పెట్టుపడు. అ. క్రి (పెటు + పడు) దెబ్బతిను.

పెట్టుపోఁతలు. వి. ౯ (పెట్టుట + పోయుట.) చూ పెట్టుపోఁతలు

పెట్టె. వై వి (మొదట రూపముపెట్టియ)

౧ సొమ్ములు లోనగునవి యుంచుకొనుటకై కొయ్య యినుము దంతము మొదలగు వానితోఁ జేసిన పేటిక.

బొట్టుపెట్టె = తిలకమునకుఁ గావలసిన వస్తు సామగ్రి యుంచెడు పెట్టె

౨. పల్లకి నడిమిపెట్టె.

చ. కవున మనోజయంబుగఁ బ్రశస్త ముహూర్తమునందు వేడ్కఁ బల్లకులు గదల్చిపెట్టెల కెంపుల పార్శ్వకిఁ బోఁ బంబంధి యం, ధక యమవృష్టిభోజాల సుత ప్రకరంబును గొల్చి రా మురాంతకుఁడు మహేంద్ర వైభవము నప్ గదలెం దురగాధి రూఢుఁడై.

వై భార. ౩. ౧౧.

౩. బండి పరము మీఁద నమర్చిన పెట్టె.

౪. పాముగాని కోఁకటిబండపురుగుగాని చుట్టుకొనియుండు చుట్ట.

పెట్టెబండి. వి గూఁడుండుచోట పెట్టె యమర్చిన బండి (చూ పెట్టె³)

పెట్టెవేయు. అ క్రి (పెటె + పెట్టు) పెట్టెవలె (పాము లోనగునవి) చుట్టుకొను. (చూ. పెట్టె⁴.)

నీ కిరరూపంబునఁ బెట్టెపెట్టినశేషు ఫణరత్న ఘృణులకుఁ బ్రాఁకుపెట్టు

పాండు ౪ ౨౫౦

పెట్రకొలికికట్టు. స క్రి పెడకొక్కులు విఱిచి కట్టు

పెట్లకంబము. వి. (పెట్లు + కంబము) అదురు వేటుగొట్టము (చూ పెటులు)

పెట్లదిమ్మ. వి (పెట్లు + దిమ్మ) ౧ అదురు వేటుదిమ్మ ౨ ఉత్సవసమయములందు ఊరేగింపు వేడుకలలో కాల్చు బాణసంచులందొకటి ఒక అడుగు పొడుగును రెండంగుళముల దళసరియు గలిగి ఫిరంగివలె నుండునది. దాని నడిమిగొట్టమునందు మందునింపి దానిని ఒక గట్టి గడమీఁద నమర్చియుంతురు (చూ. క్రొవ్వాము.)

3 చేలలో పశువులను దోలుటకై సర్వ ప్రకారముగా పేనిపెట్టుకొను చేరు
(చూ పెటులు)

పెట్లదిమ్మె. వి. (చూ. పెట్లదిమ్మ)

పెట్లమారి. వి. (పెట్లు + మారి) దెబ్బలు తిను స్వభావముగలవాఁడు, దెబ్బలుతిను స్వభావము గలది, కొట్లమారి (చూ పెటులు)

సీ కోరి బంతులఁ జాల గుణవంతము అటంచుఁ బెట్లమారుల నీడు పెట్టఁదగునె
చంద్ర (అని శ ర)

పెట్లాఁగు. (పెట్లు + ఆఁగు) మల్లబంధవిశేషము.

పెట్లు. అ క్రి (చూ పెటులు.)

౧ వే (డిమి, విగువు మున్న గువానిచే) బ్రద్దలగు, చీలు, చిటులు, పగులు

క పోఁకముడిబీఁడఁ బులకలు, మూఁకలిడఁజెమట గ్రమ్మ మోవి చలింపఁ, గ్రైక పెరిల్లని పెట్లఁగ, రాకేంద్రుని ఖాస్యఁ గనెఁ బురాంతకుఁడంతన్
పార్వ 3. ౨3

౨ కాలి ధ్వనిపూర్వకముగ పగులు

3 పొగిసె దిక్కులు మెకంబుల యంగములు పెట్లె, సారిగెఁబిట్టలు పెడఁదిరిగెమరుండు
చంద్రా ౨ 3౪

(చూ పెడులు.)

వి తుపాకివంటి అగ్ని ప్రసరణాయుధవిశేషము (చూ పెటులు వి)

పెట్టుఁగ్రోవి. వి (పెట్లు + గ్రోవి.) ౧. అదురు వేట్టిడము

సీ కఱకు రైనట్టి జంజాలు కంద్రుకలు నిర్ఘ గవియు మేనులు కంపుఁ గన్నుగవయుఁ గుణం చకేవుబుబొట్లు కుసవింద ప్రాసకేదలు నొంటె యట్టి చెప్పులను గలిగి, వలలను బెట్లుఁగ్రోవులఁ బెద్దయురులును దరలును బోనులు దీమములును, వసులు గిసులు పోగు వాలు కంద్రుక గ్రాళ్లు బలువిండ్లు నమ్ములు ఒల్లెములును, బందివాటులు నీఁటెలు బట్టె సములఁ, బంట్రకోలలు నాదిగా బహువిధ ముల, సాధనమ్ములు ధరియించి శబరపతులు, వచ్చిరాఖేట క్రియా వ్యసన రతులు
హరిశ్చ ౨ ౬

౨ తుపాకివంటి యొక యుద్ధసాధనము

వ తుపాకుల పెళపెళలు పెట్లఁ గ్రోవుల పెటపెటలు
కృష్ణ 3 ౨౯

పెట్లుప్పు. వి (పెట్లు + ఉప్పు) వేడిమికి బ్రద్ద లయిన ఒకవిధము ఉప్పు

పెరిలు. వి పెరిల్లు

పెళిల్లు. వి ౧ హతియఁదగు ధ్వని కనుకరణము
దండకము వ్యాయామవేళా సునాయాసలీలా కృతాఘాతలోలా యిత స్వర్ణశైలాగ్రసాలా పతత్ పువ్వు పృష్టాత్మశక్తి ప్రవ్యాప్తా మరోత్పన్నట్టమేఘా ళవత్తుష్టియా ముష్టిచే

గ్రేయునంతన్ శౌర్యంబు నత్యంతక ల్పాంత దుర్దాంత తంతన్యమానానిలశ్రేణి దోధూయమానాభ్ర విభ్రాజితాదభ్ర శుభ్రేతరాభ్ర చ్ఛటావిర్భవ ల్లక్ష్య కోట్యగ్నుద గ్రోగ్రఖ దుశ్చృంఖలాసంఖ్య పుంఖాను పుంఖీభవద్దీర్ఘ నిర్ఘాత నిర్ఘోషముల్ మీఱి యత్యుగ్రమై యొక్క రావంబు పుట్టెన్

గరా. ౨౩౨ నృసింహావతారదండకము

౨ పడుగుపడుటయం దగు ధ్వనికి అనుకరణము.

క. ధళధళ మెఱపులు మెఱయఁగఁ, బెళపెళ నుఱుముచుఁ బెరిల్లు పెరిలునఁ బిడుగుల్, నలుగడఁ బడ బెడిదపు ధారలు గలఁ బలువాన జలధరంబులు గురిసెన్

కళా. ౪. ౧౭

(ఆమ్రేడితమునందు పెరిల్లు పెరిల్లు, పెరిల్ల పెరిలు)

డ. వి ౧ భాగము. అరఁటిపండ్ల గొలలో నొక పెడ

వ్యవ ఎడదారి పెడదారి ఎడమొఱగము, పెడమొఱగము చెంపపెట్టు ఎడపెడ తగిలినవి.

విశే ౧ పెద్ద

సీ. నడ యభ్యసించిన పెడకొండలును బోని యాఖిల సత్వ మత్తేభములును . .

పరమ. ౪ ౧౫౧

౨. వెనుకటి

వ. ఆ సమయంబున మదదెస మల్కాపాత శర్కరా వర్షాదులగు నుత్పాతంబులు గలిగె వానికి శంకింపక శకుని గడంగి రాధవరులతో మీరు కోట్లల చేయుం డేను పెడ ముట్టునఁ దాఁకి ధర్మనందనాదులను సమయించెద

భార. శల్య ౧. ౩౩౮

౩ విపరీతమైన.

ఉ. ఈ పెడబుద్ధి నీకు జనియించెనొ రే జడుఁడైనఁ దల్పెనో!, హా! విధిఁద్రోయ నీకు వశమా! లవణాసురుశౌరిఁ బడ్డవా, రీవలె కెవ్వరైన మనిరే! యిఁక నూర్వురు బ్రహ్మలొఁగినన్, జావక పోదువోటు? కాన సాగుచు నీ విలువిద్య లిచ్చుటన్

ఉ. రా. ౬. ౧౨౩.

౪ పెడఁగేలు, పెడఁబాపు, పెడఁబాయు, పెడకంటి, పెడకంత, పెడకచ్చ, పెడకట్టు, పెడకట్టె, పెడకాలు, పెడకేలు, పెడకోరిక, పెడగంటి, పెటగాలు, పెడచెవి, పెడచేయి, పెడతల, పెడదారి, పెడనెల, పెడబొబ్బ, పెడమర, పెడమరలు, పెడమఱు, పెడముట్టు, పెడమొఱగము, పెడయర్థము (పెడర్థము), పెడయుక్తి, పెడయెక్క, (పెడ్రెక్క), పెడవాడ, పెడవావి

పెడఁగేలు. వి (చూ పెకేలు, పెడచేయి) వెనుకకు త్రిప్పిన చేయి.

క. వారెత్తి యుగ్రుఁడై నం,గాలుఁడు పెట్టి
దము ద్రోయుటయుఁ బ్రద్వేఁ బెడం, గేలం
గట్టిన గ్రాసులు, కాలావధి గామి దైవ
కారుణ్యమునన్.

దశకు ౮ ౨౪

**పెడఁబాపు.** స. క్రి. ''పెడబాయు''నకు ప్రేరణార్థకము

సీ. కామాతురుని జేసి కారించి నొంగడేని నన
హీనుఁగావించి దైన్యపఱచు, పుత్రమిత్రా
ములఁ బోరిపోరి బెడఁబాపి బహుదుఃఖ
ముల పాలుపఱచు

భోజ. ౪ ౨౦౦

వి. పెడబాయుట

**పెడఁబాయు.** స. క్రి. ఎడఁబాయు

మ. మరసేవించిన వాఁత వాఁడి యయిన
సాహ్మల్లఁ బోనాడినన్, బురుషద్వేషిణి
యైన గొడ్డయిన నెప్డం గూఁతులం గన్నచైం,
బర కాలోగిమ. గర్భకేనియును వఛ్యార్థ్యం
బెడంబాసియు,పురుషుం డొండొక పెండ్లి
యాడినను నొప్పు దప్పులేదేమియు

విజ్ఞా అచా.

చ. జలగుమానాథుఁ డిట్లు రథసంబున నందన
పారిజాతముం, బలిమిఁ బెకల్చి యొత్త విట
పంబుల ద్రేలు దుకూల పల్లవం,బులు తడిఁ
బట్టి యాడ్చుఁ గాని బోవఁగ నీక పెనంగు
లీలఁ గ,ల్పలతికలెల్ల, వల్లభలు ప్రాణవిభుఁ
బెడఁబాయ నోర్తురే?

పారి. ౪ ౨౪

**పెడకంటి.** విశ. ఒక తెగకు చెందిన.

గీ. పంటకూటాటి పెడకంటి పాకనాటి

హంస. ౪. ౧౩౧

**పెడకంటిరెడ్డి.** వి. ఒక తెగ రెడ్డి.

**పెడకంటివాండ్రు.** వి. బ. ఒక తెగవారు.

**పెడకంత.** వి. తప్పుత్రోవ

**పెడకచ్చె.** వి. వెనుకప్రక్కను దోఁపుకొను కొంగు

**పెడకట్టు.** వి. (చేతులు) వెనుకకు విఱిచి కట్టిన కట్టు

**పెడకట్టె.** వి. (చూ. పెడసరికట్టె) మూర్ఖుఁడు. మూర్ఖురాలు.

**పెడకట్టుమాట.** వి. కట్టువిఱుపు మాట

**పెడకము.** వి. వెనుకటి భాగము, పృష్ఠభాగము

క. వడి నెయిది యిభము ప్రతిమ్మ, మసరఁ
నొకఁడాడ నేయ నది వెంగఁదిరుగం, ఒక
టయుఁ బెడకమునన వెలువడి శర వెంగిని
యార్చువానిని గాంచెన్

కు. సం. ౧౧. ౧౫౭

**పెడకాలు.** వి. రెండుకాళ్లను ఒక పార్శ్వమునకు తెచ్చుకొను కాలు.

పెడకాలుగా కూర్చుండు = రెండు కాళ్లను ఒకప్రక్కకే పెట్టుకొని చతికిలఁబడి కూర్చుండు

పెడకేలు. వి. వెనుకకు త్రిప్పిన చేయి

ద్వి. కడుఁబెకూర్చు వనితఁ గోల్పడి దైత్యుచేతఁ
బెడకేలుగాఁ గట్టఁబడిన విధంబు, వ్రాలి
రావణుఁ జంపి వడి బ్రహ్మహత్య, పాలయి
ధరచుట్టు భ్రమియించు విధము.

పండితా. వాద. ౫౭౨. పొ.

ద్వి. పడిలేచి మతిపట్టి వచ్చుచు ద్విజాలు, పెడ
కేలు గాఁ బట్టి విట్టుద్రోచుదును

పండితా. మహిమ. ౧౨౬. పొ.

పెడకోరిక. వి. కూడనికోరిక.

పెడగంటి = పెడకంటి.

పెడగాలు = పెడకాలు.

పెడచెవి. వి. చెవి వెనుకటిభాగము.

పెడచె(వి)వులబెట్టు. స. క్రి. శ్రద్ధతో వినకుండు.

గీ. బహువిధంబులఁ బలుకు నా పలుకులెల్లఁ,
జేదకన్నిడి తన పెడచెవులఁ బెట్టి,
యీఅకాలలు మఱిమాట లిచ్చి, యపహ
రించె దుర్యోధనుఁడు నేయుఁ జెప్పనేల?

భార. ఉద్యో. ౪ ౩౬.

గీ. చెలువ యప్పలుకులు పెడచెవులఁ బెట్టి, ధీర
గాత్రుఁడ విగిరవిశార యగుచు, కుదిర

వోయింపుఁ దక్షుని రొదుకుచూచు, నలుగుఁ
దపహైన మగుడఁ బోవలయుననిన.

భార. విరా. ౨ ౧౨౦.

క. వను సుప్రసాదదృష్టిం, గనుఁగొను మేఁ
నిపుడు గొన్ని కాఱుల అఱచితిఁ, మునీంద్ర
వానిఁ బెడచెవులను బెట్టుము వేఱుగాఁ
దలంపక దయతోన్

భార. కర్ణ. ౩ ౯౩.

సీ. గీ. శ్రీ జన సూక్తులవి పెడచెవులఁ బెట్టి,
తెరవ సురతి క్రియోక్తుల తీపి గరు

విక్ర. ౩ ౪౧.

క. ఇచ్చుతు మెచ్చునచ్చినవాని వరియింపుమనిన
నమ్మాటలు పెడచెవులఁ బెట్ట

ప్రభా. ౩ ౯౬.

చ. పడఁతుక పెక్కుభంగులను బల్కిన యట్టి
హితోక్తులన్నియుఁ, బెడచెవిఁ బెట్ట

నలచ. ౬. ౨౭.

పెడచేయి. వి. వెనుకకు త్రిప్పిన చేయి ౨. చేతి వెనుకటి భాగము, మీఁజేయి

పెడతల. వి. తల వెనుకటిభాగము, అవటువు.

ద్వి. ఆదరంగ వీఁపుల నంటికొన్నట్టి, కడుపులఁ
బెడతలఁ బడిన కన్నులను.

పండితా. పర్వత. ౩౧౫. పొ.

సీ. పెడతలఁ గెంపల నడునెత్తి ముందట నైదు
కూఁకటు లుండునట్లుగాఁగఁ, దలకోతి
గావించి ...

హ. ౩.

బుద్ధి పెడతలఁ బట్టినది = బుద్ధి చెడినది.

**పెడతలగండఁడు.** వి ఒరులమాటలు వినక మూర్ఖుఁడైనవాఁడు

సీ. పెనుపాఁప ఎగవాఁడు పెడతలగండఁడై యుండె నీ మదవృత్తి యుడుగి వేల?

రాజశే ౩ ౧౪౭

**పెడదారి.** వి. తప్పుత్రోవ, అపథము.

**పెడనెల.** వి. తీర్పరి (అప్ర) అని శ. ర

**పెడబొబ్బ.** వి. ౧ పెద్దయఱపు.

౨ యుద్ధమునం దుత్సాహముతోఁ జేయు ధ్వని

ద్వి నగరు తల్లడమంగ నాతులు బెదర, భీకరంబుగ నార్చి పెడబొబ్బ లిడిరి, యది వాలుఁ దాలించి యాయుగమంది, రోఁపి కోడకు మంచు సువిదలఁ బలికి

పల్నాటి బాలచంద్రుని యుద్ధము

పం ౯౯-౧౦౦ ట

౩ విపరీతధ్వని

**పెడమర.** వి వెనుకటిగిక్క

వ కృష్ణుండు దానితోడి సమరంబు వెపం బుగాఁ దన భుజబలంబు చూపంతిఁ జూపు టకై యంతలోనన దక్షిణ చరణం బట్లు యుండ నపరాంఘ్రిపాతంబునం గుంభ స్థలంబు నొప్పించి యుతికి వీపు వెట్టి యమ్మహా గజంబు దన్ను ద్రేయుటకుఁ బురనెత్తిన హస్తంబు గేలఁ గుదియఁ బుచ్చి

హరివం. ఉ ౯ ౯౭

**పెడమరలు(ర్లు)** అ. క్రి ప్రక్కకుఁ గాఁ వెనకకుఁగాని మరలు (తిరుగు)

గీ పెడమరలి చూచె నొక చంద్రబింబవదన, వేడ్క దలుకొత్త నొక రాజవిటకుమారుఁ బెడమరలి యేసె వాని నప్పుడె మరుఁడు, సానఁబెట్టిన మోహనాస్త్రంబుఁ దొడిగి

నైష ౭ ౧౧౬

వి ప్రక్కకుఁ గాన వెనుకకుఁ గాని తిరుగుట

**పెడమర్లు.** (చూ పెడమరలు) అ క్రి ప్రక్కకు గాని వెనుకకుఁ గాని మరలు, (తిరుగు)

ఉ పం దీఁటెను గ్రుచ్చియెత్తఁగడు పొచ రిక౯ పెడమర్లి గ్రక్కునన్

చంద్రా ౪

వి వెనుకకుఁ దిరుగుట

సీ ఇలమీఁద దలతాఁకి నీప్రక్క నాప్రక్క పెడమర్లుగాఁ బొడె పెట్టిపెట్టి.

కాశీ. ౪

**పెడమఱలించు.** స. క్రి పెడమఱలునట్లు చేయు

ద్వి ఊలుకుచుఁ గ్రేళ్లు చూపుచుఁ బన్ని కొనుచు గంతులు వైచుచును మణికట్లఁ బెడమఱలించుచు వ్రేళ్లు విడికిల్చుచును ..

పండితా పర్వత. ౪౩౭-౪౩౯. పా

ఆ. పైఁడమఱలించి యరనిఁ దొడరక యాళులి, మిత్తి భంగిఁ గుత్తిమీఁది కుడిని, మును దలి ర్పుఁ డిష్టముగఁ గాచు నందిని, సొగసి పట్టు నా మృగేంద్రకరణి. (ద్వా. ౧౦. ౫౬.)

పెడమఱలు. అ. క్రి. (పెడ¹+ మఱలు, వృత్తిని వర్ణలోప వర్ణవికారములు.) వెనుకకుఁ దిరుగు, వెనుక మొగమగు, ప్రక్కకుఁదిరుగు.

క. పఱతెంచి కదియఁబడి యొత్తైఱ ప్రేపిన మోము దాఁకి తిరిగ గరుడి యత్తఱిఁ జక్రంబున వారి పెడమఱి వైచెను దనుజా సనుజా మస్తకము దెగఁగ. నిర్వ. 3. ౫౪.

క. . ప్రల్మాటును బెడమఱి చూచుచు, జేటికి నెదురేఁదుమాడ్కి నింటికిఁజనియెన్. దశకు. 3. ౧౫౦.

సీ. కొన్నిజాగిలములు కోలాగ్రమున నిల్వ నొక కొన్ని వెనుకకాలికిని నొడియు, నొడియు చోఁ గ్రోడంబు పెడమఱఁ దిరిగిన నది జాతి కొదిరికి వట్లు కదియు. (రా. వి. 3. ౬౬.)

పెడమల్లె(ల్లియ.) వి. (√పెడ.) వనమల్లికా విశేషము. (?). ఒకజాతి అడవిమల్లె.

(ఇది మిక్కిలి గుబురయి గుజ్జయి బలుసుకంపె గొప్పవగు పత్త్రిములుగల గుల్మము. దీని కుసుమములు మల్లియలట్లు కడుసౌరభము కలిగియుండును. అవి. చి. ని.)

సీ. పొనుపుంతిఱ మంకెన గిరికర్ణిక పెడమల్లె గొండమల్లెడియుఁ గోల.
హంస. ౪. ౧౧.

పెడము. వి. (√పెడ¹.) ప్రక్కకుఁ దిరిగిన మొగము, మాఱుమొగము. (శ. ర.)

(చూ. పెడము పెట్టు.)

పెడముపెట్టు. అ. క్రి. (పెడము + పెట్టు.) కోపాదులచే మొగము ప్రక్కకుఁ ద్రిప్పుకొను.

సీ. ఘుక్రుఁ బాకముఁ జేసి భోజనము పెట్టినఁ గుడువంగ కొల్లక పెడము పెట్టి.
హర. ౧. ౧౪.

సీ. బింబోష్ఠి తనయందు పెడముపెట్టినవేళ నిష్టార్థములు దెచ్చి యిచ్చువారు.
వరాహ. ౮. ౧3.

పెడమొగమగు. అ. క్రి. (పెడమొగము + అగు.) మాఱుమొగము పెట్టుకొను, పరాఙ్ముఖమగు.

ఉ. పా మ్మనఁ జూచుఁ జూచి మదిఁ బుట్టిన ప్రేమము పేర్మి బాప్పములఁ, గ్రమ్మినఁ గ్రమ్మఱం బెడమొగం బయి కన్నులనీరు గ్రింగుచుం, గ్రమ్మఱఁ దా శకుంతల మొగం బగు వక్రులు నించుఁ గొంతసే, పమ్మని జాలి, బొంది ధృతియంతయు నిల్వక విచ్చి పాఱఁగన్. పి. శకుం. ౪. ౭౪.

పెడ(మోము) మొగము. వి. (పెడ¹ + మొగము.) వెనుకకుఁ దిరిగిన మొగము, మాఱుమొగము.

వ. వెండియుం జటకంబులకుఁ బెడమొగంబు పెట్టికొని పట్టఁబట్టం బోవుప్రాణ భర్తల వెంటంబడి (మనుచ. 3. ౭౭.)

పెడమోమువడు. అ. క్రి. (పెడమోము + పడు.) మాఱుమొగముపెట్టు, పరాఙ్ముఖుడగు.

సీ. ప్రేల్చుచుఁ బఱతెంచు భిదురంబు వనిమొనఁ బెడచేత బెడమోమువడఁగ నడిచి.
నృసిం. ౨. ౧౧౬.

పెడయాకులఁబెట్టు. స. క్రి. (పెడ¹+ ఆకులన్ + పెట్టు.) విడిచిపెట్టు.

ఉ. ఓలము లేదు గూర్పు నని యూఁడి
యుండితిఁ గూర్మి రొల్ల నేఁ, డాలము వేసి
నన్నుఁ బెదయాళులఁ బెట్టి . .
కు. సం. ౧౧. ౭౭౮.

**పెదరేఁచు.** స. క్రి. (పెద¹ + రేఁచు.) మిక్కిలి ప్రోత్సహించు, పురికొల్పు.

క. ఇట్లాక్రమించినయాకలి తత్త్వవిముఖవిచా
రం బై యమారాచ్ఛాద్రియంబు వడిం
బెదరేప ... కా. స.౩. ౯.

**పెదలిక.** వి. ఔషధి విశేషము. ?

సీ. త్రికటుకంబును వల్లి తిక్తరోహిణిబీజముల్
బర్బరబీజములును, కృహతిద్వయంబుల
బీజము ల్వసయును సైంధవంబును బత్త్రి
సర్షపములు, గోరోచనంబును కుందేటి యొము
కయుఁ బెదలికవేరును బిల్లిపిచ్చుక మందు
లెల్లను సెనయఁగ నిర్గుండి సాగంబులోఁద
నక్యంబు చేయఁ, గీ. గుదురు దుర్వ్యాధు
లెల్లనుఁ గుందిపోవు, సన్నిపాతాదు లెల్లను
శాంత మగును మఱి, శిరోరోగములు మదో
న్మాదములును, మానుఁ బదివాసరము లిట్లు
పూని చేయ. (చి. కి, చి ని.)

**పెడలు** = పెల్లు². వి. జా. గృహపృష్ఠభూమి, పెరడు.

క. పెర డనఁ బెడ లనఁ బెళ్ళనఁ, బరగున్
గృహపృష్ఠసీమ ... (ఆం. భా. ౨. ౧౯.)

**పెదవట్టు.** వి. కలుపుమొక్క, పనికిమాలినమొక్క. (వట్టు = వంగజాతి చిన్నముండ్లమొక్క, విజ్ఞా.)

ద్వి. ఇండ్లపెదవట్లును నందనోద్యాన,మందార
ముఖ్యసంక్రందనతరులు .
నందితా. పర్వ. ౩౧౩. పా.

**పెడవాడ.** వి. (పెడ¹ + వాడ.) వెనుకవీథి.

చ. వినుమనుచేత మంచుకొని నేఁ బదివాళ్ళనుఁ
గొన్నతొత్తు మృద్వనిత కలంబెనేని పెద
వాడని నైపని యింత యేటికిన్.
శుక. ౩. ౧౩౪.

**పెదవావి.** వి. (పెద¹ + వావి.) విరుద్ధబాంధవ్యము, తగని చుట్టఱికము.

చ. పెదవిలువాఁడు వన్ బరిభవించె నిఁకన్ విను
మూఁకఁ జాల నెక్కుడి పెదవావు లెన్నదవు
కామిని . ఉ. రా. ౪. ౨౧౪.

**పెదవిసరు.** వి. (పెద² + విసరు.) ప్రక్కవిసరు.

వ. ... అలోన నడిదంబునన్ బుదమిపతి పెద
విసరు విసరి యమరవరు కరాంగుళంబులు
డెగ నడిచె . మనుచ. ౪. ౧౧౫.

**పెదవీఁక.** వి. (పెద¹ + వీఁక.) పెద్దగా నిక్కియుండుట.

మ. కలయం జంద్రిక సోఁకఁ గర్ణికలు బొంకం
బొక్క యంతంతకున్, గలికాగ్రంబులు
పట్టువాసె సెలయంగా విచ్చి తోరంపు
టుగ్గులు వీదం బెదవీఁక వీడి వెలికొత్తల్
బాళము ల్దాయ లోఁదళముల్ బింకము
చూపఁగాఁ గలువ లందం బొందెఁ గ్రొత్తా
వులన్. పి. కరుం. ౩. ౧౫౯.

క. మిండికెడిఁ బెదవులం బ్రేలు, మడిగెడుఁ
గనుదోయి పొంగెడు మా రొదురఁ గడున్,
బెదవీఁకరొదలు చేసెదు, కడపల జపము
నకు నేఁడు కలదో లేదో.
ఉ. హరి. ౪. ౪౪.

(వీరశ. చి. ని. పా.)

**పెదవెట్టు.** అ. క్రి. (పెద² + పెట్టు.) పరాఙ్ముఖమగు.

ద్వి. ....కోరి,యుండుటయుఁ దనబావ యాయుగమునే
వాని, పెందిది చాఁగఁబోని పెడ వల్లెచి,

సీ. కడిఁదిగాఁ బెతరులపురము సగ్గి కవుల్చి
తోవరుఁబుట్టములఁ గొంటులఁ జాల్చి.
అచ్చ. రా. యు. ౩.౨౩.

పెతరులసామి. వి. (పెతరులు + సామి.) పితృదేవతలకు ప్రభువు, యముఁడు.
గీ. జమునసైదోడు పెతరులసామి జముఁడు .
అన నంతకుం డొప్పు శ్రీమహేశ.
ఆం. షం. దేవ. ౧౯.

ఇట్లే: పెతరులఱేఁడు.
గీ. . గుదాకాల్బు పెతరులఱేఁ డనంగఁ
గాలుని సమాహ్వాయము లగు ...
సాం. ని. దేవ. ౧౨.

పెత్తండ్రి. వి. (పెద్ద + తండ్రి.) ౧. తండ్రి అన్న. ౨. పెత్తల్లిపెనిమిటి (గ్రా.)

పెత్తనగాఁడు. విశే. (పెత్తనము + కాఁడు.) అధికారి. (శ. ర., గ్రా.)

పెత్తనము. వి (పెద్ద + తనము.) ౧. గౌరవము, అధికారము.
సీ. తగవులో సాపురందరుఁడైనఁ దనప్రజ్ఞ తాఁ జెప్పుకొనిన బెత్తనము లేదు.
వేమ ళ. ౩౭.

(వ్యవ.) ఇఁక నీపెత్తనము సాఁగదు.
౨. వార్ధకము, ముసలితనము
(వ్యవ.) అతనిని పెత్తనములో కొడుకులు బాగుగా చూచి పెట్టిరి.

పెత్తల్లి. వి. (పెద్ద + తల్లి.) ౧. తల్లియక్క. ౨. పెత్తండ్రిభార్య. (గ్రా.)

పెద = పెద్ద. విశే. (వృత్తియందే ప్రయోగము, ఆమ్రేడితమున పెదపెద.)
౧. విరివియైనది, గొప్పది.

గీ. కుతభవభూపాలుం జనుఁడు జాశ్వర్యధన్యఁ,
దను వృపాలతకుం దగ్రజానసుతకయూన్యకారము
శ్వేతముల జాటు నరుగుడించి, పెదపాజా
రంభకరుకత్తి పెదరకొన్నడు.
నంద. ౫. ౧౯౯.

చ. పాతల నౌనర్చి మోహితల వల్లియయో
ముఖి సాపుల స్వర్భూ,సుతను విరూప లౌట
ననుచో ముసలి స్పదనిట్టకాడుపం, టతిప
రమించెఁ దా ముసలి యయ్యెడ్ .
ఆము. ౫. ౫౩.

గీ. విమల పుణ్యోద వాహోద విష్ణుపదియు,
మొదలుగాఁ గొన్ని పెదపెదనదులు గలవు.
వరాహ. ౧౦. ౧౫౪.

ద్వి. మెదిచి తెల్లనిభూతి మేనింద వలఁది, పెద
పెద రుద్రాక్షపేరులు వేసి ...
ద్వి. హరిశ్చ. పూ. ౧౩౬౫.

౨. తారము, ఉచ్చము. (కంఠస్వరాది.)
క. పెదపెదమాటల నిష్పిఁడి దొడ్డకలకలము
గాఁగ దేకెరియుఁ దా, నిది యెయ్యదియో
చూడుము, పద మనుచున్ చేర సింధుపతి
వచ్చుటయున్. రాఘ. చ ౩. ౧౧౨.

పెదగంగయుదకము = కష్టసాధ్య వస్తువు, దుర్లభ పదార్థము.
సీ. అతనికృపారసామృతవృష్టి పెదగంగయుదక
మంచు ఘృతాచి మదిఁ దలంచె .
కవిరా. ౩. ౪౭.

(పెదగంగ = ఆకాశగంగ.)
జ. పెదనవ్వు, పెదపిచ్చి పెదమూట్టు.

పెదనవ్వు. వి. (√పెద.)) పెద్దజాతి నవ్వు. కీ.
సీ. గోమువ పెదనవ్వు పఱుపునవ్వు తెలినవ్వు
కునుమ పెల్లగిపెయు గోగు జమము
హంస. ౪. ౧౭౩.

పెదపిచ్చి. వి. (√పెద.) వృక్షవిశేషము,

క. ... మాణిక్యమునం పెడపిచ్చి పీనపిచ్చి
కల్లింద మల్లింద యిప్పు కప్పుర మద్ది .
పి. శకుం. ౨. ౧౮.

పెదముట్టు. వి. (పెద + ముట్టు.) అత్యంతా క్రమణము, గొప్పముట్టడి.

లయగ్రాహి. కట్టెదురఁ జాఁకి పడఁ బెట్టి వెంగ
పెట్టుఁ బెదముట్టుపని వాలములఁ బట్టుకొని
వీడున్ కు. సం. ౧౨. ౯౫౩.

పెదవి. వి. వాతెఱ, ఓష్ఠము.

క. వెండియు నధిక భయంబున,దండనమస్కృతు
లొనర్చి దైన్యంబున నో, రెండం బెదవులు
దడుపుచు, కొండేమియు ననక మిన్నకున్నన్
గరుడున్. కాశీ. ౪. ౧౩౦.

క. అని యడుగుచుండ బాలిక, కను మలుముచుఁ
బెదవి విఱిచి కటకట వాపోఁ,రెను .
కళా. ౭. ౧౮౦.

చూ : పెదవెత్తు.

పెదవెత్తు. అ. క్రి. (పెదవి + ఎత్తు.) పలుకు, మాటాడు.

సీ. బెదవెత్త వెఱచు నీచింబోస్తి తరువార నుకు
మార తరధీరకుకము గన్న.
కువల. ౩. ౮౨.

పెద్ద¹. విశే. (సం. పృథుః. త. పెరిదు.) ౧. (పరిమాణమునందు) అధికము, ఎక్కువది.

క. ఈ యున్న పొష్యప్రోలికిఁ, బోయి కడుం
బెద్దదవ్వు పోయినయ ట్ల,త్యాయతవిమల
తపోమహి,మా యిన్ని దినంబు లేల మసలితి
చెపుమా. భార. ఆది. ౧. ౧౧౭.

క. అనిన విని యాంబికేయుఁడు, మనమెఱ్ఱన
గడుఁ బెద్ద దీని మార్కొనఁ గుంతీ,తనయులు
గొంచెం బయ్యెడు, ననుమానింపక
కదలుడు టది యొ ట్లొక్కో.
భార. భీష్మ. ౧. ౧౨౩.

గీ. ముత్తికిన్నాఁటివారు పెంపొందుటలు కొదవరు
లుణిగవారు ద్విజాళి కాన పెద్ద, యనుచు
దేశభాషలను గుఱంబును దిట్టు, నరేఁడు
దలఁచు వచ్చు కరపుణ్యములు.
విజ్ఞా. ౨. ౫౬.

చ. .. పెద్దపవంటి కోల... (ఆము. ౧. ౯.)

౨. ఉచ్చము, తారము. (కంఠస్వరాది.)

చ. కొసరి వసంతకాలమునఁ గోయిల గ్రోల్చిన
భంగి పేర్చు న, బ్బసరుమాకొర కొండచుఱిఁ
బెద్దయెలుంగున వెక్కివెక్కి .
కాశీ. ౫. ౧౭౪.

౩. దీర్ఘము. (కాలము) చిరము.

ఆ. ఎట్టి సాధ్వులకును బుటిన యిండ్లను, పెద్ద
కాల మునికి తద్ద తగదు.
భార. ఆది. ౪. ౬౫.

ఉ. నెటన యిట్టియల్క మది నిల్పితి రక్కస
తాల్మిఁ జి చ్చొప్పెడిం,గట్టినయట్లు పెద్దయును
గాలము దీనికి వాఱు చెన్నడుం, బుట్టదు...
భార ఉద్యో. ౩. ౧౧౮.

వి. ౧. ఘనకార్యము, గొప్ప పని.

సీ. అసుర వృత్తిఁ ఆ,కేట కాక కార్యసిద్ధి
కా పేర్చుకే, పెద్ద యొత్తికొనిన భీతి
మగుడఁ, బడుట కష్టసరణి బలిమి దయ్యము
తోడఁ, కెల్ల దింక నేమి సేయువాఁడ.
భార. సౌప్తి. ౧. ౧౦౫.

శ్లో. తాం చాపదం ఘోరతరాం ప్రపద్య ని
మనీషిణః, య దుద్యమ్య మహాకృత్యం
భయాదపి నివర్తతే.
సం. భార. సౌప్తి. ౭. ౨౪.

ఉ. మీదయు మాకుఁ గల్గఁగ సమిత్తుల
నోర్చుట యేమి పెద్ద ...
భార. అర. ౩. ౧౪౦.

౨. గొప్పతనము, ఘనత.

తనుపో॥. ... ధర్ముండు సతిథి ర్తి వా కిచ్చ సర్వస లక్ష్మి, నిని వారిలోనఁ దా నే పెద్ద పొంది యీశానుఁ డేఁ దనయింటికిఁ జన్న, నవమాన్యుఁ జేసె . కు. సం. ౨. ౧౪౧.

౩. విశే. అత్యంతము, మిక్కిలి.

గీ. ప్రియము పల్కెడువారిన పెద్ద మెత్తు, రప్రియంబును బథ్యంబునైన పలుకు, వినఁగ నొల్లరు .. భార. సభా. ౨. ౧౯౧.

క. . . అ, వ్విదురువచనంబు నిలుపుదు, హృద యంబున నతఁడు పెద్ద యిష్టుఁడు మాకున్.
భార. ఆది. ౮. ౧౯.

ఉ. పెక్కురణంబులం గనియుఁ బెద్దయు నమ్మవు నన్ను మద్గురుం, దక్కినవారు మేము విను దాఁపము ప్రాణములు ..
భార. ద్రో. ౫. ౧౨౪.

(ఇటు 'ఉను' వాక్యాలంకారము.)

ఉ. మాయఁ జెడవాడి వీరిఁ గొనియాడెదు పెద్ద యునీవు .. కు. సం. ౨. ౧౭౭.

(ఇట ఉను' వాక్యాలంకారము

చ. బాల్యమునాదిగ దుష్టభావనం, బెరిఁ గిరి నీనిమిత్తమునఁ బెద్దయు దుఃఖితులైరి పాండవుల్ .(భార. సభా. ౨. ౨౫౫.)

(పెద్దయుదుఃఖితులు = మిక్కిలి దుఃఖము గలవారు.)

క. ఉద్దు లవు పెనకువలతుం, దిద్దఱు సరియైన చోట నెవ్వఁడు పై పై, గద్దించి యరుగు వాతఁడు, పెద్దయు దండ్యుండు చలము పెక్కిన కలిమిన్. విజ్ఞా. ౨. ౧౧౯.

(ఇట 'ఉను' వాక్యాలంకారము.)

జ: పెగ్గమ్మడు, పెద్దకాఁకర, పెద్దకులము, పెడ్డకొంగ, పెద్దగఁజాచు, పెద్దతుంగ, పెద్దనిద్దుర, పెద్దనిద్దురవోవు, పెద్దపులి, పెద్దపాల, పెద్దమాంసము, పెద్దమొంసలి, పెద్దప్రాతు, పెద్దరోగము, పెద్దవీధి, పెద్ద ప్రేవు, పెద్దాకుచెట్టు, పెద్దింటమ్మ, పెద్దిల్లి బెబ్బులి.

పెద్ద². (సం. వృద్ధః) ౧. వృద్ధుఁడు, వృద్ధురాలు, ముసలి.

సీ. ముదివాఁడు ముదుసలి ముసలి పెద్ద ముదుకు డొక్కడొక్కు ముదురుపక్కు పన్ను, యరగడం బనఁగను నలరు వృద్ధాభిధ ..
ఆం. భా. ౨. ౧౧౯.

సీ. తల్లి మదేశపు త్రిక పెద్ద కన్నులు గాన దిప్పుడు మూఁడుకాళ్ళ ముసలి.
సైన్. ౧. ౧౦౪.

౨. (వయోధికుఁడు) జ్యేష్ఠుఁడు, జ్యేష్ఠురాలు.

మ. వగఁ బొందంగ విరించి దేర్చినఁ గృపావర్జితుండవై మన్మథు, న్మగుడం జేసితి నీకుఁ బెద్దకొడుకై మద్భక్తుఁడై చెప్ప నొప్పుగుఁ బ్రద్యుమ్నుఁ డనం౯
ఉ. హరి. ౨. ౨౦౦.

ఉ. అందఱిలోనఁ బెద్ద మహిమాన్వితరుక్మిణి
పారి. ౧. ౭౯.

౩. వయసు గడచినవాఁడు.

క. పెద్దలు లేనియెడన్ మిమ్ముద్దలు నే నొంటి నునిచి యేఁగఁగ నగునే, యుద్దియ యే మని చెప్పుదు . కళాం. ౪. ౧౫.

౪. తెలిసినవాఁడు, తెలిసినది, విజ్ఞుఁడు, విజ్ఞురాలు.

ఉ. వేయివిధంబులందుఁ బదివేవురు పెద్దలు సత్ప్రబంధముల్, పాయక చెప్పిరి ...
విక్ర. ౧, ౧౨.

గీ. ...పండితాఖ్యధాన మగుఁ బట్టికాఁడు పెద్ద
చదువరి యొంటికగలుగువాఁడు గాఁగ
మేచకశిరోధి ... ఆం. భా. ౨. ౧౮౦.

సీ. కొప్పులు దఱు చర్యా నిప్పుడె చని తేగ
పెద్ద లౌ మదుసల్లఁ బిలిచి రారె.
ఇందు. ౨. ౫. జాహ్నవీ. ౧. ౧౬.

౫. పూజ్యుఁడు, పూజింపఁ దగినవాఁడు.

సీ. పెద్దలఁ జూడఁగన్న భృత్యుని కై వడిఁ జేరి
నమస్కృతుల్ సేయువాఁడు ..
భాగ. ౮ ౧౧౫.

చ. . కన్నులికం బిటు పెటిఁబోయెఁ బెద్దల
కును పెద్దయి తనయతండ్రికిఁ దక్కువపాటు
దెచ్చితిన్. హరి. ఉ. ౮. ౯౧.

౬. (గౌరవాదులచే) అధికుఁడు, గొప్పవాఁడు,
గొప్పది, శ్రేష్ఠము.

చ. అసురగణంబులోనఁ బరమార్థమ యింద్రుఁడు
పెద్ద ... భార. ఆది. ౫. ౧౨౦.

౭. పెద్దలు హీనతఁ బొందిరి, తద్దయు హీనులు
సమృద్ధిఁ దనరిరి .
భార. సభా. ౨. ౧౭౧.

ఉ. హేమధరాధరేంద్రమున కెక్కటి పెద్ద
ధృతిన్ నైష. ౧. ౨౬

గీ. తనదు కోదండ్రలోనఁ బెద్దయు గ నన్ను,
దేవకీదేవి మన్నించు నీవు నాకుఁ, జనవు
లిచ్చుటఁ జేసి ... పారి. ౧. ౧౩౦.

౮. ముఖ్యుఁడు, ప్రధానుఁడు.

ఉ. పుత్రులు లేరు నాకు నిది పుత్రిక దీని
నలంకరించి సత్పాత్రము గాఁగ నిచ్చెద
నతిప్రియమారఁగ నీకు దీనికిం, బుత్రుఁడు
పుట్టఁగా నతఁడు పుత్రుఁడు నా కని పల్కి
కొన్న యా,పుత్రుఁడు నారయుండు నరి
పుత్రుల కెల్లను బెద్ద లిద్దఱున్.
విష్ణు. ౧. ౧౨౦.

గీ. పీటి పెద్దతలారి విస్సాటి తలిత, చిన్న పెంబెల
వేల్పుఁ బార్వతీదేవి పట్టిఁ, గాలభైరవుఁ
గుక్కురగణ పరివృతుఁడు, ననుచరించిరి .
కాశీ. ౨. ౩౭.

వి. ౧. యజమానుఁడు.

గీ. మేరలా యింటి మాయంతవారలకును, పెద్ద
లున్నారె తెలియఁగి వారి పెండ్లిసేయఁ,
గలరు . విజ. వి. ౨. ౧౭౮.

౨. బ. వంశమందలి పూర్వపురుషులు (పితృ
పితామహాదులు.)

ద్వి. మా పెద్ద లిక్ష్వాకు మనుజేశముఖ్యు, లీపృథివీ
తల మేలి రిల పెసఁగ.
రం. రా. అయో. ౨౬. పా. ౨. పం.

శా. మా పెద్దల్ హరిసంశ్రయంబున నెమాన్
మన్నారు తత్కృత్యసా, లాపశ్రీతిఁ గృతార్థ
జన్ములము తెల్లం బేము .
హరి. ఉ. ౫. ౭౬.

౩. బ. పితరులు, పితృదేవతలు.

(వ్యవ.) అన్ని జాతులవారును సంక్రాంతి
పండుగ నాఁడు పెద్దలకు పెట్టుకొందురు.

పిల్ల పెద్దదగు = రజస్వలయగు.

(వ్యవ.) చిన్న వారిపిల్ల పెద్దదైనది.

పెద్దలఁ జేయు = (గృహస్థధర్మము నందుఁ బ్రవేశ
పెట్టు) భార్యాభర్తలను కలుపు.

క. పెద్దలఁ జేయఁగదటె నీ, ముద్దులజవరాలి
నజాని ముచ్చట దీరఁగన్, పెద్దలయనుమతిచే
నని, తద్దయు మదిలోనఁ జొదముతోర్పు
ర్యమునన్. ఇందు. ౬. ౧౧౮.

పెద్దలలోఁ గలియు = చచ్చు,మరణించు.

(వ్యవ.) అతఁడు పెద్దలలోఁ గలిసి మూఁడు
సంవత్సరములైనది.

(ఇఙ్లీ: పెద్దలఁ జేరు.)

బడిపెద్ద = విద్యార్థులలో ముఖ్యుఁడు.

పెండ్లిపెద్ద = పెత్తనము వహించి పెండ్లి నడుపు వాఁడు.

పిన్నపెద్దలు = చిన్నవారును, పెద్దవారును.

జ : పెజ్జటి, పెత్తండ్రి, పెత్తనగాఁడు, పెత్తనము, పెత్తల్లి, పెద్దకాఁపు, పెద్దతండ్రి, పెద్దతల, పెద్దతల్లి, పెద్దన, పెద్ద మనుష్యుఁడు, పెద్దమ్మ, పెద్దటికము, పెద్దవాఁడు, పెద్దవారము, పెద్దవేలుపు, పెద్దపేయు.

పెద్దకక్కెర. వి. (√పెద్ద[1].) కర్కరేటువు, పక్షి విశేషము. (శ. ర.)

పెద్దకాఁకర. వి. (√పెద్ద[1]) మహాకార వేల్లము. శ్రీ. (శ. ర.)

పెద్దకాఁచి. వి. కాకాదని శ్రీ. (శ. ర.)

పెద్దకాఁపు. వి. (√పెద్ద[1]) గ్రామాధికారి. (విణ. అని. శ. ర)

పెద్దకులము. వి. (పెద్ద[1] + కులము వ్యతిరేక లక్షణ) కడజాతి, చండాలకులము. (వా.)

పెద్దకూఁకటిమాఁగ. వి. ఒకజాతి భరద్వాజము, మాందిలవము. (అని. శ. ర)

పెద్దకొంగ. వి. (√పెద్ద[1].) బలాకము.

పెద్దగఁజూచు. స. క్రి. (పెద్ద[1] + కన్ + చూచు.) ఆదరించు.

ఉ. పిన్నటనాఁటనుండి నను బెద్దగఁ జూచిన వంశవృద్ధులన్, మిన్నక చంపి ...

కై. భా. ౧. ౫౯.

పెద్దగటిక. వి. గంధాలి. శ్రీ. (శ. ర.)

పెద్దగుమ్మడి. వి. పెండ్లిగుమ్మడి. శ్రీ. (శ. ర.)

పెద్దగుమ్ముడు. వి. శ్రీపర్ణి. శ్రీ. (శ. ర.)

పెద్దగోరఁట. వి. కురంటకము. శ్రీ. (శ. ర.)

పెద్దచేఁతరాసి. వి. మహోఝురసి. శ్రీ. (శ. ర.)

పెద్దచేమంతి. వి. మహాసహా. శ్రీ. (శ. ర.)

పెద్దజల్లిమెకము. వి. సృమరము. (శ. ర.)

పెద్ద(ద)తండ్రి. వి. (√పెద్ద[1].) ౧. తండ్రి యన్న, ౨. పెత్తల్లి పెనిమిటి

(వ్యవ) భీష్ముఁడు ధృతరాష్ట్రునకు పెద్దతండ్రి.

ద్వి. తలపోయ మా పెదతండ్రులై నట్టి, యల సరోభూతమహాయోగులకును, బ్రత్యక్షమైన గోపాలశేఖరుఁడు

ద్వి. పరమ. ౫. ౩౯౬. పా.

పెద్దతనము. వి. (పెద్ద[1] + తనము.) ౧. పృథులత్వము, లావు

ఉ. నెన్నడుము పెద్దతనంబు వహించె, వేవిభుల్ దటము లై జనించె నిటు తామర సాక్షికి నాఁడునాఁటికిన్ .

ఇందు. ౨. ౧౩౫.

౨ గొప్పతనము, గౌరవము.

ఉ. మన్మథమతాంధత నాశ్రమభూమిఁ గొక్కొరొక్కోయని కూయఁడే యతఁడు కుక్కుటమై నడిరేయి గౌతము, ప్రేయసిఁ బొందఁగోరి తన పెద్దతనంబు జలంబుపాలుగాన్.

వైమ. ౦. ౪౯

గీ. కలవి మా మాఁక నిప్పింతుఁ దొలఁగుఁడో కటి, యాఁడుదానిఁ జే నంటుదుఁ దనుచు బెద్ద,తనము నభిమానమును బెంపుఁ గనఁగ బలికె .

అము. ౬. ౩౩

3. వయోఽధికత్వము.

గీ. పిన్నపెద్దతనంబు రూపింప నీదు, శాంభవం
బైన దివ్యతేజంబు మహిమ ..
కాశీ. ౨. ౬౫.

(పిన్నపెద్దతనము = పిన్నతనము, పెద్దతనము.)

క. ఇది యెంత పేర్చిదరు మీ, చదివినయాతనినె
తానఁ జదివినచుది మా,నుదతియు పెందల
పలించెన్, దదభీష్టము పెద్దపిన్నతనముల
వయసన్. ప్రభా. ౫. ౪౮.

౪. ముసలితనము, వార్ధక్యము.

(వ్యాక) పెద్దతనముచే నతనికి కన్నులు బాగుగఁ
గనఁబడుటలేదు.

పెద్దతల. వి. (√పెద్ద¹) నాయకుఁడు. యజ
మానుఁడు.

(వి.  పెద్దిగా నుండి కార్యములు నడపించు
వాఁడు అని. శ. ర.)

చ. తలకొని యర్వనిష్ఠపదతామరసంబుల తావి
గ్రోలి ఘూ,తలనుతకీర్తిసంపదకుఁ దాఁ దల
కెట్టునదైన భాగము,లక్కలమున కెల్లఁ బెద్ది
తల గోత్రభిదాదులభూజ గాంచి యా,తల
మణి సాటిలేవిదిగదా ధవ నీతల యంచు
వేమఱుణా. రామా. ౭ ౨౧౩.

క. పెద్దతల లేక మీ కీ నిద్దపురూపముల నెచట
నిల్చిన మనకుం, బెద్దతీకము చాలదు పెఱ,
ముద్దులు గల్పింతు రెందు ముఖములు గలరే.
కళా. ౬. ౧౫౨.

పెద్ద(ద)తల్లి. వి. (√పెద్ద¹) ౧. తల్లిఅక్క.
౨. పెత్తండ్రి భార్య. ౩. తల్లికంటె పెద్దది
యగు సవతితల్లి.

శా. ఏనం జెప్పెదఁ జిత్తగింపుము మహాత్మా
తండ్రి సింహాసనా,సీనుండై కొలువున్న
నే నటకుం జేరంగ శాసించితివా, దానిం
గన్గొని పెద్దతల్లి కినుకన్ దట్టించి ...
వి. పు. ౨. ౮౩.

చ. ... ధ్రువుండు దీనుఁడై, తనపెదతల్లి పేరిత
యును దండ్రి యుపేక్షయుఁ జెప్ప .
వి. పు. ౨. ౧౬.

పెద్దతుంగ. వి. (√పెద్ద¹.) పెద్దజాతితుంగ,
తృణవిశేషము. క్రీ.

గీ. ... జంబు మాదర తుంగ పెక్జంబు పెద్ద,
తుంగ . హంస. ౫. ౪౪.

పెద్దతుమ్మి. వి. మహాద్రోణము. క్రీ. (శ. ర.)

పెద్దదవనము. వి. మహాదమనము. క్రీ. (శ. ర.)

పెద్దదుష్టి. వి. రామము. (శ. ర.)

పెద్దదూలగోవెల. వి. మహాత్మగుప్త. క్రీ (శ.ర.)

పెద్దదోస. వి. రాజకర్కటి. క్రీ.

సీ. పెద్దగోస వాఁ ద్రపుసముతోఁచు ..
ఆం భా. ౨ ౩౧.

పెద్దిన(న్న). వి (√పెద్ద.) ౧. జ్యేష్ఠుఁడగు
నన్న,సోదరులందరిలోను పెద్దవాఁడు.

క అనుజుఁ డొకఁడు పెంగలి య్యె,నను
దప్పెడుఁ గాని పెద్దనకుఁ గార్యజ్ఞా, నని
రూఢిలేక తక్కిన, ననుజన్ములు పితృ
వధుదు రనసీనా థా. భార. అను. ౪. ౧౩౩.

౨. అన్న.

ఉ. ఏనిక మామతా ల్పలుక నెక్కినరావుకు
రాజు సౌరసే,నానియనుంగుఁ బెద్దన విసా
యక దేవుఁడు . భీష్మ. ౧. ౨.

పెద్దనిద్దు(దు)ర(ద్ర). వి. (√పెద్ద¹.) దీర్ఘ
నిద్ర, చావు.

ఉ. కందఁడు భీతిఁ గుందఁడు ప్రకంపన
పొందఁడు పెద్దనిద్దురన్, కొందఁడు ... -
భాగ. ౬. ౪౨౮.

81

గీ. పెద్దనిదురకు ప్రాఁగన్ను పెట్టుచున్న, మూన
వునిఁ దెచ్చి దక్షిణమస్తకంబు,గా మహీ
శయ్య నునిచి యుత్క్రాంతిదాన, మవని
దేవోత్తమున కొక్కయావు నిచ్చి.
వి. పు. ౪. ౨౫౦.

గీ. దక్షిణశ్రుతి మీఁదుగా ధాత్రిఁ బొంది,
పెద్దనిద్రకు ప్రాఁగన్ను పెట్టువేళఁ, బంచ
జనులకుఁ దారకబ్రహ్మవిద్య, యభవుఁ
డుపదేశ మొనరించు నపుడు కాశి.
కాశీ. ౨. ౫౩.

**పెద్దనిద్దు(దు)రవోవు.** అ. క్రి. (√పెద్ద¹.) చచ్చు, మరణించు.

సీ. ... చనె గంతుగొంటఁ గూలెఁ బెద్దనిద్దుర
వోయె బిడ్డఁ డ్రళ్లె, ... డింకవేసెను
ప్రుగ్గ ననఁ జచ్చె ననుమాట కాళ్య
లయ్యె. ఆం. భా. ౩. ౭౩.

సీ. పెద్దనిద్దురవోయె బిడ్డఁడోరెను గంతు
గొనియెఁ జనెఁ దరలెఁ గూలెఁ జచ్చె ..
ద్రుంగె ననఁగను మృతుఁడయ్యె ననుట
కలదు. వేంక. పాస. ౫౪.

**పెద్దనువ్వు.** వి. మహాతిలము. శ్రీ. (శ. ర.)

**పెద్ద నెల.** వి. జ్యేష్ఠ మాసము. (శ. ర.)

**పెద్దనేరెడు.** వి. మహాజంబువు. శ్రీ. (శ. ర.)

**పెద్దపల్లేరు.** వి. మహాపలంకష. శ్రీ. (శ. ర.)

**పెద్దపాఁపర.** వి. ఇంద్రవారుణి. శ్రీ.

గీ. ... ఇంద్రవారుణి చెలంగుఁ బెద్దపాఁపర
యనంగ. ఆం. భా. ౨. ౬౧.

**పెద్దపీఁచర.** వి. పీవరి. శ్రీ. (శ. ర.)

**పెద్దపులి.** వి. (పెద్ద + పులి.) బెబ్బులి, వ్యాఘ్రము.

క. పెద్దపులి కడలిచెను ము, గద్దరికనము నను
నక్క కమువులు పొదలో, నుద్దవిడిఁ
బొచ్చి చిఱుతల,రొద్దం బడినట్టులయ్యె
నో యమరేంద్రా. దశా. ౪. ౪౦.

ఇక్లీ : పెద్దమెకము.

సీ. పెద్దమెకముతోఁడి నిద్దంపుపట్టును మెలల
దిండుగాఁ గట్టి మురియువాఁడు.
ద్వా. ౧. ౩౯.

**పెద్దపులుఁగు.** వి. పెద్దజాతి గ్రుడ్లగూబ. (దీని గూఁత అరిష్టసూచకము అందురు.)

ఆ. ఎలుఁగు చేరెఁ బెద్దపులుఁగు పాముటఁ
దోఁచె, దబ్బి బొబ్బ లిడిరి నుబ్బు లడఁగ.
ద్వా. ౧. ౨౩౧.

**పెద్దపెన్నెరు.** వి. మహాశ్వగంధ. శ్రీ. (శ. ర.)

**పెద్దపొల.** వి. (పెద్ద¹ + పొల.) ౧. మనుష్య మాంసము, నరమాంసము.

వ. . మాటిమాటికి మానిసికాటు మరిగి తెరు
వులు గాచికాచి దగ్గుత్తిక వడఁ దిను పెద్ద
పొలవలన బుటపుటనై క్రుప్పకుల్లి
క్రుళ్లి గంతులిడు గబ్బి బెబ్బులుల వొడ్ల
జనంబులు మంత్రించి పారక దిగిచిన నీరు చే
పుడిగి గిరులు గ్రక్కదల వాపోవుచుఁ
దిరిగి తిరిగి ... మనుచ. ౪. ౩౫.

౨. (పూజ్యమైన జంతువు మాంసము) గోమాంసము. (శ. ర., బ్రా.)

**పెద్దబీళి.** వి. రాజకోశాతకి. శ్రీ. (శ. ర.)

**పెద్దబోడతరము.** వి. మహాముండిని. శ్రీ. (శ. ర.)

**పెద్దమనుష్యుఁడు.** వి. (√పెద్ద¹) పూజ్యుఁడు, మర్యాదగలవాఁడు.

(వ్యవ.) పెద్దమనుష్యుఁ డగువాఁ డెవ్వఁడును
ఇట్టి అవాచ్యసంభాషణము చేయఁడు.

పెద్దమాంసము=పెద్దపొల. ౨.వి.(√ పెద్ద[1].) గోమాంసము. (గ్రా.)

క. ఎనుబదియేడులవార్ధక,మునఁ బ్రాఁతవశ్ గ్రీయడిగి పో దాతనికిన్, దినియెడిది పెద్ద మాంసము, కొనియెడియది కల్లు మనఁబ్రశ్స్వ ట్టుదుంగున్. శివరా. ౪. ౧౫౬.

పెద్దమానేరు. వి. మహాజ్యోతిష్మతి. తీ. (శ. ర.)

పెద్దముత్తవపులగము. వి. అతిబల. తీ. (శ.ర.)

పెద్దములక. వి. మహావార్తాకి. తీ. (శ. ర.)

పెద్దముల్లంగి. వి. మహామూలకము. తీ. (శ. ర.)

పెద్దముసలి. వి. (√ పెద్ద[1].) పెద్దజాతిముసలి.

గీ. పెలుక నిర్లాత కోచు శాఁబేలు పిడుక, ముసలి శింశుమారము పెద్దముసలి. హంస. ౪. ౧౭౩.

పెద్దమ్మ. వి. (పెద్ద[2] + అమ్మ.) ౧ పెదతల్లి.

౨. జ్యేష్ఠాదేవి.

(అభాగ్యదేవత, ఈమె లక్ష్మీదేవి అక్క యని ప్రతీతి.)

క. పెద్దమ్మ నాట్యమాడుత, దిద్దిమ్మని వత్స వాయితిమ్మనియింటన్. (చాటువు.)

౩. (తల్లులలో గొప్పతల్లి) జగజ్జనని, (లక్ష్మి, పార్వతి.)

ఉ. మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ మేటిపెద్దమ్మ దయాంబురాశివి గదమ్మ .. భాగ. ౧౦. పూ. ౧౭౪౨.

పెద్దమ్రాను. వి. (√ పెద్ద[1].) మహానింబము. తీ.

సీ. ... పెద్దమ్రాను ననఁగను బెనుమ్రాను నన స్మహానింబ నామములంగా నెగడుచుండు. అం. భా. ౨. ౪౯.

పెద్దయీడ. వి. స్వర్ణపారేవతము. తీ. (శ. ర.)

పెద్దయేలకి. వి. బృహదేల. తీ. (శ. ర.)

పెద్దరోగము. వి. (√ పెద్ద[1].) దేహమునందుఁ దిపెడువ్యాధివిశేషము, కుష్ఠరోగము. (శ. ర.)

పెద్దతికము. వి. (పెద్ద[2] + తనము.) ౧. ఘనత, గొప్పతనము.

క. ఎఱుఁగమిచే కటి నీపెద్దతికంబు దలంప నేమి తప్పు గలిగినన్, మంచి దయచూడు మి ట్లంత్య నీకుం బనులు సేయఁదగుదురు వీరల్. భార. విరా. ౫. ౩౫౪.

ఉ. పేలతనంబులో ఘనులు పెద్దతికంబు గణించుకొందురే, యాలములోపలన్ జలి యు నందఱుఁబిరము లంచుఁ బల్కుచున్. ఉ. రా. ౩. ౧౫౯.

౨. గౌరవము.

శా. నాపైఁదికరుణఁ గాదే, యీమెయిఁ బెద్దతిక మిచ్చి యిట్లాడంట నీ, కే మనుజాదుఁ బ్రసన్నుఁడ, నా మనుజుఁడ చూపె ధర్మజుఁ డఖిలమునందున్. హరి. ఉ. ౫. ౧౨౯.

సీ తనకుఁ బెద్దతికంబు మును సేయ దని దూఱు నిగమ రాతమునకు నర్ప లోసఁగె. ప్రభా. ౧. ౪౯.

౩. వివేకము.

క. ఏలిక నాదు మతాంక,శ్రీలకు కొఱఁ దదవ సేల శిర మండఁగ ఁగాలికి సేసలు పెట్టుట, పేలతనముగాక మిఁదుఁ బెద్ద తికంబే. ఉ. హరి. ౧. ౯౬.

పెద్దవరగోఁగు. వి. బృహత్పీలువు. తీ. (శ. ర.)

పెద్దవాఁడు. విశే. (√ పెద్ద[1].) బ. పెద్దవారు, పెద్దవారలు.)

౧. ఘనుఁడు, గొప్పవాఁడు, పూజ్యుఁడు.

గీ. పెద్దకాలికి శ్రీపుణసకీవ మేలు, మాన
నీయంబు పుణ్యకర్మంబుగాక ...
హరి. ౮. ౮౨.

ఉ. కొమ్మయు మా కెటువంటి పెద్దకా,
కెంచ రోకింతయుం గలనియింతుల నంచుఁ
బెనంగ . కళా. ౩. ౩౨.

౨. వయోధికుఁడు, జ్యేష్ఠుఁడు.

ఉ. నీవు గుణాంబురాశివి వివేకుఁడ వెంతయుఁ
బెద్దవాఁడవున్, భావనమూర్తి వాదరణఁ
బాయవు . ఉ. రా. ౫. ౨౫౯.

ఆ. ఎత్తి కౌఁగిలించి యీ వేళ మ్రొక్కెదు,
పెద్దవాఁడ వనుచుఁ బ్రియము మీఱ.
దశా. ౨. ౧౨౫.

౩. వృద్ధుఁడు, ముసలివాఁడు.

సీ. మనయమ్మ కడు ముఖమున నున్నదే యయ్య
పెద్దవాఁ డాయెఁగా పేర్మి నతనిఁ, బోషిం
తురే మీరు కుశ. ౨. ౫౧౯.

**పెద్దవాకిలి.** వి. గోపురద్వారము, (దేవాల యాదుల) ముఖ్యద్వారము. (శ. ర.)

**పెద్దవారము.** వి (√పెద్ద².) బుధవారము. (శ. ర., బ్రౌ.)

**పెద్దవిన్నపము.** వి. చెవుడు, బాధిర్యము. (శ. ర.)

ఇ: పెద్దవిన్నపమువాఁడు.

**పెద్దవిన్నపమువాఁడు.** విశే. (పెద్దవిన్నపము) పెద్దచెవిటివాఁడు, బధిరుఁడు. (శ. ర.)

**పెద్దవిరి.** వి. మహాసిలి. ఔ. (శ. ర.)

**పెద్దవీధి.** వి. (√పెద్ద¹) రాజమార్గము, రాచ బాట. (శ. ర.)

**పెద్దవేము.** వి. మహానింబము. ఔ. (శ. ర.)

**పెద్దవేలుపు.** వి. (√పెద్ద¹.) జ్యేష్ఠుఁడు, బ్రహ్మ. (శ. ర.)

**పెద్దవ్రేలు.** వి (√పెద్ద¹) బొటనవ్రేలు, అంగుష్ఠము.

సీ. పాఁదగు నంగుష్ఠంబు పెద్ద. గీ. వ్రేలు
నాఁగను ఆం. భా. ౨. ౧౩౯.

**పెద్దసేయు.** స. క్రి. (పెద్ద¹ + చేయు.) ౧. గౌరవించు, గొప్పసేయు.

సీ. సవినయంబుగఁ గృతాంజలి యయి మమ్మెంత
పెద్దసేయుదు నీవు పెద్దలకును, బెద్దవు .
భార. అను. ౪. ౪౧౦.

౨. స్తుతించు, పొగడు.

చ. ముదమున నిమ్మహీశుఁ డొకముద్దియ
మాటఁగ నొక్కకాంతితో, సదమదమై
కదంగి రతిసల్పుట తెల్లమిగా వెలెంగియుఁ
మది వివరించి రోతు కభిమానము
దక్కిన వీరికూరుముల్, వదలక పెద్దసే
దివు వందిగితికి దగ కీ విచారముల్.
మనుచ. ౬. ౭౯.

౩. ఉన్నదానికంటె ఎక్కువగాఁ జేయు.

ఉ. ఎన్నడు నేర్చినాఁడవుర యీమటుమాయపు
మాటలీవు నా, కిన్ని దలంప నేమిటికి
నిక్కము గోపయి పెద్దచేసి యా,దున్న
పయోధికాంక్షకు దొడ్డగఁ జెప్పె భయంబు
నాపి సారంగ. ౨. ౧౧౪.

**పెద్దాకుచెట్టు.** వి. (పెద్ద¹ + ఆకు + చెట్టు.) ఒకానొకయడవిచెట్టు. (శ. ర.)

**పెద్దాపురి.** వి. పెద్దాపురమందు చేయఁబడు శర్కర. (శ. ర.)

**పెద్దారుగ.** వి. వరకము, సస్యవిశేషము. ఔ. (శ. ర.)

**పెద్దింటమ్మ.** వి. (√పెద్ద.) ఒకానొక గ్రామ దేవత. (శ. ర.)

**పెద్దిల్లు.** వి. (√పెద్ద.) భూజ్యగృహము) - వివాహగృహము, పూజాగృహము.

వ. ఇట్లు శృంగారించి శైలవల్లభు పెద్దింటిలోనికిఁ గొడితెప్పించి రంత . వీర. ౩. ౧౬౩.

గీ. తలుపుఁ బుచ్చి లంజతల్లి వేలుపుల పెద్దింటి లోని కరని నింపుతోడ. ఉ. తోడ్కొని పోయి .. పరమ. ౩. ౨౬౨. ౨౬౩.

**పెన.** వి. ౧. మెలి, మెలిక.

సీ. ఊడుపథంబున జాయుమరరత్నకలిభాతి మెడ హారముల పెన పుడమిఁ దాఁక.
పాండు. ౫. ౨౬౪.

సీ. కొనలఁ జుట్టినతీఁగ పెనచేఁ జమరవాలపు కరంబులఁ జుట్టి పట్టి తిగిచి.
పాండు. ౧. ౧౨౬.

౨. (వాడు.) మట్టు, బంధము.

క. వచ్చినఁ జూడ గాంచి పెనల్, విచ్చుకొని కడుం దిలంకి విసదారిగముల్, విచ్చున్నొ గ్గయి కదలక, విచ్చలవిడిఁ ఒఱచెఁ గట్లు వీడం బజకుఁ. (చ్చ రా యు. ౧౬౩.)

క. అప్పుడు గరుడుని రెక్కల, చప్పుడు మూఁ మున నెఱిఁగి పైరింపఁగ లే, కి ప్పెనలు విడిచి రాఘవు, లొప్పఁగ భుజగంబు లొక్కయురవడిఁ బఱచెఁ.
భా. రా. యు. ౬. ౨౮.

౩. రెండుపశువులను చేర్చికట్టెడుకట్టు, లంకె. (శ. ర., బ్రౌ.)

౪. గ్రుద్దులాట, నియుద్ధము.

సీ. తనరును బెనఁకువ పెనఁగులాట యనంగఁ బేన యావ గుద్దులా టన నియుద్ధము . .
ఆం. భా. ౨. ౨౨౨.

రూ: పెనఁగప్పు, పెనఁగొను, (పెన్గొను, పెనలు గొను.) పెనఁగోలుపు, పెనపట్టు, పెన వేయు, పెనవైచు.

**పెనఁకు(న్కు)వ.** వి. (√పెనఁగు.) ౧. మెలి గొనుట, చుట్టుకొనుట, అల్లిక; మెలి, మెలిక.

సీ. లల్లిబిల్లి యనంగ నలరును బెనఁకువ . .
ఆం. భా. ౩. ౨౯.

చ. . నూతనలతికాలతాంగుల నుదారగతిం జలివాపి నెయ్యపుం, బెనఁకువ నేర్పు దక్షిణ సమీరణుఁ డొయ్యనఁ దావు లంటుచున్.
వసు. ౧. ౧౨౪.

వ. అంకుశపుటలుఁగుల గ్రిందికొంకుల ములుకులంగ తగులుకొనిన యినుపసరిపెణల పెనఁకువగల యిత్తికొమ్ము సింగోటల గుప్ప దులును . ప్రబంధ. ౪౭.

౨. సమ్మేళనము, కూడిక.

క. విను సత్త్వరజస్తమముల, పెనఁకువ కవుల వెలుఁగొందు పెంపుగలుగు తుర్యనిరంజన తత్త్వము పర, మనమూ యది భావనీయ మను వేదంబుల్ (భార. శాం. ౪. ౩౩౨.)

ఉ. ఇంద్రశిలావిభూషణాంతరుచిచ్ఛటల్ పెనఁకువై తనర చాపుల వంటి కొల్వేఁగన్.
కళ. ౨. ౫౫.

౩ (స్త్రీ పురుషుల) కలయిక, కూటమి.

సీ. పెనఁకువఁ దనిసిన తనువు లొండొంటితోఁ గీలించి నిద్రించి మేలుకాంచి.
భార. విరా. ౨. ౨౩౭.

సీ. బిడని పెక్కువ మట్టు గదచిన బుసకొట్టు బొందుకుఁ దొడఁదట్టు బందికట్టు.
చంద్రా. ౬. ౧౫౧.

ఉ. .. పెడిదంపు పెనంకువ గోళ్ల నొక్కుచున్ ... దంపతుల్ [illegible]పట్టలకై పడిపోరి రెంత యున్. చంద్రా. ౬. ౧౫౭.

౪. యుద్ధము, పోరు.

క. కాన యవశ్యముఁ బెనఁకువ, గాని యుపాయమునఁ బగఱఁ గడతేర్పు ధృతిం, బూని పడచు పెవ్వఁడు డెం,దానం బెయికట్టి కొని యతఁడు నిద్రించున్.

భార. ఉద్యో. ౩. ౧౯.

క. పెనకువ జగడము . యుద్ధంబునకుఁ బేళ్లు . . ఆం సం. మాన. ౪౭.

౫. పెనగులాట, లాగులాట, నియుద్ధము.

ఆం. భా. ౭. ౭౭.

క. మెద నొకపూలసరం బిడి, వడి నడిచిన పేఁగి పెనఁకువకుఁ బిల్చుటయున్ .

శ్చరా. కిష్కిం ౪౦.

౬. వివాదము, తగవు, వ్యవహారము, వ్యాజ్యెము.

క. ఒక్కఁడు మానవు మూఁదఁగ, నొక్కఁడు దైవంబు నూఁది రొదఁబడ కున్నన్, ఎక్కువ మానవముం గొని, తక్కక పెనఁకువలు దీర్పఁ దగు సభ్యులకున్.

విజ్ఞా. ౩. ౩౧

క. పొందలిటి పత్రము తెల్లము, ముదమున విలుచుటకు దానమున పాడికి నిం,పొదవఁ బ్రమాణము లైనను, విదపటి పత్రంబె చెల్లుఁ బెనఁకువ లందున్. విజ్ఞా. ౩. ౩౭.

౭. ఆసక్తి, శ్రద్ధ.

చ. అవిశి పెదుర్పఁజాలు దొర సారవి కానక యయ్యెడయాతి దాఁ, బెనఁకువ పేటి పన్నములు పెక్కులు పేవి పసిండిఁ బాణులం, దనుపఁగ దాని నిచ్చు నని దయ్యాళ్లు మూఁకలు పైఁడికొండపై, నతతము గాఢ రంబులఁగ నన్నియుఁ గాచుచు నుండు నెంతయున్. యయా. ౧. ౯౩.

పెనఁకువలుగొను = మెలివడు, చిక్కువడు.

వ. ... బడుగునడుము బెదకి వడవడ వడంక నతితిసరులు గలయంబడఁ దిరుగుచుఁ దిరుగు నెడఁ బెనఁకువలుగొన. భాగ. ౧. ౩౯౭.

పెనఁకువవితములు. వి. బ. (√పెనఁకువ.) బాలక్రీడావిశేషము.

మహాస్రగ్ధర. బిరిగాయల్ కందుకంబుల్ పెనఁకువవితముల్ బిల్లగో ల్లాకుపీఁకల్ . సరివాంద్రం గూడి యాడున్ జనపరమునకుఁ డా శైశవక్రీడలందున్. ఇందు. ౭. ౧౪.

పెనఁగఁబడు. అ. క్రి. (పెనఁగన్ + పడు, స్వార్థమున) ౧. మెలిగొను, పెనవేసికొను.

ఉ. పెండియు వాఁడు తీవ్రశరకేదనఁ జొప్పడు దూఱవాఁడ పా,ఖండలనూతి యప్డు పెనఁగం బడురథ్యములన్ మరల్పఁగా నొంపు విధంబు గావక హై. భా. ౫. ౩౧.

౨. అలముకొనఁబడు, దట్టముగాఁ గప్పబడు.

ఉ. ఊసరవెల్లిచందమున నొక్కటి తీఁవరాలు దేరఁగా, విూసలు గడ్డమున్ జడలు పేనదరంబున పీనులున్ జరా,ధూసరమైన రోమతతితోఁ బెనఁగంబడి దూదిరాశిగాఁ, జేసినటి యున్న రొంకతగ్గమునిన్ గని కౌతుకంబునన్. మను. ౪. ౭౯.

పెనఁగప్పు. అ. క్రి. (పెన + కప్పు) పెనఁగొను, దట్టముగు.

సీ. ఎలమావిజొంపము ల్బలసిన చెత్తమ్మికొలని లోపలిదూలు పెలమిఁ బొదలి, పెనఁగప్పి రొంప్పిన యనఁటుల ... వసం. ౫. ౬౭.

పెనఁగాడు = పెనఁగులాడు. అ. క్రి. (పెనఁగు + ఆడు, పెనఁగి + ఆడు. అని. శ. ర.) పెలిగొను, పెనవేసికొను.

ఉ. పవనజచాపముక్త శరులగ్గములుం దును
మాడి కాండితో, నని పెనఁగాడఁగా నెడఁద
యమ్మునఁ గేతువు గూల్చి నూతునే,
నవియఁగ నేసినం బఱచె నాతఁడు ...
భార. ద్రో. ౪. ౨౩౩.

ఉ. సారథి వడ్డ వశ్యములు సంచలతన్ బెనఁ
గాడి యీడ్చినం, దే రను వేది యగ్రజాఁడు
ద్రిప్పికొనం గని మాలి యడ్డమై, బోరన
వచ్చి యు వ్యూహగపుంగవకేతను నేసి
నిర్వ. ౩. ౨౫.

సీ. దోర్మూలములకుఁ, దొడికి భుజంబులతోఁ
బెనఁగాడుచు లీల మోములు గబళించి ...
హరి. పూ. ౭. ౩౭.

పెనఁగు. అ. క్రి. (క. పెణగు, త. పిణంగు.)
౧. పెనఁగొను, పెలిగొను, చిక్కుపడు.

సీ. సత్తిమ్మినాలిజన్నిదము ఆయ్యాఁవర్తన
లావణ్యసూత్రములఁ బెనఁగి.
వసు. ౪. ౮౯.

౨. కూడు, కలయు.

కవిరాజ. చనిచని ముందట నాట్యాహావిర్ధ్రతి
సౌరభధూమలతాతతులం బెనఁగిన ద్రుమాఁ
కుల . భార. ఆది. ౪. ౨౧.

(లతలతో కూడుకొన్న. భా. ల. వ్యా.)

క. అనుపలుకులకు విషాదము, పెనఁగిన మోదం
బుతోడ ..
ఆం. భా. ౩. ౧౧౯. దశకు. ౩. ౧౪౫.

౩. (స్త్రీపురుషులు) కలియు, సంభోగించు.

క. మదనజరాగంబునఁ బెనఁగిన యుష్ణిని కడఁ
జూచి .. భార. ఆది. ౫. ౪౯.

సీ. పాతాళభువనాధిపతిశేషాహిశిఁ బ్రియులతో
మహనాశఁ బెనఁగఁగలిగె. భీమ. ౧. ౩౪.

౪. పోరు, యుద్ధముచేయు.

క. గిఱుపుసెడ గేయుసెడ వడిఁ, బఱచుసెడం
బెనఁగుసెడ నపారబలంబుల్ ...
భార. ఆది. ౫. ౧౬౪.

చ. వకులుఁడు నూతపుత్రుడు పెనంగుసెడన్
నకులుండు సూతపుత్రకునకు నిట్లనున్ ...
భార. కర్ణ. ౧. ౧౨౩.

౫. వివాదపడు, తగవులాడు.

క. కిడుసన్నపుఁ గార్యము పెక్కుడుఁగొనకు
తోడఁ బెనఁగి కుతుకులు మార్గ్యాం, బుడుగకి
పెద్దియు వేగిం, బడుదురుచుమి లాటనృపతి
వారులవోల్న్. కేయూర. ౨. ౧౧౮.

వ. . అలు చచ్చిన (అ) యాలికిం గలట్టిపాటి
తోడవు మగనిద కాని యాలివారు పెనంగి
తే(ని) మహాపాతకము ..
ద. శా. ౪. ౭౧౨.

౬. ఎదురాడు, మారాడు.

ఉ. నావుడు భామతోడ నరనాథవరేణ్యుఁడు
పల్కె నింత రాత్రివదనా యీహితవు
చెప్పకు మి ప్పుడిబాలి బ్రహ్మయుక్, దేవ
విభుండు కేఁ దరుగుదెంచి ప్రతిప్రతికూలు
రైన న్, నావిధ మేల మానదుఁ బెనంగక
తక్కు కుటుంచుఁ ద్రోయుచున్.
రుక్మా. ౫. ౧౬౧.

సీ. అనవుడు వారితోఁ బెనఁగుట కొల్లక ...
దశకు. ౨. ౪౨.

8. (అంగక) పెంకితనముచేయు.

సీ. పెనఁగుకూశలముల విరుదతనంబులఁ జలము డింపక తీర్పఁజాలుటయును ...

భార. విరా. ౧. ౯౫.

౯. గుంజులాడు, లాగులాడు.

గీ. నిగనిగల్ గుల్కు వరమాణిక్య మెసఁగ, గుబ్బచనుదోయి బంగారుకుండ లొసఁగెఁ, జెఁగెఁ దపోదికముడికిఁ గాఁ బ్రియుని తోడ, శిరిజాతులు ముగ్ధలు గారె యొప్పడు. దశా. ३. ౯౪.

చ. కొమ్మయు నా రెటువంటి పెద్దవా, రెంచ రోకింతయుం గెలనియింతులెంచుచుఁ బెనంగ వాత్మ చేలాంచ ముం దదీయు మగు హస్త మశోజము లూఁదిపట్టుచున్.

శశా. ३. ३౭.

౯. శ్రమపడు, ప్రయాసపడు.

చ. పెనఁగక ప్రాణరక్షణ మునేత్రయొనర్చుట పాపము అము. ౬. ౭౮

౧౦. అడ్డపడు.

సీ. కటకారివములకు గాశ్చ్రక్కిం బెనంగు నంచలచే నడ యలసపడక.

దశా. ౭. ౭౯౬.

౧౧. అంటు, పట్టు, సాటు.

క. అని తమ కిశ్రియ బోధం,చిన జారకపక్వి పతంకఁ జిత్తారోగం,బునఁ బెనఁగి నీక ప్రయుతుని, తనయందు తనయుండుబిగి వదల క ట్లనియెన్. పాండు. ४. ౭౧8.

౧౨. అలముకొను, వ్యాపించు.

చ. అనఁటయు దేవమూత వదసాబ్జమునం దన చూడ్కి నిల్పి యానవనమున మందహాసము పెనంగఁగ ని ట్లను ...

వి. పు. ౯. ౧౧४.

౧౩. ప్రబలు, అతిశయించు.

గీ. ఎలమి మణి కొన్ని చెట్టుల శత్తియొత్తి, యలని ముంగిఁ బ్రమునితో వాని యుండఁ, గుండ నిండారఁగా ముంచి కూడుదినఁగ, నింటి కేఁగను బడలిక లంటి పెనఁగ.

హంస. ౧. ౧౯8

వ. క్రి. ౧. చుట్టుకొను.

క. విని కోయ తీఁగ గాళ్లం, బెనఁగం బ నమచుఁ బొంగి భీష్ముఁడు

భార. ఆది. ४. ౭౭౦.

సీ. క్రొక్కారు మెఱుఁగు తరుశ్కని మెఱ యఁగాఁ బానియుఁ జీకు చూపుఁ బెనంగ.

ద్వా. ३. ౯8.

౨. (రతియందు) కూడు, కలియు.

గీ. పణవ కోపకయున్న పై మణిని పెంటిఁ, బెనఁగియున్నను బ్రసవింప నౌనసియున్నఁ, గావులు గొనియున్న మృగములఁ దివిరి యేయ, రుచి యాహారముగి మను నెఱుక లయిన. భార. ఆది. ४. ४३.

గీ. పడియు వడగంట్లు నింద్రగోపములు కూర్మి, ఘనకీళుఁడు క్రొమ్మెఱుం గను జవ్వనిఁ బెనంగ, బన్న సరమున సదలి పైపై నరాల, కమలము కాఘలాబ్జరాగము లనంగ.

రామా. ౬. ౧౯.

३. తలపడు, తాఁకు.

మ. అగ్గలికణ దాగ్నాని తీవ్రబాణతతి యాకాశంబునక జీకటుల్ గొలుపఁ నిల్చి పెనంగి ర య్యాహితులక ఘోరప్రకారం బునక ... హరి. ఉ. ३. ౧౧౦.

వి. పెనఁకువ, పెనఁగులాట.

(రాముని విశ్వామిత్రునితోఁ బంపుటకుఁ దండ్రి విచారించుట.)

సీ. పెన్నుద్దికొమరుల పెనఁగులా పఅలాశన
ద్వంద్వబంధురానందనములు.
చం. రా. ౨. ౩౫.

సీ. తొవవువ్వకాములతో లిమ్ముగాఁ బువ్వు
పిక్కమూలంబుల పెనఁగు వాపు ..
కు. సం. ౬. ౧౭.

గీ. కానివస్తువుఁ బట్టికోఁ గాంక్షచేతఁ, బెనఁగు
మాత్రంబె కాని లభించ దేమి .
రామలిం. ౫౪.

జః పెనఁకువ, (పెన్కువ) పెనఁకువవితములు,
పెనఁగఁబడు, పెనఁగాడు, పెనఁగులాట,
పెనఁగులాడు, పెనఁగువడు, పెనఁచు.

పెనఁగులాట(ము). వి. (√ పెనఁగులాడు.)
౧. గ్రుద్దులాట, నియుద్ధము.
చ. ... వెనుక ముందరఁ జూపి మెలఁగుచుఁ
బెనఁగులాటలం జెలంగుచుఁ బిక్కటిల్లి
మర్కటంబులును .. ప్రబంధ. ౧౭౩.
౨. మెలిగొనుట, అల్లుకొనుట.
రగడ. . తరులతల పెనఁగులాటములు తోట
ములు . గాంధవ. ౨. ౬.

పెనఁగులాడు = పెనఁగాడు. అ. క్రి. (పెనఁ
గులు + ఆడు) ౧. మల్లాడు, పోరు, గుంజా
లాడు.
సీ. (సమీరబాలకుఁడు) హేలాంచితపుష్పమాలా
విచితకేశభృంగ మల్లములతోఁ బెనఁగు
లాడు . కవిరా. ౧. ౬౪.
ఆ. పిన్న వాఁడుబోలెఁ బెనఁగులాడుచు నుండి,
బాలుఁడైన కపటబ్రహ్మచారి, మాయమయ్యె
నభుడు మసువకఁ ముందట ..
వీర. ౨. ౨౦౫.
(పెనఁగులాడు. అపమ్రుద్రి)
౨. మెలిగొను, చిక్కుపడు.

౮౩

క. కొనలను ముంగురులఁ జెదర మాల్యా
ములక్కరడాలు జాలిపై, పెనఁ గొనసాగఁ
జన్నుఁగవ విక్కుచు నట్టులబ్రొక్క జోర
ముల్, ముసరి పెనఁగులాడ మరుజాలుం
జెమర్చ జొత్తు చంపకప్రసవసుగంధితైల
మున ధర్గనకుం దలయంటె తీర్చునన్.
జాహ్నవి. ౧. ౧౪౬.

పెనఁగువడు. అ. క్రి. (పెనఁగు + పడు.) చేరు,
కలియు.
క. కరుణాతిశయంబుఁ బ్రజాపరిపాలనరతియుఁ
బెనఁగువడి యుల్లములోఁ, బిరిగొన నిశ్చయ
ముసకుం, జొరఁజాలక తలఁకుపాలనుండును
బోలన్. నిర్వ. ౧౦. ౪౪.

పెనఁగొను, పెన్గొను, పెనలుగొను. అ. క్రి.
(పెన + కొను.) ౧. మెలిగొను, పిరిగొను,
అల్లుకొను.
ఉ. అనుడు ముదంబు నమ్మమియు జాత్మఁ బెనం
గొన నన్నతోడ నిట్లను విదురుండు ...
భార. ఉద్యో. ౨. ౯౪.
చ. తిన్న నికొన్నిమానిసుం, భ్రునఁ బెనఁగొన్న
మల్లియలఁ బూచినకొనలు గాంచిరొకొక్క
చోటన్. వను. ౨. ౨౦.
౨. దట్టమగు, అతిశయించు.
చ. .. శంకరుని లోకశరణ్యుని భక్తవత్సలుం,
బెనఁగొను భక్తి వ్యక్తములతి దృఢం
బుగ నిల్పి యుండఁగన్.
సారంగ. ౩. ౧౧౨.
సీ. రణభీతులై శిబిరములు సొచ్చినవారి శుంఠు
పెన్గొనఁ బూరిఁ గఱచువారి ...
సానందో. ౪. ౩౬.
క. అనుకంపలు చిత్తమునన్, బెనలు గొనఁగ
మానివరు పృథివీతలసాంధునికడకు నడ్చి

సంభాషణలు వడసి యధిక గౌరవము దీపిం
పన్. వి. పు. ౫. ౧౦౪.

౩. ఒండొంటితో కలియు.

ఉ. కనిరొదు సైంధవుం గడచి క్రందుగ సాటి
హెచుర్చు రాజులం, దనుజుఁగ ధూమశి
ఖ్యా రములోఁ బదహస్త శిరంబు లుర్విపైఁ,
బెనఁగొని చారుభంగియును భీషణరేఖయుఁ
దాల్ప వెట్టురన్, పెనదుకు గ్రోలి భూత
మూలు నిక్కుచు నీల్గుచుఁ జొక్కుచుండఁ
గాన్. భార. ద్రో. ౨. ౩౧౨.

స. క్రి. ౧. చుట్టుకొను, ఆవరించు.

ఉ. పంచిన కోపమున్ సమయభంగ భయంబును
వగ్గలించి యుల్లంబు పెనంగొనంగఁ బతులం
దగ సభ్యులఁ జూచుచూడ్కి రూక్షం బగు
చూడ్కి నా ద్రుపదకన్నియ మాచి ...
భార. విరా. ౨. ౧౩౯.

గీ. మలఁకలై పాఱు నిర్ఝరామల జలంబు,
పాఁప తతి త్రాడు పెనఁగొన్నభావ మొంద.
వైమ. ౫. ౭౩.

౨. (రతియందు) కలియు, కూడు.

క. నను దూఱుము గౌతమముని, ననిఁ
దూఱుచుఁ గుసుమలసితవల్లీవిలసద్ధ్వనిఁ
దాఱుచు వచ్చెలిఁ బెనఁగొనఁ గోరుచుఁ
బొంచి ప్రొద్దు గ్రుంకినయంతన్.
ఉ. రా. ౫. ౭౯.

పెనఁగొల్పు. స. క్రి. (√ పెనఁగొను.) పెనఁగొనఁజేయు. (అతిశయింపఁజేయు)

మ. తన వాక్యంబులు తత్సభాజనుల కుత్సా
హంబు నాశ్చర్యమున్, బెనఁ గొల్పంగఁ
బలిందిబొమ్మ నగి గంభీరంబుగాఁ బల్కె
ద్వా. ౨. ౧౯.

పెనఁచు. స. క్రి. (√ పెనఁగు.) ౧. పెనఁజేయు, మెలిపెట్టు.

క. ఉలిచి రూపంబేరఁ గూర్మముఁ, జెలుదేర
గజంబుఁ బట్టి పెనఁచి ...
భార. ఆది. ౨. ౭౯.

చ. బలితపు శాఖయందుఁ బదపద్మయుగంబుఁ
బెనంచి పార్శ్వశాఖలఁ గరకాండము
ల్బాపి నిప్పులు మోడ్చి యధోముఖాబ్జుఁ
డై, తలకొని ఫ్రేలుచున్న యుగ్ర తాపసుఁ
గాంచె విభూతిభూమశిఖాజ్వాలఁ దగుచాని
భోజనృపవతముఁ డా వటభూరుహంబు
పైన్. భోజరా. ౨. ౭౪.

౨. నిర్మించు.

ద్వి. ఉక్కునఁ బెనఁచిన నట్లున్నాఁడు వీఁడు
ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౦౭.

౩. గట్టిగాఁగట్టు, బంధించు.

చ. ఉమియఁగఁ దన్ను నవ్వు నన కొచ్చెము
గాంచిన కొన్ని ప్రాఁకు లా, ప్రమదల నప్పు
గింపఁ దని రంజిలు సేఁతలు గన్నచెట్లకున్,
దమ కలికప్రంఖలన్ బెనఁచి నమ్ముక ముట్టఁ
బురంబుఁ గంటు సైన్యముఁ గాని నా పలిక
శుకపికాదులఁ గెలివనాలి పొల్పగున్.
ఆము. ౨. ౩౪.

౪ కూర్చు, చేర్చు, కలుపు.

చ. తెనుఁగు తెఱఁగు సంస్కృతముతీరును గాని
యపప్రయోగముల్, బెనఁచిన కబ్బముల్
సభలఁ బెద్దతికంబుగఁ దెచ్చి ..
వాల్మీకి. ౧. ౧౩.

సీ. నందుందు కొమరునిఁ బొందుగాఁ గొఁగిటఁ
బెనఁచి తద్దయును దీవన లొసంగి ..
వీలా. ౩. ౭౭.

సీ. పలుచఁగా వండినవరిపంపుఁజాఁపట్లు పెసర
పప్పులతోడఁ బెనఁచిపెనఁచి.
హైమ. ౬. ౧౨౦.

౫. మెలివేసిపట్టుకొను.

సీ. పుంశ్చలీకృతసన్నిపాతూరిపోహానకస్తు లను
రాగశేఖరలఁ బెనఁచు కరణి.

వసు. ౪. ౩౩.

పెనపరి. విశే. (పెనపు + అరి.) వివాద
శీలుఁడు, జగడగొండి, వివాదశీలురాలు.

క. అప్పు గొని పెట్ట కొల్లక, త్రిప్పి యకార
ణాను వసుమతీపతిసభకున్, చెప్పఁగవచ్చిన
పెనపరి, నప్పుడ దండించి ధనము వరువగ
వలయున్. విజ్ఞా. ౩. ౩౩.

ఆ. సుతికినాఁటివారు సొంటకులు పెనపరు,
లుంటవారు ద్విజాల కాన పెద్ద యనుచు దేశ
భాషలను గులంబున దిట్టు,నతఁడు దండు
వచ్చు శతపణములు. విజ్ఞా. ౨. ౫౬.

చ. . అ పెనపరి ఎక్కరాలు పొంచుపెట్టుచు
నీడిగిలంగ నంవలం,బున వడిఁ గట్టివైచి
కొనిపొం దని కొట్టి మదేవుఁ డంతటన్.

జై భా. ౨. ౧౧౧

పెనపు. స. క్రి. (√పెనయు.) ౧. కలుపు,
కూర్చు, చేర్చు. (శ. ౧) ౨. పెనఁచు.
(శ. ర.)

వి. ౧. వివాదము, తగవు. (ఆ. ౦.) ౨. భేదము.
(శ. ౦.)

పెనము. వి. ౧. దోసెలు లోనగునవి కాల్చెడు
ఇనుప పెంకు, స్వేదని.

ఉదా: అట్లపెనము. పెం.

క. వనరాసు లేదు మున్పురి,పెనమున నీరులను
బోలెఁ జెల్లన సుడిగొన్.

కు. సం. ౬. ౨౧౨.

౨. చెంకురసము మున్నగునవి కాఁచుట కుప
యోగించు పెద్దయినుపపాత్రము.

ఉదా: చెంకుపెనము పెం.

గీ. లిట్టు కాలినపెనములఁ బెట్టి కేప, మిట్టి
పడి యట్టె మూర్ఛిలుపట్టివారి . .

ఉ. రా. ౩. ౩౨౩.

పెనయు. అ. క్రి. (త. పిణై.) కలియు, కూడు,
పెనఁగు.

ఉ. ... అనితేతుశార్యకో ద్రేకయదుల్ మహో
గ్రకలితేషుచయంబు బగు వల్లగల్వపూరకుల
విగ్గులు స్పెనయుకేకను గ్రమ్మెను జిమ్ము
చీకటుల్. ఉ. హరివ్. ౩. ౧౦౪.

ఆ. పేరురూపుక్రియను బెనపియుండు ..

వేమ. ౧. ౩౩౬.

(శ. ర., బ్రౌ. పా. పెనఁగియుండు ముద్రి. పా.)

చూ. పెనపరి, పెనపు.

పెనవెట్టు. స. క్రి. (పెన + పెట్టు.) పిరిపెట్టు,
మెలివేయు.

సీ. వినువూనములు గాఁగ వసతోడఁ బెనవెట్టి
సెట్టెంబుగాఁ ద్రేవుఁ జుట్టినాఁడు ...

మనుచ. ౪. ౩౩.

సీ. పెనఁచి పెంద్రుకలతోఁ బెనవెట్టి చుట్టిన
ప్రాఁతచంద్రికవన్నెపాగ యమర .

క్రీడా. ౧. ౨౨౩.

పెనవేయు = పెనవైచు. స. క్రి. (పెన +
వేయు.) ౧. మెలిపెట్టు (శ. ర.)

౨. పశువుల నొకదానితో నొకటిఁ జేర్చి
బంధించు, లంకెవేయు. (శ. ర.)

పెనవైచు = పెనవేయు. స. క్రి. (పెన +
వైచు.) మెలిపెట్టు.

గీ. అనుచు నక్క వినాశకు బహులకార్య,
మెనయు బోధించి పెన వైచికొనుచుఁ
దచ్చు ... కుక. ౨. ౨౯౮, ౨౫౯.

**పెనిమి(న్మి)టి.** వి. (పెనువు + కేటి, వృత్తిని వర్ణ వికారము.) మగఁడు, భర్త.

క. పెనిమిటి చేతను పెండ్లాముని కాదు నికృష్ట దాసి యనియును వెలువం,గను జాలని మర్త్యుగ రా,లను ... భాగ. ౮. ౨౩౦.

ఉ. . . ఇట్టి డీ వనఁబోడి కందమా, పెనిమిటిఁ గూర్చి పొం పలరఁ బెండ్లి యొనర్చ మదిం దలంచెదన్. నీలా. ౧. ౯౯.

ఉ. . . మిటారి యూ నికా,కాంతునివంటి పెన్మిటి ముఖంబుఁ గమంగొను నోరచూపు లన్. గంగ. ౫౩.

సీ. మగని స్వతంత్రంబు మగువకుఁ జెల్లదు మెలఁత విధంబు పెన్మిటికి వలదు. నీతి. ౭౨.

**పెను.** = పె. విశే. ("పెనువు' శబ్దముయొక్క తుదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. దీనికి అచ్చు పరమగునపుడు ద్విత్వము వచ్చును. ఉదా. పెన్నుద్ది, పెన్నూనె మొ. పరుష సరళములు పరమగునపుడు "పెనుఁ గొమ్మ, పెనఁబాము, పెనుగాడ్పు" మున్నగు రూపములు సిద్ధించును. స్థిరవర్ణములు పర మగునపుడు, "పెనుమిన్కు, పెనువేటు, పెన్నెరు, పెన్మొసలి, పెన్సెక" మున్నగు రూపములు నిష్పన్నము లగును.) పెద్దది, గొప్పది.

(చూ. పెనుద్రెళ్ళు, పెన్నుద్ది మొ.)

**పెనుఁగొమ్మ.** వి. (పెను + కొమ్మ.) చెట్టు మొదటి కొమ్మ, స్కంధశాఖ, కటం. (శ. ర., చి. వి.)

**పెనుఁబాము.** వి. (పెను + పాము.) ౧. అజ గరము, కొండచిలువ.

ఉ. ఇది పెనుఁబాము చందమున పెంతయుఁ భీమమై జనంబులం, బెదరఁగఁ జేయు . భార. విరా. ౧. ౧౭౦.

వ. తన పట్టిన నురియ వచ్చెనుఁబాము వదనంబు ద్రయ్యం దతీగిన .. భార. అర. ౨. ౯౯.

సీ. . పెనుఁపాము నా నజగరాహ్వయము వెలయు. ఆం. భా. ౧. ౧౮౪.

౨. ఆదిశేషుఁడు.

ద్వి. పెనుపొందఁ బలుచిన పెనుఁబాముచాపఁ, దనచంకి నిఱికి పద్మాయుతుం డగుచు. ద్వి. పరమ. ౨. ౧౧౮. పొ.

**పెనుకూళ్లిమారి.** విశే. (పెను + కూళ్లి + మారి.) ప్రతిచోటను భుజించువాఁడు.

సీ. గంగాధరునకు సంగడికాఁడు గాఁడొకో పెనుకూళ్లి మారైన యనిమిషపతి. శివ. ౮. ౮.

(యజ్ఞములందు పలువిధములగు హవిస్సులను భుజించువాఁడు.)

**పెనుకెడ.** వి తృణవిశేషము.

గీ. పారికి పెనుకెడ కుందేటిపారుబా గరిక, పిరికి సాళ్వము సొంపు కుందురు గరిమిడి ... హంస. ౫. ౮౫.

**పెనుగువ్వ.** వి. (పెను + గువ్వ.) ఒకజాతి అడవి పావురము.

ఆ. పికిలి గోలగొమిలి పెనుగువ్వ బకజాతి, పావు రాయి పిడుమ పలువరింత . . హంస. ౩. ౧౩.

**పెనుచే(న్చు)=పెంచు.** స. క్రి. (√ పెరుఁగు.) ౧. వర్ధిల్లఁజేయు, (ఆహారాదులచే) పోషించు.

ఆ. నయముతోడి యొప్పునముల భండారంబుఁ, బెనుతె యగ్రవాసజనులమీఁద, గాలియైన నుడియఁగా నీక ..
భార. అశ్వ. ౨. ౪౬.

ఉ. ఆనవసీమఁ గ్రోధజనితారుణదీధితిఫాలభాగ నేత్రానలకీలలం బెనుప హస్తమున న్నిశిత త్రిశూలముంబూని .. పారి. ౪ ౧౪.

ఉ. . పుత్రులం, జేకొని పెన్పు వాపముగఁ జేయుము నావుడు మాద్రి తద్దయుఁ.
భార. ఆది. ౫. ౧౪౪.

౨. ఉబికించు, ఉబ్బించు.

చ. అనుజతనూజమంత్రి సుభటాప్తజనంబులపోరు నూచి స్వైమ్మ దనునఁ బొంగి మై పెనిచి మత్స్యుమహీరమణుండు .
భార. విరా. ౩. ౬౯.

౩. రక్షించు, సాకు.

సీ. పెనుపలేఁడాయెనే పృథ్వీసుపర్వకుమారు నిగ్గత జీవమూర్తిముల. వసు. ౪. ౪౩.

గీ. .. సాకె మనిచెఁ బెంచెఁ, బెనిచెఁ బ్రతికించెఁ గాచె కేద నన నొసఁగఁ, బ్రోచె నసుమాట
ఆం. భా. ౩. ౧౨౩.

అ. క్రి. పెరుఁగు, అతిశయించు, మించు.

గీ. అనుచుఁ బలికినజనపతి మనుచు పేర్కఁ, బెనుచువాలుఁగ సేలుఁగాఁ గినుచు వనిరు
దశా. ౧. ౧౩౭.

క. అనుచు స్నేచ్ఛలు లాదన్, వినుచు స్మృది లోనఁ బెనుచుచేడుక గనుచున్, ననుచు న్నునుసిగ్గున న్నవ్వనజానన యుండునంత వైభవలీలన్. ఇందు. ౫. ౬౫.

పెనుజోగి. వి. (√ పెను.) శివుఁడు.

సీ. పెనుజోగితేజంబుఁ బృథుల ఘాతంబులు దంత్యష్టిమదనిశదంబసమితి. (చి. శి., చి.ని.)

పెనుపడు. అ. క్రి. (పెనుపు + పడు.) అతిశయిల్లు, వర్ధిల్లు.

సీ. విరుదశాఖాశాఖముల పెనుపడం బైప్రకాయ ఘునశస్త్రరోచు లాకసముఁ బ్రాఁక.
శై. భా. ౨. ౭౪.

ద్వి. కనినంతనే కురంగములసంఘములఁ బెనుపడి చెండాడు పెనుతిండిపులులు ..
అ. మ. క ౫. ౨౨౧. పా. ౨౮. పం.

క. ఘనమైన కోపవహ్నియుఁ, బెనుపడ ...
భా. రా. .అర ౨. (శ. ర.)

పెనుపరి. విశే. (పెనుపు + అరి.) ౧. వృద్ధి పొందించువాఁడు. (చి. ని., శ. ర.) ౨. అధికుఁడు, గొప్పవాఁడు

క. హరి పలికినవిధ మెంతయు, నెరవై యున్న యది వింటె యిమ్మాటకెల్లం, గరయు దము తోలుత నీపెను,పరిచందం బెల్ల నెటుక పడియెడుఁ విదపన్.
భార. ఉద్యో. ౩. ౨౧౪.

(పెనపరి — భేదకీలుఁడు అని శ. ర.)

పెనుపారు = పెంపారు. అ. క్రి. అతిశయించు, అధికమగు.

గీ. ప్రాణదానంబు వేఁడినఁ బార్థుఁ డభయ, హస్తమిచ్చుచు దయ పెనుపారఁ బలుకు. .
భార. విరా. ౫. ౨౨౫.

మ. పెనుపారన్ వర మిచ్చి తట్లు గడిమిన్ భీమాగ్రజాం డాజిఁ గిట్టినఁ బట్టం గడు నగ్గ మైనయెడఁ గ్రేడింతు ..
భార. ద్రో. ౧. ౩౭౭.

పెనుపు = పెంపు. వి. (√ పెనుచు.) ౧. వృద్ధి. అతిశయము.

క. అనవరతసౌఖ్యసంపదఁ, బెను పొందుచు
నుండు మీకు భీకరకాంతారనివాసాయాసం
బుల, వనఘా యిబ్బంగి నవయ నలమట
పొడమున్. భార. అర. ౧. ౨౧౩.

సీ. (వృష్టికాలవర్ణన) ఎఱ్ఱలపెను పట్టె నేలపైఁ
గోఱలఁ జొచ్చె విక్ర. ౪. ౨౪.

క. ఒనరింపఁ బిచ్చలింపక, మునుకొని యయ్యు
దవి మనికిమొనగాం ద్రతవిన్, కెనసి పెను
గట్లుఁ జెట్లును, బెనుపొదవఁగ రువ్వట
యును బెగడక వాఁడున్.
అచ్చ. రా. యు. ౧౪౧

౨. పెంచుట, వృద్ధినొందించుట.

ఆ. పరిజనములఁ బెనుపు పతికి హితము .
భార. శాం. ౨. ౧౭౯.

౩. మహత్త్వము, గొప్పతనము

తే. మునిదివిజాదికలోకము, లనంతుఁ డనఁగ
జగతికెల్ల నాధారంబై, పెను పొందెడు
శేషాత్ముని, వినుతింతున్
భార. శాం. ౨. ౩౬.

తే. విను సైంధవుఁడు మహారథుఁ, డనిఁ బోక
పెనంగు వతని ద్రౌపదికై, పెనుపుఁ
బొందిరి కుంతీతనయులు ..
భార. ఉద్యో. ౪. ౨౨౨.

౪. పొడుగు, ఉన్నతి.

చ. పెనుపున శాకసంభవయు బృంహితముల్
దము నుగ్రగర్జిత, స్వనములతోడి మేఘముల
చందమూగా నొనరింప మోఁది యోధనికర
మేయు సాయకవితానము భీషణవృష్టిగా
రయం,బునఁ బయికొన్న యేనుఁగులపోరునఁ
దేరులు డేలె నెత్తుటన్.
భార. శల్య. ౧. ౧౨౧.

౫. గర్వోక్తి.

క. ... నీ, పెనుపులు లాఘవములకు పెచ్చిన
మేలే. దశకు. ౪. ౨౬.

౬. ఒప్పిదము, అందము.

గీ. కదళి దివియించె నగ్రాంఘ్రికంబు దొడల
పెనుపున .. ఆము. ౫. ౩౦.

౭. సామ్యము, పోలిక.

ఉ. . పెనురొదలు పొదల మెందలంతొదవు
తుమ్మెదల పదువు లినుపసరిపెణల పెనుపున
బనుపుఁచుచు కళా. ౬. ౨౨౪.

౮. వైభవము.

చ. . నీవు గానఁగల వాత్మజా నొక్కని కాని
కాంతయుం, బెనుపు నిప్పరోజనముఁ
బెండిలిసేయుదుఁగాక పేడుకిన్.
హరి. పూ. ౩. ౧౩౫.

చ. వావుడు, బెనుపుగ నింద్రువీటికిని
పేర్కొని పోరుదలేని నేను నీ, వెనుకన
వత్తు నంచు రతి పేడుకఁ బల్కిన
వీర. ౭. ౨౪.

(వృత్తియందుఁ గొన్నియెడల అంత్యవర్ణ
లోపము. చూ. పెను.)

విశే. ౧. పెద్దది, పరిమాణాతిశయము గలది.

ద్వి. వైద్యులకును మంత్రవాదులకును న, భేద్యం
బసాధ్యంబు పెను పగు వ్రణము.
పండితా. మహిమా ౨౫౯.

చ. అన విని కూర్మ మిట్లను . . మత్స్యమంబు
లై, పెనుపవుసత్వము ల్గాలఁదిపట్టఁగరానివి
లోఁ జరింప నొం, పెనుపిన గంగ ..
హరి. ఉ. ౫. ౨౧.

౨. బహుళము, అధిక సంఖ్యాకము.

మ. పను లాజ్ఞాపనసేయువేళలఁ దగంబ్రాతుల్
నిలింపోత్తముల్, పెనుపై కొల్తురు ..
నృసిం. ౧. ౬౦.

౩. అధికము, గొప్పది.

క. తనుఁ దొరఁగుతండ్రి సుడుపడు, మునివరుఁ డని యతని చిత్తమున శే(ప్రాద్దుక్, బెను పగు కోపంబు వసిష్ఠుని దిక్కునఁ గలిగె .
హరి. పూ. ౨. ౪౨.

క. పెను పైన యనావృష్టికి, జననాథుఁడు వనటఁ బొంది . భా. రా. బాల. ౫౪.

క. పెను పగు వచురక్య మవ్విభీషణుఁ డొందన్.
ఉ రా. ౨. ౧౯౩.

జ: పెంజిలువప్రోలు, పెంజీకటి, పెంజెర, పెందర, పెందలకడ, పెందలాడ, పెందళ్కు, పెందిరువడి, పెందుఱుము, పెంచెర, పెందెరువు, పెందోడ, పెంద్రోవ, పెంబోతు, పెనిమిటి, పెనుఁగొమ్మ, పెనుఁ బాము, పెనుగుప్వ, పెనుబోగి, పెనుమసనము, పెనుమినుకులు, పెనుమ్రాను, పెనువెల్లి, పెనువ్రేలు, పెన్నపెఱుఁగు, పెన్నాటకము, పెన్నాటకమునేయు, పెన్నిక్కు, పెన్నిట్ట, పెన్నిదురు, పెన్నిధానము, పెన్నిధి, పెన్నుద్ది, పెన్నెఱులవాఁడు, పెన్నెఱులు, పెన్పులుఁగు.

**పెనుమసనము.** వి. (పెను + మసనము.) మహాశ్మశానము, కాశి.

చ. పెను మసనంబునం గలవు పెక్కులు తీర్థములు .. కాశీ ౬. ౧౨౪.

**పెనుమినుకులు.** వి. బ. (పెను + మినుకులు సమాసమునం దుత్తరపదము పరమైనప్పుడు లు వర్ణకలోపము.) వేదములు.

క. . ప్రాఁబలుకులు పెనుమినుకులు నా, వెల యుసఁ గ్రుతులనుఁ జెప్ప విద్యాధిపతీ.
అం. సం. దేవ. ౪౧.

క. పెనుమినుకు లనఁ దెలివిం, గనుఁగొను బల్లి దునకైన. గనరాని నినుం, గనుగొంటిమి ..
అచ్చ. రా. బాల. ౬౫.

క. ఎవరేని గొనబుకాఁడా, పెనుమినుకుం దొగలు వొగడు పేరిమికాఁడా .
అచ్చ. రా. సుం. ౧౭౧.

**పెనుమ్రాను.** వి. (పెను + మ్రాను.) ౧. మహావింబము. క్రీ.

సీ. పెద్దమ్రా నవఁగను బెనుమ్రా నన న్మహావింబ నామములుంగా నెగడుచుండు.
ఆం. భా. ౨. ౪౯.

**పెనువెల్లి.** వి. (పెను + వెల్లి) ౧ మహాప్రవాహము. (చూ. వెల్లి.) ౨. ప్రళయకాల మందలి ఏకార్ణవము.

క ఇట్లు లోకంబెల్ల నేకార్ణవం బైన . పదంపడి యప్పెనువెల్లి యుల్లనల్లఁ దిగిచి పోవం దొడంగు నెడన్.
భార. అర. ౪. ౨౯.

**పెనువ్రేలు.** వి. (పెను + వ్రేలు.) అంగుష్ఠము, బొటనవ్రేలు.

క. నెమ్మి ని నీ దక్షిణగా, నమ్మున పెనువ్రేలు దునిమి దక్షిణ యిమ్ము
భార. ఆది. ౫. ౨౪౩.

గీ. శూలి, శూలిపెనువ్రేలు దెమలించి కరము లెత్తు, కొన సముద్ధతలీల గజ్జో విభుండు ఉ. రా. ౩. ౭౪.

**పెన్న.** వి. (సం. పినాకినీ. త. పెణ్ణై.) ఒకానొక నది, పినాకిని.

(ఇది ఉత్తరపినాకిని, దక్షిణపినాకిని అని యిరు తెఱఁగులది.)

సీ. అందు ముఖాసీనుఁడైనఁ యచ్యుతరేంద్రు
కంబుధుల్ వాల్గిను .కృష్ణ,వేణి పరస్వతి
పెన్న యైరావతి...పతతంబుగొలుచు.
భార. సభా. ౧. ౪౧.

సీ. పెన్నాడి తత్సేన వీఁగఁదోలుటకును బృథు
రక్తమున ముబ్బు పెన్న పాఱి.
రామ. ౨౫౯.

గీ. చెలఁగు నే ఐన నది తద్వితీపసంజ్ఞ,యమరుఁ
బెన్న యనంగను జమున యనఁగ.
ఆం. భా. ౧. ౧౭౩.

సా : పెన్నదాఁటినఁ బెరుమాళ్ళసేవ = పెన్నవది దాఁటుట యతికష్ట మనుట.

**పెన్నడపులుఁగు.** వి. (పెను+నడ+పులుఁగు.) కురము, పక్షివిశేషము. (శ. ర., ప్రా.)

**పెన్నాటకము.** మి. వి. (పెను +నాటకము.) ౧. మహానాటకము, పెద్దనాటకము. ౨. గొప్ప వర్తనము. 3. అతిశయము, ప్రాచుర్యము.

క. పిప్పలిదొప్పను నల్లంబు పొల్లంబును
బేలపిండి మెందును .. పెన్న పెన్నాటకం
బును గలిగి . కాశీ ౪. ౧౬౫.

**పెన్నాటకముసేయు.** స. క్రి. (పెన్నాటకము + చేయు.) విస్తరించిచెప్పు, అతిశయముగా వచించు

గీ. సంభవించిరి గంధర్వజాతి ననిన, గలితనం
బేల పెన్నాటకంబుసేయు, ననఁగ ధీమేళ్వ
రుని గొల్తు రప్పురమున, సాను లనుపేరి
యప్పరిశ్చంద్రముఖులు. భీమ. ౧. ౭౭.

**పెన్నిక్క.** వి. (పెను + ఇక్క.) గొప్పస్థానము.

గీ. ఆ తరుణియక్క ఐహునృత్యగీతవాద్య, కళల
పెన్నిక్క వలరాజు కంచుధక్క ...
హైజ. ౧. ౧౦౮.

**పెన్నిట్ట.** వి. (పెను + నిట్ట.) పెద్ద ప్రవాహము.

గీ. గాఢసంస్పర్శభంగులు గలుగునట్టి, వరోమ-
సమయకృత్యంబుల నొదవి సౌఖ్యరసము
పెన్నిట్ట పాఱఁబాఱఁ గ్రమ్మ దేర, నమ్మదాం
బుధిఁ దేలిరి సతియుఁ బతియు.
భార. విరా. ౫. ౮౦౨.

**పెన్నిదు(ద్దు)ర.** వి. (పెను + నిదుర.) ౧. గాఢనిద్ర.

చ. కుచములమీఁదఁ జెన్నిదురఁ గూరినబాలునిఁ
దల్లి గానలే, కొచటికిఁ బోయెనో యనుచు
నేడ్చినయట్లు . వాసిష్ఠ. ౫. ౨౮౯.

౨. పెద్దనిద్దుర, చావు.

సీ. సమయుట యీల్గుట . మిత్తి పెన్నిదుర
నా మీఱును మరణము ...
ఆం. భా. ౨. ౨౨౫.

ఉ. . . శాంభవలోచనవహ్నిఁ గ్రాఁగి పెన్ని
ద్దురఁ బూని మే మెఱుఁగ నేరక యుండెడి,
నీకు మ్రొక్కి వేనుద్దులు చెప్పినన్ మనసు
చొచ్చునె బోధము పుట్టు నేర్చునే.
వసు. ౮. ౮౦.

(ఇది రెండర్థములకు నుదాహరణము.)

**పెన్నిధానము.** మి. వి. (పెను + నిధానము) గొప్పనిధి.

గీ. పద్మముఖుఁ డైనయతఁడు నాపాలి కనకు,
పెన్నిధానంబు మాటలు పెక్కు లేల.
నైష. ౨. ౪౫.

**పెన్నిధి.** మి. వి. (పెను + నిధి) పెద్దనిక్షేపము, గొప్పపాఁతఱ.

ఉ. .. అత్యంతము చోద్యమై మెఱయ
వఱజను మన్నివనాదికిన్ ధరాక్రాంతము
లైన పెన్నిధులు కన్నులకుం బొడచూపు
నై వడిన్. విప్ర. ౧. ౧౯౨.

క. కాంచిన నతఁడును బెన్నుధిఁ, గాంచినగతి
వలరి యెదురుగా వచ్చి ..
ఏ(క. అ. ౧౪౭.

పెన్నీ(నునీ)రు. వి. ఔ. అవా (పెను + నీరు.)
౧. అధికజలము, ఎక్కువనీరు.
క. పెన్నెలలు గాని జక్కవకన్నులఁ
బెన్నీరు వెడలఁగా నెలరాలన్, జన్నీరు
వెడలఁ గానెన్, కన్నియయను జలకమాడఁ
గలిగె ననంగన్. రామా. ౬. ౧౨౫.
౨. సముద్రము
సీ. . పెనునీటఁ దేలాడుచున్న పాప.
ఉ. రా. ౧. ౮౦.

పెన్నుద్ది. వి. (పెను + ఉద్ది.) పెద్ద, ప్రతిస్పర్ధి, పోటిచేయువారి నాయకుఁడు.
వ. అందఱు వార్కేళీక్రీడనం బను నాటకం
బొడంగి రెండు సంగడంబులై కృష్ణుండును
శ్రీధాముండును బెన్నుద్దులుగాఁ దక్కువ
వారునుం దమలోన దొరయుభంగి దోయి
గట్టిరి. హరి. పూ. ౪. ౯౨.
వ. తానును బలభద్రుండును పెన్నుద్దులై యితర
వల్లవు లెల్ల నుద్దించుకొని
భాగ. ౧౦. పూ. ౪౩౦.
విశే. ౧. మిక్కిలి సమానుఁడు.
గీ. సురల పెన్నుద్దులై జరామరణభయము,
లని యెఱుంగక వర్తింతు రందఱుబులు.
వి. పు. ౧. ౧౬౨.
ఆ. పేదయైన ధనదు పెన్నుద్దియై చను, నాయ
మునకు పెచ్చు మల్పు మైన . .
విక్ర. అ. ౧౬౧.
౨. మిక్కిలి గొప్పవాఁడు, మిక్కిలిగొప్పది.
గీ. విషము(మ్రింగిన పెన్నుద్దివేల్పుఱేఁడు, మునసి
జారాతి మ్రింగి గజ్జనగఁ ద్రేచె ...
కాశీ. ౪. ౨౩౪.

౯ ద్వి. పెద్దలఱేఁడు పెన్నుద్దులమొదలు .
బసవ. 3. ౯౦౬. పం.

పెన్నె(న్నే)రు. వి. అశ్వగంధ. శే.
సీ. పెన్నెరనంగను బెన్నెరనంగను దొమ్మఁడో
ఉనఁగను దోఁచు నశ్వగంధ . .
ఆం. భా. ౨. ౬౩.
సీ. సహదేవి జట్టుప చలిపిండి చిటిముటి
పెన్నేరు విమబొద్ది పిండికొండ ..
హంస. ౪. ౧౦.

పెన్నెఱులవాఁడు. విశే. (పెను + నెఱులు + వాఁడు.) పెద్దపెంద్రుకలు కలవాఁడు. శివ.
గీ. పెన్నెఱులవాఁడనంగను వెలయుఁ శివ.
ఆం. భా. ౨. ౧౧౯.

పెన్నెఱులు. వి. బ. (పెను + నెఱులు ) పెద్ద పెంద్రుకలు, దీర్ఘకేశములు. (వృత్తియందిది ఏకవచనముగాఁ గూడనుండును.)
సీ. ముడి విప్ప నడుగుఁదమ్ములపైని వ్రాలు
పెన్నెఱులు దేంట్లగుట సందియము
గలదె. ఆము. ౨. 30.
సీ. నిడుదపెన్నెఱికుంపు జడ గట్ట నగరము
న్మనుమండు తపము సాగానిచ్చోటు.
మనుచ. ౨. ౯.
ఇట అతి దీర్ఘములగుకురు లని భావము.
సీ. అమృతంబుఁద్రావు నీలాభ్రమో యది గాదు
కప్పుపెన్నెఱిగొప్పుకొప్పు కాని.
దశా. ౨. ౭౪౪.
సీ. కొదమతుమ్మెదయొప్పు వదలింపఁ గలకప్పు
గులుకు పెన్నెఱికొప్పు లలవరించి.
రాజ. చ. ౨. ౧౭౬.

పెన్నుబులుఁగు. వి. (పెను + బులుఁగు.) గరుత్మంతుఁడు.

ఉ. ... మహా,భీలమగాఁగ వ్యాళవిభుఁ
డెమ్ములఁగీడ్చినమాడ్కి నీడ్చె న,శ్చాలికుఁ
గాలభైరవుఁడు పైకొనుచుం బోకపోరు శ క్తిఁ
గక. పాండు. ౪. ౭౯౪.

పెన్నంగ. వి. పృథివిశేషము.

సీ. కలవిరి గుంభ్రయయు గచ్చు పెన్నంగయు .
హంస. ౪. ౯.

(క్రొత్త, వ్రాఁత ప్రతి. పా.)

పెమ్మె = పెరిమె. వి. (క. హెమ్మె.) బ. వ.
దంభవచనములు, బడాయిమాటలు.

ద్వి. జనవరాధమ కూరిజముఁ డిట్టియెడలఁ,
బెమ్మెలు పలుకుసే పేర్చిపశ క్తి, సమ్మదంబు
గఁ గోపి జయ కొంచుఁగాక
ద్వి. భాగ. ౧౦. (శ. ర.)

పెయ్య = పేయ. వి. ౧. పాలువిడిచిన ఆఁడు
దూడ, లేఁటి.

సీ. .. వెలయఁ గోడె యనంగఁ పెయ్య
యనఁగఁ, గి. గోప్రభృతిపుంప్త్ర్య
పత్యముల్. ఆం. భా. ౨. ౭౬౨.

క. లలుగులపాది యొకదినఁ బెయ్యలదామెన
యొక్కవలన ననుపై యుండఁగ, మొల
కొాపి పెక్కుచుట్లస్, బలుద్రాటం జుట్టి
గోపభావం బలరెస్.
భార. విరా. ౧. ౭౫౫.

వ. ... లేయూపులకోడెలను ఆంబోతులం
కేనేది పెయ్యలను కదుపునంగూర్చి ..
వ. రా. ౪. ౭౪౯.

౨. లేఁగ, దూడ.

గీ. లలుగు లూర్చిపెయ్యల సెల్లఁ దల్లిచన్ను,
గుడుపవిడుచుఁ గొన్నిటి పలుగడలఁ
దోలు. హరి. పూ. ౫. ౭౦౨.

గీ. సోమవైశ్యులు దోగ్ధగా భూమిమరభి,
సకలరత్నౌషధులను గల్పాదియందుఁ,
బృథుమహారాజు పంపునఁ బిదికె నెలమి,
మంచుగొండను బెయ్యఁ గావించి గిరులు.
హర. ౫. ౨౨.

౩. ఆవు, గోవు.

గీ. పాలు గిడుఁ బెక్కు దాని సామ సెన్స,
పెయ్య కర్మిలిగలదు మత్పిృయనుకుంను,
పాల కేడ్చిన యపుడ చన్నట్టనిచ్చు.
భార. అను. ౨. ౪౨౩.

శ్లో. దేశకాలోపసంపన్నా, దోగ్ధ్రీ కాంతాతి
వత్సలా, స్వాదుక్షీరప్రదా గవ్యా మమ
విత్యం నివేశనే.
సం. వా. అ . ౧౦౫. ౧౫.

సీ. పలయఁబోరికి వివ్యఁగిలపెయ్య గలిగి
ముష్టింపచుక్ పరిరుష్టిఁ కొంచు సెల్ల.
ఉ. రా. ౫. ౨౦౧.

విశే. (ఆవుదూడలలోను గడదూడలలోను)
స్త్రీజాతి.

ఉదా : పెయ్యదూడ.

జ : పెయ్యమ్మ.

పెయ్యమ్మ. పనికిమాలినవాఁడు, పనికిమాలినది,
అప్రయోజకుడు, అప్రయోజకురాలు.

(వ్యవ.) వాఁడు వట్టిపెయ్యమ్మ.

పెర. వి. తేనెపట్టు, మధుకోశము.

ద్వి. గిరు లెక్కి మణులఁ గ్రొక్కిరియంగఁ,
బెరలతేనియ లాని ప్రేలరింపుచును.
రం. రా. యు. ౭౮౪. పా. ౨. పం.

సీ. తిర కొందఁ దేనియపెర లెత్తుటను గన్నఁ
దుబ్బ నీళోగిరువాకొంయ లేఁచి ...
నీలా. ౩. ౧౦౭.

జ: పెరతేనియ, పెరయూఁగ.

పెరజే. వి. సర్వవిశేషము.

సీ. పూఁతకోటులఁ జిల్కుగులియలు బ్రాఁతలు పెరజాలు గుజ్జపుఁబెరజా లచట. గీ. గలవు తత్కృపజెజ్జెపూతులును. ద్వా. ౧. ౯౨.

పెరడు. వి. దే. (క. పెం.) గృహపృష్ఠభూమి, ఇంటి వెనుకటిదొడ్డి.

సీ. కరటిదానవవైరి పెరటికల్పద్రుమం బనుచు క్షేత్రుఁడు పిద్ధరసముచేలను. పి. కథం. ౪. ౪.

సీ. ఏశాధ్వి పెరటిలో నెలవోఁటఁ గని వజ్రి వందనవని నిందనం బొనర్చు. దశా. ౧. ౫౦.

సా: పెరటిచెట్టు మందు గాదు = పరిచిత వస్తువునకు విలువయుండదు. (సులభమగు పదార్థముగ నిర్లక్ష్యముచేసి నిరసింతు రనుట.)

ఆ. తను కసాధ్యమైనఁ దమితోడఁ గాంక్షింతు, రాగసాళిమును ధరాభిసాధ, తమకు సులభ మైన యమృతంబుఁ గైకొన, రెందుఁ బెరటి చెట్టు మందు గాదు. శకా. ౭. ౩౯.

క. ఏమిటికి నీదుమతికిని, రామైతిమి దుమ్ము విడువరా దని యెంతేఁ, బ్రేమం జెప్పిన విన విటు, మామాటలు పెరటిచెట్టు మం దగుచొ నృపా. రుక్మాం. ౪. ౨౦.

పెరతే(నె)నియ. వి. (√పెర.) పెగనుండి తీసినతేనె, పట్టుతేనె, మధువిశేషము.

క. అట్టు కజ్జాయట్లు గాల్చిన, పెట్టల నింకట్ల మతియుఁ బెరతేనియలం, బెట్టుక మెసఁగుచు తాథుని, పట్టికి నిం పెసఁగ నిట్లు ప్రతిపివనంబున్. శాక. ౩. ౫౧.

క. ... మాయునతేనె పూఁదేనె జాజితేనె పుట్టతేనె పెరతేనె కజ్జతేనె మరూతేనె... ప్రబంధ. ౧౧౨.

పెరయూఁగ. వి. (√పెర. పెర విస్తరించు తీగ ఁటీఁగ.) పుత్తిక, ఒకజాతి తేనెటీఁగ.

క. పెరయూఁగల గతిఁ గవయుచుఁ, బోరిఁ బోరిఁ గడుఁదురుల పగిదిఁ బొదువుచు ... భార. ద్రో. ౧. ౨౫౯.

చ. అదురులు వాలు సూఁదికొని హస్తయుగం బునఁ గింపవైరిఁ గప్పెదుర సురంబు ద్రేచి పెరయూఁగగతిం గలచె మ్మురాంతకున్ ... ఉ. హరి. ౭. ౯౦.

పెరరేఁచు = ప్రేరేఁచు. స. క్రి. ప్రేరించు, పురికొల్పు.

(ఇది సానుస్వారమని చి. ని. నిరనుస్వారమని శ. ర. రేఁగు, రేఁచులను బురస్కరించుకొని సానుస్వారమనుట యుక్తము.)

క. . నిజసోదరులు వడిసకొటి కిప్రరుద్రైతము విన్నన్, బెరరేఁచి తెచ్చె నితఁ డెం దరి గాదు ... జై. భా. ౭. ౨౧౫.

చ. ... ఓ మునివర నీవు సేయు తపముఁ జపమున్ బెరరేఁప నొల్లి నేఁటున ధవదగ్ర వీథికి గడారపటుం డిటు వచ్చు మున్నె యూయన విను నెలినాఁడు శరాతార్థుఁడ వీవు చతుర్థ సంపదన్. పాండు. ౪. ౭౧.

మ. తరుణుల్ తల్లిరుయిం గుచంబు లనువం దద్వైభ్యముల్ దీము రై, పెరరేఁపన్ జను దించె గాక .. అము. ౨. ౭౭.

జ: పెరరేఁపు.

పెరరేఁపు = పెరరేఁచు (శ. ర.)

పెరవణి = పేరణి. వి. (సం. పేరణీ, విల్యమ్స్. క. పేరణి.) నృత్యవిశేషము.

ద్వి. అంగజారాతికి సానంద మొదవ, భృంగి
మందటీవంకఁ బెరవణి చూపు.

ప్రభులిం. ౨. ౧౩. పా. (శ. ర., బ్రౌ. పా. పేరణి. ముద్రి. పా.)

**పెరసు.** వి. పొలసు, మాంసము. (శ. ర., బ్రౌ.)

**పెరిమ.** వి. (సం. ప్రేమా.) ప్రేమ, అనురాగము, వలపు.

సీ. సురలకు హిత మొనరించితి, ధ కేగుము
నిన్నుఁ జూడఁ దద్దయు వేడ్కయ్యె, ద్వారక
పడుచున్న వారలు, హరివిక్రమ నీ సహోద
రాదులు పెరిమన్. పార. ౪. ౧౭౯.

సీ. గురుకుచ చెలిమూఁపున మోపి, మరదోఁపఁగ
నిలిచి చూచె నధిపతి నతఁడుం, బెరిమం
జూచెను సతి .. పరమ. ౩. ౧౪౭.

క. మరియుఁదు రెవ్వరి బిడ్డలు, మరు లింతియు
కాక నుతులు మతి యతిహితులే పెరిమను
బుట్టిన పుత్త్రిలు పెరుఁగఁగ శత్రులను
గ్రుతులు పెక్కులు వినవే.

కుచేల. ౧. ౫౯. (పెరిమె అపముద్రి.)

**పెరిమె = పెమ్మె.** వి. (క. పెర్మె.తు. పేర్మె, త పెరుమై) ౧. గొప్పతనము, ఘనత.

క. కలిమిఁ దలముగాని వ్యయుం,బులు పెరిమెల
కొఱకుఁ జేసి పాలియర దుర్బుద్ధులు నారి
కేళబకమను, పులుఁగు దురైశ్వర్యమహిమఁ
బొలిసిన భంగిన్. కేయూర. ౩. ౧౪౭

ఆ.వె. పేర్పుమైనల్ల యది పెంపుల దొలిపూఁ
దుటిమె, దర్పకున కర్పింపఁదలఁప దెంతటి
పెరిమె. మనుచ. ౩. ౭౪.

శ. అన్నది పావనగుణ సంపన్న తనుతియింపఁ
గలఁడె పన్నగపతియుఁన్, మిన్నకయున్నది
మునిఁగిన,యన్న దఁ దమ్మ రుని తంద్రి యనఁ
దగుఁ బెరిమెన్. రామా. ఉ. ౩. ౩౭.

౨. ప్రసిద్ధి, ఖ్యాతి.

గీ. అన్నిబిందు వివేకుని జాహ్నవ్యయంబుఁ, గూర్చి
మధుకైటభారాతి మూర్తి మిగుల, బిందు
మాధవుఁడను పేరఁ బెరిమెవడసె.

కాశీ. ౬. ౧౧౬. (ప్రాఁత ప్రతి. పా.)

౩. ప్రాశస్త్యము, శ్రేష్ఠత్వము.

వ. మిరియంబు పెరిమెయుఁ బహుప్రసరము
అవశ్యము .గలిగి .

కాశీ. ౭. ౧౭౯. (చి. వి. పా.)

**పెరుఁగాకు.** వి. (పెరుగు² + ఆకు.) = పెరుఁగు తోఁటకూర, మహాబాష్పకాకము. శ.

**పెరుఁగు¹(గ్గు) = పెరువు¹, పెఱుగు.** (త. పెరుకు. క. పెర్చు.) అ. క్రి. ౧. (వయఃప్రమాణాదులలో) ఎదుగు, వర్ధిల్లు, పెంపొందు.

సీ. . . పాండుకుమారులు .., ధృతరాష్ట్రి
కొడ్డఁ, దత్సుతులతో నొక్కటఁ బెరుఁ
గుచు భూసురవరుల వలన . .

భార. ఆది ౩. ౧౭.

క మృకుఁడఁటపుట్టుఁ బెరుంగు, మృకుఁడఁట
కేతోకఁడు గుడుచ మోకానుఁదృప్తిక్ ..

హైమ. ౪. ౪౫.

గీ. వింధ్య కుమరాద్రిపాటికి వివిధశాఖకములు
మొలపూసలుగఁ బెరుఁగి మదిఁ దలఁచె,
సెన్నఁడు ..

పాండు. ౫. ౧౬౭.

మ. పలుకుందొయ్యలిచేతి రాచిలుక పెంపక
పెక్కి జాజాకరా, కలజాతిలఁ బ్రకాలకెదిని
యనంగా ... వర్తింతుఁ గాంతామణీ.

విక్ర. ౪. ౫౦.

౨. ఉప్పొంగు, ఉత్సహించు.

సీ. తాతతాతతమున వాఁకల్లఁ బాండవాగమనంబు
విని సంతసమునఁ బెరిఁగి .
భార. ఆది. ౬. ౧౮౭.

౩. వూను, ఉద్యమించు.

క. చక్కనగు మనిన రక్కసుఁ, దక్కజముగఁ
బెరిఁగి . . భార. ఆది. ౬. ౨౦౩.

ఉత్సాహము. ... తత్క్షణంబె యేఁగి పాం,
చాలుఁ బట్టికొత్త మధికకార్యశీల మెఱ
యఁగాఁ,బోలు ననుచుఁ బెరిఁగి రాజ
పుత్రు లరిగి . భాగ. ఆది ౬. ౬౫

౪. కలుగు, పుట్టు.

క. కురుసేనఁ గదా గెలుచుట, కరముధరము
నరున కవకు గాండీవమునం, బెరిఁగినయమ్ముల
మంటలు, దరికొని తెగఁగాల్చునటిదయ
యగుఁజామ్మా (భా. ల. వ్యా. పా.)
భార. ఉద్యో. ౨. ౧౯౪

౫. తెగు, ఛిన్నమగు (ఈ యర్థమున విరను
స్వారమని శ. ౧. వ్యతిరేకలక్షణచే సబిం
దుకమునకే యీ యర్థము రావచ్చును.
చూ. పెంపు.)

చ. పెరిఁగిన హారరత్నములపెల్లున నొక్కఁడఁ
దాఁగ్రుపడ్డియై పారి. ౪. ౩౭.

వ. కెరఁగిన కపురంపుతిలకంబుతోఁ బెరిఁ
గిన శారిహారములతోఁ బదలిన సెమ్మొ
గంబుతో . ఉ. రా. ౪. ౨౨౧.

విశే. ౧. ఏండ్లు చెల్లినవాఁడు, ఏండ్లు చెల్లినది
(శ. ర)

౨. వృద్ధిపొందినది. (శ. ర.)

జ: పెంచు, పెంచుకొను, పెంపగు, పెంపరము,
పెంపరి, పెంపఱు, పెంపారు, పెంపారుచు,
పెంపు, పెంపుడు, పెక్కువ, పెనుచు, పెను
పడు, పెనుపరి, పెనుపారు, పెనుపు, పెరుఁ
గుడు,

పెరుఁగు²(గ్గు). వి. = పెరుగు² (త. పెరుగు)
దధి.

గీ. మిసిమి గలపుల్లపెరుఁగుతో మిళితమైన.
శైవ. ౬. ౧౩౦.

ఉ. కమ్మనిజున్ను మంచినెయి గట్టిది మీఁగ
డతోఁ బెరుంగు చొక్కమ్మగు జున్నుపాలు
చిలుక మ్మివిదీపినవెన్నముద్ద
హంస. ౨. ౧౧౧.

చ. రమణి యొకర్తు కొంటి మదురాపురికిం
జెరుఁ గమ్మఁ బోవుచో
దశా. ౯. ౨౦౪.

ఉ. పేరినసేయి దుగ్ధములు పెర్గును మీఁగడ
యుఁ బ్ సదాగ్రజాగారము పొచ్చి త్రాగి
కెప గింతులు వైచు మురారి పెంచఁగా.
అప్ప ౪. ౨౩౦. పా.

చ ఆరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం గను
పట గన్నెలోఁ, బెరుఁగును వంటకంబు వడ
ఒంది యలం గుడువంగఁ బెట్టు నిర్భర
కరుణాధురీణ యగుప్రాణము ప్రాణము తల్లి
యున్నదే కాశీ. ౪. ౧౧౫.

పెరుఁగు వడ్లును గలిపినరీతి = ఒకరితో నొకరు
కలియక యుండుట.

ద్వి. ఈ రీతి విశ్వాసం బెందును లేక, పెరుఁగు
వడ్లును కలిపినరీతి నుండ, వరివాధుఁ
డేకించి ద్వి. పరమ. ౫. ౩౫౭. పా.

జ: పెరుఁగాకు, పెరుఁగుతోఁటకూర, పెరుఁగు
సంద్రము.

పెరుఁగుడు. వి. (√పెరుఁగు¹.) వృద్ధి.

సీ. తగఁ ద్రివర్గాభిధ తగ్గు నిల్కడ పెరుఁగుట
యనునివి మూఁడు కొలఁది .
అం. భా. ౨. ౧౯౦.

పెరుఁగుతోఁటకూర=పెఱుకు తోఁటకూర.
వి. (పెరుఁగు¹ + తోఁటకూర = పెరుఁగు

కలి తృదుదైన తోఁటకూర.) మహాశాస్త్ర శాకము.

సీ. ..పెఱుకుతోఁటకూర, పెరుఁగుతోఁటకూర యనఁగఁ జను మహాశాఖ సంజ్ఞ.

ఆం. శా. ౨. ౩౩.

**పెరుఁగుసంద్రము.** వి. (పెరుఁగు¹+సంద్రము) పెరుఁగుకడలి, దధి సముద్రము. (శ. ర)

**పెరుమాళ్కోయిల.** వి. (పెరుమాళ్లు + కోయిల. త. పెరుమాళ్ కోవిల్.) కాంచీపురము, ఒకానొక పుణ్యక్షేత్రము.

క. కోయిలఁ దిరుమలఁ బెరుమాళ్కోయిలఁ దిరుపతులఁ గుంభకోణాదికపుణ్యాయతనంబుల మాయుం, దైరుక్కుడఁ బోయెనొకొ మురాంతకు ప్రతిమల్. (కాశీ. ౫. ౭౮౭.)

**పెరుమాళ్లడుగుబుగ్గ.** వి. (పెరుమాళ్లు + అడుగు + బు) విష్ణుపాదోద్భవయైనయేఱు, ఆకాశగంగ.

సీ. .. ము త్తెరువు లాఁడి తెలివాఁక పాంకా మరకుఁబంటు, కటకంపుతలయేఱు పెరుమాళ్లడుగుబుగ్గ జడదారిచేఁ యీటాట చదలువాఁక. గీ అమరతటినికి నామధేయములు పొంబ . సాం. ని. దేవ. ౧౬.

**పెరుమాళ్లు.** వి. బ (త. పెరుమాళ్.) దేవుఁడు, విష్ణువు.

చ. మన మునృతంపుపెంపు పెరుమాళ్ల రయింబు గు వీఁకన్ సమస్తముల్

పరమ ౨. ౧౩౩.

చ. అలనరౌ రయిందు నీ వీఁక గులామువరుం జన వద్దు మాకు వి,చ్చఁబుఁ బెరుమాళ్లకోనెఁ ప్రసాదముఁగట్టిడి పాగిపచ్చు నా,తలియ ప్రసాద మాత్ర నతతంబుఁ గారొఁదు. మన్న ప్రొక్కు యు, మ్మొలఁదుక స్వామి చిత్తమున్నికోనియు న్మదికాంతరంగరై.

వైజ. ౨. ౧౭౭.

జ : పెరుమాళ్కోయిల, పెరుమాళ్లడుగుబుగ్గ.

**పెరువు¹(ర్వు)** = పెరుఁగు. అ. క్రి. ఎదుగు, వర్ధిల్లు. (శ. ర.)

విశే. ౧. ఏండ్లు చెల్లినవాఁడు, వృద్ధుఁడు, వృద్ధురాలు.

సీ. పోవుచున్నార మీపువ్వుఁబోఁడియు నేనుఁ బెద్దకాలమువాఁటిపెరువఁ గాన లావు చాలదు జరాదైర్బల్యంబు కతమునఁ బొదవకు-నప్పు డుండిగడునపుడు.

కాశీ. ౨. ౧౬౩.

౨. పెరిఁగినది, వృద్ధిపొందినది.

వ. . తెరువులం బెరువులై విరువులంగఁ బూచి మురువు లలరుకదంబతరువులను .

రాజ. వి. ౨. ౪౬. (శ. ర., వా.)

**పెరువు²(ర్వు)** = పెరుఁగు. వి. దధి.

క. తరువంబెటినబానల పెరువులు మును గిలకరించి పేర్చిన వెన్నల్ మురువు లెనఁగఁ గ్రోలి హరి. పూ. ౫. ౨౦౩.

సీ. పెరువులోఁ బాలును బెరువు వెన్నను వెన్న చల్లను జల్ల యాజ్యమునఁ గలవు.

హరి. పూ. ౫. ౨౦౬.

ఉ. ఒల్లమిచేసి పేరలకు సత్తర మీకు నృపాల పెర్వులుం, జల్లలు దమ్ము గొన్న యవి చాలఁగ నున్నవి ... పి. కవుం. ౧. ౧౨౫.

**పెర్కు** = పెఱుకు. స. క్రి. ఊడఁదీయు ఊడఁదీయు.

ద్వి. ఆలోన పవనజుఁ డసమానవిజయు,లోలుఁ
డై వానిజాలిక పెర్కొంచె
రం. రా. సుం. ౨౬౬. పొ. ౧౭. పం.

(శ. ర. పా. పీఁకి చంపె. ముద్రి. పా.)

**పెఱ.** (సం. పరః. త. పిఱ. దీనికి వ్యుత్పత్తిగాఁ బ్రయోగము లేదు.) అన్యము, ఇతరము.

క. చుఱచి యొకచేతఁ గూర్మముఁ, బెఱచేత
గజమ్ము బట్టి  భార. ఆది. ౨. ౩౯.

గీ. సభలఁ బలుకుదు దీవు సరి లేరు నా కని,
యిది రణంబు వచ్చె నెల్లవారి, కెఱుఁగ
వచ్చు దీనఁ బెఱచోట రజైన, సుట్లు పూర
గింప నగునె యిచట.
భార. విరా. ౫. ౭౭.

వి. (సం. పరః = శత్రువు) పగవాఁడు, శత్రువు.

మ. పోనఁగంగా నే—ప్ర ...గాం, తిఁ
బ్రాపెక్ పెఱరాజకోటి
(రాజపత్నులను.)  మనుచ. ౫. ౩౭.

జ: పెఱగాయ, పెఱగాయసుద్దులు, పెఱత్రోవ, పెఱపోక, పెఱమగఁడు, పెఱవాఁడు, పెఱసుద్ది.

**పెఱగాయ.** విశే. (పెఱ + కాయ.) పనికి మాలినవాఁడు, అప్రయోజకుఁడు.
(చూ. పెఱగాయ సుద్దులు.)

**పెఱగాయసుద్దులు.** వి. బ. (√ పెఱ.) పనికి మాలినమాటలు, వ్యర్థవచనములు.

క. ... సేమగోరుకోరికవితగా, నటునిటు
ప్రొద్దులు పుచ్చుచు, నటుపటుఁ బెఱగాయ
సుద్దు లాడదవారా.  శశా. ౩. ౪౭.

**పెఱత్రోవ.** వి. (√ పెఱ.) అన్యమార్గము, పెఱత్రోవ, అపమార్గము, చెడత్రోవ.

చ. వనజదళాయతాక్షి మగవాఁడు పరాంగన
పొందుఁ గోరువాఁ, డని వినవేమొ యట్టి
రుచు లంటినచో మఱి వాక సేయఁడే,
నిను నటుగానఁ బూని మగనిం బెఱత్రోవలఁ
బోవనీకు మేర్పున నని బుద్ధిగాఁ గఱపు
ముద్దియ సందియమందకుండఁగన్.
శుక. ౧. ౪౩౪.

**పెఱపోక.** వి. (√ పెఱ.) అన్యప్రవర్తన, కెఱ నడత, చెడ్డనడత, దుష్టప్రవర్తన.

చ. పురజను లప్పుటప్పటికిఁ బుణ్యచరిత్రల
వారలక్షవిభా, స్వరమణిసౌధమార్గముల
వచ్చుచుఁ బోవుచు నుండఁజూచుచుం,
గరములు మోడ్చి మ్రొక్కుదురుగాని తదీయ
సురూపలక్ష్మికి న్వ్వరుఁ బెఱపోకఁబోరు
మను వార్తఁ బోధం బెఱ నిల్చి పాయమిన్.
కళా. ౭. ౧౪౩.

**పెఱమగఁడు.** వి. (పెఱ + మగఁడు.) ఱంకు మగఁడు, జారుఁడు.

వ. . . పెఱమగలచే నంపించుకొ మఱలునప్పుడు.
చంద్రా. ౫. ౭౩.

**పెఱవాఁడు.** వి. (పెఱ + వాఁడు.) అన్యుఁడు లాఁతివాఁడు, పరాయివాఁడు.

క. పెఱవారి కెల్లఁ దఱిమిడి, నఱకుదుఁ బాండు
క్షితీశనందనులను రూపుఱ సేయుం జే
యుదకు ... భార. ఉద్యో. ౪. ౧౫౦.

తరళ. నగుచు నిమ్మని పల్కె—నోవరనాథనందన
నాయమే, పెగడుచుఁ బెఱవానితోలిక
ఖేదవాక్యము లాడఁగా.
ఉ. రా. ౩. ౭౧.

**పెఱసుద్ది.** వి. (పెఱ + సుద్ది.) అన్యవచనము, పెఱమాట; అపవాదము, నింద.

క. పెద్దతల లేక మా కీ, నిద్దపురూపముల
యెచట నిల్చిన మనము౦, బెద్దతికము చాలదు
పెం,సుద్దులు గల్పింతు రెంచు సుజనులు
గలరే. కళా. ౨. ౧౫౨.

**పెటిక(ర్క).** వి. (తు. పెటికె) ఈ ప్రక్కను ఆ ప్రక్కను ధాన్యాదులు పోసి ఎద్దు, గుఱ్ఱము మున్నగువానిమీఁద వేసి తోయించెడు గోనె మూట.

చ. మఱియును నిన్నిధిం గల సమంచితకాంచన
రాశి బిందులం, బెటికల మోపులం గొలఁది
పెట్టఁగఁ బొక్కగు బారువుల్ .
భార. అశ్వ. ౩. ౧౫౪.

ఆ. ఇక్కు ముట్టి చక్కి నెక్కంగ మఱచి,
సంభ్రమముఁ బొంది పిఱుఁదఁ బ్రమథ
గణము, లార్వఁ బోతుఁబోఁది నడ్డంబుపడి
యుప్పు,పెటికవోలె వెఱచి పఱచె జముఁడు.
కు. సం. ౨. ౨౦౬.

(పెటిక. వ్రాఁత ప్రతి.పా.)

గీ. పెటికయే చాలు నావడ్డి విఱుఁగఁజేయు,
దానిపైఁ దాను నెక్కు
శుక. ౩. ౮౦౫.

సీ. వలంద యేనుఁగు మొత్తములఁ బట్టి ఫులుల
పైఁ బెటికిన యుత్తితోల్ పెటికగములు.
చంద్రా. ౨. ౮౧

ద్వి. ఇన్నియుఁ జెప్పఁగా నేల యీ పడిఁడీ,మ
పైన్నఁ గొనిపొందు గొన్ని పెర్కులను.
బసవు. ౮. ౧౧౮.

పోకాళ్లమీఁది పెటిక = గమన ప్రతి బంధకము, కష్టకరము.

ఆ. ముసలివాని బ్రదుకు పోకాళ్లమీఁదటి,
పెటిక యుంతె యంతపెట్టు పెట్టి, కొట్ట
నేల నీపుఁ గొడుకులఁ గన్నాఁడ, విఱియు
నీవు రాఁగ నేసె చూతు. శేష. ౩. ౧౧౯.

జ: పెటికపెట్టి, పెటికాటము.

**పెటికపెట్టి.** వి. (పెటిక + పెట్టి.) పెటికాటము చేయుపెట్టి, వర్తకుఁడు.

ద్వి. కటికంచుగుడి యుద కంటి తొ మనుచు,
బెడికసె ట్లాతనిఁ బిలిచి చూపుడును ...
బస.పు. ౨. ౮౦౭. పం.

**పెటికాటము.** వి. (పెటి + ఆట.) ఎద్దు పెం. వానిచే ధాన్యాదులు తోయించుకొని పోయి చేసెడి వ్యాపారము.

సా: కర్కటము కర్కాటము. రాఁగానే
పెటికాటము పడిపోవును = వర్షము అధి
కము కాఁగానే పెటికాట వ్యవహారము
ఆగిపోవును

**పెటికించు.** స. క్రి. (√ పెటుకు) ౧. పెల్లగింపఁ జేయు.

సీ. వేళ్లతోడుతఁ గల్ప వృక్షముల్ పెటికించి
కొనిపోయి తన కుపవనముఁ జేసె.
కు. సం. ౮. ౩౭౪.

౨. ఊడఁదీయించు., పీఁకించు.

వ. చతురు లగుదితిసుతులు తమతమ నికేత
నంబులకుం గొనిపోవుటకై విఱుగకుండఁ
బెటికించి సురకుమారకులతలల కెత్తించిన
ఘటితమణికోటికోటిమండితక,వాటసంఘా
తంబులును . ఉ. హరి. ౧. ౫౩.

౩. తోయించు.

చ. ... కప్పముల్ ధరణిపాలుఁ చేఁ గొని
మూలపెల్ గజంబులఁ బెటికించి తెచ్చె ...
భార. ఆది. ౫. ౩౯.

**పెటుకు** = పెర్కు. స. క్రి. ౧. (వృక్షశిలాదులను) పెల్లగించు, ఉన్మూలించు.

**పెలుకు(ల్కు)ఉు.** అ. క్రి. (భయాదులచే) విహ్వలించు, భయపడు.

చ. ఖలుఁడు బృహద్రథాత్మజుఁడు గర్వితుఁడై మహీంద్రరాజులం, బెలుకఁ బట్టి తెచ్చి భార. సభా. ౧. ౧౨౦.

చ. తద్విధ మంతయు నేర్పడంగఁ జెప్పిన విని కౌరవప్రభుఁడు పెల్కుచు తద్దయు మిఱుకొన్నుఁడై. భార. ఆది. ౮. ౧౧

సీ. ప్రావడంబు తేటతేఁ నడరంగఁ బెలుకఁ దీసదృష్టుల మోముఁ గలిచూచు.
భార. విరా. ౪. ౮౦.

క. ఊరక రొమ్ము రేగి మూఁకకు, నుతికి మొలఁగుకొనుచు మిగుల నుగ్రాకృతియై, కలుకం జైకొనఁ బెల్కుచు, పలుచిరి తద్భటులు రాజూపటుకుఁ బెలుచన్.
భోజరా. ౬. ౩౫౩.

౨. దిగులుపడు, బెంగపెట్టుకొను.

చ పాండురాజు దప్పినపిదపం దదాత్మజాలు పెల్కుచు తన్నని చేరవచ్చిరన్.
భాగ. ౩. ౧౧.

**పెలుచే(ల్చె).** వి. ౧. అతిశయము, ఆధిక్యము.

క. సమఁడై యుయుత్సుఁ డయ్యన్నము దుష్టం బగుటఁ జెప్పినను గుడిచె విషాన్నము నాఁకటిపెలుచను
భార ఆది. ౫. ౧౪౯.

౨. ఆటోపము, ఔద్ధత్యము

క. నానాస్త్రంబులు ముందలు, తే నిగుడన్ బదలుపడినురథటులపై, సేనంగుల గుజ్జంబుల, భీమంగులమీఁదఁ దేరు పెలుచం బఱపెన్. భార. ద్రో. ౪. ౭౫.

౩. పట్టుదల, అభినివేశము.

ఉ. శశికోట్యంబులుఁ గాకి రొక్కుమదశాంగకిలు . పోరుచుండి మతిమాత్సర్యంబునం దా మహేశ్వరుకై తేంద్రముతోడ నీలగిరి పెల్చఁ జొచ్చెరువ ట్లున్నతిన్. కు. సం. ౧. ౭౯.

ఉ. అప్పు డయ్యురువాఁగు నొండొరులన్ దలకడచి పెలుచన్ దలపడినరొయిఁ బోదమి దుమ్ము క్రమ్ముకొని సంజకెంజాయ యవని జాలి మెఱయ రాజ. చ. ౨. ౪౪.

౪. అనుగ్రహము, కినుక.

క. నీతమ్ము లతివిశోకవిదూరుల్, మతిఁ దలఁపక నా పుత్రకు, పతిబాలకు పనపరాదు నడిచిరి పెలుచన్.
భార. ఆది ౧. ౮౪. (చూ. ౧. ౮౩.)

క. అత్యుగ్రస కోపము గదిరి నీచు గావున శంకించినఁ గాని మెత్తఁబడిపోఁ, దని మనమునఁ దలఁచి యిటు లనియెం బెలుచన్. భార విరా. ౨. ౫౪

క. కొట్టువడి యటకు మును పేర్చిట్టుంబడ యేడ్చు నాదు దెసఁ గని మదిలోఁ, గటకట నాదవి నా సఖు, లిటనిరి మునీంద్రుతోడ నెత్తిన పెలుచన్. మనుచ. ౪. ౭౬.

౫. క్రౌర్యము, దయలేమి.

ఆ. తగినయుంతిధనము దాన యన్నరనాథు, వల్కలముల ముడిచినైచి యుడిపి, పెలుచ నాలతాంగి పెడఁబాముఁ దలవట్టియాగ్చె...
మార్కం. ౧. ౨౧౪.

ఉ. ఎక్కడి కేఁగుదెంచితి మహీపవిచారవిశిష్ట నీకు నేఁ జిక్కితి నాక్పదం బెలుచఁ జంపితి దొంగిలి మున్ మనీయులన్, రక్కసులన్ నిసుం బొదివి ప్రాణముఁ గొందు ...
పాండు. ౫. ౧౦౪.

౬. విధము.

క. అది వోయి శత్రుదేహము, భిదురము గిరి
ప్రయ్య నడుచు పెలుచన్ లీలన్, విదళితము
చేసె ప్రయ్యలు, పొదలిన సత్తురులతోడ
భువిఁ బడ ప్రాలెన్.
హరి. ఉ. ౬. ౨౧౮.

విణ. (దీనికిఁ గర్మధారయసమాసమునఁ దుఱమగా నిగాగమంబగు.) ౧. క్రూరము.

చ. పెలుచగురూపుతోఁ బునుకపేరులు దూల
వైదందవాలుకిన్, పెలవుల నాకిరొంచు
నిరుపేతుల కిడిము వాలుఁ బూని మై,
పొలసుగివు ల్కుడుం గిదురఁ బొట్టకుఁ గగ్గె
నటంచు నార్చుచున్, పొలయుక వచ్చు
శాటకిఁగమంగొని రాజదదారి రాముతోన్.
యయా. ౩. ౪.

(పెలుచగు పూఁపుతో శ. ర. పా.)

౨. కఠినమైనది, గట్టిది.

సీ. బలితంపుజంఘల పెలుచనితాఁకున నమర
యానములు తుత్తుమురు గాఁగ.
హరి. ఉ. ౫. ౧౬౧.

౩. అధికము, పెద్దది.

క. అనుటయుఁ బెలుచనియెలుఁగున, ఘనతూల
ప్రబలశాఖికాదుర్జయు న్మన్నను దాఁకిన
నతని ప్రభంజనుఁడను నామంబునకు నసత్యత
వచ్చున్. భార. శాం. ౩. ౩౭౭.

వి: పెలుచన.

క్రి. విణ. ద్రు. ౧. అధికముగా, మిక్కిలి.

క. ... సెటి చెడి సురగాలి విసరె నిలువక
పెలుచన్. ఉ. హరి. ౨. ౨౮.

సీ. పెల్చ పల్లిండ్లు నిల్పెద వన్న బదలించుఁ
బెలుపు గావింప సెంచినను గనరు.
విప్ర. ౩. ౧౫.

౨. శీఘ్రముగా, అవిలంబముగా.

గీ. కందుదోదలును వితిగిధరిత్రిఁ బెలుచఁ, గూలి
రూ పతి రారాజు ధూళి ద్రుంగ .
భార. కల్యా. ౧. ౯౦.

గీ. . నిఖిలైకగురుఁడనైన, నాదువాక్యంబుచే
భవార్ణవంబు పెలుచ, దాఁటుదురు మత్ప
దాంబుజధ్యానపరులు.
భాగ. ౧౦. ఉ. ౯౯౩.

శా. అంతేవాసులు నీవుఁ గూడుకొని మధ్యా
హ్నభిక్షాక్రియల్, కాంతస్వాంతతఁ జాహ్న
విం జలిపి పెల్చక రండు .
హైమ. ౨ ౧౨౩.

౩. గట్టిగా, దృఢముగా.

గీ. దండధరుఁ బెల్చ డాకాలఁ దన్ని ధ్రువుఁడు,
నింద నందును వానికి నెక్కు
భాగ. ౨. ౪౪౯.

౪. బలాత్కారముగా.

ఉ. దివాంతరయోధుఁ డీచాయఁ దదీయ
పత్నిఁ బెలుచం బడ నీడిదికొంచుఁ బోయె
దుర్గా, గో యనుమూడ్కి నంతట కకుంత
రవంబు పెలంగ నెల్లెడన్.
పారి. ౨. ౩౦.

౫. బిగ్గరగా, ఉచ్చైస్స్వరముతో.

సీ. తమనేనదిక్కు, గనఁగొని పెలుచ కోకర్ణ
రోమాంచ రోమహరోధన పార నశ్శాతి
రొప్పుడుఁ, జెప్పుదురు .
భార. ద్రో. ౫. ౩౨౨.

క. ఓయమునానది నీయం, బాయతముగ నాకు
వలయు నవగాహంబునన్, జేయఁగ రావో
తేవో, తోయము లని పిలిచె పెలుఁగు
తో త్రిలఁ బెలుచన్. హరి. ఉ. ౨. ౯౩.

౬. నిష్ఠురముగా.

ఘోరనేత్ర పెల్లున ..వంచనాభునతుహునా
విహారపరికల్పితగద్దకంఠవైఖరిన్.

విప్ర. ౩. ౬.

**పెల్ల.** వి. మంటిగడ్డ, పెత్తిక.

శా. ఎల్లిం జంద్రికమించు నీరధముఖాఁడెవ్వాఁడు దిక్పితులం, బెల్లల్ రాలెడు నిష్ఠురస్తనిత గంభీరాటహాసంబునన్.

భా. రా. యు. [illegible]

మ. . . రదఘాతోత్థితరాజతాచలరజోవ్రాతంబు నిండారుగా,మురియు దిక్కులఁ దిక్కటిల్లఁ దనకొమ్మం జమ్ములక్ వీదు పెల్ల దివింజం దరుఁడై వెలుంగ ...

భోజరా. ౧. ౬.

**పెల్లగించు.** స. క్రి. (√ పెల్లగిల్లు.) ౧. (వృక్ష పర్వతాదులను) ఉన్మూలించు, పెకలించు.

సీ. బిందుసరంబులోఁ గుందనంపుందమ్మి పేరు లేకుండఁగఁ బెల్లగించి.

ప్రభా. ౧. [illegible]

ద్వి. పృథుశక్తి రజతాద్రి బిగియాఁబటి, పృథివి పేయఁగ నూఁచి పెల్లగించుటయు.

రం. రా. ఉ. [illegible]

వ. ... అతండొక్కతరువుఁ గరయుగళినిఱియం బటి పెల్లగింప. మను. ౪. [illegible]

ఊడఁదీయు, పీకు.

మ. ... దీర్ఘసటాఘాటముఁ బెల్లగించుగతి సాంద్రక్రేణిఁ గిమ్ముచు చెరం,జూ నితప్రసార భగన్న ఖాతకులు ... అను. ౪. [illegible]

౩. కదల్చు, ఊఁచు.

గీ. ఏడుపాతాళములను గగ్గోలుపడిరయెఁ, బెల్లగించి మహీధ్రంబు పెకిలినప్పు, డిందిరా భర్తగిరి మీఁదికెత్తినపుడు గ్రక్కదలపోగ బ్రహ్మాండ కర్పరంబు. (కూర. [illegible])

౪. పెల్లులేచునట్లు త్రవ్వు.

చ. భయ మనుతోల్లికన్ విమలభాకవసుంధరఁ బెల్లగించి భక్తి యనెడునిత్తుఁ బెట్టి ప్రతిదీ నదిసమ్మదవారిజల్లఁగాఁ, నయమున వంకు రించుచు ననల్ గొనలై రుులమిం జెలంగి కాశి. ౪. [illegible]

౫. కలఁతనొందించు, క్షోభపెట్టు.

ఉ. వారలఁ గాంచి శోక మనివారణఁ జిత్తము పెల్లగింపను, క్కారవనత్తముం జెలఁగు గద్గదికం దగులంగ నేడ్చుచుం ..

భాగ. మా. [illegible]

**పెల్లగిలించు** = పెల్లగించు.

క. మగబొమ్మఁ జూడ నొల్లని, ముగుదతనం బెల్ల మూలకుట్టుగ నిఱు పెల్లగిలించు కొంటి కవిక. ౩. [illegible]

**పెల్లగిల్లు(లు.)** అ. క్రి. (√ పెల్ల.) ౧. (వృక్ష పర్వతాదులు) పెకలు, ఉన్మూలితమగు.

గీ. . . పుడమి వగులఁ, బెల్లగిలి కూలెఁ దరువులఁ గొల్ల కెల్లకూడఁబడిరి .

హరి. పూ. ౫. [illegible]

సీ. వితతనిశ్వాసమారుతఘట్టనంబునఁ బృథ్వీధరంబులు పెల్లగిల్ల ... కాశీ. ౫. [illegible]

గీ. అవని యొక్కెడ పాంబుకళ్యాణపేళఁ, బెల్లగిలి నట్టి దేవుని పేరివాని, పెండ్లికొక పట్టనంబైనఁ బెల్లగిలదు, యంచు భీష్ముండు నగియెఁ దాలాంకుఁ జూచి. దశా. [illegible]

శా. .. అవ్వీడు దుర్వారగర్వారంభంబున గంగలో వయిచువాఁడై ఘోరనీరంబు ప్రాకారాంతంబునఁ గొన్ని పెల్లగిల మ్రగ్గిడమై దిర్వఁగన్. (హరి. ౪. [illegible])

౨. ఊదు, ఊడిపోవు.

వ. . . ఈశ్వరా నీవు వైశ్వానరునిసప్త జిహ్వాపల్లవంబులు పెల్లగిల గిల్లితి .. భీమ. ౩. ౨౧౧.

సీ. ఒకమునీశ్వరుపిల్లపికి పెల్లగిలఁదీయునొక్క కరాగేంద్రునిముక్కుఁ బదుమ. సీతావి. ౧. ౨౬.

౩. పాఱిపోవు, పలాయితమగు.

శా. వానిమ్రోతంగంబుం బడ సేసి వాఁడొండెగుచోఁ దన్మస్తకం బుర్విఁ డొల్లం గేలివిధమొప్ప సేయ బలమెల్లం బెల్లగిల్లెన్ వడిన్. భార. ద్రో. ౧. ౩౧౩.

మ. రారాజు సైన్యంబు లొక్కొక్క మొగిన్ బెల్లగిలంగ బట్టదరి ఎక్రోధాంతరంగంబు తోన్. భార. కర్ణ. ౨. ౩౫౨.

వ. పెల్లగిలకి కయ్యంబు సేయువారును విక్ర. ౪. ౯౭.

౪. చలించు, కలఁగు, క్షోభించు.

గీ. భీష్మునంపఱ కౌరవ్య పెల్లగిల్లె, ఝంఝతోడి రథావళి జలదపంక్తి, భూరిమారుతహతిఁ దూలిపోవునట్లు, పఱచెఁ గని క్రీడి యుద్ధంబు సఱపెఁ దేరు. భాగ. భీష్మ. ౧. ౨౭౪.

ఉ. వేసలు పెల్లగిల్లి పఱచెన్ దశకంఠుఁడు కోట దగ్గఱం,గా నడచెన్ మణిస్ఫురిత కాంచనతోరణకాంతిఁ జూచుచున్. నిర్వ. ౪. ౫౩.

సీ. ఉల్ల మెల్లను బెల్లగిల్లి వింశతిరూపధారి కెంహాఁవను విదాహు కొందవె. హై. భా. ౭. ౧౪.

౫. వేడెక్కు, పగులు.

మ. ...చుక్కలు రాల న్దివి పెల్లగిల్ల ... పడి కోళ్ళం బెట్టి వాపోవఁగన్. ఉ. రా. ౩. ౭౫.

౬. వణంచు, చెదరు.

చ. తలఁపులు పిక్కటిలుబడి తాల్ములు పెల్లగిల్లంగఁ . . హరి. ఉ. ౩. ౭.

వ. ... నందభూమీశ్వరునకుం దగుతెఱంగున నత్తెఱం గెఱింగించిన నతండు ధైర్యంబు పెల్లగిల్ల విక్ర. ౩. ౧౦౬.

౭. వినఁబడు, బయలుపడు.

చ. అడుగవుగా త్రికర్ణుని గుణావళి వానితపంబు మెన్నినిం, బడసెఁ బ్రసన్నుఁగా హరికృపం గృప గల్గి జగద్రహస్యముల్, పెదతలనున్న కర్ణమునఁ బెల్లగిల న్సకలాగ్రవేదియై, నుడిసనినాఁ దతం డతని సంగరి కాలము మోతుకాలమున్. కకు. ౫. ౧౦౧.

జ : పెల్లగించు.

పెల్లారు. అ. క్రి. (√ పెల్లు.) అతిశయించు.

క. ఎల్లారిఁ బ్రోవఁ గరుణం, బెల్లారిన కల్పవల్లి ప్రియకరలీలా,పల్లాలిత యనఁదగు శివు, నిల్లాలి వధూమతల్లి నీశ్వరిఁ గొలుతున్. శివలీలా విలాసము. ౧. ౧౨౫.

ఉ. ఆ రుచిరాంగిఁ జూచి యనయంబును దక్షుఁడు సమ్మనంబులో, నీరమణీలలామ మునశిష్టగతిం బ్రతిపచ్చునాథు సే, నారసి యే క్రియం బరిణయం బొనరింపఁగఁ గాంతు నంచుఁ బెల్లారు విచారసాగరమునందు మునుంగుచునుండె నంతటన్. శివలీలా విలాసము. ౧. ౧౬౦.

పెల్లిదము. వి. (√ పెల్లు.) అతిశయము.

క. ఒదవెడు తృష్ణ పెల్లిదమున, వదనము వఱువట్ట్ బట్టె ... భార. విరా. ౧. ౭౭.

విణ. అధికము, బహుళము.

చ. తదవసరంబునఁ జెలువొందఁ దాఁకి సుమాలి
యుపేంద్రుపైఁ బటుప్రదరము లద్భుత మద్రి
శిఖరంబున వారినిముంచినట్లు పెల్లిదముగ
జేసె నిర్వ. ౩. ౨౩.

పెల్లు. వి. (సం. పులక్. త. పెలక్.) ౧. అతిశ
యము, ఆధిక్యము.

క. దారుణకల్పాంతమరుత్ప్రేరిత హవ్యవహుల
శిఖల పెల్లిది యని... (భార. ఆది. ౨. ౩౯.)

ఆ. అశ్వసుభటతతులయుంగ ఖండంబులు, రుధిర
కర్దమమున గ్రుంగియున్న, పెల్లు చూడ
రౌద్రబీభత్సకరుణభయానకైకహేతువయ్యె
నధిప. భార. ద్రో. ౧. ౨౪౯.

గీ. ఎసగుసాఁకటిపెల్లున నిందువందు, వదవిఁ
జరియించి యాహార మబ్బకునికి, నలసి యొక
జంబుకంబు భాగ్యమునఁ గాంచెఁ, గలహ
మొనరించి పోయినకదనభూమి.
నా. పంచ. ౧. ౧౪౯.

౨. ఉద్రేకము.

ఉ. ఒక్కనగంబు వచ్చి నినదోద్ధతి నొక్కట
దిక్కటాహముల్, పిక్కటిలంగఁ బెల్లున
గుభిల్లున శుక్తిమతీస్రవంతి పేరక్కున వ్రాలి
యూఁగె భువనావళి నుద్భటవింధ్యవైఖరిన్.
వసు. ౨. ౧౪౬.

౩. ఉరుటు, ఉద్ధతి.

శా. చెల్లింపం దగు నీకు నీప్రతిన నాచేఁ జావు
సిద్ధంబు నీకు పెల్లిలం బొలియించు శక్తి
యని మస్ఖితంబుగాఁ బల్కుచున్.
భా. రా. యు. ౧౫౪౯.

వ. ... పెల్లం బగు పెల్లుబాప గ్రుళ్ళింపుచు...
అచ్చ. రా. యు. ౩౬౪.

౪. విధము, రీతి.

చ. పిడుగులపిండుబిట్టులియు పెల్లునఁ బాఱుతు
కంఖ పెంపెత్తగన్.
భార. విరా. ౪. ౧౪౧.

వ. ... కదలి పెల్లివిరిపిన పెల్లున సకలబలంబులం
గూడుకొని. రా. వి. ౫. ౨.

౫. గుంపు, సమూహము.

గీ. తెలియ రసవంతమగు కృతి తెలుఁగసేర,
రల్పరసకృతి తెలుఁగుదు రల్ప తెల్లఁ,
దెలుకువిడి చిదరసమున దెలుఁగిరాక, పిప్పి
కరగదు నీఁగలపెల్లుతోడి.
కు. షం. ౧. ౩౦.

సీ. దర్పంబు గనుఁబాటు దాఁకపుండలఁ గొడు
గులపెల్లి ఖచరదృక్కోటి నాఁగు.
భార. భీష్మ. ౨. ౧౧౯.

౬. ఆస్పదము, నెలవు.

ద్వి. వినయంబు తేట వివేకంబుకోట, యనురక్తి
యిల్లు సదాత్తత పెల్లు, బసవఁడు కేవల
భక్తుఁ డేయసు మ. (బస. పు. ౨. ౧౩౪. పం.)

సీ. విభవంబులకుఁ బెల్లు విద్యల కొరగల్లు
పురమంజాలక్ష్మికిఁ బుట్టినిల్లు.
శివద. ౧. ౧౬.

విణ. ౧. అధికము, బహుళము.

క. భారతవర్షమునకుఁ గాఁ, గౌరవులును
పాండవులును గాంతుం గదుఁ బెల్లై రావి
రొండొరులతోఁ, బోరం దగిరి.
భార. భీష్మ. ౧. ౨౭.

చ. బిసరుహపత్రలోచనను బెల్లగు మోహము
సంఘటిల్లె ... పారి. ౧. ౧౦౦.

శా. ... పిల్లలుం బిల్లగో వెల్లో యంచు ...
రా. వి. షి. ౧౪.

౨. ఉప్పొంగినది, ప్రవృద్ధము.

క. అని యిరుదేవతా ప్రార్థనమ్ము వాదిమకవి
వినుతముగం గావించి నిలిచి పెల్లగుచుల్లంబు
నందు నేనొక పురాణముం జెప్పంగన్.
నై. భా. ౧. ౭.

క్రి. విశే. మిక్కుటముగా, అత్యంతము.

క. దోర్బలుతలయును దునిసెడు,విల్లును ధర
గాలుచు మేను విఱిగడిసినదమ్ము, పెల్లు దొరఁగు
నెత్తురునై, పల్లటిలందొడఁగె నపుడు
పాండవబలముల్. (భార. భీష్మ. ౭. ౨౩౦.)

సీ. ... పేదలై పెంచుట కలయంగఁ బెల్లు
పుట్టు,దురు ప్రజ యంతయు విరిగలవారు
గోరంగఁ బుట్టరు
భార. శాం. ౧. ౨౧౬.

జ: పెల్లారు, పెల్లిదము, పెల్లుకొను, పెల్లున,
పెల్లుమీఱు, పెల్లెత్తు.

పెల్లుకొను. అ. క్రి. (పెల్లు + కొను.) అతిశయిల్లు, విస్తరిల్లు.

క. పెల్లుకొనఁ గురిసి రప్పుడు,దల్లుగఁ దమ
చూడ్కులకును దలమిచ్చుమ భూవల్లభుఁ
పైఁ బురభామలు కొల్లలుగా లాజమిళిత
కుసుమాంజలులన్. కవిక. ౩. ౧౬౦.

వ. ఎల్లెడలఁ బెల్లుకొని యుల్లంబులు జల్లనం బిడు
గులు పడం జేసియు ..
నై. భా. ౨. ౨౪.

పెల్లున. క్రి. విశే. ద్రు. (√ పెల్లు.) అత్యంతము, మిక్కిలి.

క. వనరాశు లేడు నుప్పరి,పెనముస నీరులును
బోలెఁ బెల్లున నుడిగెన్.
కు. సం. ౬. ౧౧౨.

ద్వి. పృథివిపై విప్రులు పెల్లునఁ జూచిఁ ప్రథమ
యుగంబునఁ బృథువుఁ బెంపించి.
రం. రా. ఉ. ౧౫౩౬. పొ. ౧౫. పం.

క. కల్లలకెల్లను బుట్టిన,యి ల్లనఁ బెల్లునఁ
జెలంగు నెత్తిమీఁదుల కేఁబల్లిదులం గొం
యగుదురు, శెల్లంబుగ నొకటి సీకుఁ జెప్పెద
వినుమా. అచ్చ. రా. బాల. ౧౦౭.

పెల్లుమీఱు. అ. క్రి. (పెల్లు + మీఱు.) అతిశయించు, అగ్గలమగు.

ఆ. ఓరిదోసకారి యుడుగనిక్రొవ్వునఁ, బెల్లు
మీఱి జగముతల్లడిల్లె, ప్రామకొలఁపుసామి
మద్దియ నిటు లేల, కొంచుఁబోయె దిపుడు
కొంకులేక. అచ్చ. రా. ఆ. ౬౯.

సీ. పరాకతగజంబు వాకోపూణముచేయ నొల్లని
మాంద్యంబు పెల్లుమీఱు. కుద. ౩. ౬.

పెల్లెత్తు. అ. క్రి. (పెల్లు + ఎత్తు.) అతిశయించు.

ఉ. . మది నుల్లసిల్లి పెల్లెత్తినకేద్క
నవ్వరమహీరుహముం దనసొమ్ము నేఁతనై,
మిత్తన కేఁడెఁ జిత్తవిభు మేకొని యచ్చతు
రుండుఁ జెచ్చెరన్.
హరి. ఉ ౪. ౨౦౪.

పెళపెళ. వి. విఱుగుట, ఉఱుముట, అర్చుట, వానపడుట, మొదలగువానియందగు ధ్వని కనుకరణము.

గీ. విఱిగి పెళపెళ ధరఁ గూలి విపినతరులు.
ఉ. రా. ౨. ౪౪.

చ. పెళపెళ బల్లెముల్ విఱిచి భిల్లులు తల్లడ
మంద నుద్ధతిన్ దలలను ద్రెంచి తేజపయి
వచ్చుకిరి డ్డొర నొంచెఁ దూపునన్.
ఉ. రా. ౭. ౪౧౫.

చ. పెళపెళ మబ్బు విట్టులుచు ..
ఆము. ౪. ౧౦౧.

క. . . అదిదముఁ గొని, బెదిదముగా నఱికె
వాఁడు పెళపెళ నార్చెన్.
శశా. ౫. ౨౮.

సీ. ఎలమావిశాఖ రాల్చి పెళపెళ వార్చి
కోవెల బోటుల గోతులు పెట్టెను.
రాజ. చ. ౩. ౯౦.

చ. పెళపెళ లేచి చీరల గతి బింకములు జన్నులు
చేర్చికొంచు నే జలకములాడి యాడి .
మను. ౪. ౭౮.

సీ. ఎలగోలుజల్లు మున్ పెళపెళ సేటువా ల్పడి
గాలి పట్టిండ్లు దడిసి చనగ.
ఆము. ౪. ౯౧.

జ: పెళపెళయను.

పెళపెళయ(మ)ను. అ. క్రి. (పెళపెళ + అను.) పెళపెళమని ధ్వనిచేయు.

గీ. అతఁడు మృగకృత్తి పెళపెళ యనఁగ
ఆను. ౪. ౫౫.

సీ. కలమాన్నరుచితోడఁ గలపించు జాద
మవ్వలుబపింకెలు పెళపెళ యనంగ.
పారి. ౨. ౧౯.

సీ. అంతరాంతరములం దస్థిబృందములు పెళ
పెళమనియెడు గిలుకు లెసఁగ.
భీమ. ౪. ౧౩౦.

పెళపెళారు. ౬. పిడుగులు పడుటయందలి ధ్వని కనుకరణము.

గీ. పెళపెళా రని బెడిదంపు బిడుగు లురల
కుశ. ౧. ౧౭౩.

పెళారు. వి. అవ్యక్తధ్వని కనుకరణము.

దండకము. ... ఘుంఘామఘుంఘీభవద్దీర్ఘనిర్ఘాత
నిర్ఘోషము ల్మీఱి యత్యుగ్రమై యొక్క
రావంబు ఫుట్టెన్ పెళా రంచు బ్రహ్మాండ
భాండంబు బ్రీలెన్ ...
దశా. ౪. ౨౩౨. ౧౪౫. పా.

పెళుక్కు. వి. విఱుగుటయందగు ధ్వని కనుకరణము.

వ. . కదురు దివియు నంతలోన పెళుక్కున
వడిమికిఁ దునకలై యుండినం గని ..
చెన్న. ౪. ౧౨౭.

పెళుచ్చు. విశ. ౧. మూర్ఖుఁడు, పెంకె.

గీ. .. బాలుఁ డితఁడు, కోపని గొంకెమకోరి
కల్ కోరనేని, యిదకపోఁబోలు దిదఁబోలు
దీరు దివియఁ, జేను రాకున్న వైర్థికల్
పెళుచు లంద్రు. పాండు. ౪. ౧౫౫.

౨. విరసము, పరుషము.

ఉదా: పెళుచు మాటలు.

(శ. ర., బ్రౌ. పెళుసుమాటలు. వా.)

3. అతి సులభముగా విఱుగునది.

(వ్యవ.) మునగకొమ్మ మిక్కిలి పెళుచు.

పెల్లబ్రమాను. దున్నిన పిమ్మట పెరక పల్లములు లేకుండ చదునుచేయుటకై యుపయోగించు పలక, పాపటము. (శ. ర., బ్రౌ.)

పెల్లాపెల్లి. వి. (సంగీ) రాగములలో నొకటి, స్వరస్థాయి భేదము.

ద్వి. లాలితంబుగను వైళంబుఁ దాళంబు, సాళి
పెల్లి జాతుల జాయి, యుచిత
మొయ్యారంబు నొగిఁ బంజళంబు ..
బసవ. 3. ౯౩౫.

పెల్లు¹. వి. విఱుగుట, విఱుచుట, శకలేయుట, కాఁటుటమున్నగువానియందలిధ్వని కనుకరణము, ఆ ధ్వని.

సీ. విక్కి పెల్లని కొమ్మ లుక్కున విఱుగంగఁ
ధారుణిఁ బ్రోచి పనులఁద్రొక్కి.
పారి. ప్రా. ౫. ౧౩.

ద్వి. పై శృనుఁటుల బెదరి యూపిట్టు, కల్లు
టదర నాకాశంబు ముట్టె.
ద్వి. వ. సారంగ. ౧. ౧౧. పా. ౧౩. పం.

ద్వి. అసురులచేతిశస్త్రాస్త్రంబు లాడిసి, వెనఁ
బుచ్చి పెల్లున విఱుగుదు కపులు.
రం. రా. యు. ౪౭౧. పా. ౫. పం.

ఉ. బెబ్బులిగొంతుద్రోల్గి యది పెల్లున మార్మొద
ద్రొళ్ళి దాఁటుచుఁ ... అము. 3. ౭౦.

పెల్లు² = పెడలు, పెరడు. వి. గృహాపృష్ఠ
భూమి, దొడ్డి.

క. పెర దనఁ బెడ లనఁ బె ల్లనఁ, బరఁగు
గృహాపృష్ఠసీమ (ఆం. భా. ౭. ౧౯.)

ద్వి. నీ కేల పలవింప నీకుమూరునకు, నీకును గాఁ
జేర నేఁ డిల్లుఁబెల్లు.
ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౯౬.

(ఇల్లుఁబెల్లు, అనఁగా సర్వము అని భావము.)

పెల్లు³. వి. కంచెకును ఇండ్లగోడలకును అడవి
ప్రదేశములందుండువారు ఉపయోగించుకొను
చివుళుల గట్టిగానుండెడు ఒకజాతికొంక్కి.

చ. గొతియలమంద యాఁ బసులగుంపు కృషి
క్రియదుక్కిఁ బెడ్డదా, డ్డెకొడు పెళ్ళుకంపబలి
యించినతోఁగిలి ముల్లుపెండెముల్, తఱ
పులగాఁడి కోడియులదామెన గాదెల్లుగొల్చు
గల్గి యే, కొఱఁతయు లేకయుండ్లు నొక
గొల్లత ... వేం. పంచ. ౧. ౫౨౯.

పెల్లేము. వి. మద్యము చేయుటకు అనేక వస్తు
వులు చేర్చి చేసినపిండి, పేడకము.

గీ. ... చెలఁగు పేటకముపేరు, పెళ్ళె మనఁ
గను ... ఆం. భా. ౭. 303.

పెసర = పెసరు. వి. ముద్గసస్యము. ?.

వ. .. కందియుఁ దంబును బెసరసెనగయును
మినుములును .. భీమ. 3. ౫౪.

గీ. ... ఎఱకెల్లకంది చిర్నానగ కునగ, పిల్ల
వఱపప్పుకలుు పిల్లపెసరగాయ, మళ్లు ...
హంస. ౪. ౧౭౪.

జ: పెసరగింజ, పెసరపప్పు.

పెసరగింజె. వి. (పెసర + గింజ) ముద్గసస్య
బీజము.

గీ. అది విహంగము కేను విహంగమంబఁ బెసర
గింజకు దక్కుఁ జే పెసరగింజ, యకల యిటు
చూడు మప్పుడే యద టదంతుఁ గుటిల
చంచూపుటకోటికొట్టనముల.
కాశీ. ౬. ౨౯౬.

పెసరప(ర్వ)ప్పు, పెసరుఁబప్పు. వి.
(√పెసర.) ౧. ముద్గసూపము.

సీ. పలుచగా వండినవలిపెంపుఁజాఁపట్టు పెసర
పప్పులతోఁ బెనఁచి పెనఁచి.
శైవ. ౬. ౧౭౦.

ఉ. కప్పురభోగివంటకము కమ్మనిగోధుమపిండి
వంటయున్, గుప్పెడు పంచదారయును
గ్రొత్తగఁ గాఁచినయాలనే పెసఱపప్పును
గొమ్మువల్లఁటిపండ్లును వాలుగునైదుపంచా
లున్, లప్పులతోఁ గ్రొంబెరుఁగు లప్పుణ
రొజ్జలయింట రూకకున్. క్రీడా. ౧౩౬.

క. పెసరుంబప్పేమిటికని, కసరు స్నైయి
గొనఁడు పండుగను గొయకూకే, కోసరుం
బలుచనిచల్లరొమ్ము, కొసరుం గనఁ దకనిలోభ
మున కే మందున్. బహు. ౫. ౭.

సీ. పెసరుఁబప్పును బాలుఁ బెరుఁ గోగిరంబులుఁ
కాయసాన్నంబులు పానకంబు,గీ. ... నాది
గా భక్ష్యభోజ్యలేహ్యపదార్థైన, బహుపదా
ర్థంబు అర్పించి ప్రణతు లైరి.
హర. ౬. ౫౯౬.

౨. పెసలుదినరగా పేర్పడిన బ్రద్దలు (బేడలు) ముద్గధాన్యశ్రుం ఖండములు. (శా.)

పెసరు = పెసర. వి. (క. హెసర్. త. పయఱు.) ముద్గసస్యము. కీ.

సీ. ముద్గంబు పెసర నాఁ బొల్చును . .
ఆం. భా. ౨. ౨౩౫.

వ. .. గసగస రొసక పొసఁగఁ బెస రసుర కొనిరొ దవనిక పాదశ ...
కాశీ. ౩. ౨౩.

వ. ... పెసరుమిన్న అమ్మలోనైన ఎద్దుసినిక పుట్టినట్టి. చి. ఉ ... ఈ. ౪౭.)
ద.-శా. ౪. ౧౩౭౪.

జ: పెసరఁగాయ.

పెసరఁగాయ. వి. (పెసరు + కాయ.) పెసర కాయ.

మ. పెసరఁగాయను మొత్తకన్నులను నైపేటాడు మన్ గోష్ఠిలకా, మసలం జాచుచు ...
రా. వి. ౨. ౪౫.

పెసలు. వి. బ. పెసరగింజలు, ముద్గధాన్యము.

దీనిభేదములు: నల్లపెసలు, పచ్చపెసలు, పిచ్చపెసలు, పిల్లపెసలు. ఇం. (శ. ర.)

## పే

పేఁట¹ = పెంట¹. వి. (సం. పింరా. త. పేట్టై. క. పేటె.) ౧. నగరము, పట్టణము.

క. ఎక్కడఁ జూచినఁ గాల్బలు, మెక్కడఁ జూచిన రథంబు లిభతురగచయం, బెక్కడఁ జూచినఁ బ్రామై, త్రిక్కటిలెం బేటసాల్గ కెలఁకుల సేనల్.
కవిజ. ౩. ౧౪.

౨. శాఖానగరము, పట్టణమున కంటియుండుచిన్న యూరు.

ఉ. పురములు గాల్చి మాపములు పాడిచి పేఁటలు దోఁచి కోటలన్, ధరఁ బడఁ ద్రోఁచి . బ్రహ్మో. ౪. ౧౩౧.

౩. విపణిప్రదేశము, అంగడివీథి.

సీ. ... పేఁట యంచునఁగను విపణి రొప్పు.
ఆం. భా. ౨. ౧౨.

పేఁట². వి. (√పేఁడు.) హారములలో కొసరము, యష్టి, దామము, త్రాడు.

సీ. పేఁట యంచనఁగను విపణిప్రదేశాఖ్య యొక సూత్రాఖ్యయై యొనఁగుచుండు.
ఆం. భా. ౩. ౫౭.

(వ్యవ.) మూఁడుపేఁటలత్రాడు గట్టిగా నుండును.

పేఁడ = పెండ. వి. గోమహిషాదుల విష్ఠ, గోమయము.

గీ. ఇనుకనైనను లింగంబు చేర్చి కొలుఁడు, పేఁడనైనను లింగంబు బెట్టి కొలుఁడు, నీటనైనను లింగంబు నిలిపి కొలుఁడు.
భీమ. ౩. ౧౦౨.

సీ. పేఁడ నాఁగ గవాదివిష్ఠ మాఱును ...
ఆం. భా. ౨. ౧౩౪.

సీ. పేఁడ నాఁ దవరు గోమయసంజ్ఞ ...
ఆం. భా. ౨. ౨౫౭.

సీ. ఎద్దుముడ్డిని పేఁడ . . వేమ. శ. ౭౩.

జ: పేఁడగువ్వ, పేఁడపురుగు, పేన్నిళ్లు.

పేఁడగువ్వ. వి. (√పేఁడ.) పారావతవిశేషము. (శ. ర., బ్రౌ.)

పేఁడపురుగు. వి. (√పేఁడ.) పేఁడయందుండు ఒకజాతి పెక్కులపురుగు. (శ. ర., బ్రౌ.)

**పేఁడు** = పేను¹. స. క్రి. (దారము పేను.) పేను.
(శ. ర., గ్రా.)
(వ్యవ.) ఆమె తొడమీఁద దారము పేఁడు చుండెను (గ్రా.)
చూ: పేఁట.

**పేక.** వి. వస్త్రముల నేతయందలి యడ్డనూలు.
ద్వి. తొడయందుఁ బొడమువాతూలఘట్టనలఁ,
బడుగుఁబేకయుఁబోలెఁ బడ మహీజములు.
రం. రా. సుం. ౭౦౧. పా. ౧౯. పం.
రగడ....పాలిఁ డాఁగెను సన్నపుఁబేకల్
బహు. ౨. ౧౩.

**పేగు(వు)** = ప్రేగు. వి. ఆంత్రము.
(శ. ర., గ్రా.)
విశే. దగ్గర సంబంధము కలవాఁడు
(వ్యవ.) అది నా పేగు కనుక నామనసు తాళి లేదు. (గ్రా.)
(వ్యవ.) మే మందఱము నొకపేగు. (గ్రా.)

**పేచకము.** సం. వి. అ. పుం. ౧. గుడ్లగూబ, ఉలూకము. ౨. గజపుచ్ఛమూలోపాంతము, ఏనుఁగుతోఁక మొదలిసమీపము ౩. పర్యంకము, మంచము. ౪. మేఘము. ౫. యూకము, పేను.

**పేచకి.** సం. వి. న్. పుం. ఏనుఁగు.

**పేచి(చీ).** వి. (హిం. పేచ్. క పేచ.) చిక్కు, బాధ.
(వ్యవ.) వానితో దినదినము నేదియో పేచీ వచ్చుచునే యున్నది.
చూ: పేచీకోరు.

**పేచిక.** వి. ఒకానొక చెట్టు.
(శ. ర. జారగడ్డి, అని గ్రా.)

**పేచిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అడవిగుడ్లగూబ. (వై. ని.) ౨. పింగళి యను సంజ్ఞగల పక్షి పైఁడికంటి. (కే. ని.)

**పేచిలము.** సం. వి. అ. పుం. ఏనుఁగు.

**పేచీకోరు.** విశే. (పేచీ + కోరు. హిం. పేచ్ ఖోర్.) పేచీలు పెట్టువాఁడు, తంటాలమారి.
(వ్యవ.) వాఁడు పేచీకోరు.

**పేచుకము.** సం. వి అ. న. పేచులి. (త్రి. ని)

**పేచులి.** సం. వి. ఈ స్త్రీ. నాడీచశాకము. కీ.
(త్రి. ని.)

**పేచువు.** సం. వి. ఉ. న. నాడీచశాకము. కీ.
(త్రి. ని.)

**పేట.** సం. వి. ఆ. స్త్రీ మంజూష, పెట్టె.

**పేటకము.** సం. వి. అ. పుం. కదంబకము, సమూహము.

**పేటన.** వి. (సం. ఖేదనమ్.) బాధ, చిక్కు.
(మా. పేటనపెట్టు.)
చూ: పేటన పెట్టు.

**పేటనపెట్టు.** అ. క్రి. (పేటన + పెట్టు.) ౧. చిక్కు కలిగించు, బాధకలిగించు.
మ. అవలోకించి వయస్యలార కడురమ్యంబైన
యీతోఁటలోఁ, న వినోదింతము గొన్ని
నాళ్లిచటఁ బెంటబ్బెట్టు నీపాపిగాం, ద్ర
వృథాసందడి గాకుఁబొంద నవ కేళీ పాణి
బోవంగఁ జేయవలెం బేటనపెట్టియుంచు
నెఱుఁగుం గై భీకరత్వక్రియన్.
వరాహ. ౧౧. ౬౫.
(వ్యవ.) వానిది యేదో పేటనపెట్టుస్వభావము కాని యుపకారముండుస్వభావము కాదు.

సీ. పొంగు గంధపుఁబేటుకొంగులం దిరమ్మద
రుచులుజా జాగరారుణ్య మదర.
భోజసుతా. 3. ౧౦౯.

జ : పేటెం, పేకెత్తు, పేగ్రేగు.

పేటు². వి. వేఁట కుపయోగించు నొకానొకసాధనము; కుతంత్రము, మాయోపాయము.

ఆ. ... మిఱ్ఱు వలలు పేట్లు గోడ్లు దీమంబులు,
పాదిగాఁగఁ దెచ్చి రాటవికులు
పి. శకుం. ౧. ౧౧౭.

క. పే కెత్తి బిపులతో విసి,వో టగు పదు
పాయ మొకటి పుట్టింపఁదగుఁ,బో ట్రాడ్డి
యైనఁ దాఁ గను,చాటున బిందంగి వేఁట
వలిపెదుకేలి. కవిక. ౨. ౪౪.

జ : పేటాడు.

పేటు³. వి. (క. పేట్టు) పరిగ లోనగువానితో నేసినపట్టె. (శ. ర.)

పేటు⁴. వి. పర్వత శిఖరము. (శ. ర., బ్రా.)

సీ. శిఖరాఖ్య మొప్పును సిగరము గుబ్బ పే
టనన్ ... అం. భా. ౨. 30.

పేకె(టు లె)త్తు = పేడెత్తు. అ. క్రి. (పేటు¹ + ఎత్తు.) ౧. చిటులు, చీఁటలువాఱు.

గీ. పెదవి పేకెత్తు నాలుక పిడుచగట్టు,దాహ
మున కుదకము లేక దడబడేని .
దశా. ౨. ౧3౭.

ద్వి. పెనఁకువ నది తొల్లి పేకెత్తి యుంటఁ,
గని నీవు బిటిచిటిగాక భూవాధ.
రం. రా. బాల. ౬౦. పా. ౪. పం.

మ. ... ఇంపారు కలపంబు లబ్బాటునన్ పేటు
లెత్తి రొండొరుల రొమ్ముత్తడిన్ బోడిపాడి
రై ... మనుచ. ౫. ౩౧.

ఉ. అలఁదిన చందనంబు వృథయౌఁ దెమరింపఁగ
సమ్మదాశ్రులన్, దొలఁచినయట్లు వోయెడుఁ
గనుంగవ కాటుక పేటుకట్టఁ జెక్కుల
మకరీవిలాసము గసురొప్పెడువ న్నరిఁ జూచు
కేలి నో,చెలి కయినేయుకమ్మ యని చేడియ
యొక్కతె విశ్వ వచ్చెలిన్.
పారి. 3. ౧౭.

౨. తొలఁగు, స్థానభ్రంశము నొందు.

క. క్రేటువాడు వాఁడుఁ బిడికిటఁ, బోటుగొనఁ
గిటి పట్టి పారి ప్రాణంబుల్, పేకెత్తి
పెత్తి మృతి క,ప్పా టొక్కఁడ చాల కేలఁ
బడనైచి పడిన్. భా. రా. యు. ౬౨౦

సీ. అప్పుడు చిట్టు ముట్టాడు కోరికలను దమ
కంబుచే నైన కత్తరములఁ, పేకెత్తి విలు
కదఁ ఖదఁబాయు పిగ్గుల నొక్కొంత
నట్టూఁత లూఁగఁ దారి. విప్ర. 3. ౯౩.

3. తగ్గు, క్షీణించు.

మ. . పేకెత్తిన లజ్జ సంఘ్రిఁకటకంబుల్
ద్రోయ . మనుచ. ౨. 3౯.

౪. అతిశయించు.

క. పా టెరుఁగని పతితోలంపును, గూటంబున
కొలఁకపడని కోమలి రతియుఁ, పేకెత్తఁ
జేయు చెలిమియు, నేటికి పెదు రీఁదినటు
లెన్నఁగ సుమతీ. సు. శ. ౬౯.

పేగ్రేఁగు. అ. క్రి. (పేటు¹ + రేఁగు.) చెలరేఁగు, విజృంభించు.

(వ్యవ.) ఆ యూరిలో దొంగలు మిక్కిలి పేగ్రేఁగి యున్నారు.

(వ్యవ.) భయభక్తులు లేక వాఁడు పేగ్రేఁగి పోవుచున్నారు.

పేడ. సం. వి. అ. స్త్రీ. మంజూష, పెద్దపెట్టె. (వాచ.)

పేడి. వి. (సం. షండః. క. పేడి.) నపుంసకుఁడు, పండఁడు.

ఆ. ... సంధ్య సుస్థలి వాదటఁ, గూడకేని యతఁడు పెడిఁ గాంచు.
మార్క. ౩. ౨౪౧.

క. మనఁ బేడికి దారిక్రీత్యయును జైవికికి మధురగీతియును బీకువ కృత్యమువును రూప దర్శన్యమును జేయుటఁ బోలుఁ గృష్ణుఁ బూజించు టులకు. భార. సభా. ౨. ౧౪.

క. చనుదెంచి పేడితనమును, వనితారూపంబు నవుర వాసవసుతుఁడు ...
భార. ౧. ౨౨౯.

పేడు = పేటు[1]. వి. (ప్రా. పేండం.) దార్వాదుల, సన్నచెక్క.

సీ. ...పే దన మూత్మ దారుభేద. గీ. మగుమ ..
ఆం. భా. ౨. ౩౭.

జ: పేడెత్తు.

పేడ(డియ). విశే. గడ్డము మీసము లేనివాఁడు, లేనిది.

ఉదా: పేడమూతి, పు.(శ. ర., చి. ని, బ్రౌ)

పేడెత్తు = పేటెత్తు. అ. క్రి. (పేడు + ఎత్తు.) ౧. పీటలువాఱు, పగులు.

సీ. ఘుమ్మనుగందంబు తొమ్మపైవలంది యది పేఁ జేడెత్త పఱుచుఁ జెందు.
పార్వ. ౪. ౧౫౭.

మ. .. మృజ్జగముల్ తల్లడమంద బ్రహ్మ దలఁకెఁ బ్రాంతంబు పేడెత్తఁగన్.
మైరా. ౩. ౬౨.

౨. తొలఁగు, స్వస్థానమునుండి చలించు.

క. వాడింపుంబోటరియై, పేడెత్తక తొంగిని గాచబెబ్బులితోఁ బోరాడుము ...
అచ్చ. రా. యు. ౧౧౧.

౩. పోవు, వఱించు.

శా. .. దిగ్వ్యాపారకాధిక్యతల్, భీతిం బొందితి స్వాధికారగతిమల్ పేడెత్తు నం బాత్మలోన్. కాశీ. ౧. ౧౨౫.

స. క్రి. పీడు, వదలు.

గీ. మున్ను మాకు సహాయుఁడై యున్నవాళ్లు, మించుమదమందు పేఁ డాత్రమించ జెలుచు, నితఁడు మముఁ గాదఁ దాల్మి పేడెత్తఁ డీతఁ, డెంతవాఁ డని చింతిల్లి రింతు లాత్మ
రామా. ౨. ౧౨౫.

పేణీ. (వి (సం. ఫేనికా. కపేణీ.) భక్ష్యవిశేషము.

క. .. అంగరోల్లెలు మణుగుబువ్వలుం బేణీలు నీరువత్తిగెలు .. అదిగాఁ గల భక్ష్యంబులు (హంస. ౧. ౧౦౫.)

వ. .. మణుఁగుఁబువ్వలు పేణీ లొబ్బట్లు ...
ప్రబంధ. ౧౧౨.

పేత్వము. సం. వి. అ. న. ౧. అమృతము, ౨. ఘృతము, ౩. తప్తమైన భూభాగము, కాలిననేల. పుం. పొట్టేలు, మేషము, (వై. వి.)

పేద. విశే. (సం. భీత. త. పేదై.) ౧. పిఱికి, భీరువు.

క. పేదమన సగుట ధర్మువుగాను నరేంద్రునకు జగము గావం బ్రోవం, గాద
భార. శాం. ౧. ౬౧.

గీ. హంసడిభకులు లోనుగా సకలధరణిఁ, బెరుగుకింటకకోటిచేఁ బేదలైన, నగపతుల కత్తిరిపటుములు చిరుగకుండ, వెరవుతో నుద్ధరించినవేల్పు శౌరి. ఉ. హరి. ౪. ౨.

౨. అశక్తుడు, అసమర్థము.

వ. ... ఇ ష్పేదగుజ్జంబు లతిదూరం బెట్లు పోవనోపు. భార. అర. ౨. ౧౩౩.

ఉ. అస్త్రం బస్త్రవ్యస్తంబు ఉదయుం బవధ్యాద
యుంబు క్రౌంచం బకించవంబు గంధమాద
నంబు పేద . కాశీ. ౧. ౧౦౦.

౩. దరిద్రుఁడు, బీదవాఁడు.

క. పేదలకును సాధులకును, వేదములకుఁ
బాపనులకు వేయేల సమస్తాదిత్యులకును
వందను, కాదె బ్రదుకఁ జేయు రాజా
గావింపంగన్. భార. శాం. ౧. ౯౩.

క. పేద విధానము గన్నట్లు ...
కు. షం. ౩. ౩౭౩.

ఆ. పేద యైన ధనుఁడు పెచ్చుపెద్దియై చను,
కాయమునకు వెచ్చ మల్ప మైన .
విక్ర. ౭. ౧౪౧.

౪. సౌమ్యము, అనుద్ధతుఁడు.

క. తాపసుఁ జంపఁ బ్రదుకుమ్, సాపుత్రుఁడు
విదువు మర్జునక నావుడు వాఁ,డీ పేదమాట
లెల్లను గోపవివశుఁడైనవాఁడు గొలుపవు
ముద్గా. భార. అను. ౧. ౧౧.

గీ. ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిఁ జూచి,
తరుణి తనుమధ్య మెచటికో తలఁగిపోయె,
నుండె నేనియుఁ గనబడకున్నె యహహ,
యుద్ధతులమధ్యమునఁ బేద యుండఁదరమె.
కవిక. ౩. ౭౬.

౫. అల్పము, సన్ననిది.

క. గురుకుచవహనభరమ్మునఁ, బోరిఁబోరిఁ బేద
కవు నలిగి పోఁబోయినతి,ద్భరవహనమునకు
భరపడు, కరిణిం జఘనంబు సతికి ఘనమై
యమరున్. కు. షం. ౩. ౭౯౭

సీ. కుచకుంభయుగళిబ్రేగునఁ దొట్రుపడి పేద
కౌఁదీఁగ జవజవఁ గంపకొంద.
కాశీ. ౫. ౧౧౯.

ఫా: పేదకోపము పెదవులచేటు.

ఆ. పేదకోప మెందుఁ బెదవులచేటుగా, బడికి
యేమిచేయఁగోవు నన్ను ... కళా. ౬. ౩౦.

చెవిపేద = వినుటయందు దరిద్రుఁడు; చాడీలకుఁ జెవి యొగ్గువాఁడు.

వ. అవశ్యంబు రాజులు చెవిపేద లని పలికి ...
పం. పంచ. ౧. ౫౩౫.

పేదసాదులు = పేదలుసాధువులు.
(పేదసాదలు. వా.)

చ. మనపురియేలు పాతనికుమారిక సజ్జనురాలు
దానికే, రసమతి పేదసాదులకు సారవ
యన్నము పెట్టుచుండు .
భోజరా. ౫. ౭౬౩.

జ. పేదగిలు, పేదతనము, పేదరాలు, పేదఱ్ఱ
పేదతికము, పేదతిమి, పేదవడు, పేద
వాఁడు.

**పేదగిలు.** అ. క్రి. (√పేద.) కృశించు, చిక్కు.

ఉ. కానునం, బేద యనంగ దేహమును
బేదగిలం దుది నింక నీమనః, ఖేదము మాను
మమ్మ రసా. ౩. ౭౬.

**పేదతనము.** వి. (పేద + తనము) ౧. దారిద్ర్యము, సన్నఁదనము.

గీ. ఆపతివ్రత పెనిమిటి ననుసరించి, కులభమున
నిర్వ్యాజోగ్ర సుతులఁ గనియెఁ, బేదతనమునకే
కాదె పెక్కురైన, బిడ్డల నొసంగు విధి
యెంత దొడ్డతనము. కుచేల. ౧. ౩౧.

క. గడుసువలిగబ్బిగుబ్బల, బెడిదపు భారమున
జడిసి పేదతనముతో, వడఁకెడి నీ నడుమున
కి,య్యెడ గర్భసమృద్ధి యభయమిచ్చెఁగద
చెలీ! ఉ. రా. ౬. ౧౭౩.

౨. పిఱికితనము, భయము.

ఉ. భయ మేఁటికి లబ్ధకులార యాత్మకున్,
పేదతనంబు మేల పటి మృత్యువు డాఁగడి
చోట లేదొకో. కుకుచ. ౪. ౧౦౫.

పేదరాలు. విశే. స్త్రీ. (పేద + ఆలు.) దరిద్రురాలు.

గీ. పేదరా లనఁగ దరిద్ర వెలయు ..
ఆం. భా. ఉ. ౧౦౬.

ఉ. అక్కడ పేదరాలి గృహమందున .
భోజరా. ౩. ౧౭౬.

పేదరాలుపెద్దమ్మ = బీదయవ్వ.

క. ఆ రూఢి యశోద యనం,బేరుపడిన పేద రాల పెద్దమగృహముం, జేరం జని యాయవ్వయు, రా ర మ్మని ప్రియ మెలర్పఁ బ్రమదితుఁ డగుచున్.
శు క. ౨. ౭౩.

(పేదరాసిపెద్దమ్మ యని వాడుక.)

పేదఱపు. వి. (పేద + ఱపు.) దరిద్రపుమాట, దీనాలాపము.

ఉదా: సంపదకలవారు పేదఱపు లఱచుచుందురు.

గీ. . తాన,యాకెఁ బలుమారుఁ జేరి పేద ఱపు లఱచి,యను మనోజవికారవ ర్తనలు సలిపె
రాఘవ ర. ౬.

పేదఱికము. వి. (పేద + ఱికము.) ౧. దారిద్ర్యము, బీదతనము.

ఓ. ఒడమి గిల వపెఁగు నినను, బుడమింగిలవార లెల్ల భూషింతురు శ్రీ,పెదఁబాసిన దూషింతురు, కడుఁ బేదఱికంబుకంటెఁ గష్టము కలదే.
విక్ర. ౨ ౧౪౬.

సీ. సెటి పేదవాని పేదఱికంబు వోవు నే ద్రవ్యప్రభావక్రియామువలన.
సీతారా. ౧. ౯౭.

౨. అసమర్థత, చేతఁగానితనము.

ఉ. పేదఱుగొన్న మానవుని పేముఱు గంటియు బిటుగాల్చియుక్, పాఁడియు నీటఁ ద్రొక్కి యుపు మున్కొని తీర్పఁగడంగువెజ్జన, ట్లేదగ నిన్నిచందముల నీకని దీర్చుటకై పెనంగితిక్, పేదఱికంబు గట్టుకొని బెట్టుగఁ జిక్కితి సేమి సేయుదుక్.
నృసిం. ౫. ౧౩.

(ఇట్టిచతుర్థపాదమున ప్రాసము నిరనుస్వారము.)

౩. సూక్ష్మత్వము, సన్నఁదనము.

గీ. అధిక దౌహృదయసంపద వాసకొఱ,గంధి నడిమికిఁ బేదఱికంబు మాపెఁ,దలఁప నట్టిద యెట్టివారలకునైన, లేమికాపుర ముందునే భూమిలోన.
వరాహ. ౩. ౭.

పేదఱిమి(రిమ్మి). వి. (పేద + ఱిమి) ౧. పేదఱికము, పేదత్వము.

గీ. తగునె యర్జున యీపెంటితనము నీకు, దండిపై తెమ్ము మనసు పేదఱిమి విడిచి.
భార భీష్మ. ౧. ౧౯౭.

౨. దారిద్ర్యము, లేమి

క. ఆదినముల వ ప్పురిలో, పేదవిడుండైన విప్రుఁడు మిగులన్, బీదఱిమి నొగిలి ధన ౦౦,పాద మతి భద్రకాళిపాలికిఁ జనియెక్.
ద్వా ౧. ౪౪.

సీ. బహుధనధాన్యసంపదలసొంపు వహించి పేదర్మికిని కొమ్మ పట్టువారు
విక్ర. ౫. ౧౭౪.

సీ. కమ్మఁబువ్వులుఁ బూఁత కిలలోపలకు లేక పేదర్మికతమునఁ బెండ్లికేక
నా పంచ. ౫ ౩౫.

(శ. ర., పా. పేర్మి ముద్రి. పా)

పేదవడు. అ క్రి. (పేద + పడు.) ౧. దారిద్ర్యమునొందు, బీదయగు.

గీ. చెల్లియుండియు నైరణసేయు నతఁడు,ఁ పేదపడియును నర్థికిఁ బ్రియముతోడఁ, దనకుఁ

గలభంగి నిచ్చువతండుఁ బుణ్యపురుషు
లని చెప్పి రార్యులు గురువరేణ్య.
భార. ఉద్యో. ౨. ౪౨.

గీ. ఒకబ్రాహ్మణుండు, ధనికుఁ డటు
తొల్లి యవిలంఘ్యదైవ ఘటనఁ,బిన్నలై
పుత్రు లుండంగఁ బేదవడియె.
కేయూర. 3 303.

౨. చిక్కు, కృశించు.

గీ. పదివేలగజములబలమున విలసిల్లు వనిల
సుతుండు గాఁడవిలోనఁ, గ్రుమ్మరి కాయ
లుఁగూరలుఁదిని పేదవడినఁ జూచి .
భార. అర. ౧. ౨౧౫.

3. సన్నగిల్లు.

గీ. తాఁ గృశత్వము నొంది సౌందర్యమునకుఁ,
బూర్ణభావంబు గొల్పెడు పుండరీక,నయను
మధ్యంబు పక్ష్యజనంబు పొగడెఁ, బరమపద
పోషకులు పేదివడియుఁ దిగరె.
కవిక ౬. ౧౪౬.

సా ' పులి పేదవడినఁ బనులవాండ్రె యొక్క
డుదురు

గీ. అకట మోమోట లేక తా రంత చేసి,
బ్రదికిపోయిరి పులి పేదవడినఁ బనుల,వాండ్రె
యొక్కడి రసుకళ వచ్చె
ఉ హరి. ౪ ౧౦౨ (వీరేశ. శ ర పా.)

పేదవాఁడు. విశే. (పేద+వాఁడు.) దరిద్రుఁడు,
బీదవాఁడు

సీ. నెతి పేదవాని పేదతికంబు వోవుసే ద్రవ్య
ప్రభావకీర్తనమువలన. సీతారా. ౧. ౯౪.

పేను¹. వి. (క. పేను త. పేన్. బ పేలు) తల
యందు జనియించెడు స్వేదజవిశేషము,
యూకము.

గీ. శిరముపైఁ బేనుఁ బొడగన్నఁ జేరఁబోయి,
హింససేయకు మని చేతికిచ్చుఁ దిగిచి … ,
వైజ. ౨. ౧౬౭.

సీ. .. పే నసంగ. గీ. నలరు యూకాఖ్య ..
ఆం. భా. ౨. ౭౭.

గీ. పెటులఁ గలిగినపేల నన్నింటిఁ దిగిచె.
పాండు. 3. 30.

పేను² = పేఁడు. స. క్రి. దారము మొ. కలిపి
పురియొక్కించి యేకముచేయు, పెనవెట్టు, మెలి
వెట్టు.

ద్వి. బెడిదంబు గాఁగ ముప్పిరిఁ బేనినట్టు,లారు
నీలచ్ఛాయ నమర .
రం. రా. ఉ. ౧౧౭. పా. ౧౩. పం.

క. ఏనిద్రఁ జెందునంతకుఁ,దా నొల్లదు నిద్రఁ
దాల్పఁ దా నప్పుడు నా,మేను తనమేని
తోడం, బేనికొనుం జెలువ కూర్మి పెం పే
లడుగన్. కేయూ. ౨. ౫3

పేన్నీళ్లు. వి. బ (పేఁడ + నీళ్లు.) కలయంపి
చల్లుటకై పేఁడ కలిపిననీళ్లు.

సీ ఆస్థానమందు విద్యావంతులను గని బ్రొక్క
కుండెడుశుద్ధమూర్ఖజనుల, తటుకున గ్రామ
ప్రదక్షిణం బొనరించి నిల్చినచోటఁ బేన్నీళ్లు
చల్లి. వేణు శ. ౧౯. (శ. ర పా.)

పేపర. వి పక్షి విశేషము (శ ర, గ్రా.)

పేము = ప్రేము. వి. జా. ఒకజాతి బెత్తము,
వేత్రభేదము

సీ బెత్తమం చనఁగను వేత్ర మలరుఁ,
వే మటంచనఁగఁ దద్భేదంబు విలసిల్లు .
ఆం. భా. ౨. ౬౨.

చ. . గ్రామ్యతరుణీతతి డించినపేఁపగంపలం,
దళ మగుచున్నచెంగలువదండలకా ..
ఆము ౧. ౩౫.

జ : పేముబొద్దు.

*పేముబొద్దు. వి. (√పేము.) గోడ అంచుల యందు పేముపలె నేర్పఱచెడు బొద్దు, కుడ్యాలంకార విశేషము. (శ. ర.)

పేయ = పెయ్య. వి. చూడు.

చ. నందిపోతులునుఁ దారునుఁ బేయలు సమ్మదంబునన్, గలిసి రమించు ధేనువులఁ గాంచిరి . కు సం. ౬. ౭౦౩.

ద్వి. ధీయుత వినవయ్య దేవరదానిఁ, బేయఁ బాకము చేసి పెట్టవే యనిన ...

బ. పు. ౩. ౨౨౧. పా. ౩౫౮ పం.

పేయము. సం. విణ. (అ ఆ. అ) ౧. త్రావఁ దగినది. ౨. రుచిగలది

వి. అ. న ౧. నీళ్లు ౨ పాలు. ౩. గంజి, జావ లోనగు పానీయము. (ఇది అష్ట విధా న్నములలో నొకటి) వి. ఆ. స్త్రీ. ౧. సిక్థయుక్త పేయద్రవ్యము, మెతుకులు కలిసి పుచ్చుకొనెడి పానీయము ౨. త్రాగ, కాఁపుడుగంజి. ౩. అచ్ఛమండము, స్వచ్ఛమైన మీఁగడ.

పేయువు. సం. వి. ఉ పుం. ౧ సముద్రము. ౨. అగ్ని. ౩. సూర్యుఁడు. (ఆ. ని.)

పేయూషము. సం. వి. అ. పుం., న. ౧. అమృతము. ౨. నవఘృతము, క్రొత్తనెయ్యి. ౩. ఈనిన యేడురాత్రులలోని పాలు, ముఱ్ఱుపాలు, జున్నుపాలు.

పేర. సం. వి. ఆ. స్త్రీ. ౧. వాద్యభేదము. ౨. భూమి. (వై. ని.)

పేరంటము. వి. ౧. వివాహాది శుభకార్యములలో సువాసినులు నడపు మంగళకృత్యమునకుఁ బిలుచు పిలుపు.

ఉ. పెండ్లి నృపాలునింట నని పేరఁటముల్ ప్రియ మొప్పఁ జెప్ప నింట్లిండ్లకు శోభనాత్మకలు హేమపుఁబాత్రలఁ గొంచుఁ బెద్దపూఁబోండ్లు చరించిరి .

కళా. ౪. ౫౯.

ఉ. ఎల్లియ సోఁకుటొజ్జ యతఁ డేపునఁ జేయును గూఁతుపెండ్లి యం,చల్లన పైఁడి పళ్లెరములందును గందముఁ బూలు పచ్చఁ బ్రాల్, పెల్లుగ నించి పొల్తుకలు పేరఁట ముఁ దగఁ జెప్పె వీటిలో, వెల్లిదఁ బ్రిమ్మరం దొణఁగి రింపుగి వాయిదముల్ చెలంగఁగన్. యయా. ౪. ౭౩.

౨. వివాహాది శుభకార్యములయందు ముత్తైదువలు వచ్చి చేయుమంగళకృత్యము.

సీ. కైసేసి శచి లోనుగాఁగల దేవపురంధ్రివర్గములు పేరఁటము సేయ.

హరి. ఉ. ౭. ౨౪౨.

క. పూరారిద్రోహు నింటికిఁ, బేరంటమువచ్చి తనుచుఁ బిలుచను గోపెన్, వైరమున నదితిముక్కున భారతి నాసికయు వీరభద్రుఁడు దుద్రా. శివ. సా. ౩౦౯.

(పేరంటమువచ్చు = పేరంటమునకు వచ్చు అని భావము )

౩. చిరంటితనము, ఐదువతనము.

సీ. . చిరంటితన మెసఁగుఁ బేరంట మనఁగ

ఆం. భా. ౨ ౧౦౬.

పిలువని పేరంటము = అనాహూతముగా, అప్రార్థితముగా

చ. పొలయలుకాని యున్న ప్రపుఁబోణులు ఖండితనాయికాలలా,మలు మదిరియ్యకోల్ వలయు మానిను లేఁటికి వచ్చెనమ్మ కాఁ, బిలువని పేరటం బనుచు బెగ్గిలి సాధులఁగాఁగి

లింపఁగాఁ, బొలుపుగనందుఁ బెండ్లినడుపుల్
నడుపున్ వలినాలి తెమ్మెరల్.
విజ. వి. ౧. ౧౩.

సీ. సిగ్గుమాలి, పిలువని పేరంటమలవుమై
నిందఱు నవ్వఁగాఁ బఱతెంచి
రుక్మా. ౫ ౭౭.

౫. పేరఁటాలికూఁ, పేరఁటాలు.

**పేరఁటాలికూర.** వి. (√ పేరఁటాలు.) ఒక దినుసుకూరాకు. (శ. ర.)

**పేరఁటాలు.** వి. ఔ (పేరఁటము + ఆలు, బ. పేరఁటాండ్రు, పేరఁటాండ్రురు.) పేరంటమునకువచ్చు చిరంటి, ఐదువరాలు

గీ. రిక్కరాయుఁడు దిమిదిమిఱ రేవెలందిఁ, బెండ్లి
యగునని కడచను పేరఁటాలు, మొనసి
యొకరినీటికై ముంచు పసిఁడి,కుండయనఁ
బ్రొద్దు మున్నీటఁ గ్రుంకెనంత.
ఆచ్చ రా అయో. ౧౨

క. చెలరేఁగి రెండుతోయం,బుల పేరంటాండ్రు
చిత్తముల నెంతయు వేడ్కలుమీఱఁ జల్లు
లాడిరి, తలఁకక యభినవశుభాతురప్రాతము
నన్. కళా. ౪. ౬౦

ద్వి. పేరఁటాండ్రొగిఁబాడు పెండ్లిపాటలకు,
శారికాకీరముల్ సందిడిసేయు
రం. రా బాల ౩౮. పా. ౨౮. పం.

గీ. పేరఁటాండ్రుగు హస్తపంకేరుహములఁ,
బూఁచియెత్తిన కనకంపుఁ బూఁజెగుండ,
లున్నతస్తనములుగాఁగ నొప్పు మిగిలెఁ,
దరుణియును బోలె నృపగృహద్వారభూమి.
నైష. ౬. ౭౨.

౨. మృతచిరంటి, మరణించి సూత్రరూపము నొందిన సువాసిని.

సీ. మృతచిరంటికి నాఖ్య లెసఁగుఁ బేరంటాలు
నాఁగను . ఆం. సం. కూడ. ౪.

ఉ. నిన్నటికేయి నా యెదుట నిల్పఁజాలా కల
లోన మీకు మేల్,పన్నెదు పేరఁటాల్
నిలిచి బాపఁడరెడ్డికిఁ దెల్పరాదన
న్నెన్నన్నడుఁదిన్నెఁబెట్టి నుతియించుచుఁ
గొల్వ రటంచుఁబల్కె . శుక. ౨. ౨౨౧.

**పేరఁబడు.** అ. క్రి (పేరన్ + పడు, స్వార్థమున.) దట్టముగాఁ గూడు, సంఘీభవించు

క. కరిమదగంధమునకు మధుకరములు పిండు
కొని మునరి కటితటముల భ్రామరిమయ్యె
నగతటంబులఁ, బరువడి మొగులెఱఁగి పేరఁ
బడినవిధమునన్. క. సం. ౧. ౭౦.

**పేరకమ్మ.** వి ఒకానొకనది

గీ, బెరసి వెన్నెల గాయంగఁ బేరకమ్మ, పులిఁ
తలముల నాయూయి కొలము లెటేఁగి,తాల్పు
కస్త్రాస్త్రములు జారదంపతులకు, నసమ
బాణుండు తిరునాళ్ళ నన్నివాళ్ళ .
క్రీడా. ౨౧౩.

**పేరగు** అ. క్రి (పేరు[1] + అగు.) ప్రసిద్ధికెక్కు, విఖ్యాతమగు, గొప్పదగు.

గీ. మఱియుఁ బేరగు తులువల నుఱుముసేసి.
నీలా. ౧. ౩.

రగడ. పేరైననూరత్తుపింగాణిగిన్నియలు .
హంస. ౩. ౩౫౬.

ఉ. . కడుఁ బేరగునట్టి తపంబుసేసి యుద్దామ
విభూతి నింతటిపదంబు భజించెద .
హరి. ఉ. ౪. ౪.

**పేరజము.** సం. వి. అ. న. = పేరోజము.

**పేరడఁగించు** = పేరడఁచు. స. క్రి. (√ పేర డఁగు.) సంహరించు, చంపు.

ఉ. కారణమానుషత్వమునఁ గంసుఁడు లోనుగ దుష్టదైత్యులం, బేరడఁగించుచుండెడు వీటు

పృథ్వీజనించినవాని వాదిపం, శేరుహాసాభుఁగా
నెటేఁగి హరి. ఉ. ౧. ౪౦.

పేరడఁగు. అ క్రి. (పేరు¹ + అడఁగు) రూపఱు, నశించు.

(చూ. పేరడఁగించు, పేరడఁచు)

౹ పేరడఁచే = పేరడఁగించే. (√ పేరడఁగు)

గీ. వసుధలోపల నిరువురు వాసుదేవు, లున్నఁ
దడఁబాటుగాదె యే నొక్కరుఁడన, పేరు
సెల్లింతు నని వీనిఁ బేరడంతు, మెచ్చి
భూపాలు రెల్లను బిచ్చలింప.
హరి. ఉ. ౭. ౬౩.

పేరడవి. వి. (పేరు¹ + అడవి) అరణ్యాని, మహారణ్యము.

చ కోమలభాస్కరుం డసం, బడు వతఁ
డొక్కనాఁడు తనబాలసఖుండును దానుఁ
గూడి పేరడవిఁ జరించుచో ...
భోజరా. ౫. ౭౧౭.

క. పేరడవిలోన రాఁగా, నీరజహితుఁ డస్త
మించి నెటే నఖిలాశా, పూరితమై తమ
మెచ్చెను విక్ర. ౫. ౧౫౫.

సీ. . పేరడవి నాఁగను వరణ్యాని చెలఁగు.
ఆం భా. ౭. ౩౪.

పేరణము¹ = పేరణి¹. వి. ఖాండోపరినృత్యము, నాట్యభేదము.

గీ. ఒండుపనులకు నాకు సెలవు లేకునికిఁజేసి,
యభ్యసించితి శైశవమాదిగాఁగ, దండ
లాసకవిధమును గుండలియును, ప్రేక్క
ణంబుతోఁబగును బేరణంబు.
భార. విరా. ౧. ౭౪౦.

సీ. పడఁగు పన్నగరాజు పడగలమీఁద సర్పం
సహాకాంత పేరణము సూప ...
ఉ. హరి. ౪. ౭౧౭.

క తాటించెఁ బేరణము నా, సొప్ఫటించెఁ గిరీటి
వక్షము వృషాంకుఁడు . .
హర. ౩. ౭౭.

పేరణము² = పేరణి². వి ౧. కవచము.

సీ . పేరణ మనఁగను బేరణియన, మైమఱు
పనఁగను కవచంబు శోభిలు .
ఆం. భా. ౭. ౭౦౪.

౨. అవిక.

క. కారణములేని నగవును, బేరణమునులేనిలేవు
పృథివిస్థలిలోఁ, బూరణములేని బూరెయు,
వీరణములులేని పెండ్లి వ్యర్థరా సుమతీ.
సు. శ. ౩౭.

పేరణి¹ = పేరణము¹, పేరిణి, పెరవణి.

వి (సం. ప్రేంఖణీ. క. పేరణి) నాట్యవిశేషము, ఖాండోపరినృత్యము.

సీ. నాట్య భేదంబుల నామము ల్దనరు జక్కిణి
గుజరాతి పేరణు లనంగ.
ఆం. భా. ౧. ౧౩౦.

ఉ. పేరణి దండలాస్యమును జక్కణి కుండలి
నాఁ జతుర్విధో, దారములైన నాట్యముల ...
నాట్య. ౩. ౫౧.

లయగ్రాహి. చారుపద నూపురము లారభటి
మీఱు మణిహారములు చన్నవలఁ దారసిల
మేలా, యఖ్యారముల నచ్చరలు పేరణి
నటింప ... ఉ. రా. ౭. ౧౧౫.

ద్వి. కాదలిక పేరణి గోపెఁ జంద్రరేఖ..
వరుస నటించిరి వన్నె మీఱఁగను ..
రఘునాథా. ౭. ౭.

పేరణి² = పేరణము². వి. ౧. కవచము.

౨. అంగీ, మోఁకాళ్లదాఁక వ్రేలాడు చొక్కా.

మ. తల విద్దాతగటీలు పేరణులు పైదట్లుగా
రుమీమారక,త్తులు జోళ్లం బదనించినట్టి
కరహేతుల్ తక్కు గుల్కంగ

రా. వి. ౨. ౫౬.

విణ. సాంద్రము, దట్టము

ఉ. పౌరుల సాధువాదములు బాంధవకోటి
ప్రమోదభావలుగా, వార వధూవిధూవక
జనంబుల నాగరకంపుమాటలుం, పేరణియై
దిగంతములఁ బిక్కటిలంగ

భోజరా ౪ ౭౭

**పేరణి.** సం ॥ ఇ ఈ. స్త్రీ. నృత్య విశేషము
(విల్యమ్సు)

**పేరము = పేరెము.** వి. (సం ప్రేంఖా)
రేచితము, గుఱ్ఱము మున్నగువాని గతివిశేషము.

గీ. శంకరుఁడు నందిపై నెక్కి హుంకరించి,
యతిశయార్భటిఁ, గవ్వన నార్చి పేర్చి,
చౌకళింపులు దుమికించి చక్రగతులఁ,దరిమి
పేరంబు దోలుచు నరిగె నని.

అని. ౪. ౪౬.

జః పేరములువాఱు.

**పేరములువాఱు = పేరెములువాఱు.**
అ. క్రి. (√ పేరము.) పరుగెత్తు, భావవిశే
షముచేయు.

సీ. కలరవంబుల రకంబులు పికంబులు గేర
రమణఁ గీరములు పేరములువాఱె.

భద్రాపరిణయము. ౧. ఆ.

వ. . గోవిందునిసేవకులు ఛ్యారఁగూడక
పేరములువాఱిచారి రుపాకులు సంధించిన
మేనులు వంచి బొంకించి నాగదత్తుండు
తనబలంబుల నెచ్చరించి ...

ప్రబంధ ౫౭౭.

**పేరాముట్టి.** వి. ఒకజాతిమెుక్క.

సీ. కేతి,టీఱ పేరాముట్టి పీఁచర ములు
గాలిమిడి చేదుపాట్ల యుమ్మెత్త తిప్ప,
తీఁగె

హంస. ౪. ౧౦. (కొత్తప్రతి. పా.)

**పేరాముదము.** వి. (పేరు[1] + ఆముదము) ౧.
రక్తైరండము. కీ. (శ ర.) ౨. రక్తైరండ
తైలము. (శ ర.)

బ. పేరాముదాలు = పెద్దాముదపు గింజలు.
(తదితరమైనజాతి చిట్టిఆముదము శ ర)

**పేరాయఁడు** వి ఒకానొకజాతి కొండదొర.
(బ. పేరాయులు.)

రగడ కొండలగ్గలఁరకుగోనని పేరాయలును
దండివనమార్గభేదకులైన కోయలును.

పి. శరం 3. ౨౫౬.

**పేరాలము.** సం. వి. అ. పుం. పేతధూమలము,
పసుపు పొగరంగు కలిసినరంగు. (వై. ని.)

**పేరిణి = పేరణి[1].** వి. నాట్యవిశేషము, భాండో
పరి నృత్యము.

క. చెలి తకతోం తకతోంత, త్తళంగతోం ధ క్త
తోం దదధిగిణతోమం, చలవోక దీటుఁ
బేటిణి, వెలయించుచుఁ జూచువారు విస్మయ
మందన్. దశా. ౭. ౨౯౧.

ద్వి. కోలాటమును బాత్రగొండ్లి పేరిణియుఁ,
గేళిక కోకరై లీల నటింప.

బస. పు. ౧. ౧౨. పా. ౫౨౯. పం.

సీ. పేల యురు మురుములీలఁ బేరిణి నగఁ బద
ఘాతమున శబ్ద మొందవఁజేసి.

ప్రబంధ. ౧౦౯.

**పేరిమికాఁడు.** విణ. [(√ పేర్మి(రిమి[1])] గొప్ప
వాఁడు, ఘనుఁడు.

క. ఎనలేనిగొనబుకాఁ డా, పెనుమినుకుం
జిగి లో వొగడుపేరిమికాఁడా ...
అచ్చ. రా. కుం. ౧౭౧.

(శ. ర. పా. పేరిమివాఁడా. ముద్రి.)

పేరీఁదు. వి. (పేరు¹+ఈఁదు².) ఖర్జూరము. శ్రీ.
(శ. ర.)

పేరు౹. అ. క్రి. (క. త. పేర్.) ౧. అతిశ
యించు, మించు.

ఉ. ఆ రమణీలలామ హృదయంబున నాదట
లంతకంతకుం, బేరఁగ నింపు సంతసముఁ
బెంపు వహింపఁగ కేయూర. ౪. ౫

చ. బెడిదపుకొండ పెక్కుసెకలఁ బేరిన వేదనతాప
గాముణుల్, వడి బెడిపోవువేళ విడువంబడి
శోషితజీవపంబులై. చంద్రా. ౨. ౨౧

ఉ. వాఁడు ప్రాణముల నిల్పినఁ జాలిటఁ
దెచ్చి వెజ్జులం, బెట్టిగుణంబు చేసి మదిఁ
బేరిన కెంజిలి దీఱ వానికేఁ, బట్టముగట్టి
సారంగ. ౩. ౨౨౭.

౨ సాంద్రమగు, దట్టమగు.

ఉ. .. సర్వజంతుసం,చారవిహీనమై రవి
నిశాకరదీప్తులు లేక చీకటుల్, పేరినయొక్క
చోటు గని పెద్దియు విస్మయమంది
యందిలున్. హరి ఉ ౧౨ ౧౯౪

ఉ. పేరినఘోరవెంద్రుకలు చీఁటలువాఁడని
దీర్ఘకాయముల్ కగ్గిన బ్రహ్మరాక్ష
సుం,డు దశకు. ౧౦ ౬౪.

చ. .. తమంబును బేరె దిక్కులన్.
ఉ. రా. ౫. ౨౩౯.

౩. ఘనీభవించు, గడ్డకట్టు, తోడుకొను.

గీ. సాగరమునీరు పేరుట శైలకులము, లెయవు
లిచ్చుట . ఉ. హరి. ౨ ౫౬.

ద్వి. వడి వధ్యశిలలపై వడిసి యుండంద, మడువు
లై పేరినమనుజరక్తములు.
ద్వి. హరిశ్చ. ౧౬౩౪.

సీ. పేరి పక్వంబైన పెరుఁ గుండఁ గవ్వంబు
పులిచల్లలో మంచి చిలుకఁబోవు.
శుక. ౨. ౫౬౧.

విణ. ౧. పెద్దది, గొప్పది.

క. . వరము గోరు పవూగోత్రము నీ,దవిత
శుకంబు మహీజం,బునకుం బేరలమి వేఁడె
భూపవరేణ్యా భార. అను ౧ ౧౫౪.

క. ధారుణిఁ బడియెడువు లిభాం,కారధ్వానం
బుచేయఁగా వినుచు నమో,నారాయణాయని
ముని, పేరలుఁగున నుగ్గడించె భీతాత్మకుఁడై.
వరాహ. ౪. ౭౧.

౨. శ్రేష్ఠము, మంచిది.

సీ. వలపార ననుఁజూచి కిలకిలనవ్వఁ
బేరైనముత్యాలపేరు విను.
గవిక ౫. ౧౪౨,

౨ వృద్ధము, ముసలిది.

మ డెందంబునన్ రాజనం,దను
చూపొప్పరయ నేఁడి పేరలుఁగు నిద్రన్ మేను
తూఁగాడెనున్ విక్ర ౩ ౯౮.

క్రి విణ. అత్యంతము, మిక్కిలి

గీ ననలఁ బే రసఁగ పవనములు నమేరు
రతోవృష్టి బూది చులువ
ఆము. ౫. ౧౮౩.

వి. పే (క పెసర్ త. మ పేర్) ౧.
నామము, నామధేయము

వ. . ఉంగిడి యదురుఁద్రిక్కు యనువానికి
నా పేరు పెట్టినం జాలు
భార. విరా. ౧. ౨౭౬.

క. విను తీర్థయాత్ర చని యేఁగ నుత్తమంబైన
బదరికాశ్రమమున నొక్కనిఁ గాంచితిఁ
గృశగాత్రునిఁ, దమఁ దను పేరింటివానిఁ
దాపసవర్యుఁ. భార. శాం. ౩. ౧౫౫.

గీ. కామసంచారహరణ ప్రగల్భమైన, శాస్త్ర
మను పేరి యధిక లోచనము కలిమి
నైష. ౧. ౪౪.

గీ. మధువుఁ గాంతలపుక్కిటిమధువుఁ జెల్లి,
యార్ద్రశ్రీఁ బసనూపఁ బొగడపై నెలయ
దాన, విరిసెఁ దొల్లిటిదళములు విరులు
జడిసె, దీన వగ్గలుపడకు నుల్ల కేఁటులార్పె.
ఆము. ౫ ౧౩౦

(దీని యామ్రేడితరూపము పేర్వేరు.)

సీ. దాదులు పేర్వేర ధరణీపతులఁ జూపి
చెప్పంగఁ జూచుచుఁ జేతఁ బుష్పమాలిక
యొప్పు భార శాం ౧. ౭౯

(పేర్వేరన్ = పేరుపేరు వరుసను, ప్రత్యేక
నామములతో)

సీ. పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వియ్యంబు లందు
భాగ ౧౦ పూ. ౧౬౭

౨. (పేరుగల మనుష్య దేవతాది) వ్యక్తి.

గీ. ఇంక నీయజ్ఞఫలము నీ కిచ్చువటి, పెపె
లెవ్వ రీ వచ్చినపేళ్ళయందు
కు సం. ౨ ౧౫౯

ఉ. భారతికి గాదిలి ముప్పురతో ల్లపేరు
వి,త్యమ్ముగ నాయుపీయుతఁ గళా
ధ్యుఁడు. హరి పూ ౧ ౩.

వ. కమ్మసారి పేరు ౧ టికి చిర (మె)ట్టు
వరి వడ్లినకేలకు పుట్టి ౧ ట్టికి చి ౧౦ కొడ
మంగ్గలి పేరు౧ ట్టికి (దా శా. ౧౩౭౪)

౩. శబ్దము, మాట, సమాచారము.

చ. . . ఎయ్యెడలందుఁ జండికాయతను
పేరు లేక ఖిలమై చనఁ గూల్తునో ...
కళా. ౭. ౨౭.

క. మూపాలు పొంకింతఁ గమఁగొని, తాపసుఁ
డట వలపుపేరు దైవ మెఱుంగుఁ, శాప
మొఁగఁ మకరులుగాఁ, గోపరసావేశ
రూఢుఁ కుటిలేక్షుఁడై. రాజ. వి. ౨. ౫౭.

౪. కీర్తి, ప్రతిష్ఠ.

క. ఉక్కఁతి సురపతికైనను, ప్రొక్కము
నృపధర్మ మూఁది మొనలఁబడినన్,
మిక్కిలిపేరును నిట దివి నక్కజముగఁ
బెంపుఁ బడయనగుట నుపేంద్రా.
భార. ఉద్యో. ౩. ౩౭౦.

మ. సరో,జభవుం డింద్రుఁడు లోనుగాఁ
గల మరుత్సంఘంబుతో సేఁగుదెం,చె
భువిన్ పేర్కొలసంయమాంగ్రాతతి వచ్చెం
పేర్పు మోరంబునన్
హరి. పూ. ౧. ౧౧౧.

౫ రూపము, మిష, వ్యాజము.

కి. గురుఁ దల్లిని దండ్రిని సోదరుగ నకారణము
ప్రల్లదముఁ బల్కిన దుష్కరుచేత నూఱు
పణములు, ధరణీశుఁడు గొనుట నీతి దండువ
పేరు విజ్ఞా. ప్రా ౪౩

సీ. తలిరుజొంపము పేరఁ బులకాంకురము
లూనుఁ బువ్వులపేర లేనవ్వు నవ్వు.
కవిరా. ౫. ౩౪.

క ఆ చపలాక్షికిఁగా మన,కీచకు లందఱను
రాత్రి గీటడఁగించె రహిఁ, సోచితవిధమున
గంధర్వాచరణముపేర భీముఁ డతి భీమము
గాన్. భార. విరా. ౫. ౩౩౧.

చ. కలయఁగ మంచిలగ్న మిది గట్టిగ పే గడ
లెన్నియయ్యెనో, తెలిపెద నంచు నోర్తుఁజను

దేర వదమున రూాత్ర కెచ్చెలిం, విలిచెద
వంచు గోత్ర నొకొకే రిడి వా రటు శేఁగి
రంద అచ్చెలియలవెంటనే సగము విగ్గరగాక
రమణీలలామకును విజ. వి. ౩. ౨౧౮.

౬. మాఱు, ప్రతి.

ఉ. ... విమలముక్తాదామమూ .. ప్రమదా
రత్నము పేరుగా నెద నిముం బాటించి
ప్రార్థించెదన్. వసు. ౪. ౧౦౦.

సీ. నావాడపతి పంపినయమూల్య కటకముల్
గర్గపేరుగఁ బదాగ్రములఁ బెనగ.
వసు. ౧. ౧౫.

౭. ఎద, విషయము.

ఉ. .. ప్రభువుల్ ప్రయోజనా, పేక్ష నొకప్పు
డాశ్రితుల పేర సముచితగౌరవోన్నతుల్.
హరి. ౩. ౩౯.

శ్లో. .. ప్రాయశ్చలం గౌరవ మాశ్రితేషు.
సం. కు. స. ౩. ౧.

జ. పేరఁబడు, పేరగు, పేరడఁగించు, పేర
డఁగు, పేరడఁచు, పేగడవి, పేరాముదము,
పేరీఁడు, పేరుంగరము, పేరుకొను, పేరు
కొంచు, పేరుగాంచు, పేరుడు, పేరుపడు,
పేరుపెట్టు, పేరువాడు, పేరువాఱు,
పేరెక్కు, పేరైనవాఁడు, పేరొందు, పేరో
లగము, పేర్కను, పేర్కొను, పేర్కోలు,
పేర్చు, పేర్పు, పేర్పిందువు, ప్రెబ్బొత్తి.

పేరు౨. వి. దండ, హారము.

సీ. పెండెదన్ను పుసుకలనిడుపేరు లొండొంటిఁ
బోరిఁబోరిఁ దాఁకి బొణ్ణొబుఘరివఁగ.
హర. ౫. ౧౬.

సీ. ఉత్తగా రిచ్చిన హారిసుదర్శనపుఁ బేరునకు
ముత్తైదువ వనటఁ బొందు.
కొండు. ౩. ౫౦.

పేరుంగరము. వి. (పేరు౧ + ఉంగరము.) పేరు
చెక్కిన యుంగరము, ముద్రిక. (శ. ర.)

పేరుకొ(ర్కొ,గొ)ను. అ. క్రి. (పేరు౧ +
కొను, స్వార్థకము.) ౧. అతిశయించు, ప్రవృద్ధ
మగు.

వ. పేరుకొను కోరికలు దారుకొన డాయునెడం
బొంగిన యంగంబుల . (పారి. ౨. ౫౨.)

౨. ఘనీభవించు, గడ్డగట్టు.

(వ్యవ.) నేయి పేరుకొనినది.

(వ్యవ.) నీరు పేరుకొని మంచుగడ్డ యగును.

౩. ఖ్యాతికెక్కు, ప్రసిద్ధినొందు.

గీ. అకట వీరవ్రతస్థుండవై జగమునఁ, బేరుకొన్న
వాఁడవు యదువీరుచేతఁ, గోలుపోయితె
నీపేర్మి గోముదక్కి, యెందుఁజేయుదు రింక
నీ రేలుజనులు. (హరి. పూ. ౯. ౧౬౫.)

వ. మును ఘోషయాత్రను బదంపడి గోగ్ర
హణంబునందుఁ బేరుగాంచిన నీకు నిట్లనుట
క్రొవ్వులు దక్కుము పాలు నన్నియును.
భార. ద్రో. ౫. ౯౯.

౪. పేరుపెట్టు, పేకొను.

గీ. పేరుకొని చెప్పె నతని గాంధారి కంత.
భార. ఆశ్ర. ౨. ౩౪.

సీ. పేర్కొని పలుమాఱుఁ బిలిచి రారా యనుట
లేకున్న నయ్యింటిలోఁ గన్న కలిమి.
భార. అను. ౧. ౭౬.

స. క్రి. ౧. పేరుపెట్టి పిలుచు, పిలుచు.

గీ. పతుల నన్నలఁ దమ్ముల సుతుల హితులఁ,
బేరుకొని వారు కొందంగఁ ద్రేముడించి,
సమప్రమంకులు వినువారి మనసుఁ దేల్పఁ,
గురుకుమార నారీజనకోటి వచ్చె.
భార. స్త్రీ. ౧. ౯౭.

ఉ. అమితసహస్రసర్గవిశిఖాయువు నన్నిటూ
తెవ్వఁడోర్కొనా, విమలతపంబు గైకొనక
వృద్ధత నూడక బాలుఁగా నవ,జ్ఞ మిగుల
నిట్లు పేర్కొనియు పర్వపితామహుఁ డిబ్బ
గూలితయున్, సమధికదీర్ఘజీవి యనుకలు
పెట్టక పిల్వఁ డెన్నఁడున్.
హరి. ఉ. క. ౧౦౪.

మ. కని కింసాంతకుతోడ హంసునికి సంగ్రా
మంబు హత్తించి తద్దనుజుం బేర్కొని
యిక్కడిక్కడ ధరద్దిగ్బంబు గ్రక్కింతు.
ఉ. హరి. ౪. ౨౫.

౨. స్తుతించు, పొగడు.

ఉ. కాంచు లేమి నేయుమిరు గాండివఘోషముఁ
బాంచజన్యభీమ్రారవమున్ సహింప దివిజా
వళికిన్ వశమే వినుచ్చరల్, పేరుకొనంగ
నా దృఢకపిధ్వజమైనరథంబుతోడనుం,
బోరి ... భార. ద్రో. 3. 30.

ద్వి. రజనీచరేంద్రుండు రావణుండుండ,
పేరునామని మీరు మిగులఁ బేర్కొంటి,
రి .. (రం. రా. ఉ. ౫. పొ ౨౪. పం.)

3. ఉచ్చరించు, పారాయణముచేయు.

చ. ...లఁ డోకరుండు పేరుకొనఁగానికులంపు
మహీయథ క్తిఁ డి, య్యల (అము. ౬. 3.)

వ. హరికి సమర్పితంబయ్యె ననుచు న ద్దేవుని
సహస్రనామంబులు పేరుకొని.
ఉ. హరి. ౨. ౧౨౫.

సీ. పేర్కొన్నవారికిఁ బెంచికల్పకశాఖ గను
తించువారికి గాఁడినురభి.
వం. రా. ౧. ౪౧.

౪. వచించు, చెప్పు.

క. పేరు ప్రమాదవశంబునఁ, పేరుకొనుట కల్ల
- యయ్యె ... హైమ. ౪. ౫౪.

సీ. శ్రీకాళహస్తీశు శృంగారలాలిత్యకథలు
పేర్కొను కారికాగణంబు.
నృసిం. ౧. ౫౨.

(స్తుతించు. అని. శ. ర.)

౫. తలపెట్టు, ప్రస్తావించు.

క. చుట్టములందూటలాడరు, బెట్టుదఁదురు వాత
వారు పేర్కొన రితరుల్ లేమివంటి
దైన్యము కలదే. సుద. ౨. 3౬.

౬. స్మరించు, తలఁచు.

మ. . మయూ,రని సౌమిల్లి విడండిఁ బ్రస్తు
తులఁ బేర్కొంచున్ వరుభృద్ధికిన్.
మను. ౧. ౬.

పేరుగ్రుచ్చు. స. క్రి. (పేరు + గుచ్చు.) ౧.
పేరుపెట్టి పిలుచు.

ఆ. .. పిలుచ పేర్చె వారడఁబోయిన,ప్రజలఁ
బేరుగ్రుచ్చి పనవిపనవి.
భార. మా. ౧౦౬.

గీ. పేరుదిమ్మన దూతకు పేరుగ్రుచ్చి, తాళ
యడిగినఁ గసరడు తాళుకొనక.
బహు. ౨. ౬౬.

౨. చెప్పు, వచించు, ఉచ్చరించు.

చ. అనుటయు న మ్మునిప్రవరుఁ డాతని కిట్లను
నీవు పేరుగ్రుచ్చిన మవియుల్ల మేల
భార. శాం. ౫. ౧౦౫.

క. గాంగేయయజ్ఞభృత్యకోటిం,గొనియాడుము
పేరత పేరుగ్రుచ్చి కొలువునన్.
భార. ఆశ్ర. ౧. ౬౪.

సీ. తను కోరఁ బేరుగ్రుచ్చినవారి కాయు
రారోగ్య మిచ్చువాఁ డమమును వుచ్చు
వాఁడు. కాం. పంచ. 3. 30౫.

పేరుగాంచు. అ. క్రి. (పేరు + కాంచు.)
౧. పేరుపొందు, నామముపొందు.

:

**పేరువు.** సం. వి. ఉ. పుం. ౧. ఆదిత్యుఁడు. సూర్యుఁడు. ౨. అగ్ని. ౩. సముద్రము. ౪. పర్వతము. (శే. వి.) - పుం., స్త్రీ. గోరువంకపక్షి, కలవింకము. (శే. వి.)

**పేర = పేరము.** (శ. పేర.)

(చూ. పేరలువాలు.)

జ : పేరలువాలు.

**పేరెక్కు.** అ. క్రి. (పేరు¹+ఎక్కు.) విఖ్యాతమగు, ప్రసిద్ధినొందు.

సీ. శబ్దతర్కాదిశాస్త్రప్రసంగములఁ బేరెక్కిన విద్వాంసు లొక్కచోట.

చం. రా. ౧. ౨౬.

ఉ. ... జగంబులోనఁ బే, రెక్కినదానవంచు . కాంతల గణించుమ సత్య .

పారి. ౧. ౭౬.

**పేరము = పేరము.** వి ౧. రేచితము, గుఱ్ఱము మున్నగువాని గతిభేదము.

సీ. ... పేరము లేడెయు జాతెము బవిరి వాకేచితంబు విలసిల్లు. (ఆం. భా. ౨. ౧౯౫.)

౨. గుఱ్ఱపుపరుగులవంటి యోధులధావనము.

తగడ. కోలతో విల్లు దగఁగొని కత్తిపేరములఁ గాలుకోలఁదిని బఱచు కిదనప్రకారములు.

పి. శమం. ౩. ౨౨౪.

౩. పరుగు. (శ. ర.) ౪. శృంగార విశేషవిశేషము.

గీ. సొగసు తెలి వాలు మునుసోగసొంపు తళుకు,తళుకు చికిలి యొయ్యారంపుఁ బేరమురుటు, పొలఁపు విడియంపుదేలింపు చుఱుకు టోక,కిలికి తెత రెప్ప చూపుల కిలికిఁ జూచి. ప్రబంధ. ౧౦౬.

జ. పేరమువాలు, పేరముకట్టు.

**పేరము(లు)వా(ల్వా)లు.** అ. క్రి. (పేరము+వాలు.) ౧. (మృగ ఖగ నరాదులు.) పాఱు, పరుగెత్తు.

(మాయాకురంగము) సీ. చిత్తరంబులు గాఁగఁ బేరముల్వాలుచు హరిశ్చ. ౨. ౪౯.

వ. నిపాతిత వసుంధర నింగిఁ బేరంబు వాలు వాహనహంసంబువలనను .

పారి. ౫. ౧౩.

(పావురము) లయగ్రాహి. పేరములువాలు . సమీరుని పొటాపొటిని గొడిములాడుచు.

సారంగ. ౧. ౧౨౧.

సీ. కడుఁ బేరములువాలు గండుఁదుమ్మెదచాలు కడకంటిచూపుల బెడఁగు నడఁప.

ప్రభా. ౩ ౧౯.

(మనుజాశనుఁడు.) సీ. ప్రజలపైఁ బేరముల్ వాతి పొతి (మనుచ. ౪. ౧౧౩.)

క. పేరంబువాతి హల్లకి, కోరక కుంతంబుఁ గేలఁగొని భీషణ హుం,కారంబుమీఱ నదలిచి, క్రూరత న హ్మానిమది మఱుక్కనఁ బొడువన్.

చంద్ర. ౨. ౧౭౦, ౧౭౧.

౨. ఉఱుకు, గంతులువైచు.

సీ. జల్లులతోడి కెన్నల్లెంబు లెగవైచి పట్టుచుఁ బేరముల్వాలు వారు. (కళా. ౮. ౪౧.)

వ. (కెన్నెల.) ... అతిప్రబంధగంధోత్తమ గంధాను బంధురలగు సింధురయానల యూధ స్తనాపాముణి ప్రభా స్తబకింబుల నల్లికిత గల్లసిత లోధ్ర చూర్ణంబుల నుణ్ణుమితా

వటు విలంబివారంబులఁ బేరంబులువాఱెనో
యన . వసు. ౪. ౭౩.

3. ప్రసరించు, వ్యాపించు.

సీ. రత్నాంగుళీయకప్రభ పేరములువాఱఁ గెలి
పద్మంబు కెంగేలఁ ద్రిప్ప.
కళా. ౫. ౧౧౨

**పేరముపె(వ)ట్టు.** అ. క్రి. (పేరము + పెట్టు.)
పరుగిడు, పరుగెత్తు.

ద్వి. ధీరుఁడై నిజఖడ్గదీప్తులు నిగుడఁ, జాటి
పేరముపెట్టి సుడిగొని నొడిసి,పట్టి కూఁతలు
బెట్ట బలువిడి పోఁది.
ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౫౫. పం.

సీ. దట్టించి చంగునదాఁటి పేరముపెట్టు నీడల
నంతంత నిలిచి చూచు.
అచ్చ. రా. ఆర ౪. 3.

**పేరెలువాఱు.** అ. క్రి. (పేరము + పాఱు.)
పరుగులిడు, గంతులువేయు.

ద్వి. గములు,గిట్టి పేరెలువాఱి తిటలు ద్రోచి
దట్టంబులై సముద్ధతి సేఁగుదెంచి.
పండితా. పర్వ. 3౭౦. పా.

గీ. మంజుమాకందమంజరీపుంజచర్వ,ణక్రియాకుంఠ
కలకంఠనాదసరణి, నాలకించిన మరుఁ డంత
వంగ, వసుధఁ జెలరేఁగి పేరెలువాఱెనన్న.
చమ. ౧. ౪౯.

**పేరైనవాఁడు.** విశే. (√పేరగు.) విఖ్యాతుఁడు.
గీ. ...ఖ్యాతసంజ్ఞ,యగును బేరైనవాఁడు వాసైన
వాఁడు, మంతుకెక్కినవాఁడు నా మాత్ర
భూత. ఆం. భా. 3. ౪.

**పేరొందు.** అ. క్రి. (పేరు[1] + ఒందు.) ప్రసిద్ధి
కెక్కు, ఖ్యాతిగాంచు.

సీ. ఏ భూసురశ్రేష్ఠుఁ డిలలోనఁ బేరొందెఁ
గాశికామాహాత్మ్యకథ రచించి.
ఇందు. ౧. ౭.

**పేరోజము = పేరోజనము.** వి. ఒకజాతి గరుడ
పచ్చ.

గీ. పేరోజంబు మణుల మొగముట్టు
మనుచ. ౪. ౭౭.

(శ. ర., చి. ని. పా. పేరజము ము(ద్రి. పా.)

**పేరోజనము = పేరోజము, పేరోదనము.**
వి. (సం. పేరోజమ్.) గారుత్మతమణివిశేషము,
ఒకజాతి గరుడపచ్చ.

సీ. నడిచక్కిఁ బేరోజనపుఁజెక్కడపుఁబైఁడి
పళ్లెంబు ముక్కాలిపై ఘటించి.
దశా. ౭. ౨౭౭.

**పేరోదము.** సం. వి. అ. న. ఉపమణిభేదము.
(వాచ. కల్ప.)

**పేరోదనము = పేరోజనము.** వి. ఒకజాతి
గరుడపచ్చ.

సీ. గారుత్మతం బొప్పు గరుడపచ్చ,యనఁ
బద్మిరాగాఖ్య యగును బేరోదనం బన ...
ఆం. భా. ౭. ౭౩౬.

**పేరోలగము.** వి. (పేరు[1] + ఓలగము. క. పేరో
లగవు. త. పేరోలక్కం.) పెద్దకొలువు, (ప్రభు
వులు చేయు) మహాసభ.

గీ. ఏఁగి పేరోలగమున దేవేంద్రవిభవ, మొసఁగ
మొసఁగంగ వసియించి
ఉ. రా. 3. ౨౫౭.

వ. ఆ రాజన్యుండు పేరోలగంబున రత్నసింహాస
నాసీనుండై యున్న యవసరంబున.
విక్ర. ౭. ౭౦.

సీ. ఆస్థానసంజ్ఞ యై యలరు కోల.
గీ. గమ్మ కోలలు వన నది మించి కానిపింపఁ
బోలుఁ బేరోలగమ్ము నొడ్డోలగ మన
ఆం. భా. ౨. ౧౪౧.

పేర్కొను. అ. క్రి. (పేరు¹ + కను) ఖ్యాతి
కెక్కు, ప్రసిద్ధినొందు.
గీ. .. జగంబుల నెల్లఁ బేర్కొనినబుధులు, వారి
సప్తర్షిగణ మంద్రు కౌరవేంద్ర.
భార. అను. ౩. ౨౦౭.

పేరో(రుకో)లు. వి. (√పేరుకొను.) పేరు
కొనుట. (శ. ర.)

పే(రుచే)ర్చు. అ. క్రి. (పేరు¹ + చు - స్వార్థ
మున.) ౧. అతిశయించు, వర్ధిల్లు.
చ. . పైకొనుతలఁ పొరగించు మదిఁగోర్కులు
పేర్చిన నప్పళించు
బార. విరా. ౨. ౩౧.

క. దైతేయులు దానవులును, ఘోరనిశాచర
పిశాచములు తద్దయు సంప్రీతిం బొదలఁగ
నాతని, యాతతసామ్రాజ్య మంతకంతకుఁ
బేర్చెన్. నృసిం. ౨. ౧౧౧.

౨. చెలరేఁగు, విజృంభించు.
గీ. విశిఖనవకంబు నాఁటించి వెగడుపఱచి, పేర్చి
యార్చిన సురకోటి పిచ్చలించె.
భార. భీష్మ. ౧. ౨౪౨.

శా. ఆమాట ల్విని పాకశాసనుఁడు రౌద్రా
కారుఁడై పేర్చి పారి. ౮. ౬౦.

౩. ఉబ్బు, పొంగు.
క. చారుమనస్సమ్మదరసపూరము వెలిపేర్చునట్లు
పొలఁతికి విగళిద్భూరి సుజనిత పయో,
ధారలు నానందబాష్పధారలు నొప్పెన్.
భార. ఆది. ౬. ౨౦.

౪. ఉప్పొంగు, సంతోషించు.
శా. శర్వాణీ స్తనచక్రవాకములు వక్షస్స్ఫారశా
సారముల్, గర్వం బింపెసలారఁగాఁ దఱిసి
పేర్కొల్ నల్ప రోమాంచముల్, సర్వాం
గీణముగా ధరించికొని యిచ్చం బేర్చు
కంఠుండు. హరి. పూ. ౧. ౨.

ఉ. ... అం,పె యని చీరి హా ప్రమదచుఁ
బేరిచి మూర్ఛనొని పంచితిల్లి.
భాగ. ౧౦. పూ. ౫౧౯.

స. క్రి. (√పేరు¹.) ౧. ఒకదానిమీఁద
నొకటి యేర్పఱుచు, అమరుచు.

వ. .. కిసలయతల్పంబులకు నిట మున్న
సహాయుండ నగు నీకుఁ జితం బేర్పంజాలఁ
వచ్చె నే. హర. ౩. ౯౩.

వ. ... సరయూతటంబున సౌద పేర్చి యం
దా రాజశవ మిడి ...
భా. రా. అయో. ౨౩౪.

౨. కూడఁబెట్టు, నిలువచేయు.
క. తరువంబెట్టినబాణల, పెరువులు మును గిలక
రించి పేర్చినవెన్నల్, మరువు లెసఁగఁ
గ్రోలి. హరి. పూ. ౫. ౨౦౩.

౩. అధికముగఁజేయు
క. ఇది యెంత పేర్చెదరు మ్రొచ్చదివినయూకశనా
శాను జదివినయది మ్రానుదతియు నెందల
ఫలించెన్, ఏదకీప్సము పెద్దపిన్నతనముల
వరుసన్. ప్రభా. ౫. ౪౮.

వి. పెంపు. అతిశయము.
చ. అనిశము గ్రమ్ము పుష్పమధు వర్షజలంబుగ
చుట్టునుండి పేర్చున రతితోడిసంబెరము
చూపు విధంబునఁ బొల్చె భుజముల్.
ప్ర. సం. ౫. ౫౬౨.

ఉ. .. మారగాయలుం, గోయుచు సత్కృనం బులంలగోళులం దోళులం గొంచుం పేర్పునన్, గూయఁ జంపి యేనుఁగుల కొమ్ములు సెమ్ములు గొంచు .

కు. సం. ౬. ౬౯౨.

చ. ... పేర్పునఁ బ్రతిలేక గిర్జ నతిశూరుఁ కుమారు నడల్చి శాఁక . అసురాగ్రణి తారకుఁడు .. (కు. సం. ౧౨. ౯౫౦.)

**పేర్పు(రుపు).** వి. (√పేర్చు.) ౧. అతిశయము సమృద్ధి.

క. పేర్పున భుజించి సుఖసం,తర్పణు లగు మానులకు ముదం బొనరించెన్, గర్పూర ఖండతాంబూ, లార్పణములఁ బారితోషి కాదులవలనన్. శై. భా. ౬. ౯౩

౨. ఒకదానిమీఁద నొకటి యుంచుట.

(వ్యవ.) ఇటుకావళ్ళ పేరుపు బాగుగా నున్నది

౩. ఘటవిశేషము, దాఁక.

గీ. ఒపఁగి రుమిడ పేర్పులోఁ గాఁగు చున్న యూల పాలు ... పాండు. ౪. ౧౩౪.

ఉ. ఆరయ స్వేదనాదివిధు లన్నిట నూతము మందవీర్యమా, ధారుణిలోఁ గళోధనవిధం బొగిఁజేయుఁడి యుప్పుపోసి యా, పేరుపు లోనఁ బారదము పెట్టి జలంబులు సల్లి మూసు డిం,పారఁగ మూసి మీఁద లఘు పైనపుటం బిడి వండఁగాఁ దగున్

నూతనప్రదీపిక. (చి. ని.)

**పేర్చిందు(వు).** వి. (పేరు¹ + బిందువు.) ఘర్మ బిందువు, చెమట బొట్టు.

సీ. వలవడిఁ దొరఁగు పేర్చిందులతోడన కన్నీరు ధారలఁ గదలుకొనఁగ.

కు. సం. ౫. ౫౪౯.

గీ. తలఁకి కనుఁగవఁ గన్నీరుధార లొలుక, పొనఁ బేర్చిందు లురులంగ మొలఁకవాలిచె.

కు. సం. ౫. ౫౭౪.

గీ. వరదుముఖదీప్తి వెడలి పార్వతీముఖంబు, ప్రీతి విలసిల్లఁ గలయఁ బేర్చిందులొనఁగె.

కు. సం. ౫. ౫౧౬.

**పేర్మి¹(రిమి).** వి. (క. పెర్మెక. ఫెరుమై.) ౧. అతిశయము, పెంపు, అభివృద్ధి.

ఉ. అర్మిలి నిల్పి యాగియుఁ బ్రియంబును నా రయిడ నాఁడునాఁటికిం, బేర్మి వహించుచుండె నడపెం దనతమ్ములలోనివానిఁగాన్.

భార. విరా. ౧. ౭౭౪.

క. . ఘనసం,తాపంబు పేర్మి నితర,వ్యాపా రము మానియుండె హరియును నచటన్.

పారి. ౧. ౧౦౭.

ఉ. ఆదర మింతలేక నరుఁ డాత్మబలోన్నతి మంచివారలన్, ఖేదము చేయుటం దనదు పేర్మికిఁ గీడగుమూల మె ట్లను,ర్యాద హిరణ్యపూర్వకశిపుఁ డనుదానవుఁడు గుణాధ్యుఁ డైన ప్రహ్లాదున కెగ్గు చేసి ప్రళయంబును బొందఁడె మున్ను భాస్కరా.

భా. క. ౧౦.

౨. గౌరవము, గొప్పతనము.

క. ధర్మతనూభవుడెస దుష్కర్మము రూపించి సభ నొకండును మైమైఁ, బేర్మి సెడక పోనే ర్చునె, ధార్మికు లింకెట్టివారు తథ్యం బర యున్. భార. ఉద్యో. ౧. ౨౫౫

క. అందుఁ గుచేలుండను ముని,నందనుఁ డొక్కఁ రుఁడు దినదినము హరిసేవా,నందంబున సకలేంద్రియ,బృందముఁ బరితృప్తిఁజేంచి పేర్మి వహించున్. కుచేల. ౧. ౭౫.

జ: పేర్మికాఁడు.

పేర్మి¹(రిమి) = పెరిమ. వి. (సం. ప్రేమ.) ౧. ప్రేమ.

క. ధర్మార్థకామమోక్షద,కర్మంబుల శైశవాది కాలంబుల నీ, నిర్మలభక్తియెుఁ గల్గఁగఁ, పేర్మిం గృపసేయు మదియె ప్రియము మునుంచా. వి. పు. ౨. ౫౪.

గీ. అర్యపైఁ బేర్మి యొట్టిదో యద్రియింట, నిల్లటం బుండెఁ ద్రిభువనాధీశ్వరుండు. హర. ౫. ౪.

౨. ఆసక్తి.

ఉ. పేరిమిలో వలంబడినచెట్టయుఁబోలె నపార ఘోరసంసారమిరింతపాశములసందు దగు ల్పడి నే భవత్పదాం,భోరుహచింతనంబు మదిఁ బూనుట కేమిచేయుంటి వచల. 3 ౪౨.

విశ. హితము, ఇంపు.

గీ. ఇతము పేరి మిం పన హిత మెసఁగు సొంపు సాం. ని. మాన. 33.

పేలగింజే. వి. (√ పేలు) నిప్పులో వేఁగిపడిన ధాన్యాదిబీజము.

వ. అక్కటకటా దైవంబ నీకింటికిం పేలగిం జయుఁ జెడ్డయయ్యెనే నైష. ౧. ౧౧౦.

(పేలగింజయుం జెడ్డియగు = స్వల్పవస్తువును మహాపదార్థముగాఁ గానవచ్చుట.)

ఉదా. జ్వరితుని రొండలిక్రేడిచే వడ్లగింజలు పేల గింజ లగుచున్నవి.

పేలపిండి. వి. (√ పేలు.) పేలాలు విసరిచేసిన పిండి, సక్తువు. (శ. ర.)

వ్యవ. ఎంతకఠినగ్రంథమైనను వానికిఁ పేల పిండిగాఁ గాన్పించును.

(పేలపిండిగా = తేలికగా, లఘువుగా.)

పేలము. సం. వి. అ. న. (పురుషచిహ్నమగు.) అండకోశము.

పేలములు. వి. బ. లాజలు (దీనికి వ్యుత్పత్తి మృగ్యము.)

ఉదా. పేలగింజ, పేలపిండి.

చ. మిటమిటఁగాయుచాతపము మించఁగఁజోర్వక గండశైలముల్, పెటపెటఁ ప్రేలి పేలముల పెంపు వహించెను. చిత్ర. భా. ౨. ౯.

సీ. బొరుగులు మొదలుగాఁ బోచిర్లుదనుకను బహువచనాలుగాఁ బరగుచుండు, ... లాజలు దినరుఁ బేలాలనంగ. గీ. నక్షతల పేరు పోచిర్లునాఁగ ఆం. భా. ౨. ౫౩.

శా. కాకోలకోరతిరాష్ట్రవర్య యను చుక్ ఘోషించు చందంబునన్, కాకోలకోయని కూసెఁ బుంజులు మెల్లంగుం జక్కపేలాల కుక్, గాకోకో యన వేఁగుఁజుక్క బొడి చెన్ గ్రుంకె న్విధుం డేదిది,క్కోక్కో కోమల కైరవాళి కనఁగా నుద్యత్ప్రభాతాగతిక్. చంద్రా. ౫ ౧౧౪.

పేలవము. సం. విశ. (అ. ఆ. న.) ౧. కోమ లము, మెత్తనిది. ౨ కృశము, చిక్కినది. 3. విరళము, పలుచనిది, పెలితిగలది. (వస్త్రాది)

వి. అ. న. మరిచము, మిరియము. (శే. వి.)

పేలా. వి. (శ. పేలా.) నీర్లు త్రాగడు ఒక దినుసు గిన్నె. (శ. ర.)

పేలిక = ప్రేలిక. వి. (√ పేలు.) పీలిక, జీర్ణ వస్త్రఖండము, వస్త్రఖండవిశేషము, వస్త్ర ఖండము.

సీ..., శ్రీపేలిక యొంచుచు పేలికయన. గీ. జీర్ణ
వస్త్రైకదేశంబు చెలఁగుచుండు ...
ఆం. భా. ౨. ౧౫౪.

గీ. దబ్బ ప్రేలియుంగరవు మేధాని వాట్టు,
మడుఁగుపేలిక పిరిచుట్టుఁ బెనఁగుగాఁగ
హరి ౯ ౧౦ ౨౦౩.

సీ. మొలనున్న ధవళంపు ముద్దుపేలికతోడ
నిమ్మైన కృష్ణాజినమ్ముతోడ.
పీ. ౨ ౨౪౯.

(మయూరి విశిఖము.) వ కాకోదరంబుల యుచ
రంబులు చుంమాపుటంబులం జించినఁ
బ్రేవులు బ్రోవులుపడం గడసి నాలుకలు
పేలికల విధంబునం దూలం ...
సౌ భా. ౪. ౧౦౦

**పేలు = ప్రేలు.** అ. క్రి ౧. (ధాన్యాదులు) వేడిచే వేఁగిపగులు. (క ౫) ౨. వేడిమిచే బయలుకేటిన చిన్నచిన్న పొక్కులు కలిగి యుండు.

వ్యవ. ఈ యెండలకు శరీరమంత ను పేలినది.

౩. (తుపాకి మున్నగునవి) ధ్వనించు.

వ్యవ. ఆ కాలిగా తుపాకాయ బాగుగాపేల లేదు

౪ ఉపయోగింపనిపాటలు అతిమాత్రముగా మాటలాడు, వదరు

(వ్యవ.) పెద్దలయెదుట నట్లు పేలరాదు.

జ: పేలగింజ, పేలపిండి, పేలముల, పేలిక, పేలుచు, పేలలు.

**పేలుచే(ల్చు) = ప్రేలుచు.** స. క్రి. (√పేలు.) పేలఁజేయు.

(క) కాల్చుటచే పగిలి యేలుటకుఁ జేయు.

ఉదా: పేల్చినజొన్నలు, పేల్చినమాంసము మొ.

(చ) పగుల్చు, చీల్చు; ధ్వంసముచేయు.

సీ. కైదువుల్ విండ్లును గ త్తళంబులు పేల్చి
బూరలుఁ డాగుములు బగ్గిఁ గలిపి
అచ్చ రా. సుం. ౧౦౭.

(ట) తపింపఁజేయు, బాధించు.

గీ. బాణముల . బలముసెల్ల, మంగళములోని
పేలాలమాడ్కిఁ బేల్చి.
రా. వి. ౫. ౨౨.

క .. పెండ్యపులం గోనిలేమి పెటపెటఁ
బేల్చెక. శుక. ౩. ౨౪౩.

(త) తుపాకి మున్నగునవి కాల్చి ధ్వనింపఁ జేయు.

(వ్యవ.) తుపాకిపేల్చఁగానే పక్షులు పారి పోయినవి.

**పేశకోశ(ష)ము** సం. వి. అ. పుం అండకోశము

**పేశలము.** సం. విణ. (అ. ఆ. ఈ.) ౧. చక్కనిది, సుందరము. ౨. దక్షము, నేర్పుగలది ౩. కోమలము, మెత్తనిది. ౪ ధూర్తము, వంచనగలది ౫ అలంకృతము,
౧ అ. న చక్కఁదనము, సౌందర్యము.

**పేశస్కృత్తు.** సం. విణ. (క్.) తాను గ్రహించిన కీటమునకు రూపాంతరమును గలిగించు కీటక విశేషము, భ్రమరము

**పేశస్సు.** సం. వి. స్. న ౧. రూపము. ౨. హిరణ్యము, బంగారు. ౩. కోశము. ౪. అలంకారము, అలంకరణము.

**పేశి.** సం. వి. ఇ., ఈ. స్త్రీ ౧. మాంసఖండము, మాంసపుఁదునుక. ౨. మాంసపిండము, మాంసపు ముద్ద. ౩. అండము, గ్రుడ్డు. ౪. సువిచ్చకలిక, విరియఁబారుచున్న మొగ్గ. ౫. జటామాంసి.

ఒ. కత్తిరొఱ, ఖడ్గపిధానము. కి. నదీభేదము. ౧. పిశాచీభేదము. ౯. రాత్రునభేదము. ౧౦. గర్భమును చుట్టుకొనియుండు చర్మకోశము, చూలు నిలిచిన యించుకకాలమునందలి గర్భపిండము ౧౧ వాద్యభేదము. (ఈ యర్థము లంచు ఈశాగాంతమని వాచస్పతి) ౧౨ స్త్రీము (ఇది పుంలింగమని అని కొందఱు.) ౧౩ మాషవిదళము. ౧౪ కాలిచెప్పు. ౧౫. పండు లోనగువానిపైతొక్క.

**పేషకుఁడు** సం. వి. (అ. ఈ. ఆ.) నూఱువాఁడు, పొడిసేయువాఁడు.

**పేషణము.** సం. వి. న. ౧. మార్జనము, పొడిసేయుట. ౨. ఖలము, కల్వము; కళ్లము, ధాన్యము నూఱుచుచోటు (అని కొందఱు.) పుం. వృక్షభేదము.

**పేషణి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. నూఱురాయి, పన్నెకల్లు, కలువము.

**పేషము.** సం. వి. అ. పుం. పొడిసేయుట, నూఱుట.

**పేషాకము.** సం. వి. అ. పుం. = పేషణి.

**పేషి.** సం. వి. ఇ. పుం. వజ్రము.

**పేసెము = బేసము** వి. (సం.పేశి.పేసి. ప్రా. పేసా క బేసవు శ. ర. పేసము, అని. చి ని) ఫలామిలలో అనుకుగా నుండు పదార్థము,గుంజు.

గీ. పేసె మనంగను ఎర్యాఖ్య విలసిల్లు
ఆం. భా. ౨. ౪౦.

ఉ. అల్లవఁ జేరవచ్చి ధవళాన్నముఁ గమ్మని యాలనేతితో, బెల్లముతోడ నాల్కుదపుఁ బేసెముతోడను విమ్మపండ్లతో పిసాళిశెఁ బ్రియుఁబుని నూర్వశి పెట్టె భీతమున్.
హర. ౫. ౪౬ (పేసము. ముద్రి.)

**పేస్వరము.** సం. విశ. (అ. ఆ. ఆ.) ౧. గళ శీలము, పోవుచుండు స్వభావము గలది. ౨. నాశము సేయునది.

## పై

**పై** = పయి. వి. (సం. పై.) సప్తమ్యర్థకము. ౧. మీఁదు, ఉపరిభాగము.

గి. మీఁద, పై పయిని నాఁగ నూర్ధ్వాఖ్య పరఁగు మంగు
ఆం. భా. ౩. ౬౬.

గీ. పాలఁతి పయ్యెదకొంగు పైఁ బొందుఁ బెంచి.
ఉ. హరి. ౧. ౪౦.

చ. పరసపుటల్కఁదీర్చుతఱి కాళ్లమదగ్గనంద కాబ్జసంభరణగుణ ప్రౌఢిమ నెన్నడునుపైఁ గటపై కళంబుపై, హరినలు లంబైకొని సుఖాంబుధి నిచ్చలు తేలలాడు నిందిర కృపజాచుఁ గాత ...
పారి. పీఠి. ౪.

౨. విషయము, ఎడ.

వ్యవ. నాపై దయయుంచుము.

౩ వెనుక, అనంతరము.

గీ. కుడుపుపైఁ గుడుపు దినవిద్రగూరి నుగతపరత నొందుఁ గొల్ల కూసపగు విమాథుఁడగు
గౌర. అశ్వ. ౧. ౧౬౬.

చ. పలపలదొట్టఁగొం నికపాటి మాటికి నేటవాలుగా, జలకణముల్ నిగుడ్చువెనస్ జడిపైజడి సందడింపఁగా, జలధరపంక్తి దార్కొనుచు .. (ఉంవు ౩. ౧౦౭.)

౪. బహిర్భాగము, వెలుపల.

౫. భక్తిగొలిచిరాఁగఁ బ్రాగ్జ్యోతిపంబుపై, విడిసెఁ దత్పురమున విభుఁడు
భార. సభా. ౧. ౨౫౭.

ఉ. .. పరస్పరాత్మలం, దాశలితంబులైన
బను యాకృతులచ్ఛతం బైకిదోఁప . .
ఆము. ౧. ౧.

సీ. అర్భకకీర్తి పై కావిర్భవించెనో యన మోము
పాండిమ యతిశయిల్లె విప్ర. ౧. ౩౭.

మ. . వ్వేతలయూచెం గలకంఠి యచ్చెరవునం
దాటంకరత్నప్రభల్, పలుకంబాఱిన చెక్కు-
టద్దముల పైఁ బైపై విలంఘింపఁగాన్.
కాశీ. ౫. ౧౬౭.

వి. ౧ మీఁదనున్న.

చ. కరలుప్రవంతిఁ బై యిసుక క్రిందగుఁ జేళి
ఆము. ౪. ౧౫౦.

సీ. నీకలుకుఁ జెండ్లెవి పైకి మ్మదివ్వంచు ...
బిల్హ. ౧. ౪౧.

౨. బహిర్భాగమందున్న, వెలుపలనున్న.

క. గడివాఁడు పెదునెరయెఁ దిగుఁ, జెడఁజేయుట,
చెడఁదయేని చెల్మియు తగుఁ బై, గడివాఁడేపని
కగుఁ దన, గడివాఁ డరియైనఁ దనకె గడికావఁ
బమున్. ఆము. ౪. ౭౬.

(దీని యామ్రేడితరూపము, 'పై పై.')

పైపై = పైపయి ౧. మీఁదను మాత్రముండు
నది. (నిజముపమా లేదని భావము.)

శా. . . కుకవిప్రణీతకృతి సామాన్యాకృతిం
బూని పైపై వన్నెల్ పచరింప దానిఁ దిల
కింపం బోర ధీరోత్తముల్.
వసు. ౧. ౧౯.

౩. మిక్కిలి, అత్యంతము, అధికము.

సీ. పైపై మహోచ్ఛ్వాస పర్యుత్సుకంబులై తన
మీఁద న్పృథుల నేత్రములు వ్రాల.
హైమ. ౪. ౧౩౪.

౪. మతిమతి, కుమకెంట.

ఉ. ఏసుకు దాఁపురం బెఱుఁగి కేర్పడఁ
జెప్పితి . అవ్విబుధమానవతీమణి ప్రేమ
తోడఁ బై పై నడుఁగన్ వివేకి వెంకపాటియు
చిల్కల కేమి జెప్పినన్. (కళా. ౫. ౪౩.)

గీ. జల్లుకొని వచ్చెఁ బైపైని సారమేయ,
యూధములు వేదమనుమూర్త లుద్ధతిమున.
హర. ౩. ౩౭.

౪. సాధ్యమగు, సుకరమగు

ఉ. ధనము సంపాదించుట పైపైనున్న దను
కొంటివా '

పైపైగా = పయిపయిగా, సులభముగా.
వ్యవ ఆ తప్పు పైపైగా తేలిపోయినది
(శ. ర.)

పైపైమాటలు = అంతస్థితి లేని మాటలు

పైపైచదువులు = అంతస్సారము లేని చదువులు,
మంచిజ్ఞానము లేని చదువులు.

పైపైపనులు = బాధ్యతలేని పనులు.

పైమీఁదిబట్ట = ఉత్తరీయము.

వ్యవ. వాఁడు తొందరలో పైమీఁదిబట్టకూడ
మఱచి పోయినాఁడు

పైపని = వంటతప్ప తక్కిన పని.

(వాడుకలోని ప్రయోగ విశేషములు.)

వ్యవ మా కీ సంగతి పైఁగాఁ దెలిసినది.

,, అది మనలోమన యుండవలెనుగాని పైగా
పోకూడదు.

,, మా కీ పనివలన లాభము లేదు సరిగదా పైగా
నష్టముకూడఁ గలిగినది.

,, ఏ వీ పనిచేసి పైగా నామీఁదఁ బెట్టితివి.

౭. పైఁట, పైఁటకొంగు, పైఁజేలు, పైఁబడు,
పైఁబెట్టు, పైమాటము, పైకొను, పైకొలుపు,

పైచీర, పైచెఱఁగు, పైచేయి, పైచేయు, పైనడచు, పైపచారము, పైపడు, పైపయి, పైపాటు, పైపెచ్చు, పైయెద, పైవచ్చు, పైవెట్టు, పైవోవు

**పైంగి.** ౧౦. వి. ఇ. పుం యాస్కుఁడు.

**పైంజూషము.** సం. వి. అ. పుం. చెవి, కర్ణము.

**పైండిక్యము.** సం. వి. న భిక్షుకత్వము, భైక్షుజీవిక.

**పైండివ్యము.** సం. పైండిక్యము.

**పైఁట, పయఁట, పయిఁట, పయ్యెట.** వి. (పై + అంట - వృ కిని వర్ణలోప వర్ణవికార రూపములు. సం. పైతా (ప్రా. పఇరా) పయ్యెద, కుచోపరిచేలము, స్త్రీలఱొమ్మమీఁది వస్త్రము.

సీ. కాంతోత్తరీయంబు పైయెద పయ్యంట పైఁట పయిట. (ఆం. భా. ౧. ౧౫౫)

సీ. అంగకంబులలాగు లరసి రోమము దోడంగ సడలనీదయ్యె నెప్పుడును బైఁట

కళా. ౬. ౨౦౩.

ఉ. పైఁటను లాగులాడి కటిపై ఘటియించిన చే విడలుఁబలన్ .. పోరాటమాటాయెనా యన కొయారి రొమ్మటాటములఁ బాటపాటిన్.

పాంచా. ౫. ౭౦.

**పైఁటకొంగు.** వి. (√ పైఁట.) పయ్యెదచెఱఁగు.

గీ. పయిముదప్పెడుగతి కంకణములు మెఱయఁ, గొప్పుసవరించి యుంపఁ బులకలు గ్రమ్మికొన్న, గుబ్బయురగానరాఁ బైఁటకొంగుజాఱ, మగువ యొరగతి తెగువతోఁ దిగువ నరిఁడు.

దళా. ౩. ౬౮.

క. ... నిట్టూర్పు పవనంబు జవనంబునఁ బైఁటకొంగదలింపఁ (మనుచ. ౩. ౨౮.)

ఇప్లో: పైఁటచెఱంగు.

సీ. తులకించు జిలుఁగుదువ్వలువపైఁటచెఱంగు జాఱువాపాల్లు వసంతమాస .

ప్రబంధ. ౧౯.

**పైఁడి=పయిఁడి, పసిఁడి, పహిండి, పహిణి.** వి. ౧ సువర్ణము, బంగారము.

సీ. కనకాచలేంద్రంబు గళమునఁగట్టిన కిమనీను మగు పైఁడిగంట గాఁగ.

కు. సం ౮. ౭౨.

ఉ. వాసనఁ గేతకీదళములంకఁ గళింకములేని పైఁడి యభ్యాసముచేసె నేని యగునప్పు సమానము

నైష. ౬. ౪౩.

౨. ధనము, ద్రొక్కము

దండకము లోకత్రయిన్ నీకు నప్పుఁడునే మారునిన్ జారునిన్ జేసి రప్పింతు నేఁబ్రాఁతి యే పైఁడి నాపైఁకి యే పైఁడి లేదింటిలో వింటివా (భోగినీదండకము. ౧౧ పా.)

సీ మును ప్రతిశ్రుతము చేసినపైఁడి రాకున్న ముచ్చిచ్చునను వేగు వచ్చుదనుక. గీ. వనరు...

పాండు. ౪. ౧౪౯.

సీ. తలి చూచి యిచ్చె నెద్దానిఁ బట్టికిఁ దల్లి జాదమాడినపైఁడి సుట్టుకొనిన.

కాశీ. ౪. ౯౯.

౩. ఒకవిధమగు బంగారునాణెము.

క. ననుపగు నలిగానము విని, వనదేవత గరము మెచ్చి వానికి నొసఁగం,బనఁ బైఁడుల వీడెలు పుచ్చినవిధమునఁ బొన్న తెలమిఁ జెలువుగఁ బూచెన్. (కు సం. ౪ ౪౫.౨.)

శా. . ధర్మైకవిత్తార్జనన్, సంభూతం బగు పైఁడి కోటికొకపైనాసాఁటికి న్నెచ్చుచు. .

ఆము. ౨. ౩౫.

సీ. దేవళ్లకెంతలఁ దివియటి గారాదు లలిఁ
 బైఁడిమల తేఁకి నిలిపి రండు.
 యయా. 3. 38.

పైఁడిగోల్లు. వి. బ. (√పైఁడి) కిన్నెర, వీణె మొదలగునవి మీటునపుడు పెట్టుకొనెడు బంగరుగోల్లు.

ఉ. కీరమనోజ్ఞవాణి యొకకిన్నరి కిన్నెర మీటి మీటి యొయ్యారపులీల నేఁగి వసుధాధిపుఁ గన్గొనె జిల్లుపర్యోధర, హారముఁ జక్కఁబెట్టెడు కుచాహితహస్తము పైఁడిగోల్లు హిం,సారలిపేయుదిర్చిపని ంచెగ మల్కులం బోలె మించఁగన్
 మనుచ ౧. ౬౮.

పైఁడిచూలాలు. స్త్రీ. (√పైఁడి.) వసుంధర, భూమి.

గీ. అమరెఁ బుష్పాండిదిప్పలై యంతనంత, మెట్ట దామరిపాకులమీఁద జాతి, పైఁడిచూలాలి పేవిల్లు వాయఁ దోఁట, కలిమిచెలి పెట్టు కిలవంటకంబు లనఁగ. (యయా. ౪. ౯.)

పైఁడిచేల. వి. (పైఁడి + చెల.) విష్ణువు ధరించెడి కనకాంబరము, పీతాంబరము.

ఉ. పైఁడిచేలకొం, గిం దుకి జాఱ నొక్కఁ తరకేతుణ హస్తము కేలఁబూని
 శాలి. ౨. ౬.

పైఁడితంగేడు. వి ఔ. (√పైఁడి) వృక్షవిశేషము, బంగారమువలె పచ్చని పువ్వులు గల తంగేడు. కీ.

సీ. జిల్లేడు కెంపలి చిడ్డుకెంపలి పైఁడితంగేడు తంగేడు తగిడి యుసె. (హంస. ౪. ౧౦.)

పైఁడితామర. వి. (√పైఁడి.) ౧. బంగరు తామర.

ఉ. . వేల్పు కేటిలో, విచ్చినపైఁడితామరల వెంబడి వచ్చిన కమ్మగాడ్పులన్, మెచ్చుల రీతి
 హర. ౬. ౧౦.

౨. స్థలపద్మము, మెట్టతామర.

సీ. స్థలపద్మ మగు మెట్టతామర యనఁ బైఁడితామర యనఁ బచ్చతామర యన, నేలతామర యన
 ఆం. భా. ౨. ౬౯.

పైఁడిదొర. వి (√పైఁడి.) ధనాధిపుఁడు, కుబేరుఁడు

సీ. అది పైఁడిదొరరాణియఁగుఁ కెల్లెలుసుమీ యవిద గారవము సేయుదువుగాని.
 సుయా. ౪. ౧౩౫.

ఇట్లే పైఁడిరాయఁడు, పైఁడిఱేఁడు. మొ.

చ. నలువయుఁ బైఁడిరాయఁడుం, స్మరలును సంద్రమల్ మొద లనందగు సిజ్జగ మెల్ల నీవయై, పలుఁగు మనుండు పేలుపులవేలుపు, ముమ్మొనవాలుదాలుపా.
 చ. రా. సుం. ౧౮౦.

పైఁడినెలఁత. వి. (√పైఁడి.) శ్రీకాంత, లక్ష్మీదేవి

మ. గెలుపుం పైఁడినెలంతఁ గైకొనియె వగ్గింపన్ జగం బంతయున్ ..
 యయా. ౧. ౨౬.

(గెలుపుం పైఁడినెలంత = జయలక్ష్మి.)

పైఁడిప్రత్తి = పయిఁడిప్రత్తి. వి. (√పైఁడి.) బంగారువలె పచ్చనిగింజలుగల ప్రత్తి, కార్పాస భేదము. (శ. ర.)

సీ. . పాషాణముల కెల్ల పైఁడి ప్రత్తి.

పైఁడిముడుచు. అ. క్రి. (√పైఁడి.) ౧. గర్భాదానము చేయు.

ద్వి. ముని కోఁటకే పైఁడిముడిచిన పదుచు, చతుగుబ్బ గోరొత్తి చను గబ్బివాఁడు
అ. మ. క. ౧. ౩౪. పా. ౧౧. పం.

౨. నిశ్చితార్థము చేయు. (శ. ర.)

**పైఁ(పయిఁ)డిముడుపు.** వి. (√పైఁడిముడుచు.) నిశ్చితార్థము. (శ. ర.)

**పైఁడియుమ్మెత్త.** వి. (√పైఁడి.) కాంచనము. క్రీ.

సీ. పైఁడియుమ్మెత్త నాఁ బరగుఁ గాంచ.
గీ. నాహ్వయము . (ఆం. భా. ౨. ౫౩.)

**పైఁదేలు.** అ. క్రి. (పైన్ + తేలు) బహిర్గతము, వెలువడు.

సీ. సర్వాతిశయిత రాజసము పైఁదేల నా జడ గుంపు ముడికెంపు సౌరుమీఱ.
ఇందు ౧. ౧౬౧.

**పైఁబడు.** అ. క్రి. (పైన్ + పడు) ౧. పూను, చలపట్టు

ఉ. పానీయము పేరువాఁడు నవి పైఁబడి యొక్కఁడు వల్కనేనియుం, బానినవాఁటి పత్రములఁ వ్రాయు కెలెంగిన జ్ఞాతివర్గముల్, డాసిన బందుమిత్త్రులు నొడంబడ నిచ్చిన కొన్న యప్పులుం, వ్రాసినయిల్లు పేఱ తెలుపందగువానికి నూ కెఱుంగఁగన్.
విజ్ఞా. వ్యవ. ౧౪౬.

౨. వ్యాపరించు, ప్రాపించు.

క. బిడ్డలకు బుద్ధి సెప్పని, గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పొండిద పైఁబడ్డాఁ డని ఛీమం డొల్లఁగొడ్డెములాడంగఁ గూడు గుడిచెద వధిపా. భాగ. ౧. ౩౧౩.

**పైఁబెట్టు.** స. క్రి. (పైన్ + పెట్టు.) పెంపు.

ద్వి. వడుగులచేత నీవార్త విన్నపుడె, తడయక వే రానితప్పు పైఁబెట్టి, యలుక మై ముఖ పద్మ మవ్వలఁ జేసి, పలుకవో . .
ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౦౯. పం.

**పైకము.** సం. (క. పైకె, ప్రా. త. పయిక్కం.)

౧. రెండు కాసుల నాణెము, కాకణీద్వయము.

సీ. కా సనఁగాను గాకణి పేరు విలసిల్లుఁ బైకి మంచనఁగఁ దద్ద్వయము వెలయు.
ఆం. భా. ౨. ౨౪౪.

క. ఆర పైకంబును జేయని, హరివాసరమునకు నై నిజాత్మజుఁ డునుకున్, వరవాలుఁ జేతఁ బూనిన్నకరణి యనుపమొలకు మోదఁ గాల్పుటకుమిమ్మ. దశమా. ౫. ౧౪౩.

౨. రొక్కము, వెల.

సీ. . అమరు రొక్కమునఁ బైకమున ధనము.
ఆం. భా. ౨. ౨౪౫

సీ. కొమ్ము పైకమ్ము లేకిమ్ము జాణల కని మూచు మిరారంపుఁ జాపుడలిపి .
రా. వి. ౧. ౫౪.

సీ. గసులుఁ జెం డ్లెవి పైకమ్ము దప్పించు పైకమ్ము పిప్ప నే చేకొసంగి బిల్హ. ౧. ౪౧.

౩. సమూహము.

క. పైకము వదుకు విలాసర, పైకము సొమ్మొగము దీరిమృదుమధురోక్తుల్ పైకముఁ దెగడు స్నవలా, పైకములో నెల్ల మేలుబంతిది బళిరా. జ . ౨. ౧౦౪

చ. .. ఏఁగఁ బల్లకీ, కడల నతంబుగా నగరి కావలిఁ గాచిన రాచపైకముల్
రా. వి. ౨. ౬౪.

సీ. ... పిండు కొంత్తము తొట్టి పైకము
దాఁటెలాద్ద. గీ. . . వర్గము తగు ...
ఆం. భా. ౨. ౧౦౦.

పైకూటమి. ౧. (√పై.) ఉపరిసంగతము, పురుషాయితము.

సీ. ఉపరిసురతసంజ్ఞ యొప్పును మగపోల్కి-
కూటమి యనఁ బైకూటమి యన
ఆం. భా. ౨. ౧౭౦.

పైకొను = పయికొను. అ. క్రి. (√పై)

౧. మీఱు, అతిశయించు

చ. అనియని యుగ్గడించు ప్రతి యల్లలనాడినఁ
దల్లడించుఁ బైకొనుతలఁ బోరగించు
భార. విరా. ౨. ౨౧

సీ. మాటిమాటికిఁ గూర్మి మాటువేసెద నన్నఁ
బైకొన్నవలవంత బయలువఱుచు
విక్ర. ౧. ౧౨౯

౨. (కామక్రోధాదులచే) విజృంభించు, చెలరేఁగు

మ. ఆశ్వికులు పైకొని ఎాఁది మానవులం
వనిమిష ప్రమోదుపగు రథంబ లున
భార. భీష్మ. ౧. ౨౬౩

క. చలపాడిచి యంకెలిడుచును, ఒలుమలు ముం
గాళ్ళఁ ద్రవ్వి బలువిడిఁ ఒసికాఁ, ఫలఁ
గ్రుమ్మి విడుచుఁ బైకొని, పొలమంతయు
నవిసు యగుచుఁ బొగిరు పెలంగెన్
సీ. ౨. ౫౬

ఉ. చీకటితప్పనం బరులచేడియలన్ గమియింప
దూతి కా,లోకము మాటతీపులకు లోఁబడి
భీత్యభిమానలజ్జలన్, బోకడఁబెట్టి ప్రాణ
సంకటపోఁకకుఁ గైకొనకుండు సాహసుల్,
పైకొని చేరి త న్నుభయపార్శ్వములందును
భక్తిఁ గొల్చి రాన్. నైష. ౭. ౮౨

మ. మగవారి న్మొగమెత్తి చూడఁ గులశాస్త్రా
ధర్మము ల్దప్పవే, తగవే పైకొనఁగాక కూర్మి
బలవంతంబైన నారాజు ధైర్యగుణో
దాతుని దత్తు మల్లముఖులారా యేల
చింతింపఁగన్. వరాహ. ౩. ౧౭౯.

మ. దంతావళబృంహితంబు విని శైలాగ్రంబు
పైనుండి పైకొనుసింహము గుండెదోఁపఁ.
దశా. ౪. ౨౨౦.

౩. (యుద్ధాదులందు) ఎదుర్కొను, కవియు, పయిఁబడు.

క దానఁ గడు దన్నె నాతని,సేన యరాతు లతి
యెతేఁగి వెన్నెగ లసం,తానముతోడం
బైకొని, యానాపతిఁ జెఱిచిరి .
గౌర అశ్వ. ౧. ౧౯

వ ఇవ్విధంబున నాచార్యుం డేచిఁ నతని
ప్రాపున భవత్సేనలు గాలంగి పెనొనిము
బాల. భీష్మ. ౨. ౬౫

సీ యంతెంత సగిపడినట్లు రఁగనిచ్చుఁ బైకొనఁ
జూచినఁ ఒరువువెట్టి (విక్ర. ౨. ౧౨౫.)

౪. మర్దించు, కదఁగు

ఉ. మేరువు బూరిగాఁ దఱచు మి న్నుఱచేరన
మాయఁ బైకొనున్, నీరధిఁ బుక్కిలింతు
నను కవిక. ౫. ౧౩౩.

క. నా కిపు డెఱఁగింపుము మ,శ్లోకనిచరి
తామృతంబు శ్రోత్రాంజలులన్, బైకొని
జుర్రియుఁ దనివిం, గైకొనకున్నది మనంబు
గరుణోపేతా. భాగ. ౪. ౩౭౬

౫. కలుగు, సంభవించు.

స్ర. ముద్దుగారంగఁ దనుఁ దనారముల వింపుగూరంగ నెలమి పైకొనుదాక్కొ నన్ను, హత్తి
ద్వి. పరమ. ౫. ౪౧౦. పా.

౨. ఆక్రమించు, ఆవరించు.

ఉ. అవ్యయమవ్యవాయ లోకప్పడుమీదికవాడ మందు నీ, దివ్యసరోజధామకము దీధితిమాత్ర దిసేకమిత్రతా, భవ్యము దనీగన్న నెదఁ బాయఁ బ్రదోషములన్నచోఁ బ్రదోషవ్యసనంబు పైకొనఁగఁజాలునె దీని జగత్త్రయంబునన్. వసు. ౫. ౯౭.

మ. స్వవిధింబంతయుఁ గానలేక ఒహులాజ్ఞానాంధకారం బున్నదఁ బైకొన్నఁ బదార్థతత్త్వ మెఱుఁగంగాలేన మాకు
దశా. ౧. ౨౧౪.

క. చనునెడ శ్రీరాముఁడు పావని నవనిజరూప వైభవశ్రీ నుల్లంబుఁ నిడి దాన విచిత్రా, తనురాగప్రౌఢి వచ్చు తనుఁ బైకొనఁగన్. రాఘవ. ౨. ౩౧. (రామాయణార్థమున.)

౩. పొందు, కూడు.

ఉ. మాచనపు ద్రోయక యీఁదగు లోభ వెరాహమూల్, గైకొన పుట్టుచోట నవకంజ దళాక్షునినామవిస్మృతిం, బైకొనకుండ దాననె శుభంబగు మీఁదిమదీయజన్మముల్.
భాగ. ౩. ౫౩౦.

మ. సమయాభిజ్ఞతఁ గిమ్ముటంబు.. విదియూరం భించెఁ గాఁబోలునా, సమరం దధ్వని మానినుల్ రతికిఁ దామై శాఘులం బైకొనన్.
ప్రభా. ౫. ౫౭.

౪. మీఱు, అతిక్రమించు.

సీ. ఖగముల కేమందగతి యేఁటి కని రాజహంసలఁ బైకొనుకట్ల నడచు.
హం. ౨౦. ౭. ౬.

పైకొలుపు(లుచు) = పయికొలుపు. స. క్రి. (√పైకొను.) పైకొనఁజేయు,

(కలుగఁజేయు.)

ఉ. శాకనదీప్రదీప్తకులివంబుల నిచ్చలు నిల్పి సన్నుమల్, పైకతలింగపూజనము సల్పుతఱిన్ రవణించుఁ దక్కడా, శాకులకింకిణీరవము ఘంటలుమ్రోగుట ధూపధూపముల్, పైకొలుపున్ సమర్హగతిఁ బర్వెడు గుగ్గులు ధూపధోరణిన్. (పాండు. ౧. ౧౦౫.)

సీ. కామాక్షి యీ పల్లవములకు నీమోవితళుకుఁ గెంజాయఁ బైకొలుపుకొలఁకొ.
కవిరా. ౨. ౧౫౭.

(మీఁదఁ బడఁజేయు.)

మ. యతిరాజన్యతపోమహోజ్వలము చల్లారంగ సౌదామనీ, లతికాహుంకరణాపహాసకరలీలాలసాపాంగసంగతశోభాకలశాంబుధిస్ఫుట తరంగశ్రేణి పైకొల్పు మోహకతపత్త్రీసన్న యట్లు చేసిన జగజ్జాలాప గారంభముల్.
కవిరా. ౪. ౪౭.

సీ. అదరి యింద్రుండు బ్రహ్మాస్త్రంబు పైకొల్పు నది మురాంతకు నాభియందు డిందె.
పారి. ౫. ౩౦.

(ప్రసరింపఁజేయు, వ్యాపింపఁజేయు.)

సీ. పసిఁడికొండగడు పైఁ బఱచిన యట్లు దిక్కులఁ బసుకాంతి పైకొలుపుకాని, పైన తేరుచు ... హరి. పూ. ౪. ౯౫.

(సోఁకఁజేయు.)

గీ. రమ్యలావణ్యమూర్తికి కరత్నరాశి, కలభు విరహాగ్నిశిఖలం బైకొలుపకమ్మ.
కవిరా. ౩. ౧౭.

పైచీర = పయిచీర. వి. (√పై) ఉత్తరీయము, పైబట్ట.

సీ. కలితంపుటంగిపై వలెవాటువేసిన పైరాణి
తగటుదుప్పటి నటింప. (రా. వి. ౫. ౩౫.)

వ. .. మేలివలిపె సరిగించు చలువపైరాణి
నేలువ మేలుముసుం గిడి

ఉ. రా. ౪. ౧౩౭.

**పైరిణీ = పైరాణి.** వి. జఫ్ జలతారు.

గీ. తెంగుల్ దరిన పైరిణీ తాటి వన్నెలటి
గణింపంగా, కెంగల్వల్ నెఱిగొప్పునం
నొరి పై రెంతం గుబాళింపంగా

విజ. వి. ౨. ౧౫౪.

ఉ. మేలిపసిండిబొమ్మచనుమిట్టలకర్ణ గాలిచల్వ
పైరిణి, చేలవెలుంగులై యచటం జెల్వగు
జలుపుటేటి పెండరల్

ఉ. రా. ౧. ౫౭.

**పైరీనసి.** సం. వి. ఇ. పుం. ఒక ఉపస్మృతికర్త (కల్ప.)

**పైతామహము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. పితామహసంబంధి. ౨. పితామహునివలన ప్రాప్తము. ౩. పితామహుఁడు (బ్రహ్మ) అధిదేవతగాఁగలది. (అస్త్రాది.)

**పైతామహికము.** సం. విణ. (అ. ఈ. అ.) పితామహసంబంధి

**పైతృకము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. పితవలన ప్రాపించినది ౨. పితృసంబంధి. ౩. పితృదేవతాకమైనది.

వి. అ. న. పితృదేవతావిషయకమగు శ్రాద్ధము.

**పైతృమత్స్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కన్యకొడుకు, కానీనుఁడు. ౨. ప్రసిద్ధుఁడగువాని కొడుకు. (విల్యమ్సు.)

**పైతృష్వసేయి.** సం. వి. ఈ. స్త్రీ. మేనత్త కూఁతురు.

**పైతృష్వసేయుఁడు.** సం. వి. అ. పుం. మేనత్తకొడుకు.

**పైతృష్వస్రీయ.** సం. వి. ఆ. స్త్రీ. మేనత్త కూఁతురు.

**పైతృష్వస్రీయుఁడు.** సం. వి. అ. పుం. మేనత్తకొడుకు.

**పైత్తము.** సం. విణ. (అ. ఈ. అ.) పిత్తధాతువుచేఁ గలిగింపఁబడినది (జ్వరాది.)

ఇష్టే. పైత్తికము.

**పైత్రము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. పితృసంబంధి (శ్రాద్ధాది.) ౨. పితృపితామహసంబంధి. ౩. పితృదేవతాకము.

వి. అ. న. ౧. అంగుష్ఠతర్జనుల మధ్యభాగము. ౨. పితృసంబంధి. (దినము, మొ.)

**పైద = పయిద.** వి. (ఉ. పైదల్.) పిల్లవాఁడు.

క. పసుచుం బైదలు పన్నిదఁ, గదపి చనక చింతతో డి క్రియ్యమునకు నేఁ, గదఁగుట తగదని యాయని, విడిచి దశాననుఁడు వారు విన నిట్లనియెన్. నిర్వ. ౭. ౭౩.

ఆ. తిరిగితిరిగి యుద్దికుఁ నవక్త్రిములోడఁ, గోట
దొడ్డి చొరంగ గొలఁబోయి, యుచుఁ
బైద పెం ( ఒకి నొర్వ్య వదుచునో, యేమి
సేతు నంచుఁ బ్రేమఁడించి.

భోజరా. ౪. ౧౩౭.

ఉ. . . అలరు చిద్దంబు బంటుఁ బైదలై
ఘాలధసార్జనంబు నిలు మునిగిలియు గళ
వక్షం వర్పితక్ష, జాలినవారి కెట్టు లయ
వర్గము ధర్గ ... (పాండు. ౫. ౧౨౨.)

చూ. పైదలి.

పైదలి = పేయిదలి. వి. (పైఁడి + అలి.) ఆఁడుది, స్త్రీ.

సీ. జవరాలి నెఱిపెఱి జడవాహముల మించఁ
దడియార్చి ముడిచెఁ బైదలి యొకర్తు.
వసు. ౫. ౧౧౭.

ఉ. ... నూలెఁగఁజొచ్చె వంటసే, పచ్చని
వింటువాఁ డపుడు పైదలిపైఁ దలిరాకుఁ
గైదువుల్. విజ. వి. ౨. ౧౬౪.

క. పైదలి నలు వెన్న నలుతపడెఁ దిక్కెఁ దరమె.
అచ్చ. రా. బాల. ౧౩౫.

పైనడుచే. అ. క్రి. (పైన్ + నడుచు.) దండెత్తి పోవు, విఁాదికి నడుచు.

గీ. వరుస మాళవబర్బరధరణిపతుల, పైనడిచి
భీషణంబైన ఖండనమున, ఒహలువిభాయుధ
పటిమచే భంగపఱిచె. (శివా. ౧. ౧౧౫.)

పైనమ(ముల)గు = పయనమగు. అ. క్రి. (√పైనము.) ౧. బయలుదేఱు.

ఉత్సాహ. ఇంకశంకలుజ్జగించి యుర్వీభుజ్,
బ్రాపులేదు కొండుపాండు పైనమై ధరిత్రిజిన్.
వి. పు. ౫. ౧౩.

ఉ. పైనము లైరి పాండునరపాలతనూజులు
పాంచాలీ. ౫. ౮౭.

వ. .. అతనితోడఁగూడఁ బావకపతేతగాజ
పాళసాణులు పైనంబులైరి .
నైష. ౩. ౩౭.

౨. దాడివెడలు, దండెత్తు.

క. తనసేనము తనబలములు, దనగర్వము తన
మదంబు దనసంపదయున్, ఘనతరముగ
వచ్చెరవుగఁ, బనిగొనఁ బరసేనమీఁదఁ
బైనంబయ్యెన్. పీర. ౨. ౯౨.

పైనము = పయనము. వి. (సం. ప్రయాణమ్. ప్రా. ప్రయాణం.) ప్రయాణము, బయలుదేఱుట.

ఉ. పైనమి డేలయన్నఁ గ్రతుభంగముఁ జేసిన
దోసము .. కళా. ౨. ౧౩౮.

ఉ. పడిమరకట్టగాడ్పుదురఁ బైనముపోఁగని
వెళ్లరేఁడు . చంద్రా. ౨. ౧౯.

పైనముచేయు = బయలుదేఱఁజేయు.

ఉ. పైనముచేసి తంత్రీసను పంచెను పంతము
తోడ నిట్లతో, ధ్యానగిరింబు వెల్వడి . .
చం. గా. ౨. ౨౧.

జ పైనపు.

పైపచారము. విణ. (పై + పచారము.) వంచకము, కపటమైనది.

క. నయగారపుఁదమిఁ గపట, ప్రియముల మెచ్చు
మెచ్చుఒక్కరింతను మిథ్యాచయముల
నుపచారపు, నయగున మానిఁగూడి కొన్ని
నాళు రమింపన్. విప్ర. ౪. ౧౩.

పైపడు = పయిపడు. అ. క్రి. ౧. మీఁదు.

(ఆ. ర.) ౨. పైకొను, కవియు, సంభవించు.

క. ఆపద సమస్తలోకులఁ, బ్రాపించుఁ దొలంగు
నపుడు పవనముభంగిం, బైపడునాపద దైవిచిన,
భూపాలా తలఁగు పోఁడఁ బొందు శుభం
బుల్. భా. రా. అర. ౨. ౨౮౪.

(రెండిటికి నిదియే యుదాహరణము.)

౩. కడఁగు, ఉద్యమించు

క. పాపాత్ములారల నూరకె, చూపోపక బాధ
పెట్ట సాగయుదు రెందున్, బైపడుదురు
దుష్పాధుర, దీపించిన సాటివారి తెరువరు
గజా, కేన. ౪. ౮౩,

౨. నేలోకటి, భిన్నము.

క. నేలోక టనఁ బైపెచ్చన, మాఁట యిమ్మడి యనఁ సమాహ్వయములం పెం,పాఱును వస్త్వంతరము,సు . ఆం. శే ౧౫.

పైయెద = పయ్యెద, పయ్యెఁద. ఓ. (పై + ఎద) పైఁట.

సీ.. .. గాంతో త్తరీయంబు పయ్యెద పయ్యంట పైఁట పయింట. గీ. పైయెద పయంట నాఁగను బరగుచుండు .

ఆం. భా. ౨. ౧౯౫.

పైరి = పయిర, పయర. (శ ర.)

పైరగు = పయిరగు. అ. క్రి. (పైరు + అగు.)

౧. సాగుబడియగు.

సీ. అన్నె నేతకుఁ దొచ్చినపుడున్న దీవిలోఁ బైయూ ఱుదీవులు పైరు గావ. కవి. ౧. ౧౭౯.

౨. పెరుగు, వృద్ధినొందు.

లయగ్రాహి. . సహకారమిలకేలా,ఘార ములు జారుహిమవారిశ్రితసారణులఁ బైరైన చెంగలువయీరికలలో

వసు. ౧. ౭౨.

పైరము = పయిరము. వి. ౧. ధేనువు, ఆవు.

ఉ. కిట్టుక నోండ్లోకళ్లు తమకే తమకే పిలు పంచుఁ బైపయిగా, గొబ్బిలు పాఁడిపైర ములు కోకలు గూకలు ముందుముందుగా, కట్టుక రిచ్చి వచ్చి అలవాకిలి గాతురు కేకరింబవల్ వై జ. ౨. ౩౭.

చ. బంటుబానిసలుఁ బైరియుఁ పయ్యెయుఁ జేనుచెట్టు లో,నయినసమస్తసంపదలు పన్న విత్తికి వచ్చుపెట్టఁగాఁ, బ్రియలు ధరించు సొమ్ములకుఁ జేటునపెట్టఁ జలింప కంతకున్.

కళా. ౬. ౭౫.

పైరు = పయిరు. వి. (క. పయిర్. త. పయిర్.

బ. పైరులు, పైర్లు, పైళ్లు.) ౧. సస్యము, చేను.

సీ. పై సంగను బయిరుకా పకి యనఁ గాను సస్యము చెలఁగు ...

ఆం. భా. ౨. ౩౮.

చ. .. పువుఁదేనియసోనకాలువల్, జనముల పైరుపంటలకుఁ జాలవె యిన్నటికైన నెన్నఁ గఁ .

ప్రభా. ౧. ౨౭.

ఉ. కొల్లగపెల్లపైరులను గొంకును జంకును లేక మేయఁగాఁ, దల్లడిమంది వచ్చితిమి .

నీలా. ౨. ౫౪.

౨. మొదటిపంట తర్వాత పొలమున పెట్టెడు సస్యము.

వ్యవ. మొదటిపంట సొమ్ము దానిది దానికి సరి పోయినది. పైరువలన నాలుగు వందలు వచ్చినవి.

౩. ధాన్యము.

వ. కలియుగమహిమలు కాపరులు కాశీ ప్రయాగలు ఎక్కిరిములు గమ్మసరులు అను నూటనాలుగు వగల పైరుల చేరుదు బియ్యంబు పటిపసారంబులు .

ప్రబంధ. ౧౧౭.

గీ. పచ్చడంబులు సెనగలు పంచదార, పనస పండ్లును కొబ్బరులు పెల్లి పప్పు,బియ్యములు కూరగాయలు నెయ్యి మేఁక,పోతులాదిగ గొంచు విద్యార్థి మెలసి.

పట్టక్రి. ౨. ౮౭.

౪. ఓషధి. (చూ. పైరులరొకిమీఁదు.)

ప్రయోగ విశేషములు : పైరుగాలి.

పైరుధాన్యములు = పెసలు, మినుములు సాళ్ళలు. మొ.

వ్యాక. పైరుగాలి వీఁచినచోఁ బైరు పెరుఁగును.

ఉ. పైరగు, పైరులయొకిమీఁదు.

పైరులతొకిమీఁదు = పయిరులతొకి మీఁదు. వి. (√పైరు) ఓషధీశుఁడు, చంద్రుఁడు. (శ. ర.)

పైలపేటా. వి. అలంకారముగా చేసిన ఒక విధమగు అంచు.

సీ. మెలిపెట్టి చుట్టిన తెలిపరంగిముఁడాసు పైల పేటా దబ్బు పనులఁ జెలఁగు
శుక. ౨. ౪౨౬.

సీ. మెలిగొనఁ జుట్టిన తలపాగచెఱఁగుంచి పైల పేటాచుట్టు పట్టుశాలు. (హంస. ౭. ౨౩.)

పైలుఁడు. సం. వి. అ. పుం., ఒక మునివ్యాస శిష్యుఁడు.

పైవచ్చు. అ. క్రి. (పై + వచ్చు.) మీఁదికి వచ్చు, ఉపద్రవకరమగు.

వ. ఆతుఁడంబు పరిదాసగర్వంబున నుద్వృత్తుండై కదంగి.

క. ఆహరు మ ప్రకమునఁ గదు, సాహసమునఁ జేయి వట్ట జడియఁ కదియన్, ఓహో తన మెచ్చులు తన, కాహా పైవచ్చెననుచు నభ రుఁడు వీతిన్.
(భాగ. ౧౦. ఉ. ౧౨౪౦.)

గీ. రఘుకు నట్టింటిపగివాఁడు కమలవైరి, కింనుఁ బోలిన యుగ్రశేఖరుఁడు వాఁడు, మేనమామని చూడకు మాను చెలిమి, యకటా పైవచ్చు కొఱుఁగకే మారికుమార.
విజయ. ౩. ౪౨.

(కింతర్థముల కివియే యుదాహరణములు.)

పైవెట్టు. అ. క్రి. (పై + పెట్టు.) బయలుపఱచు, ప్రకటించు.

సీ. పైవెట్టమిరు కాని పైకొనతమికల్మి సత్వపులకలు సాక్షిపలుక. (కవిక. ౩. ౨౧౩.)

పై(పయి)వోవు. అ. క్రి. (పై + పోవు.) ఉన్మార్గగామియగు, త్రోవతప్పి నడుచు.

వ. కరాళింపక లాఁతసేయక పైవోవక కొక్కిరింపక ... (ఉ. హరి. ౪. ౨౧౩.)

(వీరేశ. పా. - (పయివోవు, వావిళ్ల. పా.)

పైశాచము. సం. విశే. (అ. ఈ. అ.) ౧. పిశాచకృతము. ౨. పిశాచసంబంధి.

వి. అ. పుం. ౧. పిశాచము. ౨. వివాహభేదము. (నిద్రించియు త్రాగి మైకముచెందియు శీలము పరాకుపడి యున్న దాని రహస్యముగా చెడిపికొను వివాహము. ఇది అష్టవిధవివాహములలో నధమము. శ్లో. సుప్తాం మత్తాం ప్రమత్తాంవా రహో యత్రోపగచ్ఛతి స పాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమో ఒధమః.) ౩. అయస్కాంతీవి పంఖుభేదము. ౪. దానభేదము (ఆక్రోశించుచు యిచ్చుట గాని యిచ్చి యాక్రోశించుటగాని గలది.)

పైశాచి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఒకానొక ప్రాకృతభాషాభేదము. ౨. రాత్రి. (విల్యమ్సు.)

పైశునము. సం. వి. అ. న. (పిశునభావము.) ౧. కొండెగానితనము. ౨. దూర్తత్వము, వంచకత్వము. ౩. నుప్తత్వము.

(ఇక్లీ : పైశున్యము.)

పైష్టము. సం. విశే. (అ. ఈ. అ.) పిష్టసంబంధి.

ఉ. మిటారించు కచంబులన్ జలపరించు వలగన్నులుఁ బొల్పుమీఱఁగన్
కళా. ౩. ౧౭.

౨. అతిశయించు.

సీ.... పూరకకుంభకరేచకంబులనిశేషంబుతోఁ బొలుపుమీఱు. కళా. ౫. ౧౬౨.

**పొలుపె(ల్పె)సలారు.** అ క్రి (√పొలుపు) ఒప్పు, శోభించు, ప్రకాశించు.

చ. పొలుపెసలారఁగా నిసుగుపొగ్గులవాఁ భాగ్యసంపదల్, కుల మభివృద్ధిఁ జెంది
హర ౨. ౧౦౩.

చ. పురిమున దేవగేహములు పొల్పెసలారున వైభవోన్నతిన్. (కిర ౧. ౭౭)

**పొలుపొ(ల్పొ)ందు = పొలుపారు.** అ క్రి. (పొలుపు+ఒందు.) ఒప్పు, శోభిల్లు

గీ. కరము పొలుపొంది కనియంగములకాంతి.
వైప. ౩. ౧౫౬.

సీ. పొలుపొందఁ గుంకుమబొట్టు పెట్టునె కాని ముద్దుగాఁ బిలకింబు దిద్దఁబోదు.
దశా ౪ ౫౮.

మ. కంటకప్రకటపై పొల్పొందు శూలంబు మిక్కుటపుఁ జెంపునఁ బూని
ఉ. రా. ౨ ౧౦౨

**పొలుపొదవు.** అ. క్రి. (పొలుపు + ఒదవు.) అతిశయించు.

క. కొలిచినజంటలఁ గోర్కులు, పొలుపొదవఁగ . (నీలా. ౧. ౭౧)

**పొలువ = పొదువ.** విశే. ౧. దుష్టుఁడు, చెడ్డవాఁడు.

క. . . . ఘోరపాపము సేసినవాఁడగు, నా పొలువ యసంగి విందు మూర్ఖులచేతన్.
భార. శాంతి. ౩. ౪౩౯.

౨. దీనుఁడు, దుష్కీర్తిలో నున్నవాఁడు.

సీ. ... తిట్టియు నడిచియుఁ దిరిగినవాఁ లా పొలువలపైఁ గృపగలిమి మేలు.
భార. అను. ౫. ౧౦౯.

**పొలువడు = పొల్లువడు.** అ క్రి. తుయించు, తలఁగు.

జ పొలువతనము.

**పొలువతనము.** వి (√పొలువ) చెడ్డతనము, దుర్జనత్వము.

సీ. . శాతంబు పట్టె ద్రుపదపుత్రి నీడిచి తెచ్చి పొలువతెనమ్మున
భార. స్త్రీ. ౨. ౫౫.

**పొల్ల = పొల్లు.** వి. (సం పలాలః త పొల్. క. పొల్ల.) గింజపట్టని ధాన్యము, తప్ప.

ఆ. పాదవుమీద మగలపొల్లలు శాలుల, పొల్లలును నిజంబపోలె నుండు.
కి ౧౦ ౧౧. ౬౧౬

సీ. తుచ్ఛధాన్యాభిధ తోఁచుఁ దలు తుంక పొల్లకట్టె తలకపొల్లు పొల్ల
ఆం. భా ౨ ౨౩౮. (ప్రాఁతప్రతి. పా.)

జ పొల్లకట్టు, పొల్లతనము, పొల్లవడు, పొల్ల వుచ్చు, పొల్లపోవు, పొల్లసేయు, పొల్లాపు.

**పొల్లకట్టు.** వి. (√పొల్ల.) పొల్లుధాన్యము.

గీ. . కల్లాన కూర్పవాతఘట్టనలఁ జాలు పెనుపొల్లకట్టుపోలె. (ఆము. ౪. ౧౩.)

సీ. తుచ్ఛధాన్యాభిధ తోఁచుఁ దాలు తుంక పొల్లకట్టు తలకపొల్లు పొల్ల.
ఆం. భా. ౨. ౨౩౮. (ప్రాఁతప్రతి. పా.)

**పొల్లతనము.** వి. (పొల్ల+తనము.) ౧. వ్యర్థతా లాఘవము.

ఉ. ఱెల్లజనులుఁ జూడఁ బొల్లతనంబున, కోర్చి యక్కమారుఁ గోడి పాఱె.

భార. కర్ణ. ౧ ౧౩౩.

౨. పిఱికితనము.

ఉ. పాఱిపోయెఁ గడుఁ బొల్లతనంబున సూత పుత్రుఁడు (భార ఆ ౭. ౭. ౯.)

(పొల్లఁదనంబున, శ. ర. పా)

శ్లో ప్రత్యక్షం తవ గాంధారే ససైన్యస్య విశాంపతే, సూతపుత్రోఽపయాతో గంధర్వాణాం తదా రణాత్.

సం. భార. ఆర ౨౪౮. ౭.

పొల్లపడు. అ. క్రి (పొల్ల + పడు) తూయించు (శ. ర.)

పొల్లవుచ్చు స. క్రి (√పొల్లవోవు) పొల్లపోవఁజేయు. (శ. ర.)

పొల్లవోవు. అ క్రి. (పొల్ల + పోవు.) ౧. వమ్మగు, వ్యర్థమగు.

గీ. ఎల్లదివ్యబాణంబులుఁ బొల్లవోవఁ, జేయునట్టుగ బ్రహ్మాస్త్రం బేసెనట్టి, క్షత్రియ మహాస్త్రంబు

భాగ. ద్రో. ౪ ౮౦౨

సీ. అఖిలధర్మవిధిజ్ఞుఁ డత్రిబార్హద్వయుఁబు నకు బిడ్డలులేక పొల్లవోయె, సంసారమనుచు . (ఉ. హరి. ౪. ౩.)

౨. చెడిపోవు, నష్టమగు

ఉ. పండియుఁ బొల్లవోయె నని బ్రాహ్మణి లోపల నేడ్చు .. (ఉ. హరి ౨. ౨౭.)

పొల్లసేయు = పొల్లుసేయు. స.క్రి. (√పొల్ల.) ౧. వ్యర్థముచేయు, వమ్ముచేయు.

క. ... మామాటలు పొల్లసేయ మాయమె నీకున్.

పద్మ. ౯. ౪౧.

౨. అలక్ష్యముసేయు, నిరాకరించు.

గీ. ... ఇంతవట్టు, తల్లి యును నేమఁ జెప్పినఁ బొల్లసేసి, దానికల మిన్న దానుగాంధనుఁడు గనిగ్రి భీష్మ ౩. ౬౩.

పొల్లావు. వి. (√పొల్ల.) కల్ల, అసత్యము.

సీ. కొల్లావు మాన్మ పొల్లావు లే దొండుఁ బలఁచిలి నది గాదు (ప్రబంధ. ౭.౨౭.)

పొల్లు = పొల్లు. వి (సం. పలాకః) ౧. గింజలేని ధాన్యము, తప్ప

ఆ కేవలము దోసిళ్ళఁ దపముంజేయుట కలము పొల్లస, వాయము సేయుఱుగా . .

భా ౧౦. పూ. ౪౪౧.

క. పొల్లున బంచినవియ్యము, తెల్లనికాకులును లేవు తెలియ సుమతీ. (సు. శ. రా.)

౨. నిరర్థకశబ్దము, పొల్లుమాట.

ద్వి. పొల్లు క్రియు ఒడ్డ పొడుపు సంఘటన.

పండితా. దీక్షా. ౭. పా.

వ్యర్థలేని పూ

క పొల్లలయి తమ వట్టును, పొల్లులు ప్రాణములతోడ (ఆప్ప. ౨. ౩౭.)

విణ. ౧ వ్యర్థము, నిష్ప్రయోజనము.

గీ. జముసిలావుఁ, జేవయును బొల్లుగాఁగాఁగచేసి విడిచె (నృసిం. ౨. ౧౯౭.)

సీ. మాతలం పొకటి పొల్లగునె . .

రాఘవ. ౧. ౪౩.

౨. నిస్సారము, సారములేనిది.

గీ. ఇంత మాలోన గట్టి పొల్లేరుపఱచి, చెరుగఁ జక్రంబు చాలదె శ్రీహరీని.

దశా. ౯. ౭౦.

౩. న్యూనము, తక్కువ.

౧౪ సంభవించు, ఘటిల్లు.

సీ. కర్జభూరము ప్రభావతీకోడు కోటలో యనుకరిపు జయమైనఁ బొసఁగ దనుము.

ప్రభా. ౧. ౧౨౯.

౧౫. ప్రకాశించు, శోభించు.

సీ. వనజగర్భునివరించుబ నిమ్ము‌లింపఁగాఁ బొడమిన శశి యనఁ బొసఁగ మోము.

జామ్మణి. ౧ ౯౯.

౧౬. ఒప్పు, పొందు.

వ నీమది రెట్టిదానిఁగాఁ, బొసఁగ నెఱుంగ వైతి నను .. భార కాం. ౬. ౨౧౯.

సీ కలలోనఁబుట్టినకథలెన్ని యున్నియుఁ బూని గ్రుచ్చినయట్లు పొసఁగఁ జెప్పు.

కాం. ౬. ౬౦.

జ పొసఁగింపు, పొసఁగుడు, పొసఁగుడు కాఁడు

పొసఁగించు. స క్రి. (√పొసఁగు.) ౧. పొసఁగఁ జేయు, సమకూర్చు

క కదియించి గబ్బిగుబ్బల, పొమగున నీడేర్చు చెఱులఁ బొసఁగించి సఖీ

హంస. 3. ౨౭౨

౨ చక్కఁగాఁ బెట్టు, నాటు

సీ అలిక భాగమునఁ జింతాకుపెడల్పుగఁ బొసఁగించుకొన్న కస్తూరిరేఖ. (శుక. ౨ 3౨)

3 గ్రహించు, పట్టుకొను.

సీ. అంబుజనిశ్శాంబరాంచలమ్ములు గేలఁబొసఁగించి పలుమారు విసరువారు.

ఇందు. 3. ౯౯.

పొసఁగుడు. వి. (√పొసఁగు.) పొసఁగుట, అనుకూల్యము, ప్రా ప్తి. (శ. ర, బ్రౌ.)

పొసఁగుడుకాఁడు. విశే. (పొసఁగుడు+కాఁడు.) నేరము పొసఁగఁజేయువాఁడు.

(వ్యవ.) పొసఁగుడుకాండ్ర మాయలోఁ పడకుము.

పొసక. వి. తుండిలుఁడు, అంద.

సీ. .. పొట్టవాఁ డనఁగను బొసక యనఁగ... తుందిలనామమై తోఁచుచుండు.

ఆం భా. ౨. ౧౭౦.

పొసపరి. క్రి. విశే ౧. మిక్కిలి, అత్యంతము.

ద్వి. పొసపరి కూన్యదుత్పోధలఁ దగిలి, భవితం బలందని పాతకులార.

(బస. పు. ౬. ౨౧౯. పం.)

ద్వి. బసవయ్య యంత్రముల్ పన్నుటఁజేసి, పొసపరి మాతోడఁ బోరుచున్నాఁడు.

బస పు ౫ ౫౭౪. పం.

౨ విస్తృతముగా, విశాలముగా.

ద్వి పొసపరి వస్త్రిల్లు పొట్టచెర్వునఁ, వసకు లేబ్బారును గ్రుచ్చి నైపించె

పండితా. వాద. ౨౦౦. పా.

పొసపొస క్రి విశే త్వరితముగా (శ. ర)

పొసపోరు వి. (√పోరు. క పొసపోర్.) పసతోఁ పోరువాఁడు.

క యన్యులతోఁ డన్, బొసపోరై బండారువు, బసవఁడు కిన మైత్రి త్రావి భ్రుకుటిఁజై రుద్రా శివ. సా. ౪3౧.

పొసరాకు. వి దగ్గుకై మూచూచు నొక ఆకు. (శ. ర.)

## పో

పో. అ క్రి. ౧. పోవుధాతుప్రా ప్తివాద్యర్థక మధ్యమపురుషైకవచనరూపము. (చూ. పోవు.)

(వ్యవ) నీయింటికి నీవు పో

౨. (క) ఆవ్యయముగా ఉపయోగపడుచు 'కదా ' యను దాని యర్థమునిచ్చుచు నిశ్చయాశ్చర్యాదులను దెలుపును.

౩. (పోఁకకాయవలెనుండు) శిశ్నాగ్రము. (గ్రా.)

౪. బొందము ఒలిచిన పూగఫలము. (గ్రా.)

౫. చన్ను, స్తనము, చనుమొన, చూచుకము. (గ్రా.)

౬. ముద్దుకోరికలు. (గ్రా.)

పోఁకయంత = పోఁకకాయంత, కొంచెము.

క. అఁకొంటి రెన్నిదినములు, పోఁకంతయు
భిక్ష పెట్టఁ బుట్టకయునికిన్
భీమ. ౨. ౧౨౪

గీ. కేఁడి కుఁగుదాఁక నోరవ వాచు గలిగెఁ,
బులిసినది గరె నన్నంబు పోఁకయంత,
కొఱఁగి పాండు. ౪. ౧౫౪.

చూ: పోఁకలంత.

క. అచట మహీధరములు, పోఁకలంతలైనఁ
బొడచూపఁబోక యున్నె.
దశా. ౯ ౧౧౫.

పోఁకకుఁగైకొనక = పోఁకకేనాఁ గైనఁ జూడక, ఎంతమాత్రమును లక్ష్యముసేయక.

ఉ. . ప్రాణ మొకపోఁకకుఁగైకొన కుందు
సాహసుల్. నైష. ౬. ౪౨.

ఉ. వచ్చి నృపాలుఁ జూచి జనవల్లభ వాదస
మాహమంతయున్, బొచ్చెము చేసి నన్ను
నొకపోఁకకుఁగైకొన కివ్విధంబునన్, జెచ్చెర
నేఁగుదెంచి రుక్మాం. ౪. ౫౩.

పోఁకకుఁబుట్టెఁదమ్మ = మిక్కిలిచవుకఁగానమ్మ.

గీ. చల్లపడె నేల సకలసస్యములుఁ బండెఁ,
బుడమి ధాన్యంబు పోఁకకుఁబుట్టెదమ్మ.
వరాహ. ౧౦. ౩౩.

గీ. కొట్టుకొని కొల్చు పోఁకకుఁబుట్టెదమ్మ,
శ్రీరఘుస్వామి రాజ్యంబుసేయునపుడు.
ఉ. రా. ౮. ౧౪౧.

చూ: పోఁకగంజి, పోఁకపేరు.

పోఁకగంజి. వి. (పోఁక + గంజి.) క్రముకఫల సారము, కాఁచు, కవిరి. (శ. ర.)

పోఁకపేరు. వి.(పోఁక + పేరు.) భక్ష్యవిశేషము. (మునిశిష్యులవర్ణనము.) సీ. పోఁకపేరు లాసంగఁ బొంకపుజపమాత్రవలయంబు లని మెడవైచు వారు. (చమ. ౩. ౮౫.)

పోఁకపొత్తి. వి (√పోఁక) క్రముకపర్ణపుపట్ట, పోఁకయాకులకు మొదటనుండు కెరలైన మెత్తనిభాగము.

ద్వి. అలివంకి లతేటఁ గలిసము, పాలుపారు
ననుపోఁకపొత్తిలోపలను
ద్వి. పరమ. ౭ ౫౧౦. పా.

సీ. ననుఁబోఁకపొత్తిఁ గుట్టిన గొప్పగమితోడ
రంభాకరాలపన్నములు పఱచి.
ఆము. ౧. ౬౭.

పోఁకబంతిపువ్వు : ఒకజాతి బంతిపువ్వు, ఒకానొక పువ్వు (శ. ర.)

పోఁకముడి. వి (పోఁక + ముడి.) స్త్రీలు ముందు వైపు వైచుకొను చిన్నకోకముడి, నీవి

సీ. వడిఁ బొప్పచోఁ బోఁకముడి జాఱి వలువ
కేలుగొని నా తంబు గదిసె నొకతె.
ఇందు. ౬. ౫.

గీ. గదర పోఁకముడి పిడిఁ జెలి పొగడ కేఁటికి
నిక్కెఁ, బోఁకప్రాఁకులయొగ్గిపొద చీకటికి
నిక్క. ఉ. రా. ౬. ౬౧.

సీ. వరకంఠపూగసందడ గన్నము నీకు సతి
పోఁకముడి యంత నడల రాగ
చంద్రి. ౬. ౧౨౭.

పోఁకప్రక్క. వి. (√పోఁక) పూగఖండము, పోఁకచెక్క.

చ. నోరికిఁ బోఁకప్రక్కకున్, గుడుపఁగఁ
గూటికిన్ మొలకుఁ గోకకు ...
కేం. పంచ. ౧. ౪౩౩.

**పోఁకుండ.** వి. (పోఁక + కుండ) పోఁకకాయ వలె గుండ్రముగాఁజేయు తియ్యని భక్ష్య విశేషము. (వా.)

**పోఁకొత్తు** వి. (పోఁక + ఒత్తు.) పూగదళిని, పోఁకచెక్కలను కత్తిరించు సాధనము, అడకత్తెర.

సీ. పోఁకొత్తు వాఁగిన బూగదళిని,దనరు
ఆం భా. ౨ ౧౬౭.

**పోఁగు = ప్రోఁగు** వి తంతువు, దారము.

సీ. . . తంతువుగాఁ జెలంగుఁ బోఁగు పోఁచనఁగా . ఆం భా. ౨. ౨౮౪

క.. గాలిఁ ద్రవ్వినపోఁగుల్, జాతినపోఁగులు నడుకం, దీరుపనే కాని నిలువఁ దీరక దినముల్. కాళి. ౨. ౯౭.

౨. పోఁగుఁద్రాడు, వేఁటాడుచోటఁ జొట్టును బిలుచు రజ్జురూపమైన మృగబంధనవిశేషము, వాగుర, ఉచ్చు

క. ఈ పోఁగునకుఁ దగుల్పడనదియే,యట్టుండ నవ్వె చెప్పుము ప్రభా ౪. ౭౬

క. నానావిధపటఖండంబైన పోఁగు, వాటేరి కలయన్. వరాహ. ౪౭౬.

క. మిడిబోనులఁ గాలుచ్చులఁ బడఁదోలియుఁ బోఁగు లోనుబఱిచియు
యయా. ౨. ౧౯.

3. కర్ణభూషావిశేషము.

సీ. పోఁగు వాఁ దంతువును గర్ణభూష మీఱు..
ఆం. భా 3 ౫౬౫

సీ. చిలువపోఁగులను ద్రే ల్వెవులఁ గీలనఁ జేసి వలరాచనీలు మైఁ గలయ నలఁది.
హర. ౫. ౫౫.

గీ. చెవుల రుద్రాక్షపోఁగులు శివుకళింప.
మను. ౧. ౪౯.

౪. (ముక్కునఁ బెట్టికొను) బంగారుమున్నగు వానితోఁ జేసినకాడ.

ఉదా ' ముక్కుపోఁగు. (గ్రా )

జ : పోఁగుచుట్టు, పోఁగుపోఁత. పోఁగుపోయు, పోఁగువాఱించు, పోఁగువాఱు.

**పోఁగుచుట్టు=ప్రోఁగుచుట్టు** వి. (√ప్రోఁగు) వేఁటకుపయోగించు సాధనవిశేషము.

గీ చలిదిచిక్కంబుఁ దిడవిండ్లు సాయకములు, పోఁగుచుట్టలు దీమము లుప్పుఁగు వలలు
సానందో. ౫. ౫౪.

**పోఁగుపోఁత** వి పోఁగుపోయుట (శ. ర.)

**పోఁగుపోయు.** అ క్రి (పోఁగు + పోయు.) సంతనకై తిన్నఁగా పోఁగుపాఱించి కట్టు, రప్పదీయు (శ ర, గ్రా )

**పోఁగువాఱించు=ప్రోఁగువాఱించు.** స క్రి (√ పోఁగువాఱు.) పోఁగువాఱు.

మ. అల్లన నానామృగసంఘముల్ మెలఁగు పల్లన్ బోఁగువాఱించి మఱును భాను ష్కులు ఉ రా. ౭. ౪౦౭.

**పోఁగువాఱు = ప్రోఁగువాఱు** అ క్రి. (పోఁగు + పాఱు ) పోఁగుగతి వ్యాపించు. (స. క్రి ఆవరించు. శ. ర.)

క. ఇం దుండి పోఁగువాఱుం, డిందందు న్వలల నొడ్డుఁడు . కరు. ౪. ౭౨.

సీ. కొఱకొఱఁ బరువిడి మఱలి కోరలు చాఁచి పొదలు దూఱుచుఁ బట్టి పోఁగువాఱి.
రసిక. ౧. ౧౦3.

వ.... ఆడాడ బోను లొడ్డించియుఁ బోఁగువాఱు నియమించియు .. చంద్రా. ౨. ౮౪

**పోఁగొట్టు.** స. క్రి. (పోవు + కొట్టు.) ౧. పగులఁగొట్టు, పాడుచేయు.

ద్వి. వాఁ డంతకార్యంబు వడిఁ జేర్చి పిదప, పోఁడిమిగాఁ దనభుజసత్త్వ మెసఁగ.

ద్వి భార. విరా ౮ ౬౮ పా

క. మోదముగలవాని వేడుకల పోఁడిమిచే, నైదువగల కైదువుగల

ఇందు. ౪. ౪౩.

౬. గౌరవము, మర్యాద, మానము.

క. సేన వారిఁ దొలఁగినం, బోఁడిమి చెడదే

భార ఉద్యో. ౮ ౩౫

సీ పిలుపు గల్గినవాఁడె ప్రియములు సిద్ధించుఁ బోఁడిమి గలవాఁడె పొసఁగు మాట

నీతి ౨౨

మ. ఇపుడీపోఁడిమి చాలఁ గాఁపురముపాం డేలా విసర్జించెదర్

శుక ౮ ౫౬

క వాఁ డెవ్వఁడో యెఱుంగిమి, పోఁడిమి చెడ లజ్జ గోలుపుచ్చె నను మఁ బూఁ, బోఁడి మగిచునెద

ఉ హరి ౫ ౧౩౩

౭ పరాక్రమము, శౌర్యము

క నేఁ డెమ్మెయినైనను నీపోఁడిమి నెడఁ దోఁప తవిలి పొదువుదు నిన్నున్.

భార భీష్మ ౩ ౩౨

౯ శక్తి, సామర్థ్యము

ఆ . చిత్తమునకుఁ, బుట్టెఱుంగునట్టిపోఁడిమి నొసఁగితి

భార అను ౮ ౩౯

౧౦ రూపు, ఆకారము

మ ఘనత న్నీమగపోఁడుముల్ పలుమఱుం గన్నారఁ గన్నారమే

(భాగ ౭. ౩౭౭.)

ఉ. చేడియ యై యతం దరయఁ జెంది యమాత్య సుహృద్భటాదులన్, వాడఁగ నందఱున్ దనకు జోడుగఁ గైకొని రాఁడు పోఁడుముల్, గోడిగచంద మొందె వలభూటుక రత్నము తళ్కు బింబునన్ ఉ. రా. ౪. ౮౨౫.

౧౧. విస్మయము, కీర్తి

వ .. వసువులందు హవ్యవాహనునిపోఁడిమి నాదిత్యులందు విష్ణుపుకరణి

భాగ. ౧౨. ౮౭.

చ . రువన్నరోషసం, పుటమున నాఁడులాగు మగపోఁడిమియుం గలదంచుసంతతుల్.

శాకుం ౩ ౯౯.

౧౨ చేష్ట, పని, పడపడి, ప్రవర్తన.

ఆ. పొలఁతి యాలిమగనిపోఁడుము లేమియుఁ గలిగినట్టిచొప్పు గానరాదు ...

కళా. ౮ ౬౫.

ద్వి ధనధాన్యవస్తువుల్ దగ నిత్తు ననుచు, మునుకొని మగపోఁడుములఁ జేయఁ బూని

౬ మ ౪ ౧ ౩౮. పా.

(మగపోఁడుములు = సంభోగక్రియలు)

క పెదబదుగుంజడదాపుల, చెనుగుంబోఁడు ములఁ దిరుగఁ జేయుట యరుదే

(చంద్రా ౩ ౩౫.)

ఉ. జగత్ప్రాపకీర్తి గాంచి తిది పాడిరు నీ కిటువంటి పోఁడుముల్

(కళాం ౩ ౪౫)

౧౩. లక్షణము, ధర్మము.

సీ. పాలిరడ్డికి మగపోఁడిమే లేదు గా గాది కేలాగునఁ గడుపు నిక్కె

శుక ౨. ౮౨౨

(మగపోఁడిమి = మగతనము, పుంస్త్వము)

౧౪. అవధానము, ఏకాగ్రత

ద్వి. పరఁగఁడిత్రయానందశాస్త్రపూరములఁ, జిర కాలంబుబునుల మజ్జనము గావించి పోఁడిమి సీమూర్తి పొదగఁ గలిగె.

ద్వి. పగమ. ౨. ౯౭. పా

(రూపణిపోక = పూర్తిగా రూపణుట.)

అదే పోకగాఁబోవు. ౧. పోయిమరలరాకుండు.

(వ్యాక.) అదేపోకగాఁ బోక త్వరగా రమ్ము.

౨. తిరిగి చూడకుండఁ బోవు.

క. ఇవ్విధంబున నిజరథంబు విఫలమనోరథంబై
పోయిన నదియుపోకగాఁబోయి
భాగ. ద్రో. ౪. ౧౬౬.

పోయినపోక = పోయినవారు పోయినటు
పోవుట, మగల రాకుండఁబోవుట.

సీ. పోయినపోకలై పోయిరి స్త్రీలు దిక్కా
మొగిమగలైర దిగ్భటులు
పారి ౫ ౩౭

కి. బలసిరి రిక్కలను లనిలోఁ, బొలిసినవారెల్ల
మనుచుఁ బోయినపోకై, నిలిచిరి వెల్వలు
మగుదఁ, దలకొనుబ్రదుకాసలేమిఁ, దలఁ
పవు దీనిఁ (మయా. ౩. ౧౦౭.)

పోయినకేపోక = నడచినదే మార్గము, స్వచ్ఛంద
ప్రవృత్తి.

ద్వి. బాయలఁగా, జాడఁ దలఁతురు కాము,
పోయినజేపోక పొసఁగ నానవరు.
ద్వి. పరమ. ౩. ౧౫౫. పా.

పోకడ. వి. (√పోవు.) ౧. గమనము.

ఉ. పోకడరాకడల్ వశముపోవక మన్మథుఁ
డాన వెట్టిన, ట్లాకలకంగి నిల్చె
కృ. శతిం. ౨. ౫౮.

౨. చేష్ట, ప్రవర్తనము, నడత.

ఉ. మనపోకడ లేమని చెప్ప నాటలే,
కాని నృపాత్మజం దలఁపఁ గానము ..
కళా. ౬. ౨౪౪.

౩. నీతి, మర్యాద.

ఉ. . ఈకృతఘ్నునిం, బోరిగొని వే తినం
దనిపఁ బోకడమాలినవార మయ్య...
భార. శాం. ౩. ౫౦౫.

సీ. . . ఆరాజు నైజకృత్యంబు చెప్పఁ, గట
కటా యేల పోకడమాలి బ్రహ్మోద్భవం
బను పేరి దివ్యాంబుజమున, కొగ్గ దలంచి
తివి వరాహ. ౯. ౭౧.

౪. మరణము, చావు.

చ. ఇటు దగునయ్య కూరులకు సెల్లను బోకడ
యిట్లు కాద యే,మిటికి నలందురన్
భా. ద్రో. ౨ ౨౫౭.

(ధరితుఁడు) చ గాఘవుఁ గాంచి తత్పదాం,
బుగహమడాలి గ్రై జడపోకడ నేడ్పొద
వన్ వచించుచున్ (౧౦. రా. ౪.౧౦౭.)

౫. నాశము, భంగము

ఉ. ఏకడఁ బొచ్చునో సుకృత మెచ్చుట
డాగునో తృప్తి యిప్పుడో, కాంతి కం
దణఁగిపోవునో సౌఖ్యము .
కవిక ౫. ౧౨౮.

పోకడపె(వె)ట్టు. స క్రి. (పోకడ+పెట్టు.)

౧ విడుచు, త్యజించు

ఉ దూతికా,లోకము మాటతీపులకు లోఁబడి
ధీత్యభిమానలజ్జలం, బోకడపెట్టి
నైష ౩. ౪౨. (క. ర. పా.)

౨. పోఁగొట్టుకొను, నాశముచేసికొను, పాపు
కొను.

చ. . ఆ మనుష్యుఁడును దీర్ఘఫలం బఖిలంబు
గాంచి యుం,బురహదకాతు పాపములఁ
బోకడపెట్టుఁ బురార్జితంబులన్.
కాశీ. ౫. ౪౮.

౩. వ్యయించు, వెచ్చించు

సీ. కలధన మెల్లఁ బోకడపెట్టి సన్యాసి యై
చిచ్చు మెత్తని యగ్రజాండు
హంస. ౫. ౧౨౦.

౪. విక్రయించు, అమ్ము.

ఉ. . మదీయభార్య సత్పుత్రవతిన్ ధనార్థి
నయి పోకడ పెట్టెద రండు విల్వఁగన్.
హరిశ్చ. ౪. ౪౪.

ఉ. . నన భర్త ఋణంబునకై ధనార్థి యై,
మానితసత్యవాణ్ని నట మానక పోకడ
పెట్టెఁ దాలిమిన్. (హరిశ్చ ౫. ౪౮.)

పోకమాను. నా. రొంపిమాను. (దమ్ముచేసిన
పిమ్మట మిట్టపల్లములు పోవుటకు మీఁద
పాఱించెడుమాను) లొల్లి, చదునుపట్టె (శ. ర.)

పోకలాఁడి. విం (పోకలు + ఆఁడి.) మాయ
లాఁడి, కపటశీల.

క. చూపట్టఁగ గోమయమునఁ, జేప ట్టొనరించి
జదలఁ జెక్కెనర్గంగం, బా పోకలాఁడి
గైకొని, వేపికడ న్నిలిపి భక్తివివశయు
పోలెన్. శుక. ౨. ౩౭.

పోకలాఁడు. విశే (పోకలు + ఆఁడు) కపట
శీలుఁడు, మాయకాఁడు.

గీ. త్రిపురకాంతలశీలంబు లపహరింప, బుద్ధ
వేషంబు గైకొన్న పోకలాఁడు
కాశీ. ౬. ౪౨.

పోకాడు. అ. క్రి. (పోక + ఆడు.) ౧. పోవు,
పాఱిపోవు.

ద్వి నీవేల పలంప నీకుమారునకు, నీకును గాఁ
జెడ నేఁ డోఁపఁ జెల్లఁ, బోకాడినట్టి
యా ప్రోదని ద్వ, వారఁ బోలునుగాక.
ద్వి హరిశ్చ. ఉ. ౧౭౯౪. పం.

౨. నశించు, చెడ

గీ.. అల్లనైరి, చెలువు వోకాడి బింబావశిష్టుఁ
డగుచు, వల్లవల్లన ప్రాలెడు నంబుజాతు.
పారి. ౭. ౫౭.

పోకారుచు(ర్చు). స. క్రి. (√పోకాడు.) ౧.
చంపు, చంపుకొను.

క. ... అర్థిం బడి తన్నీకరలోకము పొర్చెఁగఁ,
బోకార్తు దశాస్య నతనిపురి నీ కర్తున్.
భా. రా. యు. ౧౭౪.

కి. పుత్రా, నీ కు మన్మద్బాంధవులం,
బోకార్చితి ప్రకుటు టింకఁ బోనఁగుచె
చెప్పుమా భార. స్త్రీ. ౧. ౧౩.

౨ పోఁగొట్టు, పోఁగొట్టుకొను.

(కి) నాశమునొందించు, భగ్నముచేయు, చెఱచు

శా. ఇచ్చటం బ్రాణము, లొప్పకారిక
దుది సాదువేలుపునకై బొంకక నిజం
బింకయుఁ (కాశీ. ౩. ౭౭.)

కి. ఈకాయ మనలముఖమునఁ, బోకార్చి
యులూకయోనిఁ బుట్టి
శేం. పంచ. ౨౯౬.

కి శోకము బుద్ధిం, బోకార్పుఁ గావఁ
దాలిమిఁ, గైకొని శోకంబు నడువఁగా
వలయు నృపా. (భా. రా కి. ౧౦. ౩౧.)

మ. హనమంతుం డను నేఁటిమాట పతికాగ్యం
బట్లు పోకార్చి యీ, వని నెట్లం డెదుపార
మాదొరకు దవ్వా యిర్వనంబు ...
చం. రా. ౬. ౭౦.

(చ) ఁదఁచు, అపనయించు.

మ. కటపృథ్వీజావళీ వ్యాపకులో, బకి
యించెక లహరీసమీరకుల నత్యక్రాంతి
పోకారిచెక. కవరా. ౩. ౨౭.

క. . జన్మాంతర, మునసైనం బాపసమితిఁ
బోకార్తు నిటక. శేమ. ౧. ౧౪.

సీ. అఖిలకంటకుఁ డైన యల నికంకటదైత్యు
డటు పోకార్చినయతఁ డితండు.
రాజ. చ. ౨. ౧౧౭.

(ట) పొపు, పొపుకొను.

ఉ. కెంపులచూపు పెంపెసఁగ దవిల్చినమంచము సౌడిగావునుం, బూనినప్రేంకశిల్పఁగని పోకులఁ బోయిన పెన్నుఁ డిట్లనున్.

ఉ. హరి. ౨. ౧౪౮.

౨. చరిత్ర, వృత్తము

గీ. . కొడుకు కపట సైనయున్ని పోకిలను జూడఁ, గడపె నాఱును నై దేండ్లు కద్దము నకు నా. ౪. ౬౨.

క. శ్రీకిరిచంద్రికల వీ, దగ్రస్త్రీవనితలు లలరఁ దలకొలిపెడు నీ,పోకల పోకలపారుప, మూకముదహితాన్వవాయుఁ డగుభూపతికిన్.

కావ్యా. ౬ ౩౫

౩. నష్టి. (౧ ౮)

పోకు² = పోపు. వి. పచ్చిక, ఎచ్చుగడ్డి.

సీ. కేకువకడఁ బోయి పోకు మేయఁగఁ బాఁడి యావులఁ బొదిలి వెంగాడ నేఁడు.

హరి. పూ ౬౯.

గీ. ఇట్టిగోరత్న మొక్కటి నాఁ డేకతంబ, పోక మేయుచు నుండి బెబ్బులి యొకండు, దానిఁ గని భోజరా. ౪. ౧౨౯.

క. వా ఁ,ప్పుడు మునుపటి సెలవు వదలి పోకు మిగులఁగం, దొడుకులకు ...

నీలా. ౧. ౬౫.

పోగండుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వికలాంగుఁడు. ౨. న్యూనాధికాంగుఁడు, ఎక్కువ తక్కువలుగానుండు అంగములు గలవాఁడు. ౩. అయిదేండ్లు మొదలుగా పదియేండ్లవఱకుఁ గల వయస్సుతోఁగూడినవాఁడు. (బాలుఁడు.) అపోగండుఁడు. ౪. యువకుఁడు. (శే. ని.)

పోగర. వి. పక్షి చెక్కుటకై స్వర్ణకారు లుపయోగించెడి సాధనవిశేషము. (దీని భేదములు: పెకట్టుపోగర, దబ్బపోగర, గోరుపోగర, కోతికాలుపోగర, గుబ్బపోగర, తిమ్మపోగర, కమ్మపోగర, మసపోగర. శ. ర., ప్రా.)

పోగిస. వి. బాలక్రీడావిశేషము.

సీ. గోటదొర్లుడుకాయ గొబ్బిళ్లు జాపిళ్లు నీగ పోగిస బంతి దూగిలాట.

హంస. ౩. ౧౪౬.

పోగు = ప్రోఁగు. వి. (సం. పూగః. క. పోగు. త. పోక్కు) రాశి, కుప్ప.

ఉదా. పెంటపోగు, వడ్లపోగు మొ.

పోచిల్లు = ప్రోచిల్లు. వి బ శకునము చూచుట్ - ఉపశ్రుతి - ఇరుగు పొరుగిండ్లమీఁద గిల్లతోఁ జల్లుసక్షతలు (అక్షతలు మన్నగునవి చల్లుట, ఉ. ప్ర తి ని శ ర)

ద్వి ఒనరంగఁ బోచిల్లు వోతురు మఱియు, గద్దె బాపింతురు గౌరి నోముదురు.

ప్రభు. ౩. ౧౯. పా. ౨౨. పం.

సీ. ప్రాస్థనాక్షతలు పోచిల్లు నాఁగ .

ఆం భా. ౬ ౨౫౩.

సీ చెలువుండు నను నిరీక్షించునా ప్రియముతో ననుచుఁ బోచిల్లు నిత్యమును బోసి.

రుక్మాం. ౩. ౨౨౩.

పోట. .ణ. పెద్ద (దీనికి వ్యస్తప్రయోగము కాన్పింపదు.)

(మా. పోటకత్తి, పోటముంజి)

జ పోటకందులు, పోటకత్తి, పోటముంజి.

పోట. సం. వి. ఆ. స్త్రీ. ౧. పురుషలక్షణము గల యాఁడుది, మీసముగల యాఁడుది. ౨. దాసి. ౩. స్త్రీపురుషచిహ్నములుగల నపుంసక వ్యక్తి ౪. రాజ్యము పరిపాలించు స్త్రీ, రాణి. (శే. ని.)

పోటకందులు. వి. బ. (పోట + కందులు.) పెద్దవిగానుండు తెల్లకందులు. (శ. ర.) (పోటికందులు అని ప్రా.)

పోటకత్తి. వి. (పోట+కత్తి. క. పోడుకత్తి.) అడవి నఱుకెడు పెద్దకత్తి.
ఉ. తోరంపుఁ బోటకత్తుల నడుమ్ల సమగ్రము గాఁగఁ గొట్టి . (పరమ. ౧. ౧౨౪.)

పోటకము. వి (సం. స్ఫోటకః ప్రా పొటక్.) దేహమంతయు బొబ్బలు లేచెడి రోగవిశేషము, స్ఫోటకము
సీ. పోటకి మంచనఁ బాటక మంచన స్ఫోటక సామపై పొలుపు గాంచు.
ఆం. భా. ౨. ౧30.

పోటకి. ౧౦ వి. ఈ. స్త్రీ. తైలయంత్రము. (వై. ని)

పోటకుఁడు. సం. వి అ. పుం. సేవకుఁడు. (విల్యమ్సు, ఆ ని)

పోటగళము. సం వి. అ పుం ౧. పకిము, తెక్కుసగడ్డి ౨. కాశము, రెల్లు. 3. మత్స్యభేదము ౪ ఒకజాతి పాము. (వై ని)

పోటన. సం వి. అ. స్త్రీ. కఠినవాక్కు (వై. ని.)

పోటనబంతి. (పోటు + బంతి.) పుట్టచెండు, ఎగుఁగొట్టి యాడెడు వస్త్రాదికృతమైన బంతి.
సీ. పూగు త్రేపణి పోటనబంతి యనఁగ
ఆం. భా. ౭. 30౭.
ఉ. పోటనబంతి వోఁటుగతి భూవరుఁ డంఘ్రి నఖాంచలంబులఁ, మోఁదిన గట్టు బిట్టెగసి
వసు. ౨. ౧౫౬.

పోటము సం. వి అ పుం ౧. కేళ్ళభూమి, ఇల్లుకట్టఁదగిన భూమి. ౨. ఒకటిగాఁ గూర్పుట.

పోటముంజి వి (పోట+ముంజి) పుట్టగోఁచి, పెద్దగోఁచి (శ ర.)

పోటరి. వి॰. (పోటు+అరి క. పోట్టరి) శూరుఁడు.
ఉ. ... ఒక్కరుఁడును గాడు కూడ దగఁ గగ్గెఁ పోటరు లైన భర్తకృపురుగల రంటి . .
శార. విరా. ౨. ౨౫౪.
ఉ. . . మదించి యంకెలిడు పోటరిగిబ్బలతో రసెక్కి యీ, శానుఁడు వచ్చెఁ బారిషదసైన్యముతో రణకౌతుకంబునన్.
(పారి. ౪ ౭౪.)
ఉ. ... జాంబవంతుఁ డస్ఫోటరిభూరిము తమ్ముఁడు గనుంగొను మీతఁడు
భా. రా. యు. 3౪౨.

పోటరిమూటు. వి (పోటరి + మూట.) మహాశూరుఁడు.
చ ఎడపక పంచె నాతఁ డొకరయేలినవాఁ డవి పూనికాఁడవై, పొమువఁగఁ బోయు దీవు నో. పోటరిమూటవ
కు సం ౪. ౪౧౭.

పోటాడు. స క్రి (√పోటు) కలహించు. (మా పోటార్చు.)

పోటార్చు. స.క్రి.(√పోటాడు) పోట్లాడించు, కలహింపఁజేయు
వ. జూదంబు లాడార్చి పోటార్చి
దశకు. ౧౧. ౧౧౫.

పోటి. వి (√పోడుచే త. పోట్టి క. పోటి.) ౧. స్పర్ధ, ద్వేషము
సీ. లోలార్కునకు నీకు లోలోన నేమిరి పోటి పుట్టదుగదా మాటమాట. (భీమ. ౭. ౭౭.)
రగడ మదిర మది రహి మించ నమినీన, మధురిమధురస మెనపుఁ బోటికి.
చంద్రి. ౪. ౬౩.
౨. పోటుఁగంబము, ఊఁతకొయ్య. (శ. ర.)
విణ. మాఱు, ప్రతి, ఈడు, సదృశము.
గీ. సాటి సాటువ తరబడి సవతు తరము, దీటు సరి పాటి పోటి యుద్ది దొరన పాడి,

యూ దనఁగ నవ్యకావ్యా శై యొసఁగుచుండు. ఆం. భా. ౨. ౩౦౨.

సీ. ప్రవహించు నెందు శ్రీభాగీరథికిఁ బోటి
యమునాప్రవాహ్యాను యైన తటిని.
కాశీ. ౬. ౩౦౪.

పోటి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కోలుకొలసలి.
౨. మంగళయము, ప్రతిమనాయి (విల్స్యన్.)

పోటికము సం. వి. అ. పుం. కుడుపు, పుంము. (విల్సన్, ఆ. ని.)

పోటిగాఁడు విశే. (పోటి + కాఁడు.) ౧. పోటిగాఁడు, స్పర్ధి (శ. ర.)
౨. సమునుఁడు. మిత్రుఁడు

సీ. సమమిత్రులంజ్ఞలై చనుఁ బోటిగాఁడన.
ఆం. భా. ౩ ౪౯.

పోటు. వి. (√ పొడుచు.) ౧. (ఈఁటె, కొమ్ము, పిడికిలి మున్నగువాని) పొడుపు, ప్రహారము.

క. ఏటున వాటున వ్రేటునఁ, బోటున దిశా
ముఖము రౌద్రముగ నెఱుమటఁ దుమున్.
నిర్వ. ౪. ౪౭.

చ. . పులి కాటున నెద్దును పెద్దపోటునన్,
బులియు శరీరమున్ దొలఁగ
విక్ర. ౨. ౧౯౧.

గీ. అట్టు లొక్కొక్కపోటున నాలపోకు,
లన్నియును వాత ముక్కునఁ గన్నుఁగవల,
నెత్తురులు గాఱ (నీలా. ౩. ౭౫.)

౨. దెబ్బ, హాని.

గీ. పాళెమున నక్కడక్కడఁ బదిలమునకు,
బ్రోఁచఁ జేసినతముకుల మొదటిపోటు, దార
బ్రోఁకలపటహంపుధణధణలు, దొంతి గా
వింప్ల ని లున్నయంతలోను.
కవల. ౨. ౧౧౫.

సీ. దొంకలో దాఁగఁ బిడుగుపోటు తప్పదే
కా లొడ్డ నిలుచునే గాంగయుగము.
రాజలిం. ౫౯.

౩. (రోగాదులందు.) బాధ, సలుపు.

క. మందుఁ దినఁ బోటు మానును, మందుఁ
దినఁగఁ జేయఁ బొలఁతి మహిలో నలచున్.
కేయు. ౧. ౬౦.

౪. పోటు, కయ్యము.

చ. కెలవఁడు మన్న పోటు నటుడీకులతోడ
వళక్యమేని యత్తెఱఁ గది యేల నీ కుడుకు
తేర సారథి గమ్ము
భా. . 'రా ౪. ౭౩.

క. . పావితోడ నీవు లావఁ, బూ[illegible]ంచుట
పొంద్ర నీకుఁ జో టేటికిక.
ఉ. హరి. ౩. ౫౧.

౫. శౌర్యము, మగఁటిమి.

క. నా కొడుకు పోటుమాటలు, నీ కేటికిఁ
బొసఁగి నాడ నేరవు
భార. విరా. ౫. ౨౫౫.

సీ. పందకుఁ బోటు లోభగ్రస్తునకు నీగి
బోయకుఁ గరుణ నపుంసకునకు, వంగి కా
ముఖము . (పాండు. ౫. ౨౨౯.)

౬. (నదీసముద్రాదుల) ఉల్బణత, పొంగు.

గీ. . పేయింటిమీఁద సేనాబృంద్రేళ్ల, పొడవు
పోటును నాఁటు నై పొలుపు మెఱుఁగులు.
వి. పు. ౩. ౭౬.

మ. . ఒక్కరొద్దున [illegible]
లుప్పతిలెఁ బోటుం బాటుగా నెంతయున్.
మను. ౩. ౧౩౬.

(పోటుంబాటుగా = పొమ్ముతగ్గులుగా.)

జ॰ పోటకబంతి, పోటరి, పోటరిమాట, పోటాడు, పోటాడ్పు, పోటుఁగంబము, పోటుఁగలుపు, పోటుఁగూఁతలు, పోటుఁగూఁతలుకట్టు, పోటుఁగోల, పోటుకాఁడు, పోటుకానితనము, పోటుగంటి, పోటుగుంజ, పోటుగోను, పోటుదోర, పోటుపొడుచు, పోటుబంటు, పోటుమగఁడు, పోటుముట్టు, పోటులాడు, పోటువాలు, పోటొగ్గు, పోటొడ్డు, పోట్లాట, పోటావు.

పోటుఁగంబము. వి. (పోటు + కంబము.) ఊఁతగా నిలిపిన స్తంభాగికము

మ. తప్పింపు త్రిశా,గము లాక్కు, మ్మడిఁ గ్రుమ్మకేఁగుచెడ నాఁగం బూన్పుబలోప్పఁ గాఁగం,బములో నా విలసిల్లు సౌధము లవాక్షస్వగసంప్లుతన్ (చంద్రా. ౧. ౧౨.)

పోటుఁగలుపు. వి. (పోటు + కలుపు) తొల్లిక మున్నుబవానితోఁ బొడిచితీయు కలుపు (వా.) (రె ద-సారితీయు కలుపు - అని శ. ర. (బ్రా.)

పోటుఁగూఁతలు. వి. బ. (పోటు + కూఁతలు) కాకోక్తులు, బీరములు, బెదరింపుమాటలు, ధ స్న ములు

సీ. .. మావికొన యొక్క పెపెక నార్పి టోఁ జల పోటుఁగూఁతలు పెట్టసేని రాజ చ. 3. ౬౦.

ఇ॰ : పోటుమాట.

వ. పొగరువగమబ్బిన నుబ్బి తబ్బిబ్బుగా నాగు బ్బగబ్బిపోటుమాట లాడి జగడించి .. ఘటికా ౨. ౧౮౪

పోటుఁగూఁతలుపెట్టు. స క్రి (పోటుకూఁతలు + పెట్టు.) బెదరింపుమాటలాడు.

క. . వినుఁడనిమింపెదఁ గినుఁ,గొనురా యని పోఁటి పోటుఁగూఁతలు పెట్టెన్. కుమా. ౨. ౫౩౨.

పోటుఁగోల. వి. (పోటు + కోల.) ౧. మృగాదులను పొడుచుటకై కొన సన్నముగాఁ జేసిన కఱ్ఱ, ఒకానొక వేట సాధనము.

సీ. వలలును దరలుఁ బ్రోఁగులుఁ బట్టఁగా లేదు పోటుఁగో లొకటియుఁ బుచ్చలేదు. కాశీ. 3 ౩౬.

మ. . ఎద్దుల్ పోగులున్ బోటుఁగోలలు జాలంబులు .. జగుక్మీట ల.ా. ౬ బంధ ౧౯౦.

వ. వలలు పా తించి మాటు పెట్టించి తెరువులు గట్టించి పోటుఁగోలలు నించి. ... ౨. ౬౦.

౨. ఊఁతకోయ్య. (శ. ర.)

పోటుకాఁడు. విశే. (పోటు + కాఁడు.) శూరుఁడు.

గీ పాలనుమేపరు లార్వ . పోటుకాఁడు, కడఁక దిగఁద్రోచి చక్యుఁ బునిమిత్రాశ. అచ్చ. రా. యు. ౭౧౩.

పోటుకానితనము. ?. (√పోటుకాఁడు.) శూరత్వము

గీ. నే నెఱుంగను తనపోటుకానితనము ౘ హరిశ్చ. ౪ ౯౬.

పోటుగంటి. వి (పోటు + గంటి) పొడుచుట వలనఁ గలిగిన గాయము, తూటి

క మంది నాపోటుగంటి మాన్పెఁ గ్రమమునన్. దశక ౭ ౧౬

సీ పోటుగంటులు దూటి పోవుకూ లయిక్క మదివద్విరోధుల కెమియుచక్క. రాజ. చ ౨ ౪.

చ . భుజంగుల వ్యాదయుస్థలుల్ వాడిచి కొంచక తోడక పోటుగంట్లఁ గు మె, లలన ... కళా. ౧. ౩౧.

పోటుగుంజె. వి. (పోటు + గుంజ) పోట కుపయోగించు సాధనవిశేషము.

సీ. పాదిగుబ్బలు పోటుపలకలు పోటుగుంజలు చిక్కములు మరల్ జాగిలములు.

శుక. ౧. ౧౬౫

పోటుగొను స. క్రి. (పోటు + కొను.) పొడుచు

క. క్రేటువకు వాఁడు పిడికిటఁ, బోటుగొనం గిట్టి పట్టి పోకఁ బ్రాణంబుల్, పేర్చె త్త

భా. రా యు. ౩౨౦.

పోటుదొర. వి. (పోటు + దొర.) వీరుఁడు, శూరుఁడు. (విణ. శూరుఁడు అని శ. ర.)

ఉత్సాహ. .. యాశుభతనుంబున మదింపు తనకు జడిసి పోటుదొరలు దొలఁగా, వనజ మిత్త్రసంతతి ననవద్యుఁ డేరెఁ బోరికిన్.

రాఘవ. ౪ ౨౦౨.

పోటుపొడుచు. అ. క్రి. (పోటు + పొడుచు) ఉబ్బణమగు, పొంగు

సీ. అమదిగ్వపూర్వాపగాప్లవేళలఁ పోటుపొడిచి విచ్చినసీటి ఘోరరవము (కాశీ. ౪. ౬౦.)

పోటుబంటు. వి. (పోటు + బంట) యుద్ధ వీరుఁడు, శూరుఁడు

ఉ. అరిబృందము పిల్చినఁ బోటుబంట నై, యక్కడ కేల పోయితి ...

భార. ద్రో ౨. ౨౪౦

ఉ. మున్న శకతుషారమణముఖ్యుఁ దనంగ వతిన్ వరింప కేర్చఱ్ణ క్ష్మజసర్పసైన్యబల గర్వము మీఱ విదర్భమీఁద వత్తున్నత సైన్యము విడిసి యుండఁగ నీ వొకపోటు బంటవై, మిన్నక వచ్చి తేల .

విక్ర ౪. ౫౯.

పోటుమగఁడు. వి. (పోటు + మగఁడు.) యుద్ధ వీరుఁడు, శూరుఁడు. (విణ. అని శ. ర.)

క. మాటలు పెక్కాడితి వీ, పోటుమగలు వినఁగ నింకఁ బోవుట తగదు ...

భార. విరా. ౫. ౧౯.

క. పేటు లగుపోటుమగ, ల్పడ్యటన్ ఓహోరింతు రుగ్రవిక్రము లగుచున్.

పాంచు. ౧. ౧౧౬.

ఇట్లే పోటుమారివి.

ఉ చిక్కనిపోటుమారివి వివీ వినువాగలు నవ్వ కేమి గా, పెక్కుడుమాట లాడెదవు.

భార ఉద్యో. ౧. ౨౫౩. (విణ అని శ. ర.)

పోటుముట్టు. వి (పోటు + ముట్టు) యుద్ధ సాధనము, ఆయుధము

ఆ. అతని పోటుముట్టు హరి లాగించి, దానఁ జావఁ బొడిచె దానవునిని.

భాగ. ౧. ౩౪౫.

సీ. ముద్దులఁగింక ముమ్మొనపోటుముట్టును సర విలో కొండుమా సములఁ బట్టి.

వాల్మీ. ౨. ౬౧.

పోటులాడు(ట్లా)డు. అ. క్రి. (పోటులు + ఆడు)

౧ యుద్ధముచేయు, పోరు.

ఆ తండ్రి బిడ్డ యన్న తమ్ముఁడు నా కత్తి, పోయి పోటులాడి పుడమిఁ గూలఁద్రు

భార. భీష్మ ౧. ౪౭.

క. అగు నగు సరి పోటులాడి నాహుభూమిన్

దశక. ౨ ౩౪.

౨ జగడమాడు

(వ్యవ) ఆ యన్నదమ్ములు గొనుపురున విభాగము లకై పోట్లాడుచున్నారు.

పోటువాలు. వి. (పోటు + వాలు.) పొడుచు వట్టి ఆయుధము, త్రిశూలము.

ఉ. కేలను పోటువాలు దులకింపఁ దలం దొగ మేలు ... కల్గుసామికిన్.

చెన్న. ౩. ౩౯.

పోటాగ్గు = పోటొడ్డు. అ. క్రి. (పోటు + ఒగ్గు.) యుద్ధసన్నాహముచేయు, యుద్ధమునకు సిద్ధమగు.

గీ. విజిగిపోయి క్రిమ్మఱ నొకవిన్ను తెరిం, బట్టి పోటొగ్గి వచ్చెద రిట్టిదివిజా, లయిన మే మెదివినః జాత మనుచు దనుజు లఖిల సైన్యంబుగ దగ నేకముఖము సేసి

హరి. పు. ౪ ౯౦.

సీ. విచక్రుఁ డనఁగ, రైత్యేంద్రుఁ డట మున్న తిక్కుమారిద్విగుసఖుఁ డైనవాఁడు వాసవునితోడఁ, బోటొగ్గి గలిపించెఁ బూర్వగిర్వాణుల

ఉ. హ. ౪. ౨౨౦.

పోటొగ్గు = పోటాగ్గు. అ. క్రి (పోటు + ఒడ్డు) యుద్ధసన్నాహముచేయు, యుద్ధమునకు సిద్ధమగు.

గీ. భృతిరాష్ట్రతో ధిగ్మనిష్ఠమైనయుచితి మాడిన నందుఁ పోటొడ్డియున్న, చాల భృత్యులమనములు తిరుగ బడఁ.

భార. ఉద్యో. ౧. ౫౩.

పోట్లలి. సం వి. ఈ. స్త్రీ. పొట్లము, మూట.

పోట్లాట. వి. (√పోట్లాడు.) యుద్ధము, జగడము.

సీ. పోరాట పోట్లాట పోరు కయ్యముచివ్వ

(అం. భా. ౬. ౭౨౨)

(వ్యవ.) అన్నదమ్ముల పోట్లాట మనము మాన్ప లేము.

పోట్లావు. వి. (పోట్లు + ఆవు.) పొడుచు స్వభావము గల ఆవు. (శ. ర.)

పోడు. వి. ౧. తుప్పలు మున్నగునవి పెరిగియున్న యడవిచేలు.(చెట్లు నరికి పైరుసేయు చేను. అని శ.ర.)

గీ. చేలు పోడులు తీర్లను జేరి చొచ్చి, పైరు పచ్చలు మేసి .. (యయా. ౧. ౩౫౦.)

చ. అని తనపోడుచేనకడ కాతనిఁ బోకొని పోయి బోయ యిట్లను .

భోజరా. ౬. ౭౪౭.

౨. గుల్మాదులవలన నేర్పడుచిట్టడవి, ౯ డవి.

చ. తె, మ్మా ౯లఁ దోడు చిత్రగతి మిన్నులఁ జాకెడు మాకులఁ గడు పెన్నిరు లను పోరు కాలుకొని యేర్పవెలుంగుల ౯ెరు ౯ుకువో (వరాహ. ౪. ౭౪.)

వ్యా. పోకులోన డాగినాఁ డంది మేసి,లేఁడిం లో ౯ గిని గాన మల్లు.

పండితా. దీక్షా. ౪౪. పా.

౩. పోడుగొట్టు.

పోడుగొట్టు. ౯. క్రి. (పోడు + కొట్టు.) అడవి నేల పైనుండు తుప్పలు మున్నగువానిని నఱకు.

గీ. చేను కాంచి పై రిడఁ గొట్టి గొట్టె, నానెడుమాటకుఁ బోడుగొ ట్టనఁగఁ జెల్లు.

ఆం. భా. ౩. ౧౦౭.

సీ. నేల జక్కదవలె నెలకొల్పి పాల మెల్లఁ బోడుగొట్టి రిసఁ గోరాడి చప్పరింపుచు..

ప్రబంధ. ౧౭౩.

పోడువు. ౯౦. వి ఈ. పుం. కపాలాస్థితలను, తలపుర్తి పయిభాగము.

పోడా(డియ)ము. వి. అశ్వాదులద్రుతగతివిశేషము.

సీ. వెలిగిఱి నాకాశవీథిఁ బోడెంబు గా నవ లీల నెక్కడునట్లు గాదు. (నిరం. ౩. ౯.)

సీ. ఎంతదూరము వోవు నీక్కయం దని శౌరి విహగేంద్రుఁ బోడెంబు వెడల విడువ.

నిరం. ౩. ౩౭.

పోథము. సం. వి. అ. న. పండుపోక. (శ. ర.)

పౌరోధసము. సం. వి. అ. న. పురోధసుని వృత్తి.

పౌరోభాగ్యము. సం. వి. అ. న. ౧. పురోభాగ భావము, తప్పులుమాత్రము మెత్తిచెప్పుట. ౨. ఈర్ష్య, అసూయ. ౩. దుండగము, దుడుకు. ౪. పిలువనిపేరంటముగాఁ బోచ్చుట. ౫. అధిక ప్రసంగము.

పౌరోహితము. సం. విణ. (అ. ఈ. అ.) పురోహితునికి ధర్మ్యమైనది. - వి. అ. న. ౧. పురోహితత్వము. ౨. అథర్వణవేదము (కే.ని.)

పౌరోహిత్యము. సం. వి. అ. న. పురోహితుఁడు చేయుపని.

పౌర్ణమాసము. సం. విణ. (అ. ఈ. అ.) పూర్ణిమాసంబంధి, పున్నమకు సంబంధించినది. - వి. అ. పుం. పున్నమనాఁడు చేయవలసిన యాగము. (ఇది అగ్నిహోత్రముచేయువారు చేయుపని)

పౌర్ణమాసి. సం. వి. ఈ. స్త్రీ. పూర్ణిమ, పున్నమ.

పౌర్ణమాస్యము. సం. విణ. (అ. ఆ. అ.) పున్నమనాఁడు కలుగునది (సూ.గా.ది.) వి. అ. న. పున్నమనాఁడు చేయుయాగము.

పౌర్ణమి. సం. వి. ఈ. స్త్రీ. పున్నమ (వాచ.)

పౌర్తికము. సం. విణ. (అ. ఈ. అ.) పూర్తమునకు సంబంధించినది, పూర్తమునకు (చెఱువులు త్రవ్వించుట మొ.) సాధనమైనది. (కర్మము.)

పౌర్వదే(దై)హికము. సం. విణ. (అ.ఈ.అ.) పూర్వదేహసంబంధి, పూర్వజన్మమునఁ జేయఁబడినది.

పౌర్వపదికము. సం. విణ. (అ. ఈ. అ.)-సమాసమందు-పూర్వపదమునకు సంబంధించినది, పూర్వపదగ్రాహకము.

పౌర్వము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. పూర్వకాలసంబంధి. ౨. పూర్వదిక్సంబంధి, తూర్పుది.

పౌర్వాపర్యము. సం. వి. అ. న. ౧. పూర్వాపరత్వము, ఒకటికొకటి ముందటిది వెనుకటిదిగా నుండుట. ౨. అనుక్రమము, సోఁది.

పౌర్వాహ్ణికము. సం. విణ. (అ. ఈ. అ.) పూర్వాహ్ణభవము.

పౌలస్తి. సం. వి. ఈ. స్త్రీ. పులస్త్యబ్రహ్మ కూఁతురు, శూర్పణఖ.

పౌలస్త్యము. సం. వి. అ. న. యుద్ధము. (కే.ని.)

పౌలస్త్యుఁడు. సం. వి. అ. పుం. - పులస్త్యుని యపత్యము-౧. రావణుఁడు. ౨. కుంభకర్ణుఁడు. ౩. విభీషణుఁడు. ౪. కుబేరుఁడు. ౫. చంద్రుఁడు. (విల్సను)

పౌలి. సం. వి. ఇ. పుం. ఇంచుక వేఁచి యించుమించుగాఁ బక్వావస్థకుఁ దెచ్చినది, గుగ్గిళ్లు, అభ్యూషము.

పౌలు = పవులు., ౧ గులు. ౧. క్రి. (శ. ర.)

పౌలోమి. సం.వి.ఈ.స్త్రీ. (పులోమునికూఁతురు) శచీదేవి.

పౌషము. సం. వి. అ. పుం. పుష్యనక్షత్రముతోఁ గూడిన పున్నమగలనెల, పుష్యమాసము. న. ౧. ఉత్సవము. ౨. యుద్ధము.

పౌషి. సం. వి. ఈ. స్త్రీ. పుష్యమాసమున వచ్చు పున్నమ.

పౌష్కరము. సం. విణ. (అ. ఈ. అ.) పుష్కరసంబంధి.

**ప్రకటించు.** స. క్రి. ప్రకాశింపఁజేయు, వెల్లడి చేయు

ఉ. ... స్ఫురణములోన నిట్లు ప్రకటించె భవద్భుజవీర్యకార్యముల్.

భార. కర్ణ. 3. 34.

చ. పురుషవిశేషవిస్తరుఁడు పూజ్యుఁడు రాజుల లోన నీయుధిష్ఠిరుఁ డని నీగుణాలిఁ బ్రకటించి మనంబులలోన

భాగ. సభా. ౨. ౧౨.

**ప్రకటితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రకాశితము, ప్రకటింపఁబడినది, తేటతెల్లముసేయఁబడినది, వెల్లడిచేయఁబడినది. ౨. కనుపట్టునది, గోచరించునది.

**ప్రకటిల్లు.** సం. అ. క్రి. ప్రకాశితమగు.

సీ. పదపల్లవంబునఁ బ్రకటిల్లు చదలేఱు కడపుత్త్రి గాత్రి వెల్వడిచి పాఱ (కాశీ. ౪. ౧౨౭.)

**ప్రకటీకరించు.** సం. స. క్రి. ప్రకటముచేయు.

వ. ... హృదయంబు ప్రకటీకరించి యఖిలభూత కరుణారసైకభావంబున

కళా. ౭. ౬౮.

**ప్రకథనము.** సం. వి. అ. న. చక్కఁగా చెప్పుట, వెల్లడించుట.

**ప్రకరణము.** సం. వి. అ. న. ౧. శాస్త్రసిద్ధాంతమును ప్రతిపాదించు గ్రంథము. ౨. ఏకార్థప్రతిపాదకమగు గ్రంథాంశము, ఏకవిషయబోధకమగు గ్రంథభాగము. 3. ప్రస్తావము, అవసరము. ౪. దృశ్యకావ్యభేదము. (ఇందు ఇతివృత్తము లౌకికమును కవికల్పితమును, శృంగారము అంగి, నాయకుఁడు విప్రామాత్యవణిజులలో నొకఁడు, ధీరశాంతుఁడు.) ౫. (మీమాంస) అంగవాక్యసాపేక్షమగు ప్రధానవాక్యము.

**ప్రకరణి.** సం. వి. ఈ. స్త్రీ. ఉపరూపకభేదము. (ఇందు నాయకుఁడు సార్థవాహాదిః నాయిక నాయకసమానవంశజాత)

**ప్రకరము.** సం. వి. అ. పుం. ౧. సమూహము. ౨. చెదరిన పువ్వులోనగునవి, చల్లఁబడినపుష్పాది. 3. అతిక్షేపము, అచలవిస్తరమైనమాట. ౪. అగరు చందనము.

**ప్రకరి.** సం. వి. ఈ. స్త్రీ. నాటకాదులయందు కొంతకథాభాగమునందుమాత్రమే ప్రకరణవశమున నుండు గ్రంథభాగము.

**ప్రకర్షకుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు. ([illegible])

**ప్రకర్షణము.** సం. వి. అ. న. ౧. ఉత్కర్షము. ౨. ఆకర్షణము. ౩. చక్కఁగా దున్నుట.

**ప్రకర్షము.** సం. వి. అ. పుం. ౧. ఉత్కర్షము, అతిశయము. ౨. బలిమి, శక్తి. 3. మిక్కిలి కర్షణము, చక్కఁగా దున్నుట. ౪. విశేషత్వము.

**ప్రకర్షి.** సం. విణ. (స. జీ. స.) అతిశయించునది, ఉత్కృష్టము.

**ప్రకర్షించు.** సం. స. క్రి. గొప్పవానినిగాఁ దలఁచు.

దండకము. ... లలాటాక్షు దర్శింపుమీ శేష భోగిన్ ప్రకర్షింపుమీ గావు భావింపుమీ ... భోగినీదండకము.

**ప్రకర్షితము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి లాగఁబడినది.

**ప్రకల.** సం. వి. ఆ. స్త్రీ. అతిస్వల్పభాగము.

**ప్రకల్పన.** సం. వి. ఆ. స్త్రీ. ఏర్పాటు, వ్యవస్థ.

**ప్రకల్పించు.** సం. స. క్రి. కలిగించు.

గీ. కొలగి ... కుక్షిగోళంబులో గాలి కుంభక
ముస, బలిమి నిలిపిన .. యది ప్రకల్పించఁ
సుస్థాదులై నరుజలు. (కాశీ. ౫. ౧౩౫.)

ప్రకల్పితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చేయఁబడినది; కల్పఁబడినది. ౨. ఏర్పఱుపఁబడినది. ౩ రచింపఁబడినది.

ప్రకాండము. సం వి. అ. పుం , న. ౧. చెట్టుయొక్క వేళ్లు గండి కొమ్మలవఱకుఁగల భాగము, చెట్టుబోదె ౨ విటపము -విణ. శ్రేష్ఠము (ఇది ఉద్ఘ శబ్దముపంటిది. ఉదా. ఉద్ఘము.)

ప్రకాండరము. సం వి అం. పుం వృక్షము.

ప్రకామము. సం విణ. (అ ఆ. అ) మిక్కిలి కామముగలది, ప్రకృష్టకామకము ౨ యథేష్టము -వి. అ. పుం తృప్తి, తుష్టి

ప్రకారము. సం వి అ.పుం ౧. సాదృశ్యము, పోలిక. ౨. (తర్క) విశేషణము, విశిష్టజ్ఞానము నందు విశేషణముగాదోఁచు పదార్థము. ౩ భేదము.

ప్రకాలనము. సం విణ. (అ ఆ. అ.) హింసించునది.-వి. అ పుం. సర్పభేదము -వి అ. న. మారణము, చంపుట

ప్రకాశకము. సం. విణ. (అ. ఇకా. అ.) ౧. కలిగించునది, వెలుఁగునిచ్చునది, వివరించునది, విశదీకరించునది ౨. ప్రకాశించునది, వెలుఁగునది.

ప్రకాశకజ్ఞాత. సం. వి ఋ పుం.-వెలుతురు నిచ్చువానిని ముందుగాఁ దెలిసికొనునది - కోడి, కుక్కుటము.

ప్రకాశనము. సం. విణ. (అ. ఆ అ.) ప్రకాశింపఁజేయునది, వెలయించునది, వెల్లడించునది. -వి. అ. న. ౧. ప్రకాశింపఁజేయుట, వెలయించుట. ౨. చూపుట, ప్రదర్శనము. ౩. వెలిగించుట. ౪. ప్రకటించుట, చాటుట.

ప్రకాశనారి. సం. వి. ఈ. స్త్రీ. వేశ్య.

శ్లో. ప్రకాశనారీధృత ఏవ యస్మాత్, తస్మా
త్త్వయం ధారయ సంప్రకాశత్.

మృచ్ఛ. ౩. ౯.

ప్రకాశము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వెలుఁగునది, మెఱయునది. ౨. స్ఫుటము, తేటతెల్లమైనది. ౩. ప్రసిద్ధము. ౪. వికసించినది. ౫. తుల్యము. (శే. ని.)-వి. అ. పుం. ౧. వెలుఁగు, కాంతి ౨. వికాసము, వికసించుట. ౩. ఎండ, ఆతపము. ౪ ప్రసిద్ధి. ౫. గ్రంథభాగము. (అధ్యాయాది) ౬ గుఱ్ఱపుదేహముయొక్క వీఁపుభాగమునందలి నిగ్గు ౭. ప్రహాసము, పెద్దనవ్వు. (మే ని)

ప్రకాశి. సం. విణ. (న్. నీ. న్) ప్రకాశించునది.

ప్రకాశించు. సం స క్రి. ప్రకాశింపఁజేయు.

ఉ. కాంత నిజంబె యేరికిని గాకిఁ బోయిన
సుద్దులే ప్రకాశింతురు గాని యూనడుమఁ
జేసినదోసము శంకరేకదా.

సారంగ. ౩. ౫౪.

అ. క్రి. ౧. వెల్లడియగు.

క. అని తలఁచి తనదుతలఁ పెవ్వనికిఁ బ్రకా
శింపకుండ (భోజరా ౧. ౯౬.)

౨. కనఁబడు.

గీ. వెలుఁగుచుండెడి దీపంబు వేఁవస్తువులఁ
బ్రకాశింపఁజేయునట్లు .

భార. శాం. ౪. ౧౭౬.

౩. ఒప్పు.

భుజంగప్రయాతము. . విశాలేక్షణంబు ప్రకా
శింప విద్యుత్ప్రభాదేవి చూచున్

వరాహ. ౩. ౧౧.

౪. వెలుఁగు, మెఱుఁగు.

ప్రకాశితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ తెల్లడియైనది ౨ (గ్రంథము) ప్రకటితము. ౩. వెలుసినది, వెలిఁగినది. ౪ దృష్టిగోచరమైనది.

—వి. అ. న. ౧. వెలుఁగు. ౨ స్పష్టత.

ప్రకాశ్యము. సం. వి. (అ. ఆ. అ) ప్రకాశింపఁదగినది —వి. అ. న. వెలుఁగు

ప్రకిరణము. సం. విణ. (అ. ఆ. అ.) చెదరినది.

ప్రకీరము. సం. వి. అ. పుం. చెవులియడుగు చెట్టు ‡. మా పూతికర(ం)జము. ‡.

ప్రకీర్ణకము. సం వి అ. న. ౧ వింజామరము. ౨. విరివి.—పుం. గుఱ్ఱము

ప్రకీర్తన. సం. వి ఆ. స్త్రీ ౧ కీర్తించుట. ౨ పేర్కొనుట. ౩. ప్రకటించుట.

ప్రకీర్తనము. సం. వి. అ. న. ప్రకీర్తన

ప్రకీర్తి. సం. వి ఇ. స్త్రీ. గొప్పకీర్తి

ప్రకీర్తితము. సం. విణ (అ ఆ అ) ౧ కొనియాడఁబడినది. ౨. పేర్కొనఁబడినది ౩. వివరింపఁబడినది ౪ ప్రకటితము, బయల్పడినది

ప్రకీర్యము. సం. విణ (అ. ఆ అ.) చెల్లఁదగినది. —వి అ. పుం. ప్రకీరము.

ప్రకుట్యము. సం. వి. అ. పుం. అడవిమల్లె. ‡.

ప్రకృతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చక్కగాఁ జేయఁబడినది. ౨. గ్రంథప్రస్తావము వలనఁ పొందఁబడినది. ౩. మొదలుపెట్టఁబడినది ౪. నెరవేర్పఁబడినది. ౫. సహజసిద్ధమైనది.

—వి అ. న ప్రస్తుతవిషయము, ఎత్తికొన్న విషయము.

ప్రకృతార్థము. సం వి. అ. పుం. ప్రారంభించిన విషయము.

ప్రకృతి. సం. వి ఇ స్త్రీ. ౧. సహజస్థితి. ౨. సహజస్వభావము. ౩. సహజస్వరూపము. ౪. వంశసంభవము ౫. మూలకారణము. ౬. (వ్యాకరణ) అర్థవచ్ఛబ్దరూపము, ప్రత్యయాదులు చేరని మొదటి శబ్దరూపము ౭. సృష్టి విషయమున పరమాత్మని సంకల్పము, ఉపాదానకారణము. ౮ జననేంద్రియము. ౯. (గణిత) మానము, గుణకము, గుణకాంకము. ౧౦. పరమాత్మ. ౧౧. పగిది, రీతి ౧౨ ఒక ఛందస్సు (చరణమునకు ౨౧ అక్షరములుండు శ్లోకములు గలది)

ప్రకృతిత్రయము — వాత, పైత్య, శ్లేష్మములు మూఁడు.

ప్రకృతి వ్యూహములు— దండ, భోగ, మండల, అసంహతములు నాలుగు.

ప్రకృతులు— స్వామ్యాది సప్తప్రకృతులు :— స్వామి, అమాత్యుఁడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము

అవ్యక్తాది అష్టప్రకృతులు .- అవ్యక్తము, బుద్ధి, అహంకారము, పంచతన్మాత్రలు – అనగా శబ్దస్పర్శరూప రసగంధములు.

ప్రకృష్టము. సం. విణ (అ. ఆ. అ.) ప్రకర్షము గలది.

ప్రకోపనము. సం. వి అ న రూ. ప్రకోపణము ౧ ఉత్తేజనము. ౨ ఉద్దీపనము ౩ ఉద్బోధనము

ప్రకోపము. సం. వి అ పుం. ౧ తీవ్రమైన కోపము. ౨ ఉద్రేకము

ఉదా ఉపదేశము మూర్ఖులకు ప్రకోపము కల్గించునే కాని, శాంతము కల్గింపదు

౩. (సమాసములందు ఉత్తరపదముగా నున్నప్పుడు) అతిశయము, అధిక్యము.

ఉదా. వాతప్రకోపము

ప్రకోపించు. సం. అ. క్రి. ఉద్రేకించు, ముమ్మరించు.

ఉదా. పైత్యము ప్రకోపించినది.

ప్రకోష్ఠకము. సం. వి. అ. పుం. ప్రకోష్ఠము⁴.

ప్రకోష్ఠము. సం. వి అ. పుం. ౧. తొట్టికట్టు. ౨. కలాచి, ముంజేయి మొదలుకొని మోచేతి వఱకును గల ప్రదేశము. ౩. ముంజేయి. ౪. భవనమునందు బహిర్ద్వారము కడనుండు గది ౫. ప్రాంగణము. ౬. ద్వారభాగము.

ప్రక్క. దే. వి. (సం. ప్రక్కా.) ౧. పక్షము. ౨. బరిశెంక. కి. ౩. పార్శ్వము.

సీ. హిమభానుమీనల్లం డితని లావణ్యంబు తలంచిన మశక మాత్రమ్ము సుమ్ము, శతపత్రదాయాదుం డితని తేజంబు ముందరను ఖద్యోత మాత్రమ్ము సుమ్ము, చతురానన బ్రహ్మ యితని వాక్ప్రౌఢి కౌముదకుం బరాగాణు మాత్రమ్ము సుమ్ము, నిఖిల ప్రపంచంబు నిక్క మితని దోశ్శక్తి ప్రక్కను మెఱుకు మాత్రమ్ము సుమ్ము.

పాంచాలీ. ౨. ౨౬.

ప్రక్కి. వి రూ. ప్రక్క.

ప్రక్కె. వి. ఓచులము. కి

ప్రక్షరము. సం విశే. (అ ఆ. అ.) ౧. వాఁడి గలది ౨. తీవ్రమయినది.

ప్రక్రమణము. సం. వి అ. న. ౧ గమనము. ౨. గమనప్రారంభము

ప్రక్రమభంగము. వాక్య దోషములలో నొకటి. ఉద్దిష్ట ప్రక్రమమునకు కలిగిన భంగము భిగ్నప్రక్రమత

ఉదా ఆ బంతులలో మొదటిది తెల్లనిది, మూఁడవది నల్లనిది, రెండవది పచ్చనిది పువ్వులు పూచును, కాయలు కాచును, పండు పండును.

ప్రక్రమము. సం వి. అ. పుం ౧ నడచునప్పుడు పెట్టెడి యడుగు. ౨ దూరమానము. ౩ ప్రారంభము. ౪. ముందరికి పోవు గమనము, గతి. ౫. క్రమము ౬. ఉపధ ౭. పనికి ముందుగాఁ జేయు ప్రయత్నము. ౮. అవసరము. ౯. క్రమపారపఠనము.

ప్రక్రాంతము. సం. విశే (అ ఆ అ) ౧. మొదలు పెట్టఁబడినది ౨. మొదలినది. ౩ చర్చలో నున్నది. ౪ ముందు చెప్పఁబడినది. పూర్వోక్తము. ౫. అతిరిక్తము. ౬ ధైర్యము గలది.

—వి. అ. న. ౧. ప్రయాణ ప్రారంభము ౨. చర్చలోనున్న విషయము. ఎత్తికొన్న విషయము.

ప్రక్రియ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రకరణము ౨. అధికారము. ౩. మేలైన కార్యము. ౪. (వ్యాక) శబ్దరూపము కలిగిన విధము ౫. కావింపదగిన కార్యము. ౬. కార్యవిధానము.

ప్రక్లిన్నము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎక్కువగా తడిసినది, ఆర్ద్రము. ౨. తృప్తము పూర్తిగా తృప్తిచెందినది ౩. కరుణార్ద్రము

ప్రక్వణము. సం. వి. అ. పుం. వీణాధ్వని

ప్రక్వాణము = ప్రక్వణము.

ప్రక్షయము. సం. వి. అ. పుం. నాశనము

ప్రక్షరణము. సం. వి. అ. న. బొట్టుబొట్టుగా కారుట, ఓడుట

ప్రక్షాల(ళ)నము. సం. వి. అ. న. ౧. చక్కగా కడుగుట ౨. శుద్ధిచేయుట ౩. స్నానము ౪. శుద్ధి కార్యసాధనము. ౫. కడుగుటకుఁ దగిన నీరు.

ప్రక్షాలి(ళి)తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సుస్నాతము. ౨. కడుగఁబడినది ౩. శుద్ధిచేయఁబడినది.

ప్రక్షిప్తము. సం. విణ. ౧. విసరివేయఁబడినది. ౨. (అక్రమముగా) దూర్చినది

ఉదా. ఈ గ్రంథములో ప్రక్షిప్తము లనదగిన పద్యము లున్నవి. అనఁగా గ్రంథకర్త రచించనివి కలవు అని అర్థము.

ప్రక్షీణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్షీణించిపోయినది. ౨. నష్టమయినది ౩. శిథిలించినది.

ప్రక్షుణ్ణము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నలుగఁగొట్టఁబడినది. ౨. పొడువఁబడినది.

ప్రక్షేపణము. సం. వి. అ. న. ౧. విసరివేయుట. ౨. (ధరలు మొ.) నిర్ణయించుట.

ప్రక్షేపము. సం. వి. అ. పుం. ౧. విసరుట. ౨. చల్లుట. ౩. దూర్చుట. ౪. సమష్టివ్యాపారమందు వాటాదార్లు ఒక్కొక్కరు పెట్టిన పెట్టుబడి ధనము. ౫. కషాయములో కలిపిన పదార్థము.

ప్రక్షోభణము. సం. వి. అ. న. ౧. క్షోభ కలుగుట ౨. ఉద్రేకము కలుగుట.

ప్రక్షోభించు. సం. అ. క్రి. మిక్కిలి కలఁతపడు.

ప్రక్ష్వేడన. సం. వి. ఆ. స్త్రీ. చూ. ప్రక్ష్వేడనము

ప్రక్ష్వేడనము. సం. వి. అ. న. ౧. అగ్రమునందు ఉక్కుకొనలుగల బాణము. ౨. బిగ్గరగా పెట్టిన ఘోష.

ప్రఖరము. సం. వి. అ. పుం. ౧. పక్కెర, ఏనుఁగు గుఱ్ఱము మొ. వానికి తొడుగు కవచము, కంబళము. ౨. కంచర గాడిద. ౩. కుక్క.

—విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి వేఁడిగలది. ౨. మిక్కిలి వాఁడిగలది ౩. మిక్కిలి కఠినమయినది ౪. మిక్కిలి వేఁడిగలది, ౫. మిక్కిలి కఠినమైనది, ౬. మిక్కిలి కఠినమైనది ౭. మిక్కిలి వాఁడిగలది.

ప్రఖ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రత్యక్షత. ౨. ప్రఖ్యాతి, కీర్తి ౩. తెల్లడి. ప్రకాశనము ౪. ప్రాదుర్భావము.

—విణ. ౧. స్పష్టము. ౨. పోలికగలది, సదృశమైనది. సమాసములందు ఉత్తరపదముగానే యుండును.

ఉదా: శశాంక ప్రఖ్యమగు మొగము.

ప్రఖ్యాతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి ప్రసిద్ధి కెక్కినది. కీర్తి పొందినది, ౨. తృప్తము, ౩. పరిచ్ఛిన్నము, ౪. పూర్వప్రయాధి కారముతో అత్మీయముగా ప్రతిపన్నమైనది.

ప్రఖ్యాతవప్తృకము. సం. విణ. (అ ఆ. అ) ప్రఖ్యాతుఁడైన తండ్రి గలది

ప్రఖ్యాతి. సం. వి. ఇ. స్త్రీ ౧. ప్రసిద్ధి, కీర్తి. ౨. స్తుతి, పొగడ్త ౩ ప్రత్యక్షత.

ప్రఖ్యానము. సం. వి. అ. న ౧. ప్రకటనము, వెల్లడిచేయుట. ౨ విజ్ఞాపనము, నివేదనము, ౩. ప్రత్యక్షత

ప్రఖ్యాపనము. సం వి అ న ౧ ప్రకటనము, వెల్లడించుట ౨ విజ్ఞాపనము, నివేదనము ౩ వార్తాప్రసరణము.

ప్రగండము. సం. వి అ. పుం మోఁచేతినుండి బుజము వఱకును గల బాహువు

ప్రగండి. సం. వి ఈ. స్త్రీ నగరమునందలి వెలుపలి గోడ

ప్రగడ. వి సచివుఁడు (చూ. ప్రగ్గడ, ప్రెగడ, ప్రెగ్గడ. ప్రెగ్గడ.)

ప్రగతజానుకుఁడు. సం. విణ. (అ ఆ అ.) దొడ్డికాళ్లవాఁడు. చూ. ప్రజ్ఞువు

ప్రగతము. సం. విణ. (అ ఆ. అ.) ౧. దూరముగా పోయినది. ౨. ఎడము గలది

ప్రగతి. సం. వి. ఇ స్త్రీ. ౧. ముందుగతి. ౨. పురోభివృద్ధి

ప్రగదనము. సం. వి. అ. న. అల్లిక.

ప్రగమనము. సం. వి. అ. న. ౧. పురోగమనము. ౨. ప్రేమించుటలో మొదటియడుగు వేయుట.

ప్రగమము. సం వి అ. పుం ౧ ప్రగతి. ౨. ప్రేమయొక్క ప్రథమ ప్రాదుర్భావము.

ప్రగర్జనము. సం. వి అ. న బిగ్గరగా గర్జించుట.

ప్రగల్భ. సం. వి ఆ స్త్రీ. ౧. స్వీయాంతర్భేద విశిష్టనాయికా విశేషము. పదునెనిమిదేండ్లకు మించిన వయసు గలిగి సంపూర్ణ యౌవనముతో వెలయుచు రతికళా పరిజ్ఞానము మెండుగా నుండు స్త్రీ. ౨ ప్రౌఢ

ప్రగల్భత. సం వి. ఆ. స్త్రీ. ౧. దిట్టతనము, ధృష్టత్వము. ౨ గర్వము. ౩ ప్రవీణత, ప్రావీణ్యము. ౪. పరిపాకము ౫ దర్పనము, తొందర. ౬ వక్తృత్వము, మాటకారితనము ౭. పదవి, అంతస్తు ౮. నిశ్చయము, దృఢచిత్తత. ౯. పెంకెతనము, ధూర్తత్వము ౧౦. ప్రగల్భచూపు శృంగార చేష్టావిశేషము.

ప్రగల్భుఁడు. సం. విణ (అ. ఆ అ.) ౧ ప్రతిభ గలవాఁడు, ౨ ప్రౌఢుఁడు

ప్రగాఢము. సం వి అ. న ౧. పెల్లు. ౨. ఆహారవిహారాభావము, దేహక్లేశము.

—విణ. (అ. ఆ. అ.) అధికము. ౨. దృఢము. ౩. పూర్తిగా ముంచఁబడినది.

—అవ్య. ౧. తీవ్రముగా. ౨. అధికముగా. ౩. దృఢముగా. ౪. బలవంతముగా.

ప్రగీతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పాడఁబడినది. ౨. గానముతో ముఖరితమయినది.

—వి. అ. న. ౧. పాట. ౨. పాడునట్టుగా చదువు రీతి.

ప్రగీతి. సం. వి. ఇ. స్త్రీ. ఛందోవృత్తవిశేషము.

ప్రగుణనము. సం. వి. అ. న. సరిగానుంచుట.

ప్రగుణము. సం. విణ. (అ. అ. అ.) ౧ సరియైనది, నమ్రతముగలది. ౨. ఋజుమార్గమున వర్తించునది ౩. అగ్రతగలది. ౪. సమర్థతగలది. ౫. నేర్పుగలది. ౬. తెలివిగలది.

ప్రగుణితము. సం. విణ. (అ. అ అ) ౧. సరిచేయఁబడినది. ౨. ఋజుమార్గమునఁ బెట్టఁబడినది.

ప్రగుణీకరించు. సం స క్రి ౧. సరిచేయు. ౨ ఋజుమార్గమునఁ బెట్టు ౩ పోషించు

ప్రగుణ్యము. సం విణ (అ అ అ) ౧. అధికము. ౨. గుణోపేతము, ప్రశస్యతము

ప్రగృహీతము. సం విణ. (అ అ అ.) ౧ గ్రహింపఁబడినది ౨. (వ్యాకరణ) సంధికార్యము లేనిది చూ. ప్రగృహ్యము.

ప్రగృహ్యము. సం వి అ. న ౧ (వ్యాకరణ.) సంధికార్యము లేని అచ్చు "ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్" పాణిని. ౧. ౧. ౧౧. శబ్దద్వివచన రూపాంతరముల నుండు ఈ ఊ ఏ లు ప్రగృహ్యములు. ౨. అభిజ్ఞానము. ౩. వాక్యము.

ప్రగ్గ. వై. వి ప్రంగయొక్క రూపాంతరము.

ప్రగ్గడ. (రూ. ప్రగ్గడ) సచివుఁడు.

క. అతఁడు పాతకేషు లకురా,ధిపుఁ జేరంబోయి
దేవ దేవర సేనా,ధిపులం బ్రగ్గడ కొడుకులఁ
గపిపరుఁ డోకరుఁడ స్వైరవిశదముగాఁ
గూల్చెన్.

రామా. ౬. ౨౧౩.

ప్రగ్గము. వి. వి. పగ్గమునకు కొందటిరూపము. (చూ పగ్గము³) తాడు.

ఉ. దిగ్గియనంచ దూఁడుగొని తీరపువేశులు వంకిమీఁదుగా,నగ్గడ ఫుల్లకేసరమునందు వసింపఁగ నెక్కనూలిమల్, ప్రగ్గము నందఁగాఁ దరుమరంద సరోమకరంద గోష్ఠికిన్, బెగ్గల మాడు తేంట్లు మరువింటికిఁ బూని గుణద్వయత్వమున్.

అము. ౫. ౧౨౨.

ప్రగ్గెడ. రూ ప్రగ్గడ.

ప్రగ్రహణము. సం వి. న. ౧. లెస్సగా గ్రహించుట ౨ సూర్యచంద్రగ్రహణారంభము. ౩. కళ్లెము ౪ ప్రతిబంధము. ౫. కట్టు. ౬. సమర్పణము. ౭ మార్గదర్శనము.

ప్రగ్రహము. సం. వి. అ. పుం. ౧. పట్టుకొనుట. గ్రహణము. ౨ సూర్యచంద్రగ్రహణారంభము. ౩. చెఱ. ౪. చెఱఁబడినది ౫. పగ్గము. ౬. కొరడా. ౭. ఏనుఁగు గుఱ్ఱము మొదలగు మృగములను మచ్చిక చేయుట. ౮. రశ్మి. ౯. త్రాసుసూత్రము. ౧౦. విష్ణునామము. ౧౧. బాహువు, ౧౨. మార్గదర్శి. ౧౩. దయ, అనుగ్రహము. ౧౪. కర్ణికారము. ౹. ౧౫. ప్రగృహ్యము.

ప్రగ్రాహము. సం వి. అ. పుం. ౧. పట్టుకొనుట, గ్రహణము ౨. వహించుట. ౩. త్రాసుసూత్రము. ౪. కళ్లెము.

ప్రగ్రీవము. సం. వి. అ. పుం., న. ౧. కలశము, -౨ ఓలగుదిండు.' 3. పెండె. ౪. ప్రాసాదము నందలి వాతాయనము, కిటికీ. ౫. ప్రాసాద శిఖరగృహము. ౬. వృక్షాగ్రము. ౭. మందిర మునకు చుట్టును కొయ్యతో కట్టిన ప్రాకారము ౮. విలాసమందిరము

ప్రఘటం. సం. వి. అ స్త్రీ. శాస్త్రముల ప్రాథమిక సూత్ర విషయము

ప్రఘటావేత్త = ప్రాథమిక సూత్ర విషయములు మాత్రమే తెలిసినవాడు

ప్రఘణము. సం. వి అ. పుం. రూ. ప్రఘనము, ప్రఘాణము, ప్రఘానము ౧ అలిందము, వాకిలి ముందుండు నలుచదరపు చోటు -౨ ద్వార ప్రకోష్ఠము, తలవాకిలి ప్రక్కనుండు గృహము. 3 ఇనుపగుదియ. ౪. రాగి బిందె

ప్రఘసము. సం. విశే. (అ. ఆ. అ) కుక్షింభరి. ఘస్మరము

—వి. అ పుం ౧ తిండిపోతుతనము -౨. రాక్షసుడు

ప్రఘాణము = ప్రఘణము.

ప్రఘాతము. సం. వి. అ పుం. ౧. చంపుట. -౨. యుద్ధము.

ప్రఘానము = ప్రఘణము.

ప్రఘారము. సం. వి. అ. పుం. ౧ కారుట. క్షరణము. (జలాదిధార అని కొ ర.) -౨. యజ్ఞాదులందు అగ్నిహోత్రము మీద ఘృతాదుల. కారుట. (వాచ.) చూ. ప్రాఘారము.

ప్రఘూర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి తిరుగుడుగలది. -౨. చుట్టు తిరుగుట. 3 పర్యటనము, పరిభ్రమణము.

—వి. అ. పుం. అతిథి.

ప్రఘోషము. సం వి అ పుం. ౧ పెద్దధ్వని. -౨ కోలాహలము.

ప్రచండము. సం విశే ౧ తీవ్రము -౨ అధికము 3. దృఢము ౪ మిక్కిలి వేడిగలది. ౫ కోపాకులము ౬ భీషణము ౭ దుస్సహము. ౮ సరభసము. ౯. చేరరానిది ౧౦. వాడిమైనది.

—వి. అ పుం. కరవీరవిశేషము, (తెల్లగన్నేరు)

ప్రచక్రము. సం వి. అ న. ౧. ప్రయాణము సాగించుచున్న సేన -౨ పరిభ్రమించుసేన (సైనికుల ఆహారపదార్థముల అన్వేషణమునకై)

ప్రచక్షుస్సు. సం. వి. స్. పుం. ౧. బృహస్పతి. -౨. గురుడు (గ్రహము)

ప్రచయనము. సం. వి. అ. న. (పుష్పములు మొ.) కోసికొనుచేయుట, సంగ్రహించుట.

**ప్రచయము.** సం. వి. అ. పుం. ౧ (పుష్పాదుల) పోఁగు, రాశి. ౨. గుంపు ౩. వృద్ధి. ౪. కొలఁదిపాటి చేరిక. ౫ అనుదాత్త ఉదాత్త స్వరిత ప్రచయములను స్వరములలో నాల్గవది ౬. శ్రేణియందలి అంకెలలో ప్రతి రెండెంకెలకును సాధారణముగా నుండు వ్యత్యాసము ఉదా 1 4. 7, 10, 13, 16-ఇందు ప్రచయము. 3

**ప్రచరణము.** సం. వి. అ. న. ౧. ముందుకు సాగుట. ౨ ప్రచారములో నుండుట. ౩. చెలామణియగుట. ౪. పూనుకొనుట, మొదలిడుట ౫. వాడుట.

**ప్రచరణి.** సం. వి. ఈ. స్త్రీ. కొయ్యగరిఁటె

**ప్రచరము.** సం. వి. అ. పుం. ౧. మార్గము, బాట. ౨. ప్రయోగము. ౩. వాడుక. ౪. ఆచారము.

**ప్రచరించు.** సం. అ. క్రి. చరించు, తిరుగు. —స. క్రి. ప్రచారములో నుంచు.

**ప్రచరితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రచరించినది. ౨. ప్రచారములో పెట్టఁబడినది. ౩. (వృత్తిధర్మముగా) సాగింపఁబడినది.

**ప్రచలనము.** సం. వి. అ. న. ౧. (భయాదుల వలన) వణఁకుట. ౨. వెనుకకు మరలుట. ౩. వాడుకలో నుండుట, చెలామణియగుట.

**ప్రచలము.** సం విశే. (అ. ఆ. అ.) ౧. (భయాదులవలన) వణఁకుచున్నది. ౨. బయలు దేరినది. ౩ వడమనది. ౪ కంపితము. ౫. మార్గభ్రష్టము.

**ప్రచలాకము.** సం వి అ. పుం ౧. విలువిద్య. ౨. నెమలితోఁక. ౩. పాము.

**ప్రచలాకి.** సం వి. ఇ పుం. నెమలి.

**ప్రచలాయితము.** సం విశే. (అ. ఆ. అ.) తూగుట

—వి అ న (కూర్చుండి కునికిపాట్లు పడునప్పుడు) కలిగెడు తలయూఁపు

**ప్రచాలము.** సం. వి అ. పుం. వీణాకంఠ (భాగ)ము.

**ప్రచితము.** సం విశే (అ ఆ అ) ౧ (పుష్పాదులు) కోసి పోఁగుగాఁ బెట్టఁబడినది. ౨. (పదార్థములు) కూర్పఁబడినది ౩. అనుదాత్త స్వరము ౪ నింపఁబడినది

**ప్రచురత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రాచుర్యము. ౨. బాహుళ్యము. ౩. విపులత.

**ప్రచురత్వము.** సం. వి. అ. న. ప్రచురత.

**ప్రచురము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. బహుళము. ౨. విపులము. ౩ అధికము, పెద్ద, ఎక్కువ. సమాసములందుత్తరపదముయినప్పుడు అధికమని అర్థము.

ఉదా: శిల్పకళాప్రచురుఁడు, సద్గుణప్రచుర; ఘనము మహాకృత్య ప్రచురము.

ప్రచురీకృతము. సం. విణ. (అ ఆ. అ.) ప్రచుర మయినదిగాఁ జేయఁబడినది.

ప్రచేత. సం. వి ఋ. పుం. (రథాదివాహన) చోదకుఁడు.

ప్రచేతసుఁడు. సం. వి. స్ పుం. రూ ప్రచేతుఁడు, ప్రాచేతసుఁడు. ౧ వాల్మీకి. ౨. మనువు. ౩. దక్షుఁడు. ౪. వరుణుఁడు.

ప్రచేలకము. సం. వి. అ. పుం. గుఱ్ఱము

ప్రచేలము. సం. వి. అ. న. పసుపుపచ్చని చందనపు చెక్క.

ప్రచోదనము. సం. వి అ. న. చోదనముచేయుట, ప్రేరేచుట.

ప్రచోదని. సం. వి ఈ. స్త్రీ. ౧. వాఁకుడు. [illegible] ౨. సంగడికెడ్డు.

ప్రచోదితము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రేరితము.

ప్రచ్ఛదము. సం. వి. అ. పుం. కప్పు, ఆచ్ఛాదనము.

ప్రచ్ఛన. సం. వి. ఆ. స్త్రీ. ప్రశ్న.

ప్రచ్ఛనము. సం. వి. అ. న. ప్రశ్నము.

ప్రచ్ఛన్నము. సం. విణ. (అ. ఆ అ) ౧. కప్పఁబడినది. ౨. రహస్యమైనది. ౩. దాఁచియుంచినది ౪ (వస్త్రము) తొడిగినది.

ప్రచ్ఛన్నతస్కరుఁడు=కనఁబడని దొంగ

—వి ౧ రహస్యద్వారము. ౨. వాతాయనము.

—అవ్య. రహస్యముగా.

ప్రచ్ఛర్దకము. సం వి అ. న వాంతి చేసికొనుట.

ప్రచ్ఛర్దిక. సం వి. ఆ. స్త్రీ వాంతి.

ప్రచ్ఛాదకము. సం. విణ (అ ఆ. అ.) రహస్యముగా నుండునట్టిది. (సమాసములం దుత్తరపదముగా నుండును)

ఉదా: యుద్ధవిషయ ప్రచ్ఛాదక సమితి.

—వి. అ. పుం పతి పరిత్యక్తయైన భార్య తన సంతాపమును మఱుఁగు పఱచి అన్యాపదేశముగా పాడెడు పాట

ప్రచ్ఛాదనము. సం. వి. అ. న. ౧ ఆచ్ఛాదనము. ౨. పైని ధరించునట్టి ఉత్తరీయము.

ప్రచ్ఛాదితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కప్పఁబడినది. ౨. దాఁచినది.

ప్రచ్ఛానము. సం. వి. అ. న. (గొంతు కొ.) పుండగుట.

ప్రచ్ఛాయము. సం. వి. అ. న. దట్టమగునట్టి నీడగల ప్రదేశము.

ప్రచ్ఛిలము. సం. విణ. (అ. ఆ. అ.) పిచ్ఛిలము, జలములేనిది (వాచ)

ప్రజ. సం. వి. ఆ. స్త్రీ. ౧ సంతతి ౨ జనము. (స, ఖ, దు స్, సు లు పూర్వపదముగాఁగల బహువ్రీహియందు ఉత్తరపదముగు నీపదము సాంతముగును. ఉదా. సుప్రజసుఁడు, దుష్ప్రజసము, సుప్రజసుఁడు)

ప్రజననము. సం. విణ. (అ. ఈ. అ.) పుట్టించునది, జనకము. - వి. అ. న. ౧ గర్భాధానము ౨ జననము, పుట్టుట, కనుట, ప్రసవించుట ౩ అఁడుగుతి

ప్రజనము. సం. వి. అ. పుం. ౧ ప్రజననము, కనుట, ప్రసవించుట ౨ ఆవు మొదలగువానియందు ఎద్దు మొదలగువాని గర్భగ్రహణార్థమగు మైథునము, (ఆవు ఎనుము, లోనగువాని తొలిచూలు, నిశగ)

ప్రజనిక. సం. వి. ఆ. స్త్రీ. తల్లి, జనని

ప్రజల్పనము. సం. వి. అ. న. వట్టి మాటలాడుట, ఉపయుక్తముకాని యేలుబడిమాట

ప్రజల్పము. సం. వి. అ. పుం. ౧ వాక్యభేదము ('అసూయేర్ష్యామదోద్యుక్తా యో అవధీరణముద్రయా, ప్రియస్య కౌశలోద్గారః ప్రజల్పస్స తు కథ్యతే') ౨ ప్రోష్ట కథాభేదము ౩ ముచ్చట, వట్టి యేలుబడిమాటలు

ప్రజవనము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వేగము గలది

ప్రజవి. సం. విణ. (న్. నీ. న్.) మిక్కిలి వడి గలవాఁడు, తగస్వి.

ప్రజాగరము. సం. వి. అ. పుం. ౧ మేలుకొనుట, రాత్రి మేల్కొని యుండుట, నిద్రలేమి ౨ జాగరూకత ౩. కావలి కాయువాఁడు, జాగ్రత్తతోఁ గాచుకొనువాఁడు.

ప్రజాత. సం. వి. ఆ. స్త్రీ. బాలెంతరాలు, ప్రసూత

ప్రజాతంతువు. సం. వి. ఉ. పుం. సంతానము, వంశము

ప్రజాతము. సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా పుట్టినది. - వి. అ. పుం. అశ్వభేదము. (గోడిగయందు రేతస్స్కందనము గావించిన గుఱ్ఱము.)

ప్రజాతి. సం. వి. ఇ. స్త్రీ. ౧ ప్రజ ౨ ప్రజననము, కనుట, ప్రసూతి ౩ సంతతి (వాచ)

ప్రజాద. వి. ఆ. స్త్రీ. గర్భధాత్రీవృక్షము

ప్రజాదానము. సం. వి. అ. న. వెండి

ప్రజాద్వారము. సం. వి. అ. న. సూర్యుఁడు. (విల్యమ్సు)

ప్రజాపతి. సం. వి. ఇ. పుం. ౧. బ్రహ్మ. ౨. దక్షాది ౩. రాజు ౪ అల్లుఁడు. ౫ సూర్యుఁడు. ౬ అగ్ని ౭ త్వష్ట, విశ్వకర్మ. ౮. యజ్ఞము ౯ కీటభేదము ౧౦ తండ్రి, జనకుఁడు. ౧౧ మాఁగుడి ౧౨ ఒకానొక సంవత్సరము

శ్లో॥ ప్రభవో విభవః శుక్లః ప్రమోదోఽథ ప్రజాపతిః నిర్ణయసింధువు.

ప్రజావతి. సం. వి. ఈ. స్త్రీ. ౧ తోఁబుట్టినవాని పెండ్లాము ౨ కుటుంబిని, పిల్లలుగల స్త్రీ

ప్రజాహితము. సం. వి. అ. న. ప్రజలకు హితమైనది, నీరు

ప్రజిసము. సం. వి. అ. పుం. గాలి

ప్రజాఁడు. సం. వి. అ. పుం. పెనిమిటి, పతి.

అ. క్రి ౧ మండు (శ ర) ౨ ప్రకాశించు

సీ. పద్మరాగప్రభల్ పయిపయి నిగిడించు, పాద పల్లవరుచుల్ ప్రజ్వలింప

భా రా బాల ౬ ౪౯

ప్రజ్వలితము. సం విణ (అ ఆ అ) ౧ మండినది ౨ ప్రకాశించినది -వి అ న ౧ మండుట ౨ ప్రకాశించుట

ప్రడీనము. సం వి అ న (పక్షి) ౧ నలుప్రక్కలనుపఱచుట ౨ ముంపఱచుట ౩ పాఱిపోవుట, పలాయనము

ప్రణతి సం వి ఇ స్త్రీ నమస్కారము

ప్రణతుఁడు సం విణ (అ ఆ అ) ౧ మిక్కిలివంగినవాఁడు ౨ నమస్కరించినవాఁడు. ౩ అడఁకువగలవాఁడు

ప్రణదితము. సం విణ (అ ఆ అ) శబ్దించునది, ధ్వనిచేయునది

ప్రణమిల్లు సం అ క్రి ౧ నమ్రుఁడగు

వ వాఁడు వినయంబున శయ్య డిగ్గ నరుగుదెంచి గన్నీ రొలుకం బ్రణమిల్లి చేలుమొగిడ్చి మహాత్మా, సీతలం జేమి ?

భాగ శాం ౩ ౨౭౮

౨ నమస్కరించు

క. కని భక్తిఁ బ్రణమిల్లుడు, ముని యాతిథ్యం బొసఁగె మోదంబున

భాగ శాం ౩ ౧౫౬

ఆ పరమభక్తితోడఁ బ్రణమిల్లి యున్నను, శక్రుభయమువలన మునినికాయ మెల్ల

భాగ ఆది ౧ ౨౩

వ. .. అయ్యిరువురు తండ్రిచరణంబులకుం బ్రణమిల్లి. (మార్క ౩ ౭౪)

ప్రణము. సం విణ (అ ఆ అ) ప్రాఁతది, పురాతనము (వాచ)

ప్రణయకలహము. సం వి అ పుం నాయికానాయకులకు పరస్పరము కుటిలప్రచారము వలనఁగాని చిట్టకమువలనఁగాని కలుగుజగడము, వలపుజగడము, నెయ్యంపుఁగయ్యము

ప్రణయకుపితుఁడు. సం విణ (అ ఆ అ) ప్రణయకోపముగలవాఁడు

ప్రణయకోపము సం వి అ పుం ప్రేమము యొక్క కుటిలప్రచారములవలన కారణము లేకయే నాయికానాయకులకుఁ గలిగెడికోపము, పొలయలుక, నెయ్యంపుఁగినుక

ప్రణయనము. సం వి అ న ౧ తెచ్చుట ౨ కొంపోవుట ౩ చేయుట, కరణము ౪ రచించుట ౫ (కారణాదులను) ఎత్తిచెప్పుట, ఉదాహరించుట ౬ అగ్నికి సంస్కారవిశేషమును జేయుట

ప్రణయనీయము. సం విణ (అ ఆ అ) ౧ మిక్కిలి కొనిపోఁదగినది ౨ సంస్కరింపఁ దగినది (వహ్ని) ౩ వహ్నిసంస్కారసంబంధి. (ఇధ్మ కాష్ఠాది = వంటచెఱకు మొ)

ప్రణయము. సం వి అ పుం ౧ ప్రేమము, వలపు ౨ చెలిమి, మైత్రి ౩ విశ్వాసము ౪. ప్రార్థన, యాచన ౫ నిర్వాణము, మోక్షము

ప్రణయి. సం విణ (న్ నీ న్) ౧ ప్రణయముగలవాఁడు, ప్రేమగలవాఁడు ౨ ప్రేమింపఁబడినవాఁడు, ప్రియుఁడు ౩ పరిచయముగలవాఁడు -వి న్ పుం ౧ పరిచితుఁడు, చెలికాఁడు ౨ స్వామి, భర్త, ౩ భక్తుఁడు, కొలుచువాఁడు

ప్రణయించు. సం స క్రి జ్వలింపఁజేయు, మండఁజేయు.

౨ వేఁడియైనది. 3 సంతాపమునొందింపఁబడినది, నొప్పింపఁబడినది

ప్రతమకము. సం. వి. అ. పుం. ఒకవిధమగు ఉబ్బసము (ఆ. ని.)

ప్రతర్కణము. సం. వి. ఇ. న. వితర్కించుట, చర్చించుట

ప్రతర్కము. సం. వి. అ. పుం. = ప్రతర్కణము

ప్రతలము. సం. వి. అ. న. పాతాళలోకవిశేషము. పుం. ౧ చపేటము ౨ చాచినవ్రేళ్లుగల అఱచేయి (వై. ని.)

ప్రతానము. సం. వి. అ. పుం. విస్తారము, విరివి, కొన్నితీఁగలకుండు వంకరతంతువు

ప్రతానిని. సం. వి. ఈ. స్త్రీ. తీఁగ, లత

ప్రతాపనము. సం. విణ. (అ. ఈ. అ.) ౧ వేఁడిసేయునది ౨ సంతాపము కలిగించునది. వి. అ. న. ౧ వేఁడిసేయుట, కాఁచుట ౨ సంతాపము కలిగించుట, దండించుట. పుం. నరకము.

ప్రతాపము. సం. వి. అ. పుం. ౧ వేఁడిమి, తాపము. ౨ ప్రభ, కాంతి. 3. రాజాదులకు కోశదండములవలనఁ గలిగిన తేజస్సు. ౪. శౌర్యము, పరాక్రమము. ౫ శక్తి, బలిమి. ౬. ఉత్సాహము ౭. అర్కము, జిల్లేడు. తె.

ప్రతాపసము. సం. వి. అ. పుం. ౧. తెల్లజిల్లేడు. తె. ౨ ఒకజాతిలేడి (కే. ని.)

ప్రతాపించు. సం. అ. క్రి. ప్రతాపముచూపు.

మ. కపుతో నిక్కటికయ్యముం దొడరి మెచ్చించెన్ ప్రతాపించి వ్యాసపువర్గాసన మెక్క (జై. భా. ౫. ౧౭౩.)

ద్వి. గరుడుండు మును సుధాకలశముఁ గొనిన, ఖగణి రాజులు చూడఁగాఁ బ్రతాపించి
అ. మ. క. ౪. ౨౧౧. పా. ౨౮. పం.

ద్వి. నాతి చింతాపురినాథుండు నిత్య, మాతత కుథపతూర్తియై ప్రతాపించు.
ద్వి. పరమ. ౫. ౩౯౪. పా.

ప్రతారకము. సం. విణ. (అ. ఇకా. అ.) వంచకుఁడు (కే. ని.)

ప్రతారణ. సం. వి. ఆ. స్త్రీ. మోసము, వంచన

ప్రతారణము. సం. వి. అ. న. ౧ దాఁటించుట. ౨ మోసపుచ్చుట

ప్రతారము. సం. వి. అ. పుం. ౧. దాఁటించుట. ౨. మోసము

ప్రతారించు. సం. స. క్రి. మోసపుచ్చు.

గీ. కింటమాటల బలిఁ బ్రతారించినట్టి, దంభవామన, మామనస్తాప ముడుపు.
నైష. ౮. ౧౨౪.

ప్రతారిక. సం. వి. ఆ. స్త్రీ. నాభి, బొడ్డు. (కే. ని.)

ప్రతారితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మోసపుచ్చఁబడినవాఁడు

ప్రతి ౧ వస్తువు, సదృశవస్తువు

సీ. అక్షౌహిణీకృతిదా నిప్పించి యొక్కొక్క ప్రతికి నూఱునకేయి ప్రతులు గాఁగ
భోజరా. ౭. ౧౪౦

వ్యా. ఆ పుస్తకమునకు వేయిప్రతులు అచ్చు వేయించినారు

౨ స్థలము, పొలము మొదలగువాని భాగము

వ్యవ. ఆయూరిలో మాభూమి నాల్గుప్రతులుగా నున్నది

3 నిదర్శనము

ద్వి. శిథిలను సీతులఁ గారణంబులును, జెప్పు మాటల విమ్ముఁ జప్పరించుటలు, చూపొప్పుగునే ప్రతిచూపెద నీకు
పండిత. దీక్షా. ౫౨ పా. ౧౪. పం

**ప్రతిఘటిం(యిం)చు.** సం. అ. క్రి. మార్కొను, ఎదిరించు.

వ. ...అప్పుడంకుశుం డాచార్యప్రేరితుండై యుగాంతకాలానలుండునుం బోలెఁ బ్రతిఘటించి నిలిచిన ..

భార. ఆది ౭. ౩౮.

సీ. తాలలోచనునితోఁ బ్రతిఘటించి పదాంబుజమునఁ గన్గొన్న గౌతమతపస్వి.

ఉ. రా. ౭. ౧౯౪.

సీ. పారిజాతకపాదపారిజాతరిపుద్వి పారిజాత శ్రీలఁ బ్రతిఘటించి. (దశా. ౧. ౭౦.)

క. ప్రతిఘటియింపఁగ వచ్చెను, ప్రతిభటులకు నసమసమరోత్సాహముతోడన్. (భీమ. ౧. ౭౧.)

క. అరయ నీయుదయమునకుఁ, గారణమై యేకీలంబు గాంభీర్యమునన్, దారాపతిఁ గన్న పయఃపారావారంబుతోడఁ బ్రతిఘటియించెన్. (నైష. ౪. ౯.)

**ప్రతిఘట్టించు.** సం. అ. క్రి. ప్రతిఘటించు.

ద్వి. గబ్బున జైనమార్గమై యాది యనుచు, నిబ్బందిజనమును గీతుబ్బ లూర, మెట్టి మాటలఁ బ్రతిఘట్టించి యాడ, నెట్టన వాదంబు నిల్పి గెల్చినను.

బస. పు ౭. ౫౭౦.

**ప్రతిఘము.** సం. విణ. (ఏ. ఆ. అ.) ప్రతికూలము. వి. అ. పుం. ౧ మాఱుదెబ్బ, ప్రతిఘాతము. ౨ కోపము. ౩. పగతీర్చుకొనుట. ౪. మూర్ఛ. ౫. శత్రువు. ౬. వధము (శే ని)

**ప్రతిఘాతనము.** సం. వి. అ. న. మారణము, చంపుట.

**ప్రతిఘాతము.** సం. వి. అ. పుం. ౧. మాఱు దెబ్బ. ౨. ఎదిరించుట. ౩. అడ్డగింత, వారణము, వారించుట. ౪. మాఱుచేఁత. ౫. చంపుట

**ప్రతిఘాతి.** సం. విణ. (ఏ. ఈ. ఏ.) పగతీర్చుకొనువాఁడు.

**ప్రతిఘ్నము.** సం. వి. అ. న. దేహము. (వాచ.)

**ప్రతిచింతనము.** సం. వి. అ. న. ధ్యానము.

**ప్రతిచికీర్ష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. బదులు చేయుటకునిచ్ఛ. ౨. పగతీర్చుకొననిచ్ఛ.

**ప్రతిచేయు.** అ. క్రి. (ప్రతి + చేయు) సాటిచేయు, పోల్చు.

గీ. ఇంతిసౌమ్యాస్యము ప్రతిచేసి యున్నచోటఁ జందురుని మేను పూర్వపక్షంబు నొందు.

విక్ర. ౪. ౧౭.

**ప్రతిచ్ఛందము** సం. వి. అ. పుం. ౧. ప్రతిమ, ప్రతిరూపము. ౨. ప్రతినిధి.

సీ. కెవ్వకారామరేఖకుఁ బ్రతిచ్ఛందంబు త్రిదశేంద్రుశకటి కాత్మేహితంబు గీ. మంత్రియున్న యదేవసూర్యునిహితయశము (ఇట ఔపమ్యవాచకము.) భీమ. ౧. ౫౩.

**ప్రతిచ్ఛదనము.** సం. వి. అ. న. కప్పడము, కప్పుగువస్త్రము.

**ప్రతిచ్ఛన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) కప్పఁబడినది. ౨. దాఁపఁబడినది.

**ప్రతిచ్ఛాయ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రతిబింబము, నీడ. ౨. ప్రతిరూపము, ప్రతిమ. ౩. సాదృశ్యము, పోలిక.

**ప్రతిజంఘ.** సం. వి. ఆ. స్త్రీ. అగ్రజంఘ, పిక్కలయొక్క ముందటిభాగము (వాచ.)

**ప్రతిజల్పకము.** సం. వి. అ. పుం. దూతవాక్యభేదము.

**ప్రతిజాగరణము.** సం. వి. అ. న. కావలికాచుట

ప్రతిఘటించు(యిం)చే. సం. అ. క్రి. మాఱొడ్డు, ఎదిరించు.

వ. ...అజ్ఞవంశమును జాచార్యప్రభావశోదితుం డై యుగాంతకాలానలుండునుం బోలెఁ బ్రతిఘటించి నిలిచిన ...

భార. ఆది ౬. ౩౮.

సీ. ఫాలలోచనునితోఁ బ్రతిఘటించి పడాం బుజమునఁ గర్జొన్న గౌతమతిపర్వి.

ఉ. రా. ౭. ౧౯౪.

సీ. పారిజాతకపాదపారిజాతకిభుద్వి పా రి జా త శ్రీలఁ బ్రతిఘటించి. (దశా ౧. ౭౦.)

క. ప్రతిఘటియింపఁగ వచ్చురె, ప్రతిభటులకు వనసువమగఫల్గునతోడన్. (భీమ. ౧. ౭౧.)

క. అరియు నీయుదయమునకుఁ, గారణమై యేకులంబు గాంభీర్యమునన్, దారాపతిఁ గన్న పయఃపారావారంబుతోడఁ బ్రతి ఘటియించెన్. (నైష. ౪. ౯)

ప్రతిఘట్టించే సం. అ. క్రి. ప్రతిఘటించు

ద్వి గబ్బున శైవమ్ముపై యాది యనుచు, నిబ్బందిజీవమును గీయుబ్బ లూర, మెట్టి మాతోఁ బ్రతిఘట్టించి యాడ, సెట్టణ వాదంబు నిల్చి గెల్చినమ.

బస పు ౬. ౫౬౦.

ప్రతిఘము. సం. విణ (అ. అ) ప్రతిహ లము. వి. అ. పుం. ౧. మాఱుదెబ్బ, ప్రతి ఘాతము ౨. కోపము. ౩. పగతీర్చుకొనుట. ౪. మూర్ఛ్ఛిదు. ౫. శత్రువు. ౬. వధము (శే వి)

ప్రతిఘాతనము. సం. వి. అ. న. మారణము, చంపుట.

ప్రతిఘాతము. సం. వి. అ. పుం. ౧. మాఱు దెబ్బ. ౨. ఎదిరించుట. ౩. అడ్డగింత, వారణము, వారించుట. ౪. మాఱుచేత. ౫. చంపుట.

ప్రతిఘాతి. సం. విణ. (ఇ. ఈ. ఇ.) పగతీర్చు కొనువాఁడు.

ప్రతిఘ్నము. సం. వి. అ. న. దేహము. (వాచ.)

ప్రతిచింతనము సం. వి. అ న. ధ్యానము.

ప్రతిచికీర్ష. సం. వి ఆ. స్త్రీ. ౧ బదులు. చేయుటకునిచ్ఛ. ౨. పగతీర్చుకొనవిచ్ఛ.

ప్రతిచేయు. అ. క్రి (ప్రతి + చేయు) సాటి చేయు, పోల్చు

గీ. ఇంతిసెమ్మోము ప్రతిచేసి యెన్నచోటఁ జందురునిమేను పూర్వపక్షంబు నొందు.

విక్ర. ౪. ౧౭.

ప్రతిచ్ఛందము. సం వి అ పుం ౧ ప్రతిమ, ప్రతిరూపము ౨ ప్రతినిధి

సీ కేల్పకారాము రేఖకుఁ బ్రతిచ్ఛందంబు త్రిద శేంద్రుశకటి కాత్మేకింతంబు . గీ . మంత్రియన్నయదేవయ్యమహితయశము.

(ఇట ఔపమ్యవాచకము.) భీమ. ౧ ౫౩

ప్రతిచ్ఛదనము సం వి అ న కప్పుడు, కప్పుగువస్త్రము.

ప్రతిచ్ఛన్నము. సం విణ (అ. ఆ అ) కప్పఁ బడినది ౨. దాఁచఁబడినది.

ప్రతిచ్ఛాయ. సం. వి. ఆ స్త్రీ. ౧ ప్రతిబిం బము, నీడ ౨ ప్రతిరూపము, ప్రతిమ. ౩. సాదృశ్యము, పోలిక.

ప్రతిజంఘ. సం వి ఆ. స్త్రీ. ఆగ్రజంఘ, పిక్కలయొక్క ముందిభాగము (వాచ)

ప్రతిజల్పకము. సం. వి. అ పుం దూతవాక్య భేదము.

ప్రతిజాగరణము. సం వి. అ. న. కావలికాచుట

ప్రతిజాగరము. సం. వి. అ. పుం. ౧. మేలు కొనుట, మెలఁకువ. ౨. హెచ్చరిక. ౩. కాఁచుట.

ప్రతిజిహ్వ. సం. వి. ఆ. స్త్రీ. చిఱునాలుక, కొండనాలుక.

ప్రతిజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఏదేనొకపనిని దప్పక చేసెదనని దృఢముగా చెప్పుట. ౨. ఒప్పుకొనుట, అంగీకారము. ౩. (న్యాయ) సాధ్యత్వముచేత పక్ష నిర్దేశము (పంచాంగన్యాయము యొక్క అవయవ భేదము)

ప్రతిజ్ఞాంతరము. సం. వి. అ. న. (న్యాయ) నిగ్రహస్థానభేదము (ప్రతిజ్ఞాతార్థమునకు ప్రతిషేధము కలుగఁగా స్వవికల్పమువలన తదర్థము నిర్దేశించుట)

ప్రతిజ్ఞాతము. సం. వి. (అ. ఆ. అ.) ౧. దృఢముగాఁ జెప్పఁబడినది. ౨. ప్రతిజ్ఞ చేయఁబడినది. ౩. అంగీకరింపఁబడినది. వి. అ. న. ప్రతిజ్ఞ.

ప్రతిజ్ఞాతవ్యము. సం. వి. (అ. ఆ. అ.) ౧. ప్రతిజ్ఞ చేయఁదగినది. ౨. అంగీకరింపఁదగినది.

ప్రతిజ్ఞానము. సం. వి. అ. న. ౧. చెప్పుట, దృఢముగాఁజెప్పుట. ౨. అంగీకారము. ౩. ప్రతిజ్ఞ.

ప్రతిజ్ఞాసన్న్యాసము. సం. వి. అ. పుం. ౧. ప్రతిజ్ఞ దిగవిడుచుట. ౨. (న్యాయ) ప్రతిజ్ఞాహాని, ప్రతిజ్ఞను దిగవిడుచుట

ప్రతిజ్ఞాహాని. సం. వి. ఇ. స్త్రీ. (న్యాయ) ప్రతిజ్ఞను దిగవిడుచుట

ప్రతిజ్ఞేయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రతిజ్ఞ చేయఁదగినది. ౨. అంగీకరింపఁదగినది.

ప్రతితంత్రసిద్ధాంతము. సం. వి. అ. పుం. వాదిప్రతివాదులం దొకఁడుమాత్రము ఒప్పుకొన్న సిద్ధాంతము.

ప్రతితరము. సం. వి. అ. పుం. కదపుఁ జేయి, ఓడతెడ్డు లోనగు తరణసాధనము. (వాచ.)

ప్రతితాలి. సం. వి. ఈ. స్త్రీ. తాళపుఁజెవి.

ప్రతితాళము. సం. వి. అ. పుం. (సం.గీ) తాళ భేదము

ప్రతితూణి. సం. వి. ఈ. స్త్రీ. వాతరోగభేదము.

ప్రతిదానము. సం. వి. అ. న. ౧. వస్తువుల మాఱుపు, పరివర్తనము. ౨. దాపనిచ్చినదానిని మరల నిచ్చుట, న్యాసప్రత్యర్పణము.

ప్రతిదారణము. సం. వి. అ. న. ౧. విదారణము, చీల్చుట. ౨. యుద్ధము

ప్రతిదివము. సం. వి. న్. పుం. ౧. దినము. (వ్యుత్పన్న) ౨. సూర్యుఁడు. (వాచ.)

ప్రతిదృష్టాంతసమము. సం. వి. అ. పుం. (తర్క) ఒకవిధమైన పరిహారములేని సమాధానము.

ప్రతిదేయము. సం. విణ. (అ. ఆ. అ.) మరల నియ్యఁదగినది. వి. అ. న. ౧. కుదువ, తాకట్టు. ౨. తీసికొనిమరల నియ్యఁదగిన వస్తువు.

ప్రతిద్వంద్వి. సం. విణ. (న్. నీ. న్.) ౧. పగవాఁడు, శత్రువు. ౨. ప్రతికూలుఁడు, ఒవ్వని వాఁడు. ౩. తుల్యరూపుఁడు, సమానుఁడు. ౪. ఎవ్వనితో ద్వంద్వయుద్ధము చేయఁబడునో వాఁడు.

ప్రతిధ. సం. వి. ఆ. స్త్రీ. ప్రతివిధానము, ప్రతీకారము.

ప్రతిధానము. సం. వి. అ. న. నిరాకరణము. (వాచ.)

**ప్రతినివర్తనము.** సం. వి. అ. న. ౧. లభించ వస్తువునుండి నివర్తించుట. ౨. నివారణము.

**ప్రతినివిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) పట్టు పట్టఁబడునది. (శ. ర.) చలపాది, పట్టుదల గలది (ఆ. ని.)

**ప్రతినివేశము.** సం. వి. అ. పుం. లక్కారు, పట్టుదల, చలము.

**ప్రతిపక్షము.** సం. విణ. (అ. ఆ. అ.) సదృశము, సమానము. - వి. అ. పుం. ౧. విరుద్ధపక్షము. ౨. శత్రువు, ఎదిరి. ౩. (వ్యవహారమందు) ప్రతివాది, విపక్షుఁడు.

**ప్రతిపక్షి.** సం. వి. (న్. ఇ. న్.) ప్రతివాలుఁడు.

**ప్రతిపక్షితము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రతిపక్షముగలది. - వి. అ. పుం. (న్యాయ) సత్ప్రతిపక్షమను దోషముతోఁ గూడిన హేతువు (ఇదియొక హేత్వాభాసము.)

**ప్రతిపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రాప్తి, పొందుట. ('స్వర్గప్రాప్తి') ౨. ఎఱుక, తెలివి, జ్ఞానము. ('శబ్దార్థప్రతిపత్తి' 'అభేదప్రతిపత్తి') ౩. ప్రవృత్తి, పూనిక. ౪. ప్రాగల్భ్యము, నేర్పు. ౫. గౌరవము. ౬. పదప్రాప్తి. ౭. ఫలశూన్యమగు కర్మాంగవిశేషము (ఇది మీమాంసశాస్త్రము. శ్రాద్ధాదులందు దత్తమగు ద్రవ్యము కుశమయబ్రాహ్మణపక్షమున జలాదులందు నిక్షేపించుటయు ఫలశూన్యమగు కర్మాంగము) ౮. ప్రవేశము. (శ. ర.)

**ప్రతిపత్తిపటహము.** సం. వి. అ. పుం. వాద్యభేదము, నగారా.

**ప్రతిపత్తిభేదము.** సం. వి. అ. పుం. మతభేదము, అభిప్రాయభేదము.

**ప్రతిపత్తిమంతుఁడు.** సం. విణ. (త్. వతి. త్.) ౧. ప్రగల్భుఁడు, శూరి. ౨. బుద్ధిమంతుఁడు, తెలివిగలవాఁడు. ౩. పనియందు చుఱుకుఁదనముగలవాఁడు. ౪. ప్రసిద్ధుఁడు, గొప్పవాఁడు.

**ప్రతిపత్తు.** సం. వి. ద్. స్త్రీ. ౧. ప్రవేశము. ౨. ఉపక్రమము, ప్రారంభము. ౩. బుద్ధి, జ్ఞానము. ౪. ద్రగడవాద్యము. ౫. పాడ్యమి. ౬. బహిష్పవమానస్తోత్రమందు ప్రథమ స్తుతి. (వాచ) అవతారికయగు శ్లోకము. ౭. బాధము. (శ. ని.)

**ప్రతిపన్నము.** సం. విణ. ౧. ప్రాప్తము, పొందఁబడినది. ౨. అవగతము, తెలియఁబడినది. ౩. స్వీకృతము, గైకొనఁబడినది.

**ప్రతివర్ణశిఫ.** సం. వి. ఆ. స్త్రీ. ద్రవంతీవృక్షము.

**ప్రతిపాదకము.** సం. విణ. (అ. దికా. అ.) ౧. ఇచ్చునది. ౨. నిరూపించునది, స్థాపించునది. ౩. బోధకము, తెలుపునది, వివరించునది. ౪. ప్రాపకము, పొందించునది.

**ప్రతిపాదనము.** సం. వి. అ. న. ౧. దానము, ఇచ్చుట. ('పాత్రప్రతిపాదనము') ౨. నిరూపణము. ౩. బోధనము, తెలుపుట, వివరించుట. ౪. నెఱవేర్చుట, నిర్వర్తనము. ౫. కలిగించుట. ౬. ఉపక్రమింపుట.

**ప్రతిపాదయిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. బోధకుఁడు. ౨. దాత, ఇచ్చువాఁడు. ౩. నిరూపకుఁడు.

**ప్రతిపాదించు.** సం. స. క్రి. ౧. ఇచ్చు, దానము చేయు.

క. క్షితిపతులవలన సముపార్జితమైన ధనంబు ... దీనిం బ్రతిపాదింపంగవలయుఁ బాత్రవశమునన్. (భాగ. షష్ఠ. ౧. ౨౫౩.)

౨. తెలుపు, నిరూపించు.

౪. ఉపనిషదుక్తికరంబులు, ప్రశంసార్థస్తవగుణిత్ప్రతిపాదించుచున్. (కాశీ. ౫. ౧౧౩.)
౩. కలిగించు (విల్యమ్సు)

**ప్రతిపాదితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రతిపాదింపఁబడినది, దత్తము, ఇయ్యఁబడినది ౨. నిరూపితము. ౩. బోధితము, తెలుపఁబడినది. ౪. చెప్పఁబడినది. ౫. కలిగింపఁబడినది.

**ప్రతిపాద్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రతిపాదింపఁదగినది.

**ప్రతిపాలకుఁడు.** సం. విణ. (అ. అ. .) రక్షకుఁడు.

**ప్రతిపాలనము.** సం. వి. అ. న. రక్షణము.

**ప్రతిపాలించు.** సం. స. క్రి. రక్షించు.
వ. ఇట్లు ప్రస్తావశరాది వివాదంబులవలన సమస్తలోకంబులుం దానయై విష్ణుండు ప్రతిపాలించును. (వి. పు. ౪. ౧౮)

**ప్రతిపాలితము.** సం. విణ. (అ. ఆ. అ.) రక్షితము.

**ప్రతిపూజనము.** సం. వి. అ. న. ౧. ఒకరు చేసిన పూజనమునకు బదులుపూజనము చేయుట ౨. ఎదుర్కొని పూజించుట. ౩. ఒకరినొకరు పూజించుట, వందనాదులు చేయుట.

**ప్రతిపోల్చు.** స. క్రి. (ప్రతి + పోల్చు.) సరిపోల్చు.
ద్వి. బలగర్వమున మిమ్ముఁ బ్రతిపోల్పఁజాలు, బలియుర వానరపతులఁ జెక్కెంద్ర.
రం. రా. బాల. ౧౮. పొ ౨. పం.

**ప్రతిప్రణామము.** సం. వి. అ. పుం. ఒకరు చేసిన ప్రణామమునకు బదులుచేయు ప్రణామము, మాఱుమ్రొక్కు.

**ప్రతిప్రయాణము.** సం. వి. అ. న. మరలి వచ్చుట, మరలఁబాటు

**ప్రతిప్రశ్నము** సం. వి. అ. పుం. ౧. ఒకప్రశ్నకు బదులుగా నడిగెడి ప్రశ్నము. ౨. ఉత్తరము, ప్రత్యుత్తరము.

**ప్రతిప్రసవము.** సం. వి. అ. పుం. (వ్యాక.) బాధకబాధకము, సామాన్యవిధిని బాధించెడి విశేషవిధిని బాధించు సూత్రాదికము.

**ప్రతిప్రస్థాత.** సం. వి. ఋ. పుం. అధ్వర్యునకు సహాయుఁడైన ఋత్విగ్భేదము.

**ప్రతిప్రస్థానము.** సం. వి. అ. న. శత్రుపక్షమును జేరుట, విరుద్ధపక్షము నాశ్రయించుట.

**ప్రతిప్రహారము.** సం. వి. అ. పుం. ౧. మాఱుదెబ్బ, దెబ్బకుఁదగిన మాఱుదెబ్బ. ౨. ప్రతిఘాతభేదము.

**ప్రతిఫలనము** సం. వి. అ. న. ౧. ప్రతిబింబించుట. ౨. సాదృశ్యము.

**ప్రతిఫలము.** సం. వి. అ. పుం. ౧. ప్రతిబింబము. ౨. చేసినకర్మమునకు ననురూపమైన ప్రతీకారము, తగినఫలము.

**ప్రతిఫలించు.** సం. అ. క్రి. ౧. ప్రతిబింబించు.
గీ. తరుణి కడు వింత నీముఖదర్పణమునఁ, బ్రతిఫలించెను శుకదష్టపక్వబింబఫలము ...
ఉ. రా. ౬. ౪౦౮.
౨. తగినప్రతీకారమునిచ్చు.

**ప్రతిఫలితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రతిబింబించినది. ౨. తగినప్రతీకారము చేయఁబడినది.

**ప్రతిబంధకము.** సం. విణ. (అ. ధికా. అ.) ౧. బంధించునది, కట్టునది. ౨. అడ్డగించునది, ప్రతిరోధకము. ౩. ఎదిరించునది, విరోధించునది. ౨. వి. అ. పుం. విటపము, కొమ్మ.

**ప్రతిబంధనము.** సం. వి. అ. న. ౧. బంధించుట, కట్టుట ౨. చెఱయిడుట. ౩. అడ్డగింత, ప్రతిరోధనము

**ప్రతిబంధము.** సం. వి. అ. పుం. ౧. బంధించుట, కట్టుట. ౨. అడ్డగింత, ప్రతిరోధనము ౩. ఎదురించుట, మాఱొడ్డుట ౪. ముట్టడి ౫. సంబంధము. ౬. ఆశాభంగము, మనస్సు చెడుట ౭. (సాంఖ్య) వ్యాప్తి, నియతసంబంధము. (అగ్నిధూమములకుం గల యెడతెగని సంబంధము)

**ప్రతిబంధి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. బంధించునది. ౨. అడ్డగించునది. -వి. ఇ. పుం, ఇ. ఈ. స్త్రీ. ౧. ఆక్షేపము. ౨. ప్రకృతమగు నొకకల్పమునందుఁ బ్రవర్తించినపురుషునిఁ గూర్చి ప్రకృతమగు కల్పాంతరమును ఆపాదించుట. (ఇది ప్రతివాదిమతమందు అనిష్టాంశఁ బ్రసంగము కలిగించు వాక్యమగును. దీనివలన వాదికి వలెనే ప్రతివాదికిని అనిష్టప్రసక్తి కలుగును.)

**ప్రతిబంధించు.** సం. స. క్రి. ౧. అడ్డగించు

వ. మహాఋషుల వదలించి పితరులఁ బ్రతిబంధించి వసువులఁ బరిమార్చి
హర ౩. ౯.

౨. ఒకదానికి చేర్చికట్టు. ౩. (రత్నాదులను) చెక్కు, తాపు.

**ప్రతిబంధువు.** సం. వి. ఉ. పుం. బంధుసమానుఁడు. (దౌహిత్రాది.)

**ప్రతిబద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. (ఒకదానికి) బంధింపఁబడినది, కట్టఁబడినది. ౨. సంబద్ధము, సంబంధించినది. ౩. ప్రతిరుద్ధము, అడ్డగింపఁబడినది. ౪. స్థగితము, తాపఁబడినది. ౫. వ్యాపకము, నియతసంబంధము గలది, ఎల్లప్పుడు నెడతెగక సంబంధించియుండునది. (ధూమమునందు అగ్ని ప్రతిబద్ధము)

**ప్రతిబలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. బలవంతుఁడు ౨. సమానబలుఁడు
-వి. అ. పుం. శత్రువు.

**ప్రతిబాధకము.** సం. విణ. (అ. కా. అ.) మరలింపునది, మఱలఁ దఱుమఁజేయునది, ఆఁపునది. ౨. అడ్డగించునది.

**ప్రతిబాధి.** సం. విణ. (న్. నీ. న్.) అడ్డగించునది. -వి. న్. పుం. విరోధి

**ప్రతిబాహువు.** సం. వి. ఉ. పుం. బాహువుయొక్క అగ్రము (వాచ.)

**ప్రతిబింబము.** సం. వి. అ. పుం. న. ౧. ప్రతిఫలనము. ౨. ప్రతిమ.

(బుధుని వ్యాఖ్యానము) సీ. ప్రతిబింబమో కాని రజనివల్లభునకు, ధ్యానహారమో కాని యమృతరుచికి. (ఇటసాటియనిభావము.)
కాశీ. ౪ ౧౯౧.

**ప్రతిబింబవాదము.** సం. వి. అ. పుం. జీవుఁడు ఈశ్వరునకుఁ బ్రతిబింబమని స్థాపించుటకైన వాదము. (ఇది వేదాంతులవాదములలో నొక భేదము.)

**ప్రతిబింబించు.** సం. అ. క్రి. మాఱురూపము తోఁచు, ప్రతిఫలించు.

వ. తొట్టితొట్టి యెడనెడ మడువులం గట్టినసజ్జకపుగొజ్జంగినీరునందుఁ బ్రతిబింబించు నప్సరః కాంతలవదనారవిందంబులలోపలంబడి తేలియాడు వాడని చేమంతిబంతులవడువునై ... (భీమ. ౫. ౧౨౦.)

**ప్రతిబింబితము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రతిఫలితము, ప్రతిఫలించినది.

ప్రతిబుద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) జాగరితము, మేలుకొన్నది. ౨. తెలివినొందినది, మరల సంజ్ఞవచ్చినది. ౩. వికసించినది, వికసినది. ౪. తెలియఁబడినది, జ్ఞాతము.

ప్రతిబుద్ధి. సం. వి. ఇ. స్త్రీ. ౧. మేలుకొనుట. ౨. ప్రతికూలమైన యుద్దేశము.

ప్రతిబోధకము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ మేలుకొలుపునది. ౨. తెలుపునది,ఎఱిఁగించునది.

ప్రతిబోధనము. సం. విణ (అ. ఆ. అ) మేలుకొలుపునది. -వి అ. న ౧ మేలుకొలుపుట. ౨. బోధించుట. ౩. జ్ఞానము, తెలివి.

ప్రతిబోధము. సం. వి. అ పుం ౧. మేలుకొనుట, జాగరణము ౨ జ్ఞానము, ఎఱుక ౩. బోధనము, ఉపదేశము ౪ వివేకము ౫. స్మరణము. విణ. (అ ఆ అ) మేలుకొన్నది, జాగరితము. ౨. ఎఱుఁగునది, తెలిసికొనునది.

ప్రతిబోధి. సం. విణ. (న్. నీ. న్) ఎఱుఁగఁబోవువాఁడు, ప్రతిబోధమునొందఁబోవువాఁడు.

ప్రతిబోధితుఁడు. సం విణ. (అ ఆ అ) ౧ మేలుకొలుపఁబడినవాఁడు. ౨ బోధింపఁబడినవాఁడు.

ప్రతిభ. సం. వి. ఆ. స్త్రీ. ౧. తోఁపిక, స్ఫూర్తి ౨. దీప్తి, కాంతి. ౩ బుద్ధి. ౪. ప్రత్యుత్పన్నబుద్ధి, అప్పటప్పటికి క్రొత్తక్రొత్తగా వికసించెడు బుద్ధి.

ప్రతిభటించు. సం. అ. క్రి. ౧. పాటియగు, సదృశమగు.

వ. ఇప్పు డిప్పాట వాతోఁడు ప్రతిభటింపఁ గలయది. (కాశీ. ౧. ౧౦౦.)

౨ ప్రతియోధుఁడగు.

క. భీమసేనుండును వానికి పక్కాఁణంబుగా మల్లయుద్ధసన్నద్ధుం డయి ప్రతిభటించి నిలిచె నంత . (భార. సభా. ౧. ౨౦౧.)

౩. ఎదిరించు, అడ్డగించు

సీ. గురుకంబళాదుల గోవృదంబులఁ బన్ని, పరవృషభము లని ప్రతిభటించు ...

భాగ. ౧౦. పూ. ౪౩౦.

ప్రతిభటుఁడు. సం. వి. అ. పుం. ప్రతిస్పర్థి. ఎదిరి.

ప్రతిభయము. సం విణ. (అ. ఆ. అ) ౧. భయంకరము ౨ ప్రాణకరము, అపత్కరము -వి. అ న భయము.

ప్రతిభాతము సం. విణ (అ. ఆ. అ.) ౧. దీప్తిగలది ౨ జ్ఞానమును పొందినది, తెలియఁబడినది.

ప్రతిభానము సం వి అ న. ౧. దీప్తి, కాంతి. ౨. బుద్ధి ౩. ప్రతిభ, ప్రత్యుత్పన్నబుద్ధి.

ప్రతిభావంతుఁడు. సం విణ (త్. వతీ. త్.) ౧. దీప్తిగలవాఁడు. ౨ బుద్ధిమంతుఁడు.-వి.త్. పుం ౧ సూర్యుఁడు. ౨. చంద్రుఁడు. ౩ అగ్ని.

ప్రతిభాష. సం. వి ఆ. స్త్రీ ప్రత్యుత్తరము, మాఱుపలుకు.

ప్రతిభాషించు. సం. అ. క్రి మాటలాడు.

వ ప్రాణావసానకాలంబున .. నంపజేతోఁడం ప్రతిభాషించుచు ననాయాసంబునఁ గర్మశరీరంబులు విడిచి (పానందో ౧. ౧౩౧.)

ప్రతిభాసనము. సం. వి. అ. న. ౧. తోఁపిక, స్ఫురణము. ౨. పోలిక.

ప్రతిభాసము. సం. వి అ పుం ౧. మనస్సున కటాలున తోఁచుట. ౨. తోఁపిక, స్ఫురణము.

3. ప్రకాశము. ౪. మాయ. -విణ (అ. ఆ. అ) ప్రకాశమానము, వెలుఁగునది.

ప్రతిభాసించు. సం. స. క్రి. ౧ స్ఫురించు.

వ. పరశురామదత్తం బయిన భార్గవాస్త్రం బనుపేరిటి మహనీయసాధనంబు రాధేయునకుం బ్రతిభాసింపకుండె. భార. కర్ణ. 3 3౪౧.

౨. స్పష్టమగు, ప్రకాశించు.

వ. అది విని న భవదభ్యర్థితం బైనయర్థంబు ప్రతిభాసించును. భార. శాం. ౬ ౭౯.

ప్రతిభిన్నము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ వేఱుపడినది, భేదింపఁబడినది. ౨. ఖండింపఁబడినది, పెకల్పఁబడినది. 3. దగ్గఱగా సంబంధించినది.

ప్రతిభుఁడు. సం. వి. అ. పుం. (వాణిజ్య) [illegible]కుఁడు.

ప్రతిభువు. సం. వి. ఊ. పుం. పూఁటకాఁడు.

ప్రతిభేదనము. సం. వి. అ. న. ౧ ఉత్పాటనము, చీల్చుట. ౨. సైన్యాదులను పెకల్చుట. 3. విభాగించుట, పాలుపంచుట.

ప్రతిభేదము. సం. వి. అ. పుం. ౧ ఉత్పాటనము, పెకల్చుట. ౨. చీల్చుట, భేదించుట. 3. కనిపెట్టుట, కనుఁగొనుట.

ప్రతిమ. సం. వి. ఆ. స్త్రీ. ౧ శిలాదినిర్మితమగు విష్ణ్వాదిమూర్తి. ౨. విగ్రహము, బొమ్మ, పతిమ. 3. సాదృశ్యము, పోలిక. ౪. ప్రతిబింబము. ౫. అనుకృతి. ౬. చిహ్నము. ౭. ఏనుఁగు వాతకుంభము క్రింది దంతములనడిమి చోటు, గజదంతబంధము.

ప్రతిమండలము. సం. వి. అ. న. ౧ సూర్యాదుల చుట్టుబింబము. ౨. సూర్యాదుల పరివేషము, పరిధి.

ప్రతిమల్లుఁడు. సం. వి. అ. పుం. ప్రతిభటుఁడు, శత్రువు.

ప్రతిమానము. సం. వి. అ. న. ౧. ఉపమానము, మాదిరి. ౨. శిలాదినిర్మితవిష్ణ్వాదిమూర్తి, విగ్రహము, పతిమ. 3. ప్రతిబింబము. ౪. సాదృశ్యము, పోలిక. ౫. ఏనుఁగువాతకుంభము క్రింది దంతములనడిమిచోటు.

ప్రతిమార్గకము. సం. వి. అ. పుం. ఆకాశచారి యగు సౌభపురము.

ప్రతిమాల. సం. వి. ఆ. స్త్రీ. అంత్యాక్షరపద్యరాజీపద్యముల జ్ఞప్తియొక్క పరీక్షకై యొక పద్యము చివరి యక్షరముతో నారంభించి చదువఁబడు పద్యముల వరుస. (శ్రా, శ. ర)

ప్రతిముక్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కట్టఁబడినది, పరిహితము. (వస్త్రము.) ౨. తొడుగఁబడినది (కవచము.) 3. విడువఁబడినది, పరిత్యక్తము.

ప్రతిముఖము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ముంగమున నెదురుగా నున్నది, అభిముఖము. ౨. దగ్గఱది, సన్నిహితము.

వి. అ. న. ఒకనాటకసంధి. (చూ. సంధి.)

ప్రతిమూర్తి. సం. వి. ఇ. స్త్రీ. ప్రతిమ, ప్రతిరూపము.

ప్రతిమె. వి. (సం. ప్రతిమా.) ప్రతిమ, విగ్రహము.

క. ఆ ప్రతిమెలు నిలుపఁగవలయు నచట మృదుపీఠములన్. (భాగ. ౬.) (చి.ని.)

ప్రతిమోచనము. సం. వి. అ. న. ౧ సడల్చుట, ప్రిదులఁజేయుట. ౨. పగదీర్చుకొనుట. 3. విడిచిపుచ్చుట.

ప్రతియత్నము. సం. విణ. (అ. ఆ. అ.) ఒకని ప్రయత్నమునకు మాఱుగ తగిన ప్రయత్నము చేయునది.

వి. అ. పుం. ౧. ప్రత్యుపకారము. ౨. గుణాంతర మును గలిగించుట, సంస్కారము. ౩. రచన. ౪. వాంఛ, ఇచ్ఛ. ౫. ఉపగ్రహము, అను కూల్యముచేత. ౬. నిగ్రహించి. ౭. గ్రహ ణము. ౮. ( నిగ్రహము (పరిగ్రహము ?) ౯. చేఁపెట్టుట.

ప్రతియాతన. సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రతిమ. ౨. తుల్యయాతన. (శ. ర.)

ప్రతియాతనము. సం. వి. అ. న. పగదీర్చి కొనుట.

ప్రతియానము. సం. వి. అ. న. మరలిపోవుట, ఇనుకకిపోవుట

ప్రతియుద్ధము. సం. వి. అ. న. ఎదుర్కొని యుద్ధముచేయుట, మార్కొనుట.

ప్రతియోగము. సం. వి. అ. పుం. ౧. విరోధము. ౨. విరుద్ధసంబంధము. ౩. ఎదురొడ్డుట, అడ్డగించుట.

ప్రతియోగి. సం. విణ. (న. ఈ. న.) ౧. విరోధి, విరోధించునది. (న్యాయ. ఘటాది, ఘటాద్యభావమునకు ప్రతియోగి) ౨. విరుద్ధ పక్షము. ౩. (విశిష్టబుద్ధినియామకమగు సంస ర్గముయొక్క) సంబంధిభేదము. (చంద్రతుల్య ముఖము' అనుచోట సాదృశ్యమునకు చంద్రుఁడు ప్రతియోగి, ముఖము అనుయోగి ఇట కేవలముఖ మనక చంద్రతుల్యముఖమనఁ గల విశిష్ట బుద్ధియందు విశేషణముగా భాసించునది సంస ర్గముయొక్క ప్రతియోగి, విశేష్యముగా భాసిం చునది సంసర్గముయొక్క అనుయోగి. ఇట్టే 'ఘటవద్భూతలము' అనుచో సంయోగమునకు ఘటము ప్రతియోగి, భూతలము అనుయోగి)

ప్రతియోధనము. సం. ప్రతియుద్ధము.

ప్రతిరంభము. సం. వి. అ. పుం. ౧. ప్రతి లంభము, లాభము. ౨. క్రోధము, ఆగ్రహము.

ప్రతిరథుఁడు. సం. వి. అ. పుం. ప్రతియోధుఁడు.

ప్రతిరవము. సం. వి. అ. పుం. ౧. కలహము, పోరు. ౨. ప్రతిధ్వని. ౩. ప్రతికూలశబ్దము. ('వాదమునందు వీఁడు భుజింపఁదగఁడు, వీఁడు సాధనమును బలవంతముగా వసూలించు చున్నాఁడు. ఇత్యాదిగా లోకములందు ఉద్ఘో షించుట ప్రతిరవము)

ప్రతిరుద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అడ్డ గింపఁబడినది. ౨. ముట్టడింపఁబడినది.

ప్రతిరూపకము. సం. విణ. (అ. ఇకా. అ.) (సమాసాంతములందు) సమానరూపముగలది, సదృశము. వి. అ. న. ౧. ప్రతిమ, విగ్రహము. ౨. ప్రతిబింబము. ౩. ఒకదానివలెనే కల్పింపఁ బడినది. (పత్రము మొ.)

ప్రతిరూపధర. సం. వి. ఆ. స్త్రీ. కమసాలిపడి యచ్చు.

ప్రతిరూపము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సమానరూపముగలది. ౨. అనురూపము, తగినది. వి. అ. న. ప్రతిమ, విగ్రహము.

ప్రతిరోధకుఁడు. సం. విణ. (అ. ధికా. అ.) ౧. అడ్డగించువాఁడు, ఎదిరించువాఁడు. ౨. ముట్టడించువాఁడు, దొంగ.

ప్రతిరోధనము. సం. వి. అ. న. ఎదిరించుట, అడ్డగించుట.

ప్రతిరోధము. సం. వి. అ. పుం. ౧. ఎదిరించుట. ౨. అడ్డగించుట, విరోధము. ౩. ప్రతిబంధము. ౪. ముట్టడి. ౫. పరచౌర్యము, బలాత్కార ముగ దొంగిలించుట. ౬. తిరస్కారము. ౭. (న్యాయ) సాధ్యాసమితివిరోధకము సత్ప్రతిపక్షము అను హేతుదోషము.

ప్రతిరోధి. సం. వి. ఇ. పుం. ౧. ఎదిరించువాఁడు. ౨. బందిపోటుదొంగ.

ప్రతిలంభము. సం. వి. అ. పుం. ౧. లాభము, ప్రాప్తి, పొందుట ౨. ఉపాలంభము, దూఱు వాడుట.

ప్రతిలిఖించు. సం. స. క్రి. వ్రాయు.

సీ. పఠియించినను దీనిఁ బ్రతిలిఖించిన విన్న, దానంబు చేసిన .. (కాశీ. ౪. ౭౨.)

ప్రతిలోమజుఁడు. సం. వి. అ. పుం. తక్కువ వర్ణమువానికి ఎక్కువవర్ణముగల స్త్రీయందుఁ బుట్టినవాఁడు

ప్రతిలోమము. సం. విణ. (అ. ఆ అ.) ౧ వామము, విపరీతము, క్రమముతప్పినది, అవరోహణక్రమముగలది. (వ్యతి అనులోమము) ౨ జాతి దుష్టమైన (మగనికంటె తక్కువ వర్ణముగల స్త్రీ కడుపునఁ బుట్టిన)వాఁడు, తక్కువ వర్ణమువానికి ఎక్కువ వర్ణముగల స్త్రీయందుఁ బుట్టినవాఁడు ౩. ప్రతికూలము. ౪. నీచము, అధమము, ౫. పిలవాగి.

ప్రతివచనము. సం వి అ. న. ౧. ప్రతివాక్యము, మాఱుమాట. ౨. ఉత్తరము. ౩. ప్రతిధ్వని. ౪ విరుద్ధవాక్యము.

ప్రతివచస్సు. సం వి. స్. న. ౧ ప్రత్యుత్తరము. ౨. ప్రతిధ్వని.

ప్రతివచ్చు. అ. క్రి. సమానమగు.

క. ఆతిమ్మక్షితిపాలుఁడు, పాతివ్రత్యమున సకల భాగ్యశ్రీలన్, సీతకుఁ బ్రతివచ్చినవి,ఖ్యాత గుణాలంబ మాచమాంబ వరించెన్.

వి. పు. ౧. ౩౫.

సీ. బంధికంఠానతోఁడఁ బ్రతివచ్చుపైచాయ నీలి పచ్చడముతో మేళవింప. (శైవ. ౪. ౯౩.)

సీ. తన్వంగి పారిజాతప్రవాళములతోఁ బ్రతివచ్చు నీహ స్తపల్లవములు...

కాశీ. ౫. ౭౯౩.

ప్రతివర్ణికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సమానుఁడు, సదృశుఁడు.

ప్రతివసథము. సం. వి. అ పుం. గ్రామము, సంవసథము.

ప్రతివసి(యి)ంచు. సం. అ. క్రి. నివసించు.

గీ. దక్షవాటిక పశ్చిమద్వారభూమిఁ, బ్రతివసించును సర్వాంగరమ్య యుంచు.

భీమ ౧. ౯౭.

చ. ప్రతివసియించు గోవుఁ ఖురంబుల నుండు సమ స్తతీర్థసంతతియు (కాశీ. ౭ ౧౭.)

ప్రతివస్తువు సం. వి. ఉ. న. ౧. సమానమైన వస్తువు, తుల్యరూపమగు వస్తువు. ౨. ఒకదానికి బదులుగా నిచ్చినవసువు

ప్రతివస్తూపమ. సం. వి. ఆ. స్త్రీ. ఒక అర్థాలంకారభేదము.

శ్లో వాక్యయో రేకసామాన్యే ప్రతివస్తూపమా మతా, తాపేన భ్రాజతే సూర్యః శూర శ్చాపేన రాజతే. (చంద్రాలోకము.)

ప్రతివాక్యము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రత్యుత్తరము చెప్పఁదగినది. - వి. అ. న. ప్రత్యుత్తరము.

ప్రతివాదము. సం వి. అ. పుం. ప్రత్యుత్తరము, మాఱుమాట, వాదిప్రయుక్తమగు న్యాయమునకు విరుద్ధమగు న్యాయవాక్యమును బ్రయోగించుట, ప్రతిపక్షవాదము.

ప్రతివాది. సం. విణ. (ఇ. ని. ఇ.) ౧. ప్రత్యుత్తరముచెప్పువాఁడు, మాఱుపలుకువాఁడు. ౨. విరుద్ధముగా పలుకువాఁడు, విరోధవచనము చెప్పువాఁడు. (వ్యవహార.) వాది ప్రయోగించిన

స్యాయమునకు విరుద్ధమగుస్యాయవాక్యమును వాదించువాఁడు, వాదికి ప్రతిపక్షమువాఁడు. వి. క. పుం. విరోధి.

ప్రతివాదించు. సం. అ. క్రి. వాదికి ప్రతిపక్షముగా మాటాడు. (శ. ర.)

ప్రతివాపము. సం. వి. అ. పుం. (వైద్య)మందులను కషాయాదులుగా కాఁచునప్పుడు గాని, కాఁచి దించినప్పుడు గాని యితరపదార్థముల నందుఁ గలుపుట.

ప్రతివారణము. సం. విణ. (అ ఈ ఆ.) నివారించునది (కి గ్ర). వి. న. నివారణము.

ప్రతివార్త. సం. వి. అ. స్త్రీ. ప్రత్యుత్తరము వంటిదగు వృత్తాంతవిశేషము.

ప్రతివాసి. సం. విణ. (క. సీ. క.) ఇరుగుపొరుగుల నివసించువాఁడు.

ప్రతివిధానము. సం. వి. అ. న. మాఱుసేఁత, ప్రతీకారము.

ప్రతివిధి. సం. వి. ఇ. పుం. ౧. ప్రతీకారము, మాఱుసేఁత. ౨. ప్రతిచికిత్స, నివారణోపాయము.

ప్రతివిష. సం. వి. ఆ. స్త్రీ. అతివస. శ్రీ.

ప్రతివిష్ణుకము. సం. వి. అ. పుం. ముచుకుంద వృక్షము.

ప్రతివీరుఁడు. సం. వి. అ. పుం. ప్రతిభటుఁడు.

ప్రతివెట్టు. వి. స. క్రి. (ప్రతి+పెట్టు.) ఎదుట నుంచు, సమానముగానుంచు.

ఉ. అంతర మెట్టిదో యని నిజాస్యముతోఁ బ్రతివెట్టి శౌరిహి, తాంతుఁ బరీక్షసేయుటకు. హైమ. ఒ. ౮౫.

ప్రతివేశము. సం. వి. అ. పుం. ఇరుగుపొరుగు ఇల్లు.

ప్రతివేశవాసి. సం. విణ. (క. సీ. క.) ఇరుగుపొరుగుల వసించువాఁడు.

ప్రతివేశి. సం. విణ. (క. సీ. క.) ఇరుగుపొరుగులవాఁడు.

ప్రతివేశుఁడు. సం. వి. అ. పుం. ఇరుగుపొరుగులవాఁడు.

ప్రతివేశ్యుఁడు. సం. వి. అ. పుం. ఇరుగుపొరుగువాఁడు.

ప్రతివేష్టితము. సం. విణ. (అ ఆ అ.) వెనుకకుఁ జుట్టఁబడినది, వ్యత్యస్తముగాఁ జుట్టఁబడినది.

ప్రతివైరము. సం. వి. అ. న. పగతీర్చుకొనుట.

ప్రతివ్యూఢము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యూహముగా పన్నఁబడినది, ఎదురెదురుగా నిల్పఁబడినది.

ప్రతివ్యూహము. సం. వి. అ. పుం. మాఱొడ్డుట, శత్రువున కెదురుగా సేనను బన్నుట.

ప్రతిశబ్దము. సం. వి. అ. పుం. ౧. ప్రతిధ్వని. ౨. ఘోషము, మ్రోఁత, బొబ్బ.

ప్రతిశయనము. సం. వి. అ. న. ౧. ప్రతిస్వాపము, ఎదురుగాఁ బరుండుట. ౨. ఫీప్సలాభమునకై ప్రత్యాదేశముచేత దేవునిమ్రోల స్నానభోజనాదులు వర్జించిపరుండుట. (వాచ)

ప్రతిశయితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ప్రతిశయనము చేయువాఁడు.

ప్రతిశాపము. సం. వి. అ. పుం. బదులుశపించుట, మాఱుతిట్టు.

ప్రతిశాసనము. సం. వి. అ. న. ౧. ఆజ్ఞాపించుట, పనిపంచుట. ౨. పిలిచి పనిపంచుట, నికృష్టులగు భృత్యాదుల నియోగించుట.

ప్రతిశిష్టుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. పనిపంపఁబడినవాఁడు, ప్రేషితుఁడు. ౨. ప్రత్యాఖ్యాతుఁడు, నిరాకరింపఁబడినవాఁడు.

ప్రతిశీర్షకము. సం. వి. అ. పుం. అధి, పడుప, కాకట్టు.

ప్రతిశ్య. సం = ప్రతిశ్యాయము. (వాచ.)

ప్రతిశ్యాయము. సం. వి. అ. పుం. పీనసము, పడిసెము.

ప్రతిశ్రయము. సం. వి. అ. పుం. ౧. ఆశ్రయము, ప్రాపు. ౨. గృహము. ౩. సభ. ౪. యజ్ఞగృహము ౫. ఆశయము, పట్టు.

ప్రతిశ్రవణము. సం. వి. అ. న. ౧ ఆలించి వినుట ౨ అంగీకారము.

ప్రతిశ్రవము. సం వి అ పుం అంగీకారము.

ప్రతిశ్రుతము. సం. విశే. (అ. ఆ అ) ౧ అంగీకరింపఁబడినది. ౨. ప్రతిజ్ఞ సేయఁబడినది. వి అ. న ప్రతిజ్ఞ, ప్రతిన.

ప్రతిశ్రుతి. సం. వి ఇ. స్త్రీ = ప్రతిశ్రుత్తు

ప్రతిశ్రుత్తు. సం. వి. త్ స్త్రీ. ౧ అంగీకారము. ౨. ప్రతిజ్ఞ. ౩. ప్రతిధ్వని.

ప్రతిషిద్ధము. సం. విశే. ( అ. అ.) నిషేధింపఁబడినది.

ప్రతిషేధకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. నిషేధించువాఁడు. ౨. నివారించువాఁడు.

ప్రతిషేధనము. సం. వి. అ. న ౧ నిషేధము. ౨. నిరాకరణము. ౩ నివారణము.

ప్రతిషేధము. సం. వి. అ. పుం. ౧. నివారించుట, నిషేధము. ('వలదు చేయకుము' అని వారించుట, అడ్డగించుట) ౨. నిరాకరించుట. ౩. విరోధించుట. ౪. ఒక అర్థాలంకారభేదము.

శ్లో. ప్రతిషేధః ప్రసిద్ధస్య నిషేధ స్యానుకీర్తనమ్, న ద్యూత మేత త్కితవ క్రీడనం నిశితైః శరైః (చంద్రాలోకము.)

ప్రతిషేధించు. సం. స. క్రి. నిషేధించు.

క. అలిగి విరి యమ్యర్యవిందాస్య యాదాస్యే సుందరవలంబితకూస్యముద్రాముద్రితం బైన చూపున వాఁడి యాభూపాలునిం ప్రతిషేధించె. (సైంధ. ౫. ౯౫.)

ప్రతిషేధోపమ. సం వి. ఆ. స్త్రీ. ఒక ఉపమాలంకారవిశేషము.

శ్లో. న జాతు శక్తి రిందో స్తే ముఖేన ప్రతిగర్జితుమ్, కలంకినో జడస్యేతి ప్రతిషేధోపమైవ సా. (కావ్యాదర్శము.)

ప్రతిషేద్ధ. సం. విశే. (ఋ. ద్ధీ. ఋ.) ప్రతిషేధకుఁడు.

ప్రతిష్కషము. సం. వి. అ. పుం. తోలువాఱు, కొరడాచర్మరజ్జువు

ప్రతిష్కసుఁడు. సం. వి. అ. పుం. చారుఁడు.

ప్రతిష్కుఁడు. సం వి. అ. పుం దూత.

ప్రతిష్టంభము. సం విశే (అ.ఆ.అ.) అడ్డగింత.

ప్రతిష్టబ్ధము. సం విశే. (అ. ఆ. అ.) అడ్డగింపఁబడినది.

ప్రతిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. ౧ స్థానము, చోటు. ౨. నేల, భూమి. ౩. స్థైర్యము, నిలుకడ. ౪ గౌరవ . ౫. కీర్తి. ౬. (ఉద్యోగాదులందు) స్థాపించుట, నెలకొలుపుట, శాశ్వతముగా నిలుపుట ౭. దేవతావిగ్రహాదులకు బూహ్యత్వాదులు గలిగించు సంస్కారభేదము. ౮. అడుగు, పాదము. ౯. నాలుగవఛందము. ౧౦. మాహాత్మ్యము. (శే వి.)

ప్రతిష్ఠము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రసిద్ధము.

ప్రతిష్ఠానము. సం. వి. అ. న. ౧. స్థానము, చోటు. ౨. ఆశ్రయము, విశ్రమస్థానము. ౩. విఖ్యాతి. ౪. వ్రతాదుల సమాప్తియందుఁ జేయు కర్మభేదము. ౫. దేవతావిగ్రహాదులకుఁ బూజ్యత్వము గలిగించు సంస్కారభేదము. ౬. గంగా

యమునాసంగమునందు చంద్రవంశపురాజుల రాజధానిపట్టణము, గోదావరీతీరమున గల శాలివాహనుని రాజధానియగు నొకపట్టణము.

ప్రతిష్ఠాపనము. సం. వి అ. న. ౧. నిలుపుట, నెలకొలుపుట, శాశ్వతముగా నిలుపుట ౨. ఉద్యోగాదులందు నెలకొలుపుట. ౩. దేవతావిగ్రహములను స్థాపించుట.

ప్రతిష్ఠాపయిత సం విశే. (పు స్త్రీ. పు) ప్రతిష్ఠాపించువాఁడు.

ప్రతిష్ఠాపించు. సం. స క్రి. ప్రతిష్ఠచేయు (సిసిక ప్రతిష్ఠచేయించు అని ప్రేరణార్థముకూడ చెప్పవచ్చును.)

మ. సమభూమిక ఐరమోత్సవంబునఁ బ్రతిష్ఠాపించె శ్రీరంగమున్
శ్రీరంగ. ౬. ౩౨

వ. విశ్వగురుండు వైశ్వానరుఁ బ్రార్థించి నియోగించి భృగువచనంబు ప్రతిష్ఠాపించె
భార. ఆది. ౧. ౧౮౩.

మ. ... అయ్యనపాయుండు తదాశ్రమస్థ యగు మద్య(రాజ్య)లక్ష్మిక సుధాళనగేహంబున శాశ్వతంబుగఁ బ్రతిష్ఠాపించెఁ జెంపేర్పడక.
హరి పూర్వ. ౩ ౩౯.

ప్రతిష్ఠించు. సం. స. క్రి. శాశ్వతముగా నిలుపు నిలుపు.

వ. ... హైయంగవీనపూర్ణకాంచనపాత్రంబున యథాశక్తి ధర్మనిర్మితసమందరపూర్ణప్రతిమ ప్రతిష్ఠించి షోడశోపచారంబులు సలిపి
వరాహ. ౮. ౧౫.

ప్రతిష్ఠితము. సం. విశే. (అ. అ. అ.) ౧. నిలుపఁబడినది, నెలకొలుపఁబడినది. ౨. శాశ్వతముగా నిలుపఁబడినది, స్థిరముగా నెలకొలుపఁబడినది, స్థాపింపఁబడినది. ౩. కొలుపేర్పఁబడినది.

౪. విఖ్యాతము, వాసికెక్కినది. ౫. నిశ్చయింపఁబడినది.

ప్రతిసంక్రమము. సం. వి. అ. పుం. ౧. ప్రతిచ్ఛాయ. ౨. సంచారము

ప్రతిసంఖ్య. సం. వి అ. స్త్రీ. ౧. ప్రసంఖ్యానము, లెక్కగా లెక్కపెట్టుట. ౨. సాంఖ్యాదిసిద్ధమగు జ్ఞానభేదము.

ప్రతిసంఖ్యానిరోధము సం వి. అ. పుం. బుద్ధిపూర్వకముగా భావములు నశించుట. (ఇది బౌద్ధమతసిద్ధమగుపదార్థభేదము)

ప్రతిసంగతిక. సం. వి. అ. స్త్రీ దమ్మును పైఁబడనీక హరించుటకగు దుప్పటము

ప్రతిసంచరము సం. వి అ. పుం. వెనుకకు మరలుట, వెనుకకుఁదిరుగుట. ౨. మరల లయించుట, ప్రలయభేదము. ౩. జగత్తు మరల ప్రకృతియందు లయించుట. ౪ సంచారము.

ప్రతిసందేశము. సం. వి. అ. పుం. సందేశమునకు మాఱుసందేశము, పంపినవృత్తాంతమునకుఁ బ్రత్యుత్తరము. (ఇది వాచికముగా నుండును.)

ప్రతిసంధానము. సం. వి. అ. న. ౧. ఒకటిగా గూర్చుట. ౨. ఇంద్రియనిగ్రహము. ౩. స్తుతి. ౪. అనుసంధానము, అనుచింతనము. ౫. అన్వేషణము, వెదకుట.

ప్రతిసంధి. సం. వి. ఇ. పుం. ౧. మరలఁ గూడుట. ౨. గర్భమునుజొచ్చుట. ౩. యుగముల నడిమికాలము. ౪. ఉపరమము, ఉడుగుట. ౫. వియోగము. ౬. ప్రతిసధానము.

ప్రతిసంధేయము. సం. విశే. (అ. అ. అ.) ప్రతికార్యము, ప్రతీకారము చేయఁదగినది.

ప్రతిసంవేదకుఁడు. సం. విణ. (అ. ది౯. అ.) సవిస్తరముగా నెఱిఁగించువాఁడు.

ప్రతిసంస్థానము. సం. వి. అ. న. ప్రవేశించుట, ప్రవేశము.

ప్రతిసంహారము. సం. వి. అ. పుం. ౧. లోపలికి దీసుకొనుట, మడఁచుకొనుట. ౨. సంకోచము, ముడుఁగుకొనుట. ౩. అంతర్ధానము, లోపలఁ జేర్చుకొనుట. ౪. ఇచ్చుట.

ప్రతిసమము. సం. విణ. (అ. ఆ. అ.) విసదృశము.

ప్రతిసమాసనము. సం. వి. అ. న. నిరసనము, నివారించుట.

ప్రతిసరము. సం. విణ. (అ. ఆ. అ.) నియోజ్యము, నియోగింపఁదగినది. - వి. అ. పుం., న. ౧. భూషణము. ౨. హస్తబంధనసూత్రము, కాయిత్తు. ౩. ఏనుఁగుకుంభముల క్రిందిచోటు. (శ. ర.) ౪. ఆరక్షకుఁడు, ఆరెకుఁడు. పుం. ౧. సైన్యపశ్చాద్భాగము, సేనవెనుకటి దిక్కు. ౨. వివాహాదులందు దీక్షార్థము చేతఁ గట్టుకొను తోరము, కౌతుకసూత్రము. ౩. మంత్రవిశేషము. ౪. మాల్యము, పూదండ. ౫. కడియము. ౬. వ్రణశుద్ధి. ౭. ప్రాతఃకాలము.

ప్రతిసర్గము. సం. వి. అ. పుం. బ్రహ్మయొక్క సృష్టికి పాటియగు మరీచ్యాదులసృష్టి. (ఇది పురాణలక్షణములలో నొకటి - చూ. లక్షణము.) ౨. ప్రళయము.

ప్రతిసవ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రతికూలుఁడు. ౨. విరుద్ధాచారుఁడు.

ప్రతిసాంధానికుఁడు. సం. వి. అ. పుం. బట్టువాఁడు, స్తుతిపాఠకుఁడు, మాగధుఁడు.

ప్రతిసారణము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. అపసారకము, తొలఁగించునది. ౨. దూరీకారకము, దూరముగాఁ జేయునది. - వి. అ. న. ౧. దూరీకరణము. ౨. (వ.శ్రుతి) అగ్నికార్యభేదము. (వాచ.) ౩. కంటియందు మందుపూయుటకు ప్రయోగించెడి యొక పనిముట్టు. ౪. పొడి మొదలగువానితోఁగాని, వ్రేలితోఁగాని పంటిని రుద్దుట. (వైద్యక)

ప్రతిసారణీయము. సం. విణ. (అ. ఆ. అ.) స్థానాంతరమునకుఁ గొంపోఁదగినది.
- వి. అ. పుం. (వ.శ్రుతి) క్షారపాకవిధి భేదము, క్షారములను వండువిధులలో నొకభేదము.

ప్రతిసారి. సం. విణ. (స. నీ. స.) ౧. విరుద్ధముగాఁ బోవునది. ౨. నీచముగాఁ బోవునది.

ప్రతిసీర. సం. వి. ఆ. స్త్రీ. తెర, యవనిక.

ప్రతిసూర్య(క)ము. సం. వి. అ. పుం. ౧. కృకలాసము, తొండ. ౨. రెండవసూర్యుఁడు తోఁచుట. (ఇది ఆంతరిక్ష ఉత్పాతభేదము.)

ప్రతిసృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రేరితము. ౨. ప్రత్యాఖ్యాతము, నిరాకరింపఁబడినది. ౩. మత్తము, మదించినది.

ప్రతిసేన. సం. వి. ఆ. స్త్రీ. శత్రుసైన్యము.

ప్రతిసేయు. మి. స. క్రి. పోల్చు, ఉపమించు.

తే. రమణఁ బ్రతిసేయవచ్చు ... యౌదార్య
విభవధారియై మించుశ్రీరంగశౌరి కెపుడు.
వసు. ౧. ౩౪.

ప్రతిసోమ. సం. వి. ఆ. స్త్రీ. మహిషవల్లి. శ్రీ.

ప్రతిస్నాతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) స్నానముచేసినవాఁడు, జలకమాడినవాఁడు.

**ప్రతిస్పర్ధ.** సం. వి. అ. స్త్రీ. పోటీ, పురుడు.

**ప్రతిస్పర్ధి.** సం. విణ. (న. పు. న.) పోటీచేయు వాఁడు, మచ్చరించువాఁడు.

**ప్రతిస్పర్ధించు.** సం. అ. క్రి. స్పర్ధచేయు, పోటీ చేయు.

వ. వింధ్యం బను మహీధరంబు విబుధశైలం బుతోఁ బ్రతిస్పర్ధించి. (కాశీ. ౧. ౫౧.)

**ప్రతిహతము.** సం. విణ. (అ. ఆ. అ) మరలఁ గొట్టఁబడినది, మాఱుదెబ్బపడినది. ౨. నిర స్తము, త్రోసిపుచ్చఁబడినది, తిఱుగఁగొట్టఁ బడినది. 3. రుద్ధము, అడ్డగింపఁబడినది. ౪. ద్విష్టము, ద్వేషింపఁబడినది. ౫. ప్రతిస్ఖలితము, తొట్రుపడినది, మనసుచెడినది.

వి. అ. న నిరాసము, త్రోసిపుచ్చుట.

**ప్రతిహతి.** సం. వి. ఇ స్త్రీ ౧. మాఱు కొట్టుట, మాఱుదెబ్బ ౨ విఘాతము, అడ్డగింత 3 పరావృత్తి, కొట్టఁబడి మరలపోయుట ౪ రోషము

**ప్రతిహర్త.** సం విణ (ఋ స్త్రీ ఋ) ౧ మరలఁగొట్టువాఁడు, మాఱుదెబ్బఁగొట్టువాఁడు ౨ మరలఁదెచ్చువాఁడు 3 ఋత్విగ్భేదము (ఉద్గాతకు సహాయుఁడు)

**ప్రతిహస్తకుఁడు.** సం వి అ పుం ప్రతినిధి

**ప్రతిహారకుఁడు.** సం వి అ పుం గారడి విద్యయందు నేర్పరియైనవాఁడు (వాచ)

**ప్రతిహారము.** సం వి అ పుం మరలఁగొట్టుట మాఱుదెబ్బ. ౨ ద్వారము 3 గారడివిద్య ౪. (వ్యాక.) దంత్యాక్షరములయుచ్చారణమున నాలుక పండ్లకొనల నొత్తి తాఁకుట ౫ కళ్ళెపము, కాఁడెలు. (శ. ని)

**ప్రతిహారి.** సం. వి. న. పుం వాకిటికావలివాఁడు.

**ప్రతిహారుఁడు.** సం. వి. అ పుం ౧. ద్వార పాలకుఁడు, వాకిటికావలివాఁడు. ౨. గారడి వాఁడు.

**ప్రతిహాసము.** సం. వి అ పుం. ౧ నవ్వునకు మాఱునవ్వు ౨ గన్నేరు ?

**ప్రతిహితము.** సం విణ (అ ఆ అ) ౧. హితమైనది ౨ దగ్గఱగానుంపఁబడినది.

**ప్రతీంధకము.** సం వి. అ పుం విదేహదేశము.

**ప్రతీకము.** సం విణ (అ ఆ అ.) ౧ ప్రతికూలము, విలోమము ౨ అనురూపము (శ ని) వి అ పుం ౧ అవయవము ౨ ఏకదేశము

**ప్రతీకారము.** సం = ప్రతికారము

**ప్రతీకారి.** సం విణ = ప్రతికారి

**ప్రతీకాశము.** సం = ప్రతికాశము

**ప్రతీక్ష.** సం వి ఆ స్త్రీ = ప్రతీక్షణము

**ప్రతీక్షణము.** సం వి అ న (ప్రత్యాశతో) ఎదురుచూచుట, అపేక్ష

**ప్రతీక్షించు.** సం అ క్రి ఎదురుచూచు

వ ప్రాచేతసాగమనంబు ప్రతీక్షించుచున్న యెడ . (ఉ రా ౭ ౭౧)

**ప్రతీక్షితుఁడు.** సం విణ. (అ ఆ అ) ఎదురు చూడఁబడినవాఁడు ౨ భావింపఁబడినవాఁడు, ఎన్నఁబడినవాఁడు 3 గౌరవింపఁబడినవాఁడు.

**ప్రతీక్షుఁడు.** సం విణ (అ ఆ అ) ఎదురు చూచువాఁడు

**ప్రతీక్ష్యుఁడు.** సం. విణ (అ ఆ అ) ౧. పూజ్యుఁడు ౨ ప్రతీక్షింపఁదగినవాఁడు.

**ప్రతీఘాతము.** సం = ప్రతిఘాతము.

ప్రతీచి. సం. వి. ఈ. స్త్రీ. పశ్చిమదిక్కు, పడమర.

ప్రతీచీనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పడమటిది, పశ్చిమదిక్కునందు బుట్టినది. ౨. పిమ్మటిది, అనంతరము రాఁగలది.

ప్రతీచ్ఛకుఁడు. సం. వి. అ. పుం. గ్రాహకుఁడు, పుచ్చుకొనువాఁడు.

ప్రతీచ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పడమటి దిక్కునందలిది, ప్రత్యగ్భవము. ౨. అంతర్హితము.

ప్రతీతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. దృఢజ్ఞానము, ఎఱుక. ౨. ప్రసిద్ధి ౩. ఆదరము ౪. హర్షము ౫. దగ్గఱకుపోవుట, కదియుట.

ప్రతీతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. బయలుదేఱినవాఁడు, వెడలినవాఁడు. ౨. ఖ్యాతుఁడు ౩. జ్ఞాతుఁడు, తెలియఁబడినవాఁడు ౪. హృష్టుఁడు, సంతోషించినవాఁడు ౫. సాదరుఁడు, ఆదరముగలవాఁడు. ౬. ఆప్తుఁడు, ప్రత్యయితుఁడు. -వి. అ. పుం. ౧. విశ్వేదేవగణభేదము. ౨. బుధుఁడు, విద్వాంసుఁడు. (శ. వి.)

ప్రతీపతరణము. సం. వి. అ. న. వెల్లువకెదురొక్కనిపోవుట, ఎదురీదుట.

ప్రతీపదర్శిని. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుది, అంగన.

ప్రతీపము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రతికూలము. ౨. విలోమము, తలక్రిందైనది.
-వి. అ. న. ఒక అర్థాలంకారము.
శ్లో. ప్రతీప ముపమానస్యోపమేయత్వప్రకల్పనం, త్వల్లోచనసమం పద్మం త్వద్వక్త్రసదృశో విధుః (చంద్రాలోకము)

ప్రతీపవచనము. సం. వి. అ. న. ౧. ఎదురాడుట, ఆక్షేపించుట. ౨. తాఱుమాఱుగా మాటాడుట.

ప్రతీపవిపాకి. సం. విణ. (న్. నీ. న్.) ప్రతికూలఫలము నిచ్చునది, ప్రతికూలముగా పరిణమించునది.

ప్రతీపుఁడు. సం. వి. అ. పుం. ౧. శత్రువు. ౨. ఒకానొక చంద్రవంశపురాజు.

ప్రతీరము. సం. వి. అ. న. (నద్యాది) తీరము, గట్టు.

ప్రతీవాపము. సం. వి. అ. పుం. ౧. కరఁగెడు స్వర్ణాదులను ద్రవ్యాంతరముచే పొడిసేయుట (వాచ) కాలిన లోహపుఁబొడిని కాఁచి చాఁగఁగొట్టు (శ. ర.) ౨. విక్షేపించుట ౩. జనోపద్రవవిశేషము (మారి, మశూచి లోనగునవి) ౪. త్రాఁగఁదగిన యౌషధవిశేషము ౫. ఔషధవిశేషములయొక్క సంయోగభేదము

ప్రతీవేశము. సం. = ప్రతివేశము

ప్రతీవేశి. సం. విణ. (న్. నీ. న్.) = ప్రతివేశి

ప్రతీష్టము. సం. విణ. (అ. ఆ. అ.) స్వీకృతము, కైకొనఁబడినది

ప్రతీహారము. సం. వి. అ. పుం. ౧. ద్వారము. ౨. పూర్వము నేను నీకు మేలుచేసితినిగాన నిపుడు నీవు నాకు మేలుచేయుమని యొంచి చేయునట్టి సంధి

ప్రతీహారీ. సం. వి. ఈ. స్త్రీ. ద్వారపాలిక. -న్. పుం. ద్వారపాలకుఁడు.

ప్రతీహారుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

వి. అ. న. ౧. ఇంద్రియము సన్నికర్షము వలనఁ గలిగిన జ్ఞానము. ౨. కంఠోక్తత, విస్పష్టత్వము.

**ప్రత్యక్పుష్పి.** సం. వి. ఈ. స్త్రీ. అపామార్గము, ఉత్తరేణు.

**ప్రత్యక్షజ్ఞానము.** సం. వి. అ. న. ప్రత్యక్షముగాఁ బడసిన యెఱుక, కన్నారఁ జూచి తెలియుట. ౨. ఇంద్రియ సన్నికర్షము వలనఁ గలిగిన జ్ఞానము, ఇంద్రియములకు విషయములకు మాటియైన సంబంధముచేఁ గలిగిన జ్ఞానము.

**ప్రత్యక్షదర్శనము.** సం. వి. అ. న. సాక్షాద్దర్శనము, కన్నారఁగాంచుట.

**ప్రత్యక్షదర్శనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సాక్షి, ప్రత్యక్షముగా చూచినవాఁడు.

**ప్రత్యక్షదర్శి.** సం. విణ. (న. ఈ. న.) సాక్షి.

**ప్రత్యక్షదృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రత్యక్షముగా చూడఁబడినది.

**ప్రత్యక్షప్రమ.** సం. వి. అ. స్త్రీ. ఇంద్రియములకును విషయములకును సాక్షాత్సంబంధముచేఁ గలిగిన యథార్థజ్ఞానము.

**ప్రత్యక్షప్రమాణము.** సం. వి. అ. న. ప్రత్యక్షరూపమగు జ్ఞానసాధనము. జ్ఞానేంద్రియము. (ఇది ప్రమాణములలో నొకటి)

**ప్రత్యక్షభోగము.** సం. వి. అ. పుం. ఒక వస్తువును దాని సొంతదారునకుఁ దెలిసి కాని తెలియనట్లు కాని యనుభవించుట.

**ప్రత్యక్షము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. [illegible]వది, కనఁబడునది. ౨. ఎదుటనున్నది, సన్నిహితము. ౩. చక్షురాదీంద్రియ గోచరమైనది, ఐంద్రియికము. ౪. స్పష్టము, తెల్లము. ౫. కంఠోక్తము. ౬. సన్నికృష్టము, ఒండొంటిని తారసిలించినది, నడుమ మఱియొకటి లేనిది. ౭. దైహికము, దేహసంబంధి.

**ప్రత్యక్షవాది.** సం. విణ. (న. ఈ. న.) చార్వాకుఁడు, (ఇతనికి ప్రత్యక్షము తప్ప మఱియొకటి ప్రమాణముకాదు.)

**ప్రత్యక్షవిహితము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రత్యక్షముగా విధింపఁబడినది.

**ప్రత్యక్షసిద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రత్యక్షముగా ఏర్పడినది.

**ప్రత్యక్షి.** సం. విణ. (న. ఈ. న.) ప్రత్యక్షముగా చూచినవాఁడు, సాక్షి.

**ప్రత్యక్స్రోతస్సు.** సం. వి. స. పుం. ౧. పశ్చిమ దిక్కుగా ప్రవహించు నదము. ౨. నర్మదము. వి. స. స్త్రీ. నర్మదానది.

**ప్రత్యగక్షము.** సం. వి. అ. న. అంతరింద్రియము.

**ప్రత్యగాత్మ.** సం. వి. న. పుం. పరమేశ్వరుఁడు, బ్రహ్మచైతన్యము.

**ప్రత్యగాశాపతి.** సం. వి. ఇ. పుం. పడమటి దిక్పాలకుఁడు, వరుణుఁడు.

**ప్రత్యగుదక్కు.** సం. వి. చ. స్త్రీ. వాయవ్యకోణము. (వాచ.)

**ప్రత్యగ్దృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. అంతర్దృష్టి, లోఁజూపు.

**ప్రత్యగ్రథము.** సం. వి. అ. పుం. అహిచ్ఛత్ర దేశము.

**ప్రత్యగ్రము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. నూతనము, క్రొత్తది. ౨. శోధితము, పరిశుద్ధము.

ప్రత్యుపస్థానము. సం. వి. అ. న. సమీపము, దాపు.

ప్రత్యుపహారము. సం. వి. అ. పుం. కానుక.

ప్రత్యులూకము. సం. వి. అ. పుం. ౧. కాకి. ౨. గుడ్లగూబవంటి యొకపక్షి.

ప్రత్యుప్తము. సం. వి. స్. న. అ. పుం. ప్రభాతము. (శ. ర.)

ప్రత్యుషస్సు. సం. వి. స్. ప్రత్యూషము, వేకువ.

ప్రత్యూషము. సం. వి. అ. పుం. న. ప్రభాతము. (శ. ని.)

ప్రత్యూషుఁడు. సం. వి. అ. పుం. ౧. ...కా నొకవసువు. ౨. సూర్యుఁడు (వాచ.)

ప్రత్యూహము. సం. వి. అ. పుం. విఘ్నము.

ప్రత్యేకము. సం. వి. అ. న. వేఱువేఱు.

ప్రత్యేకించు. సం. అ. క్రి. ప్రత్యేకమగు, వేఱువేఱగు. (శ. ర.)

ప్రథ. సం. వి. ఆ. స్త్రీ. ప్రఖ్యాతి, పేరు.

ప్రథమ. సం. వి. ఆ. స్త్రీ. ప్రథమావిభక్తి.

ప్రథమకల్పము. సం. వి. అ. పుం. (అవలంబించుటకు) ముఖ్యమైనపక్షము (వ్యతి. అనుకల్పము.)

ప్రథమపురుషము. సం. వి. అ. పుం. (వ్యాక.) ఒక పురుషము, ప్రత్యయవిశేషము.

ప్రథమము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఆద్యము, మొదటిది. ౨. ముఖ్యము, ప్రధానము. ౩. పూర్వము, మునుపటిది వి. అ. పుం. ౧. (వ్యాక.) ప్రథమపురుషము ౨. వర్గము యొక్క మొదటి యక్షరము.

ప్రథమసాహసము. సం. వి. అ. పుం. ఇన్నూటయేఁబది పణముల దండుగు, దండభేదము.

ప్రథమాంగుళి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. అంగుష్ఠము.

ప్రథమాశ్రమము. సం. వి. అ. పుం. మొదటి ఆశ్రమము - బ్రహ్మచర్యము.

ప్రథితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఖ్యాతము, ప్రసిద్ధిఁబొందినది.

ప్రథితి. సం. వి. ఇ. స్త్రీ. ఖ్యాతి, ప్రసిద్ధి.

ప్రథిమ(ము). సం. వి. న్. పుం. విరివి, పృథుత్వము, స్థూలత్వము.

ప్రథిష్ఠము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి గొప్పది, మిక్కిలి పృథువైనది.

ప్రథీయస్సు. సం. విశే. (స్. యస్. స్.) మిగుల పృథువైనది.

ప్రదక్షిణము. సం. విశే. (అ. ఆ. ఇ.) ౧. కుడి, కుడి ఎక్కడి, కుడికి తిరిగివచ్చునది. వి. అ. న. దేవతాదుల నుద్దేశించి కుడికి తిరిగి వచ్చుట, వలగొనుట.

ప్రదక్షిణించు. సం. అ. క్రి. స. క్రి. ప్రదక్షిణముగాఁ దిరుగు.

చ. . . ఇంద్రానుజుం దమ్మునీంద్రులకుఁ బ్రత్యేకింబ యభివాదనంబు సేసి త్రేతాగ్నులకుం బ్రదక్షిణించి హరి. పూ. ౪. ౧౦౯.

వ. . . శివాలయంబు ప్రదక్షిణించి దేవకీమానంబు రాపి నేయదిక్కు సూచిన . . హరి. పూ. ౬. ౩౪.

ఉ. . . తద్రసంబు సొం,పార మహాప్రవాహమగుచు దివిజాద్రిఁ బ్రదక్షిణించి యున్నెరడుమ్యాని మూలమున సొక్కని యుండు జగత్పవిత్రమై. మార్క. ౪. ౧౪౪.

ప్రదేశనము. సం. వి. అ. న. ౧. ఉపదేశము. ౨. రాజాదుల కర్పించుకానుక, ఉపధాశన ద్రవ్యము.

ప్రదేశ(శి)ని. సం. వి. ఈ. స్త్రీ. జుట్టనవ్రేలు, తర్జని.

ప్రదేశము. సం. వి. అ. పుం. ౧. చూపుట, సూచనము. ౨. చోటు, దేశము. ౩. గోడ. ౪. జాట్టిలి.

ప్రదేహము. సం. వి. అ. పుం. ౧. పూఁత, లేపము. ౨. (వైద్య.) పూయునట్టిచమురు మొ.

ప్రదోషము. సం. విశే. (అ. ఆ. అ.) చెడినది, చెడ్డది. -వి. అ. పుం. ౧. దోషము, తప్పు, నేరము. ౨. మునిమాపు, సంజ.

ప్రదోహము. సం. వి. అ. పుం. పాలుపిదుకుట.

ప్రద్యుమ్నుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు; కృష్ణునకు రుక్మిణియందు మన్మథాంశమునఁ బుట్టినకొడుకు.

ప్రద్యోతనము. సం. వి. అ. న. ౧. వెలుఁగుట, ప్రకాశించుట. ౨. కాంతి.

ప్రద్యోతనుఁడు. సం. వి. అ. పుం సూర్యుఁడు.

ప్రద్యోతము. సం. వి. అ. పుం. కిరణము.

ప్రద్యోతించు. సం. అ. క్రి. ప్రకాశించు.

క. .పద్యమునకు నిట్ల యమకబంధమునదుముం,
ప్రద్యోతించిన నది... (కావ్యా. ౨. ౩౪.)
(ఇట ఉండక అని భావము.)

ప్రద్రవము. సం. వి. అ. పుం. పలాయనము, పాఱిపోవుట.

ప్రద్రాణకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) కష్టిత గతి నొందినవాఁడు, అతిదినస్నుఁడు.

ప్రద్రావము. సం. వి. అ. పుం. పలాయనము, పాఱిపోవుట.

ప్రద్రావి. సం. విశే. (న. ణీ. న.) పలాయనముసేయువాఁడు, పాఱిపోవువాఁడు.

ప్రద్విషత్. సం. శత్ర = ప్రద్విట్టు.

ప్రద్విట్టు. సం. విశే. (ష.) ౧. మిక్కిలిద్వేషించువాఁడు. ౨. ప్రతికూలుఁడు, విరోధి.

ప్రద్వేషణము. సం. వి. అ. పుం. మిక్కిలి ద్వేషము.

ప్రద్వేషము. సం. వి. అ. న = ప్రద్వేషణము.

ప్రద్వేషించు. సం. అ. క్రి. విరోధించు, పగఁగొను.

వ ఏను నీయుద్ధ్వరంబున కుపదర్శనంబు సేయుచుండ నద్దివస్పతియు బృహస్పతియుఁ
ప్రద్వేషించి లోకంబు వాటింతురు ...
భార. అశ్వ. ౧. ౫౦.

ప్రధ. సం. వి. అ. స్త్రీ. ౧. కశ్యపునిభార్యలలో నొకతె. (దక్షునికూఁతురు.) ౨. విధానము.

ప్రధనము. సం. వి. అ. న. ౧. యుద్ధము. ౨. యుద్ధమునందలికొల్ల. ౩. నాశనము. ౪. చీల్చుట. -పుం. ముద్గము, పెసర కీ. (శే. వి.)

ప్రధమనము. సం. వి. అ. న. ౧. ఊఁదుట. ౨. తుమ్ములుకలిగించు మందు. (అ. వి.)

ప్రధర్షకుఁడు. సం. విశే. (అ. క్షి. కా. అ.) ౧. ఎదిరించువాఁడు, పెనకువాఁడు. ౨. బాధించువాఁడు, ఉపద్రవము చేయువాఁడు.

ప్రధర్షణము. సం. వి. అ. న. ౧. ఎదుర్చుట తాఁకుట. ౨. అవమానించుట, మేరమీఱితిరస్కరించుట.

ప్రధానధాతువు. సం. వి. ఉ. పుం. చరమ ధాతువు, రేతస్సు. (వాచ.)

ప్రధానము. సం విణ. (అ. ఆ. అ.) ప్రశస్తము. ముఖ్యము. -వి. అ. న. ౧. (సాంఖ్య) సత్త్వరజస్తమోగుణాత్మికయగు ప్రకృతి. ౨. పరమాత్మ. ౩. బుద్ధి ౪ కార్యసహాయుఁడు, సచివుఁడు (ఇది మిత్రాదులలోనిది.)

ప్రధారణము. సం. వి అ. న. ఫలము పేఁకించి యిచ్చుట. (శ. ర)

ప్రధావించు. సం. అ. క్రి. పరుగెత్తు, పాఱు.

ప్రధి. సం వి. ఇ. పుం. బండికంటి కదకమ్మి, నేమి

ప్రధ్మాపనము. సం వి. అ. న. శ్వాసమార్గము అందు అడ్డుపాటు కలిగినప్పుడు ఊర్పునకు తోడ్పాటుగాచేయు చికిత్స.

ప్రధ్వంసము. సం.వి.అ.పుం. నాశము,ధ్వంసము.

ప్రధ్వంసాభావము. సం. వి. అ పుం. ప్రధ్వంసముచేఁ గలిగిన అభావవిశేషము.

ప్రధ్వస్తము. సం. విణ (అ. ఆ. అ.) పొత్తిగా నాశము పొందినది

ప్రనప్త. సం. వి. ఋ. పుం. మునిమనుమఁడు, ప్రపౌత్రుఁడు

ప్రనాలి. సం. = ప్రణాళి.

ప్రసన్న. విణ. ౧. మనోజ్ఞము, చక్కనిది.

(వృత్తియందు నిగాగమము నిత్యము.)

క. వనితలు మేలపు మెయి మెలు,పునఁ దిగిచిన నొప్పుహారములు మెదలఁగ ప్రసన్ననితోదములు ... (భార. స్త్రీ. ౨. ౧౪.)

సీ. మనిశాఖలచూపు లనుకూలములకుఁ దన ప్రసన్నవిమేను కెప్పుంబు గాఁగ.

కళా. ౧. ౬౧.

ఉ. ప్రసన్నవినమ్రకాండమునఁబర్వినకొమ్మల దేహకాంతిసంపన్నత తప్తహేమరుచి భాములశ్మల్లవభోగ్య లాదుకే. (కాశీ. ౪. ౪౬.)

ఉ. ప్రసన్ని దైవధాతురుఘిరంజన నొవ్వుమహీ ద్రికైవడిన్, గన్నులు రెండునుణ మూసుఁగఁ గాలెడుపెత్తురు ..

భా. రా. యు. ౧౨౦౬.

౨. సాంద్రము. (మనోజ్ఞము అని శ. ర.)

క. మ స్నేహ మేన వలఁదిన,ప్రసన్నవిభసితంబు నణఁచి . (పాండు. ౫. ౧౩౧.)

౩. కోమలము, మృదువు.

చ. ఘణఫలకంబు విచ్చి కదుఁ బ్రసన్నవిమే తెగ యంగఁజేయుచున్ .. (నైష. ౫. ౨౯.)

ఉ. ప్రసన్నపాదముల్ చిలుకవాతినఁ, గందదు మేనుఁదీఁగెయున్, కన్నులఁ గట్టినట్లు పొద గానఁగనర్యోడు నాకు నెచ్చెలీ

రాజ. చ. ౨ ౧౪౬.

సీ. వలచేత బంగారుజలపోసనముతోఁదఁబ్రసన్నవి వట్టుతోరము ధరించి. (క్రీడా. ౪౩.)

ప్రసన్నఁదనము. వి. (√ప్రసన్న.) ౧. సౌందర్యము, చక్కఁదనము.

ఆ. ఊటము గొన్నవాఁడు దోలు మేన నాఘూత, బంధనముల నొరులప్రసన్నఁదనము, చెఱచివాఁడు ... (భార. అను. ౫ ౧౦౦.)

ఉ. . గుణప్రసన్నతన్, ప్రసన్నఁదనంబుఁ జూపఁగలరంగయరాఘవమంత్రి విచ్చలున్, వన్నెకుఁ దెచ్చు విచ్చు వభివాంఛితవస్తులక్ష్మికోటికిన్. (పాండు. ౧. ౫౪.)

౨. కోమలత్వము. మార్దవము.

ఆ....శ్రమం బనంగ మేనిప్రసన్నఁదనము,నిఘులఁ జేఁత గాదు ... (భార. శాం. ౨. ౩౪౮.)

ప్రసూ. సం. వి. ఊ. స్త్రీ. [illegible]

ప్రపంచకము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. విరివి పొందించునది, విస్తరించునది. ౨. సవిస్తరముగా వివరించునది.

ప్రపంచనము. సం. వి. అ. న. ౧. విస్తరించుట, విరివిచేయుట. ౨. సవిస్తరముగా వివరించుట.

ప్రపంచబుద్ధి. సం విణ. (ఇ) మోసపుచ్చువాఁడు.

ప్రపంచము. సం. వి. అ. పుం. ౧. విస్తారము, విరివి, శబ్దవిస్తరము. ౨ వివరణము, వ్యాఖ్యానము. ౩. వైవిధ్యము, పెక్కువిధములు గలిగి యుండుట. ౪. సంసారము. ౫. ప్రతారణము, మోసపుచ్చుట. ౬. వ్యత్యాసము, తలక్రిందు. ౭. రచన. ౮. భూలోకము.

ప్రపంచముసేయు. సం. స. క్రి. విస్తరించు, అతిశయింపఁజేయు.

వ. చూచి రెండును ఫలంబు గావో యా మగాత్రి యాయన నింక నేమి ప్రపంచంబు సేఁన నెఱయ నెడసిపోవుటకక్కఁ బ్రయో జనం బేమియులేదు ... (కళా. ౪. ౭౩.)

ప్రపంచించు. సం. స. క్రి. విస్తరించు, అతిశయింపఁజేయు.

వ. ఈశ్వరునకు వైషమ్యాదిపరిహారార్థంబుగా నింతయుం బ్రపంచింపఁబడియె ...

కవిక. ౫. ౧౫౩.

ప్రపంచితము. సం. విణ. (అ. ఆ. అ) ౧. విస్తరింపఁబడినది, విరివిచేయఁబడినది. ౨. వ్యాఖ్యానము చేయఁబడినది. ౩. ప్రతారితము, మోసపుచ్చఁబడినది. ౪. సంపాదితము (వాచ.)

ప్రపతితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పడిపోయినది, పాతిపోయినది. ౨. క్రిందపడినది. ౩. త్యజించినది, తప్పిపోయినది. ౪. నశించినది.

ప్రపత్తి. సం. వి. ఇ. స్త్రీ. భక్తిపరులుచేయు శరణాగతి. (శ. ర.)

ప్రపథ్య. సం. వి. అ. స్త్రీ. హరీతకి, కరక్కాయ.

ప్రపదనము. సం. వి. అ. న. ప్రపత్తి, భక్తిపరులుచేయు శరణాగతి.

ద్వి. ... మహాపూర్ణగురుఁడు, తనగురుం డట ప్రపదన ముపాయంబు, తత్త్వంబు సేసు సద్వైతంబు మతము, తత్త్వార్థ మిది ప్రప దనమున కరయ.

ద్వి. పరమ. ౮. ౧౦౪. పొ.

ప్రపదము. సం. వి. అ. న ౧. మునుఁగాలు.

ప్రపదములం దులుకు. (కవి. ౧. ౭) (శ. ర.)

౨. మునుఁగాలు, పాదాగ్రము.

ప్రపన్నము. సం విణ. (అ. ఆ. అ.) ౧. పొందినది, చెందినది. ౨. శరణాగతము, శరణొందినది, ప్రపత్తిచేసినది. ౩. పొందఁబడినది.

ప్రపన్నాదము. సం. వి. అ. పుం. చక్రమర్దము, తగిరస.

ప్రపలాయి. సం విణ (న్. నీ. న్) ౧ పారిపోవువాఁడు. ౨ చెఱపట్టఁబడినవాఁడు, బందీ.

ప్రపాఠకము. సం వి. అ. పుం ౧. వేదాధ్యాయముయొక్క అంశభేదము. ౨ శ్రౌత గ్రంథముయొక్క అంశభేదము.

ప్రపాణి. సం. వి. ఇ. పుం. అఱచేయి, పాణి తలము.

ప్రపాతనము. సం.వి.అ.న.క్రిందఁబడఁద్రోయుట.

ప్రపాతము. సం. వి. అ. పుం. ౧. పడుచుట, పోవుట. ౨. క్రిందఁబడుట, పాటు. ౩. తటాలున మైఁబడుట, ఉన్నట్టుండి రాఁకుట. ౪. సెలయేఱు, నిర్ఝరము. ౫. కూలము, గట్టు. ౬. కొండచఱియ. ౭. మునిపాటు. (శ. ర.)

ప్రపాదికము. సం. వి. అ. పుం. కొమిలి.

ప్రపానకము. సం. వి. అ. న. ఒకదినుసు పాన కము, పటికబెల్లము మిరియములు లోనగునవి చేర్చిన యొకదినుసు పానీయము.

ప్రపానము. సం. వి. అ. న. ౧ మిక్కిలి త్రాగుట. ౨. గుఱ్ఱపు పైపెదవియొక్క క్రిందిభాగము.

ప్రపాపాలిక. సం. వి. ఆ. స్త్రీ. చలిపందిరి పెట్టి కొని వచ్చినవారికి నీళ్లుపోయు స్త్రీ.

ప్రపితామహి. సం. వి. ఈ. స్త్రీ. ప్రపితామహుని భార్య, ముత్తవ్వ.

ప్రపితామహుఁడు. సం. వి. అ. పుం. ముత్తాత

ప్రపీత(న)ము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి బలిసినది, మిక్కిలి పీనము.

ప్రపునా(న్నా)ట(డ)ము. సం. వి. అ. పుం. చక్రమర్దము, తగిరస. తె.

ప్రపూరిక. సం. వి. ఆ. స్త్రీ. కంటకారిక వాఁపుడు. తె.

ప్రపూర్వగుఁడు. సం. వి. అ. పుం. పరమేశ్వరుఁడు.

ప్రపోషించు. సం. స. క్రి. ఎక్కువగాఁ బోషించు.

మ. మావారితోఁగూడఁ జయ్యనఁగొంపోయి సమస్తభోగముల నిత్యంబుగా బ్రపోషింపుచున్. (యశ్వా. ౫. ౨౦.)

ప్రపౌండరీకము. సం. వి. అ. పుం. ఏనుఁగుల కును మనుష్యులకును గంటికి హితకరమై కాల పర్ణియాకులవంటి యాకులుగల యొకచెట్టు. తె. పుండరీకమను గంధద్రవ్యము. తె.

ప్రపౌత్రి. సం. వి. ఈ. స్త్రీ. మునిమనుమరాలు.

ప్రపౌత్రుఁడు. సం. వి. అ. పుం. మునిమనుమఁడు పౌత్రునికొడుకు.

ప్రప్రపితామహుఁడు. సం. వి. అ. పుం. ప్రపితామహునితండ్రి.

ప్రప్రమాతామహుఁడు. సం. వి. అ. పుం. ప్రమాతామహునితండ్రి.

ప్రఫుల్తము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రఫుల్లము.

ప్రఫుల్తి. సం. వి. ఇ. స్త్రీ. విరియుట, వికాసము.

ప్రఫుల్లము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. చక్కఁగా విరిసినది, వికసించినది. ౨. నవ్వునది ౩. ప్రకాశించునది, మెఱయునది, ౪. ఉల్లసిల్లునది, సంతోషముగలది.

ప్రబంధ(ద్ధ.) సం. విశే. (బు. త్రీ. బు.) ప్రబంధకర్త, గ్రంథకర్త

ప్రబంధకల్పన. సం. వి. ఆ. స్త్రీ. ఇంచుకసత్యము మిక్కిలి కల్పనయుఁ గల కథ.

ప్రబంధము. సం. వి. అ. పుం. ౧. ప్రకృష్టబంధము, మిక్కిలికట్టు. ౨. అవిచ్ఛేదము, ఎడతెంపులేమి, ఎడతెగకుండుట ౩. గ్రంథము యొక్క రచన. ౪. కావ్యము.

ప్రబ(వ)ర్హము. సం. విశే. (అ. ఆ. అ.) శ్రేష్ఠము, ముఖ్యము.

ప్రబద్ధము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి కట్టఁబడినది, బంధింపఁబడినది. ౨. ప్రతిబద్ధము, అడ్డగింపఁబడినది.

ప్రబల. సం. వి. ఆ. స్త్రీ. ప్రసారిణి, గొంతెనగోరు. తె.

ప్రబలంచేయు. వి. స. క్రి. దీపింపఁజేయు.

క. మనుఁడు గని సత్వరంబుగ, మనుజాస్త్రం బేయుటయును [illegible] కృత్స్నమనకృశానికి

మా పెదపట్లుగఁ, బరగిన గురుసుతుండు
పెద్ద ప్రబలంబు చేసెన్.

వ. ఇవ్విధంబున సర్వార్థంబు యమ్మహాస్త్రంబు
దీపింపంజేసిన ...

భార. ద్రో. ౫. ౩౧౫. ౩౧౬.

ప్రబలము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ మిక్కిలి
బలముగలది. ౨. మిక్కుటమైనది, ఉత్కటము.
౩. గొప్పది. ౪. ముఖ్యము. వి. అ. పుం.
పల్లవము, చిగురు.

ప్రబలు. అ. క్రి. ౧. పెరుఁగు, వర్ధిల్లు.

గీ. గగన మెక్కంద చిక్కంగఁ గ్రాఁగిపోవ,
నంధకారంబు నీరంధ్ర మగుచుఁ బ్రబలె

కాశీ. ౫. ౬.

సీ. పైఁటచాటునఁగల ప్రబలు ద్రావిడవధూ
కుచకుంభంబులు చూచి కొంకె నేమొ.

దశా. ౧ ౧౧౫.

౨. (సంతోషాదులచే) అతిశయిల్లు, ఉప్పొంగు.

గీ. వ్రాయ నేర్చినవాఁడె సద్వర్ణసమితి, వర్ధి
వర్ధులు ప్రబల వ్రాయంగ నేర్చు.

విక్ర ౧. ౪౬.

సీ. చక్రవిద్వేషణాశ్రయగానిశాహిణీ పతిప్రతా
పము మెచ్చి ప్రబలుసంజ్ఞ.

ఉ. రా. ౧. ౩౦.

౩. వర్తిల్లు, ఉండు.

సీ. కాలకూటానలగర్వంబు సర్వంబు ప్రచ్ఛన్న
తనులీలఁ బ్రబలె ననఁగ.

హరి. పూ. ౬. ౯౮. (వర్ధిల్లు శ. ర.)

సీ. కర్ణాటకీర్తి లోకవిఖ్యాత మగుచుఁ,
బ్రబలఁ గా కని దీపించి ...

హై. భా. ౨. ౯౯. (అతిశయిల్లు శ. ర.)

ప్రబల్హిక. సం. వి. ఆ. స్త్రీ. = ప్రవల్హిక.
ప్రహేళిక, గూఢముగానుంచఁబడిన యర్థము
గల కావ్యవిశేషము.

ప్రబాధకము. సం. విణ (అ. ఆ. ఆ.) ౧. మిక్కిలి
బాధించునది. ౨. మిక్కిలి యెదిరించునది.
౩. నిరాకరించునది

ప్రబాలము. సం వి. అ పుం న. = ప్రవాలము.
౧. చిగురు, కిసలయము, నవపల్లవము. ౨.
వీణాదండము, ఒళగు. ౩. పగడము. (శే. వి.)

ప్రబాళఫలము. సం. వి. అ. న = ప్రవాళఫలము
ఎఱ్ఱచందనపు మ్రాను.

ప్రబాళాశ్మంతకము. సం. వి. అ. పుం =
ప్రవాళాశ్మంతకము, ఎఱ్ఱ అశ్మంతకవృక్షము.

ప్రబాహుకము. సం. అవ్య. ౧. మీఁద, ఊర్ధ్వ
భాగమున. ౨. సమకాలమందు, ఒకప్పుడే.
(దీనికిఁ దెనుఁగునఁ బ్రయోగములేదు.)

ప్రబుద్ధము. సం విణ. (అ.ఆ.అ.) ౧. ప్రఫుల్లము,
వికసించినది. (పుష్పాది) ౨. జాగరితము, మేలు
కొన్నది. ౩. ప్రబోధముకలది, జ్ఞానముకలది.
౪. కార్యము చేయుటకుఁగాని, ఫలించుటకుఁ
గాని కదఁగినది.

ప్రబుద్ధుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) పండితుఁడు.
(శే. వి.)

ప్రబోధకుఁడు. సం. వి. అ. పుం. రాజులను
మేలుకొలుపువాఁడు, వైతాళికుఁడు.

ప్రబోధనము. సం.వి.అ.న. ౧. మేలుకొలుపుట.
౨. మేలుకొనుట. ౩. (మూర్ఛాదులనుండి)
తెలివినొందుట. ౪. యథార్థజ్ఞానము. ౫.
చక్కఁగాబోధించుట. ౬. ఉద్దీపనము, రేఁపుట.
౭. పూర్వమందుకొన్న చందనాదులకు పరి
మళము పోఁగా పరిమళమునకై మరలఁబూసి
కొనుట, అనుబోధము.

ప్రబోధ(ధి)ని. సం. వి. ఈ. స్త్రీ. కార్తిక
శుక్లైకాదశి. (ఆదినమందు విష్ణువు చాతుర్మాస్యక
నిద్రనుండి మేలుకొనును.)

ప్రబోధము. సం. వి. అ. పుం. ౧. నిద్రలేమి, జాగరణము, జాగారము. ౨. మేలుకొనుట, జాగ్రత్త. ౩. (పూర్వాధ్యాయములను పిదపగా కలిగిన) తెలివి, (అజ్ఞానాదులను పిదపగా కలిగిన) తెలివి, జ్ఞానము, యథార్థజ్ఞానము ౪ వికసించుట, వికాసము. ౫ చక్కగా బోధించుట, వివరణము

ప్రబోధించు. సం. స. క్రి ౧. చక్కగా తెలుపు

మ. కనుగొంటే భవదగ్రజాం దయినయతు స్వామిసౌభాగ్య మ్మాతనిచందంబున నీవు నిట్టిసిరి లొందం జాలఁ గాంక్షించెదం, దనయా యుండున నీద్భశప్పురణఁ బెంద న్వచ్చు వానేర్పుఁ గ్రొత్తన శీఘ్రంబున నేటి తూరగ యశస్తుంభోలి తత్తరపడఁగన్. వ. అని ప్రబోధించిన.

ఉ. రా. ౨. ౧౫౩, ౧౫౪.

వ. ..అమ్మగువ యయుద్ధము నందనుల నెప్పటి యట్ల యోగవిద్యావిదగ్ధులుగాఁ ప్రబోధించె .. (మార్క. ౩. ౧౦౫.)

౨. ప్రేరించు.

సీ. రత్నంబులను వధూరత్నంబులను జేసి తత్తత్ప్రతిఫలవిధానవిరతు, లయి ప్రబోధింపంగ నలవిగాకున్నఁ దోయజాగర్భుపాలికి నరిగి ...

భార. ఆది. ౮. ౫౬.

౩. జ్ఞానోపదేశము చేయు.

వ. ... అతం డతనివిశేషజ్ఞత యెఱింగి వారల విడిచి తన్నుం బ్రబోధించుటకై ప్రార్థించి యతనికిఁ బ్రణతుండైన ...

భార. శాం. ౪. ౩౪౨.

ప్రబోధితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ౧. మేలుకొలుపఁబడినవాఁడు. ౨. చక్కగా బోధింపఁబడినవాఁడు.

ప్రబోధోత్సవము. సం. వి. అ. పుం. కార్తిక మాసమున దశమిమొదలు పున్నమవఱకు జరుగు నుత్సవవిశేషము.

ప్రబ్బ = ప్రబ్బలి. వి. ఒకజాతి చిన్నచెట్టు.

సీ. ఈడెలు సంపంగు లియపుడు ల్పొగడలు దబ్బలు ప్రబ్బలు ద్రాక్ష మేళ్లు.

అచ్చ. రా. సుం. ౨౫.

వ. ... నీటిపఱ్ఱదపోటునఁ బోటులు ప్రబ్బగములఁ జిక్కినఁ ప్రెంక్క లతందు కెలనఁ గన ... (అచ్చ. భా. ౨. ౩౧. పా.)

సీ. పోగములదొంతి నిం దగపడఁజేయరే ప్రబ్బలార మరింగదబ్బలార. (రసిక. ౬. ౮౪.)

సీ ప్రబ్బ ప్రబ్బలి యనఁ బరఁగుశేకసంజ్ఞ...

ఆం. భా. ౨. ౪౪.

ప్రబ్బము. వి. పబ్బము, ఉత్సవము.

ద్వి. కుడిచిపారమె పండుగులఁ బ్రబ్బములను.

పండితా. పురా ౧౧౫. పా.

ప్రబ్బలి = ప్రబ్బ. వి ఒకజాతి చిన్నచెట్టు, శేకసము. కై.

సీ. ప్రబ్బ ప్రబ్బలి యనఁ బరగు శేకసంజ్ఞ.

ఆం. భా. ౨. ౪౪.

ద్వి. పారిజాతంబుతోఁ బ్రబ్బళ్ల సరిరో.

బస. పు. ౩. ౫౪.

ప్రబ్బికొను = ప్రబ్బు. అ. క్రి. (స్వార్థమున-కొను.) ౧. వ్యాపించు.

సీ. చూకాలిమీఁద నర్ధము పొఁది నిల్చినపతము ద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ.

- భాగ. ౧౦. పూ. ౩౬౯.

క. అకుఱభునకోటరమున, నాకలమూలు నైతి యనల ముంచించిన నస్త్రాశతరతిసంయమ, సైని కిలు ప్రబ్బికొనిరొ నర్భ్యంతరమున్.

సెం. మంథ. ౧. ౩౬౦.

౨. పడు, ప్రసరించు.

ఉ. సుబ్బైక యా త్ర వచ్చు న్యపకుంజరుఁ జూడ రకా ర్తసీవి దా, గొబ్బునఁ గట్టిడుం బయుటకొం గది మాన్పఁగఁ బోకఁ గాళ్లసైఁ, ప్రబ్బికొనం గుచోద్ధతభరంబు నటుం బయికొప్పుకోఁ దప్పుబ్బుగఁ జేతిక్ దొరకి పెన్మిటివక్త్ర ముకొవృతంబుగన్.
కళా. ౭. ౧౪౦.

సీ. సన్నఁపునడుములు జవ్వాదఁ బాలిండ్లబరువులు నడుములఁ ప్రబ్బికొనఁగ.
భాగ. ౯. ౩౦౬.

౩. అతిశయించు, ఉప్పొంగు.

క. . నిబ్బరపువలపు మదిలోఁ, ప్రబ్బికొని రాజింత సైఁపరాదయ్యెఁ జెలీ.
అచ్చ. రా. అర. ౩౬.

క. అబ్బెఁ దగులాథ మని మది, నుబ్బెడుచో నంతరాయ మొనఁగూడుటయున్, ప్రబ్బికొను వెఱఁగుపా టది.. (కావ్యా. ౧. ౪౩.)

వ. ... ధూపధూమశ్యామికామిషంబున నిజ స్వామి కొలువునకు నిబ్బరంపు వేడుబ్బునం ప్రబ్బికొనుచుఁ జేరినశృంగారరస సముద్రంబు వడు ... (కళా. ౨. ౯.)

౪. సందిల్లు, కదియు.

సీ. రణభీరువులు వితరణభీరువులు లేరు ప్రత్యర్థ ఆర్థులు ప్రబ్బికొనిన. (భాగ. ౭. ౫౫౪.)

ప్రబ్బు. అ. క్రి. (తె. పరప్పు.) ౧. వ్యాపించు. పర్యా.

క. పలుదెస మంటలు ప్రబ్బఁగ, నలఘుస్ఫురణ మున నిగుడునయ్యస్త్రంబున్, జలజాక్షుఁడు గని ... (భార. కర్ణ. ౩. ౩౧౯.)

సీ. పవధు శిల్లపు గ్రోలి తనియక పెనుపొంది బదబాగ్ని యంతటఁ ప్రబ్బికొన్న...
కాశి. ఖ. ౬. ౩౪.

క. ... పొంగుచు సంధ్యారాగవ్యరంపరయును తేజువాఱఁ ప్రబ్బెఁ బయపంబున్.
భోజరా. ౪. ౧౦౫.

౨. పెరుఁగు, వర్ధిల్లు, అతిశయించు, అధికమగు.

సీ. పొందుఁ దవ్విధముగఁ బాలించె రాజ్యంబు పాండవు లెక్కుడు ప్రబ్బి యశము.
గీ. లాఘవమున భరతాన్వయోల్లాస మొసఁగఁ, దగ నొనర్చిరి . . (భార. ద్రో. ౩. ౨౯.)

వ. కంకాలకాలినావం బనేకనలాపలంబియగు చుం ప్రబ్బినం గడునిబ్బరంబగు విభ్రమం బున... (వైమ. ౫. ౧౪౪.)

సీ. అధర్మం బంతకంతకుఁ ప్రబ్బు నధికు, లవశలఁ జెఱుపంగ .
భార. శాం. ౩. ౨౭౦.

౩. నిలుచు, నిలిచియుండు, వ ర్తిల్లు, ఉండు.

సీ. బలురక్కసుఁడు పోరఁ ప్రబ్బినాఁ డిట్టు న న్నాతఁగి మార్కొను మిప్పుడు. ...
రాఘవ. ౪. ౨౦౪.

సీ. గుణము వికారంబుఁ గోరికయును లేనినీవలన జగంబు పెతి, జనించుఁ, ప్రబ్బు లేనుక వంచుఁ బలుకుటు దప్పు గా దీకుంతకై ప్రబ్బు విమవరైన ...
భాగ. ౧౦. పూ. ౧౨౩.

౪. సందిల్లు, కూడు.

గీ. ... నిబ్బరపుఁదూపు తదవింటఁ ప్రబ్బెఁ జేసి. ... (ఉ. రా. ౪. ౩౯౧.)

స. క్రి. కలియు, కూడు. (శ. ర.)

సీ. మెదఁ గంపుటాకాళి విడుకొని పనులాటి నిబ్బగుప్పైక ప్రబ్బి యుబ్బు పెల్ల.
ఉ. రా. ౫. ౨౦౭.

ప్రభ. సం. వి. ఆ స్త్రీ. ౧. దీప్తి. ౨. కిరణము.

౩. ఘటేయులంక్రమువిరాజి భూత్యువిభాగము. ౪.

ౘ

శుద్ధ. ౫. కావేరిని పట్టణము. ౬. ఒకఅప్సరస. ౭. సూర్యపత్నిభేదము. ౮. గోపికభేదము.

ప్రభంజనము. సం. వి. అ. న. చక్కఁగా విఱుచుట. - పుం. వాయువు. విఱ (అ. అ. అ.) చక్కఁగావిఱుచునది.

ప్రభద్ర. సం. వి అ. స్త్రీ. ప్రసారణీలత, గొంతెమగోరు. శ్రీ

ప్రభద్రకము. సం. వి అ న. పంచదశాక్షర పాదకమగు ఛందోభేదము. పదునేనక్షరముల పాదముగల యొకానొక వృత్తము

ప్రభద్రము. సం. వి అ పుం. నింబము, వేము. శ్రీ.

ప్రభవ. సం. వి. అ పుం ఒకానొక సంవత్సరము.

ప్రభవము. సం. వి. అ. పుం. ౧. నదీమూలము. ౨. పుట్టుక, జన్మము. ౩ కారణము. ౪. ప్రభావము, పరాక్రమము.

ప్రభవించె. సం. అ క్రి. జనించు, పుట్టు.

క రాగిత్వము విడువదు నిను, రాగవిదూరుఁ డగునుతుఁడు ప్రభవించును నీ,కు ...

భార. శాం. ౬. ౫౨౯.

సీ. పరులదోషంబునఁ బ్రభవించుఁ గ్రోధ మడ్డి ణతుమాయు త్తిఁజేసి బాలియు

భార శాం ౩ ౪౨౧.

వ. . అతనికిఁ గుంభి యతనికిఁ బ్రలోభుఁ డును బ్రభవించిరి .. (మార్క. ౧. ౩౧)

వ. క్రి పుట్టించు.

చ. అతులతపంబునన్ వరుణుఁ డమ్మునిచే బహు పుణ్యకర్మము,న్నతిఁ బ్రభవింపఁగాఁబడిన దివ్య మునీంద్రుఁడు ...

భార. ఆది. ౪. ౧౫౬

ప్రభవిల్లు. సం. అ. క్రి. కలుగు.

సీ. ప్రభవిల్లుఁ బద్మసౌభాగ్య కేళిఁగోలి యభిమానభద్రార్తిఁ జెన్నొందినట్టిద.

శం. రా. ౧. ౪.

ప్రభవిష్ణువు. సం. విణ. (ఉ) ౧. ప్రభావశీలుఁడు. ౨. ఉత్కృష్టుఁడు, కేటి. వి. ఉ పుం. ప్రభువు.

ప్రభాంజనము. సం. వి. అ. పుం. మునగ, శోభాంజనము. శ్రీ. (త్రి. ని)

ప్రభాకరము. సం. వి. అ. పుం. ౧. జిల్లేడు. శ్రీ. ౨. కుశద్వీపమందలి వర్షభేదము.

ప్రభాకరుఁడు. సం. వి. అ. పుం.౧. సూర్యుఁడు. ౨. చంద్రుఁడు. ౩. అగ్ని. ౪. శివుఁడు. ౫. సముద్రుఁడు. ౬. ఒకమీమాంసకుఁడు. ౭. ఎనిమిదవ మన్వంతరమందలి దేవగణభేదము.

ప్రభాకీటము. సం. వి. అ. పుం. మిడుఁగుఱుఁ బురుగు.

ప్రభాగము. సం. వి. అ. పుం. ౧. విభజించుట, పంచుట ౨. (గణిత) భిన్నముయొక్క భిన్నము.

ప్రభాతము. సం. వి. అ. న. తెల్లవాఱుటకు ముందు నాలుగుగడియలకాలము, వేకువ

ప్రభానము. సం. వి. అ న దీప్తి, కాంతి.

ప్రభావము. సం. వి అ. పుం. ౧. కోశదండము వలనఁ గలుగుతేజస్సు. ౨. సామర్థ్యము, శక్తి. ౩. విక్రమము, మగఁటిమి. ౪. కాంతి. ౫ ఉద్భవము, పుట్టుక. ౬. మాహాత్మ్యము. (శ. వి.)

ప్రభాసంతుఁడు. సం. వి అ. పుం. పరమేశ్వరుఁడు, రుద్రుఁడు.

ప్రభాసము. సం. వి. అ. పుం. మిక్కిలికాంతి, పుం., న. ద్వారకాసమీపమందలి యొక తీర్థభేదము.

**ప్రయుజ్యావు.** సం. ఉ. పుం. అధ్వర్యుఁడు. (వాచ.)

**ప్రయతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. సంయతుఁడు, ఆత్మనిగ్రహముగలవాఁడు, జితేంద్రియుఁడు, పరిశుద్ధుఁడు, పవిత్రుఁడు. ౨. ప్రయత్నముగలవాఁడు, పట్టుగలవాఁడు. ౩. సంస్కృతుఁడు. (శ. వి.)

**ప్రయత్నము.** సం. వి. అ. పుం. ౧. విడువని పూనిక, మిక్కిలియత్నము. ౨. పూనిక, యత్నము. ౩. (వ్యాక.) బాహ్యప్రయత్నములలో నొకటి, ఉచ్చారణవ్యాపారవిశేషము. ౪. (న్యాయ) జీవనవృత్తిప్రయత్నము, గుణవిశేషము. (ప్రవృత్తిశ్చనివృత్తిశ్చ తథా జీవనకారణమ్, ఏవంప్రయత్నత్రైవిధ్యం తాంత్రికైఃపరిదర్శితమ్.) (కారికావళి.)

**ప్రయత్నశైథిల్యము.** సం. వి. అ. న. యోగాంగమగు ఆసనమును సిద్ధింపఁజేయు ప్రయత్నవిశేషము. (ఇందు స్వాభావికప్రయత్నముయొక్క ఉపరమ ముండును.)

**ప్రయత్నించు.** సం. అ. క్రి. మిక్కిలియత్నించు.

**ప్రయస్తము.** సం. విశే. అ. చేయి, నూనెలోనగువానిచేత పాకాశింపఁబడినది. (వ్యంజనము.)

**ప్రయాగభయుఁడు.** సం. వి. అ. పుం. గొప్పయాగములు చేయువారు తనస్థానము నాక్రమింతురేమోయని భయముకలవాఁడు, ఇంద్రుఁడు.

**ప్రయాగము.** సం. వి. అ. పుం., న. ౧. యజ్ఞము. ౨. గుఱ్ఱము. ౩. తీర్థవిశేషము. (శ్రీయర్థమున తత్త్రాదులలోనిది.)

ఉ. ... ప్రయాగఁజేసిన, ప్రజాపతియజ్ఞము...

కాశ. అశ్వ. ౨. ౧౨౫.

సీ. వైకుంఠమునుండి వచ్చి వైకుంఠుఁడు తానె సహాయుఁడై తీర్థమాడు ... గీ. పూవు, ఫలరక్షఁ దైవయప్పుడు ప్రయాగ.

కాశీ. ౩. ౯౨

౪. ధాన్యవిశేషము.

సీ. అర్థిఁ బ్రయాగంబు లార్జింప నార్జింపఁగానోప మెట్లు గంగాజలంబులు.

కవిజ. ౧. ౧౩.

**ప్రయాగుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**ప్రయాజము.** సం. వి. అ. పుం. దర్శపూర్ణమాసాదులకు అంగమైన యాగభేదము.

**ప్రయాణము.** సం. వి. అ. న. ౧. పయనము, ప్రస్థానము. ౨. (శత్రువు) దండెత్తివచ్చుట, దాడి. ౩. ఏనుఁగుల నేత్రపూర్వప్రదేశము. (శ. వి.)

**ప్రయాణించు.** సం. అ. క్రి. ప్రయాణముచేయు.

క. అంచలకొత్తల వడి ఱం,కించుచు బంగారు పల్లకీ యెక్కి ప్రయా,ణించుచుండెం గాంతలకు (వై. భా. ౨ ఆశ్వా.)

**ప్రయాతము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రయాణమై పోయినది. - వి. అ. పుం. ౧. కొంత చరియం దున్నతప్రదేశము. ౨. సౌప్తికము, రాత్రియుద్ధము.

**ప్రయామము.** సం. వి. అ. పుం. ౧. సంయమము, నిగ్రహించుట. ౨. నిడివి. ౩. మిక్కిలి వెలలు హెచ్చుటవలన ధాన్యాదులందు జనులకుఁగల యాదరాతిశయము. (శ. ర.) ౪. [క్రమమునకు నిచ్చుఁదగినది (అని కొందఱు) హెచ్చుచున్న వెలలకు కొలఁదిపెట్టుట, మొదలగు ధిక్య పరిచ్ఛేదనము. (వాచ.)] ౫. అనుభవించుటలోపకుండాని వ్యాపారమున ధాన్యాదుల వెలలు ప్రసిద్ధపఱచుట. (శ. ర.)

ప్రల్ల. (సం. ప్రలాపః) అర్థములేనిమాట.

ద్వి. ప్రేల్లువారుచు నీచఁ గేకరింపుచును, ప్రల్లఁ బల్కుచు నెదపాటఁ బాడుచును.

పండితా. పురా. ౧౦౧ పొ.

ప్రల్లఁదనము. వి (ప్రల్ల + తనము; ప్రల్లద + తనము = ప్రల్లదము అని శ. ర.) ౧. వదరుఁబోతుఁదనము, వాచాలత్వము.

ఉ. ప్రల్లఁదనంబుచే నెఱుకపా టొకయింతయు లేక యిచ్చటన్, బల్లిదుఁడైనసత్పుత్రిభు నబద్ధము లాడితిఁ బ్రుంగి పోదురు ...

భా. శ. ౭౯.

ఉ. ప్రల్లదనంబుచే ననదు పల్కిన బోదుల నెంపువోవునే ..(అచ్చ.భా ర. ౨౩. పొ.)

౨. పొగరుఁబోతుఁదనము.

ప్రల్లదకాఁడు. విశ (ప్రల్లదము + కాఁడు) ప్రల్లదుఁడు.

చ. .జాదకాంద్ర కడఁ బ్రల్లదకాఁడ్రైద చేతికాను లవిపోకడపెట్టుచు నేమదంబు నన్. (భల్లా. 3. ఆ. చి. ని.)

ప్రల్లదము. వి ౧. పారుష్యము, పరుసఁదనము

గీ. పెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు, ప్రల్లదంబును .. యనెడుస ప్తవ్యసనములఁ జనదు తగుల. (భార. ఉద్యో. ౨. ౮౮.)

౨. అప్రియవచనము, పరుషవచనము, దుర్భాషణము.

ఉ. ప్రల్లద మేది యిట్లు శిశుపాలుఁడు వజ్రపాతాద్రిశులుఁ యిఁడై, ప్రేల్లుడు వాని దైన పృథుదేహ మువెల్వడి తేజ మంబరం, బెల్ల వెలుంగి ... (భార. సభా. ౨. ౭౯.)

సీ. ఓయి విశ్వామిత్ర యూహింప కిరీటిఁ బ్రల్లదంబులు పల్కఁ బాడి యగునె.

హరిశ్చ. ౧. ౧౮౭.

వ. ఇవ్విధంబునం బ్రల్లదంబు లాడెదరుగాన మీమ్ము బాలుకలు గోయక నెలవులు ప్రేల్చక ప్రాణంబులు గొనక యిట్లు సైరింప వచ్చె (సైమ. శ. ౬౦.)

క. కోపించి వారు దుర్వ్యాపాండిత్యమునఁ బ్రల్లదము లాడుదురే ...

వరాహ. శ. ౧౫.

క. గురుఁ దల్లిని దండ్రిని సోదరుని నకారణము ప్రల్లదముఁ బల్కినము,మ్కరుచేత .

విజా. ౨. ౪౩.

3. దుష్కార్యము, చెడ్డపని.

ఆ. ... ఇట్టికడిమి నమ్మియే ప్రల్లదంబులు, సేయఁదొడఁగి తనుచు ..

భార. అర. ౬. ౨౪౫.

గీ. వీటఁ దమ కెవ్వ రెదు రని వెలుపలేక చెల్లుబడిఁ బ్రల్లదంబులు సేయఁదొడఁగి. రథపురెంకలు (హర. ౫. ౯.)

౪ ధార్ష్ట్యము, దార్ఢ్యము, పొగరుఁబోతుఁదనము.

గీ. కోపమున హలధరుఁ డొక గుండు వైవ, దానిఁ దప్పించుకొని ప్రల్లదమున వరని.

క. నగి యాసవకలశముఁ గొని, జగతీరుహ శాఖ యెక్కి చాపలమున వృజ్జగతిపయి వైచె ... (భాగ. ౧౦. ఉ. ౫౮౮.)

శ్లో. స చంచయిత్వా గ్రావాణం మదిరాకలశం కపిః, గృహీత్వా హేలయామాస ధూర్త స్తం కోపయన్ హసన్.

సం. భాగ. ౧౦. ౬౭. ౧౮.

వ. నవరనిపాపలం దదవితదవి . కొనిపోవచ్చినఁ బయిపడి విడువఁజాలక పెనంగు తల్లులఁ బ్రల్లదంబునం బ్రేల్లుం గ్రోచి తిట్టుచు. (ఉ. హరి. ౧. ౫౩.)

సీ. అప్పాటఁ దాలుమేన నతిగర్వులై ప్రల్ల
దమ్మునఁ జెక్కుఁద్ర దప్పురేక, తిట్టియు
భార. అను. ౫. ౧౦౪.

మత్తకోకిల. ప్రల్లదంబున పేల్చు బుద్ధిఁ జాతి
రాజనివాసము, గొల్లపెట్టి సమస్తవిత్తముఁ
గ్రూరతం గొనిపోవఁగా.
భాగ. ౪. ౨౨౫ (దుష్కృత్యము శ. ర.)

౫. వ్యర్థభాషణము.

క. పల్లవుప్రులు రజ్జాలనం, బ్రల్లదము లనంగ
వ్యర్థభాషణములకుఁ, బేర్లై వర్తిలు.
ఆం. శ ౪౩.

విణ. గర్వముతోఁ గూడినది.

ఉ. వింటిరె వానిప్రల్లదపు వెంగలిమాఁటలు
శశాం ౪ ౧౭౨.

ప్రల్లదీఁడు = ప్రల్లదుఁడు. విణ (ప్రల్లదము+ ఈఁడు.) దుష్టుఁడు, దుండగీఁడు

సీ చక్కనిమోమంబు చిక్కఁబట్టెద నన్నఁ
బంచబాణుఁడు గదుఁ బ్రల్లదీఁడు
విక్ర. ౧. ౧౨౯ (చిక్కనిమోమంబు. శ. ర.)

ప్రల్లదుఁడు = ప్రల్లదీఁడు. విణ. ౧. దుష్టుఁడు, దుర్మార్గుఁడు.

ఉ. ప్రల్లదుఁడైన యొక్కకులపాంసను చేసిన
దానఁ దక్కులంబెల్లను దూషితం బగుట.
భార. ఆది. ౧. ౧౨౫.

క. కావున నాప్రల్లదులగు,భూవరులజయించి...
మార్క. ౭. ౧౧౯.

గీ. . ప్రల్లదులచేత వంశవాపకులచేత .
కల్లరులచేతఁ దర్పించుఁ గలియుగంబు.
హై. బా ౭. ౨౧౨.

౨. పొగరుఁబోతు, క్రొవ్వినవాఁడు.

ద్వి. ప్రల్లదుఁ డౌకబాకీ భక్తుండ నను.
బస. పు. ౪. ౧౦౧. పా.

ఉ. బల్లదుఁడైనవానరుఁడు బాహుబలంబునఁ
బట్టి యుద్ధతిఁ బ్రల్లదుఁడైన రక్కసుని ...
భా. రా. యు. ౧౧౯౭

౩. దుండగీఁడు, ఆగడములుచేయువాఁడు.

ద్వి. తల్లి లేకుండినతనయుఁడు గానఁ, బ్రల్లదుఁడై
యున్నిపాట్లకు వచ్చె.
బస. పు. ౩. ౬౪. పా.

ప్రల్లదురాలు. విణ. (ప్రల్లద + ఆలు.) దుష్టురాలు.

క. . కోపమునను రక్కసియుఁ గరము ప్రల్ల
దురాలై (దుర్భాషలాడునది అనిభావము
నిర్వ ౫. ౧౨౧

ప్రవక్త. సం వి ఋ పుం. ౧. చక్కఁగా చెప్పువాఁడు, చక్కఁగా మాటాడువాఁడు ౨ వేదాదులఅర్థము నుపదేశించువాఁడు.

ప్రవచనము సం వి అ న ౧ చక్కఁగా మాటలాడుట, లెస్సగాచెప్పుట, చాటుట, వెల్లడించుట. ౨. అర్థానుసంధానముతో వచించుట, అర్థముచెప్పి వివరించుట. వేదాదిశాస్త్రము ౪. మాట, వచనము. ౫ బౌద్ధులముఖ్యసిద్ధాంతము.

ప్రవచనీయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రవక్తవ్యుఁడు, చక్కఁగావివరింపఁదగినవాఁడు ౨. ప్రవక్త. (శ ని)

ప్రవణము. సం. విణ. (అ. ఆ. అ) ౧ క్రిందికి ఏటవాలైనది, వాటపుపల్లము ౨ వడిదుడుకైనది, జాఱుపైనది ౩ ప్రహ్వము, వంగినది, వంకరైనది. ౪. ఆసక్తము, తగులుగలది ౫. స్నిగ్ధము, నెయ్యముగలది ౬. నమ్రము, అడఁకువగలది ౭. క్షీణము, తఱిఁగినది. ౮. సమర్థము - వి అ. పుం, న. ౧. నాలుగుదారులు కలియుచోటు, చతుష్పథము. ౨ ఉదరము, కడుపు.

ప్రవత్స్యత్. సం (శతృ.) ప్రవాసముసేయనున్న, పరదేశమునకుఁబోవనున్న.

ప్రవత్స్యత్పతిక. సం. వి. అ. స్త్రీ. మగఁడు పరదేశమునకుఁబోవనున్న యాఁడుది.

ప్రవయస్సు (యుఁడు.) సం. విశే. (స్) ౧. మిక్కిలివయస్సుచెల్లినవాఁడు, వృద్ధుఁడు. ౨. పురాతనము, పురాణము.

ప్రవరణము. సం. వి. అ. న. ౧. పిలుపు, ఆహ్వానము ౨. వర్షాకాలాంతమందు శ్రాద్ధులు చేయు ఉత్సవవిశేషము.

ప్రవరము. సం. విశే. (అ. ఆ. అ) శ్రేష్ఠము, మేటి. - వి. అ. పుం. ౧. పిలుపు, ఆహ్వానము ౨. అగ్నిహోత్రాధానముచేయునపుడు బ్రాహ్మణుఁడగ్నినిగురించిచేయు స్తోత్రవిశేషము. ౩. సంతతి. ౪. గోత్రము. ౫. కప్పడు, గవుసెన. ౬. ఉత్తరీయము, పైరవాసము. ౭. నల్లపెసర కీ. ౮. సముద్రపుటుప్ప (కేవి). ౯. అగరుచందనము. కీ.

ప్రవరవాహనులు. సం. వి. అ. పుం. ద్వి. అశ్వినీదేవతలు.

ప్రవర్గ్యము. సం. వి. అ. పుం. అగ్నిహోత్రము, హోమాగ్ని.

ప్రవర్గ్యము. సం. వి. అ. పుం. అగ్నిష్టోమాది యాగములం అంగభూతమైన యాగవిశేషము.

ప్రవర్తకుఁడు. సం. విశే. (అ. త్రికా. అ.) ప్రవర్తింపఁజేయువాఁడు, నడపువాఁడు

ప్రవర్తనము. సం. వి. అ. న. ౧. ప్రవర్తిల్లుట. ౨. ప్రవర్తింపఁజేయుట, నడపుట.

ప్రవర్తయిత. సం. విశే. (ఋ. త్రి. ఋ) ప్రవర్తింపఁజేయువాఁడు, నడపువాఁడు.

ప్రవర్తించు. సం. అ. క్రి. నడుచు.

క. .. రాజు ప్రవర్తించిన పేరోజన గురుతల్ప గమన మూచితము మీకున్. సైమ. ౫. ౬౪.

స. క్రి ప్రవర్తిల్లఁజేయు, జరుపు, చేయు.

మ. విశ్రాంతి యన్, యజనంబున్ విబుధ ప్రమోదనముగా నమ్మైఁ బ్రవర్తించి సర్వ జగత్పూజ్యత నుల్లసిల్లుచు...
(హరి. పూ. ౬. ౧౫౩.)

వ. శకుని కైతవం బెఱింగియుం బాపద్యూతంబుఁ బ్రవర్తించి యధర్మప్రవృత్తుండ వయితి గావున . (భార. సభా. ౨. ౨౨౩.)

వ. గీతవాద్యనృత్తంబులును నాదిగాఁగల వివిధ శుభాచారంబులం బ్రవర్తింప నియోగింప వలయు (భాగ. విరా ౩. ౨౩౬.)

ప్రవర్తిల్లు. సం. అ. క్రి. ౧. వర్తించు, జరుగు.

వ ప్రజానాశనకారణంబై ప్రవర్తిల్లిన యాడి బకయుద్ధంబు తెలం గఱంగించెద
మార్క. ౨ ౨

౨. కదఁగు, ఉద్యమించు.

ఉ. లోకముల్ శుభసమేతములే యను రాథముల్ ప్రవర్తిల్లరుగా సమస్తజగతీపరి పీడ యొనర్పఁ గ్రమ్మఱన్.
హరి పూ. ౫ ౪.

౩. ఉండు.

వ. గృధ్రంబును జంబుకంబును ముదంబునం బొంగుచు బోయి తమతమ కులంబులలోఁ బ్రభూతంబులై ప్రవర్తిల్లె.
భార. శాం. ౩ ౩౦౧.

వ. . మదీయలోకంబున సుశ్లోకుండై నిత్య స్థితి నత్యుదాత్తపదవిం బ్రవర్తిల్లు పుణ్యా త్ముం డగుటకుం దనువు దొఱఁగవలయు ననిలేదు. (భార. శాం. ౨. ౪౪౩.)

౪. కలుగు, పుట్టు.

వ. ఇవ్విధంబునం బ్రవర్తిల్లు జనవాదంబు గ్రమ క్రమంబున సమస్తదేశంబుల నెరసి చెల్లు చుండె. (శార. విశా. ౩. ౩౧.)

ప్రవర్ధిలు(ల్లు). సం. అ. క్రి. వృద్ధిపొందు.

వ. జలంబున నెసఁగు బుద్బుదంబునుబోలె నొకయండం బుద్భవిల్లి క్రమంబునం బ్రవర్ధిలి యుదకంబునం దుండె

మార్క. ౪. ౭.

ప్రవర్షించు. సం స. క్రి. కురియు.

శా. ... దేవేంద్రదిక్పాలకుల్, పాలన్ సంతస మంది దివ్యసుమవర్షంబుల్ ప్రవర్షించి ర,క్కోకన్ (భా. రా. ౨. ౮౧)

ప్రవలు=ప్రబలు. అ క్రి వృద్ధిబొందు, వర్ధిల్లు.

చ ప్రవలుచు మించు మించుమగరానిగరాలఁ గరాళితం బగుచ్, ధవళసరోజరాజమునఁ · వెలయుఁనించెరన్ గనిరొ ..

అచలా ౧. ౪౪.

ప్రవహణము. సం. వి. అ. న. కర్ణీరథము, మూఁపున మోచికొనిపోవు పల్లకి మొదలగువాహనము, మట్టితోఁజేసిన బాలకాదుల క్రీడాశకటము.

ప్రవహము. సం. వి. అ. పుం. ౧. ప్రవహించుట, పాఱుట, ౨. వాయువు. ౩. మహావాయువు, సప్తవాయుస్కంధములలో నొకటి. (ఇదియె గ్రహములకు సంచారము గావించును.) ౪. బహిర్గమనము, పత్తనమువెడలిపోవుట.

ప్రవహించు. సం. అ క్రి పాఱు.

(భిల్లరాజపుత్రి వర్ణనము) గీ. ... కందుకక్రీడ గావించు ఘర్మవారి, గరఁగి డిగజాఱు నవ గైరికద్రవంబు, గిరులఁబ్రవహించు ధాతు విస్తరము లనఁగ. (వరాహ. ౨. ౧౧౪.)

ప్రవల్హిక = ప్రబల్హిక. సం. వి. అ. స్త్రీ. ౧ ప్రహేళిక, గూఢముగానుంచబడినఅర్థముగల కావ్యవిశేషము.

ప్రవాచకము. సం. విశే. (అ. చికా. అ) ౧. వివరణముచేయునది, వ్యాఖ్యానము చేయునది. ౨. ప్రవక్త, మాటకారి.

ప్రవాణము. సం వి. అ. న. నేఁతవస్త్రమునకు అంచుకట్టుట.

ప్రవాణి. సం. వి. ఈ. స్త్రీ. సాలెవాని సాధన విశేషము, లాకి.

ప్రవాతము. సం విశే. (అ. ఆ. అ.) మిక్కిలి గాలికి అస్పదమైనది. (దేశము మొ )

ప్రవాదకుఁడు. సం విశే. (అ. దికా. అ.) వాయించువాఁడు.

ప్రవాదము. సం వి. అ. పుం. ౧. పరస్పర కథోపకథనము, ఒకరికొకరు ముచ్చటలాడుట. ౨. లోకవాదము, లోకమునందంతట వ్యాపించినమాట, పరంపరగా వచ్చినమాట.

ప్రవారణము. సం. వి. అ. న. ౧ ముందుగా వరించుట. ౨. నిషేధము ౩ కామ్యదానము.

ప్రవార(క)ము. సం. వి. అ పుం. గవుసెన, ముసుఁగు.

ప్రవాళఫలము. సం. వి. అ. న = ప్రబాళ ఫలము, ఎఱ్ఱచందనపుమ్రాను.

ప్రవాళము. సం.వి అ పుం., న.=ప్రబాలనము. ౧. పగడము, ౨. వీణాదండము, ఒళగు. ౩. చిగురు.

ప్రవాళాశ్మంతకము. సం. వి. అ. పుం = ప్రబాళాశ్మంతకము, ఎఱ్ఱ అశ్మంతకవృక్షము.

ప్రవాసనము. సం. వి. అ. న. ౧. పరదేశ వాసము. ౨. పరదేశమునకు వెడలఁగొట్టుట. ౩. చంపుట, వధము.

ప్రవాసము. సం. వి. అ. పుం. పరదేశవాసము.

ప్రవాసి. సం. విణ. (స. నీ. స.) పరదేశయాత్ర చేయువాఁడు, యాత్రికుఁడు.

ప్రవాసితుఁడు. సం. విణ (అ. ఆ. అ.) ఊరు వెడలనంపఁబడినవాఁడు, దేశాంతరమునకు వెడలఁ గొట్టఁబడినవాఁడు

ప్రవాహికుఁడు. సం విణ.అ. మిక్కిలి వహించు వాఁడు. - వి. అ. పుం. రాతినుఁడు.

ప్రవాహనము. సం వి. అ న. ౧. తెఱుమఁ గొట్టుట. ౨ విరేచనము.

ప్రవాహము. సం. వి. అ పుం ౧ వెల్లువ, ప్రోతస్సు ౨. (దేశకాలములందు) ఎడతెగ కుండుట, సంతతి, పరంపర. 3. ప్రవృత్తి. ౪. వ్యవహారము. ౫ ఉత్తమాశ్వము.

ప్రవాహి. సం. విణ. (స. నీ స.) ౧. మిక్కిలి వహించుకొనిపోవునది. ౨. తోలఁగబుచ్చునది, తెఱుమఁగొట్టునది 3. ప్రవహించునది, పాఱు నది. - వి. ఈ. స్త్రీ. ఇసుక

ప్రవాహిక. సం. వి. ఆ. స్త్రీ. అతిసారరోగము.

ప్రవిదారణము. సం. వి అ. న ౧. అవదార ణము, మిక్కిలిచీల్చుట. ౨. యుద్ధము. 3. గత్తర, అల్లరి - విణ. (అ. ఆ. అ) ౧. ఆకీర్ణము, చెదరినది. ౨. చీల్చునది (కర్త)

ప్రవిద్ధము. సం. విణ. (అ. ఆ అ.) త్రోసి పుచ్చఁబడినది, పాఱవైవఁబడినది.

ప్రవిభాసిలు. సం అ. క్రి. ప్రకాశించు.

మ.. .కర్మంబె యుత్కృథికంబై ప్రవిభాసిలు
స్సురభిమల్లా నీతివాచస్పతీ.

మల్లభూ. నీతి. ౯౧.

ప్రవిలయము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలి లయము, మిక్కిలిలీనమగుట. ౨. పూర్ణనాశము.

ప్రవివరము. సం. వి. అ. పుం. వీతశాఖము. ?.

ప్రవిమ. సం. వి. ఆ. స్త్రీ. అతివస. ?. (వాచ.)

ప్రవిష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ప్రవేశించిన వాఁడు, చొచ్చినవాఁడు.

ప్రవిస్తరించు. సం. స. క్రి. విస్తరిల్లఁజేయు, ధిరివిచేయు.

తే గీ విద్యచోద్యంబు గాఁగఁ బ్రవిస్తరించి,
పదఁకు లానరించి రప్పుడు భరతఘటితి.

కవిరా. ౧. ౧౯౭

ప్రవీక్షించు. సం. స. క్రి. చూచు.

శా. ఆగూఢోరగవైరియైన శతపత్త్రాక్షుం బ్రవీ
క్షించి (ఉ హరి. ఒ. ౧౨౫.)

ప్రవీణుఁడు. సం. విణ. (అ. ఆ అ) కుశలుఁడుఁ నిపుణుఁడు.

ప్రవీరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఉత్త ముఁడు, శ్రేష్ఠుఁడు ౨. మిక్కిలి శూరుఁడు. 3. మంచిభటుఁడు.

ప్రవృంజనీయము. సం వి అ పుం. ౧. ప్రవ ర్గ్యము. ౨. మహావీరము.

ప్రవృత్తకము. సం వి అ న ౧ రంగమును ప్రవేశించుట ౨ వైతాళీయ ప్రవరణీయమగు మాత్రావృత్తభేదము

ప్రవృత్తము. సం విణ (అ ఆ అ) ౧. ఆరం భింపఁబడినది. ౨. నడచినది, ప్రవృత్తిగలది 3. కూర్చిపోవునది. ౪ గుండ్రనిది, వృత్తము, వర్తులము. - వి. అ పుం. వర్తులాభరణము, గుండ్రనిసొమ్ము. (ఇవిర) - న ప్రవృత్తి.

ప్రవృత్తి. సం. వి ఇ స్త్రీ. ౧. ప్రవాహము, నిరంతరప్రసరణము ౨ పొడసూపుట (ఉదా. కనుమప్రవృత్తిసమయము.) 3 నడవడి. ౪.

వృత్తి, జీవిక, బ్రతుకుఁదెరువు. ౯. ఐహిక కర్మములందు ముఖ్యముగా వర్తించుట (వ్యతి నివృత్తి.) ౭. వార్త, వృత్తాంతము. ౮ ఇంద్రియములు స్వస్వవిషయములందు సంచరించుట. ౯. ఏనుఁగుమదము. ౧౦. అవంత్యాదిదేశము (మే ని.) ౧౦. (న్యాయ.) (చికీర్షాకృతిసాధ్యతాజ్ఞానాధీనమగు) ప్రయత్నభేదము. ౧౧. కళిక్తధాన్యము, ఉలవలు. ౧౨. మాత్రము (శే ని.)

ప్రవృత్తిజ్ఞుఁడు. సం. వి అ పుం. వేఁగులవారిలో నొకతెగవాఁడు, వృత్తాంతము నెఱిఁగినవాఁడు

ప్రవృద్ధము. సం విణ. (అ. ఆ. అ) ౧ పెరిఁగినది, హెచ్చినది. ౨. ప్రౌఢము. 3. పెద్దది, పృథువు.

ప్రవృద్ధి. సం. వి. ఇ స్త్రీ. ౧ మిక్కిలివృద్ధి ౨ ఉన్నతి

ప్రవేకము. సం విణ (అ అ అ) ఉత్తమము, ముఖ్యము.

ప్రవేటము. సం వి. అ. పుం. యవలు (త్రి ని.

ప్రవేణి. సం. వి ఇ, ఈ స్త్రీ ౧ ఏనుఁగు మీఁదఁ బఱచెడి యొజ్జీకంబళి ౨ (స్త్రీలు భర్తృవిరహాదులందు) కైసేయక యొక్కజడగా పెనఁచుకొన్న కురులు 3 జలాది ప్రవాహము.

ప్రవేత. సం. వి. ఋ పుం రథికుఁడు.

ప్రవేదనము. సం వి. అ. న. తెలుపుట, జ్ఞాపనము.

ప్రవేపము. సం వి అ. పుం. మిక్కిలివడఁకు, కంపము.

ప్రవేలము. సం. వి. అ. పుం పీతముద్గము, పచ్చపెసర. శ్రీ.

ప్రవేశకము. సం. వి. అ. పుం ఒకానొక నాటకాంగము. (నీచపాత్రములచే, రంగమందుఁ బ్రదర్శింపఁబడనివిషయముల వస్తుసంగతికై అర్థోపక్షేపకముగా నిందుఁజెప్పఁబడును. ఇది ప్రథమ చరమాంకములం దుండదు.)

శ్లో. ప్రవేశకోఽనుదాత్తోక్త్యా నీచపాత్రప్రయోజితః అఙ్కద్వయాన్తర్విజ్ఞేయః. (సా. ద.)

ప్రవేశనము. సం. వి. అ. న. ౧. ప్రవేశించుట, చొచ్చుట. ౨ చొప్పించుట, ప్రవేశపెట్టుట. 3. ప్రధానద్వారము, తలవాకిలి. ౪. సింహద్వారము. (వాచ.)

ప్రవేశము. సం. వి. అ పుం. చొచ్చుట.

ప్రవేశించు. సం. స. క్రి, అ. క్రి. చొచ్చు.

వ అమ్మువ్వురు పగతురుం బ్రవేశింతురు.

మార్క. ౧. ౭౯.

ప్రవేష్టము. సం వి అ పుం ౧. బాహువు, చేయి. ౨ బాహ్వధోభాగము, చేతిక్రింది భాగము. 3 ఏనుఁగుపృష్ఠస్థానము. (ఆరోహకుఁడుకూర్చుండు కండపుష్టిగల పట్టు.) ౪ ఏనుఁగుపంటియిగురు, గజదంతమాంసము. (వాచ.)

ప్రవేష్టించు. సం. స క్రి చుట్టుకొను

శా మేనాపత్యసతృప్తి, నెమ్మెను ద్దాల్చి శుభాధిదేవతలు సంప్రీతిం బ్రవేష్టింపని, శ్యామనందంబున నంది మెండు నరవిందావాసచందంబునన్. (వసు. ౫. ౧౨౫.)

ప్రవ్యక్తము. సం విణ. (అ. ఆ అ) స్పష్టము, వెల్లడియైనది

ప్రవ్యాహారము. సం. వి. అ. పుం. మాటలను (సంభాషణాదిని) దీర్ఘముగాఁ జాగించుట, దీర్ఘభాషణము.

ప్రవ్యాధము. సం. వి. అ పుం. అధికబలముతోఁ బ్రయోగింపఁబడిన బాణముపడుచోటు.

ప్రవ్రజనము. సం. వి. అ. న. సన్న్యాసియగుట, సన్న్యాసము, గృహస్థాశ్రమమందలి పుత్రాదులను వదలిపోవుట.

ప్రవ్రజిత. సం. వి. అ. స్త్రీ. ౧. జటామాంసి చె. ౨. బుద్ధభిక్షుకీభేదము.

ప్రవ్రజితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) సన్న్యసియైనవాఁడు.

ప్రవ్రజ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. పర్యటనము, దేశము త్రిమ్మరుట ౨. చతుర్థాశ్రమము, సన్న్యాసము. ౩. వానప్రస్థాశ్రమము.

శ్లో. రత్నాత్మమాత్రాః ప్రవ్రజ్యాం కల్పవృక్షా ఇవాశ్రితాః (సం. కు. సం ౨. ౨.)

ప్రవ్రజ్యావసితుఁడు. సం విణ. (అ ఆ. అ.) సన్న్యాసచ్యుతుఁడు, సన్న్యాసమునుండి వీడినవాఁడు

ప్రవ్రాజము. సం. వి అ. పుం. సన్న్యాసము.

ప్రవ్రాజిక. సం వి. ఆ. స్త్రీ. తాపసి, సన్న్యాసిని.

ప్రవ్రాజిత. సం. వి. అ స్త్రీ ౧. తపస్విని ౨ జటామాంసి. చె.

ప్రవ్వ వి (క. పరవి = మృణ్మయఘటము.) కుండ, ఘటము (శ. ర.)

క. ఎవ్వాలన జగము అన్నిటఁ, బ్రవ్వలను నిలిపినట్లు ప్రజఁ బుట్టించెన్
భాగ. ౨. ౨౦౫.

ప్రశంస. సం. వి. ఆ. స్త్రీ. ౧. స్తోత్రము, పొగడిక, కీర్తి, యశము. ౨ ప్రస్తావము.

ప్రశంసకుఁడు. సం. విణ (అ సీఆ. అ.) పొగడువాఁడు.

ప్రశంసనము. సం. వి. అ. న. పొగడిక, స్తోత్రము.

ప్రశంసాముఖరుఁడు. సం విణ. (అ. ఆ అ.) బిగ్గరిగా పొగడువాఁడు

ప్రశంసించు. సం. స. క్రి. ౧. స్తుతించు, పేర్కొను.

వ భరద్వాజుండు ప్రముదితాత్ముం డగుచు నమ్మహాత్ముం బ్రశంసించి వినతుండై వీడ్కొనియె. (భార. శాం. ౪. ౧౧౭.)

శా గజవక్త్రి మాకు సఖివక్త్రింగా. బ్రశంసించెదన్ (మార్క. ౧. ౪.)

మ. హరిఁ బ్రశంసింపంగ రాకె మునీశ్వరులున్ (భా. హరి. ౨. ౩)

౨. ప్రస్తావమునకు తెచ్చు.

దండకము. ఏరీతిఁ గామానలంబున్ నివారింతు నేనాతిలోఁదన్ విచారింతు నేవెంట రాచూలి వంచింతు నేవంకఁ గోర్కుల్ ప్రశంసింతు.
భోగినీదండకము.

ప్రశంసితుఁడు. సం. విణ. (అ ఆ. అ) పొగడఁబడినవాఁడు.

ప్రశంసోపమ. సం. వి. ఆ. స్త్రీ. ఒక విధమగు ఉపమాలంకారము.

శ్లో. బ్రహ్మణో ప్యుద్భవః పద్మ శ్చంద్ర శ్శంభు శిరోధృతః, తౌ తుల్యౌ త్వన్ముఖే నేతి సా ప్రశంసోపమోచ్యతే. (కావ్యాద. ౨. ౩౧.)

ప్రశమనము. సం వి. అ. న. ౧. శాంతత కలిగించుట. ౨. శాంతి ౩. వధము, హత్య.

ప్రశమము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలి శమము, మిక్కిలిశాంతి. ౨ నివృత్తి, ఉడుగుట.

ప్రశమితము. సం. విణ. (అ. ఆ. అ.) శాంతి కలిగింపఁబడినది, ఓదార్పఁబడినది.

ప్రశస్తము. సం. విణ. (అ. ఆ అ.) ౧. ప్రసిద్ధికెక్కినది, కొనియాడఁబడినది. ౨. శ్రేష్ఠము.

౩. క్షేమము. ౪. సేయు, నూనె లోనగువానిచే బాగపఱచినది.

ప్రశస్తాద్రి. సం. వి. ఇ. పుం. ఒకానొక పర్వతము.

ప్రశస్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రశంస, పొగడ్త. ౨. ప్రసిద్ధి.

ప్రశస్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రశంసింపఁదగినది. ౨. ప్రసిద్ధికెక్కఁదగినది.

ప్రశాంతకాముఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కామము మిక్కిలి అడఁగినవాఁడు, తృప్తుఁడు.

ప్రశాంతము. సం. విణ. అ. ౧. మిక్కిలిశాంతి నొందినది. ౨. మృతము, చచ్చినది.

ప్రశాంతి. సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలిశాంతి ౨. విశ్రాంతి, విరామము.

ప్రశాఖ. సం. వి. ఆ. స్త్రీ. అగ్రశాఖ, కొనకొమ్మ.

ప్రశాఖము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పెక్కుశాఖలుగలది, పెద్దశాఖలుగలది. ౨. పంచమదశయందున్నది. (గర్భపిండము) ఈదశయందు కరచరణము లేర్పడును.

ప్రశాసకుఁడు. సం. విణ. (అ. సికా. అ.) ౧. మిక్కిలిశాసించువాఁడు, నియమముచేయువాఁడు, విధించువాఁడు. ౨. ఆచార్యుఁడు

ప్రశాసనము. సం. వి. అ. న. ౧. శిష్యులు మున్నగువారికి మంచిచెడ్డలను దెలుపుటకై కర్తవ్యాకర్తవ్యములను బోధించు వాక్యములను బలుకుట; కర్తవ్యతను దెలుపు వాక్యమును చెప్పుట. ౨. ఏలుట, పరిపాలనము.

ప్రశాస్త. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) ౧. ప్రశాసించువాఁడు, నియమించువాఁడు, కర్తవ్యాకర్తవ్యములను బోధించి నడపువాఁడు. ౨. ఏలువాఁడు, రాజు. - వి. అ. పుం. ఋత్విగ్భేదము.

ప్రశిథిలము. సం. విణ. అ. మిక్కిలిశిథిలము, విరిగిపడినది.

ప్రశిష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ప్రశాసింపఁబడినవాఁడు.

ప్రశిష్యుఁడు. సం. వి. అ. పుం. శిష్యునియొక్క శిష్యుఁడు.

ప్రశ్నదూతి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ప్రహేళిక (శ్రీ. ని.)

ప్రశ్న(ము.) సం. వి. అ. పుం. ౧. అడుగుట. (తెలియనిదానిని తెలియఁజెప్పుమని యడుగుట.) ౨. (వ్యవహార.) విచారణ. ౩. వివాదాంశము, చర్చావిషయము. ౪. సమస్య ౫. గ్రంథముయొక్క స్వల్పపరిచ్ఛేదము.

గీ. కణఁగి వడ్డును బెరుఁగును గలుపుభంగి,
వికటవికటంబులగుప్రశ్న లడిగ .
వా. రా. ౨. ౧౩౨.

క. కమలేక్షణ నీ వడిగిన, విమలప్రశ్నములు
బ్రహ్మవిద్భేదకయోగ్యము లతిదుర్లభ
ములు ... (వా. రా. ౨. ౧౩౪.)

ద్వి. పాకశాసనుఁ డేల ప్రశ్నగావించె.
ద్వి. పారిజ. ౨౪౦౨.

ప్రశ్నవివాకుఁడు. సం. వి. అ. పుం. ౧. ప్రశ్నోత్తరదాయకుఁడగు నొక జోస్యుఁడు. (వాచ.) ౨. వివాదమును తీర్పు మధ్యస్థుఁడు.

ప్రశ్ని. సం. వి. ఈ. స్త్రీ. కుంభిక, నాఁచు. శ్రీ. (శ్రీ. ని.)

ప్రశ్నోపనిషత్తు. సం. వి. ద. స్త్రీ. ఒకయుపనిషత్తు. (ఇందు ఆఱుప్రశ్నలును ఆఱు నుత్తరములు నుండును.)

ప్రశ్రథము. సం. వి. అ. పుం. మిక్కిలిసడలినది, విగిలేనిది, ప్రశిథిలము.

ప్రశ్రయము. సం. వి. అ. పుం. ౧. మరియాద, వినయము, అనునయము. (శ. ర) ౨. ప్రణయము, వలపు.

ప్రశ్రితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) వినీతుఁడు, వినయముగలవాఁడు.

ప్రశ్లిష్టము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. పెనఁచుకొనఁబడినది, పెనగొన్నది ౨. వి. అ. పుం అకారాదులకు పరమగు నచ్చులతోడి సంధియందు నాదేశమగు నచ్చు

ప్రశ్లేషము. సం వి అ పుం. గుత్తమైనకూడిక, గాఢమగు కలయిక

ప్రశ్వాసము. సం. వి అ పుం ఊర్పు, కోష్ఠమందలివాయువును బయటికి వెడలఁబుచ్చుట

ప్రష్ట. సం. విశే (ఋ ట్రీ.ఋ) అడుగువాఁడు, ప్రశ్నించువాఁడు

ప్రష్ఠవాహము. సం. వి. హ పుం అలవాటు పఱచుటకు కాఁడిమోపెడి యెద్దులదాపునఁ గట్టెడికోడె

ప్రష్ఠుఁడు. సం విశే (అ ఆ అ) ౧. అగ్రగామి, అగ్రేసరుఁడు ౨. శ్రేష్ఠుఁడు

ప్రష్ఠౌహి. సం వి ఈ స్త్రీ తొలుచూలిపడ్డ

ప్రసంఖ్య. సం వి ఆ స్త్రీ ౧. మొత్తము, వెకసి ౨. చింతనము, ఆలోచన.

ప్రసంఖ్యానము. సం వి అ పుం. ౧. లెక్కించుట, గణనము. ౨ సమ్యగ్జ్ఞానము, ధ్యానము, చింతనము. ౩. కీర్తి, ప్రసిద్ధి.

ప్రసంగము. సం వి అ పుం. ౧. ప్రకృష్టసంగము, మిక్కిలితగులు, మిక్కిలికూడిక. ౨. ప్రస్తావము. ౩. ఆసక్తి వ్యాపృతి. ౪. చర్చావిషయము. ౫. సంగతిభేదము (శ్లో. సత్ర సక్తి ఉపోద్ఘాతో హేతుతావసర స్తథా, నిర్వాహకైక్యకార్యైక్యే షోఢాసఙ్గతి రిష్యతే. అన్నసంగతులలో నొకటి ఇది తలఁచుకొన్నప్పుడు ఉపేక్షింపరానిదుట; తలంపునకు వచ్చినప్పుడు ద్వేషింపఁదగినది కాకుండుట.) ౬. వ్యాప్తి. ౭. అనురక్తత్వము. ౮. సైంధవాసక్తి. ౯. ప్రాప్తి.

ప్రసంగించు. సం. స. క్రి. ౧. ప్రస్తావించు.

వ. అని పలికి తనతోడికోడలిం బ్రసంగించి.

భోజరా. ౬. ౧౩౦.

వ పదంపడి కార్యంబు ప్రసంగించి నాయాడిన మాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికినవచనంబు లింత యొప్పునే.

భార. ఉద్యో. ౨. ౧౧౪.

౨. విస్తరించి చెప్పు.

గా. శ్రీరామాయణముఖ్యమామకకథాశ్రేణుల్ ప్రసంగించుచున్ ఉ రా. ౯. ౩౭౫.

ప్రసంజనము. సం. వి అ. న. ౧. ప్రస్తావనకుఁ దెచ్చుట, సంబద్ధము చూర్పుట ౨. ప్రయోగమునకుఁ దెచ్చుట, వినియోగించుట.

ప్రసంధిల్లు సం. అ. క్రి కూడు.

ఉ. . సకలాంగముల్ ప్రసంధిల్లుటచేత కేవలముగుఁ దేజము లేక క్రుతోనవీర్యమై.

శేషజకల్పము. ౧౪. పొ.

ప్రసక్తము. సం. విశే. (అ ఆ. అ.) ౧. ప్రసంగవిషయమైనది, ప్రస్తావమునకు సంబంధించినది. ౨. నిత్యము.

ప్రసక్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రసంగము, ప్రస్తావము. ౨. వ్యాప్తి. (అతిప్రసక్తి = అతివ్యాప్తి.) ౩. అనుమతి.

ప్రసక్తించు. సం. అ. క్రి. ప్రస్తావమునకు వచ్చు. (శ. ర.)

ప్రసజ్యప్రతిషేధము. సం. వి. అ. పుం. ఒక ప్రసంగమును ఆరోపించి (యట్టిదానినే) నిషేధించుట. (వ్యతి పర్యుదాసము)

శ్లో. ప్రసజ్య ప్రతిషేధోఽయం క్రియయాసహ యత్ర నఞ్ । పర్యుదాస స్స విజ్ఞేయో యత్రోత్తరపదేన నఞ్.

ప్రసజ్యము. సం. విశే. (అ. ఆ అ) ౧. తగులుపడఁదగినది కూడుకొనఁదగినది ౨. ప్రయోగింపఁదగినది, అనుసంధింపఁదగినది. ౩. ప్రసక్తింపఁదగినది, కలుగఁగూడినది

ప్రసత్తి. సం వి ఇ. స్త్రీ ప్రసన్నత, నైర్మల్యము.

ప్రసత్వ. సం. వి న్ పుం. వాయువు. విశే. (న్. రీ. న్) మాంసమును భక్షించు జంతువు. (శే. ని)

ప్రసత్వరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. తల్లి ౨. ప్రతిపత్తి, జ్ఞానము. (శే. ని)

ప్రసన్న. సం. వి. ఆ. స్త్రీ ౧. సుర, కల్లు ౨. ప్రసన్నోన్ముఖయగు, గోత్ర (శే. ని)

ప్రసన్నము. సం. విశే (అ. ఆ అ.) ౧. నిర్మలము. ౨. సంతుష్టము ౩. దయగలది, అనుగ్రహముగలది ౪. తేటయైనది, తెలివిడియైనది. ౫. సరియైనది, సమంజసము.

ప్రసభము. సం వి. అ. న. బలాత్కారము. పుం. వేగము. (శే ని.)

ప్రసమీక్షణము. సం. వి. అ. న. ఆలోచనము, వివేచనము.

ప్రసయనము. సం. వి. అ. న. ౧. బంధనము ౨. తంతువు, పోగు. ౩. జాలము, వల.

ప్రసరణము. సం. వి. అ. న. ౧. సాఁగుట నిగుడుట. ౨. పలాయనము. ౩. తృణాదుల తెచ్చుటకై సేన లిటునటుపోక, ఆసారము.

ప్రసరణి. సం. వి. ఈ. స్త్రీ. = ప్రసరణము.

ప్రసరము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలి నిగుడుట, సాఁగుట. ౨ వ్యాపనము, పర్వుట. ౩. సమూహము. ౪. యుద్ధము. ౫ నారాచాస్త్రము, ఇనుపబాణము, ౬. వేగము ౭. అనునయము, వినయము (శ ర) ౮. ప్రలయము. ౯. ప్రణవము. (శే. ని.)

ప్రసరించు. సం. అ క్రి = ప్రసరిల్లు.

౧. ఆవిర్భవించు, అభివ్యక్తమగు.

సీ. ముఖమున బహువేదములు ప్రసరింపఁగఁ జేసి వానికి మేలుసేత బుద్ధి.

భార. శాం ౬. ౫౨౦.

౨. ప్రవర్తించు.

౪. రాగాదులఁ, బరిభూతులఁజేయ చిట్లు ప్రసరించు రిలన్. (మార్క. ౪. ౬౪.)

౩. వ్యాపించు.

ఉ. . .సురాసురులు ... దుగ్ధసింధువు మథింపం దొడంగిరి. డిండీరపిండఖండంబులు బ్రహ్మాండంబునం బ్రసరించె. (హర. ౬. ౫౮.)

స. క్రి. వ్యాపింపఁజేయు.

మ. వినతానూనుఁడు దాని పైపక మహావిస్తీర్ణముల్ గాఁగ గ్రక్కున రెక్కల్ ప్రసరించి వాయుసమసంక్షోభంబునం బాతి తాఁకిన .. (హరి. పూ. ౪. ౧౩౬.)

(ఇట విప్పు అని భావము.)

ఉ. ధర్మంబునకుఁ జలనం బొలసిన తెలవులను వివిధ్రంబులగుజన్మంబులుఁ గర్మంబులుం

ప్రసరించి లోకస్థితి నిర్వహించు ...
హరి. పూ. ౪. ౧౩.

ప్రసరిల్లు. సం. అ. క్రి. వ్యాపించు.

సీ. దిక్కరిణీబృంద తొండకాట యీనినపిల్లలు
దివిఁ బ్రసరిల్లె ననఁగ.
హరి. పూ. ౭. ౧౨౩

ప్రసర్పణము. సం వి. అ. న. ౧. పాఁగుట, ౨. వ్యాపనము, ప్రసరణము.

ప్రస(శ)లము. సం. వి అ. పుం. హేమంత ఋతువు. (వాచ.)

ప్రసవకము. సం వి. అ. పుం. ప్రియాళు వృక్షము.

ప్రసవనము. సం. వి. అ. న. ౧. మిక్కిలిబిడ్డలను గనుట. ౨. మిక్కిలిఫలముల నిచ్చుట.

ప్రసవబంధనము. సం. వి. అ. న. ఆకులోనగు వాని తొడిమ, వృంతము.

ప్రసవము. సం వి. అ. పుం ౧ బిడ్డనుగనుట. ౨. కాన్పు, గర్భమోచనము. ౩ బిడ్డ, అపత్యము. ౪ పువ్వు. ౫. ఫలము, పండు. ౬. కార్యము ౭ పారంపర్యప్రసంగము. ౮. ప్రేరణము. ౯. ప్రసృతి. ౧౦. అనుజ్ఞ.
(శ. ని)

ప్రసవస్థలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పుట్టు చోటు, ౨. తల్లి. (వాచ.)

ప్రసవించు. సం. స. క్రి. ౧. (బిడ్డను)గను.

వ. రాజాధిదేవి యావంత్యులగు విందాను విందులం బ్రసవించె. (హరి. పూ. ౧.)

౨. పుష్పించు.

సీ. వినఁ దన్నితివో ప్రసవించె నశోకంబు ...
సమీ. ౧. ౧౭౮.

ప్రసవిత. సం. వి. ఋ. పుం తండ్రి, జనకుఁడు.

ప్రసవిత్రి. సం. వి. ఈ. స్త్రీ. తల్లి.

ప్రసవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఎడమ. ౨. కుడి. (శ. ర.) ౩. అనుకూలము. ౪. ప్రతికూలము, విపర్యస్తము. ౫. ఆయత్తము.
(శ. ని.)

ప్రసహనము. సం. విశే. (అ. ఆ. అ.) సహనములేనిది, ఓర్పులేనిది. (శ ర.)

వి. అ. పుం. మాంసాహారియగు పక్షి

- వి. అ. న. ౧. మిక్కిలిఓర్పుట. ౨ కౌఁగిలించుట.

ప్రసహము. సం. విశే. (అ ఆ. అ.) మిక్కిలి సహించునది. - వి. అ. పుం. ౧. మాంసాహారియగుపక్షి, బలవంతముగాఁ బట్టితిను పక్షివిశేషము.

శ్లో. కాకో గృధ్రఉలూకశ్చ చిల్లశ్చశశఘాతక.
చాషో భాసశ్చ కురవః ఇత్యాద్యాః ప్రసహాః స్మృతాః (భావప్రకాశిక)

౨. ఎదుర్చుట, తాఁకోర్చుట.

ప్రసహ్యాచోరుఁడు. సం వి. అ. పుం. బలవంతముగా పైఁబడి దోఁచుకొను దొంగ.

ప్రసహ్యాహరణము. సం వి. అ. న బలవంతముగా కొనిపోవుట.

ప్రసాతిక. స. వి ఆ. స్త్రీ అణుధ్యానము, సూక్ష్మ ధాన్యము. (వాచ.)

ప్రసాదకుఁడు. సం. విశే. (అ. దికా. అ) ౧. తేర్చునది, నిర్మలము చేయునది. ౨. సంతోషపెట్టునది, ఉల్లాసముగూర్చునది.

ప్రసాదనము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. తేర్చునది, తేటచేయునది. ౨. నిష్కళము గావించునది, కలఁకదుచ్చునది, ఉపశమింపఁజేయునది. ౩. సంతోషపెట్టునది, ఉల్లాసము గలిగించునది వి. అ. న. ౧. తేర్చుట. ౨ ప్రసన్నముగాఁ జేయుట. ౩. సంతోషపెట్టుట. ౪. అనుగ్రహము గలిగించుట. ౫. అన్నము. (శ. ర.)

**ప్రసాదము.** సం. వి. అ. పుం. ౧ అనుగ్రహము. ౨. నైర్మల్యము, ప్రసన్నత, తేటదనము. ౩. కావ్యగుణములలో నొకటి. ౪. దేవనైవేద్యము. ౫. గురుజనాదులచే భుక్తపరిశిష్టమైన అన్నము కొందలగునది. ౬. విరాళము. ౭ మనస్సు

**ప్రసాదించు.** సం. స. క్రి. అనుగ్రహించు.

వ. ఆగ్రభ్రజంబుకొంఱలకు వాఁకిలి యెన్నండును లేకయుండం బ్రసాదించి యంతర్హితుండయ్యె. (భార. శాం. ౩. ౩౭౧)

క. శరణంబు వేఁడెద భవచ్చరణంబులు గనుఁగొనం బ్రసాదింపఁగదే.
భార. ఉద్యో ౩. ౪౦౭

వ. అని యిట్లు సమ్రజ్జనకుండు ప్రసాదించిన సేమ పెద్దకాలంబునకు (మార్క ౧. ౯౨.)

(ఇట అనుగ్రహపూర్వకముగాఁ బలికిన అని భావము)

**ప్రసాధకము.** సం విణ (అ. ధా. అ.) ౧. మిక్కిలిసాధించునది, నెఱవేర్చునది ౨. తీర్చునది, శుద్ధిపేయునది ౩. వస్త్రాదులచే అలంకరించునది

**ప్రసాధనము.** సం వి. అ న. ౧. మిక్కిలి సాధించుట, చక్కఁగా నెఱవేర్చుట. ౨. సిద్ధి. ౩. క్రమముగా ఏర్పఱచుట. ౪. అలంకరణము, సింగారము, అలంకారము, భూషణము. ౫. శుశ్రూష. - పుం. కంకతిక, దువ్వెన (శే. ని.)

**ప్రసాధని.** సం. వి. ఈ. స్త్రీ. కంకతిక, దువ్వెన.

**ప్రసాధిక.** సం వి. అ స్త్రీ. ౧. (రాణి మొదలగువారికి) అలంకారముచేయు స్త్రీ, సైపేయునది. ౨. నీవారధాన్యము, నివ్వరులు.

**ప్రసాధితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. నిష్పాదితము, పరిపక్వముచేయఁబడినది, చక్కఁగా సాధింపఁబడినది. ౨. అలంకరింపఁబడినది.

**ప్రసారణము.** సం. వి. అ. న. ౧. చాఁచుట (బాహుప్రసారణము,) (న్యాయ.) క్రియాభేదము. ౨. వ్యాపించుట, పర్వుట. ౩. శత్రువును చుట్టుకొనుట. ౪. తిరుచుట. ౫. (వ్యాక.) సంప్రసారణము

**ప్రసారణి.** సం వి. ఈ స్త్రీ. గొంతెమగోరు, కింటుభరి. వై.

**ప్రసారము.** సం వి . పుం వ్యాపనము, వ్యాపించుట.

**ప్రసారి.** సం. విణ. (న్ ఈ. న్) ప్రసరించునది.

**ప్రసారిణి.** సం. వి. ఈ. స్త్రీ. లజ్జాలులత. వై.

**ప్రసారితము.** సం విణ. (అ. ఆ. అ.) ౧ విస్తరింపఁబడినది, విరివిగా చేయఁబడినది, వ్యాప్తము గావింపఁబడినది. ౨ తిరుచఁబడినది, (శ ర)

**ప్రసితము.** సం విణ (అ ఆ అ) ౧ బద్ధము, కట్టఁబడినది ౨ తత్పరము, ఆసక్తము, తగులుగలది ౩ మిక్కిలిశుభ్రము. - వి అ. న. పూయము, చీము

**ప్రసితి.** సం. వి ఇ స్త్రీ. ౧ కట్టెడు సాధనము. (సంకెల మొ.) ౨. తంతువు ౩ జాలము, వల (వాచ) ౪ నిర్బంధము. (శ ర.)

**ప్రసిద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వాసికెక్కినది, ప్రసిద్ధికెక్కినది. ౨. ప్రసాధితము, అలంకరింపఁబడినది.

**ప్రసిద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఖ్యాతి ౨. నిష్పత్తి మిక్కిలిసిద్ధి, చక్కఁగా కుదురుట. ౩. అలంకారము, నగ.

**ప్రసువు.** సం. విణ. ఉ. బిడ్డ లోనగువాని కనునది. - వి. ఉ. స్త్రీ. ౧. తల్లి. ౨. అల్లె గుఱ్ఱము, గోడిగ.

**ప్రసూత.** సం. వి. ఆ. స్త్రీ. బాలెంతరాలు.

**ప్రసూతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కాన్పుకొందినది, పుట్టినది ౨. పొడమినది, ఫలించినది. 3 కనినది, ప్రసవించినది. వి. అ. న. పువ్వు.

**ప్రసూతి.** సం వి. ఇ స్త్రీ ౧ ప్రసవము. కానుపు, గర్భమోచనము ౨ (పువ్వులులోన గునవి) తలచూపుట, పొడసూపుట 3 ఫలితము ౪ బిడ్డ, పిల్ల. ౫ తల్లి.

**ప్రసూతిక.** సం. వి ఆ. స్త్రీ బాలెంతరాలు

**ప్రసూతిజము.** సం వి అ న. బాధ, దుఃఖము.

**ప్రసూనము.** సం. విణ. (అ ఆ అ) పుట్టినది, (కాచ) వి. అ. న. ౧. పువ్వు. ౨. పండు

**ప్రసూనేషువు** సం వి. ఉ పుం. పూవిలుకాఁడు, మన్మథుఁడు.

**ప్రసృత.** సం వి ఆ. స్త్రీ. జంఘ, కాలిపిక్క

**ప్రసృతజుఁడు.** సం వి అ పుం పరస్త్రీయందుఁ బుట్టినవాఁడు. (కుండగోళకాది)

**ప్రసృతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విగిడినది, చాఁగినది. ౨. కొనసాఁగి పెరిఁగినది 3. వ్యాపించినది, పర్వినది. ౪. వేగితము, త్వరింపఁబడినది. ౫. వినీతము. ౬. గతము. ౭. నియుక్తము, నియోగింపఁబడినది. ౮. తీర్పఁబడినది. (శ. ర) - వి. అ. పుం, న. రెండుపలముల కొలఁది. - వి. అ పుం. చేర, పుడిసిలి.

**ప్రసృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. చాఁగుట, వ్యాప్తి, ప్రసారము. ౨. ప్రవహించుట. 3. చేర, పుడిసిలి. ౪. తంతువు, దారము. ౫. వాక్కు. ౬. జాలము. ౭. తాత్పర్యము. ౮. బంధనము. (శ. వి.)

**ప్రసృత్వరము.** సం. విణ (అ. ఆ. అ.) ప్రసరించునది.

**ప్రసృమరము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రసరించునది. ౨. ప్రవహించునది, ఒలుకునది.

**ప్రసృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తొలఁగఁబుచ్చఁబడినది, దిగవిడువఁబడినది. ౨. గాయపఱుపఁబడినది.

**ప్రసేకము.** సం వి. అ. పుం. ౧. స్రవించుట, కాఱుట. ౨. ఆసించనము, చల్లుట, తడుపుట. 3. జాఱుట, చ్యుతి ౪. గరిఁటె లోనగువాని చిప్ప.

**ప్రసేకి.** సం. వి. న. పుం. అసాధ్యవ్రణభేదము.

**ప్రసేదిక.** సం వి ఆ స్త్రీ. చిన్నతోఁట.

**ప్రసేవకము.** సం. వి అ పుం. ౧. వీణకరిపె. ౨. సూత్రరచితపాత్రము.

**ప్రసేవము.** సం. వి. అ పుం ౧ ధాన్యము పోయుసంచి. ౨ ఎండుపుఁదట్టు. 3. వీణకరిపె విణ. (అ. ఆ అ.) ౧. స్యూతము, కుట్టఁబడినది. ౨ గ్రథితము, గ్రుచ్చఁబడినది

**ప్రస్కందనము.** సం. వి. అ న. ౧. అస్కందనము, గంతువైచుట, క్రేళ్లుదాఁటుట. ౨. విరేచనము. 3. ఆపాదనము,. కలిగించుట.

**ప్రస్కందము.** సం. వి. అ పుం. కుందము అనఁబడు చక్రాకారమగు వేదిక.

**ప్రస్ఖలనము.** సం. వి. అ. న. తడఁబడుట, తొట్రుపడుట, అడుగుతొట్రిలుట, కాళ్లుతడఁబడి పడుట.

**ప్రస్తరణము.** సం. వి. అ న. ౧. సెజ్జ, శయ్య. ౨. ఆసనము, పీఁట.

**ప్రస్తరము.** సం. వి. అ. పుం. ౧. చిగుళ్లలోనగువానిచే నేర్పఱచిన సెజ్జ. ౨. రాయి. 3.

రత్నము. ౪. దుర్భిక్షము. ౫. గ్రంథముయొక్క భాగవిశేషము. ౬. కథము. (శ. ర.)

**ప్రస్తరించు.** సం. స. క్రి. ౧. విస్తరించు, పెంపొందించు.

సీ. యజ్ఞతటాకంబునందుఁ గ్రుంకిలు పెట్టి,
బ్రహ్మర్షిపితృతృప్తిఁ బ్రస్తరించు
భీమ. ౩. ౧౧౪

క. చిలిచెలువు ప్రస్తరింపన్, దొలుదొల్త నజాండు
గురువునన్ లఘు విడెన్వా, వెలయున్
ఫాలము నాసిక, యలసాంగత్యమునఁ గంర
మట గల మయ్యెన్. (సుదంతా ౩. ౩౬)
(ఇది కందర్థములకు నుదాహరణము)

౨. ప్రస్తారముచేయు

సీ. జనియించెఁ బ్రస్తరించినఁ గ్రమంబున యర
సతభజన లనంగ సప్తవిధము, లు
అప్ప. ౪. ౩౬.

**ప్రస్తవము.** సం. వి. అ. పుం. ౧. స్తోత్రగీతము, స్తుతిసామము. ౨. ప్రస్తావము. ౩. . సమము

క. . . . వారలు నీప్రస్తవమున ని, వ్వార్లఁ
గృతము దలంచి ప్రాణములు విడుతు రనిక్.
భార. సభా. ౧. ౩౭.

క. అనఘా నీప్రస్తవమున, నని నీల్గిన వీరభటుల
యనుపోష్యుల. . . .
భార. సభా. ౧. ౩౯.

**ప్రస్తవించు.** సం. స. క్రి. విషయమునకుఁదెచ్చు, ప్రస్తావమునకుఁదెచ్చు.

ఉ. సమ్మతిఁ బ్రస్తవించు శుకశారిక లాగవ
భాషితంబులన్. (హర. ౫. ౩౧.)

**ప్రస్తారపంక్తి.** సం. వి. ఈ. స్త్రీ. ఛందోవిశేషము.

**ప్రస్తారము.** సం. వి. అ. పుం. ౧. పఱచుట. ౨. చిగుళ్లు పూవులుమొదలగువానిచే ఏర్పఱచిన సెజ్జ. ౩. సెజ్జ, శయ్య. ౪. చదునైన ప్రదేశము. ౫. తృణప్రధానవనము, వృక్షవిస్తారము. (శ. ర.) ౬. (ఛంద) లఘుగురువులను దెలుపు ప్రక్రియాభేదము, ఛందశ్శాస్త్రమునందలి ప్రత్యయవిశేషము.

**ప్రస్తార్యర్మము.** సం. వి న్. న. క్షేత్రభాగభేదము.

**ప్రస్తావన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. స్తోత్రము, స్తుతించుట ౨. ఆరంభము ౩. ఉపోద్ఘాతము, అవతారిక. ౪. ఆముఖము, నాటకముయొక్క అంగభేదము.

**ప్రస్తావము.** సం. వి. అ. పుం. ౧. ఆరంభము, ఉపక్రమించుట. ౨. అవతారిక, ఉపోద్ఘాతము, ౩. ప్రసంగము. ౪. అవసరము, తగినతఱి, యుక్తసమయము. ౫. ప్రకరణము ౬. సామావయవభేదము ౭. ప్రకృష్టస్తవము, అధికమైనస్తుతి.

**ప్రస్తావించు.** సం. స. క్రి. ప్రస్తావమునకు తెచ్చు (శ. ర.)

**ప్రస్తీత(మ)ము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. సంహతము, గుమిగూర్పఁబడినది, ఒక్కటిగా కూడినది. ౨. ధ్వనితము, మొరయింపఁబడినది, ప్రయోగింపఁబడినది. (వాచ.)

**ప్రస్తుత.** సం. వి. ఆ. స్త్రీ. (ఈనఁబోవు సమయమున) పొదుగుచేసినయావు.

**ప్రస్తుతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలిస్తుతింపఁబడినది. ౨. ఆరంభింపఁబడినది. ౩. ఉపస్థితము, సమీపించినది. ౪. ప్రకరణముచే ప్రాప్తించినది, ప్రాసంగికము. ౫. ప్రతిపన్నము, ప్రాప్తము. ౬. ఉద్యతము, సిద్ధమైనది, సిద్ధముచేయఁబడినది. (శ. ర.)
వి. అ. న. ౧. ప్రస్తావమునకు వచ్చిన విషయము. ౨. ఉపమేయము.

శా. ప్రారంభించిన వేదపాఠమునకున్ బ్రత్యూహమౌ నంచునో, యేకాతమ్మునఁ దనన్ను జాడఁ బనుదేవు . . పాండు. 3. 33

ప్రారబ్ధము. సం. విణ. (అ ఆ. అ) ప్రారంభింపఁ బడినది.

వి. అ న. ౧. ప్రారంభింపఁబడిన కార్యము; ౨. పూర్వ. దేహోద్యారంభకమగు కర్మవిశేషము. (కర్మము-ప్రారబ్ధము, ఆగామి, సంచితము అని మూఁడువిధములు, అందు ప్రారబ్ధము అనుభవించియే తీరఁదగినది.)

ప్రారబ్ధి. సం వి. ఇ. స్త్రీ. ౧. ఆరంభము ౨. ఏనుఁగును కట్టుకంబము, ఆలానము.

ప్రారోహము. సం. విణ (అ. అ. ఈ. అ.) ప్రరోహణశీలము, మొలచునట్టి స్వభావము గలది. వి. అ పుం. ప్రరోహము, మొలక.

ప్రార్ణము. సం. విణ (అ. ఆ. అ.) ప్రకృష్టమగు ఋణముగలది.

వి. అ. న. ప్రకృష్టమగు, ఋణము, ప్రధానమగు అప్పు.

ప్రార్థకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అడుగువాఁడు, ప్రశ్నించువాఁడు. ౨. వేడువాఁడు, యాచించువాఁడు. 3. మనవిచేయువాఁడు- విజ్ఞాపు.)

ప్రార్థన. సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రార్థనము ౨. (అలం.) గర్భసంధ్యంగభేదము.

శ్లో. రతిహర్షోత్సవానాంతు ప్రార్థనాభవేత్. 3. ముద్రాభేదము. శ్లో. ప్రసృతాంగుళికా హస్తౌ విధ్లిష్టౌచ సమ్ముఖే, కర్ణాకృష్ణాదరే సేయం ముద్రా స్యాత్ ప్రార్థనాభిధా.

ప్రార్థనము. సం. వి. అ. న. ౧. యాచనము, వేడుట, అడుగుట.

ప్రార్థనీయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అడుగఁదగినది. యాచనీయము. వి. అ. న. ద్వాపరయుగము.

ప్రార్థయిత. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) ౧. అడుగువాఁడు, వేఁడువాఁడు. ౨. వివాహార్థి, వరుఁడు.

ప్రార్థి. సం. విణ. (న. ని. న.) ౧. వేడువాఁడు. ౨. అడుగువాఁడు.

ప్రార్థించు. సం. స. క్రి. ౧. వేఁడు. ౨. అడుగు. (శ. ర.)

మ. అని ప్రార్థించిన నవ్విభుండు విని యత్యంతానుకంపాత్ముఁడై, యనిరుద్ధున్ గింకరులోఁద . మార్క. ౨. ౧౨౪.

ప్రార్థితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అడుగఁబడినది. ౨. వేఁడఁబడినది, శత్రుసంయతము. 3. హింసింపఁబడినది. (మే. ని., త్రి. ని.)

ప్రార్దితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మాకము. చంపఁబడినది. ౨. యాచింపఁబడినది. 3. అభియుక్తము.

ప్రాలంబము. సం. విణ. (అ. ఆ. అ.) వ్రేలాడునది. వి. అ. న. మెడనుండి సరిగా నురమున వ్రేలెడిపూదండ లోనగునది.

ప్రాలంబిక. సం. వి. ఆ. స్త్రీ. మెడనుండి సరిగా నురమున వ్రేలెడి స్వర్ణహారము, అలంకారభేదము.

ప్రాలుమాలిక=పాలుమాలిక. వి. (√ప్రాయు.) ౧. పోమరితనము, బద్ధకము. (శ. ర.) ౨. ఒకానొక కావ్యదోషము, శ్లేషమునకద్దై యుద్భుటప్పుట కవి అవలంబించుకష్టమే [illegible]

సీ. ... [illegible] ప్రాలు [illegible] [illegible] [illegible] [illegible] [illegible]

క. కొదమగ్రోలుత సంధి కెగ్గలు, కొదమునకు ప్రీతి దుష్టమదోత్కట భూతలమున వి,చ్చెదు చెదవిన ముడిచిరి యనుచుదు నీకొదనినఁ జట్టు ప్రావృడఁ గృతులక్.

కవిజనా. దోవ. ౨౧.

ఆ. అవనిభుజుండు భుక్తి వదుర కుజముల్గంగి, బుధులగురుల నమలబుద్ధిఁ దలఁప, విచ్చు నష్టమతుల నితనికి శ్రీవాను,దేవుఁ దనినఁ జట్టు ప్రావృతృతుల. కవిజనా. ౧౮. పా.

ప్రావటము. సం. వి. అ. పుం. యవలు.

ప్రావడి. వి. (ప్రా¹ + వడి) ప్రావృసము.

క. విలసత్ప్రాదాద్యతుర,ములు వర్లగు సాద్విత్రీయములు ప్రావర్లు, సృలకొని తమతమ పాదంబులయతిపై నన్నిపాదములఁ బ్రావల లమరుక్. కవిజనా. సంజ్ఞా. ౬౨.

ప్రావణము. సం. వి. అ. న. ౧. కప్పుకొను వస్త్రము, ముసుఁగు. ౨. ఉత్తరీయము.

ప్రావరము. సం. వి. అ. పుం. ౧. వెలుగు, కంచె. ౨. ఉత్తరీయము.

ప్రావారకీటము. సం. వి. అ. పుం. ఒక దిమను కీటము.

ప్రావారము. సం. వి. అ. పుం. ౧. ఉత్తరీయము. ౨. కంబళి. (శ. ర.)

ప్రావాసము. సం. విశే. (అ. ఈ. అ.) ౧. ప్రవాసమునకు దియ్యఁబడునది. ౨. ప్రవాసము నందు చేయఁదగినది.

ప్రావిరి. వి. (ప్రాఁత + విరి.) పాఁతపువ్వు, వాడి నలఁగిన పుష్పము.

ఉ. కొంతకాలము కొంత్య వరుదెంచి ... వాడినపెద్దయినాఁడ ప్రావిరుల్, కొలఁగఁ

ప్రభాతవాయువులు కోఁచుఁ బుదిం బది చాతకొన్నతిక్. ప్రాంతు. ౧. ౧౧౯౪

ప్రావీణ్యము. సం. వి. అ. న. ప్రవీణత్వము, నేర్పు.

ప్రావృ = వరవు. అ. క్రి. వ్యాపించు. (శ. ర.)

ప్రావృట్కాలము. సం. వి. అ. పుం. వర్షాకాలము, వానకారు.

ప్రావృట్టు. సం. వి. ష. స్త్రీ. ౧. వర్షఋతువు.

ప్రావృడత్యయము. సం వి. అ. పుం. ౧. వర్షఋతువుచివర. ౨. శరత్కాలము.

ప్రావృతము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి ఆవరింపఁబడినది, గ్రమ్ముకొనఁబడినది, కప్పఁబడినది. ౨. కప్పుకొనఁబడినది. (దుప్పటి) వి. అ. పుం. న. కప్పుకొనువస్త్రము.

ప్రావృతి. సం వి. ఇ. స్త్రీ. ౧. ఆవరణము. వెలుఁగు, కంచె.

ప్రావృత్తికుఁడు. సం. వి. అ. పుం. దూతభేదము.

ప్రావృషాయణి. సం. వి. ఈ. స్త్రీ. కపికచ్ఛువు, దూలగొండి. శ్రీ.

ప్రావృషికము. సం విశే. (అ. ఈ. అ.) వర్షాకాలమునఁ గలుగునది

వి. అ. పుం. స్త్రీ. నెమలి.

ప్రావృషిజము. సం. విశే. (అ. ఆ. అ) ప్రావృట్కాలమునఁ బుట్టినది వి. అ. పుం తుపాను, ఝంఝూవాతము, వానగాలి.

(శ్రీ. వి.)

ప్రావృషేణ్యము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రావృట్కాలమునఁ గలిగినది, ప్రావృట్కాల సంబంధి. ౨. వర్షాకాలమున నియ్యఁ

తగినది. (ఋతువులు.) ౩. వర్షాకాలమున చేయఁదగినది. వి. అ. పుం. ౧. కదంబము, కడప. కే. ౨. కుటజము, కొండమల్లె. కే. ౩. ధారాకదంబము, నీటికడిమి. కే.

వి. అ. స్త్రీ. ౧. కపికచ్ఛుర, దూలగొండి. కే. ౨. రక్తపునర్నవ, ఎఱ్ఱగలిజేరు.

వి. అ. న. ప్రాచుర్యము, పెల్లుఁదనము.

ప్రావృష్యము. సం. వి. అ. పుం. ౧. ధారాకదంబము, నీరుకడిమి. ౨. కుటజము, కొండమల్లె. ౩. వికంకతము, కానరేగు. కే.

ప్రావేణ్యము. సం. వి అ. న. సన్నని ఉన్నికప్పడువస్త్రము. (విల్యమ్ము.)

ప్రా(ఁత)వేల్పు. వి. (√ ప్రాఁత) పూర్వదేవత, రాక్షసుఁడు.

వ. . వేల్పులం బ్రావేల్పులను నవల్పభావనావిశేషంబుల మూషకవాహనునకుఁ బ్రదక్షిణంబులుఁ బ్రణామంబులుం జేసి

భీమ. ౪. ౯౧.

క. నిరులచెలి మగనియడుగునఁ, గర మరుదుగఁ
బొదమి ముజ్జగంబులయందున్, గరగిరిక
సెలపుణక్కర, విరిబోఁడి బొజంగ ప్రాఁత
వేల్పులగొంగా. అచ్చ. రా. ఆర. ౧.

ప్రావేశనము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. ప్రవేశించునప్పుడు ఇయ్యఁబడునది. ౨. ప్రవేశించునప్పుడు చేయఁదగినది.

ప్రావేశికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. ప్రవేశమునకు సాధనమైనది.

ప్రావ్రాజ్యము. సం. వి. అ. న. ౧. సన్న్యస్తిత్వము, సన్న్యసము. ౨. పర్యటనస్వభావము, త్రిమ్మరితనము.

ప్రాశకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తినువాఁడు, భక్షకుఁడు.

ప్రాశనము. సం. వి. అ. న. ౧. తినుట, భోజనము, ఆహారము.

ప్రాశనీయము. సం. విణ (అ. ఆ. అ.) తినఁదగినది, ఆహరింపఁదగినది.

వి. అ. న. ఆహారము.

ప్రాశస్త్యము. సం. వి. అ. న. ప్రశస్తత్వము, మేలిమి. ౨. స్తుత్యత, కొనియాడఁదగియుండుట.

ప్రాశాస్త్రము. సం వి. అ. న. ౧. ప్రశాస్త యజమానుఋత్విజానికర్మము. ౨. నిలుకడ, ప్రశాసనము.

ప్రాశించు. సం. స. క్రి. ౧. తిను, భక్షించు.

సీ. దళకోటిచర్వితోద్వాంతపర్ణమొకాని ప్రాశింప
రీతిల్లుఁ బరభృతంబు. చంద్రా. ౩. ౪౦.

గీ. శిష్టశాకాన్నలవముఁ బ్రాశించి తపసి, కోప
ముడిగించి పరపూర్ణకుక్షిఁ జేసె.

భాగ. ౧. ౩౬౪.

రం. రా. అరణ్య. ౭౭. పా. ౧౦. పం.

౨. ప్రాశనముచేయు, త్రాఁగు.

ద్వి. పాదోదకంబులు ప్రాశించికాని, యొడసఁ
గావింపఁ డితరసత్క్రియలు.

పండితా. పురా. ౯౩.

సీ. వసన బ్రహ్మతత్త్వవైశ్యులు . ముత్యాలు
ప్రాశించి మూతి యద్దము నిద్దు కొకమాటు
ముమ్మాటు కొనరఁ దుడిచి.

విజ్ఞా. ఆచా. ౫౨.

వ. ..అదుర్గంధరసంబులం నయనయాదేశంబులు బ్రహ్మతీర్థంబున హృదయపర్యంతంబు డిగ్గ శుద్ధిబుద్ధ్యర్థంబు ప్రాశించునది.

కాశీ. ౫. ౨౦౧.

**ప్రాశితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తినఁబడినది, భక్షితము. ౨. పానముచేయఁబడినది. (శ. ర.) - వి. అ. న. ౧. తినుట, కుడుపు. ౨. పితృతర్పణము, పంచయజ్ఞములలో నొకటి.

**ప్రాశిత్రము.** సం. వి. అ. న. యజ్ఞమందు బ్రహ్మ నుద్దేశించి యియ్యఁబడు పురోడాశాది భాగము.

**ప్రాశువు.** సం. వి. ఉ. పుం. కుడుపు.

**ప్రాశ్నికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. ప్రశ్నచేయువాఁడు. ౨. ప్రశ్నోత్తరదానము నకుఁ దగినవాఁడు. ౩. సభ్యుఁడు. (శ్రీ. వి.)

**ప్రాసంగము.** సం వి. అ. పుం. కాఁడికి ముందటికాఁడి.

**ప్రాసంగికము.** సం. విణ. (అ. ఈ. అ) ౧. మిక్కిలిసంగము (కూడిక) వలనఁ గలిగినది. ౨. కూడిక గలది, సంబద్ధము. ౩. ప్రసంగవశమున వచ్చినది, ప్రస్తావవశముగాఁ గలిగినది. ౪. ప్రస్తుతాంశమునకు సంబంధించినది. ౫. యుక్తసమయముగలది, తగినతఱితోడిది.

**ప్రాసంగ్యము.** సం. వి. అ. పుం. కాఁడి మోచెడి ఎద్దు.

**ప్రాసఁగు.** వి. సస్యవిశేషము.

సీ. ఏకోట విరిబోట విరుకాచునం బందుఁ బ్రా
సంగువరి చేలఁ బసిఁడిచాయ.

భీమ. ౨. ౫౪.

మ. బలుమల్ పండెను దొండపండ్లువడిరుం
బ్రాసంగఁజేల్ .. శివరా. ౪. ౧౯.

ఉ. ప్రాసఁగువిత్తువంటివెల పాలుకొలంబునఁ
బుట్టి ... పాండు. ౩. ౩.

(స్వర్ణమైన ఛవి భావము.)

**ప్రాసకము.** సం. వి. అ. పుం. ౧. ప్రాసము ఈఁటె. ౨. పాచిక, పాశకము.

**ప్రాసనము.** సం. వి. అ. న. త్రోయుట, వేయుట. ౨. పడఁద్రోయుట, దిగద్రొబ్బుట. (విల్యమ్సు.)

**ప్రాసము.** సం. వి. అ. పుం. ౧. త్రోయుట, క్షేపము. ౨. ఈఁటె, కుంతము. ౩. పద్యపాదమున రెండవయక్షరము. (ఇది తెనుఁగునందే.)

శ్లో. . వళి రాద్య మనంతరాక్షరం ప్రాసః
ఆంధ్రశబ్దచింతామణి. సంజ్ఞా. ౧౨.

**ప్రాసవము.** సం. విణ (అ. ఈ. అ.) ప్రసవసంబంధి. (ప్రసవము = పుష్పము.) (శ. ర.)

**ప్రాసాదకుక్కుటము.** సం. వి. అ. పుం. (మరగిన) పావురాయి. (శ్రీ. వి.)

**ప్రాసాదప్రస్తరము.** సం. వి. అ. పుం. ఇంటి బోడిమిద్దె. (డాబా.)

**ప్రాసాదమండన.** సం. వి. అ. స్త్రీ. ఒక దినుసు పారిదళము. (విల్యమ్సు.)

**ప్రాసాదము.** సం. వి. అ. పుం. ౧. నగరు, రాజభవనము; సౌధము, హర్మ్యము. ౨. దేవళము, దేవగృహము. ౩. ప్రేక్షకులు కూర్చుండుటకై యెత్తుగా వైచినరంగము. (విల్యమ్సు.)

**ప్రాసాదికము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. ప్రసాదముగా నియ్యఁబడినది. ౨. ప్రసాదము గలది. ౩ సుందరము, అందమైనది. (విల్యమ్సు.)

**ప్రాసించే.** స. క్రి. (సం. ప్రాశించు) భక్షించు, తిను.

ద్వి. తనసతియును దాను తత్ప్రసాదంబు, నను
రక్తిం బ్రాసించె ...

ద్వి. పరమ. ౨. ౧౧౯. పా.

http://teluguthesis.com/



ప్రాసికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ప్రాసా యుధధారి, ఈఁటెకాఁడు.

వి. అ. పుం. ఈఁటెతో యుద్ధముచేయువాఁడు.

ప్రాస్థానికము. సం. విణ. (అ. ఈ. అ.) ప్రస్థాన (ప్రయాణ) సమయమునకు సంబంధించినది. ౨ ప్రయాణమునకు అనుకూలమైనది. (యాత్రకుఁ దగుమంగళ ద్రవ్యము లగు శంఖదధ్యాది.)

ప్రాస్థికము. సం. విణ. (అ. ఈ. అ.) ప్రస్థము కొలఁత గలది. ౨. ప్రస్థముచే కొనఁబడినది. ౩. ప్రస్థము పట్టునది. ౪. ప్రస్థపరిమిత ధాన్యాదికము విత్తఁదగినది. (క్షేత్రము)

ప్రాహము. సం. వి. అ. పుం. నృత్యోపదేశము.

ప్రాహ్ణము. సం. వి. అ. పుం. ఉదయము మొదలు పదిగడియలవఱకుఁ గలకాలము, కోఁబగలు.

ప్రాహ్ణేతనము. సం. విణ. (అ. ఈ. అ.) ప్రాహ్ణసంబంధి, ప్రాహ్ణమునఁ గలుగునది.

## ప్రి

ప్రిదిలపఱుచు. స. క్రి. (√ప్రిదులు) పోఁగొట్టు.

గీ. కేలుపులకేల్పు మాటెల్ల యాలకించి
పెదలఁ బొదలెడునట్టి కల్లఁ ప్రిదిలపఱిచి,
పోఁకచే ... అచ్చ. రా. బాల. ౬౯.

ప్రిదులఁబోవు=ప్రిదులు. (తొలఁగిపోవు, తప్పి కొనిపోవు.)

మ. ప్రిదులంబోవఁగ నీక చంపుటరయ శౌర్యంబు. వసు. ౩. ౯౫.

ప్రిదులిపోవు = ప్రిదులఁబోవు. (√ప్రిదులు)

మ. మదీయ సందంత తలిరుచుం ప్రిదిలి పోవుచు నిత్తెఱంగునం దార్పుసమయం బునఁ. భా. రా. అర. ౨. ౫౨.

ప్రిదులు. అ. క్రి. ౧. విడియు.

సీ. ప్రిదిలి కైదవకొప్పు లొకటి బొక్కులు దీరె శరకాంతపం క్తుల జలము లాక.
మను. ౩. ౨౩.

౨. వదలు.

క. కెల్లము గ నలుపడుట విని, జల్లని డెందంబు పెదర సంధులు ప్రిదులన్.
భార. ద్రో. ౨. ౨౪౪.

క. హృదయ మదరంగ సంధులు, ప్రిదులఁగఁ జిత్తము గలంగఁ బెంజమ టొదవన్.
భా. రా. అర. ౨౯౯.

౩. జాఱు, గళితమగు.

ఉ. శ్యేనముఖంబునం ప్రిదిలి చెచ్చెర కొండినిఁ బడ్డకారికన్. మార్క. ౬. ౨౪౨.

క. ... ఒకభంగిఁ ప్రిదిలి పడి యది ..
భోజరా. ౪. ౨౩.

ద్వి. పెదవులు దడవుచు బిగిచన్నదోయిఁ, ప్రిదిలినపయ్యెద బిగియఁ జేర్చుచును ...
రం. రా. అర. ౧౬౯. పొ. ౬. పం.

౪. ఊడు, విడిపోవు.

గీ. కీలు ప్రిదిలి తటిల్లత నేలఁ బడిన ...
కు. సం. ౫. ౫౩౭.

గీ. పెంపు గనుపొన్నలలగుంపు ప్రిదిలి జాఱు.
వసు. ౭. ౧౧.

సీ. అనయంబుఁ దివ్యనియమవృత్తి గనయంబు ప్రిదులంగ మెలఁగి పొ క్కాడఁజేయు.
భార. శ్రీ. ౨. ౧౩౩.

చ. ప్రిదిలినపీఁ గెల సవరించు తలోదరి కోర్కెఁ గాంచి ... హైమ. ౩. ౯౭.

౫. తగ్గు, క్షీణించు.

వ. అట్టియెడ సుధయబలంబుల సుధయాబలంబులును ... చలంబులు వదలక బలంబులు ప్రిదులక బీరంబు కలక ...
ఉత్త. ౪. శా.

http://sanskritcentral.com/

ప్రియంభవిష్ణువు. సం. విశే. (ఉ) = ప్రియంభావుకము.

ప్రియంభావుకము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రియమగునది.

ప్రియంవదము. సం. వి. అ. పుం. ఒకానొక పక్షి.

వి. అ. స్త్రీ ద్వాదశాక్షర పాదకమగు ఛందోవిశేషము. పాదమునకు పండ్రెండక్షరములు గల వృత్తవిశేషము.

ప్రియంవదుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఇంపుగా మాట్లాడువాఁడు, మధురభాషి, ౨. ఇచ్చకమాడువాఁడు.

వి. అ. పుం. ౧. ఒక గంధర్వుఁడు. ౨. ఒక ఖేచరుఁడు

ప్రియకము. సం. వి. అ. పుం. ౧ చిత్రమృగము, చిత్రవర్ణముగలజింక. ౨ పీతసాలకము, వేఁగిస. ౹. ౩. నీపము, కదప. ౹ ౪. ప్రియంగువు, ప్రేంకణము. ౹. ౫. ధారాకదంబము, నీరుకడిమి. ౹. ౬. అసనము. ౹ ౭ తుమ్మెద. ౮. పక్షివిశేషము ౯ ఊసరవెల్లి (విల్యమ్సు.) ౧౦ కుంకుమము (శ ర)

ప్రియకర్మము. సం వి. న సం. ౧ ప్రియమైన కార్యము. ౨. ప్రీతికలుగునట్లు నడుచుకొనుట.

ప్రియజీవము. సం. వి. అ పుం. శ్యోనాక వృక్షము.

ప్రియత. సం. వి. అ. స్త్రీ. ప్రియత్వము.

ప్రియతమము. సం. విశే. (అ. ఆ. అ) మిక్కిలి ప్రియము. వి. అ. పుం. మయూర శిఖావృక్షము.

ప్రియతోషణము. సం. వి. అ. పుం. రతిబంధవిశేషము.

శ్లో. నారీపాదౌ స్వహస్తేన ధారయేత్ క్షమతోపరి, స్తనాపీడకరః కామీ కామయేత్ ప్రియతోషణః. (రతిమంజరి.)

ప్రియత్వము. సం. వి. అ. న ౧. స్నేహము. ౨. ప్రేమ.

ప్రియదర్శనము. సం. విశే. (అ. ఆ. అ.) చూచుట కింపయినది, సుందరము. వి. అ. పుం. ౧. చిలుక. ౨. క్షీరికావృక్షము.

ప్రియదర్శి. సం. విశే. (స. నీ స) ప్రీతితో జూచువాఁడు. వి. స. పుం. అశోకుఁడనురాజు.

ప్రియ(౦)పడు. అ క్రి. (ప్రియము + పడు) ఇష్టపడు.

ఉ. వీరకుమార! రేను విను వేఁడెదఁ బ్రార్థన సల్పుమయ్య పెంపార మఘం బొనర్పఁగఁ బ్రియంపడి దక్షిణలేమి వచ్చితిన్.

మార్క. ౩. ౮.

చ. ధృతరాష్ట్రిమానసకు దాన నపాయము లేకయుండుఁ గోప ముడిగి వీరు సేయుదురు బాంధవ మిజ్జగమం బ్రియంపడున్.

భార. ఉద్యో ౧. ౩౯.

క. ఈరూపము కడుఁ బ్రియపడి, గౌరవమునఁ దాల్చి పేర్కఁ గ్రాలెదవు .

భా. రా అర. ౨. ౩౯౮.

ద్వి. ఇట్టు మేల్కని మాడఁ బ్రియపడువారు.

పండితా. పర్వ. ౩౫౦.

ప్రియపుత్రము. సం వి. అ. పుం. పక్షి విశేషము. (విల్యమ్సు.)

ప్రియప్రాయము. సం వి. అ. న. పలుకుబడి సొంపు, వక్తృత్వము.

ప్రియభాషి. సం. విశే (స. నీ. స.) ప్రియము మాటాడువాఁడు.

ప్రియమధువు. సం. విశే. (ఉ) మద్యము ప్రియమైనవాఁడు. వి. ఉ. పుం. బలరాముఁడు.

ప్రియము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఇష్టము. ౨. ఇంపయినది, మనోజ్ఞము. ౩. ప్రేమగలది, ప్రేమించునది. ౪. హెచ్చువెలగలది. (విల్సన్.) వి. అ. పుం. ప్రియకమను మృగవిశేషము. వి. ఆ. స్త్రీ. ౧. చిట్టేలి. శ. ౨. వృత్తాంతము. ౩. మద్యము. ౪. ఒక దినుసు మల్లె శ. వి. అ. న. ౧. బుద్ధిఅనెడి ఓషధి. శ. ౨. జీవకము అనెడి ఓషధి. శ. ౩. వలపు, సౌఖ్యము. ౪. దయ, అనుగ్రహము. ౫. సంతోషము.

ప్రియవక్త. సం. విశే. (ఋ. ౘ్రీ. ఋ.) ౧. ఇంపుగా మాటాడువాఁడు, ౨. ఇచ్చకములాడువాఁడు.

ప్రియవచనము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రియములైన మాటలాడునది. వి. అ. న. ఇచ్చకపుమాట.

ప్రియవర్ణి. సం. వి. ఈ. స్త్రీ. ప్రియంగువు. శ.

ప్రియవల్లి. సం. వి. ఈ. స్త్రీ = ప్రియవర్ణి. శ.

ప్రియవాది. సం. విశే. (న్. నీ. న్.) ౧. ప్రియము మాటాడువాఁడు, ౨. ఇచ్చకమాడువాఁడు.

ప్రియవాదిక. సం. వి. ఆ. స్త్రీ. మంగళవాద్యధ్వని.

ప్రియసందేశము. సం. వి. అ. పుం. ౧. ప్రియమైన వృత్తాంతము. ౨. ప్రియమైన సంవాదము. ౩. చంపకము, సంపెంగ. శ.

ప్రియసఖము. సం. వి. అ. పుం. ఖదిరము, చండ్ర. శ.

ప్రియసాలకము. సం. వి. అ. పుం. అసనము. వేఁగిస. శ.

ప్రియాంబువు. సం. వి. ఉ. పుం. మామిడిచెట్టు.

ప్రియాపత్యము. సం. వి. అ. పుం. కంకపక్షి. రాఁబులుఁగు. (కే. ని.)

ప్రియాలము. సం. వి. అ. పుం. ౧. మోరటి. శ. ౨. అసనము. శ. వి. ఆ. స్త్రీ. ద్రాక్ష. శ.

ప్రియుఁడు. సం. వి. అ. పుం. భర్త, మగఁడు.

ప్రియుతనము. వి. ప్రియత్వము.

ఆ॥ తదుపచారములకు వొదుఁగుచు నేలమ్మ,
నాకు నిన్నితు ప్రియుతనంబు లనిరొ.

పరమ. ౫. ౩౩.

ప్రియోక్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. మంచిమాట. ఇంపయినమాట ౨. చాటువాక్యము, ఇచ్చకము.

## ప్రీ

ప్రీణనము. సం. విశే. (అ. ఈ. అ.) ప్రీతి కలిగించునది, తృప్తిఁబుట్టించునది. వి. అ. న. ౧. తృప్తిఁబుట్టించుట, తర్పణము. ౨. రక్షణము.

ప్రీణము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రీతినొందినది, తుష్టినొందినది ౨. పురాణము, ప్రాతది. ౩. పూర్వము, మునుపటిది.

ప్రీణసము. సం. వి. అ. పుం. చేఁపమిల్ల.

ప్రీణితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) తృప్తి కలిగింపఁబడినవాఁడు, సంతోషితుఁడు.

ప్రీతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. హర్షము, ఉబ్బు. ౨. ఆమోదము. సంతోషము. ౩. తృప్తి, తనివి ౪. దయ, కనికరము. ౫. ప్రేమ, వలపు. ౬. ఆసక్తి, తగులు, స్నేహము. ౭. ప్రసాదము,

కలఁకఁ జేయుట. ౭. విష్కంభాది యోగము లలో నొకటి. ౯. మన్మథుని భార్యలలో నొకతె.

ప్రీతిజుష. సం. వి. అ. స్త్రీ అనిరుద్ధుని భార్య. ఉష.

ప్రీతిదత్త. సం. విణ. (అ. ఆ. అ.) ప్రీతిచేత నియ్యఁబడినది వి. అ న. (అత్తగారిచేతఁ గాని మామగారిచేతఁగాని ప్రేమచే నియ్యఁబడినదియు, పాదవందనకాలమునం దియ్యఁబడినదియు నైన) స్త్రీ ధనము.

ప్రీతిదాయము. సం. వి అ. న ప్రీతితో నిచ్చు దానము, కానుక.

ప్రీతిదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ప్రీతిని కలిగించువాఁడు. వి. అ పుం విదూషకుఁడు.

ప్రీతుఁడు. సం. విణ. (అ ఆ అ) ప్రీతిఁ బొందినవాఁడు, ముదితుఁడు. ౨ తనిసినవాఁడు, తృప్తినొందినవాఁడు. 3 ప్రియుఁడు.



ప్రుంగుడు = పుంగుడు. వి. శ్విత్రము, తెల్ల కన్నము. (శ. ర.)

పుష్టి. సం. వి. ఇ. పుం. ౧. సూర్యు.
౨. అగ్ని. (శ. ని.)

ప్రుచ్చు = పుచ్చు. అ. క్రి పుచ్చుపట్టు, పురుగుపట్టు.

ఉ. దేవనగంబు పాఁతగిలి త్రెళ్లిన నం దొక కీడు గల్గునే యీవనజాక్షి నిట్లు పెదపాడిన నక్కట నోరు ప్రువ్వదే.

సీ. మడుపులు పనులకాల్మడిఁ బ్రుచ్చఁదొరఁగండి క్రంతలు పెనురొంపి క్రంతలయ్యె.
హరి. పూర్వ. ౩. ౫.

మ. ... వీడు పటుకోపాయత్తుఁడై యొప్పుడుం, దిరుగం బ్రువ్వదు నోరు ... భాగ. ౭. ౧౨.

ప్రువ్వఁగదిట్టు = ప్రుచ్చునట్లుతిట్టు, పడఁదిట్టు, అధికముగాఁ దిట్టు.

చ పురమిజనంబులెల్ల నినుఁ బ్రువ్వఁగఁ దిట్టఁ గవించుమన్క భార. ఉద్యో. ౨౧౦.

సీ జనులుప్రువ్వఁగఁదిట్ట నడిఁకోర్చి యార్జించెఁ బశ్యతోహరవృత్తిఁ బసిఁడిప్రోగు
పాండు. 3. ౧౦౫.

జ. ప్రుప్పి, ప్రువ్వు.

ప్రుష్వ = పుష్వ. వి. (√ప్రుచ్చు.) ౧. పుచ్చుట. (శ ర)
౨ రత్నదోష విశేషము
క. ఈ రత్నమునకుఁ బ్రుష్వియు, గారయు కర్కశమునఁగకసరులు మాఁడే, పొరువని యొల్లఁదెలియక, వారికధరియింప జగతివల దెవ్వరికిన్. రత్నపరీక్ష. ౨౭.

ప్రువ్వు=పరువు. వి (√ప్రుచ్చు) పురుగు, కీటము
క. వినుకూడుగూరపాకము, గనుగొని బ్రోయి వాపిడింపఁగా నప్పుడసం, జనితములై ప్రువ్వులు గల, గొనమిలమిలమెదలు .
భార. శాన. ౨౦.
శా. ప్రువ్వుల్ గారుచు నీచుకంపుకతుంచున్ రోఁతై. మల్లభూ. నీతి. ౯.
క. ప్రువ్వులుఁబాములు మొదలుగఁ గ్రొవ్వఁగఁ గొందఁ బరఁగిన కాతించున్.
హరి. ఉ. ౯. ౫౨.

ప్రుషితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చల్లఁబడినది. తడుపఁబడినది. ౨. సేవింపఁబడినది, 3. పూరింపఁబడినది.

ప్రుష్టము. సం. విణ. (అ. ఆ. అ.) కాల్పఁబడినది, దగ్ధము.

ప్రుష్వము. సం. వి. అ. పుం. ౧. వర్షర్తువు. ౨. జలబిందువు. విణ. (అ. ఆ. అ.) కాలినది.

ప్రుష్వుడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

# ప్రె

ప్రెక్కణము = పెక్కణము. (సం. ప్రేంఖణమ్.) వి. ౧. అభినయముతోడి నృత్యము.

గీ. ఒండుకుసులకు పెలవుశేకువిశేఁజేసి, యభ్యసించితి శైశవమాదిగాఁగ, దండలాసక విధమును గుండలియును, ప్రెక్కణంబు తెలంగుసు పేరణంబు. భార. విరా. ౧. ౨౪౦.

౨. మల్లరంగము.

వ. అనిమెత్తన యియ్యకొని గర్జించి గజాలస్యంబునం బ్రెక్కణంబుచొచ్చి భూపాలుని ముందట భుజాస్ఫాలంబుచేసి ప్రెుక్కమరలునెడ. భార. విరా. ౨. ౧౪.

(శ. ర. పా 'అంగణంబుసొచ్చి' ముద్రి. పా)

ప్రెగడ = ప్రెగ్గడ. వి. ౧. మంత్రి, అమాత్యుఁడు.

క. ప్రెగడల మనసులు విరసము, లగుగతి నదభ్రిపురాజ్య మరసి విభిన్నం,బుగఁజేసి.

భార. ఆశ్ర. ౧. ౬౦.

క. . ప్రెగడలకుం జెప్పి తీర్పు పెంపేర్పడఁగన్ .. భార. ఉద్యో. ౨. ౯౫.

సీ. ప్రెగడ ప్రెగ్గడయనఁదగుఁ బ్రధానుండు. ఆం. భా. ౨. ౧౭౩.

౨. ప్రధాన పురుషుఁడు. (శ. ర.)

ఇది కొన్ని గృహనామములకుదను గనఁబడుచున్నది.

ఉదా. తల్లాప్రెగడ, రెబ్బాప్రెగడ మొ.

ప్రెగ్గడ = ప్రగడ. ప్రగ్గడ, ప్రెగడ, ప్రెవడ. వి. (పెను+కడ.) ౧. అమాత్యుఁడు, మంత్రి.

చ. పిఱికివిగాక నీపుడొక ప్రెగ్గడ పేరఁగలుండుభంగి .. ఉ. హరి. ౪. ౧౭౯.

చ. అనవుడు నిట్లనున్ విదురుఁడక్కట ధర్మసుతుండు బాంధవుం,డును తెలిశాఁడునుందగు భటుండును బ్రెగ్గడయున్ గురుండుఁగాఁ,డె నృపవరేణ్యనీకు ...

భార. ఉద్యో ౨. ౨౪. దశకు. ౧౧. ౫౫. ఆం. భా. ౨. ౧౭౩.

౨. ప్రధాన పురుషుఁడు. (శ. ర.)

జ ప్రెగ్గడసాని.

ప్రెగ్గడసాని. వి. (ప్రెగ్గడ + సాని.) మంత్రి భార్య.

సీ. ప్రెగ్గడసాని నా వెలయుమంత్రి. గీ. భార్య ఆం భా. ౨. ౧౦౬.

ప్రెబ్బొత్తి. విశ (పేరు[1] + బొత్తి.) పెద్ద గుంపుగానున్నది.

(కి్రి. విశ. నిశ్చయముగా అని శ. ర.)

ద్వి. ప్రెబ్బొత్తి పెయ్యలపెద్ద రొక్కరుఁడు బసవ. పు. ౫. ౧౩౧. పొ. ౭౯. మం.

(తల్లాణ. ౫. అని శ. ర.)

(ప్రాతప్రతి ప్రా, ప్రెబ్బొంత క్రొత్తప్రతి పా.) ౫. ౪౫౭. మం.

ప్రెవడ = ప్రెగడ. (శ. ర.)

# ప్రే

ప్రేంకడము = ప్రేంకణము[1].

సీ. ... ప్రేంకడ మడఁగను బ్రేంకణ మడఁచోఁచుఁ బ్రియుంగువు. ఆం. భా. ౨. ౪౯.

గీ. అంబుజాసన రొుక్కిశి గానంబు సేయఁ,గడువికాసంబు నొంది ప్రేంకడపుఁడరుల్, మతి రొుసంగ నమీన్రకూట విసర, మిసమిసల సంతానకానమూలము. దశ. ౯. ౯౫.

విషయముయొక్క శుభాశుభముల పర్యాలోచనము. ౭. చెట్టుకొమ్మ ౯. బుద్ధి. (శ. ర.)

ప్రేక్షకుఁడు. సం. వి. అ పుం. చూచువాఁడు, చూపరి.

ప్రేక్షణకూటము. సం. వి. అ. న. కనుగ్రుడ్డు, నేత్రగోళము. (కల్ప)

ప్రేక్షణము. సం. వి. అ. న. ౧. చూచుట, చూపు. ౨. తోఁపిక, ఆకారస్ఫూర్తి ౩. కన్ను. ౪. జనసంబంధియగు నాటకాది ప్రదర్శనము. ౫. జనసామాన్యమగు ప్రదర్శనములు జరుగుచోటు. ౬. ప్రత్యేక్షణము.

ప్రేక్షణిక. సం. వి. ఆ. స్త్రీ. నాటకాది ప్రదర్శనములు చూచుటయం దాసగల స్త్రీ.

ప్రేక్షణికుఁడు. సం. వి అ. పుం. ప్రేక్షకుఁడు.

ప్రేక్షణీయము. సం. విణ (అ. ఆ. అ) ౧. చూడఁబడునది. ౨. చూడఁదగినది, దర్శనీయము, చూచుటకు సొబగైనది. ౩. ఆలోచింపఁ దగినది, విచారింపఁ దగినది.

ప్రేక్షాకారి. సం. విణ. (న. నీ. న.) ఆలోచించిచేయువాఁడు.

ప్రేక్షాగారము. సం. వి. అ. న. ౧. రాజుల యొక్క మంత్రాలోచనార్థ మగుగృహము. ౨. నాటకరంగము.

ప్రేక్షావంతుఁడు సం. విణ. (త్. తీ. త్.) సమీక్ష్యకారి, ఫలాఫలములను ముందుగా నాలోచించిచేయువాఁడు.

ప్రేక్షి. సం. విణ. (న. నీ. న.) ౧. చూచువాఁడు. ౨. నిపుణముగాఁ బరిశీలించువాఁడు.

ప్రేక్షితము. సం. విణ. (అ. ఆ. అ.) చూడఁబడినది, దృష్టము. వి. అ. న. చూపు.

ప్రేక్ష్యము. సం. విణ. అ. ప్రేక్షణీయము.

ప్రేగు(వు) = పేగు, అంత్రము.

సీ. . ప్రేగ గన నాంత్రంబు పెలఁగుచు ...
ఆం. భా. ౨. ౧౩౩.

గీ. చెలఁగ యీటాము లనుభవించినముగాని తెలి
యదె ప్రేగులోతలిటీటు వంటి . .
ఉషల. ౩. ౯౯.

సీ. రుధిరార్ద్రశరములు రుచిరప్రకాశములౌ
ప్రేవులపోవులు ఫేనతతులు.
భార. ద్రో. ౨. ౧౨౦.

చ. పిరిగొని దాల్పు పెట్టెముగఁ బ్రేవులు
చుట్టి ... ఉ. హరి. ౨. ౧౨౪.

ప్రేచు. ప్రేరచు, ప్రోత్సహించు. (శ. ర.)

ప్రేతకృత్యము. సం. వి. అ. న. చచ్చిన వానికై చేయు చరమక్రియ.

ప్రేతగతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మృతుఁడు.

ప్రేతగృహము. సం. వి. అ. న. శ్మశానము. వల్లకాడు

ప్రేతగోపుఁడు. సం. వి. అ. పుం. శ్మశానముఁ గావలివాఁడు

ప్రేతనది. సం. వి. ఈ. స్త్రీ. వైతరణి.

ప్రేతనరుఁడు. సం. వి. అ. పుం. పిశాచము, భూతము.

ప్రేతపక్షము. సం. వి. అ. పుం. భాద్రపదకృష్ణపక్షము, పితృపక్షము.

ప్రేతపతి. సం. వి. ఇ. పుం. యముఁడు.

ప్రేతపురము. సం. వి. అ. న. యమపురము, సంయమని.

ప్రేతభావము. సం. వి. అ. పుం. మరణము.

ప్రేతభూమి. సం. వి. ఇ. స్త్రీ. శ్మశానము, ఒలికిమిట్ట.

ప్రేతము. సం. విణ. (అ. ఆ. అ.) మృతము, చచ్చినది, పీనుఁగు. వి. అ. పుం. ౧. నరకమం దుండు జీవభేదము. ౨. పిశాచభేదము.

ప్రేతమేధము. సం. వి. అ. పుం. పితరునుద్దేశించి చేయు శ్రాద్ధరూపమగు యజ్ఞము.

ప్రేతరాక్షసి. సం. వి. ఈ. స్త్రీ. తులసి. శ్రీ.

ప్రేతరాట్. సం. వి. అ. పుం. యముఁడు.

ప్రేతవనము. సం వి. అ. న. వల్లకాడు, ఒలికిమిట్ట, శ్మశానము. (ఇట్లే ప్రేతకావము మొ.)

ప్రేతవాహితుఁడు. సం. విణ. (అ. అ. అ.) పిశాచము పట్టినవాఁడు, భూతావిష్టుఁడు. (త్రి. వి.)

ప్రేతశరీరము. సం. వి. అ. పుం. చచ్చి యమాదిలోకములకుఁ బోవుజీవుని శరీరవిశేషము, యాతనా శరీరము

ప్రేతహారుఁడు. సం. వి. అ. పుం. ౧. పీనుఁగును మోచికొని పోవువాఁడు, శవవాహకుఁడు. ౨. దగ్గతిచుట్టము.

ప్రేతాధిపుఁడు. సం. వి. అ. పుం. యముఁడు.

ప్రేతావాసము. సం. వి. అ. పుం. శ్మశానము, ఒలికిమిట్ట.

ప్రేతాస్థిధారి. సం. వి. న్. పుం. శివుఁడు.

ప్రేతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. మరణము ౨. పోక, పరుగు, పలాయనము. వి. ఇ. పుం. అన్నము.

ప్రేతికము. సం. వి అ. పుం పిశాచము, భూతము.

ప్రేతేశుఁడు. సం. వి. అ. పుం. యముఁడు.

ప్రేతోద్దేశము. సం. వి. అ. పుం. పితరుల నుద్దేశించిచేయు తర్పణాది.

ప్రేత్యభాక్కు. సం. విణ. (జ్.) మీఁదటిలోకమందుఁ గర్మఫలముల ననుభవించువాఁడు.

ప్రేత్యభావము. సం. వి. అ. పుం. మరణించిన పిదపఁ గలుగు పునర్జన్మము మరణమునకుఁ బిదప ఆత్మకుఁగలుగు భావము. (ఆ. వి.)

ప్రేత్వుఁడు. సం. వి. న్. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. వాయువు

ప్రేపు[1] = రేపు. వి. ఉషఃకాలము, వేకువ.

ఉ. ప్రేపులు రేఁబవళ్ళును చెప్ప ...
నృసిం. ౧. ౩౨.

ప్రేపు[2]. వి. పరంపర, వరుస.

గీ. కదఁగి వీని, పేపుతూపెదఁ దూపుల
ప్రేపు తెగయ ..
భా. రా. యు. ౧౫౬౧.

ప్రేషు. సం. వి ఆ స్త్రీ. ౧ ప్రాపించుటకు నిచ్ఛపొందుతలంపు. ౨. ఇచ్ఛ ౩. ఊహ, సంభావన. (విల్యమ్సు.)

ప్రేప్సువు. సం. విణ. (ఉ.) ప్రాపింప నిచ్ఛగించువాఁడు. ౨ ఇచ్ఛగించువాఁడు. ౩ ఊహించువాఁడు.

ప్రేమ(ము). సం. వి. న్ పుం. న. ౧. సౌహార్దము, చెలిమికాడి, మక్కువ. ౨. సౌయ్యాను, స్నేహము. ౩. హర్షము, ఉబ్బు. పుం. ౧. వేడుక, పరిహాసము, పరియాచకము. ౨. గాలి. (పే. వి.)

ప్రేమపాతనము. సం. వి. అ. న. (ఆనందము వలని) కన్నీరు. ౨. (దానినిగార్చు) కన్ను.

ప్రేమబంధము. సం. వి. అ. పుం. గాఢాను రాగము.

ప్రేమి. సం. విణ. (స. పుం. క.) ప్రేమ గల వాఁడు.

ప్రేము = పేము. వి. (శ. పీరంబు. దీనికి వృత్తి యుండదు ప్రేఁప అనురూపము కలుగును.)

౧. పేత్రవల్లి, బెత్తపుఁదీఁగ. శ్రీ.

క. ఇది ప్రేఁపయని ప్రమథులు, ప్రియముగ దలిర్చ దీకఁ గోలలు, గుదియలు గైకొంద్రు. హరి. ఉ. ౬. ౧౪.

మ. ... భీరలాగారల కేములఁ ప్రేముల .. వి. శకుం. ౨. ౧౪.

సీ. పులి కటంబునిఁ ప్రేఁపపాదనుండి మూని పుంగవుమీఁద నుతికిన వరాహ. ౫. ౭౦.

౨. నేత్రము, బెత్తము.

సీ. లవణంబు నింబపల్లవముఁ ద్రిప్పెడువారు ప్రేము మంచంబులోఁ బెనుచువారు. శివరా. ౨౪౦.

క. అనుటయు రసలింగమునిదు తనవర్తుల ప్రేఁప సజ్జదంతపు బిరణిక్. మనుచ. ౧. ౪౭.

ప్రేముఁడు. సం. వి. క. పుం. వాసవుఁడు, ఇంద్రుఁడు. (పే. వి.)

ప్రేముడి. వి. (ప్రేమ+ముడి = ప్రేమబంధము.)

౧. వాత్సల్యము, పిన్నలయెడ పెద్దలకుండెడి ప్రేమ. (స్నేహము అని శ. ర.)

క. నాకోటి ప్రేముడిం గదు, నాకుర రై యుండుడు చూచుచుంటిని ... భార. విరా. ౪. ౭౧.

ఉ. ... పెంచిన తల్లిదండ్రులకుఁ ప్రేముడి నా యుదఁ బాయకుండు ... విక్ర. ౫. ౧౦౬.

౨. అనురాగము, ప్రణయము.

మ. .. (చంద్రసూర్యుల) కళత్రంబు లగు ఛాయామాధాయలచేతఁ ప్రేముడిం బొదుపం బడినయట్లు ... ఆము. ౬. ౯౭.

శా. ... త్యాగమున మూర్తిన్ గోరుచుం ప్రేముడిన్.

ఉ. రా. ౭ ౧౨౫. ఆం. భా. ౧. ౧౩౬.

జ : ప్రేముడించు.

ప్రేముడించు. అ. క్రి. (√ప్రేముడి.)

౧ ప్రియపడు.

చ. చవులకుఁ ప్రేముడించు పనికంబును నాలుక. భార అర. ౬. ౧౨౩.

౨. అనురాగమొందు.

చ. మనసిజాకృతికో లజ్జిఁగి మానిని నీదనఁ, ప్రేముడించుట . దశకు ౧౦. ౧౨౨.

౩. శోకించు, దుఃఖించు.

గీ. భీమనందనుచావునఁ ప్రేముడించి, ధర్మతన యుండు బాష్పంబుధార లదర భార. ద్రో. ౫ ౨౫౪.

గీ పతుల నన్నలఁ దమ్ముల సుతుల హితులఁ, జేయకొని వారు లెందంగఁ ప్రేముడించి, పసవుపలుకులు వినువారి మనటఁ దేల్పఁ, గురుకుమార కాంతలకోటి వచ్చె. భార. స్త్రీ. ౧. ౯౭.

౪. బాధపడు.

గీ. చావు తథ్యంబు మనకు విచార మేల, పెక్కుదివసంబు లోఁకటఁ ప్రేముడించు, పా. పంచ. ౧. ౩౭౪. (శ. ర. పా. పెల్లు కుడుచు, ముద్రి. పా.)

ప్రోయ్య = ప్రోయి. వి. అధిశ్రయణి.

క. శోకంబు ప్రబలు జిహ్వల, శోకంబుల యజ్ఞ్యెఁ బ్రోయ్య పొగయమివృష్టిన్.
ఆము. ౪. ౧౨౬.

జ: ప్రోయ్యడు.

ప్రోయ్యడు. స క్రి. (√ప్రోయ్య.) పోయిలోఁ బెట్టు.

గీ. పతియవాపఁగిఁ దునియఁగా విఱువఁబలయు, కొదలఁ గాళ్లలఁ జేతుల దోడలఁ బట్టి, కడఁగి యనువుగఁజేసి ప్రోయ్యదుడుఁగాని, కర్తి గొడ్డలియడుగఁజేఁ గట్టియలకు.
భార. విరా. ౧. ౪౯.

ప్రోల్ల. వి. తృణవిశేషము. ?.

చ. పెనుతురు ప్రోల్లబూదియును వీదలిపిచ్చుక బియ్య మెంద్రయున్. . మొదలుగాఁబూది రచింప ..
ప్రబంధ. ౨౦౬.

ప్రో

ప్రోంఛనము. సం. వి అ న ౧ తుడిచి వైచుట. ౨. మార్జనము, కడుగుట. 3. మళ్ల యందు మిగిలిన ధాన్యము మొ వానిని ఏరుకొనుట.

ప్రోంరము. సం. వి. అ. పుం. పశద్గ్రిహము, తమ్మపడిగము.

ప్రోఁగు¹ = పోఁగు. వి. ౧. తంతువు, దారము.

(శ. ర) ౨. పోఁగుత్రాడు, వేఁటలో తెం కట్టుటకై పైనికట్టెడు పెద్దత్రాడు.

క. వెలువడిరి వీటివలుది, కుక్కలఁ గుక్కలు ప్రోఁగు లురులు కొమ్ములు బద్ధంగులు పంది పోటు లమ్ములు, వలలు తెరలు దీమములు చివంగులజోడులన్. వరాహ. ౪. ౪౧.

జ: ప్రోఁగుత్రాడు, ప్రోఁగుచుట్టు, ప్రోఁగు వాఱించు, ప్రోఁగువాఱు.

ప్రోఁగు². వి. ౧. కర్ణాభరణము, కుండలము.

సీ. లాఁగదాఁగుడుతాఁగ ప్రోఁగు లిడదుప్రోఁక కోలలు దోసంగులు దోలఁచుకొటి.
అచ్చరా. బాల. ౭.

శా. ప్రబ్బుంజాయలగేలుగంట్లు చెలిదాఁరం జాలింక కప్రోఁగులు ...
రా. వి. ౨. ౬౦.

సీ. ...ప్రోఁగవఁ గర్ణకేవ్లవఘంజ్షద్యుతులయు...
అం. భా. ౨. ౧౪౭.

౨. అకు, దళము.

సీ లలితంపుఁదులసిప్రోఁగులు ప్రంది కోటిలో పైఁచికొంచుఁ దురీవ వచ్చువారు.
కువల ౨. ౧౪౩.

ప్రోఁగుఁద్రాడు. వి. (√ప్రోఁగు¹.) వేఁటలో తెరకట్టుటకై పైనికట్టెడు త్రాడు.

క కొండలలోఁ జేసిన తమ, పండినచేలకు వరాహపంక్తులు చేరరా, కుందన్ల వల్లవి చామర, ఖండంబులు ప్రోఁగుఁద్రాళ్లఁగట్టుదు రెలుకల్
కాశీ. 3. ౯.

సీ. పిడుకకుంపటు లాకుతేడికలు ప్రోఁగుఁద్రాళ్వాడిగొడ్డంగ్లు మవ్వంపుటురులు.
శుక. ౧. ౧౬౬.

క ఉద్దివిడిఁ గవియుకుక్కలు, గద్దతివిన్వంగులిర్లు గడు చేచినమే, శద్దులు కొండలఁగ వేఁటకు, దిద్దినయవి ప్రోఁగుఁద్రాళ్లుఁ దెరచీరగముల్.
యయా ౧ ౧౧౧.

(ప్రోఁగుఁద్రాడు. శ. ర పా.)

ప్రోఁగుచొట్టు. వి. (√ప్రోఁగు.) వేఁటాడు సాధనము.

చ. తలముడు లర్లు బోనులు తెరల్ [illegible] గిటెలు ప్రోఁగుచుట్టలున్, బిలు[illegible] చిల్ల

కోలలు విచిత్రగదాధనురాదిసాధనం,బులు దవరంగ ... ఇందు. ౨. ౫౭.

వ. ... తెరచీరకట్టలు ప్రోఁగుచుట్టలు దొడ్డి వల లేటివల కుందేటివల పందివల ... మొదలుగా వలయు వలలును . కాశీ. 3. ౪౬.

ప్రోఁగువాఱించే = ప్రోఁగువాఱు.

వ. . భుజం బప్పళించి మృగయావర్గంబునుం దానును నిరర్గళప్రచారంబుల డాయ నేఁగి ప్రోఁగువాఱించి (పి శ ఖం ౨.౧౪.)

వ ... వింధ్యవసుంధరాధరపరిసరారణ్యంబు దరిసిమృగంబులు మెలంగుప ట్లరసి మల్లు తారు వేయించి ప్రోఁగువాఱించి వలలును దెరలు నెత్తించి బోనులు దీమంబులు నొడ్డించి హరిశ్చ ౨ ౧౫.

ప్రోఁగువాఱు = పోఁగువాఱు. స క్రి. (ప్రోఁగు[1] + పాఱు) పోఁగుగ్రాడు పఱపు, ప్రోఁగుత్రాడు వ్యాపింపఁజేయు.

మ పటుతారాపటఖండమండిత నిజప్రాగంశుధారాపరిస్ఫుటసూత్రంబులఁ బ్రోఁగువాఱి వెస సంభోవాహమార్గాఖ్యనూ, నటవిం సు. ౪ ౧౯.

గీ . బోను లమరించి యెర లెత్తి ప్రోఁగువాఱి, చుట్టుపట్టుల మెకములఁ బోపు పెట్టు. గౌ ద్వి. 3 ౫౭.

ప్రోఁజే = పోఁజే. స క్రి నలుసులు లేకుండ శుభ్రపఱచు.

ఉ. ప్రత్తినిఁ బ్రోఁజుమన్ వడికి బ్రాహ్మణుఁ డిచ్చు పవిత్రతంతువుల్, . మైనతోరము శుభోన్నతి హా స్తమునన్ ధరింపుచున్ ఉ. హరిశ్చ. ౪. ౪౦.

ప్రోక = ప్రోఁగు. వి. (సం. పూగః) సమూహము, రాశి.

చ. కమలవనంబు చేవినయగణ్యతపంబు ఫలంబు చక్రయుగ్మములముదంబుప్రోక. ... ఒప్పె సఁగ జాపరసప్రియబింబ ము త్తితిన్. . . నిర్వ. ౬. ౭౭.

ఉ. అంబిక కంచుఁ దెచ్చినమహోమణిసంఘము ప్రోకపోసి ... కాశీ. ౬. ౧౬౪.

క. ఆఁకరముతోడ వప్పెను,మూఁకలపై కుతుక ... కీసుఁగు,ప్రోకలు గావించి రపుడు కొద వడకవడిన్. భా. రా. యు. ౫3౪.

(ఇచట సానుస్వారనిరనుస్వార ప్రాసము.)

౨. స్థానము; నివాసస్థానము.

ఉత్సాహ. పారయఁ జెప్పఁ దృప్తిపగలప్రోక యైనయట్టిదు, స్తరపుటునిక్కి కొల్లఁబోటుఁ దన్కుఁడించుకొనియున్.

భార. స్త్రీ. ౧. ౪౭.

గీ. పుణ్యకులశీలమహిమలప్రోక యనఁగ,నిష్కళంకపాతివ్రత్యనిధి యనంగ,వెలయునంద్యాల నారభూవిభునిదేవి కళా. ౧. ౬౧.

ఉ .. ఆ,వన్నెలప్రోక యాదలను వావిరి బలైకము త్తియంపుఁబ్రాలెన్నఁడునింతు నీలా. ౧. ౧౦౨.

జ. ప్రోకలుగట్టు, ప్రోకలుగొను.

ప్రోకలుగట్టు. అ. క్రి (√ప్రోక) గుంపుకట్టు, సంఘీభవించు.

ఉ. తిమ్మనీ, కేఁకట వోవఁ గ్రోలి దరి నిమ్మగుచెట్టులనీడ నుండఁగాఁ, బ్రోకలు గట్టి వారిఖగముల్ కేయూర, 3. ౭౪.

(సానుస్వారనిరనుస్వారప్రాసము.)

ప్రోకలుగొను. అ. క్రి (√ప్రోక) గుంపులగు, సంఘీభవించు.

క. కోకనదంబులు మొగుడం, గోకంబులు విరిసి దిశలకుం జన మొఱఁగై, ప్రోకలు గొని మౌక్తికనిక,రాకర మనఁ దారలెసగఁ నంబరవీథిన్. కు. సం. ౭. ౯౪.

ప్రోక్షణము. సం. వి. అ. న. ౧. (నీళ్లు) చిలుకరించుట, చల్లుట, సేచనము. ౨. యజ్ఞమునందు పశువును వధించుట. ౩. వధము.

వి. ఇ., ఈ స్త్రీ. ౧. ప్రోక్షించుటకైన జలము. ౨. అట్టిజలమున కాధారమగు పాత్రము.

ప్రోక్షణీయము. సం. విశే. (అ ఆ అ.) ప్రోక్షింపఁదగినది - వి అ. న. ప్రోక్షించుటకైన జలము

ప్రోక్షించు. సం స క్రి (యజ్ఞమునందు) పశువును వధించు, వధించు

వ. ఆకర్ణింపు మధ్వర్యుండు పశువుం బ్రోక్షింపు చుండ యతి నిరీక్షించి యిది హింస గాదే యనిన నతండు. భార. అశ్వ ౨ ౬౧.

మ భుజయూపంబున గోవృషాఖ్యపశువుం బ్రోక్షించి సంక్రాంతి యాగ యజనంబున్. హరి పూ ౭ ౧౩౩

౨. చల్లు, (నీళ్లు) చిలుకరించు.

క. అని నిశ్చయించి హంసంబున జలములు పూని తల్లి పాప్మని ప్రోక్షించిన వరాహ ౧౦ ౮౦

ప్రోక్షితము. సం విశే. (అ ఆ. అ) ౧. చిలుకరింపఁబడినది ౨. (యజ్ఞమునందు) వధింపఁబడినది. ౩. యజ్ఞమునందు మంత్రాదులచే సంస్కరింపఁబడినది (కల్ప.)

ప్రోగు = ప్రోవు, పోగు. వి. (సం. పూగః.) సమూహము, గుంపు.

చ. చలువలరచ్చపట్టు జలజంబులతుట్టు విరాళికల్కిప్రోగుల కనుకట్టు జక్కవలగొట్టు .. రా వి. ౫ ౮.

చూ: ప్రోపడు[1], ప్రోపెట్టు.

ప్రోచికోలు. (√ప్రోచు.) (బలహీనత్వము నొందిన గవాదికము) కాపాడి యనుభవించుకొనుట.

ఉదా. వానికి ఆయావును ప్రోచికోలుగా నిచ్చినాఁడు. (శ. ర.)

విశే. వ్యర్థము.

ఉదా. గడ్డిపోచయు ప్రోచికోలు కాదనఁగా మనుష్యునిఁ జెప్పనేల. (శ. ర - వా. పోచికోలు.)

ప్రోచిల్లు = పోచిల్లు. వి. బ. శకునము చూచుటకై ఇరుగుపొరుగుఇండ్లమీఁద అక్షతలు నీళ్లు చల్లుట. (శ ర.) శకునము చూచుటకై ఇరుగుపొరుగిండ్లమీఁదఁ జల్లెడు అక్షతలునీళ్లు

ప్రోచు. స. క్రి (సం. పుష్) ౧ (అన్నపానాదులచే) పోషించు, పెంచు, రక్షించు, పాలించు.

క. అనమా నీప్రస్తావమున, నని నీల్గినవీరభటుల యనుపోష్యుల నెల్లను బ్రోతే. భార. సభా ౧ ౩౯

శా. భూవిస్తారము నాక్రమించి ప్రజలంబ్రోవంగ దండింపనుం, గావ న్నేర్చి మఖక్రియల్ నడపె. (భార. శాం ౧. ౧౮౧.)

ఉ. మమ్ము వందఱం, బ్రోవుము బాంధవాప్తజనపోషణకాంక్షను ధర్మ మున్నదే. ఆము. ౩. ౫౬.

క. శారద సత్రములఁ బ్రోచు జన్నయసిద్ధున్. విక్ర. ౧. ౭.

సీ. అఁ నవారాతి యమరులఁ బ్రోవంగఁ బూని యాయదువంశమున జనించి .. పారి. ౧ ౩౬.

౨. పెంచు, వృద్ధిచేయు.

ఉ. భావములోనికిలుపరిపాటిఁ బరిస్ఫుటతావిలాసమున్, బ్రోవఁగ నేర్కతో నిమః భూపతికై యొదయాదుదృష్టి ల,జ్ఞావతి యొట్టకేల శాకచందమునన్ మగిడించి. నైష. ౫. ౧౮౪.

శా. ఆకర్షించిన దేవభర్తయు జగం బాశ్చర్య పూర్ణంబు లుద్రేకింపం దనుఁ జూడ [illegible]

రేండ్లు మొదలుకొని ౫౫ ఏండ్లవరకుఁగల వయస్సుగలది. వాచ)

ప్రోఢి. సం. వి. ఇ. స్త్రీ. = ప్రౌఢి.

ప్రోతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ కుట్టఁబడినది ౨. నిడివిగాఁగాని నిలువుగాఁగాని చాఁపఁబడినది. (వ్యతి ఓతము.) ౩. బద్ధము, కట్టఁబడినది. ౪. గ్రుచ్చఁబడినది ౫ ఊఁటబడినది చొరఁబడినది. ౬ కూర్పఁబడినది, సంధింపఁబడినది వి. అ న ౧. వస్త్రము, నేతవస్త్రము. ౨ కుట్టుట.

ప్రోతోత్సాదనము. సం. వి అ న. ౧ గొడుగు ౨ వస్త్రకుట్టిమము, పటకుటీగము, డేరా.

ప్రోత్కృష్టము. సం. వి ౯. న. మిక్కిలి గిట్టి బ్రోఁత

ప్రోత్ఫలము. సం వి. అ పుం. సింగపుతోఁక వంటి పువ్వులుగల యొకానొక చెట్టు.

ప్రోత్ఫుల్లము. సం విణ. (అ. ఆ అ) చక్కఁగా విరిసినది.

ప్రోత్సారితము. సం. విణ (అ ఆ అ) ౧. తొలఁగింపఁబడినది ౨ పురికొల్పఁబడినది, ప్రేరితము. ౩. దిగవిడువఁబడినది, పరిత్యక్తము ౪. ఇయ్యఁబడినది, దత్తము. (విల్యమ్సు.)

ప్రోత్సాహకుఁడు. సం. విణ. (అ ఈ. అ.) ఉత్సాహపెట్టువాఁడు.

ప్రోత్సాహనము. సం. వి. అ. న. ౧. మిక్కిలి ఉత్సాహపెట్టుట, పురికొలుపుట. ౨. ఒకానొక నాట్యాలంకారభేదము. (పా. ద.)

ప్రోత్సాహము. సం. వి. అ. పుం. మిక్కిలి ఉత్సాహము.

ప్రోథము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రసిద్ధము. ౨. స్థాపితము, ౩. పయనమునుండునది. ౪. ప్రియము. - వి. అ. పుం., న. ౧. గుఱ్ఱపుముట్టె, అశ్వనాసిక. పుం. ౧. పిఱుదు. ౨. జీర్ణవస్త్రము. ౩. గర్భపిండము. ౪. భయము, దిగులు ౫. గర్తము, గోయి ౬. పిఱుదుల యందలి గుంట

ప్రోథి. సం వి ఇ. పుం. గుఱ్ఱము.

ప్రోదిి. వి. (సం వృద్ధిః ?) ౧. పోషణము, పెంచుట

గీ మధుపలాలస యంతఁ గ్రమంబుతోడఁ, దల్లిదండ్రులప్రోదిని దరుణి యగుచు, ...
కళా. ౫. ౩౬.

౨ అతిశయము, ఆధిక్యము, వృద్ధి, పెంపు.

సీ. తనకూటములఁ బ్రోదిఁ దాల్చు రంభాదులు సరసభావము దప్పి కిఁము వంప.
వసు ౨. ౧౧౩

సీ. అంగదమణిదీపు లలమి యొప్పగు తన భూజములకాంతికిఁ బ్రోది సేయ
హరి. ఉ. ౬. ౫౯.

౩ ఒప్పు, శోభ

మ తదీయనిర్ఝరసమీరాందోళితైలానుగం, ధినికుంజాంతినవేందుకాంతమణిపీఠిం బ్రోదిమై విశ్రమించిన . (వసు. ౨. ౧౩.)

౪ వైభవము, సంపద

క. ఆదట నేనుఁగు డిగి .. ముత్తైదువలారతులిఁగాఁ బ్రోదిన్ దననగరు వొచ్చెఁబూనిక మెఱయన్. (యయా. ౪. ౧౬౧.)

ఉ. అన్నగరంబు ప్రోదిఁ దనరారఁగఁ దమ్ములఁ గన్నతల్లిని . (రాఘవ. ౨. ౪౫.)

౫. ఉత్సాహము, పూనిక.

క. . . స్వామికార్యము సేయం, బ్రోది గల వారు నిరసి, పాదంబులకె దిక్కనరాక పరమార్థముగన్. (సా. పంచ. ౧. ౩౯౬.)

విణ. ౧. పొదియుండునది, పరాశరము,

సీ. పుష్పవర్ణ ములకుఁ బ్రోది యై వినువీథి దేవ
దుందుభినాద మావహిల్ల. (హర ౬. ౪౪)

౨. పెద్దది, గొప్పది
చ. పతి మతిలేని కోడిగపు బాఁపని నీ వొకప్రోది
చేసి పేర్కొని విప్ర ౨. ౭౩.

క. . త న్నెంతయుఁ బ్రోది సేయఁ దగని
ట్లనియెన్. (వి పు. ౧ ౨౮)

౩. అతిశయింపఁజేయునది, పోషకము
వ. పాదలుమవసోన్మాదంబునకుం బ్రోది
గాశామోదంబునం గాదంబరి గండూషించి
మను చ ౩ ౨౭.

౪. పెంచఁబడినది, సాఁకఁబడినది
వ. పోషితరాజకీరంబులు నేయఁబ్రోదికోయి
లలు మంగళగానంబొనర్ప
సై. ౧ ౬౫

ఉ. కోమలి ప్రోదిరాచిలుకకున్ ఫల మర్మిలి
నందియియ్య మే, కోమని దయ్యెన
య్యేడ రామా. ౩. ౬౪.

గీ. అందియలమొరపంబున నరుగుదెంచి, ప్రోది
రాయంచ రయమునఁ బోవునవ్విధంబున.
భార. విరా. ౪. ౨౯.

జ: ప్రోదిగొను, ప్రోదిపట్టు, ప్రోదియొనర్చు,
ప్రోదివెట్టు, ప్రోదిసేయు.

ప్రోదిగొను. స. క్రి. (√ప్రోది.) పోషించు,
రక్షించు.

మ. అపుడు కెండాడి విపత్పవృత్తముల కొర్వ్య
గ్నిచ్ఛటం బేర్చి క్రవ్యసరత్సరములన్
రజోర్ద్విరలముల్ సంతప్తమ్మం జేసి నై,ర్వ
సృగార్ద్రిం బొసరించి ప్రోదిగొన నుద్య
త్కృత్రిసత్యాఘము,శ్యాస పిద్ధించు చెయుంచుఁ
బలుక్రి వరపార్శ్వబాధులయోధావకున్.
వరహ. ౩. ౧౭.

క. ప్రోదిఁగొనఁదగినఫుష్పఫలాదులు గొడ్డంట
వచ్చి ... కవిక. ౨. ౧౪.

ప్రోదిపట్టు. వి. (√ప్రోది.) పోషణస్థానము.
సీ. పున్నమవెన్నెలప్రోదిప ట్టిది యని కాంతం
బులగుశశికాంతరుచులు,
కు. సం. ౩. ౨౭౧.

ప్రోదియొనర్చు. స.క్రి (√ప్రోది.) సంరక్షించు.
పాలించు.
ఉ. వసుమతీసురివంశవతంస మెల్లవారు
న్వినుతింపఁ బెంపెసఁగుఁ బ్రోదియొనర్చుచుఁ
దల్లిఁ దండ్రి నెం,దు న్విధిధానుగూపతను
దోహదభోజనపూజనాదులన్
పాండు. ౨ ౧౨.
చ ... కుంచెల,నెన్నగపినమాయలౌఘములు నిర్భర
సౌరభసంప్రదాయ మిం,పుగినధివాస ధూప
ములఁ బ్రోది యొనర్చుచు నిచ్చ నర్చనన్.
సైమ. ౪. ౧౩౨.
తరళ సరళివైఖరి ముఖ్యగంబులఁ జాలఁబ్రోది
యొనర్పఁగాఁ,గరళకంధరు డున్నవాఁడు...
దశా. ౨ ౬౫.

ప్రోదివెట్టు. స. క్రి (√ప్రోది) పోషించు.
సీ. క్రొవ్వారుకెందమ్మికోలఁకునఁ బ్రొద్దు వఁ
బొలసినవలపులఁ బ్రోదివెట్టి.
భాగ. ౭. ౨౬౬.
సీ. రమణీయమందిరారామదేశంబులఁ బువ్వుఁ
దీఁగెలకును బ్రోదివెట్టు.
భాగ. ౧౦. పూ. ౧౬౭౭.

ప్రోదిసేయు. స. క్రి. (√ప్రోది) ౧. పోషించు,
పెంచు.
వ. కాఁచు కొక్కెర చింద లాదిగాఁగలపాది
కేఁటకుం బ్రోదిచేసిన పతంగంబులును ...
కాశీ. ౩. ౪౬.
౨. సంరక్షించు, పాలించు.

క. ... పొత్తులలోన నుంచి కూరిమి, చెలఁ
గఁగ వావాటఁ బ్రోదిసేయుచుఁ బెనుపన్.
చంద్ర. ౧ ౧౦౩.

క....జగ మెల్లం బ్రోదిసేయఁజాలెడు నీకున్.
అచ్చ. రా అర. ౧౦౪.

౩. అతిశయింపఁజేయు, అధికముచేయు

వ. గహ్వరంబులనుండి బ్రామ్యసింహ నాదంబులం బ్రోదిసేయు తరంగతురంగ గళగళారావంబు నొండొండ రోదసీకుహరంబులు నిండ. కాశీ. ౧. ౧౮౨.

గీ ఆతనంబునఁ దిరుగు సైరావణంబు, స్వాదుఫలరసగంధంబు స్వప్రభాప్రభూతదానంబు గంధంబు ప్రోదిసేయు
వరాహ. ౧౦ ౧౨౭.

ప్రోద్ఘుష్టము. సం విశే. (అ ఆ. అ) ౧ ప్రతిధ్వనించునది. ౨ పెద్దధ్వనిచేయునది.

ప్రోద్ఘోషణ. సం. వి ఆ స్త్రీ ౧ చాటుట ౨ బిగ్గరగ శబ్దించుట

ప్రోద్ఘోషణము. సం. వి అ న. = ప్రోద్ఘోషణ.

ప్రోద్యతము. సం. విశే. (అ ఆ అ) ౧ లేపఁబడినది ౨. చుఱుకైనది, పనిపడిగలది

ప్రోపడు¹. అ. క్రి. (ప్రోగు + పడు) రాశియగు, కలిసిపోవు.

ఉ. రక్కసుతోడ రక్కసును, బ్రోపడ వ్రేయుచుం గపులు పోరుచునుండఁగ నన్నిశాచరుల్. భా. రా యు ౯౨౦.

ప్రోపడు² అ క్రి. (ప్రోపు + పడు) పోషింపఁబడు. (శ. ర.)

ప్రోపరి. విశే. (ప్రోపు + అరి³) ౧ రక్షకుఁడు, పాలించువాఁడు.

ఉ కల్లల కల్ల నిల్కడలు గూర కలంగొన నేల ప్రోపరుల్. (అచ్చ. రా. అయో. ౩౪.)

౨. పోషకుఁడు, ఆహారమిచ్చి పెంచువాఁడు.

ఉ. ...క్రూరం, బూవిలుకాని పోటునకుఁ బ్రోపరి యామని వచ్చె నత్తఱిన్.
కృ. శకుం. ౧. ౪౦.

ప్రోపఱు. అ. క్రి. (ప్రోపు + అఱు¹.) ౧. పుష్టి చెడు, బలహీనమగు.

ఉ. వాహముల్, ప్రోపఱ వెల్లవారును బ్రభూత భయార్తిఁ గలంగి రయ్యెడన్.
హరి. పూ ౪. ౧౦౦.

౨. రక్షణలేకుండు.

క. ఈపాపజాతి రక్కసి, యేపగిదిఁ గడంగి యచటి కేతెంచెనొ యీ, పాపం డిమ్మెయి నెట్లో, ప్రోపఱి యని దేవమాయ పుట్టినొ యెఱుంగన్. హరి ౫. ౧౫౪.

ప్రోపు. వి. (√ప్రోచు) ౧. పోషణము, ఆహారమిచ్చి పెంచుట.

చ. ఒకరుని చేతి ప్రోపునఁ దదున్నతి ప్రాపునఁ గాంచి యెల్లవెంటలను గొఱంత లేక పొగడం దగు సంపద నొంది
భార. ఉద్యో. ౨. ౪౪.

క ఆపార్థుఁడు గోపానల దీపితుఁడై విశిఖశిఖలతీవ్రనిహతి నత్యాపులగమి నేర్చి జముని, ప్రోపు గుడువఁ బుచ్చె వారిఁ బురవంశనిధీ భార ద్రో. ౧. ౨౫౩.
(ఇట ఆతిథ్యమని తాత్పర్యము.)

క ఏ నమ్మ దుగదవఁగఁ ద్రుతూనులు గను గందు లగ్రజుండవు నీ వి, స్సైనతతి నెంత దుఃఖపెడు, యీనీప్రోపానపడెను నిరుగుర వులకున్ పాండు. ౩ ౩౫.

౨. రక్షణము, పాలనము.

దండకము ... ఏపు దీపించునీ ప్రోపు ప్రేపాపలం ద్రేఁపుల స్వైపరీత్యంబుగాఁ బాపి యాపద్భజాం డొక్కచో డాఁచినన్.
పారి. ౩. ౩౭.

కం. ఆపురము నరిలో శ్రీతుం దను,భూపాలుండేలు
నతని ప్రోపున వైశ్యం,దేపారు నొకండు .
శుక ౨. ౬౧.

౩. విజృంభణము.

గీ. ... వైరుల ప్రో పదంచి ..
ప్రబోధ. ౨. ౮౩

సీ. కొమ్మలు వడి నూది కుదియింతుఁ బ్రో
పణ నను వాఁడు పడవైచి యనుపుదప్పఁ
బట్టి పెల్కుఱ ముక్కు గట్టుదు నను
వాఁడు (హరి పూ ౬. ౧౩౩)

ప్రోపెట్టు. స క్రి (ప్రోగు + పెట్టు.) ప్రోగుగా నుంచు

లయగ్రాహి ... మట్టి . బి ట్టదరికేల మెద
మట్టి తెగ నెత్తుపడునటులు శిరంబులను
మెట్టులుగొనం బ్రో,వెట్టు.
కు. సం ౧౨. ౯౫౩.

ప్రోయాలు. వి (ప్రోపు + ఆలు.) (ప్రోలు+ ఆలు. అని క ×) ఇల్లాలు, భార్య, స్త్రీ

ఉ . అనలుమో మవేయు ప్రో,యాలు ప్రవీణ
మానసమహోత్కృతి నాఁగ ... కేయుతన్
రామా ౧. ౮.

సీ. జవ్వని బిత్తరి చాన ప్రోయా లన్ను కన్నె
లేమ ... (ప్రబంధ ౨౬౭)

దండకము ... ప్రోయాలికిన్ సజ్జకంబైన
యందంబు నొందింపవే పారి ౩. ౩౮.

క ఆలోలనయనఁ గనుఁగొని, ఇది యచ్చర
ప్రోయాలో కా కల్లమునియాలో యను
చున్. (విజ వి. ౨. ౪౭)

ప్రోలు. వి. హో. అనా. (సం. పురీ. క. పొజలు. త. పొజిల్.) ౧. పట్టనము (బ. ప్రోలులు, ప్రోళులు, ప్రోళ్లు)

సీ. ... ఈ ప్రోలికి నాముదగేల . .
భార. ఆది. ౬. ౨౬౪.

ఉ. ... భూవలయంబునఁ బ్రోలు కల్ల గా
రూపించి భంగిఁ జూచి .. (దశకు. ౮. ౨.,

మ.... కామినీకామిసం,రతి కేలా ఘుదరైచ్చుఁ
గంతుకళాహోన్మాదంబు లా ప్రోలునన్.
అము. ౨. ౩౧.

౨. లోకము.

మ. ... శివశర్మా వేదశాస్త్రాగమాం, బుధి
చంద్రోదయ చంద్రలోక మిది యీప్రో
లేలుచుండుం, గళానిధి ...
కాశీ. ౪. ౧౭౧.

౩ స్థానము

(కావేరి వర్ణనము)

సీ జలధినాయకు నేలుబడి గన్నయిల్లాలు నిఖిల
పుణ్యపుంజాలు నిలుచు ప్రోలు ...
శుక. ౧. ౩౭౬.

౪. పెండ్లిలో నాగవల్లి నాఁడు రంగులతోఁ బెట్టెడి పిండిపట్టు, అస్థలము.

సీ ఒజ్జన మొనరింప సుచితక్రమంబునఁ ...
గిన్ గడఁ బ్రోలు చొచ్చి.
కళా ౭ ౮౩

మ. సరలం గూర్చినకొప్పుతోఁ బసపుమిన్నద్దేలు
సెమ్మోముతో, గరిసున్నాగమసాని ప్రోలు
దిగంగా ... తూర్యములన్, మొర
యుంగాఁ గదు నొప్పె నాకబలి ...
వేం పంచ. ౪. ౩౭౦

జ. ప్రోగుగాయు, ప్రోగుచుపు

ప్రోల్గుదుపు స. క్రి (ప్రోలు + కుదుపు) ప్రేరేచు (అప్ర క. ౮)

ప్రోవగు. అ క్రి. (ప్రోవు + అగు.) గుంపగు, గుంపుగూడు

క కావునఁ బాండవపక్షము, భూవల్లభకోటి
యిచటఁ బ్రోవగును .
భార. ఉద్యో ౧. ౧౬.

ఉ. వేవురు చంద్రులొక్కెడ నొకవేవురు సూర్యులు
లక్షపావకుల్, ప్రోవయి యున్నయట్టి దగు
భూరితరం బగు తేజము.
హరి. ఉ. ౭. ౨౧౫.

ప్రోవు = పోగు, ప్రోగు. వి. సమూహము, గుంపు.

చ. ఆదటులఁ గొండలం బడి మహాపద గూ పటి చన్నవారి ని,ప్పుడు గొనివచ్చి కృష్ణుఁ డొకప్రోవుగఁ గూటువమూఁకఁ గూర్చితం, .. భార. ఉద్యో. ౨. ౨౦౯.

గీ. ప్రోవు లిడ్డమృణాలకర్పూరవిరతిఁ, గాంచి వైదర్భి మదిలోన గళవళించెఁ జాల కాయాతచంద్రికాజాల మనుచు. నైష. ౨. ౧౧౮

జ• ప్రోవగు, ప్రోవుకొను, ప్రోవుకొల్పు, ప్రోవుగట్టు, ప్రోవుతీయు.

ప్రోవుకొను=ప్రోవుగట్టు. అ క్రి (√ప్రోవు) గుంపుగూడు, గు పగు. (చూ ప్రోవుకొల్పు.)

ప్రోవుకొల్పు = ప్రోవుకొనఁజేయు. స క్రి, (√ప్రోవుకొను.) ప్రోగుగాఁజేయు.

చ. . ఇప్పగొంబునిధి పల్మఱుఁ జెల్లి కట్టమీఁదఁ జెల్లరుదుగఁ బ్రోవుకొల్పెడు మహామలలోములమౌక్తికావలిన్. కవిక. ౫. ౧౧౭.

ప్రోవుగట్టు. అ క్రి. (√ప్రోవు.) రాశియగు. కూడు.

వ. ... వేవురు విభాకరులు పదివేవురు ప్రోశియ పావకులును ప్రోవుగట్టినట్టిపగిదిం ... హరి. పూ ౮. ౭౯

ప్రోవుదీయు. (ప్రోవు + తీయు). రాశినుండి దీయు.

ఉ. కమ్మరివారిబాలిక చకోరవిలోచన మద్దు గుమ్మ యా,వమ్మదరిన్ రసాయలిన వస్త్రము చుంగులు జాఱఁగట్టి తాఁ, గమ్మనిపూవ్రఁ దతోఁ గరవఖమ్ముల భాండము లంగజాస్త్ర పాఁ,తమ్మునఁ బ్రోవుదీసి విటతండము గుండెలు లార విచ్చెఁగన్. వీథి. ౨౪.

ప్రోషము. సం. వి. అ. పుం. ౧. కాల్చుట. ౨. సంతాపము. ౩. కాలుట.

ప్రోషితభర్తృక. సం. వి. ఆ. స్త్రీ. ప్రియుఁడు దేశాంతరగతుఁడైయుంత ఖేదము నొందియుండునాయిక.

ప్రోషితుఁడు. సం. విణ (అ. ఆ. అ.) దేశాంతరగతుఁడు

ప్రో(ప్రౌ)ష్ఠపదము. సం. వి. అ. పుం. భాద్రపదమాసము. వి ఆ. స్త్రీ పూర్వాభాద్రయు ఉత్తరాభాద్రయు

ప్రో(ప్రౌ)ష్ఠము. సం. వి. అ. పుం. ౧. ఎద్దు. ౨. పీఁట, పీఠము. ౩. ఎగిరియెగిరిపడెడు మత్స్య విశేషము, శఫరము.

ప్రోహము. సం. వి అ. పుం ౧. తర్కము ౨. ఏనుఁగుకాలు ౩. ఏనుఁగు మోఁకాలు. ౪ కూర్పు, సంధి. ౫ నేర్పు. (శ. ర.)

ప్రోహుఁడు. సం. విణ (అ. ఆ. అ.) ౧. తార్కికుఁడు. ౨. నేర్పరి.

## ప్రౌ

ప్రౌఢ = ప్రోఢ. సం. ఆ. స్త్రీ. స్వీయాంతర్భేద విశిష్టనాయికా విశేషము స్వీయనాయికలలో నొకతె. (పదునెనిమిదియేండ్లపైబడిన వయస్సుకలిగి సంపూర్ణయౌవనము గలది. శ. ర. ముప్పదియేండ్లు మొదలుకొనిఁ యేఁబది యేడేండ్లవఱకుఁగల వయస్సు గలది. (వాచ.)

ప్రౌఢము. సం = ప్రోఢము.

ప్రౌఢి. సం వి. ఇ. స్త్రీ. పరివృద్ధి, చక్కఁగా ఎదుగుట, నిండుగా పెరుఁగుట, పరిపాకము. ౨. వృద్ధి, పెంపు. ౩. గొప్పతనము, గౌరవము. ౪. ప్రాగల్భ్యము, దిట్టతనము. ౫. గర్వము, అహంభావము, క్రియలందు కనబడు రాగక్తి

గలదొసఁడి నిశ్చయము. ౬. సామర్థ్యము, నేర్పు. ౭. చర్చ, వివాదము. ౮. ఉత్సాహము. ౯. వాకోక్తి. ౧౦. ప్రౌఢమ్మ వాచకము.

వ. భువనంబులయందు సత్యంబునేన ఋతువు లందు వసంతంబ ప్రౌఢి మాసంబుల మార్గ శీర్షంబునునైన. భాగ. ౧౧. ౪౮.

ప్రౌఢిమ(ము.) వి. (సంస్కృతభాషలో ప్రౌఢి శబ్దమేగాని యిదిగానఁబడదు.) ప్రౌఢత్వము.

మ. ... తనర చెన్నునను దక్షప్రపణ నిగమ శాస్త్రప్రౌఢిమల్ గాంచితిన్. ఇందు. ౧. ౧౬౮.

శా. ... గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢి మన్. నైష. ౧. ౧౨.

మ. పురాణప్రౌఢిమన్ మించితిన్ ... విక్రి. ౧. ౧౧౦.

ప్రౌణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నేర్పరి. ౨. మిక్కిలి అపసారకుఁడు, మిక్కిలి తొలఁగఁ బుచ్చువాఁడు.

ప్రౌష్ఠపది. సం. వి. ఈ. స్త్రీ. భాద్రపదపూర్ణిమ.

## ప్ల

ప్లక్ష. సం. వి. ఆ. స్త్రీ. (ప్లక్షద్వీపమునుండి బయలు వెడలిన) సరస్వతీనది.

ప్లక్షప్రస్రవణము. సం. వి. అ. న. సరస్వతీనది పుట్టినచోటు.

ప్లక్షము. సం. వి. అ. పుం. ౧. జువ్వి. ౨. కలుజువ్వి. ౩. సప్తద్వీపములలో నొకటి. (చూ. ద్వీపము.) ౪. పెరటితలుపు, దిడ్డితలుపు. ౫. ద్వారపార్శ్వమందలి ప్రదేశము. శ. రా. కే.

ప్లవ. సం. వి. అ. పుం. ప్రభవాది సంవత్సరము లలో నొక సంవత్సరము.

ప్లవంగమము. సం. వి. అ. పుం. ౧. కోఁతి. ౨. కప్ప.

ప్లవంగము. సం. వి. అ. పుం. ౧. కోఁతి. ౨. మృగము, జింక. ౩. ప్లక్షము. జువ్వి. కే.

ప్లవకము. సం. వి. అ. పుం. ౧. కప్ప. ౨. కోఁతి. ౩. ప్లక్షము, జువ్వి. కే.

ప్లవకుఁడు. సం. వి. అ. పుం. దాఁటువాఁడు.

వి. అ. పుం. ౧. చండాలుఁడు. ౨. కత్తి మొనలగువాని పైనాఁడు బొమ్మరి మొనలగు నర్తకుఁడు.

ప్లవగతి. సం. వి. ఇ. స్త్రీ. కప్ప.

ప్లవగము. సం. వి. అ. పుం ౧. కోఁతి. ౨. కప్ప. ౩. ప్లవమనెడిపక్షి. ౪ శిరీషవృక్షము, దిరిసెనపుఁజెట్టు.

ప్లవగుఁడు. సం. వి. అ. పుం. సూర్యసారథి, అనూరుఁడు.

ప్లవనము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రవణము, నిమ్నము, క్రిందికి ఏటవాలుగా నున్నది.

వి. అ. న. ౧. దాఁటుట. ౨. ఈఁదుట. ౩. మునుఁగుట, త్రుంకుట, స్నానము. ౪. పఱచుట. ౫. మహాప్రవాహము, పెనువెల్లి. ౬. వాటపుఁబల్లపు నేల, ప్రవణము. ౭. నింపుట.

ప్లవము. సం. విణ. (అ. ఆ. అ) ౧. తేలునది, ఈఁదులాడునది. ౨. దాఁటునది.

వి. అ. పుం. ౧. తేలుట, ఈఁదుట. ౨. నీరు పొంగినవెల్లువ. ౩. దాఁటుట. ౪. తెప్ప. ౫. కప్ప. ౬. కోఁతి. ౭. వాటపుఁబల్లపు నేల, ప్రవణము. ౮. గొఱ్ఱె. ౯. ఒక దిమసుచేఁపల, పులుగు. ౧౦. శావి. కే. ౧౧. నీరుకాకి. ౧౨. నీరుకోడి. (కారండవము, కన్నెలేడి.) ౧౩. జలకము. ౧౪. ప్లక్షవృక్షము. ౧౫. [illegible]

వి. అ. పుం. మూఁడుమాత్రలకాల ముచ్చ రింపఁబడెడు స్వరము.

**ప్లుతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రవాహము, వెల్లువ. ౨. దాఁటు. ౩. అశ్వగతివిశేషము ౪. స్వరమును మూఁడుమాత్రలకాల ముచ్చ రించుట.

**ప్లుషము.** సం. వి. అ. పుం. కాలుట, దాహము.

**ప్లుష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) కాల్పఁబడి నది, దగ్ధము.

## ప్లో

**ప్లోతము.** సం. వి. అ. పుం. గాయము మొదలగు వానికి కట్టుగుడ్డ, శస్త్రకర్మముయొక్క ఉప కరణభేదము. ౨. వస్త్రము.

**ప్లోషణము.** సం. విణ. (అ. ఈ. అ.) కాల్చునది, నీఱుసేయునది. వి. అ. న. కాల్చుట, దాహము.

**ప్లోషము.** సం. వి. అ. పుం. కాల్చుట, దాహము.

## ఫ

**ఫ.** సం. ఒకానొక యక్షరము.

**ఫ.** సం. వి. అ. పుం. ౧. ఝంఝూవాతము, వానగాలి. ౨. నోరు మిక్కిలితెఱచి యావులించుట, జృంభావిస్ఫారము. ౩. ఫలలాభము. ౪. వర్ధనము ౫. [illegible]సాధనము ౬. పెచ్చు[illegible] ౭. [illegible] న ౧. రూక్ష భాషణము, పరుషముగా పలుకుట. ౨. ఫూత్కారము. ౩. నిష్ఫలవాక్యము.

**ఫంజి.** సం. వి. ఈ. స్త్రీ. భార్గి. ఱ. (వామన హాటి.)

**ఫంజిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. భార్గి. ఱ. ౨. దేవతాడము. ఱ. ౩. దురాలభ, తీఁటకసెంద. ఱ.

**ఫంజిపత్రిక.** సం. వి. ఆ. స్త్రీ. ఆఖుకర్ణి, ఎలుకచెవియాకు. ఱ.

**ఫండము.** సం. వి. అ. పుం. జఠరము, కడుపు.

**ఫక్కి.** సం. వి. ఈ. స్త్రీ. రీతి, ప్రకారము. (శ. ర.)

**ఫక్కిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కర్తవ్యనిర్ణయార్థమగు పూర్వపక్షము. ౨. అసద్వ్యవహారము. ౩. హేత్వాఖ్యానము, సత్యాఖ్యానము. ౪. కపటోపాయము, జిత్తు. ౫. అవిచారపూర్వకముగాఁ గలిగియున్న యభిప్రాయము. ౬. తార్కికనిర్దేశము. ౭. గ్రంథము.

శ్లో॥ ఫణిభాషితభాష్యఫక్కికా విషమా కుండలనామవాపితా. సం. నైష. ౨. ౯౫.

**ఫట్.** సం. అవ్య. ౧. మంత్రోచ్చారణమందుచ్చరింపఁబడు అనుకరణశబ్దము. ౨. యోగము. ౩. అస్త్రనామకమగు మంత్రభేదము. ౪. విఘ్ననివారణమునం దుపయోగింపఁబడునది.

**ఫటము.** సం. వి. అ. పుం. ౧. పట్లు. ౨. కితవుఁడు, వంచకుఁడు, మోసకాఁడు.

**ఫడింగ.** సం. వి. ఆ. స్త్రీ. ఝిల్లిక, ఈలపురుగు.

**ఫణ.** సం. వి. ఆ. స్త్రీ. = ఫణము.

**ఫణాధరము.** సం. వి. అ. పుం. సర్పము.

ఇట్లే ఫణాధరము

**ఫణాభృత్తు.** సం. వి. త్. పుం. సర్పము.

**ఫణము.** సం. వి. అ. పుం. పాముపడగ.

**ఫణావంతము.** సం. వి. త్. పుం. పాము.

**ఫణాకరము.** సం. వి. అ. పుం. సర్పము.

ఇట్లే ఫణాధరము మొ.

**ఫణి.** సం. వి. న్. పుం. ౧. పడగగల పాము, భోగి, పాము. ౨. రాహువు. ౩. పతంజలి (మహాభాష్యకారుఁడు.) ౪. మరువకము.

**ఫణికేసరము.** సం. వి. అ. పుం. నాగకేసరము. ఱ.

ఫణిచక్రము. సం. వి. అ. న. వివాహాదులందు శుభాశుభసూచక నాడీకూటమును దెలుపుటకైన చక్రవిశేషము.

ఫణిజ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక వృక్షము.

ఫణిజిహ్వ. సం. వి. ఆ స్త్రీ ౧ మహాశతావరి. చూ. ౨. మహాసమంగి చూ.

ఫణిజ్ఝకము. సం. వి. అ. పుం. ౧ మరువము. చూ. ౨. జంబీరము, నిమ్మ చూ.

ఫణితము. సం. వి అ. న. గమనము.

ఫణితల్పగుఁడు. సం. వి అ. పుం. శేషశయనుఁడు—విష్ణువు,

ఫణితి. సం వి. ఈ స్త్రీ. వాక్కు. (శ. ర.)

సీ. అతినీలకుంతలయమృత పూరంబుతో దొరవచ్చు నీముఖ సరసఫణితి

కాశీ. ౫. ౨౯౩.

ఫణిని. సం. వి. ఈ స్త్రీ. సర్పిణి అను ఓషధి చూ

ఫణిప్రియము. సం. వి. అ పుం. గాలి.

ఫణిఫేనము. సం. వి. అ పుం. నల్లమందు.

ఫణిభుక్కు. సం. వి క్. పుం. ౧. నెమలి, గరుడుఁడు.

ఫణిముఖము. సం. వి. అ న ఇంటికికన్నము పెట్టుదొంగలకు మట్టి త్రవ్వుటకై యుపయోగించునొకవిధమగు గుద్దలి, చోరసాధనము.

ఫణివల్లి. సం వి ఈ స్త్రీ. నాగవల్లి. చూ. తమలపాకుతీఁగ

ఫణిహంత్రి. సం. వి ఈ. స్త్రీ. గంధనాకులి, సర్పాక్షి. చూ.

ఫణిహృత్తు. సం. వి త్. స్త్రీ. క్షుద్రదురాలభ. చూ. ఒకవిధమగు కపింద. చూ.

ఫణీంద్రుఁడు. సం. వి. అ. పుం. ౧. శేషుఁడు. ౨. వాసుకి. ౩ పతంజలి.

ఇట్లే: ఫణీశ్వరుఁడు.

ఫత్కారి. సం. వి. న్. పుం, పక్షి.

ఫరంజే = ఫరుఁజే. వి. (క్రై. మొం.వాని.) పిడి, త్సరువు.

శా. బంగారంపు ఫరంజు క్రొంజికిలివాల్పట్టైన డాలుం జెరా,నింగాతీం దోనలకా వహింపుచు .. రంగా. ౩. ౪౯.

ఫరము. సం. వి. అ. న. ఫలకము, పలక, కేడెము.

ఫరవానా. హిం వి. (హిం. ఫర్వానా.) రాజాజ్ఞ, శాసనము.

క. హాతకారా ల్గానివచ్చిన, ఫరవానా చూచి హార్ష పరవశుఁ డగుచున్, శిరసావహించుకొనుచుం, దిరమగు బహుమానజలధిఁ దేల్చెకా వారిన్. రంగా. ౨. ౧౪౪.

ఫరుబకము. సం. వి. అ. న చెక్కలాకుపెట్టె, తాంబూలకరండము.

ఫర్ఫరము. సం. విశే. (అ ఆ. అ.) చంచలము.

ఫర్వరీకము. సం వి అ. పుం ౧ జోపేటము, త్రేళ్లుచాఁచిన అఱచేయి. అ. న. ౧. నవపల్లవము, లేఁతచిగురు. ౨. మృదుత్వము. ఆ స్త్రీ పాదుక

ఫలకంటకము. సం. వి. అ. పుం. కంటకి ఫలద్రుమము, పనస. చూ.

ఫలకపాణి. సం. విశే. (ఇ) పలక చేతఁగలవాఁడు, కేడెముచేఁబూనినవాఁడు (యోధుఁడు.)

ఫలకము. సం వి. అ. న. ౧. పలక, కేడెము. ౨. పలకవలె చదునైన యుపరిభాగము. ౩. వ్రాయుట కుపయోగించు శిలాదిపట్టకము. ౪. పీఁటఁడు. ౫. అఱచేయి. ౬. ఫలము, ఫలితము. ౭. లాభము. ౮. ఆర్తవము, రజస్సు. ౯. శాకాగ్రము. ౧౦. తామరపూవునందలి దుద్దు. ౧౧. అస్థిఖండము, శిరస్సునందలియెముకలకైన చదునైనయస్థి. ౧౨. నాగకేసరము.

ఫలకయంత్రము. సం. వి. అ. న. భాస్కరాచార్యులు కనిపెట్టిన ఒక జ్యోతిశ్శాస్త్ర యంత్రము

ఫలకర్కశ. సం. వి. అ. స్త్రీ. వనకోలి, కారు రేఁగుచెట్టు.

ఫలకసక్థుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పలకవలె వెడల్పైనతొడలుగలవాఁడు.

ఫలకి. సం. విణ. (న్. నీ. న్.) ౧. ఫలకములు గలది, పలకలుగలది. ౨. పలకదాల్చినవాఁడు, కేడెము ధరించినవాఁడు. వి. న్. పుం. ౧. ఒక విధమైనచేప. (మే. ని.) ౨. కఱ్ఱపలకతో చేసిన యానము. పుం. న. చందనపుకఱ్ఱ.

ఫలకృష్ణము. సం. వి. అ. పుం. ఓఁక, పానీయామలకము. టీ.

ఫలకేసరము. సం. వి. అ. పుం. కొబ్బరిచెట్టు.

ఫలకోశము. సం. వి. అ. పుం. అండకోశము, వృషణము.
ఇట్లే: ఫలకోశకము. (త్రి. ని.)

ఫలగ్రాహి. సం. విణ. (న్. ణీ. న్.) ఫలించునది, కాలమునఁ బండ్లుపండునది (చెట్టు). వి. న్. పుం. ఫలవృక్షము.

ఫలచమసము. సం. వి. అ. పుం. ౧. దధిమిశ్రితవటత్వక్చూర్ణము, పెరుఁగుకలిపిన మఱ్ఱిపట్టపొడి. ౨. న్యాయభేదము.

ఫలచోరకము. సం. వి. అ. పుం. చోరమను గంధద్రవ్యము.

ఫలత్రయము. సం. వి. అ. న. ౧. కరక, తాడి, ఉసిరిక అని మూఁడుఫలములు. ౨. ద్రాక్ష, ఖర్జూరము, కేసరము అని మూఁడుఫలములు.

ఫలత్రికము. సం. వి. అ. న. కరక, తాడి, ఉసిరికలు.

ఫలదము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఫలము నిచ్చునది, ఫలించునది. ౨. లాభముఁజేకూర్చునది. ౩. ప్రతిఫలము నిచ్చునది, పారితోషికమిచ్చునది. వి. అ. పుం. వృక్షము.
ఇట్లే: ఫలప్రదము.

ఫలనము. సం. వి. అ. న. ౧. ఫలించుట, పండ్లు పండుట. ౨. లాభము నిచ్చుట.

ఫలనిర్వృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ఫలము కలుగుట.

ఫలపాకము. సం. వి. అ. పుం. ౧. కరమర్దకము, కలివె. టీ. ౨. పానీయామలకము. ఒకజాతి ఉసిరిక. ౩. పండు పండుట.

ఫలపాకాంత. సం. వి. ఆ. స్త్రీ. ఒకసారి ఫలించి నశించు అరఁటి, వరి మొ. ఓషధి.

ఫలపాకి. సం. వి. న్. పుం. గర్దభాండవృక్షము.

ఫలపుచ్ఛము. సం. వి. అ. పుం. ఏరండవృక్షము, ఆముదపుఁజెట్టు.

ఫలపుష్పా. సం. వి. ఆ. స్త్రీ. పిండఖర్జూరి (రా. ని.)

ఫలపూరము. సం. వి. అ. పుం. మాదీఫలము. టీ.
ఇట్లే: ఫలపూరకము.

ఫలప్రియ. సం. వి. ఆ. స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణము. టీ.

ఫలభాక్కు. సం. విణ. (క్. క్. క్.) ఫలమును బొందువాఁడు.

ఫలభూమి. సం. వి. ఇ. స్త్రీ. కర్మముల ఫలముల ననుభవించు స్థానము (స్వర్గము మొ.)

ఫలమత్స్య. సం. వి. ఆ. స్త్రీ. కలబంద. టీ.

ఫలము. సం. వి. అ. న. ౧. పండు. ౨. పంట. ౩. పరిణామము, ఫలితము. ౪. ప్రతిఫలము. ౫. కార్యము. (వ్యతి. కారణము.) ౬. ఉద్దేశము. ౭. ప్రయోజనము. ౮. లాభము, వడ్డీ.

౯. సంతానము. ౧౦. పండులోని గింజ. ౧౧. శారిఫలము, జెత్తపలక. ౧౨. కత్తివాదర. ౧౩. ఫాలము, నాఁగటికఱ్ఱు. ౧౪. బాణము ములికి. ౧౫, ఫలకము, కేడెము. ౧౬. జాజికాయ. ౧౭. త్రిఫల. ౧౮. ప్రత్తికాయ (శ. ర.) ౧౯. కల్లోలము, పెద్దయల. ౨౦. ఆర్తవము, రజస్సు. ౨౧. ముష్కము, వృషణము. ౨౨. దానము, ఈవి. ౨౩. కుటజము. †. ౨౪. (వ్యాక.) కర్త్రాది వ్యాపారనిష్పాద్యమైన ప్రధాన ప్రయోజనము, ధాత్వర్థజన్యమగు సంయోగాది. శ్లో. యస్యార్థస్య ప్రసిద్ధ్యర్థం ఆరభ్యంతే పచాదయః తత్ప్రధానంఫలం తేషాం నలాభాది ప్రయోజనం. (హరికారిక.) ౨౫. (గౌతమ ప్రోక్తమగు.) ప్రమేయభేదము. ౨౬. (గణిత.) త్రైరాశికమునందలి మూఁడు రాసులలోను రెండవరాశి ౨౭. ఒకక్షేత్రము యొక్క చదరపుకొలత ౨౮ పందికోల చివర. (శ.ర.) ౨౯. కక్కోలము. †. (వాచ.)

ఫలముఖ్యా. సం. వి. ఆ. స్త్రీ. అజమోదా ఓమము. †.

ఫలముద్గరిక. సం. వి. ఆ. స్త్రీ. పిండఖర్జూరి. †.

ఫలయోగము. సం. వి. అ. పుం. (అలం) సమగ్రమగు ఫలప్రాప్తి.
శ్లో. సావస్థా ఫలయోగః స్యా ద్యః సమగ్ర ఫలాగమః. (సా. ద.)

ఫలవంతము. సం. విశే. (త్. వత్. త్.) ౧. పండ్లుగలది. (వృక్షము.) ౨. ఫలమునకు సాధనమైనది. (యాగాది) ౩. ఫలముతోఁగూడినది. ౪. ఫలితము లిచ్చునది. వి. త్. పుం. పండ్లతోఁ గూడినచెట్టు.

ఫలవంధ్యము. సం. వి. అ. పుం. గొడ్డుచెట్టు, పండ్లుపండని చెట్టు.

ఫలవతి. సం. వి. ఈ. స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణము. †. (విల్యమ్సు.)

ఫలవర్తులము. సం. వి అ. పుం. కాళింగ వృక్షము.

ఫలవృక్షకము. సం వి. అ. పుం. పనసచెట్టు.

ఫలశాకము. సం. వి. అ. న. (పత్త్రం పుష్పం ఫలం నాళం కన్దం సంస్వేదజం తథా) ఇను షడ్విధశాకములలో ఫలరూప మగుశాకము. (కూష్మాండాది)

ఫలశైశిరము. సం. వి. అ. పుం బదరవృక్షము.

ఫలశ్రేష్ఠము. సం. వి. అ. పుం. మామిడిచెట్టు.

ఫలషాడవము. సం వి. అ. పుం. దానిమ్మ. †.

ఫలసాయము. వి. వి. పంట. (శ. ర)

ఫలస్థాపనము. సం. వి. అ. న. సీమంతోన్నయనమనెడు సంస్కారము.
(ఇందు ఔదుంబరఫలములు రెండు స్థాపింపఁబడునుగాన యిట్టిపేరు.)

ఫలస్నేహము. సం వి. అ. పుం. అంకోటవృక్షము

ఫలహారకము. సం. వి. అ. పుం. ఫలకము, పలక. (విల్యమ్సు.)

ఫలహి. సం.వి.ఈ. స్త్రీ. ప్రత్తిచెట్టు. (విల్యము.)

ఫలాంతము. సం. వి. అ. పుం. వెదురు. †

ఫలాఢ్య. సం. వి. ఆ. స్త్రీ. కాష్ఠకదళి, అడవియరఁటి. †.

ఫలాదనము. సం. వి. అ. పుం. శుకము, చిలుక.

ఫలాధ్యక్షము. సం. వి. అ. పుం. రాజాదనము, పాల. †.

ఫలాపేక్ష. సం. వి. ఆ స్త్రీ. ఫలము నెదురు చూచుట, ఫలమునందలి యాశ.

ఫలామ్లము. సం. వి. అ. పుం. అమ్లవేతసము, పుల్లప్రబ్బలి. †. న. చింతపండు, వృక్షామ్లము.

**ఫలాశనము.** సం. వి. అ. పుం. చిలుక.

**ఫలాస్థి.** సం. వి ఇ. న. కొబ్బరికాయ.

**ఫలి.** సం. విణ. (స్ నీ. న్.) ౧. ఫలములు గలది, పండ్లుగలది. (వృక్షము.) ౨. ౦ంది ఫలితముగలది, లాభకరము వి న్. పుం చెట్టు ఇ. పుం. మత్స్యభేదము. ఈ. స్త్రీ. ప్రేంకణము కే

**ఫలి(యి)ంచే.** సం. అ క్రి పండు

సీ అహారములు పెట్టునది పితృకోటికి వవి వారి కర్పంబు లై ఫలించు.

మార్క 3 ౨౦౯.

చ నీమహానీయసంగమం,బున ఫలియించె నాతలంపు వోయిద... మార్క 3 ౩౭౧.

**ఫలిక.** సం వి ఆ. స్త్రీ ౧. నిష్పావి, ౨. శాఖాగ్రము, అలుగుములికి

**ఫలితము.** సం. విణ. (అ ఆ. .) ౧. నిష్పన్నము, ఫలించినది, పండినది. ౨ ఈడేటిన కొలువేటినది. వి అ. పుం. పండ్లుపండినచెట్టు. ఆ స్త్రీ రజస్వల. అ. న. శైలేయము, ఆ పుష్పం.

**ఫలినము.** సం. విణ. (అ. ఆ. అ.) ఫలముగల్గి. వి. అ పుం. పనస. కే. చెట్టు.

**ఫలిని.** సం. వి. ఈ. స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణము. కే. (ఇది మామిడికి ప్రియురాలని కవి సంప్రదాయము.) ౨. తరిగొబ్బ. కే.

**ఫలీకృతము.** సం. విణ. (అ. ఆ అ) దంచి పొట్టూడునట్టు చెరుగఁబడినది. (ధాన్యము)

**ఫలేంద్రము.** సం. వి. అ. పుం. అల్లనేరేడు, రాజజంబువు. కే.

**ఫలేగ్రహి.** సం. వి. ఇ. పుం - తగుసమయమున ఫలించునది - చెట్టు.

విణ. (ఇ) కాలమునఁ బండ్లు పండునది.

**ఫలేపుష్ప.** సం. వి. ఆ. స్త్రీ. ద్రోణపుష్పి, తుమ్మి. కే.

**ఫలేరుహ.** సం. వి. ఆ. స్త్రీ. పాటలి, కలిగొట్టు. కే.

**ఫలోత్తమ.** సం వి. ఆ. స్త్రీ. ౧. విత్తులేని ద్రాక్ష. కిసిమిసి. ౨. త్రిఫల.

**ఫలోత్పత్తి.** సం. వి. ఇ స్త్రీ. ౧. ఫలము కలుగుట. ౨ లాభము. వి. ఇ. పుం. మామిడి కే.

**ఫలోదయము.** సం. వి అ. పుం ౧. ఫలము పొడచూపుట, కోర్కి ఫలించుట. ౨ లాభము. ౩. ప్రతీకారము. ౪. హర్షము. ౫. స్వర్గము

**ఫల్గనము.** సం. విణ. (అ ఆ. అ) ఫల్గునీనక్షత్రమునఁ బుట్టినది. వి.అ పుం. ఫాల్గునమాసము.

**ఫల్గుని.** సం వి. ఈ. స్త్రీ ౧. ఒక నక్షత్రము. ౨ బొక్కమేడి, కాకోదుంబరిక. కే

**ఫల్గునీభవుఁడు.** సం వి. అ పుం బృహస్పతి గురుఁడు (విల్యమ్సు)

**ఫల్గునుఁడు.** సం. వి. అ. పుం. అర్జునుఁడు.

**ఫల్గువాటిక.** సం. వి. ఆ. స్త్రీ. కాకోదుంబరిక, బొక్కమేడి. కే.

**ఫల్గువు.** సం. విణ. (ఉ) ౧ సారములేనిది. పసలేనిది. ౨ నిష్ప్రయోజనము, ౩. చిన్నది. మాత్రము. ౪. నిరర్థకము. ౫. దుర్బలము, సత్తువలేనిది. ౬. మిథ్యయైనది, కల్ల. ౭.రహస్యము. వి. ఉ. స్త్రీ. ౧. వసంతసమయము, ౨. కాకోదుంబరిక. కే. బొక్కమేడి. కే. ౩ గయాతీర్థమందుఁగల యేఱునది. (గులాల్ అను) ఒకవిధమగు రెంగునిపొడి. (దీనిచే హోళిపండుగునందు వసంతము లాడుదురు.

**ఫల్గువృంతాకము.** సం. వి. అ. పుం. కొండవాకుడు భేదము, దుండిలము. కే.

**ఫల్గూత్సవము.** సం. వి. అ. పుం. హోళిపండుగ.

(దీనిని హిందువులు ఫాల్గున పౌర్ణమాసియందు చేయుదురు.)

ఫల్గ్యము. సం. వి. అ. న. పుష్పం.

ఫల్లకి. సం. వి. ఈ. పుం. మత్స్యభేదము.

ఫల్లఫలము. సం. వి అ. పుం కూర్పవాతము, చేటగాలి.

ఫల్లా. అవ్య. (హిం. ఫల్లా) వరే (అంగీకారమును దెలుపును.)

క. ఫల్లా కాని మ్మిపు డా, ల్లాకిల్లాకు నడఁచి కించిన్మాత్రక, హల్లాకు నూలు కొలుచుఁ జెల్లాకుండెదరఁజేయ శీఘ్రము మారిక. రంగా. ౨. ౨౭౩.

ఫలీన. క్రి. విణ. ద్రు. గట్టిగా.

క. తరలక భే యని మనుఁగే, సరపుంద రటున ఫలీన జాడించినఁ దా, నరుగక చండి తనంపుం, గరకరి కుకన్సైంధవంబు గళవళ పడుచుక. చంద్రా ౩. ౬౫.

## ఫా

ఫా. సం. వి. అ. పుం. ౧. నిష్ఫల భావణము. ౨ సంతాపము ౩ వృద్ధి. విణ వర్ధకుఁడు (దీనికిఁ దెనుఁగున వ్యాప్రయోగములేదు)

ఫాంటము. సం విణ (అ ఆ అ) అనాయాసముగా చేయఁబడినది. వి. అ పుం. న ఆయాసములేక చేసిన కషాయము, కషాయమున చిలుకునప్పుడు తొలుతఁబుట్టెడు వెన్నచిద్రుప.

ఫాండము. సం వి అ న కడుపు, ఉదరము.

ఫాటకి. సం. వి. ఈ. స్త్రీ. పటిక.

ఫాణి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కండచక్కెర. ౨. కరంభము, దధిమిశ్రితసక్తువు, పెరుఁగుతోఁగలిపిన పేలపిండి.

ఫాణితము. సం. వి. అ. న. కండచక్కెర.

ఫాలఖేల. సం. వి. ఆ. స్త్రీ. పూరేడుపిట్ట.

ఫాలనేత్రుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి శివుఁడు.

ఫాలము. సం. వి. అ. పుం న. నాఁగటికర్రు. ౨. పాఁపటదీర్చుట, సీమంతభాగము ౩ కట్టు, మొపు ౪ నుదురు. పుం ౧. నిమ్మనిత్తు. ౨. ఒకానొకచెట్టు న. ౧. నూలితోఁ జేసినవస్త్రము. ౨. దున్నినపొలము. విణ. (అ. ఆ అ.) నూలితోఁజేయఁబడినది (మే. ని)

ఫాలాహతము. సం. విణ. (అ. ఆ. అ) దున్నఁబడినది (విల్యమ్సు)

ఫాలుఁడు. సం. వి. అ. పుం. ౧. బలరాముఁడు ౨ శివుఁడు. ౩ కృషీవలుఁడు, కాఁపు.

ఫాల్గునము. సం. వి అ. పుం. ౧ ఒకమాసము. ౨. ఏఱువుద్ది. ¶

ఫాల్గునానుజము. సం. వి. అ. పుం. ౧. చైత్రమాసము ౨ వసంతకాలము.

ఫాల్గుని. సం వి. ఈ. స్త్రీ. ఫాల్గునమాస పూర్ణిమ.

ఫాల్గునికము. సం. వి అ పుం ఫాల్గునమాసము.

ఫాల్గునీభవుఁడు సం వి అ పుం గురుఁడు, బృహస్పతి.

ఫాల్గునుఁడు. సం వి. అ పుం. అర్జునుఁడు

## ఫి

ఫి. సం. వి ఇ పుం. ౧ పాపము. ౨ కోపము, ౩. నిష్ఫలవాక్యము. ౪ దుష్టుఁడైన మనుజుఁడు.

ఫింగకము. సం. వి. అ. పుం పక్షివిశేషము, ఒకజాతి పక్షి.

ఫిరంగము. సం. వి. అ. పుం. ౧ ఒకానొక దేశము ౨. పరంగివారి రోగవిశేషము.

ఫిరంగి. సం. వి. ఈ. పుం పరంగివాఁడు. విణ. (ఈ. ని. ఈ.) ఫిరంగరోగము కలవాఁడు.

## ఫు

ఫు. సం. వి. ఉ. పుం. ౧. మంత్రోచ్చారణ పూర్వకమగు ఫుత్కారము. ౨. తుచ్ఛవాక్యము.

ఫుకము. సం. వి. అ. పుం. పక్షి.

ఫుల్. అవ్య. శ. ౧. ఊదుట మొదలగు వాని యందగు ధ్వనికి అనుకరణము. ౨. కీఁచుమని కూపెట్టుట.

ఇట్లే: ఫూల్. మొ.

ఫుత్కరము. సం. వి. అ. పుం. అగ్ని

ఫుత్కారము. సం. వి. అ. పుం. ౧ ఊదుట. ౨. బుస్సుమనుట, పాము బుసకొట్టుట. ౩. ఎగరోజుట. ౪ కీఁచుమని కూపెట్టుట.

ఇట్లే ఫూత్కారము.

ఫుత్కృతి. సం. వి. ఇ. స్త్రీ. ఫుత్కారము.

ఇట్లే: ఫూత్కృతి.

ఫుప్ఫుసము. సం. వి. అ. పుం. శ్వాసకోశము, ఊపిరితిత్తి

ఫుల్లతువరి. సం. వి. ఈ. స్త్రీ. పటికారము, పొలిగారము. (ఆ. వి.)

ఫుల్లదామము. సం. వి. న. న. పాదమునకుఁ బందొమ్మిదియక్షరములుగల వృత్తభేదము.

ఫుల్లనేత్రము. సం. విణ (అ. ఆ అ) విప్పారిన నేత్రములుకలది

౨. వి. అ. పుం. ఒకవిధమగులేడి, న. విశాలమైన కన్ను.

ఇట్లే: ఫుల్లలోచనము మొ.

ఫుల్లఫాలము. సం. వి అ. పుం. ధాన్యము తూరుగునప్పుడు కలుగుగాలి, చేటగాలి.

ఫుల్లము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వికసించినది, విరిసినది. ౨. పూచినది.

౨. వి. అ. న. చక్కఁగా విరిసినపువ్వు.

ఫుల్లరీకము. సం. వి. అ. పుం. ౧. దేశభేదము. ౨. సర్పము.

ఫుల్లి. సం. వి ఇ. స్త్రీ. వికాసము, వికసించుట, పూచుట.

## ఫూ

ఫూత్కృతము. సం. విణ. (అ ఆ. అ) ౧. ఊదఁబడినది. ౨. నీటిబుగ్గ మొదలగువానివలె పైకి చిమ్మఁబడినది. ౩. గట్టిగా కూపెట్టునది.

వి. అ. న. ౧. గాలియంత్రములోనగు వాని ధ్వని. ౨ కీఁచుమని బిగ్గరగా కూయుట

ఫూత్కారము = ఫుత్కారము.

## ఫె

ఫెళఫెళ. వి. చలువబట్టల చప్పుడు

గీ. రమ్యమేఖలఘుళిఘుళుల్ రత్నహేమ, కలిత
నూపురఝుళిఝుళుల్ చలువవలువ, ఫెళ
ఫెళల్ గిలుక్కుమట్టెలగిలగిలల్ రహించ
రాయంచనడ నిల్చెఁ బంచలాక్షి.

హంస. ౩. ౫౪.

## ఫే

ఫేన. సం. వి. ఆ. స్త్రీ. సాతలాక్షుపము కీ.

ఫేనకము. సం. వి. అ పుం. ౧. ఫేనము. ౨. పిష్టకభేదము, ఒకదినుసు పిండివంట.

వి. ఆ. స్త్రీ. జలపక్వతండులచూర్ణము, నీటితో ఉడికించిన వరిపిండి.

ఫేనదుగ్ధ. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిక్షుపము. కీ.

ఫేనము. సం. వి. అ. పుం. ౧. నురుఁగు. ౨. సముద్రపు నురుఁగు. ౩. నోటి నురుఁగు లేక చొంగ. ౪. సాలుకయందూరు తియ్యనియుమ్మి. ౫ మంచు.

ఫేనవాహి. సం. వి న. పుం. ౧. వడియఁగట్టు వస్త్రము. (విశ్వము.) ౨. వస్త్రము. (శాశ.)

**ఫేనాగ్రము.** సం. వి. అ. న. బుగ్గ, బుద్బుదము, బుడగ.

**ఫేనాశని.** సం. వి. ఇ. పుం. నురువున వజ్రాయుధముగాఁ గలవాఁడు, ఇంద్రుఁడు.

**ఫేనగిరి.** సం. వి. ఇ. పుం. (సింధునది సమీపమునను్న) ఒక పర్వతము. (విల్సను)

**ఫేనిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పక్వాన్నభేదము. (కాజాఅనివాచ) ౨. భక్ష్యవిశేషము, పేణి (శ. ర.)

**ఫేనిలము.** సం. విణ (అ. ఆ. అ.) నురుఁగుగలది. వి. అ. పుం. ౧ బదరీవృక్షము, రేఁగుచెట్టు. ౨ అరిష్టవృక్షము, కుంకుడు. ౩. న. మదనవృక్షఫలము, ఉమ్మెత్తకాయ. ౩. రేఁగుఁబండు

ఇట్లే ఫేనలము.

**ఫేరము.** సం వి. అ పుం. సృగాలము, నక్క.

**ఫేరవము.** సం. వి. అ పుం. నక్క.

**ఫేరవుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ధూర్తుఁడు. ౨. ఘాతుకుఁడు, హింసకుఁడు. వి. అ. పుం రాక్షసుఁడు

**ఫేరుండము.** సం. వి. అ. పుం. = ఫేరము.

**ఫేరువు.** సం. వి. ఉ. పుం. నక్క, జంబుకము.

**ఫేల.** సం. వి. ఆ. స్త్రీ. ఎంగిలి, ఉచ్ఛిష్టము.

**ఫేలము.** సం. వి. అ. న. ఎంగిలి.

**ఫేలి.** సం. వి. ఈ. స్త్రీ. = ఫేల.

**ఫేలిక.** సం. వి. ఆ. స్త్రీ. = ఫేల.

**ఫేషువా.** వి. (మహా. పేష్వా.) కోశాధ్యక్షుఁడు.

సీ. పెంపు మీఱువసంతఫేషువా హజారమునుండి చెలాయిణీవకొసరు దెలుప ... మదను పాదుషాకు దండుగడాలె నప్పుడు.

అని. ౩. ౯౧.

## ఫ్సా

**ఫ్సా.** సం. వి. ఆ. స్త్రీ. భక్షణము, తినుట.

**ఫ్సాతము.** సం. విణ. (అ ఆ. అ) భక్షితము, తినఁబడినది.

**ఫ్సానము.** సం. వి. అ న. ౧. తినుట, ఆహారము, భోజనము.

## బ

**బ.** ఈధ ఒకయక్షరము.

**బ.** సం వి. అ పుం ౧ వరుణుఁడు. ౨. జలము ౩. నీటికడవ. ౪. పురుషుఁడు. ౫. భగము. ౬. సింధువు. ౭ గమనము. ౮. గంధనము. ౯. తంతుసంతానము, పోగులసమూహము ౧౦ వపనము. (మే ని. దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

**బంక.** వి. (సం. పంకః. క. బంకె.) ౧. (చెట్ల) జిగురు, నిర్యాసము.

సీ. ఆకురాలుపుగండ్ల సాసెడు సాసనింతడు గూఁడి బంకటియంగలార్చి.

ఆము ౫. ౧౧౪.

ద్వి. అడవిచెట్లులబంకలాకులునలము, పెడపట్టి దొక్కలు పెల్లుగామోచి,కొనితెచ్చు ...

పండితా. పురా. ౧౨౭. పా. ౯. పం.

౨. ఆసనమునుండి జిగటపడెడి రోగవిశేషము. (శ. ర.)

౩. లోభము. (చూ. బంకెర.)

జ: బంకతెవులు, బంకదుత్తెర, బంకపురుగు, బంకమన్ను, బంకముచ్చు, బంకెర.

**బంకతెవులు.** వి (√ బంక.) సస్యములకుఁ గలిగెడు రోగవిశేషము. (గ్రా.)

**బంకదుత్తెర.** వి. (√ బంక.) ఒకవిధమగు తెండ. ౧. (చూ. కుత్తిర.)

సీ. మయ్యాకుపొన్నయు, మొగలియుఁ ద్రిబంక
మ త్రిశిఖాంసపాదిగంటె ..

బంకపురుగు. వి. (√బంక.) ఒకవిధపుగు కీటము.

(ఇది ప్రాఁకునపుడు వెనుక వల్లనిచాలిక శేర్పడును.)

బంకమన్ను. వి (√బంక) కుంభకరమృత్తు, కుండలుచేయుమన్ను, జిగురుగలమన్ను

సీ. .. బంకమన్నవఁగఁ గుంభకరమృత్తు.
ఆం. భా. ౨. ౫.

బంకముచ్చు. విణ (√బంక) పిసినారి, లోభి (శ. ర.)

బంకు. విణ ౧. వృద్ధుఁడు. కూరునివలె నటించువాఁడు. (శ. ర.)

చ ఆతనికింటెను బంకువీరుమ, ద్విసభుజ
శక్తికిందరముగారు
ఉ హరి. ౪. ౧౩౧.

౨. కావలివాఁడు (గ్రా, శ. ర.)

వి. ౧. కత్త్య, ఇంటిలోపలిభాగము.

ద్వి. మొదలగునిమ్మ లిమ్మగఁ గనుంగొనుచు,
గొదుకక బంకుబంకులు దాఁటి చనుచు.
ద్వి తి. సా. ౧౭౯. పా. ౧౦. పం.

బంకెలు. విణ. (√బంక.) బుద్బురాలు

ద్వి. బంకెలల్ బంకెలల్ పచ్చిరక్కసలు .
పండితా. పురా. ౧౧౬. పా. (శ ర. పా)

బంగనబయలు. వి. (బయలు+బయలు.) బట్ట బయలు. (శ. ర.) (వ్యవ) గోడ తీసివేయఁగానే పెరడు బంగనబయ లయిపోయినది.

బంగరపుగట్టు. వి. (√బంగరము.) మేరు పర్వతము.

.... బంగరపుగట్టు, కుదను గనుపట్టునిల
తోయద యుతంగ... ఉ. రా. ౨. ౪౨.

బంగరము=బంగారము. వి. కాంచనము, సువర్ణము.

మ. .. విరించిచేఁ గొనిన మార్యం దక్ష
దార్వాన్నబం, గరభుంబూడియకై...
సైమ. ౮. ౧౫౯.

ఉ. ఇత్తడి రాగి బంగరములిప్పటియప్పుల కైనఁ
జాలవు... శేమ. ౩. ౧౨౩.

జ బంగరపుగట్టు.

బంగరు(వు.)=బంగారము, బంగారు. వి. స్వర్ణము, బంగారము.

గీ. బంగరు నేయుటకొలకు...
ఆ. ము. ౨. ౮.

ఉ ముంగిటికల్ప భూరుహము మూలధనంబు
నివేశనంబులో, బంగరుసావ ... జగంబు
లందు మా మంగళశైలవల్లభుసమం బగు
దైవము లేదు చూడఁగన్. అని ౧. ౪౨.

క. కరు వేఁటికి బలితపుబం,గరు లేఁటికి ...
నిన్నువిడిచి చనుకొడఁ దరుణీ.
రవిక. ౬. ౧౧౦.

శా. హ్మాసాథోత్తమపార్వతీగిరికులం గానీ రమా
విష్ణులం,గానీ రూపినపాటి బంగరుపునా
గావించినేమసబుంధన్,దానం బీఁదగు ...
వరాహ. ౯. ౬౨.

ఉ. పరిఖ నిజాశ్రయాంబుపరిపాటిఁ దలిర్పఁ
బదారుదన్నుబం,గరువున సైవరాజ గృహ
కల్పన కర్ణిక గాఁగ ...

జ. బంగరుఁగంటి, బంగరుకొండ, బంగరు
గట్టు, బంగరుగుండు, బంగరుచేల, బంగరు
పిచ్చిక.

బంగరుఁగంటి. వి. (బంగరు + కన్ను.) వీర స్త్రీపుఁడు.

సీ. గొంటుబంగరుఁగంటి కంటువేలుపువింటిగుణ
రవంబున నంటు గుండెదిగులు.
ఉ. రా. ౨. ౨౧౪.

(గొంటుబంగరుఁగంటి కంటువేలుపు = క్రూరుఁడగు హిరణ్యాక్షునకు శత్రు వగుదేవుఁడు, విష్ణువు అని భావము.)

బంగరు(వు)కొండ. వి. (బంగరు + కొండ) మేరుపర్వతము

ఉ. బంగరుకొండనుండి దిగుభాల దివాకరులీల
రాముఁ డుత్తుంగమణీమయాసనముఁ దొరవు
వేడుక డిగ్గి ... ఉ. రా. ౧. ౧౮౧.

ఉ. ... నీలవర్ణ నీ,యిన్నితేఁ జూడ మీఁది
వగ మెల్ల ఘనాఘనపంక్తి పర్వి పై,కొన్న
మెఱుంగు బంగరువుకొండగతిం దిలకించె
నంతయున్. కవిక. ౬. ౨౦౦.

బంగరుగట్టు. వి. (బంగరు+గట్టు.) మేరువు.
(రాక్షసవర్ణనము.)

క. బంగరుగట్టుపట్టు కొఱదవి నిర్గమించి
సౌవర్ణవాహినీజలావగాహనంబునకు వచ్చు
నచ్చె కృశిబోవనస్తం బేరవు కదంబకంబు
దంబున ... శం. రా. ౨. ౬౩.

బంగరుగట్టువింటివాఁడు = మేరుధన్వుఁడు, శివుఁడు.

ఉ. ... బంగరుగట్టువింటివాఁ డబ్బుర మైన
నవ్వుఁజబురాసురులందెగటార్చుపాదుపు ...
గల్పాఘఁగుం గృతికేత సప్పుడుర్.
శం. రా. ౧. ౧.

బంగరుగుండు. వి. ఔ. (బంగరు + గుండు.) మేరువు.

అ. నిలుక వాని గెలుకఁ గళులాభ్యురిఁ దెబ్బ,
ఆశాపాలంబు మాని యురుగఁ దనిన, మనుచు
ఘనమనీఁ గంటి మనుచు బంగరుగుంటి, కరో
యులకపేంద్రు నందుఁ గాంచి.
సమీర. ౧. ౧౫౩.

ఉ. బంగరుగుంటివింటిదొరపాటి యనం దగు
మేటి పాటి మా, బంగళగొంటురక్కసుల
రాయిడి గెంటెడుపోటుబంటు...
సమీర. ౨. ౪౧.

బంగరుగుంటివింటిదొర = శివుఁడు.

బంగరు(వు)చేల. వి. (బంగరు(వు) + చేల.) కనకాంబరము, పీతాంబరము.

మానిని. బంగరుచేలయుఁ బద్మవిభాతము
బాహుచతుష్కము... కళా. ౨. ౧౮౦.

చ. ... సురాధిపుఁ డభ్రమువల్లభంబు ను
య్యన డిగి వల్లెవాటుగ భుజాగ్రమునం దగు
మేలిజాళువా, జిమఁగు మెఱుంగు బంగరువు
చేల చెఱంగు కటీతటంబునం, బెనఁచి...
దశా. ౨. ౩౪.

బంగరుపిచ్చుక. వి. (బంగరు + పిచ్చుక.) పక్షి విశేషము.

క. ... బంగరుపిచ్చుకఁ గొంచుక, వింటి
సాళువపుఁగులుఁగు ..అచ్చ. రా. అర. ౬౨.

బంగల. వి. ౧. కుంపటి, అంగారధానిక. (శ.ర.)
౨. బండికుంపటి, ఒకచోటనుండి వేఱొక
చోటికి తీసికొనిపోవుట కుపయోగించు కుంపటి.

గీ. బంగళయనంగ బండికుంపటియగుఁ దన.
ఆం. భా. ౨. ౨౮౧.

('బండిగలయది' ప్రాఁకప్రతి.)

బంగలా. వి. (హిం. బంగలా.) గృహవిశేషము.

ద్వి. బంగరుమని రంగు బంగలా యుంటి,
ముంగల... వృ. వి. ౧. ౨౬.

బంగారము = బంగరము, బంగరు, బంగారు.
వి. (సం. భృంగారః. ప్రా. భింగారో. క.

బంగారవు. (త. వంగార) కనకము, పసిఁడి.

క. ... బం,గారము బోలెఁడుకోడంన,కు ..
హరి. పూ. ౫. ౨౭౫.

ఉ. హరిమిత్రతోఁడ వలకూబరుఁ డేకతమాడి పెద్దబం,గారపుఁగోరఁ గల్పవని కాజని కాంతము రైనచీరలున్. మనుచ. ౫. ౯౨.

విశే. (బంగారమువంటిది) అధికమూల్యము కలది; దుర్లభము.

సీ. కప్పుకో ంల బంగారిమా పువులంతు లవి సువర్ణలతోదయములనుమ్మ.
కవిరా. ౧. ౭౧.

బంగారయ్య. విశే (బంగారు + అయ్య) బంగారువలె ప్రియమగువాఁడు, ప్రియుఁడు

క.... నాబం,గారయ్యా నీవు చల్లఁగా నుండుమింకన్. శుక. ౨ ౩౧.

బంగారు(వు) = బంగరు, బంగారము. వి ౧. స్వర్ణము, పసిఁడి.

సీ. చదలేటిబంగారు జలరుహంబులతూండ్లు భోజనంబులు మాకుఁ బువ్వుఁబోఁణి.
నైష. ౨. ౭౯

ద్వి. కలఁకఁ దొలంగినకమలినిబోలె, బలుమట్టు గడిగిన బంగారుబోలె.
రం. రా. బాల ౫౧. పొ. ౫. పం.

ఉ. నారు మెఱుంగు లయ్యె సుమఁగాంతికిఁ గైవార గీపిపేయం బం,గారువు లయ్యెఁ చేనగలఁ గంటినపట్లు కవిక. 3. ౨౨.

౨. బంగారుతోఁజేసిన భూషణము.

గీ. ఉదుటుగజ్జలు గలతల్పుటురము మాది, గందకట్టులు మాది బంగారు మాది, నీటి వాకిటిబోటిసే గిరుడ కెపుడు
ఆము. ౨. ౧౦.

(ఇక మైలంతర్గతములకు సుదాహరణము.)

విశే. ౧. అపురూపము.

సీ. మించుమేనటు కౌఁగిలించి చూచెద నన్నఁ జెలి యది బంగారు చేసికొనెదు.
సారంగ. ౨. ౨౨౫.

౨. మిక్కిలి ప్రేమపాత్రము.

(వ్యవ.) మా అమ్మాయి బంగారుతల్లి చేసు చెప్పినట్లు వినునమ్మ.

బంగారు బొమ్మకు మసిపాతగట్టు = అనుకూల వస్తువులఁ గూర్చుట.

ద్వి. పొసఁగిన బంగారుబొమ్మను దెచ్చి,మసి పాతఁ గట్టుట మాకు సమ్మతమె.
ద్వి. నల. ౧. ౭౮౧.

జ. బంగారయ్య, బంగారు కడుపువాఁడు, బంగారుకుండ, బంగారుకొండ, బంగారు తీఁగ

బంగారుబోఁడి = బంగారువలె మనోజ్ఞరాలగు ఆఁడుది, ఆఁడుది.

ద్వి. బంగారుబోఁడుల పాలిండ్లఁ బోలు, బంగారుకుండల పసమించి ..
ద్వి పరమ. ౧. 33. పొ.

బంగారు మొలక = సంపంగి మొక్క.

సీ. పంజాలు కర్పూరపాదపంబులు తెచ్చి జల జోగి బంగారు మొలకదెచ్చి.
హర. శీ. ౯. ౨౫.

ముంగొంగు బంగారము = ముందుకొంగునముడిచి కొన్నబంగారము-అతిసులభము, ఎప్పుడును సిద్ధముగా నుండునది.

(వ్యవ.) భగవంతుఁడు భక్తులకు ముంగొంగు బంగారు.

సీ. ముక్కుఁరత్నముకాని ముంగొంగుబంగారు...
రామలిం. ౧౨.

**బంగారు కడుపువాఁడు.** వి. (బంగారు + కడుపువాఁడు.) హిరణ్యగర్భుఁడు, బ్రహ్మ.

అ. పలుకుపలంది మగఁడు బంగారు కడుపు
వాఁడు ... అనఁగ బ్రహ్మ పేరు లబ్ధమాకి.
ఆం భా. ౧. ౩౯.

**బంగారుకుండ.** వి. (√బంగారు.) సువర్ణ కలశము.

గీ. గుబ్బచనుదోయ బంగారుకుండ లౌనఁగ.
దశా. ౩. ౭౪. రామా. ౭. ౧౧౬.

విశే. బంగారుకుండవలె మనోహరురాలు, మనోజ్ఞురాలు.

గీ. కెమ్మ బంగారుకుండ జలమ్ము లనుచుఁ,
దెమ్మ లతకూన మంచినుమమ్ము లనుచు.
విజ. వి ౭. ౧౪౭.

(ఇది వి. విశే ల కుదాహరణము)

మ. బళిరా కేరకుఁడేరి దక్కి నిటు లీబంగారు
కుం దంచుఁ జం,కలదాటించుచు
పాండు. ౩ ౬౩, చూ. ౬౫, ౬౬.

**బంగారుకొండ.** వి. (√బంగారు) మేరుపర్వతము (శ. ర.)

విశే. ౧ మంచివాఁడు

ఉదా. వీఁడు మాబంగారుకొండ (శ. ర)

౨. ప్రేమాస్పదము.

(వ్యవ) నాబంగారుకొండా నిన్ను విడిచి నే
నుండఁగలనా? నాబంగారుకొండ యేఁడీ
నాభాచాలకొండ యేఁడీ.

**బంగారుతీఁగ(గె).** వి. (బంగారు+తీఁగ.) ఇక్షు విశేషము, ఒకవిధమగు ప్రశస్తమగు చెఱకు. శ్రీ.

(వ్యవ.) చెఱకులలో బంగారుతీఁగ చాల రుచి
కలద్ని పెత్తనిది.

(వి.) ధాన్యవిశేషము.

సీ. బంగారుతీఁగెలు గంగాజలమ్ములు కస్తూరి
నిగరాలు కటకనురులు. హంస. ౪. ౧౭౭.

సీ కణజము లిన్నింద బంగారుతీఁగెల గూర్పఁ
జాలమేమటి ముత్తెసరులు గూర్చ.
కవిజ. ౧. ౧౩.

**బంగాళ.** వి. ఎనిమిది పురుషరాగములలో నొకటి.

సీ భైరవి మాళవి బంగాళి హిందోళి రాగమం
జరియు శ్రీరాగగౌళి భూపాల లెన్మిది
పురుషరాగంబులు హంస. ౫. ౧౭౩.

సీ. భైరవిశ్రీరాగబంగాళిహిందోళి మాళవులును
రాగమంజరియును. ప్రబంధ. ౯౫.

**బంగాళము** వి. (సం. వంగ.) వంగదేశము.

సీ. జోడనల్ ద్రొక్కించు కూరసీవాంగ
బంగాళముల్ పంచబంగాళముగను.
దశా. ౧౦. ౧౧౩.

ద్వి. గౌళ నేపాళ బంగాళ పాంచాల, చోళేంద్ర
ముఖుల రాజులఁ ద్రొక్కఁజేసి.
ద్వి. పరమ ౪ ౭౩౭. పా.

**బంగాళి.** వి. వంగభాష

(వ్యవ.) బంగాళిభాషలో పెక్కులు ఆఖ్యాయికలు వెలువడినవి.

**బంగి.** వి. (సం భంగీ క. భంగి. త. బంగి.)
గంజాయి, మత్తు కలిగించుపదార్థ విశేషము

సీ . జడగాఁజ గంజా బంగి యనఁగఁ గలం
జాహ్వయంబు లలర సాం వి మాన. ౩౪.

జః బంగిముచ్చు

**బంగిముచ్చు.** విశే. (బంగి + ముచ్చు.) బంగి త్రాగువాఁడు. (శ. ర.)

**బంగు.** వి. గంజాయి, కలంజము

సీ. బంగు గంజాయి నాఁ బరగుఁ గలం
జాఖ్య ... ఆం. భా. ౭ ౬౦౪.

ఉ. గుడిగుడి బ్రాగ బంగు జుఱ్ఱి గొబ్బున దిబ్బ గుడాకుముద్దపై, బడి రవలించి ద్రోవిపాగ వచ్చెదుంటిని మించ .. (పార్వ. ౪. ౯౭.)

బంటరి. విశే. (బంటు + అరి. స్వార్థమున.) శూరుఁడు.

ఉ.... భూరిసుఖాధిపత్యములఁ బొందుదురప్పురి బోటుబంటరుల్. (శుక. ౧. ౬౬.)

బంటతికము. వి. (√ బంటు.) దాస్యము.

క. చేరఁడుమాకలఁ బిడికెడు, కూరయుఁ గాని యొక్కపూఁటకూటికి దొరయై, యూరికిఁ బంచినఁ బోఁబడు, పౌరోహిత్యంబు బుద్ధి బంటతికముగా. ద్వా. ౨. ౧౬౩.

బంటి. అవ. నీరు కొండలగువాని పరిమితిని దెలుపు ప్రత్యయము.

లయగ్రాహి. మత్తుకలబంటి యగు నెత్తురులు దోఁయిళుల, నెత్తి చవిఁ గ్రోలుచును ... భార. స్త్రీ. ౨. ౭.

గీ ... మద్దులు మునింగి, పాలు వెంపర్లు తమ కెంతబంటి యనుట .. ఉ. హరి. ౪. ౧౨౪.

వ. ... యమునాజలంబులు నొరనందు ముందర సుందరులు సొచ్చి పదప్రమాణంబు జాను దఘ్నంబు కటిద్వయసంబు మధ్యమాత్రంబు కుచంబుబంటి యని పలుకుచు ... భాగ. ౧౦ పూ. ౧౦౯౯.

ఉ. ఉత్తరశాయకేక్షణకటాక్షవిలాసరసప్రవాహముల్, మత్తుకబంటి తామరల కుందలము న్కలు గండుమీలకున్. విజ. వి. ౩. ౧౫.

ద్వి. కోఁకట నొకపెట్టు రూఢిగాఁ బడితి, మొందకూఁకురి కన్న ముక్కునబంటి. ద్వి. మరిచ్చ ఉ ౧౦౧౧. పం.

గీ. భయము దోడ్తేర ముక్కునబంటి యయ్యె. కేం. పంచ. ౧. ౨౧౧.

(ఇట వృత్తిని నగాగమము.)

బంటు. వి. (సం. భటుః. క. బంటు.) ౧. భృత్యుఁడు, పరిచారకుఁడు.

వ. స్వస్తి శ్రీ శకవర్షంబులు ౧౧౯౭. కెంటి చైత్రశుద్ధ ౫ మంగళవారము నాఁడు విషువ సంక్రాంతి నిమిత్యమున శ్రీ కెలనాంటి రాజేంద్రచోడయరాజులబంటు కెలనాంటి లోని .. కొరపాటి నివాసమున్నైన పోతి నాయకుండు శ్రీ కొణవగిరి త్రిపురాంతక మహాదేవరకు ... ధారాపూర్వకముగా .. ఇచ్చి (కావల్యపురము శాసనము. గు. జి.)

సీ. ... బంటు వరవుఁడు గుండడు నాఁగ దానాఖ్యులుగాఁగఁ దనరు. ఆం. భా. ౨. ౨౭౭.

గీ. పతులప్రస్తరంబు బంట్లకు దీర్పంగ, వలయు ననుట కు. సం. ౧౧. ౬౦౨.

మ. ... తాపం బాఱఁగఁ గాఁగిలించుకొనవే తథ్యంబు నీబంటనే, ..యోపక్వబింబాధరీ. శైవ. ౭. ౫౧.

౨. శిష్యుఁడు.

చ. గొనముల ప్రోక యంగిరసు కూరిమి చుట్టఁడు కేల్మొగిడ్చె పేర్మిని గనుకొన్నబిడ్డ మఱి మాకును బంటు ... (యయా. ౩ ౧౩౦.)

(శ. గ. పా నీకుఁబట్టు ముద్రి పా.)

౩ యోధుఁడు, వీరుడు.

గీ. ... భటుఁడు, పరగు జోదన నెంకన బంటనంగ. ఆం. భా. ౨. ౧౭౪.

సీ తొడరి కెల్చులినైనఁ జెడకెలబడఁద్రోయు పోఁపుగల్గినబంట్ల పుట్టినిల్లు. యయా. ౧. ౩౦.

విశే. ౧. భక్తుఁడు.

సీ. మునిమాపు బలుగంబమునఁ బుట్టి బంటు నక్కలఁ గాచినట్టిసింగంబు వీడు. పా. ౧. ౪౯.

సీ ... బం డన నిశాలీల రొంప్పు.

అం. భా. ౨. ౨౯.

చ. వన గల రొండల స్గదురుబండలఁ గాశల
నిండి పొంగుచా, ద్రుసరత్రుఁకాలచే నిపురఁ
బాటిన నిర్వ్యరిరోగిరంబు .

చంద్రా. ౨. ౪౬

చ. పలురులు పచ్చరాచలువబండల వ్రాలుచు ·

సారంగ. ౨. ౧౯౧.

౨. పొట్టినోఁకలి. (శ. ర)

విశే. ౧. పొుద్దుతేటినది. (అతిగినది. శ ర.)

(వ్యవ) ఇది బండకత్తి; తెగదు. (పాషాణము వంటిది.)

౨. బుద్ధిహీనుఁడు, మందుఁడు, చులుకలేని వాఁడు.

ద్వి. బండలు గాశతాపములు సాష్టాంగ,దండ ప్రణామములో తరిఁదరిఁజేసి

పండితా. పురా. ౧౩౪. పా.

(వ్యవ.) వీఁడు బండ; వీని కెంత చెప్పినను ఒక్క ముక్క రాదు.

(వీనిది బండబుద్ధి యేది చెప్పినను గ్రహింప లేదు.)

జ : బండకొత్తు, బండచింత, బండతనము, బండ తల, బండారు.

బండ[2]. వి. (సం. భండః. క. బణ్ణ. త. వండన్)

౧. ఘోరకృత్యములుచేసి బిచ్చమెత్తెడు ఒక నీచజాతి.

ఉదా : బండవాఁడు, బండది. (శ. ర.)

౨. శైలూషాదులగుజాయాజీవులలో నొకజాతి వాఁడు

సీ. బండలు బూతులు పరిహాసకులు నట్టువా రాదిగాఁ గలవారు దక్క ...

విజ్ఞా. ౨. ౧౧౬.

విశే. ఆకారాయః (శ. ర.)

బండతిట్లు=బండవాతివాండ్రు తిట్టుకొనెడుతిట్లు. (అనఁగా బూతులు.)

గీ. కండకన్నులవాని నాఁకటను బండ,తిట్ల చేతాళకలసారెఁ దిట్టువాని.

అము. ౬. ౨౦.

బండబూతులు = బందవాండ్రు తిట్టుకొను బూతులు. (బండుబూతులు. శ. ర.)

జ : బండగుఁడు. బండాట, బండెత.

బండఁగి. వి ౧. దీము, వేటకాఁడు పశుపక్ష్యాదులను బట్టుకొనుటకై పెంచినమృగము పక్షి లోనగునది.

సీ. ... గాడ్పుమృగము బండఁగిఁ జేసి యుల యించి సెలలోనియుక్తిఁజేయు.

కు. సం. ౪. ౩౪౯.

క. డేగలను వేఁటయురులన్, జాగిలముల జాతి ముంగిసల బండఁగులన్, వేగఁ గొని ...

చంద్రా. ౨. ౪౧.,

౨. వేటకాండ్రు మృగములు మున్నగువానిని బట్టుకొనుట కుపయోగించు కపటయంత్రవిశే షము, ఒకవిధమగు బోను.

క. పొంకించుఁడు మాయిఱ్ఱులఁ,గొంకుల పీసంత్ర గుండ్లఁగొమ్ముల నురులం,బొంకించి దిగువ గాలివ,లంకుల బండంగిబండ్లు పట్టుం డనుచున్. (కకు. ౪. ౪౩.)

క ... కు,క్కలు ప్రోగులురులు కొమ్ములు బండం,గులు పందిపోటులు ...

వరాహ. ౪. ౪౧.

చ. మిడిబిండ్లు బండఁగులుఁ గొమ్ములుఁ బాదులు వల్లెత్రాళ్లుఁ జ,వ్వలకడికోల్ ధరించి యురువంకలఁ జేరికొంత యుద్ధతిన్.

చంద్ర. ౨. ౨౧.

(దీనిని శ. ర. 'బండగు'గా గ్రహించి 'బోను' అను నర్థమిచ్చెను.)

బండఁడు[1] = బండ[1]. విశే. బుద్ధిహీనుఁడు, మందుఁడు.

ద్వి. బండఁ డనక కడు మందరి యనక, రెండు చేతులు లేని మొండి వీఁడనక.

పండితా. పురా. ౧౦౧. పా.

బండఁడు[2] = బండ[2]. విశే. ఆకతాయి. (శ. ర.)

బండగుఁడు = బండ[2]. విశే. ఆకతాయి.

గీ డాంబికులచేతఁ బచ్చిబండగులచేతఁ, గల్ల రులచేత దర్పించుఁ గలియుగంబు.

[illegible]

బండకెత్తు. అ క్రి. (√బండ[1].) మొండికెత్తు, ఆకతాయయగు.

(వ్యవ) వాఁడు బొత్తిగా బండకెత్తిపోయి వాఁడు

బండచింత వి. (√బండ[1]?) తింత్రిణీవృక్షభేదము, ఒకజాతి చింతచెట్టు

సీ. బండచింతయు ... ల్లబలుసు ... రభి చీకిరేను కూఁకుడు సెమ్మి ప్రేంకణమ్ము.

హంస ౪ ౧౧

బండతనము. వి (బండ[1] + తనము.) మొండి తనము

క. ఇట్టికి నూఁడినవాఁడో, యొట్టిడుకొన్నాఁడొ యనుచు నుల్లసమాడం, బట్టుచు మగిడి చూడక, పత్తనమున కేఁగె లజ్జ బండ తనమునన్. (ఉ. హరి ౧. ౩౬.)

బండతల. వి. (బండ[1] + తల) బట్టతల, జుట్టు లేనితల. (డాయిరాలె నున్నగానున్నతల.)

సీ. సెలయేఁటినింగిరయేఁచాలముల్ వాయింప నెండ మావులఁ బట్ట బండతలయు, బ్రోఁకాలు ముడి పెట్టి ... (శు. సం. ౧. ౧౩౫.)

బండము. వి. (సం. భాండః) వస్తువు, వినువు.

క. కాలు చాచిగ గలబండము, గొలుచు సెడం దూఁచుతోటఁ గుటిలతఁ దఱుఁగన్, గాలి చినఁ దూఁచిన బండము, దళిమున చేపారి మీఁద దండువు దగులున్.

విజ్ఞా. ౨. ౩౦.

బండరి = బండారి. వి. (బండరు + ఇ[1].) కోశాధికారి

ద్వి. బండరుల్ గొట్టరుల్ బానిసె లీకు, బండ రుల్ గొట్టరుల్ బానిసెల్ గాఁగ.

పండితా పర్వ ౩౧౨. పా.

ఉ . సంపన్నుఁ డనం బ్రసిద్ధిగను బండరికే తగుఁగాక భూమిపై, సెన్నఁగ

చెన్న ౪. ౩౩౪

బండరు = బండారము. వి. కోశాగారము

ద్వి ప్రతిలేని తనయింటిబండరుధనము, కత సహ్రా ... దసాధ్యః నిలిం

పండితా పర్వ ౩౧౨. పా

జ: బండరి.

బండరువు = బాండారువు, బండారము. వి. (సం. భండారః) ౧. కోశాగారము, ధన గృహము, బొక్కసము.

సీ. బండరు పంచన బండార మంచన బొక్కస మంచనఁ బొసఁగుచుండు, వల్లభాండా గారము (ఆం భా. ౨. ౧౫)

క. ఆసౌమ్యునకును భూసుర, భాసురహస్తములు గాఁడె బండరువులుగాఁ, జేసినపురూరవుఁడు ది, గ్వాసితవిశకీర్తి చక్రవర్తి జనించెన్.

పి శకుం. ౪. ౨౫.

ద్వి. బండరువం దున్న పద్మరాగములు, బండరు దెంచుదు బ్రాలెల్లినట్లు.

పండితా. మహిమ. ౨౬౫. పా.

౨. కోశము, బొక్కసము.

గళితేశపటీమి(క్రొమ్మి సిమి,సింది గంధములు మున్నిరిగో౯ఁ జూచి.

అ. మ. క. ౨. ౧౨. పా. ౨౨. పం.

సీ. గొరగణ్ము మైలారుఁ గొనియాడు సొక కేళ నొసలిపై బండారుపసుపుఁ దాల్చి.

కాశీ ౩. ౨౩౦.

౨ వృక్షవిశేషము, ఒకజాతిచెట్టు.

సీ. చలికి బండారాకుసందుల డిగి మంచు తుంపురుల్ దుప్పటిఁ దొప్పదోఁగ.

రా ౯. ౨. ౪౦

జ: బండారుపిచ్చిక.

బండారు² = బండారము. వి. ధనము.

(చూ. బండారిల్లు.)

జ: బండారిల్లు.

బండారుఁడు. సం. వి. అ. పుం బచ్చెలను గావు వాఁడు. (శ. ర.)

బండారుపిచ్చిక. వి (√బండారు¹.) పీత ముండము, పచ్చతలపిచ్చుక. (చి. ని., శ. ర.)

బండారువు = బండరువు. వి. బొక్కసము.

మ. తనబండారువు చూఱ యిచ్చెనొకో కంద ర్పుండునేఁ డంచు .

కు. సం. ౧౦. ౩౯౩

బండాలము=బండవలము. వి. (సం. భాండం.)

౧. సంచిమొదలు, మూలధనము

గీ. మొదలు బండాల మనఁ దగు మూలధనము.

ఆం భా. ౨. ౨౬౩.

౨. సామర్థ్యము. (శ. ర. బండారము. అని వ్యవ. దాని బండారము బైటపడినది.)

బండి. వి. (క. బండి. త వండి. . బ. బండులు, బండ్లు.) ౧. శకటము.

గీ. ...బండ్లు యటఁగ శకటసమాఖ్యలై యలరు చుండు. (ఆం. భా. ౨. ౨౦౭.)

గీ. తెప్పదెరలఁగ బండు తేకెంచుచున్న,యవి మహాత్మ ... (భార. అను. ౪. ౩౦౮.)

సీ. బండులు విఱుగంగఁ బైదాఁటి పండిళ్లు పడఁ ద్రోచి తలుపులు సడలనొత్తి.

హరి. పూ ౬ ౧౩౮.

౨. రథము.

సీ ఎఱుఁగులుఁ బలులుఁ గారెనుఁబోతులును బూనుబండిపై దేవాంతకుండు వచ్చె

రామా. ౮. ౬౬.

సా: నిండుబండికిఁ జేట బరువె=ఘనకార్యము నిర్వహించువానికి ఆసందర్భమున నొకచిన్న కార్యము చేయుట కష్టము గా దనుట.

క .శౌ,ర్యాటోప నిండుబండికిఁ, జేటబరువె యువనినాథ చింతింపంగన్

రుక్మా ౩ ౧౨.

ఇట్లే నిండుబండికిం జేట భరమె

ఉ ఘోరపుబాధలఁ బొందుచొంటిమైఁ, జాటిలునాత్మకున్ భరమె పాపము నీయది నిండుబండికిం, జేట భరంబె యేమిటికిఁ జేయవు వి(ప్రుఁడ కిల్బిషంబులన్.

సైవ ౪ ౪౬.

సా కొడిబండ్లకుఁ బదములు సాఁచుట = అక్క ఱకుమాలిన సాహసకృత్యమును జేయుట.

ద్వి పాకొడిబండ్లకుఁ బదములు సాఁచు, వీఁతెఁడిపగిది వివేకంబు మాలి.

ద్వి. హరిశ్చ. ఉ ౨౪౦౪. పం.

చ. పిలిచితినన్న నిన్ను నతిథీశుఁడవి(ప్రుఁడ నమ్మి నాఁడ నీపలు కమృతంబు గాఁ దగునె పాకొడుబండ్లకుఁగాళ్లు సాఁపఁగా, వలవదు నన్ను పోటుమగఁడై యిటుచేసితిగాక యాసతో, విలుతు ... నీకులమంచిదఁ జాలమంచిదన్ (ఉ. హరి. ౨. ౩౧.)

జ: బండికన్ను, బండికల్లు, బండికంపటి, బండి గుతిగింజ, బండిగురివెంద, బండిపులి, బండి

బాట, బండిబారు, బండిమొగ్గరము, బండి రక్కసుఁడు, బండిరేక్క

బండికన్ను. వి. (బండి+కన్ను) ౧. బండి చక్రము.

సీ కన్నులయ్యును బండికన్నులయ్యును జంద్ర సూర్యు లెవ్వనికడ సొంపు గనిరి
ద్వా ౧౨ ౧౦౧.

క. బాసలఁట బండికండ్లఁట, చేసన్నఁట (ఇట నూఁతపదము.) శుక ౨ ౧౧౩.

౨. రథచక్రనాభి, బండికంటి నడిమిరంధ్రము

సీ బండిక ల్లనఁగను బరగును జక్రంబు బండికన్న నఁగను బరగు నాభి
ఆం భా ౨ ౨౦౨

బండికల్లు(లు). వి (బండి + కల్లు) బండి చక్రము, బండికన్ను, రథచక్ర

గీ త్రిపురసంహార మొనరించునపుడు హరుఁడు, బండికల్లు నిమేను గిండి ...
ముంచ ౨. ౮౦.

గీ. కన్ను వలమానికము బండికల్లు జగిలె, గాఁడు సై యిమ్ము మిక్కిలికంటివేల్పు, నలరఁజేయువలంతి యగ్గలపుఁ జల్లదనము నెఱపుచు నంతకంతకు వెలింగె.
అచ్చ. రా అయో ౧౯

సీ ఆది మహోమయం బగునొక్కచక్రంబుఁ గల్పించి బ్రహ్మ జగద్ధితముగఁ, గల్పించి యాబండికలు డొల్ల .. (కాశి. ౧ ౪౪.)

సీ. బండిక ల్లనఁగను బరగును జక్రంబు
ఆం. భా. ౨. ౨౦౨.

బండికుంపటి. వి. (బండి + కుంపటి.) ఒకచోట నుండి వేఱొకచోటికి తీసికొనిపోవుటకు వీలగు నొకవిధమైనకుంపటి, బంగల.

గీ. బంగల యనంగ బండికుంపటి యగు భర...
ఆం. భా. ౨. ౨౮౧.

బండిగిల్లు. అ. క్రి. కడగండ్లు పడు, కష్టముల ననుభవించు. (శ. ర.)

బండిగురిగింజే. వి. (√బండి.) బండిగురివెంద పూస.

వ. బండిగురిగింజ లీఁగ చప్పరంబులఁజొప్పున నప్పరంబు నంటు కప్పురంపుటనంటి గుప్ప మనక.
శు. రా ౬. ౫౬.

సీ. వల్లగిం చెన పూలి తెల్లగిం చెన యుత్తరేను గుబ్బిరి సంబరేను బండిగురిగింజ ..
హంస ౪. ౧౦.

బండిగురివె(ర్వె)ంద. వి. (√బండి) మాధవి, ఒకజాతిగురివెంద తీ.

సీ తగును మాధవియు బండిగురివెంద,వంగ. .
ఆం. భా ౨. ౫౨

సీ వర్తించుఁ బూఁదేనె వాఁకచెంగట బండి గుర్వెంద పొదరింద్లఁ గొంతతడవు.
భాస ౪. ౯౬

ద్వి. కుందవర్ధనములు కొండగోఁగులును, బండి గుర్వెందలు పారిజాతములు.
ప్రభు. ౨ ౧౭. పొ. ౭. పం

సీ. కన్నె గేదఁగిసంపెఁగలగుంపుసొంపులు గలుగు గండపుచెట్లు గ్రందుకొన్న,చోట నిం పైన పన్నీటికాలువవెంట నందపు బండిగుర్వెంద పొదల
ఇందు ౩ ౪౪.

బండిపులి. వి. (√బండి) ఒకజాతిపులి.

ద్వి మువ్వల గిలగిల మొఱయ జాడించి, క్రొవ్వున నుపొంగుకొమరుసార్వములఁ,గని నంతనే కురంగముల సంఘములఁ, దెసపడి చెండాడు పెనుబండిపులులు.
అ. ను. క. ౫. ౨౨౧. పొ. ౨౬ పం.

సీ. కనుమటుం గొనసూర్పు ననుబిల్లా బిద్దెనెడ బండిపులితూర యిది కృపాలు.
చంద్రికా. ౨. ౪౭

బండిబాట. వి. (√బండి.) ఘంటాపథము, రాజమార్గము.

సీ. బాట యనంగను బండిబా టనఁ దగు ఘంటాపథము ... (ఆం. భా. ౨ ౯.)

బండిబారు. వి (బండి + బారు) రథసైన్యము.

చ. . అట్టపై, నిలిచినకృత్తమ స్తకము విచ్చఁ గొల్చుఁగ బండిబారునన్ (కకు. ౫ ౧౭౪.)

బండిమొగ్గరము. వి. (√బండి) శకట వ్యూహము (శ ర)

బండిరక్కసుఁడు. వి (√బండి) శకటాసురుఁడు (చి ని)

బండిరిక్క. వి (√బండి.) రోహిణీనక్షత్రము (శ. ర)

బండు. వి. (క. బండు.) ౧. అవమానము (అకతాయతనము శ ర)

గీ తాను భిక్షాకపాలంబు దాల్చి వచ్చి బండు సేయుటకంటె రాకుండు టుచితు

కాశీ ౭ ౬౦

౨ అకతాయమాట

(వ్యవ.) నన్ను వాఁడు బండుబూతులు తిట్టి నాఁడు. (శ ర)

బండెత. వి. (√బండ².) బండజాతి యాఁడుది.

ద్వి మిండెతలక్కత్తెకి మిగిలినగొంట్లు,కొండెంపుఁ గొలువులు బండెత లచ్చులు

పండితా. పురా ౧౧౭ పా.

బండ్లకల్లులు. వి. బ. బాలక్రీడావిశేషము.

సీ. బండ్లకల్లులఁ జొప్పబెండ్లమంచంబులు గంగెద్దులాటలు గీ . ఆడుకొంటి

హంస. 3 ౧౪౭.

బంతి¹, వి. ౧. కందుకము, చెండు.

చ. ఇరువురు నీలనీరజనిరీక్షణ లించినవేడ్కతోఁ బరస్పర మెదిరించి కాంచనపుబంతుల. దచ్చనవాటులాడఁగా. (శైవ 3 ౯౫.)

ఉ. పట్టక ముందె క్రొన్ననలబంతులు గందును గోరు నాటఁగన్, గట్టిగ నుందుఁగొంత లను (నీలా. ౨. ౨3.)

గీ. కందుకము చెండు బంతి నాఁగను దనర్చు. ఆం భా. ౨ ౧౭౪.

౨ బాలక్రీడావిశేషము, చెండుతో నాడెడి యాట, బంతియాట.

సీ. గోటదొర్లుడుకాయ గొబ్బిళ్లు కోపిల్ల నీగ పోగిస బంతి దూగిలాట

హంస 3. ౧౪౭.

సీ. తూరనతుంకముల్ దోపిడియాటలు బంతి యాలంకి ప్రబంధ. ౭౧3.

3 పుష్పవృక్షవిశేషము, ఒకజాతి పువ్వుల చెట్టు.

ఉదా బంతిపువ్వు, బంతినారు. మొ॥

౪. పేటకాంద్రను, చోరులు నుపయోగించు ఓషధివిశేషము

గీ భల్ల మది యేల యాయచ్ఛభల్లములకు, నయ్యె యీబంతి నీకబంతి యయ్యెనేని.

చంద్రా ౨. ౪3.

గీ బంతి తలముళ్లు వాకట్టుబదనికలును, నక్క కొమ్ములుఁ బూనువా రుక్కుమిగిలి.

సుద. 3. ౭౭.

ద్వి తలముళ్లు చా క నిద్దపుగద్దగోరు, బల పంపుబదనికల్ బంతి కత్తెరయు

ద్వి పరమ. ౭. ౪౦౫.

బంతి². వి. (సం. పంక్తి. ప్రా. పంతి. క. బంతి.) ౧. వరుస, పంక్తి

సీ. . . బారు బంతి, పదుపు చాల్ చాలుపు పొఁజు సొరిది చాలు నాఁగను బంక్తిపేరు దగును (ఆం. భా. ౨. 3౪.)

ఉ. మనుజాం డీతఁడు ... యొంతటివాఁడు వీఁ
డయిన బందాకోరుఁగాఁ జేసెదన్.
హంస. ౨. ౩౯.

బందాటము. వి. అభినివేశము, పట్టుదల.
గీ. రూక లడుగుచుఁ దుదిఁ బచ్చకాయతైన,
గొడఁబడుచు హస్తగత మైన గొడియ
నడచి, దొడ్డబందాటమునఁ గొకఁ ద్రోసి
కొనుచు, గుడిసెజంతలు తెరువాటు గొట్టి
రవుడు. కవిక. ౪. ౯౫.

బందాము = బందము. (శ. ర.)

బందాయి = బండ. విశే. వశవర్తి, లోపడిన
వాఁడు.
ద్వి. చోళేంద్రముఖుల రాజులఁ జొక్కఁజేసి,
తనకు నైజంపుబందాయిలం జేసి,కొని...
ద్వి. పరమ. ౪. ౨౩౨. పా.

బందారు = బండారు[1]. వి. ౧. హరిద్ర,
పసుపు; పసుపుచెట్టు.
సీ. ... పసుపు బందారు నాఁగను హరిద్ర
చను (ఆం. భా ౨. ౨౪౯.)
౨. వృక్షవిశేషము, ఒకానొకచెట్టు.
సీ. గొంగడిముసుఁగుతో గొల్లలు చట్రాతిపైని
బందారాకుఁ బఱచికొనఁగ.
శుక. ౨. ౩౪౨.

బందారుబసవన్న. వి. బాలక్రీడావిశేషము.
సీ. కుమ్మెదరేఁపుళ్లు కుమ్మరసారెలు బందారు
బసవన్న పత్తికాయ. (హంస. ౩. ౧౪౬.)

బంది = బందె. విశే. (సం. బంధీ. క. బంది)
నిర్బంధింపఁబడినవాఁడు, నిర్బంధములో నున్న
వాఁడు.
గీ. విక్రమకృతులైన యబ్బందివేల్పుకెల్ల, మనఁగఁ
గోరిక సేవాని మక్కువమీఱి.
హర. ౪. ౪౮.

వి. ౧. ఇబ్బంది, కష్టము; నిర్బంధము; చెఱ
సాల.
(వ్యవ.) తానదుకు డబ్బు లేక చాల ఇబ్బంది
పడితిమి. కాని యిప్పుడు డబ్బుదొరకినది.
ఇంక బంది లేదు.
ద్వి. భావింప మన మీఁద బందిఁ జిక్కితిమి,
దేవర గలిగ నా చావు దప్పెడిని.
బస. పు. ౨. ౩౯౬. పా.
సీ. ఏతదర్థము కదా ఋషి దేవతాకోటి బందిఁ
బెట్టినవాఁడఁ బట్టి తెచ్చి.
కాశీ. ౬. ౨౨౧.
౨. బందిపోటు. (నిర్బంధము అని శ. ర.)
సీ. అధ్వరాదికసత్క్రియల్ ప్రవర్తింపక
తక్కి లి బంది యేదిక్కులందుఁ, దఱు
చయ్యె ... (భార. శాం. ౨. ౭౯.)
ఇ: బందికత్తె, బందికాఁడు, బందిగము, బంది
గీఁడు, బందిపోటు, బందివట్టు, బందివాటు,
బందివెట్టు.

బంది. సం. వి. ఈ. స్త్రీ ౧. బంధము, చెఱ. ౨.
కైది.

బందికత్తె = బందెకత్తె. విశే (బంది+కత్తె.)
దోపుడుకత్తె, బందెపోటుచేయుస్త్రీ.
గీ. తలఁచు పూయుదు గోలగందంబుఁ బసుపు,
బందికత్తెలు మరకప్రపంచవేళ ...
కాశీ. ౩ ౧౦౯.
మ.... నాప్రాభీర్యాముం గోలపోయి బలిష్ఠుం
డగుకామునిచారిఁ బడి నే నెట్లోర్తు నే బందిక
త్తెబడిం బాపువుఁడ్వష్ణ యిప్ప దకటా
దీర్ఘాకృతిన్ రొప్పెడిన్. (భాగ. ౯. ౫౩౫.)

బందికాఁడు = బందెకాఁడు. విశే. (బంది +
కాఁడు.) బందిపోటు చేయువాఁడు.
గీ. పేర్చి దివసక్రమంబున పీడ బలిసి, బందికాఁ
డైనఁ బొరుగులు బ్రతుకఁ గనునె.
మను. ౩. ౧౨౧.

సీ. విహరింప బందిశాలఁదవ్వులకెమకస్నానఁదవదయద స్ఫురణచేసదటుగల్గి. (పారిజా. ౪. ౧౦౩.)

బందిగము. వి. (√బంది. క. బందిగ.) చెఱసాల.

గీ. ధర్మమార్గంబు దప్పనితండ్రి నుగ్రసేను శృంఖలాబద్ధునిఁ జేసి బందిగమున నిడి మేటిదైత్యులఁ గాపుపెట్టి ...
వి. పు. ౫. ౩౧౨.

గీ. అదరుఁ గారాగృహంబు గుయ్యారము చెఱ, సాల బందిగ మనంగను
ఆం. భా. ౨. ౨౨౬.

బందిగీఁడు. విశే. (బందిగము + ఈఁడు.) చెఱసాలయం దుంచఁబడినవాఁడు.

సీ. ధర బందిగీలఁగాఁ దాల్చి తెచ్చితిగదా మాళవచోళసేపాళనృపుల ...
రంగా. ౨. ౩౯.

బందిపోటు. వి. (√బంది.) ౧. నిర్బంధపుంచి కొట్టు, చౌర్యము, దొంగతనము, నిరోధించి దోఁచుకొనుట. (దోచుట. శ. ర.)

సీ. పరగుఁ దెక్కలి యన బందిపోటనఁగను దొంగతన మనంగఁ జౌర్యంబు చెల్లు ...
ఆం. భా. ౨. ౨౯౨.

బందిపట్టు. అ. క్రి. (బంది + పట్టు.) బందిపోటుచేయు.

సీ. కన్నంబు పెట్టి తెక్కలి గాని యంకంబు కలుపురతో వాడి బందిపట్టి.
దశకు. ౬. ౯౫.

సీ. మగ లాఁడుబాలకి మరిగి ప్రుచ్చిలి బంది పట్టి కన్నంబులుపెట్టి తెరువుఁద్రెక్కొని ...
కు. సం. ౫. ౭౨౫.

౨. నిర్బంధముచేయుట.

సీ. బిడనిపెక్కువ మట్టుగడచిన బసకొట్టుఁ బొందునకుఁ దొడఁబట్టు బందిపట్టు.
ఉత్త. ౬. ౧౫౧.

బందివాటు. వి. (√బంది.) నిర్బంధము.

ద్వి. కనుఁగొన కోఁ కైన కాలకౌశికునిఘనత మా మ్మను బందివాటులమాత.
ద్వి. పారిజా. ౬. ౧౦౯౫. పఠి,

(బందివాటులమాత = నిర్బంధములకు పుట్టినిల్లు.)

బందిపెట్టు. అ. క్రి. (√బంది.) బందిపోటుచేయు, నిర్బంధించి దోఁచుకొను.

ద్వి. జంగమార్చన చేయు సమయంబునందు, దొంగలు బందిపెట్టంగ నూహించి.
బస పు. ౨. ౩౮౨.

బందు¹. వి. (త ఎరుసు.) గృధ్రవిశేషము, బోరువపక్షి, (రాబందు. అని. శ. ర)

గీ. పొత్తుకొని మొత్తులాడి పెన్నెత్తురోలుకఁ, జూచువారల కెంతయు సొబగుమీఱ, బూరుగులపోల్కిఁ బొలిచి రపొప్పియసేల, బూచిగములును బందులుఁ బొదలియాడ.
అచ్చ. రా. యు. ౧౩౫.

బందు². వి (సం. బంధః. క. బందు.) ౧. ఆవరణము, అచ్ఛాదనము.

ద్వి. గౌన శైవయిలవీఁగగుమి గప్పకొన్నునుఁ బొన్నచెట్టుబందువ నందమైన, చందురా తిన్నపై ... (విష్ణు. మా. వి. ౪. అ.) (శ. ర.)

౨. చుట్టుకొనుట, అల్లికొనుట.

వ. ... పోఁకబ్రూఁకులతీఁగలబందునఁ బొందిన ద్రాక్షపందిళ్ళనందునన్ . .
(బందున = అల్లికలో.) ఉ. రా. ౯. ౨౪.

౩. పెట్టె మొ. వానిమూలలబిగించెడి యినుము మొదలగువాని తగడు. (శ. ర.)
(వ్యవ.) ఆపెట్టెకు బందులు వేయుము.

౪. నిరోధము, కట్టివేత. (శ. ర.)

౩. పశువులపందుగ, చేలలోఁ బడిన పశువులను విడిపించుకొనుట కిచ్చెడి సొమ్ము. (శ. ర.)

౪. ఎనుములకు బంద పాలికొనఁగొన వగు . . ఒదయుఁ డాఁకేగి విడిచినవో. (విజ్ఞా. ౨. ౪.)

౫. ఇబ్బంది, కష్టము.

గీ. చుట్టముల కెల్ల పగఱులుఁగట్టి యురక, ప్రజకు బందెలు గొల్పంగఁ బ్రాభుఁ డీవు.

శేష. 3 ౧౯౨.

ద్వి. పోనీక బందెలఁ బొరలించి తపసి, దానవుం డై నల్లద్రావుచున్నాఁడు.

ద్వి. మారిక్ప. ఉ. ౪౫౦ పం.

సీ. ఆదికాలమునాఁటియగ్రహారంబులు బందెలు గల్పించి పాడుసేయు. (వి. పు. ౨. ౧౦౩.)

జ : బందికత్తె, బందకాఁడు, బందగొను, బందదొడ్డి, బందెలపోతు, బందెలమారి, బందెలుసుట్టు, బందవట్టు.

బందికత్తె = బందికత్తె. విణ. (బంద+కత్తె.) దొంగుదుకత్తె.

సీ. మదనసమ్మోహనమంత్రాధిదేవతల్ పంచ శిలీముఖు బందికత్తెలు . .

భాగ. ఉ. ౪౪౫.

బందికాఁడు = బందికాఁడు. (√బంద.) వి. బందికారి, బందిపోటుదొంగ. (చెఱలోవేయు వాఁడు. అని శ. ర.)

సీ. . . . బందకాఁ డనఁ దగు బందికారి.

ఆం. భా. ౨. ౨౯౧.

చ. జలరుహమిత్రుఁ డాశ్మరుచిభంపదఁ జేకటి బందకాఁడితో, గలఁగుచు బిలలోనడిఁగె కొనె . . .

పారి. ౨. ౫౯.

బందిగొను. స. క్రి. (బంద + కొను.) ౧. నిరోధించు. ౨. కష్టపెట్టు, ఇబ్బందిపెట్టు, చెఱ పెట్టు.

గీ. అర్క. శశ్యాది రాజులిర్గాంతుగములఁ, దొరకెల బందఁగొని యుండు మాఱు లేక, యంధకారంబ్యంబితంబైన . . .

కగక. ౪. ౯౨.

(రందర్ధముల కిదియే యుదాహరణము.)

బందెడ. వి. తెల్లవావిలి, శ్వేతసురస. కీ.

సీ. . . బందెడ యనఁ దెల్లవావిలి యన శ్వేత, సురసాభిధాన మై పరగుచుండు.

ఆం. భా. ౨. ౫౧.

వా : బందడకు పచ్చి లేదు, కొడలికి క్రొత్త లేదు.

బందె(ల)దొడ్డి. వి. (బంద + దొడ్డి.) బందె, పశువులచెఱ.

గీ. పుట్టినిలు డించి యత్తయి ల్మెట్టినట్టి, కోడలి తెలుంగు కొఱకుచే స్వేదవాడి, బందదొడ్డిఁ జను కోడెచందము. (రా. వి. 3 ౧౪౨.)

బందెలపోతు. విణ. (√బంద.) నిర్బంధము కలిగించువాఁడు, కష్టపెట్టువాఁడు. (చెఱవేయు స్వభావము కలవాఁడు. శ. ర.)

ద్వి. అచ్చి వారొదుర బ్రహ్మకుఁ బోవరాదు, పురిలోన బందెలపోతులఁ దనఁగ.

ద్వి. మారిక్ప. ఉ. ౩౨౭. పం.

బందెలమారి. విణ. (√బంద.) ౧. బందెల పోతు.

ఉ. కొందల మందెడి స్మనను గొబ్బున నాయక వాలకించి యా, బందెలమారిచంద్రికగ భాగ్యముఁగోరకు మానదందమా.

చంద్ర. వి. ౨. ౧౩౨.

౨. చెడ్డవాఁడు, దుష్టుఁడు.

సీ. మాళ బందెలమారి మండటి పాపాలమొద్ద ధగిడి.

హంస. ౫. ౧౧౮.

బందెలుసుట్టు. స. క్రి. (బందెలు + చుట్టు.) నిర్బంధపెట్టు.

౬. బందులఁ బట్టి సజ్జనుల బాధలఁ బెట్టి యసాధకోటిఁ బెన్, బందెలుపట్టి యూరములు పట్టి పథంబులు గొట్టి బిట్టరై.
భాగ. ౬. ౧౦౪.

**బందె(లు)పట్టు.** స. క్రి. (బందె+పట్టు.) ౧. నిర్బంధపఱుచు.

గీ. భరత మాతల్లి పతి బందెపట్టి నీకు, రాజ్య పట్టంబునకు వేఁడి రాము వదలి, కనిచె
భా. రా. అయో. ౨౩౩.

౨. కొల్లగొట్టు.

సీ. చోరసంచయ మగ్రహారముల్ బందెలుపట్టి సమస్తసంపదలు గొనిరి
వి పు ౨. ౧౨౪.

**బంధకము.** విణ. (అ. ధికా. అ) ౧. బంధించునది, కట్టునది. ౨. పట్టుకొనునది. ౩ స్త్రీలను చెఱుపువాఁడు, రతిహిండకుఁడు.-వి అ. పుం. ౧. కట్టుత్రాడు. ౨. ఆనకట్ట. ౩. వినిమయము, మాఱుపు. ౪. ప్రతిజ్ఞ ౫. పత్తనము.-వి. అ. న. ౧. చెఱ, బంధము. ౨. చెఱసాల.

**బంధకరణము.** సం. వి అ. న. సంకెలవైచుట, చెఱపట్టుట. (విల్యమ్సు)

**బంధకి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పుంశ్చలి, ఱంకుటాలు. ౨. పణ్యస్త్రీ, భోగముది. ౩. పెడిరేనుఁగు, ఆఁడయేనుఁగు. ౪. గొడ్డురాలు, వంధ్య.

**బంధనగ్రంథి.** సం. వి. ఇ. పుం. ౧. పశ్వాదులకుఁ గట్టెడికట్టు వెండలగువానిముడి. ౨. ఉరి. ౩. పశువులనుగట్టు పలుపు.

**బంధనము.** సం. విణ. (అ. తా. అ.) ౧. బంధించునది, కట్టునది. ౨. నిరోధించునది, అడ్డగించునది. ౩. ఆశ్రయించినది.-వి. అ. న. ౧. బంధించుట. ౨. కట్టుట, సంకెల మొదలగువానితోఁగట్టుట. ౨. చుట్టుఁగ్రమ్ముకొనుట. ౩. బంధము, కట్టు. ౪. కట్టుటకైన సాధనము. (గొలుసు, త్రాడు మొ॥ ౫. పట్టుకొనుట. ౬. చెఱ, నిర్బంధము. ౭. చెఱసాల. ౮. రచన, నిర్మాణము ౯. కూర్పుట. ౧౦. గాయపఱచుట. ౧౧. తొడిమ, వృంతము. ౧౨. ప్రణాదులకుఁ గట్టెడి కట్టు. ౧౩. అడ్డు, ప్రతిబంధము. ౧౪. సంబంధము. ౧౫. వధము, కొల.

**బంధనస్తంభము.** సం. వి. అ. పుం. ౧. ఏనుఁగు మొ॥ వానినిఁ గట్టుకంబము. ౨. కొండగోఁగు. శ.

ఇక్లే. బంధస్తంభము

**బంధనాలయము.** సం. వి. అ. పుం. చెఱసాల.

ఇక్లే: బంధనాగారము. మొ॥

**బంధము.** సం. వి అ. పుం. ౧. కట్టు, ముడి. ౨. (తిలపెండ్రుకలుకట్టు) దారము. ౩. సంకెల, కట్టుగొలుసు. ౪. చెఱపట్టుట, బందిచేయుట. ౫. పట్టుకొనుట. (గజబంధము.) ౬. రచన. (పరుషబంధము మొ॥) బంధము ౭. నిర్మాణము. ౮. సంబంధము. ౯. కూర్పు, ఒకటిగాఁగూర్చుట. (అంజలిబంధము) ౧౦. వ్రణములకు కట్టెడుకట్టు. ౧౧ ఒద్దిక, విశమత్యము, ఆనురూప్యము. ౧౨. పరిణామము, ఫలితము. ౧౩. సంయోగవిశేషము. (ఇది కామశాస్త్రమున ౧౬ చెప్పఁబడినది.) ౧౪. (అలం) చిత్రాలంకారవిశేషము. (ఖడ్గబంధము, పద్మబంధము మొ॥ ౧౫. (పటము మొదలగువానికి చుట్టువైచు.) చట్టము. ౧౬. దేహము. ౧౭. కడుపు. ౧౮. (నదికి) సంకెలకట్టుట. ౧౯. కన్నులు చక్కఁగా మూఁతపడని రోగవిశేషము.

**బంధించు.** సం. స. క్రి. కట్టివేయు.

సీ. ... ఇంద్రియవ్యాపార మడిగించి క్రియలెల్ల విడిచి పుణ్యపాపబంధంబుల సోఁకిబంధింపంగఁ బడక మనోవృత్తి నొడిచి...
భార. ఆది. ౫. ౬౦.

బంధింపించు. సం. స. క్రి. కట్టించు.

వ. ... వలునిచే పేరుపు బంధింపించి తన్మార్గంబునం జని . . (భాగ. ౨. ౧౬౭.)

బంధితము. సం. విశే. (అ.ఆ.అ) ౧ బంధింపఁబడినది, కట్టఁబడినది. ౨ చెఱపెట్టఁబడినది.

బంధిత్రము. సం. వి. అ. పుం. ౧. చర్మవ్యజనము, తోలువీవన. ౨. మచ్చ, కల.
(విల్యమ్సు.)

బంధిద్రుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు.

బంధుకము. సం. వి. అ. పుం. బంధుజీవము, మంకెన. చె. - వి. ఆ స్త్రీ. బంధకి, అంకుటాలు. (విల్యమ్సు)

బంధుకుఁడు. సం. వి. అ. పుం. జారజుఁడు, అంకుమగనివలనఁ బుట్టినవాఁడు.

బంధుజీవము సం వి అ. పుం. మంకెన. చె. (ఇస్లీ. బంధుజీవకము.)

బంధుత. సం. వి ఆ. స్త్రీ. ౧ బంధుత్వము. ౨. బంధుసమూహము.

బంధుత్వము. సం. వి. అ. న. చుట్టఱికము.

బంధుర. సం. వి. ఆ స్త్రీ. వేశ్య.

బంధురము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఉన్నతానతము, మెరకపల్లములుగా నుండునది, విషమము. ౨. నమ్రము, వంగినది. ౩. వంకరైనది, వక్రము. ౪. రమ్యము, ఇంపైనది. ౫. బధిరము. చెవుటిది. ౬. బాధకము. -వి. అ. పుం. ౧. హంస, కలహంస. ౨. పక్షి. ౩. కొంగ. ౪. వాయువిడంగము. ౫. తిలకల్కము, తెలకపిండి. ౬. అఁడుగులి. ౭. బంధుజీవము, మంకెన. చె. ౮. మకుటము. ౯. వెలపిండి, పత్తువు.

బంధులము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. నమ్రము, వంగినది. ౨. రమ్యము, ఇంపయినది. వి. అ. పుం. బంధుజీవము, మంకెన. చె.

బంధులుఁడు. సం. వి. అ. పుం ౧. అంకుటాలికొడుకు, అసతీపుత్రుఁడు. ౨. వేశ్యయింటి అనుచరుఁడు.

శ్లో. పరగృహలలితాః పరాన్నపుష్టాః, పరపురుషైర్జనితాః పరాంగనాసు, పరధననిరతా, గుణేష్వవాచ్యా, గజకలభా ఇవబంధులాలలామః (మృచ్ఛకటిక. ౪. ౨౭.)

బంధువు. సం. వి. ఉ. పుం. ౧. చుట్టము. ౨. సహచరుఁడు, తోడివాఁడు. (ప్రవాసబంధువుః ధర్మబంధువు మొ॥) ౩. జ్ఞాతి. ౪. మిత్త్రుఁడు. ౫. బంధుజీవము, మంకెన చె. ౬. ఒకవర్గమునకు నామమాత్రమున చేరినవాఁడేగాని నిజముగా దాని విహితకృత్యములు చేయనివాఁడు.
ఉదా ' క్షత్రబంధువు బ్రహ్మబంధువు.

బంధూకము. సం వి అ పుం ౧ మంకెన. చె. ౨. వేఁగిస, పీతసాలకము. - న. చె. బంధూకపువ్వము.

బంధూరము. సం. విశే. (అ ఆ అ.) ౧. ఉన్నతానతము, ఒకచో ఉన్నతమై మఱొక్కచో ఆనతమునైనది, విషమము. ౨. నమ్రము, వంగినది. ౩. రమ్యము, ఒప్పిదమైనది. - వి. అ. న. ఛిద్రము, రంధ్రము.

బంధూలి. సం. వి. ఇ. పుం. బంధుజీవము, మంకెన. చె.

బంధ్యము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. బంధింపఁదగినది, కట్టఁదగినది. ౨. ఒక్కటిగాఁగూర్పఁ

తగినది. 3. రచింపఁదగినది. ౪. నిబద్ధము, చుట్టఁబడ్డది.

**బంపు.** వి. (క. బంపు.) పంద్లపాఁచి, పాఁకుడు.

సీ. సన్నుతింపుచుఁ జేరుజటివరేణ్యులకోటిబంపు
కంపున నెగఁద్రోఁకుడుపగటు.
చంద్రా ౧ ౬౧.

**బంబ.** విశే. (క. బంబ.) పెద్దది, స్థూలము.

ద్వి. ... భవ్యహస్తముల, బంబలింగంబులఁ
బాపనివారు. ప్రభు 3. ఆ.
(శ ర. పా పంబి ముద్రి. పా.)

జ : బంబోతు.

**బంబోతు = పెంబోతు.** విశే.(బంబ+పోతు.)
ఎద్దువలె బలిసినమేను గలవాఁడు.

సీ. బంబోతు నా నెద్దువలెను మిక్కిలి రొండ
బ్బలిసియుండెడివాఁడు పరగుచుండు
ఆం భా. ౨. ౧౨౦.

వి. బలసినయెద్దు. (గ్రా )

**బంభరము.** సం. వి. అ పుం తుమ్మెద.

**బంభరాలి.** సం. వి ఈ స్త్రీ. ఈఁగ.
(విల్సన్.)

**బంభ్రమించే.** సం అ. క్రి. మిక్కిలితిరుగు.

క. కీటకముఁ దెచ్చి భ్రమరము, పాటవమున
బంభ్రమింప భ్రాంతంబై తత్కీటకము
భాగ ౪ ౧౬.

సీ. నుడువుమంత్రము తూర వెదఁగుమంత్రముఁ
బూని పరమేష్ఠిచిత్తంబు బంభ్రమించె .
సమీర. ౪. ౨౬.

(మిక్కిలి కలతపడె నని భావము )

**బంహిమ(ము).** సం. వి. న. పుం. బాహు
ళ్యము, పెల్లుఁదనము.

**బంహిష్ఠము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి
బహుళము.

**బంహీయము.** సం. విశే. (న. యమ్. న.)
మిక్కిలిబహుళము.

**బకచరుఁడు.** సం. వి. అ. పుం. వేషధారి, మోస
గాఁడు.

శ్లో. అధోదృష్టి ర్నైష్కృతికః స్వార్థసాధక
తత్పరః, శఠో మిథ్యావినీతశ్చ బకవ్రత
చరో ద్విజః మ. శా. ౪. ౧౯౬.

**బకదారి.** వి. ౧.పారావతవిశేషము.

సీ. పారావతం బగుఁ బావురాయి యనంగఁ. .
తద్భేదములుగాను దనరుచుండును ... బక
దారి దూరబారులనంగ .
ఆం. భా. ౨. ౭౯.

క. మేలైన లకోరీ ల్గాడ్డీలుం బదరీలు పల్ల
టీల్ పక్కివ లూఁచీలుం బకదార్లును
గూకీలు నొసఁదుపేరులం దగినపార్శ్వములన్.
సారంగ. ౧. ౧౧౪.

వ. మరకతంపు టుప్పరిగకోటిగ దక్షి
యొందు బకదారిపారువామిటారితీరున ...
చం. రా 3. ౭౫.

రగడ ..ఇట్టలపురతిపెక్కఁ గవకిన శెనఁగు నీలక
దారిపిట్టలు శుక. ౧ ౧33.

౨. పారావతము, పావురము.

చ అలజలజారిపైరి యగడాడెదుబిల్కు యనన్
బజాతి బల్తులున చకోరి వారిజము తూరిన
నామదిలో లకోరి వాఁకలబకదారి మూరి
కలకంఠ మెఱుంగ దోకంత దారి కేవలము
కుటారి కారి యని వాడి కడున్ వలరాకటారి
కిన్. చంద్రా. ౪. ౧౯3.

**బకము.** సం. వి. అ. పుం. ౧. బకోటము,
పక్కికొంగ. ౨. బకపుష్పము. కీ.

**బకరుక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చిన్నకొంగ.
౨. గాలిచే వంగఁబడినచెట్టుకొమ్మ.(విల్సను.)

బకలము=బగళము. వి. అపకరణము.
(చూ: బకలముసేయు.)

ఇ: బకలముసేయు.

బకలముసేయు = బగళముచేయు. స. క్రి
(బకలము + సేయు.) తొలగించు.

సీ. బకలంబుసేసె పాటకక్షేత్రపాణియై కలిమి
విష్ణుశ్రేణదండనాథుఁడు ..
శ్రీరం. ౧. ౧౩౬.

బకవృత్తి. సం వి ఇ పుం = బకచరుఁడు.

బకాను. వి చిఱుసేరు ? (శ. ర)

బకి. సం. వి. ఈ. స్త్రీ. పూతన.

బకుఁడు. సం. వి. అ. పుం. ౧. భీమునిచే చంపఁబడిన ఒకరాక్షసుఁడు. ౨. కృష్ణునిచే హతుఁడైన ఒకరాక్షసుఁడు. ౩. కుబేరుఁడు.

బకురము. సం. విశే. (అ ఆ అ.) భయంకరము. (వాచ.)

బకోటము. సం. బకము.

బక్క=బ్రక్క. విశే. ౧.కృశుఁడు, దుర్బలుఁడు.

గీ. వారికంటెను బలిరొ యీబక్కబాపఁడు...
పార్వ. ౪. ౧౦౯.

సీ. ... బడుఁగ గన బడు వన బక్క యనఁగ,
పెఱయ వమాంసుండు ..
ఆం. భా. ౨. ౧౧౯.

ఉ. ... ప్రొద్దత్యనికేవ పెక్కుడిది కావని
బక్కఅతింక ... (భం. రా. ౨. ౧౨౪.)

౨. అల్పము, నీచము.

ఉ. పెక్కుదు బక్కదైవముల పేరుఁ గొల్చెద
రట్లు కాదయా. దా. శ. ౨౫.

చ. బలకరఖండదళుల్ గలిగి బక్కవిరోగి
యటంచు(ను తక్కటుల్. (రా. వి. ౨. ౫౧.)

ఇ: బక్కచిక్కు, బక్కటిల్లు, బక్కతనము...

బక్కచిక్కు. అ క్రి. (బక్క + చిక్కు.) మిక్కిలికృశించు.

చ. ... నీతను వనంకబలాఢ్యము బక్కచిక్కి
యున్నది .. కుశ. ౩. ౪౦౦.

బక్కటిల్లు. అ.క్రి (√బక్క.) ౧.కృశించు. (శ. ర.)
(వ్యాధి) ఆయెడ్ని బక్కటిల్లినది.

బక్కమజ్జిగ. వి (బక్క + మజ్జిగ) నీళ్లు అధికముగా చేర్చిన మజ్జిగ. (శ ర)
(ఇట్లే బక్కచల్ల మొ||)

బక్కరించె. స క్రి నిగిడించు

ఉ. .. వెన్కొ గి చెవి బక్కరించి యొుఱుకుం
బొడకట్టిన వ దాఁటుచున్.
శివల. ౨. ౭౪.

బక్తరు. వి (హిం బఖ్తర్. కవచము.)

సీ పందీఁ కెలలు గంటి పాఱ నుక్కున శిరో
బక్తరుగుట్టాల బరికి బనికి ...
రంగా. ౩. ౨౨౩.

బక్షీ. వి (హిం బఖ్షీ) సేనాధిపతి.

సీ. మునిషీ యొకఁడు చెప్ప మొనసి బక్షీ చెప్ప,
దరువాత నామునందారు చెప్ప.
వేను. శ. ౧౩.

సీ. వరుస బక్షీచిత్తనికల్యుఁ డైనను గడుదీర్ఘ
వత్తివకాల తైన. (వేను. శ. ౪౬.)

బగనము. విశే. (సం భగ్నః.) భగ్నము, పాడైనది.

క. అగినిగణంబున కిరుదెస, నగణముతోఁ
గూర్చి చెప్ప సత్కవి మదిలో, నగిచెయఁ
దిట్టి యైనను, బగనముగాఁడుండఁ గమల
భవుఁడో శివుఁడో.(కవిజనా. సంజ్ఞా. ౫౦.)

బగబగ. (అగ్ని, మరుపు, మొ.) అధికముగా మరదుట కనుకరణము.

చ. ... సోదరుం, బగగాని రాజ్యలోభమునఁ బట్టి వధించిన దుష్టకర్ముని, బగబగమండు మంటలకుఁబట్టి కమర్పఁగ లేదు పద్మజా. రుక్మా ౨ ౭౦ (శ ర.)

వ.... దిగదిగన విసరి బగబగన మండు చిదుఁగు సోదమంటలకు ... (మనుచ. ౪ ౬౦.)

(వ్యవ) మండువేయుటచేత కురుపు బగబగ మండుచున్నది

బగళమగు. అ. క్రి (బగళము + అగు) అపసరిల్లు, తొలఁగు

సీ. అవసరం బిప్పడ యగు నంతదాఁకను బగళమై నిలుఁడు దిశాపాలవరులు
నృసిం ౧. ౭౦.

బగళము = బకలము. వి అపసరణము

గీ. వెరసి భద్రమహాకాళి భృంగిరిటులు, పాయు బగళంబు తొలఁగు విచ్చేయుఁ డనుచు
భీమ ౫ ౭౫

జ : బగళమగు, బగళముచేయు.

బగళముచేయు = బకలముచేయు. స. క్రి (బగళము + చేయు.) తొలఁగించు, తప్పించు.

ఉ. పాయఁ దొలంగుఁడంచుభయపార్శ్వములన్ బగళంబుసేయుచున్
సైవ. ౭. ౧౪౫.

బగి. వి. ప్రక్క, పార్శ్వము.

సీ. బగిని బింగన్నకోడిగములు వీక్షించి హాసంబుతోఁ జెయి ప్రేసిప్రేసి.
వరాహ. ౧౧. ౧౦.

సీ....పార్శ్వసంజ్ఞ, కెలనఁ గెలఁ కనఁ గద యన బగి యన ప్రక్క యనంగఁ గప్పట్టు ... (ఆం. భా. ౨. ౧౩౭.)

బగిలి. వి. (సం. భక్తి.) పూజ్యులయందుఁ గల యనురాగము.

ద్వి. కాతనిబగితియు నితనికిఁ గూర్చు నాతని కూర్మియు .. (బస. పు. ౫. ౪౪౭. పం.)

ద్వి. పను లేదఁ దా లేద బగి లేద జగతి.
బస. పు. 3. ౭౦౭. పం.

జ : బగుతుఁడు

బగిస. వి వృక్షవిశేషము.

సీ. కేల,తాడి బగిస పోఁక తాడుకొబ్బర చెట్టు పెద్దమాను. (హంస. ౪. ౧౧.)
(బగ్గిస. క్రొ త్తప్రతి పా.)

బగిసి = బైసి, బవిసి. వి స్త్రీలమర్యాద, పాతివ్రత్యము.

క. అబిడ గర్భోత్పత్తికి, సై బగిసియు మాలి పతింత దృతివిూఁదన్, లోఁ బొదమినరుచి మించినఁ, బ్రాబల్యము గలుగువిటులపాలిది యయ్యెన్ (హంస. ౨. ౭౨.)

గీ. ... వీరిబగిసికి మఱి గారవించి మారుఁడు, కాయసిద్ధి యొసంగుచే కల్ల గాక.
కుక. 3. ౯౪.

బగీలు. వి. (క. బగీలు త. పగీల్.) సంతాపము నందలి ధ్వనికి యనుకరణము.

ఉదా : ఆమాట వినఁగనే నాకడుపులో బగీలు మన్నది. (శ. ర.)

బగుతుఁడు. వి.(√ బగితి)సం భక్తః.) భక్తుఁడు.

ద్వి. బగుతులపాదుకాప్రతతులు నాకు, నగవడ నంచు నందంద మ్రొక్కుచును.
బస. పు. ౧. ౫౪౩. పం.

బగ్గము. విశే. (సం. భగ్నం.) భగ్నముకొంది నది, చెడినది, పాడైనది. (చూ. బగ్గముపాడు.)

జ : బగ్గముపాడు.

బగ్గముపాడు. విశే. (√ బగ్గము.) మిక్కిలి పాడైనది.

సీ. చెలిఁగ్రోవులు వైచి ధీరెఁ దైవులఁజారె బగ్గముపాదై కుపాకియూళ.

రా. వి. ౫. ౧౫.

బగ్గరి. విణ. (బగ్గ + అరి.) బగ్గనిమండిపడు వాఁడు. (శ. ర.)

బగ్గి = బుగ్గి. వి బూడిద, దుమ్ము

గీ. కాక పెంచినమాట నిక్కంబయేని ప్రాఁత పరివారములతోట బగ్గి పడియె

కుక. ౨. ౨౭౪.

జ: బగ్గిపెట్టు.

బగ్గించు. స.క్రి. (సం.భంగః √బగ్గ) గద్దించు, కోపమున వదలించు.

ద్వి దిగ్గన లేచి వల్దనలను జూచి, బగ్గించి పలుక శబ్దం బెట్లు దోఁచె.

పండితా. పర్వ. ౩౯౩. పు.

బగ్గిపెట్టు. స.క్రి. (బగ్గి + పెట్టు) బుగ్గిలోఁగలుపు.

గీ. ఏకకాపీనధారియై యింటి కింటి, కక్కు పిగ్గను భయమును బగ్గిపెట్టి.

శివధ ౫. ౭౦.

(ఇట వదలి అని భావము.)

బగ్గు. వి. ౧. పొరిపుచ్చుటయం దగు ననుకరణము.

క. పిగ్గనడి విరియఁ జాఁతీరి, బగ్గనఁ బొరిపుచ్చు వీరభద్రునిధాటిన్ నుగ్గు లయి ...

కాశీ ౩. ౧౩.

౨. (మనస్సు) పరితపించుటయం దగు అను కరణము.

క.... అకటా, బగ్గనమం డెడునీమను, సిగ్గించుకి లేదు ... (కుక. ౩ ౭౧.)

౩. ద్రుద్దలగుటయందగు అనుకరణము.

ద్విం. పరవశుండై గుండె బగ్గన నవియ.

ద్విం. శ. పా. ౩. ౧౦౧. పు. ౨, పం.

౪. (నిప్పు, కురుపు మొ॥) మండుటయం దగు అనుకరణము.

(వ్యవ.) నిప్పు బగ్గున మండుచున్నది.

,, కురుపు బగ్గున మండిపోవుచున్నది.

జ: బగ్గరి, బగ్గించు, బగ్గుండి, బగ్గున, బగ్గు బగ్గురుమను, బగ్గుమను

బగ్గుండి. వి. (బగ్గ + పిండి..వర్ణలోపము.) చిమ్మి నపుడు బగ్గున మండినట్లు కనఁబడెడు చూర్ణము, ఎఱ్ఱనిపిండి.

సీ. దిక్సతీమణులఁ మత్తిలి చల్లులాడెడు గడి తంపుబగ్గుండిపొడు లనంగ.

రసిక. ౪. ౯౪.

గీ. త్రాడుఁదాలుపుచెలి పైఁడిమేడమీఁద,గొండ్లి సలుపుచు ననుగులఁ గూడి చల్లులాడు బగ్గుండిపొడులు.

అచ్చ రా. అయో. ౧౩.

బగ్గున. క్రి. విణ ద్రు. (√బగ్గ.) తొందరగా.

సీ. వలపక్కచూడ్కి కవ్వల యాదవాగ్రణు ల్బగ్గున నిరువంకఁ బాయ రొసఁగ.

బహు ౧. ౧౦౫.

బగ్గుబగ్గురుమను=బగ్గుమను. అ క్రి (√బగ్గ.) బగ్గుబగ్గనమండు.

వ. ... ముక్కంటి కెక్కున నక్కటికం బతి యిక్కటికిరాతిరుఁడియ నగ్గలపుటలుకయగ్గి బగ్గుబగ్గురుమన. ... (కువల. ౨. ౩౮.)

బగ్గుమను. అ. క్రి. (బగ్గ + అను.) బగ్గనమండు. (శ. ర.)

బచేనికాఁడు. విణ. మొత్తనివాఁడు, చేసినట్లెల్ల మారకుండువాఁడు.

గీ. విధుఁడు కానటివాఁ డైనను వృద్ధుఁడైనఁ దన్ను మెచ్చుకి యొక్కతెఁ దగిలెనేని,

దీరఁగ వ్రాసియున్న యా, బచ్చనిల్లు వంచి
మురుబాణుఁడు ... (సుత. ౨. ౪౫.)

౨. రంగు, వర్ణము.

సీ. కైసేసికొనుచుఁ బ్రాకృతరుణి సొమ్ములకున్
పట్టిన బచ్చెనబరణి యనఁగ .
వరాహ. ౪ ౧౪౫.

క. ... పై పై, నింకఁగ నింకఁగఁ బల్మఱుఁ,
బంకించుటఁబోలె పొదిబచ్చెన పొచ్చున్.
పాండు. ౨. ౪౧.

క. బొచ్చెములు లేక పటమున, నచ్చాంద్రమ
న స్తనంధయాభరణాంకున్, బచ్చెనవొత్తిన
రీతిని, ముచ్చటగా వ్రాసి గౌరిముందఱ
నిడుచున్. (పార్వ ౪. ౧౩౧.)

(బచ్చెనవొత్తు = అచ్చొత్తు.)

౩. గుఱుతు, చిహ్నము.

సీ. లక్కనం బాది కళంకావనా లడియాలపై
బచ్చెన యనఁగఁ జిహ్న, గీ. మలరు
ఆం భా. ౧ ౭౦

౪. వంచన, కపటము, మోసము.

చ. సులభమొ దుర్లభంబొ యని చూడకెఱుం
గవు ..యిడుములందగఁ.. నినుఁ బుచ్చెద
బచ్చెన రూపుపోకులన్.
భార. శాం. ౪. ౫౧.

విణ వంచకము, మోసగించునది

చ. కనుఁగవఁ బాఱఁజూచెదవుగాని మనంబునఁ
జూడవు స్త్రీలం, దరిపెనుగాని భావమునఁ
దన్ప వొకప్పుడు నీప్రవీణత, ల్వనుపద వింక
నీపటలు బచ్చెనచేతలు చాలుఁ జాలు .
వరప. ౨ ౧౪.

క. ఇచ్చిన నాసొమ్మంతయు, మచ్చిక రాఁ దీసి
కొన్నిమాసంబుల కా, నెచ్చెలిని గన్నజం
తటు, బచ్చెనమాటలను బయలుపందిలి
యిడుచున్. ప్రబంధ. ౪.౨౫.

ఉ. ఎచ్చటనుండి వచ్చితిరొ యెయ్యెడ కేఁగఁ
దలంచివారొ యీ, ముచ్చట లేల మాకు,
ద్విజముఖ్యులసం జనుఁ దట్టిబోటికిం, బచ్చెన
మాటలేల .. (శ్రీరం. మా. ౨. ౯౯.) .

చూ: బచ్చెనవెట్టు.

బచ్చెనవెట్టు. అ. క్రి. (బచ్చెన + పెట్టు.)
సిద్ధముచేయు.

ద్వి బండియుఁ బొణకయు బచ్చెనవెట్టి, బండి
పెల్లెడ నందిపడగలు గట్టి
బస. పు. ౪. ౧౫౦. పం.

బజగె(గే)డి. విణ. దుష్టురాలు, దుష్టుఁడు

క. బజగెడిమాటలు చెవి విడి మజనుఁ గుమా
రుని లీలాం, గజునిం బోనాడుకొంటిఁగద కే
దనుచున్. (సారంగ. ౩. ౨౧౪.)

సీ ఓవరిపైన నీ కునికిఁ గావించిరే బజగెడి
యని దూఱు బావగారు. (కుక. ౩. ౨౯౪.)

సీ పాపిష్ఠి బజగేడి పంచమహాపాతకియు వ్యతి
పాత పోకిళ్లమారి. (హంస ౫. ౧౧౩.)

బజారము. వి ౧. ప్రలాపము, ప్రల్లదము.

సీ బజారము నాఁగిఁ జెలఁగ నాఁ బ్రలా
పావిధి (ఆం భా. ౧ ౧౧౬.)

౨ వ్యభిచారము. (చి. ని )

బజారపుఁ బలుకులు = స్వేచ్ఛాలాపములు,
స్వైరాలాపములు.

శా. పాలిండ్లపైఁ బల్మఱున్, జీర ల్జాఱ
బజారిపుంబలుకులం జెట్టాడుచుం బాడుచు,
న్నారాచొప్పల దిక్కులం దిరిగికన్నం
గన్నె వ్వెన్నెలన్. (బహు. ౩. ౫౯.)

బజారి. విణ. (సం జారిణీ ప్రా జారీ. బజారు + ఇ.)

౧. దుష్టుఁడు, చెడ్డవాఁడు.

సీ. .వ్రాత్యుఁడు బజారి ...
హంస. ౫. ౧౧౩.

౨. వ్యభిచారిణి,

సీ. అవలోకములఁ జేర్చి యలద్విజునివిప్రశి
శిష్టుని భ్రష్టుఁజేసినబజారి.
బహు. ౫. ౧౪౯.

౩. రజ్జులాఁడు, ప్రేలరి.

ఉ. ఏల బజారి రంతు లిడి యెవ్వరు మెత్తురు
నోరిలోపలన్ స్రవె లిడినప్పుడుం గటువసేరఁడు
వీనుకుఁడు . (సారంగ. ౩ ౫౮.)

వి. ధూర స్త్రీ.

సీ. ... బజారి యనంగ దండులంతె, గట్టిజంత
ఊఁగ గయాళి యనఁగను ధూర్తయోషా
విధ దోఁచుచుండు.(అం. భా ౨. ౧౧౪.)

బజారించు. అ. క్రి (√ బజారు.) వ్యభిచరించు.
(చి. ని. బజారించు. శ. ర.)

బజారు. వి. (సం ప్రచారః ప్రసారః. హిం బజార్) అంగడివీథి. (బజారు. అని. శ గ.)
(వ్యవ.) ఈయూరిబజారు లన్నియు విశాలముగా నున్నవి.
బజారుమాట = వీథులయందు చెప్పుకొనెడు మాట. (శ ర.)
జః బజారి, బజారించు.

బజీతు. వి (హిం. ఫజీహత్. మిశ్ర(గ్రా.) కష్టము, దుఃఖము.

క. మన కేల దుష్కరం బగు,పనిఁ బూను
బజీతు దేవపతి కేఁడ నటం, చని తెల్పవచ్చె
దేవా,తనురతు పరోపకారితాధికముగదా.
పార్వ. ౩. ౩౮.

విశే. భంగముఁబొందినది, అవమానము నొందినది.

గీ. ... చుట్టాలచేత బజీత నగుదు
శుక. ౨. ౧౨౪.

జః బజీతుచేయు.

బజీతుసేయు. స. క్రి. (బజీతు + చేయు.) పరాభవించు, అవమానించు.

గీ. ఆఁడుదాని బజీతుసేయంగ నగునె.
అము. ౫. ౫౧.

చ. అవనితనూజపైఁ గదిసె నం ...
మోవిరక్కసిం,గవయఁదలంచుదాని నవ్వుగా
దన కిట్లు బజీతుచేసె ...సముగ్రదాహ్యదన్.
భోజనురా. ౩. ౧౨౯.

బజ్జడి. వి. (సం. భంజలి) అశ్వగతివిశేషము.
(పాదన్యాసవిశేషము. శ. ర )

ద్వి బహుచిత్రగతులతో బజ్జళ్లు ద్రొక్కు.
పల్నాటివీరచరిత్రము. ౨. భా. (శ. ర.)

బజ్జి. వి. (క, త. బజ్జి.) అనుపుగాఁజేసిన వ్యంజన విశేషము.

మ. ఫలముల్ పానకముల్ రసాయనము లంబ
ళ్లూరుబిం డ్లూరుఁగా,యలు బజ్జుల్ దధిపిండ
ఖండములు నం దావిర్భవించెన్ దగన్.
రాజ. చ ౨ ౧౨౪.

సీ. కలవంటకములు బజ్జీలు పిండివంటలు
చక్కెరఁగి జున్ను రసాయనములు.
ఘటికా. ౨. ౧౬.

సీ ఒకప్రేలఁ జవి చూచి యొరుఁ ద్రోచినబజ్జి
యాప్రమాణమును జేర్పవాప్రఫలము
పాంచా. ౪. ౫౯.

బటానబయలు=బట్టబయలు. (బటాకబయలు, స్వార్థమున కకారాగమము అని శ. ర.)
విశే. ప్రకటితము.

క. .. ఆ, తొయ్యలి యూఁచక యూఁచక,
పయ్యెదగొంగును బటానబయలుగఁ జేసెన్.
సారంగ. ౩. ౧౬.

(బటాకబయలు. శ. ర. పా.)

ఉ అటఁ గనుచున్ బటానబయ లైనచనుంగవ
పైటఁ జేర్చ . ... లేచి ...
ఉ. హరిశ్చ. ౪. ౧౪౦.

ద్వి. వటవలదీయుటా నయములప్రోవొ, బటువుల పిండొ శోభనకదంబంబొ.

ద్వి. పరమ. ౪. ౨౩౧.

౫. దిట్టతనము, ప్రౌఢత.

వ. బటువు మిగిలి పాటనికాయంబు రాయిడిం బడి పుటపుట నైనకూలంకష చాటువుల మాటకారితనంబు మెరసి .

మనుచ. ౫. ౧౦౧

విశే. ౧. వర్తులము, గుండ్రనిది.

గీ. . . వర్తులాఖ్య చెల్లు, బటు వనఁగ వట్రు వనఁగను (ఆం. బా ౩. ౧౭ )

క. కుటిలాలక నీగుబ్బలు, బటువు లయి పొంగాని కొగయుబంగరునిగ్గుల్, బోటమరిలుఁబుట్టచెం బ్లొ, నటుగాదే నింతపట్టి యాడుమనఁటకే.

సారంగి. ౨ ౨౦౭.

ఉ. బటువుంజన్నులు చందమామ తళుకుల్ ప్రస్ఫావకాంచీలస, త్కటిలీల ల్గలజవ్వనుల్ తపులు గాఁగాఁగాక . (మల్ల శృం. ౩౧.)

౨. అందమైనది, మనోజ్ఞమైనది.

గీ. ... ఎదుటఁ, బసివలపు లిచ్చు పచ్చాకు పసిఁడిపట్టు, బటువుకోడును బటువులై పుటముగులుకఁ, బూని రందల మెంతయు బోయ లంత (రా. వి. ౨. ౪౩.)

బటువుబిల్ల = గుండ్రని తిలగడ

గీ. ... పైఁటలో మరునిబటువు, బిల్లక్రియఁ బట్టుఁగంచెల బిగువుఁజన్ను, నిక్కఁ దిన్నఁ జాక్రాలి చెత్తమాడు. (అము. ౧. ౫౯.)

సీ. వకిపెలపట్టెమంచముఁ బట్టుఁదలగడ బటువు బిళ్లలు మార్త్యపటపుఁబులుఁ. (వైజ. ౩. ౩౪.)

జ : బటువారు, బటువుకత్తి, బటువుకైదువు, బటువుకైదువుజోడు, బటువుగువ్వ, బటువు పుల్గు, బటువుబాలు, బటువువాలుకాల్పు.

బటువు[1]. విశే. (సం. పటు.) ౧. గొప్పది, పెద్దది, అధికము.

క. అటుముందటపటుకైతోర్వ్యుద్భట మయి దిట మయి నిగాఢదళసంతతివి, స్ఫుట మయి కడు నావట మయి బటు వయిన దోశ్కవటముం గనిరయిక్. ప్రబంధ. ౨౦౩.

గీ. పోయగముచేత బటు వైనపొంకుచేత.

కవిక. ౬. ౧౫౪.

౨ దృఢము. (శ. ర.)

బటువుకత్తి. వి (బటువు[1] + కత్తి) చక్రము.

గీ. . చేయంచుఁబుఁగు, చుట్టుఁగైదువు గుదు సువా లన్నడియడిదము, బటువుకత్తి నాఁ జక్ర మా. (ఆం. భా. ౧. ౫౨.)

బటువుకైగువు = బటువువాలు. వి. (బటువు + కైదువు.) చక్రము. (బటువుఁగైదువు. శ. ర.)

సీ. వచ్చు, చున్నఁ గల్గొని వాఁడు గ్రస్సుపం దూలంగ ద్రుద్దుల బటువుకైదువుల నడిద, ముల మరల్చినఁ బోక. ..

అచ్చ. రా. [illegible]

సీ. బటువుకైదువవాని భాసమానవ్యగాంక భాను మానస్మితాస్యంబువాని. (దశా. ౨. ౨౫౩.)

బటువుకైదువుజోడు. వి. (బటువుకైదువు + జోడు.) చక్రాయుధుఁడు, విష్ణువు.

సీ. . బటువుకైదువుజోడు బమ్మతండ్రి ...

గీ. కూరిపేరులలరు... (పాం. వి. చేవ. ౪.)

బటువుగువ్వ. వి. (బటువు + గువ్వ.) బటువు పుల్గు, చక్రవాకము.

గీ. బంటుపిట్ట బటువుగువ్వ జక్కవ యనఁ గో నామంబు లగు... (పాం. వి. తిర్య. ౩౭.

బటువుపుల్గు = బటువుగువ్వ. వి. (బటువు¹ + పుల్గు.) చక్రవాకపక్షి.

సీ. ఇటు జోడు వీడనిబటువుపుల్గుటపంగుచట్ట పుట్టువు మెట్టుఁ జూచి కాఁద.

ప్రబంధ. ౧౪౭.

బటువువాలు = బటువుకైదువు. వి. (బటువు¹ + వాలు) చక్రము.

గీ. ... చుట్టువాలు నుడివాలు వట్రువవాలు బటువువాలు పదినాలంచులవాలు విల్లవా లున సుదర్శనాఖ్యలు వలులు పొంబ.

సాం. వి. దేవ. ౧౪.

బటువువాలుతాల్పు. వి. (బటువువాలు + తాల్పు) చక్రధరుఁడు, విష్ణువు.

క. అబ్బటువువాలుతాల్పును, గుబ్బలివిలుకాఁడు నంచగుఱ్ఱపుజోదుం, గొబ్బున నడ్డము వచ్చిన, నిబ్బరముగఁ బోర నోఁడు నినుఁ డగ టార్తుస్.     (అచ్చ. రా. యు. ౫౦౧.)

బట్ట. విశే. (క. బట్ట. త పరస్తై) వెండ్రుకలు లేనిది, ఆవరణరహితము, ఆచ్ఛాదనరహితము. (చూ. బట్టతల మొ॥)

వి (సం పటః. క. బట్టె. ప్రా. పటో.) ౧. వస్త్రము.

గీ. కట్టుబట్టలు గాని క్రొంతబట్ట దయను, గోఁచులకు నిచ్చి ...     (ఆము. ౬. ౩౭.)

సీ. బలము తక్కువ కైనఁ దైబట్టు బరువు పరు సంచార మడిగిన సడలు రక్షి.

రామలిం. ౫౦.

౨. వస్త్రఖండము, గుడ్డ.

సీ. ... గుడ్డ గా బట్ట గాఁ జెలువొందు వస్త్ర ఖండము ...     (అం. ఖా. ౨. ౧౧౯.)

౩ కనులదెసాముమీఁది తెలుపు లోపలగాని చాలు. (శ ర, గ్రా.)

ఉదా : బట్టావు మొ.

జ : బట్టగట్టు, బట్టతల, బట్టతలవాఁడు, బట్ట మేఁక.

బట్టకడప. వి ధూళికదంబము. ?.

సీ. . తడ మేఁకు కడప బట్టకడప కొడిమె.

హంస ౪. ౧౧.

బట్టకడిమి. వి. (బట్ట + కడిమి.) ధూళికదంబము. (చి. ని., శ. ర.)

బట్టగట్టు. అ. క్రి (బట్ట+కట్టు) కేశాద్యావరణ రహితమైనదగు.

శా. . మన్మథవిహారక్లేశవిభ్రాంతిఁచే, బాంథు బారెను బట్టగట్టెఁ దల చెప్పన్ లోఁత సంసారము     కాశీ. శ. ౧౪.

చ. ప్రతిదినకేశలుంచనపురాయిడి నెట్టన బట్ట గట్టి పైఁ, బుతపుత ముంచు సున్నకులు బోఁదతలన్ ధరియింప నోడియున్.

పాండు. ౨. ౬౪.

౨ అట్టకట్టు, బట్టవలె తలయేర్పడు.

సీ. తల మాసి పువ్వు పెత్తులకు జిల్గురుమాలుబట్ట గట్టిన తల బట్టగట్టి.     (ప్రబంధ. ౩౫౫.)

బట్టతల. వి (బట్ట+తల.) కేశాద్యావరణరహిత మైనతల, ఖల్వాటము.

గీ. ఇనునిమధ్యందినపు టెండ తనదు పెద్ద, బట్టతల మించఁ బిల్వఁ జేరఁ బాఱుతెంచి.

ఆము. ౬. ౪౬.

సీ. సునుబట్టతలలపైఁ గనకంపుఁ జెంగులు పట్టంచేరలు మాయఁజుట్టినారు.

హైమ. ౪. ౬౦.

ఇష్టి : బట్టబయలుదల.

సీ. కలుకుచె మెరిగిన కలువలజెంద్రపుకలులోన బట్ట బయలుదలగాబిపోగె ఉమర. (హైమ. ౪. ౯.)

బట్టతల మోకాలు ముడిపెట్టుట = అసాధ్యమగు పనిచేయుట.

సీ. కడుబట్టతలల మోకాళ్లను ముడిపెట్ట నేర్తు
మఱియును నేను నేర్తు. విప్ర. ౪. ౨౮.

బట్టతలవాఁడు. విశే. (√బట్టతల.) ఖల్వాటుఁడు.

శా. ఎండ స్ఫూర్తి తపింప బట్టతలవాఁ డొండె
నిలన్ నీడఁ గోర్చుండన్ దాళకుజంబుక్రింది
కరుగన్ . . (మల్లభూ. నీతి. ౨౪.)

బట్టబయ(బై)లు = బటానబయలు, బటా బయలు, బట్టబయలు. వి. జో. (బయలు+ బయలు. అని చి. ని., శ. ర.) వృక్షాద్యావరణాచ్ఛాదనరహితమగు బయలు.

మ. .. వన్యావృక్షవితానంబులు లేనిబట్టబయ
లన్ కాకాళసంబై యుమాధవుఁ డెంతెం
చుచు చేసెఁ దపమున్ దాత్పర్య ధైర్యం
బునన్. (పి. కవం. ౨. ౧౧౨.)

ఉ. తోట్టినరోమవిస్ఫురణతో ధరణిం గల
పక్కణస్థలుల్, బట్టబయళ్లుగా మెదడు
వట్టినపాండుకపాలఖండముల్, గట్టినవెండి
వాళములకైవడి నంట ఖురాంచలంబుల,
న్మట్టె నిషాదహస్తములు మారమణీరవ
ణుండు కిల్కియై. (వరాహ. ౯. ౩౫.)

గీ. గరుడగంధర్వభుజగకిన్నరపిశాచ, భటు లు
చావడిముంగటి బట్టబయలఁ, బటులతర
వృత్తిఁ గోటులసంఖ్య లెసఁగ నగ్నిగర్భుండు
గొలువున్న యవసరమున. (కాశీ. ౨. ౪.)

ఉ. ప్రోలున బట్టబైట నిజపుత్రకుఁడుం బలు
గాకి యట్టితో, పలుపునేనిగొల్చు టాళ
ఖ్రకమహేం బలిదైత్యవల్లభా.
వరా. ౨. ౪౨౩.

సీ. తపసాంఘ్రి గుదియించి తలంచుకొన్నను వార
లేటికిఁగా బట్టబైటబ్రతుకు.
ఉ. హ. ౧. ౩౧.

విశే. (బట్టబయలువంటిది.) ప్రకటమైనది.

ఉ. . అమ్మకక్కల గుట్టు బట్టబయలై గని
పింపఁగ కారి పొన్నపై, సొక్కి రమించు
చున్కి . . (సారంగ. ౨. ౭౦.)

బట్టమేఁక. వి (√బట్ట) పశువిశేషము. (శ. ర.)

బట్టి[1]. వి. బహుమానము.

ఉత్సాహ. అట్టివేళ విశ్వకర్మ యరుగుదెంచి దీని
కిన్, జట్టి పుట్ట దంచు పాంచజన్యమన్య
శంఖమున్, బట్టి గాఁగ నిచ్చి యలవతస్వర
త్స్వరద్విషున్, జట్టుక్రేల భూవరునకుఁ జూపి
రేకతంబుగాన్. (కవు. ౨. ౧౦౯.)

బట్టి[2] = బట్టికాఁడు. ౧. చిలుక.

సీ. మాణిక్యమకుటంబు మాటి మస్తమునందు
బట్టియాఁకల పెట్టి ముట్టిపడిరి.
ఘటికా. ౧. ౧౫౩.

౨. వాగ్ధోరణి. (చూ. బట్టికాఁడు.)

జ: బట్టికాఁడు

బట్టి[3](ట్టీ). వి. (క. బట్టి, బట్టీ.) మందులు వండుటకును ఓదము కొందలగువానినుండి ద్రవము తీయుటకు నుపయోగించెడిప్రొయ్యి, ఆవము. (శ. ర.)

బట్టికాఁడు = బట్టి[2]. వి.(√బట్టి[2].) ౧. చిలుక.

గీ. చదువు శుకసంఘ బట్టికాఁ డనఁగ రామ,
తమ్ము యతఁ జిలుక యనఁగ. ...
అం. ఫా. ౨. ౭౯.

౨. గోరువంక, శారిక.

సీ. బట్టికాఁడుల నింపు పుట్టునట్టుగఁ గేళిఁ
బట్టి మాటలఁ గఱపంగ రాదె.
సిం. ౨. ౯౧.

గీ. ఇంటి పూరికలు కార్డీలు కల్లటీలు, పాత్ర
రాయులు బికవార్ల బట్టిగాండ్రు, వంతలు
వెలుగ్ల కేర్లము ల్లుంచవశ్శ్నుదిలుకలు పిశాచి
కమునయు ల్గలవి వలుక. (పాం. ౫. ౧౪౩.)

బట్టినగోల. వి. ఎత్తనగోల.

సీ. తనయ గోణ్యుద్ధారదండాఖ్య తాఱ్త్తనగోల
కా బట్టినగోల నాఁగ.

ఆం. భా. ౨. ౨౬౪.

బట్టియ¹ = బట్టె. వి. కాలువ. (చి. ని.)

బట్టియ² = బట్టె². వి. సున్నము మున్నగునవి
తయారుచేయుటకు కట్టినకట్టడము.
(అంబవమునం దిది సూళె యందురు.)
ఉదా. ఇటికబట్టియ, సున్నపుబట్టియ. (చి. ని.)

బట్టు = బట్టువాఁడు. వి (సం. భట్టః) స్తోత్ర
ములుచేయు నొకజాతివాఁడు.

గీ. ... బట్లు, క్రిక్కి లవఁ బారకాఖ్యలు
సేయుచుండు. (ఆం. భా. ౨. ౧౭౬.)

గీ. ...నభోమండలంబుఁ, బూరటిల బట్లు కలి
రాజుఁ బొగడి పొగడి. (హైమ. ౪ ౬౩.)

గీ. పుటములు దట్టిలంగ నిచ్చి చుట్టములకు,
బట్టులకుఁ బేదలకుఁ గోరినట్టు లొసఁగి ...
అచ్చ. రా. యు. ౫౭౭.

ద్వి. కొంఁగంది రఘురాముని లవిద్య పెంపు,
తబీగాని తలపోసి తల లూఁచియూఁచి,
బట్టుకైవడి మెచ్చిపటుతరధ్వనులు, బెట్టిత్తి
రఘురాముఁ జేర్కొని పొగడ.
రం. రా. యు. ౩౫౧. పొ. ౨౨. పం.

జ : బట్టువాఁడు.

బట్టువాఁడు = బట్టు. వి. (బట్టు + వాఁడు.)
స్తోత్రములుచేయు నొకజాతివాఁడు.
అ. కేడుబట్టువానివినయుంబు లధికంబు ...
వేమన. ౩. ౧౫౩.

సీ. దర్పకాకార వాతలరాయ యని కొంటఁ
బడు బట్టువారిఁ గాంచెదచి.
కుక. ౪. ౧౧౧.

బట్టె¹ = బట్టియ¹. వి. కాలువ, కుల్య.
(శ. ర., బ్రౌ.)

బట్టె² = బట్టియ². వి. సున్నము పెందలగునవి
తయారుచేయుటకు కట్టిన కట్టడము. (చి. ని.)

బట్లె. వి. శరాకవిశేషము, ఒకవిధమగుమాకుఁడు.

సీ. ...పరగు దడ్డము పాద బట్లె మల్ల, యనఁ
గను దద్వికేషాభిధ ...
ఆం. భా. ౨. ౨౪౭.

బడ = బడా. విణ. (క. పడు, హిం. బడా.)
పెద్దది. (చూ. బడగొండ.) - క్రి. విణ. అత్యం
తము, మిక్కిలి. (చూ. బడబాశి.)
జ : బడగొండ, బడబాశి.

బడగ = బడవ. విణ. (క. బడగ.) అవినీతుఁడు,
తుచ్ఛుఁడు.

ద్వి. అడిగడువారు తే కయ్య నీ వింత, బడగ
వైతివి మఱి బాపురే యనుచు.
బ.సం. పు. ౪. ౨౩౫. పం.

బడగులు. వి. బ. నీలగిరిప్రాంతమందుండు ఒక
జాతి జనులు. (వడగరులు అని శ. ర.)

బడగొండ. వి (బడ+కొండ.) కొండవలె పెద్ద
యాకారము కలిగి నీర్లు కలిగిన మేఘము.
(శ. ర.)

బడవు. వి. కష్టము.

గీ. చోద పల్లట మల్లట చోదువు బడవు
యిడు మగచాటు కా మనఁ బరగుఁ
కష్టము ... (ఆం. భా. ౧. ౧౫౦.)

బడబ. సం. వి. అ. స్త్రీ. ౧. ఆఁడుగుఱ్ఱము, పె
గోడిగ. ౨. ఆఁడుగుఱ్ఱమురూపమున సూర్యుని
వలన అశ్వినులను గనిన అశ్వినియనెడి అప్సర
స్త్రీ. ౩. దాసి. ౪. వేశ్య. ౫. బ్రాహ్మణస్త్రీ.

**బడబడ.** వి. ౧. బొబ్బ పడగండ్లు మొ. తొందరగా పడుటయందగుధ్వని కనుకరణము.

ద్వి. పిడుగులు మెఱుములుఁ బేర్చు వేగమున, బడబడ వడగండ్లు వడియ నెల్లెడల.

ద్వి పారిజా. పూ. ౨౧౪౯. పం.

౨. (మ్రింగుట లోనగువాని ధ్వని కనుకరణము.

క. బడబడ నేవల (మ్రింగెడి,కడుపుమి యాభల మటంచుఁ గ్రోధముతోడన్ ...

పద్మ. 8. ౨౪౨.

3. అధికముగా మాటలాడుటయం దగుధ్వని కనుకరణము.

(వ్యవ.) వాఁడు బడబడ వాఁగుచున్నాఁడు.

౪. ఇనుపకగడు మున్నగువానిని కొట్టునప్పుడు అగు ధ్వని కనుకరణము.

(వ్యవ.) కమ్మరివాఁడు డబ్బా బడబడ వాయించుచున్నాఁడు.

౫. నీరు కొండలగుండి కాఱుటయం దగు ధ్వని కనుకరణము.

(వ్యవ.) అ బిందె బడబడ కాఱుచున్నది.

**బడబాకి.** విణ. (బడ+బాకి?) మిక్కిలిగొప్పది, మిగుల పెద్దదైనది.

ద్వి. పెఱిపినకురులును నిడుదకోఱలును, బలుపైన కడుపును బడబాకినోరు.

రం రా. అర. ౧౯౦. పా. ౨౪. పం

ద్వి పడఁకుకంపెనఁగాడి బడబాకినోరు, చెదను చెవులుఁ గుఱుచఁచుగడ్డమును.

వవ. 3. ౧౪౯. పా. ౨౦. పం.

**బడబాగ్ని.** సం. వి. ఇ. పుం. = బడబానలము.

**బడబానలము.** సం. వి అ. పుం. బడబాగ్ని, సముద్రమునందుండు అశ్వాకారముగల యగ్ని.

**బడబాముఖము.** సం. వి. అ. పుం. = బడబాగ్ని.

**బడరుఁడు.** వి. (క. బడ. కు. బళ.) ౧. దేవుఁడు, శివుఁడు.

క. బడలు గుడి యంకరాత్మయు, బడరుం డను పలుకు లండిగి భ క్తిని గుడిరే, గుడి యనియు లింగమూర్తియు, బడరుం డని కొలుచు కుని పాతకము శివా. (శివ. పా. ౨౭౦.)

౨. దరిద్రుఁడు.

క. తొడవులు చిదికిన యిమ్ములు, గుడిమట్టుగపాల మిల్లు గుడి ముడిరు ద్దక్కుడు, గట్టువలుపు దో లగు, బడరునకై నవయ నేమి ప్రళయము వచ్చెన్

కు. సం. 8. ౭౪౦.

**బడలించు** = బడలఁజేయు, బడల్చు. స. క్రి. ($\sqrt{}$బడలు.) శ్రమపెట్టు, అలయించు.

క. వడి గెలవా రని భటులను, బడలించుచు మఱు విడుదవయనంబుల మం,డొడు వేసవినిన్ విడిసిన,రుదలన్ (బజదప్పినొప్పు తెఱఁగును కరుణన్. (ఉ. రా 8. ౬౯.)

౨. నొప్పించు, బాధపెట్టు.

సీ. జంబుమాలిని మూఁడు శరముల బడలించి యూపాతు నాల్గింట నుదుటు మార్చి.

ఉ. రా. ౪. ౬౬.

3. శోధపెట్టు, వ్యాకులపెట్టు.

ఉ. ... భీమసం,గ్రామకుతూహలంబున జగత్త్రయమున్ బడలించురాక్షస,గ్రామములన్ హరించి మముఁ గావఁగదే శివ యంచు మ్రొక్కినన్. (ఉ. రా. ౧. 3౧౨.)

ద్వి. పరిపూర్ణకళహము బడలించుకొనము.

ద్వి. వల. ౧. ౯౨౫. (ఇట ఔపమ్యద్యోతకము.)

**బడలిక.** వి. ($\sqrt{}$బడలు.) ౧. శ్రమము, అలయిక, శ్రమచిహ్నము.

చ. పడమర పెట్టునయ్యెడుమఁబ్రాకన మొల్లకూటిపేదరై, బడలిక నూడువచ్చిలుకప్రగ్గములన్. [illegible] (ఆము ౨. ౪౯.)

చ. అడిగినయంతలోన నరసాన్నములన్ సమకూర్చు వాఁకటన్, బడలిక తెందనీక ...

పారి. ౧. ౬౧.

గీ. ... బడిబడి బడలిక లాడలఁ బొదలు.

దశా. ౧, ౧౬౯.

క. అనవలసి యుంటి నిన్నుం, గనుఁగొనుటే
చాలు బడలికలు కనుపించెన్

కుశ. ౨. ౫౨౨.

బడలు. అ. క్రి. ౧. శ్రమపడు, అలయు; వాడు

గీ. కమ్మగంధులకావిఁ గ్రమ్మకేఁటి,మూఁక
లీలాబ్జములఁ జోప లేక బడలు

వరాహ. ౧౧. ౯౨.

ఉ. కన్నియలార మే నృదశఁ గంటిరె నా కని
బొంక చేర్పునన్. (పారి ౩ ౧౪)

వ. ... కరఁగినకర్పూరంబుతిలకంబుతోఁ జెరఁగిన
కారహారములతో బడలిన కమ్మగం
బుతో ... (ఉ రా. ౪ ౨౨౧.)

౨. నొచ్చు, బాధనొందు.

గీ. అరుగుదెంచితి రందుల కనుట గాదు, పదము
లెక్కడ బడలెనో కద మునీంద్ర.

కువల ౨. ౪౫.

వి శ్రమము, అలసట. (చూ బడలుపడు.)

జ: బడలించు, బడలిక, బడలుపడు, బడలు
పఱుచు, బడల్చు.

బడలుప(వ)డు=బడల్పడు. అ. క్రి.(బడలు + పడు) ౧. అలయు, శ్రమనొందు

ఆ. బడలుపడితి రాజ్యభారంబు భరియించి,
పొదమె మతి విరక్తి భూనుపర్వ

కాశీ ౨. ౭౭.

క. ... మవనం, బడలువడఁ బఱచుక్రియఁ
దద,బద ధూళియు గాడ్పు వీచెఁ బ్రతి
కూలంబై. (కు సం. ౫. ౪౯౦)

వ. ... వెళవెళమనచప్పళ్లతో దుల్లి చిఱుల
మూలిపడగా బడలువడక

ఉ. రా. ౩. ౭౭.

౨. నొచ్చు, బాధనొందు.

క. నలిరేఁగి యార్చి కొరకు, బలసుభటులఁ
బొడిచి రాజ బడలువడంగన్.

భార. ఆది. ౭. ౯౧.

వ. . మెదలు వదుపులుం బొదుయులుగ
వెడిదంపుటినుపబడియల బడలువడ నడఁ
చుచు . (అచ్చ. రా. యు. ౩౭౪.)

గీ నడులుఁడును దదనుజుఁడు సాత్యకియు సాంబు,
భద్రకొడుకును వెదిరినబలము లెల్ల,వెదరఁ
జెదర బడల్పడఁ బెల్లు పావఁ,జేయఁ గవి
కొరవులు సంధి సేయువారు.

భార. ఉద్యో. ౨. ౧౩౯.

౩. చీకాకుపడు, క్షోభపడు.

క. కరిహయనరనికరము, బడలువడం దఱిమె
నలి నధశ్వరు లార్వన్.

భార. విరా. ౩. ౧౬౪.

చ. తనగదఁ జేసి రాక్షసులదారుణశస్త్ర
చయంబు వశ్రమం,బున వతిధీరుఁడై విలిచి
పోరి నిశాచరులన్ బడల్పడన్, ఘనభుజ
దండచండహతిఁ గ్రాఁచిన నుక్కఱి రక్క
సుఁ కుబేరుని కలిఁగింప

భార అర. ౩ ౩౭౭.

౪ చెడు, నశించు, చచ్చు.

ఉ కత్యము కల్గినట్లయిన గంధగజప్రకరంబు
కుంభముల్,వ్రయ్యఁ దురంగపంక్తులు ధరం
బడఁ దెరిగముల్ బడల్పడన్.

భా ఉద్యో. ౩. ౭౭.

వ విచ్ఛిన్నంబులైనవయవంబులును కదలు
రుధిరంబులును బడలుపను బలంబులును
గొండలవడువునం బడు మాంసఖండంబు
లును .. సమరాంగణంబు భీషణమయ్యె

భాగ. ౧౦. ఉ. ౪౧౭

౫. చాఁప చుట్టగఁ బడు.

గీ. ...బడల్పడిరి వనఁగఁ,జాఁపచుట్టగఁ బ
డని తోఁచఁబడును. (ఆం. భా. ౩. ౧౦౪.

౬. చెడు, కూలు.

సీ. కనిగొట్టుచిన్న రెమ్మలఁ ... కొమ్మన్ మడిసి రేకొమ్మలు బడలువడెడు. (విప్ర. ౩. ౬౩.)

౩. వలఁగు.

అంతటివిభాతి. తడబడఁగ పేర్చి పడి నడుగు విడు వేగమునఁ బడమి పెను ప్రయత్నలయి బడలు వడి ప్రుంగెన్. (భా. రా. యు. ౧౯౪౩.)

**బడలుప(వ)ఱు(అ)చు.** స. క్రి. (బడలు + పఱచు.) ౧. అలయించు. శ్రమపఱచు.

క. ... రుద్రుండు రౌద్రఘనుమున్నద్రుంచై మరు ద్రాజివాజిం బడలుపఱిచి మెఱుంగు మెఱు చిననంధంబున. (వరాహ. ౫. ౧౧౩.)

౨. నొప్పించు.

క. నిర్జరులం దర్జించి కిన్నరుల వెన్ను వూచి కింపురుషులఁ జంపి గరుడుల బడలుపఱచి... హర ౩. ౯.

౩. చీకాకుపఱచు

సీ. ఇరువురకోదండగురుతరజ్యానాద మదరి బ్రహ్మాండంబు బడలువఱుప. భా. రా. యు. ౧౨౪౪.

**బడలువాపు.** స. క్రి (బడలు + పాపు.) చంపు, సంహరించు.

గీ. లాఁచిగవిఁడొచ్చి యచ్ఛభల్లములగముల బడలువాపకయున్న నీబంటఁగాను. వేం. పంచ ౨ ౧౯౪

**బడ(లుచే)ల్చు** = బడలించు. స. క్రి. (√బడలు.) పడఁగొట్టు.

క. కరితలభంబు కొమ్మ ప్రదు గైకొని బిఱ్ఱునఁ ద్రిప్పి లోడువై, ఖరి గిరి పెత్తు సంగడము గైపడి పవ్వలయాద్రిఁబట్టు గో,ట రహిని మత్తఖడ్గిని బడల్చు రణంబుగఁ గొట్టు లోహముద్గరసముదాయ మచ్చిఱుతకై పృథ భూపతి యాదవోద్ధతిన్ (రా. వి. ౨. ౨౩.)

**బడవ(ఁడు)** = బడగ. విశే. (క. బడగ.) అవినీతుఁడు, తుచ్ఛుఁడు.

(వ్యస.) ఓరిబడవా ఎంతపని చేసితివిరా!

౨. భృత్యుఁడు, సేవకుఁడు.

చ. ... సైఁచుమీ, బడవని తప్పు సేయు నిట్టుల బట్టక మానితి కేఁటకానికల్. కళా. ౪. ౬౩.

జ: బడవపడు, బడవవాటు.

**బడ(బ)వ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఁడుగుఱ్ఱము, గోడిగ. ౨. బ్రాహ్మణస్త్రీ. ౩. దాసి. ౪. అశ్వనీనక్షత్రము.

**బడవపడు.** అ. క్రి. (బడవ + పడు.) దాసుఁడగు, భృత్యుఁడగు. (చూ. బడవవాటు.)

**బడవవాటు.** వి. (√బడవపడు.) దాస్యము.

సీ. బడవవాటున వాటుబడ్డచద్దజనిమ్మకాయ గాచినచెయి కాయగాచె. (ప్రబంధ. ౩౫౫.)

**బడవా.** విశే. (సం. వడవా. క. బడవా.) ౧. కార్చునది; కార్చువాఁడు.

సీ. మద్యపాయులతోడ మచ్చిక కారాదు బడవాల గొప్పగాఁ బట్టరాదు. వేను. ౫౨.

సీ. బడవాకుఁ బ్రతి యున్న బహాదరు కేసాలు దళివాయి కోకయూర ధర్మచేట. వేను. ౩౪.

జ: బడవాతనము.

**బడవా(బా)గ్ని.** సం. వి ఇ. పుం. సముద్ర మందు బడబ(గోడిగ) ముఖమునం దున్న కాలానలము, వార్వపుటగ్గి.

**బడవాతనము.** వి. (బడవా+తనము.) కార్పుట.

సీ. పంచాంగములు పూసి బడవాతనముఁ జేసి పల్లెకూటము చెప్పి పనులఁ గాచి. వేను. ౪౧.

**బడా** = బడ. విశే. (హిం. బడా.) గొప్పది.

చ. ... మెఱుంగుఁదళ్కు—లం, జలుకుబడా రుమాలు బలుచిక్కులవచ్చుల జరీంతి కాసె ... (భార్గవపురాణము. ౬. ౧౧౪.)

బడికొను. స. క్రి. గ్రా. అనుసరించు.

ఉదా. పెద్దలు చూపిన మార్గమును బడికొనుట చిన్నలకు శ్రేయస్కరము.

౨. పోలు, సదృశమగు.

ఉదా. తండ్రిని బడికొను కూఁతురు దృష్టవంతు రాలగును.

బడికోడి. వి. ౧. పెద్దజాతికోడి. (గ్రామ్య) ౨. భక్ష్యవిశేషము.

బడికోలు. వి. ౧ ఒడికొనుట, అనుసరించుట. ౨. చాలు, పోలిక, సామ్యము.

మ. అళు లేత ద్వదనేందురాగ మిళనా పాదు
ర్భవలోత్కర కంబుల రేకల్ సుధలంచు
రా నొకకొ నెమ్మొమెత్తఁ జైత్రంపుఁ బు,
వ్వులలోఁ దగ్గుబు లయ్యె గంధఫలిఁ
బువ్వుల్ పుట్టిపోఁడోలె నా,చ్చెల! చేఁక్రై,
తిలిచెందుఁ దల్లి బడికోల్ చెట్టాట యేశా
మహిన్

అము. ౫ ౧౩౨.

(తల్లి ఒడికోల్ చెట్టు = తల్లిపోలిక యందలి మర్గుణము.)

బడేఁద్రిప్పు. చూ. బడిత్రిప్పు.

బడిగల్లు. వి. చోపదారు, వారిపోసు.

సీ. అవనినిరూపణారూ వనిత నీవు మెలంగుదే
విని యూదూరవృష్టి యనిన, దాకన కాద
యూతఁడు నన్ను బ్రహ్మించి యూగతిఁ
దోర్దాన్ని నిషటీకరుఁడు, బలిశతూతఁడు
దన్నుఁ బ్రథమంబునందు గృహారామమునఁ
గాంచుటాదిగాఁగ, నది తుదగాఁగ నఖి
స్తంబు వినిపించి తత్ప్రసంగంబునఁ దనదు
పేరు, కులము విద్యయు నప్పటి కోరిక
యును, చెప్ప యూ కోర్కి సాధించు
చింతఁదక్క, చింత మొలఁగక యేఁగు
దెంచితిఁ, గొలుకుఁ, బోవ బడిగల్లువడిరా
వో పొలఁతి యనిరా.

కళా. ౩. ౧౦౫.

బడిత. వి. రూ. ఒడితి, బడితె.

౧. ఇనుప కట్ల గుదియ, పరిఘము. ౨ దుడ్డు కఱ్ఱ, జంతువులను గొట్టు కఱ్ఱ ౩. గోడ మరుగునకుఁ బెట్టు కఱ్ఱ.

బడిత పాఠము. వి. చదివిన పాఠము.

ద్వి. విడువు మీాడే కాలి విద్దెలొజ్జలకు, బడిత పాఠము దొంగ పదరు లన్నియును ...

ద్వి. హరిశ్చ. ఉ. ౭౨౭.

బడితి = బడిత.

బడితె = బడిత.

బడిత్రిప్పు. రూ. బడిఁద్రిప్పు. స క్రి. ౧. (మరణ దండనము పొందినవానిని ఊరేఁగింపు చెక్కిం చుటకు పూర్వము) నగరము చుట్టును ఊరేఁ గించి త్రిప్పు.

౨. (బడిమి + త్రిప్పు) బడియు, (దృష్టిదోష పరిహారమునకై) దిగఁదుడుచు.

ఎ. గీ. దాని కెలిగోలు జూడయుటఁ గేసరాన్న,
ముంజ మువ్వడు బడిద్రిప్పి పోసి కొరకె...

చను. ౨.

బడిపనులు = చిన్న పనులు. (రూ. బడి.)

ద్వి. అగ్గడి చుట్టు బిల్వాశోక సురభి, గుగ్గులు
క్రముకాది కుజములు పెట్టి, మరుభంబు దమ
నంబు మాచిపత్త్రియు,మరువను బహుపువ్వు
వాటికల్ నాటి, బాలవారిని దివ్వెటీలను బల్ల
గోలలవారిని గుడిప్రాకారులను, ఒడిసెల
శాంద్రను నోణాలవారి, బడి పనుల జనులను
బంతంబు బంట్లు, ద్వారపాలుర నువిధానుల
విండ్లవారిఁ దలారుల వారక యేలి ..

బస. పు. 3. ౫౧౧ పం.

బడిపెద్ద. వి. ౧. ఉపాధ్యాయులకు సహాయుఁడుగా నుండఁదగిన ముఖ్యవిద్యార్థి. (ఇంగ్లీషు-మానిటర్.) ౨. బడికిపెద్ద. యజమానుఁడు.

బడిబడి. అవ్య. ద్రు. ౧. ఒకరివెంట నొకరు.

క. ... ప్రముదంబున బంధు జనులు బడిబడి
రాగన్. సునంద. ౨. ౧౫౫. (గ్రామ్య.)

చ. కడు నతి పెక్కునట్టి యధికంపుఁ గుటీరక చే
నతండు నన్నిడల జనాధిపుల్ దనకుఁ గన్యల
నిచ్చెద మంచు పెండ్లెం, బడిబడిఁ జెప్పి
పంప నది పోటిగఁ బట్టక వారి యాసుచే,
నడపాదలేక పోయెనఁట యల్పము లయ్యెఁ
గులాభిమానముల్.

కళా. ౩. ౪౪.

౨ మాటిమాటికి. 3. తరితరము. ౪. వెనువెంటనే. తత్క్షణమే.

చూ. వెంబడిన్.

బడిమి. వి. ౧. బడియుట రూ. బడియు.

౨ చక్రాకారభ్రమణము.

ద్వి . . నీ కష్టాత్మురాలి, నిందలఁ జూడం
నీ ఋణంబునను, బందిగాఁ గొనిపోయి
పట్టముచుట్టు, బడిమిగాఁ ద్రిప్పి కూపంబు
లోపలను, ఒడఁద్రోసి రండు యీపని
పెంతైన, మునగిలే దింక ముమ్మాటికి వెలవ
చనుఁడని పలుక .

ద్వి సారం. 3. ౧౪౭-౧౫౨. పం

3. భూతబలి.

బడియ. రూ. బడి ౧. చిన్న దుడ్డుకఱ్ఱ

సీ. అర్భుచు గోపాలు రందఱు నందంద బడి
యల రాలను బడఁగ వైచి, కొన్ని దవ్వుల
వానిఁ గొమరార వానిన కొని ధాత్రిఁ
దారఁగిందికొన్ని లీల, నిక్కి పెళ్లని కొమ్మ
లుప్పున విఱుగంగఁ దిగిచి ధారుణిఁ ద్రోచి
పగులఁద్రోచి కొన్ని యువ్విధమున నన్నింటి
రాల్పంగ నిష్ఫలంబయ్యె నన్నిచతరువు
ఫలనిపాత మూతంబగు బహుతరము
చటులశాఖా విభంజన జనితరవము, నమద
గోపాల నినదాగర్జారవంబు, గలసి గగ
నంబు శబ్దాత్మకంబాయె.

హరి. పూ. ౬. ౧౪

గీ. ఏమి చెప్పఁగ నున్నది? యేమిధమునఁ
గాక వడలించుచున్నాఁడు వాలకమునుఁ ?

మనమున లోఁగిలిచేసి లోఁగునె శివాజ్ఞ?, యుడుము పడఁకిన పడఁకునే బడియపెట్టు?

కాశీ. ౨. ౧౪౪.

పిచ్చిబడియ = మూర్ఖుఁడు.

౨. శవయానము.

బడియు. స. క్రి. (దృష్టిదోష పరిహారమునకై) దిగఁదీయు, దిగఁదుడుచు.

ఉ. ఊరుల దీఁగఁ బోతి కృపతోర్పడఁగాఁ దన శేఁత నవ్వుతో, శేయనపా లపాంగ ములకెంటఁ బ్రసాదము చేసిన నిన్ను కా, నాయకుఁ డెంతయుం బ్రియమునం గయికోఁడో కా నాల్గుదిక్కులం, బ్రాయపు చంద్రికల్ బడిసి పాఱఁగఁ జైచుచు న పురార్థముల్.

వై. ౩. ౧౩౩.

(బడిసి, బడసి అని పాఠాంతరములు.)

చ. అని చెలువల్లి దూరి ధవళాంబుజ భాజన రాజి నాఁటించిన కుసుమాన్న రాశి పయిఁ జక్కని చెందొవ జోతి నిల్పి య, వ్వనితకుఁ జుట్టురా బడిసి వైచి సుగంధ పలాశి వాటిఁ కా, యని యతిరీతి బంటులకు వామితిఁ జేసి రచేశథంగులల్.

పండితా. పర్వత. ౩౫౯. పా.

(బడసి అని పాఠాంతరము.)

బడిరోగిరము. (బడి + ఓగిరము) కొంచెముగా పెట్టిన యన్నము.

బడిలి. వి. తూఁటు, బెజ్జము, రంధ్రము.

బడివాటు. వి. (బడి[3] + వాటు) చిన్న దెబ్బ.

వ్యవ. బడివాటుజ్వరము = కొద్దిగా తగిలిన జ్వరము.

బడివారడి. వి. రూ. బడేవారడి. ౧. తలపన్ను, వ్యష్టిగతముగా ప్రతి ఒక్కరికిని విధించిన పన్ను. ౨. రెంటికిని గల భేదము.

బడివేటు. వి. (బడి + వేటు.) చూ. బడివాటు.

బడిశ. బడిశము.

బడిశము. సం. వి. అ. న. (రూ. బడిశ, బడిశె, బలిశము.) చేపలను బట్టు గాలము.

బడిశి. బడిశము.

బడిసి. వి. రఘ. (ఓరుగల్లు దేశీయ తెలుగు) అని గ్రామ్యము.

బడిసివాటు. వి. (బడిసి, √బడియు + వాటు) దిగఁదీసి వైచుట.

విశే. దిగఁదీసివైచినది, దిగఁదుడుపైనది.

గీ. బ్రహ్మలోకంబు గాశిక బడిసివాటు, విష్ణులోకంబు గాశిక వినిమయంబు, దాసదాసానుదాస బృందంబుగాక, యింద్రచంద్రాదిలోకంబు లిద్దమిహము.

కాశీ. ౩. ౧౫౦.

బడగ. వి. ఒకజాతివాఁడు. బ. బడగలు.

బడగు. రూ. బడుగు.

బడుగు. వి. కృశము.

విణ. కృశము, కృశించినది, క్షీణించినది

సీ. కొంటెగొక్కులు విరుద్ధులై మీఁటిన నవియు నట్టింపొందు గుబ్బపాలిండ్లతోడఁ, గడుఁ గృశత్వంబునఁ బిడికిటి లోపల నడఁగెడు బడుగు కౌన్నడుముతోడఁ, జిలువప్ప తెలివి నిగ్గు చిలుకుచుఁ దనరారు తళుకు లేఁజెక్కుటద్దములతోడ, జగతి కెందును లేని చక్కఁ దనాన సొంపగు చిన్ని ముద్దు మోమొగము తోడఁ, గరము విలసిల్లు సకలాంగకముల తోడ, రహిఁ దనర్చు నలంకార మహిమ తోడ, ద్వారక ఖల దండ నింపారుచున్న, ప్రతిమ నొక్కటి చూచె భూపాలచంద్ర

కళా. ౭. ౧౩౨.

౨. శక్తిహీనుఁడు, అసమర్థుఁడు.

మ. అడగే విన్ను వరంబు వేగమ యవాల్యాకార! విచ్చేయుమా, మదు రాజార్థ విభూషణుండు వరమీ నున్నాఁడు యుష్మద్భృకుల్, బడుగుల్ వాంఛిత మీసమర్థులె? వృథాలాప ప్రబంధంబులక, జడిపెట్టం బని లేదు విన్నక తపశ్చర్యా విరోధంబు గాన్.

కాశీ. ౪. ౧౨౦.

౩. అల్పుఁడు.

క. కడుఁగొత్తలు సేవిటుకను, బడుగుం బాటించి మిన్ను ప్రాఁకించెదు నీ, యడుగులకొని, యాటకుఁ బను, పడి కారము నీకు మమ్ముఁ బాడిరా బోగడక్

హరి. ఉ. ౭. ౫౩.

సీ. నీ విక్రమ క్రీడ నిజ హృదయంగమంబై, మెచ్చు శ్రీధరుం డసుఁగుఁ దండ్రి, నీ యాజ్ఞ గొండిన సేరక ముద్రిత వదనుఁడై వర్తించు వాగ్వరుండు, నీ తూపు కోర్వక నిటలాక్షుఁ డుమ తనూఫలకంబు చాటునఁ బాయఁ డెప్పుడు, నీ విరుదోక్తిచిహ్నిత జయ జంగమ స్తంభమై యున్నాఁడు జంభవైరి, యింకఁ దక్కిన బడుగుల నెన్న నేల?, యిట్టి నీ విల్లు పసిబాల నేఁచు టెట్లు?, పర్వతం బెత్తు శేలన బంతిరొత్తి, కడిమి కెలుపంగఁ జూచితే కాయజన్మ!

కవికర్ణ. ౩. ౧౧౭

(వ్రాఁతప్రతులలో బడగు అని ఈ శబ్దము అకారమధ్యముగా నున్నది కన్నడ భాషలో ఇది బడగు, బణగు.)

బడుగుదేవర. బడుగల దేవర.

గీ. ఇది కంటిరే శ్రీమహేశ్వరం బనుచు, నదె మీఁదట మహేశ్వరావాస మనుచుఁ, గడు గొప్ప బహు హేమకలశంబు లనుచు, బడుగుదేవర చూర్ణపతి యందుఁడనుచు జయవెట్టుఁ డిటు గూడదపాఁ శెల్లనుచు జయ జయఘూర్ణముఘు జయజయ యనుచు.

పండితా. పర్వత. ౨౮౧. పే.

ఘృష్టుడుఁ దనయుండు ఘృష్టుడు వతనిఁ,
బెట్టుఁడు నంబెన్న పేరంచు వరుగ ...
పండితా. మహిమ. పు. ౧౩౫.

బత్తియము. ప్రా. భత్యము, కయిజీతము.

బత్తీస. హిం ముప్పదిరెండు.

ద్వి. రమణ బత్తిసాది రాగంబులకును .
ద్వి. భాగ. (చూ. ప్రౌఢ్య.)

బత్తీసు = బత్తాయి.

బత్తుఁడు. దే. వి. కమసాలెవారి పట్టపుఁ పేరు. చేతిపనులు చేసి జీవించు జాతులలో అయిదు జాతులవారు తమ నామధేయమున కుపనామముగా పెట్టుకొను పేరు

ఉదా వడ్లబత్తుఁడు = వడ్రంగి.

ప్రా. వి. భక్తుఁడు.

కడుపుబత్తుఁడు. తన కడుపే దేవునిగాభావించువాఁడు.

ద్వి. కట్టడులకు లోనుగాక మాయలను, మట్టిమల్లాడి నిర్మల లింగసేవ, గట్టిగాఁ బట్టని కడుపు బత్తులను, కొట్టు భక్తి ఘటించు నిల బసవన్న ...
ప్రభులిం. ఇష్టలింగకథ. ౧౩. ౧౧౯. పా.

క. బత్తులు మనువాకత్తుల, తొత్తిరి పశు సముజ ముండములు చండములౌ, కొత్తురు ఘార లంజారవి, పత్తిమిరవవారుణ ప్రభలు ప్రబలంగక.
పాండు. 3. ౩౭.

ద్వి ఎగుడునో రొక బత్తుఁ డీ బ్రాలు కనుచు,
కొగుడకున్నను లింగ మెఱుఁగుఁగా కనుచు.
పండితా. పర్వత. ౨౯౦. పా.

బత్తెము. రూ. బత్తియము. ప్రతిదినము రాబడిగా వచ్చు భత్యము.

బదనాము. హిం. అవమానము, చెడుపేరు.
(బదలాము అని వాడుక మాట శ. ర.)

బదనిక. వి. వేరొక చెట్టుమీఁద మొలచునట్టి తీఁగె.

సీ. బదనిక వదనిక బవనిక యన వందచమఁ
దిప్పతీఁగె నాఁగను గుడూచి . .
ఆం. భా. ౨. ౫౪.

బదర. వి. ౧. పగులు.

(వ్యవ.) ఆ కుండ బదరపోయినది.
౨. పాఁచితీఁగె. శ్రీ.

సం. అ స్త్రీ ౧. కాకలి. శ్రీ. ౨. పాఁచి తీఁగె. శ్రీ. ప్రత్తిచెట్టు. శ్రీ. ౪. ప్రత్తి.

బదరము. సం. వి. అ. న. ౧. రేఁగుపండు. ౨. ప్రత్తికాయ.

—వి. అ. పుం. ౧. ప్రత్తిచెట్టు. శ్రీ. ౨. ప్రత్తి తేడ.

బదరి. సం. వి. ఇ. స్త్రీ. రేఁగుచెట్టు. శ్రీ.

ద్వి. బదరి తింత్రిణీ బిల్వపాటలీ క్రముక, కదళీ కటూశ్వత్థ ఖర్జూర లుంగ ...
ద్వి. నల. 3. ౨౫౩.

బదరిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. రేఁగుచెట్టు. కీ. ౨. రేఁగుపండు. ౩. ప్రత్తిచెట్టు కీ. గంగానదీ మూలమందు గల ఆధార ప్రవాహములలో నొకదాని పేరు.

బదరికము. వి. పెట్టె

ఆ మూఁడు వగల పగిది ముడుపులు దెప్పించి,
కలయ నొక్క బదరికమున నుంచి,
కాంతలేశ్వరుని నగరి పురోహితుఁడైన,
గాలవునకుఁ గౌతుకమునఁ బనిచె
జై. ౫. ౪౬.

బదరికాశ్రమము. నరనారాయణ తాపసుల ఆశ్రమము

బదరీచ్ఛదము. సం. వి. అ. ౧ం. సుగంధద్రవ్యములలో నొకట.

బదరీతపోవనము. బదరికాశ్రమమందు తపస్సు చేసికొనుటకు గల వనము.

బదరీనారాయణము. వి. పుణ్య స్థలములలో బదరికాశ్రమమయిన స్థలము

బదరీపత్రము. సం. వి. సుగంధ ద్రవ్యములలో నొకటి.

బదరీవనము. సం. వి. రేఁగుచెట్ల వనము.

బదరీవాస. సం. వి. ఆ. స్త్రీ. దుర్గ. (బదరీ వనమందుండునది.)

బదలాయించు. స. క్రి. ౧. (ఉద్యోగులను) ఒకచోటనుండి మరియొకచోటికి మార్చు. ౨. ఒకదానికి మాఱుగా నింకొకటి యిచ్చు

బదలాయింపు. వి. మార్పు. చూ. బదలాయించు.

బదులు. వి. (అ. బదిల్) ౧. మాఱు.

క. వేడుక రొమ్మునంగ విభునకుఁ, జేడియచేఁ తకును బదులు చేయని చెయువుల, వీడని క్రీడాభరమును, జూడని చూడ్కియును బ్రథమ సురత క్రీడన్
కవిజ. ౩ ౧౦౪

౨. అప్పు.

(వ్యవ) చే బదులుగా అయిదురూపాయలు తెచ్చుకొన్నాను కుంచెడుబియ్యము బదులు పుచ్చుకొన్నారు. ఇంకను బదులు తీర్చలేదు.

౩. ప్రతి

సీ. పోలికయనఁగఁ బోల్పొందు నుపమపేరు, ప్రతిమాఱు బదులనఁ బ్రతినిధి యగు.
ఆం. భా. ౨. ౩౦౨.

బద్ద. రూ. బ్రద్ద. వి. ౧. కాయయొక్క ఖండము.
ఉదా. గుమ్మడి బద్ద, సొరకాయబద్ద.
౨. వెదురు లోనగువాని చీలిక, పాయ.
ఉదా: వెదురు బద్దల చాప.
౩. చీఁట, పగులు.
ఉదా: అద్దము బద్దలయినది.

ద్వి. ... పలికంబు౯ శిష్యకో, బద్దలఁ గూర్చిన
పత్త్రదండంబులును.
పండితా. పర్వ. ౩౪౪. పా.

**బద్ర.** వి. (సం. ద్వాదశ. ప్రా., హిం. బారహ్.) పండ్రెండు.

క. ఆ త్రిభువన తిగ దుగయు, సత్తా దచ్చాకరంచ
వాకం చీర, వి త్తిగ యుద్దగ బద్రలు,
చి త్తంబున౯ ధలదినట్టు చేతిఁ దిద్దు౯.
ఉ. హరి. ౩. ౧౨౧.

**బద్రపట్టు.** వి. (సం. భద్రం.) పదిలము, జాగ్రత్త. (శ. ర.)

**బధిరితము.** సం. విణ. (అ. ఆ. అ.) బధిరముగా చేయఁబడినది.

**బధిరిమము.** సం. వి. ఇ. పుం. చెవుడు, బధిరత్వము.

**బధిరుఁడు.** సం. వి. అ. పుం. చెవిటివాఁడు.

**బద్ధగుదము.** సం. వి. అ. న. ఒకవిధమైనరోగము. (దీనిచే మలబంధాదులు కలుగును. కల్ప.)

**బద్ధఫలము.** సం. వి. అ. పుం. కరంజము, కీ. (రా. ని.)

**బద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కట్టఁబడినది. ౨. సంకెలవేయఁబడినది. ౩. పట్టుకొనఁబడినది. ౪. చెఱపెట్టఁబడినది. ౫. కట్టుకొనఁబడినది. ౬. అడఁపఁబడినది. ౭. నిర్మింపఁబడినది. ౮. కూర్పఁబడినది, ఒకటిగాఁ జేర్పఁబడినది. ౯. పాదుకొన్నది, నాటుకొన్నది, స్థిరము. ౧౦. మూయఁబడినది. (కవాటము చూ.) ౧౧. చిక్కఁబడినది, శాపఁబడినది. ౧౨. రచింపఁబడినది. (పద్యము.) ౧౩. చిక్కుకొన్నది. ౧౪. గడ్డకట్టినది, కదుములుగట్టినది. (నెత్తురు.)

**బద్ధముష్టి.** సం. విణ. (ఇ.) ౧. పిడికిలిపట్టినవాఁడు. ౨. పిసినిగొట్టు, కృపణుఁడు.

**బద్ధమానుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మానము పూనినవాఁడు, మిన్నకుండువాఁడు.

**బద్ధరసాలము.** సం. వి. అ. పుం. శాఖాగ్రము ఒకజాతి రాచమామిడి. కీ.

**బద్ధరాగుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ఒకదానియందు అనురాగము నిలిపినవాఁడు.

**బద్ధసూతము.** సం. వి. అ. పుం పాదరసము బొక్క పాకవిశేషము.

**బధ్యము.** సం. వి. అ. పుం. నీళ్లరాకుండకట్టిన కట్ట. (శ. ర.)

**బనాతు.** వి. (హిం. బనాత్.) వస్త్రవిశేషము ఒకవిధమైన ఉన్నిబట్ట.

రగడ. పెంకములులును సూర్యపుటములు బనాతులును, పరికాలు లిం పొప్పుచలికప్పడంబులును ... (పాంప. ౫. ౩౫౬.)

**బన్న(ము)పడు.** అ. క్రి. (బన్నము + పడు.) భంగమునొందు, అవమానము నొందు.

గీ. తక్కఁగలయింతిగముల వాదన్యు లదరి,
పట్టుకొని రోఁచి పీడల్ల బన్నపడఁగ,
దొడ్డగొని రథకుంజరతురగతతులు, దమక
వలవమనికిఁ దిగఁద్రావి చనిరి.
భార. మా. ౧౦౦.

క. అలిగిన నలుగక యుగ్గలు, పలికిన మఱి వినని
యట్లు ప్రతివచనంబుల్, వలుకక బన్నము
వడి యుండఁ, దలపక యున్నతఁడ చూడ
ధర్మజ్ఞుఁ డిలన్. (భార. అ. ౩. ౧౪౭.)

**బన్నపఱుచు(చ్చు)** స. క్రి. (√బన్నపడు.) భంగము నొందించు, అవమానపఱచు.

ద్వి. నిన్నుఁ గాదట యన్న నీరజోదరుఁడు,
బన్నపఱచుచు బలి బంధించు తెలిసి.
పండితా వాద. ౧౫, పా.

**బన్నము.** వి. (సం. భగ్నః. ప్రా. భగ్గం. క. బన్నవు.) ౧. అవమానము, పరాభవము.

గీ. శూఁదు ద్రౌపది పడినబన్నములు చూచి ...
భార. ఉద్యో. ౩. ౧౪౯.

బన్నసరి=బన్నసరము. వి. ౧. హారవిశేషము.
సీ. విరుల సన్నగుబన్నసరులఁ జెన్నగుమిన్న
బలుదగుబ్బులఁ గ్రాఁగి తోలఁగ జేసి.
చంద్రా. ౪. ౧౫౯.
ఉత్సాహ. పండిదండ లుంగరాలు సన్నబన్న
సరులు హొన్నందెలు... (ప్రబంధ. ౨౬౩.)
గీ. పరగ వెలలేనిచౌకట్లు బన్నసరులఁ, బవిమి
సొప్పారుపచ్చలు పతకములును.
యయా. ౫. ౧౦౦.

బబ్బుర. వి. వృక్షఫలాదులపై నుండు త్వక్కు, తొక్కు, పెచ్చు.
సీ. మీఁదిబబ్బురగీసి మృదువుగాఁజేసిన విరుల
మృణాలహారములు వైచి.
పి. శకుం. 3. ౪౧.
సీ. కరకకాయలమీఁద గలుగు బబ్బురయును
బిప్పలిమూలంబు తిప్పతీఁగె.
అష్ట. ౨.౪30
ఆ. కప్పి యుల్లి కుంకి యుప్ప కరక్కాయ,
బబ్బురయును భృంగి ప్రసవమునకుఁ, జాన
దస్యములను బరగింపఁ జాముల, వివము
తొలఁగిపోవు జేగిరమున. (చి. శి. చి. ని.)

బబ్బురించు=బొబ్బురించు. అ. క్రి ౧. అఱచు.
సీ. ఎదఁ జొక్క నిదురపోయెడిశంభకర్ణుండు
బబ్బురించుచు లేచి ప్రాఁకులాడె.
దశా. ౭. ౨౦౪. (పలవరించు అని భావము.)
౨. అదరిపడు, దద్దరిల్లు.
ద్వి. పాతాళలోకంబు బబ్బురింపఁగను, అతల
బ్రహ్మఘోష మందంద సెలఁగ.
ద్వి. భార. విరా. 3. ౫౩.

బబ్బురి. వి. (క. బబ్బులి.) బ్రబ్బులిచెట్టు.
Ep. In V. 100. పా.

బభ్రుధాతువు. సం. వి. ఉ. పుం. సువర్ణగైరికము. (రా. ని.)

బభ్రువాహనుఁడు. సం. వి. అ. పుం. అర్జునునకు చిత్రాంగదయందుఁ బుట్టినకొడుకు, మణిపురరాజు.

బభ్రువు. సం. విశే. (ఉ.) ౧. పింగళవర్ణము గలది. ౨. రోగమువలన బట్టతలగలవాఁడు. 3. ఖలతువు, కన్నుమూడువాఁడు.-వి. ఉ. పుం. ౧. అగ్ని ౨. పింగళవర్ణము. 3. ఒకయాదవుఁడు. ౪ శివుఁడు. ౫. విష్ణువు. ౬. విశాలమను దేశభేదము. ౭. నితావరి. ౮. ౘ. ముంగి. ౯. పింగళవర్ణము. - స్త్రీ. కపిలగోవు.

బమ = బ్రమ. వి. (సం. భ్రమః. క. బమె.) భ్రాంతి, భ్రమ.
వ. .. నుమనికరంబుల దూరంబులం గనుంగొని కాఱుపోద యనుబమ రొదల నెదుగ.
ప్రబంధ. ౧౮౬.
జ : బమయించు

బమయించు. స క్రి. (√బమ) భ్రమింపఁజేయు, మోసపుచ్చు
క. .. నేఁ డిడె చుటం,బై బమయించెను నన్నున్ ... (ప్రబంధ. ౬30.)

బమి. వి. (సం. భ్రమిః) భ్రమణము.
(చూ. బమిపుర్వు.)
జ : బమిపుర్వు.

బమిపుర్వు. వి. (బమి + పుర్వు.) భ్రమరకము, కుమ్మెద.
సీ. బిరబిరనత్రావుడు వరుసవల్లె బమిపుర్వు కుమ్మెద
తేఁటి ముద్దుగలకాల్లు,పుర గవ భ్రమరంబు
పొలుచు ... (పాం. వి. తిర్య. ౫౯.)

బమ్మ్రె=బమ్మ్రెఁడు. వి. (సం. బ్రహ్మ. క. బొమ్మ.)
౧. హిరణ్యగర్భుఁడు, బ్రహ్మదేవుఁడు.
క. తమ్ములకన్నను గన్నులు, తొమ్మిది గుణము
లను మెచ్చెఁ దొయ్యలి కంచుం, బమ్మ
తనమీయుగోపాం,తమ్మున బ్రావినమరాంతరం
బలిమెఁ జెపుల్. (కవిజ. ౧౫ ౬౭.)

గీ. బమ్మకోలముఁ బట్టినబల్లిదుండవు.

అచ్చ. రా. సుం. ౭౦.

౨. బ్రాహ్మణుఁడు. (చూ. బమ్మరాకాసి.)

౩. వేదము. (చూ. బమ్మచారి.)

బమ్మయమ్మ = బ్రహ్మాస్త్రము.

గీ. బమ్మయమ్మ చేర్పి యజ్ఞగబంటుమీఁద, పైన వది పంపుజాలక వానిఁ గుదియఁ గట్టి పైచిన ... (అచ్చ. రా. సుం. ౧౩౨.)

జ : బమ్మఁడు, బమ్మకట్టు, బమ్మచారి, బమ్మరాకాసి.

బమ్మఁడు = బమ్మ. వి. (√బమ్మ.) బ్రాహ్మణుఁడు.

క. ... రమ్మని యంపఁ జాలును, బమ్మఁడు వావెంటఁ బెద్దపరుగున వచ్చున్.

వైజ. ౪. ౩౩.

బమ్మకట్టు. వి. (√బమ్మ.) బ్రహ్మాస్త్రబంధము.

ఆ. అనుచు వేడుక విననూనుమంతునకుఁ గడు, నగ్గి చల్లనయ్యె నాతఁ డంతఁ గడఁకఁ బ్రాఁకమినుకనుడుపులు గొడఁగినఁ గడిఁది మీఱి బమ్మకట్టు వీడె.

అచ్చ. రా. సుం. ౧౪౦.

బమ్మ(మ్మా)చారి. వి. (√బమ్మ. - సం. బ్రహ్మచారీ.) బ్రహ్మచారి, వటుఁడు.

గీ. పాపమునకుఁ బోయి రామచిన్నబమ్మచారి, చేత గిన్నియఁ బట్టించెన్ ...

వైజ. ౪. ౭౫.

క. అయన బమ్మచారి కొట్టాయెను. ...

వైజ. ౪. ౧౧.

సీ. ... కడుపుదాల్చి, వడు గొంటిజందెము వాఁడు బమ్మచారి యన బ్రహ్మచారికి క్లమరు ... (పాం. ని. మాన. ౪.)

బమ్మర = బమ్మెర. వి. భ్రాంతి.

౧. (చూ. బమ్మరపడు, బమ్మరపోవు.)

జ : బమ్మరపడు, బమ్మరపోవు, బమ్మరించు, బమ్మరిల్లు.

బమ్మరపడు. అ. క్రి. (బమ్మర+పడు.) దిగ్భ్రమ చెందు.

ద్వి. అమ్మకొధ్వని విని యామందవారు, బమ్మర పడి లేచి పరికించి చూడ.

ద్వి. భాగ. ౧. ౧౦. పా.

బమ్మరపోవు. అ. క్రి. (బమ్మర + పోవు.) దిగ్భ్రమచెందు.

ద్వి. మిమ్ముఁ గోఁతులు పట్టి మెదిచిన వారు, బమ్మరపోవుచుఁ బరతెంచినారు.

రం రా యు ౩౭౮. పా. ౧౪. పం.

బమ్మరాకాసి. వి. (√బమ్మ.) బ్రహ్మరాక్షసి.

సీ. బమ్మరాకాసులభంగినిఁ జె క్రెక్కి పదరుచు నున్నట్టిబర్హిణములు. (రసిక. ౩. ౧౪౪.)

బమ్మరించు=బమ్మరిల్లు. అ.క్రి. (√బమ్మర.)

౧. చాంచల్యము నొందు.

సీ ...శయానం దయ్యె నాపేరఁ దయ్యెఁ చిత్ర్యకేళిఁ గని బమ్మరించె నేని, వది చిత్ర గ్రహము .. (భార. అర ౫. ౧౫౩.)

('ఉన్మదించె నేని' ముద్రి.పా.)

సీ. పాదనూపినక్లైన వడిఁ బట్ట నమకట్టి బరి కించి కానక బమ్మరించు.

భార. విరా. ౨. ౩౦౧.

సీ. లోలాక్షి తన్ను నాలోకించు నెంతయు భావించి నెమ్మది బమ్మరించు.

దశకు. ౩. ౧౫౨.

౨. భ్రమించు, దిద్దిరఁదిరుగు.

ఉ. తనులత యుబ్బిపోవ బెదిదంబుగఁ గొల్ల విజాస్త్రవేదనన్, వనచరకొంత జె ట్టుటికి నాథుని కొఁగిలి వాసి కేఁకలీ, ... బమ్మరించుచు ... (భోజరా. ౫. ౪౯.)

బమ్మరిల్లు=బమ్మరించే. అ.క్రి. (√బమ్మర.)
౧. దిగ్భ్రమచెందు.

ఆ. అగ్నిదాహార్తిఁ బంగారవర్ణుండు, బమ్మరిల్లి పేలఁబడిన .. (భార. ఆది. ౩. ౭౪.)

ఆ. అనుడు ఘనుఁడు భోజుఁడును మది భ్రమక్కుచు, బమ్మరిల్లి పసిఁడిబొమ్మ వాడు, జాన మల్వ మన్నదానవు మీరాజా, దాన మెంత .. (ద్వా. ౨. ౫౧.)

౨. భ్రమించు, దిద్దిరఁదిరుగు.

సీ. పన్నగంబుల కెల్ల భయము మిక్కుటముగాఁ బాతాళలోకంబు బమ్మరిల్లె.
ఖ్రి. ౪. ౫౦.

బమ్మెర. వి. మోహపెట్టుట
(చూ. బమ్మెరకత్తె)

జః బమ్మెరకత్తె.

బమ్మెరకత్తె. విణ. (బమ్మెర + కత్తె) మోహపెట్టునది, భ్రమకలిగించునది.

ద్వి. రొమ్ముల కుంపట్లు రోఁతప్రామిండ్లు, బమ్మెరకత్తెలు నమ్మనిబోంట్లు ... వన్నె కత్తెలు వారవనితలు మఱియు.
పండితా. పురా. ౩౫౩. పొ.

బమ్మెర=బమ్మర. వి. (సం. భ్రమః. ప్రా. భమ.)
౧. భ్రాంతి.

సీ. ... బవిరి బమ్మెర యన భ్రాంతి చెలఁగు.
ఆం. భా. ౧. ౧౦౩.

౨. మోసము, వంచన. (చూ. బమ్మెరగొల్పు.)

జః బమ్మెరగొను, బమ్మెరగొల్పు, బమ్మెరపోక, బమ్మెరపోవు.

బమ్మెరగొను. అ. క్రి. (బమ్మెర + కొను.)
బమ్మెరపోవు. (చూ. బమ్మెరగొల్పు.)

బమ్మెరగొల్పు. స. క్రి. (√బమ్మెరగొను.)
భ్రమపెట్టు, మోసపుచ్చు.

క. ...వమ్ముగ లక్ష్యము సేయక, బమ్మెర గొల్పెడ వటంచు వారలు వల్కన్.
పార్వ. ౪. ౧౬౩.

బమ్మెరపోక. వి. (√బమ్మెరపోవు.) బమ్మెర పోవుట, భయముచే దిగ్భ్రమచెందుట.

మ. ... బృహద్గతిజనిశ్వాసైకనిర్వాపవ్చిలితో బమ్మెరపోకతో వటకు ... ఒకకాంతార మృగంబు భిన్నఖురటంకోదగ్రమై కెంచినన్.
కేం. పంచ ౨. ౧౩౬.

బమ్మెరపోవు. అ. క్రి. (బమ్మెర+పోవు) ౧. భయవిస్మయాదులచే మూఢమగు.

క అలెడిదవుఁబ్రమోఁకకుఁ గా,దే బమ్మెరపోయి కెండుపడిరి . (మారి. పూ ౯. ౪౯.)

చ. పలుకుచు యిట్లు గొంతి విని బమ్మెరపోయితి మింత బెట్టిదం,బు లగుచు మాటలు ...
భార. ఉద్యో. ౪. ౨౨.

ఉ. జలరుహాక్షుఁడు. .నొంచె బలవదరాతి యోధులను బమ్మెరపోయి కలంగి పాఱఁ గన్.
భాగ. ఉ. ౧౦. ౪౦౫.

జః బమ్మెరపోక.

బయఁకలు = బయ్యఁకలు. వి. బ. (క. బయకె) వేవిళ్లు. గర్భిణీలక్షణములు.

ఆ. చెలువ బయఁక లైనఁ జెప్పవేటికి నన్న సిగ్గుపడుచుఁ జెలువ చెంతఁ దలఁగు.
ద్వా. ౩. ౩౧.

గీ. ఇట్లు వర్తింప నాతనియింతి గర్భకలితయై చిట్టుముల బయఁకలుమెంగమునఁ, బెలుపు గనుపింప ... (శుక. ౨. ౧౪౬.)

బయకాఁడు. వి. (√బయలు. వృత్తినవర్ణ లోపము.) ౧. స్వరాదుల ప్రకటించువాఁడు వైణికుఁడు.

సీ. ... బయకాఁడు వీణాపాఁ ఉనఁ బొల్పు వైణికుడు ... (సాం. ని. మను. ౧౦.)

గీ. పంచమశ్రుతిదంతి బయకాఁడు పట్టి మీఁట, గమ్మ మనసాదకమున గ్రమ్మకరణిఁగాఁగ.
పార్వ. ౩. ౮౫.

సీ. మన పైన నొకసారి కనుఁడాని బయకాని మునిఁ బిల్చి పాడింపు మకొనఁగరాదు.
చం. రా. ౨. ౨౫.

౨. గాయకుఁడు, పాటపాడువాఁడు, రాగ మును కెలువరించువాఁడు.

సీ. పరిహాసకులు నటుల్ బయకాండ్రు కొంగ పాల గాచినా రని తెల్పుకటికదాని.
ఉ. రా. ౪ ౨౨౩.

సీ. ఇంపుసొంపులఁ బాడుకెలతేఁటిబయకాఁలు లకు వన్నెమీఁటు నీలము లొసంగ.
అని ౨. ౪౧.

౩. గానవిద్యోపాధ్యాయుఁడు.

ఉ. బయకాఁలు లొనర్చినట్టి ప్రా,వేశిక మంగళ ధ్రువలు వీనుల కింపుగఁ బాడి రంగసల్. (సైవ. ౩. ౧౪౭.)

ఉ. అలరాజని భాస్యరొలుంగు గట్టిగా, కోయిల కంచుకుత్తికలకుఁ బయకాఁ డన వచ్చు నెచ్చెలీ. (విజ. వి. ౧. ౧౧౯.)
(ఇట ఔపమ్యద్యోతకము)

౪. ఋంత్రగాత్రముల రెండిటియందును నేర్పుగల వాఁడు

సీ. గాణయుం చనఁగను గాయకాభిన చెల్లు వీణె కాఁడనఁ దగు వైణికుండు, బయకాఁ డనంగ నుభయకారి విలసిల్లు
ఆం భా. ౨. ౨౬౩

తెలుగంటిబయకాఁడు = దేవవైణికుఁడు, నారదుఁడు.

సీ. నిలుచుండి వీణ చేతులఁ బూని తెలుగంటి బయకాఁడు కేల్మోడ్పుపదముఁ బాడ.
కువల. ౧. ౧౨౫.

మూవుసెమ్మెముబయకాఁడు = తురగముఖ గాయకుఁడు, తుంబురుఁడు.

గీ.... మావుసెమ్మెముబయకాఁడు మధురగానా, రీతి రంగేళుఁ బాడ సంగీతధరణి.
శ్రీరం. మా. ౪. ౧౫౯.
(మావుసెమ్మె ము అసముద్రి.)

బయకము = బయ్యంక. వి. నాట్యవిశేషము.
ద్వి భ్రమరముల్ సాళెముల్ బయకముల్ మెఱసి, రమణఁ బంచాంచిపేరణి యాడు వారు. (పండితా పర్వ. ౪౩౫. క్రొత్తప్రతి.)

బయకారము. వి (బయలు + కారము[1].) గానము. (చూ. బయకాఁడు.)

ఉ. . కిన్నెరమెట్లబంతిసం, గాతపుసన్నబంతి బయకారపుఁగన్నడగౌళపంతుకా, సాత తతావతానలపసం దివుటాడెడు ...
పెద్దనచాటువు.

జ: బయకారి.

బయకారి. విణ (బయకారము + ఇ[1].) సంగీతము పాడువాఁడు

గీ మంతుఁ దన నొప్పనెఱవింతవహించకార్య, సొగసుబయకారిజాణను జూచి దగ్గి.
హంస. ౫. ౧౬౯. (విలాసవంతుఁడని భావము.)

బయలీదించు. స క్రి (√బయలు.) వట్టియాన కలిగించు

గీ దూఱఁ దగునిన్ను నొకటికిఁ దొంటియట్ల, కల్లకూరిమి నెఱవువాక్యముల నన్ను, నిట్టు డును బయలీదించె దిదియకాద, కటిల తడిపాఁతఁ గుత్తుక గోయు టనఁగ
ప్రభా. ౫. ౧౨౪.

బయలు = బైలు. వి. దే. (సం. బహిః. ప్రా. బహి. క. బయల్.) ౧. ఊరు, మంది రము మొదలగువాని బహిఃప్రదేశము, వెలుపలి టుచో.

సీ. అపుంచగాద ధాత్రీపదం బెవ్వానికపివాజుగా సేఁగునట్టి బయలు. (మనుచ. ౧. ౧౧.)

వ. ... మందిరంబు ప్రవేశింపక యొక్కబయల నిఖిలబంధుమిత్రపరిజనపరివృతుండై నిలిచెా. భార. కల్యా. ౧. ౪౧.

గీ. ... తాను, బయటఁ గొలువున్న పసిఁడి కొండ (వైజ. ౨. ౪౨.)

౨. శూన్యప్రదేశము, వట్టిచోటు, అవరణాది శూన్యమగుప్రదేశము.

ఆ. ...నీవ యుర్వి యేలు,గుజ్జములును, సేఁగులు లేనిబయలు నీ,తలకొ కట్టికొనుము ధర్మతనయ (భార. కల్యా. ౨. ౬౨.)

ద్వి. పండినచే లెల్ల బయలుగా మేసి. ద్వి. మారిచ్చ పూ. ౪౯౨. పం.

సీ ఇంద్రజాలపువిద్య సెచోట్టనైనను బయలు పట్టణముగాఁ బన్నవచ్చు విక్ర. ౪. ౧౧౩.

గీ ఎల్ల వారును జూడంగ నిట్టిబయల, నెట్టు సంగమ మగు నని యింతి యన్న. భార ఆది 3 ౪౨.

గీ. . తెలు,పులుగఁ దోఁచె కొండమావుల బయళ్లు (ఆము. ౨. ౪౭.)

క. దినకరుఁ జూపి తత్పరిధిఁ, గొనివచ్చెద ననుచొ యొట్టికమతియు నారా, మునికరశిఖిఁ బడ వరిగెడు, పని వలవదు సీత నీకు బయలం గలదే (బా. రా. ఆర. ౨ ౧౫.)

(పైఁబైనున్నదా ? సులభమా ? యనిభావము.)

3. ఆకాశము.

సీ. పసిఁడికుంభంబులు బయ లంబుచీచులు పుక్కరావర్తంబు పులినతలము. భీమ. ౧. ౯౩.

మ. చెలియల్ గన్నియ ముద్దరా లబల నీకే మంబు చింతించు ని,ర్మల దీక్ష బయలాడుమాటలకునై మర్యాదఁజోఁ దట్టి కృ తక్కులజాతుండవు ... తెగ్రవేయఁగాదే యగుశే ... (భాగ. ౧౦. పూ. ౨౯.)

ఉ. చెచ్చెర నిప్పు డీబయలు చెప్పినమాటలు నమ్మ వచ్చునే. (వీర. ౨. ౧౫౨.)

౪. అవకాశము, సందు.

ద్వి. అహితభూరులచేత నంచితమణుల, బహుళతరద్యుతి నొప్పుభద్రపీఠంబు, బట్టించికొని నేల బయ లిచ్చి పోయు, నెట్టన భూదేవి నెమ్మి సేకించి. రం రా. ఉ. ౧౬౯. పొ. ౨౭. పం.

ఆ. భాసదీప్తు లదర బయలీక మేఘముల్, నీడ సేయుచుండ ... (భా. రా. యు. ౨౬౦.)

విశే. ౧. శూన్యము, వట్టిది.

వ. అక్కురరాజా దవచట్టును బయ లగుటఁ గలయం జూచి. (భార కల్య ౧. ౩౯౯.)

(ఇట నేసారహిత మని భావము.)

గీ. ... అపుడు మనసైనికులఁ గిచకారిసెదుర, నలిక పాసిన బయ లయ్యె నతని మనము. భార. భీష్మ ౨ ౯౨.

ద్వి. భక్తవత్సల విన్నుఁ బరికింపఁ దరమె, భక్తియోగము దక్క బయలుమాటలకు. రం రా. బాల ౧౬ పొ. ౨౦. పం.

(బయలుమాటలు = వ్యర్థాలాపములు.)

౨. బహిర్భూతుఁడు, వెలుపలివాఁడు, బహిర్భూతము.

ద్వి. భావంబులకు నెల్ల బయ లైనవాఁడు, దేవదేవుఁడు సర్వదేవతామయుఁడు. రం. రా. ఉ. ౫౯. పొ. ౨౦. పం.

క .. ఆతడ వాయుద, పండితుఁడును విరుదు నైనమతికిని బయలై. (ఆము. ౪. ౨౩౨)

3. ప్రకటము, వెల్లడియైనది.

సీ. పొన్నపువ్వులఁ బోలుపొక్కిళ్లు బయలుగాఁ గట్ట నేర్తుమ చీర కటిభరమున. కాశి, 3 ౧౦౯.

క. నా విని యుత్త డీ భావం, బీవనితకు నీవని తకు నిది యనుచు బయల్, గావించి కథ్య మిథ్యాభావంబులు మీరలేరు పలుపఁగ వలయున్. కళా. 3. ౨౦౯.

క్రి. విశే. శూన్యముగా.

గీ. బయలు నవ్వుచుఁ బడుకిల్లు వాదికొనుచు. దశకు. ౭. ౧౪౩. (బయలు = ఊఱక. అని భావము.)

జ: బంగనబయలు బయకాఁడు, బయకారము, బయలీదించు, బయలుదామర, బయలు దేఱు, బయలుద్రొక్కు, బయలు పుచ్చు, బయలుమెఱయు, బయలుపఱుచు, బయలువెదలించు, బయలుబోవు, బయలెక్కు, బయలేఱు, బయల్పట్టు, బయల్వెదలు

బయలుదామర. వి (బయలు = తామర.) నీటికి బైటనుండు తామర, మెట్టతామర.

ద్వి. వనవిల్తునరదుల నగెడుజంఘలును, బయలు దామరలఁ గిద్వెఱచుపాదములు. ద్వి. పారిజా. పూ. ౦౯౯. పం.

బయలు(ల్)దేఱు. అ. క్రి (√బయలు) ౧. గృహాదులనుండి వెలువడు.

గీ. బయలుదేఱినమకుండు లోపలను సతియు, గాని యన్యులు లే రైరి ఖచరపతికి. దశా ౬. ౫౧.

సీ. మనుఁ గేరికొని మాలమాల డాఁగిన దిశాధిపుల కిప్పుడు బయల్దేఱఁ గలిగె. ఉ. రా. ౧. ౧౫౦.

౨. పుట్టు.

(వ్యవ.) అతని కొకకొడుకు బయలుదేఱినాఁడు.

బయలుద్రొక్కు = బయలుపడు.

(√బయలు.) ప్రకటమగు, వెల్లడియగు.

సీ. ప్రబలబాహాంతరద్రఢిమఁగాఢిన్యంబు బయలు ద్రొక్కఁగఁ గులపర్వతములు. గీ.... కొల్చి తేఱిరిల్లు ... కళా. 3. ౭౧.

బయలుప(ల్ప)డు = బయలుద్రొక్కు. అ. క్రి. (బయలు + పడు.) ౧. ప్రకటమగు, వెల్లడియగు.

క. కలిమికి భోగము కర్మఫల మని తెలియఁగ జెప్పి బయలుపడఁ జెల్లఁగ విశ్వంబునిచి భోగింపక . (భార. విరా. ౧. ౧౬౦.)

వ. వీరె సఖులు వచ్చుచున్న వారు మంత్రరహస్యంబులు బయలుపడకుండవలయు ... నైష. ౬. ౫౮.

గీ. నేఁడు ప్రాలు చల్లిరి వేడుక ల్బయలు పడఁగ. నీలా. 3. ౫౭.

౨. గోచరించు.

(క.) కనఁబడు.

చ .. బాలపై వలు వెడలన్ బయల్పడియె వల్లపుచంబులుఁ గళ్యుగ్మమున్. భార. ఆది. ౪౭౩.

చ. . చల్లునీట మయిపూఁతి గరంగినఁ జన్నుదోయిపై, నరుదుగఁ గామముద్రలు బయల్పడకుండఁగఁ గప్పె భారణీశ్వరకరనిర్గళత్సలిలసాంద్రసరోజసమాజపత్త్రిముల్. వి్ర. ౫. ౫౫.

గీ. అట్టిరమణుండు దివియ నవార్య్యతనయ, విభుమణి స్తంభమున వరవెదలి బయలు, పతి కెనంగుచు .... (వసు. ౭. ౩౧.)

(వ.) తెలియు, వ్యక్తమగు.

ఉ. వారలు పూనినట్లు వనవాసము సల్పిరిట కేది తప్పు రయఁగా బయల్పడనియట్లుగ సుండెడువత్సరంబులను, జేరుపచేరువల్ గడచె ... (భార. విరా. 3. ౧౦౭.)

వ. ... అని కప్పి పల్కంబోయి బయల్పడఁ బల్కి .... కు. సం. ౫. ౭౦.

౩. నిర్గమించు, వెలువడు.

వ. ... కమనీయసౌందర్యలీలఁ బయలుపడిన కామిని యిందిరాకామిని యనియును ...

ఉ. రా. ౨. ౬౧.

**బయలుపుచ్చు.** స. క్రి. (√బయలు.) ప్రకటించు వెల్లడిచేయు.

సీ. సద్వస్తు బయలుపుచ్చంగ రా దనుచునో రిక్కగుంపుల నేర్పరింపదయ్యె. గీ. ... నిస్తంద్రచంద్రికావిలసనంబు.

ప్రభా. ౫. ౬౨.

**బయలుమెఱయు.** అ. క్రి. (√బయలు.) బయలుపడు, వెల్లడియగు

గీ. వారి యజ్ఞాతవాససంవత్సరంబు, నిండకుండంగ మున్న పార్థుండు బయలు, మెఱసి సమయంబు దప్పెఁ ...

భార. విరా. ౫. ౩౬౮.

ఆ. కురులు గూడ మేను మెఱుఁగెక్కఁ బాలిండ్ల, బయలు మెఱసెఁ.. తోయజాస్య కలరుఁబ్రాయ మైన.

కం. పంచ. ౩. ౩౦౧.

గీ. సంతతజలాంతరాళసంస్థానమహిమఁ, బ్రాఁచి పట్టినమేనితో బయలు మెఱసి, వచ్చె వలి గట్టుతో లిపట్టి . వసు. ౫. ౩౬.

**బయలువ(ప,ల్ప)ఱుచు.** స. క్రి. (√బయలు) బయలుపడఁజేయు, ప్రకటముచేయు.

సీ. మాటిమాటికిఁ గూర్మి మాటు వేసెవ సన్నఁ బైకొన్నవలవంత బయలువఱచు.

విక్ర. ౧. ౧౨౪.

ఉ. అంత దశాననుండును ... మతిపొద్దిన భీమణకోపవహ్ని నేత్రాంతరకోణకాంతులు బయల్పఱుపఁ ... (ఉ. రా. ౩. ౯౬.)

**బయలువెడలించు.** స. క్రి. (√బయలు.) బయటికి వెడలఁజేయు, నిర్గమింపఁజేయు.

**బయలు(ల్)వోవు.** అ. క్రి. (బయలు+పోవు.) ౧. బయలుపడు, వ్యక్తమగు.

ద్వి. ఒనరంగ లోలోన నొసఁగి నిక్కెక్కి, వనిఁ బంప నేఁడిద బయలు వోకుండఁ, గేసెద నేనియుఁ గొప్పెద ననుచు.

నవ. ౩. ౧౪౨. పా. ౧౫. పం.

౨. వెలుపలికిఁబోవు

గీ. ... అయలరుఁబోణి, ధరణియుం దొక్కరాజనందనునిమీఁద, నిలిపెనఁట బయల్వోవకుండ నెమ్మనంబు. (సైవ. ౩. ౧౯.)

**బయలెక్కు.** అ. క్రి. (బయలు + ఎక్కు.) బయలుపడు, ప్రకటమగు

సీ. వెలువలచూపులా శిలిగిన,వీ తెల్ల బయలెక్కఁ గా కని బకకులంబు.

కవి. ౨. ౬౯.

**బయలేఱు.** వి. (బయలు + ఏఱు) ఆకాశగంగ.

ద్వి. బయలేఱు నెల శిరోభాగదేశముల, నయమార భోగిసంతతి నందనమ్ము, లగుచున్న...

ద్వి. పరమ. ౧. ౩౧. పా.

**బయల్వట్టు.** అ. క్రి. (బయలు+పట్టు.) స్థానము విడిచిపోవు, పాఱిపోవు.

సీ. పట్టు గానక బయల్వట్టి రాదిత్యులు ఖచరులత్రోవలు గట్టువడిరి.

ఉ. రా. ౧. ౨౯౫.

**బయ(లు వె)ల్వెడలు.** అ క్రి. (బయలు + వెడలు.) బయలుదేఱు, నిర్గమించు.

గీ. వింధ్యభూధరమును బయల్వెడలి యచట, నఖిలలోకైకకర్త్మద యైనయట్టి, నర్మదను గ్రుంకి ... వాల్మీ. ౨. ౬౫.

లయగ్రాహి. చెలువమ్మున బయల్వెడలి కమ్మ నగువింటఁ, దమ్మి విరిమల్లి వెడదమ్మ గనరుచ్చి ... నీలా. ౩. ౩౯.

**బయిడాలము** = బైడాలము. (శ. ర. చూ. బైడాలము.)

**బయిరవాసము** = బైరవాసము. వి. అంగవస్త్రము. (చి. వి.)

బయిరాగి = బైరాగి. వి. క్షుద్రసన్యాసి. (శ. ర.)

బయిరి = బైరి. వి. శ్యేనభేదము, ఒకజాతిడేగ. (ఇది గద్దంతయయి పెడఁదనిడుదనల్లనిఛాయలు లక్ష్యణం గలిగి తోఁకపై మీఁది యుండి సమము లయి కొంటిసాఁగిన ఱెక్కలు గలిగియుండు. చి. వి.)

బయిలు = బైలు. (శ. ర.)

బయిసణ = బైసణ. వి. పీనపాంసుకాయరుయొక్క బంధనము. (శ. ర)

బయిసి = బైసి. వి (సం. భవిష్యమ్.) ౧. అను గ్రహము, దయ.

ద్వి. మాబోఁటిభక్తులమనికియు నునికి, నీబయి సియె కాద గిరిలోపకార.

బస. పు ౫ ౩౧౦. పం.

౨. గౌరవము, గొప్పతనము.

ద్వి. బయసైనదెమక నీప్రజలలోపలను, బయసి పోవుట కొంత పాపంబు కొంత.

ద్వి. శ. పా. ౨. ౩౮. పం.

సీ. తొడిని క్రమ్మఱఁ గాలు విడిచి పక్కను దుంగ జాడఁగి యాయముఁ బట్టి గ్రుక్కఁ జేయుఁ. గీ. జేసి యిటు లేకమ్ముల బయిసిఁ గొనియె, జనవిభుఁడు కూడ నొకకొన్ని జాగిలములు. (చంద్రా. ౨ ౯౧.)

3 మేర, హద్దు. (చూ. బయిసిమాలు.)

౪. శోభ, సొంపు. (చూ. బయిసిమాలు.)

౫. భాగ్యము. (శ. ర)

జ : బయిసిమాలించు, బయిసిమాలు.

బయిసిమాలించు. స. క్రి. (√బయిసిమాలు.) గౌరవము చేయుచు.

(వేశ్యమాత.) సీ. .. పోటివిటుల. గీ. బయిసి మాలించుఁ దనమిన్న వయసుచాఁటి, పడుపు బుద్ధులు దలకెట్టి .. (వైజ. ౨. ౭౪.)

బయిసిమాలు. అ. క్రి. (√బయిసి.) ౧. మర్యాదతప్పు.

చ. తగవులు విల్వఁ బాల్పఁడినదైవము చొక్కట నీవు గ్రుచ్చువై, మగువలమాత్రకుం బయిసి మాలిన చేరికఁ జెప్పికొందుము ...

కరమ. ౪. ౧౧౦.

౨. మేరమీఱు, హద్దుమీఱు.

గీ. బాలెఁ గదుఁ దూలి జవరాలిపై విరాళి, బయలుమతి మాలి తమి సొలి బయిసిమాలి.

శశాం. ౨. ౯౨.

3. శోభతఱుఁగు, సొంపుచెడు.

గీ. ప్రియము గలిగిన వంగీకరింపవలదు, ముండ దీవన కపాడి కొమముజాచి, బైసిమాలిన పరమనిర్భాగ్యురాలు,విధవ దానియాశీస్సును విషసమంబు (కాశీ ౨. ౭౫.)

బయిసుక = బైసుక. (శ.ర.) (చూ. బైసుక.)

బయ్యఁకలు = బయఁకలు. వి. బ వేవిళ్లు, దౌహృదము.

సీ. . వేవిళ్లు నాఁగ బయ్యంకలం చనఁగను దౌహృదాఖ్యలు చెలంగు.

ఆం. భా. ౨. ౧౦౯.

బయ్యఁడు. విణ. మందుఁడు. (శ. ర.)

బయ్యకపుల్ల. వి. పక్షివిశేషము.

సీ. ... గుడిసె బయ్యకపుల్ల నీటువ బెగ్గురు జిక్కుతురక ... (హంస. ౩. ౧౨.)

బయ్యన. వి. భైరవుఁడు ? (ఇది తిమ్మన, తిప్పయావంటిది.)

బయ్యనబాలికేజాలు = కుక్కలు, కునకములు కాలభైరవుని ప్రియవాహనములు.

ఉ. బయ్యనబాలికేజా లొకపట్టునఁ బట్టినవారు పట్టెదర్. (కళా. ౪. ౩౮.)

బరక. విణ. కఱుకైనది. (శ. ర.)

**బరకట.** విశా. అసత్యము, బొల్లి. (ఇది తరకట శబ్దపూర్వకముగానే కానవచ్చుచున్నది.)

వ. ... అవ్వోయవ్వ కడుపుకూటికి దబ్బ రాడితి నని తలంచి యుండావే అది కల్ల గాదు కైలాట గాదు తరకటబరకట గాదు తబ్బిబ్బు గాదు. (వేం. మా. ౫. ౩౭.)

క. తరకటబరకట కాదే, తరుణీ నామాట నీకుఁ దార్కాణ యగునే. (దశా. ౭. ౭౦౯.)

**బరకము.** వి. ౧. ఒకవిధమగు గోనె, పెక్కు గోనెలు కలిపి కుట్టిన ఒకవిధమగు ఆస్తరణము.

సీ. ... గోనె యం చనఁగను గోణి పరగుఁ, దద్విశేషాభిధ తగును బరక మన ...

ఆం. భా. ౨. ౨౬౬.

౨. దూదిబరువు. (శ. ర. గ్రా.)

**బరగడ.** వి. ధాన్యపురాశి లోనగువానిమీఁద వేసెడు మట్టిముద్ర (శ ర., గ్రా )

**బరగడము.** వి. వృక్షవిశేషము (శ. ర.)

**బరగు.** ఉపశాఖ, చిన్నకొమ్మ, రెమ్మ.

సీ. బలుగు గోల బరగు పెల యన నుపశాఖ చెలఁగు . (ఆం భా. ౨. ౩౪)

**బరణి** = బరిణె. (సం. భరణీ. క బరణి త. పరిణి.) కాటుక మొదలగునవి యుంచు దబ్బి, కరాటము.

సీ. భరణి మీఁఱును దార్వు బరణి దబ్బి.

ఆం. భా. ౨ ౧౬౬.

గీ. తోఁచెఁ బ్రాచీమహీధరోత్తుంగసరణిఁ, బ్రాఁ జదువుమానికంబులబరణి తరణి.

పారి. ౪ ౪౯.

క. అమటయు రసలింగము నిడు, తన వక్షోజ ప్రేపసజ్జదంతపుబరణిన్, నిని చిన రొమ్ము కపసరు ... మనుచ ౧. ౪౭.

చూ: బరణికెలు.

**బరణిచుక్క.** వి. భరణీనక్షత్రము. (శ. ర.)

**బరణికెలు.** వి. (√బరణి) బరణికప్ప, దబ్బి మూఁత.

క. సుడిగాలి ధూళిఁ జాట్టుచు, వడిగా నందంత తిరుగవలయం బగుచున్, బుడమి యను బరణికెలు తిరిగెడుకరణిం గ్రాలె నట్టి గ్రీష్మమునందున్ వాల్మీ. ౨ ౪౪.

**బరతము.** వి. పక్షివిశేషము

సీ. బరతము కోకిల పవిరిక తంగేడుగొరవంక జక్కవ చెరువుకోడి. (హంస ౩. ౧౨.)

**బరతుపిట్ట.** వి పక్షివిశేషము (శ. ర., చి. ని)

**బరపట.** వి. తృణవిశేషము. బ. తృణధాన్యవిశేషము.

గీ. గునుగు లూదర్లు బరపటల్ గోర్లుగొండు, లల్లిబియ్యంబు వెదురుబియ్యంబు ...

కాశి ౩. ౧౫౧.

**బరమా.** వి వడ్రంగి మున్నగువారు కొయ్యలు మొ॥ వానికిని కాలపనివారు రత్నములకును బెజ్జమువేసెడుసాధనము. (శ. ర, చి. ని)

**బరవసము.** వి. (హిం. భరోసా = అధారము, ఆశ్రయము. క. బరవస = అభినివేశము.) ౧. ధైర్యము.

గీ. బవర మెల్లియ బిరుదవై బరవసంబు, గలిగి చావుము చావక తొలఁగరాదు.

భార. ఉద్యో. ౪. ౨౦౩

చ. . తమ్ము నని బోయగతిన్ గిరిశుం డెదిర్చినన్, బరవస మొప్పఁగా గెలిచి పాశుప తాస్త్రముఁగొన్న శత్రుభీకరుఁడు ధనంజ యుండు ... భాగ ౩. ౭౧.

క. ఈలీల వియోగానల,కీలామాలాతితాపకీలిత హృదయాం,దోళనమాతఖేలనయగు, బాలిక శోకపకియ గదిసి బరవసమలరన్.

చంద్రా. ౪. ౧౫౬.

౨. అభినివేశము, పట్టుదల.

క. విరటుఁడు ద్రుపదుఁడు దోడుగ, నిరవున
ముగ నెత్తి విడిసి బలిమి వడిగినం, గురు
పతియు వెలిచి యిచ్చెను, ధరలోఁ జక్క
నగ మిట్టితగవులం గలవే.
భార. ఉద్యో. ౧. ౧౫౧.

క. జనకుని పనుపున కలరుచు, మనమున ముద
మొందవ నగరమనుజాపతినుతుల్, కనుకని
బిరవసములఁ గొనకొని పరభసగతుల నరిగి
గురుధృతు లెనఁగన్
భా. రా. బాల. ౪౦౫.

3. ఉత్సాహము.

సీ. లెక్క లెక్కువ లగురక్కసిమూకల బర
వసం బొనరించి పలు తెఱఁగుల.
అచ్చ. రా. యు. ౯౩.

క. హరిసేనతోడ వినజుఁడు, బిరవసమున
రాకసమయభంగము సేసెన్
భా. రా. కిష్కిం. ౪౧౪.

×బరాతము వి. ౧. తా నీయవలసినదానిని మఱి
యొకని యొద్దనుండి తీసికొమ్మని వచ్చినవానితో
చెప్పుట, లిఖితపూర్వకముగా ఆజ్ఞయిచ్చుట
సీ. మోయీను కుల్గ్రాణమును జెప్పు వద్లగించ
లకు బరాతముల్ సరవి వ్రాయు.
వేణు ౨౫.

౨ బహుమతి, పారితోషికము
(వ్యవ) ప్రతిసంవత్సరము నాకు దసరాబరా
తములక్రింద పదిరూపాయి లగును.

బరాబరి. వి (హిం. బరాబరీ = సమానము,
హెచ్చుతగ్గులు లేనిది.) ౧ హెచ్చరిక.
సీ. మరునిముందఱ బరాబరిసేయు కంచుకిఖలను
చేతుల వెంచిగుద లనంగి. (పారి ౨. ౩౬.)
గీ. బిగ్బరీభూర్జరులు బరాబరులు సేయఁ, బల్లకీ
యెక్కి పల్లకీపల్లవోష్ఠి, వల్లకీవాణి వాణి
ప్రఫుల్లకీర్తి, గారవమ్మునఁ జేరె శృంగార
వనము. రా. వి ౩. ౪౪.

సీ. స్వస్తికహస్తులై సమ్ముఖంబున బరాబరి
గాఁగ పర్యుసుపర్యు లుండ. (కాశీ. ౨. ౪.)
సీ. . పక్కి కొమ్మలు బరాబరు లొనర్ప.
అచ్చ రా. సుం. ౩౫.

విశే. ౧. పరిపూర్ణము.
చ. అతఁడు డొకయంగినన్ గలయ నప్పటి
నుండియు నేల రాకపో, పతివలతోడ నే
మనుచు నాగతిఁ బక్కొద నంచు నీగ్గునన్,
సతి మునుఁగున్ బరాబరిగఁ జయ్యన
నూర్పదు జంకుచూపులన్, వ్రాతిఁ గోళ
నీదు చెక్కుల వహించును బాండుపలాండు
కాంతులన్. గంధ. ౧౨౨.

౨ సరియైనది. (శ. ర)
జ : బరాబరిక.

బరాబరిక. వి. (√బరాబరి) హెచ్చరిక.
సీ తనదు దండవ్రుఁగట్టుచుగు బెత్తముగఁ బట్టి
ప్రతిహారులను బరాబరిక చేసి
చంద్రా ౩ ౪౨ (శ. ర, చి. ని పా.)

బరి.¹ విశే (క. బతి.) ౧ అనావృతము, కవ
చాదులు లేనిది. (చి. ని.) (వృత్తియందుబరిగి
శబ్దమున కంత్యవర్ణము లోపింపఁగా మిగిలిన
రూపము)
క. శిరమునఁ గగ్గంబుల నెత్తు కొలంక బరిమేని
తోడఁ దూలక బాహుస్ఫురణంబు మెఱయ
సాయక,పరంపరలు నరుని మీఁదఁ బఱపెం
బెలువన్. (భార కర్ణ ౩. ౩౩౫.)
సీ కదిసి విప్పక్షేసుకై దండ యొడిసియుఁ గడు
వేగ మదరంగఁ గడకు నూఁకి, బరిమేని
గరుముని నురవడిపై నెక్కి పదపద ను
సార పన్నె సోఁకి (వాల్మీ ౧ ౧౦౨.)
వ అదవులు లేనిబరగొండ లన నెల్లెడఁ
బొలుచుబరిమేనుంగులును ..
(అచ్చ. భా. ౩. ౧౫.)
౨. (క. బరి.) కేవలము, పట్టిది. (చూ. బరిఁగోలె.)

బరి¹. వి. ౧. పార్శ్వము, ప్రక్క, పార్శ్వప్రదేశము.

క. పరిఘమున నురము శిరమున,బరియు నడిచి
ధనదు మూర్ఛపాలు పఱిచి.

హరి. పూ. ౪. ౧౫౩.

గీ. జనవిభుఁడు నాఁట పఞ్చాననవ్యాఘ్రకులఁ, దిరు
గుచోఁ గర్ణతూపులు బరులు రెంటఁ,గట్టి
కనుపట్టె రెక్కలు గలమహాను,హేమకంబు
విధంబున నేకలంబు. (వరాహ. ౪. ౮౫౩.)

క. దురమున కొండ దొడ కొలు,బరి శిరము...

కు. సం. ౧౧. ౬౭౦.

౨. గీఁత, రేఖ.

గీ. పగలు బరి వ్రాసి యాఁగి దర్పంబుఁ జెలఁగుఁ,
గోలుపుచ్చుము రారాత్రిక్రోధవహ్ని,యురక
నిటు మంద నాఁడదు నడుటఁగలుగు,వాఁడు
గుండియగలవాఁడు గాఁడె జగతి.

హరి. ఉ. ౭. ౫.

ద్వి. పర్ణశాలకుఁ జుట్టు బరులేదు వ్రాసి,వర్ణించి
యీబరుల్ వడి దాఁటకమ్మ.

రం. రా. అర. ౧౭౬. పౌ. ౨౧. పం.

క. స్మరమాంత్రికుండు నిలుపం,గరానికోమాళి
పన్నగము నిలుపుట దు, స్తర మని తలఁచుక
వ్రాసిన,బరులను మా యీ సరోజపత్త్రాక్షి
వళుల్. వరాహ. ౩. ౧౧౬.

౩. హద్దు, మేర, నియమము.

క. బరి తప్పి తప్పచేతలఁ బొరలక ...

విరం. ౩. ౩౨.

సీ. పతియాజ్ఞఁ దల నిడి బరి యింత గడవని
లలనల కీయింతి తిలకలక్ష్మి.

కేయూర. ౧. ౩౬.

౪. తోత్రము, ఏనుఁగును దోలుసాధనము.

సీ. ..తోత్రంబు బరి యావఁగ,సారెకోలయునంగ
వలయుచుండు. (ఆం. భా. ౨. ౧౯౫.)

౫. కేద్దనము, చుట్టుబాటుట. (చూ. బరికోను.)

జ : బరికోల, బరికోను, బరిదాగు, బరిపోటు, బరివిడుచు.

బరి². వి. ౧. దొంగ, చోరుఁడు.

(చి. వి., శ. ర., గ్రా.)

మ. అవనీశత్రిదశేంద్రు చూపుబరి కన్యాగంధ
పాళిద్వయీ,నవలావణ్యరసంబుఁ గొల్లగొని-
యంతన్ ... (వసుచ. ౫. ౮౨.)

౨. శత్రువు.

గీ. చిచ్చువాతను బరివాతఁ జిక్కవడక, తప్పి
పోయినవార పో తద్దు లెందు.

కాశీ. ౬. ౨౯౪.

బరికట్టె(ట్టియ). వి. (√బరి¹.) ౧. దరిద్రుఁడు.

సీ. ... వెలయు దరిద్రుండు పేద యన బికారి
యంచన బరికట్టె నా ...

ఆం. భా. ౩. ౧౪.

౨. బరిగమ్మ, అలుగులేని యీఁటె.

ఉ. ... పద్మరాగంపుఁగుప్పలు నిప్పులనుచుఁ
గందలు బరికట్టియల నట్టి కొలుతట్లు
గాలుపం బాలుబడి తిరుగు భూతభేతాళ
బాలికాపులకోలాహలంబులును.

కాశీ. ౨. ౬౨.

బరికాఁడు. వి (√బరి².) తోత్రముతో నేనుఁగు
ప్రక్కలను బొడుచువాఁడు. (మావటివాఁడు.
ఆని. శ. ర.)

మ. మది శంకింపక ముట్టివిక్రమరసోత్సాదంబునన్
భూవిభున్,గద వ్రేటుంగ నతండు పైఁబడి
భుజాగర్వంబునన్ బట్టె నా,రదుఁ డార్వం
బరికాఁడు నిర్భయతఁ జేరం జూచినం
బిట్టును,న్మదకుండాలములీల దిక్కులిలవాను
శ్రావణున్ రావణున్ (నిర్వ. ౬ ౫౫)

బరికాయ. విశే. (√బరి¹.) కొంటె, గుణ
హీనుఁడు.

గీ. ... బరికాయ కొండె ఖాఁ దోఁచు
భ్రష్టుఁడు ... (ఆం. భా. ౩. ౧౨.)

బరికె. వి. చువ్వ, సన్నని నిడుపైన కర్ర.

సీ. చిగురాకుబరికెలు గగనచూతమునకు నలఁతి
యూడలు వియద్వటమునకును.
వి. శకుం. ౩. ౨౦౧.

౨. గఱుకుగలయొండినకాతిమట్టు. (శ. ర., బ్రౌ.)

విణ. చింపిరి. (శ. ర.)

గీ. నిడుద పాదవుల మిడిగ్రుడ్లు బడుపుటొడలు,
గుంతకౌనులు గుజ్జుకేలుఁ గుందకడుపు,
మిట్టపండ్లును కెంతయు బెట్టిదంపుఁ,బలు
కులును దురాచారంబు బరికెతలయు.
మార్క. ౫. ౧౮౧.

(బరికెతలయు. చి. ని. పా.)

సీ. ముడివడ్డబొమలును ముహుర్మూలముక్కుఁ
బల్లబెండ్రుకలును బరికెతలలు
ఉ. హరి. ౨ ౧౨౨.

వ. ... ఒక్కడీసుని నడుమ నిడుకొని ... బరికె
తలల కఱకుఁగొండదరుల సనుదెంచిన నప్పు
రమువారుణికుండు. (వ్యా. ౧౧. ౨౬.)

బరిగమ్మి = బరికట్టె. వి. (బరి + గమ్మి.)
అలుఁగులేనియీఁటె.

ద్వి. గొడ్డలి బరిగమ్మి కూటికుండయును, దుడ్డు
కోలయుఁ బట్టి ...
బసవ. పు. ౩. ౧౧౨౧ పం.

బరిగా(కా)యపోటు. వి. (బరిగాయ+పోటు.)
బాలక్రీడావిశేషము.

సీ. గడ్డఁబోడి యుక్కుఁసికొట్టు బరిగాయ
పోటు గిరగిరలు బొంగరములు.
హంస. ౩. ౧౮౬.

బరిగి. విణ. ఏమియుతెలియని, మూర్ఖము.
(చూ. బరిగిరాజు.)

జ: బరికట్టె, బరికాఁడు, బరికాయ, బరిగమ్మి,
బరిగాయపోటు, బరిగిరాజు, బరికోగి.

బరిగిరాజు. వి. (బరిగి + రాజు.) తెలుసుకొనని
గుజ్జుముకొక్కడిరాజు.

సీ. ...బరిగిరా తనఁ బల్యాణబంధ రహితమాయ
సమారోహకాభిఖ్య యలరుచుండు.
ఆం. భా. ౨. ౨౦౩.

బరిగె. వి. ధాన్యవిశేషము.

సీ. బరిగ సజ్జయు ... (హంస ౪. ౧౨౪.)

బరిగొ(కొ)ను. స క్రి. (బరి + కొను.) పరి
వేష్టించు, చుట్టుకొను.

గీ. గిరికొనెను బ్రహ్మ బరికొనె గ్రిక్కొనె జగ
మెల్లయు వేష్టించె ననుటకు ...
ఆం. భా. ౩. ౧౧౪.

చ. కరముల మూఁపులూఁదుకొని కన్నుల్వ...
వసు. ౩. ౧౫౬.

బరిగోల. వి. (బరి + కోల) ౧. తోత్రము,
ఏనుఁగులను తోలుటకై ప్రక్కలను పొడిచెడి
యర్ధచంద్రాకారమైన అలుఁగు గల కేలు
దండము.

తరువోజ. అరికంబుకుంజరుఁ దగుభీకుఁ బల్కు
లనుబరిగోలల నలఁచుట మేలి.
భార. స్త్రీ. ౨. ౫౧౭

క. బరిగోలచేత మదపెం,ధురముం గదలించినట్లు
దూతల వాఖ్యా,వరుఁ గదలించుచు ... .
భారా. ఆర. ౧. ౨౩౩.

క. అప్పులకుల కలుకలు మది, ... కొష్పారఁగ
బరిగోలలు, గొప్పించిన భద్రగజము మాల్యా
న్పుగతిన్. (ఉ. హరి. ౫. ౨౨౦.)

౨. బాణము.

చ. ... అయ్యవం,గుని మనుపాఁడితుప్పుబరి
గోలవిధంబున నల్కఁ బల్కఁగన్ ...
కాళ్ళి. ౩. ౪౫.

వ. ... చెలువులుగొని బరిగోలల కెలంగున...
వరాహ. 3. ౯౭

3. కాఁటికాపరివాని చేతికఱ్ఱ.

సీ. శత్రుభీకరమైన శాతాసి నమరుని కేల నీచపు
బరిగోల యుండ. (హర్క. ౧. ౭౫)

**బరిచి(చీ).** వి. (హిం. బర్ఛీ.) ఈఁటె, కుంతము.

సీ. ... సేజ బరిచి యీఁటె యనంగఁ బరగుఁ
గుంతము ... ఆం. భా. ౨. ౨౧౪.

ద్వి. పరశుపట్టిసముల బాఁకుల వాఁడి,బరిచీల
మురుగదా ప్రముఖాయుధముల.
ద్వి. సా. ౨. భా. (శ ర.)

**బరిజోగి.** వి. (√బరి¹.) - పట్టిజోగి - పాముల
వాఁడు.

క. గరుడుఁడు తోలుక తిరుగును, బురముల
నాడింతు రుదరపోషణములకున్, బరిజోగులు
పెట్టెల నిడి, తరుణు లాలుచుకొంద్రు
మణులు తలతలవారిన్. (శై. భా. ౪. ౭౨)

**బరిడె** = బరిణె. వి. బరణి.

జ: బరిడెగవ్వ, బరిడెపురుగు

**బరిడెగవ్వ.** వి. (బరిడె + గవ్వ) భక్ష్యవిశేషము

వ. ... సరడాలు బరిడెగవ్వలు ...
హంస ౧. ౧౦౫

**బరిడె(ణె)పురుగు.** వి. (బరిడె + పురుగు.)
బొద్దింక. (శ ర., బ్రా-బండపురుగు చి ని.)

**బరిణె(ణియ)** = బరణి. వి. కాటుక మొ॥
ఉంచుకొను కరాటము, డబ్బి. (చి. ని.)

సీ. మరున కర్పింప కాముని సమకట్టినపచ్చరా
బరిణెలబాగుఁ గాంచి. (ఉ. రా. ౨. ౧౪.)

మ. ... ఒక్క చందనగంధి గంధవొడిబరిణెయు
నొక్క పుండరీకనయన యగురుధూపధూమ
కరండంబును ... (వి. శకుం. ౧. ౯౨.)

సీ. కలుకుఁజూపులుద్దుకొని కొప్పునుసవరించు బరు
ణెత్తి కాటుకబరిణె మెదకు. (శుక. 3. ౪౭.)

**బరిదెగు.** అ. క్రి.(√బరి².) హద్దుమీఱు, విశృం
ఖలమగు.

సీ. బరిదగినది విడివడినది యనేఁగను వెలయు
చుండును విశృంఖలసమాఖ్య.
ఆం భా. 3. ౨౫.

(వ్యవ)వాఁడు బరిదగి సంచరించుచున్నాఁడు.

**బరిపోటు.** వి (√బరి².) మల్లబంధవిశేషము,
ముప్పదిరెండు విన్నాణములలో నొకటి.

వ. తుట్టును బరిపోటును రొండిపేటును
మణంబును (మల్లపు. 3. ౭౯)

సీ రూఢింపు బరిపోటు రొండిపేటు ... గీ.
ముప్పదియురెండువిన్నాణములకుఁ జేర్లు,
ఆం భా. ౨. ౨౪౯.

**బరియు.** అ. క్రి. వ్యాపించు, పర్వు.

ఆ. చందవంబు గలయ సఖి బల్మిఁ బూసినఁ,
బోలఁతి వదనలీల పొలిచెఁ దరలు, పుబ్బి
బరియఁ గల్లు పూసినయద్దంబు,భంగిపోక
నిజవిభాతిఁ దలఁకి (కు. సం. ౯ ౨౩.)

**బరివిడుచు.** స. క్రి. (√బరి²) మృగములను
బట్టుకొనుటకై పురికొల్పు), ఉసికొల్పు.

క ... భయం,కరములగు వేటకుక్కల, బరి
విడిచిన నవి వధించె బహుమృగతతులన్
హరిశ్చ. ౨. ౨౦.

**బరివెంక.** వి. పిచులము, పక్కిచెట్టు

సీ. పాలపండులు కెమ్మిపండులు బరివెంక
పండులుఁ జిటిముటిపండ్లు ...
కాశి. 3. ౭౯.

సీ. ఇక్కడ గుడితూర్పుదిక్కునఁ బరిగచెట్టున్నది
దానికి నుత్తరమునఁ, బరివెఁడుదవ్వున బరి
వెంక పడమటి కెలవునఁ దొమ్మిదినిధులు
మీఁతి, ధనదుండు దాఁచినధనము పె
క్కున్నది ...
హ్యా. ౫. ౨౯౪. (చి. కి. చి. ని.)

**బహుప్రజము.** సం. విశే. (అ. అ. అ.) పెక్కు ప్రజలు గలది. వి. అ. పుం. ౧. పంది ౨. ముంజగడ్డి. శ్రీ.

**బహుప్రదుఁడు.** సం విశే (అ అ అ) మిక్కిలి యీవిగాఁడు, దానశౌండుఁడు.

**బహుఫలము.** సం విశే (అ అ అ) మిక్కిలి ఫలములు గలది వి అ పుం ౧ కదంబము, కడప శ్రీ ౨. వికంకతము శ్రీ

**బహుఫలిక.** సం వి అ స్త్రీ భూమిబదరి, నేలరేఁగు శ్రీ

**బహుఫేన.** సం వి అ స్త్రీ సాతల, సబ్బు రేకు శ్రీ

**బహుబలము.** సం వి అ పుం సింహము

**బహుభుజ.** సం వి అ స్త్రీ దుర్గ.

**బహుమంజరి.** సం వి ఈ స్త్రీ తులసి శ్రీ

**బహుమతము.** సం. విశే. (అ అ అ) ౧ గొప్పగా నెన్నఁబడినది ౨ అనేకమతములు (అభిప్రాయములు) గలది

**బహుమతి.** సం వి. ఇ స్త్రీ గొప్పయెన్నిక, గొప్పమదింపు, బహుమానము

శ్రీ బహుతురగ శకటగోగణ, బహుళ బహు గ్రామములను బహుమతి నిత్తుక్

భార అను 3. ౨౧3

**బహుమలము.** సం వి. అ. న సీసము.

**బహుమానము.** సం వి. అ పుం. గొప్పగా భావించుట, మిక్కిలిగౌరవము వి. అ. న. గొప్పవారు తక్కువవారి కిచ్చు పసదనము, సమ్మానము.

**బహుమానించు.** సం. స. క్రి. మిక్కిలి గౌరవించు.

ఉ. అహహా లోకము లేకొలంది మను .. ఖండుచేసవికి నీళ శ్రీశ వాగీశుల,నృహ ఘుప్ పూర్ధమునందు శయ్యా నిగమవ్యాపార శాశ్రంబునన్, బహుమానింతురు వారి ...

కృ. శకుం. ౧. ౩౨. (ఇట ఆశ్రయింతురు అని భావము.)

**బహుమాన్యుఁడు.** సం. విశే. (అ. అ. అ.) మిక్కిలి గౌరవింపఁదగినవాఁడు.

**బహుమార్గగ.** సం. వి అ స్త్రీ. ౧. గంగానది ౨ చెడిప, లంజుటాలు.

**బహుమార్గము.** సం. వి. అ. పుం. పెక్కుదారులు కలియుచోటు, చత్వరము.

**బహుమార్గి.** సం వి ఈ. స్త్రీ పెక్కుమార్గములు కలియుచోటు, చత్వరము.

**బహుమూర్తి.** సం. విశే. (ఇ) అనేకమూర్తులు గలది, పెక్కు ఆకారములు గలది. వి. ఇ. స్త్రీ వనకార్పాసము, అడవిప్రత్తి శ్రీ.

**బహుమూర్ధుఁడు.** సం వి. ఉ. పుం. విష్ణువు.

**బహుమూల.** సం వి అ స్త్రీ శతావరి, చల్లగడ్డ శ్రీ

**బహుమూలకము.** సం వి. అ. న. ఉశీరము, వట్టివేరు.

**బహుమూల్యము.** సం. విశే. (అ. అ. అ.) మిక్కిలి వెలగలది, మహార్ఘము, వి. అ. న. మిక్కిలి వెల

**బహురంధ్రిక** సం వి అ స్త్రీ. మేధ శ్రీ

**బహురస.** సం వి అ స్త్రీ అధికమగు రసము కలది-మహాజ్యోతిష్మతి శ్రీ

**బహురూపము.** సం విశే. (అ. అ. అ) పెక్కురంగులు గలది, చిత్రవర్ణము గలది. వి అ పుం ౧. సరటము. ఊసరవెల్లి పెక్కు రూపములు గలది. ౨ కేశము 3 సర్జరసము, సజ్జరసము.

**బహురూపుఁడు.** సం వి అ పుం. ౧ విష్ణువు ౨ శివుఁడు 3 మన్మథుఁడు (శ ర.)

**బహురేతసుఁడు.** సం వి స పుం. చతుర్ముఖ బ్రహ్మ.

**బహురోమము.** సం. వి. న. పుం. మిక్కిలి రోమములు గలది-గొఱ్ఱె.

**బహులగంధ.** సం. వి. అ. స్త్రీ. ఏలకి. శ.

**బహులచ్ఛదము.** సం. వి. అ. పుం. రక్తశోభాంజనము. శ.

**బహులము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. దట్టమైనది, నిబిడము. ౨. కలుచు. ౩. అనేకము, పెక్కు. ౪. వల్లనిది (వాచ) ౫. (వ్యాక) ప్రవృత్త్యాది విధేయధర్మము. శ్లో. క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్యదేవ, విధేర్విధానం బహుధా సమీక్ష్య చతుర్విధం బాహులకం వదన్తి. వి. అ. పుం. ౧. కృష్ణపక్షము. ౨. అగ్ని. అ. స్త్రీ. ౧. ఆవు. ౨. పెద్దఏలకి. శ. ౩. నీలిచెట్టు. అ. న. ౧. ఆకాశము. ౨. తెల్లమిరియాలు. ౩. వలువు (వాచ)

**బహులీకరణము.** సం. వి. అ. న. బహులముగా చేయుట. ౨. తూర్పెత్తుట, చెరగుట.

**బహువచనము.** సం. వి. అ. న. (వ్యాక) బహుత్వమును తెలుపు ప్రత్యయము.

**బహువల్కము.** సం. వి. అ. పుం. మోరటి, ప్రియాళువు. శ.

**బహువారము.** సం. అవ్య. పెక్కుమాఱులు.

**బహువారకము.** సం. వి. అ. పుం. శ్లేష్మాతకము, విరిగి. శ.

**బహువిధము.** సం. విణ. (అ. ఆ. అ.) పెక్కు తెఱఁగులు గలది, వివిధము. (శ. ర.)

**బహువీర్యము.** సం. వి. అ. పుం. ౧. విభీతకము, తాడి. శ. ౨. తండులీయశాకము, చిత్తిబూర. శ. ౩. బూరుగు. శ. ౪. మరువకము. శ.

**బహువు.** సం. విణ. (ఉ. ఉ. హ్వీ. ఉ.) ౧. విపులము, అధికము, ఎక్కుడు. ౨. పెక్కు, అనేకము.

**బహువ్రీహి.** సం. విణ. (ఇ) మిక్కిలి వ్రీహి (= ధాన్యము.) గలది. వి. ఇ. పుం. (వ్యాక) కలుగు అన్యపదార్థ ప్రధానమగు సమాస విశేషము. (ఇది తద్గుణ సంవిజ్ఞానము, అతద్గుణ సంవిజ్ఞానము అని ద్వివిధము. సమాసార్థ ఘటక పదార్థములకు సంయోగ సమవాయాద్యతర సంబంధ మున్న రెండుల తద్గుణ సంవిజ్ఞానము. ఉదా. చిత్రవస్త్రునిఁ దీసికొనిరమ్ము, లంబకర్ణునిఁ దీసికొనిరమ్ము. అది లేనిచో నతద్గుణ సంవిజ్ఞానము. ఉదా. దృష్టసముద్రునిఁ దీసికొనిరమ్ము.

**బహుశత్రువు.** సం. వి. ఉ. పుం. చటకము, ఊరఁబిచ్చుక.

**బహుశస్.** సం. అవ్య. ౧. మిక్కిలి, కలుగుగా. ౨. మాటికి, పెక్కుమాఱులు. ౩. ప్రాయికముగా, సాధారణముగా.

**బహుశల్యము.** సం. వి. అ. పుం. రక్తఖదిరము, ఎఱ్ఱచండ్ర. శ.

**బహుశాలము.** సం. వి. అ. పుం. స్నుహీవృక్షము, జెముడుచెట్టు. శ.

**బహుశ్రుతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) అనేక శాస్త్రముల నధ్యయనము చేసినవాఁడు.

**బహుసంతతి.** సం. వి. ఇ. పుం. మిక్కిలి సంతానము గలది, ఒకదినుసు వెదురు. శ.

**బహుసారము.** సం. వి. అ. పుం. మిక్కిలి చేవగలది, మిక్కిలి సత్తువగలది ఖదిరము, చండ్ర. శ.

**బహుసుత.** సం. వి. అ. స్త్రీ. పిల్లపీఁచర, శతమూలి. శ.

**బహుసువు.** సం. వి. ఊ. స్త్రీ. పెక్కు బిడ్డలను గన్నయాఁడుది, పెంటి పంది.

**బహుసూతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పెక్కు బిడ్డలఁ గన్నయాఁడుది. ౨. పెక్కుఁ గలిగొడ్డియావు, పరేష్టుక.

**బహుస్రవ.** సం. వి. అ. స్త్రీ. సల్లకి, అందుగు. శ.

**బహూకరించు.** సం. స. క్రి. సన్మానించు, మన్నించు.

శా. ఈ దంపతులు చరాచరప్రపంచంబు
రక్షింతురు గాక యనుచు దీవించిన విరించి
బహూకరించి సనకసనందన సనత్కుమా
రాదుల సంభావించి శరా ౬ ౪౩
(తథాస్తు అని సమ్మతించి అని భావము)

క అని యిట్లు తండ్రి చెప్పిన వినతోక్తులు
వినియు శుకుఁడు విద్యానిధి సమ్మనమున
బహూకరింపమిఁ గని వేదవ్యాసుఁ డతని
గని యిట్లనియెన్ వాసిష్ఠ ౧ ౧౪౦

బహూదకుఁడు. సం వి అ పుం కౌచార్థము
మిక్కిలి ఉదకములు కలవాఁడు - ఒకానొక
సన్న్యాసి

బహ్వపత్యము. సం వి అ పుం మిక్కిలి
పిల్లలు గలది ౧ పంది ౨ ఎలుక

బహ్వాశి. సం విశ (స్ నీ క్) తిండిపోతు

బహ్వృచుఁడు. సం వి అ పుం ఋగ్వేదము
చదువువాఁడు ( శ్మాభా (బ్రాహ్మణుఁడు-
కాశిక)

## బా

బాండువ. వి (సం బాణ్డః) కుండ, ఘటము
(చి ని, శ ర)

బాంధకినేయుఁడు. సం వి అ పుం కులట
కొడుకు ఱంకుటాలి కొడుకు

బాంధవము. సం వి అ న ౧ బంధుత్వము
చుట్టఱికము

క పవనునకును నీకును బాంధవము గలదొ
భార శాం 3 3౭౪

ఈ యర్థము తెలుఁగుగ్రంథములందే కవఁబడు
చున్నది

౨ మైత్రి

చ తను పగఁబాలు గోలుపడి దానినయిప్పుడు
గోరు పేరికిఁగా, సముచితవృత్తి నిచ్చి తను
పాయున సంతసమంది యున్కి యుక్తము
ధృతరాష్ట్రినూనునకు దాన భపాండుకు లేక
యుండుఁ గో,వ మడిగి పేరు పేరయూరు
బాంధవ విఘ్నగముం బ్రియంపడున్
భార ఉద్యో ౧ ౧౯

బాంధవుఁడు. సం వి అ పుం ౧ చుట్టము
౨ జ్ఞాతి 3 మిత్రుఁడు ౪ భ్రాత

బాంధవ్యము. సం వి అ న చుట్టఱికము
(విల్యమ్సు)

బాఁకా. వి (హిం బాంకా) కాహళము
ఊఁదెడి వాద్యవిశేషము చర్మవాద్యవిశేష
మని చి ని నిరనుస్వార మని శ ర
వ్యవ పెండ్లివారు ఊరిపెలుపల బాఁకా పట్టించు
చున్నారు

బాఁకు. వి (క బాక హిం బాంక్) ౧ కటారి
కత్తి వంకరకత్తి

సీ గొనబు గా మురులఁ జెక్కిన చెంగులోడ
కేలందు బాఁకుతోఁ బొల్చు నీవిదట్లు
రా వి ౨ ౪౪

చ తన కిది దక్క వంచుఁ బ్రమదంబునఁ
బంక్తిముఖుండు మానకేతుని చిగురాకుబాఁకు
మదిఁ దూఱినఁ దాలిమి మాలి
ఉ రా 3 ౧౧౫

ఉ మానునిడంబురాకు రహి మించిన ఱెక్కల
లేక చెక్కు చేతైన ప్రసూనసాయకము
లన్నియు నేయుచుఁ గల్వమొగ్గ కే ౙ
నటు చిమ్మి కుందనపుఁజాయల గేదఁగిరేకు
బాఁకుచే భాను 3 ౨3

గీ బాఁకు, వంకి చిల్లాణ మనఁగను వక్రశస్త్ర
ములరు మండును అం భా ౨ ౨౧౩

బాఁష్. వి (హిం బాశ్) ఒకవిధమగు డేగ
శ్యేనవిశేషము
(ఇది రెక్కలు విడిచిన పులుఁగు మీఁదికిఁ
బోయి పులుఁగును గొట్టును గాని కొండవ
విడుపునకుఁ బోవదు మిగుల శౌర్యంబు గలిగి
కరం బుపలాలనీయంబై యుండును. చి ని)

(వ్యవ) బాఁపనక్కలు స్నానమునకుఁ బోవు చున్నారు

**బాఁపనచీమ.** వి (√బాఁపన) బ్రాహ్మ వృత్తు ములయందుండు గోరోజనపు వర్ణము గల యొక జాతి పెద్దచీమ (శ ర)

**బాఁపనమ్మ.** వి (బాఁపన + అమ్మ) బ్రాహ్మణ స్త్రీ పాఱుతి
- సీ ముద్దు పురుషునిఁ జెడనాడు మగువ మీఁదఁ బోయి పులిగాని పురుడయి పుట్టు ననుచు బాఁపనమ్మలు చెప్పిన పాట మేలె యనుచు — శుక ౩ ౧౪౫

**బాఁపనయ్య = బాఁపనుఁడు, బాఁపఁడు, బాఁడు.** వి (బాఁపన + అయ్య) బ్రాహ్మణుఁడు పాఱుఁడు
- గీ అపుర మెచ్చితి నో బాఁపనయ్య నిన్ను — వారిజ్ఞ ౪ ౨౯
- ఆ బాఁపనయ్య యొసఁగు బాఁపనయ్యల కగ్ర హారవార సార భూరి గంధ సార రత్నాంబర మాన్యమాన తతులు మహిని వెలయ — పానంచో ౧ ౨౯
- ఆ అంతఁ బెద్ద బాఁపనయ్యల యానతి వడసి — అచ్చ రా బాల ౧౯౨

**బాఁపనుఁడు = బాఁపఁడు.** వి బ్రాహ్మణుఁడు పాఱుఁడు
- సీ అమరును విప్రుండు పాఱుఁడు బాఁపఁడు బాఁపనుండు గీ పుడమి వేల్పన — ఆం భా ౨ ౧౪౦

**బాఁపతికము.** వి (బాఁపన + తికము) బ్రాహ్మణ్యము
- గీ బ్రాహ్మణ్యము తనరారు బాఁపరికమన — ఆం భా ౨ ౧౪౧

**బాకి.** విణ విస్తృతము విశాలము వెడఁద
- చ అతిసాధు మునీంద్రుఁడు వోలె నేత్రముల్ దెఱచక బాకినోరు మెదలింపక రైతుక పట్టి నంచు — భాగ ౯ ౨౦౪
- ద్వి ఎసఁగిన బాకినో రంతయుఁ దెఱచి — ద్వి. హరిశ్చ ౬ ౧౯౫౧ పం
- సీ బాకి నోరు మరరాదు పగ పాటి వెదకించు కొంటి పల్లనరాదు కంటగించు — శుక ౩ ౨౧

వి (= బాకీ) అప్పు ఋణము (శ ర)
- జ బాకినోటిమొకము

**బాకినోటిమొకము.** వి (బాకి + నోరు + మొకము) పంచాస్యము సింహము (శ ర గ్రా)

**బాకీ = బాకి.** వి (క బాకి త బాకి హిం బాకీ) అప్పు ఋణము
- సీ పైక మీఁజాలక బాకీ టకాయించి యేలు గొడ్డములఁ బల్కు చుండినాఁడు — రంగా ౨ ౧౪౧

**బాగగు.** అ క్రి (బాగు + అగు) ౧ ఒప్పు రమ్యమగు
- సీ ఇంతి సంపెఁగ చెంత నెంత బాఁగాయెఁ జేమంతిబంతులు వింత కాంతి నెరసి — దశా ౩ ౫
- గీ వయసువాఁడు ను మిగుల బాగయినవాఁడు నన్నిట నొయారియై యుండునట్టివాఁడు — సారంగ ౨ ౯

౨ సెలవేఱు
- గీ అన్నఁ గరశూలమునఁ గూర్చి నను జేఁదకేఁడు నడఁగఁ దనశూలముల న బాగయ్యెఁ బనులు — కళ ౫ ౯౫

**బాగడము.** వి కట్టడము
- ఉ చందురు రాతి బాగడపు జంట బవంతి — విజ వి ౩ ౧౮౫

**బాగము(గా)లు = బాగలు.** వి బ (సం భాగః క బాగ త పాక్కు) పోఁకచెక్కలు వక్కలు
- గీ పండుటాకులు కపురంపు బాగములును ముత్తియపు సున్నము అరంగములును — కవిరా. ౫ ౧౬౪

గీ. లీల కేసన్న బరతి బాగాలు గులికి, యిద్ద
ఱకుఁ బెట్టి చుట్టి యాకిచ్చి యిచ్చు..
విప్ర. ౨. ౯౬.

సీ. బాగాలు వెస కొక్కు పద్మాక్షి యొసఁ
గిన . మనుచ. ౩. ౬౬.

క. సోగ లగు పండుటాకుల, లాగునఁ దల
వాకు మడిచి లలనఁ యొసంగన్, బాగాలు
వేసికొని తన, బాగా లున్నట్టి మేడ పజ్జకు
నేఁగన్. సారంగ. ౨. ౧౯౪

సీ. పూగభాగమ్ములు పొలుచు బాగా లన
ఆం భా. ౨ ౧౬౪

బాగరి. విణ. (బాగు + అరి) సుందరుఁడు, అందగాఁడు, సుందరి, అందకత్తె

ఉ. తెల్లని దీవి తమ్మి పెలదేఁటివలెన్ దగు
నొక్క బాగరిన్, పాల్కడలి యిల్లట
పల్లునిఁగాంచి రయ్యెడన్ రామా ౩ ౪౪

గీ. నాగరకముద్ర గల మంచి బాగరి యఁట, నాగ
వాసములో వింతనటనల దఁట, కులుకు
గుబ్బల ప్రాయంపుఁ గోమలి యఁట, వలచి
వలపింపదే యెంతవాని నైన
విజ వి ౧ ౧౧౦

బాగలు = బాగములు. చూ కపురము

బాగిలించు. అ క్రి (క. బాగిల్ = వాకిలి, ద్వారము) బయటఁబడు, వెలువడు.

వ. నగరంబు వెలువడి వచ్చినయది మొదలు
ఎండఁ బాతిపోయెదు నాహారం బడిరి
వింక బాగిలింపక యుంగిలించిన విడుకుసే .
దశా ౨ ౪౭

బాగు. వి. (క౦ భగ, త పొంగు) ౧ ఒప్పిదము, సౌందర్యము, సొగసు.

గీ. పసిఁడిచంపకదామంబు బాగుఁ జూర్చి, వాలు
క్రొన్నెల చెలువున వాఁడిదీర్చి...
భాగ ౨. ౭౬౬.

సీ. బలుపోయుగంపుఁగొలఁకు, నాఁగ నలు
కొందు నయ్యెలనాఁగబాగుఁబొగడ నలవి
యె పలుకుల పొలఁతి కైన. లీలా. ౨. ౧౪.

౨. విధము, రీతి

అ. అలిగి బకుఁడు, వీనిబాగు చూడ వేఱంచు
డావిన, తరుపుఁ జేతికి కొనుచుఁ దాఁటు
దంచె భార. ఆది ౬. ౧౯౨.

సీ. నిగిడి పూఁ తొఱుబాగుగఁ గత్తిరించినగడ్డంబు
కొన రొమ్ముఁ గమ్మిరింప, హైమ. ౪ ౯౩
ఉ. రా ౩ ౧౦౩.

౩ క్షేమము (వ్య ర)
(వ్యవ) మావా రందఱును బాగున్నారు

౪ ఆరోగ్యము

చ బడిబడిఁ జూరలేమనుచు వచ్చు సువారవు
వారిఁ జూచి నా, యొడలికి బాగు లేదు మతి
యొక్కటి యొల్లను పార్వ. ౨ ౯౯.

౫. భద్రము, శుభము

సీ మంచి మేల్ బాగు లెస్స యన శుభంబు
లలరు సాం ని మాన ౩౩

చూ బాగుపడు

విణ ౧ చక్కనిది, సొగసైనది

క. సోగు లగు పండుటాకుల, లాగునఁ దలవాకు
మడిచి లలన యొసంగన్, బాగాలు వేసి
కొని తన, బాగాలున్నట్టి మేడ పజ్జకు
నేఁగన్ సారంగ. ౨. ౧౯౪.

౨. యుక్తము, తగినది

గీ బహుకథా సంగతులు పేయ బాగుగాదు ...
కాశీ. ౧. ౪౯.

సీ దట్టంబు నీకట్టినట్టి చెంగావికి బాగు గావలె
కేలఁ బయఁట నిమిరె మనుచ. ౬. ౨.

క వేగ నరేంద్రుఁడు రాకే, బాగా యుటు
చనఁగ . . సారంగ. ౨. ౨౪.

౩. శుభ్రము, పరిశుద్ధము. చూ. బాగుచేయు.
బాగునకుఁ దెచ్చు, పరిశుద్ధము చేయు.

సీ. చందురు నునుఁగాంతి కం దెర్చి కూర్చి బాగు
నకుఁ దెచ్చినయట్లు కొమరు మిగిలి ...
భార. విరా ౨. ౫౨.

ఇ. బాగరు, బాగరి, బాగుచేయు, బాగుపడు,
బాగులాఁడి.

**బాగుచేయు.** స క్రి (బాగు + చేయు) చక్కఁ బఱచు (శ ర త్నా)

(వ్యవ) నిర్భాగ్యుని బాగుచేయువాఁడు లేఁడు

ఆ విద్యము బాగుచేయుము

**బాగుదార.** వి చూరకత్తి చిన్నకత్తి ఆయుధ విశేషము

చ నూతన పలాశసుమం బను బాగుదారచేఁ జలమున నయ్యతిన్ వణఁక సారసనాయక వీరుఁ డంతటన్ — చంద్రి ౨ ౧౪

గీ బాగుదారన వల్పావి పరగు — ఆం భా ౨ ౨౧౪

సీ బాడుపెట్టినయట్టి బాగుదార్లరుమాలు తెగ వైచి తెగ నౌరల్ పేయువారు — మల్లు ౨ ౪

**బాగుపడు.** అ క్రి (బాగు + పడు) భద్రము నొందు మేలొందు

ఆ ద్రోహబుద్ధినైన దొంగతీకమునైన సటలనైన సాహసమునసైన సంప దధికుచేత సాధించి ధనమును ఒడుగు నిచ్చి బాగు పడును వేమ — వేమ ౩ ౧౩౭

**బాగులాఁడి.** విశే (బాగులు + ఆఁడి) అందకత్తె సుందరి

చ అసురసురకై యలంతి నడు మల్లలనాడఁగ ముందుముందుగా నొసఁరి బాగులాఁడి యపు డొక్కతె వచ్చి — సారంగ ౧ ౩౯

**బాగెము.** వి (సం భాగ్యమ్) సుకృతము పుణ్యము

గీ రాజ గాఁడమ్మ కంబము రాయఁ డితని వేసమున మేలు బాగెము నేసియుంట నిపుడు గనుఁగొంటి మని పల్కు నెలఁత దొరల — యయా ౧ ౧౨౦

ఉ సంతాపము రానిదెప్ప నిరతంబును జేసుట లేని ప్రాపుగా పాపము లేనిఁ బాపు కల బాగపు సొమ్మది లోపు బూమిలో, నైపున నీకె గాక వెలవారికి లేదుగదా ధరామరా — ప్రబంధ ౪ ౨౯

**బాగోతి** = భాగవతుఁడు (సం భాగవతః కృష్ణుఁడు మొదలగువారి వేషము వేసికొని యాడి జీవించువాఁడు)

ఉ బాగోతుల బచ్చిగాని కోకకొంచె మనంగ గృహంబు నేయమిన్ — క్రీడా పీఠి ౬౯ పా

**బాజారు.** = బజారు. వి (సం ప్రసారః హిం బాజార్ క బాజారు) ఇది చి ని శ ర లలో శకటరేఫముగా గ్రహింపఁబడినది నిర్ధారకప్రయోగములు లేవు అంగడివీధి విపణి

క పూజారివారికోడలు తా జారిఁగ బిందె జాతి దబ్బునఁ ఒడిరయిన్ హైజారు కొంగు దడిసిన బాజారు తిరిగి చూచి పక్కన నవ్వెన్ — వీధి ౧౯

సీ కూరగాయల కంచుఁ గోరి తా బాజారు కును మరిమరి నేఁగుఁ గొమరుతోడ — హంస ౧ ౨౧౯

సీ అంగడి బాజారువంగి విపణి పొల్చు — పా ని మాన ౪౪

**బాజా.** వి (క బాజా) ౧ శ్రేణి వరుస

క తేజీరాతాబాతా తెగజగినొగిఁ దగిడి నెగడఁగాఁ జాలెడు మేత్తె జానెడు కుత్తుకగల తేజీకున్ — అచ్చ రా ౪౦ ౨౭

సీ కొట్టి తోలఁగ నీకు గోవృషభంబుల బాజా గాదు గురాలపోఁజాగాని — విం నార ౧౫

వ ప్రమాణరాజుల రాజిలి బాజాలగు బాజాలు బోదులు చేయుచు — భార్గవపురాణము ౫ ౧౨౫

౨ గృహపార్శ్వములయందు దమర్చెడు పొడుగైన దారువిశేషము పొడుగైన లావుగల కఱ్ఱలు (ఇది మూలముకంటె సన్నముగా నుండును)

(వ్యవ) ఈ యింటికి మంచి బాజా లమర్చినారు

**బాజాబందు.** వి (సం భుజబంధః, క బాజా బందు త పాలికందు) సందిటఁ గట్టుకొను భూషణము

ఉ కేవల సాధనంబు లిరుగేల వహించి నటించు నమ్మవాఁ, భావనంబట్ల యుక్కుటులి బాడిస యుం గొని నీవు మామ కీ నావఁగధంబునన్ మెలఁగ వేం పంచ 3 ౨౧౮

గీ వర్ధినికిఁ జేరు వెలయుచుండు బాడిస యటం చనంగఁ జెవ్వందిలింగ ఆం భా ౨ 300

**బాడు.** వి (త పాడు) గవుసెన ప్రావరణము ముసుఁగు

సీ బాడు పెట్టినయట్టి బాగుదార్ల రుమాలు లెగ దైచి తెగ నొరల్ సేయువారు వల్లపు ౨ ౪

సీ ప్రావరణ మాఁ ఒరదా యునంగను బాడు నాఁగ ఆం భా ౨ ౧౪౯

జ బాడుగోలు, బాడువెటు

**బాడుగోలు.** విణ (వాడ + కోలు) వార్తాహరుఁడు (మానహీనుఁడు అని శ ర)

ఉ పెండెము బాడుగోలునకు భృత్యునకు న్మెడనాలు మెలత్రాడులు కుంకెనకాని కియ్యఁగన్ వాంస ౫ ౧౩౬

**బాడుదల.** వి (త పాడుదుడై) ఇది ఎట్టుభాతువుతో వ్యవహితము గను ఉప్యవహితముగాను అనుప్రయుక్తమై ప్రయోగములఁగాన ఒడెడి కూరకృత్యము సావాసకృత్యము (అవమానించుట అని శ ర)

గీ బాడుదల నొండెఁ బటము పాండుతనయ ముఖ్యు భార కర్ణ ౨ ౬

సీ భీతిఁ బాఱెడి పురుషాహాతు వెన్కొని బాడుదలఁట్టి నృసిం ౨ ౧౧౩

చ కడిఁది మగంటిమిం దొడరి శయ్యమునం దవ భాహుదర్ప మే ర్పడనమరేంద్రు బాడుదలఁబట్టినరావణి భా రా యు ౪౪౪

**బాడువ = బడువ.** వి (త పాలి) పల్లపుసేల.

వ మిన్నేటి బాడువల జెన్నెలపుల్గులు కెమ్మి బోఁదెలు బెదర రొద లాదవ ప్రాయు పోతుచేసుంగులను అచ్చ భా 3 ౩౩

గీ ధరణి విస్తారనిమ్నమై దనరనేని, బాడు వన ఒడు వనఁగిను ఒరగుచుండు ఆం భా ౨ ౫ చ ప్ర వి 3 ౪౦

**బాడుపెట్టు.** స క్రి (బాడు + పెట్టు) ముసుఁగు పెటు

ఉ చే నైతువమా శరాసనము వేఁటొంటన్ దూనాస్త్ర పంచకముం దాపున బాడు ట్టి టు లెంచ న్మించు గొజ్జంగియున్ గ్గీ గుసుజాపరుంజా వెలయ న్మారుండు ధేయం బనస్ శుకఘోటిం గుడెఁ దట్టి మీాటి వడిగా సుత్రాముమోసాలకున్ పార్వ ౨ ౧౧౪

**బాఁడు** వి ఋరద పంకము (శ ర బ్రౌ బాడి-వాడుకి)

**బాఁఢము.** సం విణ (అ ఆ అ) ౧ దృఢము ౨ మిక్కిలి అధికము 3 గట్టి(ధ్వని)

**బాణ** సం వి అ స్త్రీ ౧ శరపుంఖము బాణము పింజ ౨ నీలఝింటి నల్లగోరంట కి 3 సరస్వతి

**బాణకారి.** వి బాణసంచులు కాల్చువాఁడు

౧ చిత్రవిచిత్రగులు గాఁ జూపుచు భాణకారులు ముందఱ నడువ హంస 3 ౨౯

**బాణగంగ.** సం వి అ స్త్రీ (రావణుని బాణము చే నిర్మితమగు) ఒకనది

**బాణజత్తు** సం వి ఉ పుం విష్ణువు

**బాణధి** సం వి ఇ పుం అంపపొది

**బాణపాతము.** సం వి అ పుం ౧ అమ్ముల యేటుదూరము ౨ అమ్ము పోవు మేర

**బాణపుంఖ.** సం వి అ స్త్రీ శరపుంఖ, తెంపలి కి

**బాణపుఁజివ్వ.** వి (బాణము + చివ్వ) ఒకవిధమగు బాణసంచు

వ పెట్లుఁ గ్రోవుల పెటపెటలు, జబురిజంగుల ఢిరంగుల ఢిమఢిమలు, ధమామీాల ధమధమలు, బాణపుఁజివ్వల జిఱజిఱలు కృష్ణ 3 ౨౫

బాణము. వి ఒకవిధమగు ఫిరంగి (దీనికి వృత్తిని ముద్దలోపము చూ బాణవిద్దె మొ)
గీ బాణములఁ జివ్వలుచిచిన బాణములను గ్రోవులను గుంటగ్రోవుల రా వి ౫ ౨౨
గీ సురగ్రోవి పిరంగి బాణము గుంటగ్రోవి జబురుజంగి తుపాకి బజాయినాఁగ నెలయు నగ్ని ప్రసారణాఖ్యలు మహేశ
ఆం భా ౨ ౨౧౫
దయ్యపుబాణఁరిచిల్కు — తామ్రసామ్రాజ్య
సీ సరగ దయ్యపుబాణఁరిచిల్కు దొరఁగిం ఒగలఁ గూరుచు మల్కికొగుల జేసి
చంద్రా ౬ ౯౦
జ బాణపుఁ జివ్వ బాణవిద్దె బాణసంచు
బాణము. సం వి అ పుం ౧ అమ్ము శరము ౨ గుఱి లక్ష్యము ౩ బాణముచివర ౪ ఎ ౫ శరపుంఖము ౫ అవుపొదుగు ౬ అయిదు అనుటకు సంకేతనామము ౭ శబ్దము ౮ వాక్యము ౯ అగ్ని ౧౦ నీలఝిటి నల్ల గోరింట ¶
బాణముద్ర. సం వి అ స్త్రీ ముద్రాభేదము
శ్లో యథా హస్తగతా బాణా స్తథా వాస్త్రాం కరం ప్రియే బాణముద్రా సమాఖ్యాత రిపువర్గ నికృంతనీ (వాచ)
బాణలి. వి (క పాణలె త పాణలి) వేఁచుట మొదలగువాని కుపయోగించు లోహపాత్ర విశేషము
పీ కంచువు బాణలి కంచు కంటనఁ దగు
ఆం భా ౨ ౨౪౩
బాణవారము. సం వి అ పుం వారవాణము కవచము
బాణవిద్దె. వి (బాణము+విద్దె) బాణ సంచు బాణసంచులు కాల్చు విద్య
వ చక్ర బిరుసులుఁ బంచవన్నె బిరుసులు గజ బిరుసులు మొదలయిన బాణవిద్దెల హైఖరులు చిత్ర విచిత్రముగాఁ జూపుచు బాణకారులు ముందఱ నడువ హంస ౩ ౨౯ (బాణవిద్య ముద్రిపా)
బాణసంచు. = బాణవిద్దె వి (బాణము+సంచు) తుపాకిమందుతోఁ జేసి వేడుకకుఁ గాల్చెడు బూవత్తులు చిచ్చుబుడ్లు లోనగునవి (గ్రామ్య) ఈ సంవత్సరము దీపావళికి బాణసంచు చాల తిక్కువ
బాణా. వి (త పాణ త్తడి) దండాయుధము
గీ గడలు బాణా ల్పటాలు నగ్గలికఁ బూని ఎగివడల్ ద్రొక్కికొనుచు నిబ్బరపు బీరములు గనంబడె ఎ మరల్ మోలఁ జెలఁగి సాధన లొనర్ప రసిక ౧ ౫౧
జ బాణకత్తి బాణవకిణి
బాణాకత్తి. వి (బాణా+కత్తి) ఆయుధ విశేషము పొడగుపాటకత్తి
క మనసీఁడు మెఱుఁగుఁ జాయల నన బాణకత్తి దుసుసునం ఒఱసంచెన్
భోజరాజా ౩ ౭౭
సీ ఇట్లుండు శక్తివహించు గుహుం డన్న సరణి బాణకత్తి చాఁచి చాఁచి
౨ కు ౨ ౨౧
బాణావంకిణి ౨ (బా+వంకిణి) దండాయుధము వంటి బాఁకు బాణకత్తి
శా బాణావంకిణి బెద్దకత్తి గుమితిన్ బాణాసన ప్రాభిమన్ ద్రోణాచార్యుల నైనఁ ఒల్కుదురు నేర్పుల్ శకాం ౨ ౧౪
బాణావలి. సం వి ఇ ఈ స్త్రీ ౧ బాణముల పంక్తి ౨ ఏకవాక్యముగ నున్న యైదుపద్యముల వరుస (విల్యమ్సు)
బాణాశ్రయము. సం వి అ పుం ౧ అమ్ముల పొది ౨ ధనుస్సు విల్లు
బాణాసనము ౦ వి అ న విల్లు ధనుస్సు
బా(వా)ణిని. సం వి ఈ స్త్రీ ౧ విదగ్ధరాలు ౨ నర్తకి ౩ ఉత్తమస్త్రీ (మే ని)
బాణుఁడు. సం వి అ పుం ౧ ఒకానొక రాక్షసుఁడు ౨ కాదంబర్యాది గ్రంథకర్త

**బాతలిం(ళిం)చు.** అ క్రి బ్రద్దలగు
సీ దీర్ఘ కంఠకఠోర ఘుర్ఘురస్వనమునఁ బాతాళ
గోళంబు బాతలింప    శివరా ౧ ౬౧
౨ అలుచు పొంగిపెట్టు
ద్వి పాతాళ పాతాళ యనుచు మొచేతు
లూఁతగా వెనుకకు నొఱఁగి కాలికిలఁ బడి
పొటుకొని గుండె బలువిడి నడచి పడక
కాలుం గని బాతళింపఁగను    నవ ౩
౧౫౬ పొ (తత్తరపడు అని శ ర)
౩ సంభ్రమించు తత్తరపడు
౪ కేటికిఁ బోడగని కాస బాతలించువారు నైన
మునులను జూచి హస్తాబ్జ మెత్తి కెలి
పుడుగుఁ డోడ కుండుఁడు వెడలుఁ డనుచు
వంచితాలాపముల భీతి నపనయించి
పి శకుం ౩ ౧౦౫
చ తపములఁ ధరణిం బడి బాతళింపఁ గా
వరాహా ౫ ౧౧౨

**బాతి.** వి (సం భక్తిః)(సానుస్వారమని శ ర)
౧ ప్రీతి ఇష్టము ఇంపు
క ఆతఁడు కాలాంతరమున బాతిగ భవదీయ
భవ్య పరలోకవిధుల్ చేతోగతి భక్తి పరి
స్ఫీతములుగఁ జేయు    భార మా ౧౨౦
ఉ బాతిగఁ జైకొన న్వలయు    పెద్దన
చాటువు
౨ శ్రద్ధ జాగరూకత
క ప్రాతఃకాలము సనియొదు బ తిగ సంధ్యాది
విధులు పరిపాటిగ నీ వాతత మతిఁ జేయుము
భా రా బాల ౩౩౪
క పాతాళలోక మంతయు బాతిగ శోధించి
హయము బరికించి
భా రా బాల ౪౦౪
క అని బాఁతి బాతి పెట్టిన వెనుఁ బాఁతవరాల
సోలఁ బెకలించి ఘనస్తని కిచ్చి
కేం పంచ ౪ ౫౦౧
౩ రీతి విధము

ద్వి పిఁ డేమి బాతి నీకెలఁదిఁ జేకూర్చు
(రం రా కిష్కిం చి ని)

**బాతు¹(వు)** వి జలపక్షివిశేషము ఆడేలు
గీ బాతవంగ నగు శరారి
అం భా ౨ ౯౩
మ తలఁ బక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదా
రంపుఁ గుల్యాంతర స్థలి నిద్రింపఁగ
ఆము ౧ ౬౫

**బాతు².** వి (హిం భాత్) అన్నము
సీ పసదనము బాతు సాద మోగిర మన
జరుగు నన్నము పేర్లు
సాం ని మాన ౨౨

**బాద.** వి (సం బాధా) వేదన నొప్పి బాధ
గీ వపట యంగలారుపు కెల వంత గోడు బాద
యంగద వగ పనఁ బరగుఁ బీడ
సాం ని మాన ౩౩
సీ బాద కాగులు నొవ్వి వందురు అనంగఁ
జను వ్యథ    అం భా ౧ ౧౫౦

**బాదము = బాదాము.** వి (సం బాదామమ్
క బాదామి త వాదామరం హిం
వాందామ్) ఫలవృక్షవిశేషము (దీని గింజల
లోని పప్పును భక్షింతురు శ ర)

**బాదరము = బాదరు** (శ ర)

**బాదరము** ౧ విశ (అ ఈ అ) ౧ బదర
సంబంధి బదరవృక్షము – రేఁగు చెట్టునకు
సంబంధించినది ౨ ప్రత్తిగి నూలిది నూలితో
నేయ బడినది వి అ పుం ౧ ప్రత్తిచెట్టు
కార్పాసము క్లీ ప అ న ౧ రేఁగుచెట్టు
౨ పట్టు ౩ జలము ౪ నూలివస్త్రము నూలి
పోగు ౫ దక్షిణావర్తమగు శంఖము కుడి
వైపుగా సుడిచుట్టియున్న సంకువు ౬ ఫాలము
వి అ స్త్రీ ప్రత్తిచెట్టు కార్పాసవృక్షము

**బాదరాయణసంబంధము.** సం వి అ పుం
లేనిపోని దూరాకృష్టమగు సంబంధము

శ్లో॥ యుష్మాకం బదరీచక్ర మస్మాకం బదరీ తరుః బాదారాయణ సంబంధో యూయం యూయం వయం వయమ్ చాటువు

-గరాయణి సం వి ఇ పుం శుకుఁడు

-దరాయణుఁడు సం వి అ పుం ౧ వ్యాస ముని ౨ తెత్తివాఁడు ౩ నిష్ప్రయోజకుఁడైన పురుషుఁడు (శ ర)

-గరించు అ క్రి (√బాదరు) ప్రతిఘటించు

శ్రీ నిస్సాణములమ్రోఁతి వింగి మిట్టి మురారి పాంచజన్యమ్ముతో బాదరింప ఉ హరి ౫ ౬౦ (ఇట ఔపమ్యద్యోతకము)

శ్రీ మొలక మీఁసకట్టుఁ గ్రాలు ముత్యాలరాప్రేక ధవళాంగు బొట్టుతో బాదరింప శాశీ ౩ ౨౪౦ (ఇటను ఔపమ్యద్యోతకము)

-దరు=బాదరము వి (క బాదర=ప్రత్తి) తుపాకిలో జానకి గ్రాఁ డుంచెడుతావు

సీ బాదరు నాఁగను బరగుఁ దుపాకిలోపలను జానకి గ్రాఁడు నిలుపు తావు

ఆం భా ౨ ౨౧౯

జ బాదరించు

-దామము. సం వి అ న బదముకాయ (శ ర)

-దాము=బాదము (శ ర)

-ధ సం వి ఆ స్త్రీ బాసము

-ధకము సం విశ (అ ఆ అ) ౧ బాధించునది పీడించునది వి అ పుం ఋతుకాలమందు బిడ్డలు పుట్టుశక్తి నడ్డగించు స్త్రీరోగవిశేషము

-ధనము. సం విశ (అ ఈ అ) ౧ బాధించునది పీడించునది ౨ నిషేధించునది అడ్డగించునది వి అ న ౧ పీడ కాతియ ౨ రద్దు ౩ తొలఁగఁబుచ్చుట నివారణము ౪ నిషేధము నిరాకరించుట ౫ ప్రతిబంధము అడ్డగించుట

-ధము. సం వి అ పుం ౧ పీడనము కాతియ ౨ కొందలము, దుఃఖము ౩ ఎగ్గు, హాని ౪ అపాయము ౫ ప్రతిషేధము, నిషేధము ౬ ప్రతిబంధము అడ్డు ౭ (న్యాయ) వ్యాఘాతము గలది (వహ్న్యనుమితియందు వహ్న్యభావముగల హ్రదము బాధము ఇది హేత్వాభాసములలో నొకటి)

బాధించు సం స క్రి బాధపెట్టు

శా ధనాదానసం ధాపారుష్యముతోడ సాధుజనులం బాధించె రక్తాంగకుం డే పాపాత్ముఁడు నీ పితామహుఁడు సుమ్మీ వంశవిస్తారకా వరాహ ౨ ౯౭

బాధితము సం విశ (అ ఆ అ) ౧ పీడితము నొప్పింపఁబడినది ౨ కష్టపెట్టఁబడినది ౩ అడ్డగింపఁబడినది ప్రతిబద్ధము ౪ నిషేధింపఁబడినది ౫ త్రోసిపుచ్చఁబడినది నిరాకృతము ౬ ఖండింపఁబడినది ౭ (న్యాయ) సాధ్యాభావవత్పక్షము గలది (ఉదా వహ్ని అనుష్ణము)

బాధిర్యము. సం వి అ న చెవుడు

బాధ్యత. సం వి ఆ స్త్రీ ౧ బాధ్యత్వము ౨ పూచీ

బాధ్యము. సం విశ (అ ఆ అ) ౧ నొప్పింపఁదగినది బాధింపఁదగినది ౨ నిషేధింపఁదగినది ౩ నిరాకరింపఁదగినది రద్దుసేయఁదగినది

బాన. వి (సం భాండః ప్రా బాణమ్ క బాని త పానై) ౧ కడవ పెద్దకుండ

సీ తతముఖ భాండాఖ్య తనరు బాన

ఆం భా ౨ ౨౪౬

మ కడు నుద్యన్మానవిచ్ఛేదనం, బిది పూరింపఁగరాని బాన నరునే యీరీతులం ద్రిప్పఁజాలదు వల్లభై ౨౨

మ ఘనసూచీముఖ కూచకాగ్ర ధవళాంగ స్తబ్ధరోమాళి దుస్సిన (బ్రహ్మాండము కూంట్ల బానవలె భాసిల్లఁగ

దశా ౩ ౧౭౩ పాంచాలీ ౫ ౭౬

౨ ఎత్తుకడవ (శ ర)

జ బానగిలు

బానగిలు(ల్లు). అ క్రి (√ బాన) బలాత్కృతముగు బలవంతముగ లాగఁబడినదగు
ఉ పూనినరీతి వాని తలఁపు ల్వడిఁ బ్రాసములుం జలంబునం బానగిలంగ నీడ్చి యొకపద్యముఁ గూర్పఁగవచ్చుఁ గాక యా ఖ్యాన కథాను కూలముగఁ గావ్యముఁ జెప్ప వశంబె
ద్వా ౧ ౨౦

బానసము. వి (సం మహానసః కి వాణసు)
౧ వంటశాల
సీ శివుఁ డాత్మసుతు నభిషేకింబు సేయుడు దిగధీశు లంతన దిక్కరించి పనులద్దరాఁడ జంభారి బానసమున కనలుండు రాఁడ
కు సం ౧౦ ౫౫౫
అ ధూమిని నవమాన పఱచి యునిచెఁ గుక్క బానసమున దశకు ౧౦ ౧౦౧
ఉ శౌరి కరాసిధారచేఁ ఎచ్చఁడిచేయఁగా జముని బానసముం బురడించు చ్చోటికిన్
ఉ హరి ౪ ౧౯౬
౨ వంట
తా నీ చిత్తంబునవ్ మెచ్చున ట్లే వండం గడు నేర్తు బానసమునం దిచ్చోటనే కాదు న న్నే వీటన్ మిగులంగ నెవ్వఁడును లేడు
భార విరా ౧ ౨౧౭
గీ హరియు మాహిష్మతీ పురి కరుగుదెంచి రక్ష గాఁ బెట్టి తిరిగెడు రాక్షసులకుఁ దొలత జము బానసము నింటి త్రోవఁ జూపి
ఉ హర ౧ ౧౩౯

బానసమువాఁడు = వంటవాఁడు

వ అ కల్మాషపాదు నొక్కనాఁ డొక్క బ్రాహ్మణుం డధిక క్షుధార్తుండై వచ్చి సమాంసంబయిన భోజనంబడిగిన నిచ్చిపోయి వాఁ డంతఃపురంబున నుండి మఱచి యర్థరాత్రంబు నప్పుడు దలంచి తన బానసంబు వానిం బిలిచి భార ఆది ౫ ౧౧౪

బానసపుబాడబుఁడు = వంటబ్రాహ్మణుఁడు

గీ తెచ్చి యొక హైన్యవుఁడు గాను కిచ్చె ననుచు బానసపు బాడబులచేతఁ బంపుటయును
ఆము ౪ ౧౯౬
జ బానసీఁడు

బానసీఁడు. వి (బానసము + ఈఁడు కి బానసిగ) బంటవాఁడు వల్లవుఁడు
ఉ నన్నిమ్ముగ బానసీని నొకనిం బురిఁగానఁ యట్లుగాఁగ మేన్ గాఁడియపెట్టి ధైర్యము నొడిచింబుగ వండుడు నెల్లకూరలున్
భార విరా ౧ ౪౪

బానిస. వి దాసి
గీ దాసి యొప్పు బానిసయనంగఁ దత్త
ఆం భా ౨ ౨౧౭
చ బంటుబానిసలు బైమ పెయ్యలు నే చెట్టులో నయిన సమస్త సంపదలు నన్న విత్తిన్ని కి తెచ్చిపెట్టఁగా కళా ౬ ౧౮
క అవ్వారాంగనబానిస మువ్వురు నీల్గటక దాన మూలం బనుచున్ విక్ర ౬ ౧౩౦

బానిసము. వి దాస్యము బానిసతనము
గీ వరవుడం బఁనఁ బను పన బానిసమన దాస్య నామంబులై యుండు
ఆం భా ౨ ౨౧౭
జ బానిసీఁడు

బానిసీఁడు. వి (బానిసము + ఈఁడు) సేవకుడు భృత్యుఁడు
గీ లాఁదోఁటకావలి బానిసీంద్రు సాలజచ్చిరి కేఁడు అచ్చ రా సుం ౧౨౪
సీ బానిసీఁడు బంటు వరవుఁడు గుండదనాఁగ దాసాఖ్యలు గాఁగఁ దనరు
ఆం భా ౨ ౨౧౯
ఆ కొల్వకాఁడు లెంక గుండఁడు నవుకరబంటు జీతకాఁడు బానిసీఁడు వరవుఁ డే భటుండు వఱలు ఆం పదా నర ౩

బాపు = బాపురే. అవ్య ౧ ప్రశంసార్థకము (దీని యామ్రేడిత రూపము బాపుబాపు)

ఆ బాపు కన్నగాడ బాపు నిశ్శంకుండ, బాపు బల్లిదుండ బాపు మెచ్చు, యనుచుఁ జేరు లెల్ల నగ్గించి యగ్గించి వినుతి సేయ.

దశకు ౫ ౧౩౧.

మ అరకే శౌరి బలి ధ్రువుం డహహా భద్రాశ్వుండు పవ్వా తలో, దరి ప్రహ్లాదుఁడు మేలు బాపు మహిభర్తల్ విప్రు లౌరా వణిగ్వరు లాహా వరాహ. ౭ ౯౩

చ అనుటయు బాపు బాపు నను నాసలపాలొనరించి సెమ్మదిం, జను పెర సెజ్జె తెంగిరి భోజరా ౪ ౨౪౨

౨ సంతాపార్థకము

క యతిసుతుఁ డేఁట నిర్ఘాతా, యత భీకరబాణపాత మఁట బాపు విధీ

భా రా ఆయో ౨౦౪

౩ ఆశ్చర్యార్థకము

ద్వి ఘనుఁడే చేఁటలవేమ కలియుగ సోమ, ఘనుఁడ చేఁటలవేమ ఘనధాన కామ, బాపు చేఁటలవేమ బసవేశ ధామ

పండితా పురా ౧౬౪ పా

ఆ కెల్లదమ్మితొంగల పీనికన్దోయితీ, రేపుమాపు బాపు రేపు మాపు సారంగ ౨ ౪౧

బాపురు. అవ్య ప్రశంసార్థకము

ఆ భళిర మేషరాజ బాపు రురశ్రేష్ఠ, ఔర యేషేంద్ర యరరె తగర

క్రీడా ౨౩౨

బాపురె(రే) = బాపు. అవ్య (క బాపురే)

౧ ప్రశంసార్థకము.

క భుజగర్వ మడఁగఁ జొట్టిన, భుజగాస్త్రము లిట్టు నట్టుఁ బారలం బడినన్, గజిబిజి లేదు కొలగంబున, మఱి బాపుర వీనిఁ బోల మగలుం గలరే ఉ. హరి. ౫ ౨౪.

చ స్వరము లయాశ తేలు శ్రుతి బాగుర మూర్ఛన కంపితంబు బా,పురె బళిరయ్య డాల్ మెఱిసెఁ బో ...

ఉ. రా. ౬. ౧౩౫.

చ తటుకున నస్తమించెఁ బతి దైన్యముఁ జూడఁగ నోడి తారకా, పటలము నుం ద్రియామ యును బాపుర యింతుల వాఁడి పంతముల్. నైష ౭ ౧౬.

గీ బాపురే నన్ను బీదవాఁపని విధంబు, నను గనుంగొని యర్ఘ్యదానం బొసంగ, వచ్చితె దశా ౪౧. ౩౦౧

౨ ఆశ్చర్యార్థకము

ఉ శృంగారరసంబునం గరుపు కట్టి మనోజ్ఞ సువర్ణ కారికు, డీ గమణీ శిరోమణిని నింపున ము న్నొనరించె బాపురే చిత్రభా ౩ ౪౧

గీ ఔర లేవాఁడి మాపుల యాఘుశంబు, బాపురే భూరికటితటీభారమహిమ

పాండు, ౧. ౧౧౪

బాబా. వి (సం బడబా) ౧ అశ్వము, గుఱ్ఱము

సీ పచ్చనిడాలులో పలిప్రొద్దుగాబాల రత్న కింకిణులయారవమువలన రామా.౧ ౧౨౪.

గీ మాటలో దచ్చికడలఁ, బఱచి క్రమ్మఱు నచటి బాబాతుటములు నీలా ౧ ౩౪

సీ పరగు నశ్వంబు బాబా వావురము వాహనము జక్కి లత్తడి మావు గుఱ్ఱమన

ఆం. భా ౨ ౧౯౬.

౨ వాహనము.

సీ తోరంపుసాంబ్రాణి ధూపధూమము గట్టుపగిదారి బాబాల బారు తీర్చ

దశా ౧ ౨౬౫.

సీ లేలిహానారి దువాళించె నొక్కటి, తోడుకు బాబా సెక్కె తోలె నొకటి.

వరాహ ౫. ౧౧౭.

సీ రాజీవభవురి గారాపుఁబట్టపుదేవి యంచ బాబా సెక్కె నలరుఁబోణి భీమ. ౧ ౪.

తొగబాబాపా = మన్మథుఁడు

శా పన్నీటన్ జలకం లాడి తొగబాబా పాదుసాకాయపు, ఱెన్నెల్ వ్రాసిన చీరఁ గట్టి శుక. ౪. ౧౦౬ (తొగ = పక్షివిశేషము, చిలుక.)

జ. బారసాల, బారాది.

భారంగి. వి. (సం. భార్గి) ఒకజాతి మందుచెట్టు, గంటుబారంగి.

సీ.. బారంగి గంటుబారంగియుఁ జఱు,తేఁ కవఁగ భార్గి తెలయును. ఆం. భా ౨. ౫౪.

బారకము. వి. (సం. భారః) బరువు. (శ ర) (వ్యవ.) నా యొపిలు బారకముగా నున్నది జ॰ బారకించు.

బారకట్టె. వి. (బార[1] + కట్టె) బారెఁడు పొడుగు కట్టె.

గీ గడ్డిబొడ్డుపలెను పేను గాపెంప, బారకట్టెల తెఱఁగున భాహులలర, జవకయాగంబుఁ జూడ వచ్చెను చంద్ర. వి. ౧ ౩౩

బారకాఁడి. వి. (బార[1] + కాఁడి) దున్నుటకై కోఁడెల నలవరించు కాఁడిమ్రాను. (చి ని ప్రా., శ ర)

బారకించు. అ క్రి (√ బారకము) భారమగు, బరువగు

(వ్యవ.) వాని ఒడలు కొంచెము బారకించినది. (చి ని, శ ర.)

బారకీరము. సం విణ (అ ఆ అ) బారగ్రాహి. వి అ. పుం. ౧ ఒడలొసలము ౨ యోాక, పేను. ౩ కలికేకిని, దుర్వాస ౪ (నీరాజిత మయిన) గుఱ్ఱము.

బారపట్టె. వి. (బార[1] + పట్టె) స్తంభముమీఁద నడ్డముగా నమర్చెడు నిడుపాటి పట్టె. (శ ర.)

బారపోయు. స క్రి (బార[1] + పోయు) చేయి చాగునంత కొలఁది నూలుపడకు (శ. ర.)

బారసాల. వి. (√ బార[2] సం. ద్వాదశాహః. ప్రా వారసాహో, పాలీ. బారసాహో) నామకరణము అను శిశువులకు చేయు సంస్కార విశేషము. (చి. ని., శ. ర.)

బారసి. వి. (సం. ద్వాదశి ప్రా బారసి.) ద్వాదశి, పక్షములయందుఁ బండ్రెండవ తిథి.

క. వినిపించునది యమస్మృతి, మతి ధర్మం గొలుచు బహుజనముల కతిమాన్యం బున్నది బారసిని భుజియింపఁగఁ దాన నెల్ల విభవము కలుగున్. భార. శాం ౪. ౨౫౨.

సీ. బారసి పోనీదు పైనిద్రఁ బోఁటుసక్కాలు వాడు మత్స్యమ్యకథలఁ ద్రోయు. అము. ౪. ౫౦.

గీ. బారసి యనంగ ద్వాదశి పరగు . . ఆం. భా ౧. ౭౮.

బారా = బార[2]. వి (సం. ద్వాదశ, ప్రా. బారస, హి. బారా) పండ్రెండు.

ఉ తెలయాంధ్రుల దాకు వినోద లీల బా,రా పది దచ్చి యిత్తిగ దుగా యని పన్నిద ముగ్గడించుచున్ విరం ౨. ౨౨

మ. . తచ్చాక చావంచ యి,త్తిగ బారా దుగ యంచుఁ జిల్కరొద లుద్దీపింపఁ దా దవ్వులన్. కళా. ౩. ౧౪౧

బారాటి. వి పెట్టభూమి

గీ. చాటిపార గాక చిట్టూటచోటు గాక, తల్లి తల గాక క్రీఁడెద శ్వేరపురువు, రాతి పోటును లేని బారాటిసేల . . విప్ర. ౨ ౧౭.

బారాది. విణ (బార[2] + అది) ౧. అనేకములు.

క బారాది సొమ్ము లుండఁగ, వారము కొనుచుఁ జనిరొ వందజము . పాండు. ౪. ౨౩౨.

క. వా రిరువురు . హోరాహోరిఁగఁ బోరిరి, బారాది దినంబులు .. అము. ౩. ౧౫.

౨. మిక్కుటము, అధికము.

మ.:..ఎగువబొలికేర బారాది యగు దూరం బేగఁ బోగువాటించి యత్త్రాసిట వల తెరాటం బర కత్తి .. మను. ౪. ౫౭.

బారి. వి.(సం. పారి. క బారి.) ౧. ఏనిగొలుసు, ఏనుఁగు కాలఁ గట్టెడు గొలుసు.

**బారు.** వి. (సం వారః క బారు.) ౧. పంక్తి, వరుస.

మ. రెుల్లు జీరుల కన్(గేవల నల్లపత్త్రిముల / బారుల్ దీర్చు భద్రాకృతిన్. చం.రా. ౨.౪

గీ.. శీఘ్ర శస్త్రధారలును మీఱుగాముల / బారు గల్గి, పేరుగల వేల్పు దొరలచేఁ దీఱు / నాత్మబలము వీక్షించి.. ఉ. రా.౪.౩౩౨.

గీ. వారణేంద్రంబు ద్వారంబుఁ జేరి పెద్ద, / బారిచే శైరిబారులఁ బారిసమర...

రా. వి. ౫ ౨౦.

౨. సమూహము, సేనాసమూహము

గీ. కాఁడా చేసిన మొత్తంబు బారు / కుటుము పేర్లు సమూహమునకు ..

ఆం సం. మాన. ౭౭.

గీ. మూఁకలోమాది దళసహస్రీ సమృద్ధ, విలప / నము మీఁద లేఁగుటు దలిపెనపుడు, తద్వి / లాపాన తద్ద విలపించె శిఖికేకు నొద్ది / బారు. శకు. ౫. ౧౭౮

సీ. పగటిగాసంబు దప్పక యుండ దినలోఁబ / మాదిరి కొంటరి కోదుమూశ. గీ. మొదలు / గాఁగల బాగులు మొనకు నిచ్చి .

రా. వి ౫ ౧౩

విశే. దీర్ఘము, పొడుపైనది.

ఉ. యా, పట్టున మీలఁ గాంచి యొక బారు / వలం దివియించి రేపువన్.

ద్వా ౧ ౨౩౯.

సీ. కినిసి గోంద్రిలుచుఁ జైకొను పంచనఖములఁ / బారుటేఁకుల డిందు పతిచి పతిచి.

కృ. శకం. ౧ ౭౧

జ· బారుచాపు? బారుచేయు, బారుదీరు, / బారులుతీర్చు, బారుకట్టు

**బారుచాపు.** వి. (బారు + చాపు?) పెద్ద / మారలు కల రేకు. వస్త్రవిశేషము. (శ. ర. ద్రా.)

**బారుచేయు.** స. క్రి. (బారు + చేయు) కుపా / కిలో ముందుకేసి కూరు. (శ. ర. ద్రా.)

(వ్యవ.) వాఁడు కుపాకి బారుచేసినాఁడు.

**బారు(లు)దీరు.** అ. క్రి. (బారు + తీరు) ౧. / బారుగానుండు, పంక్తిగా చేర్పడు.

గీ. కులయనిలయసుగంధ సంబంధ మంద, పవన / నిశ్వాస వీచికల్ బారుదీర .

వేం. పంచ. ౪. ౩౦౮.

వ. పొదలు గదలి యొగసి నడుమ నెడ తెగని / బారుదీరిన మగలేఁటి దాఁటు నాపునిదొర / చలి కాని రాకకుఁ గట్టిన కలువతోరణం బని / పేరుకొనుచు రా. వి. ౩. ౧౧౪

౨ (యుద్ధమునందు) మొనఁగా చేర్పడు.

గీ దైతేయవీరు లపుడు చేరి కేర్వఁ / బారులుదీరి. దశ. ౨. ౩౮౧.

మ తత్తపటు వత్సోజయుగంబు [illegible] / మీఁదం బారుదీరు న్నృపా ఇందు. ౨. / ౧౫౪. (ఇట ఎదురొడ్డను అని భావము.)

**బారులుతీర్చు.** అ క్రి. (బారులు + తీర్చు) వరు / సలుకట్టు, పంక్తులు తీర్చు

సీ తనుక బారులుతీర్చు పెనుగ్రాహముల / నోర్చు . దశ. ౧. ౨౦౫.

**బారువ = బారువు.** వి. (సం. భారః. క. / బారువు) ౧. ఇరువదిమణుగులకొలఁది.

సీ. రుక్మిణి యొసఁగ బారువ తావి కుంకుమ / కర్పూరము యొసంగ సంకుమదము ...

భాను ౪. ౭౭.

౨. ఇరువదొక్కటులలకొలఁది.

ఉ. ఎన్న సాల్గుమాడలె త్తొక కర్షంబు, సాల్గు / కర్షలైన నగు పలంబు, పలము లొక్క / నూఱు తులయగుఁ దుల లొక్క, యిరువ / దొకటి బారు విది మతంబు. ద్వా. ౭. ౧౩౩. / (ప్రాంత ప్రతిపా.)

వ. అట్టి కిరీటం బెట్టి దనిన నూఱుబారువలకన / కంబుతోఁ దీర్చి తాల లేని జీవములఁ / దాఁచించి యుండు. వేం. మా. ౪. ౧౭౧.

**బారువు(ర్వు) = బారువ.** ([illegible] మణుఁగుల / కొలఁది.)

బాలక్రీడ. సం వి ఆ స్త్రీ బాలురయాట బాల్య వినోదము

బాలక్రీడనకము. సం వి అ న బాలురయాట బొమ్మ వి అ పుం చెండు (రాజని)

బాలక్రీడనము. సం వి అ న బాలురయాట, బాలురయాటబొమ్మ

బా(వా)లఖిల్యుఁడు. సం వి అ పుం అంగుష్ఠ మాత్రప్రమాణముగల ఋషిగణవిశేషము (వీరు సూర్యరథమునకు ముందు పోవుదురనియు అఱువదివేవురనియుఁ జెప్పఁబడుదురు)

బాలచర్య. సం వి ఆ స్త్రీ బాలుని నడవడి

బాలచర్యుఁడు. సం వి అ పుం కార్తికేయుడు కుమారస్వామి (త్రి ని)

బాలతంత్రము. సం వి అ పుం గర్భిణీచర్య మంత్రసానితనము (త్రి ని)

బాలతనయము. సం వి అ పుం ఖదిరము చండ్ర ‡

బాలతృణము. సం వి అ న శష్పము లేత గసవు ‡

బాలదలకము. సం వి అ న ఖదిరము చండ్ర ‡

బా(వా)లధి. సం వి ఇ పుం వెండ్రుకలుగల తోఁక

బాలపత్త్రము. సం వి అ పుం ౧ యువాసము తెల్లచండ్ర ‡ ౨ చండ్ర ‡ వి అ న క్రొత్తయాకు - ఇట్లే బాలపత్త్రకము

బాలపాశ్య. సం వి ఆ స్త్రీ ౧ చెంపమక్కు- పాపటక్రింద నుండు బంగారు లోనగువానిచే రచితమగు రేకు ౨ వెండ్రుకలను గట్టుటకుఁ గాని వానితోడఁ జేరంచి యల్లుటకుఁగాని యుపయుక్తమగు ముత్యాలసరము (విల్యమ్సు)

బాలపుష్పి. సం వి ఈ స్త్రీ యూధిక అడవి మొల్ల ‡

బాలపుష్పిక. సం వి ఆ స్త్రీ బాలపుష్పి ‡

బాలభద్రకము. సం వి అ పుం విషభేదము

బాలభైషజ్యము. సం వి అ న ౧ రసాంజనము ౨ శిశువుల యౌషధము

బాలభోజ్యము. సం వి అ పుం చణకము సెనగలు (రాజని)

బాలము. సం విణ (అ ఆ అ) ౧ శిశువు నిసువు ౨ క్రొత్తగాఁ బొడమినది (బాలచంద్రుఁడు) క్రొత్తది ౩ మూర్ఖము ౪ అవిశుద్ధము (యజ్ఞపశువు మొ॥) వి అ పుం ౧ శిశువు నిసువు ౨ చిన్నవాఁడు పదునారేండ్లలోఁబడినవాఁడు ౩ గుఱ్ఱపుపిల్ల ౪ తోఁక ౫ గుఱ్ఱపుతోఁక ఏనుఁగుతోఁక ౬ కేశము వెండ్రుక ౭ అయిదేండ్ల యేనుఁగుపిల్ల ౮ మత్స్యభేదము ౯ నారికేళము ‡ పుం న కురువేరు గంధద్రవ్యవిశేషము

బాలమూలము. సం వి అ పు చిన్న ముల్లంగి ‡

బాలమూషిక. సం వి ఆ స్త్రీ చిట్టెలుక గిరి

బాలయజ్ఞోపవీతకము. సం వి అ పుం ముక్కటము జన్నిదము (త్రి ని)

బాలరాజము. సం వి అ న వైడూర్యమణి

బాలవత్సము. సం వి అ పుం ౧ లేదూడ ౨ పావురము

బాలవము. సం వి అ పుం (జ్యోతి) కరణములలో నొకటి

బాలవాయజము. సం వి అ పుం వైడూర్యము (బాలవాయపర్వతమందు పుట్టునది విదూరనగరమందు సంస్కరింపఁబడును)

బా(వా)లవాసస్సు. సం వి స న ఉన్ని వస్త్రము (కల్ప)

బాలవాహ్యము. సం వి అ పుం అడవిమేఁక

బా(వా)లవ్యజనము. సం వి అ న చామరము

బాలవ్రతుఁడు. సం వి అ పుం (మంజుఘోషుఁడను) బౌద్ధసేనదేవుఁడు (త్రి ని)

బాలసంగడము. వి మల్లసాధనవిశేషము

సీ. తత్ప్రథమంబుశై తగఁ గంబము లోనత కటి
కన లోడు సంగడము బాల,సంగడము నీతి
గోరా మసంగ.. ఆం. భా. ౨. ౨౦౪.

బాలసంధ్య. సం. వి. ఆ. స్త్రీ. తొలుసంజ, లేఁతసంజ.

బాలసము. వి. (సం. బాలిశ్య) బాలిశగుణము, మూర్ఖ్యము.

ఉ. వలి సన్నులు సిక్కనితాలు సూడఁ గా
బాలస మంద చిత్రరతిఁ బ్రౌఢలు గావున
సౌఖ్యభంగిఁ బాం,చాలన శైనఁ గాంత
లనిజం విది యిట్టిది నాఁగఁ బాలసే.
కు సం. ౮ ౧౫౯

బాలసాత్మ్యము. సం వి. అ న. (బాలులకు సుఖమును చేయునది) క్షీరము

బాలసూర్యము. సం వి అ పుం. వైడూర్యము. ఇట్లే బాలసూర్యకము

వా(వా)లహస్తము. సం వి అ.పుం ౧ వాలధి, ఇంద్రుకలు చిబుకొనియుండు తోఁక. ౨. కేశ సమూహము

బాలాక్షి. సం వి. ఈ స్త్రీ. కేశపుష్పవృక్షము.

బాలాజీ. వి (హిం. బాలాజీ) తిరుపతివేంకటేశ్వరునకు బైరాగులు వాడెడు పేరు (శ ర)

బాలాతపము. సం వి. అ. పుం లేయెండ.

బాలార్కుఁడు. సం. వి అ. పుం ౧. ఉదయసూర్యుఁడు. ౨. కన్యారాశిస్థ సూర్యుఁడు.

బాలి. సం. వి ఇ న్ పుం. వాలి, సుగ్రీవుని యన్న.

బాలిక. సం. వి. అ. స్త్రీ ౧. బాల, నిసువు. ౨. పదునాఱేండ్లకు లోఁబడిన వయసుగల పిల్ల. ౩. కన్యక. ౪. ఆఁడుది. ౫. కర్ణభూషణము, చెవిలోగడ. ౬. పీఁక, పత్రకాహళ ౭. వాలుక, ఇసుక. ౮. చిట్టేలకి. శ్రీ.

బాలిని. సం. వి. ఈ. స్త్రీ. అశ్వినీనక్షత్రము.

బాలిమము. సం. వి. న్. పుం. బాల్యము.

బాలిశము. సం. వి. అ. న. ఉపధానము, తలగడ.

బాలిశుఁడు. సం. విశే. (అ. ఆ. అ) ౧. బాలుఁడు, పసితనము కలవాఁడు. ౨. పిల్లవాఁడు, పిన్నవాఁడు. ౩. మూర్ఖుఁడు, మూఢుఁడు. ౪. జాగ్రత్తలేనివాఁడు. వి అ. పుం. బాలుఁడు.

బాలీశము. సం. వి. అ. పుం. మూత్రకృచ్ఛ్ర రోగము.

బాలీసు. వి (సం. బాలిశః, హిం. బాలిశ్) తలకడ చేరఁబడుట కుపయోగించు దిండు, ఒరగుదిండు.

సీ. బాలీసు రతనంపు కీలుబొమ్మలు చిటి చాపలు
తెడఁద వింజామరములు. రసిక ౧. ౬౧

సీ. పట్టెమంచంబు ను బలుపు ను బాలీసుఁ
జందుగు పెట్టెలు మందసముల.
నీలా. ౩ ౮౬.

బాలుక. సం వి అ స్త్రీ వాలుక

బాలుకము. సం వి. అ పుం పానీయామలకము. శ్రీ న ౧. ఏలావాలుకము. (గంధద్రవ్యము) ౨ కర్కటి, నాఁగుదోస, శ్రీ ౩ కర్పూరము ౪ యంత్రభేదము ఆ. స్త్రీ. ఇసుక, వాలుక

బాలుకాగడము. సం వి అ పుం. మత్స్య విశేషము

బాలుకాత్మికా. సం. వి. అ స్త్రీ. శర్కర, చక్కెర.

బా(వా)లుకాప్రభ. సం వి. అ స్త్రీ. నరక విశేషము.

బా(వా)లుకాయంత్రము. సం. వి. అ న. ఔషధపాకార్థమగు యంత్రభేదము, మందులు వండుట కుపయోగించు యంత్రము.

బాలుకి. సం. వి. ఈ. స్త్రీ. కర్కటీభేదము, నాఁగుదోస. శ్రీ (త్రి. ని.)

బాలువు. సం. వి. ఉ. పుం. ఏలావాలుకమను గంధద్రవ్యము.

బాలూకము. సం. వి. అ. పుం. విషభేదము.

సీ. బాలుఁ బ్రేలును సంకు గ్రాలుఁ డాలును చిల్ల
వాలుఁ గేలును గల బాళివాఁడ.
ప్రబంధ. ౨౨౪.

౫. విధము, రీతి.

చ ఈపరి యందఱు మెక్కుచిదు నై వెంటనే
గుంపు లుడ్డలు తుటుములు మూకలుగా డాక
మీఱి నాలుగు కోవులతో సీనిన పులల
బాళిని యూఁతలు గ్రమ్మిన లీలను
ప్రబంధ. ౪౭౭

౬. ప్రీతి

శా. రక్షః కులాధ్యక్షు యొ, వ్వాఁడున్
మాపురిఁ జేరి నీకరణి గర్వస్ఫూర్తి నిట్లాడఁ
గా, లేఁడు గ్రుండ వతండు వచ్చినను
బాళిన్ రమ్ము మెంతావనన్
ఉ రా. ౩. ౧౭౪

౭ చింత, వ్యధ. (చూ బాళిగొలుపు)

౮ బాళిగొను, బాళిగొలుపు, బాళితాఁకు, బాళివట్టు

బాళిగొను. స క్రి (బాళి + కొను) వలఁచు, అనురాగము నొందు

ఉ ఏలలు పాడుదు రందు వధ్వగుల్, బాళి
గొనంగ శాలి వనపాలిక పాలిక బాలికా
మణుల్ దశా ౧. ౧౧౬.

బాళిగొలుపు. స. క్రి (√ బాళిగొను) చింతిల్లఁ జేయు, తలపెట్టు

గీ తా నెఱింగియు నీజాతి గాని దానిమాట
లెల్లను గొండగా మదిఁ దలంచి, కుడిచి
కూర్చుండి వను బాళిగొలుప నేల
విప్ర ౪. ౪౪

బాళితాఁకు. అ క్రి (బాళి + తాఁకు) సొమ్మసిలు, మూర్ఛిలు

గీ. వడవెంద బాళితాఁక, నైమములచేఁ గప
పట్టె సొమ్మసిలె ననఁగ, మూర్ఛ తా
సాం. ని. మాన. ౪౨.

బాళివట్టు. అ. క్రి. (బాళి + పట్టు) ప్రీతిగొను

క. మదిలయు విభుఁడును సేర్పులు, వదలినఁ
గని రవుడు పౌరవశ్య సుఖంబుల్, మదినాఁటి
యున్న మదన, ప్రదరంబును వెలుక బాళి
వట్టిన భంగిన్ కళా. ౪. ౨౧

బాళు. అ క్రి శ్రేయమొందు, మేలొందు.

ద్వి పాది గల్గి భూమిఁ గాఁపురములు చేసి,
బ్రదికి బాళెదమని పరగువారలకు, వలవంత
వేళ దేవర దయ్యె మనఁగఁ, గలదు.
ద్వి. పరమ. ౩ ౧౫౪. (చి. ని. పా.)

బావ. వి (సం భావుకః, ప్రా భావుఅ, క. బావ)

౧ అక్క మగఁడు.

సీ బావయు మఱఁదియు బవరానఁ గూలిన
వనిత వారేమి కావలయు నీకు .
ఉ రా. ౪ ౨౧౬.

ఆ పంచదారఁ బోరపి భక్షింపఁగా నెత్త,
భావమ్ము మనుచు బావనగినఁ, దొలఁగఁ
బెట్టె రోషకిలికించితంబుతోఁ, గొమ్మ నరటి
పండ్లు గూర్చి మఱఁది నైష ౬. ౧౩౯.

౨ భర్త యన్న

క ఇది యెల్లను నౌకతల యీ, పదుమూఁ
డేఁడులును నాకు బావ కొడుకుచే, నదయ
మగు కూడు గుడుచుట, యది యొక తల
యయ్యె భార. ఉద్యో ౩. ౧౯౨.

సీ బావ యొప్పం పెను పలుకుల నేమగు నాతని
కొడుకుఁ గీడాడ నేల
భార. ఉద్యో. ౩ ౧౯౫.

సీ. అత్తయుం చనఁగను నలరు నన్యోన్యంబు
జాయాపతులకును జనను నైన, మామ నాఁ
దత్పిత్రు నామ మై విలసిల్లు నదరు బావ
యనఁ దదగ్రజాఖ్య. ఆం భా. ౨. ౧౧౪.

౩. భార్య అన్న.

సీ అడరు బావ యనఁ దదగ్రజాఖ్య ...
ఆం. భా. ౨. ౧౧౪.

క. భూవర పద్మాక్షుఁడు దన,బావ మాతుం
డగుట కనియుఁ బలుకక యుండెన్ ...
భాగ. ౧౦. ఉ. ౩౦౪.

శా. బావా నీవచనంబు నిక్కము సుమీ ...
భాగ. ౧౦. పూ ౧౬౨.

౪. తనకన్న పెద్దదైన మేనత్త మేనమామల కొడుకు (చూ మేనబావ)
౫. కామిని తనకలఁచినవానికి వావి కల్పించి పిలుచు వరుస
చ. మఱఁది యటంచు బావ యని మామ యటంచు ను నల్లుఁడంచు నం,దఱకును నన్ని వావు లిడి . దశా ౨ ౩౬౬.
ఉ...బలింద్రుఁ డిప్పుడో,కోమలి నీవు నేనమృత కుంభము వ్రానినఁ జూచి గోపబా,లామణి వంచుఁ బొల్గానఁ బలంచెద మన్న ను నవ్వు చుఁ మృగా,క్షీమణి బావ నీవు దధిఁ జిల్కఁ గ గోరికి నైన కోసమే దశా ౨ ౩౫౩
౯ బావమఱంది
బావంచి = బావంజా. వి కాసుగ ) క్రీ.
సీ. బ్రాహ్మియు శంఖయు బావంచి విత్తన ములు నపామార్గమున్ను మొదలి వ్రేళ్ల అప్ప ౨ ౪౩౦
బావంజి = బావంచి. వి కాసుగచ్చు క్రీ వాగడ (చి ని శ ర)
బావమఱంది. వి (బావ + మఱంది) చెల్లెలిభర్త
ద్వి... తెలిచిన మిగుల మోదించి యా బావ, మఱంది నెన్నడు మ నుమ్మలిక రట్టింప, నలంతి నవ్వుచు నిడుపగు పెద్ద యినుప, గొలుసు గీల్కొలిపి యా కుమారంబుకంట, డించిన .... ద్వి పరమ ౭ ౫౨౫
బావి. వి (సం వాపీ, ప్రా వావి శ బావి హిం బావడీ) ౧ వాపిక, డిగ్గియ, నడబావి
శ్లో. ద్వారహీనో భవే త్కూపో ద్వారే కైకేన వాపికా, నైకద్వారా పుష్కరిణీ దీర్ఘా కారా తు దీర్ఘికా, కుల్యా విధుతతోయ శ్చ తటాకః పరికీర్తితః.
తత్త్వరత్నాకరము. (చి ని.)
చ. నతజలపూరితంబు లగు నూతులు నూఱిటి కంటె నూన్పత, ద్రవత యొక బావి మేలు. భార ఆది ౪ ౯౩
సీ. తలిరుటేమావి క్రొత్త ఒవాదిఒలక్రోవి వల పులదీవి చెంగలువ బావి.
అచ్చ రా. బాల. ౧౩౬.

గీ. కల్దిరిగాఁ గుక్క, వనికి పోవులఁ బడుటకుఁ బసువుల యెరవు, పెంటలకు పెంసల్లు .. అము. ౨. ౫౩.
౨ చెలమ, కూపకము.
సీ సుసుఁగావి జెగి పోవి వన తేనియల బావి. సీలా. ౧. ౫౬
౩ తటాకము, చెఱువు
ఉ . మగు,త్పాసుఁడు గాంచె నొక్కరొయెడ. వాస్తవా డాగముస్ గీ కాంచి యాబావి యగుఁ మరంగములు నీర ద్రావునది ... హై భా. ౨. ౮
తిల్లిగాః – తీర్థవిశేషము. పట్టిస క్షేత్రమందలి యొకి తీర్థము
సీ అంతఃప్రవాహ యై యావిర్భవించె నీ ధరణీ ధరము పొంతఁ దల్లిబావి. కాశీ. ౩ ౨౫
బావిలి(లీ). వి (క బావిలీ, త పావిలి) స్త్రీ కర్ణ భూషావిశేషము, అఁడుది కొవ చెవులందుఁ బెట్టుకొను నలంకారవిశేషము
చ వరుస మెఱుంగు బావిక పు వజ్రపుఁగుచ్చుల గచ్చుపై బరాఁరి యొనరించు ముత్తియపు బావిలి నిగ్గు పరాకుఁ జల్వ కువల. ౫ ౯౨.
సీ. అలికకేళకుఁ బోల కకుకుక్రొన్నెల లీల నెలవంక బావిలీ చలన మంద సమీర. ౩. ౨౧౩
గీ రత్నతాటంకములు బవిరలును బావి, లీలు ముత్యాలసరములు కీలుకడెము, లాది యగు సొమ్ము లంగంబు లాని యలరె... ఉ. రా ౬. ౧౧౮.
జః బావిలీగొలుసు.
బావిలీగొలుసు. వి (బావిలీ + గొలుసు) నగ వాఁడు కొవ చెవిని ధరించెడి భూషావిశేషము (శ ర)
బావుకొను. స. క్రి. కొన్న మొదలగునవి చేయి నిండ ఎత్తి కోట నిడుకొను.

గీ. ఓలిఁ గట్టిన యుట్లకు నుతికి పెద్ద, బావలం
దున్న వెన్నలు బావుకొనుచు, నుట్టులను
ద్రచ్చి బావల నురలఁ ద్రోచి
హరి. పూ ౫ ౨౦౫, ౨౨౪

దండ. కడుం దియ్య మంచున్ వడిన్ బావు
కొంచున్ గడన్ జూచుకొంచున్ చెడన్
ద్రిప్పుకొంచున్ చెన్న. ౫ ౨౯౭

౨ అన్నము లోనగునది నోట నరుదుకొను

చ కరతల మెల్లఁ జాఁచి పులఖండము నెయ్యిని
బిండి సుంద్రముల్, పొరిఁబోరిఁ గళ్ల నేయు
చును బుగ్గలఁ బెట్టుచు బావుకొంచు
వీర ౧ ౫

3. అనుభవించు.

(వ్యవ) ఈ వ్యవహారములో నీ వేమి బావు
కొంద మని దిరిగెదవు?

బావురు = బావురుఁబిల్లి. వి ౧. మహా మార్జా
లము, గండుపిల్లి.

సీ బావురుఁబిల్లి నా బావు రనఁగఁ, జను
మహామార్జాలసంజ్ఞ ఆం. భా ౨ ౧౪.

౨ గండుపిల్లి కూఁత కనుకరణము

చూ బావురుఁబిల్లి

జ బావురుఁబిల్లి, బావురుగడ్డము, బావురు
గాఁడు, బావురుమను

బావురుఁబిల్లి. వి (బావురు + పిల్లి) మహా మార్జా
లము, బావురని కూయు గండుపిల్లి

ద్వి బెడిదంపు బావురుఁబిల్లివాలికిని, దొడిఁ
బడ రాచిల్కఁ ద్రోయుచందమున
ద్వి పారిజా ౬ ౨౪౩౬

ఉ మీకు బలెఁ బెంచినవారికి ముద్దు గాక
పె,న్బావురుఁబిల్లికిం గలుగునా మొగమోట
యొకింత చిల్కపైన్ కళా ౬ ౨౩౧

బావురుగడ్డము. వి (బావురు + గడ్డము) పిల్లి
గడ్డము, మేకగడ్డము. (శ. ర.)

బావురుగాఁడు. వి. (బావురు + కాఁడు) బావురుఁ
బిల్లి, మహా మార్జాలము.

ఆ. రిబాఁ జలుకఁ బెంచి బావురుగానికి,
కొప్పగించురీతి దశా. ౧. ౧౫౨.

ఉ బావురుగానిఁ జూచి వెలి పైకొనఁ దల్లిక
మందు మూరుతే,జీవలె గుండె జల్లుమనఁ
జేప్పడి బేల్పు కెలంది
ఉ. రా. ౪ ౧౯౫

బావురుమను. అ. క్రి (బావురు + అను) (జన
శూన్యమగుటచే) బావురుమను మాఱు మోఁత
కలదియగు (శ ర. ప్రౌ.)

(వ్యవ) పిల్లలు ఊరికి వెళ్లినతర్వాత యిల్లు
బావురుమనుచున్నది

బాష్కలుఁడు. సం వి అ పుం ఒక ఋషి
ఋషి

బాష్పపూరము. సం. వి. అ. పుం. కన్నీటి
ముంపు

బాష్పము. సం వి అ. పుం. న ౧. కన్నీరు.
౨ తోటకూర 3 ఊష్మము, ఆవిరి. ౪.ఇనుము.

బాష్పాంబువు. సం. వి ఉ న. కన్నీరు.

బాస. వి (సం భాషా, ప్ర. భాసా, క బాసె.)
౧ (ఒకరి యభిప్రాయ మొకరికి తెలియ పలు
మటకై యుపయుక్తమగు శబ్దజాలము.)
ఆంధ్రాదిభాష

గీ అచ్చతెనుఁగు, బాసచే నిచ్చు డే నొన
ర్చఁగ దొడఁగిన, నీల యను పేరఁ దేజన
నిచ్చట్లిల్లు, నింతి పెండిలి కతలఁ గట్టు లనిన.
నీలా ౧ ౨౩.

సీ బాస నా శపథంబు భాష తెలయు . .
ఆం భా. 3. ౫౬.

౨ మాట, పలుకు, హితవచనము.

సీ అంత నర్యేపురు అయుధ విద్యారహస్య
ప్రయుక్తులఁ బలికిరి పలికిన బాసఁ జూడ,
నత్యుత్తమక్షత్రయాన్వయు లగుదురు .
భార. ఆది. ౩. ౨౨౬.

చ. క్షమఁ గుణము న్నె పుంగవానచారిజనం బెడ
దోషదృష్టి కుష్యము గడుగంగఁ బూన్చి

చ. ప్రథమ గర్భవతిన్ సతిఁ బుట్టినింటికిన్,
కొడుకొని వచ్చుచో నిచట దుస్సహమైన
ప్రమాది తేదవం బడియెడు నిర్యోగం బగిన
భాసట లేదు. విక్ర. ౮. ౩౫.

భాసటము. వి. విషము?

క. ఆ సమయంబున వెన్నెల, భాసటమునఁ
దోఁచి తోఁచి పాంథవధూటిపై, నెపె మనో
భవుఁ డెంత యుఁ, గాలిల నెలదేఁటి జెక్క-
గముల శరంబుల్. ఉ. శకుం. ౩ ౧౭౦

ఉ. పలుచని లేఁత కెంజిగురు బత్తళికం బెల
వించి తేనియం, గొలిచిన భాసటంబు గళ
క్రొవ్విరి తూపుల పాండు. ౫. ౧౨౬

వ. ఎదల గలంగి కలంగు తెరువరుల సేయ
భాసటంబు చిలికిన మరుని చిలుకుల వోని
కుసుమ్మిద తుమ్మెల వలరులఁ గాంచి
యయా. ౪. ౧౩

భాసనము. వి. వంటపాత్రము (శ ర)

భాసము. వి బంగారము, మణులు కెం. ఉంచు
పాలె, కంచి. (శ ర)

సీ. పైఁడిబాసముఁ జెట్టఁబడ నైచి దుడ్డు పెట్టుకుఁ
బాఱుచునె యొకొ లైఁచువారు
ఆము ౬. ౩౩.

భాసవాలు. వి (భాస + వాలు) ఋషి, జడదారి

ఉ. ఆభాసవాలు కొలమున, విబోధక వతి
స్మరుండు. అన నప్పనమంత్రి పెంపొందు
ధరన్. చెన్న, పీఠి. ౨౧.

ఉ. సరవిం దామర భాసవాల్మగుణ భాస్వ
ద్ధామ పాదాప్త భాగ్య రమోత్కర్ష ము
కల్మిఁ గర్క మహోగ్రావిష్ట కులో మఖ,
స్ఫురణం దాల్చి సముజ్జ్వలావయవ దై
సొం పూన చంద్ర. ౪. ౧౪౪.

గీ. కొండవలె వచ్చు తొలిచెల్పుఁ గొమ్ముఁ జూచి,
భాసవాల్మిన్న యా రాచపట్టి కనియె...
అచ్చ. రా. కాం. ౧౧౧

౨. దేవత. (శ. ర.)

భాసవాల్ కన్నుపాప = అత్రి నేత్రోద్భవుఁడు-
చంద్రుఁడు

తరల. గాలికుపరి ఏని చూపుల బెడంగును
భాసవాల్కనుపాపకందుఁ దలంచు భా,
గు లయసంబు బడేమియా తనపున్ సతం
బుగఁ దాలిచెన్. యయా. ౧. ౨౦.

భాసవాల్దిట్టలు. వి. (భాసవాలు + దిట్టలు)
సురలు, దేవతలు

క సురలవు వేల్పులు కేకేల్, తెలుగంటులు
భాసవాలుదిట్ట లవం చేశ్లిర వగు
అం. భా. ౧. ౬౨.

భాసవాల్దొర. వి. (భాసవాలు + దొర) ౧. ముని
శ్రేష్ఠుఁడు

సీ. తెచ తాభ్యాస సంయూచ శాత్మ్రియచాతురిఁ
జెని భాసవాల్దొరలడిగిరి వసు. ౫. ౬.

౨. దేవేంద్రుఁడు. (శ. ర.)

భాససేయు. అ. క్రి (భాస + చేయు) ప్రమా
ణముసేయు, ఒట్టు పెట్టుకొను.

ఉ కన్నియఁ గాని చేతో కతెఁ గాను
నమ్మ్ర కా, దన్నను నీదు కూది యగరా
మృత మా నిట వాసపేసెదన్
విజ. వి ౧. ౯౩

భాసాడు. అ. క్రి. (భాస + ఆడు) మాటాడు,
భాషించు

గీ తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁగేనుఁ,
కెలుఁగు వల్లభుండఁ దెలుఁగొ కండ, యెల్ల
నృపులు గొలువ నెఱుఁగవే భాసాడి, దేశ
భాషలందుఁ దెలుఁగు లెస్స ఆము. ౧. ౧౫

భాసికదండ. వి. (భాసికము + దండ) తల ముందు
ప్రక్క నుంచఁబడిన పుష్పహారము. (శ. ర.)

భాసికపట్టు. వి (భాసికము + పట్టు) పట్టా
సనము (శ ర.)

కేడ్పాటుతో నేను బాహిరమై యుండెద
నొంటి నీ వకట న న్నేకాకినిం జేసితే.
భా. రా. అయో. ౩౮

౨ బహిరంగమైనది

౩ ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు
గుప్తవర్తనములు గాఁగ, ఒలుప వలయు
నృపతి గొలువున్న యెడల బాహిరము లైనఁ
గలని శగ్గులగుట భార. విరా ౧. ౧౩౩

గీ ఉవిద నిర్లంపు జంఘుల సవతుఁ గోరి, కలమ
గర్భంబు లడఁచు లోఁ గంటకములు, చాలు
వల విఁచి మతి దివసక్రమమున, నిలువ కవి
బహిరము లైనఁ దలలు వంచు.
ఆము ౫ 33

౪ మూర్ఖ సామ్మ (చూ బాహిరపోవు)

౫ గావారపోవు

వావారుఁడు. విణ (సం బావ్యామ్) దూరుఁడు,
కోయనవాఁడు

౬ క అటు గాక కర్మగతి లంపటుఁడు నగుదు
నేని నల్పఫలభోగితమై, నట యిట దిరు
గమ మోక్షు ని, కటవృత్తికి బాహిరుండ
గానె కుమారా భార శాం ౧ ౫౯

వాగాకిము. సం విణ (అ ఈ అ) బయటిది,
౨ పలిది వి అ పుం ఎద్దు

వాహకుఁడు. సం వి అ పుం బాహీకదేశపు
వాఁడు

బాహు(వు) సం వి ఉ పుం. ౧ చంక మొదలు
వేళ్లవఱకు నుండు భాగము, భుజము
శా అసిలతాధృద్బాహు వేష్టింప
ఆము ౫ ౫౦.

గీ . నాయెదుర బాహువప్పళించి
భార. విరా. ౨ ౩

౨. వ్యాగాదుల ముందటి కాలు. 3 (గణిత)
కోటికర్ల భిన్నమగు క్షేత్రావయవ-రేఖావ
యవ భేదము. ద్వి. అర్ద్రా నక్షత్రము.

బాహుకము. సం. వి. అ పుం. క్రోఁతి.

బాహుకుంథము. సం వి. అ.పుం.(పక్షి) ఱెక్క.

బాహుకుఁడు. సం వి అ పుం నలుఁడు కర్కో
టక దష్టుఁడైన పిదపఁ దాల్చిన పేరు

బాహుచాపము. సం వి అ పుం. రెండు
బాహువులు రెండుప్రక్కలఁ జాఁచి పట్టినకొలత,
బార (విల్యమ్సు)

బాహుజము. సం వి అ పుం ౧ చిలుక. ౨
స్వయముగా మొలచిన నువ్వు

బాహుజుఁడు. సం వి అ పుం (విరాట్పురు
షుని) భుజమునందుఁ బుట్టినవాఁడు,రాచవాఁడు,
క్షత్రియుఁడు

బాహుత్రాణము. సం వి అ పుం న చేతికవ
చము (బాణాదుల దెబ్బ తగులకుండఁ జేతికిఁ
గట్టుకొను ఇనుప కవచము) ఇట్లే బాహు
త్రాణము

బాహుద. సం వి ఆ స్త్రీ ఒకానొక నది.

బాహుదంతకము. సం వి అ న ఇంద్రప్రోక్త
మగు నీతిశాస్త్రము (ఇది పంచసహస్రాత్మ
కము )

బాహుదంతి. సం వి న్ పుం. ఇంద్రుఁడు

బాహుదము. సం వి అ న బాహుపురి (శర)

బాహుపాశము. సం వి. అ పుం యుద్ధమందలి
యొక విన్యాణము (కౌఁగిలింతయందువలె
బాహువులు మెడచుట్టు వైచుట )

బాహుపురి. మి వి (బాహు + పురి) కేయూ
రము, భుజకీర్తి, సందెకడియము
ద్వి బాహుపు ర్లంగరా ల్పటుకంకణములు,
బాహువు లంగుళావళి కాంతు లీన ..
౧౦ రా శాల ౬౫. పా. ౧౫.
సీ బిగువుఁగౌఁగిళ్లఁ జేఁ బ్రియు బాహుపుర
లొత్తి కుమ్మెలు వోయిన కుచతటములు .
ప్రభా. ౬. ౬౨.
బ. ధాన్యవిశేషము.

సీ. లత్తుక తొత్తులు లక్ష్మ్యుమసోహారా ల్భారతీ నేసలు బాహుపురులు. హంస. ४. ౧౨౭.

బాహుభూష. సం. వి. అ. స్త్రీ. కేయూరము, సందిటి డియము, భుజకీర్తి

బాహుభూషణము. సం. వి అ. న. బాహు భూష

బాహుభేది. ౧౦ వి. న్ పుం. విష్ణువు (శిల్ప.)

బాహుమూలము. సం వి అ న. చంక, కక్షము

బాహుయుద్ధము. సం. వి అ న యుద్ధము, జెట్టిపట్లుపట్టుట

బాహులకము. సం.వి అ న. ౧. నానావిధత్వము, పెక్కు గొలుగులు గలిగియుండుట ౨. (వ్యాక) వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయాది నానావిధ కార్యములు గలిగి యుండుట

శ్లో. క్వచి త్ప్రవృత్తిః క్వచి దప్రవృత్తిః క్వచి ద్విభాషా క్వచి దన్య దేవ, విధే ర్విధానం బహుధా సమీక్ష్య చతుర్విధం బాహు లకం వదన్తి

బాహులగ్రీవము. సం. వి అ. పుం. నెమిలి. (అ. ని.)

బాహులము. ౧౦ విశ. (అ ఈ. అ ) ౧. నానా విధము. ౨. అనేకసాధ్యము, పెక్కింటిచే సాధింపఁదగినది వి అ. పుం ౧ అగ్ని. ౨. చాంద్రమాన కార్తికమాసము న. ౧. నానావిధత్వము. ౨. బాహుత్రాణము, చేతి కవచము

బాహులీ. సం వి. ఈ. స్త్రీ. కార్తికపూర్ణిమ.

బాహులేయుఁడు. సం. వి అ. పుం. కుమార స్వామి

బాహుల్యము. సం. వి. అ న ౧. బహుళ భావము, పెల్లుఁదనము, తఱచు. ౨ నానా విధత్వము ३ సాధారణ్యము, సామాన్యస్థితి.

బాహుశిఖరము. సం. వి. అ న. మూఁపు, మూఁపుదల.

బాహుసంభవుఁడు. సం. వి అ పుం. క్షత్రి యుఁడు.

బాహుసహస్రభృత్తు. సం. వి. త్. పుం. సహస్ర భుజుఁడు, కార్తవీర్యార్జునుఁడు

బాహూబాహువి. సం. అవ్య. ఒకరినొకరు బాహువులతో ప్రహరించుచు చేయునది (పోరు.)

బాహ్యకర్ణము. సం. వి అ పుం నాగభేదము ఒకానొక ఏనుగు (వా. చ)

బాహ్యము. సం విశ (అ. ఈ అ) ౧. వెలి లిది, ఒయటది ౨ వేఱు, అన్యము 3 వెలి యైనది, లోనుగానిది ४ వెలిపెట్టఁబడిన

బాహా. సం వి పుం ఒకానొక దేశము

బాహ్లి(హ్లా)కము. సం వి అ.పుం ౧ ఒకానొక దేశము ౨ బాహ్లికదేశపు గుఱ్ఱము. 3. గంధర్వ భేదము న ౧. కుంకుమపువ్వు ౨. ఇంగువ

బాహ్లికుఁడు. సం వి. అ. పుం. ౧. బాహ్లిక దేశపు రాజు ౨. బాహ్లికదేశపు రాజు ఇక్ష్వే, బాల్హికుఁడు, బాహ్లీకుఁడు.

బాహ్లిజము. సం. వి. అ. పుం. బాహ్లికదేశమున బుట్టిన గుఱ్ఱము.

## బి

బింకము = బింగము.¹ (క. బింక ) ౧. బిగువు

సీ జిలుగైన కనకంపుఁ జీనాంబరము గొంగు పాలిండ్ల బింకంబు ఁయలుపఱుప. హర ३. ౨౯

చ. గురుతర శాతకుంభ మయ కుంభకుచంబుల కుల్కు బింక మా, తెఱవకు రొమ్ము శుక. ౧ 3౯४

౨. గర్వము.

ఉ. కొండొక యొండు చోటువలెఁ గొంకు బింకముతో నరుండు భీముం డని మాటికి న మున్నతి నెన్నుదు... రాఘవ ४. ౯౪

వ బింకంబులు సడలక విక్ర ౪ ౯౭
గీ బిగు వన బింక మనఁగ పరగు గర్వంబు
ఆం భా ౨ ౨౨౧

౩ ధైర్యము
చ ద్వారపాలురన్ వెతి చెడ మట్టికొంచుఁ
బోరు నిర్భర గర్వము నుబ్బు బింకమున్
మెఱయఁగ వచ్చి యాంకుర మించె
ప్రభా ౧ ౭౧

ద్వి ఇంక చెట్లని యాత్మఁ గొంకక మనకు
బింకంబు వదలక పృథు సాహసమున
పండితా పురా ౧౩౨ పా

౪ శౌర్యము శూరత్వము
సీ ఆచటి రాజులు బంటు నంపి భార్గవు నైన
బింకానఁ బిలిపించు రంకమునకు మనుచ
౧ ౫౦ ('గర్వము' అని వ్యాఖ్య)
ఉ కొంకు లేని పెలఁ గుండడి ముగుదల డంక
తనము మీఱి జంకు లేక బింకమునఁ
గలంచె దింక వెన్నఁడు నీకు వంక గల్గ
దోటు జింకతాల్ప నీలా ౩ ౨౧

౫ తీక్ష్ణత తీవ్రము
వ ప్రళయ సముద్రంబు దోరయు సంకర్ష
ణాగ్ని బింకంబున ఉ రా ౨ ౬౧

౬ అభిమానము పట్టుదల
చ చనదు వినోదకోష మిఁక సాగవు బింకము
లాలకింపుఁడీ చం రా ౬ ౫

౭ అతిశయము పెంపు
శా గం డారన్ మదసారథంబునకు బింకం
బెక్కఁ గ్రోధాగ్నికిన్ లేదండస్వామి
మదంబు చేసె కు సం ౧ ౭౬
వ కామిని హరిణలోచనల చలిత కంకణ
సంకుల క్వేంకారంబు లానసాపాదచేందు
రాళి ఝుంకారంబుల బింకంబు లడంప
ఆము ౪ ౩౫

విణ ౧ దృఢమైనది గుల్లకానిది
సీ పొలయల్కఁ దలఁపులఁ బులకించుఁ బుల
కించి బింకంపుఁ గౌగిళ్ల బిగి భజించు
కావ్యా ౩ ౧౨౨

సీ కరిమూలరుచుల బింకపుఁబంకజాక్షులు రమ
ణతో వింజామరములు వీవ వి పు ౧౧౭

౨ బిగువైనది సడలనిది
చ పెళపెళ లేని-చీరఁ గటి బింకపుఁ జన్నులఁ
జేర్చికొంచు మనుచ ౫ ౬౭
వ ఇరుగెలంకులఁ గుంకుమపు ముంకుల పెదజల్లు
బింకపు చంకల పొంకంబును
ప్రబంధ ౭౭

జ బింకపెక్కు

బింకపెక్కు అ క్రి (బింకము + ఎక్కు)
నిక్కు పైకిలేచు
కు మును సౌరభ్యము నివ్వటిల్లఁగ మనో
మోదంబునన్ దేటు లల్లన రొలిన్ జెడ
లంగ రేకులు సముల్లాసంబునన్ బింక
మెక్క భార ఉద్యో ౨ ౧౧౦

బింగన్న. వి (బింగి + అన్న సం భృంగి)
ప్రమథగణములలో నొకఁడు భృంగిరిటుఁడు
సీ బగిని బింగన్న కోడిగములు వీక్షించి హాసం
బుతోఁ జేయి ప్రేసి ప్రేసి
వరాహ ౧౧ ౧౦

బింగము[1] = బింకము విణ దృఢము గట్టిది
ఉ బింగపురాలు గా హిమము పేరిన యగ్గిరి
స్రోత దుర్వహోత్తుంగకటీరుచాలసవతుల్
తురగాస్యలు సంచరించుచో
పి శకుం ౨ ౧౦౭

బింగము[2]. వి అభ్రకము (చి ని)

బింగీలు వి బ గుంజిళ్లు (చూ బింగీలుపెట్టించు)
జ బింగీలుపెట్టించు

బింగీలుపెట్టించు స క్రి (√బింగీలు) గుంజిళ్లు
పెట్టించు
గీ నన్ను బింగీలుపెట్టించునాఁడె యయ్యో,
వారు నిద్రింపఁగాఁ జూచి చేరి యచటి,
చింతచ్రేల్కొమ్మ వంచుక పిగఁదఁ గట్టి,
విడిచి యురికితిని హంస ౩ ౧౭౪
(బింగిళ్లు పెట్టించుట అని ప్రా)

బింగురాజు. వి కాకికంటె నల్లగాను చిన్నది గాను నుండు పక్షి విశేషము (బ్రౌ)

బిందము[1]. వి (సం బృందమ్ కు బిందు) సమూహము గుంపు

గీ బింద మై పూచి ఎర్విన కుందలతల తోన కడములు పూచె కు సం ౭ ౪౭౧

గీ గట్లు కౌఁగిలించి సంద్రముల్ గలఁయఁ బాలు కోఁతి బిందము లారాముఁ గొలుచుఁ బొమ్మి అచ్చ రా సుం ౧౫౮

బిందము[2]. వి (సం భిన్నమ్) ఉపద్రవము ఆపద

గీ రతిరొయిలుం గగు నది వలరాజు పేరు చెప్పి పనకాడు నదిరేమి చిత్ర ముగ్గు కొయిదఁ దడ కెద్ది మరుఁడు దండెత్తి బోవఁ బోవ నడుమను బిందంబు పుట్టై నొక్క కు సం ౫ ౫౭౪

చ నడు మసదు ఆడు గిడుచోటఁ గాల్ దమలినంత నకొనుకు బింద మర్యొదున్ కు సం ౮ ౧౭

బిందించు. సం స క్రి ౧ (నీళ్లు) చల్లు నిషే దించు

(మధుపానవర్ణనము)

సీ వింధ్యవాసిని కేకవీరకు మున్నుగా నెల్ల వేల్పులకు బిందించి మ్రొక్కి ద్వా ౪ ౭౩౪ (రెండిటి కిదియె యుదాహరణము)

౨ (వానచినుకులు) చిలుకు

(వ్యవ) ఆర్ద్రిబిందించిన ఆయువదిరో బాలు వలువు

బిందియ = బిండె. (కు బిన్దిగి) బిందె

చ తామరకంటి యొకర్తు కేటకౌన్నెల పటి కంపు బిందియల నించిన గొజ్జంగి పూవు నీటిచేఁ, దలఁగడిగెన్ యయాతికి యయా ౪ ౮౭

మ జలముల్ తెచ్చిన హైఁడిబిందియల మెచ్చం బోని ఘర్మాంబుకందళపుం జన్నుల మిన్న కుభల ౫ ౯౦

బిందీ. వి (సం బిందుః) చేరుచుక్క లలాట భూషావిశేషము కృష్ణా ౩ అ (శ ర బ్రౌ)

బిందుచిత్రకము సం వి అ పుం బొట్లుదుప్పి ఒక విధమగు జింక

బిందుజాలకము సం వి అ న ౧ బిందుసమూ హము ౨ ఏనుఁగుతొండము మీఁది మచ్చలు

బిందుతంత్రము సం వి అ పుం ౧ చద రంగము చతురంగక్రీడనము ౨ నెత్తపలక శారిఫలకము ౩ పాచిక పాశకము

బిందుపత్రము. సం వి అ పుం బుజపత్రి భూర్జపత్రము ‡

బిందుఫలము. సం వి అ పుం ముత్యము (విల్యమ్సు)

బిందురేఖకము సం వి అ పుం ౧ అను స్వారము ౨ ఒకజాతి పక్షి

బిందువు. సం వి ఉ పుం ౧ బొట్టు ౨ సున్న ౩ ఏనుఁగు దేహమునందలి మచ్చ ఏనుఁగు దేహముపై చిత్రించిన వన్నెచుక్క ౪ (క్షేత్రగణిత) స్థూలత్వ దీర్ఘత్వములు లేకయు లక్షింపరాకయు ఉన్న వస్తువిశేషము ౫ అను స్వారసూచకమగు రేఖాభేదము ౬ దంతక్షత విశేషము ౭ భ్రూమధ్యము ౮ (నాటక) అర్థప్రకృతభేదము (బీజము బిందువు పతాక ప్రకరి కార్యము అను అర్థప్రకృతులలో నొకటి బిందువు అవాన్తరార్థమునకు విచ్ఛే దము కలుగఁగా దానికిఁ గథ యందు మఱలఁ గూర్పు గలిగించునది) ౯ నాదజన్యమును క్రియాప్రాధాన్య లక్షణమును అగు చిచ్ఛక్తి యొక్క అవస్థాభేదము ౧౦ బీజభేదము ౧౧ లవము లేశము ౧౨ అవయవము ౧౩ శుక్రము (శ ర)

బిందుసరస్సు. సం వి స్ న ఒకానొక సరస్సు

బిండె = బిందియ. వి గొంతు సన్నముగా నుండెడు లోహపాత్ర విశేషము

చ. పొలఁతి మొగంబు చందురుని మెచ్చఁ
గుచంబులు కుందనంపు బిం,దెలకగు సంప్ర
తుల్ చను ౨ ౪౨
సీ. కాంతాపరాధులఁ గౌముది నడికింపఁ
బెట్టిన పటికంపు బింద యనఁగ
పి. శకుం ౩. ౧౭౨.
సీ. తామ్రాది భాండముల్ దనరు బింద
యనంగ అం భా ౨. ౨౪౫

బింబ. సం. వి. అ స్త్రీ దొండతీఁగ ‡
బింబజ. సం. వి అ స్త్రీ దొండ. ‡
బింబటము. సం వి అ పుం ఆవ, సర్షపము ‡
బింబఫలము. సం. వి అ. న దొండపండు
బింబము. సం. వి. అ పుం న ౧ (చంద్ర సూర్య)మండలము. ౨. ప్రతిబింబము ౩ కమండలువు ౪ అద్దము. ౫ ఉపమేయము ౬ ముఖము ౭ చిహ్నము ౮ ఉపదానము ౯ సామ్యము. (కే ని) (వ్యతి) ప్రతిబింబము పుం. కృకలాసము, ఊసరవెల్లి న ౧ దొండపండు ౨. ప్రతిమ విణ సమానము
బింబి. సం. వి ఇ. స్త్రీ బింబ
బింబితము. సం విణ (అ ఆ అ) ౧ ప్రతిబింబించినది ౨ పటమున ప్రతిఛ్ఛాయఁబడినది
బింబోష్ఠి. సం వి. ఈ స్త్రీ దొండపండువంటి పెదవి గల అఁడుది, అఁడుది
బికారి. విణ. (సం. వికారీ, క బికారి, త పిచ్చారి, హిం. భిఖారీ) ౧ దరిద్రుఁడు, అవిరక్తభిక్షుకుఁడు
సీ కెలయు దరిద్రుండు బి,కారి యం ఏన
ఒరిక్తె నా అం భా ౩ ౧౪.
సీ. అవిరక్తభిక్షుకుఁ డలరును బికిరాలమారి
బికాసి బికారి . అం భా ౨ ౧౭౬.
౨ అప్రయోజకుఁడు, అసమర్థుఁడు.
గీ. కుంటికుదుపు లశక్తులు కుష్ఠరోగు, లంధులును వృద్ధులు బాలు రాది గాఁగఁ, గాకకరుగంగ లేని బికారు లెల్ల, మోక్షమును బొందుదురు గాక దక్షవాటి. భీమ. ౫. ౨౧.
గీ. ప్రయోగమునకు, శుద్ధి గాఁ గూర్పకుంక
విజ్ఞోదు పడఁగ, గణము లూహించి కూర్చు
బికారికుకవి ౧ విసర్పగారుడము. ౧. (శ.ర.)
౩ ధూర్తుఁడు.
సీ ఆశతాయ బికారి యడి బండ గుండఁడు .
హంస ౫. ౧౧౩.

బికాసి. విణ. (సం భిక్షాశీ, త పిచ్చాసి.) అవిరక్తభిక్షుకుఁడు, వైరాగ్యము కలుగని బిచ్చగాఁడు.
సీ అవిరక్తభిక్షుకుఁ డలరును బికిరాలమారి
బికాసి బికారి అం. భా ౨. ౧౭౬.
బికి(క్కి)రము. వి (సం. భికిరమ్.) భిక్షము.
మ అకటా మోహము వోదు స్థండిలశయుండై నీరసాహారవృం,బికిరం బెత్తి చతుర్థవేళఁ దినుచున్ మల్లభూ వై ౧౫
సీ. బికిరముల్ గొను మినుపికి వలంతి .
అచ్చ. రా. బాల. ౬౮.
ఉ నీ,బిక్కిర మెత్తు నయ్య రవ పిల్లలవాడల నింతసేపు నీ,యిక్కువ లన్నియున్ వెదకి రమ్మ నిట వచ్చి లేచి రావయా ..
వైజ ౪. ౩౮.
గీ భిక్షు తిరిపము బికిరము బిచ్చమాయ, వారము ను జోగు నాఁగను వరలు .
అం భా. ౨ ౧౭౫.
జ బికిరాలమారి
బికిరాలమారి. విణ (√బికిరము) బిచ్చమెత్తు స్వభావము గలవాఁడు
సీ అవిరక్తభిక్షుకుఁ డలరును బికిరాలమారి
బికాసి బికారి అం భా. ౨ ౧౭౬.
బిక్క. విణ ౧ బెదురుకలది
ఉ. తేనియ కుండ మోచికొని దిక్కులు నాలుఁగు బిక్క చూడ్కి నే,దేనియుఁ జూచు కొంచు . . కేయూర. ౨. ౧౧౨.
౨. హీనము.
సీ. గద్గదస్వరము బిక్కయొలుంగుతోఁ గూడ
పెలఁగ హరిస్తుతుల్ సేసికొనుచు ..
కళా ౧. ౧౯౮.

౩ విస్ఫారము

గీ. తాన తత్ప్రేతకుల మీఁద కదియు బెట్టు
బిక్క లగు నీదు చేతులు ప్రేతరాజ
శివలీలా ౨

౪ ఖిన్నము

(వ్యవ) వాఁడు బిక్క మొగము వేసినాఁడు

౫ నిఱుపేద (శ ర)

బిక్కి. వి (క బిక్కి) ౧ అక్షోటకము వృక్ష విశేషము (శ ర) ౨ గారచెట్టు (బ్రౌ)

బిక్కిరించు. స క్రి ౧ నిక్కించు తిక్కించు

ద్వి పిలపిలఁ జెవు లల్ల బిక్కిరించుకొని
ద్వి నల ౩ ౨౭౯ (శ ర)

౨ చికిలించు

వ కన్నులు బిక్కిరించి చెక్కిరించుచున్ కొండ కొడుకు లంఘించుచు
వేం మా ౧ ౨౩౦

బిక్కుబిక్కు. వి ఎక్కటిత్వాదులచే మనసునకు కలుగు దిగులున కనుకరణము
(చూ బిక్కుబిక్కుమను)

జ బిక్కుబిక్కుమను

బిక్కుబిక్కుమను. అ క్రి (బిక్కుబిక్కు + అను) దిగులుపడు భయమునొందు (బ్రౌ)

(వ్యవ) ఆ యింట్లో వాఁ డొకఁడును బిక్కుబిక్కు మనుచు నున్నాఁడు

బిగ=బిగ్గ. క్రి విశే ద్రు (చూ బిగఁబట్టు)

బిగఁగట్టు. వి (బిగియన్ + కట్టు) బిగియఁగట్టిన కట్టు

ఉ అమ్మహీ కాంతు నమఁజ్జఁ బెట్టె బిగ
గట్టుల నెల్ల నడల్ప  శుక ౧ ౪౭౦

బిగఁబట్టు. స క్రి (బిగియన్ + పట్టు) ౧ బిగియఁబట్టు నిరోధించు చలింపకుండఁ జేయు

సీ చలన మొందక నిజస్వాంతంబు బిగఁబట్టి
పంచేంద్రియము లడఁగించినాఁడు
కుచేల ౧ ౨౫

సీ స్ఫటికపు దత్తమాలిక చేతఁ బట్టి చిత్తము
బిగఁబట్టి  వేం మా ౨ ౪౧

౨ గట్టిగా పట్టుకొను

గీ జగతిపైఁ బాదములు రెంటఁ జక్కఁ జాఁచి,
పాణులఁ దదగ్రములు బిగఁబట్టి నడుము,
జానువులఁ జేర్చి యున్కి యా సాధుచరిత
తాపసేంద్రులు పశ్చిమస్థాన మంద్రు
కళా ౫ ౧౬౦

వ సురియతోడి కరంబు కరంబు చలంబుతో బిగఁబట్టి వలకేలి కరవాలంబులం దలలు కలుక్కునఁ దెగ నఱకు సురవీరులును
ఉ రా ౪ ౨౭౧

బిగఁబూను. స క్రి (బిగియన్ + పూను) గట్టిగా పట్టుకొను

సీ చని యప్పురముఁ జొచ్చి తన మది మేర్పడఁ
గోల చే బిగఁ బూని తూలికొనుచు
పెన్న ౪ ౧౯

బిగాడు వి బీడు (చి ని)

బిగాది విశే ౧ ధూర్తుఁడు మోసకాఁడు

సీ తెగి గంటి లేనిపోటుగ నొడ్డ నద్దల గిద్దలఁ
బొడుచు వేఁటిన బిగాది
వేం పంచ ౧ ౩౬౩

౨ పిశాచి

గీ ఇప్పుడు గన్గొనఁగఁ బీడ విడిచి బిగాది
యెట్టి నట్టు లయ్యె నింకొచ్చోటి కరుగవలయు
రసిక ౪ ౩౪

బిగి. వి (√బిగియు క బిగి) ౧ అభినివేశము పట్టుదల దురాగ్రహము

క మావులు విల్లును దుముకై పోవఁగ వైచిన
నతండు వాలివోని బిగిన్
అచ్చ రా యు ౧౯౩

క ప్రయుతుని తనయుఁడు తనయుండుఁ బిగి
వదలక యిట్లనియెన్  పాండు ౫ ౨౧౩

క తుటుంతు ను బిగియును గల్ల యు నెఱుఁగఁ
డతం డించు కయిన నెల్లెడలందున్
నీలా ౧ ౪౪

వ తిగిచినఁ బిగి వదలక పయిఁ బడి వైచిన
విడువక  కళా ౩ ౨౬౬

౨ బింకము, దార్ఢ్యము కాఠిన్యము

ఉ కీ, లాడినయంతతోడ బిగి యాడిన
తాలిమితోడ వచ్చె . సుద ౩ ౪
సీ పాలయుల్కఁ దలపులఁ బులకించుఁ బుల
కించి బింకంపుఁ గౌఁగిళ్ల బిగి భజించు
కావ్యా ౩ ౧౭౭
క. మగవాఁడు భాగ్యవంతుఁడు, మగువకు నొ
ప్పుగునె యిట్లు మానవు బిగి గట్టిగఁ దాల్పఁ
దనంతన యూఁడిగ మిటు నటు సేయ
నతని డెందము గరఁగున్ కళా. ౪ ౬౭
చ పగడపుఁ జిట్టులన్ మనికిపట్టుగఁ గట్టిన
పట్టుజీనువుల్, జిగి బిగి మించు చెంచువులఁ
జించినచో రసపూర మూర
వసు ౧ ౧౧౩

విణ బిగువు, దృఢమైనది, కఠినము
సీ పెద్ద తామరకంపు బిగి పట్టియలచేత సాబ
గైన ముత్యాల సోరనములు
యయా ౧ ౯౨
చ ఉరస్థలంబుం జన్నుల నెదు రొత్తి మక్కువ
వనుం బిగి కౌఁగిటఁ జేర్ప వేఁటికేఁ
పారి ౧ ౧౧౨
చ బిగి కౌనులున్ నీలా. ౧. ౩౯.
చ. దాని బిగి చన్నులు దాని పెడంద కన్ను
లున్, దమి తెలయింప ఉ రా ౫.౧౫౫

బిగి(యి)ంచు. స క్రి (√బిగియు) ౧ బిగియఁ
గట్టు, గట్టిగాఁ గట్టు
చ చేలము నడుమ న్బిగించుచు నిలా
నిహితాత్మ శిరః కిరీటుఁడై పారి ౩.౪
సీ కుండ బొజ్జల క్రింద డ్రిండు గా బిగియించి
గడితంపు మడుఁగులు గట్టినారు
సైష ౨. ౬౩
సీ మోలనూలు బిగియించి తెలఁది పొన్నెలఁ
గొచ్చు బిఱుదీయ కోటిలో నుఱుకు కరణి ..
కుసుచ. ౩. ౩౧.
౨. (గడియ మొ.) గట్టిగావేయు, నొక్కు.
గీ తలుపు, మూసి గడియ బిగించెద మోస
పోక, తెల్లవాఱిన మీరది తెలిసికొనుడు...
శుక. ౨. ౧౭౭.

చ. ఆయస,స్ఫురణఁ దవర్చు కోట తలుపుల్
బిగియించ గఁ బంచి . . కువల ౩. ౪.
౩ అదుము, అదిమిపట్టు, గట్టిగాఁ బట్టుకొను.
క. అపుడు హిమాచలకన్యక, త్రిపురాంతకు
కంఠంబున తనదోర్వల్లిన్
ఉ. చుట్టి బిగించి పట్టి పురసూదన యీ గర
ళాగ్నిఁ గంధరా, ఘట్టమునందు నిల్పుము...
భీమ. ౪. ౬౭.
గీ. అట్లు డేర్చుచు సతి నతఁ డపుడు విడక,
కౌఁగిట బిగించెఁ దైపయిఁ గాముఁ డదర
కళా ౪ ౧౦౧
౪ (జడ మొ ) ముడుఁచు, ముడివేయు.
సీ శిరమునఁ గొంజడ లిర వార బిగియించి విమ
లాక్షమాల హస్తమునఁ దాల్చి
ద్వా ౮. ౧౦౩.
౫ (పైఁట మొ ) సవరించు, చక్కఁజేయు.
ఉ బాలిక నాఁటిరేయి పతి పజ్జకుఁ బోయి
పయింట కొంగు కం,గేల బిగించుచు న్నెలను
గోరెడు లేనగు మోము వంచి దశా ౬ ౪౩.
౬ (కోపాదులచే) ముడుఁచు, మూయు.
గీ పెలవులు బిగించి నేత్ర దంష్ట్రికలు మెఱయ .
మనుచ ౪. ౧౧౩
వ అన్నాగవాసంబులు నాగరక విలోకంబునం
జెలరేఁగి మొగంబులు బిగించికొని వేదు
రెత్తిన గతి నరిదిరియుత్తఱ. ఆము. ౪. ౩౫.
౭ నొప్పించు.
క లెక్కఁగొనక నరుఁ గృష్ణుని, నక్కఱఁగ
బిగించి మూర్ఛ నొందించి ధరన్
భై భా. ౭ ౧౯౦

బిగితము. విణ (√ ౧ బిగి ) దృఢము.
సీ. బిగితంపు ముష్టికంపిత రైన యసిధార విమత
కరాష్టులు విఱిచి విఱిచి హరి ఉ. ౭.౧౭.

బిగిబద్ద. వి. (బిగి + బద్ద) రెండు గాడి కమ్ములకు
నడుమ వేయు బిగువు బద్ద (క ర.)

బిగియఁబట్టు. స క్రి (బిగియన్ + పట్టు) కష్ట
ముచే భరపడుచుకొను.

**బిగుతు.** విశే (√బిగియు) గుత్తము, వదులు కానిది (చి ని, శ ర, బ్రౌ)

(వ్యవ) ఈ కడియము చేతికి బిగుతుగా నున్నది

**బిగుమానము.** వి (బిగి + మానము) బింకము, బెట్టుసరి.

ఉ ఈ, యండజరాజయాన కైన యా పురుషుండు వుదన్యుఁ డీ జగన్మండలి నెవ్వఁడంచు బిగుమానముతోఁ బురి కేఁగ నంతటన్ దశా. ౭ ౧ ౫౨ (బిగిమానము అని బ్రౌ)

**బిగువారు.** అ. క్రి (బిగువు + ఆరు[1]) ౧ బిగువగు, దృఢమగు.

ఉ నాకుఁ జే,కామక చేసే నీ నృపతికామిని నాదగు భాగ్య మెంత సా, మ్మైన న దేల దీని బిగువారెడు కౌఁగిటఁ జేరఁ గల్గినన్ శుక ౩ ౫౩౪.

౨ ఉగ్రమగు, భీకరమగు.

వ. అని భంగించి యూర్పులు సందడింప మొగంబు బిగువారఁ గ్రోధ శోకంబులు మనంబునఁ బెనఁగొనన్ ... భార. ద్రో. ౨. ౨౬౯

**బిగువాఱు.** వి (బిగువు + వాఱు) కట్టుత్రాడు, కట్టెలమోపు కట్టుత్రాడు

చ. వల నగు పుట్టగోఁచి బిగువాఱ్లును సుంకపు కాసులు న్విభా,సిలు కరసాన గొడ్డలియుఁ జిక్కమున న్సొరకాయ బుఱ్ఱలోఁ, జలిదియు శుక ౩. ౨౪౫.

**బిగువు.** వి (√బిగియు) ౧ అదుముడు, నొక్కుడు

సీ. పృథులాఁకుశంబుల బిగువులు డించినఁ గొంకక జాడించు కుంజరములు భా. రా యు ౫౧౭.

౨. దృఢత, దిట్టతనము, పటుత్వము

గీ. మురువు కొమ్మని బిగువు కొమ్మది నగవు, వలర నిట్లగు వాలి కొవాలవాల దశా. ౭. ౩౩.

క. మగవానికంటె మానవు గ, మగువ కడలఁ బ్రాయ మంద్రు మానవతి నీ, జిగి బిగువు లంతకంతకు, మిగులఁగఁ బాలు పొందుటకు నిమిత్తముఁ జెపుమా కళా ౪. ౪౭.

౩ బెట్టుసరి

సీ అలుకలఁ దరితీపు లాసలఁ బ్రియములు నగవులు బిగువులు నయము భయము . . కాశీ ౪ ౩౦.

వ ధైర్యంబు కలిమిఁ బ్రాణంబులు పిడికిటం బట్టుకొని పట్ట బిగువున నిలిచిన విలోకించి. వరాహ ౭ ౫౯.

౪. ధైర్యము, దిట్టతనము

మ వలచే వజ్రము బొమ్మలో బిగువు గర్వంబుం బ్రమోదంబు మీ,సలలో నవ్వు నొయారముం జెలఁగ నుత్సాహంబుతోన్ దశా. ౪. ౪౭.

వ బింకంబులు సడలక బిగువులు దక్కక బిరుదులు స్రుక్కక . విక్ర ౪. ౯౭.

గీ. దిట్ట మతిది బిగువు నాఁగ ధృతికిఁ బేర్లు. ఆం. సం మాన. ౫౭

౫ గర్వము.

మ ఒలు మీసల్ వడిఁ గొల్పుచున్ బిగువుతోఁ బౌలస్త్యుఁ డేమంటి వౌ,వలసల్ దీసెకే యూర్ధ్వలోకములు దేవర్షీంద్ర నావు డున్ ఉ. రా. ౫ ౨౦౦.

గీ బీర మనఁగను బిగు వన బింక మనఁగఁ, బరగు గర్వంబు ఆం. భా ౨ ౨౨౧.

౬ గర్వోక్తి.

మ. జగ మెల్లం గొనియాడ నప్రతిమదోస్సంపత్తిఁ బెంపొంది యా, తగవుం గానక పిమ్మటన్ జెడఁగ నై దర్పించి తెల్లప్పుడున్, బిగువు ల్వక్కాడు పారెసారెకు ... హరి. ఉ ౭. ౧౯౫.

క. అడుమ నీ బిగువులు వో, నాడుము పలుకులకు నేమి యది గాకున్నన్ వాల్మీకి. ౩. ౫౬.

౭. బింకము, బిగి.

క తొఁగ నిండ ఫాలనయనుఁడు నగ చాపము
దిగిచినపుడు నాగేంద్రుం డు బ్బిగువున
మొగంబు లదరుటఁ బోఁగ లెగయఁగ
విషము భోగులు భోగులునఁ గ్రక్కెన్
భీమ ౪ ౧౩౭

శా క్రాటితో కొలిచెదు ఒకజాతి కొలఁత
(శ ర)

విశ ౧ గంభీరము

వ ఈ రెండు క్రూర కర్మంబులకుఁ గర్ణునిఁ
గడికండలు సేయక కాంతిం బొంద నేర్తునే
యని బిగువు కొలుంగునం బలికి దిగ్గన లేచి
భార ద్రో ౫ ౨౫౩

క ఆ సెలవున నర్ధనికల పీనులకుం దోఁచుకేచి
విధినందన సై మానిక నాయకకృత ఘుంటా
నాదము నృహరి బిగువు నగవుం బోలెన్
పాండు ౩ ౧౧౫

౨ గట్టిది దృఢము శిథిలము కానిది

గీ ముదురుఁ దీశెల బిగువు గా మోపు గట్టి
హర ౧ ౨౦

గీ పైఁటలో మరుని బటువు బిల్లక్రియఁ బట్టుఁ
గంచెల బిగువుఁ జన్ను నిక్క
ఆము ౧ ౫౯

బిగువుఁదన్ను. అ క్రి (బిగువున్ + తన్ను)
బిగియు బిగువగు బిగిసియుండు

సీ వలిపె పాఁవడ గ్రుచ్చి వెలయించు నొడ్డాణ
మెగయు కుచ్చిళ్లపై బిగువుఁదన్న
గంధ ౧౪౩

బిగువుకొను. అ క్రి (√ బిగువు) బిగువగు
(శ ర)

బిగ్గ = బిగ్గన. క్రి విశ ద్రు (√ బిగియు)
౧ వదలకుండ దృఢముగా

సీ మొలకట్టు కావెలోపల బిగ్గఁ జెరివిన బలు
తమ్మి కెంపుల బాఁకు మొఱయ
రవిశ ౧ ౬౪

గీ ముందవులుఁగు లకట యులిగి మతి
ముంతు మొద బిగ్గ సులిమి చంపె
కేయూర, ౩ ౩౪

ఉ ఇగ్గాదు పెన్మకుం బయికి నీడ్చినఁ బైఁటఁ
దొలంగఁ జేయఁ గే లొగ్గదు కమ్మ పోఁక
ముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండు
కొంగులుం బిగ్గ నడంచుచున్ విడిచిపెట్టదు
బాల నవం బ కేమి విజ వి ౨ ౩౦

౨ గట్టిగా బిగ్గరగా

ఉ అనత మూలి రై యటులు ప్రార్థన సేయు
మునీంద్రు కాంబరీ మానుష వేషధారి దయ
మాన మవన్థిస్రతి బిగ్గ నవ్వుచున్
పాండు ౪ ౧౧౨

గీ బంగారుఁ దగటు దుప్పటి బిగ్గ మొలఁ
జుట్టి నీల ౧ ౬౧

బిగ్గఁబట్టు. స క్రి (బిగ్గన్ + పట్టు) దృఢముగా
పట్టు గట్టిగాపట్టు

వ విషయంబుల వెంట వంటి పాఱెడి యింద్రి
యంబుల బుద్ధి సారథు లై మనో నామకంబు
లైన పగ్గంబుల బిగ్గఁబట్టి ప్రొంగ్గం దిగిచి
భాగ ౨ ౧౨

ఉ ప్రియుండు పాదమ్ముల బిగ్గఁబట్టి విశిత
మ్ముగఁ బీడిత నామధేయ బంధమ్మున
మన్మథావాశము దా నొనరింపఁ గ
రాజశే ౩ (చి ని)

బిగ్గన = బిగ్గ. క్రి విశ ద్రు (√ బిగియు) ౧
గట్టిగా దృఢముగా

సీ కరము బిగ్గనఁ బట్టి కట్టిన వల్లియ యూడిని
వ్రాలినఁ గాంచి విడిచి పుచ్చి
వీర ౨ ౨౬౪

ఉ రాఘవుఁ డపూర్వ్యపు బన్నె పదిండి దుప్ప
టిన్ బిగ్గనఁ జుట్టుకొంచుఁ దగుపెద్దలుఁ
దమ్ములుఁ వెంట రాఁగ సుద ౧ ౯౨

౨ బిగ్గరగా ఉచ్చైస్స్వరముతో

మ ఘనసంతోషభవాశ్రు లై శివశివా కాశిపతి
యందు సు శ్వనినాదంబుల బిగ్గనం బలు
కుచున్ గాంధారి మాంధారికేశను
మల్ల ై ౬౫

బిగ్గర. క్రి. విశే. ద్రు. (√బిగియు.) ౧. గడుల కుండ, దృఢముగా.

సీ. కొంగు బిగబట్టు కాసె లోమురళి కావాళంబు కొనివి బిగ్గర దిండు కెవంచి కట్టి
రుక్మా ౧. ౧౨౪.

క. డిగ్గన యగ్గజగామిని, నగ్గలికన్ సరసి లోని కధిపుఁడు తివియన్, బెగ్గడిలి కరయుగ మ్మున, బిగ్గర కొడ కౌఁగిలించి బెగడఁగ నగుచున్.
ఉ రా. ౭. ౯౦

సీ. కౌఁగిళ్ల బిగ్గరఁ గదియించి మేనుల నిరువుర చేతుల కెలమి నలమ యయా. ౫. ౨౭.

చ. దిటమగు చెల్వముస్ గొనముఁ దేజను గల్గిన ముద్దు గుమ్మకుం, దటుకున నొక్క పాల సునిఁ దారిచి బిగ్గర నంటఁ గట్టి
నీలా. ౧ ౧౧౦

౨. ఉచ్చైస్స్వరముతో, గట్టిగా

(వ్యవ.) అంత బిగ్గరగా మాటలాడకు, నలుగురను విందురు.

బిచ్చగాఁడు. విశే (బిచ్చము + కాఁడు ) బిచ్చమెత్తుకొనువాఁడు

గీ మగనికంటె కొరుగు వగలాఁడి కిరసత్తి, బలుగ యాళి పొరుగు పాలి జాలి, మందులాఁడి చెడుగు మానవి బూతంబు, పిసిఁడి బిచ్చగాండ్ల కెన్నుగుదియ. చెన్న. ౨. ౨౪.

బిచ్చన. విశే. దృఢము.

వ సేవకోన్నమితంబు లగు నిచ్చలపు బిచ్చన గచ్చుటరిగల నీడల జాడల సర్వాభరణ మణి కిరణ జాలంబు తరణిఘృణుల నవలఁ ద్రోయ ..
ఇందు. ౧. ౧౩.

బిచ్చము. వి. (సం. భిక్షా, ప్రా. భిక్ఖా) భిక్ష, తిరిపము.

గీ. భిక్ష తిరిపము బికిరము బిచ్చ మాయవారము ను తోగు నాఁగను బలులు ..
అం. భా. ౨. ౧౩౫.

గీ. తోలు కట్టుక తిరుగు బిచ్చాల కివుని...
దశా. 3. ౫౭.

పా నీ బిచ్చాని కొరదండము లేఁపితి దొంతరయ్యా!

విశే అత్యల్పము, క్షుద్రము.

(వ్యవ) బిచ్చపుఁ గూటికి పేదతికమా?

జ బిచ్చగాఁడు, బిచ్చము లెత్తు.

బిచ్చములె(మె)త్తు. స. క్రి. (బిచ్చములు + ఎత్తు) యాచించి పుచ్చుకొను

సీ. సంతలోఁ బ్రత్తి బిచ్చములెత్తి నూకొలు వగల జన్నిదములు వడికి వడికి .
శుక. ౪. ౧౦౯.

బిజెమాడు. అ. క్రి (క. బిజమాడు.) విజయము చేయు, వచ్చు

సీ బిజమాడు దేవర నిజకృపా దృష్టిఁ జెన్నారు నాయిల్లు బిడారు మీకు . .
కాశీ ౧ 3౫.

బిటారము. వి ఒకవిధమగు విలాసము

ఉ బాలనయ్యు నీ, వింతటి జంతకం చెలుఁగ మింతకు మూలము నీకె కావునం, గాంత బిటార మాటి కపి కాంతవుగ మ్మని కాక మిచ్చినన్. సమీర. ౨౨౨.

చ. మొగము బిటారమున్ నుదుటి ముంగురులున్ దలుకొత్తు చూపులున్ ఉ రా ౬ ౯౨.

ద్వి నలువునఁ గ్రొత్త కట్టాణి ముత్యములు, డాలించు సరణి బిటారింబు లొలకటఁ, గీలించు కరణి జక్కర లుప్పతిలఁగ
ద్వి పరమ 3 ౧౩౦ పొ.

ద్వి. రాజిత శైవాల రమణీయ రోమ, రాజిలకల్ బిటారములు వాటింప .
విష్ణు. పూ ౨ (శ. ర.)

జ బిటారి, బిటారించు.

బిటారి. విశే. (బిటారము + ఇ) బిటారముగలది, విలాసవతి. (శ ర)

బిటారించు. అ. క్రి. (√బిటారము) ఒప్పు, శోభించు.

ద్వి. బొడ్డుమానికము కెంపుల బిటారించు నొడ్డాణము నమించు నుదరబంధంబు ...
ద్వి. పరమ. ౨. ౯౪. ౫.

బిటికి. వి దుష్ట స్త్రీ చెడ్డయాఁడుది
గీ చొచ్చి చచ్చిన చండాలుఁ జూచు మాడ్కిఁ
జూడ కల్లంత నోసరించుచు గృహాంత
రాంతభిత్తిక చెంతఁ గంకటికి నరుగు బిటికి
వీక్షించి యప్పటి పెద్దసెట్టి   శం పంచ
౩ ౧౯౧ ('పలువభార్య' అని లక్ష్మీ
నారాయణీయము (ప్రయోగాంతరము లేదు)

బిట్టకబిట్టు = బిట్టబిట్టు  క్రి విశ అకస్మిక
ముగా కటాలున
ద్వి కటకటా శాసించెఁ గాక యత్తవని కాద
బిట్టకబిట్టుగాఁ బడుల్ నచ్చు   బస వు
౬ ౨౫౦ ౪౦ ('శాదేని బిట్టపిడ్గరపడు
ల్వచ్చు' క్రొత్త ప్రతిపా)

బిట్టబిట్టు క్రి విశ ద్రు (బిట్టు + బిట్టు) కటా
లున
గీ ఇది విచారింపకేని కృతీశ్వరుండు పిడుగు
మొత్తినగతిఁ గూలు బిట్టబిట్టు
కవిజ సంజ్ఞా ౩౫
ఆ వచ్చి యాలి మానవతి నోరకన్నులఁ జూచి
బిట్టబిట్టు మరతమునకు వేగపడిన వచట
నలి గాడి దీపంబుఁ జూప యిట్టు లనిరొ
సుదతి ఎతికి   కేయూర ౩ ౨౧౫
ద్వి పెరుఁగు చిక్కెడు శాన బిట్ట బిట్టువివి
ధరణిఁ జెందిన వాఁడె తన కైశ్య మనుచు
ప్రభులిం ౩ ౪౭ పొ ౧౭ ౪౦
ద్వి అర్మిలి నినుఁ గూడ నాపించి నట్టి కర్మం
బునకుఁ దీరుగడ యొద్ది తల్లి బిట్టబిట్టుగ
నొండ నిట్టి దుష్కర్మము
పండితా పురా ౧౮౨ పొ

బిట్టిలు. అ క్రి ప్రాకు ?
వ కూపాకి వెట్లకు నిలుపోపక గుభులు గుభు
ల్లునం బరిభ్రాక్రోడంబునం బడి చేయాడింప
నేరమి నడుగు నట్టి బిట్టిలి యొడ్డునకుం దేలిన
కొండొకడు నాయక వాడీలును
రా వి ౫ ౩౩

బిట్టు. వి ౧ అతిశయము
గీ బెట్టు నిబ్బరము దిటము బిట్టు గాటు మనఁగ
నతిశయ మగును   ఆం భా ౧ ౬౬
సీ ఎఱపట్టు తెలి బిట్టు నోరపట్టు చిఱు చట్టు
ఎల జిక్కు దొర చెక్కు ప్రబలువాఁడు
అచలా ౧ ౬౨
౨ ఔద్ధత్యము గర్వము
చ తతిమి విక్రమఁ దప్పు తనుఁ దాఁకిన నాయకభి
మన్యుఁ డల్గి బిట్టు విలు ద్రుంచి సారథి
వపం దురగంబులఁ జావ నేసి
భార భీష్మ ౨ ౮౦౨
చ కురుబల మే గుడించె నక్కు గోవుల బిట్టుఁ
బట్టు దానిపైఁ బరిగొని శౌర్యస పద యు
బాహుబలంబునుఁ జూపఁ బూని రమే నరి
గద నట్టె   భార విరా ౪ ౨౦
ఉ బిట్టుఱ సొమ్మయిం గెలుపఁ బెల్కుఱ
లేచియు మెట్టి లేచినం బట్టియు నడ్డనం
బుల నపార భుజాబలగర్వ మేర్పడన్
కు సం ౧౧ ౪౧౪
౩ ధైర్యము
క టిట్టిభి కాహంకృతికిం గట్టల్క జనించి
కడలి కడ నొండొకచోఁ బెట్టిన గ్రుడ్ల
హరించెం బిట్టుతీ వీక్షించి టిట్టిభిక గాఢా
త్రిన్   శం పంచ ౧ ౬౨౧
అవ్య అత్యంతము మిక్కిలి
సీ బిట్టు గట్టనఁ బెల్లు పెద్దయుఁ దద్దయు
అత్యంతముగ ననుట శాఖ్యలయ్యె
ఆం శే ౫౪
క్రి విశ ౧ శీఘ్రముగా వేగముగా
మ విరథుం డై పొలిపోని బంటు తనముల్
వేగంబు నొప్పంగ బిట్టు రథంబుల్ డిగు
నప్డు చేతి గద నుగ్గ రాల వేసెన్ ధను
ర్ధరుఁడు   భార భీష్మ ౨ ౫౬
ఉ మానని కోప మిట్లు మది మల్లడి గొల్పఁగ
మింటికిన్ మహా శ్యేనము పోలె బిట్టుగని
రొక్కుడు నక్కున నుగ్రవిగ్రహం డై
పాండు ౪ ౨౯౨

గీ విష్ణుండు వచ్చి పక్షిపతి నెక్కి- పైఁడి
దుప్పటి చెఱఁగు దూలఁగా బిట్టు వాగెలఁ
దోలికొనుచు వరాహ ౭ ౧౧౪

౨ తటాలున అకస్మాత్తుగా

వ ఇట్లు నిషధరాజాచేతం బట్టువడి బిట్టు
మేల్కాంచి యక్కాంచన హంసంబు
నైష ౧ ౧౦౧

ఉ ఆ నినదంబు బిట్టు విని యప్పుడ గార్దభ
రూప ధారులై ధేనుక ముఖ్య రాక్షసులు
తీవ్రగతిం బఱతెంచి వి పు ౬ ౧౯౭

చ విడిచిన నేమి చెప్పనలిభీకర దుస్స్వప్నమునుండ
రీతి మప్పుడ తన నిద్ర మేల్కనిన పోలిక
బ్రాయగుచు బిట్టు లేచి కేయూరం ౨ ౩౩

౩ అధికముగా

స్రగ్ధర చాకుండం బోకుండఁ గౌరవ్యులకు
వశమె బి ట్టుల్కి మార్భిల్లకుండన్
భార ఉద్యో ౧ ౩౨౩

ఉ అత్యుత్తమధీరతాగుణసమున్నతి మేరు
మహీధరంబు భూభృత్తిలకుండు నైషధుఁడు
బిట్టు చలించెఁ గదా తదాహతిన్
నైష ౭ ౯

ద్వి రాజితం బగు నాపరోజలరాశి బ్రాజిల్లు
నాదిఁ జంద్రసమాగమమున బుట్టి తారా
పథంబున వెల్లి విరిసి బి ట్టుబ్బి దెసలకు నిట్టు
గొడుచుడు పండితా వాద ౨౧౨ పా

౪ గాఢముగా దృఢముగా

సీ మట్టియు లొండింటి బిట్టు దాఁకఁగ నేల
నందంద మొనిగాళ్ల నప్పళించు
భార విరా ౨ ౨౫౦

క అట్టియెడఁ బుండ్రనంబును ధట్టించి యదూ
ద్వహులందు దశముష్టిహతిన్ బి ట్టడువ
నయిదు ముష్టుల ఉ హరి ౩ ౬౨

౫ బిగ్గరగా ఉచ్చైస్స్వరముగా

క అట్టియెడ దేవదత్తము బిట్టొత్తె నరుండు
వెక్కు- పిడుగుల బ్రోఁతన్
భార, ద్రో ౩ ౨౨౧.

చ ధీతి బి ట్టు లిరియుచుఁ బోరు సర్తతి
వియోగముఁ బొంది రథాంగ దంపతుల్
నైష రా ౧౫౪

జ బిటుబిట్లు బిట్టువడు

బిట్టుబిట్లు. క్రి విణ (బిట్టు + బిట్టు) తటాలున
ఆకస్మికముగా

ఉ అప్పుడు బిట్టుబిట్లు విభుఁడా తరుణిం గనుఁ
గొన్నఁ బుప్పఁడే రుప్పర వీథిఁ దోలుకొని
యుగ్రగతిం బఱతెంచి భోజరా ౪ ౭౭

మ ఆతని రమే తెంచుట బిట్టుబిట్లు గని కాంత
ల్విస్మయా క్రాంతలై భోజరా ౫ ౬౬

బిట్టువ(ప)డు. అ క్రి (బిట్టు + పడు) తత్తర
పడు కలవరపడు

వ ఇట్టి తెఱంగునం బిట్టువడి గుట్టు చెడి గట్టు
పడిం జేరుటకై యగడతం బడి మునింగి దరిఁ
జేరి రా వి ౫ ౩౩

బిడ = బిడ్డ. వి ౧ కూఁతురు

ఉ చింత రొనర్ప సాగకుము చిన్ని బిడా యని
పాఱఁ ద్రోసి యత్యంత రయంబున నృపులు
తన్గని కొల్వఁగ ధీర చిత్తరై
పార్వ ౪ ౧౦

౨ అ ఈ ఏ అను పదములకు అను
ప్రయుక్తమై స్త్రీయను నర్థమిచ్చును (చూ
అబిడ ఈబిడ ఏబిడ )

బిడము. ౦ అ న అట్టుప్పు వంటఉప్పు

బిడలవణము. సం వి అ న అట్టుప్పు

బిడాబిడి క్రి విణ సత్వరముగా వడిగా

వ కఫాలు కఫాలున చూరణ బడి బడి చెడా
లునఁ జొచ్చి బిడా బిడి సరిబిత్తరుల మిడుకఁ
దతిమి హత్తిన ప్రబంధ ౭౭౭

బిడారము. వి (క బిడార ) ౧ వాసస్థానము,
ఉనికిపట్టు

చ గడిదొర గాన ప్రుచ్చిమి దిగంబడి యప్ప
టికిన్ బిడార మాకిడలిన బంధనంబు శిఖ
నైకొని గాడ్పు సమాన భూతతన్
చంద్రా ౨ ౧౯.

౪ కాన బిడారంపు పామిఁ గన్గొని పలికెన్
అచ్చ రా బాల ౧౪౭

౨ శిబిరము, దండువిడియుచోటు

సీ కదలికొని బిడార మదుగు ముట్టఁ గలంచి
గాలి రజోవ్యాప్తిఁ గాకుచేసి
వసు ౪ ౧౨

౩ విడిది, విడియుచోటు

మ శుభావహలీలన్ విడియించె వారలను
జాళ్వ బల్పిడారంబులన్ ల వి ౫ ౨౫

గీ శార్ఙ్గపాణి రాజసంబునఁ గుండిన రాజ
ధాని డాయ వచ్చిన మునుమున్న పోయి
రుక్మి బాహుఁడు బిడారములు వలుపా
లమర్చి

గీ విడియించి చంద్ర ౫ ౧౩౪ ౧౩౭

**బిడారు.** వి ౧ వాసస్థానము ఉనికిపట్టు

సీ వేలము పాళెము వీడుపట్టు బిడారు విడిది
యుంచ నఁగ నివేశ మువ్వు
అం భా ౨ ౧౯౪

గీ సరగఁ దమఁ జూచు వారి కెవ్వరికి నైన
మలబిడారును మలఁకల నలరు పేరు
యయా ౨ ౪౪

గీ ఈ కెలంది రౌండల్ సైఁడి లో కెలంది యీ
కెలంత లలాటంబు లేసేలంత యీ సుపాణి
రదశ్రేణి రేఁ సుపాణి యీ బిడారు మృగీ
మదశ్రీ బిడారు విజ వి ౧ ౧౩౦

౨ విడిఁది విడియుచోట

సీ బిజమాడు దేవరు నిజకృపాదృష్టిఁ జెన్నారు
నాయిల్లు బిడారు మీకు శాక ౧ ౩౫

వ రాజవాహనుపాళెంబు దిబియించెద నని
చలపట్టి ఒంటిపు కట్ట యుత్తరంపు గట్టున
బారు పెట్టించి పెండు గ దండుగుడారు
బిడారు అంట మూటాలు అంటించి బాణంబు
వరగించిన రా వి ౫ ౨ (సుదూ
రాము అని టీక)

౩ ఉపప, సార్థము, వణిక్సమూహము (శ ర)

**బిడాలకము.** సం వి అ పుం ౧ నేత్రౌషధ
విశేషము ౨ పుముఁగుచట్టము ౩ పిల్లి
న హారిదళము (శ ర)

**బిడాలపదకము.** సం వి అ న పదియాఱు
మాషముల యెత్తు

**బిడాలము.** సం వి అ పుం ౧ పిల్లి ౨ కను
గ్రుడ్డు ౩ నేత్రరోగౌషధము

**బిడాలలవణము.** సం వి అ న ఒకజాతి ఉప్పు

గీ బిడాలలవణ మంటుప్పు చాటుప్పున విల
సిల్లు అం భా ౨ ౨౪౯

**బిడాలవణము.** మి వి ఒకవిధమగు ఉప్పు
(శ ర ద్రా)

**బిడాలి** సం వి ఈ స్త్రీ విదారి ముయ్యాకు
పొన్న ?

**బిడి(డె)యము.** వి (సం వ్రీడా ప్రా విడ్డా)
సిగ్గు (చి ని శ ర)

చ మొగము బిడెంబు చిన్నదుటె ముంగురు
లున్ గరుకొందు చూపులున్ ఉ రా ౫
౨౨ (శ ర పా మొగమ బిటారమున్
ముద్రి పా )

(వ్యవ) క్రొత్తల్లునికి అత్తవారియింట బిడియ
మెక్కువగా నుండును

ద్వి మది బిడియంబు వదలి
ద్వి శ పా (శ ర)

**బిదుగు** విణ (క బిదుకు) బుద్ధిహీనుఁడు తెలివి
తక్కువవాఁడు

క పోగ నుడ్డు కుడిచి మంట న్సగ మరుగం
గాలి రేఁ డ్పుసఁగ నన్నగమున్, ఢిగ నుటికి
దుష్టబుద్ధిం, దెగి తిట్టుచు బిదుగు బదుగు
దేహము విడిచెన్ కేం పంచ ౧ ౪౨౧

**బిదువు.** వి (క బిదుపు బిదపు) అవకాశము
(శ ర)

విణ అవకాశము కలది (శ ర)

**బిడేన.** క్రి విణ ద్రు తటాలున

ఉ అంతట నొక్కచెంచు పంది నింతింతలు
చెక్కలై పడఁ బయిం బడి కొంచు బిడేవ
కాని క్రొవ్వంతయుఁ గాఁచి కాఁచి యచ
టాఁకి చే తను దోఁగినట్లు గాన్
యయా ౨ ౯

బిడౌజుఁడు. సం వి ప్. పుం ఇంద్రుఁడు

బిడ్డ=బిడ. వి ౧ శిశువు

వ బిడ్డలారా యిలాగున నతి తృప్తిపాసాకు
లంబులై కులాయ కూలంబులం గులగులం
గూసెదరు సైం ౧ ౧౧౦

సీ కట్ట నిల్వని చెర్వు గడియలోపల నిండు
బ్రతుకఁ జాలని బిడ్డ బారెడుండు
వేణు ౨౪

అ కూన నిసువు బిడ్డ కుఱ్ఱ పొట్టెఁ యనఁగ
శిశుసమాఖ్యలగు అం ౨ం మాన ౧౨

౨ అపత్యము సంతానము

సీ ఎట్టి బిడ్డనఁగ నపత్యంబు దగు
ఆం భా ౨ ౧౧౧

క నీజసఁ గోపింతుసె కుల ఖేదము గా ఒలుకు
టయును బిడ్డలఁ జెఱుపం గాదని
కినియుచు
భార భీష్మ 3 ౪౪౨

ఉ అంద్రెనుస్ బిడ్డల వెంటఁ బెట్టుకొని భీతిలి
చేరితి మఱ్ఱి క్రిందటన్ ఉ రా ౨ ౨౨౧

3 మగశిశువు కొడుకు

గీ కలిమి జవరాలు సోముఁక కన్నబిడ్డ
దశా ౬ ౬౨

౪ కూఁతురు

మ భూసతీ తిలకంబుం దుదఁ ద్రోవఁ గశ్య
పున కార్తిం బిడ్డ యై పోఁవదే
ఆము ౫ ౪౪

ఉ ఓయి దయావిహీనమతి యూరక యీ పసి
బిడ్డఁ గొట్టఁ గాఁ జే రొటు లాడె నీకు
మను చ ౫ ౨౪

క మాతాపితృవర్జితుఁ డగు, నీతని కే గొట్టు
బిడ్డ నిచ్చితి నకటా . కాశి ౪ ౪౯

బిడ్డ బిడ్డ తరము. పిల్ల పిల్ల తరము వంశపరంపర

అ బిడ్డబిడ్డతరము బ్రతుకుఁ డాశ్రయించి
భీమ ౫ ౨౧

జ బిడ్డపుట్టు బిడ్డతల్లి

బిడ్డఁడు. వి ౧ కొడుకు

సీ బిడ్డనుఁ జేరఁ బిలిచి పద్మాక్షుండు
వరాహ ౫ ౯౪

ద్వి చెన్నయ్య మాతాత చేరము తల్లి ఒన్నయ్య
కక్కయ్య బిడ్డ నే ననుచు
బస పు ౧ ౫౧౦ పం

అ గొడ్డు వీఁగి కన్న బిడ్డండు కవున ఉత్ప
లాక్షి ధూర్తుఁడైనవాని దుశ్చేష్టితములెల్లఁ
నధిపు సెఱుఁగ నీక యడచుచుండు
కాశి ౪ ౨౪

౨ శిశువు

క బిడ్డని గరముల తొమ్మున నడ్డంబుగఁ ఒట్టి
పదము లల్లన యిడుచున్
భాగ ౧౦ పూ ౧౪౦

సీ అంతఁ జాడాకర్మ మాచరించిరి బిడ్డనికి
గృహ్య సంప్రోక్త నియమ పరత
కాశి ౪ ౧3

బిడ్డకుట్టు వి (బిడ్డ+కుట్టు) ప్రసవవేదన బిడ్డను
కనునప్పటి నొప్పులు

క గొడ్రాలు బిడ్డకుట్టే మెఱుఁగున్
హైజ 3 ౧౨౬

సీ గొడ్రా లెఱుంగునే బిడ్డకుట్టనుట మాన్పం
పవా వంధ్యకు నిసు వొసంగి రా వి ౧ ౩౬

చ చెలువకు బిడ్డకుట్లు వలపిల్లఁగ భిల్లపురంధ్రు
లంతలో కాళ 3 ౨౬

బిడ్డతల్లి. వి (బిడ్డ+తల్లి) బాలెంతరాలు, నవ
ప్రసూత (శ ర)

బిడ్డ(డ)=బిడ్డ. వి బిడ్డఁడు కొడుకు
(చి వి ద్రా)

మ పులిగోరుల్ పెర తేనె కస్తురి పొకంబుల్
పునుగు జవ్వాజి పిల్లులు గోరోజన మిఱ్ఱులున్
బిలికిపూలున్ జల్లులున్ మాదిపం,తులుఁ

గుంపేర్లనుఁ జాఱపప్పు గెలవిండ్లుస్ బాణ
వాతంప కట్టలుఁ గ్రైకానుక లిచ్చి బోయ
దొరబిడ్డల్ గాంచి రాఘూవిభుస్
రామా ౨ ౫ (చి ని శ ర పా)
(అంప కట్టలు గ్రైకానుక లిచ్చి బోయదొర
బిడ్డల్ గాంచి రాఘూవిభుస్ ముద్రి పా)

చిత్రపోవు. అ క్రి (చిత్రము+పోవు) చలించు (శ ర)

చిత్రము. వి ౧ విలాసము సౌందర్యము
లయగ్రాహి వృత్త గతిఁ గ్రేవుల్ చిత్ర
ములం దిగిచి మెత్త మెదదు ల్మానవని గుత్త
గొనుచుండఁ భియవృత్తిఁ గల నొప్పెస్
భాగ ౬ ౩౮౩
సీ చిత్రము కులుకు బెడఁగు బెళుకు
హొయ లగలగ విగాస మొప్పుచుండు
ఆం భా ౧ ౧౩౯
సీ తలఁగ్రాలు వోయు చిత్రముఁ దెల్పెడు
చాయఁ గ్రొన్నన ల్దోయిళ్ల కొల దినొంగి
విజ వి ౧ ౧౨౯
సీ వాలిక ముఖికి నెన్నడుము గానఁగ నయ్యెఁ
దనరు నెత్తరుల చిత్రము దరలె
వసు ౩ ౨౦
౨ నాట్య విశేషము
గీ బాల్య సంపూర్ణ భావంబు పాయఁ బాయఁ
దరుణ యౌవన లక్ష్మి నర్తనము సూపె
అధికతర మైన తెర తీసినంత లోన చిత్ర
రము చూపు పాతగత్తివోలె
నిరం ౨ ౯
౩ తళతళ, కాంతివిశేషము (ప్రకాశము అవి శ ర)
వ మగ వేడిస మొత్తంబుల చిత్రంబులు
చిత్రగించుచు వసు ౩ ౧౫౪
రగడ తెలుకు వేడిస మీల చిత్రంబులు గంటె
కొలఁత బెళ్కుఁ గలాద నీదు చూపుల
గంటె దశా ౭, ౩-౨౫ (ప్రా పా)
ద్వి మేలైన చిత్రమ్ములు మిమ్ము వెడిదపు
వాలుఁ గత్తులుగల భయంకరులఁ గింకరుల
ద్వి హరిశ్చ ఉ ౨౪౪౩ ౭౦
విశే ౧ సుందరము చక్కనిది
గీ చిత్రపు గుబ్బ చన్నులు గిరిశ శైఖరిఁ జెన్ను
మీఱె రవిక ౩ ౬౬
ఉ కేళి నీ చంపకగంధి చిత్రపుఁ జన్నుల
మీఁద సుఖించుచుండు
విజ వి ౧ ౭౧
౨ చంచలము
చ సుధాంశు మండలీ సువదన యంచు చిత్ర
రపుఁ జూపుల దంచు లతాంగి యంచు
ప్రబోధ ౪ ౪
మ అనిమేషస్థితి మాన్చు చిత్రపుఁ జూపు
మనుచ ౨ ౩౩
సీ తునిఁగియు మొలచు నద్భుతపుఁ గన్నుల
విల్లు తనకుఁ దా మెఱయు చిత్రపునారి
రవిక ౪ ౭౪
౩ సరసము విలాసము గలది
చ మలయజగంధి చిత్రపు మాటలు వీనుల
సోకినంతనే అని ౨ ౨౪

చిత్రపుపాటు సరసత
గీ నుడువులో నారజంపు చిత్రపు పాటు
బొమ్మలో బిగువు సొగడ సేఁగు నాకారి
వెంట నయ్యె నెమ్మె కాఁడు కువల ౫ ౫
(చిత్రపుపాటు ముద్రి)

చిత్రపుఁబనులు. మన్మథ క్రీడ
వ వెన్నెల పులుగుల మొత్తంబుల చిత్రంబుం
ఒనులకు మెత్తఁబడి నీల ౩ ౧౦
జ చిత్రపోవు చిత్రములాడు చిత్ర[1]

చిత్రములాడు. అ క్రి (చిత్రములు+ఆడు)
వ్యాపించు
సీ శరదభ్ర శుభ్ర నిర్మల దేహనిస్ఫుర ద్గాత్రధర్మ
ములు చిత్రములాడ వి పు ౩, ౧౦

బిత్తరి¹. వి (క బిత్తరి, బిత్తరము + ఇ³) శృంగార చేష్ట గల యాఁడుది, విలాసిని, ఆఁడుది, స్త్రీ

క. ప్రాయపువాఁ డట సదృశ, శ్రీయుక్తిం దలిర్చుబిత్తరి న్నీవు నఁట యా, హా యాతని యాత్మ యినుమో, ఆరయో కులిశంబో చెలి దొలఁగక యుండవ్ ప్రభా. ౮ ౮౭

క. గత్తంపు గుబ్బ లురమున, హత్తుగ సరి యాని యాని యా రసికుండున్, బిత్తరియును బెనఁగిరి కళాం ౩ ౧౦౭

ఉ. బిత్తరి యోర్తు ముత్తియపుఁ జేరు వలగ్నమునన్ ఘటించి .. వసు ౬ ౧౮

గీ. గోతి బిత్తరి యుగ్మలి కొమ్మ కల్కి, మడఁతి జోటిక ముద్దుగుమ్మ యన స్త్రీ సమాఖ్య లం చనఁ గాను జెన్నలరుచుండు

అం. భా. ౨. ౧౦౮.

విశే. మనోహరమైనది.

చ. హరు సెఱుఁగింట భ్రమంచిన లతాంత శరున్ భవదీయ మైన బిత్తరి కడకంటి చూపులు సదా సృజియించు ననేకమూర్తి గా ..

వరాహ. ౧౧ ౩౪.

సీ. హురుముంజి ముత్యాల యొరగు పాగ మెఱుంగు నొసలి బిత్తరిబొట్టు ముసుగు వేయ .. సారంగ ౬ ౪౯

బిత్తరి². వి మల్లబంధ విశేషము.

చ. సరిగ సలాము చేసి ముడిసన్నపు ద్రాళ్లు ధరించి మల్లురై, బిరబిరఁ దానకంబు లిడి పేర్కొని మీసలు దువ్వి బిత్తరిన్, జొర వరుఁ జొచ్చి త్రేసి బరి చొంగణ సీసము శక్తిచే బయున్, గరవశమున్ నృసింహ మను గైకొని జెట్లను గాంచి కెంబడిన్.

ప్రబంధ. ౭౧.

క... యారసికుండున్, బిత్తరియును బెనఁగిరి సరి, బిత్తరులం బిరుదు జెట్లు, పెనఁగిన మాడ్కిన్. కళాం. ౩. ౧౦౭.

బిత్తరించు. అ. క్రి (√బిత్తరము, సం. విస్తారః, క బిత్తరిసు) ౧ వ్యాపించు, ప్రసరించు.

సీ. వేణీభరములపై విహరించు విహరించి బింబా ధరములపై బిత్తరించు .

గీ. నారాయణాస్త్ర వహ్ని. భీమ. ౮. ౧౮౦.

౨ విలసిల్లు, ప్రకాశించు, తళతళలాడు

సీ. కలికి కొమ్మావి నిగ్గులు పర్వరా లెల్ల బింబ ఫలచ్ఛాయ బిత్తరింప సుద. ౫ ౨౩.

ద్వి. పడఁతి వర్షాకాల పతి వాఁగ వందు, కొడుకు సంపదల మైఁగొని బిత్తరించు ..

ద్వి పరమ. ౫ ౩౯౭. పా.

గీ. నృత్తవేషంబు మిక్కిలి బిత్తరింప, వచ్చె నూర్వశి సకియ లిర్వంకఁ గొలువ .

వాల్మీ ౩. ౩౦.

ఉ. అన్నవ కానుదీఁగ యని యాడఁగఁ బయ్యెదఁ బిక్కటిల్లుచున్, జన్నులు తొంగ లింప మరుపావను దిద్దిన రూపులో యనన్, గన్నులు బిత్తరింప వైం.రా. ౧. ౧౩౮

చ. అరరొరడించి పైచిన శయంబుల కత్తులు బిత్తరింపఁగా, నరిగెల బంట్ల చా లరిగె నప్పుడు చప్పుడు గుప్పులింపఁగన్ . .

రావి ౨. ౫౮.

౩. అతిశయించు.

గీ. చిత్త మిగురింప వేడ్కలు బిత్తరింప, నవ యవ్వంబులఁ బులకంబు లంకురింప

వరాహ. ౧౧. ౧౦.

వ. .గొజ్జంగి నీటి సెత్తావి బిత్తరించు గంధపొడి పొలుపును భీమ. ౧. ౧౧౪.

౮. చలించు, ఊఁగాడు, అదరు.

సీ. కడుకునొజ్జ మై లైన కర్ణపార్శ్వంబులఁ బెనుపాఁప పోఁగులు బిత్తరించు ...

భీమ. ౩. ౧౯.

గీ. పిక్కటిల్లిన చనుకట్టు బిత్తరింప .

పాంచాలీ. ౨. ౧౩.

౫ పరసమాడు.

సీ చిందు లేనియలును లెమట చిత్తడియును
గ్రొత్తావిఁ దమలోన బిత్తరింప పి శకుం
౨ ౫౧ (మిళితమగు అని భావము)

సీ మద్రికా మాణిక్యముల దీప్తి కెంగేలి
పించెంబుఁ గుంచెతో బిత్తరింప క్రీడా
౩౪ (మిళితమగునని భా)

౫ తహతహపడు

వ అని యిత్తెఱంగున నమ్మెఱుంగు బోఁడి
బిత్తరించుచుం గ్రొత్త వలవంతలఁ దత్తఱిం
చుచు నీలా ౨ ౧౧౭

బిత్తల వి దిసమొల (శ ర చి ని)
(చూ బిత్తలి)

జ బిత్తలి

బిత్తలి విణ (బిత్తల + ఇ) దిసమొలవాఁడు
దిగంబరుఁడు దిగంబరి

అ పుట్టు బిత్తలివలెఁ బోవు బిత్తలివలెఁ దిరుగు
బిత్తలివలె దేహి ధరణి నున్న నాఁటి కైన
నుపకారి కాలేఁడు వేమ ౧ ౫౦

అ అత్తఱి బిత్తలై ఘన ముదాత్తను చిత్తపు
మత్తులో నన బిబ్బిత్తరి కత్తరింపక యు
పేర్కొని వాకిలి దీసి హంస ౨ ౫౨

గీ రాజముఖులార శుక్రవారమున బావ్యా,
జలముల మునింగి బత్తి బిత్తలి రై రావిఁ
కౌఁగిలించిన మా కెల్ల కార్యసిద్ధి కలుగ
దశా ౯ ౫౯

బిత్తెడ వి చక్కిలములు మున్నగు భక్ష్యములను
వేఁచెడు పాత్రలోనుండి పైకిఁ దీసెడు సాధన
విశేషము

సీ చనుమ బిత్తెడ యన శష్కులికాప్రముఖ
సముద్ధరణ సాధకావ్వయంబు
అం భా ౨ ౨౪౪

బిదలము. సం విదలము భిక్షాపాత్రము

బిద్దము. విణ (సం భిన్నమ్) ౧ బ్రద్దలైనది
భిన్నము

ఉ దక్షు కూఁతురి నఖాంకురంబుగన్
బిద్దము చేసె పైపసగము నిండని గర్భముతోడ
యండమున్ కాశీ ౫ ౨౧

౨ వేఱైనది అన్యము

ఉ ఆకృతియం దొక లేశమాత్రమం బిద్దము
గాక నీకుఁ బ్రతిబింబము వోలె వెలుంగు
చున్న నీ పెద్ద కుమారు
పి శకుం ౪ ౧౨౪

బిద్దు. అ క్రి చచ్చు

మ సింగముల్ కడగొట్టైన మనుబిడ్డ గంటు
గొను జంకల్ బిద్ద దొరంగిటుల్
సారంగ ౧ ౧౦౪

అ పెద్ద నిద్దురవోరు బిద్ద దొరెను గంటు
గానిరె వనుట పేళ్లగును మృతునకు
అం సం మాన ౫౩

బిద్దె(ద్దియ). వి నరకము దుర్గతి (చి ని శ ర)

సీ బిద్ద బిస్త యనంగ వెలయు దుర్గతి
అం భా ౧ ౧౫౦ (బిద్ద బ్రా)

బిద్దెము. వి ఆట (చూ బిద్దెమువాఁడు)

జ బిద్దెమువాఁడు

బిద్దెమువాఁడు. వి (బిద్దెము + వాఁడు) ఆట
వలన జీవించెడి యొకానొక జాతివాఁడు

వ బోగమువారును దేవనాటకపు జంగాలును
జంగాలు బిద్దెమువాండ్రు తెల్లగొల్లబత్తులు
విపసత్తులు బత్తులు పల్నాటి వీరులు
హంస ౩ ౨౭

బిబ్బిలికాయ. వి ఆభరణ విశేషము అందుదాని
కాలి మూడవ వ్రేలి నగ

సీ కలుకుఁబిల్లాండ్లు బిబ్బిలికాయలును మట్టియలు
వీరముద్దలు నందియలును కళా ౪ ౫౭

సీ వీరముద్దా నా మట్టె యనఁగఁ బిబ్బిలికాయ
నాఁ బిల్లాణి యనఁ జెటి బొద్దు నాఁగను
గ్రమంబుగఁ బదాంగుళీ విభూషలు
అం భా ౨ ౧౫౯

బిబ్బీ. వి (హిం బీబీ) తురుష్కస్త్రీ

సీ. ఎదలపైఁ జొదలు పయ్యెదలు జాఱఁగ
  జాఱు బిబ్బీలకు ముసుంగుఁ లబ్బఁ జేసె.
  వసు ౧ ౪౭
క. నిబ్బరపుఁ గలికి చూపులు, జబ్బించుక లేని
  యొడలు సన్నపు నడుమున్ మబ్బుకురు
  లుబ్బు నగవులు, బిబ్బీలకుఁ గాక కలవె
  పృథివీస్థలిపై  వీర 33
సీ. భర్తృజామాతృ సోదరభ్రాతృ దులాదిలో
  వ్రాలుట కొఱలు బిబ్బీల కతన.
  రంగా 3 ౨౩౭

బిబ్బీ². వి. తోరణము (శ ర) (చూ మకరబిబ్బీ)

బిబ్బోకము. సం. వి అ పుం ౧ నాయికకు గర్వాతిశయముచేత ఇష్టవస్తువునందును కలిగెడు అనాదరము. ౨ గర్వము వలని యనాదరము. 3. విలాసము, శృంగారచేష్టా విశేషము.

బిభిత్స. సం వి అ స్త్రీ. భేదించునిచ్ఛ

బిభిత్సువు. సం. విణ. ఉ. భేదింప నిచ్ఛగించువాఁడు.

బిభీషకము. సం విణ. (అ షి కా అ) భయ పెట్టునది

బిభీషిక. సం వి. అ స్త్రీ. ౧ బెదరించుట. ౨. భయము.

ఉ. కృష్ణుఁ జేపట్టి బిభీషికల్ ధరణిపాలుర కిప్పుడు చూపితి . భార. సభా. ౨ ౪౦

బిమ్మిటి. వి. ౧. పారవశ్యము, వివశత (నిర్ధారక ప్రయోగములు లేవు)

క కడిమిం దాఁకిన యురవడిఁ, బిడుగడఁచిన
  భంగి నైన బిమ్మిటి తోడన్, సుడివడుచు
  నుండి కొండొక, దడవునకుం దెలిసి
  భా. రా సుం. ౨౯.

చ. తెలఁత యొకర్తు. గ్రుక్క కరంబు
  బిమ్మిటిం గలఁగి పొరింబోరి న్వడఁకు నైవడిఁ
  గావఁగ నయ్యో నయ్యోడన్ నృసిం. 3. ౯౭.

ఉ ..గజంబు గజంబును డ్రొబ్బు నైవడిన్,
  భేదిల డ్రొబ్బ నయ్యసుర బిమ్మిటి నొంది
  చెచ్చు... భాగ. ౧౦. పూ. ౧౧౪3.

౨. మిఱుమిట్లు గొనుట.

ఉ. కాంచి విరించి నందనుఁడు కన్నులు బిమ్మిటి
  నొంద . పాండు. ౨. ౧౯౦.

విణ దుర్ధర్షము, తిరస్కరింప శక్యముగానిది

క. కరికోటికి బిమ్మిటి యై తక్కరవాల
  కరాళఘాత కరినత పేర్చెన్
  హరి ఉ. ౩. ౨౦౯.

గీ. తనకుఁ బిమ్మిటి యైన యర్జునుని బాహు,లీల
  నమ్మోయిఁ ద్రోవంగ లేక
  భార. కర్ణ. ౧. ౩.

జ. బిమ్మిటిగొను. బిమ్మిటిపోవు.

బిమ్మిటిగొను. అ. క్రి. (బిమ్మిటి + కొను) వివశత్వము నొందు

ఆ విపుల శోక జలధి మునిఁగి, పేర్చు తల్లడ
  మున బిమ్మిటి గొనియెడుఁ, జిత్త మింక
  నేమిసేయు వాఁడ. భార. ద్రో. ౨. ౧౪౩.

ద్వి భూకాంతులు పాదమ్ములు సడలి,
  బిమ్మిటిగొని లోన భీతిల్లి రంత
  అ మ క ౫. ౨౩3. పొ ౨౭. పం.

బిమ్మిటిపోవు. అ. క్రి. (బిమ్మిటి + పోవు) ౧. మూర్ఛిల్లు.

చ అంగదు నా ప్రజంఘుఁడుం, బిడికిట
  బిట్టుగాఁ బొడవ బిమ్మిటిపోవుచు దేరి
  భా రా. యు. ౧౧౯౨.

౨ వివశత్వము నొందు (శ. ర.)

బియ్యము. వి (సం బీజమ్, ప్రా బీఅం. క చేయ) (ఈ శబ్దము తఱచుగ నేకవచనాంతంబ గానంబడియెడి) తండులములు, వడ్లు దంచి చేఱఁగగా గలుగు పదార్థము.

గీ బియ్య, మునఁగ జాత్యేక వచనమై యమరఁ
  దండు,లము దనరు ఆం.భా. ౨.౨౫౩.

ద్వి బియ్యంబు సయితంబు పెసలు నువ్వులును,
  నెయ్యొ తెఱఁగున. అచటఁ బోయింపు...
  రం. రా ఉ ౧౩౪ పొ. 3. పం.

సీ కలని వణిక్పురోధల తోడఁ బుణ్యాహమున
  బియ్యములకునై పొత్తులాడి ..
  అమ. ౫. ౭౯.

వ గురుజనంబు లేమలిన సందడిం బడి యప్పు
డంతి బుడిబుడి నడలతో నగరరక్షాధిక్షేప
దక్షం బగు సాహసంబు ఎవోయంబుగా
సముయస్థల పరణిం గైకొని శుక ౩ ౩౦౨

౩ కృత్రిమము తెచ్చిపెట్టుకొన్నది

క ఒడలు వసివాడ్డ వాడక్ జడయూర్పు
విగిడ్చి పెల్లగె కరాంబుజ మరెయ్యెడ మాంది
లేచి బడిబడి బుడిబుడి రేడుపు లెసంగ
భూవరుతోడక్ సారంగ ౨ ౨౧౫

క అడుగులు పుడమిని వడి నిడి గుడుగుడు
మని నడచి కొట్టుకొని ఎడి నాకిల్నదుము
గొని బెణక నంచని బుడిబుడి రేడ్పులను
క్రమము వొంది రీతిన్ పార్వ ౪ ౧౨౩

ద్వి చిడిముడి మానముల్ చికిలించుటలును
బుడిబుడి జపములు ఫ్రూస లెన్నుటలు
పండితా దీక్షా ౫౭ పా

౪ అల్పము కొంచెము

ద్వి కిదుకుచుఁ జిన్నికెంగేలఁ జైకొంగుఁ గది
యించి బుడిబుడి కన్నీరు దెచ్చి
ద్వి హరిశ్చ ప్రూ ౨౩౪౨ పం

వ ముత్తియంపు ముంగఱ రంగువఁ గదలుకొను
బుడిబుడి కన్నీటఁ బ్రతిఫలించి
మనుచ ౩ ౨౭

౫ చిన్నచిన్న

క జెడజెడ నడకలు నడచుచు జెడజెడ నడు
గిడఁగ నదరి యిల దిగఁబడఁగా బుడిబుడి
నొడువులు నొడువుచుఁ జడిముడి తడఁ
బడఁగఁ వడుగు నీరక్ రాజాక్
భాగ ౭ ౫౪౧

క్రి విణ క్రు తొందఱగా

సీ పచ్చకాజినుగుఁ గ్రొంబనుల సోరణగండ్ల
బుడిబుడిఁ బొదలి దూబూచు లాడి
చంద్రా ౧ ౪౨

సీ రాజు దూరుల యిండ్ల కేతంబునఁ దదాప్తుల
వెంట బుడిబుడిఁ బోవువారు
వసు ౪ ౬౫

ద్వి పుడమిపై మకుటంబు బుడిబుడి దొర్ల
అ మ ౪ ౪ ౨౦౪ పా రామ ౪౩౦

జ బుడిబుడ్లుపోవు

బుడిబుడి². వి బాలచంద్రుఁడు (చూ బుడి
బుడితాల్పుఁడు)
జ బుడి బుడి తాల్పుఁడు

బుడిబుడితాల్పుఁడు. వి (బుడిబుడి² +
తాల్పుఁడు) బాలచంద్రుని ధరించినవాఁడు
శివుఁడు

చ చెడుగుల విష్ణుభక్తి నిరసించు దురాత్ముల
పాతలక్ష్మి చే ఎడుటకుఁ గాని హీనులఁ
బ్రభావ తిరస్కృత లోకపాలుఁడా బుడి
బుడి తాల్పుఁ డందు నొకవ్రాటయు నం
దఁగనీక త్రోచి పోవడచుఁ గలంచు దొంద
ముల సారటపెట్టు మహోగ్రమూర్తియై
పాండు ౪ ౨౭౯

బుడిబు(వు)ర్లుపో(వో)వు. అ క్రి (బుడిబుడి¹+
పోవు) తొట్రుపడు

ద్వి ఎడపక యని నరుల్ బుడిబుర్లుపోవ
ఎల వు ౫ ౧౯౩

ద్వి బడఁబడ వీరభ్రతోద్యుక్తి నడవ బుడిపుర్ల
వోవుచు భూసురుల్ నరులు ఎండితఁ
జూచి సైపక నొక్కనాఁడు ఎండితయ్యా
నీవు కారాణుఁడవు భూతియు రుద్రాక్ష
ములు దాల్పనగునె
ఎండితా దీక్షా ౧౦ తా

క జడురై మందఱ దోఁపక తడఁబడ బుడి
బుర్లువోవ ధరణీశ్వరుఁ డయ్యెడ వారిఁ
జూచి మీ కిచిడిముడిపా టేల వచ్చెఁ
జెప్పుం డనినన్ శ్రీరం ౫ ౧౦౫౨

ద్వి బుడిబుర్లు వోవుచు భూసురు లెల్ల
బస వు ౪ ౫ పం

బుడిపడు. అ క్రి (బుడి+పడు) తొట్రుపడు

క బుడిపడుఁ గాటులు నిలువక, పడఁ
బోవుం ఉ హరి ౬ ౧౬౪

బుడుక. వి మునుక, స్నానము.

గీ స్నానంబు తనరుము దానంబు మునుక
బుడుక మజ్జన మన
ఆం. భా. ౨. ౭౦.

బుడుగు = బుడిగి. విణ ౧. పొట్టి

గీ...బుడుగువడుగురూపున బలి నడుగువాఁడు...
చంద్రా. ౧ ౪౦ (శ. ర పా బడుగు ముద్రిపా)

౨. నీచుఁడు.

(హైశ్యదూషణము) సీ. బూసంబు దతిపి చేర్పున నమ్మికొనుటకుఁ గఱవుఁ గోరదు దోసకారి బుడుగ. వేం. పంచ ౧. ౪౭౩.

బుడుత. విణ ౧. పొట్టివాఁడు, వామనుఁడు

సీ. బుడుత గుజ్జు బురుక అనఁగను వామ నాఖ్య దనరు ఆం భా. ౨ ౧౨౩

౨ లేఁత

గీ. బుడుత కొన్నెల పూవొగ్గ ముడుచు వేల్పు, చిరకృపాదృష్టి మనల రక్షించుఁగాక ...
వరాహ. ౭. ౭౯.

సీ. బుడుత కల్వల విందుఁ బోలు నెఱ్ఱె సలిపైఁ కెలఁకపు పురారేకి చిందులాడ. నీలా ౧.౪౫.

వి. బాలిక, బిడ్డ, కుమారుఁడు.

శా. వింతే యీ బుడుతెంత నన్గణుచఁ గావింపం దను స్మృత్తురే... అము. ౭.౧౦౯

గీ తిలక మొంగిఁ దీర్చి మితభుక్తి సలిపి కెంట, బూమె లెఱుఁగని యొకపాటి బుడుత యాతుముడుపు లందీయ మోహంబు మురులు గొల్ప, కెడలె నలభామ నిజకేళి వేశ్మసీమ
హంస ౧. ౧౨౦.

వ....ఇంత లింతల బుడుతలతో నింతులతో బంతులు సాగి . . ఉ. రా ౪. ౧౭౩.

సీ...బాలకసంజ్ఞ నవ్వ నవ్వ.. బుడుత కుఱ్ఱ బొట్టె బాడిగ లేఁత ..
ఆం. భా. ౨. ౧౧౭.

గీ అంత మడియక మిగిలి యున్నట్టి సోఁకు గొంట్లు పదిమత్తుకల కోని పాలి కేఁగి, మిక్కుటంబుగఁ బాముల కేఁత బుడుత, మగతనం బెల్లఁ బలుమఱుఁ బొగడి యనిరి . .
అచ్చ. రా. సుం. ౧౨౩.

బుడుతేఁడు. వి చిన్నవాఁడు, బాలుఁడు

సీ కుఱుదూఁపు పర్యోంట చెఱఁగులో నిడి కొన్న ముద్దుబల్కుల చిన్ని బుడుతఁ డెమర
శుక. ౧. ౧౩

ఉ రారి కుమార యన్న వ,బ్బుడుతేఁడు నెఱ్ఱెసల్ పుడమిఁ బొందఁగఁ బాగిలి బ్రొక్కి వేడుకల్, వడనీతినయ్య మిమ్ము నెడబాయక వచ్చెద సామిఁ బావవే.
చెన్నబ ౩. ౪౮

సీ జీరాడు దుప్పటి చెఱఁగు చేఁ బూని కంబడి గిండి కొని వచ్చు బుడుతఁ డొడుఁగ . .
ఉ. రా. ౭. ౧౯౦.

బుడుతకాసీలు. వి. బ. వస్త్రవిశేషము.

రగడ. బుడుతకాసీలు మహాముదులు నిరాసీలు సరిసేయరాని హంసావళులు లాకీలు... హంస ౫. ౩౫౭. (బుడుతకాళిలు వ్రాత ప్రతిపా)

బుడుబుడుక్క = డుబుడక్క. వి. సన్న మగు నడిమిభాగము గలిగి విరివి యగు రెండు తుదలందు తోలుతో కప్పఁబడిన చిన్న వాద్యము

సీ. డుబుడక్క యనఁగ బుడుబుడుక్క యనఁగ హుడుకు నాఁ దనర్చు హుడుక్క పేరు. . ఆం. భా. ౧. ౧౨౮.

౨. బుడుబుడుక్కలవాఁడు.

బుడుబుడుక్కలవాఁడు = డుబుడక్కవాఁడు. వి. (బుడుబుడుక్కలు+వాఁడు) సోదెవాఁడు. (శ ర.)

బుడునర. వి. శాకమాచిక. (చి. ని.)

బుడ్డ వి (౬ బుడ్డి) ౧ వృద్ధి చెందిన అండము
సా బుడ్డ వమ్మ రోయటను బడ్డట్టు (శ ర)
౨ నీటి బుగ్గ (శ ర)
జ బుడ్డకాకర బుడ్డగించు బుడ్డగింపు బుడ్డ తుమ్మ బుడ్డపక్కి బుడ్డపిడుగు బుడ్డబుడు ర బుడ్డవాడు

బుడ్డకాకర. వి (బుడ్డ+కాకర) కర్కటవల్లి ? (చి ని శ ర)

బుడ్డకొణుజు=బుడ్డపిడుదు. వి ఎకువుల దేహమును బట్టి నెత్తురుపీల్చు నొకజాతి గోమారి (వాచ)

బుడ్డగించు. అ క్రి (√బుడ్డ) (ఎంది) ముట్టితో భూమి మొదలగువానిని పెల్లగించు
చ ఒకమతి బుడ్డగింప విలయోదకముల్ ఎలుకల్పి చిప్ప త్రచ్చుకొ మహోత్రవీధి జననాకరతి స్మోయి చెంచి
ఆము ౪ ౨౧
ఏ అటదిభిద నవారి ద స్తైనమహిం గుమి గూడి ఎందు లం కట బుడ్డగింప బెడిదం బగు లోయలు బర్వి చంద్రా ౨ ౫౨

బుడ్డగింపు వి (√బుడ్డగించు) (ఎంది) ముట్టితో కోరాడుట
గీ ఎంది ఎల గెకల మ్మనకు ఒరగ ఖుృష్టి బుడ్డగిం పనగ దధ్ధరాయాతి గేరు నభవ
ఆం భా ౨ ౨

బుడ్డతుమ్మ వి (బుడ్డ+తుమ్మ) వృక్షవిశేషము
సీ జమ్మి ఎలకు గార చంద్ర ఎటికి తెల్ల యుమ్మ లొద్దుగ ఉడ్డు బుడ్డతుమ్మ
వాంస ౪ ౯

బుడ్డపక్కి వి (బుడ్డ+పక్కి) మత్స్యవిశేషము (శ ర)

బుడ్డపిడు(పే)దు=బుడ్డకొణుజు. (బుడ్డ+పిడుదు) ఒకజాతి గోమారి (శ ర)

బుడ్డబుడుసర. వి (బుడ్డ+బుడుసర) ఓషధి విశేషము (శ ర)

బుడ్డవాడు. విశే (బుడ్డ+వాడు) అండవృద్ధి కలవాడు (శ ర)

బుడ్డి=బుడ్డిగ. వి ౧ కమండలువు
సీ పొలగుc గమండలు బుడిగ యనంగ బుడ్డిగ యనగను బుడ్డి యనగ
అం భా ౨ ౧౩౩
౨ అల్పముఖభాండము చిన్నమూతి గల చిన్న కుండ
గీ అల్పముఖభాండ నామధేయంబు చెలగు బుడ్డి బుంగ బుడిగ నాగ
అం భా ౨ ౨౪౮
౩ చిన్నమూతి గల కాచపాత్రవిశేషము గాజు సీసా (శ ర)

బుడ్డిగ=బుడ్డి వి కమండలువు

బుత్త వి రోగాని అడుగుతి (చి ని)

బుత్తి వి (సం భుక్తిః క బుత్తి) ౧ ఒకి దేవతాపుల కొసంగడి యాహారము
ఉ శ్రీకుత్తుకc గోసి బుద్బుదవిఘూర్ణిత ధనిల పైన నెత్తుటన్ బుత్తి రొనర్తు దుర్గకు
ప్రబోధ ౩ ౯
౨ భోజనము
క ప్రాణాహుతిc గొసె నాశిత బాణావళి యాతుధాన భామిని ఎంప ప్రాణముల రాగ జాదిమ శోణంసముదయము బుత్తి గను టకు మొదలన్ చం ౦ ౨ ౬
౩ భోగము ఇహలోకసౌఖ్యము
మ ఈ విపుడు గూర్పం బూను నీ యచ ట్రుం దెనుcగుం గబ్బము నిమ్ము నిచ్చలల త్తి న్ముక్తియున్ బుత్తియున్ నెన రొప్ప న్నయుకూర్పు చెప్పెడును నే నీ యు ద్ధ నే యుండెడన్ నీలా ౧ ౧౫
గీ గిత్తరి త్తడివాడు బుత్తిముత్తు లిదంగ జాలు వాc డొదల జాలువాడు
అచ్చ రా శాల ౧౭

బుద్ధి. వి. (సం. బుద్ధిః. ర. బుద్ధి) బుద్ధి, తెలివి.

ద్వి. పెద్దల కోడు పెన్నుద్దుల మొదలు, బుద్ధుల ప్రోక విబుధనిదానంబు ...

బస. పు. ౩. ౯౦౬. పం

గీ. బుద్ధి యుంచన తెలయును బుద్ధిసంజ్ఞ.

ఆం. భా. ౧. ౧౦౨.

ఉ. నా, బుద్ధులు దప్పి నేమిటికిఁ బోయిన నీళ్లకు గట్టదట్టి నీ, యుద్ధము లోని నీడ కాటు లాసపడం బొసఁ గుం దలోదరీ.

ఉ. హరి. ౫. ౧౫౪.

ఉ. బుద్ధి యొకింత లేక చెడిపోవఁ దలం పిడెఁ గాక యిత్తతిన్.

అచ్చ. రా. సుం. ౧౨.

బుద్ధిచెప్పు, బుద్ధిమెకము.

బుద్ధి(ద్ధులు)చెప్పు. అ. క్రి. (బుద్ధి+చెప్పు) సత్ప్రవర్తన మెలఁగించు, మంచి నడవడిని బోధించు.

సీ. అతనిఁ గన్నొత్తిఁగి యీగిత జారు బొందిన సుద్దచెంగిన రాజా బుద్ధిచెప్పు .

శుక. ౨. ౫౫౪.

ఉ. సుద్దులకర్త యై యొచటఁ జూచిన సోది చరించు నేరికిన్, బుద్ధులు చెప్పు తాను పలు వోకల పోవఁ దొడంగు . .

ఉ. హరిశ్చ ౧. ౬.

బుద్ధిమెకము. వి. (బుద్ధి+మెకము) నక్క.

గీ నక్క, బుద్ధి, మెక మన జంబుకాఖ్యలౌ...

సాం. ని. తిర్య. ౪౪.

బుద్ధి. సం. వి. ఇ. స్త్రీ. ౧. మనీష, మతి. ౨. ఎఱుక, జ్ఞానము. ౩. వివేకము, తెలివి.

క. అనిలజునకుఁ జాలఁడె నా, తనయుఁడు మోసంబు గాక ధర్మజుఁ బెట్టఁ బ్బినఁ బోని చ్చుట రాధా, తనయునకున్ బుద్ధి యగునె తప్పెం దప్పున్. భార. కర్ణ. ౩. ౩.

క. పెద్దలు లేనియడన్ ... బుద్ధి చెపితలఁ బట్టెన్. శాం. ౪. ౧౫.

౪. మనస్సు. ౫. ప్రతిభ. ౬. తెప్పిఱుట, మూర్ఛదేఱుట. ౭. (సాంఖ్య) సుఖదుఃఖాదులగు నెనిమిది ధర్మములు గల ప్రకృతి పరిణామభేదము. ౮. (వేదాంత) నిశ్చయాత్మకమగు వృత్తి గల అంతఃకరణము, అంతఃకరణవృత్తులు నాలుగింటిలో నొకటి. (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) అని అంతఃకరణము నాలుగు తెఱఁగులు కలది. వానిలో బుద్ధి - పండ, మేధ ప్రాషి, చార్వి, గృహీతి, చత్వరి అని యాఱు భేదములు కలది. (శై. ని.) దీనికి క్షయము కలిగించునవి.- శోకము, క్రోధము, లోభము, కామము, మోహము, పరాసుత, ఈర్ష్య, మానము, విచికిత్స, హింస, అసూయ, జుగుప్స అనునవి. దీనికి వృద్ధికరములు నింబాట రూషవృంతములు. శ్లో. నింబాట రూషవృంతాశ్చ బుద్ధివృద్ధి కరామతాః. (వాచ.) ౯. ఆలోచన, తలఁపు

క. నీవు సుయోధను పాలికిఁ, బోవఁగ వలదనియు నొక్క బుద్ధి ఎఱిఁగెదుమె, గోవింద యతఁడు మంత్రులుఁ, గావర ముఱచిక్క వినరు కార్యవచనముల్.

భార. ఉద్యో. ౩ ౨౫

తరువోజ మఱి దీని గాంగేయ విదుర కల శజాశ్వత్థామ గౌతముల్ బుద్ధి, గా నిడం బడుదుర. భార. ఆది. ౬. ౧౨౯.

బుద్ధివదలు. మఱచు.

క. చని రవ్వల నమ్మునులును, వనచరుఁడును వారిబుద్ధి వదలక మదిలో, ననుదినము కందమూలా, శన మొనరించుచును నితర సంగరహితుఁడై.

వాల్మీకి. ౨. ౧౧౫.

బుద్ధిచె(సె)ప్పు. మి. అ. క్రి. ౧. ఉపదేశించు.

సీ. ప్రద్యుమ్నునకుఁ గుమార సమేతముగ ధర్మపుత్రుసభకడ నిల్వ బుద్ధి చెప్పి ...

హై. భా. ౪. ౯౧.

౨ కూడనిపని వల దని బోధించు చీవాట్లు పెట్టు

వ మతియు బహు ప్రకారంబుల బుద్ధి
చెప్పియుం బ్రియంబు పలికియు
సైష ౪ ౧౧౫

ఇట్లే బుద్ధులు చెప్పు
గీ ఏమరక దీని రక్షింపు మీవు నియతి ననుచు
బుద్ధులుచెప్పి యయ్యరుంధ ఁడరిగె
కా ౬ ౨౩

బుద్ధిమంతుఁడు. సం విణ (త్ మతి త్) మంచిబుద్ధి గలవాఁడు

బుద్ధియోగము. సం వి అ పుం బుద్ధిచేత పరమాత్మ తోడి కూడిక పొందు యోగ విశేషము

బుద్ధిశాలి. ం విణ (న్ నీ న్) బుద్ధిమంతుఁడు

బుద్ధిసహాయుఁడు ౯ ౧ అ పుం ఆలోచన చెప్పుమంత్రి (వ లా)

బుద్ధీంద్రియము. ౯ వి అ న జ్ఞానేంద్రియము (కన్ను వి ముక్కు నాలుక తోలు అని యివి యైదు వ్యతి కర్మేంద్రియము)

బుద్ధుఁడు. ౯ం విణ (అ ఆ అ) ౧ తెలియఁబడినవాఁడు జ్ఞాతుఁడు ౨ మేలుకొన్నవాఁడు జాగరితుఁడు ౩ ఎఱిఁగినవాఁడు తెలివిగలవాఁడు వి అ పుం ౧ పండితుఁడు ౨ (బుద్ధ) తత్త్వజ్ఞానముచే జన్మబంధము వీడ తాను నిర్వాణమును పొందక మునుపు లోకులకు నిర్వాణోపాయమును బోధించు జ్ఞాని ౩ శాక్యముని బుద్ధదేవుఁడు (విష్ణుని చతుర్వింశత్యవతారములలో నిరువదియొకటవ యవతారము దశావతారములలో తొమ్మిదవ యవతారము)
శ్లో తతః కలౌ సంప్రవృత్తే సంమోహాయ సురద్విషామ్ బుద్ధో నామ్నా జినసుతః కీకటేషు భవిష్యతి॥ సం భాగ ౧ ౩ ౨౪

బుద్బుదము. సం వి అ పుం ౧ నీరుబుగ్గ ౨ ఆయిదు దినముల గర్భపిండము (పంచరాత్రేణ కలలం బుద్బుదాకారతాం వ్రజేత్)

బుధ. సం వి ఆ స్త్రీ ౧ జటామాంసి ౨ బుద్ధి (శ్రై ని)

బుధతాత ౯ం వి అ పుం చంద్రుఁడు

బుధరత్నము ౯ం ౧ అ న మరకతము పచ్చ గరుడపచ్చ గారుత్మము (రా ని)

బుధవారము ౯ం వి అ పుం ఒకవారము సౌమ్యవారము ఇట్లే బుధవాసరము

బుధసుతుఁడు. ౯ం వి అ పుం పురూరవుఁడు

బుధానుఁడు సం విణ (అ ఆ అ) ౧ బ్రహ్మవాది ౨ ప్రియవాది ౩ వేదములను జదివించువాఁడు ఆచార్యుఁడు ౪ విజ్ఞుఁడు సాజ్ఞుఁడు వి అ పుం కవి

బుధితము. ౯ం విణ (అ ఆ అ) తెలియఁబడినది

బుధిలుఁడు. ౯ం విణ (అ ఆ అ) విద్వాంసుఁడు తెలిసినవాఁడు

బుధుఁడు సం విణ (అ ఆ అ) ౧ పండితుఁడు తెలిసినవాఁడు ౨ బుద్ధిమంతుఁడు ౩ మేలుకొన్నవాఁడు వి అ పుం ౧ పండితుఁడు ౨ దేవత వేలుపు ౩ బుధగ్రహము ౪ చంద్రునకు తారయందుఁ బుట్టిన కొడుకు

బుధ్నము సం వి అ పుం ౧ (పాత్రము మొదలగువాని) అడుగుభాగము ౨ వృక్షమూలము వేరు ౩ మిక్కిలి క్రిందైనభాగము మిక్కిలియధోభాగము ౪ ఊడ

బుధ్నుఁడు. సం వి అ పుం శివుఁడు

బుబ్బుదము. వి (౯ం బుద్బుదః) భత్య్వంతమము

సీ బుబ్బుద మనంగఁ దనరును బుద్బుదంబు
లక్షణ యనంగ లట్వా చెలంగు మండు
ఆం భా ౨ ౨౫౦

బుభుక్ష. సం. వి. అ. స్త్రీ. భుజింపనిచ్ఛ, ఆఁకలి

బుభుక్షితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఆఁకలిగొన్నవాఁడు, క్షుధితుఁడు.

బుభుక్షువు. సం. విణ. (ఉ.) ౧ ఆఁకలిగొన్నవాఁడు ౨. విషయభోగాభిలాషము గలవాఁడు (వ్యతి. ముముక్షువు)

బుభుత్స. సం. వి. అ. స్త్రీ. బోధగాననిచ్ఛ తెలిసికొనుట కగు కోరిక.

బుభుత్సువు. సం. విణ. (ఉ.) తెలియఁగోరినవాఁడు.

బుభూష. సం. వి. అ. స్త్రీ. ౧ ఉండుటకు నిచ్ఛ. ౨. అగుటకు నిచ్ఛ

బుభూషువు. సం. విణ. (ఉ.) ౧ ఉండఁగోరువాఁడు ౨ కాఁగోరువాఁడు.

బుయ్యి. వి. ఆఁడుగుఱి.

గీ. పాపలగనుతావు పత్త బుయ్యి
సాం. ని. మాన. ౧౯.

బుయ్యారము. వి. (హిం. భుయ్యారహ్) చెఱసాల, కారాగారము. (శ. ర. మిశ్రభా.)

బురకట. పిణ. బూటకము, అసత్యము, బొల్లు.
(ఇది తరకట శబ్దపూర్వకముగానే సోదికత్తెల మాటలందుఁ గానవచ్చుచున్నది)

గీ....ఎఱుంగఁ జెర నీవు, గానఁ దరకట బురకట
గాదు మేలు,జెరు బురకని తోడితే తార
కాణ,యొండు రెండే దినాలనోదుండి
నాదు,మాట మఱువకుమని పోయె సుఱిచి
నాక ప్రబంధ ౬. ౨౬.

బురకడము. వి. ఉడుముల వేఁటాడు కుక్క
సీ.. .ఉడుపవేఁ పవు బురకడ మనంగి .
ఆం. శా. ౨. ౨౯౦.

బురజు. వి. బురుజు. (ఆప్ర - శ. ర, క్రొ.)

బురద. వి. పంకము.

గీ. పారలికఁ బయోధిఁ జెందిన బురద యొండి,
యొదలు జాడింపఁ గడ రాలి పడిన యొద్దు,
పెల్ల లజ్జాసనాంబముల్ పెంపు గాంచుఁ,
దావకమహత్త్వమునను వాయావరాహ.
చంద్రా. ౧. ౯౫.

క. గరగరిక నిచ్చ గలుగక, బురదం గలఁగు
టయు కాక వాలుపఱఁగా దామర మొగ్గల
పేరిటి తామర మొగ్గలు వోలఁగలవె మగువ
చనుగవన్ యయా. ౪ ౪౫.

గీ. .రొంకి బురద, చదుకు నా నొప్పఁ
..ంక, మార్యచ త్తరిరంస
ఆం. శా ౧. ౧౫౫.

జ బురదకమ్మి, బురదకొయ్య, బురదపాము.

బురదకమ్మి. వి (బురద + కమ్మి) కడపక్రింది కమ్మి (శ. ర.)

బురదకొయ్య. వి. (బురద + కొయ్య) బురద కమ్మి. (చి. ని.)

బురదపాము. వి. (బురద + పాము) రొంపిలో సంచరించు పాము, నీరుపాము. (శ. ర., క్రొ.)

బురి. సం. వి. ఇ. స్త్రీ. బులి

బురీలు. వి (పక్షులు) ఎగురుటయం దగు ధ్వని కనుకరణము

చ. వడి సరిపంక్తి కొక్కెగారపంక్తి బురీలున
లెవ దానిపైఁ, దొడిఁబడ వేగ చేసి యది
దూరముగాఁ దఱుమన్ విజేనద,త్తడి కాసఁ
ఒన్నె . . చంద్రా. ౨. ౧౦౭.

బురుక¹ = బురుకఁడు. వి. స్తవపాయి, బిడ్డఁడు.

గీ జియ్య రేమి మందుఁ గొదవాల్గుచెలఁగు
లందుఁ, దిరిగి కనుగొన వెందు దేవరకు
దొరయు, పురుడు లేఁ గాన నీబంటు బురుక
గాన, చామన మెఱుంగు తిరుమేని సామి
గాన ప్రబంధ. ౧౪౯.

విణ. ౧. వామనుఁడు, పొట్టివాఁడు.

సీ. పొమఁగు బుడుత గుజ్జు బురుక బుడిగి...
వామనాఖ్యఁ దనరు. ఆం. శా. ౨. ౧౨౩.

సీ. అనిన విని గొల్లకొమరులు, నవనోఁడుల
మిన్నఁ గైకొనఁగ వలచిన బుల్లును గోడెల
గెల్వఁగ నో,పని జడుపును గల్గి కాడు పడి
యుండి రొగిన్. నీలా. 3. ౬౦

౨ విలాసము.

సీ పొలుపులై వలరాచబులుపులై పలుమొవల్
మొల్లల కొకవింత మురువు నింప
యయా ౧. ౭౪

సీ. హొరఁగు చెన్నె హొర పొయ్యారము
బులుపు హొయి లనఁగ విలాస మప్పు
చుండు . . ఆం. భా. ౧. ౧౩౯.

3 బింకము.

చ అలుకలు చాలు గమ్మనవయా యయగారిఁ
దమమ్మ కింత బుల్పులకుఁ బనేమి తాఁ
దొలఁగిపొయిన యప్పటినుండి పిల్లయుఁ
బలుకదు వైజ. ౪ ౧౩.

బుల్లి. వి. శేఫము, మగగుఱి

సీ.. బుల్ల బెల్ల మనంగఁ బొసఁగు శేఫము
సాం ని మాన. ౧౯

బువి. వి (సం భూః) పుడమి, భూమి.

గీ భూమికి సమాన్య లగు బువి పుడమి నేల,
మన్ను పంటవలంతి నా .
ఆం సం. స్థా. ౨౨.

బువ్వ. వి అన్నము, కీరము.

ఆ. అమ్మ బువ్వ పెట్టుమనఁ డొకనాఁడైన..
దశా. ౪. ౧౩౯.

ఆ అన్న మధికమైన నదియుఁ దాఁ జంపు నా,
యన్న మంటకున్న నాత్మ నొచ్చుఁ, జంప
నొంప బువ్వ చాలదా కర్యోల, విశ్వ...
వేమ. 3. ౭౦

సీ....అన్నంబు తెలయుచుండు, బువ్వ .
ఆం. భా. ౨. ౨౫౩.

చూ: బువ్వంపుబంతి, బువ్వకుడుపు, బువ్వము.

బువ్వంపుబంతి. వి. (బువ్వము+బంతి.) ౧. వివాహాదులలో సహభోజనమునకై చేరిన బంధువుల వరుస.

గీ. చిగురు విలుకాని జాతర చేయఁ బూని,
కాలమువాముల నందఱుఁ గూడఁ బెట్టినంత
గలయంగ బువ్వంపు బంతి విందు, పెట్టి
రెలమిఁ జకోరంపుఁ బేరటాండ్రు.
పారి. ౨. ౪౭.

గీ నిఖిల బంధులతోడ మాణిక్యదీప, జాలము
వెలుంగు పెండిలి చవికలోనఁ, బసిఁడిపీఁటల
బువ్వంపుబంతి సాగి, సోదరులతోడఁ బ్రేమఁ
గూర్చున్న వేళ. దశా. ౩. ౨౩౩.

౨ బాలికా క్రీడా విశేషము

సీ. బొమ్మలపెండ్లిండ్లు బువ్వంపు బంతులు ..
హంస. ౫. ౧౫౫.

బువ్వకుడుపు. వి (బువ్వ + కుడుపు) అన్నప్రాశనము. (శ. ర.)

బువ్వము. వి (√బువ్వ) ౧ వివాహములో బంధువులందఱును కలసి భుజించుట, పెండ్లివారి సహభోజనము

గీ అపుడు బువ్వంబు లలరించి యల విరించి,
ముఖ్యులసను యథోచితములు ఘటించి,
కేశయవిభుండు మఱియు లౌకికవిభుల,
భూరివిభుల సభక్తిగాఁ బూజచేసె.
ముకుంద. 3. 300.

సీ ..బువ్వమనంగ స్వజనవివాహ సజ్గ్థి తనరు...
ఆం భా. ౨. ౧౪౯.

చ చెలఁగి వివాహాభ్యుదయము చేకొని రాముఁడు
సీతయున్ శిఖన్, వలగొని వచ్చి సప్తముని
వందనమున్ గురువృద్ధ బందుమం,డల యుగ
పత్ప్రణామము నొదర్చ పరస్పర లజ్జ లాత్మ
రం,జిలఁ దగువారితోడుత భుజించిరి బువ్వ
మునన్ వధూవరుల్. రామా. ౪. ౧౨౩.

౨. అన్నము, ఆహారము

ఉ కాముక హృద్వధిం గలఁచు కవ్వము
బువ్వము దేవకోటికిన్, రాజుకతీశ వింబ

ముదయాచల మెక్కెఁ బ్రభాతి
పెక్కువన్. కాశీ. ౪. ౯౨.

సీ బుష్యంబు గుడుచుకే బ్రోదిరాచిలుకలు పరి
పక్వదాడిమీ ఫలరసములు
చంద్ర. ౩ ౧౧౩.

గీ. వేలుపుల కెల్ల వేలుపై వెలయుతాను, మామ
యిలు వేల్పు దర్శించి మధురభక్ష్య, చోష్య
పానీయ భోజ్య వస్తువులతోడ, హైమ భాజ
నముల బుష్య మారగించె ప్రబంధ. ౬౦౩

బుష. సం. వి. అ స్త్రీ. మూస.

బుస. వి (శ బుస) ౧. పాములు మొ॥ వాని
భూత్కారము. ౨. నిట్టూర్పు (చూ బుస
కొట్టు)
జ బుసకొట్టు, బుసక్రోవులు, బుసపుర్వు, బుస
బుసలాడు, బుసపెట్టు.

బుసకొట్టు. అ క్రి (బుస + కొట్టు) ౧. (పాము,
సింహము మొ.) భూత్కారము చేయు.
సీ భూరిభుజంగికా భుక్తనిర్ముక్తుఁడై వారక
బుసకొట్టువానిఁ దెగడి వసు. ౧ ౪౫ (ఇది
రండవయర్థమునకుఁ గూడ నుదాహరణము)
సీ వాటింప నోరిబాబ్బాటమే వడి గాని
ఘోరాజిలో బుసకొట్టుచుంట గీ కొదవ
దవకంచుఁ గ్రిమ్మలు నదిరుఁ డైన, యల్ల
నరసింహాండును బోలె నరస. ౫. ౭౯.
సీ. కమలాకరములపైఁ గవిసి నీరు గలంచి
క్రోలుచు బుసకొట్టుఁ గొంతతడవు ...
వరాహ. ౧౧. ౪౬.
౨. నిట్టూర్పు విడుచు
సీ. ఈసడించుచుఁ గన్ను లెఱ్ఱఁ జేయుచు బుస
కొట్టుచుఁ బకపక నిట్టు నగుచు .
అచ్చ. రా. యు. ౧౯౫.
క. వన్నిం తలయించిన ఖలు, నిక్కి బుజావిధి
వధింతునే యని యార్చుల్, మిన్నందఁగ
బుసకొట్టుందు, వన్నిచుఁడు పొగరు కెడలు
వన్నలకో క్రిన్. అను. ౬. ౨౬.

బుసక్రోవులు. వి. (బుస + క్రోవులు) ఒకవిధ
మగు తుపాకులు.
ద్వి. క్రోవులు జబురుజంగులు పిరంగులను, బుస
క్రోవులును గసాబులు తుపాకులును, వసుధ
లీలగ కొక్కెవడిఁ గాల్చి రిపుల. .
అ. మ శ ౩. ౧౪౧ పా. ౧౫౪

బుసపుర్వు. వి. (బుస + పుర్వు) పాము
సీ బుసపుర్వునా భోగి వెలయు .
సాం. ని. తిర్య. ౭౦.

బుసబుస. వి. నీళ్లుపొంగుట మున్నగువానియఁ
దగు ధ్వని కనుకరణము (శ. ర)

బుసబుసలాడు. అ క్రి (బుసబుసలు + ఆడు)
బుసకొట్టు.
క. పున్నాగంబుల వలగొని, పున్నాగము
విఱుచ ఫణులు బుసబుసలాడన్, పున్నాగ
మకుళకానృప, పున్నాగము చూచిచూచి
పొరిఁబొరి నవ్వున్ కృ కకుం. ౧. ౬౯

బుసము. సం. వి అ న. ౧. పొల్లు. ౨ ఉద
కము (వై ని.) అ స్త్రీ ౧. పిడక. ౨. ఇంగ
నము, వంటకట్టె. ౩. మీఁగడ తీసిన పెరుగు

బుసపెట్టు. అ. క్రి. (బుస + పెట్టు) బుసకొట్టు,
నిట్టూర్పు విడుచు.
క. ఉసురుసురనుచుం బొరలును, గసరును ఒక
దతిగి వెసను గడగడ వడకు, న్విసువున బుస
పెట్టును వె,క్కస మగువల రాచపెగలఁ
గ్రాఁగుచు మఱియున్. నీలా. ౨. ౭౪

బుసి. వి. (సం. బుసమ్.) బుసము, గాబు.
సీ . బుసుసంజ్ఞ బుసి యన ...
ఆం. భా. ౨. ౨౩౭.
జ: బుసిపోవు.

బుసి. సం. వి. ఈ. స్త్రీ. పశ్చిమ సముద్రమ్ము
నడుమ నుండెడు వరుణోద్యాన నది. (శ. ర.)

బుసిపోవు. అ. క్రి. (బుసి + పోవు) నిరర్థమగు,
చెడు.

గీ. చెడిపె బుసిబోరు ననఁగను చెడిరు వనఁగ,
నాఖ్య లగుఁ గార్య శైథిల్య మర్యో
ననుటకు . . ఆం. శే. ౯.

బుసుకుజొన్న. వి. (బుసుకు + జొన్న) ఒకవిధ
ము గు జొన్న.

గీ. . బుసుకుజొన్న, యనఁగ జార్ణవిశేష చూ
నహి విభూష ఆం. భా ౨ ౨౩౪.

బుస్తము. సం. వి అ. న. ౧. మాంసపిష్టక
భేదము. (వాచ), వేఁపుడు మాంసము యొక్క
కాల్చినముక్క.. (ఆ వి) ౨. పనసపండు
మొ వానియందు త్యాజ్య ము గు తొక్క
మొదలగుభాగము.

బుస్సు. వి ౧. తూఁటుయం దగు ధ్వని కను
కరణము

వ ..శరభంబుల నీక్షించి తొక్కులు ముడించి
బుస్సనం దూటి తటాలునం దన్నికొని
యొగయు గండభేరుండంబుల యొఱకలం
బొడమిన గడుసు పెనుగాలి
చంద్రా. ౨. ౯౪.

౨ ఊఁపుటయం దగు ధ్వని కనుకరణము

సీ. కడువడిఁ గ్రమ్మతి కనుకట్టు సైచిన
బుస్సన పెగమాఁది పోఁవఁజేసె .
చెన్నబ. ౫ ౩౧౯.

౩. సర్పాదులు చేయు ఫూత్కారమున కను
కరణము.

చ. మొకమున బుస్సమంచు నహి గ్రొంగిన
సెట్లు భయంబు చెందునో.. హర. ౪. ౨౩

తోటకము. కొంచక నాల్కలు గ్రోయుచు
మంటల్, నించుచు నింగియు నేలయు
నెల్లన్, ముంచుక బుస్సన గ్రాఁగుచు
వాఁడిన్, మించిన పాముల మేల్పులు
కేసెన్. అచ్చ రా యు. ౧౫౦.

## బూ

బూఁజే=బూఁదు. వి. (సం. పూతిః, క. బూజు,
త. పూంజు)

౧. దుర్గంధము, ఫుస్తు.

ఆ. ఫుస్తు బూఁజు నాఁగ, బూతిగంధ, మలరు...
ఆం భా. ౧. ౧౦౪.

౨ ఎండ సోకమిచే తడివస్తువులపై పట్టు మకిల.
(చూ. బూఁజేపట్టు )

(వ్యవ ) ఈ చింతపండు బూఁజుతో నున్నది.

జ : బూఁజేపట్టు.

బూఁజేపట్టు. అ. క్రి. (బూఁజే + పట్టు) బూఁజు
కలది యగు. బూఁదు పాఱు.

సీ బూఁజుపట్టిన దేహములపై దళంబుగా మల
యజ పంకంబు లలఁదినారు... శైవ. ౪. ౭౩.

బూఁదారు. అ క్రి. (బూఁదు + అరు[1]) బూఁజు
పట్టు.

క. భూదేవుఁడు దా నేమిట, బూఁదారిన
యొక్క కా నుఁ భోరయించుటయున్,
లేదఁట సకలము నడపిన, యీ దొరగతి
సంచరించునఁట యిది తగదే.
విప్ర ౪. ౧౪.

బూఁదు=బూఁజే. (సం. పూతిః) ౧. దుర్గంధము
౨ ఎండ సోఁకమిచే తడివస్తువులపై పట్టు
మకిల. (చూ. బూఁదారు. బూఁదు పాఱు.)

జ బూఁదారు, బూఁదుపాఱు

బూఁదుపాడు. అ క్రి (బూఁదు + పాఱు)
బూఁజుపట్టు

సీ. బూఁదుపాఱఁగ నేస బూదిఁ బూసిన
వారు, త్రిముఖాస్త్రములు కేలఁ ద్రిప్పువారు .
పాండు. ౧ ౧౭౫.

బూక. వి అసత్యము, బొంకు

సీ . బూక నా బూటకం బనఁగను. .అబద్ధ
కంఠరొ యలరుచుండు ....
ఆం. భా. ౧. ౧౧౯.

బూక్కము. సం. వి అ న. ౧క్కము.

బూగర. వి ౧. తమిదలు మొదలగు ధాన్యముల
మీఁది పొట్టు.

సీ. పరగును బుససంజ్ఞ బుసి యన గా చిన
బూగిర యన ఆం భా. ౨. ౨౩౮

౨ ఇండ్ల వాసములకు పక్షుకు బూసి (శ ర)

బూచి. వి (క. బూచి.) భూతము, పిశాచము

సీ. పురిటింట్ల బూఁచుల పోక్కుఁ బూఁబోద
లపై సంపడి కెంపు నిందిందిరములు
- రసిక. ౩. ౧౪౪

క ఆలరుం బ్రాయపుఁగన్నుల కలికి మది
మగఁడు బూచి గావున
వేం పంచ ౩ ౧౮౦

ఉ .బూచి, గాము సోఁక పత్తి గాలి దయ్యము
బూత, మనఁ బిశాచసంజ్ఞ లలరు నభవ.
ఆం భా ౧ ౬౩

విశే ౧ (బూచివలె భయము కలిగించునది)
వికృతమైనది.

ఉ కాలినమోటువంటి కొఁబగాని శరీరము ఎల్ల
జంత్రుకల్, గ్రాలెడు బూచి గడ్డమును
ఖల్వాటకంబును .. వి. పు. ౨. ౧౩౫.

౨ బాలక్రీడా విశేషము

సీ దూచియు జాబిల్లి బూచి కన్నులకచ్చు గుడి
గుడి కుంచంబు కుంకెనగిరి...
హంస. ౩ ౧౪౬.

జ బూచి మొసలవాఁడు, బూచివాఁడు,
బూచుల దొర, బూచుల రాయఁడు,
బూచుల కోఁడు.

బూచిమొసలవాఁడు. (బూచి + మొసలు +
వాఁడు ) భూతేశుఁడు, శివుఁడు

సీ. మొసలకై దువ బూచి మొసలవానిఁ గలంచి
కులుకు కత్తిని సోఁకుడులును నొంచి .
అచ్చ. రా. యు. ౪. ౬౪.

బూచివాఁడు. వి. (బూచి + వాఁడు.) బూచి,
భూతము. (శ. ర.)

బూచులదొర. వి. (బూచులు + దొర) శివుడు.

చ చదలుకుఱ్ఱనిఁ గొట్టితి జాగ కాని బూచుల
దొరఁ దోలితి న్మిగుల సొంపున కేలితి ముజ్జ
గంబులన్ అచ్చ రా. యు. ౪౯౬.

గీ. జముపగతుఁడు బూచులదొర జంగమయ్య,
యోగికంబులు భవదాఖ్య లలరియుండు,
ధాతృమత పదజల జాత మాతృబూత
ఆం. భా ౧. ౩౭

బూచులరాయఁడు. వి (బూచులు + రాయఁడు)
భూతేశుఁడు, శివుఁడు

వ. తనరుచునుండు చాల్పు టరదంబుల కోని
యనుంగుబోద శేఁపున నిట వచ్చి ఓ విడిన
బూచులరాయని విల్లుఁ గన్గొనన్
అచ్చ రా బాల ౧౮౧

బూచులతోఁడు. వి.(బూచులు + ఓఁడు) శివుడు.
భూతేశుఁడు.

ఉ. జాచి నమస్కరించి శ్రుతిసూక్తుల సన్నుతి
సేయువానితో, బూచులు కోఁడు పల్కె....
చెన్న. ౪ ౧౩.

బూట. విశే. (క. బూట = బూటక మోసము.)
బూటకుఁడు.

గీ జగము లెల్లను సాయూజ్య మిగుల కునికిఁ,
గనియు వినియు కెఱుంగుదు వనజనేత్ర
యింత భయమును బొంద నీకేల మది
ఖు,జంగభూషణు నబ్బూటగొంగఁ జేసి.
కు. సం. ౪. ౪౨౬.

(ప్రయోగాంతరము దొరకలేదు.)

బూటకము. వి. (క. బూటక, త. బూట్టకం.)
౧. మాయ, మోసము

క. నేఁడేడుదివములయ్యెని, తోడిమిం చెడ
సాగి నీదుబూటకమా యె,త్యాదైనను

కోపశో యిది,కేఁడెద పత్యంబుఁ జెప్పుకే
కరుణాబ్ధి. కాశీ. 3. ౯౭.

దండకము...నీ బూటకం బెవ్వరు న్నేటుగా
వారయన్ లేరుగా . నీలా. ౨. ౪౧.

౨. అసత్యవచనము, కల్లమాట.

ఉ. పోరుడుపంగ నేఁ బలుకు బూటక మెల్ల ని
ఒద్దఁ జేసి తమి,వారిని బోరుమనో సుతుఁడు...
చెన్న. 3. ౧౪౦.

సీ బూక నా బూటకం బనలగను. అబద్ధ
సంజ్ఞ లైు యులరుచుండు
అం. భా. ౧ ౧౧౭.

విశ. అసత్యమైనది

సీ ఒంతులఁ దిరుగ నీపదములచే తీర్థంబూరెలం
దనుమాట బూటకంబె
పార్వ. ౫. ౧౭౦.

ఉ విష్ణు శంకరుల భక్తి దృఢంబుగ గల్గెనేని
నా, నాఁటికి వాని కన్ని సుగుణమ్ములు
దామె ఘటింప ముక్తుఁ డౌ, బూటకపు
న్విచారములఁ బోవఁగ నేమి ఫలంబు
భూవరా. కవిరాజ. ౧. ౧౪౭

జ. బూటకుఁడు. బూటకీఁడు.

బూటకీఁడు. విశ (బూటకము + ఈఁడు)
మాయావి, మోసగాఁడు.

ఆ. నమ్మకూలి యిచరు లెటుఁగ, కుండఁ
దలుపు తెడలికొనిపోవ, జనులెల్ల బూట
కీఁడు పారిపోయెసంద్రు
బస. పు. ౧. (శ. ర.)

బూటకుఁడు. విశ. (√బూటకము) బూటకీఁడు
మాయావి.

గీ. అరయ నాడంబరాతి ప్రాజ్ఞాని చూచుచు,
జాటుచుండెడి నీతి శాస్త్రము నిజంబు,
బడుగు లెచ్చోటి కేఁగిన బ్రదుకు గిలదె,
బూటకులఁ గాని మెచ్చరు భూమిపతులు.
కుచేల. ౨. ౧౦౯.

ద్వి కపటులనే కాని కలితవిజ్ఞాన, నిపుణుల
నొల్లరు నేఁటి బూటకులు ..
ప్రభులిం. 3. ౧౦౧. పా. రా. పం.

బూడిద = బూది, బూడ్ద. వి. ధూళి, దుమ్ము
భస్మము.

గీ రాజసంబున హస్త్యశ్వ రథ పదాతి, పాద
ఘట్టన మేరువు మీఁదఁ బడిఁడి, బూడిదలు
కేఁగ కొకనాఁడు దాడిపెట్టి
వరాహ. ౬. ౧౨౯.

సీ మసి బూడి దయ్యె నిర్మలకేలి దీప్తి కాకమ
లినీ కహ్లార కైరవములు భీమ. ౪. ౧౪౩.

సీ నీటు బూడిద యన నెవఁడు న
భస్మాఖ్య .. అం. భా. ౨. ౨౭౨.

బూడిదలోని హోమము = వ్యర్థము.

ఉ. మూఁడవకంట నీఱుగట మున్నె రొటుంగఁ
నైతి నక్కటా, బూడిదలోని హోమ
మయిపోయిన దంతయు భావసంభవా
తపతి 3 ౯౩.

జ. బూడిదగుమ్మడి, బూడిదపండు, బూడిద
పమ్న.

బూడిదగుమ్మడి. వి. (బూడిద + గుమ్మడి)
కూష్మాండ భేదము, ఒకజాతి గుమ్మడి, పెండ్లి
గుమ్మడి. (శ. ర.)
(వ్యవ.) ఈ బూడిదగుమ్మడి కాయ కేఁతది, వడి
యములకు పనికిరాదు.

బూడిదపండు. వి (బూడిద + పండు.) విభూతి
యుండ.

ఉ. అడవికి వేఁటకై వరిగి యాతఁ డొకా
నొక నాఁ డొకింతయున్, మెండ మలగింప
లేక తన మేపోడ లాండును రెండునేకమై,
పాడమఁగ బీదకన్న వడి బూడిదపండును
బోలె బూఁదుపాలెడు నొక దుష్కిం
గవియ. పాండు ౫. ౧౪.

బూడిదపన్ను. వి. (బూడిద + పన్ను) శ్మశానమునందు శవమును కాల్చుటకై యిచ్చెడు పన్ను. (శ. ర.)

బూడ్ద=బూడిద, బూది. వి భస్మము, బూడిద.

క ..అప్పుడు లాదవకి చెడు బూడ్ద విడిన హుతముల కరణిన్ భా రా యు. ౧౦౧.

సీ. పాలుచు నీరాజ్య విభూతి గ్రేఁ గయ్యోనే దైవంబుకంటికి ధరణినాథ, చక్రంబు పని సేయ పడి పన్ననీపెంపు బూడ్ద బెట్టయ్యె భూరికీర్తి మార్క. ౧. ౧౩౬.

సీ. కిరణంబుల గోటిఁ గెరుట కొపలించి పూరేళ్ల బడుకల బూడ్దఁ గలిపి... ద్వా. ౧-౨౩౭.

ఆ. వల్లబోడితలలు తెల్లనిగొంగళ్లు, మెడలబూడ్ద పూఁత యొడలకోఁత, యిట్టి వేషములను బొట్టకోసమె సుమీ. విశ్వ
వేమ ౩ ౧౯౩

బూతగెనుసు. వి. (బూతము + గెనుసు) ఒక విధమగు గెనుసుగడ్డ

గీ పాసఁగు తెల్లగెనుసు బూతగెనుసు ....
హంస. ౪. ౧౩౧.

బూతపిల్లి. వి (బూతము + ఎల్లి) గంధమార్జాలము, పునుఁగుఁ పిల్లి

ఆ. ఓకిలిపూలు బూతపిల్లు లేనికొమ్మ, లలరఁ దేనె పెద్ద తెలగపండ్లు
యయా. ౧. ౧౦౩.

ఆ. మహిని బూతపిల్లి మచ్చికయును బోలె, రాచమాట నమ్మరాకయుండు...
ధల్గా (శ. శ. ర.)

సీ... బూతై, పిల్లి పాఁగను గేమ్మపిల్లి పాఁగను బుగ్గపిల్లి యటంచనఁ జెల్లు గంధ, మార్జాలనామంబు ఆం. భా. ౨. ౯౪.

బూతము. వి. (సం. భూతః) ౧. పిశాచము, దయ్యము.

ఆ. ... దయ్యము బూత, మనఁ బిశాచసంజ్ఞ లలరు నభవ. ఆం. భా. ౧. ౬౩.

క. అతటి పెన్నెలదగు ను, జ్జాతా జాబిల్లి తెజ్జ జగమున కెల్లన్, రాత్రి సోఁకిన చీకటి, బూతము విడువంగఁ జల్లు బూదియుఁ బోలెన్ యయా ౨. ౯౧.

౨. పృథివ్యాది పంచభూతములలో నొకటి.

ఉ. చక్కని వారిలో మిగులఁ జక్కనివాడవు గాన నీ కెనా, చక్కనివారిఁ జంద్రుని వసంతునిఁ గూరుచుకొంటి వంద మా, జక్కర వంటిరాజ యొకచక్క మదేమని కూర్చుకొంటి వమ్మక్క యరూపకం బయిన యారయెల తెమ్మెర వాలి బూతముల్ .. విజ. ౩. ౪౫

౩ ప్రాణి, జంతువు. (శ ర.)

జ బూతగెనుసు, బూతపల్లి

బూతి. వి. (సం. భూతిః) ౧. బూది, బూడిద.

క. బూతము విడువంగఁ జల్లు బూతియు బోలెన్. యయా. ౨౯౧.

౨. తిండి. (శ. ర)

బూతు. వి (శ బూతు) ౧ కుత్సితపుతిట్టు.

ద్వి. కొలనివారల బూతు గెరలఁ దిట్టుచును...
ద్వి. హరిశ్చ ఉ. ౧౩౯౩. పం.

సీ. ఎక్కలమ్మ యటన్న నొక్కట కొడవను బోతురాజా లటన్న బూతు కుదువు ...
శుక. ౩. ౪౯.

౨. అసత్యము.

సీ. బూతు నా బూమె నా ... అబద్ధ సంఙ్ఞి
క్రైమ యలరుచుండు.. ఆం. భా. ౧.౧౧౭.

౩. బట్టు, స్తుతిచేసి జీవించువాఁడు.

ఆ. బూతు వొగడినట్లు వొగడెడు పొగడంగ,
వలయుచేని సుగుణవంతు లయిన, కర్ణశల్యు
లాదిగాఁ గల వీరులఁ, బొగడుచుండ రాదె
ప్రాడ్డువోక. భార. సభా. ౨. ౪౭

విశే. అసహ్యముగా తిట్టువాఁడు

గీ. బూతు కూనగాఁడు పావకుండు, బొంకు
లాఁడు ప్రుచ్చు ముండరి కొండీఁడు, కల్లు
ద్రాగువాఁడు సాక్షి విజ్ఞా ౩ ౧౦౪

శ్లో॥ స్త్రీబాలవృద్ధకితవ మత్తోన్మత్తాభిశస్తకాః,
దృష్టదోషశ్చ అసాక్షిణః
యాజ్ఞ. ౨ ౭౧.

(దృష్టదోషః దృష్టవిరుద్ధవచనః అని వ్యాఖ్య)

గీ. వాదులానితోఁ గ వాట్లనితోడను, బూతు
తోడను బూతుతోడఁ దిండిపోతుతోడ,
ఆ నటుమటీనితోడ నడియరితోడను, తలకు
చెత్తమాడ తెరవుగాదు.ఈ వారి ౩ ౧౧౨

సీ. ఒండలు బూతులు పరిహాసకులు నట్టువా
రాదిగాఁ గల వారు దక్కఁ, జెలువారియూలు
తాఁ బ్రియుఁడు వారింపఁగఁ బరుతోఁడఁ
బల్కినఁ బణశతంబు తెలిసి దండువల
విధింప వలయు. విజ్ఞా ౨. ౧౧౬.

బూద¹. వి. తృణవిశేషము

గీ. ... గడ్డి, ఫుల్లఫూ రూచయును బూద
పూలగడ్డి, కదురు తుంగాకు తుంగలు
గలయ విడిచి ... హంస. ౫. ౪౩.

బూద². వి. పాలకుండ

మ. ఉదరాలాభుల కెక్కి నిక్కి సహాజాం
భోపేంద్రసంయుక్తఁ లై, చదలన్ బూద
శశాంకవీరి కరవిస్తారంబులన్ బట్టి పి,
ట్టదుమం గాఁ జకోరగోపతతిపాశా
చంద్రికాక్షీరముల్, పొదలెన్ ఘూర్ణిత
దుగ్ధధామనిబిడప్రోద్భూత సంరంభముల్.
వసు. ౪. ౨౦.

బూది=బూడిద, బూడ్ద. వి. (సం. భూతిః)
భస్మము. బూడిద, గోమయభస్మము.

మధ్యాక్కర. ప్రోక్షైన భస్మంబు వాయఁ
ద్రోచి యబ్బూదిలో నడఁగి, రేపుగు
గొడుకులతోడ నం దొక్కయింతి యత్యు
గ్ర, పావకదగ్ధులై యున్నఁ జూచి
యపౌరులు దాని, భావించి కుంతియుఁ
సుతులు వని శోకపరవశు లగుచు.
భార. ఆది ౬. ౧౬౫.

గీ. ఎండుసకు బిష్ట నిచ్చిన చంద మొందు,
బూదిలో నేయి వేల్చుటఁ బోలు...అపాత్ర
జనులకుఁ బెట్టుట పారవేంద్ర
భార. శాం. ౧. ౩౩౨.

క. ఆదిత్యాస్త్రజ్వలనము, భూదిగ్గగనములు
నిండి పొదివి మహోగ్రంబై దానవు ఘన
దేహము, బూదిగ నొనరించెఁ జిత్రముగ
నొకమాత్రన్ భా. అర. ౪ ౪౧౨.

సీ. కకపాలదలిబూదిఁ గన్నులలోఁ బ్రామి
బాధింతు రప్సరః పల్లవకుల. హర.౫.౧౦.

జ. బూదిచలుమ, బూదిపొలసుదిండు.

బూది². వి. తృణవిశేషము.

క. పుట్టితి బుద్ధి రాంతేంగితిఁ, బుట్టించితి జగము
సగముదోరాను బ్రాయం, బిట్టి వినూతన
సృష్టులు, పుట్టుట లే దార యిట్టి బూమెలు
భూమిన్ భాగ ౧౧ పు ౫౩౬.

గీ తిలక మొగిఁ దీర్చి మిత భుక్తి సలిపి పెంట,
బూమె లెఱుఁగని యొకపాటి బడుగ
యాకు, మడుపు లందీయ మోహంబు మరులు
గొల్ప, జడలె నలబామ నిజకేళి వేశ్మనీమ.
హంస ౧. ౧౨౦

౪. అబద్ధము.

సీ బూతు నా బూమెనా బూకనా బూటక
మ్మనఁగను వేడబ మనఁగఁ దొడికె
గీ యనఁగను నబద్ధసంజ్ఞ రై యలరు
చుండు . ఆం. భా. ౧. ౧౧౭.

౫. వంచన, మోసము.
(చూ. బూమెచేయు.)

విణ వంచకుఁడు, మాయగాఁడు.

ద్వి ఒకవిచారము మాకు శోదశ నీరాజా,
సుకవాసి పనిపంచ చూపుగుజ్జంబు, బూమె
తుంటరి యొనుపోతుపై వాన . .
ద్వి హరిశ్చ ఉ. ౧౪౯౭. పం.

జ బూమాట, బూమెకత్తియ, బూమెకాఁడు,
బూమెచేయు, బూమెలాఁడి, బూమెలాఁడు.

బూమికత్తి(త్తె)యు. విణ. (√బూమె) వేషము
వేయునది, వంచకురాలు.

సీ. పుష్పలావిక యొర్తు బూమెకత్తియ యొర్తు
గంధవాహిని యొర్తు గొత్తులంకె . .
కాశీ. ౫. ౩౧౬.

బూమెకాఁడు. విణ. (√బూమె) మాయావి,
వంచకుఁడు

సీ. పూవుటమ్మల వేయు బూమెకాఁడు ...
ధనా. ౧. ౩౪.

బూమెచేయు. స. క్రి (బూమె + చేయు)
మోసపుచ్చు, వంచించు

గీ. నన్నుఁ గొనివచ్చినపుడు భూనాథ నీవు,
నీకుఁ గలుగు వ్రతంబులు నియమములును,
దెలియఁ జెప్పిన నిక్కల తేరిచూడు,
భూప వలదు నన్నింత బూమె సేయ.
రుక్మా ౫. ౧౦౪.

ఇట్లే, బూమెలుచే(సే)యు

ద్వి. చేసిన నేరమి చేసేతఁ గుడువఁ, జేసి యీ
బూమెలు సేసె దైవంబు
ద్వి హరిశ్చ. ఉ. ౪౨౪. పం.

సీ. భువనమిలో వట్టియా బూమెలు సేయంగ నే
నేర్తు మఱియును నేన నేర్తు...
విప్ర. ౪. ౨౯.

బూమెలాఁడి. విణ. (√బూమె) బూమెకత్తె
(క ర.)

బూమెలాఁడు. విణ. (√బూమె) బూమె
కాఁడు. (క ర.)

బూర = బూరగ. వి. (సం. పూరః. ప్రా
పూరో) ఊఁదునట్టి వాద్యవిశేషము, కాహళి
భేదము, బాఁకా.

గీ. అపుడు కోఁతుల నూఁదు వాయనికడంక,
వానరుల చేత వడిఁ గమ్మలవిచి యొల్ల, కోన
త్రిమ్మరి మూకలఁ గూడఁబెట్టి, తిరి మెలు
యంగ బూర వట్టించి తరలి.
అచ్చ. రా. కిష్కి. ౧౩.

సీ. నీరపుట్టువయును నీరపుట్టువయును
బూరయు దొడవుగా బొలుపు మెఱప . .
అచ్చ. రా. శాల. ౩.

విశ. స్థూలము. (శ. ర.)

జ: బూరకాలివాఁడు, బూరకాలు, బూరగడ్డి,
బూరగొమ్ము.

బూరఁడు. విశ. (సం. పూరః) విజృంభించు వాఁడు

ఉ. చెప్పిన వద్దురాత్మకుఁడు సింగఁడు బూరఁడునై సుహృత్తముం, దప్పక చూచి పూర్వసుకృతంబునఁ గాంచిన సొమ్ము నెమ్మమై, నిప్పులిమేరకేసరమహీరుహమూలమునందు డాఁచిపో, నొప్పు నొరు ల్గనుంగొనరయూరి కరయా కొనిపోవఁ జూచినన్
వేం. పంచ. ౧. ౩౦౪.

బూరకా(గా)లివాఁడు. విశ. (బూరకాలు + వాఁడు) ఏనుఁగు కాలు గలవాఁడు

సీ...బూరకాలి,వాఁ డెనఁగఁ బ్రవృద్ధపాదుఁడు దనరారు అం. భా. ౨. ౧౨౨

గీ. వ్రేలుడగు బొజ్జగల బూరగాలివాని . .
ఆము. ౬. ౧౯.

బూరకా(గా)లు. వి. (బూర + కాలు) ఏనుఁగు కాలు, రోగముచే వలముగాఁ బెరిఁగిన కాలు.

సీ. బూరకాళులు నీచఁబోయినచేతులుఁ గోఱ మూఁపులు గుదిగొన్నతోడలు . .
హరి. ౨. ౧౨౨.

బూరగ = బూర. వి. ౧. ఊఁదెడు వాద్యవిశేషము.

ద్వి. సంగీతవాద్యఘోషంబులు మెఱఁగ, బూరగల్ గంచుకొమ్ములు కాహళములు ...
ద్వి. సభ. ౨. ౫౫౧.

౨. నాగస్వరంబునకు శ్రుతియిచ్చెడు వాద్యవిశేషము. (శ. ర)

బూరగడ్డి. వి. (బూర + గడ్డి) తృణవిశేషము. (శ ర)

బూరగొమ్ము. వి (బూర + కొమ్ము) ౧ ఊఁదెడు వక్రవాద్యవిశేషము, కొమ్ముబూర

ఉ .అద్భుత,స్ఫారతరార్భటిం బిరుదుసంకులఁ దారలు బూరుగొమ్ములున్, భేరులుఁ దమ్మటంబులును భీషణవృత్తిని బిట్టు మ్రోయఁగన్. కళా ౭ ౧౧౭ (ఇటరద్వయ ప్రాసపాంకర్యము )

ఉ తారలు బూరగొమ్ములును దప్పెటలున్ ఒటహంబులున్ బదుల్, నూఱులు వేలు మ్రోయ రామా ౭ ౬౯

౨ శంఖము.

వ మొసలివారొంటుల నాయఁడ బూరగొమ్ముగల తుపాసి .. ప్రబంధ ౨౧౬

సీ శంఖము చిందము సంకు బూరగొ మ్మనఁ దనరారు . . అం. భా. ౧. ౧౬౧

బూరట. వి. (సం. పూరః.) ఉబ్బు, పొంగు, ఉబ్బటము. (చూ. బూరటిల్లు )

జ: బూరటించు, బూరటిలు.

బూరటించు. స. క్రి. (√బూరట) బూరటిల్లఁ జేయు, నింపు (శ. ర.)

బూరటిలు(ల్లు). అ. క్రి. (√బూరట) నిండు.

క. అతఁ డంబుదప్రై గర్జిల్లె నభము బూర టిలంగాఁక. భార. ద్రో. ౫. ౨౨౧.

గీ.. నభోమండలంబు, బూరటిల బట్టు కవి రాజుఁ బొగడి పొగడి.. నైష. ౪ ౬౩.

సీ కలముపైఁ గీలించి గాలి కత్తిన చాఁప వోలె మిన్నంతయు బూరటిల్లె.

భార. ఉద్యో. ౪. ౧౧౬.

గీ. పడగతోడను దునుమాడి పటుహయములఁ, జంపి సారథిఁ బరిమార్చి సకలనభము, బూర టిల్లంగ సింగంబుపోల్కిఁ జెలఁచెఁ, బోరి నుదీర్ణగర్జాపరిస్ఫూర్తిఁ జెలఁగి.

హరి. ఉ. ౬. ౧౫౬.

బూరము. వి. అడంబరము. (చూ. బటా బూరము.)

జ. బటాబూరము.

బూరి(రె)యు. వి.(సం. పూరికా) భక్ష్యవిశేషము.

సీ ...ఉండ్రాలు నూబిండి పుండ్రేక్షులుం జేసి యునఁట పండ్లం బూరియలు ఘృతంబు. గీ. నాదిగా భక్ష్యభోజ్య లేహ్యాదు లయిన, బహు పదార్థంబులు వార ౬ ౫౫

గీ. బూరియలు లడ్డువంబులు పొరలి పాలు

నైష ౬ ౧౨౪.

మత్తకోకిలము. పాయసంబుల రొంపులన్ బహుభంగి బూరెలు నట్టులు స్నేయుఁ జాలును. హరి. పూ. ౪ ౧౫౨

సీ. గారెలు బూరెలు చారులు సారులఁ గమ్మని మాంసముల్ భుమ్మ మనుచు ...

ఉ. రా. ౬. ౧౨౨

సీ... బూరె యనంగను బూరెల కేగు ...

అం. భా. ౨. ౨౫౫.

క. పూరణము లేని బూరెయు.. సు. శ. ౩౬

బూరుగు(వు)[1]= బూర. వి. కాహళీ భేదము.

సీ. బూరుగు నాఁగను బూరుగుబ్రానికి నూఁదెడు బూరకు నొనరు.. వేంక. నానా. ౧౨౧.

క.. బూరుగు నా నూఁదు వాద్యమును శాల్మ లియున్ అం సం నా ౧౨.

బూరుగు(వు)[2]. వి శాల్మలివృక్షము

క హితోపదేశ కర్తల పలుకున్, వినక కుజ నుండు సాహసమునఁ జెడు బలుగాడ్పుఁ దొడరు బూరుగు లీలన్ ఉ రా ౨. ౧౦.

గీ. హత్తుకొని మొత్తులాడి పెన్నెత్తురొలుకఁ, జాచువారల కెంతయు సొబగు మీఱ, బూరుగుల పోల్కిఁ బొలిచిరి

అప్ప రా యు ౧౩౫.

చ. .నీ వటుకిడింది వగండవు నిన్న దాకవం, బెఱుకటి పేరు బూరుగ నశించితి గా కిటు పల్కు లేఁటికిన్ భార. శాం. ౩ ౩౯౦ (ఇట నిస్సారమని భావము)

సీ పూరణి తేజరిల్లు, బూరుగం చనఁగను .

అం. భా. ౨ ౪౪

గీ బూరువా యింత పఱపును బొడవుఁ గల్గి, నీవు మృగపక్షి సంశ్రయణీయ మగుచు ...

భార శాం ౩. ౩౭౪.

జ బూరుగుదీవి

బూరుగుదీవి. వి. (బూరుగు[2] + దీవి) శాల్మలి ద్వీపము (శ. ర)

బూర్నీసు. వి. మిక్కిలి మెత్తగా నుండుకంబళి

వ...చలికప్పడంబులు సకలాతి గుడారములు
బూర్నీసు ల్లారి కెట్టు గిప్ప నక్క గోడ
సరాదుల పటవికెంపులు

ప్రబంధ ౬౦౫.

**బూటకొమ్ము**=బ ఱ్ఱటకొమ్ము. చిమ్మ న గ్రోవి, నీళ్లు చిమ్మెడి గొట్టము.

ఉ తోడనె లేచి దాడమ ప్రలోదము గా
సెనుబోతుతో జము ౧, మూడిన నక్కటిన్
మడుగు లూనిన సెత్తుట వగ్న శృంగముల్,
ప్రోదతనంబునం దగిన బూటకొమ్ములు
గాఁగఁ ఒల్లుపో,రాడిరి నిన్న రావణ రణా
వని భూతకాచ బాలికన్

కవిక. ౨ ౧౧౪.

**బూల.** వి శేఁ౩ తాటిమ్రానిలోని మెత్తని పేడు (శ. ర. ప్రా)

**బూలి.** విణ. (√ బూల) నిస్సారమైనది (శ. ర)

**బూసము.** వి. (సం. బుసమ్) ధాన్యము. (శ. ర. ప్రా)

సీ. బూసంబు దఱిపి పేర్పున నమ్మికొమటుకుఁ
గఱవుగోరెడు దోసకారి బుడుగ

వేం పంచ. ౧ ౪౬౩.

**బూసి.** వి. ఇండ్లవాసములపై పట్టెడు సాలెపట్టు. (శ. ర. ప్రా.)

## బృ

**బృంద.** సం. వి. అ స్త్రీ ౧. తులసి. ౹. ౨. రాధిక ౩. గోకులమునకు సమీపమందున్న అరణ్యము, బృందావనము.

**బృందము.** సం. విణ. (అ. ఆ. అ) అనేకము, అసంఖ్యాకము. వి. అ. న. ౧. సమూహము, గుంపు ౨. రాశి, ప్రోఁగు ౩. దశార్బుద సంఖ్య, పది యర్బుదములు

**బృందారకము.** సం. విణ (అ ఆ రికా అ.) ౧ విరివిరియైనది, బహుళము ౨ శ్రేష్ఠమైనది ౩ మనోహరము, ఇంపైనది. ౪ గౌరవాస్పదమైనది

**బృందారకుఁడు.** సం. వి అ పుం ౧ వేల్పు, దేవత ౨ (సమాసాన్తమున) ముఖ్యుఁడు, ప్రధానపురుషుఁడు.

**బృందారణ్యము.** సం బృందావనము

**బృందారము.** సం విణ (అ ఆ అ.) ౧ విరివియైనది, గొప్పది. ౨ శ్రేష్ఠమైనది. ౩ మనోహరము, ఇంపైనది

**బృందావనము.** సం వి. అ. న. ౧ గోకులమునకు సమీపమం దున్న యడవి. ౨. తులసికోట, తులసిచెట్టు వేయుటకై యెత్తుగావేసిన వట్రు దిబ్బ

**బృందావని.** సం వి ఈ స్త్రీ. తులసి ౹

**బృందిష్ఠము.** సం. విణ (అ ఆ అ) ౧ మిక్కిలి గొప్పది ౨ మిక్కిలి చక్కనిది.

**బృందీయము.** సం విణ. (స్ సీ స్) ౧ ఘనతరము, విశాలతరము. ౨ సుందరతరము, ఒకదానికంటె నెక్కువ చక్కనిది

**బృంహణము.** సం విణ (అ ఆ అ) వర్ధకము, పెంచునది. వి. అ. పుం ఒకగొబ్బున పిండ్లివంట న. ౧. వర్ధనము, పెంచుట ౨ ఘీంకారము, ఏనుఁగుగీఁక (విల్యమ్సు)

**బృంహితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వర్ధితము, పెంపఁబడినది ౨ పెరిఁగినది, అధికమైనది. వి. అ. న. ఏనుఁగుఘీంకృతి గీఁక.

బృసి. సం. వి. ఈ. స్త్రీ. ఋషుల యొాసనము.

బృహచ్చంచువు. సం. వి. ఉ. పుం. మహా చంచుశాకము. టీ.

బృహచ్చిత్రము. సం. వి. అ. పుం. మాధీ ఫలము. టీ.

బృహచ్ఛల్కము. సం వి. అ. పుం. చింగట మత్స్యము.

బృ(వృ)హతి. సం. వి. ఈ. స్త్రీ. ౧ పెద్దవీణ ౨ విశ్వావసుని వీణ ౩ దేహమునందు రొమ్మునకును, కొన్నెముకకును నడుమ నుండు భాగము. ౪. కప్పడు దుప్పటి, ఉత్తరీయ భేదము. ౫ వారిధాని, నీరు నిలువచేయు చోటు. ౬. క్షుద్రవార్తాకి, చిన్నములక టీ ౭ కంటకారి, వాకుడు. టీ. ౮. వాక్కు. ౯. నవాక్షరపాదకముగు ఛందోభేదము.

బృ(వృ)హతిక. సం. వి. అ స్త్రీ. ఉత్తరీయము, పైని కప్పుకొను వస్త్రము

బృ(వృ)హత్తు. సం. విశే (త్. త్. త్.) పెద్దది, గొప్పది, ఉరుజ్ఞనది వి. త్. పుం, విష్ణువు న. ౧. వేదము ౨ సామభేదము. ౩. బ్రహ్మము.

బృహత్కందము. సం. వి. అ. పుం ౧ గృంజనము, తెల్లుల్లి టీ. ౨. విష్ణుకందము. టీ

బృహత్కాసము. సం. వి. అ. పుం రెల్లు. టీ.

బృహత్తాళము. సం. వి. అ. పుం. హింతాళము, గిలకతాడు. టీ.

బృహత్తిక్త. సం. వి. అ. స్త్రీ. పాఠ. టీ. (రాజ. వి.),

బృహత్తృణము. సం వి అ న. వెదురు. టీ.

బృహత్త్వక్కు. సం వి చ్. పుం. వృక్ష భేదము.

బృహత్పత్త్రము. సం వి అ. పుం. హస్తి కందము. టీ అ స్త్రీ త్రిపర్ణిక టీ

బృహత్పాటలి. సం వి. ఈ. స్త్రీ. ఉమ్మెత్త, దుత్తూరము టీ (త్రి వి)

బృహత్పాదము. సం వి అ. పుం వటము, మఱ్ఱి. టీ

బృహత్పారేవతము. సం వి అ పుం మహా పారేవతము

బృహత్పాలము. సం. వి. అ. పుం పోడి చెట్టు (అ ని.)

బృహత్పాలి. సం వి. న్. పుం. అడవిజీలకఱ్ఱ.

బృహత్పీలువు. సం. వి. ఉ. పుం. వరగోగు, కొండగోగు. టీ

బృహత్పుష్పి. సం. వి. ఈ. స్త్రీ. ఘంటారవ వృక్షము.

బృహత్ఫల. సం వి అ స్త్రీ. ౧. కటుతుంబి. టీ. ౨. మాహేంద్రవారుణి టీ ౩. కూశ్మాండి, గుమ్మడి టీ. ౪. మహాజంబువు, పెద్దనేరేడు. టీ.

బృహదంగము. సం. విశే (అ. ఈ. అ.) పెద్ద శరీరము గలది. వి. అ. పుం. ఏనుగు.

బృహదమ్లము. సం. వి. అ. పుం. కామరంగము.

బృహదారణ్య(క)ము. సం. వి. అ. న. ఒకా నొక ఉపనిషత్తు (ఇది శుక్ల యజుర్వేదోపని షత్తు.)

బృహదేల. సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకి. ‡.

బృహద్గృహము. సం. వి. అ. పుం. కారూపదేశము. (వాచ.)

బృహద్గోలము. సం. వి. అ. న. నీటిపుచ్చ. ‡

బృహద్దళము. సం. వి. అ పుం. ౧. హింతాళము, గిలకతాడు ‡. ౨. పట్టికాలోధ్రము.‡. (రాజ. ని.)

బృహద్ధలము. సం. వి. అ. న. మహాలాంగలము.

బృహద్బీజము. సం. వి. అ. పుం అంబాళము, ఆమ్రాతకము.‡. న అండవృద్ధి.

బృహద్భట్టారిక. సం. వి. ఆ స్త్రీ దుర్గ.

బృహద్భానువు. సం. వి. ఉ. పుం ౧ అగ్ని. ౨ చిత్రమూలము ‡.

బృహద్రథంతరము. సం. వి. అ. న. ౧. సామభేదము ౨. అగ్నిభేదము.

బృహద్రథుఁడు. సం. వి అ పుం. ౧. ఇంద్రుఁడు. ౨ ఒకరాజు. (జరాసంధుని తండ్రి)

బృహద్రథము. సం. వి. అ. పుం. యజ్ఞపాత్రభేదము

బృహద్రావి. సం వి. న్. పుం. ఒకజాతి చిన్నగుడ్లగూబ, క్షుద్రోలూకము.

బృహద్వతి. సం. వి. ఈ స్త్రీ. ఒకానొకనది.

బృహద్వల్కము. సం. వి అ పుం. పట్టికాలోధ్రము, తెల్లలొద్దుగు. ‡.

బృహద్వాతము. సం. వి. అ. పుం. (అశ్మరీరోగమును హరించు) ధాన్యభేదము.

బృహద్వారుణి. సం. వి. ఈ. స్త్రీ. మహేంద్రవారుణి, పెద్ద చేఁదుపుచ్చ. ‡.

బృహన్నల. సం. వి. ఆ. స్త్రీ. విరాటనగరమున అజ్ఞాతవాసము నాఁటి అర్జునుని పేరు.

బృహన్నలము. సం. వి అ. పుం. పెద్దకిక్కిస. ‡

బృహన్నారదీయము. సం. వి. అ. న. ఒకానొక ఉపపురాణము.

బృహన్నౌక. సం వి. ఆ. స్త్రీ. చదరంగము

బృహన్మరీచము. సం వి. అ న. మిరపకాయ (శ ర)

బృహస్పతి. సం. వి. ఇ పుం ౧. సురగురువు, వేల్పుటొజ్జ ౨ ఒక గ్రహము ౩ ఒకముని (వాచ)

బృహస్పతిచక్రము. సం వి. అ. న. ఒకానొక గోచారచక్రము. (బృహస్పతి యున్న నక్షత్రము మొదలిడి జన్మనక్షత్రము వఱకు లెక్కింపఁగా మొదటి నాలుగు రాజ్యమును, తరువాతి నాలుగు సౌఖ్యమును, పిమ్మట యొకటి ధైశ్వర్యమును, తరువాతి యైదు ప్రీతిసిద్ధిని, అటుపిమ్మటి యాఱు పీడను, పై నాలుగు మృత్యువును, అటుపై మూఁడు సుఖమును ఇచ్చును. (వాచ.)

బృహస్పతివారము. సం. వి అ పుం. ఒకవారము, గురువారము, (ఇదియె లక్ష్మివారము అని కూడ అనఁబడును.)

బృహస్పతిసవము. సం. వి అ పుం. ఒకానొక యజ్ఞము. (వాజపేయయాగము చేసి పిమ్మట బ్రాహ్మణుఁడు బృహస్పతి సవనము చేయవలయును.)

# బె

**బెంగ.** వి. ౧. విరహవ్యథ, ఎడబాటువలని దుఃఖము. (చూ. బెంగగొను.)

౨. మనోవ్యాకులత, కలవరము.

(వ్యవ.) ఆ పిల్ల పెండ్లికై తల్లికున్న బెంగ తండ్రికి లేదు.

౩. కేక, బొబ్బ. (చూ. బెంగలిడు.)

జ: బెంగగొను, బెంగటిలు, బెంగపెట్టుకొను, బెంగలిడు, బెక్కొట్టు.

**బెంగగొను.** అ. క్రి. (బెంగ + కొను.) విరహవ్యథ నొందు.

ఉ... ధారుణీకాంతుఁడు సంతసం బడరఁ గ్రన్నన నన్నవవింటిదంటచే, వంతఁ గలంగి బెంగగొని వాలెము దాలిమి దూలి కేవ్రుసీ, చెంతకు వచ్చి హెచ్చు తమిఁ జేకొను మా కొదఁగూడు వేడుకల్ రసిక ౫౪.

**బెంగటిల్లు(లు).** అ. క్రి (√బెంగ.) బెంగపెట్టుకొను

(వ్యవ.) ఆ కుఱ్ఱవాఁడు తండ్రికొఱకు బెంగటిల్లియున్నాఁడు.

**బెంగపెట్టుకొను.** అ. క్రి. (√బెంగ.) ఎడబాటు వలన మనోవ్యథచెందు

(వ్యవ.) ఆ పిల్ల తల్లికై బెంగపెట్టుకొని అన్నము తినుటలేదు

**బెంగలిడు.** అ. క్రి. (బెంగలు + ఇడు.) కేకలు వేయు, బొబ్బలుపెట్టు

ఉ. బెంగలిడంగ గంటె యిట పెంటిని గావక కేలిపోయి చిత్రాంగి విచిత్రరత్నభవనాంగణసీమను డేల వ్రాలె నా బంగరుముక్కుపొత్తరము ... పారంగ. ౨. ౪.

**బెండ.** వి. (క. బెండె, త. వెండై.) గోజిహ్వ, ఎద్దుబాలుక. ౧.

(తెలుగున ఒకవిధమగు కూరగాయలచెట్టు, దీనిభేదములు కప్పురపుబెండ, ఏడాకులబెండ.)

గీ. ... బెండ, యవఁగ గోజిహ్వ దగు ... ఆం. భా. ౨. ౬౪.

క బెండా మారెక్కొండా యాడ్రొండా మియందడ కిప్రదు తోరము విూలక్ ... చంద్రి రాద. చంద్ర. వి. ౨. ౧౦౦.

**బెండగిలు(ల్లు).** అ. క్రి (√బెండు.) ౧. ఎత్తువడు, బలహీనమగు

గీ. బెండగిలెను నాఁగ పొత్తువడిరయి, వసుట తగును. ఆం భా. ౩. ౯౫.

౨. వ్యథనొందు, బాధపడు

చ చిటిపొటిమబ్బుల్ చీఁకటి ఘటియించి యథ్వగనికాయము బెండగిలం దటిల్లతా, కుటిలత గొంచెపొటిచినకు ద్దోరగించె ధరాతలంబునన్ శుక. ౨. ౩౪౦.

౩. పెల్లగిల్లు, ప్రయాణమగు. (శ. ర.)

**బెండగు.** అ. క్రి (బెండు+అగు) భగ్నమగు, చెడు.

మ మును లంకాపురిలోన రావణుబలంబుల్ రామసైన్యంబుతో, వని గావించుచు పెడక నిశాచరుల నుద్ఘాటించి రామానుజుని మెప్పించితి నట్టినా కొక మనుష్యుం డెంత నాపేరు విన్నను దేవాసుర వీరసైన్యముల కైనన్ గర్వముల్ బెండగున్. వి. పు. ౬. ౨౬౭.

౨. నిస్సారమగు, బలహీనమగు.

గీ ఏమి చెప్పుదు నీకు నుద్దామవిక్రమాభిరాముండు నాఁ జనువక్కిరీటి, కరము గరము బెండగుటయు గాండీవంబు, వడిరొఁ బుడమిపైఁ గురువరపతికేళ్యా. భార. అశ్వ. ౪. ౩౯.

**బెండాబెడగు.** విశే. వ్యర్థస్థితులని.

క. ... చిందరవందరలై చీకాకై కారుకూరలై పంచబంగాళలై చెల్లాచెదరలై గజిబిజియై బెండాబెడ్డెగ్గె కకావికలై ... ప్రబంధ. ౨౭౫.

బెండు. వి. (క. బెండు.) బెలుగు.

క. మనుజాంగనలం బట్టుట, దనుజాలకుం జెల్లఁ
గాక దనుజాంగనలన్, మనుజాలు పట్టుట
కును దొరకొనిరే బెండులు మునింగి
గుండులు దేలెన్. ఉ. హరి. ౫. ౨౧౯.

క. పెకలించి యుద్ధివఁ జాలుం, బ్రకటిత
దోశ్శక్తి బెండువలెఁ దచ్ఛ్వదము ...
దశా. ౨. ౧౬౭.

విశే. నిస్సారము.

క. ... దుర్యయము ను బెట్టిదము ను బెండు
ను వగుపలు, కొదవదు నీనాలుకకు నరహా
స్నక రుపుడున్. భార. ఉద్యో. ౧. ౩౬౩.

ఉ. పక్షికులేంద్రుఁ డల్గి నిజపక్షపరంపరఁ
బుట్టుగాడ్పువడ్డ, రాక్షసరాజ సైనికుల
రాయిడిఁ జేసిన బండుటాకుల ట్లుత్కట
క్షణంబయిన నచ్చుట నిల్వఁగ లేక బెండు
నై, దక్షిణవార్ధిలోఁ బడిరి దైవశంబున
లంక త్రోవగన్. ఉ. రా. ౨. ౧౦౪.

జ: బెండగిలు, బెండగు, బెండుకొను, బెండు
చేయు, బెండుపఱచు, బెండుబొమ్మ,
బెండుమానిసి, బెండువడు.

బెండుకొను. అ క్రి. (బెండు + కొను) బలహీ
నమగు.

సీ దట్టంపు వలపులతమి బెండుకొని పార
పారకు గుండియ జల్లనంగ నీలా. ౨ ౧౩

బెండుచేయు. స. క్రి (బెండు + చేయు) నిస్సా
రముఁజేయు

సీ. మండెడు వటుకాలదండంబు చేతులఁ
బిసికి వేఁడిమి యార్చి బెండుచేసి.
హరి. పూ. ౪. ౧౫౫.

బెండుపఱచు. స. క్రి. (బెండు + పఱచు.) ౧.
బలహీనతకొందించు.

శా. ... దైర్యధ్వంసి యై తెంచుచున్.

సీ. ద్రోణుని నిరువదిబాణంబులఁ దెమల్చి
భీముని మున్నాట బెండుపఱచి.
చిత్రభా. ౭. ౧౦౯.

సీ. కర్కార్ణ కెత్తురుగ్రక్కించి కొక్కరపిండు
గుండియ లెల్ల బెండుపఱచి. గీ. పాకు
వంబు విజయపాలుఁ జేరె. ద్వా. ౧౨౩౭.

౨. సంహరించు, చంపు.

సీ. చంపకైశ్రీ మీఱి కొండలోయలఁ దూఱి
గండకమ్ములఁ జేరి బెండుపఱచు. గీ. ...
శకుంతలానందనుండు. కృ. శకుం. ౩. ౭౯.

గీ. సామి నానిన్నపము విని సారెకడలి, కుంక
మలచెంత గడెకడ వృష్ణఁ జాలఁ బెండు
బెండాడి మేకముల బెండుపఱచి, దేవరకు
వేడ్క పుట్టింతు దేవుదాన.
శుక. ౧. ౧౫౭.

బెండుబొమ్మ. వి.(బెండు + బొమ్మ.) బెండుతోఁ
జేసినబొమ్మ, బెలుగుబొమ్మ.

మ. ... బెండుబొమ్మగతి నుండె స్పందితం
బల్క నై. ఆము. ౫ ౬౩.

బెండుమానిసి. వి. (బెండు + మానిసి) పిఱికి
వాఁడు, భీరువు.

(బలహీనుఁడైన మనుష్యుఁడు అని శ. ర.)

వ. . వారలగరుడకపిధ్వజంబులఁ జక్రగాండీ
వంబులు బెండుమానసులకుభీషణంబులు.
భార. కర్ణ. ౨. ౪౬.

శ్లో॥ అర్జునేగాండివం కృష్ణేచక్రం తార్క్ష్యకపి
ధ్వజౌ, భీరూణాంత్రాసజననం శల్య హర్ష
కరం మమ. సం భార కర్ణ ౩౪ ౧౪.

బెండువ(ప)డు. అ. క్రి (బెండు + పడు) ౧
నిస్సత్త్వమగు, బలహీనమగు.

గీ దైర్యమేన భీతి, బలుచేఁ గొంత బెండు
పడియుండెఁ గొంత భార. అర ౭ ౨౬

క. పాండవబల మల్పం బై, యుండం
గృష్ణుఁడు ధనంజయుఁడును దప్పం,
బెండువడఁగఁ గని మనమును, గండడఁగఁగ
జేల గెలువు నైకొనవచ్చున్.
భార. శల్య. ౧. ౩౦౯.

లయగ్రాహి. విండులను గోలలును దండిగను
గేలఁ గొనికొండగుమ లారయుచు బెండు

పడ కే మృద్దండభుజశక్తి మెయి మెండు కొని... పె శకుం. ౧. ౧౧౩.

౨. సారహీనమగు.

సీ. చండభీషణ శైవజముగ దాదండంబు విఱు సంతయును వాసి బెండుపడిరో.

భీమ. ౪. ౧౦౩.

సీ. భామినీమణి బెండుపడనిసింగిణులు నీ కను బొమ్మ లై తుది వకార్ముకునకు

కవిరా. ౨. ౧౩౦.

క.. పీసుల్, బెండుపడ నోంద్రకొట్టుచు, దుండగపు ఖురంబు తన కెదు రృణ తేరన్.

వేం పంచ. ౩. ౫౫.

(ఇట చిల్లులుపడు అని భావము)

౩. వ్యర్థమగు, నిష్ఫలమగు.

సీ.. అదియు, సద్విజోత్తమ మీఁద జపలతఁ గావించు వభిచారకర్మంబునట్లు బెండుపడి పఱతేఁ గని పద్మోదరుఁడు .

భాగ. ౩. ౬౮౮.

సీ. దనుజాధముఁడు కొనకొఱఁ దప్పించె నో భిదురంబు సేఁడేల బెండుపడిరో

భాగ. ౯. ౩౩౬.

౪. అలయు, శ్రమ మొందు.

వ.. ధృష్టద్యుమ్నుండును బెండుపడి యున్న వాఁడు ... భార. కర్ణ. ౧. ౧౫.

వ. ... పండుకొన్నాల మెండున బెండుపడి కాలిమి చిందువంద్ర ... మనుచ. ౩. ౨౭.

౫. అల్పమగు, తక్కువయగు, ఉడుగు, నశించు.

గీ. .. విరుదు రాతులవార్తలు బెండుపడఁగ.

కళా. ౭. ౬౭.

గీ. గర్వములు బెండుపడఁ గౌతుకములు ముడుఁగ. నృసిం. ౨. ౯౦.

గీ. నాగభీషణబాణప్రయోగములను, భీమవరవర చేష్టలు బెండుపడఁగ. రాఘవ. ౪. ౧౨౬.

౬. ఖేదము నొందు, దుఃఖించు.

వ. ... మమ్ము సమ్ముఖంబున నాలోకించు చుండియు బెండుపడి యోలంబునం దల ద్రాల్చి తాచుకొని మిన్న కున్న యది ...

పా. శకుం. ౨. ౩౫.

వ.. ఒక్కయెడ జాతివిరోధం బైన కాల కాలంబానుచు నొక్కచాయ రాశి మిత్ర త్వంబు దాలనుండిన బెండువడుచు ...

శుక. ౨. ౧౭౦.

౭ నిశ్చేష్టమగు.

క అబెడిదపుబ్రోతకుఁ గా,దే బమ్మెరపోయి దేవ దేవరనగరన్, వే బెండువడిరి మొగి ములపై బెగ్గలికంబు దేఁట బరిజను లెల్లన్.

హరి పూ ౯ ౪౩.

బెండడి. వి. ౧. రొంపి, ఇటుకలు తాళ్లు, కొంద లగునవి కలిపి గోడకట్టుటకు మధ్యను వేయు పలుచనిమన్ను, సున్నము మొ.

సీ అగరుజంబాలంబు నందు బెండడి చేసి పన్నీరు కొల్లవఁ బరిఖఁ దార్చి గీ భీమనా థుని నగరి యారామ శేఖ్య బూజ చెసిరి సహకారధూరహమల భీమ. ౫ ౧౦౦

వ. . అందంద ప్రవహించునిందూపలస్యం దంబులకు విందు లగు నిందీవర మరందం బుల బెండడిం బడి... మనుచ. ౩. ౨౭.

సీ కంకర బెండడి గార సోద యనంగ లేప విశేష మై లోఁపఁ దగును.

ఆం. భా. ౨. ౧౩.

బెకబెక. వి కప్పలు కూయుటయందగు ధ్వనికను కరణము. (చూ. బెకబెకలాడు )

జ: బెకబెకలాడు.

బెకబెకలాడు. అ క్రి (బెకబెకలు + అడు) బెక మని కూయు. (శ. ర )

(వ్యవ.) కప్పలు బెకబెకలాడును.

బెకొట్టు. అ. క్రి. (బెంగ + కొట్టు) వాపోవు. (శ. ర., ప్రా.)

బెగడించు. స. క్రి. (√ బెగడు) భయపెట్టు, బెదరించు.

క ...చిగురు విలుకాఁడు రతి వను, బెగడించెడు నీవు సహజ ధీరత వగుటన్.

ప్రబోధ. ౧. ౫౨.

బేడ[2]. పొట్టుతీసిన కాయధాన్యములపప్పు.

ఉ. బెల్లపుటచ్చులున్ పెసరబేడలుఁ జిమ్మిలి నువ్వుటుండలున్ హర. ౨. ౯౧.

గీ. పెరుఁగు వడియంబులును బచ్చిపరుగు బేడ, లురతరాచ్యుతపూజోపకరణపేటి,కలును .. ఆము. ౨. ౯౩.

సీ. పప్పు బేడ యన నూపంబు తనరు ఆం భా. ౨. ౨౪౭

బేడ. స వి ఆ స్త్రీ పడవ

బేడ(ము). సం వి. అ న. చిల్లులేకుండదట్టముగాఁ గూర్చుట.

బేడస(ము) = బేడిస. వి. మత్స్యవిశేషము. ఎగి రెడిచేఁప, పాఠీనము

సీ. ఒలుచెపసలతోడఁ గలహింపఁ దగుజాడఁ గలికి చేటపెడందకన్ను లమర. చంద్రా ౨ ౧౧౪

సీ. పరకోక్కాలు బేడసమీలఁ దరఁగలు తెగదాటి నడిమికిఁ దొచ్చుకొనఁగ కకు ౨. ౭౦

సీ. బేడసంబుల నిచ్చి వేడుక కాంద్రకు గొండెల, ఒలుదుండగీల కిచ్చి ద్వా. ౧ ౨౪౦

బేడా. వి గర భలయమునకుచుట్టునుండెడి మండపము

సీ. దర్పణాకృతిఁ దళ త్తళలాడుకంబాలు డంబై చెలంగు బేడా హొరంగు. సిం నార ౧౨

బేడిగె = బెడిగ. వి (సం భాటకః, క. బాడిగె.) పన్ను, భాగధేయము (బేడిగ. అని చి ని, శ. ర, బ్రా.)

వ. సాగివచ్చినపూర్వపు మాన్యపు క్షేత్రాలక్షత్రితము బేడిగెరొఖం యూతదాతిథిపుణ్యకాలమందు తమతండ్రి వీరవసాయనింగారికి పుణ్యముగా ధారబోసియి స్తిమి. గు జి గుత్తికొండ. శా. ౧౫౦౭.

బేడిజేము. వి. మాయ, టక్కు. (శ. ర., బ్రా.)

బేడిదము = బెడిదము. విశే. భయంకరము.

క. బేడిద మగు నా దెబ్బకు, నోడక ... కాశీ. ౪. ౧౭౭.

బేడిస[1] = బేడస. వి. మత్స్యవిశేషము, పాఠీనము.

ఉ. బింబఫలోష్ఠికన్ను లను బేడిసమీల విరు దిక్కులన్ సమానంబుగఁ బర్వుచున్న. . ప్రభా. ౨. ౩౧.

సీ. కొరద దాసరికొయ్య కొఱ్ఱ మీనులను ముచ్చుంగు బేడిస కెల్ల చాలమీను. హంస ౪. ౧౭౩.

జ. బేడిసతిరుగుళ్లు

బేడిస[2]. వి నమస్కారము.

రగడ అనిశంబును వృషభాద్రినియతఖురిపేరిట హరికిని బేడిస లెన్నుచు హంస ౪ ౨౧౩.

బేడిసతిరుగుళ్లు. వి బ (బేడిస + తిరుగుళ్లు.) బాలికాక్రీడావిశేషము

సీ. పిప్పిళ్లు త్రొక్కుళ్లు బేడిసతిరుగుళ్లు వచ్చన గండ్లు దాయాలు పొళ్లు హంస ౫ ౧౫౫.

బేతాళము. సం. వి అ. పుం ౧ పిశాచము. ౨. భూతావిష్టమృతదేహము (శ ర)

బేతాళుఁడు. సం. వి అ పుం యమకింకరుఁడు. (శ ర.)

బేత్రి. వి (హిం భేత్రి) మూఁడు. (ఇది సాగటా లాటపరిభాష)

సీ. కంకణంబులు మ్రోయఁగా దుగా బేత్రి చౌకం చంచఁ బంచెముల్ వైచువారు చమ. ౧. ౧౦౨.

బేది. వి. (సం. భేదీ.) పాసనము, విరేచనము. (శ. ర, బ్రా.)

బేరకత్తె. విశే. (బేరము + కత్తె.) బేరముచేయునది, బేరమాడునది.

చ. సరస మెఱుంగు చంద్రముఖి సాధడిదంట యు బేరకత్తెయున్. పెు రా.అయో.౧౨.

బేరగాఁడు. విశే. (బేరము + కాఁడు.) బేరము చేయువాఁడు.

(వ్యవ.) ఈ వారము బేరగాండ్రు ఎక్కువగా వచ్చుటచే పశువులధర చాల చులకగా నున్నది.

**బేరజము.** వి. ౧. కుత్సితప్రవర్తనము, చెడ్డనడవడి.

రగడ. ఇంతి పావురపురొద రేల వినె దార జము, వింతరే విరహిణుల కెకఁబెట్టు బేరజము. మనుచ. ౩. ౭౪.

ద్వి. జగడించు నల బేరజమునకు నోడి, పొగు లుచు నిలు సొచ్చి పోవంగలేక. ద్వి. పరమ. ౪ ౩౦౨ పొ.

౨ బ. పరుషవచనములు.

గీ. కాంతుఁ డపరాధియైన ధైర్యకలనఁ బేరఁ, గెరడము లాడు దైన్యంబు గీలుకొనిన, బేరజము లాడు. శృంగారరసాలవాలము ౨ ఆ (౪ ౧)

విశే ౧. కుత్సితుఁడు, కుత్సితురాలు, కుత్సితము

చ. ప్రౌఢవా,రిజముఖి యోర్తు చూచి పతి ప్రేమ భరంబు మరల్పరాదు బే,రజపు లతాంతబాణుఁడు కరస్థితపల్లవఖడ్గధారచే, గజిబిజి చేసెనేని . రాజ. చ. ౩ ౭౩

క. దొరకొని తనుఁ బొదివి కడున్, సరగను జదలికిని నొగిని జను బేరజపుం,గరువలిఁ బలు తోలుకొనె, నరుదుగ గుదె కాల్పుచిటి కనిచెం గడిమిన్, నీలా. ౧. ౪౪.

క ఊరార్చి యడుగ నమ్మది, బేరజ మిది విన్న నీకుఁ బెనుదుఃఖంబౌ . శుక. ౨. ౪౩.

క. రమ్మనకపోదు తాత్పర్య మ్మధికము దేవ దేవి కది సహజంబే, యమ్మగలి బేరజ మ్మది, రమ్మౌనె నసుమాట నమ్మరాదెప్పటి కిన్. హైజ. ౪. ౪౨.

చ... ఎంతటిగయాళి కా బేరజపున్ విచారముల్, దెలియనివాని పైఁ గలది లేనిది చాల ఘటించి తండ్రివిద్దల కడసేయఁజూచి తకటా . . సారంగ. ౩. ౪౯.

సీ. అమరపతి కొల్వునకు వచ్చు సుమశరుండు, గులుకుపాలిండ్లు గయ్యాళి కలికి బోండ్ల, యారజపు బేరజపుఁ బేర లపుడు జూపి కచ్చు కొని దూఱు కెప్పుంగవమ్ము కరణి. చంద్రా. ౩. ౨౪.

౨. ధూర్తుఁడు.

సీ. ... కేడ ములుచ బేరజ మన ధూర్తు పేరు కెలయు. ఆం. భా. ౩. ౪.

౩. కేర్పరి, చతురుఁడు

చ. నడవడిగల్గువాఁడు కడు నాణెము చేఁగల వాఁడు రూపువని, బెడఁగగువాఁడు బల్ రతుల బేరజమై తగువాఁడు నిద్ధరన్ హంస ౫. ౨౧౭

**బేరము.** వి. (సం. వ్యవహారః, ప్రా. ఓహారో- దీనికి వృత్తియందు మువర్ణలోపము.) క్రయ విక్రయవ్యాపారము, వాణిజ్యము.

సీ. బ్రాహ్మణుం డయ్యు బేరములాడు దుర్జాతి యంధకూపంబున నవశుఁ డగుట. ఉ రా. ౩. ౩౨౫.

మ. ధన మార్జింపుడు నార్జితం బయిన తద్ద్ర వ్యంబు బేరంబుచేఁ, గొనసాగింపుడు వడ్డి వాసికలనన్ గూర్తు న్మఱింగొంత . ప్రబోధ ౪. ౩౩

౨ కొనునపుడు వస్తువుల వెలకొలఁదిని నిర్ణ యించుట, మూల్యనిర్ణయము. చూ బేరమాడు

జ . బేరమాడు.

**బేరమాడు.** స. క్రి. (√ బేరము) కొనునపుడు వస్తువులను కొంతవెలకు ఇమ్మని అడుగు.

(వ్యవ.) అతఁడు కందులు బేరమాడుచున్నాఁడు.

ఓడ బేరమరుగు = వాణిజ్యమునకై ఓడపై ద్వీపాంతరమున కేఁగు

క. ఈరీతి వణిగ్వల్లభుఁ డారూఢిగ నోడబేర మరిగిన తఱి . శుక. ౧ ౭౦.

జ: బేరకత్తె, బేరగాఁడు, బేరసారము, బేరి[1].

**బేరసారము.** వి. (బేరము + సారము.) క్రయ విక్రయవ్యాపారము

వ... కోమట్లు కాకట్లు దక్కం దిరిగియు ధారణ దరఓయు బేరసారంబులయెడఁ

దఱుఁగు మెఱుఁగు చేసియు వదనంబు గా
ధనంబు గూడఁబెట్టి. వరాహ. ౯. ౧-౨౩.

గీ. ఈడెము వళంద బందర యింగిలీషు, కళము
మొదలైన పేఁటలగారలెల్ల, సారభద్రవ్య
ములు చేరసార మాడఁ, బిలువనంపిరి తమ
తమపేఁటలకును    హంస. ౧. ౧౧౨

**బేరి¹.** వి. (బేరము + ఇ³, -క. బేరి) వైశ్యుఁడు, బేరగాఁడు

సీ. కుడుము రూకల కల్లఁ గొన్న నైతిఁ గా యంచు
బేరి తీఱనియూరి వేర మొంద
శుక. ౨. ౫౬౩

సీ. కోటికిఁ బడగెత్తుకొనియున్న శెట్టులున్
పెక్కులై వర్ధిల్లు బేరిజనులు. హంస. ౨. ౯

సీ. వైశ్యసామంబులు వఱలఁ గోవట్లన బేహారు
లనఁగను బేరు లనఁగ.
ఆం. భా. ౨. ౨౭

**బేరి².** వి. (సం. భేరీ. క. బేరె) దుందుభి, వాద్య విశేషము.

క. బెక్కులు దొనలు బేరులు, జిక్కి
తెగలు బొమ్మటయు బెంగ గాని యని
కిన్. అచ్చ. రా. యు. ౧౩౯

సీ. తా నున్న కేళి కంతటికి గిణాచారి పెక్కు
సుద్దులు ప్రోయు పెద్దబేరి శుక. ౩. ౧౭.

**బేరీజు.** వి. (హిం. బేరీజ్.) ౧ రాజులకిచ్చుపన్ను మొత్తము ౨ లెక్కల వివరణము (శర., బ్రౌ.) (వ్యవ.) మీ రీ బేరీజు సరిచూడుఁడు

**బేల.** విణ. (సం. భేలః) ౧ మూఢుఁడు, తెలివిలేనివాఁడు, అవివేకి, మూఢురాలు, తెలివిలేనిది

ఉ. సంపద దక్కియుండఁగ నశక్తు లనంజను
లుమ్మఁ బిల్చి పూజింపఁగ నంత బేల
పతి. . భార. ఉద్యో. ౧. ౩౧౪.

ఆ. అంతిపురములోని కన్యల పేరిటి, పోతుటేఁగ
నైన బోలయకుండ, నాజ్ఞ పెట్టి శారదానంద
గురు నాజ్ఞ, పెట్ట నేరనైతి బేలనైతి.
విక్ర. ౩. ౫౯.

చ. యుగ్నిసాక్షికం బునఁ బరిణీతనై వసతిఁ
బొల్పుగఁ బొక్కఁగాని యన్యులకు, మన
మునఁ నేనియుం దలఁప మానిని యిట్టి
ఒకాత్మ నన్ను నిట్లని పలుకంగ నీకగునే
యన్యులఁ బల్కినయట్లు బేలవై.
భార. ఆది. ౪. ౧౩౩.

శా. కాంతా శైశవచాపలంబున లతా కాంతార
వీథిం ?రి, భ్రాంతిం బొందెద బేల? బేలవై
నను ? శక్యంబె పట్టంగ. వైష. ౨. ౪౪

సీ. ముగ్ధకుఁ బేళ్లగు ముగుద యన మ్మొద్దరాలు
నా గోల నా బేల యనఁగ
ఆం. సం. మాన. ౪.

౨ భీరువు, పిఱికి

గీ. బేల యీ బేరజపుదనం బేల యింక.
నీలా. ౨. ౯౪.

ద్వి. కోమలదేహవు గోలవు బేల, యేమియు
నేపాటు నెఱుఁగవు నీవు
రం. రా. అర. ౧౬౩ పా.

జ. బేలతనము, బేలపోవు, బేలరి.

**బేలతనము.** వి. (√ బేల) ౧ అవివేకము, తెలివితక్కువతనము

ఉ. బేలతనంబున నిన్ను నమ్మి నా గుట్టును
జేము న్మిగులఁ గోల్పడిపోయితి నేమి
సేయుదున్ పారి. ౧. ౧౨౪

ఉ. బ్రహ్మ దానికి, లాలితరూపయౌవనకళా
లలితాంగవిలాసవిభ్రమం, బేల యొసంగె
బేలతన మేటికి నిచ్చె. అహ. ౩. ౧౧.

క. మొదటికి నిహమే లేదట, పిదపం బర
మెటులు గల్గు బేలతనము గా, కిది మరము
గాదు. దశా. ౯. ౫౭.

౨ భీరుత్వము, కాతర్యము (చి. ని.)

**బేలపోవు.** అ. క్రి. (√ బేల) నిస్సారమగు.

గీ. బీజమాత్రంబు చిక్కక బేలపోవు, నెల్ల
ధరణియు. శ్రీరం. మా. ౩. ౧౪.

**బేలరి.** విణ. (బేల + అరి³) వివేకహీనుఁడు.

ఉ. చాలుఁ బుకే సరోజభవ సత్పథవృత్తిఁ దూరంగి కూఁతు ని, ట్లాలరిజై రమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియే, వేలరి హైతి. భాగ 3 3౮౦

**వేలు.** విణ వివేకహీనుఁడు, వివేకహీనురాలు, వివేకహీనమైనది.

చ. తనముఖ మంబుజాత మని దందడి మూపు నళివ్రజంబులోఁ, బెనఁగు విన్నపు వోల నీక వేలుపతిం గని కు ౫౦ ౯ ౨౭౪

క. సౌబలునీతియుఁ గర్ణుకుఁ, జాఁ లమును గూడి తనకు సామ్రాజ్యం బీఁ, గా ఒలసి వెలయు వాఁడై, యా వే లూఁడు మనమునం దేప్రొద్దున్. భార కర్ణ ౧ ౨౨౨

శా కదుం దోస మీ వేలుంకెద్యి దశకు ౬ ౬

వి. మోసము. చూ వేలుపడు, వేలుపోవు మొ

జ. వేలుఁదనము, వేలుపడు, వేలుపఱచు, వేలు పోవు, వేలుపెట్టు, వేల్పాటు

**వేలుఁదనము.** వి (వేలు + తనము) అవివేకము, తెలివితక్కువ

క. ఏలిక వాడు మఖాంశ, శ్రీలకు నోరుఁ దడవ నేల శిర ముండఁగ మోఁ, కాలను నేసలు పెట్టుట, వేలుదనము గాక మీకుఁ బెద్దతి కంచే. ఉ హరి ౧ ౯౬

**వేలుప(ల్ప)డు.** అ క్రి (వేలు + పడు) మోస పోవు

క... సే న,మ్మాటల వేలుపడితి . భోజరా. ౬ ౫౫

చ. .. కమించుచు నెయ్యెండొరుచేఁతఁ జద్ద యీ, పెనుఁబగ నొంది మా టపస వేల్పడి క్రమ్మఱఁ జేరు టొప్పునే. భార శాం 3 ౨౫౨.

క. బలియుండగు పగతున కెడ, గలిగి చన వ్యలయు వాఁడు కార్యముకొఱకై, కల ళుఁగవచ్చిన వేల్పడి, కలిపికొనఁగ వలదు. కేయూర. 3. ౨౬౨.

అగు.

శా. ఏ కార్యంబు ఫలించె నీవ చెపుమా యేతం బుగా నార్యమ,రా్మ కారస్థితిలోడ వేలుపడితి స్తైకే నృపుల్ ప్రాక్తనుల్. వారి. పూ. ౮. ౨౮.

**వేలుప(ల్ప)ఱచు.** స క్రి. (√ వేలుపడు) వంచించు, మోసపుచ్చు

క యకటా యెవ్వతెయొ వివేకవిహీనుం, డని యితని వేలుపఱచెం . శుక ౨. ౨౮౦.

క ాభామ్మకు గిలిగింతలు, నీబోటిని వేలు పఱచి నేఁ డిది చుట్టం,బై బమయించెను నన్నుక్, సాబానే బాల ప్రబంధ ౬౩౦

చ నన్ను వేల్పఱచి యాత్మజాఁ డున్నెడ కేఁగి సత్వరం,బునఁ జనుదెంతు నంటవి భోజరా ౪. ౧౪౧.

మ త్రిపురస్త్రీలఁ బతివ్రతావణుల సారెం బుంభ్చలీవ ర్తనం, బుపదేశంబొనరించి వేల్ప ఱచి పార 3 3౪

**వేలుపోవు.** అ క్రి (వేలు + పోవు) మోసపోవు

ఉ ఇప్పులి నిజంబుగ న న్గనుఁగొన్న యప్పుడే, చేవ దలిర్పఁ బైఁబడక చింత యొనర్చుచు వేలుపోయి నే, నేవగ దాననో, యనుచు శుక ౨ ౨౫౬.

గీ ఏల యేఁచుచున్నాఁడు హృదయభవుఁడు, సెలఁతయును నేను సమదృష్టి నిలిచినపుడు, వేలుపోవును దాన యీకే లెఱుఁగఁడు, తెల్లవాఱంగవలెఁ గదా దేవకృపను. పి. కథం 3. ౧౬౫.

సీ. కోలుపోయె ననంగ వేలుపోయె ననంగ మోసపోయె ననుట పొలుచు ... అం. భా. 3. ౯౭

**వేలుపెట్టు.** స. క్రి (వేలు + పెట్టు) మోసపుచ్చు.

క. తానచొ మాంసముఁ దిన దచొ, యీ నక్కయు వేలుపెట్టె నిన్నాళ్లును . భార. శాం. 3. ౬౬.

ఆ. కపట మెఱుఁగకుండఁ గాంతకుఁ గాంతకుఁ,
బాలుచేసి చాల బేలుపెట్టి.
దశకు ౬ ౧-౨౫

బేల్పాటు. వి. (√ బేలుపడు) మోసపోవుట
వ. బేల్పాటు చిత్తంబునం, దొదవన్
దశకు ౧౧ ౫౫.

బేసడము. వి శ్యేనభేదము, ఒకజాతిడేగ
వ బేసడంబులు ఒలకట్టెలు తళుకు మించు
మొదలగు డేగలం గరంబులఁ గల చిత్తం
బుల పట్టించి ఇందు ౨ ౬౦

బేసము = పేసెము. వి (క బేసవు) చిక్కని
పండ్లరసము, గుజ్జు
సీ పాకవేళారంభపరిపాటిఁ దమయంతిఁ ఒగి
లినపనస(క్రొం)బండ్ల బేసము
పాండు ౧ ౧౧౮
వ మొత్తంబులై చిత్తంబులు మత్తంబులుగఁ
దత్తరంబునం దియ్యనిపండ్లకుఁ గయ్యంబులు
సేసి పయ్యన నేసరేఁగి బేసంబులు గాసం
బులు గొని భాగ ౮ ౪౪౭
చ దవియగు తేనె జొబ్బిలెడు చక్కెరమామిడి
పండ్లబేసముం భాను ౩ ౨౨

బేసరి. వి స్త్రీల నాసికాభూషణవిశేషము (ఒక
జాతిముంగర క ర)
(వ్యవ) ఈ బేసరి వెల యెంత?

బేసి. విశే (సం విషమః) సరిసంఖ్య కానిది
(సంఖ్యలలో నొకటి, మూఁడు, ఐదు మొదలగు
నవి.)
క బేసి యనన్ విషమమునకుఁ బేరై వెల
యున్. అం. శే ౪౪.
జ బేసికంటి, బేసికంటిమామ, బేసికంటి
వేల్పు, బేసికైదువుజోదు, బేసితాపసులు

బేసికంటి. వి. (బేసి + కన్ను) విషమాక్షుఁడు,
శివుఁడు.
సీ. నగఁ గల్గినను జాలు మొగసాలవాకిలి
కాపించు నబ్బేసికంటికైన
యయా. ౧. ౭౫.

బేసికంటిమామ. వి (√ బేసికంటి) హిమ
వంతుఁడు.
సీ గట్లరాయఁడు బేసికంటిమామ, చలికొండ
. నా హిమగిరినామంబు లెసఁగు . .
సాం. ని. స్థా. ౫౫.

బేసికంటివేల్పు. వి (√ బేసికంటి) త్ర్యంబకుఁడు,
శివుఁడు
ఆ వెండికొండఁబోలు వెలిగిత్తపై నెక్కి,
బాసవాలుగములు ఒలపి కొలువ, నాకసంబుఁ
బుడమి నలమిన వెలుఁగునఁ, గానవయ్యె
బేసికంటివేల్పు చెన్న. ౪. ౭౦.
సీ మిక్కిలికంటిదేవర బేసికంటివేల్పు.
అం సం దేవ ౬.
ఇశ్లే బేసికంటియొకిమీఁదు, బేసికన్నులదొర,
మొ॥
క. దేవర నీవిపు డలుగఁగ, నీవెంటఁ దుక బేసి
కంటియొకిమీఁడో జముండో వేల్పుటేఁడో
నెత్తుర్వాద్రావుడుగమికాఁడో నీళ్లరాయఁడో
చెపుమా అచ్చ రా సుం. ౫౯.
క అది నిండె నేని నిన్ననిఁ, గదియంగా వెంచు
బేసికన్నులదొరయున్.
అచ్చ. రా. యు. ౪౩౬.
గీ గుజ్జువేల్పుతండ్రి, బేసికన్నామి యన
నీదుపేళ్లు పాంబ సాం ని. దేవ ౩.

బేసికైదువుజోదు. వి (బేసికైదువు + జోదు)
విషమశరుఁడు, పంచబాణుఁడు, మన్మథుఁడు.
(శ. ర.)

బేసితాపసులు. వి. బ. (బేసి + తాపసులు)
సప్తమహర్షులు.
శా...మిన్నేట నీ,రాడం బోయెడి బేసితాపసులు
మేరౌ (వ్రే)ల సిద్ధించెఁ గా, యాడంబోయిన
తీర్థ మంచు మదిలో హర్షింతు ర(క్రాంత)
మున్ వరస. ౫. ౫౩.

బేహారమాడు. అ క్రి. (బేరహాము + ఆడు)
వాణిజ్యము చేయు.

ద్వి. పూని బేహారమాడి పోవువారలను, బోనీక
మీఁద కాఁపులు పెట్టి.
ద్వి. పరమ. ౪౭౭ పా

బేహారము = బేహారము, బెహారము. వి
(సం. వ్యవహారః) వాణిజ్యము.
సీ బేహారమాడింపఁ బెరిగినధనమునఁ గోటుల
సంఖ్యలై కొలఁది మీఱ నా పంచ ౫ ౧౩.
జ బేహారమాడు, బేహారి

బేహారి. వి (బేహారము + ఇ) బేహారి, వణిజుఁడు
ఉ. గురుపదపంకజాతములు గొల్వనివారలు
హోమహాబ్ధిని, స్తరణకుఁ గర్ణధారహితంబగు
నావను సంగ్రహించు బేహారిగతి భూరి
దుస్తరభవాంబుధిలోన మునుంగుచుందురు
భాగ. ౧౦ ఉ ౧౨౨౭
మ మీర లిట్లతికష్టస్థితి నోడబేహారులపాలై
పోవ నాచెట్టపట్టితిరే యందు
కళా ౬ ౧౯౪
ద్వి ఇగవోఁగ నెన్నికకెక్కు బేహారులు,
హాసుల గంతులఁ దోగహత్తుగా రొచ్చి
ద్వి పరమ ౬. ౪౭౬ పా

బేహారమాడు. అ క్రి (బేహారము + ఆడు)
వాణిజ్యముచేయు
గీ కృషిసేయుటయును బేహారమాడుట
యును భాగ ౧౦ ౨ ౨౫౬.
గీ అన్ని దీవులఁ బెచ్చులాభార్థకోట, యర్థులకు
నిచ్చి కీర్తిబేహారమాడు ,నవచిత్రపురాంత
కుండు వంశాబ్ధివిధుఁడు హార పీఠ ౨౬.
సీ కిష్మంతంబులలోన గనులు ద్రవ్వించి
బేహారమడించి యన్యాయధనముఁ జేర
నీక పి శకుం ౪ ౧౭౫
గీ అశ్వముల గోర్పుడెంబుల నమ్ముకొనుట,
యోషఁ దా నెక్కి బేహారమాడుకొనుట,
యొనర మధుమాంససేవయు నుత్తగమున,
నెందుఁ బెక్కండ్రు చేయుట నెగ్గు లేదు
విజ్ఞా. ౧ ౩౨

బేహారము = బెహారము. వి (సం. వ్యవహారః) క్రయవిక్రయ వ్యాపారము, వాణిజ్యము.
క. కరిసనమును బేహారము, వరవి పశులఁ
గూర్చుటయును ననఁగా వృత్తుల్ ౫, వరు
లకు హరి పూ ౩. ౧౩౦.
గీ పారలౌకికకుసీద, మాసపడువారి కిదియ
బేహార మరయ నైష. ౩ ౫౨
జ బేహారమాడు, బేహారి, బేహారికుఁడు.

బేహారి. వి (బేహారము + ఇ) క్రయవిక్రయ
వ్యాపారముచేయువాఁడు, వణిజుఁడు
క బేహారులు మితసత్య,వ్యాహారులు వచ్చి
నిలిచి వలసినవస్తు, వ్యూహములు నించి
రప్పురి, నాహారిదశ్వాన్వవాయు నా దృతి
వలనన్ ఉ. రా. ౩. ౧౫౪.
సీ కోట్లు బేహారులగొనబుటంగడులందఱచుగా
గొండెముల్ తలుపులంద
అచ్చు రా శాల ౪౭ పరమ ౪. ౧౯౩.

బేహారికుఁడు. వి (√ బేహారము సం. వ్యావహారికః) కోమటి, వణిజుఁడు
ద్వి లెక్కకు నవనిధు ల్లెక్కని ధనదు,
పెక్కుడెవ పెచ్చని బేహారికులును.
ప్రభు ౧ ౧౯ పా ౨౨. పం

## బై

బైజే. వి ప్రలాపము, అర్థములేనిమాట (అజ్ఞానము అని శ ర పరికిమాలినపని యని. బ్రౌ)
ఉ కల్లలు వేదముల్ స్మృతులు గల్లలు కల్లలు
యజ్ఞకర్మముల్, కల్లలు పైతృకక్రియలు
కల్లలు ఘోరతపఃప్రభావము, ల్లల్లలు దే
దేవకార్యములు గావున బైజలు మా,
మామతిం, బెల్లవిధంబులన్ నడుపు
డిమ్ముల ముక్తికిఁ బోవఁ గోరినన్.
వి పు ౪. ౩౨౯
సీ రజ్జ్రోలుడు పలుము పలవరింపు బై
ప్రల్లదము వదరువదాగళి ఒజారము నాఁ
జెలఁగ నాఁద్రి,లాపోక్తిధ.
ఆం. భా. ౧. ౧౧

సీ. జవరాండ్రమందహాసముల కెందొనొకాని
నిలువరు పండువెన్నెలలబైట
ఉ రా ౫ ౨౭౧

౩. ఆకాశము.

సీ ప్రసవాస్త్రమాయావి బైట వ్రాసినసుడి
విసరువానవకు గంభీరవాభి
పి శకుం ౨ ౧౭౪

విశ. ౧ ప్రకటము, వెల్లడియైనది

శా. తానే దొంగిలి గిన్నె శిష్యవరుచేతిc బcం
చౌర్యcబు బై,లైనం దూcట చనంగి
చేరమిని విప్ర ౫ ౬౨

సీ గబ్బిగుబ్బలు బైలుగాcగc బైcటచేయంగు
జాళించి సవరించు సారెసారె.
ఘటికా ౨ ౩౪

౨ తొలcగినది

సీ. పర్యాద యొక్కింత బై లైనవో నింటి
యొకతె దాడిమఫలంక కొడియc జూడ
రా. వి ౩ ౭౬.

జః బైటcబెట్టు, బైలగు, బైలుదేఱు బైలుదేర్చు,
బైలుపడు, బైలువట్టు, బైల్పడు

**బైలుదేఱు.** అ క్రి. (√బైలు) గృహాదులనుండి
వెలువడు

వ్యవ ఎక్కడికో బైలుదేఱినాcడు

**బైలుదేర్చు.** స క్రి (√బైలుదేఱు) బయలు
దేరcజేయు, వెలువఱచు వెలిపుచ్చు.

సీ తనహిరణ్మయగర్భతను బైలుదేర్చిన ట్లంగ
రంగద్ద్యుతి యతిశయింప ఇందు ౧ ౩

**బైలుపడు.** అ క్రి (బైలు + పడు )ప్రకటితమగు,
వెల్లడియగు

గీ జలరుహోత్పలపదనఖంబులను బోలc, జాల
కాంతయు తిక్కచా బై లుపడియెc.
రసిక. ౨ ౧౦౪ (ఆకాశమునందుండు
అని శ్లేషార్థము చేలపడు ముద్రి పా.)

మ . జిలుగుంగుచ్ఛెల్లకొం గత్తి గుబ్బలపైc
గప్పిన బైలుపట్టఘునప్రాంతంబు వీడించి ..
దశా. ౭. ౧౭౩. (ప్రా. పా )

**బైలువట్టు.** అ. క్రి. (బైలు + పట్టు,) బయలుపడు,
బైటవ్యాపించు, బయటనుపొందు.

మ. తనతోcబుట్టువు బైలువట్టినను సంతాపంబు
శైలేంద్రనందనకున్ భర్త యడంగన
వ్వగపు నానానిమ్న గాశ్రేణికిన్, జనియిం
చన్ శరవహ్నిద్రుమందినసరస్వంతు ద్దయాం
చద్విలో,చనవీక్షామృతనిర్ఝరావళిc బున
స్సంపూరితుం జేయవే సమీర. ౧. ౬౬
(నిరాశ్రయయగు అని భావము )

**బైల్పడు.** అ క్రి (బైలు + పడు ) బయల్పడు,
ప్రకటమగు

చ ద్యుమణి పడంగ విచ్చుచరపోదధి బైల్పడ
వచ్చుబాడబో,ద్గమితశిఖానికాయఘునకాంతి
యన ద్దనరారె సంధ్య ముకుంద ౩. ౪౩

**బైల్వము** సం విశ (అ. ఈ అ ) బిల్వసంబంధి,
మారేడుసంబంధము గలది.

వి అం పుం. మారేడుపండు

**బైసణ** = బయిసణ. వి వీణాసారకాయయొక్క
బంధనము (శ ర.)

**బైసి** = బయిసి, బగిసి. వి ౧. గొప్పతనము,
గౌరవము ఆధిక్యము

గీ అమృతమును రత్నమును బోయినపుడ
ఫణుల,బైసి చెడిపోవుc దుది నీరుపాము
లగును. బై. భా. ౪. ౭౧.

ఉ నీ,బైసి తొలంగc దొత్తువలెc జాపెదc
గూటికిc జేరకుం డెదన్.
నా పంచ. ౧. ౧౪౯.

ఉ ఎ,ప్పట్టునc జూచినన్ శిశువిబైసి
యెఱుంగగరాదు భామినీ. హర. ౪. ౨౯.

శా ధానుష్కున్నతి చెప్పc దీరునె మునీంద్రా
చేరువో మందరం,బో నీచాపము దాని
బైసియు నీcకన్ చూపెట్టcగా గావలె.
చం. రా. ౩. ౧౪౯.

౨. సొంపు, చక్కcదనము.

సీ. కోరచూపుల రొమ్ముచేరుగ్రుడ్డులవాఁడు బైసి
  మాలినమ్రాని పణఁతవాఁడు
  వరాహ. ౨. ౪౫.

సీ. బందికం దెనచాయబైసిమాలినమేన కొందరు
  గందవుర్రొంపి కొత్తినాఁడు మను చ. ౪. ౩౩.

3. నియతి, భాగ్యము.

గీ అలరుఁ గట్టెడి ఒవిసి దయ్యమ్ము బైసి,
  కట్టడి యనంగ నియతిగా ఆం భా ౧ ౯౯

౪. ఈలువు, పాతివ్రత్యము, స్త్రీలమర్యాద.

చ. అగు నగు బైసిమాలిచిత నంచు విజృంభణ
  వృత్తి నివ్విధిన్, సాగ యనిమాటలం జెవులు
  మూడకు సైఁచినదానఁ గాను నాథుగనికి
  నిన్ను వంటి కోఁఅమాలినమానుసు లీడ.
  వేం పంచ 3. ౨౭౫.

జ బైసికొను, బైసిగాఁడు

బైసికొను. స క్రి. (√బైసి.) చంపు

గీ ఇటు లేకలమ్ముల బైసికొనియె, జనవిభుఁడు
  మూడ నొకకొన్ని జాగిలములు
  చంద్రా ౨ ౯౧

బైసిగాఁడు. వి (√బైసి) గౌరవహీనుఁడు
  (ఇట వ్యతిరేకలక్షణ)

గీ వ్రాసికొన్నారు బాఁపనబైసిగాండ్రు
  శుక ౨ ౨౪౬

బైసుక=బయిసుక. వి ౧ నియమము, ఏర్పాటు
  ప్రతిజ్ఞ

సీ కోగిణిఁ గొపరి బైసుకి పెట్టె పలకపై
  పారెలు వోయించి సరిము మూచి
  ఉ వారి 3 ౧౨౦

గీ పలకఁ దఱుమక బైసుక పల్లటిలక.
  ఉ వారి 3. ౧౨౪.

చ ... అతిసాధుమునీంద్రుఁడుకోరె కేశ్రమల్,
  జెలువక బాకిసోరు కుదలింపక బైసుక
  పట్టె నంచు . . భాగ. ౯. ౨౦౬.

అ. అవనినాథుఁ డెఱుఁగ డాగ్రహంబె కాని,
  నీచవృత్తి నిట్టు నీకు నేల, ప్రాణ మిత్తు
  ననుచు బైసుక పెట్టంగ, వలదు రమ్ము భూప
  వరతనూజ. రుక్మా. ౫. ౧౫౬.
  (శ. ర. పా. బైసిక. ముద్రి. పా.)

౨. కొలువు, స్థిరనివాసము.

క భావంబున సంతసంబు బైసుక పెట్టన్.
  విక్ర. ౭ ౭౯.

# బొ

బొంకణము. వి బొక్కణము, విధూతిసంధి

అ. కటితటంబునందుఁ గట్టినగోఁచియు, వొలువఁ
  ఒడిలి విట్టు లొంటిఁ దిరిగి, చంక బొంకణ
  మును సడలిన దిఁకసైన, గొండలందుఁ
  దిరుగకుండు దేవ బస. 3 (శ. ర.)

బొంకప్ప. వి మత్స్యవిశేషము. (శ. ర.)

బొంకరి. విణ (బొంకు + అరి) అసత్యవాది, కల్లరి.

ఉ అ, బొంకరిదివ్యవాణియుఁ దపోధను
  లుస్ మము నిట్టులంతురే భార. కర్ణ. 3. ౫౯.

సీ పొలుచు నసత్యుండు బొంకరి యన..
  ఆం. భా. 3. ౧౨.

బొంకి. వి కరోటిభేదము, పుర్రెపెంకు.

గీ తనరును గరోటి కప్పెర పునుక .. బోఁకి
  బొంకి, పెంచు పెంకు తద్విశేషాఖ్య.
  ఆం భా. ౨ ౧౩౩.

బొంకించు. స క్రి (√బొంకు.) ౧. మోసపుచ్చు,
  వంచించు.

సీ పూరజం బని చాల బొంకించి యమ్మరో
  కుమిలి నిగ్గులుదేరకుమ్మ గుప్పి.
  చంద్రా ౪, ౧౬౩,

౨. అసత్యముగునట్లుచేయు.

క. మాటలయట్టిది యగునే, పోటనులోకంబు
  వలుకు బొంకించెద నే, మాటలకంటెను
  వని జా, పో టగ్గల మింక నమ్ము
  భూభుజ నన్నున్ కు. సం. ౧౧. ౬౦.

3 బొంకఁజేయు, అసత్యమాడునట్లుచేయు.

వ్యవ . శ్రీకృష్ణుఁడు ధర్మరాజును బొంకించెను.

బొంకింపు. వి. (√బొంకు) మల్లబంధవిశేషము

వ. .. ఉపాయింపువిధంబును, బొంకింపువిధంబును .. మల్లపు. ౩. ౬౯.

బొంకు. అ. క్రి. అబద్ధమాడు.

క. ఇప్పరికిం జనుదేరఁ గతము బొంకక చెప్పుమా. భార. విరా ౧. ౩౧౪.

క. చను బొంకఁగ బ్రాహ్మణార్థ్యయమున సర్వధనాపహరణమున... భార అది ౩.౧౪౭

ఉ. ఇంకనివారిధుల్ ధరణి నెవ్వరి వేఁడని యింద్రు లెన్నఁడున్, బొంకనిధర్మనందనులు నృపతికుంజరసూనులు పొల్తురప్పరిన్ విక్ర ౧ ౪౨

వి ౧ అసత్యవచనము

క. బొంకాడెడుగతితలె దీ, కిం కిటఁ జూచు కొనుఁ డితని సెట్టడిచెదనో. హరి. పూ ౫ ౨౩౧

ఉ. బొంకము గానియీవలని బొంకులు మాచవి గావు రుక్మిణీ,పంకజపత్రనేత్రకును బ్రాణపదంబులు గాని . పారి ౧. ౧౨౫.

ఆ. జల్లి బురుడ బొంకు పొల్లు దబ్బఱ . హుళిక్కి నా నసత్య మభఖ అం. భా. ౧ ౧౧౯

౨. అసత్యత్వము, కల్లతనము

గీ బొంకునకు నోర్చి బ్రహ్మాస్త్రమునకుఁ గాక, బ్రాహ్మణుఁడ నని చెప్పి తత్ప్రదభక్తిఁ, గలిగి మెలఁగంగ భార కర్ణ ౨ ౭౭

గీ. కాలదండం బహోఘంబు గాఁగ నేన, యాచరించితి దీన దశాననుండు, నొచ్చినను నొవ్వకున్న నానోదువు బొంకుఁ,జెందువటు వలెఁ గాకుండఁ జేయుము , . ఉ. రా. ౩. ౩౬౧.

సీ. అయింతి ప్రద్యుమ్ను జాయగాఁ బలికిన గారి మాటకు బొంకుగలుగ దనుము. ప్రభా. ౧. ౧౨౭.

౩. తప్పు, పొరపాటు.

క పెట్టు బయలుగాఁ గరువలి, పట్టి పెడంకుచు నుతెగుబరులు మరంబున్, బొట్టుంకొని విసర నాజెగ,జెట్టి మిగుల నడిఁకి బొంకుచేసితి వనుచున్. కై. భా. ౨. ౭౦.

విశే. (క. బొంకు) అసత్యమైనది.

సీ వినుము మాతాన్వయంబున నీవు పుట్టుట, బొంకు . భార. ఉద్యో. ౪. ౫౯.

ఉ. భూతపతిప్రసాదవిధి బొంకగు టెందును లేమి దశకు. ౨. ౩.

గీ. ఆత్మకత్సర్వభూతాని యనుట బొంకె అము ౫. ౪౩.

జ' బొంకించు, బొంకింపు, బొంకులకాన,బొంకులాఁడి, బొంకులాఁడు.

బొంకులకొన. వి (√బొంకు) అసత్యమాడునది; అసత్యమాడువాఁడు, బొంకులబుంగ.

సీ. నక్కచిక్కులమారి పెక్కుకురూపి దూబరదిండి బొంకులకొన మొండి. చెన్న. ౨. ౨౪.

బొంకులాఁడి. విశే (బొంకులు + ఆఁడి) కల్లలాడునది, అసత్యములాడునది (శ. ర.)

బొంకులాఁడు. విశే (బొంకులు + ఆఁడు) కల్లలాడువాఁడు, అసత్యములాడువాఁడు.

ఆ బాలకుండు వృద్ధు పగవాఁడు చుట్టంబు, బూతు మానగాఁడు పాతకుండు, బొంకులాఁడు ముచ్చు మఱపరి కొండీఁడు, కల్లుద్రాగువాఁడు గాఁడు సాక్షి. విజ్ఞా.౩ ౧౦౪

బొంగరము. వి. (సం. భ్రమరకమ్) బాలురాడుకొను బొమ్మరము, బొంగరములతో నాడు కొనెడియాట

సీ. బొంగర మనఁగను బొమ్మర మనఁగను భ్రమరాభిధానంబు పరఁగుచుండు. అం. భా. ౨. ౪౦౪.

వ....మురని కెంపుబొంగరములంటోని చెట్టు జాపురమెుగడలును. యయా. ౪. ౧౪.

సీ. బొట్టగీరవగింజలు బొంగరములు, గచ్చకాయలు దాఁగిలిమ్రుచ్చులాట . . ప్రబంధ ౧౬౩.

**బొంగు.** వి కీచకము లావుగలిగి బోలుగ నుండు వెదురు పల్లకిలోనగువానిని మోయుటకుపయోగించు వెదురు

సీ కీచకసంజ్ఞ రైయి తోఁచు బొంగన
ఆం భా ౨ ౪౮

రగడ పొలుపొందు గందలపు బొంగులును గడేలు
హంస ౫ ౩౫౬

జ బొంగువెదురు

**బొంగువెదురు=బొంగు** వి (బొంగు + వెదురు) లావుగలిగి బోలుగానుండు వెదురు కీచకము

క విదితముగ బొంగువెదురున నొదవినమౌక్తికము తారకోజ్జ్వలము
రత్న ౩౬

**బొండ.** వి (సం బంధః ప్రా బందో) తప్పు చేసినవారి కాలుసేతులకుఁ దగిల్చెడు దారు యంత్రవిశేషము. ద్రుపదము (దీనిని బొండకొయ్య బొండ్రమాను అనియు నందురు)

గీ భోగములకండ యులవేల్పుబువ్వదండ ఎలితు లకు బొండ పేదలపైఁడికుండ
రా వి ౧ ౩౧

క విన వచ్చి దొంగగా యని యొనరఁగ నిట బొండకొయ్య నుంచిరి శుక ౩ ౨౦౮

సీ బొండయనంగను బోననఁగూటయంత్రాభిధానంబు గాఁ దనరుచుండు
ఆం భా ౨ ౨౯౩

**బొండము=బొండలము** వి ఒలవని కొబ్బరకాయ

సీ కడకొస్సై లేనారికేడపుబొండము లట్ల బెట్టి దంబుగఁ దల ద్రిప్పుచ్చుకొనుచు
అచ్చ రా యు ౨౮౫

సీ నారికేరంపుబొండాలు మీఁగడయును వద దధి పిండఖండా ల్గుడుములు పార ౬ ౫౫

**బొం(డ్ల)డలము=బొండము.** వి ఒలవని కొబ్బరకాయ

శా పారి న్నారికేడంపుబొంగలము లిచ్చెఁ ద్రబ్లి లో త్రిలుటన్ నీరశ్రై తోఁగన్
చంద్ర ౨ ౧౦౩

సీ ఎలనీటిబొండలంబులు లోలి పెదదొల్ల చాల్చి సైచిన దొల్లుపుష్లిగములు అము ౬ ౧౪

చ పగడపుఁజాయ చెందిరము ప్రామినపాండ్య వఘూకుచంబులన్ వగునరుణంపుబొండ్లములు నారికెడంబలు వజ్రకుట్టిమం బగు పథముం జెలంగు
అము ౧ ౫౪

సీ తాళాదికళలాటు తవరు బొండ్లమువంగ
ఆం భా ౨ ౪౯

**బొండాము=బొండలము.** (శ ర)

**బొండిగ.** వి ఈగెమొదలు తొడిమ (శ ర)

**బొండు.** విణ గుండ్రమైనది వర్తులము
(ఉదా బొండుగంటలు చి ని శ ర ప్రా)

జ బొండుమల్లె

**బొండుగ(వ)=బొండుగు** వి కంఠము (కంఠనాళము అని శ ర

ద్వి బొండుగ లుచ్చి యూపొట్టలు చీరి గుండెలు ఛేదించి కోలలు మతిమి
పద ౧ ౫౧ పా ౨౪ పం

సీ మొగిసి రక్కసునిబొండుగఁ జించు నీ గోళ్ల చిటిలెనో పిరికుచశిఖరి దాఁకి
సిం నార ౬

క శాలద్విరంగకరంబులఁ బోలెడుకరములను దమజాబొండుగ బిగియం గిరింప ప్రేలఁబడె యొను బాలకుఁ డొకకొండభంగి బరువై యుధిపా
భాగ ౧౦ పూ ౨౬౩

**బొండుగు(వు)=బొండుగ** వి కంఠము

గీ గొంతు గొంతుక కుత్తుక కోలికి బొండు గవఁగఁ గంఠంబు చెలఁగును
ఆం భా ౨ ౧౮౧

ఉ కొండలబొండుగుల్ వగుల ద్రుగ్గియుఁ గొండలపొట్ల ప్రచ్చియున్
అచ్చ రా. యు ౧౩౪

(బొండుగల్ వగుల ద్రుగ్గియు శ ర పా)

గీ ఊడ్చి బొండువు ప్రచ్చి ప్రేవులిడి నంజాడంతయును బుచ్చి పొదుకగా నమరఁగట్టి

కొనుచు వేగుంబోకగుటఁ జూచి జనిరొ
భార. శాం ౩. ౪౯౯ (బొందుమల్లి
శ. ర. పా )

**బొందుమల్లె (ల్లియ).** వి. (బొందు + మల్లె.) మల్లెలావిశేషము, ఒకజాతిమల్లె, గుండుమల్లె. ॥

గీ మెండుమీఁటినపగటిచే రెండ దాఁకి, యొల్లఁ
బోయిన లేబొందుమల్లెపొదల
ఆము ౨ ౫౬.

సీ బొందుమల్లెలశోకములు మంకెనలు నంది
వర్ధనంబులు విరవాదివిరులు.
ఉ. రా. ౩ ౨౦౧

గి బొందుమల్లె యనఁగ మహామల్లి యనను
అం భా ౨. ౫౧

గి బొందుమల్లియవిరివంప ఖండపరశు
బ్రాజించె నలఁడు వైష ౮ ౧౦౭

సీ బొందుమల్లియలపైఁ బొరలాడుఁ బొరలాడి
పుష్పంధయంబుల బోవఁబోవు నప్పురం
బునఁ బ్రమదవనానిలుండు విక్ర ౧ ౯౫

**బొండెము.** వి కెమ్ముడుమున్నగువానితోఁ జేర్చి
చిన యాభరణము, ద్వారమునకు ముండ్లకంపతో
అల్లి యమర్చిన తడిక. (ముండ్లకంపతో అల్లి
తెట్టునకు అమర్చెడు తడుకు శ ర )

**బొంత.** వి (సం ప్రోథః కె బొంత )కప్పుకొనుట
కును పఱచుకొనుటకును దట్టముగాకుట్టినగంత
గీ బొంతకు గంతకుఁ బ్రోగిడిపోవు,నంతకు
విశ్రియంబార్చి తెప్పించి
బస పు. ౪ ౨౭౦ పం

యోగి యొక నిడుఁబలపంబును గాతము
బొంతయు గ్రక్కున నాతని కిచ్చి వాని
గుణములు చెప్పెన్. హ్యా ౮. ౧౧౨.

క ఇప్పుడు శకవిభుఁ డెనసుట, యెప్పుడుగా
మున్న బొంతయును లాతమును, గప్పెర
యును బాదుకలును, జొప్పడినవి బ్రతుకు
టొప్పు జోగియుఁబోలెన్ విక్ర. ౪ ౬౨

విశే. పెద్ద (చూ. బొంతకాకి, బొంతరఁటి మొ॥)
జ బొంతకాకి, బొంతజెముడు, బొంతమడ
మలు, బొంతరఁటి, బొంతజాయి, బొంద
డము, బొందడీఁడు, బొందడీలు.

**బొంతకాకి.** వి (బొంత + కాకి.) కాకోలము, మాలకాకి (శ. ర., బ్రౌ , వా )

**బొంతజెముడు.** వి (బొంత + జెముడు.) ఒకజాతి జెముడు ॥

గీ. బొంతజెము డుల్లియును సదాముస్తె మొదలు,
గాఁ గలుగునట్టి చిఱుచెట్లఁ గాంచి యంత
హంస ౪ ౧౦

**బొంతమడమలు.** వి. బ ధాన్యభేదము, ఒక విధమగు ధాన్యము.

వ . రాయమెచ్చు లేఁజిమల్లెలు మునిమనోహ
రాలు వెండిగుండ్లు బొంతమడమలు కూటి
కుప్పలు కాఱుసంపెఁగలు .
ప్రబంధ ౧౧౨.

**బొంతరఁటి.** వి (బొంత + అరఁటి.) పెద్ద కాయలు కాచెడు ఒకజాతి అరఁటి (శ ర., బ్రౌ.)

**బొంతజాయి.** వి. (బొంత + జాయి.) శిలాభేదము, ఒక విధమగుజాయి. (శ. ర., బ్రౌ.)

**బొంతు.** వి. జొన్నలులోనగువాని గింజలయడుగున నుండు కుదురువంటి పొట్టు (చి. ని., శ. ర.)
బ. పొట్టుతోనున్న జొన్నలు (బ్రౌ.)

**బొంద¹.** వి (సం బృందమ్ ) ౧. గుంపు, సమూహము

చ వనికి గురూక్తి దోఁచు పరివారపుబొందపయి
న్నిరీహుఁడై, తనపినతల్లి యానతిని దాల్చెఁ
గటిస్థలి రాఘవుండు . వల్కలచేల
మ త్తతిన్ చం. రా. ౮. ౫౮.
మూ.. సపరిచ్ఛద ఏవ గచ్ఛ ...
సం. చం. రా. అయో. ౩౭౭

**బొంద².** వి. గొతియు, రీఁటు, గర్తము, చిన్నగోయి.
ఉ. ... మిహిరుండు ఘా తసుమతిగర్భంబు
భేదింప జొచ్చిన ఒల్లాయములో యనంగఁ
గనుపట్టె నన్న బొంద లొరన్.
చంద్రా. ౨. ౨౫

ద్వి. పుచ్చివకన్నులబొందల మున్న, వచ్చు
కీలాలప్రవాహంబు నడిగి
పండితా మహిమ ౨౫౧ పా
గీ. లాఁగ బాతియ బొంద యనఁగఁబొలుచు
గర్తంబు అం భా ౧ ౧౮౫
బొందః. వి ౧ అరఁటలోనగువాని ప్రకాండము
ఉ బొంద దూఁట వేఁదండము దాఁకనట్లు
దశా ౩ ౨౦౧
(వ్యవ) ఈ అరఁటబొంగ విస్తళ్లకు చాఁగా
బాగుండును
౨ బాలతాళము, రేఁతితాడి
సీ. బాలతాళాఖ్య బొంద నాఁ బరఁగు
అం భా ౨ ౪౪
౫ బొందకోల, బొందపక్కి
బొంద౪. వి ఒకానొకశాకము, ఒకవిధమగుకూర.
వ. .కందయుఁ బొందయుఁ జారులుఁ దియ్య
కూరలు. కాశీ ౪ ౧౭౫
బొందకోల. వి (బొంద౪+కోల) మల్లసాధ
నాయుధవిశేషము (చి ని, శ ర)
సీ. సాధనాయుధములు సానకత్తి యనంగ
బొందకోల యనంగఁ బొలుపుఁ గాంచు
అం భా ౨ ౨౦౬
క. బిరుదుగలకులుక లిరువురు నొఱమట్టి
మెఱుంగుదట్టు రెగుచల్లడముల్, బరగంగ
బొందకోలల హరిగలు తాటించి క్రొ
క్కాయారము మీఱిన్. ప్రబంధ. ౭౯
బొందడ(ళ)ము. వి (బొంత+దడము) కంచు
కము, చొక్కాయ, కవచము.
సీ పాతకంబులు నీలిపట్టుబొందడములు పగ
లింటినిద్రలు పచ్చడములు. హైమ ౪ ౬౧.
గీ. చొచ్చి చెడుగు లారుల కొంపజూతు
రట్లు, బొందళము లేమి వాఁడికూపులును
తోఁతె అచ్చ భా. ౧. ౮౨
కు. . . కందమ్ము బొం,దళపుఁ గాతును గ్రాసి
నట్టి పడకింటన్ మించుపూఁతాన్పునన్.
ఉ. రా. ౮. ౨౨౨.

సీ పేరణ మనఁగను పేరణీ యన, హైమము
వనఁగను బొంగళిం బనంగ, తో డనఁ
గవచంబు తోఖలు అం. భా. ౨.౨౦౮
బొందడీ = బొందడము. వి (√బొంత) కవ
చము
౧ వలపుల రాజ వీవు గళితాంయలజాబిలి చిల్కు
తేజీ తూఁపులు నన రెంచ విల్ చెఱకు
పొంపుగఁ దేఁటులు నారి బొందడీ, తిలి
రలమూపి యి పపాది తారకు తెమ్మెర
చుట్టు మిట్టి నీ, కలవడు కొట్లు మొక్కలపు
టంపము లబ్బురం పెంచి మాదిరిన్
యయా ౫ ౭౦.
బొందడీఁడు. వి. (బొందడము+ఈఁడు)కంచుకి
(కవచముతొడగినవాఁడు వర్మితుఁడు శ ర)
గీ కంచుకి యొసఁగుచుండు, బొందడీఁ
డని అం భా. ౨ ౧౭౩.
బొందడీలు. వి బ. (√బొందడము) ధాన్య
విశేషము, ఒకవిధమగుధాన్యము.
వ బొందడీలు పునుఁగుఁదావులు తేనె
తోలలు పోసనాలు ప్రబంధ. ౧౧౨.
బొందపక్కి. వి (బొంద+పక్కి) మత్స్య
విశేషము, ఒకజాతిచేఁప (శ. ౭)
బొందపువ్వు. వి (బొంద౪+పువ్వు) తాటి
పువ్వునుబట్టియుండెడు మాఁగుడాపు.(శ ౯.)
బొంది. వి (ప్రా. బోది, బుది ౨ బొంది.
త. పొంది) దేహము, మేను.
గీ. నిఱపు లేకని నతిమి యిచ్చినఫలమునఁ
బొందితోడన దివికేఁగు పొలుపు పొరె.
కు. సఁ ౧౧. ౪౩౦.
ద్వి బొందితోడను కూడఁ బోయి స్వర్గంబు,
నందుము పొమ్మన్న నాత్రిశంకుండు.
రం. రా. బాల ౫౭. పా ౧౧. ౫౦.
గీ అబ్బలియు రింక, నిన్నుఁ గనుఁగొన్న
బొందితో నిల్వనీరు.
అచ్చ. రా యు. ౧౧౨.

బొందిలీ. వి భారతీయులలో నొకజాతి
(బొందిలి. అని శ. ర)
గీ ఎనుఁగులు వేయి బొందిలీ లెంచి చూడ
లక్ష పెండారు లొకలక్ష కృష్ణ ౩ ౨౫

బొందివేఁట. వి గూండ్లలో నుంచి పెంచెడు
కాఁకులుమొదలగు పక్షులసహాయమున నాడెడు
వేఁట
ఆ కారుకోడి కౌఁజు మొదలుగాఁగ
బొందివేఁటకు మీఱు ఎట్టెల్ల గూండ్ల
బిట్టు చెలఁగ యయా ౧ ౧౧౩

బొందు. వి (సం బంధః) ౧ దారము
సీ ఎవ్వఁడు రవణిల్లు పెల్లజీవులయందుఁ బూస
లలోనున్న బొందువోలె కాశీ ౫ ౯౭
సీ గీజుసామము చిన్నికోరమీసలు చెంపఁ
బనిమట్టుపీక బొండుఎట్టినూలు
శుక ౨ ౨౪౧
౨ పూవుబెత్తు
గీ నియమమునఁ బుష్పములు గోసి చేర్పు
మీఁదఁ బలుతెఱంగుల వి తవింతలుగ మాలి
కలును బొందులు కందుకమ్ములు రచించి
కళా ౪ ౭౨
౩ చొక్కాయ ముడివేసెడు సన్నని నాడా
ఉదా బొందులచొక్కా పరికిణీబొందు మొ॥
౪ శుష్కసస్యము పెన్ను దీయుటకు యోగ్యము
గాని లతి లోనగునది
సీ బొం దనఁగాను శుష్కసస్యము చెలంగు
అం భా ౨ ౨౩౪
వ్యవ ఈ సంవత్సరము నీరు చాలక చేనంతయు
బొం దయిపోయినది
విణ స్థూలము, లావైనది
ఉ చాల దళంబుగాఁ బృథులచంపకకీలనఁ
బొల్చు బొందుఁ దోఁచూలెలనంగఁ గల
బ్బుగంధకదళీనవపంక్తుల సొప్పు నప్పురిన్
ఆము ౧ ౬౭
౫ బొందుపోవు

బొందుపోవు. అ క్రి (బొందు + పోవు) పఁ
మున్నగునవి పెన్ను తీయుటకు యోగ్యముగాక
పోవు
వ్యవ ఈ యేఁడు రసంగిచేలు బొందుపోయినవి

బొందె. వి కదళీత్వగంతర్గతశ్వేతకాండము గల
వేసిన అరఁటిచెట్టు లోపలనుండు తెల్లని
భాగము దూఁట (దీనినే దూఁట దవ్వ అని
వ్యవహరింతురు)
సీ బొందె యనఁగను బొల్చును గదళీత్వ
గంతర్గతశ్వేతకాండసంజ్ఞ
అం భా ౩ ౫౭

బొక్క. వి (సం భూకః క బొక్క
త పొక్క) ౧ కలుగు కన్నము బిలము
ఆ చాటినేలమన్న కాచకే పుమన్నఁ బుట్ట
మన్న నెలుకబొక్కమన్నఁ దక్క నొండు
చోటఁ దామన్న గని కాచ మాచరింప
వలయు నంద్రు బుధులు విజ్ఞా ౧ ౩౭
క ఒక్కరొయెడం దములో నొక బొక్కకు
వాదడిచి శశకముఁ గపింజలమున్
కేయూర ౨ ౯౧
గీ లాఁగ బొఱియ బొక్కె కలుఁగు బొక్క
బొంద యనఁగఁ బొలుచు గర్తంబు
అం భా ౧ ౧౪౫
౨ గోయి గర్తము
ద్వి ఎడనెడ బొక్కలనిడినశాలకుల పెడ
లించి భక్షించు శేతాశతకులు
ద్వి హరిశ్చ ఉ ౧౬౭ పం
౩ రోని అఁడుగుతీ (వా) ౪ కారా
గారము ఖైదు
(వ్యవ) వానిని బొక్కలో పెట్టినారు
౫ నష్టము దండువు
(వ్యవ) వానికి బేరములో నాలుగువందల
బొక్క వచ్చినది
౬ బొక్కచెరదు బొక్కలాఁడు

బొక్కణ(ము). వి (క బొక్కణ త పొక్కణం
మ పొక్కణం) విభూతి పోకికొనుసంచి

ద్వి. కడఁగి కేరడవ్రులఁ గాయ పండేరి, కుడిచి
కత్తిరించు పెక్కురుకతాపసులకుఁ, బొడలకళా
సంబో బూదిబొక్కణ మె, జడలొ రుద్రా
క్షలో సంపదకేల.
ద్వి. హరిశ్చ పూ. ౧౪౭-౨. పం

సీ. బూదిబొక్కణ లాతిమును గమండలువును
బులికళాసముఁ గరంబున వహించి.
హర ౨. ౭౪

బొక్కనియ=బొక్కనె. వి గుఱ్ఱములకు దాణా పెట్టుసంచి.

సీ వాదంబుతో నశ్వముఖుల లాయంబులఁ
గట్టి బొక్కనియలఁ గవణ మెత్తు
నృసిం. ౨ ౧-౨౪.

బొక్కబొరడు. వి. సర్పవిశేషము, ఒకజాతి పాము (శ. ర., బ్రౌ.)

బొక్కలాఁడు. వి. (బొక్కలు + ఆఁడు) ౧ సర్పము ౨. కన్నగాఁడు

ద్వి 'శ్రుతిబాహ్యుఁ డిలఁ బుట్టుగ్రుడ్డి తామ
సుఁడు, గతిచెడ్డచెడుగు తెక్కలి బొక్క
లాఁడు, పదవిహీనుఁడు జగత్ప్రాణభక్ష
కుఁడు, కదకి యీవిసపాలవిత్తు నేమందు'
ద్వి. హరిశ్చ ఉ. ౨౦౩౬. పం

(ఇది పైరెండర్థములకును లక్ష్యము)

బొక్కసపి(పుటి)ల్లు. వి. (బొక్కసము + ఇల్లు) ధనాగారము.

సీ. సరుకులుండు, మిద్దె చిల్లరులు నమ్మెడు
దుకాణము బచ్చుమళిగ బొక్కసపిల్లు
మచ్చులు .. హంస ౨ ౨౨౬.

గీ. బొక్కసపుటిండ్లు సుగ్రాణముల నెలవులుఁ,
బాకశాలలు మరము లనేకభోజనార్థ
శాలలుఁ .గట్టఁ బనుపు. ఉ. రా. ౭. ౧౪

బొక్కసము. వి. (క. బొక్కస. త. పొక్కిసం)
౧. ధనాగారము, బండారము.

గీ. పూర్వ మే నున్న దో మీదు బొక్కసముల,
బొక్కసములు మీరె యది మే మెఱుంగ
మనఘ. ఉ. హరిశ్చ. ౧. ౪౨.

గీ సలిలపతి బొక్కసము వడిసకుల మెల్ల, ధర్మ
సీమంబు గిరులకు ధర్మ మవిల, తాండవిత
పాండుడిండీరఖండధారా, ధళ్యసాంద్రంబు
పాలసంద్రంబు మించు. వాల్మీకి. ౧. ౬౧.

సీ. బండరు వంచన బండార మంచన,
బొసఁగుచుండు, నల్లభాండాగారము
ఆం. భా. ౨ ౧౫.

౨ పెట్టె.

సీ. తటి నిండుజాబిల్లి తళుకుబొక్కసములోపల
మించు వలిమంచు వలువఁ బూని.
చంద్ర. ౪. ౪౪.

గీ తండులాదికతామ్రపాత్రములతోడ, పెసఁగు
సంచియు నగలబొక్కసముఁ దాల్చి, వెంట
శిష్యుఁడు చనుదేర . ఇందు. ౨. ౧౧౫.

౩ మూట.

గీ అస్థిగర్భితతామ్రపేట్యన్వితముగు, బొక్కసం
బెత్తుకొనిపోయి బోయ యనుచు
కాశీ. ౫ ౬౪.

ద్వి చంక బొక్కసమును సడలియున్నదియు,
శంకింప కొం పెట్టు సరియించెదయ్యా.
బస. పు ౩ ౬౫౬.

౪. ధనము, కోశము. (చూ బొక్కసపిల్లు.)

బొక్కి. విశ ౧ మాంసములేనిది, గుంటలుపడినది.

సీ. నొక్కుఁబ్రక్కలు బొక్కిరొమ్ములు
కలుగు నెఱుకుముసుఁడిఁ గనిరి సతులు.
కు. సం. ౬. ౬౯౪.

సీ బొక్కిఱొమ్ములు లోతుఁబొట్టలు మిడి
గ్రుడ్లు గూనివీఁపులు నిడుఁగొంకిదేళ్లు.
ఉ. హరి ౨. ౧౨౨.

సీ కొంగ మెడయు నిడుగూనివీఁపు సోఱుగు
పోయినరొండియు బొక్కిఱొమ్ము.
హరిశ్చ ౪. ౧౬౭.

౨ బోసివాఁడు, పండ్లులేనివాఁడు, పండ్లులేనిది.

ఆ. చీకు తెలుఁగు బొక్కి చెఱకునఁ గలయది,
మూఁగ శబ్దవివరములు గ్రహింప, లేనివనిది ...
వెన్న ౪. ౪౭.

చేఁదబొక్కి = పాఁతచేఁద.

ఆ. చేఁదబొక్కఁ బొదను జేర్చి ఖాండంబుల,
లోతునీళ్లమడుఁగులోన ముంచి. హైజ. ౩.౬౩

జ బొక్కపడు.

బొక్కపడు. అ. క్రి. శిథిలమగు.

మ కోట బొక్కపడంగా యవనోగ్రసైన్యము
ఫిరంగీల్ గుప్పి రొక్కుమ్మడిన్
రంగా ౩ ౮౨

బొక్కస. వి. వస్త్రములుపెట్టెడి పెట్టె, కోశ
కము. (శ ర.)

బొక్కసా. వి చిన్నమాట, అల్పభారము.

(వ్యవ) బొక్కసాలో కొంతకచ్చుబలె వీఁడు
సిద్ధమైనాఁడు

బొక్కు. స క్రి ౧ ఏదేని వస్తువును నోటినిండ
చేసికొని తిను

సీ. జాలినారసాగడు జొన్నల కాఁడలఁ ద్రొక్కి
మొక్కునఁ ద్రెంచి బొక్కి బొక్కి.
ద్వా ౪ ౧౧౪

క. రక్కసుఁడై శాపం బిడి, యొక్కొక
యపరాధమునకు నొక్కొక్కఁడు గా,
బొక్కఁగ లోకము పురపురఁ బొక్కఁగఁ
బాదర్యో నంతిపురముం బురమున్.
మనుచ. ౫. ౨౫

ఉ. తనవారు వారివా రనక దొరకినవారినెల్లం
దునుకలు చేసి బొక్కుచుం ద్రొక్కుచు
రామా ౭. ౧౫౦

వి. బొక్కుట.

జ. బొక్కులాడు.

బొక్కులాడు. స క్రి (బొక్కులు + ఆడు) నోటి
నిండ చేసికొని తిను, బొక్కు.

చ. కలమపుకెండుగల్ ద్రవిడకన్యలు ముంగిటఁ
గాచుచుండి తజ్జలరుహనాథగేహరుర
కాబము సొరెకు బొక్కులాడ చెంగలువ
దండలఁ దోలుదు రప్పురంబునన్
ఆము. ౧. ౮౫

బొక్కెన¹. వి నీరుపిప్పలి. వృ.

సీ. నీరుపిప్పలి యంచనిన బొక్కెన యనంగఁ
దోయపిప్పలిసంజ్ఞ దోఁచుచుండు.
ఆం. భా. ౨. ౫౮.

బొక్కెన²=బొక్కెనియు. ౧ ఉలవలు మున్నగు
దాణా ఉంచి గుఱ్ఱమునోటికి తగిలించుసంచి.

సీ అశ్వఖాదనసాధకాస్యలంబి,ధత్రి బొ
క్కెన యనఁ బరగు... ఆం.భా ౨.౨౦౦.

౨ చేఁద, నీళ్లుతోడుసాధనము.

గీ చేఁద, బొక్కెన యనంగఁ దర్భేద
యొప్పుచుండు. ఆం. భా. ౨. ౨౯౩.

బొగడ. వి ౧ మంచపుఁగోడు మొదలగువాని
తలయందును గందపట్టెమీఁదను ఉండుగుబ్బ.

చ పగడపుఁబాదపట్టియలు బన్ను మెఱుంగు
కిరీటిపచ్చబొ,బొగడ కడానిక్రొంబసిమి
పుత్తడిపట్టుపకోళ్లసంతనం, దగుమగణాతి
పట్టియలు పెంపగుమంచమునన్ మహో
న్నతిన్ చంద్రా ౬. ౨౩౨.

౨ చూచుకము, చన్మొన

చ చనుబొగడల్ పిఖాకలనఁ జక్కలిగింతలు
నోవ లోఁగుచున్ కళా. ౧. ౨౪.

సీ తెలిముత్తియపుసరుల్ దిద్దు నెపంబున గుబ్బ
చన్బొగడలఁ గోరఁ జెనకి. నీలా ౩. ౧౦౩.

౩ ఆఁడువారు కొనచెవిని ధరించెడు భూష
విశేషము, బుగడ

సీ. చెవులపువ్వు బొగడ బవిరె రాకేక ... క
భూషావిశేషములు ఆం.భా. ౨.౧౪౭

సీ కలన మించుధరాజకెంపుటొబొగడల జి
చవిజవ్వాదిచెల్మి కలర. ఉ. రా. ౬. ౧౧౯

ద్వి. మగటాలతళుకుఁగమ్మలును గట్టాణి,బొగ
డలు చుఱుకుఁగెంపులబవిరెలును.
రం రా. బాల. ౮౫. పొ. ౬.

౪. చెఱువుకట్ట లోనగువానియందు నీళ్లు దూఱి
వచ్చెడు రంధ్రము. (శ. ర.)

జ బొగడపచ్చలు, బొగడసరులు.

బొగడపచ్చేలు. వి బ. (బొగడ + పచ్చలు.
వస్త్రవిశేషములు, ఒకదినుసువస్త్రములు.

సీ. నిండుబన్నెలు మంచినిగమగోచరల
పొమంతవీథులు ప్రతిముఖము బొగడ. సీవచ్చ
లును.. మొదలుగా వల్వలు ధరించి మడిక
లపుడు. ప్రబంధ. ౨౪౨

**బొగడసరులు.** వి.బ.(√ బొగడ)భూషావిశేషము.
సీ. ఏడుకట్టులు వంకె లికుకరాజనములు పులి
గోళ్లవంకెలు బొగడసరులు.
హంస. ౪. ౧౨౭.

**బొగ్గు.** వి. మండి చల్లారిన కట్టెతునుక, కాలిక
గీ. బొగ్గులకుఁబోలె కొందలంటఁబొడువఁబనదు
భార. ఉద్యో ౨. ౫౪
క . . బొగ్గులకై కల్పతరువుఁ బొడుచుట
సుమతీ. సు. శ. ౫౭.
గీ. .బొగ్గు, నల్లి అనఁగను గాలి కానామములగు.
ఆం. భా. ౨. ౨౪౨.
వికా. నల్లనిది.
మ. తలిరుంగేల మరుత్కిశోరగమితాత్యచ్ఛ
ప్రసూనాంతరో,జ్జ్వలకింజల్కసమాఖ్యలో
ద్రవము లెంచ న్నించి కేఁదేఁటిపిల్కల
పేరం దగు బొగ్గుటిమువలకోల్లన్ బట్టి
యాడించె . చంద్రా. ౪ ౭౧
జ' బొగ్గుపడు, బొగ్గులుసేయు.

**బొగ్గుపడు.** అ. క్రి. (బొగ్గు + పడు.) నల్లనిదగు.
సీ. కనకవర్ణంబైన కైటభాసురకైరి పొగచూరి
నల్లనై బొగ్గుపడిరొ భీమ. ౪ ౬౧
శ్లో కాలకూటాగ్నిసంపర్కాన్నీలవర్ణస్తదా౽
భవత్.

**బొగ్గులుసేయు.** స. క్రి. (బొగ్గులు + చేయు)
బొగ్గులుగాఁ జేయు,పాడుచేయు
ఉ. సిగ్గొకయింతలేక తలచేడియకైవడి ధర్మ
కీర్తులన్, బొగ్గులుసేసి జారుకకిఁబొందికటా
కడుపేలకెచ్చుకొంటి. . భాగ. ౯ ౩౪౭.

**బొచ్చె.** వి. కోశము, శంద్రుక.
సీ. కోశము బొచ్చెన ద్రుమ్మెడు తావిలు...
ఆం. భా. ౨. ౧౪౬.

**బొచ్చు.** వి. కరోటిభేదము; తలచెంపు.
గీ. తనరుచు గకోటి కొప్పెర పునుక ... బోలె
బొచ్చు నా ... ఆం. భా. ౨. ౧౩౩.

**బొజఁగు.** (సం. భుజంగః)౧ విటుఁడు, వేశ్యాపతి
క పడిపడి తెలతెలఁదురలెం,బడో నవలెంచిరి
బొరిఁబొరిఁ బ్రాయపుఁ బొజఁగుల్.
అచ్చ. రా. అయో. ౧౩.
క నాథుఁడుబొజఁగు విభుడు న్ప,పా! కట
విటుకైఁ ఖ్యుఁ దర్ధపతి యనువాతం,డు...
దళకు. ౬. ౯౯.
సీ. విటనామధేయమా విట కాఁడు వేడుక కాఁడు
బొజఁగు నన్ను కాఁడు అంటె,కాఁదనఁగ ..
ఆం. భా. ౨. ౧౧౬.
౨ ప్రభువు, అధిపతి
మాలిని జగములరొుకిమీఁదా జాకువాచింటి
వాఁడా, తిగకోటికిలగొంగా దిట్ట లేకే
బొజంగా. అచ్చ. రా. కిష్కిం. ౧౦౯.
జ' బొజఁగులాఁడి

**బొజఁగులాఁడి.** వి. (బొజఁగులు + ఆఁడి)
పై వ్యభిచారిణి, అంకటాలు
సీ. బొజఁగులాఁడి లోడారిబుచ్చి పల్గాకి
జాదరి రొుబ్బెరాసి గాతలకొటారు.
చెన్న. ౨. ౨౪.

**బొజ్జ.** వి (క బొజ్జె) పొట్ట, కడుపు.
సీ బొజ్జన బొజ్జనఁ బొట్టన డొక్కనఁ గడు
పనఁ గుక్షియాఖ్యలు చెలంగు.
ఆం. భా. ౨. ౧౩౪.
గీ. అమృతమధురంబు లగుగాదు్ప లానియాని,
బొజ్జపెంచిన పెనుపాఁపపెజ్జమీఁద . కారి
పవ్వళించు నైష ౫. ౪౪.
గీ లెక్కలిడరానిరాయంచజక్కిబోదు,గ్రద్దుఁ
ఒనఁటులు నిండారు గొప్పబొజ్జఁ బూను
పెనుదంట .. నీలా. ౧ ౭౪.
జ' బొజ్జదేవర, బొజ్జవాఁడు

**బొజ్జదేవర.** వి. (బొజ్జ + దేవర) వినాయకుఁడు.
గీ. గుజ్జువేలుపు పిళ్లారి కొమ్ముఱాజు, బొజ్జ
దేవర ... వినాయకుఁడనఁ జెల్లాదురు ...
ఆం. భా. ౧. ౪౩.

**బొజ్జవాఁడు.** వి. (√ బొజ్జ) తుందిలుఁడు, పెద్ద
పొట్ట గలవాఁడు.

సీ. బొజ్జవాఁ డనఁగను బొజ్జివాఁ డనఁగను తుందిలవాహుఁడై తోఁచుచుండు.
ఆం భా. ౧-౨౦.

బొటనవ్రేలు = బొటమనవ్రేలు, బొటవ్రేలు, బొట్టనవ్రేలు, బొట్టవ్రేలు. వి. హా. అంగుష్ఠము, పెద్దవ్రేలు.

గీ. నాగకన్యలతోడికలహ మునకుఁ గాల్ద్రిప్పి దవ్వులేక బొటనవ్రేలఁ బుడమి వ్రాసెద వది రేల పువ్వుఁబోణి దశా. ౨ ౩-౨౪

సీ. పొసఁగు వంగుష్ఠంబు బొటనవ్రే ల్బొట్టనవ్రే ల్బొటవ్రే ల్బొట్టవ్రేలు పెద్దవ్రేలు నాఁగను ఆం భా. ౨ ౧౩౯.

బొటబొట. వి. పొక్కుట కారుట మున్నగు వానియందగుధ్వని కనుకరణము.

చ. చివరిటలున్, బొటబొటఁబొక్కుభూమిఁ గల భూజములందు మహోగ్రవృత్తిమై చిత్రభా. ౨ ౯

ప. . . క్రొవ్వుచమురు బొటబొటన వడియం గలవీన మెదడుఁ జిగురెముక యూరఁగాయ వంటి వంటి మెక్కు కాకినులును చంద్రా. ౬ ౯౩

గీ. అడలెఁ గన్నుల బొటబొట వశ్రు లొలుక కళా. ౩ ౨౪౧

ఇక్షే: బొటబొటబొట

క. చిఁపొటిచినుకులు మిఁలన్, బొట టబొట యనుచుఁ బడెఁగ విప్ర. ౩ ౫౫

బొటమంచి. వి. గొల్లనిపరికరములలో నొకటి.

సీ. బొప్పి మజ్జగమంత బొటమంచి ఎల్లలగూఁడు దామెనత్రాడు కోఁతికత్తి హంస. ౨ ౬౫

బొటమనవ్రేలు = బొటనవ్రేలు.

క. ఉల్లన బొటమనవ్రేలిని, పెల్లన వారి పంట నృట్టి మెఱుమంచు నొక్కెన్. సత్య. శాం. ౪. ౧౯౭. (శ.ర, బ్రౌ. పా. అల్లలనబొటవ్రేలను, మ.వ్రి. పా.)

బొటవ్రేలు = బొటనవ్రేలు.

ఉ. . . పెన్నువిమించుఁ గాలి బొటవ్రేలిచేఁ గూఁకుచు . . . రామా. ౫. ౧౯.

క. ఛటుఁడొకఁడు పందిపోటున, బొటవ్రేలికి నూటికెట్టి పూని యదల్పన్. సారంగ. ౧. ౧౦౫.

చ. తద్దయు నొప్పు విచారశయ్యపై, వింపిత లీల బాల బొటవ్రేల నిలాతలమున్ లిఖించుచున్. విక్ర. ౪ ౨౨౦.

బొటిమె. వి. యౌవనమందు మొగమున లేచెడు చిన్నపొక్కు, అవగండము (శ. ర)

బొటుకురు. వి. వృక్షవిశేషము. ఒకానొకచెట్టు.

ద్వి. బొటుకురు నుసిరిక పోఁక నారంజి, కటుకుర గుమ్మడి కస్తూరి తుమ్మ. ద్వి. శ సా. ౨ ౬౨౭ పం.

బొట్టు[1]. వి. ౧ గానవిశేషము.

వ. విరించిపట్టి విపంచి పట్టి బెట్టుగా బొట్టు గీతంబులం దలపెట్టె. ఉ. రా. ౨. ౬౧

బొట్టు[2]. వి. ధాన్యాదు లుంచుకొనుటకు వెదురు ఒద్దలతో నల్లిన పెద్దబుట్ట, పాణక.

గీ. తద్విశేషసమాఖ్యలు దనరుచుండు, కొట్టు కూఱు పొడక కుమి బొట్ట యనఁగ. ఆం భా. ౨. ౨౪౦

బొట్టడి. వి. బెస్తలు సవారి మోయునపుడు నడచు నడకలలో నొకటి.

వ. బెస్తలు నిస్తుగా మోచి నిబ్బడుగు మోరడి ఒలిమికం బొద్దిక బొట్టడి చిట్టడి మోపన ఒదిలము ప్రబంధ. ౬౦౫. (దొర్లించెడునల్లరాయి అని శ. ర.)

బొట్టనగోలలు. వి. బ. బాలక్రీడావిశేషము.

సీ. చీకటిమొటికిల్లు చిమ్ముబిల్లలు పెట్లు బొట్టన గోలలు బొమ్మరాలు. గీ. అదిగా నైకక్రీడలాడి రచట. వి. పు. ౧. ౨౦౨.

బొట్టనవ్రేలు = బొటనవ్రేలు.

బొట్టము. వి. కాపీనము, గోఁచి.

గీ. బొట్టు మంచునఁ గాటుకయు దనరారు
ఆం. భా. ౨. ౧౫౩.

బొట్టుపేలు = బొటనవ్రేలు. (క. బొట్టు = కాలిబొటనవ్రేలు.)

బొట్టియ[1] = బొట్టె[1]. వి (క పొడియాన్) ౧. పుత్రుఁడు.

చ. తన్కుఁ బురానిదీరమున్, బౌవరఁగ వేల్పు గొంగతోలిబొట్టియ యింద్రజిత్తుండు ఇంపి లున్. అచ్చ రా యు. ౭౦.

క వినుఁ గోడ నీకు బొట్టియ, లోనగూడు కొఱంగు నిక్కి పొదవఁ దలిపెదన్
అచ్చ. రా బాల ౫౩

౨. పుత్రిక, కూఁతురు

గీ పుడమి బొట్టియ యత్తల కడర మ్రొక్కి.
అచ్చ రా. యు. ౫౮౭.

బొట్టియ[2] = బొట్టె[2].

బొట్టియఁడు = బొట్టెఁడు. వి పుత్రుఁడు

గీ. ప్రౌఢునికుపును గాదుపుబొట్టియఁడును పెనుగట్టు లెత్తుకొనిరి.
అచ్చ రా యు ౭౮

బొట్టు. వి (సం పుండ్రమ్. క బొట్టు త పొట్టి మ పొట్టి) తిలకము

ఆ. ఇద్దబొట్టువోలె నింటిలో నుండక
కు. సం. ౭. ౭౭౩.

ఆ బోడతలయు నిడుదబొట్టుఁ జూచి.
ఉ. హరి ౪. ౪౨

సీ. పశ్చిమదిక్కుంభిఫాలభాగంబునఁ బోలు పొందు కేగుఱుబొట్టనంగ విక్ర. ౩. ౮౫.

౨. జలాది బిందువు, చుక్క.

సీ. గోఖురోద్ధతరేణుకుంఠితం బగు మోము చెమటబొట్టుల జాలఁ జెన్నుమిగుల.
హరి. పూ. ౫. ౧౭౮.

సీ. ఆకొంబొట్టున కచట సిఁగలు మునిరిన వానిఁ బట్టంగ నని తలంచి.
కేయూర. ౨ ౧౧౪.

౩ అంకెలలోశూన్యస్థానము, సున్న, బిందువు.

చ. పొరిఁ బదిమున్నులు క్షణంబు బొట్టు మృగాంకుఁడు వెడుమిమిన్న లున్, ధరణియు. భా. రా. యు. ౩౭౫.

సీ. బొట్టన సున్నన బోలుపొందు బిందువు...
ఆం. భా. ౨. ౧౮౮.

౪ లెక్కించునపుడు గుర్తుగా పెట్టిన చుక్క.

క. వనచరనాయక సంఖ్యను, వనజభవుఁడు బొట్టు లిడుచు వచ్చినకోలె నాఁ, గనదురుదీర్ఘంబు గగనంబున పొక్కిఁ డొకండవోఁ చెఁ బొరిఁ దారకముల్. భా. రా. యు. ౩౭.

౫ మంగళసూత్రమున గ్రుచ్చబడి సువర్ణాభరణము.

గీ. తనయులను ధారవోసెను దక్షుఁ డప్పుడు, బొట్టు గట్టెను చంద్రుఁ డప్పుత్రికలకు.
శ్రీరం. మా. ౪. ౭.

గీ పుట్టుటకు మున్న లేమకు బొట్టు గట్టి, చెట్ట పట్టుట కొకరుండు పుట్టెఁ జూడె.
కృ. శతం. ౨. ౭౪.

గీ పుస్తె, యనఁగ మాంగళ్యసూత్రాఖ్య యలరు చుండు, బొట్టనఁ దదంతర సువర్ణభూష యొక
ఆం. భా. ౨. ౧౪౮.

౬ బొట్టుదారము, బొట్టానర్చు.

బొట్టుగు(వు). వి తిలకవృక్షము †.

సీ బొట్టుగు లేమావిఁ బొదలించె కొక్కుఱు చూచియుఁ జేనంటి సొబగుమీఱ.
యయా. ౪. ౧౯.

మ లలనా యీరిఁ దశోకవృక్షము రసాలంబున్ బ్రియాళంబు వావిలియుం బొన్నయు బొట్టుగున్ బొగడ క్రోవి గ్గోఁగు సంపెంగ నిం,దులఁ బోషింపఁడు వైజ. ౨. ౧౪.

సీ. పొన్న బొట్టుగు పొఁక పొగడ దాడిమ మిప్ప గుముడిందగురుకొండ గోగుకేమ.
కేం. పంచ. ౪. ౫౨౨.

బొట్టుదారము. వి. (√ బొట్టు) బొట్టుగ్రుచ్చబడు మంగళసూత్రము. (శ. ర.)

బొట్టె[1] = బొట్టియ1. వి. ౧. పుత్రకుఁడు, పిల్లవాఁడు.

చెట్టు లేక విహరించుటకు వజ్రనాభు మొదల యడిగి ... ప్రభా. ౧. ౧౨౧.

బొడ్డసరము=బోడసరము. వి. ఓషధివిశేషము, పైరులలో మొలచు ఒకవిధమగు చిన్నచెట్టు. (బ్రౌ, శ ర.)

బొడ్డి. విశే. ౧. మూర్ఖురాలు, వివేకములేనిది

క ఒడ్డారంబునఁ దులు దై, యడ్డిడ కారెడ్డి సాము మఱచి మనమునన్, జడ్డనఁ గులమును జెఱచునా,బొడ్డిని రాజంత యంతిపురమున గనిచెన్. ఉ. హరిశ్చ ౪. ౫౭.

౨ లోతైనది

ద్వి. పొట్టయు జడగొంతువోయినవీఁపు, బొడ్డి కన్నులు ముడిబొమలు వ్రేల్ జడలు పండితా. దీక్షా. ౪౦. పా.

బొడ్డిగము. వి అవివేకము. (చూ. బొడ్డిగీఁడు)

జ: బొడ్డిగీఁడు.

బొడ్డిగీఁడు. విశే. (√బొడ్డిగము) మూర్ఖుఁడు, అవివేకి.

గీ. రెడ్డిగాడుకైన యొకయొడ్డె బొడ్డిగీఁడు ఉ. హరిశ్చ ౪ ౧౨

బొడ్డు. వి (క. పొట్టు) ౧ నాభి, పొక్కిలి.

సీ. . బొడ్డు పొక్కిలి యనఁ బొసఁగు నాభి ఆం భా ౨ ౧౩౭.

౨. నాభినాళము.

గీ. . మరునకుం గుసుమర్తు మన్మంత్రసాని, బొడ్డు గోసినవాడులివో శ అము. ౫ ౧౧౨

౩. గిన్నె సీసా మొ॥ వానికిఁ గ్రిందుభాగమున లోపలికి మొలకగానుండు ప్రదేశము

చ. దేవతలఫుట్ట మొసంగుచు బొడ్డుగిన్నెలో, నునుతురు రాగిసంకటి తలోదరులు శుక. ౨. ౩౩౫.

౪. నూతిచుట్టును ఎత్తుగా కట్టినగోడ. (శ. ర.)

జ: బొడ్డుఁజవిక, బొడ్డుకొంగు, బొడ్డుగంట, బొడ్డుపుడక, బొడ్డుమల్లె, బొడ్డువంచు, బొడ్డెర, బొడ్రత్నము.

బొడ్డుఁజవిక. వి. (బొడ్డు + చవిక) చుట్టుకొల్లారము వడిమిచావడి (శ. ర.)

బొడ్డుకొంగు. వి (బొడ్డు + కొంగు) బొడ్డుకడ చెక్కుకొనుకట్టు ఒట్టకొన

(వ్యవ) వాఁడు డబ్బు బొడ్డుకొంగున గట్టిగా కట్టికొనివాఁడు

బొడ్డుగంట. వి అలంకారవిశేషము, మొలగంట.

గీ ధూరితారావళులు మొలపూసలయ్యెఁ, గమలినీనాయకుఁడు బొడ్డుగంట యయ్యె. సీతా వి. ౨. ౧౩౦.

బొడ్డుపుడక. వి (బొడ్డు + పుడక) కఱ్ఱతోఁజేసిన యొకవిధమగు పనిముట్టు, దూదేకులవాం డ్రుపయోగించు కొఱముట్టు (శ ర., బ్రౌ.)

బొడ్డుమ(ల్లియ)ల్లె = బొండుమల్లె. వి. (√బొడ్డు) ఒకజాతిమల్లె ‡ లతావిశేషము, దానిపుష్పము

ద్వి కన్నె గేదంగులు గరవీరములును, పొన్నలుఁ బొగడులు బొడ్డుమల్లియలు ప్రభులిం. ౨ ౧౭. ౩. పం.

గీ. పొగడలును బొడ్డుమల్లెలుఁ బొన్నవిరులుఁ బొమ్మవను వాల్గుదిక్కులఁ బఱచికైచి పి. శకుం ౩ ౪౧.

బొడ్డువంచు. అ క్రి. (బొడ్డు + వంచు)ఓపిక గలిగి యుండు.

ఉ ఏపనికైనను బొడ్డువంపలే, దందుకుఁ దోడు చీమ చిటుకన్నను వాడుకు వచ్చుచుండు భోజరా. ౫. ౧౪౨.

బొడ్డెరు(రిక). వి. (√బొడ్డు) పశురోగవిశేషము.

క తొట్రుపడు లేచుఁ బలుమరు, నిట్టలపడి చూచి కాళ్లు నీల్గుచునుండుం, బెట్టదు మెయ్యదు బొడ్డెరు పుట్టిన పసరము చికిత్స పొందెరుగంగా.

సహదేవపశుశైద్యశాస్త్రము. ౧౧. పా. ౩౪. ప.

బొడ్రత్నము. వి. (బొడ్డు + రత్నము) [illegible] దుండు మణి, భాగ్యవిశేషము.

శా. . సాధుస్తుత్యవంశంబునం, బొడ్రత్నంబునఁ దేజిల్లుజననంబుం బొందినన్ ..

శైవ. ౧. ౬౩.

బొణిగ. వి ౧ సరకుతోసున్న చేతిసిద్దె. ౨. కొయ్యగంట. ౩. ధత్తూరవిశేషము. బ ౧ పొట్టుబీడి బ్రద్దలు కాని కాయధాన్యము. ౨. బొంతు బీడని జొన్నలు లోనగునవి. (శ. ర.)

బొణుగు. వి చిప్పలు మొదలగున వానికదాని కొకటి తగులునపుడు పుట్టుధ్వని కనుకరణము. (దీనియామ్రేడితరూపము బొణొబ్బొణుగు)

సీ మొనఁదన్ను ఫునుకలనిడు పేరు లొండొండఁ బొరిఁబొరి దాఁకి బొణొబ్బొణుగు రవఁగ.

బొత్త. వి తామ్రాదిపాత్రములరంధ్రము, చిల్లి (శ ర)

(వ్యా) కొత్తచెంబు బొత్త పడినది.

బొత్తి. వి దొంతి, దొంతర, పత్పంక్తి

(వ్యవ) అకాగితములు బొత్తి పెట్టుము

బొత్తిగా=పూర్తిగా.

సీ వలు వందఁ దొలఁగించ వలదను వనితకే ల్విడిపించి బొత్తిగా సుపలఁజేసి

శృ. వి. ౧ ౧౭ పా ౧౫. పం.

బొద. వి బల్బజము, తృణవిశేషము

సీ బొద యన బల్బజం బొనరుచుండు.

ఆం భా ౨ ౭౫

బొది. వి ఓడలు చేసెడుచోటు (శ. ర, బ్రౌ)

బొద్ది. వి. (క బొద్ది) ౧. వృద్ధదారకము ౧ ఒక జాతిమూరాకుచెట్టు

సీ. బొద్దిమూరయుఁ దక్రమును సంతకుము చాలు నీఁతగింజలు నీర్లు సొనయు చాలు

(చి కీ., చి వి.)

౨. వృక్షవిశేషము.

ద్వి. మద్ది పొలికొడిసె మారేడు కొలఁగ బొద్ది పాపర జమ్మి పులఁగుడు చేడి

ద్వి. శ సా. ౨. ౭౪౬ పం

గీ. బొద్ది యనఁగ, వృద్ధదారక మలరును

ఆం. భా. ౨. ౬౭

బొద్దీఁక. వి. (బొద్దు + ఈఁక) ఒకజాతి కీటకము, బరిగెపురుగు (శ. ర.)

బొద్దు. వి. ౧. శిశువుల హస్తాభరణవిశేషము, హస్తాభరణవిశేషము.

చ పైఁడియుంగరం,బులుఁ బులిగోరు సంకులును బొద్దులు గాజాలు రావిరేకయుం, జెలువలరంగ . కళా ౭ ౧౯౯

గీ కడెము కడియము బొద్దొత్తుగాజు మూడిగంబు హస్తభూషావిశేషంబు లలరుచుండు ఆం. భా. ౧. ౧౪౯

౨. కొన్ని కొఁపులు చేర్చి కట్టిన ప్రత్తి, గడ్డి మొII వాని సమూహము.

వ దేవులకుం బుణ్యాంబుగా విడియాన కుని చిరి ప్రత్తిబొద్దునకొ దశా ౪ ౯౩౯

ప కొలఁచుభండిబీసాల. ౨ ప్రత్తిబొద్దునం గేసరిపాక. ౧. ద. శా. ౪ ౯౩౫

(చూ. గడ్డిబొద్దు.)

౩. గోడలు లోనగువానియంచులయం దేర్పతి చెడు తదవయవవిశేషము, టాకు. (శ ర)

జ· బొద్దుకీటు

బొద్దుకీటు. వి (బొద్దు + కీటు) గోడపై బొద్దేర్ప తిచి పెట్టెడు కీటు (శ. ర)

బొద్దుగ. వి వృక్షవిశేషము

వ మద్ది బొద్దుగ వావిలి యిందుగు మొదలగు తరుల ఇందు. ౨. ౭౦.

బొనము. వి. మెఱుఁగు, తళుకు

ఉదా: కెండిపండుబొనము. శ. ర. (ఇతర వ్యవహారము కాని ప్రయోగాస్తరము గాని కానరాదు)

బొప్ప(ఁడు). వి. బాలుఁడు, పిల్లవాఁడు.

ద్వి. బొంగరదుఁ గడుభ్రమువ్వానకు బొప్పనికి, నంగటిము ల్లరొయ్యి నని వరు లవఁగ.

బస. పు. ౩. ౩౬౫. పం.

విణ మూఢుఁడు.

౬ పూటుపడు ఒకడు చేయవలసినపని తాను
చేసెదనని పూనికఁగొను

౯ గురుతుచవహావభరమ్మునఁ బొరిఁబొరి బేద
కవు వరిగిపోఁబోయినఁ ద ద్భరవహనమునకు
భరపడుకరణిం జక్షువంబు సతికిఘన హైం యను
రుక్ కు సం 3 ౨౯౨

౭ విశ్వసించు నమ్ము

౮ ప్రజ రోసిన కాన నన్నుం బ్రజ సుగతికిఁ
బుచ్చునని భరంపడి కోరక్
భార శాం ౫ 3౮౭

భరము. సం వి అ పుం ౧ అతిశయము ౨ అసక్తి

అ బాలకేళిమీఁదిభరము గ్రవంబున విడుచఁ
గళలయందు కేద్కుసానిపి నయముతోడ
వర్తనంబుల శిక్షింపు సెలఁత కేడుగడయు
నీవకాద భార విరా ౧ ౨౫౧

ద్వి తిరునాళ్లఁ జూతు నన్భరమున నుండ
పండితా దీక్షా ౫౦

విణ (అ ఆ అ) భరించునది

భరి(యి)ంచు. సం స క్రి పోషించు

సీ పతి ప్రయత్నంబుతో భార్య భరియించుచుఁ
గీడొందకుండ రక్షింపవలయు
మార్క ౨ 3౨౫

వ అశేషలోకంబు నస్మచ్ఛరీర సంభూత
శాకాహారంబుల భరియించి శాకంభరియను
పేరం బరగుదు మార్క ౬ ౨30

భరితము. సం విణ (అ ఆ అ) ౧ పోషితము
పోషింపఁబడినది ౨ నిండినది పూర్ణమైనది
3 పచ్చనిది హరితవర్ణముగలది
వి అ పుం పచ్చనిరంగు హరితవర్ణము

భరిమ. సం వి ఞ పుం ౧ విష్ణువు ౨ కుటుం
బము 3 పోషణము ప్రోచుట

భరుజము. సం వి అ పుం నక్క (వాచ)

భరుటకము. సం వి అ న భృష్టామిషము,
వేఁచినమాంసము

భరువు. సం వి ఉ పుం ౧ భర్త ౨ ప్రభువు
3 శివుఁడు ౪ బంగారము

భర్గము. సం వి అ పుం ౧ కాంతి, దీప్తి జిగి
౨ సూర్యునియందలి తేజస్సు 3 వేఁచుట,
కాల్చుట

భర్గుఁడు. సం వి అ పుం శివుఁడు

భర్గ్యుఁడు. సం వి అ పుం శివుఁడు

భర్జనము. సం వి అ న ౧ వేఁచుట కాల్చుట
౨ బాణలి పెనము విణ (అ ఆ అ) వేఁచు
నది కాల్చునది

భర్త. సం వి ఋ పుం ౧ పతి మగఁడు ౨
ప్రభువు పైయధికారి యజమానుఁడు
ఉదా గణభర్త భూతభర్త ఇం॥
విణ (ఋ ర్త్రీ ఋ) ౧ ముఖ్యుఁడు సేన
నడిపించువాఁడు ౨ పోషించువాఁడు
రక్షించువాఁడు 3 సృజించువాఁడు

భర్తృఘ్ని సం వి ఈ స్త్రీ భర్తనుజంపుస్త్రీ

భర్తృదారకుఁడు సం వి అ పుం (నాట్య)
రాజకుమారుఁడు

భర్తృదారిక. సం వి ఆ స్త్రీ (నాట్య) రాజ
కుమారిక

భర్తృమతి. స వి ఈ స్త్రీ భర్తగలది సువాసిని

భర్తృవ్రత సం వి ఆ స్త్రీ పతివ్రత భర్తను
దైవముగా నెంచెడిస్త్రీ

భర్తృవ్రతము. సం వి అ న పాతివ్రత్యము

భర్తృసాత్కృత. సం వి ఆ స్త్రీ భర్తకధీ
నముచేయఁబడిన స్త్రీ వివాహిత

భర్త్రి. సం వి ఈ స్త్రీ పోషించుస్త్రీ

భర్త్సకుఁడు. సం వి అ పుం ౧ భయపెట్టు
వాఁడు బెదరించువాఁడు ౨ నిందించువాఁడు

భర్త్సనము. సం విణ (అ ఈ అ) ౧ భయ
పెట్టునది బెదరించునది ౨ నిందించునది,
తిట్టునది వి అ న ౧ బెదరింపు భయపెట్టుట
౨. నిందించుట, తిట్టుట

**భర్త్సించు.** సం. స. క్రి. భయపెట్టు, బెదిరించు.
మ.అని భర్త్సించినఁ బల్లవిల్లి విముఖుండైపోయె విద్యుత్ప్రభాఖ్యనిశాటాధముఁడు.
వరాహ. ౧౧ ౯౨ (భర్జించు—ముద్రి).

**భర్త్సితము.** సం విణ (అ ఆ అ) ౧ నిందితము, తిట్టఁబడినది. ౨. బెదరింపఁబడినది
వి అ. న ౧ నిందించుట, బెదరింపు

**భర్త్సిపత్త్రిక.** సం. వి అ స్త్రీ. మహానీలి ౘె. (రా. ని, వాచ)

**భర్మణ్యా.** సం వి అ స్త్రీ అడ్డసాలి

**భర్మము.** సం వి న్ న ౧ పోషణము, ప్రోచుట, రక్షించుట. ౨ బంగారము 3 బొడ్డు, నాభి ౪ దుత్తూరము, ఉమ్మెత్త ౘె

**భలత.** సం. వి. ఆ. స్త్రీ రాజజలాలత ౘె (వాచ)

**భల్లకము.** సం వి అ పుం ౧. శ్యోనాకము, దుండిగపుఁజెట్టు. (రా ని) ౨ ఎలుఁగుగొడ్డు.

**భల్లము.** సం వి అ. పుం, న అస్త్రభేదము, బల్లెము. పుం. ఎలుఁగుగొడ్డు.

**భల్లాతకము.** సం వి. అ. పుం, న జీడి ౘె

**భల్లాతకి.** సం వి. ఈ స్త్రీ. ౧. జీడి ౘె ౨. ఇరువదినాలుగు స్త్రీరాగములలో నొకటి
సీ. సలలితలలితహరి కురంజి ధన్యాసి పూర్వ గౌళ వరాళి నాట భల్లాతకి
హంస ౫ ౧౩
గీ. కన్నడయు చాయయును గౌళ కడునపూర్వ, మైన భల్లాతకియును నారాయణియు ను, గ్రమత నిరువదినాల్గు స్త్రీరాగములును.
ప్రబంధ. ౯౫.

**భల్లాతము.** సం = భల్లాతకము.

**భల్లి.** సం. వి. ఈ. స్త్రీ. = భల్లాతకము.

**భల్లు** = ఒల్లు. (విలుగుటయం దగుధ్వని కను కరణము.)
చ...ఈ,యమపమకార్ముకం బిటు రయంబునఁ గేల ధరించెనందు నే, మనయము విస్మయఁబుసడునంతటిలోఁ దిగిచె నన్న కేంద్ర భల్లన విలుగంగఁ జెప్పఁ దడ బమ్మెయి నెప్పెడుమాత్రయింతయున్
హరి ఉ ౯ ౭౬

**భల్లుకము.** సం వి అ పుం ౧ భల్లూకము ౨ కోఁతి (శ ర)

**భల్లూకము.** సం వి ఉ పుం ఎలుగుఁగొడ్డు

**భళభళ.** వి భుజించునపు డగుధ్వని, అధ్వనికను కరణము.
క జలసేచన ఘుళఘుళ లప్పలములపళపళలు భోక్త్రు భళభళ లచలా,వళిపటపెళపెళ లంగద ఝుళఝుళ లేకీభవించె జనము నుతింపన్.
ఒహ ౪ ౨౪

**భవకుఁడు.** సం విణ (అ వి ఆ అ) ౧ బ్రదుకువాఁడు, జీవించువాఁడు ౨ ఆశీర్వాదము పొందువాఁడు

**భవఘస్మరము.** సం వి అ పుం దావానలము, కార్చిచ్చు.

**భవచ్ఛిత్తు.** సం. విణ సంసారసంబంధమును ద్రెంపినవాఁడు (రూ భవచ్ఛిదుఁడు)

**భవచ్ఛేదము.** సం. వి. అ. పుం సంసారమును ద్రెంపుట, పునర్జన్మము లేకుండఁజేయుట.

**భవతి.** సం వి. ఈ స్త్రీ ౧ దీప్తిమతియగు స్త్రీ, దేవి. ౨. విషములోఁ బూయఁబడిన బాణము, విషాక్తబాణము.

**భవదారువు.** సం. వి ఉ. న. దేవదారువు. ౘె.

**భవదీయము.** సం. విణ. (అ. ఆ. అ) మీసంబంధమైనది, మీది, నీది.

**భవనము.** సం వి. అ. న ౧. ఉనికి. ౨. జన్మము, పుట్టుక. 3 నివాసస్థానము ౪ స్థానము, ఉనికిపట్టు (ఉదా: అవినయభవనము = అవినయస్థానము.) ౫ గృహము.

**భవభూతము.** సం. వి అ. న. ప్రపంచకారణము, బ్రహ్మము.

**భవభూతి** సం వి ఇ పుం ఒకానొకసుప్రసిద్ధ సంస్కృతకవి

**భవము** సం విణ (అ అ అ) బయలుదేరినది పుట్టినది (ఇది సమాసాంతములయందు ప్రయుక్తమగును) వి అ పుం ౧ సత్త ఉనికి సద్భావము ౨ పుట్టుక జన్మము ౩ మూలకారణము నిధానము ౪ ప్రాపంచికజీవనము బ్రదుకు సంసారము ఉదా భవార్ణవము భవసాగరము మొ। ౫ ప్రపంచము ౬ బాగుగానుండుట ఆరోగ్యము శుభము ౭ ప్రాశస్త్యము శ్రేష్ఠత్వము గొప్పతనము ౮ ప్రాప్తి పొందుట

**భవరుత్తు** వి చ్ స్త్రీ ప్రేతపటహము దహనక్రియాదులు జరుగునపుడు వాయించు వాద్యవిశేషము (రూ భవరుదము)

**భవాంతకృత్తు** సం వి త్ పుం ౧ బుద్ధుడు ౨ బ్రహ్మ

**భవాత్మజుడు** సం వి అ పుం ౧ ఈశ్వరపుత్రుడు గణపతి ౨ కుమారస్వామి

**భవాదృక్కు** సం విణ (క్ క క్) నీ(మీ)వంటివాడు (రూ భవాదృశుడు)

**భవాదృక్షుడు** సం విణ (అ ఆ అ) మీవంటివాడు నీవంటివాడు

**భవాదృశుడు** సం విణ (అ ఈ అ) మీవంటివాడు నీవంటివాడు

**భవాని** సం వి ఈ స్త్రీ పార్వతి భవునిభార్య

**భవాభీష్టము** సం వి అ న ఈశ్వరున కభీష్టమైనది గుగ్గిలము ?

**భవాయని** సం వి ఈ స్త్రీ ౧౦౧ (వాచ)

**భవి** సం వి న్ పుం సంసారి గృహస్థు అద్వైతుడు శివభక్తుడు గానివాడు (అద్వైతునకు సంసారబద్ధతయేకాని ముక్తిలేదని శైవసిద్ధాంతము)

ద్వి భవిజనసంసర్గపథపరిత్యాగి
బస పు ౪ ౫ పం

ద్వి పురవీథిభవులు శరణులక్షముల్ సంధిల్లి రేని రోడఁబాఁబోదురుఁ బాంథ్రోయని గంట వాడాడఁ బేయుచుఁ గూడఁ బోటుచును మరమునకేతెంచి
బస పు ౪ ౧౭ పం

ద్వి అసత్యంబుచేత సత్యంబు భవిచేతభక్తుండు పదపడి మెఱయు
పండితా మహిమా ౨౯౭ పా

**భవికము** సం విణ (అ ఆ అ) శుభయుతము మంగళము వి అ న శుభము మంగళము

**భవిత** సం విణ (ఋ త్రి ఋ) కాఁగలస్వభావముకలవాఁడు (క ర)

**భవితవ్యత** సం వి ఆ స్త్రీ ౧ అవశ్యంభావము తప్పక కాఁదగుట ౨ భాగ్యము అదృష్టము

**భవితవ్యము** సం విణ (అ ఆ అ) కాఁదగినది వి అ న ౧ శుభము ౨ భాగ్యము

**భవిలుడు** సం వి అ పుం విటుఁడు జారుఁడు (త్రి ని)

**భవిష్ణువు** సం విణ (ఉ) కాదగినది

**భవిష్యత్తు** సం విణ (త్ త్రి త్) ౧ వర్తమానప్రాగభావప్రతియోగి ముందు కాఁబోవునది ౨ ఆసన్నమైనది సమీపించినది

**భవిష్యపురాణము** సం వి అ న పదునెనిమిది పురాణములలో నొకటి

**భవుఁడు** సం వి అ పుం శివుఁడు

**భవ్య** సం వి ఆ స్త్రీ గజపిప్పలి ? ౨ అరటి అగిసె ?

**భవ్యము** సం వి అ న ౧ ఉనికి, క్షేమ ౨ భవిష్యత్కాలము ౩ సత్యము ౪ శుభము ౫ యోగ్యత ౬ ఎముక

సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఉండునది. ౨. కాఁబోవునది, భవిష్యత్తు ౩. అనుకూలమైనది, తగినది. ౪. శుభకరము, సుఖకరము. ౫. మనోహరము, అందమైనది. ౬. సౌమ్యమైనది, శాంతమైనది. ౭. సత్యమైనది. ౮. సౌభాగ్యము

భషణము. సం. వి అ. పుం. శునకము, కుక్క-న. కుక్కమొఱుఁగు, శ్వరవము, కుక్కకూఁత

భష(క)ము. సం వి అ పుం. శునకము, కుక్క.

భసలము. సం వి. అ పుం. తుమ్మెద, భృంగము.

భసితము. సం. వి అ న. భస్మము, బూది.

భస్త్రా. సం వి. ఆ స్త్రీ కమ్మరి కొలిమితిత్తి.

భస్త్రిక. సం వి ఆ. స్త్రీ. = భస్త్రా.

భస్త్రీక. సం. వి. ఆ స్త్రీ. = భస్త్రా

భస్మకము. సం. వి అ. న ౧ కలధౌతము, వెండి ౨. రోగవిశేషము, అన్నమెక్కువగా జీర్ణమగుటవలన నధికమగు రోగసంబంధమైన యాఁకలి. ౩. విడంగము, తండులము. వై. (వై. ని., వి. ని)

భస్మగంధ. సం. వి. ఆ. స్త్రీ రేణుకయనుగంధద్రవ్యము. వై.

భస్మగంధిని. సం. వి ఈ. స్త్రీ రేణుకయనెడి గంధద్రవ్యము. వై

భస్మగర్భ. సం. వి. ఆ స్త్రీ ౧ తినిశము. వై. ౨. కపిలశింశుప వై ౩. రేణుక వై

భస్మతూలము. సం వి అ న ౧. మంచు హిమము. ౨. పాంసువర్షము, దుమ్మువాన ౩. గ్రామకూటము, గ్రామముల సమూహము, (వై. ని.)

భస్మవేధకము. సం. వి. అ. పుం. హారతి కర్పూరము.

భస్మస్నానము. సం. వి. అ. న. బూదిదతోఁ బవిత్రము చేయుట, బూదిదతో స్నానము చేయుట.

భస్మీకరించు. సం. స. క్రి. భస్మముచేయు.

క. విను వంశవృద్ధు లభిభూజనములకును భాజనములు . అనలముల యట్లు వారల,కనలుట భస్మీకరించు ఘనుసైన జనక.

హరి పూ ౮. ౯౦.

ద్వి. కలశసంభవుఁడు హుంకారమాత్రమున, బలియు నిల్వలుఁ జూచి భస్మీకరించి

రం. రా అర. ౧౫౧. పా ౨౪ పం.

## భా

భా. సం. వి. ఆ స్త్రీ. ౧. భూమి. ౨. అలంకృతి ౩ దీప్తి. (శా. ని దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము కనపడదు)

భాంగకము. సం. వి అ పుం గుడ్డపీలిక, వస్త్రఖండము (విల్యమ్సు)

భాంగము. సం విశే (అ ఈ అ) ౧ జనపనారతోఁ జేయఁబడినది ౨. గంజాయితోఁ జేయఁబడినది

భాంగీనము. సం. వి అ. న. ౧. జనపచేను. ౨ గంజాయిచేను.

భాండపతి. సం. వి ఇ పుం వర్తకుఁడు, వ్యాపారము చేయువాఁడు

భాండపుటుఁడు. సం వి. అ. పుం. మంగలివాఁడు

భాండపుష్పము. సం వి అ పుం సర్పవిశేషము, ఒకజాతిపాము (త్రి ని)

భాండప్రతిభాండకము. సం వి అ న సరకునకు సరకు బదులుగానిచ్చిపుచ్చుకొనుట, వినిమయము చేసికొనుట, మార్చుకొనుట, కుండమార్పుడు

భాండము. సం. వి అ న. ౧. పాత్ర, కుండ ౨. వర్తకుని మూలధనము. ౩. నదీమధ్యభాగము, ౪. గుఱ్ఱపుకుత్తిలు. (శబ్. కౌ.) ౫. అలంకారము, నగ. ౬. పుం. వ్యాపారసామగ్రి, వర్తకుని సరకులు.

భాండవాదనము. సం. వి. అ న. భాండమను వాద్యవిశేషము వాయించుట.

భాండాగారము. సం వి అ పుం న సామానుల గది సరకులు నిలువచేయుగది

భాండాగారికుఁడు. సం వి అ పుం భాండాగారాధికారి

భాండారము. సం వి అ న సామానుకొట్టు

భాండారి. సం వి న్ పుం భాండారాధ్యక్షుఁడు

భాండారికుఁడు. సం వి అ పుం భాండాగారికుఁడు

భాండి. సం వి ఇ స్త్రీ మంగలిపొది మంగలికత్తులపొది (వాచ)

భాండీరము సం వి అ పుం వటవృక్షము

భాకూటము. సం వి అ పుం ౧ మత్స్యవిశేషము ఒకజాతిచేఁప (హేమ ని హే ని విశ్వ)

ఉ మీఁటగు మీాల సెల్లమును క్రమింగి క్రమంబున నానె సెండపె న్కీటిక కెంటఁ దోఁచుతోఁగ వేరుబడిన్ గోడుపై చెలఁగఁగాఁ డ్రోటికఁ గర్దమద్రవముతో నెనయించిన బొమ్మడాయ భాకూటకులంపులేకెన బకోటకులం బజల ప్రాదంబునన్ ఆము ౨ ౫౮ ('డాకూ్కటకులంబు' అని అన్న పాఠము లును అన్ని వ్యాఖ్యానములును వ్యాఖ్యానములందు 'బొమ్మడాయనూ్నత్క్మమతో్స్య డాకూ్కటస్త్రిక్తమత్స్యకః ఇతి విశ్వః' అని చూపఁబడినది ఈయుదాహరణము విశ్వమునఁగాని మఱి యేసంస్కృతనిఘంటువు లందుఁగాని కానరాదు దీనితో నిచ్చిన 'బొమ్మడాయ' తెలుఁగుపదముగా నున్నది)

౨ పర్వతభేదము (హే ని)

భాక్కు. సం విశ (క్) (ఇది కేవలము సమాసాంతముగ నుండును. పాపభాక్కు దోషభాక్కు మొ) ౧ ఆస్పదమైనది ౨ అనుభవించునది

భాక్తము. సం విశ (అ ఆ అ) ౧ ఎల్లపుడు నితరులచేఁ బోషింపఁబడినది పరపోష్యము పరాన్నముచే జీవించునది ౨ అముఖ్యము అప్రధానము, గౌణము (అర్థము)

భాక్షుఁడు. సం. విశ (అ ఆ అ) తిండిస్వభావముగలవాఁడు తిండిపోతు, భోజనశీలుఁడు

భాగజాతి. సం వి ఇ స్త్రీ పూర్ణాంకములోని భాగములను తెలుపు భిన్నాంకము (వ్యతి ప్రభాగజాతి)

భాగధేయము. సం వి అ న ౧ భాగము అంశము ౨ అదృష్టము దైవము మంచియదృష్టము భాగ్యము పుం పన్ను, రాజులకుఁ జెల్లించెడు పన్ను

భాగము. సం వి అ పుం ౧ అంశము ౨ అదృష్టము భాగ్యము ౩ (జ్యోతి) పరిధిలో మున్నూటయఱువదవవంతు ౪ రాశిలో ముప్పదవవంతు ౫ స్థలము చోటు

భాగలక్షణ. సం వి అ స్త్రీ జహదజహల్లక్షణ

భాగవతము. సం విశ (అ ఈ అ) భగవంతునికి సంబంధించినది వి అ న పదునెనిమిది పురాణములలో నొకటి

భాగవతుఁడు. సం విశ (అ ఆ అ) ౧ భగవద్భక్తుఁడు

గీ అర్చఁగావింతు రెపుడు నిట్లతిథులైన భాగవతులకు వప్పూరి భాగవతులు ఆము ౧ ౪౭

౨ కృష్ణుఁడు మొదలగువారివేషము వేసికొనియాడి జీవించువాఁడు

సీ అఁడు భాగవతునిజాడ గడ్డము మీాఱి యున్నగా గొఱిగించుకొన్నవాఁడు

చంద్ర వి ౧ ౭౨

భాగహారము. సం వి అ పుం (గణిత) విభజనము భాగించుట

భాగించు సం స క్రి భాగముచేయు, పంచు (శ ర)

భాగినేయి. సం వి ఈ స్త్రీ మేనకోడలు సోదరీపుత్త్రి

భాగినేయుఁడు. సం వి. అ పుం, మేనల్లుఁడు, సోదరీపుత్త్రుఁడు

**భాగీరథి.** సం. వి. ఈ. స్త్రీ. భగీరథుఁడు తీసికొని వచ్చినది, గంగానది

**భాగ్యము.** సం. విణ. (అ. ఆ అ) ౧. విభజింపఁ దగినది. ౨. అదృష్టముగలది. వి అ న ౧ అదృష్టము, విధి. ౨ మంచియదృష్టము ౩ శుభము, క్షేమము.

**భాజకము.** సం విణ (అ జకా అ) విభజించునది, విడదీయునది వి అ పుం, న (గణిత) విభాగకల్పకమగు సంఖ్య.

**భాజనము.** సం. వి. అ న ౧ పాత్రము ౨ స్థానము, ఉనికిపట్టు. ౩. అఱువదినాలుగుపలముల తూనిక.

**భాజము.** సం. = భాక్కు.

**భాజి.** సం వి. న్ పుం సేవకుఁడు ఈ స్త్రీ ౧ గంజి. ౨ వ్యంజనవిశేషము

**భాజితము.** సం. విణ. (అ. ఆ అ) ౧ పంచఁబడినది, విడదీయఁబడినది వి. అ న. భాగము.

**భాజ్యము.** సం విణ. (అ ఆ. అ.) ౧. విడఁదీయఁదగినది. వి. అ న ౧ భాగము. ౨. (గణిత) భాగింపఁబడుసంఖ్య, హార్యము

**భాట(క)ము.** సం. వి. అ. న. అవక్రయము (హలా ని)

**భాట్టుఁడు.** సం విణ. (అ ఈ అ.) భాట్టమతానుసారి, కుమారిలభట్టు స్థాపించిన మీమాంసమతమనుసరించువాఁడు

**భాణము.** సం వి అ. పుం పదివిధములు గల రూపకములలో నొకటి

శ్లో భారతీవంశభూయిష్ఠం కార్యసౌభాగ్య సంస్తుతః, సూచ్యేతే వీరశృంగారౌ విటేన వివృణో క్తినా,కల్పితేనేతివృత్తేనధూర్తచారిత్ర వర్ణనమ్, ఏకాంకో ముఖనిర్వాహకాయత్ర భాణస్ససమ్మతః

**భాతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రకాశము, తళతళ మను కాంతి.

గీ. సన్నుతంబుగ నాహిమవన్నగంబు,గాంచనాద్రీంద్రు మెచ్చరు కంపురేని, కనకరుచి రమేలని చంపకప్రసూన,పరిమళాకీర్ణ సాకీర్ణభాతి మిగిలి. కు. సం ౩ ౨౫౨.

౨ విధము, పోలిక (ఈయర్థము తెనుఁగునఁనే కానఁబచ్చుచున్నది )

౩ మత్స్యమూర్తివైన మధుకైటభారాతి,భాతి నీవు భువనపావనుఁడవు హై. ౨. ౬౨

గీ చెలఁగుచిలుకనవ్వు తెన్నెలన్ జిలుకుచుండఁ, గలికితెలిడాలుచూపులఁ గలయఁబర్వఁ, బాండిమము దోఁచి భారతిభాతి నాతి పసిఁడి గద్దియపైఁ బాట పాడుచుండె

బిల్హ ౧ ౫౬

**భానువు.** సం వి. ఉ పుం సూర్యుఁడు

**భాద్రపద.** సం వి ఆ స్త్రీ ఉత్తరభాద్రపదానక్షత్రము (శ ర.)

**భాద్రపదము.** సం వి. అ పుం. ఒకానొక మాసము.

**భాద్రపది.** సం. వి ఈ స్త్రీ. భాద్రపదమాసమందలి పౌర్ణమాసి

**భాద్రమాతురుఁడు.** సం వి అ పుం. భద్రమాతృసుతుఁడు, గుణవతియొక్క కొడుకు.

**భాద్రము.** సం వి అ. పుం భాద్రపదమాసము.

**భాద్రలు.** సం వి ఆ స్త్రీ. పూర్వాభాద్ర, ఉత్తరభాద్ర నక్షత్రములు.

**భాద్రి.** సం వి ఈ స్త్రీ భాద్రపదమాసమందలి పౌర్ణమాసి

**భానము.** సం వి. అ న. ౧. కనుపించుట, గోచరమగుట. ౨. కాంతి, వెలుఁగు. ౩. జ్ఞానము, ప్రతీతి.

**భానుకేసరుఁడు.** సం వి. అ. పుం. సూర్యుఁడు.

**భానుజుఁడు.** సం వి. అ. పుం. ౧. శని. ౨. యముఁడు ౩. కర్ణుఁడు. ౪. సుగ్రీవుఁడు.

భానుమంతము. సం విణ (క్ మతి క్) ౧ కాంతిగలది, ప్రకాశవంతము ౨ అందమైనది సుందరము

భానుమంతుఁడు. సం వి క్ పుం సూర్యుఁడు

భానుమతి. సం వి ఈ స్త్రీ దుర్యోధనుని భార్య

భానువు. సం వి ఉ పుం ౧ కాంతి వెలుఁగు ప్రకాశము ౨ కిరణము ౩ సూర్యుఁడు ౪ అందము ౫ దినము పగలు ౬ రాజు పట్టాభిషిక్తుఁడు ౭ శివుఁడు ౮ జిల్లేడు ౯ స్త్రీ సౌందర్యముగల భార్య (విల్యమ్సు)

భానేమి. సం వి ఇ పుం ౧ సూర్యుఁడు ౨ జిల్లేడు ౯

భామ. సం వి అ స్త్రీ ౧ సులభముగా కోపము వచ్చెడి స్త్రీ ౨ స్త్రీ వనిత ౩ కృష్ణుని భార్యయగు సత్యభామ

భామము. సం వి అ పుం ౧ ప్రకాశము తళతళమను కాంతి ౨ క్రోధము పగ ౩ జిల్లేడు ౯

భామి. సం విణ (న్ నీ న్) ౧ కోపముగలది ౨ ప్రకాశించునది

భామిని. సం వి ఈ స్త్రీ ౧ సుందరమైన యువతి ౨ సులభముగా కోపమును బొందు స్త్రీ

భాముఁడు. వి అ పుం ౧ సూర్యుఁడు ౨ సోదరియొక్కపతి బావ

భాయి వి (హిం భాఈ) సోదరుఁడు

క భాయీ యని దెయొకనుడిలో మా యనిపించె దను జూడుమా యనికరిమై చాయఁగని తొమ్ముగ్రుద్దినఁ జాయఁగ గ్రుద్దుటను పెట్టు సరిగాఁ దాఁకెన్ ప్రబంధ ౧౫

భారంగి. సం వి ఈ స్త్రీ పోషించు స్త్రీ

భారంగి. వి ఖలీనవిశేషము (ఇది అన్యదేశ్యమని తోఁచెడిని)

వ క్షైరితమతంబు భారంగి లంగిణి మొదలగు ఖలీనంబుల నిరీయంబులై ఫేనంబుల దొరుగు వారువంబులుంను ఉ హరి ౪ ౨౧౩

(ప్రతులందు మహాప్రాణఘటితముగా నుంటచే నట్లె గ్రహింపఁబడినది)

భారండము. సం వి అ పుం కృత్రిమపక్షి (ఉత్తరకురుదేశపు శకునపక్షియని కొందఱు)

భారకుఁడు. సం విణ (అ రికా అ) ఒరువు మోయువాఁడు

భారతము. సం విణ (అ ఈ అ) ౧ భరతుని సంబంధమైనది ౨ భరతుని వంశస్థమైనది వి అ న ౧ భరతుఁడు పాలించినదేశము, హిందూదేశమనఁబడు దేశము ౨ భారత గ్రంథము (ఇది భరతుని వంశస్థులగు కౌరవ పాండవాదుల చరిత్రమును దెలుపు మహాగ్రంథము దీనిని ప్రథమమున సంస్కృత భాషలో వ్యాసుఁడు రచించెను) ౩ సంగీతము అభినయము (నాట్యశాస్త్రమును) దెలుపు శాస్త్రము

భారతి. సం వి ఈ స్త్రీ ౧ మాట పదను ౨ సరస్వతీదేవి ౩ కైశిక్యాది వృత్తులలో నొకటియగు భారతీవృత్తి ౪ పక్షివిశేషము ౫ యతిసంప్రదాయమును దెలుపు బిరుద చిహ్నము (నృసింహభారతీస్వామి మొ॥)

భారతిసేసలు. మి వి ఒ ధాన్యవిశేషము

సీ లత్తుకబొత్తులు లక్ష్మీమనోహరా ల్భారతి సేసలు శాహుపురులు హంస ౪ ౧౨౮

భారతుఁడు. సం వి అ పుం ౧ భరతవంశస్థుఁడు భరతునిసంతతివాఁడు ౨ భరతవర్షవాసి (హిందూదేశస్థుఁడు) ఆసేతుహిమాచలమధ్యవాసి ౩ నటుఁడు నాటకమాడి జీవించువాఁడు ౪ మేరుపర్వతమునకు దక్షిణభాగమున బ్రకాశించు సూర్యుఁడు

భారద్వాజము. సం వి అ పుం భరద్వాజపక్షి ఏట్రింత

భారద్వాజి. సం వి ఈ స్త్రీ అడవిప్రత్తిచెట్టు

భారద్వాజుఁడు. సం వి అ పుం ౧ ద్రోణాచార్యుఁడు (ఇతఁడు కౌరవపాండవులకు ధను

ర్విద్య నేర్పిన గురువు.) -౨. అగస్త్యుఁడు 3. భరద్వాజుని గోత్రమునఁ బుట్టినవాఁడు.

భారము. సం వి అ. పుం ౧ బరువు. -౨ యుద్ధములలో దీక్షమైన భాగము. 3 రెండు వేలపలముల బంగారుయొక్క పరిమాణము (తూనిక.) ౪. కావడి, పర్యాహారము (పే ని., హాలా. ని) (ఈ క్రిందియర్థములందు తెనుఁగునను ప్రయోగము కిప్పుడున్నది) ౫.పూ-చీ.

మ. అని యక్కన్యలఁ జేరఁగాఁ బిలిచి యేలా తల్లితోఁ బోరఁగాఁ బనిలేదా తిరు కాళహస్తి పతిఁ జూపన్ మాది భారంబు మా,కెను కెంటన్ జనుడెందు కాళ. ౪. ౫౩

౬. మల్లబంధవిశేషము.

వ కిన్నాతయును భారంబును బాంగిణయు ప్రబంధ ౩౨

భారయష్టి. సం వి ఇ స్త్రీ కావడిబ్రద్ద

భారవాహకుఁడు. సం. విణ (అ హి కా అ) బరువుమోయువాఁడు

భారవాహనము. సం వి. అ పుం బరువు మోయు జంతువు. వ బండి, సామానుజేయు బండి

భారవి. సం వి. ఇ పుం కిరాతార్జునీయ మను స్త్రీ. కావ్యము రచించిన ప్రసిద్ధుఁడగు కవి

భారి. స వి ఇ పుం సింహము న్ పుం బరువు మోయు కూలివాఁడు

భారూపము. సం వి అ న బ్రహ్మము

భారూపుఁడు. సం. వి. అ పుం జీవుఁడు. చైతన్యరూపుఁడు

భారోపజీవనము. సం. వి అ. న బరువుమోసి జీవించుట బరువుమోయువాని బ్రదుకు.

భార్గవప్రియము. సం. వి. అ పుం వజ్రము.

భార్గవము. సం వి. అ. పుం. ౧ ఏనుఁగు -౨ తూర్పుదేశము, భరతవర్షమందు తూర్పుదేశమందలి దేశవిశేషము. భార్గవదేశము.

భార్గవి. సం వి. ఈ స్త్రీ. ౧.దూర్వాతృణము శ్రీ -౨ లక్ష్మి 3. పార్వతి. ౪ దేవయాని, శుక్రాచార్యునికూఁతురు.

భార్గవుఁడు. సం. వి అ పుం. ౧ రాక్షసగురువును శుక్రమండలాధిపతియు నగు శుక్రాచార్యుఁడు -౨. పరశురాముఁడు. 3 శివుఁడు. ౪ ధనుర్ధారి, విలువిద్య నేర్చినవాఁడు. ౫. జమదగ్ని

భార్గుఁడు. సం. వి. అ పుం. భర్గులకురాజు.

భార్జి. సం. వి ఈ స్త్రీ. చిఱుతేకు, గంటుబారంగి శ్రీ.

భార్య. సం వి అ స్త్రీ పత్ని, కా స్త్రీయముగా, పెండ్లాడిన స్త్రీ, పాణిగృహీతి

భార్యము. సం విణ (అ ఆ అ.) ౧ పోషింపఁదగినది, భరింపఁదగినది

భార్యాజితము. సం. వి అ. పుం హరిణవిశేషము.

భార్యాటికము. సం వి అ. పుం హరిణవిశేషము, కణుజు.

భార్యాటికుఁడు. సం విణ (అ ఆ. అ.) భార్యకు లొంగినవాఁడు, పెండ్లాము చెప్పినట్లు వినువాఁడు

భార్యాటుఁడు. సం విణ (అ ఈ. అ) భార్యయొక్క వ్యభిచారవృత్తిచే బ్రదుకువాఁడు (త్రి ని)

భార్యారువు. సం వి ఉ పుం. ౧. పరభార్యను పొందువాఁడు -౨ హరిణవిశేషము

భార్యుఁడు. సం వి అ పుం. సేవకుఁడు

భాలచంద్ర. సం వి అ. స్త్రీ. దుర్గాదేవి.

భాలచంద్రుఁడు. సం. వి అ. పుం. ౧. శివుఁడు -౨ గణపతి.

భాలదర్శనము. సం. వి. అ. న. సిందూరము.

భాలదర్శనుఁడు. సం.వి. అ. పుం శివుఁడు, ఫాలనేత్రుఁడు.

భాలము. సం వి అ న ౧ లలాటము అలికము ౨ తేజస్సు కాంతి ౩ కాలస్కంధము చీకటిచెట్టు

భాలాంకము. సం వి అ పుం ౧ అంపము ౨ కూర్మము,తాఁబేలు ౩ రోహితమత్స్యము ౪ శాకభేదము కూర

భాలాంకుఁడు. సం వి అ పుం ౧ లలాటముపై నదృష్ట(భాగ్య)చిహ్నములైనరేఖలతోఁ బుట్టిన మనుష్యుఁడు ౨ శివుఁడు (వీనికి లలాటమం దగ్నిచిహ్నము గలదు)

భాలుఁడు. సం వి అ పుం వైశ్యునివలన నటి యందు పుట్టినవాఁడు

భాలువు. సం వి ఉ పుం సూర్యుఁడు

భాలూకము. సం వి అ పుం ఎలుఁగుగొడ్డు

భావ. సం వి అ పుం ఒకానొక సంవత్సరము

భావకము. సం విశే (అ విశా అ) ౧ సెలవిచ్చునది సాగించునది ౨ ఒకనిక్షేమము వృద్ధి బఱచునది ౩ ఊహించునది ౪ కవిత్వాభిరుచి వి అ పుం ౧ రసము ౨ రాగము

భావజుఁడు. సం వి అ పుం మన్మథుఁడు మనోభవుఁడు

భావతము. సం విశే (అ ఈ అ) తమసంబంధమైనది యుష్మదీయము

భావత్కము సం విశే (అ ఈ అ) భవదీయము

భావదర్శి. వి న్ పుం యజమానుని యాజ్ఞను గ్రహించుటకై వానిభావము కనుపెట్టువాఁడు సేవకుఁడు

భావన. సం వి అ స్త్రీ (తర్క) సంస్కారవిశేషము (మీమాంస) లిఙర్థవిశేషము

భావనము. సం వి అ న ౧ ఒకని శ్రేయస్సు నభివృద్ధి పఱచుట ౨ తలఁపు అభిప్రాయము ౩ విశ్వాసము నమ్మకము ౪ ధ్యానించుట ౫ ఊహ ౬ జ్ఞప్తి జ్ఞాపకముంచుకొనుట ౭ (తర్క) ప్రత్యక్షజ్ఞానము

భావనుఁడు. సం వి అ పుం విష్ణువు

భావము సం వి అ పుం ౧ రీతి విధము

చ విమలసుధాంశుకాంతమణివేదికపై నవహంస తూలతల్పమున సుఖప్రసుప్తి పరిపాకము నొంది విశాలనేత్రపద్మములు మెంగి డ్పి శేషఫణిపైఁ బవళించిన యంబుజాక్షుభావమున గిరంబుఁ బొల్పమరువానిఁ గనుంగొనె నింతి పార్థునిన్ హర ౭ ౧౨౦

సీ అంగునిరేఖ యయాతిభావంబునఁ బృథువిధంబు భగీరథు నిమాడ్కి విక్ర ౨౬౯

౨ సత్త ఉండుట ౩ తటస్థమగుట ౪ స్వాభావికగుణము ప్రకృతి ౫ ఉద్దేశము ఆలోచన ఊహ ౬ రత్యాదిస్థాయిభావము ౭ ప్రేమము అనురాగము ౮ నిశ్చయము ౯ హృదయము ఆత్మ ౧౦ ప్రాణి ౧౧ భావన ధ్యానము ౧౨ నడవడి ప్రవర్తనము ౧౩ చేష్ట ౧౪ జన్మము పుట్టువు ౧౫ ప్రపంచకము ౧౬ ఇష్టము ఉపదేశము ౧౭ (వ్యాక) ప్రకృత్యర్థమువందు ప్రకారీభూతార్థము ౧౮ సిద్ధసాధ్యాన్యతరావస్థాపన్న ధాత్వర్థము ౧౯ జ్ఞానేంద్రియము ౨౦ (జ్యోతి)తన్వాదిభావము ౨౧ విభూతి ౨౨ యోని ౨౩ సంసారము ౨౪ (తర్క) ద్రవ్యాది పదార్థషట్కము

భావరూపము సం విశే (అ ఆ అ) నిజమైనది యథార్థమైనది

భావాటము. సం వి అ పుం ఉత్తముని గృహము

భావాటుఁడు. సం వి అ పుం ౧ పవిత్రుఁడైన మనుష్యుఁడు ౨ కాముకుఁడు ౩ నటుఁడు, నాటకమాడి జీవించువాఁడు

భావాలీన. సం వి అ స్త్రీ ఛాయ నీడ (రా.ని)

భావి. సం విశే (న్ నీ న) ౧ అగునది, కాఁబోవునది జరుగఁబోవునది ౨ అ, అ కాల

మిగిలిన యచ్చులకు సంజ్ఞ (వాజసనేయ ప్రాతి శాఖ్య విల్యమ్సు)

**భావించుకొను.** సం స క్రి (స్వార్థమునకొను)
వ. నీవుం గ్రమంబున నొడంబడుట భావించి
కొని వానికి నర్తనశాల సంకేతప్రదేశం
బుగాఁ జెప్పి భార విరా ౨-౨౩౪

**భావించు.** సం స. క్రి ౧ తలఁచు ఎంచు
వ. పరిశిష్టంబగు సొమ్ము నాకు వెలగా భావింపు
మంచున్ మునీశ్వరుపాదంబులు పట్టెఁ గేతుల
వారిచంద్రుండు దైన్యంబునన్
మార్క ౧-౨౭
౨ ఊహించు ఆలోచించు
సీ. ప్రజ్ఞ నక్కొడుకులు భావించి సద్గోష్ఠిఁ బర
గంగ విషయతత్పరత మాను
భాగ శాం ౫ ౩౬౫
౩ నటించు
గీ. అనిన నాతనిమాటకు నడ్డమాడ వెఱచినట్టి
తెఱంగు భావించి యల్లనియ్యకొనుటయు
ధర్మనందనేంద్రసుతుఁడు దృఢతనుత్రాణ మత
నికిఁ దొడఁగనిచె భార విరాఁ ౪౩౭

**భావికము.** సం విణ (అ ఈ అ) ౧ స్వాభావికము స్వతస్సిద్ధము ౨ మనోవికారసంబంధమైనది భావసంబంధమైనది వి అ న ౧ రాగముతో నిండినభాష శృంగారముతో నిండిన భాష ౨ కావ్యాలంకారములలో నొకటి భావికాలంకారము
శ్లో. అతీతానాగతే యత్రప్రత్యక్షత్వేన లక్ష్యతే
అత్యద్భుతార్థకథనా ద్భావికం తదుదాహృతమ్

**భావితము.** సం విణ (అ ఆ అ) ౧ పొందఁబడినది ౨ ధ్యానింపఁబడినది ఆలోచింపఁబడినది ౩ తెలిసికొనఁబడినది ౪ (గణిత) ఒకానొక సమీకరణము

**భావితాత్మ.** సం. విణ (న్ ని న్) ౧ దైవధ్యానముచేఁ బవిత్రమైన ఆత్మగలవాఁడు బ్రహ్మమును దెలిసికొనినవాఁడు బ్రహ్మజ్ఞుఁడు ౨ పవిత్రుఁడు వి న్ పుం సన్యాసి యోగి

**భావిత్వము.** సం వి అ న అనివార్యత

**భావిత్రము.** సం వి అ న ముల్లోకములు, లోకత్రయి (వాచ)

**భావిని.** సం వి ఈ స్త్రీ అందకత్తె సౌందర్యము గల స్త్రీ

**భావుఁడు.** సం వి అ పుం (నాట్య) విద్వాంసుఁడు

**భావుకము.** సం విణ (అ ఆ అ) ౧ మాంగల్యయుక్తము ౨ భావనాయుతము

**భావుకుఁడు.** సం వి అ పుం సోదరియొక్క మగఁడు బావ

**భావ్యము.** సం విణ (అ ఆ అ) ౧ కాఁదగినది సంభవింపఁదగినది ౨ ఊహ్యము ఊహింపఁదగినది వి అ న ౧ నిర్ణయింపఁబడినవిషయము ముందుతప్పక జరుగువిషయము ౨ భవిష్యత్తు

**భాష.** సం వి ఆ స్త్రీ ౧ పలుకు మాట ౨ నుడి బాస ౩ స్వరూపనిరూపణము వివరణము ౪ సరస్వతీదేవి

**భాషకము.** సం విణ (అ ఈ ఆ అ) ౧ సంభాషించునది చెప్పునది

**భాషణము.** సం వి అ న ౧ పలుకుట, మాటలాడుట చెప్పుట ౨ పలుకుమాట

**భాషాసమము.** సం వి అ పుం కావ్యాలంకారవిశేషము సంస్కృతప్రాకృతభాషలలో నేకరూపముగా నుండునట్లు పదముల నేర్పఱచిన వాక్యరచన (అది సంస్కృతమనియుఁ బ్రాకృతమనియుఁ గూడ నెంచుటకు వీలుపడును)

**భాషించు.** సం అ క్రి వచించు
క. అనిన మునీంద్రుఁడు వనితా వనిసురపాత
కము సేయువానిని రక్షించిన భాషింపఁ
గాదని చూడక మాఱుమాటలాడక పోవన్
వరాహ ౪ ౪౭

**భాషిక.** సం వి ఆ స్త్రీ భాష, నుడి.

**భాషితపుంస్కము.** సం విణ (అ ఆ అ) ఉక్త పుంస్కము (ప్రవృత్తినిమిత్తైక్యము కలుగగా పుంలింగమందును స్త్రీలింగ నపుంసకలింగములలో నొకదానియందు వర్తించుశబ్దము)

**భాషితము** సం విణ (అ ఆ అ) చెప్పఁబడినది పలుకఁబడినది వి అ న పలుకు వాక్కు

**భాష్యము** సం వి అ న ౧ మాట పలుకు ౨ వ్యాఖ్యానవిశేషము వివరణము

శ్లో సూత్రార్థో వర్ణ్యతే యత్ర పదైస్సూత్రానుసారిభిః స్వపదాని చ వర్ణ్యంతే భాష్యం భాష్యవిదో విదుః

**భాస్** సం వి స్ స్త్రీ (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగములేదు) ౧ కిరణము ౨ కాంతి

**భాసంతము.** విణ (అ ఆ అ) ౧ ప్రకాశించునది ౨ అందమైనది వి అ పుం ౧ అశ్విన్యాదినక్షత్రము ౨ భాసపక్షి

**భాసంతి** సం వి ఈ స్త్రీ నక్షత్రము (అశ్విన్యాది)

**భాసంతుఁడు** సం వి అ పుం ౧ సూర్యుఁడు ౨ చంద్రుడు

**భాసకము** సం విణ (అ సికా అ) ౧ ప్రకాశించునది వెలుఁగునది ౨ స్ఫుటపఱచునది విశదపఱచునది

**భాసనము.** సం వి అ న ప్రకాశము ద్యుతి

**భాసము** సం వి అ పుం ౧ కాంతి ప్రకాశము ౨ కిరణము ౩ ఇచ్ఛ ౪ కోడి ౫ గృధ్రము గ్రద్ద ౬ గోశాల గోష్ఠము ఎద్దుల దొడ్డి ౭ వెముడుకాకి (చూ కాలామృతము)

**భాసస్సు.** సం వి స్ న దీప్తి కాంతి

**భాసిల్లు(లు).** సం అ క్రి ప్రకాశించు

దండకము ధూత్యష్టకాసర్గకాసర్గసంధూతికి
స్మన్ను కత్తృంబుకే నేనులన్ బాసి
భాసిల్లు చెప్పద్వితీయుండవై
వరాహ ౬ ౯౧

భాసమయంబున నమ్మదనుఁ డగ్గలికం గలికాముఖంబులై బాసిలు తూపులన్ హృదయపద్మము లక్ష్యముసేసి రేసినన్
కృ శకుం ౨ ౧౨౫

**భాసుఁడు** సం వి అ పుం భాసకవి

**భాసురము.** సం విణ (ఒ ఆ అ) ప్రకాశించునది దివ్యమైనది వి ఒ పుం ౧ స్ఫటికము (త్రి ని) ౨ చెంగల్వకోష్టు

**భాసురుఁడు.** సం వి అ పుం వరుఁడు శూరుఁడు

**భాస్కరప్రియము** సం వి అ పుం కెంపు పద్మరాగము

**భాస్కరము** సం వి అ న బంగారము (రా ని)

**భాస్కరుఁడు.** సం వి అ పుం ౧ సూర్యుఁడు ౨ వీరుఁడు శూరుఁడు ౩ అగ్ని ౪ శివుఁడు ౫ భరతవర్షమందుఁ బ్రసిద్ధుఁడగు జ్యోతిశ్శాస్త్రగ్రంథకర్త

**భాస్కరోదయము.** సం వి అ పుం సుగంధద్రవ్యవిశేషము

వ అగరుచందన హరిచందన ఘనసారోదయ భాస్కరోదయ మృగమద ప్రముఖనిజవాసనల నాశావకాశంబుల వాసించుచు నృపరత్నంబుఁ జేరునంత ద్వా ౩ ౨౦౬ (వ్రాఁతప్రతిపా ఘనసారోదయభాస్కర మృగమద ముద్రి పా)

**భాస్వంతము** సం విణ (త్ తీ త్) ప్రకాశమానమైనది ప్రకాశించునది మిగులప్రకాశించునది దేదీప్యమానము వి త్ పుం జిల్లేడు ✝

**భాస్వంతుఁడు.** సం వి త్ పుం ౧ సూర్యుడు, ౨ వీరుఁడు శూరుఁడు

**భాస్వతి.** సం వి ఈ స్త్రీ సూర్యునిపట్టణము,

**భాస్వరము.** సం విణ (అ ఆ అ) ప్రకాశమానమైనది దివ్యమైనది వి అ పుం ౧ దివాభాగము పగలు ౨ అగ్ని ౩ జిల్లేడు ✝ ౪ చెంగల్వకోష్టు

## భి

**భిందిపాలము.** సం వి అ పుం నాళికాస్త్రము, వడిసెలవలెనుండు వస్త్రవిశేషము

**భిక్ష.** సం వి ఆ స్త్రీ ౧ అడుగుట, యాచించుట ౨ భిక్షగాఁబెట్టిన వస్తువు, దానము ౩ సేవ (మే ని)

**భిక్షణము.** సం వి అ న యాచన

**భిక్షాటనము.** సం వి అ న భిక్షకై తిరుగుట, ముష్టికై తిరుగుట, యాచింప సంచరించుట

**భిక్షాశి.** సం విణ (న్ నీ న్) భిక్షాన్నము తినువాఁడు, భిక్షచే బ్రదుకువాఁడు

**భిక్షించే.** సం స క్రి యాచించు

మ మతిఁ గుంతీసుతపక్షపాతి యగుచున్
మాయాస్వరూపంబుతో, జితదైత్యుండు శత
క్రతుండు నను భిక్షింపంగ నేతెంచె
భార విరా ౪ ౨౯౧

గీ వాడవాడల భిక్షించుచుండుగాని, యిట్టిదివ్యా
న్నములు మెచ్చునే శివుండు హార ౫ ౧౭

**భిక్షితము.** సం విణ (అ ఆ అ) యాచింపఁబడినది

**భిక్షుకుఁడు.** సం విణ (అ ఈ అ) యాచకుఁడు, బిచ్చగాఁడు

**భిక్షువు.** సం విణ (ఉ) ౧ యాచకుఁడు, బిచ్చగాఁడు ౨ సన్న్యాసి, యతి

**భిక్షుసూత్రము.** సం వి అ న ౧ యతిధర్మముల దెలుపు గ్రంథము ౨ వేదాంతసూత్రములు.

**భిత్తము.** సం. వి. అ. న తునుక, ఖండము.

**భిత్తి.** సం. వి. ఇ. స్త్రీ) ౧. విభాగము. ౨. గోడ

**భిత్తిక.** సం వి. ఆ స్త్రీ) ౧ గోడ ౨ బల్లి (వాచ)

**భిత్తిచోరుఁడు.** సం. వి అ పుం కన్నగాఁడు

**భిత్తిపాతనము.** సం. వి అ. పుం. – గోడపడఁగొట్టు– పందికొక్కు–, మహామూషికము.

**భిద.** సం వి ఆ స్త్రీ) ౧. పగులుట ౨ భేదము ౩ విశేషకరణము, విశేషింపఁజేయుట.

**భిది.** సం వి ఇ పుం వజ్రాయుధము

**భిదురము.** సం విణ (అ ఆ అ) బ్రద్దలగునది, పగులునది వి అ పుం. ౧ ప్లక్షవృక్షము, జమ్మిచెట్టు ౨ వజ్రాయుధము.

**భిదువు.** సం వి ఉ పుం ఇంద్రునివజ్రాయుధము

**భిదేళిమము.** సం విణ (అ ఆ అ) భేదింపఁదగినది (బ్రద్దలగునది అని కొందఱు)

**భిద్రము.** సం వి అ న వజ్రాయుధము (త్రి ని)

**భిన్నకుఁడు.** సం వి. అ. పుం బౌద్ధమతస్థుఁడు (త్రి ని)

**భిన్నక్రమము.** సం. విణ (అ ఆ అ) క్రమస్థితిలోలేనిది, ఉండఁదగినట్లు లేనిది (కావ్యదోషము మొ॥)

**భిన్నగాత్రిక.** సం వి ఆ స్త్రీ) కర్కాటకము, ఎంద్రకాయ

**భిన్నగుణనము.** సం వి అ న (గణిత) అంశములను (భాగములను) గుణించుట

**భిన్నదర్శి.** సం విణ (న్ నీ న్) భేదము చేయువాఁడు, భేదముగాఁజూచువాఁడు, పక్షపాతము గలిగియుండువాఁడు

**భిన్నము.** సం విణ (అ ఆ అ) ౧ పగులఁగొట్టఁబడినది, చింపఁబడినది, చీల్పఁబడినది ౨ వసుకైనది, శిథిలముగాఁ జేయఁబడినది ౩. (ఒకదానికంటె) ఇతరమైనది. ౪. కలుపఁబడినది, మిశ్రముగాఁ జేయఁబడినది. ౫. ఫుల్లము, వికసించినది. వి. అ పుం రత్నమందలి దోషము.

సీ తునుకబోయినరీతిఁ దోఁచు భిన్నం బది
వయ్యన బంధుపక్షంబుజెఱచు
రత్నపరీక్ష ౧౪ ప

న. ౧ ముక్క, భాగము ౨ వికాసము, విరియుట ౩ దెబ్బ, క్షతము ౪ భాగహారము, భాగించుట ౫ ఒకానొకరోగము

భిన్నయోజని. సం వి ఈ స్త్రీ పాషాణభేదిక వృక్షము

భిన్నవిట్క. సం వి ఆ స్త్రీ అలాబూలత, అనుగము ?

భిన్నాంకము. సం వి అ పుం భాగములను కొల్పు సంఖ్య (వ్యతి-భ్రాష్టాంకము) ఉదా ½, ¼

భిన్నోదరుఁడు. సం వి ఉ పుం సవతితల్లికొడుకు

భిరింటిక. సం వి ఆ స్త్రీ తెల్లగురివింద తీఁగ, శ్వేతగుంజ. ? (రా ని)

భిల్లగవి. సం వి ఈ స్త్రీ గనయి, గనయిప్పుగి ములలో ఒకది

భిల్లతరువు. సం వి ఉ పుం లోధ్రవృక్షము, లొద్దుగుచెట్టు (రా ని)

భిల్లభూషణ. సం వి అ న గుంజావృక్షము, గురివెంద ?

భిల్లి. సం. వి ఈ స్త్రీ ౧ లోధ్రవృక్షము లొద్దుగుచెట్టు ౨ భిల్లజాతి స్త్రీ

భిల్లుఁడు. సం వి అ పుం అరణ్యకులలో నొక తెగవాఁడు, బ్రాహ్మణస్త్రీయందు ధీవరుని వలనఁ బుట్టినవాఁడు

భిల్లోటము. సం వి అ పుం లోధ్రవృక్షము, లొద్దుగుచెట్టు

భిషక్కు. సం వి క్ పుం వైద్యుఁడు

భిషక్ప్రియ. సం వి ఆ. స్త్రీ గుడూచి,తిప్పతీఁగ

భిషగ్జితము. సం వి అ న. ఔషధము

భిషగ్భద్ర. సం వి ఆ స్త్రీ భద్రదంతిక, ఒక జాతి నేపాళము. ?

భిషఙ్మాత. సం వి ఋ స్త్రీ వాసకము, అడ్డసరము. ?.

భిషజుఁడు. సం వి జ్ పుం. వైద్యుఁడు

భిస్స. సం వి ఆ స్త్రీ. అన్నము.

భిస్సట(ము). సం వి. అ. స్త్రీ (ఇది కంధరాదుల లోనిది) మాడన్నము

గీ చూడు మీసారి భాండ మో శోభగాంగి, బిస్సటంబొండెఁ దాటితప్పినది యొండెఁ గలుగు పాండు ౪ ౧౭౩

# భీ

భీ. సం వి ఈ స్త్రీ భయము

భీతము. సం విశ (అ ఆ అ) భయపడినది వి అ న భయము పుం మాత్రభేదము

భీతి. సం వి ఇ స్త్రీ ౧ భయము ౨ వడఁకుట

భీతినాటితకము. సం వి అ న భయాభినయము, భయమును నటించుట

భీతిల్లు(లు.) సం అ క్రి భయపడు.

గీ ఏను గంధర్వకన్నరిదానవాది, దివ్యభూ మి బులకును భీతిల్లను భార ఉద్యో ౪ ౨౧౫

సీ మొగములు దెల్లఁగా మునులు దేవతలును భీతల్లి చేతులు ఎసిగిలోనిరి కాశీ ౩ ౩౬

ఉ దుర్నికునంబులతోడ లంకకుస్, భీతిల్లి కేఁగి వాఁడును ఉ రా ౨ ౩౦౦

భీమ. సం వి ఆ స్త్రీ ౧ దుర్గాదేవి ౨ రోచన మను గంధద్రవ్యము ౩ కళ, కొరడా ౪ నదీ విశేషము

భీమగుదెలు. మి వి ధాన్యవిశేషము.

వ తేటచలములు ఊదుఖుటికలు గాజాకడియములు జాజికుసుమలు దూసరులు భీమగుదెలు ఏడాకు మొలకలు గుజ్జరులు. ప్రబంధ ౧౧౨.

భీమనాదము. సం విశ (అ ఆ అ) భయంకర మైనధ్వనికలది, భయంకరముగా ధ్వనిచేయునది వి అ పుం ౧ భయంకరమగుధ్వని. ౨. సింహము ౩. మహాప్రళయమందు వచ్చు సప్త మేఘములలో నొకటి.

భీమము. సం విశ (అ. ఆ. అ) భయంకరము, భయమును పుట్టించునది.

వి అ పుం ౧ భయానకరసము ౨ అమ్లవేతసము ‡ (చే ని) ౩ ఈశ్వరుని అష్టమూర్తులలో నొకటి ఆకాశము ౪ మంత్రభేదము

**భీమరథి.** సం వి ఈ స్త్రీ ౧ మనుష్యుని జీవితములో డెబ్బదియేడవయేట నేడవ నెలలో నేడవ రాత్రి (ఇది చాల నపాయకరమని చెప్పఁబడినది) ౨ ఒకానొకనది

**భీమరము.** సం వి అ న యుద్ధము పోరు (విల్యమ్సు)

**భీమవిక్రాంతము.** సం విణ (అ ఆ అ) భయంకరమైనశక్తిగలది వి అ పుం సింహము (త్రి ని)

**భీమశాసనుఁడు.** సం వి అ పుం భయంకరమైనశాసనము కలవాఁడు యముఁడు

**భీమసేనము.** సం వి అ పుం కర్పూరభేదము

**భీమసేనుఁడు** సం వి అ పుం భీముఁడు పాండవులలో రెండవవాఁడు

**భీముఁడు.** సం వి అ పుం ౧ శివుఁడు ౨ పరమేశ్వరుఁడు ౩ పంచపాండవులలో రెండవవాఁడు కుంతీపుత్రుఁడు

**భీరుకము.** సం విణ (అ ఆ అ) భయముకలది వి అ పుం ౧ పెద్దపులి ౨ నక్క ౩ ఎలుఁగుగొడ్డు ౪ గుడ్లగూబ ౫ ఇక్షుభేదము చెఱకులలో నొకరకము న అరణ్యము అడవి

**భీరుచేతస్సు.** సం వి స్ పుం దుప్పి (విల్యమ్సు) ఇట్లే భీరుచేతసము

**భీరురంధ్రము.** సం వి ల పుం పొయ్యి (విల్యమ్సు)

**భీరువు.** సం వి ఉ ఊ స్త్రీ ఆఁడుది స్త్రీ ఉ ౧ అజ ఆఁడుజాతి మేఁక ౨ ఛాయ నీడ ౩ శతపాదిక కాళ్లజెఱ్ఱ ౪ శతావరి పిల్లపీఁచర ‡ ౫ కంటకారి ‡ పుం ౧ నక్క ౨ పెద్దపులి ౩ ఇక్షుభేదము ఒకజాతిచెఱకు ‡

**భీరుహృదయము.** సం వి అ పుం లేడి

**భీలుకము.** సం = భీరుకము

**భీలూకము.** సం వి అ పుం ఎలుఁగుగొడ్డు

**భీష.** సం వి ఆ స్త్రీ ౧ భయపెట్టుట ౨ భయము

**భీషణము** సం విణ (అ ఈ అ) ౧ దారుణము ౨ గాఢము వి అ పుం ౧ భయానకరసము ౨ కపోతము పావురము ౩ కుందురకము సీమసాంబ్రాణిచెట్టు ౪ హింతాలము గిఱకతాడు ‡ ఆ స్త్రీ ఎల్లకి ‡

**భీషణుఁడు** సం వి అ పుం శివుఁడు

**భీషితము.** సం విణ (అ ఆ అ) భయపెట్టఁబడినది బెదరింపఁబడినది

**భీష్మపంచకము.** సం వి అ న ౧ కార్తిక శుక్లైకాదశి మొదలు పౌర్ణమివఱకుఁగల అయిదు తిథులు ౨ పై తిథులలోఁ జేయు వ్రతము

**భీష్మము.** సం వి అ పుం భయానకరసము విణ (అ ఆ అ) ౧ భయంకరము ౨ భయానకరసము కలది

**భీష్మసువు.** సం వి ఊ స్త్రీ గంగానది

**భీష్ముఁడు.** సం వి అ పుం గంగాశంతనుల పుత్త్రుఁడు గాంగేయుఁడు

## భు

**భుంభుం.** వి శంఖధ్వన్యనుకృతి

దండకము శంఖభుంభుంనినాదంబులున్
దశా ౪ ౨౩౨

**భుక్కు.** సం విణ (జ్) అనుభవించువాఁడు తినువాఁడు పాలించువాఁడు (హుతభుక్కు పాపభుక్కు మహీభుక్కు మొ॥)

**భుక్తము.** సం విణ (అ ఆ అ) ౧ తినఁబడినది ౨ అనుభవింపఁబడినది వి అ న ౧ తినుట ౨ అనుభవించుట

**భుక్తి.** సం వి ఇ స్త్రీ ౧ తినుట, తిండి ౨ అనుభవించుట భోగము ౩ గ్రహములయొక్క ప్రతిదిన సంచారము

**భుక్తిప్రదము.** సం వి అ పుం ముద్గము పెసర ¶

**భుగ్నము.** సం విణ (అ ఆ అ) ౧ వంగినది వక్రమైనది ౨ భగ్నమైనది పగిలినది

**భుజ.** సం వి ఆ స్త్రీ) ౧ బాహువు ౨ చేయి

**భుజంగఘాతిని.** సం వి ఈ స్త్రీ) సర్పాక్షీలత (వాచ)

**భుజంగపర్ణిని.** సం వి ఈ స్త్రీ) నాగదమని ఈశ్వరి ¶

**భుజంగప్రయాతము.** సం వి అ న (ఛంద) ఒకానొక సమవృత్తము

భుజంగప్రయాతము భుజంగప్రయాతాఖ్యవృత్తమ్ము యాల నగజవ్రాత శాంతిగాఁ జెప్పనొప్పున్ అప్ప ౪ ౨౧౪ పా

**భుజంగభము.** సం వి అ న ఆశ్లేషానక్షత్రము

**భుజంగభుక్కు.** సం వి జ్ పుం నెమిలి పాముపేఁపరి (శ ర)

**భుజంగమము.** సం = భుజంగము

**భుజంగము.** సం వి అ పుం ౧ పాము ౨ రాహువు ౩ ఆశ్లేషానక్షత్రము న సీసము త్రపువు

**భుజంగలత** సం వి ఆ స్త్రీ) నాగవల్లి తమలపాకులతీఁగ

**భుజంగాక్షి.** సం వి ఈ స్త్రీ) సర్పాక్షి ¶ (శ ర)

**భుజంగుఁడు** సం వి అ పుం విటుఁడు మిండగాఁడు

**భుజంగేశుఁడు.** సం వి ఉ పుం ౧ వాసుకి ౨ శేషాహి ౩ పతంజలి ౪ పింగళుఁడను ఋషి

**భుజకీర్తి.** సం వి ఇ స్త్రీ) బాహుపురి కేయూరము (శ ర)

**భుజకోటరము.** సం వి అ పుం కక్షభాగము చంక (వాచ)

**భుజగదారణము.** సం వి అ పుం పామును జీల్చునది ౧ గరుడపక్షి ౨ నెమిలి ౩ ముంగిస నకులము

**భుజగభోజి.** సం వి న్ పుం పామునుదినునది ౧ గరుత్మంతుఁడు గరుడపక్షి ౨ నెమిలి ౩ ముంగిస

**భుజగము.** సం వి అ పుం పాము సర్పము

**భుజగాంతకము** సం వి అ పుం ౧ గరుడపక్షి ౨ నెమిలి మయూరము ౩ నకులము ముంగిస

**భుజగాశనము** సం వి అ పుం పాములనుదినునది ౧ గరుడపక్షి ౨ మయూరము నెమిలి ౩ నకులము ముంగిస

**భుజజ్యా.** సం వి ఆ స్త్రీ) (జ్యో) త్రికోణక్షేత్రము యొక్క భుజము

**భుజదలము** సం వి అ పుం చేయి హస్తము

**భుజపత్త్రిము.** సం వి అ పుం బుజపత్త్రిరి ¶ (శ ర)

**భుజబంధనము.** సం వి అ న కౌఁగిలింత ఆలింగనము

**భుజము.** సం వి అ పుం ౧ బాహువు కరము ౨ (జ్యోతి) త్రికోణాది క్షేత్రాంశభాగము ౩ భుజపత్త్రివృక్షము (వై ని) ౪ గరుడుఁడు ౫ సూర్యుఁడు ౬ అగ్ని (కే ని)

**భుజశాలి.** సం విణ (న్ నీ న్) బాహుబలము గలవాఁడు బలముగల బాహువులుగలవాఁడు

**భుజశిరస్సు(ము).** సం వి స న మూఁపు స్కంధము

**భుజాంతరము.** సం వి అ న రొమ్ము వక్షస్థలము

**భుజాగ్రము.** సం వి అ న హస్తము చేయి

**భుజాదలము.** సం వి అ పుం చేయి హస్తము (త్రి ని)

**భుజి.** సం వి అ పుం అగ్ని (వై ని)

**భుజి(యి)ంచు** సం స క్రి ౧ తిను

గీ అస్తమింపఁగఁ జేరినాఁ డహిమకరుఁడు,
శిష్యులే శాక యయుతంబు జిగురుఁజోఁడి,

వ్రతమెుదప్పి భుజింపంగ వలనుగాదు, నేఁడు
నిన్న టిమఱుసాఁడు నిక్కువంబు

కాశీ ౭ ౧౮౧

చ ఆలకలు దుత్వరాగు సరసాన్నములన్బుజి
యింపరాదు నలిన దళాయతాక్షి కని
నాథుఁడుచెంగటలేక యుండినన్

కళాం ౨ ౧౨౪

సీ తల్లి భుజియించు గురుతర భోజ్యనిచయ,
మెల్ల జీర్ణంబుగా నెట్లు గ్రాఁగఁడు

మార్క ౨ ౨౨

౨. అనుభవించు

ఉ ఎల్లభోగముల్, వారలఁ జూచి క్రమ్మఱఁగ
వచ్చి సుఖస్థితిమై భుజించెదన్

భార. మహా. ౭౫

క ఇదియొకపనిగా దేవగ,మగిలోఁ జింతింప
వలదు మాకెదురుగ నీ, యుదధి వ్రతిధాత్ర
మల్లుల, వెదకియుఁ గానము భుజంపు విశ్వ
శ్రీలన్ వార. పూ. ౮౫౯

భుజిష్య. సం. వి. అ. స్త్రీ. ౧ వేశ్య, లంజ (మే. ని.) ౨ దాసి

భుజిష్యము. సం. వి. అ. న. ౧ హస్తసూత్రము, ముంజేతికిఁ గట్టుకొనుత్రాఁడు ౨ రోగము

భుజిష్యుఁడు. సం. విణ. (అ. అ. ఆ.) స్వతంత్రుఁడు (శై. ని.) వి. అ. పుం. ౧ సేవకుఁడు, భృత్యుఁడు

భుజ్యువు. సం. వి. ఉ. పుం. ౧ అన్నము, ఆహార పదార్థము ౨ పాత్ర, భాజనము ౩ అగ్ని ౪ యజ్ఞము. (వాచ.)

భురణ్యువు. సం. వి. ఉ. పుం. ౧ విష్ణువు ౨ సూర్యుఁడు

భురణ్యువులు. సం. వి. ఉ. పుం. ద్వి. అశ్వినీ దేవతలు

భురిక్కు. సం. వి. క్. స్త్రీ. ౧ బాహువు. ౨ కందగడ్డ ౩ ఛందోభేదము. ౪. వస ౫ భూమి (శ. ని.) పుం. రాజు.

భువనకోశము. సం. వి. అ. పుం. భూగోళము. (వాచ.)

భువనత్రయము. సం. వి. అ. న. స్వర్గమర్త్య పాతాళములను ముల్లోకములు, భూలోక భువర్లోక సువర్లోకములు మూఁడు

భువనపావని. సం. వి. ఈ. స్త్రీ. గంగ

భువనము. సం. వి. అ. న. ౧ ప్రపంచము, లోకము (పదునాలుగులోకములు) ౨ భూమి ౩ స్వర్గము ౪ ప్రాణి, చైతన్యముగలజంతువు ౫ మనుష్యజాతి ౬ నీరు, జలము ౭ పదు నాలుగనుసంఖ్య ౮ స్థానము, నివాసస్థానము ౯ ఆకాశము (వాచ.) ౧౦ రంధ్రము (శై. ని.)

భువనేశ్వరము. సం. వి. అ. న. గృహవిశేషము, చుట్టుకవంత (శ. ర.)

భువనేశ్వరుఁడు. సం. వి. అ. పుం. ౧ రాజు, భూపతి ౨ శివుఁడు

భువన్యుఁడు. సం. వి. అ. పుం. ౧. అగ్ని ౨ సూర్యుఁడు ౩ ప్రభువు (శై. ని. ఇది ఉకారాంతమని వాచ.)

భువర్. సం. వి. ర్. అవ్య. ౧ లోకవిశేషము ౨ ఒకానొక వ్యాహృతి

భువస్సు. సం. వి. స్. న. ౧ సూర్యుఁడు ౨ ఒకానొకలోకము

భువి. సం. వి. ఈ. స్త్రీ. ౧ భూమి, భూలోకము ౨ నవపదార్థములలోనొకటి, నవద్రవ్యములలో నొకటి ౩ ప్రపంచకము, మండలము ౪ ప్రదేశము, స్థానమాత్రము (కే. ని.) స్థలము, తావు ౫ భూమి, భూరూపమైనయాస్తి ౬. ఒకటి యనుసంఖ్య ౭ (గణిత) క్షేత్రగణితసంబంధమైన లెక్కకు ఆధారము ౮ అగ్నిహోత్రము, యజ్ఞసంబంధమైన యగ్ని ౯. కలుగుట, సంభవించుట, ఉద్భవము (పృథివి యనునర్థము కాక మిగిలిన యర్థములలో వ్యస్తప్రయోగము లేదని తోఁచెడిని.)

భువిస్సు. సం వి స్ పుం సముద్రము

భువు. సం విణ (ఊ) (భూ యనుదానియొక్క తత్సమరూపము ఇది సమాసాంతమునందే వచ్చును ఆత్మభువు చిత్తభువు కమలభువు మనోభువు మొ॥) ఉండునది పుట్టునది

భుశుండి. సం వి ఈ స్త్రీ తుదిని ఇనుపగుండు అమర్చినదుడ్డుకఱ్ఱ (శై ని)

భుశుండి. సం వి ఇ ఈ స్త్రీ తోలను చిమ్ము ర్మమయమగు నాయుధవిశేషము

## భూ

భూకదంబము. సం వి అ పుం నేలకడిమి కదంబవృక్షభేదము ¶

భూకము. సం వి అ పుం న ౧ రంధ్రము ౨ కాలము వేళ

భూకలము. సం వి అ పుం లాంగలిగుజ్జము పెంకిగుజ్జము పుర్వినీతాళ్యము

భూకశ్యపుఁడు. సం వి అ పుం కృష్ణునితండ్రి యగు వసుదేవుఁడు (త్రి ని)

భూకాకము. సం వి అ పుం ౧ నారాయణ పక్షి ౨ కొంగపక్షి ౩ పారావతవిశేషము నీలకపోతము

భూకేశ. సం వి అ స్త్రీ ౧ పిశాచి ఆఁడు పిశాచము

భూకేశము. సం వి అ పుం ౧ వటము మఱ్ఱి చెట్టు ౨ శైవలము నాచు

భూక్షిత్తు. సం వి త్ పుం పంది సూకరము (త్రి ని)

భూగరము. సం వి అ న ఒకవిధమగు విషము

భూగర్తము. సం వి అ పుం గుహ

భూగర్భుఁడు. సం వి అ పుం భవభూతికవి (త్రి ని)

భూగృహము సం వి అ న నేలమాలియ (శర)

భూగోలము. సం వి అ పుం భూమండలము

భూఘనము. సం వి అ పుం శరీరము (శై ని)

భూచ్ఛాయ(ము). సం వి ఆ పే ౧ భూమి యొక్కనీడ (ఇదియే రాహువు అనఁబడినది) ౨ చీకటి

భూజ. సం వి ఆ స్త్రీ సీత భూపుత్త్రి)

భూజంతువు. సం వి ఉ పుం ఏనుఁగు

భూజంబువు. సం వి ఉ ఊ పుం గోధూమము ¶

భూజము. సం విణ (అ ఆ అ) భూమియందు బుట్టినది భూమినుండి బయలుదేఱినది వి అ పుం చెట్టు వృక్షము

భూజాని. సం వి ఇ పుం ౧ విష్ణువు ౨ రాజు

భూజుఁడు. సం వి అ పుం ౧ అంగారకుఁడు భూపుత్త్రుఁడు ౨ నరకాసురుఁడు

భూత. సం వి ఆ స్త్రీ కృష్ణపక్షచతుర్దశి

భూతకేశము. సం వి అ పుం జటామాంసి ¶

భూతకేశి. సం వి ఈ స్త్రీ నల్లవావిలి ¶

భూతగెనుసు. మి వి ఒకానొకదుంప ఆ చేమకంద గెనుసు చిలగడ పెండలము పెనుఁగు తెల్లగెనుసు భూతగనుసు అల్లముల్లి ఖమల్లగి వెల్లుల్లి గాఁజరయును వెండలుగా గెఁగలవు వాంస ౪ ౧౩౧

భూతఘ్నము సం వి అ పుం ౧ భూర్జ వృక్షము ౨ ఉష్ట్రము ఒంటె ౩ వెల్లుల్లి ¶

భూతఘ్ని. సం వి ఈ స్త్రీ తులసి ¶

భూతచతుర్దశి. సం వి ఈ స్త్రీ పూర్ణిమాంత పక్షమున కార్తికబహుళ (కృష్ణపక్ష) చతుర్దశి. (దీనినే యమచతుర్దశి యందురు)

భూతధాత్రి. సం వి ఈ స్త్రీ భూమి

భూతధారిణి. సం వి ఈ స్త్రీ భూమి

భూతనాథుఁడు. సం వి అ పుం శివుఁడు

**భూతనాశనము.** సం వి అ పుం, ౧ తీడిచెట్టు, భల్లాతకము క్రీ ౨ ఆవాలు న. రుద్రాక్షము.

**భూతనెరిద.** మి. వి. వృక్షవిశేషము

సీ బూరుగు కలిగొట్టు భూతపాదిరి కుక్క-
బూరుగ చిటిగొట్టె భూతనెరిద
హం స ర ౧౧

**భూతపక్షము.** సం వి అ పుం కృష్ణపక్షము, భూతములకు అంధకారావృతము గాన క్రియ మగుపక్షము

**భూతపత్త్రి.** సం వి ఈ స్త్రీ కృష్ణతులసి క్రీ

**భూతపాదిరి.** మి వి వృక్షవిశేషము.

సీ బూరుగు కలిగొట్టు భూతపాదిరి కుక్క-
బూరుగ చిటిగొట్టె భూతనెరిద
హంస ర ౧౧

**భూతపుష్పము.** సం వి అ పుం దుండిగము క్రీ (శై ని)

**భూతపూర్ణిమ.** సం వి. అ స్త్రీ ఆశ్వయుజ మాసమందలి పూర్ణిమ, ఆశ్వినశుద్ధపూర్ణిమ

**భూతపూర్వము.** సం విణ (అ ఆ అ) పూర్వ మున నున్నది, కొనుకటిది

**భూతబలి.** సం వి ఇ పుం భూతయజ్ఞము

**భూతమాత.** సం వి ఋ స్త్రీ గౌరి, పార్వతి

**భూతము.** సం వి అ పుం, న ౧ చేతనాచేతన వస్తువు, సజీవనిర్జీవపదార్థము ౨ ప్రాణి, జంతువు, ౩ ం నామము న ౧ పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అను పంచభూతములు, పృథివ్యాదిభూతము ౨ నిజము, యాథార్థ్యము ౩ గతకాలము, కడచినకాలము ర ప్రపంచము ౫ క్షేమము, బాగుగానుండుట ౬ అయిదు అనుసంఖ్య. ౭. తగుట, యోగ్యత. పుం. కృష్ణపక్షచతుర్దశి. విణ. (అ. ఆ. అ.) ౧. అయినది, ఉన్నది ౨ నిజము, సత్యము. ౩ తగినది, యుక్తము. ర కడచినది, గతము ౫ ప్రాప్తము, పొందఁబడినది ౬. సమానముగా నుండునది, సరియగునది

**భూతయజ్ఞము.** సం వి అ. పుం భూతములకు బలులువేయుయజ్ఞము, గృహస్థు ప్రతిదినము నాచరింపవలసిన పంచయజ్ఞములలో నొకటి

**భూతరాట్టు.** సం వి జ్ పుం శివుఁడు.

**భూతలోద్భవము.** సం వి అ న సీసము, త్రపువు.

**భూతవాసము.** సం వి అ పుం విభీతకవృక్షము, తాండిచెట్టు

**భూతవిక్రియ.** సం. వి అ స్త్రీ ౧ అపస్మార రోగము ౨ భూతావేశము, దయ్యము సోఁకుట

**భూతవేశి.** సం. వి ఇ స్త్రీ తెల్లవావిలి క్రీ (శ ర)

**భూతసంచారి.** సం. వి న్ పుం దావానలము కార్చిచ్చు.

**భూతసంప్లవము.** సం వి అ పుం. మహాప్రళయము

**భూతసారి.** సం వి ఈ స్త్రీ త్రిఫల, కరకకాయ విరికలు (శై. ని)

**భూతహరము.** వి అ. పుం. గుగ్గిలము క్రీ.

**భూతాత్మ(ము).** సం వి న్ పుం ౧ గా వాయువు. ౨ శరీరము (శై ని) ౩ బ్రహ (శ

**భూతాత్ముఁడు.** సం వి న్ పుం బ్రహ్మ

**భూతారి.** సం వి ఇ పుం హింగువు, ఇంగువ

**భూతార్థము.** సం వి అ పుం నిజము, సత్య

**భూతావాసము.** సం వి అ పుం విభీతక తాండి క్రీ

**భూతి.** సం వి ఇ స్త్రీ ౧ ఆగుట, ఉండ ౨ పుట్టుక ౩ క్షేమము, సుఖము, అభివ ర. ఐశ్వర్యము, సంపత్తు ౫ విభూతి, భస్మ ౬. రంగుసీర. (రేఖ) లతో నేనుఁగునకుఁ యలంకారము. ౭. తపస్సుచేతఁగాని కేశ విధుల (ఐంద్రజాలికర్మ) చేతఁగాని సంపాది దగిన యమానుషశక్తి ౮ కాల్చిన మాం (శై ని) పుం వృద్ధియను నోషధి.

భూతికము. సం వి అ న ౧ కర్పూరము ౨ చందనము ౩ కత్తృణము కామంచి గడ్డి సువాసనగలగడ్డి ౪ కట్ఫలము ౫ చిత్రమూలము * ౬ భూకంబము * ౭ యవాని ఓమము *

భూతికేలము. సం వి అ పుం గొయ్యి

భూతుఁడు. సం వి అ పుం పుత్త్రుఁడు కొడుకు (శ ర)

భూతులసి. సం వి ఈ స్త్రీ నేలతొళసి
సీ తంగేడుఁ మెట్టబందారి దుండుగ బ్రహ్మ
దండి భూతుల సెబ్బదండి వాం౨ ౪ ౧౦

భూతేశుఁడు. సం వి అ పుం శివుఁడు

భూతేష్ట. సం వి అ స్త్రీ శుక్లపక్ష చతుర్దశి తిథి (శై ని) ఆశ్వినికృష్ణచతుర్దశి (వాచ)

భూత్తమము. సం వి అ న బంగారము సువర్ణము

భూదారము. సం వి అ పుం ఎంది వరాహము

భూదేవుఁడు. సం వి అ పుం బ్రాహ్మణుఁడు పుడమివేల్పు

భూధనుఁడు. సం వి అ పుం భూమి ధనముగా గలవాడు రాజు

భూధరము. సం వి అ పుం భూమినిధరించు నది ౧ పర్వతము ౨ ఏడు అనుసంఖ్య

భూధరుఁడు. సం వి అ పుం రాజు

భూధ్రము. సం వి అ పుం పర్వతము

భూనాగము. సం వి అ పుం వానపాము

భూనామ. సం వి న్ స్త్రీ బాలెంతబోళము వలె సెబ్బవగు నొకానొకవిధమగు పరిమళించు మన్ను (శై ని)

భూనింబము. సం వి అ పుం నేలవేము * (శ ర)

భూపతి. సం. వి ఇ పుం ౧ రాజు ౨ క్షత్త్రియుఁడు

భూపదము. సం వి అ పుం వృక్షము చెట్టు

భూపది. సం వి స్త్రీ మల్లె *

భూపాటలి. సం వి ఈ స్త్రీ నేలకలిగొట్టు * (శ ర)

భూపాల(ళ,ము). సం వి అ పుం ఎనిమిది పురుష రాగములలో నొకటి
సీ భైరవి మాళవి బందాళ హిందోళ రాగ
మంజరియు శ్రీరాగ గౌళ భూపాల లెన్మిది
పురుషరాగంబులు హంస ౫ ౧౨౩
సీ భూపాళ గౌళులన్ బురుషరాగాష్టకం
బాహిరి లలిత బిలావారులును ప్రబంధ ౯౫

భూపుఁడు. సం వి అ పుం రాజు, ఱేఁడు

భూపుత్త్రి. సం వి ఈ స్త్రీ సీత (శ్రీరాముని భార్య)

భూపుత్త్రుఁడు. సం వి అ పుం ౧ అంగారకుఁడు ౨ నరకాసురుఁడు

భూపూగము. సం వి అ పుం తోఁటపోఁక, ఒకజాతిపోఁక * (శ ర)

భూబదరి. సం వి ఈ స్త్రీ నేలరేను * (శ ర)

భూభుక్కు. సం వి జ్ పుం రాజు, ఱేఁడు

భూభుజుఁడు. సం = భూభుక్కు

భూభృత్తు. సం వి త్ పుం నేలతాల్పు ౧ పర్వతము ౨ రాజు ౩ విష్ణువు

భూమ(ము.) సం వి న్ పుం ౧ సమృద్ధి బాహుళ్యము ౨ ఐశ్వర్యము ధనసంపత్తి న ౧ భూమి ౨ ప్రదేశము (మండలము అని ప్రకృతవ్యవహారము)

భూమి. సం వి ఇ స్త్రీ (కృష్ణోద క్పాండు సంఖ్యాపూర్వక భూమి శబ్దమునకు 'భూమ' అని అకారాన్తరూపమగును ఉదా కృష్ణ భూమము ద్విభూమము) ౧ పృథివి, పుడమి. ౨ స్థానము ప్రదేశము ౩ నాలుక, జిహ్వ. ౪ యోగుల మనోవస్థాభేదము. ౫ ఒకటి, యను సంఖ్య ౬ (నాటక) నేపథ్యము, వేషము. (అ ని)

భూమిక. సం వి అ స్త్రీ ౧ మాఱువేషము ౨ రచన (శ ర)

భూమికర్కారువు. సం వి అ పుం నేల గుమ్మడి ‡ (శ ర)

భూమికూశ్మాండము. సం వి అ పుం విదారి నేలగుమ్మడి ‡

భూమిచంపకము. సం వి అ పుం నేల సంపెంగ ‡ (శ ర)

భూమిజ. సం వి ఆ స్త్రీ సీత

భూమిజంబుక. సం వి ఆ స్త్రీ ౧ కాకినేరేడు ‡ ౨ నేలనేరేడు ‡ (శ ర)

భూమిజుఁడు. సం వి అ పుం ౧ అంగారకుఁడు ౨ నరకాసురుఁడు (శ ర)

భూమిమయి. సం వి ఈ స్త్రీ ‾యాదేవి (వై ని)

భూమిలాభము. సం వి అ పుం ౧ మగణము (వై ని) ౨ భూప్రాప్తి

భూమిస్పృక్కు. సం వి శ్ పుం ౧ వైశ్యుడు కోమటి ౨ మానవుఁడు మర్త్యుఁడు

భూమ్యామలకి. సం వి ఈ స్త్రీ నేలయుసిరిక ‡ (శ ర)

భూయశన్. సం అవ్య తఱచు

భూయస్సు. సం విశ (స్ సీ స్) ౧ బహుళము విస్తారమైనది ౨ పెద్దది ౩ చాల ముఖ్యమైనది ౪ అత్యధికము చాలఁబెద్దది ౫ పెక్కు అనేకము ౬ సంపన్నము నిండి యుండునది ౭ తీక్ష్ణమైనది ప్రచండమైనది

భూయిష్ఠము. సం విశ (అ ఆ అ) బహుతరము

భూర్. సం అవ్య ౧ మూఁడు వ్యాహృతులలో నొకటి ౨ క్రిందులోకములలో నథోలోకము

భూరి. సం విశ (ఇ) ౧ అధికము ౨ పెద్దది గొప్పది వి ఇ పుం ౧ విష్ణువు ౨ శివుఁడు ౩ ఇంద్రుఁడు న బంగారము

భూరిక్కు. సం = భూరిజము

భూరిగంధ. సం వి ఆ స్త్రీ ఒకానొక గంధద్రవ్యము ‡

భూరిగమము. సం వి అ పుం గాడిద గార్దభము

భూరిజము. సం వి క్ స్త్రీ భూమి

భూరిఫేన. సం వి ఆ స్త్రీ సంబరేను ‡ (శ ర)

భూరిభాగము. సం విశ (అ ఆ అ) అధికైశ్వర్యము గలది

భూరిమాయము. సం వి అ పుం నక్క సృగాలము

భూరిమాయువు. సం వి ఉ పుం భూరిమాయము

భూరిరసము. సం వి అ పుం చెఱకు ఇక్షువు ‡

భూరిలోహము. సం వి అ పుం కాంస్యము కంచు

భూరిశ్రవసుఁడు. సం = భూరిశ్రవస్సు (శ ర)

భూరిశ్రవస్సు. సం వి స్ పుం ౧ సాత్యకిచేఁ జంపఁబడిన కౌరవపక్షపాతి యగు నొక యోధుఁడు ౨ ఇంద్రుఁడు

భూరుండి. సం వి ఇ స్త్రీ గురుగుచెట్టు

భూరుట్టు. సం వి హ్ పుం వృక్షము చెట్టు

భూరుహము. సం వి అ పుం వృక్షము చెట్టు

భూర్జకంటకుఁడు. సం వి అ పుం ఒకానొక సంకరజాతివాఁడు

శ్లో ॥ వ్రాత్యాత్తు జాయతే విప్రా త్పాపాత్మా భూర్జకంటకః

భూర్జపత్త్రము. సం వి అ పుం వృక్షవిశేషము

భూర్జము సం వి అ పుం ఒకజాతిచె ... రావిచెట్టువంటి చెట్టు మృదుత్వక్కు ‡

భూర్ణి. సం వి ఇ స్త్రీ ౧ భూమి ౨ కూలి (వై ని)

భూలత. సం వి ఆ స్త్రీ మహీలత కించుకము ఎఱ్ఱవానపాము

భూలవణము. సం వి అ న విడలవణము. (వై ని)

భూవల్లభుఁడు. సం వి అ పుం రాజు, భూపతి

భూవరుఁడు సం వి అ పుం రాజు పుడమిఱేఁడు

భూవల్లూరము. సం వి అ న అహిచ్ఛత్త్రము ఒకానొక విషము

భూశక్రుఁడు. సం. వి అ పుం క్షత్రియుఁడు (శై ని)

భూశయము. సం. వి అ పుం నేలఁబరుండెడి జంతువు, నకులము మొ॥

భూశ్రవసము. సం వి స్. న వల్మీకము, పుట్ట

భూశ్రవస్సు. సం = భూశ్రవసము

భూష. సం వి ఆ స్త్రీ ౧ అలంకరించుట ౨ అలంకారము, నగ (ఉదా కర్ణభూష మొ॥)

భూషణచేయు. మి స క్రి స్తోత్రముచేయు

క ఆటుమీఁదట మాయాంగన, తటుకున హరు నకును మ్రొక్కి తత్పార్థివుముం,దట నల్ల మిఘను నిడి ప్రస్ఫుటముగ నిట్లనుమ మాయ భూషణచేసెన్ ప్రభు ౧ ౯౯

భూషణము. సం వి అ న ౧ అలంకరించుట ౨ అలంకారము, నగ

భూషించు. సం స క్రి ౧ అలంకరించు

శా తను కాంతిశ్రీలు దిగ్భూములన్, భూషిం పంగ వరాహ ౧ ౧౪౧

మ ఇదగ్న్యాగ్రవతీసమాఖ్య నఖలవ్యాఖ్యాతి మై యొప్పునేర్పరి మత్వామినివాన మప్పర మహి న్భూషించు నామోన్నతిన్ హరి ఉ ౫ ౧౯౨ (ఉండెనని భావము)

౨ స్తుతించు, పొగడు

శా పోలు న్స్వర్గపురాముతో నను చు న్భూషించ వేలాది,తేలాముంజలము ఏలు స్వాంత నాగసేనుండు వరాహ ౧౨౩

భూషితము. సం విణ (అ ఆ అ) అలంకరింపఁబడినది

భూష్ణువు. సం విణ (ఉ) ౧ అగునట్టివాఁడు (ఉదా అలంభూష్ణువు = సమర్థుఁడగునట్టి వాఁడు) ౨ విశ్వర్యము గోరునట్టివాఁడు

భూసంభవుఁడు. సం వి అ పుం ౧ అంగారకుఁడు ౨ నరకాసురుఁడు

భూసుత. సం వి ఆ స్త్రీ సీత, భూపుత్రి

భూసుతుఁడు. సం వి. అ పుం. ౧. అంగారకుఁడు ౨ నరకాసురుఁడు

భూసురుఁడు. సం. వి. అ పుం. బ్రాహ్మణుఁడు, నేలవేలుపు.

భూస్తృణము. సం వి అ పుం. సువాసనగల ఒకజాతిగడ్డి = (చిప్పగడ్డి అనికర)

భూస్పృక్కు. సం వి శ్ పుం ౧ మర్త్యుఁడు, మనుష్యుఁడు ౨ వైశ్యుఁడు, కోమటి

భూస్పృశుఁడు. సం వి శ్ పుం = భూస్పృక్కు

భూస్వర్గము. సం వి అ పుం మేరుపర్వతము

## భృ

భృంగకము. సం వి అ పుం ౧ తుమ్మెద ౨ దూడేకులపిట్ట, రాజవాసనపక్షి

భృంగజ. సం వి. ఆ స్త్రీ భార్గియనులత

భృంగజము. సం వి అ న ౧. అగరు ౨ అభ్రకము

భృంగపర్ణిక. సం.వి.ఆ స్త్రీ చిన్నయేలకులచెట్టు

భృంగప్రియ. సం. వి. ఆ స్త్రీ మాధవి, పువ్వులగురివెంద. వై

భృంగము. సం వి అ పుం ౧ తుమ్మెద. ౨ పక్షివిశేషము, కూఁకటిమూఁగపట్ట ౩ బంగారపుఁ బాత్ర ౪ గుంటగలిజేరు. వై న ౧ అభ్రకము ౨ త్వక్పత్త్రము, ఆకుపత్రి

భృంగరాజము. సం వి అ పుం ౧ మార్కవము, గుంటగలిజేరు వై ౨ కూఁకటిమూఁగ ౩ గండుతుమ్మెద (శ ర)

భృంగరాట్టు. సం వి ట్ పుం ౧. గండుతుమ్మెద, పెద్దతుమ్మెద ౨ గుంటగలిజేరు వై. ౩ ఒకానొకరంగు (కే ని)

భృంగరిటి. సం వి ఇ పుం శివునిపరిచారకులలో నొకఁడు (అంగవికారముగలవాఁడని ప్రసిద్ధి)

భృంగరీటి. సం = భృంగరిటి

భృంగరీటుఁడు. సం. వి అ పుం భృంగి, శివపరిచారకుఁడు (శై ని)

భృంగరోలము. సం వి అ పుం ఒకానొకజాతి కందిరీగ

భృంగవల్లభము. సం వి అ పుం ఒకజాతి కదంబము ¶

భృంగాణము. సం వి అ పుం నల్లని పెద్ద తేనెటీగ (శై ని)

భృంగానంద. సం వి ఆ స్త్రీ యూధిక మొల్ల ¶

భృంగాభీష్టము. సం వి అ పుం మామిడిచెట్టు

భృంగారము సం వి అ పుం న ౧ బంగారపుం బాత్ర బంగారుకుండ ౨ ఒకమాదిరిపాత్ర జారీ న ౧ బంగారము ౨ లవంగములు

భృంగారి. సం వి ఈ స్త్రీ ఝల్లిక ఇలకోడి కీచురాయి

భృంగి. సం వి ఈ స్త్రీ ౧ ఆఁడుతుమ్మెద ౨ ఆటవిష అతివస న్ పుం ౧ వత్తిచెట్టు ౨ శివునిపరిచారకులలో నొకడు

భృంగిదండ. మి వి మల్లవిద్యాసంబంధమగు ఎది రెండుదండలలో నొకట

వ ఆవ్వీరుండు నమదండ భృంగిదండ కుక్కుటపుదండ మొదలుగాఁ గల పదిరెండు దండల యఖండపాండిత్యంబు దెలిసి

వాంగ ౧ ౨౦౬

వ గజదండ భృగిదండ వామపార్శ్వభృంగి దక్షిణపార్శ్వభృంగి మల్లపు ౩ ౬౯

భృంగిరిటి. సం = భృంగరిటి

భృంగిరీటి. సం = భృంగరిటి

భృంగీశుఁడు. సం వి అ పుం శివుఁడు

భృంగుఁడు. సం వి అ పుం విటుఁడు జారుఁడు

భృంటిక. సం వి ఆ స్త్రీ లతావిశేషము శ్వేతగుంజ ¶

భృండి. సం వి ఇ స్త్రీ తరంగము అల

భృకుంసుఁడు. సం వి అ పుం స్త్రీవేషము వేయుపురుషనటుఁడు భ్రూకుంసుఁడు

భృకుటి. సం వి ఈ స్త్రీ కనుబొమముడి భ్రూభంగము

భృగుజుఁడు సం వి అ పుం శుక్రుఁడు

భృగుతనయుఁడు. సం వి అ పుం శుక్రుఁడు

భృగునందనుఁడు. సం వి అ పుం ౧ పరశురాముడు ౨ శుక్రుఁడు

భృగుపతి సం వి ఇ పుం పరశురాముఁడు

భృగుపాతము. సం వి అ పుం ప్రాయశ్చిత్తవిశేషము (కొండ మీఁదనుండి క్రిందికిపడుట)

వ రజస్వలాంభోజినీ దివాసంగమ క్రీడాసంప్రాప్తదురిత ప్రాయశ్చిత్తార్థంబు భృగుపాతం బాచరించువిధంబునఁ దపనుం డపరగిరిఁ దిరోహితుం డయ్యె

వేం పంచ ౩ ౧౭౪

భృగువాసరము సం వి అ పుం శుక్రవారము

భృగువు సం వి అ పుం ౧ భృగుమహర్షి (ఇతడు భృగువంశకర్త) ౨ జమదగ్నిమహర్షి ౩ శుక్రుఁడు ౪ కొండచఱియ పర్వతముపైనుండు చదునైననేల ౫ శివుఁడు

భృజ్జకంరుఁడు సం వి అ పుం బ్రాహ్మణ స్త్రీయందు వ్రాత్యబ్రాహ్మణునివలనఁ బుట్టినవాఁడు (శై ని)

భృతకుఁడు సం విణ (అ తిశా అ) కూలిచేసి జీవించువాఁడు కూలివాఁడు

భృతము సం విణ (౧ అ అ) ౧ భరింపఁబడినది ౨ పోషింపఁబడినది ౩ నిండినది పూర్ణమైనది

భృతి సం వి ఇ స్త్రీ ౧ భరించుట మోయుట ౨ పోషించుట ౩ కూలి జీతము ౪ మూల్యము వెల

భృతిభుక్కు సం వి క్ పుం కూలికిఁ బనిచేయువాఁడు కూలివాఁడు

భృతిభుజుఁడు. సం = భృతిభుక్కు

భృతుఁడు సం వి అ పుం కూలివాఁడు కూలికై పనిచేయువాఁడు

భృత్తి సం విణ (త్) ౧ భరించునది మోయునది ౨ పోషించునది ప్రోచునది

**భృత్రిమము.** సం. విణ. (అ. ఆ. అ.) పోషింపఁబడినది.

**భృత్యా.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పెంచుట, పోషించుట. ౨. సేవ. ౩. కూలివానికిచ్చుసొమ్ము, కూలి.

**భృత్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పోషింపఁదగినవాఁడు, పోషింపఁబడవలసినవాఁడు, పోష్యుఁడు. ౨. బంటు.

**భృథము.** సం. వి. అ. పుం. తాఁబేలు. (వై. ని.)

**భృమలము.** సం. వి. అ. న. చక్రము. పుం. ౧. వాయువు. ౨. ఒకానొకజాతిపురుగు.

**భృశము.** సం. విణ. (అ. ఆ. అ.) అతివేలము, అత్యర్థము.

**భృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) వేఁపఁబడినది, కాల్పఁబడినది.

**భృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. వేపుడు. ౨. పాడడవి. (శ. ర.)

## భే

**భేకభుక్కు.** సం. వి. జ్. పుం. సర్పము, పాము. (త్రి. ని.)

**భేకభుజము.** సం. = భేకభుక్కు.

**భేకము.** సం. వి. అ. పుం. ౧. కప్ప. ౨. మేఘము, మబ్బు.

**భేకి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుకప్ప, వర్షాభ్వ. ౨. మండూకపర్ణి ‡

**భేకుఁడు.** సం. వి. అ. పుం. బ్రాహ్మణస్త్రీయందు నిషాదునివలన పుట్టిన సంకరుఁడు. (వై. ని.) విణ. (అ. ఆ. అ.) కాతరుఁడు. (కే. ని.)

**భేటకము.** సం. వి. అ. పుం. కొనుట. (వై. ని.)

**భేడము.** సం. వి. అ. పుం. పొట్టేలు.

**భేడ్రము.** సం. వి. అ. పుం. పొట్టేలు.

**భేత్తృ.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. విడఁగొట్టువాఁడు, పగులఁగొట్టువాఁడు.

**భేదకము.** సం. విణ. (అ. దికా. అ.) ౧. పగులఁగొట్టునది, చీల్చునది, విడఁదీయునది. ౨. అంతరము చూపునది. ౩. వివరించునది, స్వరూపము నిరూపించునది. ౪. మలశుద్ధిచేయునది, విరేచనకారి. వి. అ. పుం. విశేషణము.

**భేదకరుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) విరోధములు పుట్టించువాఁడు, కలఁతలుపుట్టించువాఁడు.

**భేదదర్శి.** సం. విణ. (న్. నీ. న్.) పరమాత్మకంటె ప్రపంచకము భిన్నముగా (వేఱుగా) నున్నదని యనుకొనువాఁడు.

**భేదనము.** సం. వి. అ. న. ౧. చీల్చుట, పగులఁగొట్టుట, చింపుట. ౨. విడఁదీయుట, వేర్పఱుచుట. ౩. తారతమ్యము (అంతరము) ఎంచుట. ౪. విరోధములు పుట్టించుట, కలఁతలు గలిగించుట. ౫. హింగువు. పుం. ౧. పంది. ౨. పుల్లబచ్చలి ‡ (శ. ర.) విణ. (అ. ఆ. అ.) ౧. పగులఁగొట్టునది, విడఁదీయునది. ౨. సంభ్రమము చేయునది, గ్రుచ్చునది. ౩. నశింపఁజేయునది, చెఱచునది. ౪. పరిచ్ఛేదము చేయునది, అంతరము చూపునది. ౫. వివరించునది, స్వరూపము నిరూపించునది. ౬. విరేచనముచేయునది, మలము విడువఁజేయునది.

**భేదము.** సం. వి. అ. పుం. ౧. పగులఁగొట్టుట, చీల్చుట. ౨. విఱుగుట, ఎగులుట. ౩. పగిలిపోవుట, బలవంతముగాఁ బగులుట. ౪. విభజనము, విభాగము. ౫. అంతరము, తారతమ్యము. ౬. విశేషము (రసభేదము, కాలభేదము). ౭. మార్పు. ౮. సామదానభేదదండము లను చతురుపాయములలో మూఁడవయుపాయము, శత్రుపక్షమునందుఁ బరస్పరవిరోధము పెట్టుట. ౯. (వైద్య.) మలముపోవుట, విరేచనము. ౧౦. (న్యాయ.) అన్యోన్యాభావము.

**భేదించు.** సం. స. క్రి. ౧. బ్రద్దలుచేయు.

క. అవిరళవిషఫణిదంష్ట్రలు పవనజావజ్రతనువుపైతోలును నోపవు భేదింపఁగ
భార. ఆది. ౫. ౧౩౬.

సీ. సాత్యకి నిటలంబు సాయకంబొకట భేదించి
నెత్తురు వెల్లిఁ దేల్పఁ దలఁడు — హరి. ౩. ౫౩.

క్షవము. సం. వి. అ. న. ౧ భిక్షుసమూహము, యాచకసమూహము. ౨ సన్న్యాసిసమూహము

క్షుకము. సం. వి. అ. న. ౧ భిక్షుసమూహము, యాచకులసమూహము. ౨ సన్న్యాసిసమూహము

క్ష్యము. సం. వి. అ. న. భిక్షాన్నము, భిక్షచే దొరకినయన్నము

మరథి. సం. వి. ఈ. స్త్రీ. ప్రాణులకు భయమును కలుగఁజేయు డెబ్బదియేడవ సంవత్సరపు ఎడవమాసమునాఁటి ఏడవరాత్రి

శ్లో. యా సప్తసప్తతితమే వర్షే మాసి చ సప్తమే। సప్తమీ ప్రాణినాం ఘోరా రాత్రిర్భైమరథీహి సా (శ. ని.)

మి. సం. వి. ఈ. స్త్రీ. ౧ దమయంతి (ఈమె భీమునికూఁతురు, నలునిభార్య. దమయన్తికిఁ దండ్రి ననుసరించి వచ్చినపేరు)

రవమతము. సం. వి. అ. న. ఖలీనవిశేషము

వ. భైరవమతంబు భారంగి లంగిణి మొదలగు ఖలీనంబులు (ఉ. హరి. ౪. ౨౧౩)

రవము. సం. విణ. (అ. ఈ. అ.) ౧ భయంకరమైనది, వెఱపు పుట్టించునది. ౨ దుఃఖకరము, విచారకరము. ౩ భైరవసంబంధమైనది. ౪ భయానకరసము గలది. వి. అ. పుం. ౧ శివావతారము (ఈ యవతారమున కెనిమిదివిధముల రూపములు గణింపఁబడినవి. అష్టభైరవులు). ౨ భయానకరసము. ౩ భయము, వెఱపు. ౪ (సంగీత) రాగవిశేషము (ఇది భైరవరాగము భయానకరసము నుద్రేకింపఁజేయును)

సీ. భైరవ శ్రీరాగ బంగాళ హిందోళ మాళవులును రాగమంజరియును (ప్రబంధ. ౯౨)

౫ ఒకానొకపర్వతము (శ. ని.)

వి. అ. న. భయము, వెఱపు

రవయాతన. సం. వి. అ. స్త్రీ. కాశిలో మృతులగువారు పరమాత్మలో నైక్యమగుటకై (ముక్తిచెందుటకై) భైరవుఁడు చావనిపోయినవారికిఁ గలిగించు శుద్ధిహేతువు, పవిత్రతాదాయకమగు బాధావిశేషము, భైరవుఁడు పెట్టు యాతన

భైరవి. సం. వి. ఈ. స్త్రీ. ౧ దుర్గాదేవి (దుర్గయొక్క యవతారభేదము). ౨ దుర్గామహోత్సవములయందు దుర్గాదేవికిఁ బ్రతినిధిగానుండు పండ్రెండేండ్లబాలిక. ౩ ఎనిమిది పురుషరాగములలో నొకటి

సీ. భైరవి మాళవి బంగాళ హిందోళ రాగమంజరియు శ్రీరాగ గౌళ భూపాళ లెన్మిది పురుషరాగంబులు (వాంస. ౫. ౧౨౩)

భైరవుఁడు. సం. వి. అ. పుం. ౧ శివుఁడు. ౨ శివగణాధిపులలో నొకఁడు. విణ. భయానకరసము గలవాఁడు (శ. ర.)

భైషజము. సం. వి. అ. న. మందు, ఔషధము. పుం. లావకపక్షి, పూరెడుపిట్ట

భైషజ్యము. సం. వి. అ. న. ౧ మందు, ఔషధము. ౨ (రోగము) మాన్పుట, కుదుర్చుట

భైష్మకి. సం. వి. ఈ. స్త్రీ. రుక్మిణి, విదర్భదేశాధిపతి యగు భీష్మకుని కూఁతురు

## భో

భోక్త. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧ భుజించువాఁడు, తినువాఁడు. ౨ ఉపయోగపఱచువాఁడు. ౩ అనుభవించువాఁడు. ౪ రక్షించువాఁడు, శాసించువాఁడు, పాలించువాఁడు

భోగకరము. సం. విణ. (అ. ఈ. అ.) భోగము గలిగించునది, ఆనందకరము

భోగగృహము. సం. వి. అ. న. వాసగృహము, పడకిల్లు (శ. ర.)

భోగదేహము. సం. వి. అ. పుం. చనిపోయినవాఁడు తత్కర్మానుసారముగా ననుభవింపవలసిన సుఖదుఃఖములను అనుభవింపఁ దాల్చిన సూక్ష్మశరీరము, స్వర్గనరకభోగార్థమై యేర్పడిన సూక్ష్మశరీరము

భోగపాలుఁడు. సం. వి. అ. పుం. అశ్వరక్షకుఁడు, గుఱ్ఱములఁ గాచువాఁడు

భోగపిశాచిక. సం. వి. అ. స్త్రీ. ఆఁకలి

**భోగభూమి.** సం వి ఇ స్త్రీ భారతవర్షాతిరిక్తవర్షము

**భోగము.** సం వి అ పుం ౧ తినుట తిండి ౨ సుఖదుఃఖాదుల భుక్తి ఫలము చెందుట ౩ సుఖము ౪ దుఃఖము ౫ పరిపాలన ఏలుట ౬ భోజనము ౭ రవ్యాదులరాశిగతి కాలము ౮ ఫణము పడగ ౯ ధనము ౧౦ రక్షణము ౧౧ వెలయాలికిచ్చెడి ధనము ౧౨ సర్పశరీరము ౧౩ రాజ్యము ౧౪ కౌటిల్యము (కే ని ఖై ని)

**భోగవతి.** సం వి ఈ స్త్రీ ౧ పాతాళగంగ ౨ పాతాళలోకములోని సర్పనగరి విణ భోగముకలది

**భోగావలి.** సం వి ఈ స్త్రీ ౧ స్తోత్రపాఠకులస్తుతిగ్రంథము ౨ నాగపురి

**భోగి.** సం విణ (న్ నీ న్) ౧ (ఫలము) అనుభవించువాఁడు సుఖమనుభవించువాఁడు ౨ వంపులుగలది ౩ పడగలుగలది ౪ భోగాయత్తమైనది ౫ ధనవంతము వి న్ పుం ౧ సర్పము పాము ౨ రాజు ౩ భోగవిరతుఁడు ౪ మంగలి ౫ గ్రామాధికారి ౬ ఆశ్లేషానక్షత్రము

**భోగించే.** సం క్రి అనుభవించు
మ భరతుఁ ఒటము గట రిత్రియగు భూభా
గంబు భోగించెన్ భా ర అయో
గీ ఇ కిఁ యణ్యా భోగి నేఁగుకెమ్మ
మ ర్క ౨ ౨

**భోగికాంతుఁడు.** వి అ పుం వాయువు

**భోగికుఁడు.** స వి అ పుం గుఱ్ఱపువాఁడు అశ్వరక్షకుఁడు

**భోగిని.** సం వి ఈ స్త్రీ ౧ మహిషి కాని (పట్టాభిషిక్తురాలు కాని) రాజభార్య ౨ భోగముది ౩ ఆఁడుఁబాము (శ ర)

**భోగిభు(జము)క్కు.** సం వి క్ పుం ౧ నకులము ముంగిస ౨ నెమలి, మయూరము

**భోగివల్లభము.** సం వి అ పుం చందనవృక్షము.

**భోగీంద్రుఁడు.** సం వి అ పుం ౧ శేషుఁడు ౨ వాసుకి

**భోగీశుఁడు.** సం వి అ పుం ౧ శేషుఁడు ౨ వాసుకి

**భోగ్యము.** సం విణ (అ ఆ అ) అనుభవింపఁదగినది వి అ న ౧ ధనము ౨ ధాన్యము

**భోజకుఁడు.** సం విణ (అ కా అ) ౧ తినిపించువాఁడు భోజనముపెట్టువాఁడు పోషించువాఁడు ౨ తినువాఁడు భుజించువాఁడు

**భోజనము.** సం వి అ న ౧ తినుట అన్నము తినుట ౨ అన్నము ఆహారము ౩ అన్నము పెట్టుట ౪ అనుభవించుట ౫ ఐశ్వర్యము కలిమి ధనము

**భోజనీయము.** సం విణ (అ ఆ అ) ౧ తినఁదగినది భక్ష్యము ౨ అన్నము వి అ న అక్షీబము సముద్రపుటుప్పు (కే ని ఖై ని)

**భోజనుఁడు.** సం విణ (అ ఈ అ) భోజనము పెట్టువాఁడు పోషించువాఁడు తినుటకిచ్చువాఁడు

**భోజపతి.** సం వి అ పుం ౧ భోజమహారాజు (చూ భోజుఁడు) ౨ కంసుఁడు

**భోజపురము.** సం వి అ న మథురానగరము
వ భోజపురయాత్రాదంధసంరంభయై
అము ౫ ౫౨

**భోజము.** సం వి అ పుం దేశవిశేషము భోజదేశము

**భోజయిత.** సం విణ (ఋ త్రీ ఋ) భుజింపఁజేయువాఁడు తిండిపెట్టువాఁడు

**భోజరాజు.** సం వి అ పుం భోజుఁడనురాజు భోజదేశాధిపతి

**భోజుఁడు.** సం వి అ పుం ౧ ధారానగరాధిపతి యగు భోజుఁడు, మాలవాధీశ్వరుఁ డగు భోజరాజు (ఇతఁడు సంస్కృతవిద్యాభిమానియు సరస్వతీకంఠాభరణాది బహుగ్రంథకర్తయు నని కూడ నూహింపఁబడినది) ౨ విదర్భరాజు ౩ విధవయగు క్షత్రియస్త్రీకి పుట్టినవాఁడు క్షత్రియగోళకుఁడు

భోజ్యము. సం విణ (అ ఆ అ) ౧ తినఁదగినది (మా భో జ్యము) ౨ భక్ష్యభోజ్యలేహ్యచోష్యములలో ఒకటి ౩ అనుభవింపఁదగినది ౩ భోగింపఁదగినది

భోజ్యసంభవము. సం వి ఉ పుం శరీరము యొక్క భోజ్యముచేఁ బుట్టిన ప్రధానరస ధాతువు

భోటము. సం వి అ పుం భోటదేశము

భోలము. సం వి అ పుం పెద్దపులి (శే ని)

భోలి. సం వి అ పుం ఉష్ట్రము ఒంటె

భోషాణము. వి పెద్దపెట్టె (శ ర)

## భౌ

భౌతి. సం వి ఈ స్త్రీ రాత్రి

భౌతికము. సం వి అ న ముత్యము
విణ భూతిసంబంధమైనది

భౌమదినము. సం వి అ న మంగళవారము

భౌమనుఁడు. సం వి ఉ పుం విశ్వకర్మ దేవతాశిల్పి

భౌమము. సం విణ (అ ఈ అ) ౧ భూసంబంధమైనది ౨ భూమియందున్నది భూప్రదేశమునకుఁ జెందినది ౩ పార్థివము మంటితోఁ జేయఁబడినది

భౌమరత్నము. సం వి అ న ప్రవాళము పగడము

భౌముఁడు. సం వి అ పుం ౧ అంగారకుఁడు ౨ నరకాసురుఁడు

భౌరికుఁడు. సం వి అ పుం రాజధనాగారమునందు బంగారముపై నేర్పఱుపఁబడిన యధికారి బ సమతిలమను పేరుగల ఒకానొక దేశము (శే ని)

భౌవాదికము. సం విణ (అ ఈ అ) భూ మొదలుగాగల ధాతువులగణమునకుఁ జెందినది భ్వాదిగణ సంబంధమైనది

## భ్ర

భ్రంశనము. సం విణ (అ ఈ అ) జాఱునది క్రిందునకుఁ బడునది
వి అ న ౧ జాఱుట పడుట పతనము

భ్రంశము. సం వి అ పుం ౧ తగ్గిపోవుట, వీడుట క్రిందునకు జాఱుట పతనము, పడుట ౨ క్షీణించుట తగ్గుట ౩ పాటు నాశము, చెడుట ౪ పాఱిపోవుట, పలాయనము

భ్రంశి. సం విణ (న్ నీ న్) ౧ జాఱునది, క్రిందునకుఁ బడునది కూలునది ౨ క్షీణించునది తగ్గునది ౩ నశింపఁజేయునది ధ్వంసము చేయునది చెఱచునది

భ్రంశితము. సం విణ (అ ఆ అ) త్రోసివేయఁబడినది

భ్రకుంసుఁడు. సం వి అ పుం క్షత్త్రియుని వలన ఝల్లియను శూద్రజాతి స్త్రీయందు పుట్టినవాఁడు (వై ని)

భ్రకుంసుఁడు. సం వి అ పుం స్త్రీవేషము ధరించు నటుఁడు

భ్రక్షము. సం వి అ పుం తనతప్పును మఱుఁగు పుచ్చుట (శ ర)

భ్రజ్జనము. సం వి అ న ౧ వేఁచుట ౨ కాల్చుట

భ్రమంతము. సం వి అ పుం చిన్నయిల్లు గుడిసె (వై ని)

భ్రమ(ము). సం వి అ పుం (ఇది చరిత్రాదుల లోనిది) ౧ తిరుగుట చలనము
క తనరె బలిభుక్తతులు నిండిన గ్రామశ్రీల కటితినీలము లగుటం గనియోద్వృణగ్రాహిత నఁ గొనుకనవులఁ జైత్యతరుల గూండ్లిడు భ్రమలన్ ఆము ౪ ౧౩౨ ('భ్రమలన్,' వావిళ్ల ప్రతిపా 'భ్రమణన్' వేదము, వ్రాతఁ ప్రతిపా)
శా చేరం జోటొక టెందుఁ గానక భ్రమం జెయ్వేదు భృంగావళిన్ హరి పూ ఉ ౧౧౪
౨ చుట్టుదిరుగుట గుండ్రముగా దిరుగుట.
౩ సుడి ౪ తిరుగలి ౫ భ్రాంతి భిన్నముగా గ్రహించుట
గీ ఎఱుఁగఁబడు లేక విభియు నాకాశవర్ణ భాతి గాజాగరభ్రాంతి భ్రమలఁ బెట్టు
వా రా ౧ ౫౯

గీ. నీకు నా నీకు నానంచు నెమకి నెమకి, ముగుద
లను వారి భ్రమయించి మోసపుచ్చుఁ, బళ్ళ
తోఁ హారుఁ డత్యంత పాపబుద్ధి, పట్టణములోఁ
దగుల్పిరి పండె కాఁడు క్రీడా ౯౯
ద్వి. కూఁతు నిచ్చెద నని కోదండ మెక్కటి, భ్రాంతిగా నెప మిడి భ్రమియించె మనల
రం. రా. బాల. ౬౩ పా. ౧౯ పం.

భ్రేశిమ. సం. వి. న్. పుం. తీవ్రత, ఉరవడి.

భ్రష్టము. సం. విణ. (అ. ఆ. అ.) జాఱినది.

భ్రష్టు(ఁడు). సం. విణ. (అ. ఆ. అ.) (ఇది వృద్ధాది) ౧. చెడినవాఁడు
సీ. ఎరికింపఁగా మతిభ్రష్టు గాక
భాగ. ౩. ౪౩౭
౨. వెలి వేయఁబడినవాఁడు.
క. తళ్కుమ నిగులఁ గామ్యత, పక్కణవర్తి
కులఁ దొల్లి భ్రష్టుగు విప్రుఁడు
ఆము. ౪. ౨౧౦

## భ్రా

భ్రాంతము. సం. విణ. (అ. ఆ. అ.) తిరిగినది, భ్రాంతి నొందినది. వి. అ. పుం. ౧. మత్తగజము, మదపుటేనుఁగు ౨. ఉమ్మెత్త గుత్తూరము. ౫. న. ౧. సంచరించుట, తిరుగుట ౨. అధరోష్ఠమునఁ జేయు చుంబనము.
సీ. చెవుల నివి త్తంబు చెక్కుల స్ఫుటతంబు
నధరోష్ఠమున భ్రాంతమగు
హంస. ౫. ౧౪౭

భ్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. తిరుగుట ౨. పొరపాటు, భ్రాంతి, తప్పుడభిప్రాయము ౩. ఒకానొక అర్థాలంకారము, భ్రాంతిమదలంకారము ౪. కోరిక, వాంఛ.
ఆ. భ్రాంతి నడుగుచోటఁ బ్రాణంబులేనిని, నిచ్చువాఁడు దాఁపఁ డిచ్చుఁ గాని
భాగ. ౬. ౩౫౭

భ్రాంతిపడు. మి. అ. క్రి. భ్రమఁజెందు
(చూ. భ్రాంతిపఱచు.)

భ్రాంతిపఱచు. మి. స. క్రి. భ్రాంతిపడఁజేయు, భ్రమయించు
గీ. మృగులపవనాహతి నొకింత గదలియాడు, పల్లవములమాటునను దోఁచు మొల్లమొగ్గ, చాలుగతిఁ బల్కుబడి కోవిచాటునఁ గనఁ, బడుచు నింతిపల్వరుస కవ్వాభ్రాంతిపఱచు,
ప్రభా. ౨ ౬౭.

భ్రాజకము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రకాశించునది. వి. అ. న. పైత్యము, పిత్తము.

భ్రాజథువు. సం. వి. ఉ. పుం. ౧. ప్రకాశము, తళతళమను కాంతి ౨. అందము, సౌందర్యము.

భ్రాజనము. సం. వి. అ. న. ప్రకాశించుట.

భ్రాజము. సం. వి. అ. న. (వేద) సామభేదము పుం. బ. భ్రాజము లను శ్లోకములు.

భ్రాజితము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రకాశము నొందినది.

భ్రాజిల్లు(ట). సం. అ. క్రి. ప్రకాశించు.
ద్వి. ఒసవని శరణన్న భ్రాజిల్లు బుద్ధి.
బస. పు. ౧. ౧౦౧ పం.
క. తొమ్మిది గవనులు గల్గుపురమ్మున సతతంబు నాత్మ భ్రాజిలుచుండున్ ప్రబోధ. ౩. ౧౩.

భ్రాజిష్ణువు. సం. విణ. (ఉ.) ప్రకాశించునది, దేదీప్యమానము, మిగులఁ బ్రకాశించునది.

భ్రాత. సం. వి. ఋ. పుం. తోఁబుట్టువు, సోదరుఁడు. బ. సోదరియును సోదరుఁడును, సోదరీసోదరులు.

భ్రాతుష్పుత్రుఁడు. సం. వి. అ. పుం. భ్రాతృపుత్త్రుఁడు, సోదరుని కొడుకు.

భ్రాతృగంధి. సం. విణ. (ఇ.) సోదరనామమాత్రము గలవాఁడు, పేరునకు మాత్రము సోదరుఁడైనవాఁడు.

భ్రాతృత్వము. సం. వి. అ. న. సోదరభావము.

భ్రాతృద్వితీయ. సం. వి. ఆ. స్త్రీ. కార్తిక శుద్ధ ద్వితీయ, యమద్వితీయ (ఆదినమునఁ దోఁబుట్టువు లగు ఆఁడువాండ్రు తమ సోదరులను తమయింటికిఁ బిలిచి వారికి విందులు చేసి వారిచ్చిన కానుకలు గ్రహింతురు మున్ను యమున తన సోదరుఁడగు యముని ఆ తిథినాఁడు తన యింటికిఁ బిలిచి విందు చేసి యతఁ డిచ్చిన బహుమానములు పుచ్చుకొనెనట ఆ సంప్రదాయము ననుసరించిరేమో యాతిథికి భ్రాతృద్వితీయ యను పేరు గలిగెను. దీనికి యమద్వితీయ యనియుఁ బేరుగలదు)

